మహాకవి కాళిదాస కృత



# రఘువంశము

## మొదటి భాగము

(తెలుఁగు లఘువ్యాఖ్యా సహితము)

మొదటి తొమ్మిది సర్గలు

వ్యాఖ్యాత

కేశవపంతుల నరసింహశాస్త్రి

విద్వాన్, శిరోమణి, ఆకాశవాణీ సంస్కృత పరిచయ కార్యకర్త




ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి

కళాభవన్ - సైఫాబాదు

హైదరాబాదు - 4

# తొలి పలుకు

ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడమి చేపట్టిన అనేక సారస్వత కార్యక్రమాలలో సంస్కృత గ్రంథ ప్రచురణ ఒకటి. ఆంధ్ర విద్వాంసులు, కవులు సంస్కృతీకరించిన కొన్ని తెలుగు కావ్యాలు అకాడమీ ప్రకటించింది. వీటిలో శ్రీ యస్. టి. జి. వరదాచార్యులుగారు సంస్కృతంలోనికి అనువదించిన ఏడు తెలుగు శతకాల సంపుటము, శ్రీ సన్నిధానం సూర్యనారాయణశాస్త్రిగారు పరివర్తించిన కళాపూర్ణోదయము, శ్రీ కుంటిమద్ది శేషశర్మగారు అనువదించిన మనుచరిత్రయు చేరి ఉన్నవి.

కొన్ని సంస్కృత స్వతంత్ర గ్రంథాలను కూడా అకాడమీ ప్రకటించింది. వీటిలో ఇప్పటివరకు ముద్రింపబడిన పుస్తకాలు :- ఆచార్య డా. బి. రామరాజుగారి సంపాదకత్వములో శ్రీ కృష్ణదేవరాయ రచితమైన జాంబవతీ పరిణయ నాటకము, 'అభినవ కాళిదాసు' వెల్లాల ఉమామహేశ్వరుడు రచించిన శృంగారశేఖర భాణము, మధురవాణి రచించిన శ్రీరామాయణసార కావ్యతిలకము, శ్రీ సన్నిధానము సూర్యనారాయణశాస్త్రిగారి ఆంధ్రప్రదేశ హాస్యకథలు అనునవి.

డా. పుల్లెల శ్రీరామచంద్రుడు, శ్రీ కప్పగంతుల లక్ష్మణశాస్త్రిగార్ల సంపాదకత్వమున ఒక తెలుగు-సంస్కృత నిఘంటువును కూడ అకాడమీ ప్రచురించింది. శ్రీహర్షమహాకవి రచించిన నైషధ కావ్యమును టీకా తాత్పర్య వ్యాకరణ విశేషములతో రచించు కార్యమును శ్రీ ఉడాలి సుబ్బరామశాస్త్రిగారికి అప్పగించినది. వారింతవరకు మూడేసి సర్గలుగా రచించిన మూడు సంపుటములు ముంద్రింపబడినవి. నాలుగవ సంపుటము ముద్రణకు సిద్ధముగా ఉన్నది. శ్రీ సుబ్బరామశాస్త్రిగారి సంపాదకత్వములోనే స్త్రీ ప్రత్యయాది విశేషములతో క్రొత్తరూపమును సంతరించుకొన్న, కీ. శే. గరణివై యాకరణ కృష్ణాచార్యవిరచితమైన శబ్దరత్నావళివి అకాడమీ ప్రచురించినది.

ఈ వరుసలోనే మహాకవి కాళిదాసు రచించిన రఘువంశ కావ్యమునకు తెలుగు లఘువ్యాఖ్యను రచించు పని శ్రీ కేశవపంతుల నరసింహశాస్త్రి గారికి అప్పగింపబడినది.

శ్రీ శాస్త్రిగారు మొదటినుండి తొమ్మిది సర్గలవరకు ప్రతి పదార్థ తాత్పర్య విశేషములతో రచించిన ఈ మొదటి సంపుటమును ప్రచురించి సంస్కృత భాషాభిమానులైన చదువరుల ముందుంచుచున్నాము. రెండవ సంపుటముతో పూర్తి కానున్న ఈ రఘువంశమును శ్రీ శాస్త్రిగారు రచించుచున్నారు. ఈ రచనను చక్కగా నిర్వహించుచున్న శ్రీ కేశవపంతుల నరసింహశాస్త్రిగారికి అకాడమీపక్షాన కృతజ్ఞతావందనములు.

ఆంధ్ర పాఠకలోకానికి ఈ గ్రంథము ఆదరపాత్రము కాగలదని విశ్వసించుచున్నాను.

హైదరాబాద్
28, జనవరి 1979

దేవులపల్లి రామానుజరావు
కార్యదర్శి

# విజ్ఞప్తి

కవి కులగురువు, మహాకవి కాళిదాసు రచనలు మధురాతిమధురములన్న విషయము జగద్విదితము. అందులోను రఘువంశ మహాకావ్యము సంస్కృత భాషాధ్యయనము చేయువారి కందఱికిని ప్రప్రథమ పాఠ్యముగ నుండుటయేకాక బహురసభరితమై కంఠస్థముగ జేసికొన దగినట్టి గ్రంథము. దీనిని తెలుగులోనికి పద్యకావ్యముగ ననువదించినవారును, మొదటినుండి అయిదు సర్గలకు మాత్రము, పదవిభాగ, అర్థ, ఆకాంక్షాది విశేషములతో వ్యాఖ్యానమును రచించినవారును, తమ కవసరమని తోచిన సర్గలకు మాత్రము ప్రతిపదార్థ తాత్పర్యములను రచించిన వారును, మన పూర్వులలో నున్నారు. వానిలో కొన్ని అలభ్యములునై యున్నవి. కాగా విద్యార్థులకును, రఘువంశ కావ్యార్థమును పూర్ణముగా తెలిసికొన దలచిన రసజ్ఞులకును కలుగుచున్న క్లేశమును అకాడమీవారు గ్రహించినారు, ఈ సత్కార్యమునకు పూనుకొన్నారు.

ఆధునిక విద్యావంతులు కాళిదాసు రఘువంశకావ్య భావ సౌందర్యమును తమంతట తాము ఊహించి, గ్రహింప గల్గుటకు శ్లోకములందలి ప్రతి పదము నకును అర్థము తెలియ వలయును. అందువలన ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడమీ వారు నన్ను రఘువంశ కావ్యమునకు పూర్తిగా, పందొమ్మిది సర్గలకును, ప్రతి పదార్థమును వ్రాయుటకై ఆదేశించిరి. ఒక్క ప్రతిపదార్థమును మాత్రము రచించి వదలినచో చదువరులకు సుబోధముగా నుండజాలదని నేను సూచించుటచేత ఈ విధమైన లఘువ్యాఖ్యను వ్రాయుట కంగీకరించిరి. ఇంతకు అకాడమీవారి యుద్దేశము రఘువంశ మంతయు ఒక సంపుటముగా నుండినచో చదువరులకు సౌలభ్యము చేకూరునన్నదియే. కాని అది సాధ్యపడలేదు, రెండు సంపుటములుగా నీ కావ్యము వెలువడుచున్నది.

ఈ రచనలో సంస్కృత శబ్ద స్వరూపము బోధపడుటకై శ్లోకములందును, అర్థము వ్రాయు నప్పుడును, విసంధులు పాటింప బడినవి. అర్థములు వ్రాయు నప్పుడు, అవసరమును బట్టి రెండు మూడు పదముల కొకసారియే అర్థమును వ్రాయుటయు, దీర్ఘ సమాసములందు కొన్నిచోట్ల ప్రతి పదమును విడదీసి యర్థమును వ్రాయుటయు, కొన్నిచోట్ల విడదీయకయే సముదాయమున కర్థము వ్రాయుటయు జరిగినది. ప్రతి శ్లోకమున కర్థము ముగిసిన పిమ్మట తాత్పర్య సూచక వాక్యము చేర్పబడినది. విశేషములు, శబ్దవ్యుత్పత్తులును అవసర మనుకున్నచోట చేర్చఁబడినవి. ఇంత మాత్రముగానే ఈ లఘు వ్యాఖ్యను రచించుటకు కారణము చదువరులకు దీనిని సులభముగా నుంచుటయే. విశేషజ్ఞులయిన విద్వాంసులును, వ్యాకరణాది సర్వ విషయ జిజ్ఞాసువులైన విద్యార్థులును మన్నింతురుగాక.

లఘుమల్లినాథీయమనదగిన ఈ తెలుఁగు లఘువ్యాఖ్యను రఘువంశ మహాకావ్యమునకు రచించు భాగ్యమును నాకు గల్గించిన ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ వారికిని, తత్కార్యదర్శియైన శ్రీ దేవులపల్లి రామానుజరావు గారికిని నేను సర్వదా కృతజ్ఞుఁడనై యున్నాను.

మొదటినుండి తొమ్మిది సర్గలుగల ఈ ప్రథమ సంపుటము నిప్పుడు మీ కరకమలములందుంచుచు, అచిర కాలమునందే రెండవ సంపుటము నందజేయు టకు ప్రయత్నించుచున్నాను.

26/3RT, బర్కత్‌పుర,
హైదరాబాద్

విద్వద్విధేయుడు
కేశవపంతుల నరసింహశాస్త్రి

# వి ష య సూ చి క

# రఘువంశము

## ప్రథమ సర్గము

### ప్రార్థన

మాతాపితృభ్యాం జగతో నమో వామార్ధజానయే,
సద్యో దక్షిణదృక్పాతసంకుచద్వామదృష్టయే.

అంతరాయతిమిరోపశాంతయే శాంతపావన మచింత్యవైభవమ్,
తం నరం వపుషి కుంజరం ముఖే మన్మహే కిమపి తుందిలం మహః

శరణం కరవాణి శర్మదం తే చరణం వాణి! చరాచరోపజీవ్యమ్,
కరుణామసృణైః కటాక్షపాతైః కురు మా మంబ! కృతార్థసార్థవాహమ్॥

శ్లో. వాగర్థావివ సంపృక్తౌ వాగర్థప్రతిపత్తయే
జగతః పితరౌ వందే పార్వతీపరమేశ్వరౌ. 1

వ్యాఖ్య : వాగర్థావివ (వాక్ + అర్థౌ + ఇవ) - శబ్దము, అర్థము వలె; సంపృక్తౌ - నిత్యసంబంధముగలవారును, జగతః - లోకమునకు, పితరౌ - తల్లి దండ్రులైనవారును అగు, పార్వతీపరమేశ్వరౌ - పార్వతీపరమేశ్వరులను, వాగర్థ ప్రతిపత్తయే - (వాక్ + అర్థ + ప్రతిపత్తయే) వాగర్థ - శబ్దార్థములయొక్క, ప్రతిపత్తయే - జ్ఞానముకొఱకు, వందే - నమస్కరించుచున్నాను. జగత్తుకు పితరులై శబ్దార్థములవలె నిత్యసంబంధముగల పార్వతీపరమేశ్వరులను శబ్దార్థజ్ఞానముకొఱకై నమస్కరించుచున్నాను అని భావము. "నిత్యః శబ్దార్థ సంబంధః" అని మీమాంస కులు శబ్దార్థములకు నిత్యసంబంధమును అంగీకరింతురు. ఈ శ్లోకమునందలి అలంకారము 'ఉపమ'. అమృతబీజమైన 'వ'కారముతో ఈకావ్య మారంభింపబడి నందున ఇది శుభప్రదము.

శ్లో. క్వ సూర్యప్రభవో వంశః క్వచాల్పవిషయా మతిః,
తితీర్షుః దుస్తరం మోహాదుడుపేనాస్మి సాగరమ్, 2

వ్యాఖ్య : సూర్యప్రభవః - సూర్యుడు మూలకారణముగాగల, వంశః - వంశము, క్వ - ఎక్కడ ! అల్పవిషయా - కొద్ది విషయములనుమాత్రమేయెఱిగిన, మతిః - నాబుద్ధి, క్వ - ఎక్కడ ! దుస్తరం - దాటుటకు సాధ్యముకాని, సాగరం - సముద్రమును, మోహాత్ - అజ్ఞానమువలన, ఉడుపేన - చిన్న తెప్పతో, తితీర్షుః- దాటగోరుచున్నవాడను, అస్మి - అగుచున్నాను. మహత్తరమైన సూర్యవంశ మెక్కడ? అల్పజ్ఞుఁడనైన నేనెక్కడ? అజ్ఞానమున సముద్రమును తెప్ప కొయ్యతో దాటఁదలఁచుకొంటున్నాను అని భావము. 'క్వ' అను రెండు అవ్యయ పదములు సూర్యవంశముయొక్క అధిక్యమును సూచించును. 'ఉడుపము' అనగా తెప్ప, లేదా చర్మముతో వెదురుబద్దలను దొప్ప అకారముతో కట్టిన పుట్టి. దీనిని 'అరిగిలి' అని కూడా అందురు.

శ్లో. మందః కవియశఃప్రార్థీ గమిష్యా మ్యుపహాస్యతాం,
ప్రాంశులభ్యే ఫలే లోభాదుద్బాహు రివ వామనః. 3

వ్యాఖ్య : మందః - మూఢుడనైన (నేను), కవియశఃప్రార్థీ - కవులకు వచ్చు కీర్తిని కోరుచున్నవాడనై, ప్రాంశులభ్యే - ఎత్తుగానున్న వానిచేత పొంద దగిన, ఫలే - పండు విషయమున, లోభాత్ - ఆశవలన, ఉద్బాహుః - పైకి ఎత్తిన చేతులు గల, వామనః ఇవ - పొట్టివానివలె, అపహాస్యతాం - నగు బాటును, గమిష్యామి - పొందగలను. ప్రతివానికిని తాను కవిగా పేరు పొంద వలెనన్న యాశ ఉండును. అట్టి యాశకు లోనై అందని పండ్ల కజ్జులు చాచు పొట్టివానివలె నగుబాటు పాలగుదునని భావము. ఇందలి 'కవి' శబ్దము ఆదికవి వాల్మీకిని సూచించుననియు, ఆయన రచించిన రామాయణకథను తాను రచింప బూనుట హాస్యాస్పదమనియు, తెల్పుచు కాళిదాసు తన వినయమును వాల్మీకిని దృష్టిలో నుంచుకొని తెల్పెనేగాని సామాన్య కవులను దలచి కాదు.

శ్లో. అథవా కృతవాగ్ద్వారే వంశేఽస్మిన్ పూర్వసూరిభిః,
మణౌ వజ్రసముత్కీర్ణే సూత్రస్యేవాస్తి మే గతిః. 4

వ్యాఖ్య : అథవా - లేదా, పూర్వసూరిభిః - పూర్వకవులచేత, కృత వాగ్ద్వారే — కృత - చేయబడిన, వాగ్ద్వారే - వాగ్రూపమైన ద్వారము గల, అస్మిన్ వంశే - ఈ వంశమునందు, వజ్రసముత్కీర్ణే - వజ్రముచేత బెజ్జము వేయబడిన, మణౌ - మణియందు, సూత్రస్యేవ (సూత్రస్య + ఇవ) - దారమున్ను

నకువలె, మే - నాకు, గతిః - గమనము, అస్తి - కలదు. పూర్వకపు లనగా వాల్మీకి ప్రభృతులు; వజ్రము అనగా మణులకు రంధ్రమువేయు సూది; వర్ణనీయ మైన రఘువంశ రచనయందు నావాక్కు, రంధ్రములున్న మణులలో దారము దూరినట్లు ముందుకు సాగిపోవునని భావము.

శ్లో. సోఽహ మాజన్మ శుద్ధానా మాఫలోదయ కర్మణామ్,
ఆసముద్ర క్షితీశానా మానాక రథవర్త్మనామ్. 5

వ్యాఖ్య : (ఈ శ్లోకమునుండి "రఘూణామన్వయం వక్ష్యే" అను శ్లోకము వరకు ఒకే అన్వయము. అంతవరకును విశేషణములతో కూడిన ఒక పెద్ద వాక్యము). సోఽహం - (సః + అహం) - అట్టి నేను, ఆజన్మశుద్ధానాం - పుట్టుక మొదలుకొని పరిశుద్ధులైనవారును, ఆఫలోదయకర్మణాం - ఫలితము సిద్ధించువరకు కర్మాచరణము చేయువారును, ఆసముద్రక్షితీశానాం - సముద్ర పర్యంతమైన భూమికి రాజులైనవారును, ఆనాకరథవర్త్మనాం - స్వర్గలోకపర్యం తము తమ రథమార్గముగల వారును. "ఆజన్మ, ఆఫలోదయ, ఆసముద్ర, ఆనాక" అనుపదములలోని 'ఆ' కారము 'ఆఙ్' అను ఉపసర్గలోనిది. దీనికి, మర్యాద (హద్దు), అభివిధి (హద్దును కూడ కలుపుకొని) అనునవి అర్థములు. ఇచ్చట అభివిధి. 'ఆజన్మ' అనగా గర్భోత్పత్తి నుండియే వైదిక సంస్కారముల చేత శుద్ధులు అనియు, 'ఆసముద్ర' - సముద్రములనుకూడ కలుపుకొని అనియు, 'ఆనాక' అనగా స్వర్గమునందు కూడా వీరి రథములకు మార్గము కలదనియు భావము.

శ్లో. యథావిధి హుతాగ్నీనాం యథా కామార్చితార్థినాం,
యథాపరాధ దండానాం యథా కాల ప్రబోధినామ్. 6

వ్యాఖ్య : యథావిధి - శాస్త్రప్రకారము, హుతాగ్నీనాం - హోమము చేయబడిన అగ్నులు కలవారును, యథాకామ - వారి కోరిక ననుసరించి, అర్చిత - పూజింపబడిన, అర్థినాం - యాచకులు గలవారును, యథాపరాధ - అపరాధమునకు తగినట్టి, దండానాం - దండనము గల వారును, యథాకాల - కాలము నతిక్ర మింపక, ప్రబోధినాం - మేల్కొను నట్టి వారును. ఏ పాదమున కాపాదము ఒక్క సమాసము. విధిం అనతిక్రమ్య - యథావిధి; కామం అనతిక్రమ్య - యథాకామం; అపరాధం అనతిక్రమ్య - యథాపరాధం; కాలం అనతిక్రమ్య -

యథాకాలం; ఈ యథావిధ్యాదులు తమ ఉత్తరపదములైన హుతాదులతో సమాసమును పొందును. ఈ నాలుగు విశేషణములచేత రఘువంశ రాజులయొక్క దేవతాపూజ, అర్థి సత్కారము, దుష్టశిక్షణ శిష్టరక్షణములు, ప్రజా పాలన సమయ జాగరూకత, చెప్పబడినవి.

శ్లో. త్యాగాయ సంభృతార్థానాం సత్యాయ మితభాషిణామ్,
యశసే విజిగీషూణాం ప్రజాయై గృహమేధినామ్. 7

వ్యాఖ్య : త్యాగాయ - సత్పాత్రదానము కొఱకే, సంభృతార్థానాం - ప్రోగు చేయబడిన ధనము కలవారును, సత్యాయ సత్యపాలనము కొఱకే, మితభాషిణాం- మితముగా మాట్లాడువారును, యశసే - కీర్తికొఱకే, విజిగీషూణాం - విజయేచ్ఛ గలవారును, ప్రజాయై - సంతానము కొఱకే, గృహమేధినాం - వివాహమాడు వారును (భార్యను చేరువారును). "జాయాచ గృహిణీ గృహమ్" అను నిఘంటువు వలన 'గృహం' అనగా భార్య. గృహైః దారైః మేధంతే సంగచ్ఛంతే ఇతి గృహమేధినః అని వ్యుత్పత్తి. గృహమేధి అనగా వివాహితుడు. ఈ విశేషణముల చేత రఘువంశపు రాజుల పరోపకారము, సత్యప్రియత్వము, యశఃపరత్వము, పరిశుద్ధత్వము చెప్పబడినవి.

శ్లో. శైశవేఽభ్యస్త విద్యానాం యౌవనే విషయైషిణామ్,
వార్ధకే మునివృత్తీనాం యోగేనాంతే తనుత్యజామ్. 8

వ్యాఖ్య : శైశవే - బాల్యమునందు, అభ్యస్తవిద్యానాం - నేర్చుకొనబడిన విద్యలు కలవారును, యౌవనే - యౌవన దశయందు, విషయైషిణాం - భోగ్య వస్తువులను కోరువారును, వార్ధకే - ముదుసలితనమునందు, మునివృత్తీనాం - వానప్రస్థాశ్రమమును స్వీకరించి, మునులవలె జీవించువారును, అంత్యే - మరణ సమయమున, యోగేన - యోగాభ్యాస పాటవముచేత, (పరమాత్మ ధ్యానముచేత) తనుత్యజాం - శరీరమును విడుచు వారును;

శ్లో. రఘూణా మన్వయం వక్ష్యే తనువాగ్విభవోఽపిసన్,
తద్గుణైః కర్ణమాగత్య చాపలాయ ప్రచోదితః. 9

వ్యాఖ్య : తనువాగ్విభవోఽపిసన్—తను - స్వల్పమైన, వాగ్విభవః - వాణీప్రసారము గలవాడను, సన్‌అపి - అగుచున్నవాడనైనను, సోఽహం - అట్టి

  

నేను, తద్గుణైః - ఆ రఘువంశ రాజుల సద్గుణములచేత, కర్ణంఆగత్య - నా చెవిని చేరి, చాపలాయ - చేతగాని పనిని చేయుటకొఱకై, ప్రచోదితః - ప్రేరేపింపబడిన వాడనై, రఘూణాం - రఘువంశపు రాజులయొక్క, అన్వయం - వంశమును 'రఘువంశ' మను కావ్యమును, వక్ష్యే - చెప్పబోవుచున్నాను. వారి గుణములే నన్ను ప్రేరేపించి నాచేత రఘువంశమను మహాకావ్యమును రచింపజేయు చున్నవని భావము. "సోఽహ .... రఘూణా మన్వయం వక్ష్యే" అని చెప్పబడిన యీయన్వయమునకు 'కులకమ్' అని పేరు. నాలుగు, లేక అంతకు ఎక్కువగానున్న శ్లోకములకు కర్తృపదము, క్రియ ఒకటిగానే ఉన్నచో అది 'కులకము' అనబడును.

శ్లో. తం సంతః శ్రోతు మర్హంతి సదసద్వ్యక్తిహేతవః,
హేమ్నః సంలక్ష్యతేఽహ్యగ్నౌ విశుద్ధిః శ్యామికాపి వా. 10

వ్యాఖ్య : తం - ఆరఘువంశకావ్యమును, సదసద్వ్యక్తిహేతవః (సత్ + అసత్ + వ్యక్తి + హేతవః)- గుణదోషముల ప్రకటనమునకు కారణభూతులైన, సంతః - సత్పురుషులు, శ్రోతుం - వినుటకు, అర్హంతి - తగియున్నారు. హేమ్నః - బంగారముయొక్క, విశుద్ధిః వా - నిర్మలత్వముగాని, శ్యామికాపి వా - ఇతరలోహము కలిసిన దోషముగాని, అగ్నౌ - అగ్నియందు, సంలక్ష్యతే హి - చక్కగా చూడబడునుగదా! బంగారముయొక్క గుణదోషములు అగ్నిలో తెలిసినట్లు కావ్యమునందలి మంచిచెడ్డలు సత్పురుషులవలనఁ దెలియునని భావము. గుణదోష వివేకాధికారము సజ్జనులయిన విద్వాంసులదేకాని ఇతరులది కాదన్నది కవిహృదయము. 'హేమ్నః' అని బంగారము పేరు నెత్తుటచేత తన కావ్యము ఉత్తమోత్తమ మన్న విశ్వాసము కాళిదాసుకు కలదని ధ్వని.

శ్లో. వైవస్వతో మను ర్నామ మాననీయో మనీషిణాం,
ఆసీ న్మహీక్షితా మాద్యః ప్రణవ శ్ఛందసా మివ. 11

వ్యాఖ్య : మనీషిణాం - విద్వాంసులకు, మాననీయః - పూజ్యుడును, ఛందసాం - వేదములకు, ప్రణవఃఇవ - ఓంకారమువలె, మహీక్షితాం - రాజులకు, ఆద్యః - మొదటివాడునునైన, వైవస్వతఃనామ - వైవస్వతుడను ప్రసిద్ధిగల, మనుః - మనువు, ఆసీత్ - ఉండెను. ఒక బ్రహ్మకల్పములో పదునాలుగు మంది మనువులు మారెదరు. మనువు విశ్వపరిపాలనము చేయునట్టి ధర్మనిర్ణేత.

ఈ వైవస్వతుడు వర్తమానమనువు. సూర్యపుత్రుడు (వివస్వతః సూర్యస్య అపత్యం పుమాన్ వైవస్వతః అని వ్యుత్పత్తి). మనువులు స్వాయంభువ, స్వారోచిష, ఉత్తమ, తామస, రైవత, చాక్షుష, వైవస్వత, సూర్యసావర్ణిక, దక్షసావర్ణిక, బ్రహ్మసావర్ణిక, రుద్రసావర్ణిక, ధర్మసావర్ణిక, రౌచ్య, భౌచ్యులు పదునాలుగురు. వైవస్వతుడు సూర్యవంశపు రాజుల మూలపురుషుడు.

శ్లో. తదన్వయే శుద్ధిమతి ప్రసూతః శుద్ధిమత్తరః,
దిలీప ఇతి రాజేందు రిందుః క్షీరనిధావివ. 12

వ్యాఖ్య : శుద్ధిమతి - పవిత్రమైన, తదన్వయే (తత్ + అన్వయే) - ఆ మనువుయొక్క వంశమునందు, శుద్ధిమత్తరః - అంతకంటెను పవిత్రుడైన, దిలీపఇతి - దిలీపుడను ప్రసిద్ధిగల, రాజేందుః - రాజచంద్రుడు, క్షీరనిధౌ - పాలసముద్రమునందు, ఇందుఃఇవ - చంద్రుడువలె, ప్రసూతః - పుట్టెను. పవిత్రమైన యా మనువుయొక్క వంశమునందు అంతకంటెను పవిత్రుడైన దిలీపుడు, పాలసముద్రమునందు చంద్రునివలె పుట్టెనని భావము, అలంకారము : ఉపమ.

శ్లో. వ్యూఢోరస్కో వృషస్కంధః సాలప్రాంశు ర్మహాభుజః,
ఆత్మకర్మక్షమం దేహం క్షాత్రో ధర్మ ఇవాశ్రితః. 13

వ్యాఖ్య : వ్యూఢోరస్కః - విశాలమైన వక్షస్థలము గలవాడును, వృషస్కంధః - ఎద్దుమూపులవంటి భుజములు గల వాడును, సాలప్రాంశుః - మద్దిచెట్టువలె ఉన్నతమైన వాడును, మహాభుజః - దీర్ఘములైన బాహువులు గల వాడును అగు ఆ దిలీపుడు, ఆత్మకర్మక్షమం - తన పనులకు తగిన, దేహం - శరీరమును, ఆశ్రితః - ఆశ్రయించిన, క్షాత్రః - క్షత్రియ సంబంధమైన, ధర్మ ఇవ - ధర్మమా యనునట్లు, స్థితః - ఉండెను. క్షాత్రధర్మము దిలీపుడుగా అవతరించినదా ఏమి! అని తాత్పర్యము. అలంకారము ఉత్ప్రేక్ష. ఇచ్చటినుండి మూడు శ్లోకములు దిలీపవర్ణనము.

శ్లో. సర్వాతిరిక్త సారేణ సర్వతేజోభిభావినా,
స్థితః సర్వోన్నతేనోర్వీం క్రాంత్వా మేరు రివాత్మనా. 14

వ్యాఖ్య : సర్వాతిరిక్త సారేణ - సర్వభూతముల కంటెను అధికమైన బలముగలదియు, సర్వతేజోభిభావినా - అన్నిటిని తన తేజస్సుచేత తిరస్కరించు

నదియు, సర్వోన్నతేన - అన్నిటికంటెను ఉన్నతమైన, ఆత్మనా-దేహముచేత, మేరుఃఇవ - మేరుపర్వతమువలె, ఉర్వీం - భూమిని, క్రాంత్వా - ఆక్రమించి, స్థితః - ఉండెను (విశేషణములన్ని మేరుపర్వతమునకుగూడ సరిపోవును) సర్వోత్కృష్టుఁడై యుండెనని భావము.

అష్టాభిశ్చ సురేంద్రాణాం మాత్రాభిర్నిర్మితో నృపః,
తస్మా దభిభవత్యేష సర్వభూతాని తేజసా.

అని మనుస్మృతి. అష్టదిక్పాలకుల యంశలచేత రాజు సృజింపబడును గనుక అతడు తన బలతేజముల చేత సర్వభూతములను అణచియుంచగలఁడని తాత్పర్యము.

శ్లో. ఆకారసదృశప్రజ్ఞః ప్రజ్ఞయా సదృశాగమః,
ఆగమైః సదృశారంభః ఆరంభ సదృశోదయః. 15

వ్యాఖ్య : ఆకారసదృశప్రజ్ఞః - ఆకారముతో సమానమైన ప్రజ్ఞకలవాడును, ప్రజ్ఞయా - బుద్ధిశక్తితో, సదృశాగమః - సమానమైన శాస్త్రపరిశ్రమ కలవాడును, ఆగమైః - శాస్త్రములతో, సదృశారంభః - సమానమైన కర్మలు (పనులు) గలవాడును, ఆరంభ - కార్యారంభముతో, సదృశోదయః - సమానమైన ఫలసిద్ధి గలవాడును. దిలీపుడు ఆకారమునకుదగిన ప్రజ్ఞ, ప్రజ్ఞకుదగిన శాస్త్రజ్ఞానము, దానికి దగిన కార్యారంభము, దానికిదగిన అభ్యుదయము గలవాఁడై యుండెనట.

శ్లో. భీమకాంతైః నృపగుణైః స బభూవోపజీవినాను,
అధృష్య శ్చాభిగమ్యశ్చ యాదోరత్నై రివార్ణవః. 16

వ్యాఖ్య : భీమకాంతైః - భయంకరములును మనోహరములునగు, నృపగుణైః - రాజగుణములచేత (తేజస్సు, పరాక్రమము మొదలయిన భయంకర గుణములును, కులశీల దాక్షిణ్యాది మనోహర గుణములును), సః - ఆ దిలీపుడు, ఉపజీవినాం - ఆశ్రితులకు, యాదోరత్నైః - మొసళ్లు మొదలయిన జలజంతువుల చేతను ముత్యములు మొదలయిన రత్నములచేతను, అర్ణవఃఇవ - సముద్రుడువలె అధృష్యః చ - తిరస్కరించుటకు వీలులేనివాడును, అభిగమ్యః చ - ఆశ్రయించుటకు వీలయినవాడును, బభూవ - అయియుండెను. అధృష్యత్వము, అభిగమ్యత్వము రాజులకును, పాలకులకును ఉండవలసిన గుణములు. అవి లేకపోయినచో

ఆశ్రితులు, ప్రజలు తలపై కెక్కుదురు. లేదా విరక్తులై దూరము పోయెదరు కనుక ఆ రెండు గుణములును గలిగియుండెనని భావము.

శ్లో. రేఖామాత్ర మపి క్షుణ్ణా దామనో ర్వర్త్మనః పరమ్,
న వ్యతీయుః ప్రజా స్తస్య నియంతు ర్నేమివృత్తయః. 17

వ్యాఖ్య : నియంతుః - శిక్షకుడైన (సారథియైన), తస్య - ఆ దిలీపుని యొక్క, ప్రజాః - ప్రజలు, నేమివృత్తయః - నేమి - చక్రముల అంచుల (కమ్ముల, లేక పట్టాల) యొక్క, వృత్తయః - వర్తనమువంటి వర్తనముగల వారై (నడక), ఆ, మనోః -, మనువునుండి, క్షుణ్ణాత్ - అభ్యస్తమైయున్న (నలిగియున్న), వర్త్మనః - మార్గముకంటె, రేఖామాత్రం అపి - ఒక గీటు మాత్రముకూడ, న వ్యతీయుః - ప్రక్కకు తొలగకుండిరి. వైవస్వత మనువునుండి దిలీపుని వరకు ఎన్నో తరములు గడచినవి. అయినను ఆ వంశపు రాజులు మనువు చెప్పిన ధర్మమార్గమున తాము నడచుచు తమ ప్రజలను నడిపించు చుండిరని భావము. సమర్థుడైన సారథి రథచక్రములు రేఖామాత్రముకూడ ప్రక్కకు తొలగ నట్లు దిలీపుని పాలనమున ప్రజలు ధర్మమార్గమును కొంచముకూడ అతిక్రమింప కుండిరనుట వలన రెండిటికిని ఔపమ్యము స్ఫురించును. ఉపమాలంకార ధ్వని.

శ్లో. ప్రజానా మేవ భూత్యర్థం స తాభ్యో బలి మగ్రహీత్
సహస్రగుణ ముత్స్రష్టు మాదత్తే హి రసం రవిః. 18

వ్యాఖ్య : సః - ఆ దిలీపుడు, ప్రజానాం ప్రజలయొక్క, భూత్యర్థం ఏవ (భూతి + అర్థం) - అభివృద్ధి కోసమే, తాభ్యః - వారివలన, బలిం - పన్నును (వారి ఆదాయంలో ఆరవ భాగరూపమైన పన్నులను), అగ్రహీత్ - తీసుకొనెను, హి - అదియుక్తమే, రవిః - సూర్యుడు, సహస్రగుణం - వేయి రెట్లుగా, ఉత్స్రష్టుం - విడుచుటకు (వర్షించుటకే), రసం - జలమును, ఆదత్తే - స్వీకరించుచున్నాడు. ప్రజావృద్ధి కార్యముల కోసమే దిలీపుడు షష్ఠాంశరూపమైన పన్నులను స్వీకరించుచుండెను. సూర్యుడు వెయ్యిరెట్లుగా వర్షించుటకే నదీతటా కాదుల జలమును తీసుకొనుచున్నాడు. "ఆదిత్యా జ్జాయతే వృష్టిః" అని ప్రమాణము. అర్థాంతరన్యాసము అలంకారము.

శ్లో. సేనా పరిచ్ఛద స్తస్య ద్వయ మేవార్థ సాధనమ్,
శాస్త్రేష్వకుంఠితా బుద్ధిః మౌర్వీ ధనుషి చాతతా. 19

వ్యాఖ్య : తస్య - ఆదిలీపునికి, సేనా - చతురంగబలము, పరిచ్ఛదః - ఉపకరణమే (ఛత్రచామరాదులవలె రాజచిహ్నము మాత్రమే), అర్థసాధనం - ప్రయోజన సాధనము మాత్రము, ద్వయమేవ - రెండే, శాస్త్రేషు - అర్థశాస్త్ర నీతిశాస్త్రాదులందు, అకుంఠితా - నిరాటంకముగా ముందుకు సాగునట్టి, బుద్ధిః - బుద్ధియు, ధనుషి - విల్లునందు, ఆతతా - ఆరోపితమైన (ఎక్కుపెట్టబడిన), మౌర్వీ - అల్లెత్రాడును. దిలీపునికి సైన్యము మొదలయినవి అలంకార ప్రాయములు మాత్రమే, కార్యసాధనమునం దతని బుద్ధియు, ధనుస్సును మాత్రమే చాలి యుండె నని భావము.

శ్లో. తస్య సంవృతమంత్రస్య గూఢాకారేంగితస్య చ,
ఫలానుమేయాః ప్రారంభాః సంస్కారాః ప్రాక్తనా ఇవ. 20

వ్యాఖ్య : సంవృతమంత్రస్య - దాచబడిన ఆలోచనలు గలిగినట్టియు, గూఢాకారేంగితస్య చ—గూఢ - పైకి కనబడని, ఆకార - రాగద్వేషాదులును, ఇంగిత - హృదయము నందలి మార్పును గల, తస్య - ఆ దిలీపుని యొక్క, ప్రారంభాః - పనుల ఆరంభములు (సామాద్యుపాయ ప్రయోగములు), ప్రాక్తనాః - పూర్వజన్మకు సంబంధించిన, సంస్కారాః ఇవ - కర్మవాసనలువలె, ఫలానుమేయాః - ఫలితమునుబట్టి యూహింపదగినవి మాత్రమే (ఆసన్ - అయినవి). రాజ్యపాలనమునకు సంబంధించిన ఆలోచనలను, తన మనోభావములను, తానారంభించు పనులను రహస్యముగానుంచి ఫలితము ఏర్పడినప్పుడే నలుగురికి తెలియునట్లు చేయుచుండెనని భావము. ముందుగానే ప్రకటించుట నీతిగాదని యాజ్ఞవల్క్య స్మృతి చెప్పుచున్నది :

"మంత్రమూలం యతో రాజ్య మతో మంత్రం సురక్షితమ్.
కుర్యాత్ యథాన్యే న విదుః కర్మణాం ఆఫలోదయాత్."

శ్లో. జుగోపాత్మాన మత్రస్తో భేజే ధర్మ మనాతురః
అగృధ్ను రాదదే సోఽర్థ మసక్త స్సుఖ మన్వభూత్. 21

వ్యాఖ్య : సః - ఆదిలీపుడు, అత్రస్తః - భీరువుకాకయే, ఆత్మానం - శరీరమును, జుగోప - రక్షించుకొనెను, అనాతురః - బాధలు లేనివాడైనను, ధర్మం - సుకృతమును, భేజే - ఆర్జించెను, అగృధ్నుః - లోభికాకయే, అర్థం - ధనమును, ఆదదే - స్వీకరించెను, అసక్తః - ఆసక్తిలేనివాడై, సుఖం -

సౌఖ్యమును, అన్వభూత్ - అనుభవించెను. శరీరము ఆద్యధర్మసాధనము కనుక శరీర రక్షణమును చేసుకొనెనే కాని ఇతరులకు భయపడికాదనియు, ఏదియో ఆపద వచ్చినప్పుడు కాక నిత్యము పుణ్యకర్మలు చేసెననియు, పిసినిగొట్టుతనముచే గాక రాజధర్మముగా ధనము నార్జించెననియు, ఆ యా సుఖములందు వ్యసనియై ఆసక్తుడు గాక అర్హభోగముల ననుభవించెననియు భావము.

శ్లో. జ్ఞానే మౌనం క్షమా శక్తౌ త్యాగే శ్లాఘావిపర్యయః,
గుణా గుణానుబంధిత్వా త్తస్య సప్రసవా ఇవ. 22

వ్యాఖ్య : జ్ఞానే - పరవృత్తాంతము తెలిసినప్పుడును, మౌనం-మౌనము, శక్తౌ - ప్రతీకారము చేయగలశక్తి యున్నప్పుడును, క్షమా - సహనము, త్యాగే - దానముచేయుట యందు, శ్లాఘావిపర్యయః - స్తోత్రమును కోరకుండుటయు, ఇట్లు, తస్య - ఆదిలీపుని యొక్క, గుణాః - జ్ఞానాదిగుణములు, గుణానుబంధిత్వాత్ - విరుద్ధములైన మౌనాదిగుణములతో సాహచర్యముగలవి యగుటవలన, సప్రసవాఃఇవ - సమానముగా పుట్టినవా (సోదరులా) యనునట్లు, (అభూవన్ - ఉండినవి). "నాన్యోపతాపి వచనం మౌనం వ్రతచరిష్ణుతా" అను కామందకవచనము ననుసరించుచు, ఇతరులను బాధించు వచనమును పలుకక మౌనము వహించుచుండెను. "శక్తానాం భూషణం క్షమా" అని చాణక్య వచనము. దానము చేసితి నని చెప్పుకొనుట తప్పు అని మను వచనము: "న దత్త్వా పరికీర్తయేత్." విరుద్ధములైనను అతనియందు అవిరోధముగా పైగుణము లుండెనని భావము. అలంకారము : ఉత్ప్రేక్ష.

శ్లో. అనాకృష్టస్య విషయై ర్విద్యానాం పారదృశ్వనః,
తస్య ధర్మరతే రాసీత్ వృద్ధత్వం జరసా వినా. 23

వ్యాఖ్య : విషయైః - ఇంద్రియభోగ్యములైన రూపరసాదులచేత, అనాకృష్టస్య - ఆకర్షింపబడని వాడును, విద్యానాం - వేదాది విద్యలయొక్క, పారదృశ్వనః - అంతమును చూచినవాడును, ధర్మరతేః - ధర్మమునం దాసక్తికలవాడును అగు, తస్య - ఆదిలీపునికి, జరసావినా - శారీరకమైన ముసలితనము లేకయే, వృద్ధత్వం - వార్ధక్యము, ఆసీత్ - ఏర్పడెను. అతడు శరీరముచేత యౌవనవంతుడైనను జ్ఞానముచేత వృద్ధుడై 'పెద్దమనిషి' అని అనిపించుకొనెనని భావము. వృద్ధత్వము వైరాగ్యముచేతను, విద్యచేతను, జ్ఞానముచేతను, వయస్సు

పెరుగుటచేతను నాల్గువిధములుగానుండును. అందు మొదటి మూడు వృద్ధత్వములు అతనికి కలిగినవి అని భావము.

శ్లో. ప్రజానాం వినయాధానాత్ రక్షణాత్ భరణా దపి,
స పితా పితర స్తాసాం కేవలం జన్మ హేతవః. 24

వ్యాఖ్య : ప్రజానాం - ప్రజలకు, వినయాధానాత్ (వినయ + అధానాత్)- సన్మార్గ ప్రవర్తనము కలిగించుట వలనను, రక్షణాత్ - భయహేతువుల నుండి కాపాడుట వలనను, భరణాత్ అపి - అన్నపానాదులచేత పోషించుట వలనను కూడ, సః - ఆదిలీపుడు, పితా - తండ్రి యయ్యెను, తాసాం - వారియొక్క, పితరః - తండ్రులు, కేవలం జన్మ హేతవః - పుట్టుటకు మాత్రమే కారకులు. ప్రజలకు తమ తల్లిదండ్రులు జన్మకు మాత్రమే కారణము, శిక్షారక్షణాదులచేత దిలీపుడే తండ్రివంటివాడై యుండెనని భావము.

శ్లో. స్థిత్యై దండయతో దండ్యాన్ పరిణేతుః ప్రసూతయే,
అప్యర్థకామౌ తస్యాస్తాం ధర్మాయైవ మనీషిణః. 25

వ్యాఖ్య : దండ్యాన్ - దండింప దగినవారిని, స్థిత్యై - లోకస్థితికొఱకే, దండయతః - శిక్షించు చున్నట్టియు, ప్రసూతయే - సంతానముకొఱకు మాత్రమే, పరిణేతుః - వివాహమాడినట్టియు, మనీషిణః - విద్వాంసుడైన, తస్య -ఆదిలీపుని యొక్క, అర్థకామౌ అపి - అర్థ కామపురుషార్థములుకూడ, ధర్మాయ + ఏవ - ధర్మము కొరకే, ఆస్తాం - అయినవి. దండింప దగినవారిని క్రోధద్వేషములచేత కాక, లోకమునందు ధర్మమును ప్రతిష్ఠించుటకొఱకే, దండించుట. "అదండ్యాన్ దండయన్ రాజా దండ్యాం శ్చైవాప్యదండయన్, అయశో మహదాప్నోతి నరకం చాధిగచ్ఛతి" అను శాస్త్రము ననుసరించుటకే, అట్లే సంతానము కొఱకే వివాహ మాడెననుట వలన యధేచ్ఛా కామప్రవృత్తి అతనియందు లేకుండెననియు, ఆ రెండు పురుషార్థములను ధర్మ పురుషార్థమును సాధించుటకొఱకే అత డనుసరించె ననియు భావము.

శ్లో. దుదోహ గాం స యజ్ఞాయ సస్యాయ మఘవా దివం,
సంపద్వినిమయేనోభౌ దధతు ర్భువనద్వయమ్. 26

వ్యాఖ్య : సః - ఆ దిలీపుడు, యజ్ఞాయ - యజ్ఞములు చేయుటకొఱకు, గాం - భూమిని, దుదోహ - పితికెను (పన్నులు తీసుకొనెను), మఘవా -

ఇంద్రుడు, సస్యాయ - పైరును వృద్ధిపరచుట కొఱకు, దివం - స్వర్గమును, దుదోహ - వర్షరూపమున పిదికెను, ఇట్లు, ఉభౌ - ఇద్దఱును, సంపద్వినిమయేన - తమ సంపదల మార్పుచేత (ఆదాన ప్రదానములచేత), భువనద్వయం - లోక ద్వయమును (భూలోక స్వర్గలోకములు రెండిటిని), దధతుః - పోషించిరి.

"రాజా త్వర్థాన్ సమాహృత్య కుర్యా దింద్రమహోత్సవమ్,
ప్రీణితో మేఘవాహస్తు మహతీం వృష్టి మావహేత్".

అని దండనీతి. రాజు యజ్ఞాదులచేత ఇంద్రుని తృప్తిపరచినచో ఇంద్రుడు వర్షములు కురిపించును. కనుక దిలీపుడు ఆ విధముగా చేయుచు తన దేశమున అనావృష్ట్యాది దోషములను రానీయక ప్రజాపాలనము చేసెనని భావము.

శ్లో. న కిలానుయయు స్తస్య రాజానో రక్షితు ర్యశః,
వ్యావృత్తా యత్ పరస్వేభ్యః శ్రుతౌ తస్కరతా స్థితా. 27

వ్యాఖ్య : రాజానః - ఇతర రాజులు, రక్షితుః - భయములనుండి కాపాడునట్టి, తస్య - ఆ దిలీపుని యొక్క, యశః - కీర్తిని, నానుయయుః కిల (న + అనుయయుః) - అనుకరింపజాలకపోయిరిసుమా, యత్ - ఎందువల్లననగా, తస్కరతా - చౌర్యము, పరస్వేభ్యః - ఇతరుల ధనములనుండి, వ్యావృత్తా - మరలినదై, శ్రుతౌ - వాచకశబ్దమునందు మాత్రమే (తస్కర శబ్దమునందు మాత్రమే), స్థితా - నిల్చియుండినదో. దిలీపుని రాజ్యమునందు తస్కరత్వము అనగా దొంగతనము లేకుండెను. తస్కరత్వమను శబ్దము మాత్రము 'వంధ్యా పుత్ర గగనకుసుమాది' శబ్దములవలె అర్థశూన్యమై యుండెనని భావము. అందు వల్ల పరరాజులు అతని కీర్తిని దొంగిలింపలేకపోయిరి. అతనివంటి కీర్తి మంతుఁడు లేకుండెనని భావము. అలంకారము : కావ్యలింగము.

శ్లో. ద్వేష్యోఽపి సమ్మతః శిష్టః తస్యార్తస్య యథౌషధం,
త్యాజ్యో దుష్టః ప్రియోఽప్యాసీ దంగుళీ వోరగక్షతా. 28

వ్యాఖ్య : శిష్టః - సజ్జనుడు, ద్వేష్యోపి(ద్వేష్యః + అపి) - శత్రువైనను, ఆర్తస్య - రోగికి, ఔషధంయథా - మందువలె, తస్య - ఆ దిలీపునికి, సమ్మతః - ఇష్టమైనవాడు, ఆసీత్ - ఆయెను, దుష్టః - దుర్జనుడు, ప్రియోఽపి (ప్రియః + అపి)- ప్రేమాస్పదుడైనను, ఉరగక్షతా - పాముచేత కఱవబడిన, అంగుళీవ - వ్రేలువలె, త్యాజ్యః - విడువదగినవాడు, ఆసీత్ - ఆయెను- అతనికి శిష్టుడే బంధువు, దుష్టుడే శత్రువు అని భావము. అలంకారము : ఉపమ.

శ్లో. తం వేధాః విదధే నూనం మహాభూతసమాధినా,
తథాహి సర్వే తస్యాసన్ పరార్థైకఫలాః గుణాః. 29

వ్యాఖ్య : వేధాః - బ్రహ్మ, తం - ఆదిలీపుని, మహాభూతసమాధినా - పంచమహాభూతముల యొక్క కారణ సామగ్రిచేత, విదధే నూనం - సృజించి యుండవచ్చును, తథాహి - అట్లేయైయుండును, తస్య - అతనియొక్క, సర్వే గుణాః - అన్ని గుణములును, పరార్థైకఫలాః - ఇతరుల ప్రయోజనమే ఫలముగా గలవి, ఆసన్ - అయినవి. పంచభూతముల గుణములైన శబ్దస్పర్శరూపరస గంధములు పరులకే యుపయోగపడునట్లు అతని గుణములుకూడ పరప్రయోజనమే ముఖ్యముగాగల వయ్యెనని భావము. కారణ గుణములు కార్యమునందు సంక్రమించినవను న్యాయము సూచింపబడినది. అలంకారము : ఉత్ప్రేక్ష.

శ్లో. స వేలావప్ర వలయాం పరిఖీకృత సాగరామ్,
అనన్యశాసనా ముర్వీం శశాసై కపురీ మివ. 30

వ్యాఖ్య : సః - ఆదిలీపుడు, వేలావప్రవలయాం - సముద్రపుటొడ్డు కోట గోడగా కలదియు, పరిఖీకృతసాగరాం - అగడ్తగా చేయబడిన సముద్రములు గలదియు, అనన్యశాసనాం - మరియొకని శాసనము లేనిదియు నగు, ఉర్వీం - భూమిని, ఏకపురీం ఇవ - ఒక నగరమునువలె, శశాస - ఏలెను. చతుస్సముద్ర ముద్రితమైన భూమండలమును అనాయాసముగా పాలించెనని భావము. అలం కారము : రూపకము.

శ్లో. తస్య దాక్షిణ్య రూఢేన నామ్నా మగధవంశజా,
పత్నీ సుదక్షిణే త్యాసీ దధ్వరస్యేవ దక్షిణా. 31

వ్యాఖ్య : తస్య - ఆదిలీపునికి, మగధవంశజా - మగధ వంశమునందు పుట్టినదియు, దాక్షిణ్యరూఢేన - దాక్షిణ్య గుణముచేత ప్రసిద్ధమైన (దాక్షిణ్య మనగా ఎదుటివారి చిత్తవృత్తికి అనుకూలముగా వర్తించు గుణము, మొగ మోటమి) నామ్నా - పేరుచేత, సుదక్షిణేతి (సుదక్షిణా + ఇతి) - సుదక్షిణయని, అధ్వరస్య - యజ్ఞపురుషునకు, దక్షిణా ఇవ - దక్షిణయనబడు స్త్రీవలె, పత్నీ - భార్య, ఆసీత్ - ఉండెను. దిలీపునికి మహాపవిత్రురాలగు సుదక్షిణ భార్యయై యుండెను. "యజ్ఞో గంధర్వ స్తస్య దక్షిణా అప్సరసః" అని శ్రుతి. దిలీపుడు యజ్ఞపురుషునితోను, సుదక్షిణ దక్షిణతోను పోల్చబడుటచేత ఆదంపతుల ధార్మికత్వ పవిత్రత్వములు సూచితములగును. అలంకారము : ఉపమ.

శ్లో. కళత్రవంత మాత్మాన మవరోధే మహత్యపి,
తయా మేనే మనస్విన్యా లక్ష్మ్యా చ వసుధాధిపః. 32

వ్యాఖ్య: వసుధాధిపః - భూపతియైన ఆదిలీపుడు, అవరోధే - అంతఃపుర జనము, మహత్యపి (మహతి + అపి) - ఎక్కువగా ఉన్నప్పటికిని, మనస్విన్యా - దృఢచిత్తయైన (పతిచిత్తానువర్తనాది నిర్బంధములను సహించునట్టిదియైన), తయా - ఆసుదక్షిణాదేవిచేతను, లక్ష్మ్యా చ - రాజ్యలక్ష్మిచేతను, ఆత్మానం - తనను, కళత్రవంతం - భార్యగలవానినిగా, మేనే - తలచెను. 'రాజానో బహువల్లభాః' అను న్యాయముచేత అంతఃపురస్త్రీలెందఱున్నను సుదక్షిణయే పట్టపురాణి. వసుధాధిపశబ్దముచేత భూమి, రాజ్యలక్ష్మి, సుదక్షిణ ఈ ముగ్గురి చేతనే అతడు తనను కళత్రవంతునిగా భావించెను. రాజులకు భూమిని, రాజ్య లక్ష్మిని భార్యలనుగా వర్ణించుట కవిసమయము.

శ్లో. తస్యా మాత్మానురూపాయాం ఆత్మజన్మసముత్సుకః,
విలంబితఫలైః కాలం స నినాయ మనోరథైః. 33

వ్యాఖ్య: సః - అతడు, ఆత్మానురూపాయాం - తనకు తగినదియైన, తస్యాం - ఆసుదక్షిణాదేవియందు, ఆత్మజన్మసముత్సుకః - కుమారుడు పుట్టుట యందు త్వరపడువాడై, విలంబితఫలైః - ఆలస్యమయిన పుత్రప్రాప్తి రూప ఫలముగల, మనోరథైః - కోరికలతో, కాలం - కాలమును, నినాయ - గడపెను. 'ఆత్మజన్మ' అను శబ్దమునకు పుత్రుడనియు, తానే పుత్రరూపమున జన్మించుట యనియు నర్థము. "ఆత్మా వై పుత్రనామాసి" అన్న శ్రుతి రెండవ యర్థమునకు ప్రమాణము. దిలీపుడు ఎప్పుడు కుమారుడు పుట్టునాయన్న కోరిక లతో కాలము గడపుచుండెనని భావము.

శ్లో. సంతానార్థాయ విధయే స్వభుజా దవతారితా,
తేన ధూర్జగతో గుర్వీ సచివేషు నిచిక్షిపే. 34

వ్యాఖ్య: తేన - ఆ దిలీపునిచేత, సంతానార్థాయ - సంతానమే ప్రయోజన ముగాగల, విధయే - అనుష్ఠానము కొఱకు, స్వభుజాత్ - తనభుజముల నుండి, అవతారితా - దింపబడిన, జగతః - భూమి యొక్క, గుర్వీ - గొప్పదియైన, ధూః - భారము, సచివేషు - మంత్రులయందు, నిచిక్షిపే - ఉంచబడెను, దిలీపుడు సంతానార్థమై చేయవలసిన మంత్రతంత్రాద్యనుష్ఠానము కొరకై రాజ్యపాలన భార మును మంత్రులపై నుంచెనని భావము.

శ్లో. అథాభ్యర్చ్య విధాతారం ప్రయతౌ పుత్రకామ్యయా,
తౌ దంపతీ వసిష్ఠస్య గురోర్జగ్మతు రాశ్రమమ్. 35

వ్యాఖ్య: అథ - తరువాత, పుత్రకామ్యయా - పుత్రసంతానేచ్ఛచేత, తౌ దంపతీ - ఆ భార్యాభర్తలు (సుదక్షిణా దిలీపులు), ప్రయతౌ - వ్రతనియమము కలవారై, విధాతారం - బ్రహ్మను, అభ్యర్చ్య - పూజించి, గురోః - తమ కుల గురువైన, వసిష్ఠస్య - వసిష్ఠమహాముని యొక్క, ఆశ్రమం - ఆశ్రమమును గుఱించి, జగ్మతుః - వెళ్లిరి. సంతానార్థులైన సుదక్షిణా దిలీపులు వసిష్ఠాశ్రమము నకు వెళ్లిరి. పుత్రసంతానార్థులు బ్రహ్మను ఉపాసింపవలెనని మంత్ర శాస్త్రజ్ఞుల నిర్ణయము. "స ఖలు పుత్రార్థిభిరుపాస్యతే" కులగురువైన వసిష్ఠుడు ఉపాయము చెప్పునని అచ్చటికి నియమ నిష్ఠలుగలవారై వెళ్లిరని భావము.

శ్లో. స్నిగ్ధ గంభీర నిర్ఘోష మేకం స్యందన మాస్థితౌ,
ప్రావృషేణ్యం పయోవాహం విద్యు దైరావతా వివ. 36

వ్యాఖ్య: స్నిగ్ధ గంభీర నిర్ఘోషం - మధుర గంభీరమైన ధ్వనిగల, ఏకం స్యందనం - ఒకే రథమును, ప్రావృషేణ్యం - వర్షాకాలమునందు వచ్చునట్టి, పయోవాహం - మేఘమును, విద్యుదైరావతావివ (విద్యుత్ + ఐరావతౌ + ఇవ) - మెఱుపు, జలరూపమైన ఐరావత గజము వలె, ఆస్థితౌ - అధిరోహించిన వారై (తౌ దంపతీ - ఆ దంపతులు, ఆశ్రమం - వసిష్ఠాశ్రమమును గురించి, జగ్మతుః - వెళ్లిరి). ఇచ్చటినుండి 45 వ శ్లోకమువరకును పూర్వశ్లోకము నందలి "తౌ దంపతీ వసిష్ఠస్య గురోర్జగ్మతు రాశ్రమమ్" అను వాక్య మనుబంధముగా నన్వయించుకొని యర్థము నెఱుఁగవలెను. ఏకస్యందన శబ్దము ఆ దంపతుల మనోరథైక్యమును సూచించుటయేగాక, వసిష్ఠాశ్రమమునకు వినయ వినీతులై ఆడంబరము లేనివారై వెళ్లిరను విషయమునుగూడ సూచించును. అలంకారము: ఉపమ.

శ్లో. మాభూ దాశ్రమ పీడేతి పరిమేయ పురస్సరౌ,
అనుభావ విశేషాత్తు సేనాపరివృతా వివ. 37

వ్యాఖ్య: ఆశ్రమ పీడా - ఆశ్రమమునకు బాధ, మాభూత్ - కలుగకుండు గాక, ఇతి - అని, పరిమేయపురస్సరౌ - లెక్కపెట్టదగిన సేవకులు గలవారై, అనుభావ విశేషాత్తు - తేజోవిశేషము వలననైతే, సేనాపరివృతావివ (సేనాపరి

వృతౌ + ఇవ) ఒక సైన్యముచేత చుట్టబడియున్నారా ఏమి యనునట్లు, (స్థితౌ - ఉన్నవారై, జగ్మతుః - వెళ్లిరి) వసిష్ఠాశ్రమమునకు జన సమ్మర్దమువలని బాధ కలుగకుండుటకై 'పురస్సరౌ' అనగా ముందునడచువారు, ఆశ్రమ మార్గమును చూపుటకును తమకు కావలసినంతపట్టుకును గల పరిజనులతో వెళ్లిరని భావము.

శ్లో. సేవ్యమానౌ సుఖస్పర్శైః సాలనిర్యాస గంధిభిః,
పుష్పరేణూత్కిరై ర్వాతై రాధూత వనరాజిభిః. 38

వ్యాఖ్య : సుఖస్పర్శైః - ప్రియమైన స్పర్శగలవియు, సాలనిర్యాస గంధిభిః - మద్దిచెట్ల జిగురువాసన గలవియు, పుష్పరేణూత్కిరైః - పుప్పొడులను చల్లుచున్నట్టివియు, ఆధూతవనరాజిభిః - కొంచము కదలింపబడిన వనపంక్తులు గలవియునైన, వాతైః - వాయువులచేత, సేవ్యమానౌ - సేవింపబడుచున్న వారై (జగ్మతుః - వెళ్లిరి). ఆ + ధూత — ఆధూత, 'ఆఙ్' అను అవ్యయ మునకు మర్యాద - హద్దు, అభివిధి - పూర్తిగా తనలో కలుపుకొని, ఈషత్ - కొంచము అను నర్థములు కలవు. కనుక ఆధూత అనగా కొంచముగా కదల్ప బడిన అని యర్థము. వారి దారిలో చల్లని మెల్లని పరిమళవంతములైన వాయు వులు వీచినవనియు, అది భావిశుభసూచకమనియు భావము.

శ్లో. మనోఽభిరామాః శృణ్వంతౌ రథనేమి స్వనోన్ముఖైః,
షడ్జసంవాదినీః కేకాః ద్విధాభిన్నాః శిఖండిభిః, 39

వ్యాఖ్య : రథనేమిస్వనోన్ముఖైః - రథచక్రముల ధ్వనులవలన పైకెత్త బడిన ముఖములుగల (చక్రధ్వనులు మేఘధ్వనులను భ్రమచేతనని భావము), శిఖండిభిః - నెమళ్ళచేత, ద్విధా - రెండు విధములుగా, భిన్నాః - వేరుపడి నవియు, షడ్జసంవాదినీః - షడ్జస్వరమును పోలినవియు, మనోఽభిరామాః - మనస్సునకు ప్రియమైనవియు నగు, కేకాః - నెమలి కేకలను, శృణ్వంతౌ - విను చున్నవారై (జగ్మతుః - వెళ్లిరి) మనోహరములైన నెమలి కేకలను విని యానం దించుచు వెళ్లిరని భావము. 'శుద్ధము, వికృతము' అను భేదములచేత, లేదా 'చ్యుతము, అచ్యుతము' అను భేదములచేత షడ్జస్వరము రెండు విధములు. అట్లే నెమలి కేక రెండు విధములుగా నుండును కనుక 'షడ్జసంవాదినీః' అన్నాడు. 'షడ్జం మయూరో వదతి' నెమలి షడ్జస్వరమును పలుకునని శాస్త్రము. 'స రి గ మ ప ద ని' అను సప్తస్వరములను పలుకుటలో పొరపాటు రాకుండు టకై వాటిని మృగ పక్షుల స్వరములతో పోల్చి నిర్ణయించినారు శాస్త్రజ్ఞులు.

"మయూర, చాతక, చ్ఛాగ, క్రౌంచ, కోకిల, దర్దురాః,
గజశ్చ సప్త షడ్జాదీన్ క్రమాదుచ్చారయంత్యమీ".

నెమిలి, వానకోయిల, మేక, క్రౌంచపక్షి (కొరకంచు), కోకిల, కప్ప, ఏనుగు, వరుసగా సప్తస్వరములను పలుకును.

శ్లో. పరస్పరాక్షి సాదృశ్య మదూరోజ్ఝిత వర్త్మసు,
మృగద్వంద్వేషు పశ్యంతౌ స్యందనాబద్ధ దృష్టిషు. 40

వ్యాఖ్య: అదూరోజ్ఝితవర్త్మసు - దగ్గరగానే విడువబడిన మార్గము కలవియు (రథము వెళ్ళుటకు మాత్రము దారిని వదలి ప్రక్కన నిల్చుని యుండినట్టివని యర్థము), స్యందనాబద్ధదృష్టిషు - రథమునందే నిలిపియుంచబడిన చూపులు గలవియు నగు, మృగద్వంద్వేషు - లేడిజంటలయందు, పరస్పరాక్షి సాదృశ్యం - ఒకరి కన్నుల సామ్యము నొకరు, పశ్యంతౌ - చూచుచున్నవారై, (జగ్మతుః - వెళ్లిరి). గుఱ్ఱములు, రథచక్రముల ధ్వనులు చిత్రముగా గనపడుటచేత లేడి జంటలు రథమునే చూచుచు దారిప్రక్కనే నిలిచియున్నవి. ఆడులేళ్ల కనులయందు సుదక్షిణానేత్రసాదృశ్యమును దిలీపుడును, మగలేళ్ల కనులయందు దిలీపనేత్ర సాదృశ్యమును సుదక్షిణాదేవియును చూచుకొనిరని భావము. ('మృగీచ మృగశ్చ మృగౌ' అని ఏకశేషసమాసము; పిమ్మట, మృగయోః ద్వంద్వాని మృగద్వంద్వాని, తేషు మృగద్వంద్వేషు అని తత్పురుష సమాసము. అప్పుడు మృగమిథునములు జంటలు అనునర్థము వచ్చును).

శ్లో. శ్రేణీబంధా ద్వితన్వద్భి రస్తంభాం తోరణస్రజమ్,
సారసైః కలనిర్హ్రాదైః క్వచి దున్నమితాననౌ. 41

వ్యాఖ్య: శ్రేణీబంధాత్ - వరుసలుకట్టుటవలన, అస్తంభాం - స్తంభములు లేని, తోరణస్రజం - తోరణమాలను, వితన్వద్భిః - ఏర్పరచుచున్నట్లుగా నున్నట్టియును, కలనిర్హ్రాదైః - అవ్యక్త మధురమైన అరపులుగల, సారసైః - బెగ్గురు పక్షులచేత, క్వచిత్ - ఒకచోట, ఉన్నమితాననౌ - ఆకాశమువైపున కెత్తబడిన ముఖములు గలవారై (జగ్మతుః - వెళ్లిరి). బెగ్గురుపక్షులు ఆకసమున బారులుతీర్చి అరచుచుండగా తలలెత్తి వాటిని చూచుచు నేగిరని భావము. తోరణమనగా ఇంటి బహిర్ద్వారము (పెద్దగానుండు ప్రాకారాదుల ద్వారము). దానికి కట్టునట్టి 'స్రజము' అనగా మామిడియాకులతో లేదా పూలతో కట్టబడుదండ. దానిని యేర్పరచుచున్నవా?

ఏమి అని ఉత్ప్రేక్ష, 'ఇవ' లేనందున అది గమ్యోత్ప్రేక్ష అలంకారము. ఇది వారి ప్రయాణమునకు శుభసూచకము.

శ్లో. పవన స్యానుకూలత్వాత్ ప్రార్థనా సిద్ధి శంసినః,
రజోభి స్తురగోత్కీర్ణై రస్పృష్టాలక వేష్టనౌ. 42

వ్యాఖ్య: ప్రార్థనాసిద్ధిశంసినః - మనోరథసిద్ధిని సూచించునట్టి, పవనస్య - వాయువుయొక్క, అనుకూలత్వాత్ - అనుకూల్యమువలన, తురగోత్కీర్ణైః - గుఱ్ఱములచేత పైకిచల్లబడిన, రజోభిః - దుమ్ములచేత, అస్పృష్టాలక వేష్టనౌ - అస్పృష్ట - తాకబడని, అలక - సుదక్షిణాదేవి ముంగురులును, వేష్టన - దిలీపుని తలపాగయు గలవారై (జగ్మతుః - వెళ్లిరి). అనుకూల వాయువనగా మనము వెళ్లు దిశకే వీచునట్టిగాలి, అదియు మెల్లగానుండునది. 'పవనస్య అనుకూలత్వాత్' - గాలి అనుకూలముగా నుండుటవలన అనురీతిగా అర్థమును చెప్పుటకూడ ఆచారములో నున్నది. ఇట్టిచోట్ల షష్ఠికి ప్రథమార్థము చెప్పుటవలన తెలుగుఅర్థము బాగా బోధపడును.

శ్లో. సరసీ ష్వరవిందానాం వీచి విక్షోభ శీతలమ్,
ఆమోద ముపజిఘ్రంతౌ స్వ నిశ్వాసా నుకారిణమ్. 43

వ్యాఖ్య: సరసీషు - కొలకులయందు, వీచివిక్షోభ శీతలం - అలల కదలికచేత చల్లబడినదియు, స్వనిశ్వాసానుకారిణం - తమ నిట్టూర్పుగాలిని పోలినదియునగు, అరవిందానాం ఆమోదం - తామరపూల సువాసనను, ఉపజిఘ్రంతౌ - ఆఘ్రాణించుచున్నవారై (జగ్మతుః - వెళ్లిరి) చల్లని పద్మపరిమళము నాఘ్రాణించుచు ప్రయాణముచేసిరని భావము. సుదక్షిణా దిలీపుల నిశ్వాసవాయువును కమలగంధము అనుకరించుచున్నట్లు చెప్పుటచేత ఆ దంపతులు సాముద్రిక శాస్త్ర ప్రకారము ఉత్తమజాతి స్త్రీ పురుషులని ధ్వని. ఉపమానమగు కమలగంధమునకు ఉపమేయత్వము కల్పింపబడుటచేత ఇది ప్రతీపాలంకారము.

శ్లో. గ్రామే ష్వాత్మ విసృష్టేషు యూప చిహ్నేషు యజ్వనామ్,
అమోఘాః ప్రతిగృహ్ణంతా వర్ఘ్యాను పద మాశిషః. 44

వ్యాఖ్య: ఆత్మవిసృష్టేషు - తమచేత దానము చేయబడినవియు, యూప చిహ్నేషు - యూప - యజ్ఞ పశుబంధన స్తంభములు, చిహ్నేషు - గుర్తులుగా

గల, గ్రామేషు - దారిలోవచ్చు గ్రామములందు, అమోఘాః - వృథాగాపోని, యజ్వనాం ఆశిషః - యజ్ఞములు చేసిన సోమయాజుల యొక్క ఆశీర్వాదములను, అర్ఘ్యానుపదం (అర్ఘ్య + అనుపదం) - పాదోదకమును తీసుకొన్న వెంటనే, ప్రతిగృహ్ణంతౌ - స్వీకరించు చున్నవారై (జగ్మతుః - వెళ్లిరి). తామిచ్చిన బ్రాహ్మణాగ్రహారములను యూప స్తంభముల గుర్తులతో తెలుసుకొని; రథము నాపి దిగి, వారు బంధుభావములతో నిచ్చిన నీటితో కాళ్లు కడుగుకొని, వెంటనే అమోఘములైన వారి యాశీస్సులను స్వీకరించుచు ఆలస్యము చేయక వెళ్లుచుండి రని భావము. 'అర్ఘ్యం' అనగా పూజాద్రవ్యములు, పాదములు కడుగుకొనుటకై ఇచ్చు నీరు మొదలగునది.

శ్లో. హైయంగవీన మాదాయ ఘోషవృద్ధా నుపస్థితాన్,
నామధేయాని పృచ్ఛంతౌ వన్యానాం మార్గశాఖినామ్. 45

వ్యాఖ్య : హైయంగవీనం - నిన్నటి పాలలో వచ్చిన వెన్నను కఱగ బెట్టగా వచ్చిన ఆవు నేతిని (సద్యోఘృతమును), ఆదాయ - తీసికొని, ఉప స్థితాన్ - వచ్చిన, ఘోషవృద్ధాన్ - గొల్లపల్లెల పెద్దలను, వన్యానాం - అడ విలో పుట్టిన, మార్గశాఖినాం - దారిలోని చెట్లయొక్క, నామధేయాని - పేర్లను, పృచ్ఛంతౌ - అడుగుచున్నవారై, (జగ్మతుః - వెళ్లిరి). రాజు తమ పల్లెల సమీపమునందలి మార్గమున వెళ్లుచున్నట్లు తెలిసిన గ్రామస్థులు" రిక్తహస్తేన నోపే యాత్ రాజానం, దేవతాం గురుమ్" అను న్యాయము ననుసరించి, తమ కృషి ఫలితములలో నుత్తమోత్తమమైన సద్యోఘృతమును కానుకగా తీసికొని ఆయనను దర్శించిరి. వచ్చిన పెద్దలను ప్రేమతో పలుకరించుట రాజధర్మము కనుక సుదక్షిణా దిలీపులు ఆ పెద్దలను దారియందలి చెట్లపేర్లు నడుగుచు కొంతదూరము వారితో ముచ్చటించుచు వెళ్లి వారిని తృప్తిపరచిరని భావము. ఆనాటి రాజులకును ప్రజలకును ఉండిన సాన్నిహిత్యానుబంధము లట్టివి.

శ్లో. కాప్యభిఖ్యా తయో రాసీత్ వ్రజతోః శుద్ధ వేషయోః,
హిమ నిర్ముక్తయో ర్యోగే చిత్రా చంద్రమసో రివ. 46

వ్యాఖ్య : వ్రజతోః - వెళ్లుచున్నవారును, శుద్ధవేషయోః - తెల్లని వస్త్ర ములు ధరించిన, తయోః - ఆ సుదక్షిణాదిలీపులకు, హిమనిర్ముక్తయోః - మంచు నుండి విడువబడిన, చిత్రాచంద్రమసోః ఇవ - చిత్తానక్షత్రమునకును చంద్రునికిని

వలె, యోగేసతి - ఒకచోట చేరుట జరుగగా, కాపి (కా + అపి) - ఒకానొక, అభిఖ్యా - శోభ, ఆసీత్ - కలిగెను. తెల్లని వస్త్రములు ధరించి వెళ్లుచున్న ఆ దంపతుల కాంతి విశేషము మంచునుండి విడివడిన చిత్తా నక్షత్ర చంద్ర సంయోగమువలె అనిర్వాచ్యముగా నుండెను. చిత్రా నక్షత్రముతో చంద్రునికి సంబంధ మేర్పడినప్పుడే చైత్ర మాసము వచ్చును. శిశిర ఋతువులో మంచుతో గప్పబడి యుండుటవలన కాంతి యుండదు. ఈ యుపమానమువలన ఆ దంపతులకు దుఃఖకాలము గడచి సంతోషకాలము వచ్చినట్లు సూచింపబడినది. వసంత కాలము ఉల్లాసమును గలిగించునుగదా!

శ్లో. తత్తద్భూమిపతిః పత్న్యై దర్శయన్ ప్రియదర్శనః,
అపి లంఘిత మధ్వానం బుబుధే న బుధోపమః. 47

వ్యాఖ్య: ప్రియదర్శనః - ప్రియమైన దర్శనము గలవాడును (చూడ ముచ్చటయైన రూపము గలవాడని యర్థము), బుధోపమః - బుధుడు ఉపమానముగా గలవాడును (అనేక విషయములు తెలిసినవాడు) అగు, భూమిపతిః - దిలీప మహారాజు, పత్న్యై - భార్యకు, తత్తత్ - ఆయా విశేషములను, దర్శయన్ - చూపుచు, లంఘితం అపి - దాటివచ్చినదేయైనప్పటికిని, అధ్వానం - మార్గమును, న బుబుధే - ఎఱుగక పోయెను. ప్రియురాలికి మార్గస్థవిశేషములను దెలుపు సంతోషములో దిలీపునికి మార్గము గడచినట్లే యనిపించలేదని భావము.

శ్లో. స దుష్ప్రాపయశాః ప్రాప దాశ్రమం శ్రాంత వాహనః,
సాయం సంయమిన స్తస్య మహర్షే ర్మహిషీసఖః. 48

వ్యాఖ్య: దుష్ప్రాపయశాః - ఇతరులకు పొందశక్యముగాని కీర్తిగలవాడును, శ్రాంతవాహనః - అలసిన రథాశ్వములు గలవాడును, మహిషీసఖః - భార్యమాత్ర సహాయుడును అగు, సః - ఆ దిలీపుడు, సాయం - సాయంకాలమున, సంయమినః - నియమవంతుడైన, తస్య మహర్షేః - ఆ వసిష్ఠమహర్షి యొక్క, ఆశ్రమం - ఆశ్రమమును, ప్రాపత్ - చేరెను. సుదక్షిణా దిలీపులు, అలసిపోయిన గుఱ్ఱములు గలవారై తాము ను అలసి సాయంకాలమునకు వసిష్ఠాశ్రమమును జేరిరని భావము.

వసిష్ఠాశ్రమ వర్ణనము:

శ్లో. వనాంతరా దుపావృత్తైః సమి త్కుశ ఫలా హరైః,
పూర్యమాణ మదృశ్యాగ్ని ప్రత్యుద్యాతై స్తపస్విభిః. 49

వ్యాఖ్య : వనాంతరాత్ - ఇతర వనమునుండి, ఉపావృత్తైః - తిరిగి వచ్చినట్టియును, సమిత్కుశఫలాహరైః - సమిధలను, దర్భలను, ఫలములను తెచ్చుకొనుచున్నట్టియును, అదృశ్యాగ్నిప్రత్యుద్యాతైః - సామాన్య దృష్టికి అదృశ్యమైన హోమాగ్నులచేత ఎదుర్కొనబడుచున్నట్టి, తపస్విభిః - మునులచేత, పూర్యమాణం - నిండింపబడుచున్న (అంతకుముందు ఎక్కువ జనంలేని ఆశ్రమం ఇప్పుడు పచ్చుచున్న మునులతో నిండిపోవు చున్నదని భావము) ఆశ్రమం - అట్టి వసిష్ఠాశ్రమమును, ప్రాపత్ - చేరెను. అని వెనుకటి శ్లోకమునందలి క్రియతో అన్వయము. యజ్ఞములు చేయునట్టి ఆహితాగ్నులు మరియొకచోటికివెళ్లి తిరిగి వచ్చునప్పుడు హోమాగ్నులు, లోకమున గ్రామాంతరమునుండి తిరిగి వచ్చిన తండ్రిని పుత్రులు ఎదుర్కొనునట్లు, ఎదుర్కొనునని వేదము చెప్పుచున్నది. "ప్రోష్య గచ్ఛతా మాహితాగ్నీనామగ్నయః ప్రత్యుద్యాంతి" యథాహ - "కామం పితరం ప్రోషితవంతం పుత్రాః ప్రత్యాధావంత్యేవ మేతమగ్నయః ప్రత్యాధావంతి సశకలాన్ దారూనివాహరన్".

శ్లో. ఆకీర్ణ మృషిపత్నీనా ముటజ ద్వార రోధిభిః,
అపత్యై రివ నీవార భాగధేయోచితై ర్మృగైః. 50

వ్యాఖ్య : నీవారభాగధేయోచితైః - నివ్వరిధాన్యముల భాగములకు అర్హములైనవియు, ఉటజద్వారరోధిభిః - పర్ణశాలల ద్వారములను అడ్డగించుచున్నవియునగు, మృగైః - లేళ్లచేత, ఋషిపత్నీనాం - మునిపత్నులయొక్క, అపత్యైరివ - బిడ్డలచేతవలె, ఆకీర్ణం - వ్యాప్తమైన (ఆశ్రమం - ఆశ్రమమును, ప్రాపత్ - చేరెను). భాగ + ధేయ - భాగధేయ - భాగము, "నామ, రూప, భాగ" అను శబ్దములకు తమ యర్థమునందే ఈ 'ధేయ' ప్రత్యయము వచ్చును. నామధేయము, రూపధేయము, భాగధేయము అని రూపములు. మునిపత్నులవద్ద, పిల్లలవలె మారాము చేయుచున్న లేళ్లుగల నాయాశ్రమము కనపడెనని భావము.

శ్లో. సేకాంతే మునికన్యాభిః తత్క్షణోజ్ఝిత వృక్షకమ్,
విశ్రంభాయ విహంగానా మాలవాలాంబు పాయినామ్. 51

వ్యాఖ్య : సేకాంతే - నీళ్లు పోసిన పిమ్మట, మునికన్యాభిః - మునికన్యలచేత, ఆలవాలాంబుపాయినాం - పాదుల యందలి జలమును త్రాగునట్టి, విహంగానాం - పక్షులయొక్క, విశ్రంభాయ - నమ్మకము కొఱకు, తత్క్షణోజ్ఝిత

వృక్షకం - వెంటనే విడిచిపెట్టబడిన మొక్కలుగల, (ఆశ్రమ - ఆశ్రమమును, ప్రాపత్ - చేరెను.) చెట్లకు నీళ్ళుపోసిన పిమ్మట పాదులలో నిల్చిన నీళ్ళను త్రాగు పక్షులు బెదరిపోకుండ మునికన్యలు దూరముగా నిల్చుని యుండిరని భావము. 'వృక్షః' అనగా చెట్టు. 'వృక్షకః' అనగా బాలవృక్షము (మొక్క). ఇచ్చట సమాసమువందు ద్వితీయాంతమై వృక్షకమ్ అని కనపడుచున్నది, ఆశ్రమం అను దానికి విశేషణము.

శ్లో. ఆతపాత్యయ సంక్షిప్త నీవారాసు నిషాదిభిః,
మృగై ర్వర్తిత రోమంథ ముటజాంగణ భూమిషు. 52

వ్యాఖ్య: ఆతపాత్యయ సంక్షిప్త నీవారాసు (ఆతప + అత్యయ + సంక్షిప్త + నీవారాసు) - ఎండ తగ్గిపోగానే ప్రోగుచేయబడిన నీవారధాన్యముగల, ఉటజాంగణ భూమిషు - పర్ణశాలలయొక్క ముంగిటి ప్రదేశములందు, నిషాదిభిః - కూర్చొనియున్న (లేళ్లు కూర్చొనుట యనగా వొక విధముగా పరుండుటయే), మృగైః - లేళ్ళచేత, వర్తితరోమంథం - చేయబడుచున్న నెమరుగల (నెమరు వేయుచున్న లేళ్ళుగల, (ఆశ్రమం ప్రాపత్-ఆశ్రమమును చేరెను) ఆశ్రమ కుటీరముల ముందు ఆరబోసిన నివ్వరిధాన్యములను, సాయంకాలమున ప్రోగులు చేసి యుంచగా చిఱుఎండలలో ఆ కుప్పలమీద కూర్చుని లేళ్ళు నెమరు వేయుచుండెనని భావము.

శ్లో. అభ్యుత్థితాగ్ని పిశునై రతిథీ నాశ్రమోన్ముఖాన్,
పునానం పవనోద్ధూతై ర్ధూమై రాహుతి గంధిభిః. 53

వ్యాఖ్య: అభ్యుత్థితాగ్ని పిశునైః (అభ్యుత్థిత, అగ్ని, పిశునైః) - ప్రజ్వలించిన అగ్నిని సూచించునట్టియు, పవనోద్ధూతైః - (పవన, ఉద్ధూతైః) వాయువుచేత పైకి ప్రసరింప జేయబడినట్టివియు, ఆహుతి గంధిభిః - అగ్నిలో వేయబడిన హోమద్రవ్యముల వాసనగలవియునగు, ధూమైః - పొగలచేత, ఆశ్రమోన్ముఖాన్ (ఆశ్రమ, ఉన్ముఖాన్) - ఆశ్రమము పైపునకు వచ్చుచున్న, అతిథీన్ - అతిథులను, పునానం - పవిత్రము చేయుచున్న, (ఆశ్రమం - ఆశ్రమమును, ప్రాపత్ - చేరెను.) ప్రజ్వలించుచున్న అగ్నులలోని హోమద్రవ్యముల పరిమళముతో గూడిన హోమధూమములు ఆశ్రమమునకు వచ్చుచున్న అతిథులను పవిత్రము చేయుచుండెనని భావము.

  

శ్లో. అథ యంతార మాదిశ్య ధుర్యాన్ విశ్రామయేతి సః,
తా మవారోపయ త్పత్నీం రథా దవతతార చ. 54

వ్యాఖ్య: అథ - అనంతరము (ఆశ్రమమును చేరిన పిమ్మట), సః - ఆదిలీపమహారాజు, యంతారం - సారథిని, "ధుర్యాన్ విశ్రామయ" - గుఱ్ఱములను విశ్రమింపజేయుము, ఇతి - అని, ఆదిశ్య - ఆజ్ఞాపించి, తాంపత్నీం - భార్యయైన ఆ సుదక్షిణాదేవిని, రథాత్ - రథమునుండి, అవారోపయత్ - దింపెను, అవతతార చ - తానుగూడ దిగెను. దిలీపుఁడు సారథితో గుఱ్ఱములను విశ్రమింపఁ జేయుమని చెప్పి, సుదక్షిణాదేవిని రథమునుండి దింపి, తాను దిగెనని భావము.

శ్లో. తస్మై సభ్యాః సభార్యాయ గోప్త్రే గుప్తతమేంద్రియాః.
అర్హణా మర్హతే చక్రుః మునయో నయ చక్షుషే. 55

వ్యాఖ్య: సభ్యాః - సభయందు యోగ్యులైన వారును, గుప్తతమేంద్రియాః - మిక్కిలి నియమింపబడిన యింద్రియములు గలవారును, (అయిన) మునయః - మునులు, సభార్యాయ - భార్యాసహితుడును, గోప్త్రే - రక్షకుడును, అర్హతే - పూజ్యుడును, నయచక్షుషే - నీతిశాస్త్ర నిర్ణీతమైన చూపుగలవాడును అగు, తస్మై - ఆ దిలీపుని కొఱకు (దిలీపునికి), అర్హణాం - పూజను, చక్రుః - చేసిరి. 'గుప్తతమేంద్రియాః' అను పదము వారి రాగద్వేషములు లేని ప్రవర్తనను తెలుపును. 'సభ్యాః' అను పదము మునులందరును ఒక సభగావించి దిలీపునికి స్వాగతము పలికిరనియు, 'అర్హణాం' అను పదము, దిలీపుడు రాజర్షి యనియు, అసలు రాజు అష్టదిక్పాలకుల అంశ కలవాడు కావున పూజార్హుడనియు తెలుపును. మునులు దిలీపునికి చక్కని అతిథి సత్కారము చేసిరని శ్లోక భావము.

శ్లో. విధేః సాయంతన స్యాంతే స దదర్శ తపోనిధిమ్,
అన్వాసిత మరుంధత్యా స్వాహయేవ హవిర్భుజమ్. 56

వ్యాఖ్య: సాయంతనస్య - సాయంకాలమునకు సంబంధించిన, విధేః - కర్మానుష్ఠానముయొక్క, అంతే - ముగింపునందు, సః - ఆదిలీపుడు, అరుంధత్యా - అరుంధతీదేవిచేత, అన్వాసితం - సేవింపబడియుండిన (ఉచితాసనముపైఁ గూర్చుండబెట్టి తాను ప్రక్కన గూర్చొని యుండినదని యర్థము), తపోనిధిం -

తపస్సులకు నిధియైన వసిష్ఠుని, స్వాహయా - స్వాహాదేవిచేత, అన్వాసితం - సేవింపబడిన, హవిర్భుజం ఇవ - అగ్నిహోత్రునివలె, దదర్శ - దర్శనము చేసెను. దిలీపుడు చేరునప్పటికి వసిష్ఠుడు సాయంకాల హోమాదులను చేయు చుండుటచేత, కర్మానుష్ఠానము పూర్తియగువఱకు వేచియుండి, వసిష్ఠుడు పత్నీ సహితుడై యుచితాసనమున గూర్చున్నప్పుడు దర్శనము చేసెనని భావము. పూజ్యులైనవారు చేతిలో సమిధలను, పువ్వులను, దర్భలను, అగ్నిని, జలమును, మృత్తును, అన్నమును, పుస్తకమును పట్టుకున్నప్పుడును, జపహోమములు చేయుచున్నప్పుడును వారికి నమస్కరింపరాదని శాస్త్రము. అనగా ప్రత్యభివాదన, ఆశీర్వాదాదులను చేయుటకు వీలులేని సమయమున అభివాదనము చేయకూడదని భావము. అందుకే దిలీపుడు వేచియుండుట. అగ్నిహోత్రుని భార్యకు 'స్వాహా, అగ్నాయీ' అని పేర్లు.

శ్లో. తయోర్జగృహతుః పాదాన్ రాజా రాజ్ఞీచ మాగధీ,
తౌ గురుర్గురుపత్నీచ ప్రీత్యా ప్రతిననందతుః. 57

వ్యాఖ్య : మాగధీ - మగధరాజపుత్రియు, రాజ్ఞీ - రాణియునైన, సుదక్షిణాదేవియు, రాజా చ - దిలీపమహారాజును, తయోః - ఆ యరుంధతీ వసిష్ఠుల యొక్క, పాదౌ - రెండు పాదములను, జగృహతుః - పట్టుకొనిరి, గురుపత్నీ - గురు భార్యయైన అరుంధతియు, గురుశ్చ - గురువైన వసిష్ఠుడును, తౌ - వారిద్దరిని (ఆ సుదక్షిణాదిలీపులను), ప్రీత్యా - ప్రేమతో, ప్రతిననందతుః - ఆశీర్వాదములతో గౌరవించిరి. సుదక్షిణాదిలీపులు నమస్కరింపగా నరుంధతీ వసిష్ఠు లాశీర్వదించిరని భావము.

శ్లో. తమాతిథ్యక్రియా శాంత రథక్షోభ పరిశ్రమమ్,
పప్రచ్ఛ కుశలం రాజ్యే రాజ్యాశ్రమ మునిం మునిః. 58

వ్యాఖ్య : మునిః - వసిష్ఠమహాముని, ఆతిథ్యక్రియా శాంత రథక్షోభ పరిశ్రమం - అతిథి సత్కారక్రియలచేత శాంతించిన రథసంచలనమువలని అలసట కలవాడును, రాజ్యాశ్రమ మునిం - రాజ్య మను ఆశ్రమమున మునివంటివాడును అగు, తం - ఆదిలీపుని, రాజ్యే - రాజ్యమందలి, కుశలం - క్షేమమును గుఱించి, పప్రచ్ఛ - అడిగెను. వసిష్ఠుడు దిలీపునికి ఆతిథ్య మిచ్చి, అలసట తీరిన పిమ్మట అతని కుశలము నడిగెను,

"బ్రాహ్మణం కుశలం పృచ్ఛేత్ క్షత్రబంధు మనామయం,
వైశ్యం క్షేమం సమాగమ్య శూద్ర మారోగ్య మేవచ".

అని మనుస్మృతి. క్రొత్తగా కలుసుకున్నప్పుడు, బ్రాహ్మణుని 'కుశలమా?' యనియు, క్షత్రియుని 'అనామయమా?' అనియు, వైశ్యుని 'క్షేమమా?' యనియు, శూద్రుని 'ఆరోగ్యమా?' అనియు నడుగవలెను. ఇచ్చట దిలీపుడు మునివంటి వాడు కనుక 'కుశలమా' అని యడిగెనని తెలియవలెను.

శ్లో. అథాథర్వ నిధే స్తస్య విజితారిపురః పురః,
అర్థ్యా మర్థపతి ర్వాచ మాదదే వదతాం వరః. 59

వ్యాఖ్య: అథ - అనంతరము, విజితారిపురః - జయింపబడిన శత్రు నగరములు కలవాడును, వదతాంవరః - వక్తలలో శ్రేష్ఠుడును నగు, అర్థపతిః - కుబేరునివంటి వాడగు దిలీపమహారాజు, అథర్వనిధేః - అథర్వ వేదమునకు నిధి యైన, తస్య - ఆ వసిష్ఠునియొక్క, పురః - ఎదుట, అర్థ్యాం - అర్థవంతమైన, వాచం - వాక్కును, ఆదదే - స్వీకరించెను (మాటలాడుటకు మొదలు పెట్టెనని యర్థము). "విజితారిపురః, అర్థపతిః, వదతాంవరః" అను విశేషణముల వలన దిలీపునికి అంగబలము, అర్థబలము, పలుకుబడియునున్నవి. సంతానము మాత్రమే కొఱత. కనుక అథర్వవేదనిధియైన వసిష్ఠుడు తమ కులగురువు, పురోహితుడు కనుక ఆయన నాశ్రయించెనని భావము. "త్రయ్యాంచ దండనీత్యాంచ కుశలః స్యాత్ పురోహితః, అథర్వవిహితం కుర్యాత్ నిత్యం శాంతికపౌష్టికే" అని పురోహిత లక్షణము. ఋగ్యజుస్సామ వేదములు వచ్చి, దండనీతి తెలిసి, అథర్వ వేదమునందు చెప్పబడిన శాంతిక పౌష్టిక కర్మలను జరిపించుచు రాజునకు శ్రేయమును చేకూర్చువాడు పురోహితుడు. ఆ లక్షణములన్నియు వసిష్ఠునియందు కలవు కనుక దిలీపుడతనితో తన వాంఛను దెలుపుటకు ప్రారంభించెనని తాత్పర్యము.

శ్లో. ఉపపన్నం నను శివం సప్తస్వంగేషు యస్య మే,
దైవీనాం మానుషీణాంచ ప్రతికర్తా త్వ మాపదామ్. 60

వ్యాఖ్య: యస్య - ఏ నాయొక్క, దైవీనాం - దైవికములును, మానుషీణాంచ - మానవులవల్ల కలిగినవియునగు, ఆపదాం - ఆపదలకు, త్వం - నీవు, ప్రతికర్తా - ప్రతిక్రియచేయువాడవైయున్నావో, (తస్య) మే - అట్టి నాకు, సప్తసు, అంగేషు - ఏడయిన రాజ్యాంగములయందు, శివం - కుశలము, ఉపపన్నంనను -

ఉండనేయున్నదికదా. నీ మహిమచేత నాకెట్టి యాపదలును లేక సుఖముగా నున్నా నని భావము. 'స్వామి, అమాత్యుడు, సుహృత్, కోశము రాష్ట్రము, దుర్గము, సైన్యము' సప్తాంగములు, 'అగ్నిభయం, వరదలు, వ్యాధులు, కఱవు, జననష్టం,' ఈ అయిదు దైవికములయిన ఆపదలు. 'ఆయుక్తులు, చోరులు, శత్రురాజులు, రాజ వల్లభులు, రాజుయొక్క లోభము' అను అయిదు మానవులవల్ల కలుగు ఆపదలు.

శ్లో. తవ మంత్రకృతో మంత్రైః దూరా త్ప్రశమితారిభిః
ప్రత్యాదిశ్యంత ఇవ మే దృష్టలక్ష్యభిదః శరాః 61

వ్యాఖ్య : దూరాత్ - దూరమునుండియే (పరోక్షముగానే), ప్రశమితారిభిః- శమింపజేయబడిన శత్రువులుగల, మంత్రకృతః, తవ, మంత్రైః - మంత్రకర్త వైన నీయొక్క మంత్రములచేత, దృష్టలక్ష్యభిదః - కంటికి కనపడు లక్ష్యము లను మాత్రమే భేదింప గలిగిన, మే - నాయొక్క, శరాః - బాణములు, ప్రత్యా దిశ్యంతే ఇవ - నిరాకరింపబడుచున్నవా ? యనున ట్లున్నది. నీవు దూరము నుండియే నాకు శత్రుబాధ లేకుండునట్లు ప్రయోగించు మంత్రముల ముందు నా బాణములు నిరుపయోగములు సుమా! అలంకారము: ఉత్ప్రేక్ష. మంత్రకర్తయనగా శత్రు నిర్మూలనార్థమై బీజాక్షర సంపుటిచేత చేయబడు మంత్రములకు కర్త, లేక ప్రయోక్త యని యర్థము. దిలీపుని శరములు అవసరము లేకయే వసిష్ఠుని మంత్ర ములచేత శత్రువులు నిర్వీర్యులగుచుండిరని భావము, ఇది మానుషములైన ఆపత్తు లకు వసిష్ఠుడు చేయుచున్న ప్రతీకారము.

శ్లో. హవి రావర్జితం హోతః త్వయా విధివ దగ్నిషు
వృష్టి ర్భవతి సస్యానాం అవగ్రహ విశోషిణామ్. 62

వ్యాఖ్య : హే హోతః! - హోమముచేయునట్టి ఓ వసిష్ఠ మునీ! త్వయా - నీచేత, విధివత్ - శాస్త్రప్రకారముగా, అగ్నిషు - అగ్నులయందు, ఆవర్జితం - వేయబడిన, హవిః - నెయ్యి, అన్నము మొదలయిన హోమద్రవ్యము, అవగ్రహ విశోషిణాం - అనావృష్టిచేత ఎండిపోవుచున్న, సస్యానాం-పైరులకు, వృష్టిః - వర్షము, భవతి - అగుచున్నది. నీవు చేయు హోమముల వలన నా దేశమున సస్యములు ఫలించుచున్నవని భావము. యజ్ఞయాగాదు లాచరించుచు వసిష్ఠుడు దిలీ పుని రాజ్యమునందు వచ్చు దైవికములైన యాపదలను తొలగించుచుండెను.

అగ్నిలో వేసిన ఆహుతి సూర్యునిఁ జేరి వర్షహేతు వగునని మనుస్మృతి చెప్పు చున్నది.

శ్లో. "అగ్నౌ ప్రాస్తాహుతిః సమ్య గాదిత్య ముపతిష్ఠతే
ఆదిత్యా జ్జాయతే వృష్టిః వృష్టే రన్నం తతః ప్రజాః"

శ్లో. పురుషాయుష జీవిన్యో నిరాతంకా నిరీతయః
య న్మదీయాః ప్రజా _స్తస్య హేతు స్త్వద్బ్రహ్మవర్చసమ్ 63

వ్యాఖ్య : మదీయాః - నావారైన, ప్రజాః - ప్రజలు, పురుషాయుష జీవిన్యః - నూరు సంవత్సరములు జీవించువారును, నిరాతంకాః - భయరహితులును, నిరీతయః - ఈతిబాధలు లేనివారును అనునది, యత్ - ఏదైతే కలదో, తస్య - దాని కంతటికిని, త్వత్ బ్రహ్మవర్చసం - నీ వ్రతాధ్యయన సంపత్తియే, హేతుః - కారణము. నా ప్రజలు భయరహితులై, ఈతిబాధలు లేనివారై నూరు సంవత్సరములు జీవించుటకు నీ తపస్సే కారణమని భావము. "శతాయుర్వై పురుషః" అను శ్రుతి వలన 'పురుషాయుషం' అనగా నూరు సంవత్సరములు జీవితకాలము. ఈ శబ్ద మిట్లే యుండును. 'పురుషాయువు' అనుట తప్పు. ఈతి బాధలు: "అతివృష్టి, అనావృష్టి, శలభములు, మూషికములు, చిలుకలు, ఒకరి కొకరు దగ్గర దగ్గరగా నున్న రాజులు" అని ఆరు విధములని కామందక నీతి సారము చెప్పుచున్నది.

శ్లో. త్వయైవం చింత్యమానస్య గురుణా బ్రహ్మయోనినా
సానుబంధాః కథం న స్యుః సంపదో మే నిరాపదః. 64

వ్యాఖ్య : బ్రహ్మయోనినా - బ్రహ్మపుత్రుడవును, గురుణా - కులగురువువునైన, త్వయా - నీ చేత, ఏవం - ఈ చెప్పిన విధముగా, చింత్యమానస్య - తలపబడుచున్నవాడను, నిరాపదః - ఆపదలు లేనటువంటివాడనునగు, మే - నాయొక్క, సంపదః - సంపదలు, సానుబంధాః - అనుస్యూతములు (అవిచ్ఛిన్నములు), కథం న స్యుః - ఎట్లు కాకుండును? బ్రహ్మపుత్రుఁడవైన నీవు నాయందు కరుణ గలిగియున్నప్పుడు నా సంపద లవిచ్ఛిన్నముగా నుండక యేమగునని భావము.

శ్లో. కింతు వధ్వాం తవైతస్యాం అదృష్ట సదృశ ప్రజమ్
న మా మవతి సద్వీపా రత్నసూరపి మేదినీ. 65

వ్యాఖ్య : కింతు - కాని, తవ - నీ యొక్క, ఏతస్యాం వధ్వాం - ఈకోడలియందు, అదృష్టసదృశప్రజం - చూడబడని తగిన సంతానము గల, మాం - నన్ను, సద్వీపాఅపి - ద్వీపములతో కూడినదైనను, రత్నసూః అపి - రత్నములను ప్రసవించునదైనను, మేదినీ - భూమి, న అవతి - సంతోషపెట్టుటలేదు. ఈ నీ కోడలియందు నాకుఁ దగిన పుత్రుఁ డుదయింపనందున సర్వసంపన్నమైన నా రాజ్యము నన్ను సుఖపెట్టజాలకున్నది యని దిలీపుడు తాను వచ్చిన పనిని వసిష్ఠునితో నివేదించెను.

ఇచ్చటి నుండి ఆఱు శ్లోకముల వఱకు తనకు పుత్ర సంతానము లేనందు వల్ల కలుగుచున్న విషాదమును వెల్లడించును.

**శ్లో. నూనం మత్తః పరం వంశ్యాః పిండ విచ్ఛేద దర్శినః**
**న ప్రకామ భుజ శ్శ్రాద్ధే స్వధా సంగ్రహ తత్పరాః. 66**

వ్యాఖ్య : మత్తః, పరం - నాతరువాత, పిండవిచ్ఛేదదర్శినః - పిండదానము ఆగిపోవుటను ఊహించుచున్న, వంశ్యాః - మా వంశమువారైన పితృదేవతలు, స్వధాసంగ్రహతత్పరాః - పితృభోజన ద్రవ్యమును దాచుకొనుటయందు ఆసక్తులగుచు, శ్రాద్ధే - ఇప్పుడు నేనుపెట్టు శ్రాద్ధకర్మయందు, ప్రకామభుజః - పూర్తిగా భోజనముచేయువారు, న భవంతి - అగుటలేదు. నూనం - సత్యము. 'స్వధా' అనునది అవ్యయము- పితృభోజ్యము అనియర్థము. ఇకముందు తమకు శ్రాద్ధములు జరుగవుగదా యన్న చింతతో నిప్పుడును తృప్తిగాతినక, నేనిచ్చిన 'స్వధా' ద్రవ్యమును నాపితరులు దాచుకొనుచున్నారు. అని తన అనపత్యతను గురించి విలపించుచున్న వానివలె వసిష్ఠునితో విన్నవించెను.

**శ్లో. మత్పరం దుర్లభం మత్వా నూనమావర్జితం మయా,**
**పయః పూర్వైః స్వనిశ్వాసైః కవోష్ణ ముపభుజ్యతే. 67**

వ్యాఖ్య : మత్పరం - నా యనంతరమున, దుర్లభం - అలభ్యమని, మత్వా - తలచి, మయా - నాచేత, ఆవర్జితం - విడువబడిన, పయః - జలము, స్వనిశ్వాసైః - నిట్టూర్పులు విడుచుచున్న, పూర్వైః - మాపితరులచేత, కవోష్ణం - వెచ్చబడునట్లుగా, ఉపభుజ్యతే నూనం - స్వీకరింపబడుచున్నదని ఊహించుచున్నాను .నాయనంతరమిట్టి జలము లభింపదుగదాయను దుఃఖమునవచ్చు నిట్టూర్పులతో వారుత్రాగు తర్పణజలము వెచ్చనై పోవుచుండవచ్చునని యూహించు చున్నానని భావము.

శ్లో. సోఽహ మిజ్యా విశుద్ధాత్మా ప్రజాలోప నిమీలితః,
ప్రకాశ శ్చాప్రకాశశ్చ లోకాలోక ఇవాచలః 68

వ్యాఖ్య : ఇజ్యావిశుద్ధాత్మా - యాగముచేత పరిశుద్ధమైన ఆత్మగలవాడను, ప్రజాలోపనిమీలితః - సంతానలోపముచేత మఱుగుపడిన వాడనులగు, సోఽహం (సః + అహం) - అట్టినేను, లోకాలోకః- చక్రవాళ మనబడెడు, అచలఃఇవ - పర్వతమువలె, ప్రకాశశ్చ - ప్రకాశముకలవాడను, అప్రకాశశ్చ - ప్రకాశములేని వాడనుకూడ, (అస్మి - అగుచున్నాను.) నాకు యాగములు చేయుటచేత దేవ ఋణము తీరినదికాని పుత్రసంతానము లేనందున పితృఋణము తీరలేదు. కనుక చక్రవాళపర్వతము లోపలిభాగమున సూర్యతేజముచేత ప్రకాశించుచును, వెలుపలి భాగమున చీకటిచేత ప్రకాశములేనిదిగను ఉన్నట్లు నేను సగము చీకటియగు జీవితము గడుపుచున్నానని భావము. "లోకాలోక శ్చక్రవాళః" అని అమరము. ఈ పర్వతము సర్వవిశ్వమును చుట్టియుండి లోపలమాత్రమే కనబడుచున్నదనియు, వెలుపలిభాగమంతయు అంధకారమే యనియు పురాణవచనము.

శ్లో. లోకాంతర సుఖం పుణ్యం తపోదాన సముద్భవమ్,
సంతతిః శుద్ధవంశ్యా హి పరత్రేహ చ శర్మణే. 69

వ్యాఖ్య : తపోదాన సముద్భవం - తపస్సు, దానము కారణములుగా కలిగిన, పుణ్యం - పుణ్యము, లోకాంతరసుఖంహి - పరలోకమునందు కలుగునట్టి సుఖము కలిగించునది మాత్రమే. శుద్ధవంశ్యా - పరిశుద్ధమైన వంశమున బుట్టిన, సంతతిః-సంతానము, పరత్ర-పరలోకమునందును, ఇహచ- ఈ లోకమునందును, శర్మణే - సుఖముకొరకు (భవతి - అగుచున్నది) తపోదానాదులవలన కలిగిన పుణ్యము పరలోకసుఖమును మాత్రమే ఇచ్చును. సత్సంతానము ఇహ పరలోక సౌఖ్యములను ప్రసాదించునుగదా యని విన్నవించెను.

శ్లో. తయా హీనం విధాత ర్మాం కథం పశ్య న్న దూయసే,
సిక్తం స్వయమివ స్నేహాత్ వంధ్య మాశ్రమ వృక్షకమ్. 70

వ్యాఖ్య : హేవిధాతః - ఓబ్రహ్మ! తయా - అట్టి సంతతిచేత, హీనం - హీనుడనై (సంతతిలేనివాడనైన),మాం - నన్ను, స్నేహాత్ - వాత్సల్యము వలన, స్వయం - సొంతముగా, సిక్తం - నీళ్లుపోయబడినదై, వంధ్యం - గొడ్డుపోయిన, ఆశ్రమవృక్షకం ఇవ - నీ యాశ్రమమునందలి చిన్నచెట్టునువలె, పశ్యన్ - చూచు

ష్పన్నవాడవై, కథం - ఎట్లు, నదూయసే - బాధపడకున్నావు ? నీవు దోహదము చేసి, పెంచినమొక్క గొడ్డుపోయినట్లు, నీ యనుగ్రహ పాత్రుడనైననేను సంతానహీనుడనై యుండగా చూచుచు నెట్లూరకున్నావని భావము. 'విధాతః !' అని సంబోధించుటవలన శక్తికలిగియు ఉపేక్షించుటను సూచించును. 'ఆశ్రమవృక్షకం' అనునది తన సర్వశ్రేయమును వసిష్ఠుని దయపై నాధారపడియున్నట్లు తెలుపును. అలంకారము ; ఉపమ.

శ్లో. అసహ్యా పీడం భగవన్! ఋణ మంత్య మవేహి మే,
అరుంతుద మివాలాన మనిర్వాణస్య దంతినః. 71

వ్యాఖ్య : హే భగవన్ - ఓ భగవంతుడా ! మే - నాయొక్క, అంత్యం - చివరిదియైన, ఋణం - పితృఋణమును, అనిర్వాణస్య - స్నానములేనట్టి, దంతినః - ఏనుగునకు, అరుంతుదం - మర్మచ్ఛేదియైన (పుండును రాపిడి చేయునట్టి) ఆలానమివ - బంధన స్తంభమువలె, అసహ్యాపీడం- భరింపరాని బాధ కలగించుదానినిగా, అవేహి - తెలిసికొనుము. జలమజ్జనములేని గజము కట్టుగొయ్య వద్ద బాధపడుచున్నట్లు నేను మర్మచ్ఛేదియైన పితృఋణముచే బాధపడుచున్నానని భావము. భగవంతుడనగా ప్రాణులయొక్క ఉత్పత్తిని, వినాశమును, ఆగమనమును, గమనమును, విద్యను ఎఱిగిన తపస్సంపన్నుడు. గజమునకు మూడు పనులు ముఖ్యము. "నిర్వాణము, ఉత్థానము, శయనము". అవిలేనిచో అది బాధపడును. మానవునికి జన్మతః మూడు ఋణము లేర్పడును. అవి, "దేవఋణము, ఋషి ఋణము, పితృఋణము" అనునవి. యాగము, దానము, సంతానము అనునవి క్రమముగా ఆఋణములను తీర్చును.

శ్లో. తస్మాన్ముచ్యే యథా తాత! సంవిధాతుం తథార్హసి,
ఇక్ష్వాకూణాం దురాపేఽర్థే త్వదధీనా హి సిద్ధయః. 72

వ్యాఖ్య ; హేతాత! - ఓతండ్రీ ! తస్మాత్ - ఆ పితృఋణమునుండి, యథా - ఏ విధముగా, ముచ్యే - ముక్తుడనగుదునో, తథా - ఆవిధముగా, సంవిధాతుం - చేయుటకు, త్వం -నీవు, అర్హసి - తగియున్నావు. ఇక్ష్వాకూణాం - ఇక్ష్వాకువంశీయులకు, దురాపే - దుర్లభమైన, అర్థే - కార్యమునందు, సిద్ధయః - ఫలితములు, త్వదధీనాఃహి - నీ యధీనములేకదా! కనుక ఆ పితృఋణము నుండి నేను విముక్తుఁడగు మార్గమును సూచింపుము. మా ఇక్ష్వాకువంశీయులకు అసాధ్యములైన పనులు నీ యనుగ్రహముచేతనే ఫలించుచుండును గదా అని భావము.

శ్లో. ఇతి విజ్ఞాపితో రాజ్ఞా ధ్యాన స్తిమిత లోచనః,
క్షణమాత్ర మృషి స్తస్థౌ సుప్తమీన ఇవ హ్రదః. 73

వ్యాఖ్య : ఇతి - ఈ విధముగా, రాజ్ఞా - దిలీప మహారాజుచేత, విజ్ఞాపితః - విన్నవింపబడిన. ఋషిః - వసిష్ఠమహర్షి, ధ్యాన స్తిమిత లోచనః - ధ్యానముచేత నిశ్చలములైన కన్నులుగలవాడై, క్షణమాత్రం - క్షణకాలము, సుప్త మీనః - నిద్రించిన చేపలుగల, హ్రదః ఇవ - సరోవరమువలె, తస్థౌ - ఉండెను. ఇట్లు దీనుడై ప్రార్థించుచున్న దిలీపునిపై కరుణగలిగి సంతానము లేకపోవుటకు గల కారణము నెఱుగుటకు వసిష్ఠుడు క్షణకాలము ధ్యాన నిమగ్నుడై యుండెనని తాత్పర్యము.

శ్లో. సోఽపశ్యత్ ప్రణిధానేన సంతతేః స్తంభకారణమ్,
భావితాత్మా భువో భర్తుః అథైనం ప్రత్యబోధయత్. 74

వ్యాఖ్య ; సః - ఆ వసిష్ఠముని, ప్రణిధానేన - ఏకాగ్ర చిత్తముచేత, భావితాత్మా - శుద్ధమైన అంతఃకరణము గలవాడై, భువః - భూమికి, భర్తుః - పతియైన దిలీపునియొక్క, సంతతేః - సంతానమునకు, స్తంభకారణం - ప్రతిబంధక కారణమును, అపశ్యత్ - కనుగొనెను, అథ - తరువాత, ఏనం - దిలీపుని, ప్రత్యబోధయత్ - తెలియువానినిగా చేసెను (దిలీపునికి తెలిపెనని యర్థము) 'ప్రణిధాన' మనగా యోగవిశేషము. అట్లు ధ్యాన నిమగ్నుఁడైన వసిష్ఠుఁడు భావితాత్ముఁడై దిలీపునికి సంతానము గలుగకుండుటకు గల కారణమును దెలిసికొని, ముందు చెప్పబోవు రీతిగా నతనికిఁ జెప్పెనని భావము.

శ్లో. పురా శక్ర ముపస్థాయ తవోర్వీం ప్రతియాస్యతః,
ఆసీ త్కల్పతరు చ్ఛాయాం ఆశ్రితా సురభిః పథి. 75

వ్యాఖ్య ; పురా - పూర్వమొకప్పుడు, శక్రం - దేవేంద్రుని, ఉపస్థాయ - సేవించి, ఉర్వీం, ప్రతి - భూలోకమును గుఱించి, యాస్యతః - వచ్చుచున్న, తవ - నీయొక్క, పథి - మార్గమునందు, కల్పతరు చ్ఛాయాం - కల్పవృక్షము యొక్కనీడను, ఆశ్రితా - ఆశ్రయించినదై, సురభిః - కామధేనువు, ఆసీత్ - ఉండెను. నీవువచ్చు దారిలో కల్పవృక్షపునీడలో కామధేనువు పండుకొని ఉండినది. ఇంద్రసమాగమానంతరము తిరిగి భూలోకమునకు వచ్చుచున్న నీవు దానిని గమనింపలేదన్ని భావము,

శ్లో. ధర్మలోప భయా ద్రాజ్ఞీం ఋతుస్నాతా మనుస్మరన్,
ప్రదక్షిణ క్రియార్హాయాం తస్యాం త్వం సాధు నాచరః. 76

వ్యాఖ్య : ఋతుస్నాతాం - రజస్వ లానంతర స్నానము చేసి యుండిన, రాజ్ఞీం - ఈ సుదక్షిణాదేవిని, ధర్మలోప భయాత్ -- ధర్మలోపము కలుగునన్న భయమువలన, అనుస్మరణ్ - తలచుకొనుచున్న వాడవగుచు, ప్రదక్షిణక్రియార్హాయాం - ప్రదక్షిణముచేయుటకు తగియున్న, తస్యాం - ఆ కామధేనువు విషయమున, త్వం - నీవు, సాధు - ప్రదక్షిణాది సత్కారమును, నాచరః (న + అచరః) - చేయలేదు.

"మృదం గాం దైవతం విప్రం ఘృతం మధు చతుష్పథమ్,
ప్రదక్షిణాని కుర్వీత విజ్ఞాతాంశ్చ వనస్పతీన్". అని శాస్త్రము.

కనుక గోవునకు ప్రదక్షిణము చేయవలెను. ఇక కామధేనువు విషయమున చెప్పవలసిన దేమున్నది? కాని దిలీపుడు ఋతుస్నాతయైన భార్యవద్దకి వెళ్లకపోవుట ధర్మమన్న ఆలోచనలోపడి, ప్రదక్షిణము చేయలేదు. ఋతుకాల భార్యాసంగము ధర్మము. దానిని ఉపేక్షించుట అధర్మము అని పరాశరస్మృతి చెప్పుచున్నది.

"ఋతుస్నాతాంతు యో భార్యాం స్వస్థస్సన్ నోపగచ్ఛతి,
బాలగోఘ్నాపరాధేన విధ్యతే నాత్ర సంశయః".

కనుక అత్వరలో వెళ్లుచు, దిలీపుఁడు కామధేనువునకు ప్రదక్షిణ నమస్కారాదులు చేయక వెళ్లిన సంగతిని వసిష్ఠుఁ డతనితోఁ జెప్పెనని భావము.

శ్లో. అవజానాసి మాం యస్మాత్ తత స్తే న భవిష్యతి,
మత్ప్రసూతి మనారాధ్య ప్రజేతి త్వాం శశాప సా. 77

వ్యాఖ్య : యస్మాత్ - ఏకారణమువలన, మాం - నన్ను, అవజానాసి - తిరస్కరించుచున్నావో, తతః - అందువల్ల, మత్ప్రసూతిం - నా సంతానమును, అనారాధ్య -ఆరాధింపక, తే - నీకు, ప్రజా - సంతానము, నభవిష్యతి - కలుగదు, ఇతి - ఇట్లని, సా - ఆకామధేనువు, త్వాం - నిన్ను, శశాప - శపించెను ఏ సంతానార్థివై వెళ్ళుచు నన్నవమానించితివో ఆ సంతానము నాబిడ్డ నారాధింపక నీకు కలుగకుండుగాక అని శాపమిచ్చెను. కామధేనువు : దిలీపుని మనోగతము నెఱిగియే తగిన శాపమిచ్చి తద్విమోచనోపాయమును పలికినది. నీవు సంతానార్థివై నన్ను మరచితివి కనుక, నా సంతానమును సేవించిననే కాని నీకు సంతానము కలుగబోదని శాపవచన రహస్యము.

శ్లో. స శాపో న త్వయా రాజన్ నచ సారథినా శ్రుతః
నదత్యాకాశ గంగాయాః స్రోత స్యుద్దామ దిగ్గజే. 78

వ్యాఖ్య : హే రాజన్ - ఓ రాజా! ఉద్దామదిగ్గజే - గొలుసు లూడదీసుకొని వచ్చిపడిన దిగ్గజములు గల, ఆకాశగంగాయాః స్రోతసి - ఆకాశగంగా ప్రవాహము, నదతి (సతి) - ధ్వనించుచుండగా, సః శాపః - ఆశాపము, త్వయా - నీచేత, న శ్రుతః - వినబడలేదు. సారథినా చ - నీ రథసారథిచేతగూడ, న శ్రుతః - వినబడలేదు. గంగా ప్రవాహ ధ్వనిలో నీకు గాని, నీ సారథికిగాని ఆ శాపవచనము వినపడలేదు. దిలీపుడు అన్యమనస్కుడగుటచేత కామధేనువును చూడలేదు. శాప వచనము ఆయనకుగాని, సారథికిగాని గంగానదిలోని దిగ్గజ ఘీంకార ప్రవాహ ధ్వనులచేత వినపడలేదు. వినియున్నచో కామధేనువును క్షమాపణము కోరియుండెడివాడే. రథ వేగము వలని వాయుధ్వని కూడా దానికి తోడ్పడినది. 'ఉద్గతాః దామ్నః ఉద్దామానః' అని ఉద్దామశబ్ద వ్యుత్పత్తి. దిగ్గజములు జలక్రీడార్థమై కట్టుత్రాళ్లు తెంచుకొని వచ్చి పడినవని భావము.

శ్లో. ఈప్సితం తదవజ్ఞానాత్ విద్ధి సార్గళ మాత్మనః,
ప్రతిబధ్నాతి హి శ్రేయః పూజ్య పూజా వ్యతిక్రమః. 79

వ్యాఖ్య : తదవజ్ఞానాత్ - తత్ - ఆకామధేనువుయొక్క, అవజ్ఞానాత్ - అవమానమువలన, ఆత్మనః - నీ యొక్క, ఈప్సితం - కోరిక, సార్గళం (స + అర్గళం) - ప్రతిబంధకముతో కూడినట్టిదని, విద్ధి - తెలిసికొనుము. పూజ్యపూజా వ్యతిక్రమః - పూజింపదగిన వారియొక్క పూజకు వ్యతిరేకముగా నడచుట, శ్రేయః - శ్రేయస్సును, ప్రతిబధ్నాతి హి - అడ్డగించును గదా! ఆ కామధేనువును గుర్తింపక పోవుట నీ కోరికకు ప్రతిబంధకమైనది. పూజ్యులను గుర్తింపక పోవుట శ్రేయస్సుకు భంగకరము గదా! యని వసిష్ఠుడు దిలీపునితో ననెను. అలంకారము : అర్థాంతరన్యాసము.

శ్లో. హవిషే దీర్ఘసత్రస్య సా చేదానీం ప్రచేతసః,
భుజంగ పిహిత ద్వారం పాతాళ మధితిష్ఠతి. 80

వ్యాఖ్య : సా చ - ఆ కామధేనువు కూడ, ఇదానీం - ఇప్పుడు, దీర్ఘసత్రస్య - చిరకాలము చేయతగిన యాగము నాచరించుచున్న, ప్రచేతసః - వరుణునియొక్క, హవిషే - ఆజ్యము మొదలయిన హోమ ద్రవ్యము కొఱకై,

భుజంగ పిహిత ద్వారం - పాములచేత అడ్డగింపబడిన ద్వారముగల, పాతాళం - పాతాళలోకమును, అధితిష్ఠతి - అధివసించియున్నది (పాతాళము నందున్నది అని యర్థము). ఇప్పుడా కామధేనువు వరుణుఁడు చేయు యాగమునకు పాలు, నేయి చేకూర్చుటకు పాతాళ లోకమునందున్నది. నీవు వెళ్ళి ప్రార్థించుటకు వీలుపడదు; కామధేనువు వద్దికి వెళ్లుటకుగాని, శాప విమోచనమునకై ప్రార్థించుటకుగాని బహు కాలము వరకు వీలులేదని భావము. దీర్ఘ సత్రయాగము పూర్తి యగువరకు చాల కాలము పట్టును గదా!

శ్లో. సుతాం తదీయాం సురభేః కృత్వా ప్రతినిధిం శుచిః,
ఆరాధయ సపత్నీకః ప్రీతా కామదుఘా హి సా. 81

వ్యాఖ్య : తదీయాం సుతాం - దాని పుత్రికను (నందినీ ధేనువును), సురభేః - కామధేనువునకు, ప్రతినిధింకృత్వా - ప్రతినిధినిగా చేసుకొని, శుచిః - పవిత్రుడవును, సపత్నీకః - భార్యాసహితుడవునై, ఆరాధయ - సేవింపుము. హి - ఎందువలననగా, సా - ఆ నందిని, ప్రీతా - సంతుష్టినిఁ జెందినదై, కామ దుఘా - కోరికలను పిండునది (భవతి - అగును) ఇప్పుడు కామధేనువు బిడ్డయగు నందినీ ధేనువును దాని తల్లికి ప్రతినిధిగా భావించి సేవింపుము, అది సంతసించి నీ కోరికలిచ్చును. కామధేనువు "మత్ప్రసూతిమనారాధ్య" అని శాపమిచ్చినది కనుక నందినీసేవ అపరిహార్యము. నందినికూడా కామధేనువు వలెనే కోరికలను ఫలింపఁ జేయగలదు. శాపప్రభావము సుదక్షిణపైఁగూడ పడును గనుక సపత్నీకుడవై సేవింపుమని వసిష్ఠుడు చెప్పెను.

శ్లో. ఇతి వాదిన ఏవాస్య హోతు రాహుతి సాధనమ్,
అనింద్యా నందినీనామ ధేను రావవృతే వనాత్. 82

వ్యాఖ్య : ఇతి - ఈ విధముగా, వాదినఃఏవ హోతుః - హోమశీలుడైన వసిష్ఠుడు చెప్పుచుండగానే, అస్య ఆహూతి సాధనం - అతని హోమ ద్రవ్యములకు సాధనమైనట్టిదియు, నందినీనామ - నందినియను పేరుగలదియు నగు (నందయతీతి నందినీ, సంతోషపెట్టునది యని వ్యుత్పత్తి), అనింద్యాధేనుః - పూజార్హమైనగోవు, వనాత్ - వనమునుండి, ఆవవృతే - తిరిగివచ్చెను. ఇట్లు వసిష్ఠుడు చెప్పుచుండగనే పూజార్హయగు నందిని వనమునుండి ఆశ్రమమునకు తిరిగివచ్చెను.

  

నందినీ వర్ణనము :

శ్లో. లలాటోదయ మాభుగ్నం పల్లవ స్నిగ్ధ పాటలా,
బిభ్రతీ శ్వేత రోమాంకం సంధ్యేవ శశినం నవమ్. 83

వ్యాఖ్య : పల్లవ స్నిగ్ధ పాటలా - చిగురాకువలె నిగనిగలాడుచు కొంచెము ఎఱ్ఱగా నున్నదియు, లలాటోదయం -నొసటియందు పుట్టిన, అభుగ్నం - కొంచెము వంకర తిరిగిన, శ్వేత రోమాంకం - తెల్లని వెంట్రుకల చిహ్నమును, బిభ్రతీ - ధరించు చున్నదియునై, సంధ్యాఇవ - సంధ్యవలె, (స్థితా - ఉండిన, ధేనుః - ఆవు, ఆవవృతే - తిరిగి వచ్చెను). మెత్తని చిగురాకువలె నిగనిగలాడు ఎఱ్ఱని శరీరముగల నందినీధేనువు నుదుట చంద్రవంక ఆకారములో తెల్లని వెంట్రుకల రేఖ యున్నది. అది సంధ్యాకాలమున ఎఱ్ఱబారిన ఆకాశమునందు కనపడు చంద్ర రేఖవలె నున్నది. సంధ్యా కాలమున సుదక్షిణా దిలీపులు వసిష్ఠాశ్రమమును చేరి నారు. సంధ్యవలె నందినీధేనువు వచ్చినది. ఈ మొదలయిన భావనాచిత్రము గీసిన కాళిదాసు ఉపమాలంకారము ఇతరులకు సాధ్యము కానిది.

శ్లో. భువం కోష్ణేన కుండోధ్నీ మేధ్యే నావభృథా దపి,
ప్రస్రవేనాభివర్షంతీ వత్సాలోక ప్రవర్తినా. 84

వ్యాఖ్య ; కోష్ణేన - కొంచెము వెచ్చనైనట్టియు, అవభృథాత్ - అవభృథ స్నానముకంటెను, మేధ్యేన - పవిత్రమైనట్టియు, వత్సాలోక ప్రవర్తినా - దూడను చూచుటచేత కలిగినట్టిదియు నగు, ప్రస్రవేణ - క్షీర స్రావముచేత, భువం - భూమిని, అభివర్షంతీ - తడుపుచున్నది యై, కుండోధ్నీ - కడవవంటి పెద్ద పొదుగుగల (ఆ నందినీధేనువు, ఆవవృతే-తిరిగివచ్చెను.) కుండంతటి పొదుగుగల ఆ నందిని వత్సముపై మనస్సు కలిగి క్షీరధారలతో నేలను తడుపుచు ఆశ్రమము నకు వచ్చెనని భావము. అవభృథము : యజ్ఞము, వ్రతము, మొదలయిన కర్మల యందవలంబించిన దీక్షాంతమునందు పుణ్యనదీ జలమున చేయుస్నానము. అది ఒక ఉత్సవముగా చేయబడును.

శ్లో. రజఃకణైః ఖురోద్ధూతైః స్పృశద్భి ర్గాత్ర మంతికాత్,
తీర్థాభిషేకజాం శుద్ధిం ఆదధానా మహీక్షితః. 85

వ్యాఖ్య ; ఖురోద్ధూతైః-గిట్టలచేత నెగురగొట్టబడినవియు(రేపబడిన), అంతి కాత్ - సమీపమునుండి, గాత్రం - శరీరమును, స్పృశద్భిః-తాకుచున్నవియునగు,

రజఃకణైః - ధూళికణములచేత, మహీక్షితః - రాజునకు, తీర్థాభిషేకజాం - తీర్థ స్నానమువలన కలిగిన, శుద్ధిం - పవిత్రతను, ఆదధానా - కగించుచున్నదియై, (ధేనుః - నందిని, ఆవవృతే - తిరిగివచ్చెను.) నందినీధేనువు తన బిడ్డకోసమై వేగముగా వచ్చుటచేత గిట్టల తాకిడితో లేచిన దుమ్ము సుదక్షిణా దిలీపులను కప్పి తీర్థస్నాన పుణ్యమును వారికి లభింపజేసినదని భావము. గోరజస్స్నానమునకు వాయవ్య స్నానమని పేరు. "ఆగ్నేయము, వారుణము, బ్రాహ్మము, వాయవ్యము" అని స్నానము నాలుగు విధములు.

"ఆగ్నేయం భస్మనా స్నానం అవగాహ్య తు వారుణమ్,
ఆపోహిష్ఠేతి చ బ్రాహ్మం వాయవ్యం గోరజః స్మృతమ్"

శ్లో. తాం పుణ్యదర్శనాం దృష్ట్వా నిమిత్తజ్ఞ స్తపోనిధిః,
యాజ్య మాశంసితావంధ్య ప్రార్థనం పున రబ్రవీత్. 86

వ్యాఖ్య: నిమిత్తజ్ఞః - శకున శాస్త్రము తెలిసిన, తపోనిధిః - వసిష్ఠుడు, పుణ్యదర్శనాం - పవిత్రమైన దర్శనముగల, తాం - ఆ నందినీ ధేనువును, దృష్ట్వా - చూచి, ఆశంసితావంధ్య ప్రార్థనం - మనోరథ సాఫల్యముగల యాచన చేసిన, యాజ్యం - తనచే యజ్ఞాదులు చేయింపబడు దిలీపుని గురించి, పునః - మరల, అబ్రవీత్ - చెప్పెను. దిలీప వసిష్ఠులకు యాజ్యయాజక భావము సంబంధము. యాజకుడనగా వైదికకర్మలు చేయించు పురోహితుడు. యాజ్యుడనగా అట్టి కర్మలుచేయు యజమాని. వసిష్ఠుడు తపోనిధి కనుక పరోక్షమున జరిగిన శాపమును దెలిపెను. నిమిత్తజ్ఞుడు కనుక ఇప్పుడు శకునఫలమును చెప్పుచున్నాడని భావము.

శ్లో. అదూరవర్తినీం సిద్ధిం రాజన్! విగణ యాత్మనః
ఉపస్థితేయం కళ్యాణీ నామ్ని కీర్తిత ఏవ యత్. 87

వ్యాఖ్య: హేరాజన్ - ఓ రాజా! యత్ - ఏకారణమువలన, ఇయం - ఈ, కళ్యాణీ - మంగళరూపిణియైన నందిని, నామ్ని కీర్తిత ఏవ - పేరును చెప్పుకొ గానే, ఉపస్థితా - వచ్చినదో, (తత్ - ఆ కారణమువలన) ఆత్మనః - నీయొక్క, సిద్ధిం - మనోరథ సిద్ధిని, అదూరవర్తినీం - సమీపమునందున్న దానినిగా, విగణయ - లెక్కింపుము (తెలిసికొనుము). అనుకొనుచుండగనే నందినీధేనువు వచ్చినది కనుక నీ మనోరథసిద్ధి చాలా సమీపకాలమునందే కలుగునని గ్రహింపుమని భావము.

శ్లో. వన్యవృత్తి రిమాం శశ్వ దాత్మానుగమనేన గాం,
విద్యా మభ్యసనే నేవ ప్రసాదయితు మర్హసి. 88

వ్యాఖ్య : వన్యవృత్తిః - వనమునందలి కందమూలాదులే జీవనోపాయముగా గలవాడవై, ఇమాం గాం - ఈ గోవును, శశ్వత్ - సదా (ఎప్పుడును విడువక), ఆత్మానుగమనేన (ఆత్మ + అనుగమనేన)-నీ యనుసరణముచేత, అభ్యసనేన - అభ్యాసముచేత, విద్యాం, ఇవ - విద్యనువలె, ప్రసాదయితుం - ప్రసన్నురాలిని చేసికొనుటకు, అర్హసి - తగుదువు (అట్లు చేయుము). విద్యార్థివలె బ్రహ్మచర్యమును, మునులవలె వన్యఫలాహారాదులను చేయుచు నిరంతరముగా నందినిని సేవింపుమని భావము.

శ్లో. ప్రస్థితాయాం ప్రతిష్ఠేథాః స్థితాయాం స్థితి మాచర,
నిషణ్ణాయాం నిషీదా స్యాం పీతాంభసి పిబే రపః. 89

వ్యాఖ్య : అస్యాం - ఈ ధేనువు, ప్రస్థితాయాం (సత్యాం) - బయలుదేరినదికాగా, ప్రతిష్ఠేథాః - నీవు బయలుదేరుము, స్థితాయాం - నిలువబడినది కాగా, స్థితిం, ఆచర - నీవును నిలుచుండుము. నిషణ్ణాయాం - కూర్చున్నది (పడుకున్నది) కాగా, నిషీద - నీవును కూర్చుండుము, పీతాంభసి - నీరుత్రాగినదికాగా, అపః - నీళ్లను, పిబేః - త్రాగుము. అది బయలుదేరినచో నీవు బయలుదేరి, అది పడుకున్నచో నీవు కూర్చుని, అది నీరుత్రాగినవుడు నీవు నీరుత్రాగి, నిరంతరము దానిని అనుసరించి సేవించుచుండుమని గవానుసరణప్రకారము నుపదేశించెను.

శ్లో. వధూ ర్భక్తిమతీ చైనాం అర్చితా మాతపోవనాత్,
ప్రయతా ప్రాతర న్వేతు సాయం ప్రత్యుద్వ్రజే దపి. 90

వ్యాఖ్య : వధూః చ - నీ భార్యకూడా (లేదా మా యీకోడలుకూడా) భక్తిమతీ - భక్తిగలదియు, ప్రయతా - నియమము గలదియునై, అర్చితాం - తనచేత గంధ పుష్పాదులు పెట్టి పూజింపబడిన, ఏనాం - ఈ ధేనువును, ప్రాతః - ఉదయమున, ఆతపోవనాత్ - తపోవనము వఱకు, అన్వేతు - వెంట వచ్చునుగాక, సాయం అపి - సాయంకాలమున గూడ, ప్రత్యుద్వ్రజేత్ - (అంతదూరము వచ్చి) ఎదుర్కొనునుగాక. నీ భార్యకూడా భక్తినియమములు గలదియై ఉదయమున దానిని పూజించి వనము దాక సాగనంప వలెను, సాయంకాల మది తిరిగి వచ్చునప్పుడు స్వాగతము చెప్పవలెను. గర్భధారణ, ప్రసవాదులచేత సంతానోత్పత్తికి

ముఖ్యాధారమైన సుదక్షిణాదేవి, కామధేనుశాప ప్రభావానికి గురియై యున్నందున ఆమెయు, స్త్రీ స్వభావమునకు, శక్తికి, విరుద్ధము కానంతవఱకు నందినీధేనుసేవను చేయవలసియే యున్నదని వసిష్ఠోపదేశ సారాంశము.

శ్లో॥ ఇత్యాప్రసాదా దస్యా స్త్వం పరిచర్యాపరో భవ,
అవిఘ్నమస్తు తే స్థేయాః పితేవ ధురి పుత్రిణామ్. 91

వ్యాఖ్య : ఇతి - ఈ చెప్పినవిధముగా, త్వం - నీవు, ఆప్రసాదాత్ - అనుగ్రహ పర్యంతము (ప్రసన్నురాలగువఱకు), అస్యాః - ఈ ధేనువుయొక్క, పరిచర్యా పరః - సేవా తత్పరుడవు, భవ - అగుము, తే - నీకు, అవిఘ్నం - అవిఘ్నము, అస్తు - అగుగాక, పితేవ (పితా + ఇవ) - మీ తండ్రివలెనే, పుత్రిణాం - సత్పుత్రులు గల వారియొక్క, ధురి - ముందు, స్థేయాః - నిలువుము (సత్పుత్రవంతులలో అగ్రేసరుడవు కమ్ము). ఇట్లు దానికి అనుగ్రహము కలుగు వరకును పరిచర్య చేయుము, ఆ పరిచర్య నిర్విఘ్నముగా సాగునుగాక, నీ తండ్రి వలె నీవును పుత్రవంతులలో శ్రేష్ఠుఁడ వగుదువుగాక అని వసిష్ఠుఁ డాశీర్వదించెను.

శ్లో॥ తథేతి ప్రతిజగ్రాహ ప్రీతిమాన్ సపరిగ్రహః,
ఆదేశం దేశకాలజ్ఞః శిష్యః శాసితు రానతః. 92

వ్యాఖ్య : దేశకాలజ్ఞః - దేశకాలములనెరిగిన వాడును, ప్రీతిమాన్ - సంతోషవంతుడును, శిష్యః - శిష్యుడునగు దిలీపుడు, సపరిగ్రహః - భార్యాసహితుడై, ఆనతః (సన్) - వినమ్రుడైనవాడగుచు, శాసితుః - గురువైన వసిష్ఠునియొక్క, ఆదేశం - ఆజ్ఞను, తథేతి (తథా ఇతి) - అట్లేయని, ప్రతిజగ్రాహ - స్వీకరించెను (దిలీపుఁడు సంతోషముతో గురుని యాదేశమును బదులు పలుకక సరేయని స్వీకరించెను). ఇచ్చట దేశమనగా హోమాగ్ని సన్నిధి. కాలమనగా హోమానంతర కాలము. ఆ సమయమున తపోనిధియైన వసిష్ఠుడు ఆర్షజ్ఞానముతో చెప్పుట. ఇక దానికి బదులాడక అంగీకరించుటయే దిలీపుని దేశకాలజ్ఞతకు లక్షణము, కనుకనే బదులు పలుకక ఆదేశమును స్వీకరించెనని భావము.

శ్లో॥ అథ ప్రదోషే దోషజ్ఞః సంవేశాయ విశాం పతిమ్,
సూనుః సూనృతవాక్ స్రష్టుః విససర్జోర్జితశ్రియమ్. 93

వ్యాఖ్య : అథ - తరువాత, ప్రదోషే - రాత్రిసమయమున, దోషజ్ఞః -

విద్వాంసుడును, సూనృతవాక్ - సత్యప్రియ భాషియు, స్రష్టుః - బ్రహ్మయొక్క, సూనుః - పుత్రుడైన వసిష్ఠుడు, ఊర్జిత శ్రియం - సమృద్ధమైన సంపదగల, విశాం. పతిం - ప్రజాధిపతి యైన దిలీపుని, సంవేశాయ - నిద్రకొఱకై, విససర్జ - విడిచి పెట్టెను (పంపెను). వసిష్ఠ మహాముని కామధేను శాపమును, తన్నివారణోపాయ మును, నందినీ సేవాక్రమమును దిలీపునికిచెప్పి, యతడంగీకరించిన పిమ్మట ఇక వెళ్లి నిద్రింపుమని యానతిచ్చెనని భావము. "ప్రియం సత్యం చ సూనృతమ్" అని హలాయుధ నిఘంటువు.

శ్లో. సత్యా మపి తపఃసిద్ధౌ నియమాపేక్షయా మునిః,
కల్పవిత్ కల్పయామాస వన్యా మేవాస్య సంవిధామ్. 94

వ్యాఖ్య : కల్పవిత్ - వ్రత ప్రయోగము నెఱిగిన, మునిః - వసిష్ఠుడు. తపఃసిద్ధౌ - తపస్సువలన రాజయోగ్యమైన ఆహారాదికమును సంపాదించు శక్తి, సత్యాం, అపి - ఉండినప్పటికిని, నియమాపేక్షయా - ఇప్పటినుండియే వారికి వ్రత చర్య ఆరంభమగుగాక యన్న భావముచేత, అస్య - ఆ దిలీపునికి, వన్యాం ఏవ - అరణ్య లభ్యమైనదే యైన, సంవిధాం - కుశాది శయనసామగ్రిని, ఫలాదికమును కల్పయామాస - యిప్పించెను. ఆ క్షణమునుండియే సుదక్షిణా దిలీపులకు బ్రహ్మ చర్య వ్రతాదులను కల్పించెనని భావము.

శ్లో. నిర్దిష్టాం కులపతినా స పర్ణశాలాం
అధ్యాస్య ప్రయత పరిగ్రహ ద్వితీయః,
తచ్ఛిష్యాధ్యయన నివేదితావసానాం
సంవిష్టః కుశశయనే నిశాం నినాయ. 95

వ్యాఖ్య : సః - ఆ దిలీపుడు, కులపతినా - ఆశ్రమాధిపతియైన వసిష్ఠుని చేత, నిర్దిష్టాం - చూపబడిన, పర్ణశాలాం అధ్యాస్య - పర్ణశాలయందు నివసించి (ఇచ్చట సప్తమ్యర్థమున ద్వితీయా విభక్తి) ప్రయత పరిగ్రహద్వితీయః-నియమవంతు రాలైన భార్య మాత్రమే తోడుగా గలవాడై, కుశశయనే - దర్భశయ్యయందు, సంవిష్టః - నిద్రించినవాడై, తచ్ఛిష్యాధ్యయననివేదితావసానాం - ఆయన శిష్యులు వేదపఠనముచేత తెలుపబడిన అంతముగల, నిశాం - రాత్రిని, నినాయ - గడపెను. దిలీపుడు కులపతియైన వశిష్ఠుఁ డాదేశించిన బ్రహ్మచర్యమును పాటించి దర్భ పడక

పై నిద్రించి, శిష్యుల వేదఘోషచేత ఉషఃకాలమున మేల్కొనెనని భావము. 'కుల పతి' యనగా పదివేలమంది శిష్యులకు అన్నవస్త్రములిచ్చి వేదాధ్యయనము చేయించు మహర్షి. పూర్వకాలమున శిష్యులు అపరరాత్రమందు వేదమును కంఠస్థము చేసెడువారు. అట్లు చేయవలయునని ధర్మశాస్త్రము. "నిశాంతే న పరిశ్రాంతో బ్రహ్మాధీత్య పునః స్వపేత్" అని మనువు; "నచాపరరాత్రమధీత్య పునః స్వపేత్" అని గౌతముడు. (తెల్లవారుజామున చదువుకొని మరల నిద్రింపరాదు; ఒకవేళ ఎక్కువగా అలసిపోయినచో మళ్లీ నిద్రింపవచ్చును).

ఇది మహాకవి కాళిదాసకృత

రఘువంశ కావ్యమున ప్రథమసర్గమునకు తెలుఁగు లఘువ్యాఖ్య.



# మహాకవి కాళిదాసకృత రఘువంశము



## ద్వితీయ సర్గము

శ్లో. అథ ప్రజానా మధిపః ప్రభాతే
జాయా ప్రతిగ్రాహిత గంధమాల్యాం,
వనాయ పీతప్రతిబద్ధ వత్సాం
యశోధనో ధేను మృషే ర్ముమోచ. 1

వ్యాఖ్య : అథ - అనంతరము, యశోధనః - కీర్తియే ధనముగా భావించు వాడును, ప్రజానాం - ప్రజలకు, అధిపః - పాలకుడునైన దిలీప మహారాజు, ప్రభాతే - మరునాటి ప్రాతఃకాలమునందు, జాయా ప్రతిగ్రాహిత గంధమాల్యాం - జాయా - భార్యయైన సుదక్షిణా దేవిచేత, ప్రతిగ్రాహిత - స్వీకరింపజేయ బడిన, గంధమాల్యాం - గంధము, పూలదండలు కలదియును, పీత ప్రతిబద్ధ వత్సాం - పాలుత్రాగినదియు తిరిగి కట్టివేయబడినదియు నగు లేఁగ గలదియునగు, ఋషేః ధేనుం - వసిష్ఠ మహర్షియొక్క గోవును (నందినీధేనువును), వనాయ - వనము నకు వెళ్లుటకై, ముమోచ - విడిచిపెట్టెను. ఇందలి 'జాయా' శబ్దము సుదక్షిణా దేవి సంతానవతి కాబోవు నంశమును సూచించును. 'ప్రభాత' శబ్దము దిలీపుని జీవి తము నందలి అంధకారము తొలగుటను సూచించును. 'యశోధన' శబ్దము దిలీ పుడు తాను సంతాన హీనుడను నపకీర్తిని భరింపజాలక రాజుకు అనర్హమైనను ఆవును కాయుటకు పూనుకొనెనను విషయమును సూచించును.

శ్లో. తస్యాః ఖురన్యాస పవిత్ర పాంసు
మపాంసులానాం ధురి కీర్తనీయా,
మార్గం మనుష్యేశ్వర ధర్మపత్నీ
శ్రుతేరివార్థం స్మృతి రన్వగచ్ఛత్. 2

వ్యాఖ్య : అపాంసులానాం - నిర్దోషురాండ్రైన స్త్రీలయొక్క, ధురి - అగ్రమున, కీర్తనీయా - చెప్పదగిన, మనుష్యేశ్వర ధర్మపత్నీ - దిలీపుని భార్య

చరేణ - సేవకుడైన, తేన - ఆ దిలీపునిచేత, శేషః - మిగిలిన, అనుయాయివర్గః అపి - అనుచరుల సమూహము కూడ, న్యషేధి - నిషేధింపబడెను, తస్య - అతనికి, శరీరరక్షా - దేహరక్షణము, అన్యతః - మరియొకని వలన, న - అక్కర లేదు. మనోః - మనువుయొక్క, ప్రసూతిః - సంతతి (క్షత్రియజాతి), స్వవీర్యగుప్తాహి - తన పరాక్రమము చేతనే రక్షింప బడునట్టిదికదా ! సుదక్షిణతో పాటు మిగిలిన అనుచర వర్గమునుగూడ వెనుకకు పంపెనని భావము,

శ్లో. ఆస్వాదవద్భిః కబళై స్తృణానాం
కండూయనై ర్దంశనివారణైశ్చ,
అవ్యాహతైః స్వైరగతైశ్చ తస్యాః
సమ్రాట్ సమారాధన తత్పరోఽభూత్. 5

వ్యాఖ్య - సమ్రాట్ - చక్రవర్తియైన ఆ దిలీపుడు, ఆస్వాదవద్భిః - రసవంతములైన, తృణానాం - గడ్డిపరకలయొక్క, కబళైః - కబళములచేతను, కండూయనైః - గోకుటలచేతను, దంశనివారణైః - ఈగలను దోలుట చేతను, అవ్యాహతైః - ఇటునటు అదల్పబడని, స్వైరగతైః చ - స్వేచ్ఛా సంచారముల చేతను, తస్యాః - దానియొక్క (ఆ నందిని యొక్క), సమారాధన తత్పరః - సేవాతత్పరుడు, అభూత్ - ఆయెను. నందినికి మనస్సు సంతోషపడునట్లు సర్వ విధములయిన పరిచర్యలను చేయుచుండెనని భావము. రాజసూయ యాగము చేసినవాడును, భూ మండలాధిపతియై రాజులందరిని శాసింప గలవాడును నగు రాజు 'సమ్రాట్టు' అనబడును.

శ్లో. స్థితః స్థితా ముచ్చలితః ప్రయాతాం
నిషేదుషీ మాసన బంధధీరః,
జలాభిలాషీ జలమాదదానాం
ఛాయేవ తాం భూపతి రన్వగచ్ఛత్. 6

వ్యాఖ్య : భూపతిః - దిలీప మహారాజు, తాం - ఆ నందినీధేనువును, స్థితాం - నిలచియున్న దానిని, స్థితః - నిలుచున్న వాడగుచును, ప్రయాతాం - నడచుదానిని, ఉచ్చలితః - నడచువాడగుచును, నిషేదుషీం - పడుకొన్న దానిని ఆసన బంధధీరః - స్థిరముగా కూర్చొనువాడగుచును, జలం - నీటిని, ఆదదానాం - తీసుకొనుచున్న దానిని, జలాభిలాషీ - తాను నీరు త్రాగఁ గోరుచును,

ఛాయా ఇవ - నీడవలె, అన్వగచ్ఛత్ - అనుసరించుచుండెను. మన నీడ మనమేమి చేసిన అది దానిని చేయును. కొంచము కూడ భేదముండదు. అట్లే దిలీపుడు నందినిని విడువక సేవించెననియు దాని యాహారనిద్రాదు లెట్లో తనవియు నట్లే నియమించుకొనెననియు తాత్పర్యము. 'ఛాయేవ' అనునది గొప్ప యుపమానము. అలంకారము - ఉపమ.

శ్లో. స న్యస్త చిహ్నా మపి రాజలక్ష్మీం
తేజోవిశేషానుమితాం దధానః,
ఆసీ దనావిష్కృత దానరాజిః
అంతర్మదావస్థ ఇవ ద్విపేంద్రః 7

వ్యాఖ్య : న్యస్త చిహ్నాం, అపి - తీసి యుంచబడిన లాంఛనములు కలదియైనను, తేజోవిశేషానుమితాం - తేజోవిశేష - ప్రాభవాతిశయముచేత, అనుమితాం - ఊహింపబడిన, రాజ లక్ష్మీం - రాజశోభను, దధానః - ధరించుచున్న, సః - ఆ దిలీపుడు, అనావిష్కృత - బయటికి కానరాని, దానరాజిః - మదోదక స్రావము గలదియు, అంతర్మదావస్థః - లోననే యున్న మదస్థితిగల, ద్విపేంద్రః ఇవ - గజరాజు వలె, ఆసీత్ - ఉండెను (రాజచిహ్నములను ధరింపకపోయినను దిలీపుడు రాజువలెనే కనబడెను).

శ్లో. లతాప్రతానోద్గ్రథితైః స కేశైః
అధిజ్యధన్వా విచచార దావం
రక్షాపదేశా న్మునిహోమధేనోః
వన్యాన్ వినేష్యన్నివ దుష్టసత్త్వాన్. 8

వ్యాఖ్య : లతాప్రతానోద్గ్రథితైః - లతాప్రతాన - వంకరలు తీరిన తీగలచేత, ఉద్గ్రథితైః - ఎత్తి కట్టబడిన, కేశైః - శిరోజములతో, సః - అతడు, అధిజ్యధన్వా - ఎక్కుపెట్టబడిన విల్లు కలవాడగుచు, ముని హోమధేనోః - వసిష్ఠ హోమార్థమున్న నందినీధేనువు యొక్క, రక్షాపదేశాత్ - రక్షణ నెపము వలన, వన్యాన్ - అరణ్యమునందున్న, దుష్ట సత్త్వాన్ - క్రూరమృగములను, వినేష్యన్, ఇవ - శిక్షింపబోవువాని వలె, దావం - అరణ్యమును, విచచార - సంచరించెను. అలం : ఉత్ప్రేక్ష. నందినిని రక్షించు నెపమున వేటకాని వేషము ధరించిన దిలీపుడు దుష్టమృగములను శిక్షింపబోయిన వానివలె నుండెనని భావము).

శ్లో. విసృష్ట పార్శ్వానుచరస్య తస్య
పార్శ్వద్రుమాః పాశభృతా సమస్య,
ఉదీరయామాసు రివోన్మదానా
మాలోకశబ్దం వయసాం విరావైః 9

వ్యాఖ్య : విసృష్ట పార్శ్వానుచరస్య - విడిచిపెట్టబడిన పార్శ్వానుచరులు గలవాడును, పాశభృతా - వరుణునితో, సమస్య - సమానుడైన, తస్య - ఆ దిలీపునికి, పార్శ్వద్రుమాః - దారిప్రక్కనున్న వృక్షములు, ఉన్మదానాం - మదించిన, వయసాం - పక్షులయొక్క, విరావైః - ధ్వనులచేత, ఆలోకశబ్దం - 'రాజు వచ్చున్నాడు చూడుడు' అను శబ్దమును, లేదా 'జయ' శబ్దమును, ఉదీరయామాసుః ఇవ - పలికినవా యనినట్లుండెను. రాజభటులు చేయుపనిని వృక్షములు నిర్వర్తించెనని భావము. వరుణుడు ఋగ్వేద దేవతలలో సర్వశ్రేష్ఠుడు. అతని యుపమానము దిలీపుని యుత్కర్షను తెలుపును. దిలీపుడు నడచుదారి ప్రక్కన వృక్షములు, వానిపైని పక్షుల కిలకిలారావము లుండుట సహజము. వాటిని రాజు నడచునప్పుడు ప్రక్కననడచు సేవకులు పలుకు 'చూడుడు, తొలగుడు, జయ జయ' అను శబ్దములుగా చెప్పుటచే నిది ఉత్ప్రేక్షాలంకారము.

శ్లో. మరుత్ప్రయుక్తాశ్చ మరుత్సఖాభం
తమర్చ్యమారా దభివర్తమానం,
అవాకిరన్ బాలలతాః ప్రసూనైః
ఆచారలాజై రివ పౌరకన్యాః. 10

వ్యాఖ్య : మరుత్ప్రయుక్తాః - వాయువుచేత ప్రేరేపింపబడిన, బాలలతాఃచ - లేతతీగలుకూడ, ఆరాత్ - సమీపమునందు, అభివర్తమానం - నడిచి వెళ్లుచున్నట్టియును, మరుత్సఖాభం - వాయుమిత్రుడైన యగ్నివలె ప్రకాశించుచున్నవాడును, అర్చ్యం - పూజనీయుడైన, తం - ఆ దిలీపమహారాజును, ప్రసూనైః - పువ్వులచేత, పౌరకన్యాః - పట్టణములందలి కన్యలు, ఆచారలాజైః ఇవ - రాజు బయటికి వెళ్లునప్పుడు చల్లు వరిపేలాల చేతవలె, అవాకిరన్ - చల్లినవి. గాలికి కదలుచున్న తీగలు పువ్వులను రాజుపై రాల్పగా నవి పౌరకన్యలు చల్లు పేలాలవలె నుండెనట. దిక్పాలకాంశ గల రాజు అగ్నితుల్యుడు, అగ్ని మరుత్సఖుడు కనుక మిత్రుని గౌరవింపుడని మరుత్తు లతా కన్యలను ప్రేరేపించెను. అగ్ని సర్వదా పూజ్యుడు.

ఇచ్చట లతలకు పౌరకన్యోపమానము మిక్కిలి శ్లాఘింపదగినట్టిది. కవి సూక్ష్మ దృష్టిని వెల్లడించును. పౌరస్త్రీలన్నచో స్వారస్యముండదు. వారు పరాంగనలు క వచ్చును. రాజును చూచి సిగ్గుపడవచ్చును. కన్య అట్లుకాదు.

శ్లో. ధనుర్భృతోఽప్యస్య దయార్ద్రభావం
ఆఖ్యాత మంతఃకరణై ర్విశంకైః,
విలోకయంత్యో వపురాపు రక్ష్ణాం
ప్రకామవిస్తారఫలం హరిణ్యః. **11**

వ్యాఖ్య : ధనుర్భృతః, అపి - ధనుర్ధరుడై యున్నప్పటికిని, విశంకైః - అనుమానపడని, అంతఃకరణైః - మనస్సులచేత, ఆఖ్యాతం - చెప్పబడిన, దయార్ద్రభావం - దయాస్వభావముగల, అస్య - దిలీపునియొక్క, వపుః - శరీరమును, విలోకయంత్యః చూచుచున్న, హరిణ్యః - ఆడులేళ్లు, అక్ష్ణాం - తమ కన్నులయొక్క, ప్రకామవిస్తారఫలం - మిక్కిలి విశాలములై యుండుటకు తగిన ఫలమును, ఆపుః - పొందినవి. ధనుర్ధరుడై యున్నను, అతనియందు గోచరించు దయా స్వభావమును గమనించి, లేళ్లు నిర్భయముగా దిలీపునిజూచుచు తమ విశాల నేత్రముల సాఫల్యమును బొందెనని భావము.

శ్లో. స కీచకై ర్మారుతపూర్ణరంధ్రైః
కూజద్భి రాపాదిత వంశకృత్యం,
శుశ్రావ కుంజేషు యశః స్వ ముచ్చైః
ఉద్గీయమానం వనదేవతాభిః. **12**

వ్యాఖ్య : సః - ఆ దిలీపుడు, మారుతపూర్ణరంధ్రైః - గాలిచేత నిండిన రంధ్రములు గల (కనుకనే), కూజద్భిః - ధ్వనించుచున్న, కీచకైః - వెదుళ్లచేత, ఉచ్చైః - బిగ్గరగా, ఆపాదిత వంశకృత్యం - కూర్పబడిన వేణువుల కర్తవ్యము కలుగునట్లుగా, కుంజేషు - పొదరిండ్లయందు, వనదేవతాభిః - వనదేవతల చేత, ఉద్గీయమానం - గానము చేయబడుచున్న, స్వం, యశః - తనకీర్తిని, శుశ్రావ - వినెను. గాలిచే పూరింపబడిన వెదుళ్లచేయుధ్వని వేణునాద తానముకాగా వనదేవతల చేత చేయబడిన తన యశోగానమును దిలీపుడు వినెనని భావము.

శ్లో. పృక్త స్తుషారై ర్గిరినిర్ఝరాణాం
అనోకహాకంపిత పుష్పగంధీ,

త మాతపక్లాంత మనాతపత్రం
ఆచారపూతం పవనః సిషేవే. 13

వ్యాఖ్య : గిరినిర్ఘరాణాం – పర్వతములనుండి దిగు ప్రవాహములయొక్క, తుషారైః – నీటి తుంపురులచేత, పృక్తః – తడిసినదియు, అనోకహా – కంపిత పుష్పగంధీ-అనోకహ – చెట్లయొక్క, ఆకంపిత – కొంచము కదలుచున్న, పుష్ప – పువ్వులయొక్క, గంధీ – పరిమళము గలదియు నగు, పవనః – గాలి, అనాత పత్రం – ఛత్రము లేని వాడును, ఆతపక్లాంతం – ఎండచే బడలినవాడును, ఆచార పూతం – నడవడిచేత పవిత్రుడునైన, తం – ఆ దిలీపుని, సిషేవే – సేవించెను. జగత్పావనుడైన పవనుడు వ్రతాచరణ పవిత్రుడై ఛత్రచామరములులేక వాడుబారు చున్న దిలీపునిని శైత్య సౌరభ్య మాంద్యగుణములు కలవాడై సేవించెనని భావము. దిలీపునికి హాయినిగొల్పు గాలి వీచెననుట.

శ్లో. శశామ వృష్ట్యాపి వినా దవాగ్నిః
ఆసీద్విశేషా ఫలపుష్ప వృద్ధిః,
ఊనం నసత్త్వే ష్వధికో బబాధే
తస్మిన్ వనం గోప్తరి గాహమానే. 14

వ్యాఖ్య : గోప్తరి – రక్షకుడైన, తస్మిన్ – ఆ దిలీప మహారాజు,వనం – అరణ్యమును గాహమానే (సతి) – ప్రవేశించిన వాడగుచుండగా, వృష్ట్యా, వినా, అపి – వర్షములేకున్నను, దవాగ్నిః – అరణ్యాగ్ని, శశామ – చల్లారెను, ఫల పుష్పవృద్ధిః – ఫలపుష్పములవృద్ధి – విశేషా – అధికమైనది, ఆసీత్ – అయ్యెను, సత్త్వేషు – మృగములయందు, అధికః– గొప్పదైన వ్యాఘ్రాదికము, ఊనం–తక్కువ బలముగల హరిణాదికమును, న బబాధే – బాధింపలేదు. దిలీపుడు వనమును ప్రవే శింపగానే దావాగ్ని చల్లారెననియు, ఫలపుష్పములు ఎక్కువగా వృద్ధిచెందెననియు, చిన్న మృగములను పెద్దవి బాధించుట మానెననియు భావము.

శ్లో. సంచారపూతాని దిగంతరాణి
కృత్వా దినాంతే నిలయాయ గంతుం,
ప్రచక్రమే పల్లవరాగతామ్రా
ప్రభా పతంగస్య మునేశ్చ ధేనుః. 15

వ్యాఖ్య : పల్లవరాగ తామ్రా – చిగురాకుల కాంతివలె ఎఱ్ఱనిదైన, పతం

గస్య - సూర్యుని యొక్క, ప్రభా - కాంతియు, మునేః - వసిష్ఠుని యొక్క, ధేనుః చ - గోవున్ను, దిగంతరాణి-దిక్కులనడిమి భాగములను, సంచారపూతాని-తనసంచారముచేత పవిత్రమైనవానినిగా, కృత్వా - చేసి, దినాంతే - సాయంకాలమందు, నిలయాయ - సూర్యపక్షమున అస్తపర్వతమునకు, ధేనుపక్షమున ఆశ్రమమునకు, గంతుం - వెళ్లుటకు, ప్రచక్రమే - ప్రారంభించెను. నందినీధేనువు ఎట్లుగానుండెనని భావము.

శ్లో. తాం దేవతా పిత్రతిథి క్రియార్థాం
అన్వగ్యయౌ మధ్యమలోకపాలః,
బభౌచ సా తేన సతాం మతేన
శ్రద్ధేవ సాక్షా ద్విధినోపపన్నా. 16

వ్యాఖ్య : మధ్యమలోకపాలః - భూలోకపాలుడైన దిలీపుడు, దేవతాపిత్రతిథి క్రియార్థాం - దేవతల యొక్కయు, పితృదేవతల యొక్కయు, అతిథుల యొక్కయు క్రియలే ప్రయోజనముగాగల (యాగ శ్రాద్ధ దాన కర్మలు ప్రయోజనములుగాగల), తాం - ఆ నందినీధేనువును, అన్వక్ - అనుసరించి, యయౌ - వెళ్లెను, సతాం - సత్పురుషులకు, మతేన - సమ్మతుడైన, తేన - ఆ దిలీపుని చేత, ఉపపన్నా - కూడిన, సాచ - ఆ ధేనువుకూడ, సతాం మతేన విధినా - సత్పురుషులకు సమ్మతమైన అనుష్ఠానముచేత, ఉపపన్నా - కూడిన, సాక్షాత్ - కంటికి కనబడు, శ్రద్ధేవ (శ్రద్ధా + ఇవ) - ఆస్తిక్య బుద్ధివలె, బభౌ - ప్రకాశించెను. వైదికకర్మలకు శాస్త్రచోదితమైన అనుష్ఠానము (విధి) ఆస్తిక్యబుద్ధి (శ్రద్ధ) ముఖ్యములు. దిలీపుడు విధితోను, ధేనువు శ్రద్ధతోను పోల్చబడుటచే వారి పవిత్రత్వము వ్యక్తము.

శ్లో. స పల్వలోత్తీర్ణ వరాహయూథా
న్యావాస వృక్షోన్ముఖ బర్హిణాని,
యయౌ మృగాధ్యాసిత శాద్వలాని
శ్యామాయమానాని వనాని పశ్యన్. 17

వ్యాఖ్య : సః - ఆ దిలీప మహారాజు, పల్వలోత్తీర్ణ వరాహయూథాని - పల్వల - నీటి గుంటలనుండి, ఉత్తీర్ణ - పైకి వచ్చిన, వరాహ యూథాని - పందుల గుంపులు గలవియు, ఆవాసవృక్షోన్ముఖ బర్హిణాని - నివాస వృక్షముల వైపునకు మరలిన నెమళ్లు గలవియు, మృగాధ్యాసిత శాద్వలాని - లేళ్లచేత అధివ

సింపబడిన పచ్చికబయళ్లు గలవియు నగుటచేత, శ్యామాయమానాని - నల్లబడు చున్న, వనాని - అరణ్యములను, పశ్యన్ - చూచుచు, యయౌ - వెళ్లెను. సాయంకాలమున వనము మిక్కిలి పచ్చనై నలుపు రంగుతో కనపడుచుండె నవియు, ఆ వర్ణమునకు వరాహములు, నెమళ్లు, పచ్చికబయళ్లు కూడా దోహదము చేసినవనియు భావము.

శ్లో. ఆపీన భారోద్వహన ప్రయత్నాత్
గృష్టి ర్గురుత్వా ద్వపుషో నరేంద్రః,
ఉభా వలంచక్రతు రంచితాభ్యాం
తపోవనావృత్తిపథం గతాభ్యామ్. 18

వ్యాఖ్య : గృష్టిః - నందినీధేనువు, ఆపీనభారోద్వహన ప్రయత్నాత్ - పొదుగు బరువును మోయుటయందలి ప్రయాసము వల్లను, నరేంద్రః - దిలీప మహారాజు, వపుషః - దేహముయొక్క, గురుత్వాత్ - గొప్పతనము వలనను, ఉభౌ - ఇద్దరును, అంచితాభ్యాం - అందమొలుకుచున్న, గతాభ్యాం - నడకలచేత, తపోవనావృత్తిపథం - తపోవనమునుండి తిరిగివచ్చుమార్గమును, అలంచక్రతుః - అలంకరించిరి. పెద్ద పొదుగుగల ధేనువు, సర్వాంగపుష్టమైన దేహముగల దిలీపుడు మార్గమునకు అందమును గూర్చిరని భావము. గృష్టిః - ఒకయీత యీనిన ఆవు. నందినీ దిలీపులు తిరిగివచ్చుచున్న తపోవన మార్గము రమణీయముగా కనబడుటకు ఆ యిద్దరి నడకల హుందాతనము కారణము.

శ్లో. వసిష్ఠధేనో రనుయాయినం తం
ఆవర్తమానం వనితా వనాంతాత్,
పపౌ నిమేషాలస పక్ష్మపంక్తిః
ఉపోషితాభ్యామివ లోచనాభ్యామ్. 19

వ్యాఖ్య : వసిష్ఠధేనోః - వసిష్ఠుని గోవుయొక్క, అనుయాయినం - అను చరుడైన వాడును, వనాంతాత్ - అరణ్యమునుండి, ఆవర్తమానం - తిరిగి వచ్చు చున్నవాడును నగు, తం - ఆ దిలీపుని, వనితా - సుదక్షిణాదేవి, నిమేషాలస పక్ష్మ పంక్తిః - నిమేష - మూతపడుటయందు, అలస - సోమరితనముగల, పక్ష్మ - తెప్ప వెంట్రుకల యొక్క, పంక్తిః - వరుసకలది యగుచు (తెప్పలు వాల్చనిదై యని అర్థము), లోచనాభ్యాం - రెండు కన్నులతోను, ఉపోషితాభ్యాం, ఇవ -

ఉపవాసమున్నవాని చేతవలె, పపౌ - పానముచేసెను. ఉపోషితుడు దప్పిగొని, విడువక జలమును త్రాగునట్లు సుదక్షిణ తన రెండు కన్నులతో తిరిగి వచ్చుచున్న దిలీపుని త్రాగెను, అనగా ఱెప్పలు వాల్చక ప్రేమాతిశయమున చూచెనని భావము. దీని వలన సుదక్షిణ పాతివ్రత్యము, భర్తయందలి విశేషానురాగమును సూచితములు. 'వనితా' శబ్దమునకు అత్యంతానురాగవతి అని యర్థము.

శ్లో. పురస్కృతా వర్త్మని పార్థివేన
ప్రత్యుద్గతా పార్థివ ధర్మపత్న్యా
తదంతరే సా విరరాజ ధేనుః
దిన క్షపా మధ్యగతేవ సంధ్యా. 20

వ్యాఖ్య : వర్త్మని - మార్గమునందు, పార్థివేన - పృథివీశ్వరుడైన దిలీపునిచేత, పురస్కృతా - ముందుంచుకొన బడినదియు, పార్థివ ధర్మపత్న్యా - రాజ ధర్మపత్ని సుదక్షిణచేత, ప్రత్యుద్గతా - ఎదురుకొనబడినదియు నగు, సా - ఆ నందినీ ధేనువు, తదంతరే - వారిద్దరినడుమ, దినక్షపా మధ్యగతా పగటికిని రాత్రికిని నడుమనున్న, సంధ్యా ఇవ - సంధ్యవలె, విరరాజ - ప్రకాశించెను. సంధ్య ఎట్టినిది, నందిని ఎట్టినిది కనుక ఆ ధేనువు వారి నడుమ దిన రాత్రుల నడుమనున్న సంధ్యవలె నుండెనని భావము.

శ్లో. ప్రదక్షిణీకృత్య పయస్వినీం తాం
సుదక్షిణా సాక్షతపాత్ర హస్తా,
ప్రణమ్య చానర్చ విశాల మస్యాః
శృంగాంతరం ద్వార మివార్థసిద్ధేః. 21

వ్యాఖ్య : సాక్షత పాత్ర హస్తా - అక్షతలుగల పళ్లెమును చేతులయందు పట్టుకొన్న, సుదక్షిణా - సుదక్షిణాదేవి, పయస్వినీం - సమృద్ధిగా పాలిచ్చునట్టి, తాం - ఆ నందినీధేనువును, ప్రదక్షిణీకృత్య - ప్రదక్షిణము చేసియు, ప్రణమ్యచ - నమస్కరించియు, అస్యాః - దానియొక్క, విశాలం - వెడల్పుగానున్న, శృంగాంతరం - కొమ్ముల నడిమి భాగమును, అర్థసిద్ధేః - తమ కార్యసిద్ధికి ద్వారం, ఇవ - ద్వారమువలె నున్నదానిని, ఆనర్చ - అర్చించెను. తమ కార్యసిద్ధికి ద్వారమా యనునట్లున్న నందినియొక్క ముఖమును సుదక్షిణ గంధ పుష్పాక్షతలతో అలంకరించెనని భావము.

శ్లో॥ వత్సోత్సుకాఽపి స్తిమితా సపర్యాం
ప్రత్యగ్రహీ త్సేతి ననందతు స్తౌ,
భక్త్యోపపన్నేషు హి తద్విధానాం
ప్రసాద చిహ్నాని పురః ఫలాని. 22

వ్యాఖ్య : సా - ఆ నందిని, వత్సోత్సుకా, అపి - దూడవిషయమై త్వర పడుచున్నదైనను, స్తిమితా - కదలక నిలిచినదై, సపర్యాం - పూజను, ప్రత్య గ్రహీత్ - స్వీకరించినది, ఇతి - అని, తౌ - వారిద్దరు (సుదక్షిణా దిలీపులు), ననందతుః - సంతోషపడిరి, భక్త్యా - భక్తిచేత, ఉపపన్నేషు - కూడినవారి విష మున, తద్విధానాం - అలాంటి వారియొక్క (నందినివంటి మహనీయులయొక్క), ప్రసాద చిహ్నాని - ప్రసన్నతా లక్షణములు, పురఃఫలాని,హి - సమీపించిన ఫల సిద్ధి కలవి కదా! దూడవద్దికి వెళ్లిపోక, నిలిచి, తాముచేసిన పూజను నందిని స్వీక రించుట తమకు అచిరకాలమున సంతాన ప్రాప్తికి సూచకమని వారు ఆనందించి రని భావము.

శ్లో॥. గురోః సదారస్య నిపీడ్య పాదౌ
సమాప్య సాంధ్యం చ విధిం దిలీపః
దోహావసానే పునరేవ దోగ్ధ్రీం
భేజే భుజోచ్ఛిన్నరిపు ర్నిషణ్ణామ్. 23

వ్యాఖ్య : భుజోచ్ఛిన్నరిపుః (భుజ + ఉచ్ఛిన్న + రిపుః) - భుజములచేత ఛేదింపబడిన శత్రుషులుగల అనగా పరాక్రమవంతుడైన, దిలీపః - దిలీపుడు, సదా రస్య - భార్యా సహితుడైన, గురోః - గురువైన వసిష్ఠునియొక్క, పాదౌ - పాదము ను, నిపీడ్య - పట్టి (నమస్కరించి), సాంధ్యం - సంధ్యాకాలమునకు సంబంధించిన, విధిం - అనుష్ఠానమును, సమాప్య, చ - ముగించియు, దోహా వసానే - పాలుపితికిన పిమ్మట, నిషణ్ణాం పరుండిన, దోగ్ధ్రీం - పాడియావైన ఆ నందినిని, పునరేవ - మళ్లీకూడ, భేజే - సేవించెను. నందినివెంట నడచెనని తాత్పర్యము. పూర్వపదములేని 'దోగ్ధ్రీ' శబ్దము కోరికలను పితుకునది అన్న అర్థమును స్ఫురింపజేయును.

శ్లో॥. తా మంతికన్యస్త బలిప్రదీపాం
అన్వాస్య గోప్తా గృహిణీసహాయః,

క్రమేణ సుప్తామను సంవివేశ
సుప్తోత్థితాం ప్రాత రనూదతిష్ఠత్. 24

వ్యాఖ్య : గోప్తా - రక్షకుడైన దిలీపుడు, గృహిణీసహాయః (సన్) - భార్యాసహితుడగుచు, అంతికన్యస్త బలిప్రదీపాం - సమీపమందుంచ బడిన పూజా ద్రవ్యములు దీపములునుగల, తాం - ఆ నందినీధేనువును, అన్వాస్య - అనుస రించి కూర్చుని, క్రమేణ - క్రమపరిపాటిగా, సుప్తాంఅను - నిద్రించిన యావు వద్దనే, సంవివేశ - నిద్రించెను, ప్రాతః - ఉదయమున, సుప్తోత్థితాం - నిద్రించి లేచినదానిని, అనూదతిష్ఠత్ అనుసరించి లేచెను. అది నిద్రమేల్కొనగా తానును లేచి నిల్చునె ననుట 'క్రమేణ' అను పదము వరుసగా జరుగుచున్న నందినీ దినచర్యను, దాని ననుసరించుచున్న సుదక్షిణా దిలీపుల వ్రత విధానమును సూచించును.

శ్లో. ఇత్థం వ్రతం ధారయతః ప్రజార్థం
సమం మహిష్యా మహనీయకీర్తేః
సప్త వ్యతీయు స్త్రిగుణాని తస్య
దినాని దీనోద్ధరణోచితస్య. 25

వ్యాఖ్య : ఇత్థం - ఈ విధముగా, ప్రజార్థం - సంతానము కొఱకు, మహిష్యాసమం పట్టపురాణితో గూడ, వ్రతం - వ్రతమును, ధారయతః - ఆచరించు చున్నవాడును, మహనీయకీర్తేః - కొనియాడ దగిన కీర్తిగలవాడును, దీనోద్ధరణో చితస్య(దీన + ఉద్ధరణ + ఉచితస్య)దీనుల దైన్యమును పోగొట్టుట కర్హుడైన, తస్య ఆ దిలీపునికి, త్రిగుణాని - మూడురెట్లయిన, సప్త ఏడు, దినాని -రోజులు, వ్యతీయుః - కడచినవి. ఇరువదియొక్క రోజులు గడచిపోయెననియు అట్లు ధేను వును సేవించెననియు భావము. కడచిన 25 శ్లోకములలో దిలీపునికి విశేషణములుగా ఉపయోగించబడిన "ప్రజానామధిపః, సమ్రాట్, మరుత్సఖాభం, ఆహారపూతం, మధ్యమలోకపాలః, భుజోచ్ఛిన్న రిపుః, గోప్తా, మహనీయకీర్తేః" అను పదములు దిలీపుని ధార్మిక ప్రజాదరణాది గుణములను, పరాక్రమమును, సంతానముకొరకై పడు కష్టములను సూచించుటయేకాక, రాబోవు కథాంశమునుగూడ సూచించు చున్నవి.

శ్లో. అన్యేద్యు రాత్మానుచరస్య భావం
జిజ్ఞాసమానా మునిహోమధేనుః,
గంగాప్రపాతాంత నిరూఢ ఘాసం
గౌరీగురో ర్గహ్వర మావివేశ. 26

వ్యాఖ్య : అన్యేద్యుః - మరునాడు (ఇరువది రెండవ దినమున), మునిహోమధేనుః - వసిష్ఠుని హోమార్థమై యున్న నందినీధేనువు, ఆత్మానుచరస్య - తనకు సేవకుడై యున్న దిలీపునియొక్క, భావం - భక్తిభావమును, జిజ్ఞాసమానా - తెలిసికొన గోరుచున్నదియగుచు, గంగా ప్రపాతాంత నిరూఢ ఘాసం - గంగా ప్రవాహము పడుచోట మొలచిన లేత పచ్చికగల, గౌరీగురోః - పార్వతికి తండ్రియగు హిమాద్రియొక్క, గహ్వరం - గుహను, ఆవివేశ ప్రవేశించెను. ఇరువది రెండవ దినమున నందిని దిలీపుని భక్తినిఁ బరీక్షింపఁ దలచినదియై ఒక హిమవత్పర్వత గుహలో ప్రవేశించెనని భావము.

శ్లో. సా దుష్ప్రధర్షా మనసాపి హింస్రైః
ఇత్యద్రి శోభా ప్రహితేక్షణేన,
అలక్షితాభ్యుత్పతనో నృపేణ
ప్రసహ్య సింహః కిల తాం చకర్ష. 27

వ్యాఖ్య : సా ఆ నందినీధేనువు, హింస్రైః ఘాతుక మృగముల చేత, మనసా, అపి - మనస్సుచేత కూడ (కోరికమాత్రమున గూడ), దుష్ప్రధర్షా - బెదరుటకు (భయపెట్టుటకు) శక్యముకానిది, ఇతి - ఇట్లనుకొని, అద్రిశోభా ప్రహితేక్షణేన - పర్వత సౌందర్యముపై ప్రసరింప జేయ బడిన కన్నులు గల, నృపేణ - రాజైన దిలీపునిచేత, అలక్షితాభ్యుత్పతనః (అలక్షిత + అభ్యుత్పతనః) - చూడబడని లంఘనముగల, సింహః - ఒకానొక సింహము, తాం - ఆధేనువును, ప్రసహ్య - హఠాత్తుగా, చకర్ష, కిల - లాగుకొని పోయెనుసుమా ! హిమాచల, గంగాపాత, శాడ్వలాది శోభలను చూస్తూ ఒక క్షణకాలము ధేనువును చూచుటను దిలీపుడు ఏమరినప్పుడు ఆయనకు తెలియనీయక ఒక సింహము నందినిని లాగుకొని ఆ గుహలోనికి పోయెనని భావము.

శ్లో. తదీయ మాక్రందిత మార్తసాధోః
గుహానిబద్ధ ప్రతిశబ్ద దీర్ఘం,

రశ్మిష్వివాదాయ నగేంద్రసక్తాం
నివర్తయామాస నృపస్య దృష్టిమ్. 28

వ్యాఖ్య ; గుహానిబద్ధ ప్రతిశబ్దదీర్ఘం - ఆగుహాయందు నిండి సుదీర్ఘమైన, తదీయం, ఆక్రందితం - ఆ నందినీ సంబధమైన యార్తనాదము (రోదనధ్వని), ఆర్తసాధోః - దుఃఖితుల విషయమున కరుణాశాలియైన, నృపస్య - రాజుయొక్క, నగేంద్రసక్తాం - పర్వతరాజుపై లగ్నమైయున్న, దృష్టిం - చూపును, రశ్మిషు - పగ్గములయందు (కట్టి), ఆధాయ, ఇవ - లాగబడినట్లు, నివర్తయామాస - వెనుకకు మరలించెను. సింహముచేత లాగబడిన గోవుయొక్క ఆక్రందనము దిలీపుని దృష్టిని హఠాత్తుగా గుహవైపు మరలించెనని భావము.

శ్లో. స పాటలాయాం గవి తస్థివాంసం
ధనుర్ధరః కేసరిణాం దదర్శ,
అధిత్యకాయా మివ ధాతుమయ్యాం
లోధ్రద్రుమం సానుమతః ప్రఫుల్లమ్. 29

వ్యాఖ్య ; ధనుర్ధరః - విల్లును ధరించిన, సః - ఆ దిలీపుడు, పాటలాయాం - కొంచము ఎఱ్ఱగానున్న, గవి - ధేనువుమీద, తస్థివాంసం - కూర్చుని యున్న, కేసరిణం - సింహమును, సానుమతః - పర్వతము యొక్క, ధాతుమయ్యాం - ఎఱుపురంగుతో కూడిన (ఎఱ్ఱని రాళ్లూ మట్టిగల గైరిక ధాతువు), అధిత్యకాయాం -నెత్తముమీద (పర్వతముయొక్క పైభాగమున ఒక ప్రక్కనున్న కొద్దిపాటి స్థలమునందు) తస్థివాంసం - ఉండినదియై, ప్రఫుల్లం - విరియ బూచిన, లోధ్రద్రుమం - లొద్దుగు చెట్టునువలె, దదర్శ - చూచెను. ఎఱ్ఱని నందినిపైఁ గూర్చునియున్న తెల్లని సింహము, జాజురంగుగల కొండనెత్తముపై నిల్చి విరియ బూచిన లొద్దుగు చెట్టువలె దిలీపుని కంటికిఁ గనపడెనని భావము.

'ధనుర్ధరః, కేసరిణం, ప్రఫుల్లం' మొదలయిన పదములన్నియు నిండైన యర్థములతో (సాభిప్రాయములు) నుండుటచేత ఇది పరికరాలంకార పుష్టమైన ఉపమాలంకారము. ఆరణ్యకమైన లోధ్రద్రుమోపమానము కాళిదాసుని సమయజ్ఞతను సూచించుచున్నది. సింహమును చూచుట, ధనువు నెక్కుబెట్టుట ఏకకాలమున జరిగెను.

  

శ్లో. తతో మృగేంద్రస్య మృగేంద్రగామీ
వధాయ వధ్యస్య శరం శరణ్యః,
జాతాభిషంగో నృపతి ర్నిషంగాత్
ఉద్ధర్తు మైచ్ఛత్ ప్రసభోద్ధృతారిః. 30

వ్యాఖ్య ; తతః - తరువాత, మృగేంద్రగామీ - సింహము వలె నడచు వాడును, ప్రసభోద్ధృతారిః - బలాత్కారముగా పెరికి వేయబడిన శత్రువులు గల వాడును నగు, నృపతిః - దిలీపుడు, జాతాభిషంగః - కలిగిన అవమానముగల వాడై, వధ్యస్య - వధింపదగిన, మృగేంద్రస్య - సింహముయొక్క, వధాయ - సంహారముకొఱకు, నిషంగాత్ - తూణీరమునుండి, శరం - బాణమును, ఉద్ధర్తుం - పైకితీయుటకు, ఐచ్ఛత్ - తలచెను. వెంటనే దిలీపుడు సింహముపై బాణమును వేయుటకు సమకట్టెను. 'మృగేంద్రగామీ' అను పదము దిలీపుడు నందినిపై కెక్కి కూర్చున్న సింహమును చూడగానే సింహమువలె ఒక్క లంఘనముతో దగ్గరకువెళ్లి బాణమును తూణీరమునుండి తీయబోయెనను భావమును సూచించును.

శ్లో. వామేతర స్తస్య కరః ప్రహర్తుః
నఖప్రభా భూషిత కంకపత్రే,
సక్తాంగుళిః సాయకపుంఖ ఏవ
చిత్రార్పితారంభ ఇవావతస్థే. 31

వ్యాఖ్య ; ప్రహర్తుః - కొట్టఁబోవు వాడైన, తస్య - ఆ దిలీపునియొక్క, వామేతరః (వామ + ఇతరః) - కుడిదియైన, కరః - చేయి, నఖప్రభాభూషిత కంకపత్రే—నఖప్రభా - గోళ్ళకాంతులచేత, భూషిత - కప్పబడిన, కంక - రాబందు యొక్క, పత్రే - ఈకలు గల, పుంఖే ఏవ - పిడియందే, సక్తాంగుళిః - అతుక్కపోయిన వ్రేళ్లుగలదియై, చిత్రార్పితారంభఃఇవ - చిత్రపటమునందు చూపబడిన ప్రారంభము గలదివలె, అవతస్థే - ఆగిపోయెను. తూణీరమునుండి బాణమును తీయబోయిన దిలీపునిహస్తము బాణపుపిడిమీదనే అతుకుకొని పోయెననియు అది చిత్రపటమునందలి బొమ్మవలె కదలక మెదలక యుండెననియు భావము. అలం ; ఉపమ.

శ్లో. బాహు ప్రతిష్టంభ వివృద్ధ మన్యుః
అభ్యర్ణ మాగస్కృత మస్పృశద్భిః,

రాజా స్వతేజోభి రదహ్యా తాంత
ర్భోగీవ మంత్రౌషధ రుద్ధ వీర్యః. 32

వ్యాఖ్య : బాహు ప్రతిష్టంభవివృద్ధమన్యుః - భుజ ప్రతిబంధము వలన వృద్ధి చెందిన కోపముగల వాడైన, రాజా - దిలీపుడు, మంత్రౌషధరుద్ధ వీర్యః - మంత్రము చేతను, ఓషధి అనగా చెట్టురసము చేతను, ఆపబడిన శక్తిగల, భోగీవ (భోగీ + ఇవ) సర్పమువలె, అభ్యర్ణం - ఎదుటనున్న, ఆగస్కృతం తప్పు చేసిన దానిని (సింహమును), అస్పృశద్భిః - తాకకండా ఉన్న, స్వతేజోభిః - తన ప్రతాపములచేత, అంతః - లోలోపలనే, అదహ్యాత - దహింపబడెను. తన కపకారము చేసి యెదుటనున్న శత్రువును కఱవబోగా మంత్రము మొదలయిన వానిచేత నిర్వీర్యము చేయబడిన సర్పమువలె బాణము వేయబోయిన చేయి ఆగి పోగా దిలీపుడు తనలోనే ఉడికిపోయెనని భావము. అలం : ఉపమ,

శ్లో. త మార్యగృహ్యాం నిగృహీత ధేనుః
మనుష్యవాచా మనువంశ కేతుమ్,
విస్మాయయన్ విస్మిత మాత్మవృత్తౌ
సింహోరుసత్త్వం నిజగాద సింహః. 33

వ్యాఖ్య : నిగృహీతధేనుః - గట్టిగా పట్టుకోబడిన యావుగల, సింహః - సింహము, ఆర్యగృహ్యాం - మంచివారి పక్షము వహించువాడును, మనువంశ కేతుం - మను వంశమునకు ధ్వజమువంటి వాడును, సింహోరుసత్త్వం - సింహము కంటే ఎక్కువైన బలముగల వాడును, ఆత్మవృత్తౌ అప్పటి తన స్థితి విషయమున, విస్మితం - ఆశ్చర్యపడుచున్న వాడును నగు, తం ఆ దిలీప మహా రాజును, మనుష్యవాచా - మనుష్య భాషణముచేత, విస్మాయయన్ - ఇంకను ఆశ్చర్యమును పొందించుచు, నిజగాద - పెద్దగా పల్కెను, నిర్భయముగా పెద్దగా సింహము దిలీపుని గురించి పలికెనని భావము. 'విస్మాయయన్' ఇదియే సాధు ప్రయోగమనియు, 'విస్మాపయన్' సాధువు కాదనియు మల్లినాథుని వ్యాఖ్య.

శ్లో. అలం మహీపాల! తవ శ్రమేణ
ప్రయుక్త మప్యస్త్ర మితో వృథా స్యాత్
న పాదపోన్మూలన శక్తి రంహః
శిలోచ్చయే మూర్ఛతి మారుతస్య. 34

వ్యాఖ్య : మహీపాల! - ఓ రాజా!, తవ - నీకు, శ్రమేణ - శ్రమతో, అలం పనిలేదు, ఇతః - ఈ నామీద, ప్రయుక్తం, అపి ప్రయోగింపబడినది యైనను, అస్త్రం - బాణము, వృథా, స్యాత్ - వ్యర్థమగును, పాదపోన్మూలన శక్తి - వృక్షములను పెల్లగించుటయందు శక్తిగల, మారుతస్య - వాయువు యొక్క, రంహః - వేగము, శిలోచ్చయే - పర్వతమునందు, న మూర్ఛతి ప్రసరింపదు కదా! ఓ రాజా! నీవు నాపై బాణము వేసినను అది వ్యర్థమే అగును. వాయువుయొక్క వేగము చెట్టును పెకలించును గాని పర్వతమును గదలించునా? అని సింహము పలికెను.

శ్లో. కైలాసగౌరం వృష మారురుక్షోః
పాదార్పణానుగ్రహ పూతపృష్ఠమ్
అవేహి మాం కింకర మష్టమూర్తేః
కుంభోదరం నామ నికుంభమిత్రమ్ 35

వ్యాఖ్య : కైలాసగౌరం - కైలాసపర్వతమువలె తెల్లనిదైన, వృషం - వృషభమును (నందీశ్వరుని), ఆరురుక్షోః - ఎక్కగోరుచున్న, అష్టమూర్తేః - శివునియొక్క, పాదార్పణానుగ్రహ పూతపృష్ఠం - పాదార్పణ - పాదముంచుట యనెడు, అనుగ్రహ - అనుగ్రహముచేత, పూత - పవిత్రము చేయబడిన, పృష్ఠం - వీపు కలవాడను, నికుంభమిత్రం - నికుంభుడనువానికి స్నేహితుడను, కుంభోదరం నామ - కుంభోదరుడను పేరుగల నన్ను, కింకరం - శివుని సేవకుని గా, అవేహి - తెలిసికొనుము. ఎత్తైన నందీశ్వరుని పైకెక్కునప్పుడు శివుడు నా వీపును మెట్టుగా నుపయోగించుకొనును. అట్లు శివపాదస్పర్శ చేత పవిత్రమైన వీపుగల కుంభోదరుఁడనబడు శివసేవకుడను గాని మృగమునుగానని సింహము పలికెను. 'నికుంభుడు', సుప్రసిద్ధ శివకింకరుడుగాను, కుమారస్వామి భటుడుగాను పురాణములలో పేర్కొనబడెను. శివుని అష్టమూర్తులు (శరీరములు) ; "పృథివి, జలము, తేజస్సు, వాయువు, ఆకాశము, సూర్యుడు, చంద్రుడు, యజ్ఞము చేసిన సోమయాజి" అనునవి.

శ్లో. అముం పురః పశ్యసి దేవదారుం
పుత్రీకృతో సౌ వృషభధ్వజేన,

యో హేమకుంభస్తన నిస్సృతానాం
స్కందస్య మాతుః పయసాం రసజ్ఞః. 36

వ్యాఖ్య : పురః - ఎదుట, అముం, దేవదారుం ఈ దేవదారు వృక్షమును, పశ్యసి - చూచుచున్నావుకదా! అసౌ- ఇది, వృషభధ్వజేన శివునిచేత, పుత్రీకృతః- కుమారుడుగా భావింపబడినది, యః - ఏయీదేవదారువు, స్కందస్య, మాతుః - కుమారస్వామికి తల్లియైన పార్వతియొక్క, హేమకుంభస్తన నిస్సృతానాం - బంగారు కుండయను స్తనమునుండి స్రవించునట్టి, పయసాం - ఉదకముల యొక్క (పాలయొక్క), రసజ్ఞః రుచినెఱిగినదై యున్నదో! పార్వతి కుమార స్వామిని క్షీరముతో తృప్తి పరచినట్లే ఈ దేవదారు వృక్షమును నీటితో తృప్తి పరచుచున్నదనియు, ఇది శివపార్వతులకు ముద్దుబిడ్డవంటిదనియు భావము.

శ్లో. కండూయమానేన కటం కదాచిత్
వన్యద్విపే నోన్మథితా త్వగస్య
అథైన మద్రే స్తనయా శుశోచ
సేనాన్య మాలీఢ మివాసురాస్త్రైః. 37

వ్యాఖ్య ; కదాచిత్ - ఒకానొకప్పుడు, కటం - గండస్థలమును, కండూయమానేన - గోకుకొనుచున్న, వన్యద్విపేన - అడవి ఏనుగుచేత, అస్య - దీని యొక్క, త్వక్ - చర్మము, ఉన్మథితా - నలిగి పైకి లేచునట్లు చేయబడినది, అథ - అప్పుడు, అద్రేః - హిమాద్రియొక్క, తనయా - కూతురైన పార్వతి, అసురాస్త్రైః - రాక్షసుల బాణములచేత, ఆలీఢం - ఛేదింపబడిన, సేనాన్యం, ఇవ కుమారస్వామిని గుఱించివలె, ఏనం ఈ దేవదారు వృక్షమును గుఱించి, శుశోచ - దుఃఖించెను. ఒకప్పుడు ఒక వనగజ మీ దేవదారు వృక్షమును రాచు కొనగా దీని చర్మము పైకి లేచినది, పార్వతి దానిని చూచి కుమారస్వామి రాక్షసుల బాణములచేత ఛేదింపబడినట్లువలె మిక్కిలి దుఃఖించినది,

శ్లో. తదాప్రభృత్యేవ వనద్విపానాం
త్రాసార్థ మస్మి న్నహ మద్రికుక్షౌ,
వ్యాపారిత శ్శూలభృతా విధాయ
సింహత్వ మంకాగత సత్త్వ వృత్తిః. 38

వ్యాఖ్య : తదాప్రభృతి, ఏవ అది మొదలుకొనియే, వనద్విపానాం - అడవి ఏనుగులయొక్క, త్రాసార్థం భయము కొఱకు శూలభృతా శివునిచేత, అంకాగతసత్త్వవృత్తి — అంకాగత - సమీపమునకు వచ్చిన, సత్త్వ - ప్రాణులు మాత్రమే, వృత్తి - జీవనాధారముగాగల, సింహత్వం - సింహముసై యుండుటను, విధాయ ఏర్పఱచి, అహం - నేను, అస్మిన్ ఈ, అద్రికుక్షౌ - పర్వతగుహయందు, వ్యాపారితః సేవకుడుగా నుంచబడితిని. అప్పటినుండి ఈ చెట్టును గజములు రాచుకొనకుండ చూచుటకై శివుడు నన్నిచ్చట కావలి యుంచినాడు. నేను 'అంకాగత సత్త్వ వృత్తి' అనగా నా వద్దికి వచ్చిన మృగాదులను మాత్రమే భక్షింపవలెనుగాని, ఆహారార్థమై వేటాడరాదు. అది శివుని యాజ్ఞ అని సింహము పలికెను.

శ్లో. తస్యాల మేషా క్షుధితస్య తృప్త్యై
ప్రదిష్టకాలా పరమేశ్వరేణ
ఉపస్థితా శోణితపారణా మే
సురద్విష శ్చాంద్రమసీ సుధేవ. 39

వ్యాఖ్య : పరమేశ్వరేణ శివునిచేత ప్రదిష్టకాలా - నిర్దేశించబడిన భోజనకాలము గలదియై, ఉపస్థితా నా వద్దికి వచ్చిన, ఏషా - ఈ, శోణిత పారణా - రక్తభోజనము, సురద్విషః - దేవశత్రువైన రాహువుయొక్క, తృప్త్యై - తృప్తికొఱకు, చాంద్రమసీ చంద్రునికి సంబంధించిన, సుధేవ (సుధా + ఇవ) - అమృతమువలె, క్షుధితస్య - ఆకలిగొనియున్న, మే - నాయొక్క, తృప్త్యై - తృప్తికొఱకు, అలం - చాలును. శివానుగ్రహము చేత ఆకలివేళకు నా యెదటికి వచ్చిన ఈ గోవు, రాహువునకు చంద్రకిరణామృతము వలె నాకిప్పటికి చాలును అన్నది సింహము. 'పారణ' యనగా వ్రతాదులయందలి యుపవాసము ముగిసిన పిమ్మట చేయునట్టి భోజనము. అమృతమునకై ప్రయత్నించిన రాక్షసులలో రాహువున కప్పుడప్పుడు లభించు చంద్రుని కిరణామృతముతోనే తృప్తియని భావము.

శ్లో. స త్వం నివర్తస్వ విహాయ లజ్జాం
గురో ర్భవాన్ దర్శితశిష్యభక్తిః
శస్త్రేణ రక్ష్యం య దశక్యరక్షం
న తద్యశః శస్త్రభృతాం క్షిణోతి. 40

వ్యాఖ్య ; సః త్వం - అట్టి నీవు (ధేనువును రక్షింపగల ఉపాయము లేని నీవు), లజ్జాం - సిగ్గును, విహాయ - విడిచి, నివర్తస్వ - వెనుకకు మరలుము. భవాన్ - నీవు, గురోః - నీ గురువునకు, దర్శిత శిష్యభక్తిః - చూపబడిన శిష్యభక్తి గలవాడవయితివి, యత్ - ఏ, రక్ష్యం - కాపాడదగిన వస్తువు, శస్త్రేణ - ఆయుధము చేత, అశక్యరక్ష్యం - సాధ్యముగాని రక్షణకలదియో, తత్ - ఆ వస్తువు, శస్త్రభృతాం - సాయుధులైన క్షత్రియుల యొక్క, యశః - కీర్తిని, నక్షిణోతి - నశింపజేయదు. నీవు ధేనువును రక్షింపలేకపోయినందున కీర్తికి భంగము రాదు. పాపము కూడ కలుగదు, గురుభక్తిని చూపితివి. నీవు రక్షింపజాలని ధేనువు నెట్లు రక్షింపగల్గుదువు? అని భావము.

శ్లో. ఇతి ప్రగల్భం పురుషాధిరాజో
మృగాధిరాజస్య వచో నిశమ్య
ప్రత్యాహతాస్త్రో గిరిశ ప్రభావాత్
ఆత్మన్యవజ్ఞాం శిథిలీచకార. 41

వ్యాఖ్య : పురుషాధిరాజః - పురుష శ్రేష్ఠుడైన దిలీపుడు, ఇతి - ఈ విధమైన, మృగాధిరాజస్య - మృగపతియైన సింహము యొక్క, ప్రగల్భం - ప్రౌఢమైన, వచః - పలుకును, నిశమ్య - విని, గిరిశ ప్రభావాత్ - శివుని యొక్క ప్రభావమువలన, ప్రత్యాహతాస్త్రః - కుంఠితమైన బాణము కలవాడై, ఆత్మని - తన విషయమున, అవజ్ఞాం - అవమానమును, శిథిలీచకార - సడలించుకొనెను - విడిచెను. మానావమానములు సమానులతో ప్రతిఘటనము కలిగినప్పుడుగాని, పరమేశ్వరుని విషయమున కాదని గ్రహించెనని భావము.

శ్లో. ప్రత్యబ్రవీచ్చైన మిషుప్రయోగే
తత్పూర్వభంగే వితథప్రయత్నః
జడీకృత త్ర్యంబక వీక్షణేన
వజ్రం ముముక్షన్నివ వజ్రపాణిః 42

వ్యాఖ్య : తత్పూర్వభంగే - అదియే మొట్టమొదటి దైవ ప్రతిబంధము గల, ఇషు ప్రయోగే బాణప్రయోగమునందు, వితథప్రయత్నః - వ్యర్థమైన ప్రయాసకలవాడై, వజ్రం - వజ్రాయుధమును, ముముక్షన్ - విడువగోరుచు, త్ర్యంబక వీక్షణేన - ముక్కంటి చూపుచేత, జడీకృతః - స్తంభితుడై పోయిన,

వజ్రపాణిః, ఇవ - ఇంద్రునివలె (ఉండిన దిలీపుడు), ఏనం - ఈ సింహమును గురించి, ప్రత్యబ్రవీత్ చ - బదులు పలికెను. (ప్రతి + అబ్రవీత్ = ప్రత్యబ్రవీత్). దిగంబర రూపమున అడ్డము వచ్చిన శివుని నెఱుగక దారినుండి తొలగి పొమ్మనుచు, పోనందున నింద్రుడు వజ్రాయుధమును ప్రయోగింపబోగా శివుని మహిమచేత నది బాహువుతోసహా స్తంభించిపోయెను అని పురాణగాథ. అట్లే బాణము పిడికిలికి అంటుకుపోయిన చేయిగల దిలీపుని స్థితికి ఇంద్రోపమానము చెప్పబడినది.

శ్లో. సంరుద్ధచేష్టస్య మృగేంద్ర కామం
హాస్యం వచ స్తద్య దహం వివక్షుః
అంతర్గతం ప్రాణభృతాం హి వేద
సర్వం భవాన్ భావ మతోఽభిధాస్యే. 43

వ్యాఖ్య : మృగేంద్ర - ఓ సింహమా! యత్‌వచః - ఏ మాటను, అహం - నేను, వివక్షుః - పలుకదలచుచున్నానో, సంరుద్ధచేష్టస్య - అడ్డగింపబడిన కదలికగల నాయొక్క, తత్ - ఆ మాట, కామం - మిక్కిలి, హాస్యం - పరిహసింపదగినదే, (కాని), భవాన్ - నీవు, ప్రాణభృతాం - ప్రాణులయొక్క, అంతర్గతం - మనస్సునందున్న, సర్వం సమస్తమైన, భావం - అభిప్రాయమును, వేద హి - ఎఱుగుదువు కదా! అతః - అందువలన, అభిధాస్యే - చెప్పబోవుచున్నాను. సత్యమునే చెప్పెదను కనుక అది హాస్యాస్పదము కాదని సర్వప్రాణుల యొక్క హృద్గతాభిప్రాయము నెఱిగినట్టి నీవు గుర్తింపగలవని పలుకబోవుచున్నానని భావము.

శ్లో. మాన్య స్స మే స్థావర జంగమానాం
సర్గ స్థితి ప్రత్యవహార హేతుః
గురో రపీదం ధన మాహితాగ్నేః
నశ్య త్పురస్తా దనుపేక్షణీయమ్. 44

వ్యాఖ్య : స్థావరజంగమానాం - చరాచరములైన ప్రాణులయొక్క, సర్గ స్థితి ప్రత్యవహార హేతుః - పుట్టుకకు, బ్రతుకుటకు, మరణమునకు గూడ కారణమైన, సః - ఆ పరమేశ్వరుడు, మే - నాకు, మాన్యః - పూజ్యుడే, (కాని) పురస్తాత్ - కనులయెదుట, నశ్యత్ - నశించుచున్న (చావనున్న), ఇదం - ఈ, ఆహితాగ్నేః - యజ్ఞము చేయుచున్న, గురోః - గురువైన వసిష్ఠునియొక్క, ధనం,

అపి - గోరూపమైన ధనము కూడ, అనుపేక్షణీయం - ఉపేక్షింపఁదగినది కాదు గదా! సృష్టిస్థితి లయములకు హేతువైన శివుఁడు నాకును పూజ్యుఁడే. ఈశ్వరాజ్ఞ ననుసరించి 'అంకాగతసత్త్వవృత్తి' వైన నీకు గోవును విడిచినచో, కనుల యెదుట చనిపోవుచున్న గురువుగారి గోవును ఉపేక్షించిన పాపము నాకు తప్పదు కదా! అని భావము.

శ్లో. స త్వం మదీయేన శరీరవృత్తిం
దేహేన నిర్వర్తయితుం ప్రసీద
దినావసానోత్సుక బాలవత్సా
విసృజ్యతాం ధేను రియం మహర్షేః. 45

వ్యాఖ్య : సః త్వం - అట్టి నీవు (దగ్గఱికి వచ్చిన ప్రాణిని మాత్రమే తినునట్టి వ్రతముగల నీవు), మదీయేన - నాదియైన, దేహేన - శరీరముచేత, శరీరవృత్తిం - నీ దేహజీవనమును, నిర్వర్తయితుం - నెరవేర్చుకొనుటకు, ప్రసీద - అనుగ్రహింపుము; దినావసానోత్సుక బాలవత్సా - దినావసాన - సాయంకాలమునందు, ఉత్సుక - తల్లి వచ్చునని యాతురపడుచున్న, బాలవత్సా - లేఁగదూడ గలిగిన, ఇయం - ఈ, మహర్షేః ధేనుః - వసిష్ఠ మహాఋషియొక్క ఆవు, విసృజ్యతాం - విడిచిపెట్టబడుగాక. నందినీ ధేనువును విడిచి నన్ను ఆహారముగా స్వీకరింపుము. నీ దగ్గఱికి ధేనువువలెనే నేనును వచ్చినాను. పాలకెదురు చూచుచున్న లేఁగ గల యావును చంపుటకంటె నన్ను చంపి తినుట మేలుకదా అని భావము.

శ్లో. అథాంధకారం గిరిగహ్వరాణాం
దంష్ట్రామయూఖైః శకలాని కుర్వన్
భూయ స్స భూతేశ్వర పార్శ్వవర్తీ
కించి ద్విహస్యార్థపతిం బభాషే. 46

వ్యాఖ్య : అథ - తరువాత, భూతేశ్వర పార్శ్వవర్తీ - శివుని యనుచరుడైన, సః - అసింహము, గిరిగహ్వరాణాం - పర్వత గుహలయొక్క, అంధకారం - చీకటిని, దంష్ట్రామయూఖైః - కోరలకిరణకాంతులచేత, శకలాని ముక్కలు ముక్కలుగా, కుర్వన్ - చేయుచున్నదియై, కించిత్ - కొంచముగా. విహస్య - నవ్వి, అర్థపతిం - సంపన్నుడైన దిలీపునుద్దేశించి, భూయః - మరల, బభాషే,

పలికెను. తరువాత సింహము తన కోరలకాంతులు గుహయందలి చీకటిని ముక్కలు చేయుచుండగా నవ్వి దిలీపునితో మరల పలికెను. కోరల కాంతులచేత చీకటి ముక్కలు ముక్కలుగా కనపడుచున్నదట! అనగా అంధకార బంధురమైన గుహలో దంష్ట్రా కాంతికిరణములు చొచ్చుకొని పోయినందున తిలతండులముల వలె తెల్లని కిరణములు, చీకటిముక్కలు కలిసి మనోహర దృశ్యముగా నేర్పడిన దని భావము. అద్భుతమైన భావన.

శ్లో. **ఏకాతపత్రం జగతః ప్రభుత్వం**
**నవం వయః కాంత మిదం వపుశ్చ**
**అల్పస్య హేతోః బహుహాతు మిచ్ఛన్**
**విచారమూఢః ప్రతిభాసి మే త్వమ్.** 47

వ్యాఖ్య : ఏకాతపత్రం - ఏకచ్ఛత్రాధిపత్యముగల, జగతః - ప్రపంచము యొక్క, ప్రభుత్వం - రాచఱికమును, నవం క్రొత్తదైన, వయః - వయస్సును, కాంతం - చక్కదనముగల, ఇదంవపుః - ఈశరీరమును, బహు - అనేకము, అల్పస్య - కొద్దిపాటిదైన, హేతోః - కారణమునకై, హాతుం విడిచి పెట్టుటకు, ఇచ్ఛన్ - కోరుచున్న, త్వం - నీవు, మే - నాకు, విచారమూఢః - యుక్తాయుక్త విమర్శనజ్ఞానములేని మూర్ఖుడవుగా, ప్రతిభాసి - కనపడుచున్నావు. (అందుకే నవ్వువచ్చినది) అల్పమైన గోవు ప్రాణమునకై ఏకచ్ఛత్రాధిపత్యము గల ప్రభుత్వము, నూత్నవయః సౌందర్యముగల దేహము విడువఁ దగినవి కావనియు, అట్లు విడువబూనుట వెఱ్ఱి యనియు తాత్పర్యము.

శ్లో. **భూతానుకంపా తవ చే దియం గౌః**
**ఏకా భవేత్ స్వస్తిమతీ త్వదంతే,**
**జీవన్ పునః శశ్వ దుపప్లవేభ్యః**
**ప్రజాః ప్రజానాథ! పితేవ పాసి.** 48

వ్యాఖ్య ; ప్రజానాథ! - ఓ దిలీప మహారాజా! తవ - నీకు, భూతానుకంపాచేత్ - ప్రాణులయందు దయయే ఉండినచో, త్వదంతే (త్వత్ + అంతే) - నీ మరణానంతరము, ఇయం ఈ, ఏకా, గౌః - ఒక్క గోవు మాత్రమే, స్వస్తిమతీ - క్షేమముగలది, భవేత్ - అగును, జీవన్ పునః నీవు బ్రతికియున్న వాడవగుచో, పితేవ (పితా + ఇవ) - తండ్రివలె, ప్రజాః ప్రజలందరిని, ఉపప్లవే

భ్యః - ఉపద్రవములనుండి, శశ్వత్ ఎల్లప్పుడును, పాసి - రక్షించుచుందువు. నీవు మరణించినచో నీ గోవు మాత్రమే బ్రతుకును. నీవు ప్రజానాథుడవు, ఒక్క గోవుకోసము ప్రాణములను విడుతువేని అనేక విపత్తులనుండి ప్రజాబాహుళ్యమును కాపాడవలసిన బాధ్యతగల రాజధర్మమును గోల్పోయి పతితుడవయ్యెదవు. కనుక నీ యుక్తి యుక్తముగా లేదు. అని సింహము పలికెను.

శ్లో. అథైకధేనో రపరాధ చండాత్
గురోః కృశానుప్రతిమాత్ బిభేషి,
శక్యోఽస్య మన్యు ర్భవతా వినేతుం
గాః కోటిశః స్పర్శయతా ఘటోధ్నీః. 49

వ్యాఖ్య : అథ – అట్లుకాక, ఏకధేనోః - ఒకే ఒక గోవు గల వాడును, (కనుకనే), అపరాధచండాత్ - నీ యపరాధముచేత తీవ్రమైన కోపము గలవాడై, కృశాను ప్రతిమాత్ అగ్నిహోత్రునితో సమానుడుగానగు, గురోః - గురువైన వసిష్ఠుని వలన. బిభేషి భయపడుచున్నావా? అస్య - ఆయనయొక్క, మన్యుః - కోపము, ఘటోధ్నీః కుండలవంటి పొదుగులు గల, గాః - గోవులను, కోటిశ - కోట్లకొలదిగా, స్పర్శయతా . దానముచేయునట్టి. భవతా - నీచేత, వినేతుం తొలగించుటకు, శక్యః సాధ్యమైనదే. ఈ గోవు పోయినందువలన కలుగు వసిష్ఠుని కోపమును కోట్లకొలదిగా నీవిచ్చు గోవులద్వారా పోగొట్టవచ్చును. కనుక గురుకోపమునకు భయపడకుము. దీనికి బదులుగా ననేక గోవుల నతనికిచ్చి కోపమును తొలగింపుమని భావము.

శ్లో. తద్రక్ష కల్యాణ పరంపరాణాం
భోక్తార మూర్జస్వల మాత్మదేహం,
మహీతల స్పర్శనమాత్ర భిన్నం
ఋద్ధం హి రాజ్యం పద మైంద్ర మాహుః. 50

వ్యాఖ్య తత్ – అందువలన, కల్యాణపరంపరాణాం - శుభ పరంపరలను, భోక్తారం అనుభవించునట్టిదియును, ఊర్జస్వలం - మంచిబలము గల దెయునగు, ఆత్మదేహం నీ శరీరమును, రక్ష - కాపాడుకొనుము; ఋద్ధం - సర్వసంపదలతో వృద్ధిచెందిన, రాజ్యం - రాజ్యము, మహీతల స్పర్శనమాత్ర భిన్నం భూమిని స్పృశించుట మాత్రము చేతనే వేఱుగానున్న, ఐంద్రం ఇంద్ర

సంబంధమైన, పదం - పదవినిగా, ఆహుః, హి - చెప్పుదురుగదా! సర్వసమృద్ధమైన రాజ్యము స్వర్గమే కనుక, దేహత్యాగము వలన నీకు కలుగబోవు స్వర్గమేదియు నుండదు. కనుక కల్యాణ పరంపరానుభవమునకు యోగ్యమైన దేహమును రక్షించుకొనుము.

శ్లో. ఏతావ దుక్త్వా విరతే మృగేంద్రే
ప్రతిస్వనే నాస్య గుహాగతేన
శిలోచ్చయోఽపి క్షితిపాల ముచ్చైః
ప్రీత్యా తమేవార్థ మభాషతేవ. 51

వ్యాఖ్య : మృగేంద్రే - సింహము, ఏతావత్ - ఇంతమాత్రము, ఉక్త్వా - పలికి, విరతే (సతి) - విరమించినది కాగా, గుహాగతేన - గుహయందు ప్రవేశించిన, అస్య - ఈ సింహము యొక్క, ప్రతిస్వనేన - ప్రతిధ్వని చేత, శిలోచ్చయః, అపి - పర్వతము గూడ, ప్రీత్యా - సంతోషముచేత, క్షితిపాలం - రాజును గుఱించి, తం, ఏవ, అర్థం - అదేయభిప్రాయమునే, ఉచ్చైః - బిగ్గరగా, అభాషతేవ (అభాషత + ఇవ) - పలికెనాయన్నట్లుండెను. గుహా ప్రతిధ్వనుల వలన సింహము పలుకులు దిలీపునికి రెండేసి పర్యాయములు వినపడెననియు, అది సింహవచనములను పర్వతము సైతము ఆమోదించినట్లుండెనని భావము.

శ్లో. నిశమ్య దేవానుచరస్య వాచం
మనుష్యదేవః పున రప్యువాచ,
ధేన్వా తదధ్యాసిత కాతరాక్ష్యా
నిరీక్ష్యమాణః సుతరాం దయాళుః. 52

వ్యాఖ్య : దేవానుచరస్య - పరమేశ్వరుని సేవకుడైన సింహము యొక్క, వాచం - వాక్కును, నిశమ్య - విని, మనుష్యదేవః - రాజు, తదధ్యాసిత కాతరాక్ష్యా - తత్ - ఆ సింహము యొక్క, అధ్యాసిత - ఆక్రమణము చేత, కాతరాక్ష్యా - బెదరుచున్న చూపులు గల, ధేన్వా - గోవు చేత, నిరీక్ష్యమాణః - చూడబడుచున్న వాడగుచు, సుతరాం - ఇంకను ఎక్కువగా, దయాళుః - దయ గల

వాడగుచు, పునరపి - మరల కూడ, ఉవాచ - పలికెను. తనను సింహమునకు వదలిపెట్టు నేమో యని బెదరుచు, తనను చూచుచున్న గోవును చూచుచు, మిక్కిలి కలిగిన హృదయము కలవాడైన దిలీపుడు మరల నిట్లు పలికెనని భావము.

శ్లో॥ క్షతాత్ కిల త్రాయత ఇత్యుదగ్రః
క్షత్రస్య శబ్దో భువనేషు రూఢః
రాజ్యేన కిం తద్విపరీత వృత్తేః
ప్రాణై రుపక్రోశ మలీమసై ర్వా. 53

వ్యాఖ్య : ఉదగ్రః - ఉన్నతమైన, క్షత్రస్య - క్షత్రియ వర్ణము యొక్క, శబ్దః - వాచకమైన పదము (అనగా క్షత్ర శబ్దము, లేదా క్షత్రియ శబ్దము), క్షతాత్ - నాశము నుండి, త్రాయతే - రక్షించును, ఇతి - అని (అను వ్యుత్పత్తి చేత), భువనేషు - లోకములందు, రూఢః కిల - ప్రసిద్ధమై యున్నదికదా! తద్విపరీత వృత్తేః - దానికి విరుద్ధమైన ప్రవర్తన గల వానికి, రాజ్యేన - రాజ్యముతో గాని, ఉపక్రోశమలీమసైః - నిందచేత మలినములైన, ప్రాణైః వా - ప్రాణములతో గాని, కిం - ఏమి పని ? క్షత్రియ శబ్దమునకు ఇతరులను కాపాడు వాడని యర్థము. అట్లు చేయలేని వానికి రాజ్యముతోఁ గాని నింద్యములైన ప్రాణములతో గాని యేమి పని యని భావము. ఇది 'ఏకాతపత్రం' ఇత్యాది సింహ వచనమునకు సమాధానము. 'క్షత్ర' శబ్దము 'పంకజ' శబ్దము వలె యోగ రూఢము. అనగా వ్యుత్పత్త్యర్థమును, ప్రసిద్ధార్థమును గలది. అంతే కాని వట్టి ప్రసిద్ధార్థము గల 'అశ్వకర్ణ' వంటి శబ్దము కాదు. 'అశ్వకర్ణ' ఒక ఓషధి. అందులో అశ్వత్వము గాని, కర్ణత్వము గాని లేదు.

శ్లో॥ కథం ను శక్యో ఽనునయో మహర్షేః
విశ్రాణనా చ్చాన్యపయస్వినీనామ్,
ఇమా మనూనాం సురభే రవేహి
రుద్రౌజసా తు ప్రహృతం త్వయాస్యామ్. 54

వ్యాఖ్య : మహర్షేః - వసిష్ఠుని యొక్క, అనునయః చ - ఓదార్పు కూడ, అన్యపయస్వినీనాం - ఇతరములయిన పాడియావుల యొక్క, విశ్రాణనాత్ -

దానము వలన, కథం ను శక్యః - ఎట్లు సాధ్యపడును? ఇమాం - దీనిని, సురభేః - కామధేనువు కంటే, అనూనాం - తక్కువ కాని దానినిగా, అవేహి - తెలిసి కొనుము; అస్యాం - దీనిమీద, త్వయా - నీచేత, ప్రహృతం, తు - దెబ్బ పడుటయందువా? రుద్రౌజసా (రుద్ర + ఓజసా) - పరమేశ్వరుని సామర్థ్యము చేతనే. నీవు శివకింకరుడవై ఆ దేవుని ప్రభావము చేతనే దీనిమీద దెబ్బను వేసితివి కాని నీ శక్తి వలన కాదు, ఇది కామధేను తుల్య ప్రభావము గల గోవు. దీనికి బదులుగా నేనెన్ని గోవులిచ్చినను సరిపోవు. వసిష్ఠుని కోపమును శమింపఁజేయుట అసాధ్యము అని దిలీపు డనెను.

శ్లో. సేయం స్వదేహార్పణ నిష్క్రయేణ
న్యాయ్యా మయా మోచయితుం భవత్తః
న పారణా స్యా ద్విహతా తవైవం
భవేదలుప్తశ్చ మునేః క్రియార్థః, ౫౫

వ్యాఖ్య: సేయం (సా + ఇయం) - అట్టి యీ నందినీ ధేనువు, మయా - నాచేత, స్వదేహార్పణ నిష్క్రయేణ - నా శరీరము నర్పించుట యను వెల చేత, భవత్తః - నీ నుండి, మోచయితుం - విడిపించుటకు, న్యాయ్యా - తగి యున్నది, ఏవం - ఈ విధముగా చేసినచో, తవ - నీ యొక్క, పారణా - భోజనము, విహతా - భంగము కలిగింపబడినది, న స్యాత్ - కాబోదు, మునేః - వసిష్ఠ మహర్షి యొక్క, క్రియార్థః చ - హోమక్రియ యను ప్రయోజనము కూడ, అలుప్తః - లోపించనిది, భవేత్ - కాఁగలదు. కనుక దీనిని విడిపించుట న్యాయ్యము, తల్లికై అఱ్ఱులు సాచుచున్న గోవత్సమునకును, వసిష్ఠ మునికిని నందినీ ధేనువే కావలెను. "అంకాగతసత్త్వవృత్తి" దగ్గఱకు వచ్చిన ప్రాణిని భక్షింప వలసిన నీకు ధేనువైనను, నేనైనను, సమానమే కదా? యని సమాధానము చెప్పెను.

శ్లో. భవానపీదం పరవా నవైతి
మహాన్ హి యత్న స్తవ దేవదారౌ,
స్థాతుం నియోక్తు ర్నహి శక్య మగ్రే
వినాశ్య రక్ష్యం స్వయ మక్షతేన. ౫౬

వ్యాఖ్య: పరవాన్ - పరతంత్రుఁడవైన, భవాన్, అపి - నీవుకూడ, ఇదం - ఈ చెప్పబోవు విషయమును, అవైతి - ఎఱుగుదవు; దేవదారౌ - దేవదారు వృక్ష విషయమున, తవ - నీ యొక్క, యత్నః - రక్షణ ప్రయత్నము, మహాన్ హి - గొప్పది కదా! రక్ష్యం - కాపాడదగిన వస్తువును, వినాశ్య - నాశము పొందించి, స్వయం - తాను మాత్రము, అక్షతేన - దెబ్బ తినకుండనున్న సేవకుని చేత, నియోక్తుః - తన స్వామి యొక్క, అగ్రే - ఎదుట, స్థాతుం - నిలుచుటకు, న, శక్యం, హి - సాధ్యము కాదు కదా! దేవదారు వృక్షమును నశింప జేసినచో నీవు శివుని యెదుట నిలువ సాధ్యము కానట్లే, నందినీ ధేనువును నశింపఁజేసి నేను వసిష్ఠుని యెదుట నిలువజాలనను విషయమును నీవెఱుగనిది కాదని భావము.

శ్లో. కి మప్యహింస్య స్తవ చేన్మతోఽహం
యశశ్శరీరే భవ మే దయాళుః
ఏకాంత విధ్వంసిషు మద్విధానాం
పిండే ష్వనాస్థా ఖలు భౌతికేషు. 57

వ్యాఖ్య: కిమపి - లేక, అహం - నేను, తవ - నీకు, అహింస్యః - చంపఁదగని వాడనుగా, మతః, చేత్ - ఇష్టుడనైతి నేని, మే - నా యొక్క, యశశ్శరీరే - కీర్తియనెడు శరీరము నందు, దయాళుః - కరుణగల వాడవు భవ - కమ్ము; మద్విధానాం - నాబోటి వారికి, ఏకాంత విధ్వంసిషు - తప్పక నశించి పోవునట్టి, భౌతికేషు - పంచ భూతముల కలయికతో నేర్పడిన, పిండేషు - శరీరముల యందు, అనాస్థా, ఖలు - అనపేక్షయే సుమా! నాకు శరీరము ముఖ్యము గాదు. వివేకవంతులయిన మాబోటి వారికి నశ్వరములైన దేహముల మీదికంటెను అనశ్వరమైన కీర్తిమీదనే యెక్కువ మక్కువ, కనుక నా దేహము మీద కాక నా కీర్తిమీద కరుణ జూపుమని దిలీపుడు పలికెను.

శ్లో. సంబంధ మాభాషణపూర్వ మాహుః
వృత్త స్స నౌ సంగతయో ర్వనాంతే
త ద్భూతనాథానుగ! నార్హసి త్వం
సంబంధినో మే ప్రణయం విహంతుమ్. 58

వ్యాఖ్య : సంబంధం - సఖ్యమును, ఆభాషణపూర్వం - సంభాషణమే కారణముగా గలదానినిగా, ఆహుః - చెప్పుదురు, వనాంతే - అరణ్యమునందు, సంగతయోః - కలిసికొన్న, నౌ - మన యిద్దఱికి, సఃవృత్తః - అది జరిగినది, తత్ - అందువలన, హే భూతనాథానుగ - ఓ ఈశ్వరసేవకుడా! సంబంధినః - స్నేహితుడనైన, మే - నా యొక్క, ప్రణయం - ప్రార్థనను, విహంతుం - భంగపరచుటకు, త్వం - నీవు, నార్హసి (న+అర్హసి) - తగవు. పెద్దలు సంభాషణము వలన సఖ్యము కలుగునని చెప్పుదురు. అది మనకు జరిగినది కనుక సంబంధినైన నామాటను దీసివేయకుము. అని ధర్మబద్ధములును హేతు బద్ధములును అగు పలుకులతో దిలీప మహారాజు సింహమును నిరుత్తరమును గావించెను.

శ్లో. తథేతి గాం ముక్తవతే దిలీపః
సద్యః ప్రతిష్టంభ విముక్త బాహుః
స న్యస్త శస్త్రో హరయే స్వదేహ
ముపానయత్ పిండమి వామిషస్య. 59

వ్యాఖ్య : తథేతి (తథా+ఇతి) - అట్లేయని, గాం - ధేనువును. ముక్తవతే - విడిచి పెట్టినట్టి, హరయే - సింహము కొఱకు, సద్యః - వెంటనే, ప్రతిష్టంభవిముక్త బాహుః - స్తంభించుటనుండి విడివడిన బాహువుగల, సః దిలీపః - ఆ దిలీపుడు, న్యస్తశస్త్రః - నేలపై నుంచబడిన ఆయుధము గలవాడగుచు, స్వదేహం - తన శరీరమును, ఆమిషస్య - మాంసము యొక్క, పిండం, ఇవ - కబళమును వలె, ఉపానయత్ - సింహసమీపమునకు జేర్చెను. సింహము దిలీపుని వచనముల నంగీకరించి ధేనువును విడువగా దిలీపుఁడు బాణ తూణీరములను నేలపై వదలి తన శరీరము నొక మాంసపు ముద్దనుగా సింహము వద్దకిఁ జేర్చెను. ఈ శ్లోకమునందు కొందఱు వ్యాఖ్యాతలు "సన్న్యస్తశస్త్రః" అను పాఠమును గ్రహించి, దిలీపు డస్త్రసన్యాసమును చేసి తన దేహమును సింహమున కర్పించెననియు, గోరక్షణము చేయజాలని తన యస్త్రము వృథాయని భావించెననియు వ్యాఖ్యానించిరి. అట్లు చేసినచో మరల అస్త్రమును గ్రహించుట కతడు ప్రాయశ్చిత్త విధిని జరుపుకోవలసి యుండును, అట్టి సన్యాసమునకుఁ బ్రసక్తియు లేదు.

శ్లో. తస్మిన్ క్షణే పాలయితుః ప్రజానాం
ఉత్పశ్యతః సింహనిపాత ముగ్రం,

అవాఙ్ముఖ స్యోపరి పుష్పవృష్టిః
పపాత విద్యాధర హ_స్త ముక్తా. 60

వ్యాఖ్య : తస్మిన్, క్షణే - ఆ క్షణమునందు, ఉగ్రం - భయంకరమైన, సింహనిపాతం - సింహము యొక్క పాటును, ఉత్పశ్యతః - ఊహించుచున్న వాడును, అవాఙ్ముఖస్య - క్రిందికివంచిన ముఖముగల వాడును, ప్రజానాం - ప్రజల యొక్క, పాలయితుః - పాలకుడైన దిలీపునియొక్క, ఉపరి - మీద, విద్యాధర హ_స్తముక్తాం - గగనచరులైన విద్యాధరులయొక్క చేతులనుండి విడువఁబడిన, పుష్పవృష్టిః - పుష్పవర్షము, పపాత - పడెను. అట్లు తనను మ్రింగుమని సింహాముముందు వంగిన దిలీపునిమీద విద్యాధరులు పుష్పవర్షము కురిపించిరి. కాని దిలీపుడు దానిని గమనింపక సమాహిత చిత్తుడై సింహనిపాతమున కెదురుచూచు చుండెను.

శ్లో. ఉ_త్తిష్ఠ వత్సే త్యమృతాయమానం
వచో నిశమ్యోత్థితముత్థిత స్సన్,
దదర్శ రాజా జననీ మివ స్వాం
గా మగ్రతః ప్రస్రవిణీం న సింహమ్. 61

వ్యాఖ్య : రాజా - దిలీప మహారాజు, అమృతాయమానం - అమృతము వంటిదగుచు, ఉత్థితం - బయలుదేరిన, "హేవత్స! ఉ త్తిష్ఠ - నాయనా లెమ్ము" ఇతి - అను, వచః - మాటను, నిశమ్య - విని, ఉత్థితఃసన్ - లేచినవాడగుచు, అగ్రతః - ఎదుట, ప్రస్రవిణీం - పాలు కురియుచున్న, గాం - నందినీధేనువును, స్వాం జననీం, ఇవ - తన తల్లినివలె, దదర్శ - చూచెను, సింహం - సింహమును, న దదర్శ - చూడలేదు (సింహము అంతర్ధానమును పొందినది) అప్పుడు నాయనా! లెమ్ము అను అమృతవాక్కులు వినబడగానే దిలీపుడు లేచి నిల్చుండెను. ఎదుట పాలుకురియుచున్న నందిని మాత్రమే యున్నది. సింహము అదృశ్యమైనది.

శ్లో. తం విస్మితం ధేను రువాచ సాధో!
మాయాం మయోద్భావ్య పరీక్షితోఽసి,
ఋషిప్రభావా న్మయి నాంతకోఽపి
ప్రభుః ప్రహర్తుం కిముతాన్యహింస్రాః. 62

వ్యాఖ్య : విస్మితం ఆశ్చర్యముతోగూడిన, తం - ఆ దిలీపునిగుఱించి, ధేనుః - నందినీధేనువు, ఉవాచ - ఇట్లు పలికెను, సాధో! - ఓ సత్పురుషుడా! మయా - నాచేత, మాయాం మాయను, ఉద్భావ్య - కల్పించి, పరీక్షితః - పరీక్షింపబడినవాడవు, అసి - అగుచున్నావు ; ఋషిప్రభావాత్ వసిష్ఠుని మహిమవలన, అంతకః, అపి - యముడు కూడా, మయి - నా మీద, ప్రహర్తుం - దెబ్బవేయుటకు, ప్రభుః - సమర్థుడు, న - కాడు, అన్యహింస్రాః - ఇతరములగు ఘాతుక మృగముముల విషయము, కిముత - ఏమి చెప్పవలెను? ఓ సజ్జనుఁడా! వినుము "వ్రతాచరణముకొఱకు నిన్ను వసిష్ఠుఁడు నావెంట పంపెనుగాని నన్ను రక్షించుటకుగాదు. నేను ఋషిమహిమచేతనే లేదా స్వీయప్రభావముచేతనే సురక్షితను. నన్నెవ్వరును చంపలేరు. ఈ జరిగినకథ నంతటిని నీ పరీక్షార్థమై నేను కల్పించితిని" అని విస్మితుడై యున్న రాజుతో నందిని యనెను.

శ్లో. భక్త్యా గురౌ మయ్యనుకంపయా చ
ప్రీతాస్మి తే పుత్ర! వరం వృణీష్వ,
న కేవలానాం పయసాం ప్రసూతి
మవేహి మాం కామదుఘాం ప్రసన్నామ్. 63

వ్యాఖ్య : పుత్ర - కుమారా! గురౌ - గురువునందలి, భక్త్యా - భక్తిచేతను, మయి - నాయందలి, అనుకంపయా చ - కరుణచేతను, తే నీకొఱకు, ప్రీతాస్మి (ప్రీతా + అస్మి) - తృప్తికలదానైతిని (నిన్ను గుఱించి సంతోషించితిని), వరం - వరమును, వృణీష్వ - కోరుకొనుము, మాం - నన్ను, కేవలానాం, పయసాం - ఒక పాలకుమాత్రమే, ప్రసూతిం - కారణమునుగా, న అవేహి - భావింపకుము (మంచి పాలిచ్చు గోవుగా మాత్రమే తలంపకుము), ప్రసన్నాం - ప్రసన్నురాలనై, కామదుఘాం - కోరికలనిచ్చు దానినిగా కూడ, అవేహి - తెలిసికొనుము. నీ గురుభక్తి చేతను, నాయందలి కరుణచేతను, సంతసించితిని 'వరమును కోరుము ఇచ్చెద'ననెను. 'పుత్ర!' అని సంబోధించుట పుత్రవరమును కోరుకొమ్మని సూచించుట. అంతేకాక, పదములవరుస "పుత్రవరం వృణీష్వ" అని యుండుట చమత్కారమును కలిగించుటయే కాక ఇక పుత్రవరమును కోరి సిద్ధిని పొందవచ్చుననియు సూచించును.

శ్లో. తత స్సమానీయ స మానితార్థీ
హస్తౌ స్వహస్తార్జిత వీరశబ్దః
వంశస్య కర్తార మనంతకీర్తిం
సుదక్షిణాయాం తనయం యయాచే. 64

వ్యాఖ్య : తతః - తరువాత, మానితార్థీ - గౌరవింపబడిన యాచకులు గల వాడును, స్వహస్తార్జిత వీరశబ్దః (స్వహస్త + అర్జిత + వీర + శబ్దః) తన భుజములచేత సంపాదింపఁబడిన 'వీర' అను బిరుద శబ్దముగల వాడును అగు, సః - ఆ దిలీపుడు, హస్తౌ - రెండు చేతులను, సమానీయ - జోడించి, (దోసిలినొగ్గి) వంశస్య - తనవంశమునకు, కర్తారం - ప్రవర్తకుడును, అనంతకీర్తిం - విస్తారమైన యశస్సు గలవాడును నగు, తనయం - పుత్రుని, సుదక్షిణాయాం - సుదక్షిణా దేవియందు, (కలుగునట్లు) యయాచే - యాచించెను. ఎందఱో యర్థులను తృప్తి పరచిన మహావీరుఁడగు దిలీపుఁడు చేతులు జోడించి వంశ ప్రతిష్ఠాపకుఁడైన కుమారుని ఇమ్మని నందినీ ధేనువును వరమడిగెను. సూర్యవంశమున 'కకుస్థుడు' ప్రవర్తకు డగుటచే "కాకుస్థ వంశమనియు, ఇక్ష్వాకుడు ప్రవర్తకు డగుటచేత ఇక్ష్వాకువంశ" మనియు ఇంతవరకు ప్రసిద్ధమయ్యెను. ఇకమీద తనకు పుట్టబోవు కుమారుని పేరుతో ప్రసిద్ధము కావలెను. అది దిలీపుని కోరిక. అది నందినీ వరము చేత సిద్ధించి రఘువు పుట్టును. అతని పేరుతో నికమీద రఘువంశపు రాజు లను పేరు వచ్చును. కాళిదాసు తన కావ్యమున కందులకే "రఘువంశము" అని నామకరణము చేసెను.

శ్లో సంతానకామాయ తథేతి కామం
రాజ్ఞే ప్రతిశ్రుత్య పయస్వినీ సా
దుగ్ధ్వా పయః పత్రపుటే మదీయం
పుత్రోపభుంక్ష్వేతి త మాదిదేశ. 65

వ్యాఖ్య : సా, పయస్వినీ - ఆ పాడియావు, సంతాన కామాయ - సంతతిని గోరుచున్న, రాజ్ఞే - దిలీప మహారాజు కొఱకు, తథేతి - సరేయని, కామం - కోరికను, ప్రతిశ్రుత్య - తప్పక యిచ్చెదనని చెప్పి, పుత్ర - ఓ కుమారా! మదీయం, పయః - నా పాలను, పత్రపుటే - ఒక ఆకు దొప్పయందు, దుగ్ధ్వా -

పిండుకొని, ఉపభుంక్ష్వ - భుజింపుము (త్రాగుము), ఇతి - అని, తం - ఆతనిని, ఆదిదేశ - ఆజ్ఞాపించెను.

శ్లో. వత్సస్య హోమార్థవిధేశ్చ శేషం
గురో రనుజ్ఞా మధిగమ్య మాతః
ఔధస్య మిచ్ఛామి తవోపభోక్తుం
షష్ఠాంశ ముర్వ్యా ఇవ రక్షితాయాః. 66

వ్యాఖ్య: మాతః - ఓ తల్లీ! వత్సస్య - దూడ యొక్కయు, హోమార్థ విధేశ్చ - హోమక్రియా విధి యొక్కయు, శేషం - మిగిలినట్టి (ఆ రెండు పనులకు కాగా మిగిలినట్టి) తవ - నీ యొక్క, ఔధస్యం - క్షీరమును, రక్షితాయాః - నాచే కాపాడబడిన, ఉర్వ్యాః - భూమి యొక్క (భూఫలితము యొక్క) షష్ఠాంశం, ఇవ - ఆఱవ భాగమునువలె, గురోః - గురువైన వసిష్ఠుని యొక్క, అనుజ్ఞాం - సమ్మతిని, అధిగమ్య - పొంది, ఉపభోక్తుం - అనుభవించుటకు, ఇచ్ఛామి - కోరుచున్నాను, పాలుదొన్నెలో పిండుకొని త్రాగుమన్న నందినితో తల్లీ! వసిష్ఠ హోమమునకును, నీబిడ్డకును సరిపోగా మిగిలిన పాలను గురువునానతి పొంది త్రాగెదనని పలికెను. 'షష్ఠాంశమును' భూస్వామి యనుమతితోనే రాజు పన్నుగా గ్రహింపవలెను, యజమాని లేని సమయమున పంటనంతటిని రాజు గ్రహించుట ధర్మము కాదు. అందువలన దిలీపుడు గురు సమ్మతిని అపేక్షించినాడు. ఇది కాళిదాసు రాజనీతి వైశారద్యమునకు సూచకము.

శ్లో. ఇత్థం క్షితీశేన వసిష్ఠధేనుః
విజ్ఞాపితా ప్రీతతరా బభూవ
తదన్వితా హైమవతాచ్చ కుక్షేః
ప్రత్యాయయా వాశ్రమ మశ్రమేణ. 67

వ్యాఖ్య: ఇత్థం - ఈ విధముగా, క్షితీశేన - రాజు చేత, విజ్ఞాపితా - విన్నవింపబడిన, వసిష్ఠధేనుః - వసిష్ఠుని గోవు, ప్రీతతరా - మరింతగా సంతోషించినది, బభూవ - ఆయెను; తదన్వితా - ఆయనతో కలసినదియై, హైమవతాత్, కుక్షేః - హిమవత్పర్వతగుహ నుండి, అశ్రమేణ - సుఖముగా, ఆశ్రమం - ఆశ్రమమును గురించి, ప్రత్యాయయౌ, చ - తిరిగి వచ్చెను, కూడ.

దిలీపుని వచనముల వలన మిక్కిలి సంతోషించిన నందిని హిమగిరి గుహ నుండి దిలీప సహితముగా వసిష్ఠాశ్రమమునకు సుఖముగా తిరిగివచ్చెను.

శ్లో. తస్యాః ప్రసన్నేందుముఖః ప్రసాదం
గురు ర్నృపాణాం గురవే నివేద్య
ప్రహర్ష చిహ్నానుమితం ప్రియాయై
శశంస వాచా పునరుక్తయేవ. 68

వ్యాఖ్య: ప్రసన్నేందుముఖః - నిర్మలమైన చంద్రునివంటి ముఖముగల, నృపాణాం, గురుః - రాజులందరిలోను పెద్దవాడైన దిలీపుడు, ప్రహర్ష చిహ్నానుమితం - తన సంతోషాతిశయము యొక్క చిహ్నముల చేతనే ఊహింపబడిన (ప్రహర్ష + చిహ్న + అనుమితం), తస్యాః - ఆ ధేనువు యొక్క, ప్రసాదం - అనుగ్రహమును, పునరుక్తయేవ (పునరుక్తయా + ఇవ - తెలిసిన విషయమునే మరల చెప్పుచున్నట్లున్న, వాచా - వాక్కుచేత, గురవే - గురువైన వసిష్ఠుని కొఱకు, నివేద్య - విన్నవించి, ప్రియాయై - ప్రియురాలైన సుదక్షిణకును, శశంస - చెప్పెను. చెప్పినది చెప్పుట పునరుక్తి, కాని యిచ్చట ముఖ చిహ్నములచేతనే గ్రహించిన వసిష్ఠ సుదక్షిణలకు దిలీపుని హెచ్చు పునరుక్తియా యనునట్లు భాసించినది. అలంకారము: ఉత్ప్రేక్ష.

శ్లో. స నందినీస్తన్య మనిందితాత్మా
సద్వత్సలో వత్సహుతావశేషం
పపౌ వసిష్ఠేన కృతాభ్యనుజ్ఞః
శుభ్రం యశో మూర్త మివాతితృష్ణః. 69

వ్యాఖ్య: అనిందితాత్మా - మెచ్చఁదగిన స్వభావము గలవాడును, సద్వత్సలః - మంచివారి యందు ప్రేమకలవాడును నగు, సః - ఆ దిలీపుడు, వసిష్ఠేన - వసిష్ఠునిచేత, కృతాభ్యనుజ్ఞః - (కృత + అభి + అనుజ్ఞః) - చేయబడిన యనుమతి కలవాడై, వత్సహుతావశేషం - వత్సకు, హోమమునకు, సరిపోగా మిగిలిన, నందినీస్తన్యం - నందినీ ధేనువు క్షీరమును, శుభ్రం - తెల్లనిదియు, మూర్తం - రూపమును ధరించిన (మూర్తిమంతమైన) యశః, ఇవ - కీర్తినివలె, అతితృష్ణః (సన్) - మిక్కిలి దప్పిగొన్న వాడగుచు, పపౌ - పానముచేసెను.

పవిత్రాత్మగల దిలీపుడు వసిష్ఠానుమతి పొంది వత్సకు హోమమునకు సరిపడగా మిగిలిన పాలను మూర్తీభవించిన కీర్తినివలె మిక్కిలి శ్రద్ధతో పానముచేసెను. కీర్తి తెల్లగా నుండునని కవి సమయము. ఇచ్చట క్షీరము మూర్తిమంతమైన యశస్సుగా భావింపబడినది కనుక ఉత్ప్రేక్షాలంకారము.

శ్లో. ప్రాత ర్యథోక్త వ్రత పారణాంతే
ప్రాస్థానికం స్వస్త్యయనం ప్రయుజ్య
తౌ దంపతీ స్వాం ప్రతి రాజధానీం
ప్రస్థాపయామాస వశీ వసిష్ఠః. 70

వ్యాఖ్య: వశీ - జితేంద్రియుడైన, వసిష్ఠః - వసిష్ఠుడు, ప్రాతః - మరునాటి ప్రాతః కాలమున, యథోక్త వ్రతపారణాంతే (యథా + ఉక్త + వ్రత + పారణా + అంతే) - శాస్త్రోక్తమైన గోసేవావ్రత సమాప్తియందు చేయవలసిన భోజనము చేసినపిమ్మట, ప్రాస్థానికం - ప్రయాణకాలమునందు చేయవలసిన స్వస్త్యయనం - శుభాశీర్వచనమును, ప్రయుజ్య - చేసి, తౌ - ఆ, దంపతీ - భార్యాభర్తలను, స్వాం, రాజధానీం, ప్రతి - తమరాజధానీ నగరమును గురించి, ప్రస్థాపయామాస - ప్రయాణము చేయించెను. వసిష్ఠుడు వ్రతసమాప్తిని గావించిన సుదక్షిణా దిలీపులను భోజనము చేయించి మరునాడు స్వనగరమునకు ప్రయాణము చేయించెను.

శ్లో. ప్రదక్షిణీకృత్య హుతం హుతాశం
అనంతరం భర్తు రరుంధతీం చ
ధేనుం సవత్సాం చ నృపః ప్రతస్థే
సన్మంగళోదగ్రతర ప్రభావః. 71

వ్యాఖ్య: నృపః - దిలీపమహారాజు, హుతం - అప్పుడే హోమము చేయబడిన, హుతాశం - అగ్నినీ (హోమద్రవ్యముచే ప్రజ్వలించి మండుచున్న అగ్నిదేవునినీ), భర్తుః - భర్తయైన వసిష్ఠుని యొక్క, అనంతరం - తరువాత, అరుంధతీం చ - అరుంధతీదేవిని, సవత్సాం - దూడతో కలిసియున్న, ధేనుం చ - నందినీధేనువును, ప్రదక్షిణీకృత్య - ప్రదక్షిణముచేసి అందఱికిని ప్రదక్షిణము చేసి యని యర్థము). సన్మంగళోదగ్రతర ప్రభావః (సత్ + మంగళ + ఉదగ్ర

తర + ప్రభావః) - మంచి ప్రదక్షిణాది మంగళాచారములచేత, మిక్కిలి యతిశ యించిన మహిమగల వాడగుచు, ప్రతస్థే - బయలుదేరెను. దిలీపుడు హోమా గ్నికిని, వసిష్ఠునికిని, అరుంధతికిని, సవత్సయైన నందికిని బ్రదక్షిణముచేసి, తన్మూలమున అతిశయించిన తేజస్సుగలవాఁడై బయలుదేరెను. పుత్రవరప్రాప్తి, గురుజన సేవాలాభము, దిలీపుని ప్రభావము 'ఉదగ్రతరము' అనగా మిక్కిలి యినుమడించుటకు కారణములు. మహాసంతోషముతో తిరిగివెళ్లెనని యభిప్రాయము.

శ్లో. శ్రోత్రాభిరామ ధ్వనినా రథేన
స ధర్మపత్నీ సహితః సహిష్ణుః,
యయా వనుద్ఘాత సుఖేన మార్గం
స్వేనేవ పూర్ణేన మనోరథేన. 72

వ్యాఖ్య: ధర్మపత్నీ సహితః - భార్యాసహితుడును, సహిష్ణుః - వ్రతాది కష్టములను సహించు స్వభావము గలవాడునగు, సః - ఆ దిలీపుడు, శ్రోత్రాభిరామ ధ్వనినా - చెవులకింపైన ధ్వనిగలదియు, అనుద్ఘాత సుఖేన - కుదుపులు లేనందున సుఖకరమైనదియు నగు, రథేన - రథముచేత, స్వేన - తనదియగు, పూర్ణేన - సఫలమైన, మనోరథేనేవ (మనోరథేన + ఇవ) - కోరికచేత వలెనే, మార్గం - త్రోవను, యయౌ - నడచెను. శ్రుతి సుఖమును గలిగించు ధ్వనిగల రథముపై ధర్మపత్నీ సహితుఁడైన దిలీపుఁడు పూర్ణమనోరథుఁడై స్వనగరమునకు వెళ్లెను. దిలీపుడు వసిష్ఠునివద్దకి వచ్చునప్పుడు, రథధ్వని "స్నిగ్ధగంభీర నిర్ఘోషమై" యుండి నది. ఇప్పుడు "అనుద్ఘాతసుఖము"గా నున్నది. అప్పుడు చింతాక్రాంతుడై యున్నం దున అది రణగొణ ధ్వని, ఇప్పుడు సంతోషచిత్తుడు గావున శ్రోత్రాభిరామధ్వని. మనోరథపక్షమున సుతుడు కలుగునన్న సుఖవాక్యశ్రుతి.

శ్లో. త మాహితౌత్సుక్య మదర్శనేన
ప్రజాః ప్రజార్థవ్రత కర్శితాంగం,
నేత్రైః పపుః తృప్తి మనాప్నువద్భిః
నవోదయం నాథ మివౌషధీనామ్. 73

వ్యాఖ్య: అదర్శనేన - ఇంతకాలము కనబడకుండుటచేత, ఆహితౌ త్సుక్యం (ఆహిత + ఔత్సుక్యం) - కలిగింపబడిన ఉత్కంఠకలవాడును, ప్రజార్థ

  

వ్రత కర్శితాంగం - సంతానార్థమైన వ్రతముచేత కృశించిన శరీరము గలవాడును, నవోదయం - నూతనాభ్యుదయము కలవాడును నగు, తం - ఆ దిలీపుని, ప్రజాః - ప్రజలు, తృప్తిం - తృప్తిని, అనాప్నువద్భిః - పొందలేకున్నట్టి, నేత్రైః - కన్నులతో, ఓషధీనాం, నాథం, ఇవ - చంద్రునినివలె, పపుః - పానము చేసిరి (మిక్కిలి ఆ_క్తితో చూచిరని యర్థము) చంద్రపక్షమున, అదర్శనేన - కాలము వలన (కృష్ణపక్ష) కనబడకుండుట, వ్రత - తన కళలను దేవతలకు వరుసగానిచ్చు వ్రతము. నవోదయం-శుక్లపక్షోదయము, మొదలయిన యర్థములను గ్రహింపవలెను.

శ్లో. పురందరశ్రీః పుర ముత్పతాకం
ప్రవిశ్య పౌరై రభినంద్యమానః,
భుజే భుజంగేంద్ర సమాన సారే
భూయః స భూమే ర్ధుర మాపసంజ. 74

వ్యాఖ్య: పురందరశ్రీః - దేవేంద్రుని సంపదవంటి సంపదగల, సః - ఆ దిలీపుడు, పౌరైః - ఎదుర్కొనుటకు వచ్చిన పురజనులచేత, అభినంద్యమానః - సంతోష పెట్టబడుచున్నవాడగుచు, ఉత్పతాకం - ఉన్నతముగా చేయబడిన జెండాలు గల, పురం - పట్టణమును, ప్రవిశ్య - ప్రవేశించి, భుజగేంద్ర సమానసారే - ఆదిశేషునితో సమానమైన బలముగల, భుజే - తన భుజమునందు, భూయః - మరల, భూమేః - భూమియొక్క, ధురం - భారమును, ఆససంజ - వహించెను. "తేన ధూర్జగతో గుర్వీ సచివేషు నిచిక్షిపే" (ప్రథమసర్గ 34 శ్లో) ఆశ్రమమునకు వెళ్లినప్పుడు మంత్రులపై నుంచబడిన రాజ్యభారమును మరల వహించెనని భావము. "ఉత్పతాకం" రాజులు రాజధానీ నగరమును విడిచి వెళ్లినప్పుడు సౌధములమీద జెండాను తీసియుంచుటయు, వారు నగరమును చేరగానే మరల పతాకము నెగుల వేయుటయు నాచారమై యుండెను. దానివలన ప్రజలకు రాజు నగరమున నుండెనా? లేక గ్రామాంతరమునకు వెళ్లెనా యను సంశయము కలుగకుండుటయు, ఇతరములగు మరికొన్నియు ప్రయోజనములు.

శ్లో. అథ నయనసముత్థం జ్యోతి రత్రేరివ ద్యౌః
సురసరిదివ తేజో వహ్నినిష్ఠ్యూత మైశం,

నరపతికుల భూత్యై గర్భ మాధత్త రాజ్ఞీ
గురుభి రభినివిష్టం లోకపాలానుభావైః. 75

వ్యాఖ్య: అథ - తరువాత, ద్యౌః - ఆకాశము, అత్రేః - అత్రిమహర్షి యొక్క, నయనసముత్థం - నేత్రమునుండి పుట్టిన, జ్యోతిః, ఇవ - కాంతినివలె (చంద్రునిని వలెను), సురసరిత్ - దేవనదియైన గంగ, వహ్నినిష్ఠ్యూత - అగ్ని చేత ఉంచబడిన, ఐశం - ఈశ్వర సంబంధమైన, తేజః, ఇవ - వీర్యరూపమైన షణ్ముఖునివలెను, రాజ్ఞీ - సుదక్షిణాదేవి, నరపతి కులభూత్యై - దిలీపుని వంశాభి వృద్ధికొఱకు, గురుభిః - గొప్పవియైన, లోకపాలానుభావైః - దిక్పాలకుల తేజస్సులచేత, అభినివిష్టం - ప్రవేశింపబడిన, గర్భం - గర్భమును, ఆధత్త - ధరించెను. అత్రి మహాముని నేత్రమునుండి చంద్రుడు పుట్టినట్లు హరివంశము నందున్నది. శివవీర్యమును అగ్నితెచ్చి గంగానదియం దుంచుటచేత కుమారస్వామి పుట్టినట్లు రామాయణాదులందు కలదు. ఇచ్చట చెప్పబడిన "లోకపాల" శబ్దము దిలీపునికి పర్యాయపదము, "అష్టానాం లోకపాలానాం వపుర్ధారయతే నృపః" అని మనుస్మృతి. ఇందలి "ఆధత్త" అను క్రియ స్త్రీ కర్తృకమైన గర్భధారణమును తెలుపును. వైదికమత సంప్రదాయము ననుసరించి భర్త, భార్యను, "నీవు గర్భమును ధరించి పదియవమాసమున ప్రసవింపుము" అని కోరవలసినట్లు ఋగ్వేదాశ్వలాయన సీమంతమంత్రము చెప్పుచున్నది. "యథేయం పృథివీమహ్యుత్తానా గర్భమాదధే। ఏవం త్వం గర్భమాధేహి దశమే మాసి సూతవే" కనుక సుదక్షిణ పై విధముగా గర్భమును ధరించినట్లు చెప్పుట కాళిదాసుయొక్క లౌకిక, వైదిక పాండితికి తార్కాణము.

ఇది మహాకవి కాళిదాసకృత రఘువంశ
కావ్యమున ద్వితీయ సర్గకు
తెలుగు లఘువ్యాఖ్య.

# మహాకవి కాళిదాసకృత రఘువంశ



# మ హా కా వ్య ము

## తృ తీ య స ర్గ ము

శ్లో. అథేప్సితం భర్తు రుపస్థితోదయం
సఖీజనోద్వీక్షణ కౌముదీముఖం,
నిదాన మిక్ష్వాకుకులస్య సంతతేః
సుదక్షిణా దౌర్హృదలక్షణం దధౌ. 1

వ్యాఖ్య : అథ – గర్భధారణము తర్వాత, సుదక్షిణా - రాణియైన సుద క్షిణాదేవి, ఉపస్థితోదయం - సమీపించిన ఫలకాలముగల, భర్తుః - పతియైన దిలీపుని యొక్క, ఈప్సితం - మనోరథ మైనట్టిదియు, సఖీజనోద్వీక్షణ కౌముదీ ముఖం - సఖీజన - చెలికత్తెలయొక్క, ఉద్వీక్షణ - ఎదురుచూపులకు, కౌముదీ ముఖం – వెన్నెల వచ్చుట వంటిదియు, ఇక్ష్వాకు కులస్య - ఇక్ష్వాకు వంశము యొక్క, సంతతేః – అవిచ్ఛిన్నతకు, నిదానం – మూలకారణమైనదియు నగు, దౌర్హృదలక్షణం – గర్భచిహ్నమును (ముందు చెప్పబోవు రీతిగా), దధౌ - ధరించెను, "సఖీజనోద్వీక్షణ కౌముదీ మహమ్" అని మరియొక పాఠము గలదు. 'కౌముదీ' అనగా దీపోత్సవతిథి (పండుగ). భవిష్యోత్తర పురాణమునందు "కౌ మోదంతే జనా యస్యాం తేనాసౌ కౌముదీ మతా" అని చెప్పబడి యున్నది. సుద క్షిణా గర్భచిహ్నము సఖీజనమున కా పండుగవంటిదని భావము. మాతృహృద యము, శిశు హృదయమును కలిసి యుండుటచేత గర్భమునకు "దౌర్హృదము" అని పేరు వచ్చినది. అలంకారము : రూపకము.

శ్లో. శరీరసాదా దసమగ్ర భూషణా
ముఖేన సా లక్ష్యత లోధ్రపాండునా,

తనుప్రకాశేన విచేయతారకా
ప్రభాతకల్పా శశినేవ శర్వరీ. 2

వ్యాఖ్య : శరీరసాదాత్ - దేహము యొక్క కృశ్యమువలన, అసమగ్ర భూషణా - కొన్ని యాభరణములు మాత్రమే ధరించినదియు, లోధ్రపాండునా - లొద్దుగు పువ్వువలె తెల్లబడిన, ముఖేన - ముఖముతో (కూడిన), సా - ఆ సుద క్షిణా దేవి, విచేయతారకా - వెదుకదగిన నక్షత్రములు గలదియు, (కొద్దిపాటి తారకలు గలది) తను ప్రకాశేన - అల్పమైన కాంతిగల, శశినా చంద్రునితో (కూడినది) ప్రభాతకల్పా ప్రాతఃకాల ప్రాయమైన, శర్వరీ, ఇవ - రాత్రివలె, అలక్ష్యత - కనబడెను. కొద్దిపాటి యాభరణములతోను, లొద్దుగపువ్వువలె తెల్ల బారిన ముఖముతోను, చిక్కిపోయిన శరీరముతోను ఉన్న సుదక్షిణాదేవి లెక్కిం దగిన చుక్కలతో, కాంతి తఱిగి పోయిన చంద్రబింబముతోను కూడి తెల్లవార బోయే ముందున్న రాత్రివలె కనబడుచుండెనని భావము. ఈ ఉపమాలంకారము వలన "క్షామత" అను గర్భ లక్షణము చెప్పబడినది. రాత్రిని వెన్నెల రాత్రినిగా చెప్పుట చక్కని ఉపమానము.

శ్లో. తదాననం మృత్సురభి క్షితీశ్వరో
రహస్యుపాఘ్రాయ న తృప్తి మాయయౌ,
కరీవ సిక్తం పృషతైః పయోముచాం
శుచివ్యపాయే వనరాజి పల్వలమ్. 3

వ్యాఖ్య : క్షితీశ్వరః - రాజు, రహసి - ఏకాంతమునందు, మృత్సురభి - మట్టిచేత సువాసనకలదైన, తదాననం - ఆ సుదక్షిణాదేవి ముఖమును, ఉపా ఘ్రాయ - వాసనచూచి, తృప్తిం - తృప్తిని, న, ఆయయౌ - అంతగా పొంద లేదు. (ఎవరు దేనినివలె) శుచి వ్యపాయే - శుచి - గ్రీష్మ ఋతువు యొక్క, వ్యపాయే - అవసానమునందు, పయోముచాం - మేఘములయొక్క, పృషతైః - నీటిచుక్కలచేత, సిక్తం - తడుపబడిన, వనరాజ్యాః - అరణ్య పంక్తికి సంబం ధించిన, పల్వలం చిన్న సరస్సును, ఉపాఘ్రాయ - మూర్కొనిన పిమ్మట, కరీవ - ఏనుగువలెనే. తొలకరి చినుకులు పడినప్పుడు వచ్చు భూగంధముగల చిన్నచిన్న గుంటలలో ఏనుగులు నేలను మూర్కొనుచు ఆనందపడినట్లు, దిలీపుడు మట్టివాసనతో కూడిన సహజసుగంధమగు సుదక్షిణా ముఖ పరిమళమును పదే పదే

ఆఘ్రాణించుచుండెనని భావము. గర్భిణీస్త్రీలు మృద్భక్షణము చేయుట లోక ప్రసిద్ధము. దీని వలన "దోహదము" అను లక్షణము చెప్పబడినది.

శ్లో. దివం మరుత్వానివ భోక్ష్యతే భువం
దిగంత విశ్రాంత రథో హి తత్సుతః,
అతోఽభిలాషే ప్రథమం తథావిధే
మనో బబంధాన్యరసాన్ విలంఘ్య సా. 4

వ్యాఖ్య : హి - ఎందువల్లనైతే, దిగంత విశ్రాంత రథః - దిగంతము లందు విశ్రమించునట్టి రథములుగలుగు (చక్రవర్తికానున్న), తత్సుతః - ఆ సుదక్షిణా కుమారుడు, మరుత్వాన్ - ఇంద్రుడు, దివం, ఇవ - స్వర్గమునువలె, భువం - భూమిని, భోక్ష్యతే - అనుభవింపబోవనున్నాడో, అతః - ఇందువలన, ప్రథమం - మొదట, సా - ఆమె, తథావిధే - ఆ విధమైన (భూవికారమైన మట్టి), అభిలాషే - భోగ్యవస్తువునందు, అన్యరసాన్ - ఇతర రసములు గల పదార్థములను, విలంఘ్య - అతిక్రమించి (విడిచి), మనః - మనస్సును, బబంధ - నిలిపెను. ఇతర గంధములకంటె నామెకు మట్టి వాసనయే యెక్కువ ఇష్టముగానుండెను. 'దోహద' లక్షణమైన మృద్భక్షణమును గురించిన ఉత్ప్రేక్ష ఇది. పుట్టబోవు పుత్రుని భూభోగసూచనార్థమైనదే యీ మృద్భక్షణము అని తాత్పర్యము.

శ్లో. న మే హ్రియా శంసతి కించి దీప్సితం
స్పృహావతీ వస్తుషు కేషు మాగధీ,
ఇతి స్మ పృచ్ఛ త్యనువేల మాదృతః
ప్రియాసఖీ రుత్తర కోసలేశ్వరః. 5

వ్యాఖ్య : మాగధీ - మగధరాజ పుత్రియైన సుదక్షిణ, హ్రియా - సిగ్గుచేత, కించిత్, ఈప్సితం - ఏ కోరికనుగూడ, మే - నాకు, న శంసతి - చెప్పదు, కేషు వస్తుషు - ఏ వస్తువులయందు, స్పృహావతీ - కోరిక గలదైయున్నదో ; ఇతి - అని, అనువేలం - అనుక్షణమును (నిముషనిముషమునకు) ఆదృతః - ఆదరము కలవాడై, ప్రియాయాః - భార్యయొక్క, సఖీః - చెలికత్తెలను (దాసీ

ళను), ఉత్తర కోసలేశ్వరః - ఉత్తర కోసల దేశమునకు ప్రభువైన దిలీపుడు, పృచ్ఛతిస్మ - అడిగెను. సఖులకైనచో కోరికలు దాపక చెప్పునని యభి ప్రాయము. "ఉత్తర కోసలేశ్వర మాగధీ" శబ్దములు వారి యాభిజాత్యమును వెల్లడించుచున్నవి.

శ్లో. ఉపేత్య సా దోహద దుఃఖ శీలతాం
యదేవ వవ్రే తదపశ్య దాహృతమ్,
న హీష్ట మస్య త్రిదివేఽపి భూపతేః
అభూ దనాసాద్య మధిజ్యధన్వనః. 6

వ్యాఖ్య: సా - ఆ సుదక్షిణాదేవి, దోహద దుఃఖశీలతాం - దోహద - గర్భిణీ మనోరథముచేత, దుఃఖశీలతాం - దుఃఖ స్వభావము కలిగియుండుటను, ఉపేత్య పొంది, యత్ - ఏ వస్తువును, వవ్రే - కోరెనో, తత్ - ఆ వస్తువు, (భర్త్రా - భర్తచేత), ఆహృతం - తీసుక రాబడినదిగా, అపశ్యదేవ - చూడనే చూచెను (పొందెనని యర్థము), హి - ఎందువలన ననగా, అధిజ్యధన్వనః అస్య భూపతేః ధనుర్ధరుడగు ఈ దిలీపమహారాజునకు, త్రిదివేపి - స్వర్గమునందుఁగూడ, ఇష్టం - కోరబడిన వస్తువు, అనాసాద్యం - పొంద శక్యముగానిది, న అభూత్ - లేకుండెను. గర్భిణీ మనోరథమును తీర్చకపోయినచో గర్భమునకు వికారముగాని, స్రావముగాని కలుగునని యాయుర్వేదము. కనుక దిలీపుఁడు సుదక్షిణపైగల యనురాగవిశేషముచేతఁ గాక శాస్త్రసమ్మత మనియే ఆమె కోర్కెలను దీర్చుచుండెనని భావము. "దోహదస్యాప్రదానేన గర్భోదోషమవాప్నుయాత్" అని ప్రమాణము.

శ్లో. క్రమేణ నిస్తీర్య చ దోహదవ్యథాం
ప్రచీయమానావయవా రరాజ సా,
పురాణ పత్రాపగమా దనంతరం
లతేవ సన్నద్ధ మనోజ్ఞ పల్లవా. 7

వ్యాఖ్య: సా - ఆ సుదక్షిణాదేవి, క్రమేణ - క్రమముగా, దోహద వ్యథాం - దౌర్హృదక్లేశమును (గర్భిణీ బాధను) చ - కూడ, నిస్తీర్య - దాటి,

ప్రచీయమానావయవా - ఆరోగ్యపడుచున్న అవయవములు గలది యగుచు, పురాణపత్రాపగమాత్, అనంతరం - పండుటాకులు రాలిపోయిన పిమ్మట, సంనద్ధ మనోజ్ఞ పల్లవా - సంనద్ధ - మొలచిన, మనోజ్ఞ - అందమైన, పల్లవా - చిగుళ్లుగల, లతేవ - తీగవలె, రరాజ - ప్రకాశించెను. క్రమక్రమముగా క్లేశము తగ్గిన సుదక్షిణ, పండుటాకులు రాలినపిమ్మట చిగిర్చిన తీగవలె నిగనిగలాడుచు అందముగాఁ గనబడుచుండెనని భావము.

శ్లో. దినేషు గచ్ఛత్సు నితాంతపీవరం
తదీయ మానీలముఖం స్తనద్వయమ్,
తిరశ్చకార భ్రమరాభిలీనయోః
సుజాతయోః పంకజకోశయోః శ్రియమ్. 8

వ్యాఖ్య: దినేషు - దోహదదినములు, గచ్ఛత్సు - గడచుచున్నవి కాగా, నితాంతపీవరం - మిక్కిలి బలసినదియు, ఆనీలముఖం - అంతట నల్లబడిన చూచుకములు గలదియు నగు, తదీయం స్తనద్వయం - ఆ సుదక్షిణాదేవివి యగు చన్నుగవ, భ్రమరాభిలీనయోః - తుమ్మెదలచేఁ గప్పబడినవియు, సుజాతయోః - సుందరములైన, పంకజకోశయోః - తామర మొగ్గలయొక్క, శ్రియం - కాంతిని, తిరశ్చకార - తిరస్కరించెను. (అనగా వానికంటె నందముగా నుండెనని భావము). అలంకారము: వ్యతిరేకము.

శ్లో. నిధానగర్భా మివ సాగరాంబరాం
శమీ మివాభ్యంతరలీన పావకామ్,
నదీ మివాంతఃసలిలాం సరస్వతీం
నృపః ససత్వాం మహిషీ మమన్యత. 9

వ్యాఖ్య: నృపః - రాజు, ససత్వాం - ఆపన్నసత్వయైన (గర్భిణియైన), మహిషీం - పట్టపురాణిని, నిధానగర్భాం - నిధి గర్భమునందున్న, సాగరాంబరాం ఇవ - సముద్రవసనయైన భూదేవిని వలెను, అభ్యంతరలీన పావకాం - లోపల దాగియున్న అగ్నిగల, శమీమివ - జమ్మితీగనువలెను, అంతః సలిలాం - అంత ర్గత జలముగల, సరస్వతీం నదీమివ - సరస్వతీ నదినివలెను, అమన్యత - తలఁ

చెను. "ఆపన్నసత్వా, గుర్వీణీ, అంతర్వత్నీ, గర్భిణీ" ఇవి సమానార్థకములు; సుదక్షిణాదేవికిఁ జెప్పఁబడిన పై యుపమానములచేత గర్భస్థమైన శిశువుయొక్క భాగ్యవత్త్వము తేజస్వితత్వము, పావనత్వమును సూచింపఁబడినవి. యజ్ఞాగ్నిని శమీ గర్భమునుండి మథించి సంపాదించుట వైదికాచారము. దిలీపుఁడు సుదక్షిణను గర్భమునందు నిధిగల భూదేవితోను, అంతర్గతాగ్నియైన శమీలతతోను, అంత స్సలిలయైన సరస్వతీనదితోను సమానముగా, పవిత్రురాలిగా భావించెనని యభి ప్రాయము.

శ్లో. ప్రియానురాగస్య మనః సమున్నతేః
భుజార్జితానాం చ దిగంత సంపదామ్,
యథాక్రమం పుంసవనాదికాః క్రియాః
ధృతేశ్చ ధీరః సదృశీ ర్వ్యధత్త సః. 10

వ్యాఖ్య: ధీరః - ధీరుడైన, సః - ఆ దిలీప మహారాజు, ప్రియాను రాగస్య - భార్యయందలి యనురాగమునకును, మనః సమున్నతేః - తన మనస్సు యొక్క యౌన్నత్యమునకును (అనగా తన యౌదార్యమునకు), భుజార్జితానాం - తన భుజ బలముచేత సంపాదింపఁబడిన, దిగంత సంపదాం - అన్ని దిక్కుల యందుఁ గూర్పబడిన సంపదలకును, ధృతేశ్చ - తనకు పుత్రుఁడు కలుగఁ బోవు చున్నాడను సంతోషమునకును, సదృశః - తగినట్టి, పుంసవనాదికాః - పుంస వనము మొదలయిన, క్రియాః - సంస్కారములను, యథాక్రమం - వరుసను తప్పనీయక, వ్యధత్త - చేసెను. పుసంవన, అనవలోభన, సీమంతోన్నయనాది గర్భ సంస్కారములను క్రమముగా ద్వితీయ, చతుర్థ, షష్ఠ మాసములందు మహా వైభవముగా జరిపించెనని భావము. మానవుఁడు పుట్టగానే మానవుఁడు కాఁ జాలఁడు, గర్భధారణము మొదలు చతుర్వింశతి సంస్కారములను పొంది, ఆత్మ గుణ, విద్యా, పురుషార్థాదులను సంపాదించిననాడే యుత్తమ మానవుఁడు కాగలుగునని భారతీయుల విశ్వాసము. అందువలన దిలీపుఁ డా సంస్కారములను గర్భమునకు జరిపించెను.

శ్లో. సురేంద్ర మాత్రా శ్రిత గర్భ గౌరవాత్
ప్రయత్న ముక్తాసనయా గృహాగతః,

తయోపచారాంజలి ఖిన్న హస్తయా
ననంద పారిప్లవ నేత్రయా నృపః. 11

వ్యాఖ్య: గృహాగతః - అంతఃపురమునకు తిరిగి వచ్చిన, నృపః - దిలీపుఁడు, సురేంద్రమాత్రాశ్రిత గర్భగౌరవాత్ - సురేంద్ర - అష్ట దిక్పాలకుల యొక్క, మాత్రా - అంశలచేత, ఆశ్రిత - అనుప్రవిష్టమైన, గర్భ - గర్భము యొక్క, గౌరవాత్ - బరువు వలన, ప్రయత్న ముక్తాసనయా - ప్రయత్న - ప్రయత్నముచేత, ముక్త - విడువఁబడిన, ఆసనయా - పీఠము గలదియును (అతి ప్రయత్నముతో లేచి నిలుచున్నట్టి అని యర్థము), ఉపచారాంజలి ఖిన్న హస్తయా - ఉపచార - గౌరవమునకు సంబంధించిన, అంజలి - దోయిలినిఁ గూర్చుటయందు, ఖిన్న - చేతగాని, హస్తయా - చేతులు గలదియును, పారిప్లవ నేత్రయా - త్వరగా మర్యాదను పాటింపలేక పోయితినిగదా యను భయమువలన చలించుచున్న నేత్రములు గలదియు నగు, తయా ఆ సుదక్షిణచేత, ననంద - సంతోషించెను. పతి తనవద్దికి వచ్చినపుడు గర్భభారముచేత ఉపచారములు చేయఁజాలక చింతిలుచున్న సుదక్షిణను చూచి ఇంతకాలమునకు గర్భభారాలసయైన భార్యను జూడఁ గలిగితినిగదా! యని దిలీపుఁడు సంతోషించెనేకాని ఆమె పూర్వమువలె ప్రత్యుత్థానా ద్యుపచారములు చేయలేదని కినియలేదు. రాజు దిక్పాలకాంశతో జన్మించునని మనువు చెప్పెను. "అష్టాభిశ్చ సురేంద్రాణాం మాత్రాభిర్నిర్మితో నృపః".

శ్లో. కుమార భృత్యా కుశలై రనుష్ఠితే
భిషగ్భి రాప్తై రథ గర్భభర్మణి,
పతిః ప్రతీతః ప్రసవోన్ముఖీం ప్రియాం
దదర్శ కాలే దివ మభ్రితా మివ. 12

వ్యాఖ్య: అథ - తరువాత, కుమార భృత్యాకుశలైః - శిశు చికిత్సయందు నేర్పరులైన (భృత్యా - చికిత్స), ఆప్తైః - తమమేలును గోరునట్టి, భిషగ్భిః - వైద్యులచేత, గర్భభర్మణి - గర్భపోషణము, అనుష్ఠితే సతి - చేయబడినది యగుచుండగా, కాలే - దశమ మాసమునందు, ప్రసవోన్ముఖీం - ప్రసవించుటకు సిద్ధముగా నున్న, ప్రియాం - భార్యను, అభ్రితాం - మేఘయుక్తమైన, దివం

ఇవ - ఆకాశమునువలెె, పతిః - భర్త, ప్రతీతః - హృష్టుఁడగుచు, దదర్శ - చూచెను (ఎప్పుడు ప్రసవించునా యని యెదురు చూచుచుండెను.) వర్షింపఁబోవు మేఘముతోఁ గూడిన యాకాశమును ప్రజలు హృష్టులై చూచినట్లు ప్రసవింపఁబోవు భార్యను దిలీపుఁ డమందానంద భరితుఁడై చూచెనని భావము. "గర్భకర్మణి" అను పాఠమునందు గర్భాధాన ప్రతీతి కలుగుటవలన ఆ పాఠమును మల్లినాథుఁడు వదలిపెట్టెను. అలం : ఉపమ.

శ్లో. గ్రహై స్తతః పంచభి రుచ్చసంశ్రయై
రసూర్యగైః సూచితభాగ్యసంపదమ్.
అసూత పుత్రం సమయే శచీసమా
త్రిసాధనా శక్తి రివార్థ మక్షయమ్. 13

వ్యాఖ్య : తతః - పిమ్మట, శచీసమా - శచీదేవితో సమానురాలైన ఆ సుదక్షిణాదేవి, సమయే - ప్రసూతి కాలమునందు, ఉచ్చసంశ్రయైః - తమ తమ ఉచ్చస్థానములైన మేషాదిరాసుల యందున్నవియును, అసూర్యగైః - సూర్య గ్రహముతో కలియనివియు (అనగా అస్తమింపనివియు) నగు, పంచభిఃగ్రహైః - అయిదు గ్రహములచేత (అప్పటి కాలచక్రము ననుసరించి యథాసంభవముగా నుచ్చరాసి స్థితములైన ఏవో అయిదు గ్రహములచేత నని యర్థము), సూచితభాగ్య సంపదం - సూచింపబడిన భాగ్య, రాజ్య, ధనాది భావములు పొందగలిగిన, పుత్రం - కుమారుని, త్రిసాధనా - ప్రభావ, మంత్ర, ఉత్సాహాత్మకములైన సాధనములు గల, శక్తిః - శక్తి, అక్షయం - నశింపని, అర్థం ఇవ - ప్రయోజనమునువలె, అసూత - కనెను. (మంచి ముహూర్తమున సుదక్షిణ పుత్రునిఁ గనెనని భావము). ప్రభుశక్తి, మంత్రశక్తి, ఉత్సాహశక్తి అనబడు శక్తిత్రయము రాజ్య స్థైర్య పాలనాదులకు ముఖ్యము. ఈ శ్లోకమునందు నవగ్రహముల స్థాన నిర్దేశాదుల చేత కవి తన జ్యోతిర్విద్యా ప్రావీణ్యమును వెల్లడించెను. సుదక్షిణాదేవిని ఇంద్రాణితో నుపమించుటచేత పుట్టిన శిశువుయొక్క భాగ్యవిశేషము సూచితమైనది.

శ్లో. దిశః ప్రసేదు ర్మరుతో వవుః సుఖాః
ప్రదక్షిణార్చి ర్హవి రగ్ని రాదదే,

బభూవ సర్వం శుభశంసి తత్క్షణం
భవో హి లోకాభ్యుదయాయ తాదృశామ్. 14

వ్యాఖ్య: తత్క్షణం - ఆ నిమిషమునందు, దిశః - దిక్కులు, ప్రసేదుః - నిర్మలము లయ్యెను, మరుతః - వాయువులు, సుఖాః - హాయి నిచ్చునవియై, వవుః - వీచెను, అగ్నిః - హోమాగ్ని, ప్రదక్షిణార్చిః - సవ్యముగా తిరుగు జ్వాలలు కలదియై, హవిః - హోమ ద్రవ్యమును, ఆదదే - స్వీకరించెను, సర్వం - సమస్తమును, శుభశంసి - శుభ సూచకమైనది, బభూవ - అయ్యెను, తాదృశాం - అట్టి వారియొక్క, భవః - జన్మము, లోకాభ్యుదయాయ హి - లోక శ్రేయస్సు కొఱకేకదా! అందువలన దేవతలుగూడా సంతుష్టులైరని భావము. ఆశిశువు పుట్టగానే ప్రకృతి యంతయు ప్రసన్నమై దేశ శ్రేయస్సును సూచించెను.

శ్లో. అరిష్టశయ్యాం పరితో విసారిణా
సుజన్మన స్తస్య నిజేన తేజసా,
నిశీథదీపాః సహసా హతత్విషో
బభూవు రాలేఖ్యసమర్పితా ఇవ. 15

వ్యాఖ్య: అరిష్టశయ్యాం పరితః - అరిష్ట - సూతికా గృహము నందలి, శయ్యాంపరితః - పరుపుచుట్టును (ఇచ్చట షష్ఠీ విభక్త్యర్థముగల శయ్యా శబ్దము, పరితఃఅను నవ్యయముతోఁ జేరుటవలన ద్వితీయా విభక్త్యంతమైనది), విసారిణా - వ్యాపించినదియు, సుజన్మనః - మంగళకరమైన పుట్టుకగల, తస్య - ఆ శిశువు యొక్క, నిజేన - సహజమైన, తేజసా - తేజస్సుచేత, సహసా - హఠాత్తుగా, హతత్విషః - క్షీణించిన కాంతులుగల, నిశీథ దీపాః - అర్ధరాత్రము నందలి దీపములు, ఆలేఖ్యసమర్పితాః ఇవ - చిత్తరువునం దుంచబడినవివలె, బభూవుః - అయినవి. నిశీథ శబ్దము దీపముల కాంత్యాధిక్యమును సూచించుటకు, అట్టి కాంతి గల దీపములు ఆ శిశువుయొక్క సహజ కాంతిచేత నిస్తేజస్కములై చిత్తరువు నందలి దీపములవలె కనఁబడుచుండెనని భావము.

శ్లో. జనాయ శుద్ధాంతచరాయ శంసతే
కుమార జన్మామృత సమ్మితాక్షరమ్,

అదేయ మాసీ త్త్రియమేవ భూపతేః
శశిప్రభం ఛత్ర ముభే చ చామరే. 16

వ్యాఖ్య: భూపతేః - దిలీపునికి, అమృత సమ్మితాక్షరం - అమృతముతో సమానమైన అక్షరములుగల, "కుమారజన్మ", - "పుత్రోత్పత్తి"అని, శంసతే - చెప్పుచున్న, శుద్ధాంతచరాయ - అంతఃపురమునఁ దిరుగునట్టి, జనాయ - జనము కొఱకు, త్రయమేవ - మూడు మాత్రమే, అదేయం - ఇచ్చుటకు వీలు లేనివి, ఆసీత్ - అయ్యెను, (అవి యేవి యనఁగా) శశి ప్రభం - చంద్ర కాంతిగల, ఛత్రం - శ్వేత ఛత్రమును, ఉభే చామరేచ - రెండు చామరములును. ఛత్ర చామరములు రాజ చిహ్నములు కనుక వాటిని తప్ప ఇతర వస్తువుల నన్నిటిని పుత్రోత్పత్తి వార్తను చెప్పిన పరిజనమునకు సంతోషముతో బహూకరించెనని భావము.

శ్లో. నివాత పద్మ స్తిమితేన చక్షుషా
నృపస్య కాంతం పిబతః సుతాననమ్,
మహోదధేః పూర ఇవేందుదర్శనాత్
గురుః ప్రహర్షః ప్రబభూవ నాత్మని. 17

వ్యాఖ్య: నివాత పద్మ స్తిమితేన - నివాత - గాలిలేని ప్రదేశము నందలి, పద్మ - కమలమువలె, స్తిమితేన - కదలిక లేని, చక్షుషా - కంటితో, కాంతం - సుందరమైన, సుతాననం - పుత్రముఖమును, పిబతః - త్రాగుచున్న (మిక్కిలి యాసక్తితో చూచుచున్న), నృపస్య - దిలీప మహారాజుయొక్క, గురుః - అత్యధిక మైన, ప్రహర్షః - సంతోషము, ఇందుదర్శనాత్ - చంద్ర దర్శనమువలన, గురుః - పెద్దదయిన, మహోదధేః పూరః ఇవ - సముద్రముయొక్క జలమువలె, ఆత్మని - తనలో, న ప్రబభూవ - నిలువలేక పోయెను. చంద్రోదయ కాలము నందు పొంగిన సముద్రజలము ఒడ్డు లొరసినట్లు, పుత్ర ముఖదర్శనము వలనఁ గలిగిన ప్రహర్షము దిలీపునిలో నిముడజాలక బహిర్గతమయ్యెను. అందఱి యెదుట తన సంతోషాతిశయమును దిలీపుఁడు వెల్లడించెనని భావము.

శ్లో. స జాతకర్మణ్యఖిలే తపస్వినా
తపోవనా దేత్య పురోధసా కృతే,

దిలీపసూను ర్మణి రాకరోద్భవః
ప్రయుక్తసంస్కార ఇవాధికం బభౌ 18

వ్యాఖ్య: సః - ఆ దిలీపసుతుఁడు, తపస్వినా - తపస్వియైన వాడును, పురోధసా - పురోహితుఁడునైన వసిష్ఠునిచేత, తపోవనాత్ - తపో వనమునుండి, ఏత్య - వచ్చి, అఖిలే - సమగ్రమైన, జాతకర్మణి - పుట్టిన శిశువునకు చేయవలసిన సంస్కారము, కృతే - చేయఁబడినదికాగా, ప్రయుక్త సంస్కారః - సాన బట్టుట మొదలయిన సంస్కారము చేయఁబడిన, ఆకరోద్భవః మణిః ఇవ - గనిలో పుట్టిన రత్నమువలె, అధికం - ఎక్కువగా, బభౌ - ప్రకాశించెను. వసిష్ఠుని మంత్ర ప్రభావమువలన శిశువు మిక్కిలి తేజస్వి యయ్యెననియు వైదిక సంస్కారము ఖనిలో పుట్టిన మణికి శాణకషణమువలె మిక్కిలి యవసరమనియు, జాతకర్మ అట్టిదనియు భావము. "ప్రాఙ్నాభివర్ధనా త్పుంసో జాతకర్మ విధీయతే" అను మనువచనమువలన మగ శిశువునకు బొడ్డు కోయకముందు చేయవలసిన వైదిక సంస్కారమునకు "జాతకర్మ" అని పేరు.

శ్లో. సుఖశ్రవా మంగళతూర్య నిస్వనాః
ప్రమోద నృత్త్యైః సహ వారయోషితామ్,
న కేవలం పద్మని మాగధీపతేః
పథి వ్యజృంభంత దివౌకసా మపి. 19

వ్యాఖ్య: సుఖశ్రవాః - వినుటకు సొంపైన, మంగళతూర్య నిస్వనాః - మంగళవాద్య ధ్వనులు, వారయోషితాం - వేశ్యలయొక్క, ప్రమోద నృత్త్యైఃసహ - ఆనంద నర్తనములతో కూడ, మాగధీపతేః - సుదక్షిణా భర్తయగు దిలీపుని యొక్క, సద్మనికేవలం - గృహమునందు మాత్రమే, న - కాదు, దివౌకసాం - దేవతలయొక్క, పథి అపి - మార్గమైన యాకాశమునందు సైతము, వ్యజృంభంత - విజృంభించెను. మంగళవాద్య ధ్వనులు రాజగృహముననేకాక, పుట్టిన బిడ్డ దేవాంశ సంభూతుఁడును, దేవతల కుపకరింపబోవు వాడును నగుటచేత దేవ దుందుభులును మ్రోగెనని భావము.

శ్లో. న సంయత స్తస్య బభూవ రక్షితుః
విసర్జయే ద్యం సుతజన్మహర్షితః,

ఋణాభిధానా త్స్వయ మేవ కేవలం
తదా పితౄణాం ముముచే స బంధనాత్. 20

వ్యాఖ్య: రక్షితుః - చక్కని పాలకుఁడైన, తస్య - ఆ దిలీపునికి, సంయతః - కారాగారబద్ధుఁడు, న బభూవ - లేకపోయెను, సుతజన్మహర్షితః - కుమారునియొక్క పుట్టుకచేత సంతోషపడిన వాఁడై, యం - ఏ బద్ధుని, విసర్జయేత్ - విడిపింపఁ దలచెనో; కనుక, సః -అతఁడు, తదా - అప్పుడు, పితౄణాం - పితృ దేవతలయొక్క, ఋణాభిధానాత్ - ఋణమను పేరుగల, బంధనాత్ - బంధనమునుండి, కేవలం స్వయమేవ - ఒక్క తాను మాత్రమే, ముముచే - విడువఁబడెను. రాజులకు కుమారోదయాది హర్షాతిరేకము కలిగినప్పుడు కారాగార బద్ధులను విడుచుట యాచారము, సత్పరిపాలకుఁడైన యతని రాజ్యమునందు దొంగతనము మొదలయినవి లేకుండుటవలన బద్ధుఁడే లేకపోయెను. కనుక ఇక తానొక్కఁడే పితౄణ బంధనమునుండి విముక్తిని గాంచెనని భావము. ఇచ్చట "ఏష వా అనృణోయః పుత్రీ" అను శ్రుతి ప్రమాణము.

శ్లో. శ్రుతస్య యాయా దయ మంత మర్భకః
తథా పరేషాం యుధి చేతి పార్థివః,
అవేత్య ధాతో ర్గమనార్థ మర్థవిత్
చకార నామ్నా రఘు మాత్మసంభవమ్. 21

వ్యాఖ్య: అర్థవిత్ - శబ్దముల యర్థము నెఱిఁగిన వాఁడైన, పార్థివః - పృథివీపతియగు దిలీపుడు, అయం అర్భకః - ఈ పిల్లవాఁడు, శ్రుతస్య - శాస్త్రముయొక్క, అంతం - పారమును, యాయాత్ - చేరుటకు శక్తుఁడగును, ఇతి - అను కారణమువలన, ధాతోః - 'లఘి' ధాతువునకుగల, గమనార్థం - గమనమను నర్థమును, అవేక్ష్య - ఎఱిఁగి, ఆత్మసంభవం - తన పుత్రుని, నామ్నా - పేరుచేత, రఘుం - రఘువునుగా (రఘు శబ్దవాచ్యునిగా) చకార - చేసెను. రఘువు అని నామకరణము చేసెననియు అది సార్థక నామధేయమనియు భావము. "అఘి వఘి లఘి గత్యర్థాః" అను పాణినీయ ధాతుపాఠమునందు చెప్పబడిన 'లఘి' ధాతువునకు గమనము అర్థము. దానికి ఉణాది సూత్రములచేత ఉత్వము, రేఫము వచ్చుటచేత 'రఘుః' అను శబ్దము సిద్ధించును. పదిరోజుల

పురుడు దాటగానే శిశువునకు నామకరణము చేయవలయునని శంఖస్మృతి చెప్పు-చున్నది. "ఆశౌచే తు వ్యతిక్రాంతే నామకర్మ విధీయతే".

శ్లో. పితుః ప్రయత్నాత్స సమగ్రసంపదః
శుభైః శరీరావయవై ర్దినేదినే,
పుపోష వృద్ధిం హరిదశ్వ దీధితే
రనుప్రవేశా దివ బాలచంద్రమాః. 22

వ్యాఖ్య: సః - ఆ రఘువు, సమగ్ర సంపదః - సంపూర్ణ సంపదలుగల, పితుః - తండ్రియొక్క, ప్రయత్నాత్ - ప్రయత్నము వలన, శుభైః - మనోహరములైన, శరీరావయవైః - శరీరముయొక్క అవయవములచేత, హరిదశ్వ దీధితేః - హరిదశ్వ - సూర్యుని యొక్క, దీధితేః - కాంతి యొక్క, అనుప్రవేశాత్ - ప్రవేశమువలన, బాలచంద్రమాః - బాలచంద్రుఁడు, ఇవ - వలె, దినేదినే - ప్రతి దినమును, వృద్ధిం - పెఱుగుదలను, పుపోష - సంతరించు-కొనెను. పోషణము వలన రఘువు చంద్రునివలె దినదినాభివృద్ధిని పొంది ముద్దులు-మూట గట్టుచుండెనని భావము.

శ్లో. ఉమావృషాంకౌ శరజన్మనా యథా
యథా జయంతేన శచీపురందరౌ,
తథా నృపః సాచ సుతేన మాగధీ
ననందతు స్తత్సదృశేన తత్సమౌ. 23

వ్యాఖ్య: ఉమా వృషాంకౌ - పార్వతీ పరమేశ్వరులు, శరజన్మనా - కుమారస్వామిచేత, యథా - ఏ విధముగా, ననందతుః - సంతోషపడిరో, శచీపురందరౌ - శచీదేవియు ఇంద్రుఁడును, జయంతేన - జయంతునిచేత, యథా - ఏ విధముగా, ననందతుః - సంతోషపడిరో, తథా - అదేవిధముగా, తత్సమౌ - ఆ పార్వతీ పరమేశ్వర, శచీ పురందరులతో సమానులైన, సా మాగధీ - ఆ మగధరాజపుత్రియగు సుదక్షిణయు, నృపశ్చ - దిలీపుడును, తత్సదృశేన - ఆ షణ్ముఖ జయంతులతో సమానుఁడైన, సుతేన - కుమారుఁడైన రఘువుచేత, ననందతుః - సంతోషపడిరి.

శ్లో. రథాంగనామ్నో రివ భావబంధనం
బభూవ యత్ప్రేమ పరస్పరాశ్రయమ్,
విభక్త మప్యేకసుతేన తత్తయోః
పరస్పరస్యోపరి పర్యచీయత. 24

వ్యాఖ్య: రథాంగనామ్నోః ఇవ - చక్రవాకముల జంటకువలె, తయోః - ఆ సుదక్షిణా దిలీపులకు, భావబంధనం - హృదయాకర్షకమైన, పరస్పరాశ్రయమ్ - ఒండొరుల నాశ్రయించిన, యత్ప్రేమ - ఏ ప్రేమ, బభూవ - ఉండెనో, తత్ - ఆ ప్రేమ, ఏకసుతేన - ఒకే కుమారునిచేత, విభక్తమపి - విభజింపఁబడినను, పరస్పరస్య ఉపరి - ఒకరిమీద నొకరికి, పర్యచీయత - ఎక్కువగా వృద్ధిచెందెను. జలాదిరూపమైన ఒకానొక వస్తువు ఒక యాధారమునందు (పాత్రయందు) ఉంచబడినప్పుడున్న కొలతను, రెండు పాత్రములందు పంచినప్పుడు కోల్పోవును. అట్లే యా దంపతుల కొకరిపై నొకరికిఁగల ప్రేమ విభక్తమై కుమారునియందుఁ బ్రవేశించినది కనుక తగ్గవలెను. కాని అట్లు తగ్గక యింకను వృద్ధిచెందినది. ఇది చమత్కారము. అనగా "నీవలన నాకింత చక్కని కుమారుఁడు కలిగెఁగదా!" యని దిలీపుడును, అట్టి భావముతోనే సుదక్షిణయు, కృతజ్ఞతాపూర్వకమును, పుత్రదర్శనోద్దీపితమును నగు ప్రేమను పరస్పరము పెంచుకొని యానందించిరని తాత్పర్యము.

శ్లో. ఉవాచ ధాత్ర్యా ప్రథమోదితం వచో
యయౌ తదీయా మవలంబ్య చాంగులిమ్,
అభూచ్చ నమ్రః ప్రణిపాతశిక్షయా
పితు ర్ముదం తేన తతాన సోఽర్భకః. 25

వ్యాఖ్య: సః అర్భకః - ఆశిశువు, ధాత్ర్యా -దాదిచేత, ప్రథమోదితం - మొదట పలికింపఁబడిన, వచః - మాటను, ఉవాచ - పలికెను, తదీయాం - ఆదాదిదియైన, అంగులిం - వ్రేలిని, అవలంబ్య - పట్టుకొని, యయౌచ - నడచెనుగూడ, ప్రణిపాత శిక్షయా - ప్రణిపాత - నమస్కారము యొక్క, శిక్షయా - నేర్పుటచేత, నమ్రః - నమస్కరించు వాఁడు, అభూచ్చ - అయ్యెనుగూడ, తేన - ఇట్టి యభివృద్ధిచేత, పితుః - తండ్రికి, ముదం - సంతోషమును, తతాన -

ఎక్కువచేసెను, ఆ పిల్లవాడు దాది పలికించిన మాటలు పలుకుచును, ఆమె వ్రేలు పట్టుకొని నడచుచును, పెద్దలకు నమస్కరించుచును దిలీపునికి మిక్కిలి సంతోషమును గూర్చెనని భావము.

శ్లో. త మంక మారోప్య శరీరయోగజైః
సుఖై ర్నిషించంత మివామృతం త్వచి,
ఉపాంత సంమీలిత లోచనో నృపః
చిరాత్ సుతస్పర్శ రసజ్ఞతాం యయౌ. 26

వ్యాఖ్య: శరీరయోగజైః - శరీర స్పర్శవలన కలిగిన, సుఖైః - సుఖములచేత, త్వచి - చర్మేంద్రియమునందు, అమృతం - అమృతమును, నిషించంతంఇవ - చిలుకరించుచున్నట్లున్న, తం - ఆ పుత్రుని, అంకం - తొడను, ఆరోప్య - ఎక్కించుకొని (తొడమీద నెక్కించుకొని), ఉపాంత సమ్మీలిత లోచనః - ఉపాంత - తుదితెప్పలచేత, సమ్మీలిత - మూయబడిన, లోచనః - కన్నులుగల వాఁడగుచు, నృపః - దిలీపుఁడు, చిరాత్ - చాలాసేపు, సుతస్పర్శ రసజ్ఞతాం - పుత్రస్పర్శ రసాస్వాదమును, యయౌ - పొందెను. 'చిరాత్' అను పదమునకు బహుకాలమునకు అని యర్థము చెప్పినచో, దిలీపునికి బహుకాలమునకు సంతానము కలిగినది కనుక యింతకాలమునకు పుత్రగాత్ర పరిష్వంగ సుఖమెట్టిదో తెలిసి యానందరస నిమగ్నుఁడయ్యెనను భావముగూడ సిద్ధించును.

శ్లో. అమంస్త చానేన పరార్ధ్య జన్మనా
స్థితే రభేత్తా స్థితిమంత మన్వయమ్,
స్వమూర్తిభేదేన గుణాగ్ర్యవర్తినా
పతిః ప్రజానా మివ సర్గ మాత్మనః. 27

వ్యాఖ్య: స్థితేః అభేత్తా - మర్యాదాపాలకుఁడైన - ఆ దిలీపుఁడు, పరార్ధ్య జన్మనా - ఉత్కృష్టమైన జన్మముగల, అనేన - ఈ రఘువుచేత, అన్వయం - వంశము, ప్రజానాం పతిః - బ్రహ్మ. గుణాగ్ర్యవర్తినా - గుణ - సత్త్వరజస్తమో గుణములలో, అగ్ర్య - మొదటిదియైన సత్వ గుణముచేత, వర్తినా - నడచునట్టి, స్వమూర్తిభేదేన - తన యవతారమైన విష్ణువుచేత, ఆత్మనః - తన

యొక్క, సర్గంఇవ - సృష్టినివలె, స్థితిమంతం - ప్రతిష్ఠావంతమైన దానినిగా, అమంస్త - తలచెను (తన వంశము నిలచినట్లు భావించెను). సృష్టికర్త తన సృష్టిలో సత్వగుణ ప్రధానమైన విష్ణురూపమున తానే యవతరించుటచేత సృష్టి మర్యాద ప్రతిష్ఠావంతమైనట్లు భావించినరీతిగా, దిలీపుఁ డుత్తమోత్తమ జన్మగల యా పుత్రునిచేత తన వంశమర్యాద సుస్థిరమైనట్లు భావించెనని యభిప్రాయము.

శ్లో. స వృత్తచూల శ్చలకాకపక్షకై
రమాత్యపుత్రైః సవయోభి రన్వితః,
లిపే ర్యథావద్గ్రహణేవ వాఙ్మయం
నదీముఖేనేవ సముద్ర మావిశత్. 28

వ్యాఖ్య: వృత్తచూలః - కడచిన చూడాకర్మగల (పుట్టువెంట్రుకలు తీసి జుట్టు పెట్టఁబడిన) సః - ఆ రఘువు, చలకాకపక్షకైః - కదలి యాడుచున్న పిల్లజుట్లు కలవారును, సవయోభిః - స్నేహితులునగు, అమాత్య పుత్రైః - మంత్రుల కుమారులతో, అన్వితఃసన్ - కలిసినవాఁడగుచు, లిపేః - ఏబదిసంఖ్య గల అకారాదిక్షకారాంత వర్ణములయొక్క, యథావద్గ్రహణేన - ఉన్నది యున్నట్లు గ్రహించుటచేత, వాఙ్మయం - శబ్దజాతమును, నదీముఖేన ఇవ - నదీద్వారమున, సముద్రమివ - సముద్రమునువలె, ఆవిశత్ - ప్రవేశించెను. మొసలి మొదలగు జంతువులు నదిద్వారా సముద్రమునందు ప్రవేశించినట్లు రఘువు పంచాశద్వర్ణాత్మిక యైన మాతృకద్వారా వాఙ్మయ సముద్రమున సులభముగాఁ బ్రవేశించెను. వర్ణ మాలను నేర్చుకొని విద్యలో ప్రవేశించెనని భావము.

శ్లో. అథోపనీతం విధివ ద్విపశ్చితో
వినిన్యు రేనం గురవో గురుప్రియమ్,
అవంధ్యయత్నాశ్చ బభూవు రత్ర తే
క్రియా హి వస్తూపహితా ప్రసీదతి. 29

వ్యాఖ్య: అథ - అనంతరము (మనుప్రోక్తమైన గర్భైకాదశ వత్సరము నందు - పదకొండవయేట) విధివత్ - శాస్త్ర ప్రకారముగా, ఉపనీతం - ఉపనయ నము చేయఁబడి నట్టియు, గురుప్రియం - గురువులకు ప్రేమ పాత్రుఁడు నగు,

ఏనం - ఈ రఘువును, విపశ్చితః - విద్వాంసులగు, గురవః - గురువులు. వినిన్యుః - శిక్షించిరి (విద్యల నభ్యసింపఁ జేసిరి). తే - ఆ గురువులు, అత్ర - ఈ రఘువునందు, అవంధ్య యత్నాశ్చ - సఫల ప్రయత్నము గలవారును, బభూవుః - అయిరి ; హి - అదియట్లే యగును, క్రియా - విద్యా శిక్షణము, వస్తూపహితా - వస్తు - అర్హుఁడగు విద్యార్థియందు, ఉపహితా - ప్రయోగింపఁబడినదియై, ప్రసీదతి - ఫలించును. రఘు కుమారునికి గురువులు బోధించిన విద్యలు చక్కఁగా వచ్చుచుండెను. వారు సఫలప్రయత్నులగుచుండిరి. ఇచ్చట క్రియా శబ్దమునకు 'శిక్ష' అర్థము, "క్రియాహి ద్రవ్యం వినయతి నా ద్రవ్యమ్" అని కౌటిల్యార్థ శాస్త్రము. చదువు వచ్చుటకు స్వభావసిద్ధమైన పాత్రతకావలయునని కౌటిల్యమతము.

శ్లో. ధియః సమగ్రైః స గుణై రుదారధీః
క్రమా చ్చతస్ర శ్చతురర్ణ వోపమాః,
తతార విద్యాః పవనాతిపాతిభి
ర్దిశో హరిద్భి ర్హరితా మివేశ్వరః. 30

వ్యాఖ్య : ఉదారధీః - ఉత్కృష్టబుద్ధిగల, సః - ఆ రఘువు, సమగ్రైః - సంపూర్ణములైన, ధియఃగుణైః - బుద్ధియొక్క గుణములచేత, చతురర్ణవోపమాః - నాలుగు సముద్రములతో సమానమగు, చతస్రః - నాలుగైన, విద్యాః - "ఆన్వీక్షకీ, త్రయీ, వార్తా, దండనీతి" యను విద్యలను, హరితాం - దిక్కులకు, ఈశ్వరః - ప్రభువైన సూర్యుఁడు, పవనాతిపాతిభిః - గాలికన్నను ముందు పరుగెత్తునట్టి, హరిద్భిః - తన గుఱ్ఱముల చేత, చతస్రః దిశఃఇవ - నాలుగు దిక్కులనువలె, క్రమాత్ - వరుసగా, తతార - దాటెను (నేర్చెనని యర్థము). రఘు కుమారుడు, శుశ్రూష, శ్రవణం, గ్రహణం, ఊహాపోహలు, అర్థవిజ్ఞానము, తత్త్వజ్ఞానము అను ధీగుణములు కలవాఁడై వానిచేత సముద్రోపమానములైన చతుర్విద్యలను, సూర్యుఁ డతివేగముగల తన గుఱ్ఱములచేత సువిశాలములైన దిక్కుల నధిగమించిన ట్లధిగమించెనని భావము.

శ్లో. త్వచం స మేధ్యాం పరిధాయ రౌరవీం
అశిక్షతాస్త్రం పితు రేవ మంత్రవత్,

న కేవలం తద్గురు రేకపార్థివః
క్షితావభూ దేక ధనుర్ధరోఽపి సః. 31

వ్యాఖ్య : సః - ఆ రఘువు, మేధ్యాం - పరిశుద్ధమైనదియు, రౌరవం - మహాకృష్ణ మృగమునకు సంబంధించిన (నల్లని మగజింకదియగు) త్వచం - చర్మమును, పరిధాయ - ధరించి, మంత్రవత్ - సమంత్రకమైన, అస్త్రం - ఆగ్నేయాది అస్త్రజాతమును, పితుఃఏవ - తండ్రి వలననే, అశిక్షత - నేర్చుకొనెను: తద్గురుః - అతని తండ్రియైన దిలీపుఁడు, ఏకపార్థివః కేవలం - ఏక - అద్వితీయుఁడైన, పార్థివః కేవలం - రాజుమాత్రమే, న - కాదు, క్షితౌ - భూమిమీద, సః - అతఁడు, ఏక ధనుర్ధరః అపి - అద్వితీయుఁడైన విలుకాడును, అభూత్ - అయియుండెను. దిలీపుఁడు అద్వితీయుఁడైన చక్రవర్తియే కాక అసాధారణ ధనుర్ధరుఁడు నగుటచేత నతనివద్దనే రఘువు శస్త్రాస్త్ర విద్యలను నేర్చెనని భావము. బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య బ్రహ్మచారులు క్రమముగా కృష్ణాజిన, రౌరవాజిన, మేషచర్మములను ధరింప వలయుననియు, శణక్షౌమాది వస్త్రములను (నారబట్టలను, పట్టువస్త్రములను) సైతము ధరింపవచ్చుననియు మనువుచెప్పెను.

శ్లో. మహోక్షతాం వత్సతరః స్పృశన్నివ
ద్విపేంద్రభావం కలభః శ్రయన్నివ,
రఘుః క్రమాత్ యౌవనభిన్న శైశవః
పుపోష గాంభీర్యమనోహరం వపుః. 32

వ్యాఖ్య : రఘుః - రఘువు, క్రమాత్ - వరుసగా, యౌవనభిన్న శైశవః సన్ - యౌవన - పడుచుదనముచేత, భిన్న - తొలగింపఁబడిన, శైశవః సన్ - శిశుత్వము గలవాఁడగుచు, మహోక్షభావం మహావృషభత్వమును, స్పృశన్ - తాకుచున్న (పొందుచున్న), వత్సతరఃఇవ - కోడెదూడవలెను, ద్విపేంద్రభావం - మహాగజత్వమును, శ్రయన్ - ఆశ్రయించుచున్న, కలభః ఇవ - ఏనుగుపిల్లవలెను, గాంభీర్యేణ - లోతైన హృదయముచేత, మనోహరం - అందమైన, వపుః - దేహమును, పుపోష - పెంచెను. రఘువుదేహము, బాల్యమునుండి తారుణ్యమునందు ప్రవేశించెనని భావము.

శ్లో. అథాస్య గోదానవిధే రసంతరం
వివాహదీక్షాం నిరవర్తయ ద్గురుః,
నరేంద్రకన్యా స్త మవాప్య సత్పతిం
తమోనుదం దక్షసుతా ఇవాబభుః. 33

వ్యాఖ్య: అథ - అనంతరము, గురుః - తండ్రి, అస్య - ఈ రఘువునకు, గోదానవిధేః - కేశాంతమను సంస్కారముయొక్క, అనంతరం - తరువాత, వివాహదీక్షాం - వివాహదీక్షను, నిరవర్తయత్ - జరిపించెను, అథ - ఆ తరువాత, నరేంద్రకన్యాః - రాజకన్యకలు, తం - ఆ రఘువును, దక్షసుతాః - దక్షప్రజాపతి కుమార్తెలైన రోహిణి మొదలగువారు, తమోనుదం ఇవ - చంద్రునిని వలె, సత్పతిం - మంచి మగనిని, అవాప్య - పొంది, అబభుః - చక్కగా ప్రకాశించిరి. "రాజానో బహువల్లభాః" అను న్యాయమున నతని కనేక కన్యలతో వివాహము జరిగెనని భావము. 'గావో లోమాని కేశాదీయంతే ఖండ్యంతే అస్మిన్ ఇతి గోదానం' గౌః (గో) అను శబ్దము పుంలింగమైనప్పుడు సూర్యుఁడు, వృషభము, ఒకానొకక్రతువు (గోదానం), ఋషి అని యర్థములు. స్త్రీ లింగమైనప్పుడు దిక్కు, భారతి, భూమి, కామధేనువు అని యర్థములు. 'గో' శబ్ద ముభయలింగమైనప్పుడు స్వర్గము, వజ్రము, జలము, కిరణము, చూపు, బాణము, కేశము (వెంట్రుక) అర్థములని కేశవనిఘంటువు. ఈ గోదానకర్మ బ్రాహ్మణునికి పదహారవ సంవత్సరము నందును, క్షత్రియునికి ఇరువది రెండవ సంవత్సరమునందును జరుగవలెనని మనువు చెప్పెను. 'తమోనుదం'అనుపదము రఘువునకుఁ గూడ నన్వయించును. తన యజ్ఞానమును (తమస్సును) విద్యలచేత పోగొట్టుకున్నట్టి వాఁడని యర్థము.

శ్లో. యువా యుగవ్యాయత బాహు రంసలః
కవాటవక్షాః పరిణద్ధ కంధరః,
వపుః ప్రకర్షా దజయ ద్గురుం రఘు
స్తథాపి నీచై ర్వినయా దదృశ్యత. 34

వ్యాఖ్య: ఇఁక రఘువుయొక్క యౌవరాజ్య యోగ్యతను గురించిన వర్ణనము: యువా - యువకుండును, యుగవ్యాయత బాహుః - యుగ - కాడిమ్రాను

వలె, వ్యాయత - సుదీర్ఘములైన, (ఎత్తైన భుజములు గలవాఁడు), కవాటవక్షాః - తలుపులవంటి విశాలమైన వక్షస్థలము గలవాఁడును, పరిణద్ధ కంధరః - విశాలమైన మెడ కలవాఁడును అగు, రఘుః - రఘువు, వపుఃప్రకర్షాత్ - శరీరాధిక్యము వలన, గురుం - తండ్రిని, అజయత్ - జయించెను, తథాపి - అట్లయ్యును, వినయాత్ - నమ్రతవలన, నీచైః - చిన్నవాఁడుగా, అదృశ్యత - కనఁబడెను. యౌవన మద విలసితుఁడై యుండెననియు, దీర్ఘ బాహువులతోను, విశాలమైన వక్షస్థలముతోను, గాంభీర్యముతోను చూడముచ్చటగా నుండెనని భావము.

శ్లో. తతః ప్రజానాం చిర మాత్మనా ధృతాం
నితాంతగుర్వీం లఘయిష్యతా ధురం,
నిసర్గ సంస్కారవినీత ఇత్యసౌ
నృపేణ చక్రే యువరాజ శబ్దభాక్. 35

వ్యాఖ్య: తతః - తరువాత, ఆత్మనా - తనచేత, చిరం - బహుకాలము, ధృతాం - ధరింపఁబడినదియు, నితాంతగుర్వీం - మిక్కిలి బరువైనదియు నగు, ప్రజానాం - ప్రజలయొక్క, ధురం - భారమును (ప్రజాపాలన భారమును), లఘయిష్యతా - చులకనచేసుకోఁ దలచుచున్న, నృపేణ - డిలీప మహారాజుచేత, అసౌ - ఈ రఘువు, నిసర్గ సంస్కారవినీతః - నిసర్గ - స్వభావముచేతను, సంస్కార - శాస్త్రజనిత వాసనచేతను, వినీతః - నమ్రుఁడు, ఇతి - ఇట్లని, యువరాజ శబ్దభాక్ - యువరాజ శబ్దవాచ్యుడుగా, చక్రే - చేయఁబడెను. దిలీపుఁడు రఘువును యువరాజుగాఁజేసి తన భారమును తగ్గించుకొనఁ దలఁచినవాఁడై యతనికి యౌవరాజ్య పట్టాభిషేకమును జేసెను. వినయము : 'స్వాభావికము, కల్పితము' అని రెండువిధములు. రఘువు ఉభయ సంపన్నుఁడు కనుక "వినీత మౌరసం పుత్రం యౌవరాజ్యేఽభిషేచయేత్" అను కామందక వచనానుసారముగా రఘువును యువరాజునుగాఁ జేసెనని భావము.

శ్లో. నరేంద్ర మూలాయతనా దనంతరం
తదాస్పదం శ్రీ ర్యువరాజ సంజ్ఞితమ్,
అగచ్ఛ దంశేన గుణాభిలాషిణీ
నవావతారం కమలాది వోత్పలమ్. 36

వ్యాఖ్య : గుణాభిలాషిణీ - గుణములను అభిలషించునట్టి, శ్రీః - రాజ్య లక్ష్మి (పద్మముల నాశ్రయించు కాంత్యధిదేవతయు), నరేంద్రమూలాయతనాత్ - నరేంద్ర - దిలీపుఁడను, మూలాయతనాత్ - ప్రధాన స్థానమునుండి, అనంతరం - సన్నిహితమును, యువరాజ సంజ్ఞితం - యువరాజను పేరుగలదియు నగు, తదా స్పదం - ఆ రఘువు అనెడు తనస్థానమును, కమలాత్ - బహుకాలముక్రింద పుట్టిన కమలమునుండి, నవావతారం - క్రొత్తగా ఉదయించిన, ఉత్పలమివ - కలువనువలె, అంశేన - భాగముచేత, అగచ్ఛత్ - చేరెను. పగటి వేళయందు కమలమునందుండి యుండి విసిగిన పద్మశ్రీ సాయంత్రమునందు క్రొత్తగా విచ్చిన కలువయందు మక్కువను జూపినట్లు, దిలీపునియందుఁ జిరకాలము వసించిన రాజ్య లక్ష్మి యువకుడైన రఘువును మక్కువతోఁ జేరెనని యభిప్రాయము. స్త్రీలు సహజముగా యువకునియం దనురక్త లగుదురుగదా! కమలమునుండి యుత్పల మును పద్మశ్రీ చేరినట్లు చెప్పిన యుపమానమువలన దిలీపుడు సూర్యునివంటి వాఁడనియు, రఘువు చంద్రునివంటి వాఁడనియు, చంద్రోదయ సమయమునకు సూర్యుఁడు వృద్ధుఁడయ్యెననియు, 'అంశేన' అనుటచేత సూర్యాంశ చంద్రునిలో నుండుటచేత రాజ్యలక్ష్మి అవ్యభిచారిణి యనియు ధ్వనింపుచున్నది. కాళిదాసు చెప్పు నట్టి ఉపమానము ఉపమేయమున కెంతటి యాధిక్యమును జేకూర్చవలయునో యంతటి యాధిక్యమును జేకూర్చును. కనుకనే 'ఉపమా కాళిదాసస్య' అన్నారు విజ్ఞులు.

శ్లో. విభావసుః సారథినేవ వాయునా
ఘన వ్యపాయేన గభస్తిమా నివ
బభూవ తేనా తితరాం సుదుస్సహః
కటప్రభేదేన కరీవ పార్థివః. 37

వ్యాఖ్య : సారథినా - సహాయభూతుఁడైన, వాయునా - వాయువుచేత, విభావసుః ఇవ - అగ్నివలెను, ఘన వ్యపాయేన - శరత్సమయముచేత (ఘన - మేఘము, దాని వ్యపాయము వినాశము. మేఘములు తొలఁగి పోవుటయే శరత్తు) గభస్తిమాన్ ఇవ - సూర్యునివలెను, కటప్రభేదేన - గండస్థలము పగిలి మదము స్రవించుటచేత, కరీఇవ - ఏనుగువలెను, పార్థివః - రాజు (దిలీపుడు) తేన - సహాయభూతుఁడైన ఆ రఘువుచేత, అతితరాం - ఎక్కువగా, సుదుస్సహః -

సహనశీలుఁడు, బభూవ - అయ్యెను. యువరాజైన రఘువు తోడ్పడుచుండుట చేత ప్రజాపాలనాది క్లేశమును దిలీపుఁడు సులభముగా సహించుచు హాయిగా నుండెనని భావము.

శ్లో. నియుజ్య తం హోమతురంగ రక్షణే
ధనుర్ధరం రాజసుతై రనుద్రుతమ్,
అపూర్ణ మేకేన శతక్రతూపమః
శతం క్రతూనా మపవిఘ్న మాప సః. 38

వ్యాఖ్య : శతక్రతూపమః - ఇంద్రుడు ఉపమానముగాఁ గల, సః - ఆ దిలీపుడు, రాజసుతైః - పెక్కు రాజకుమారులచేత, అనుద్రుతం - వెంబడింపం బడినవాఁడును, ధనుర్ధరం - ధానుష్కుఁడునైన, తం - ఆ రఘువును, హోమ తురంగ రక్షణే - యజ్ఞాశ్వ రక్షణమునందు, నియుజ్య - నియోగించి, ఏకేన - ఒకే అశ్వమేధముచేత మాత్రమే, అపూర్ణం - తక్కువగానున్న, క్రతూనాం - అశ్వమేధయాగము యొక్క, శతం - నూరింటిని, అపవిఘ్నం - విఘ్నములు తొలఁగునట్లుగా, ఆప - పొందెను. రఘువు యాగాశ్వములను వెంబడించి దిగ్విజయమును సాధింపఁగా, దిలీపుఁడు తొంబది తొమ్మిది అశ్వమేధ యాగములను పూర్తి చేసెనని భావము. "శతం వై తల్ప్యా రాజపుత్రా దేవా ఆశాపాలాః" అను శ్రుతి ననుసరించి రఘు సహాయార్థము రాజపుత్రశతమును బంపెను.

శ్లో. తతః పరం తేన మఖాయ యజ్వనా
తురంగ ముత్సృష్ట మనర్గలం పునః,
ధనుర్భృతా మగ్రత ఏవ రక్షిణాం
జహార శక్రః కిల గూఢవిగ్రహః. 39

వ్యాఖ్య : తతఃపరం - తొంబది తొమ్మిది క్రతువులు చేసిన పిమ్మట; యజ్వనా - యజ్ఞకర్తయైన, తేన - ఆ దిలీపునిచేత, పునః - మరల, మఖాయ - యాగము చేయుటకొఱకు, ఉత్సృష్టం - విడువబడినదియు, అనర్గలం - అవ్యాహతమైన స్వేచ్ఛా గమనముగల, తురంగం - గుఱ్ఱమును, ధనుర్భృతాం, రక్షిణాం - దానిని రక్షించుచున్న విలుకాండ్రయొక్క, అగ్రతః ఏవ - ఎదుటనే,

శక్రః - ఇంద్రుఁడు, గూఢ విగ్రహః - కనఁబడని శరీరము గలవాఁడగుచు జహార కిల - అపహరించెనట! శతతమాశ్వమేధమునకై విడువఁబడిన గుఱ్ఱమును రక్షకుల యెదుటనే ఇంద్రుఁడు గూఢముగా నపహరించెను. "అపర్యావర్తయంతోఽశ్వ మనుచరంతి" అను ఆపస్తంబ స్మృతివలన యాగాశ్వము, దాని యిష్టమువచ్చిన రీతిగా ముందునకు వెళ్లుచుండగా రక్షకులు దానివెంట వెళ్లవలసినదే కాని, దానిని యిటునటు మఱలపరాదు కనుక నది యనర్గలముగా వెళ్లుచుండినది.

శ్లో. విషాద లుప్త ప్రతిపత్తి విస్మితం
కుమారసైన్యం సపది స్థితంచ తత్,
వసిష్ఠ ధేనుశ్చ యదృచ్ఛ యాగతా
శ్రుతప్రభావా దదృశేఽథ నందినీ. 40

వ్యాఖ్య: తత్ - ఆ రఘువునకు సంబంధించిన, సైన్యం - సైన్యము, సపది - ఆక్షణమునందు, విషాదలుప్త ప్రతిపత్తి - విషాద - మనోభంగ రూపమైన దుఃఖముచేత, లుప్త - లోపించిన, ప్రతిపత్తి - కర్తవ్య జ్ఞానము గలదియై (ఏమియుఁ దోచనిదియై), విస్మితం - ఆకస్మికమైన అశ్వనాశమున కాశ్చర్యము గలదియగుచు, స్థితం - నిలచిపోయినది, అథ - తరువాత, శ్రుతప్రభావా - ప్రసిద్ధ ప్రభావముగలదియు, యదృచ్ఛయా - స్వేచ్ఛచేత, ఆగతా - వచ్చినదియు, నందినీ - నందినియను పేరుగల, వసిష్ఠధేనుశ్చ - వసిష్ఠుని గోవు, దదృశే - కనఁబడెను. గుఱ్ఱము ఉన్నదున్నట్లు మాయమగుటచేత రఘువు, అతని సైన్యమును ఆశ్చర్య చకితులైరి. ఇంతలో నక్కడ నందినీ ధేనువు సాక్షాత్కరించెను. రెండు 'చ' కారములు, సైన్యము స్తబ్ధమగుటయు, నందినీ ధేనువు సాక్షాత్కరించుటయు అవిలంబముగా జరిగినవి అని తెలుపుటకు ప్రయోగింపబడినవి. రఘువు తన యనుగ్రహము వలన పుట్టినవాడు కనుక సహాయపడుటకు నందిని వచ్చెను.

శ్లో. తదంగ నిష్యంద జలేన లోచనే
ప్రమృజ్య పుణ్యేన పురస్కృతః సతామ్,
అతీంద్రియేష్వ ప్యుపపన్న దర్శనో
బభూవ భావేషు దిలీప నందనః. 41

వ్యాఖ్య: సతాం - సత్పురుషులకు, పురస్కృతః - ముందున్న వాఁడైన, (సత్పురుషాగ్రగణియైన అని యర్థము), దిలీప నందనః - రఘురాజు, పుణ్యేన - పవిత్రమైన. తదంగ నిష్యందజలేన - తత్ - ఆ నందినీ ధేనువుయొక్క, అంగ - శరీరమునుండి, నిష్యంద - స్రవించిన - జలేన - జలముచేత (ఆ నందినీ ధేనువు యొక్క మూత్రముచేత), లోచనే - కన్నులను, ప్రమృజ్య - తుడుచుకొని, అతీంద్రియేషు - నేత్రాదులైన యింద్రియములకు గోచరింపని, భావేషు, అపి - వస్తువులయందు సైతము, ఉపపన్న దర్శనః - సంభవించిన సాక్షాత్కార శక్తిగలవాఁడు (ఇతరుల దృష్టికి కనపడని వస్తువులను జూడగల శక్తి గలవాఁడు)- బభూవ - అయ్యెను. అట్లువచ్చిన నందినీధేనువు మూత్రముచేత కన్నులు తుడుచుకొనగా రఘువునకు అందఱికిఁ గనపడని వస్తువులను తాను చూడఁగల శక్తి వచ్చెను.

శ్లో॥ స పూర్వతః పర్వతపక్ష శాసనం
దదర్శ దేవం నరదేవ సంభవః,
పునఃపునః సూత నిషిద్ధ చాపలం
హరంత మశ్వం రథరశ్మి సంయతమ్. 42

వ్యాఖ్య: నరదేవ సంభవః - రాజకుమారుఁడైన, సః - ఆ రఘువు, పునః పునః - మాటిమాటికిని, సూత నిషిద్ధచాపలం - సూత - సారథిచేత, నిషిద్ధ - నివారింపబడిన, చాపలం - ఔద్ధత్యము గలదియు (ఇటునటు లాగుచు నెగిసిపోఁబోవుచున్నట్టిదియు), రథరశ్మి సంయతం - రథముయొక్క పగ్గములచేత కట్టివేయబడినదియు నగు, అశ్వం - గుఱ్ఱమును, హరంతం - అపహరించుక పోవుచున్న, పర్వత పక్షశాతనం - పర్వత - పర్వతములయొక్క, పక్ష - ఱెక్కలను, శాతనం - నఱికి వేయునట్టి, దేవం - దేవతా రూపుఁడగు పురుషుని (ఇంద్రునిని) పూర్వతః - తూర్పుదిక్కునందు, దదర్శ - చూచెను. యాగాశ్వము మొండికెత్తి యెగురుచున్నను దానిని రథమునకు గట్టించి యపహరించుక పోవుచున్న యింద్రుఁడు తూర్పుదిశయందు రఘువునకుఁ గానవచ్చెను,

శ్లో॥ శతైస్తమక్ష్ణా మనిమేషవృత్తిభిః
హరిం విదిత్వా హరిభిశ్చ వాజిభిః,

అవోచ దేనం గగనస్పృశా రఘుః
స్వరేణ ధీరేణ నివర్తయన్నివ. 43

వ్యాఖ్య: రఘుః - రఘుమహారాజు, తం - గుఱ్ఱము నపహరించుకొని పోవుచున్న యాతనిని, అనిమేష వృత్తిభిః - ఱెప్పలు వ్రాల్చకుండునవి యైన, అక్ష్ణాం,శతైః - కన్నులయొక్క శతములచేతను (సహస్ర నేత్రములచేత), హరిభిః - ఆకుపచ్చని రంగుగలవియైన, వాజిభిశ్చ - గుఱ్ఱముల చేతను, హరిం - ఇంద్రునిగా, విదిత్వా - తెలిసికొని, ఏనం - కనబడుచున్న ఆ యింద్రుని, గగనస్పృశా - ఆకాశమును తాకునదియు, ధీరేణ - గంభీరమైనదియు నగు, స్వరేణ ఏవ - ధ్వనిచేతనే, నివర్తయన్ ఇవ - వెనుకకు మరలించుచున్న వాఁడువలె, అవోచత్ - పలికెను (ఉచ్చైః స్వరముతో పలికెనని యర్థము) రఘువు సహస్ర నేత్ర హరిదశ్వాది చిహ్నములచేత యింద్రుని గుర్తించి పెద్దగా నరచుచు పలికెనని భావము.

శ్లో. మఖాంశభాజాం ప్రథమో మనీషిభి
స్త్వమేవ దేవేంద్ర! సదా నిగద్యసే,
అజస్ర దీక్షాప్రయతస్య మద్గురోః
క్రియావిఘాతాయ కథం ప్రవర్తసే? 44

వ్యాఖ్య: హే దేవేంద్ర - ఓ దేవేంద్రుడా! మనీషిభిః - విద్వాంసులచేత, త్వమేవ - నీ వొకండవే, మఖాంశభుజాం - యజ్ఞ భాగములను అనుభవించు వారిలో, ప్రథమః - మొదటివాఁడవుగా, సదా - ఎల్లప్పుడును, నిగద్యసే - చెప్పఁబడుచుందువు, (తథాపి - అట్లయ్యును) అజస్రదీక్షా ప్రయతస్య - అజస్ర - నిత్యమును, దీక్షా - యజ్ఞదీక్షయందు, ప్రయతస్య - నియమితుఁడైన, మద్గురోః - మా తండ్రియొక్క, క్రియా విఘాతాయ - క్రతు వినాశమును చేయుటకు, కథం - ఎట్లు, ప్రవర్తసే - పూనుకొనుచున్నావు? ఓ దేవేంద్రా! నీవు యజ్ఞభోక్తవు, యజ్ఞమునందలి హవిర్భాగమును ప్రప్రథమము స్వీకరించునట్టి నీవు నిరంతరముగా యజ్ఞదీక్షితుఁడై యున్న మా తండ్రియాగమునే యేల భంగపరచ దలఁచితివి? అది నీకే నష్టముకదా! అని ప్రశ్నించెను.

శ్లో. త్రిలోకనాథేన సదా మఖద్విషః
త్వయా నియమ్యా నను దివ్యచక్షుషా

స చేత్స్వయం కర్మసు ధర్మచారిణాం
త్వ మంతరాయో భవసి చ్యుతో విధిః. 45

వ్యాఖ్య: త్రిలోకనాథేన - ముల్లోకములకును ప్రభుఁడ వైనట్టియు, దివ్య చక్షుషా - అతీంద్రియ వస్తుదర్శనము చేయఁగల వాఁడవునైన, త్వయా - నీ చేత, మఖద్విషః - క్రతు విఘాతకులు, సదా - ఎల్లప్పుడును, నియమ్యాఃనను - శిక్షింపఁ దగిన వారుకదా! సః త్వం - అట్టినీవు, ధర్మచారిణాం - ధర్మము నాచరించువారి యొక్క, కర్మసు - క్రతువులయందు, స్వయం - స్వయముగా (నీవే), అంతరాయం - విఘ్నము, భవసిచేత్ - అగుదువేని, విధిః - అనుష్ఠానము, చ్యుతః - నష్టమైనట్టిదే. త్రిలోకనాథుఁడవైన నీవు యజ్ఞవిఘాతకులను శిక్షింప వలసిన వాఁడవు. అట్టినీవే యజ్ఞాచరణమునకు విఘ్నమును జేతువేని లోకమునందు సత్కార్మయే నశించిపోవునని యనెను.

శ్లో. త దంగ మగ్ర్యం మఘవన్! మహాక్రతో
రముం తురంగం ప్రతిమోక్తు మర్హసి,
పథః శ్రుతే ర్దర్శయితార ఈశ్వరా
మలీమసా మాదదతే న పద్ధతిమ్. 46

వ్యాఖ్య: హేమఘవన్ - ఓ యింద్రుఁడా! తత్ - పైఁజెప్పిన కారణము వలన, మహాక్రతోః - అశ్వమేధ యాగమునకు, అగ్ర్యం - ప్రప్రథమమైన, అంగం - సాధనమగు, అముంతురంగం - ఈ గుఱ్ఱమును, ప్రతిమోక్తుం - వెనుకకు విడుచుటకు (తిరిగి నాకిచ్చివేయుటకు), అర్హసి - తగుదువు, (ఎందుకనగా) శ్రుతేః - వేదముయొక్క, పథః - మార్గములను, దర్శయితారః - చూపించువారగు (సన్మార్గదర్శకులైన) ఈశ్వరాః - గొప్పవారు, మలీమసాం - మలినమైన, పద్ధతిం - మార్గమును, న ఆదదతే - స్వీకరింపరు. (చెడ్డమార్గమున నడువరని యర్థము) వేదవేత్తవైన నీవిట్లు చేయుట తగదుగనుక నా గుఱ్ఱమును నాకిచ్చి వేయుము.

శ్లో. ఇతి ప్రగల్భం రఘుణా సమీరితం
వచో నిశమ్యాధిపతి ర్దివౌకసాం,

నివర్తయామాస రథం సవిస్మయః
ప్రచక్రమేచ ప్రతివక్తు ముత్తరమ్. 47

వ్యాఖ్య: ఇతి - ఇట్లు, రఘుణా - రఘుమహారాజు చేత, సమీరితం - పలుకబడిన, ప్రగల్భం వచః - ప్రౌఢమైన వచనమును, నిశమ్య - విని, దివౌకసాం - స్వర్గవాసులకు, అధిపతిః - ప్రభువైన దేవేంద్రుడు, సవిస్మయః - ఆశ్చర్యము కలవాఁడగుచు, రథం - తన రథమును, నివర్తయామాస - వెనుకకు మరల్చెను, ప్రతివక్తుం - బదులుపలుకుటకు, ప్రచక్రమేచ - ప్రారంభించెను గూడ. రఘుమహారాజు మాటల కాశ్చర్యచకితుఁడైన యింద్రుఁడు తన రథమును వెనుకకు మరల్చి ఇట్లు పలుకదొడగెను.



శ్లో. యదాత్థ రాజన్యకుమార! తత్తథా
యశస్తు రక్ష్యం పరతో యశోధనైః,
జగత్ప్రకాశం తదశేష మిజ్యయా
భవద్గురు ర్లంఘయితుం మమోద్యతః. 48



వ్యాఖ్య: హే రాజన్యకుమార - ఓ క్షత్రియ యువకుఁడా! యత్ - ఏ వాక్యమును, ఆత్థ - పలుకుచున్నావో, తత్‌తథా - అదియట్లే (సత్యమే). తు - కాని, యశోధనైః - కీర్తియే ధనముగాఁగల మావంటి వారిచేత, పరతః - శత్రువునుండి, యశః - కీర్తి, రక్ష్యం - కాపాడఁదగినట్టిది (ఇతరుల బారినిఁ బడనీయక మా కీర్తిని మేము రక్షించుకొనుట యవసరము), భవద్గురుః - నీ తండ్రియగు దిలీపుఁడు, జగత్ప్రకాశం - లోక ప్రసిద్ధమైయున్న, అశేషం - సర్వమైన, మమ - నాయొక్క, తత్ - ఆ కీర్తిని (ఆ నాకీర్తియంతటిని), ఇజ్యయా - యాగముచేత, లంఘయితుం - అతిక్రమించుటకు, ఉద్యతః - ఉద్యుక్తుఁడైయున్నాఁడు. ఓయి! నీవు చెప్పునది సత్యమే. కాని మీ తండ్రి నూరుయజ్ఞములు పూర్తిచేసి నాకున్న "శతక్రతు" బిరుదమును, కీర్తిని రూపుమాపుటకు ప్రయత్నించుచున్నాడు. మరి నా కీర్తిని నేను రక్షించుకొనవలదా? యని యింద్రుఁడు రఘువుతో ననెను.

శ్లో. హరి ర్యథైకః పురుషోత్తమః స్మృతో
మహేశ్వర స్త్ర్యంబక ఏవ నాపరః,

తథా విదు ర్మాం మునయః శతక్రతుం
ద్వితీయగామీ నహి శబ్ద ఏష నః. 49

వ్యాఖ్య: యథా - ఏ విధముగా, హరిః - విష్ణువు, ఏకః - ఒకఁడే, పురుషోత్తమః - పురుషోత్తముఁడని, స్మృతః - స్మరింపఁ బడుచున్నాఁడో (చెప్పబడుచున్నాఁడో), యథాచ - ఏవిధముగానైతే, త్ర్యంబక ఏవ - శివుడే, మహేశ్వరః స్మృతః - మహేశ్వరుఁడుగా చెప్పఁబడుచున్నాఁడో, నాపరః - మఱియొక పురుషుఁడుకాదో, తథా - అదేవిధముగా, మాం - నన్ను, మునయః -ఋషులు, శతక్రతుం - శతక్రతు శబ్దవాచ్యునిగా, విదుః - గుర్తింతురు, నః - మా యొక్క (హరిహరులయొక్కయు, నాయొక్కయు), ఏషః - ఈ, శబ్దః - శబ్దము (పురుషోత్తమ, మహేశ్వర, శతక్రతు శబ్దములు) ద్వితీయగామీ - రెండవ వానిని చేరునది, నహి - కాదుసుమా! నేనుతప్ప మరియొకడు "శతక్రతు, శతమన్యు" శబ్దములచేతఁ బిలువఁబడుటకు అర్హుడుకాడని భావము.

శ్లో. అతోఽయ మశ్వః కపిలానుకారిణా
పితు స్త్వదీయస్య మయాపహారితః,
అలం ప్రయత్నేన తవాత్ర మానిధాః
పదం పదవ్యాం సగరస్య సన్తతేః. 50

వ్యాఖ్య: అతః - ఈ కారణమువలన (నేనుమాత్రమే శతక్రతు శబ్దవాచ్యుఁడ నైనందువలన), త్వదీయస్యపితుః - మీ తండ్రియొక్క, అయం - నూరవదియైన యీ, అశ్వః - గుఱ్ఱము, కపిలానుకారిణా - కపిలమహామునిని బోలియున్న, మయా - నాచేత, అపహారితః - అపహరింపఁబడినది, తవ - నీకు, అత్ర - ఈ గుఱ్ఱము విషయమై, ప్రయత్నేన - ప్రయత్నముచేత, అలం - చాలును (ఈ గుఱ్ఱముకొరకై నీవు ప్రయత్నింపకుము), సగరస్య - సగర చక్రవర్తియొక్క, సంతతేః - సంతానముయొక్క, పదవ్యాం - మార్గమునందు, పదం - అడుగును, మానిధాః - పెట్టకుము. పెద్దవారిని తిరస్కరించుట నీకు వినాశమూల మగుననియు గుఱ్ఱముపై నాశ విడువుమనియు నింద్రుడు పల్కెను. పూర్వము సగరచక్రవర్తి యాగార్థమై అశ్వమును విడువఁగా నదియొక గోతిలో దిగబడి పాతాళమునందు తపస్సు చేసికొనుచున్న కపిలునివద్ద చేరెను. సగరుని

కుమారులు (60 వేల సంఖ్య గలవారు) అచ్చటికి వేలను త్రవ్వుకొని యేగి కపిలుఁడు అశ్వము నపహరించెనని యవమానించి కపిలుని కోపవహ్నిలో భస్మమై పోయిరి. ఆ కథ నింద్రుఁ డిచ్చట రఘువునకు "కపిలానుకారిణా" యను పదముచేత సూచించి నీవును అట్లు నశింపకుమని హితము చెప్పెను.

శ్లో. తతః ప్రహస్యాపభయః పురందరం
పున ర్బభాషే తురగస్య రక్షితా,
గృహాణ శస్త్రం యది సర్గ ఏష తే
న ఖల్వనిర్జిత్య రఘుం కృతీ భవాన్. 51

వ్యాఖ్య: తతః - తరువాత, తురగస్య - గుఱ్ఱమునకు, రక్షితా - రక్షకుఁడైన రఘువు, ప్రహస్య - పెద్దగానవ్వి, అపభయఃసన్ - భయములేనివాఁడగుచు, పునః - తిరిగి, పురందరం - ఇంద్రుని గుఱించి, బభాషే - పలికెను (బదులు పలికెనని యర్థము). హే దేవేంద్రా! - ఓ దేవేంద్రుఁడా! ఏషః - ఇది (గుఱ్ఱముమ విడువకపోవుట) తే - నీ యొక్క, సర్గఃయది - నిశ్చయమే యైనచో, శస్త్రం - ఆయుధమును, గృహాణ - తీసుకొనుము, భవాన్ - నీవు, రఘుం - రఘువును (నన్ను), అనిర్జిత్య - జయింపకుండ, కృతీ - కృతకృత్యుఁడవు, నఖలు - కాలేవుసుమా! రఘువు పెద్దగానవ్వి అశ్వమును విడువక పోవుటయే నీ నిశ్చయమైనచో శస్త్రపాణివై నాతో యుద్ధము చేయుమని యింద్రునితో ననెను. 'సర్గ' శబ్దమునకు స్వభావ, నిర్మోక్ష, నిశ్చయ, అధ్యాయ, సృష్టులు అర్థములు.

శ్లో. స ఏవ ముక్త్వా మఘవంత మున్ముఖః
కరిష్యమాణః సశరం శరాసనమ్,
అతిష్ఠ దాలీఢవిశేష శోభినా
వపుః ప్రకర్షేణ విడంబితేశ్వరః. 52

వ్యాఖ్య: సః - ఆ రఘువు, ఉన్ముఖః - ఎత్తిన ముఖము కలవాఁడగుచు, (ఇంద్రుడు ఆకాశమునందు రఘువు నేలమీద నుండుటవలన నని భావము) మఘవంతం - ఇంద్రుని గుఱించి, ఏవం - పైన చెప్పినవిధముగా, ఉక్త్వా - పలికి, శరాసనం - ధనుస్సును, సశరం - బాణముతో కూడినదానిగా, కరిష్యమాణః -

చేయబోవుచున్న వాఁడగుచు, ఆలీఢ విశేష శోభినా—ఆలీఢ - 'ఆలీఢ'మను పేరు గల, విశేష - ఒకానొక స్థితిభేదముచేత. శోభినా - ప్రకాశించుచున్న, వపుఃప్రకర్షేణ - శరీరౌన్నత్యముచేత, విడంబితేశ్వరః - అనుకరింపఁబడిన శివుఁడు కలవాఁడై (శివునివలె), అతిష్ఠత్ - నిలిచెను. ఆకాశమువైపు తలనెత్తి, బాణము నెక్కుపెట్టి రఘువు ఇంద్రునితో యుద్ధము చేయుటకు సిద్ధపడెను. ధనుర్ధరులు యుద్ధమునందు నిలుచు స్థానభేదములు: "వైశాఖము, మండలము, సమపదము, ఆలీఢము, ప్రత్యాలీఢము" అని యైదు విధములు. ఆలీఢమనగా నొకకాలు వెనుకకును ఒకకాలు ముందునకును పెట్టి నిలుచుండుట.

శ్లో. రఘో రవష్టంభమయేన పత్రిణా
హృది క్షతో గోత్రభిద ప్యమర్షణః,
నవాంబుదానీక ముహూర్త లాంఛనే
ధనుష్య మోఘం సమధత్త సాయకమ్. 53

వ్యాఖ్య: రఘోః - రఘుమహారాజుయొక్క, అవష్టంభమయేన - స్తంభరూపమైన (లేక సువర్ణరూపమైన), పత్రిణా - బాణముచేత, హృది - వక్షస్థలమునందు, క్షతః - కొట్టఁబడినవాఁడై, (కనుకనే) అమర్షణః - క్రుద్ధుఁడైన, గోత్రభిత్, అపి - ఇంద్రుఁడునైతము, నవాంబుదానీక ముహూర్తలాంఛనే: - నవాంబుద - తొలకరి మేఘములయొక్క, అనీక - బృందమునకు, ముహూర్త - క్షణకాలము, లాంఛనే - చిహ్నముగా నుండునట్టి, ధనుషి - తన యింద్రధనుస్సునందు, అమోఘం - వ్యర్థముకాని, సాయకం - బాణమును, సమధత్త - కూర్చెను. రఘువుచేత వక్షస్థలముపై కొట్టబడిన యింద్రుఁడు క్రుద్ధుఁడై తన యింద్రధనుస్సునందు బాణము నెక్కుపెట్టెను.

శ్లో. దిలీపసూనోః స బృహద్భుజాంతరం
ప్రవిశ్య భీమాసుర శోణితోచితః,
పపా వనాస్వాదితపూర్వ మాశుగః
కుతూహలేనేవ మనుష్య శోణితమ్. 54

వ్యాఖ్య: భీమాసుర శోణితోచితః — భీమ - భయంకరులైన, అసుర - రాక్షసులయొక్క, శోణిత - రక్తమునందు, ఉచితః - పరిచితమైన, సః - ఆ

  

యింద్రునిచే విడువఁబడిన, ఆశుగః - బాణము, దిలీపసూనోః - రఘువుయొక్క, బృహత్ - విశాలమైన, భుజాంతరం - వక్షస్థలమును, ప్రవిశ్య - ప్రవేశించి, అనాస్వాదిత పూర్వం - ఇంతకుపూర్వము రుచి చూడనట్టి, మనుష్య శోణితం - మనుష్య రక్తమును, కుతూహలేనేవ - కుతూహలమచేతవలె, పపౌ - పానము చేసెను. భయంకరమైన యింద్రబాణము రఘువుయొక్క వక్షస్థలమున నాటి రక్తము ను స్రవింపఁ జేసెను.

శ్లో. హరేః కుమారోఽపి కుమారవిక్రమః
సురద్విపాస్ఫాలన కర్కశాంగులౌ,
భుజే శచీపత్రవిశేష కాంకితే
స్వనామచిహ్నం నిచఖాన సాయకమ్. 55

వ్యాఖ్య : కుమార విక్రమః - కుమారస్వామియొక్క పరాక్రమమువంటి పరాక్రమముగల, కుమారోఽపి (కుమార + అపి) - రఘువుగూడ, సురద్విపాస్ఫాలనకర్కశాంగులౌ — సురద్విప - ఐరావతముయొక్క, ఆస్ఫాలన - చఱపుల చేత, కర్కశ - కఠినములైన (మార్దవము వోయిన) అంగులౌ - వ్రేళ్లుకలది యును, శచీపత్ర విశేషకాంకితే — శచీ - శచీదేవియొక్క (ఆమె బుగ్గలు మొదలైన ప్రదేశములందు చిత్రింపబడిన) పత్రవిశేషక - మకరికాది పత్రరచనలు, బుక్క మొదలగువానిచేత, అంకితే - చిహ్నితమైన (ఆయా రంగులన్నియు నంటుకొనిన) హరేః - ఇంద్రుని యొక్క, భుజే - భుజము మీద, స్వనామ చిహ్నం - స్వనామాంకితమైన ('రఘు' అను పేరుగల) సాయకం - బాణమును, నిచఖాన - నాటెను. నిష్కంటకముగా స్వర్గరాజ్యము నేలుచున్న యింద్రుని కిది మహాపరాభవము. అతని భుజమునందు రఘునామాంకితమైన శరము నాటుకొని నిలిచి యుండెనట.

శ్లో. జహార చాన్యేన మయూరపత్త్రిణా
శరేణ శక్రస్య మహాశనిధ్వజమ్,
చుకోప తస్మై స భృశం సురశ్రియః
ప్రసహ్య కేశవ్యపరోపణా దివ. 56

వ్యాఖ్య: అన్యేన - మరియొకటి యైన, మయూరపత్రిణా - నెమలి యాకలుగల, శరేణ - బాణము చేత, శక్రస్య - ఇంద్రునియొక్క, మహాశని ధ్వజం - గొప్ప వజ్రాయుధ రూపముగల కేతనమును (జెండాను), జహార - హరించెను (భేదించెను), సః - ఆ యింద్రుఁడు, సురశ్రియః - దేవరాజ్యలక్ష్మి యొక్క, ప్రసహ్య - బలాత్కారముచేసి (లాగి), కేశవ్యపరోపణాదివ - కేశ బంధమును భేదించుటవలన వలె, తస్మై - ఆ రఘువుకొఱకు, భృశం - మిక్కిలి, చుకోప - కోపించెను. రఘువు మరియొక బాణముచేత ఇంద్రుని ధ్వజమును విరుగగొట్టగా స్వర్గరాజ్యలక్ష్మియొక్క సిగను గోసినట్లు భావించి ఇంద్రుఁడు అతనిని మిక్కిలికోపించి చంపఁ దలచెనని భావము.

శ్లో. తయో రుపాంతస్థిత సిద్ధసైనికం
గరుత్మదాశీవిష భీమదర్శనైః,
బభూవ యుద్ధం తుములం జయైషిణో
రధోముఖై రూర్ధ్వముఖైశ్చ పత్త్రిభిః, 57

వ్యాఖ్య: జయైషిణోః - ఒకరినొకరు జయింపఁదలచుచున్న, తయోః - ఆ యిద్దఱికి (యింద్ర రఘువులకు), గరుత్మదాశీవిషభీమ దర్శనైః - గరుత్మత్ - ఱెక్కలుగల, ఆశీవిష - సర్పములవలె, భీమ - భయంకరమైన, దర్శనైః - దర్శనముగల (ఱెక్కలుగల సర్పములవలె చూచువారికి భయమును గలిగించుచున్నట్టి), అధోముఖైః - అధోముఖములును, ఊర్ధ్వముఖైశ్చ - ఊర్ధ్వముఖములు నైన (ఇంద్రుఁడు వేయునవి అధోముఖముగాను, రఘువు వేయునవి ఊర్ధ్వముఖముగాను పోవుచుండెనని భావము), పత్త్రిభిః - బాణములచేత, ఉపాంతస్థిత సిద్ధి సైనికం - ఉపాంతస్థిత - తటస్థులుగా నున్న, సిద్ధ - ఇంద్రుని పక్షమువారైన సిద్ధులును, సైనికం — రఘు పక్షీయులైన సైనికులు కలదియునగు, తుములం, యుద్ధం - సంకులమైన యుద్ధము, బభూవ - జరిగెను. ఇంద్రుని బాణములు నేల మీదికిని రఘువు బాణములు ఆకాశమునకును బహుళముగా వ్యాపించుచుండగా జూచుచున్న యిరుపక్షములవారికిని భయమును గలిగించు సంకులయుద్ధము జరిగెను,

శ్లో. అతిప్రబంధ ప్రహితాస్త్రవృష్టిభిః
త మాశ్రయం దుష్ప్రసహస్య తేజసః,

  

శశాక నిర్వాపయితుం న వాసవః
స్వతశ్చ్యుతం వహ్నిమివాద్భి రంబుదః. 58

వ్యాఖ్య: వాసవః - ఇంద్రుఁడు, అతిప్రబంధ ప్రహితాస్త్ర వృష్టిభిః - అతి ప్రబంధ - ఎడతెగకుండ, ప్రహిత - ప్రయోగింపఁ బడిన, అస్త్ర వృష్టిభిః - బాణ వర్షములచేత, దుష్ప్రసహస్య - ఓర్వఁజాలనట్టి, తేజసః - ప్రతాపమునకు, ఆశ్రయం - ఆశ్రయుఁడైన, తం - ఆ రఘువును, అంబుదః - మేఘము, అద్భిః - ఉదకములచేత, స్వతశ్చ్యుతం - తనంతట జాఱిన, వహ్నింఇవ - అగ్నిని వలె, నిర్వాపయితుం - చల్లార్చుటకు, న శశాక - శక్తుఁడు కాలేకపోయెను. మేఘము తన జలధారలచేత విద్యుద్రూపమైన పిడుగు మొదలయినవానిని చల్లార్పఁ జాలనట్లు, లోకపాలాంశముతోఁ బుట్టిన రఘుమహారాజు ఇంద్రాంశ సంభూతుఁడే కనుక నతని ప్రతాపము నాపఁ జాలకపోయెనని భావము. "అష్టాభి ర్లోకపాలానాం మాత్రాభి ర్నిర్మితో నృపః".

శ్లో. తతః ప్రకోష్ఠే హరిచందనాంకితే
ప్రమథ్యమానార్ణవ ధీరనాదినీమ్,
రఘుః శశాంకార్ధముఖేన పత్త్రిణా
శరాసనజ్యా మలునాత్ బిడౌజసః. 59

వ్యాఖ్య: తతః - తరువాత, రఘుః - రఘురాజు, హరిచందనాంకితే - శ్రీగంధముచే పూయఁబడిన (లేదా కల్పవృక్షములలో నొకదాని చిహ్నముగల) ప్రకోష్ఠే - ఇంద్రుని మణిబంధమునందు, ప్రమథ్యమానార్ణవ ధీరనాదినీం— ప్రమథ్యమాన - మథింపఁబడుచున్న, అర్ణవ - సముద్రమువలె, ధీర - గంభీరముగా, నాదినీం - ధ్వనించుచున్న, బిడౌజసః - ఇంద్రునియొక్క, శరాసనజ్యాం - విల్లుయొక్క అల్లెత్రాటిని (మౌర్విని), శశాంకార్ధ ముఖేన - అర్ధచంద్రాకార ముఖముగల, పత్త్రిణాం - బాణముచేత, అలునాత్ - ఛేదించెను. 'వేవేష్టి వ్యాప్నోతి ఇతి విట్ - వ్యాపకం ఓజః యస్య సః బిడౌజాః తస్య బిడౌజసః' అని బిడౌజశ్శబ్ద వ్యుత్పత్తి. "వబయో రభేదః" కనుక "విట్, బిట్" అయినది. వ్యాపకమైన పరాక్రమము గలవాఁడని యర్థము.

శ్లో. స చాప ముత్సృజ్య వివృద్ధమత్సరః
ప్రణాశనాయ ప్రబలస్య విద్విషః,
మహీధ్ర పక్ష వ్యపరోపణోచితం
స్ఫురత్ప్రభామండల మస్త్ర మాదదే. 60

వ్యాఖ్య: వివృద్ధమత్సరః - ప్రబలిన వైరముగల, సః - ఆ యింద్రుఁడు, చాపం - ధనుస్సును, ఉత్సృజ్య - వదలివేసి, ప్రబలస్య - అధికుఁడైన, విద్విషః - శత్రువుయొక్క, ప్రణాశనాయ - వధకొఱకై, మహీధ్ర పక్ష వ్యపరోపణోచితం — మహీధ్ర - పర్వతములయొక్క, పక్ష - ఱెక్కలను, వ్యపరోపణ - ఛేదించుటయందు, ఉచితం - సమర్థమైనదియు, స్ఫురత్ప్రభా మండలం - ప్రకాశించు కాంతిమండలము గల, అస్త్రం - అస్త్రమును (అనగా వజ్రాయుధమును) ఆదదే - తీసికొనెను. వజ్రాయుధముచేత రఘువును నఱుకుటకుద్యుక్తుఁడయ్యెనని భావము.

శ్లో. రఘు ర్భృశం వక్షసి తేన తాడితః
పపాత భూమౌ సహ సైనికాశ్రుభిః,
నిమేషమాత్రా దవధూయ తద్వ్యథాం
సహోత్థితః సైనిక హర్ష నిస్వనైః. 61

వ్యాఖ్య: రఘుః - రఘువు, తేన - ఆ వజ్రాయుధముచేత, భృశం - అత్యధికముగా, వక్షసి - వక్షస్థలమునందు, తాడితః - కొట్టబడినవాఁడై, సైనికాశ్రుభిః సహ - తన సైనికుల కన్నీళ్లతోకూడ, భూమౌ - నేలపైన, పపాత - పడెను (సైనికుల దుఃఖాశ్రువులును రఘుమహారాజు శరీరమును ఏకకాలమున నేలపై బడినవి), నిమేషమాత్రాత్ - క్షణ కాలములోనే, తద్వ్యథాం - ఆ వజ్రఘాతమువలన కలిగిన బాధను, అవధూయ - దులుపుకొని (లెక్కసేయక), సైనిక హర్షనిస్వనైః సహ - రఘురాజు భటుల హర్షధ్వానములతో (సింహనాదముతో కూడ), ఉత్థితః - లేచి నిలువఁబడెను. నేలపై బడుటకును మరల లేచి నిలుచుండుటకును ఎక్కువ వ్యవధానము లేకపోయెననియు, వజ్రాయుధపు దెబ్బను సైతము రఘువు లెక్కసేయక వెంటనే తేరుకొనెననియు భావము.

శ్లో. తథాపి శస్త్రవ్యవహార నిష్ఠురే
విపక్షభావే చిర మస్య తస్థుషః,
తుతోష వీర్యాతిశయేన వృత్రహా
పదం హి సర్వత్ర గుణై ర్నిధీయతే. 62

వ్యాఖ్య: తథాపి - వజ్రఘాతము జరిగినప్పటికిని, శస్త్ర వ్యవహారనిష్ఠురే - శస్త్ర - ఆయుధములయొక్క, వ్యవహార - వ్యాపారముచేత (బాణములు వేయుచునే యుండుటచేత), నిష్ఠురే - క్రూరమైన, విపక్షభావే - శాత్రవమునందు, చిరం - ఎక్కువసేపు, తస్థుషః - నిలచియున్న, అస్య - ఈ రఘువుయొక్క, వీర్యాతిశయేన - పరాక్రమాతిశయముచేత, వృత్రహా - ఇంద్రుడు, తుతోష - సంతోషించెను (శత్రువువలన సంతోషపడుట యెట్లు ? అనగా) గుణైః - సద్గుణములచేత, సర్వత్ర - అంతట (శత్రుమిత్ర ఉదాసీనులయందు), పదం - పాదము, నిధీయతే - ఉంచబడును. ఇంద్రుఁడు రఘు పరాక్రమమునకు సంతోషించెను. గుణములు అంతటను ప్రవేశించును గనుక, రఘురాజు గుణములు శత్రువగు నింద్రునిసైత మాకర్షించినవని భావము. అలంకారము: అర్థాంతర న్యాసము.

శ్లో. అసంగ మద్రిష్వపి సారవత్తయా
న మే త్వదన్యేన విసోఢ మాయుధమ్,
అవేహి మాం ప్రీత మృతే తురంగమాత్
కి మిచ్ఛసీతి స్ఫుట మాహ వాసవః. 63

వ్యాఖ్య: సారవత్తయా - మహాపటిష్ఠమైన దగుటచేత, అద్రిషు, అపి - పర్వతములయందు సైతము, అసంగతం - అప్రతిహతమైన, మే, ఆయుధమ్ - నాయొక్క వజ్రాయుధము, త్వదన్యేన - నీకంటే యితరునిచేత, న విసోఢం - సహింపఁబడలేదు, (అతః - ఇందువలన) మాం - నన్ను, ప్రీతం - సంతుష్టుఁడైన వానినిగా, అవేహి - తెలిసికొనుము, తురంగమాత్, ఋతే - గుఱ్ఱముతప్ప, కిం ఇచ్ఛసి - ఏమి కోరెదవు ? ఇతి - ఇట్లని, స్ఫుటం - స్పష్టముగా, వాసవః - ఇంద్రుఁడు, ఆహ - పలికెను. పర్వతములను సైతము ఛేదింపఁగల నా వజ్రాయుధముయొక్క దెబ్బను నీవుతప్ప సహించినవాఁడు లేడు కనుక సంతసించితిని.

తురంగముతప్ప యేమడిగినను ఇచ్చెదను నీకు కావలసిన వరమును కోరుకొమ్మని యింద్రుఁడు రఘువుతో ననెను.

శ్లో. తతో నిషంగా దసమగ్ర ముద్ధృతం
సువర్ణపుంఖ ద్యుతి రంజితాంగులిమ్,
నరేంద్రసూనుః ప్రతిసంహర న్నిషుం
ప్రియంవదః ప్రత్యవదత్ సురేశ్వరమ్. 64

వ్యాఖ్య: తతః - పిమ్మట, నిషంగాత్ - తూణీరమునుండి, అసమగ్రం - అసంపూర్ణముగా (సగముగా), ఉద్ధృతం - పైకి తీయబడినదియు, సువర్ణపుంఖ ద్యుతిరంజితాంగులిమ్ — సువర్ణపుంఖ - బంగారుపిడియొక్క, ద్యుతి - కాంతుల చేత, రంజిత - పూయబడిన, అంగులిం - వ్రేళ్లుగలదియునగు, ఇషుం - బాణమును, ప్రతిసంహరన్ - మరల నమ్ములపొదిలో విడుచుచున్న వాఁడై (తనను కొట్టనివానిని తాను కొట్టరాదను యుద్ధధర్మమును పాటించువాఁడై), ప్రియంవదః - ప్రేమవచనములు పలుకునట్టి, నరేంద్రసూనుః - రాజకుమారుఁడు, సురేశ్వరం - దేవతలకు ప్రభువైన యింద్రుని గుఱించి, ప్రత్యవదత్ - బదులు పలికెను.

శ్లో. అమోచ్య మశ్వం యది మన్యసే ప్రభో!
తతః సమాప్తే విధినైవ కర్మణి,
అజస్ర దీక్షాప్రయతః స మద్గురుః
క్రతో రశేషేణ ఫలేన యుజ్యతామ్. 65

వ్యాఖ్య: హే ప్రభూ! (ఇంద్రా!), అశ్వం - గుఱ్ఱమును, అమోచ్యం - విడుచుటకు వీలులేనిదానినిగా, మన్యసే, యది - తలఁచుచున్న వాఁడవగుదువేని, తతః - అట్లయినచో, అజస్రదీక్షాప్రయతః—అజస్ర - ఎల్లప్పుడును, దీక్షా - క్రతు దీక్షయందు, ప్రయతః - నిష్ఠాపరుఁడైయున్న, సః మద్గురుః - ఆ మా తండ్రి, విధినైవ (విధినా + ఏవ) - శాస్త్రవిధానముచేతనే, కర్మణి - యాగకర్మ, సమాప్తే సతి - పూర్తిచేయబడినదికాగా, క్రతోః - యాగమునకు, యత్ఫలం - ఏ ఫలమువచ్చునో, అశేషేణ - మిగులక సంపూర్ణమైన, ఫలేన - ఆ ఫలముచేత, యుజ్యతాం - కూర్పఁబడుగాక, మా తండ్రికి శతాశ్వమేధ ఫలము నిమ్ము అని

కోరెను. "అవిధినా కృతం అకృతం". విధివిధానము ననుసరించి చేయని కర్మ చేసినట్టేకాదు. కనుక శాస్త్రప్రకారము పరిసమాప్తి చేయఁబడిన అశ్వమేధయాగము యొక్క సంపూర్ణఫలమును మా తండ్రి కియ్యవలసినదని రఘువు ఇంద్రునిఁ గోరెను. అతఁ డశ్వము తప్ప మరి దేనినైనను గోర మనియుండెనుగదా! అశ్వమేధయాగ ఫలము దక్కినప్పు డశ్వముతో నేమిపని యని రఘు విట్లు కోరెను. ఇంద్రుఁడు యాగఫలప్రదాత కనుక కోరిక సమంజసముగా నున్నది. అట్టి కోరికను ఇంద్రుఁడు నిరాకరించుటకు వీలులేదు. దిలీపచక్రవర్తిని గూడ తనవలెనే "శతక్రతు, శతమన్యు" శబ్దవాచ్యునిగా భావించి స్వర్గరాజ్యసింహాసనార్థ భాగముపై నెక్కుట కంగీకరింపవలసినదే. ఇది రఘువునకు తోచిన యుపాయము.

శ్లో. యథాచ వృత్తాంత మిమం సదోగత
స్త్రిలోచనైకాంశతయా దురాసదః,
తవైవ సందేశహరా ద్విశాంపతిః
శృణోతి లోకేశ ! తథా విధీయతామ్. 66

వ్యాఖ్య: సదోగతః - యాగసభయందు గాని, రాజ్యసభయందు గాని యున్నవాడును, త్రిలోచనైకాంశతయా - త్రిలోచనుడగు శివుని ఒకమూర్తియైన వాఁ డగుటచేత, దురాసధః - మాబోటివారిచేత సమీపించుటకు శక్యముకాని వాఁడును నగు, విశాంపతిః - రాజైన దిలీపుఁడు, యథా - ఏ ప్రకారముగానైతే, ఇమం - ఈ. వృత్తాంతం - వార్తను, తవ - నీయొక్క, సందేశహరాదేవ - వార్తాహరునివలననే, శృణోతి చ - వినువాఁడగునో, హే లోకేశ - ఓ యింద్రా! తథా - ఆ విధముగా, విధీయతాం - చేయఁబడుగాక, (ఈ వార్తను నీ దూత ద్వారానే తెలుపుమని కోరెను). "భూతార్కచంద్రయజ్వానో మూర్తయోష్టౌ ప్రకీర్తితాః" పృథివి, జలము, తేజస్సు, వాయువు, ఆకాశము, సూర్యుఁడు, చంద్రుఁడు, యజ్వా (యాగదీక్షితుఁడు); ఇవి శివుని అష్టమూర్తులు. ఇందులో దిలీపుఁడు యజ్వ కనుక త్రిలోచనుని యొకయంశగాఁ జెప్పబడెనని గ్రహింపవలయును.

శ్లో. తథేతి కామం ప్రతిశుశ్రువాన్ రఘో:
యథాగతం మాతలిసారథి ర్యయౌ,

నృపస్య నాతిప్రమనాః సదోగృహం
సుదక్షిణాసూను రపి న్యవర్తత. 67

వ్యాఖ్య: మాతలిసారథిః - ఇంద్రుడు (మాతలియను సారథి గలవాడు), రఘోః - రఘువుయొక్క, కామం - కోరికను, తథేతి (తథా + ఇతి) - అట్లే యగుగాక యని, ప్రతిశుశ్రువాన్ - అంగీకరించిన వాడగుచు, యథాగతం - వచ్చినదారిని, యయౌ - వెళ్లిపోయెను, సుదక్షిణాసూనుః, అపి - రఘువుకూడ, నాతిప్రమనాః - అంతయెక్కువ సంతోషము లేనివాడగుచు, నృపస్య - రాజైన దిలీపునియొక్క, సదోగృహం - యాగమంటపమును గుఱించి, న్యవర్తత - తిరిగి వెళ్లెను. (విజయము చేకూరినను యాగాశ్వము పోయినందున రఘువుకు ఎక్కువ సంతోషము కలుగలేదని భావము).

శ్లో. త మభ్యనందత్ ప్రథమం ప్రబోధితః
ప్రజేశ్వరః శాసనహారిణా హరేః,
పరామృశన్ హర్షజడేన పాణినా
తదీయ మంగం కులిశ వ్రణాంకితమ్. 68

వ్యాఖ్య: హరేః - ఇంద్రునియొక్క, శాసనహారిణా - ఆజ్ఞను తెచ్చిన సేవకునిచేత, ప్రథమం - మొదట, బోధితః - తెలుపబడినవాడై (ఇంద్ర రఘు యుద్ధము, తనకు శతాశ్వమేధ ఫలము లభించుట మొదలగు నంశములు తెలుపబడిన వాడై), ప్రజేశ్వరః - రాజైన దిలీపుడు, హర్షజడేన - సంతోషాతిశయము చేత చల్లబడిన, పాణినా - చేతితో, కులిశవ్రణాంకితం—కులిశ - వజ్రాయుధము చేతనైన, వ్రణ- వ్రణముచేత, అంకితం - చిహ్నితమైన, తదీయం - ఆ రఘువునకు సంబంధించిన, అంగం - శరీరమును, పరామృశన్ - నిమురుచు, తం - అతనిని, అభ్యనందత్ - అభినందించెను. ఇంద్రుని దూతద్వారా ముందే సర్వము నెఱిగిన దిలీపుడు రఘువు రాగానే యతని నభినందించెను.

శ్లో. ఇతి క్షితీశో నవతిం నవాధికాం
మహాక్రతూనాం మహనీయశాసనః,

  

సమారురుక్షు ర్దివ మాయుషః క్షయే
తతాన సోపానపరంపరా మివ. 69

వ్యాఖ్య: మహనీయ శాసనః - పూజనీయమైన యాజ్ఞగల, క్షితీశః - దిలీప మహారాజు, ఇతి - ఈ ప్రకారముగా, మహాక్రతూనాం - అశ్వమేధ యాగముల యొక్క, నవాధికాం - తొమ్మిదిచేత నెక్కువైన, నవతిం - తొంబదిని (99 అని యర్థము), ఆయుషః - తన ఆయుష్యముయొక్క, క్షయే - క్షయము జరిగినప్పుడు (తాను మృతిచెందినప్పుడు), దివం - స్వర్గమును, ఆరురుక్షుః - అధిరోహింపఁ దలఁచినవాఁడై, సోపానపరంపరామివ - మెట్లవరుసనువలె, తతాన - చేసెను (విస్తరించెను). తొంబది తొమ్మిది యాగములుచేసి, నూరవ అశ్వమేధ ఫలమునుగూడ కుమారుఁడైన రఘువు పరాక్రమముచేత సాధించిన దిలీపుఁడు స్వర్గమును సరాసరిగాఁ జేరుటకుఁ దగిన సోపానపరంపర నశ్వమేధములద్వారా యేర్పరచుకొనెను.

శ్లో. అథ స విషయ వ్యావృత్తాత్మా యథావిధి సూనవే
నృపతికకుదం దత్త్వా యూనే సితాతపవారణమ్,
మునివన తరుచ్ఛాయాం దేవ్యా తయా సహ శిశ్రియే
గలితవయసా మిక్ష్వాకూణా మిదం హి కులవ్రతమ్. 70

వ్యాఖ్య: అథ - ఆ తరువాత, విషయ వ్యావృత్తాత్మా—విషయ - భోగ్యవస్తువులనుండి, వ్యావృత్త - మరలిన, ఆత్మా - మనస్సుగల, సః - ఆ దిలీపుఁడు, యథావిధి - శాస్త్రప్రకారముగా, యూనే - యువకుఁడైన, సూనవే - కుమారుని కొఱకు (కుమారునికి), నృపతికకుదం - రాజచిహ్నమైన, సితాతపవారణం - శ్వేతచ్ఛత్రమును, దత్త్వా - ఇచ్చి (రాజ్యపట్టాభిషేకముచేసి యని యర్థము), తయా - ఆ, దేవ్యాసహ - భార్యయగు సుదక్షిణా దేవితోఁగూడ, మునివన తరుచ్ఛాయాం - మునివన - తపోవనమునందలి, తరు - ఒకానొక వృక్షముయొక్క, ఛాయాం - నీడను, శిశ్రియే - ఆశ్రయించెను, (వానప్రస్థాశ్రమమును స్వీకరించెనని భావము), హి - అది యట్లే, గలితవయసాం - వృద్ధులైనట్టి, ఇక్ష్వాకూణాం - ఇక్ష్వాకు వంశీయులైన రాజులకు, ఇదం - ఇది, కులవ్రతం - వంశాచారము. తరువాత దిలీపుఁడు వైరాగ్యము గలవాఁడై కుమారునికిఁ బట్టాభిషేకము గావించి, భార్యతో

సహా తమ వంశాచారమైన వానప్రస్థాశ్రమమును స్వీకరించెను. 'దేవ్యాసహ' అని చెప్పుటచేత 'సపత్నీక వానప్రస్థాశ్రమమును' స్వీకరించెనని భావము. "సుతవిన్యస్త పత్నీక స్తయావానుగతో వనమ్, వానప్రస్థో బ్రహ్మచారీ సాగ్నిః సోపాసనో వ్రజేత్" అను యాజ్ఞవల్క్యస్మృతి వచనమువలన భార్యను కుమారులవద్ద విడిచివెళ్లుట యొక పక్షము. భార్యతోకూడ వెళ్లుట మరియొక పక్షము, ఎట్లయినను వానప్రస్థుఁడు బ్రహ్మచారియై, అగ్నికార్యము చేయుచు జీవితమును గడపవలయును. కావ్యారంభమునందు "వార్ధకే మునివృత్తీనామ్" అని చెప్పినదాని కిది యుదాహరణము.

ఇది మహాకవి కాళిదాసకృత

రఘువంశ కావ్యమున

తృతీయ సర్గకు తెలుఁగు లఘువ్యాఖ్య

# చతుర్థ సర్గము

శ్లో. స రాజ్యం గురుణా దత్తం ప్రతిపద్యాధికం బభౌ,
దినాంతే నిహితం తేజః సవిత్రేవ హుతాశనః. 1

వ్యాఖ్య: సః - ఆ రఘుమహారాజు, గురుణా - తండ్రియైన దిలీపునిచేత, దత్తం - ఈయఁబడిన, రాజ్యం - రాజ్యాధికారమును, ప్రతిపద్య - పొంది. దినాంతే - సాయంకాలమునందు, సవిత్రా - సూర్యునిచేత, నిహితం - ఉంచఁబడిన, తేజః - తేజస్సును, ప్రతిపద్య - పొందినపిమ్మట, హుతాశనః ఇవ - అగ్నిహోత్రునివలె, అధికం, బభౌ - ఎక్కువగా ప్రకాశించెను. పరాక్రమతేజః ప్రభావాదులచేత సహజముగానే ప్రకాశించుచున్న రఘువు పితృదత్తమైన రాజ్యాధికారమునుపొంది, సాయంకాలమున సూర్యతేజస్సు సంక్రమించిన యగ్నివలె, విశేషముగా ప్రకాశించెనని భావము. సూర్యతేజస్సు రాత్రియం దగ్నిని ప్రవేశించునని శ్రుతిప్రమాణము గలదు.

శ్లో. దిలీపానంతరం రాజ్యే తం నిశమ్య ప్రతిష్ఠితం,
పూర్వం ప్రధూమితో రాజ్ఞాం హృదయేఽగ్ని రివోత్థితః. 2

వ్యాఖ్య: దిలీపానంతరం - దిలీపుని తరువాత, రాజ్యే - రాజ్యమునందు, ప్రతిష్ఠితం - నిలుపబడిన, తం - ఆ రఘువును, నిశమ్య - విని, పూర్వం - దిలీపుని కాలమునందు, రాజ్ఞాం - శత్రురాజులయొక్క, హృదయే మనస్సునందు, ప్రధూమితః - బాగా పొగలేచునట్లు చేయఁబడిన, అగ్నిః - సంతాపాగ్ని, ఉత్థితః ఇవ - మంటలులేచెనో యనునట్లుండెను. పూర్వము దిలీపుని ప్రతాపము వలననే శత్రురాజుల గుండెలలోనున్న సంతాపాగ్ని పొగలు లేచుచుండెను. ఇప్పుడా స్థాన

మున రఘువువచ్చుటచేత నా సంతాపము మంటలై మండెను. అనగా దిలీపుని కాల మందే భయముచేత కుమిలిపోవుచున్న శత్రువుల కిప్పు డధికతరతాపముగల్గి భయ పడు చుండిరని భావము.

శ్లో. పురుహూతధ్వజస్యేవ తస్యోన్నయనపంక్తయః
నవాభ్యుత్థానదర్శిన్యో ననందుః సప్రజాః ప్రజాః. 3

వ్యాఖ్య : పురుహూతధ్వజస్య ఇవ - ఇంద్రధ్వజముయొక్క వలె, తస్య - ఆ రఘుమహారాజుయొక్క, నవాభ్యుత్థాన దర్శిన్యః - నూతనాభ్యుదయమును చూచు చున్నట్టియును, సప్రజాః - పుత్ర పుత్రీజనముతోఁ గూడిన, ప్రజాః - జనులు, ఉన్నయనపంక్తయః - ఎత్తబడి విప్పారిన కనులవరుసలు గలవారై, ననందుః - చూచియానందించిరి. అచ్చటిజనులు పిల్లలను వెంటఁబెట్టుకొని ప్రతిసంవత్సరము, వర్షములు పడుటకై జరుపబడునట్టి యింద్రధ్వజోత్సవము నందలి యెత్తైన ధ్వజ మును బారులుబారులుగా నెత్తఁబడిన కనులతో నెట్లు చూచుచుండిరో అట్లే రఘు మహారాజుయొక్క అభ్యున్నతిని తలఎత్తి చూచుచు నానందించిరని భావము. సువృష్టి కలుగుటకై రాజద్వారమునందు ఇంద్రధ్వజమును సమున్నతమైన దానినిగా స్థాపించి జాతరసేయు నాచారము మనదేశమున నుండెను.

శ్లో. సమ మేవ సమాక్రాంతం ద్వయం ద్విరదగామినా,
తేన సింహాసనం పిత్ర్య మఖిలం చారిమండలం 4

వ్యాఖ్య: ద్విరదగామినా - ఏనుగు నడకగల, తేన - ఆ రఘు మహారాజుచేత, పిత్ర్యం - తండ్రివలన లబ్ధమైన, సింహాసనం - సింహాసనము, అఖిలం అరిమండలం చ - సమస్తమైన శత్రురాష్ట్రమునను, ద్వయం - రెండును, సమమేవ - ఏకకాలమునందే, సమాక్రాంతం - అధిష్ఠింపఁబడినది. ఏనుగువంటి నడకయు, ఏనుగుల సైన్యమును గల రఘుమహారాజు పితృసింహాసనముపై నెక్క గానే శత్రువు లతని గజసైన్య యుద్ధమునకు భయపడి విధేయులై వర్తించుట కారంభించిరని భావము. "ద్విరదగామినా" ద్విరద ఇవగచ్ఛతీతి ద్విరదగామీ, అనియు, 'ద్విరదైః గచ్ఛతీతి ద్విరదగామీ' అనియు విగ్రహములు చెప్పవలెను.

శ్లో. ఛాయామండల లక్ష్యేణ త మదృశ్యా కిల స్వయం,
పద్మా పద్మాతపత్రేణ భేజే సామ్రాజ్యదీక్షితమ్. 5

వ్యాఖ్య: పద్మా - లక్ష్మీదేవి, స్వయం - తాను, అదృశ్యాకిల - కనబడని దగుచునే ఛాయామండలలక్ష్యేణ - కాంతిమండలముచేత నూహింపఁదగిన, పద్మాతపత్రేణ - కమలమనెడు గొడుగుచేత, సామ్రాజ్యదీక్షితం - మండలాధిపత్యమునందు దీక్షవహించిన, తం - ఆ రఘుమహారాజును, భేజే - సేవించెను. రఘువు సింహాసనమెక్కఁగానే యతని ముఖమున కొక గొప్పకాంతి కలిగెను. అది మండలాకారమున గోచరించుటచేత రాజ్యలక్ష్మి తానదృశ్యమయ్యును కమలాతపత్రముచేత సామ్రాజ్యదీక్షితుఁడైన యతనిని సేవించుచున్నట్లుగా నుండెనని భావము. సింహాసన మెక్కఁగానే రాజ్యలక్ష్మి సాన్నిధ్య మతనికిఁ గలిగె ననునది పరమార్థము.

శ్లో. పరికల్పిత సాన్నిధ్యా కాలేకాలే చ వందిషు,
స్తుత్యం స్తుతిభి రర్థ్యాభి రుపతస్థే సరస్వతీ. 6

వ్యాఖ్య: సరస్వతీ చ - సరస్వతియును, కాలేకాలే - ఆయా సమయములయందు, వందిషు - స్తుతిపాఠకులయందు, పరికల్పితసాన్నిధ్యా - కల్పించుకోఁబడిన సన్నిధానము కలదియై, స్తుత్యం - స్తుతించుటకర్హుడైన యతనిని, అర్థ్యాభిః - అర్థవంతమునైన, స్తుతిభిః - స్తోత్రములచేత, ఉపతస్థే - పూజించెను. సరస్వతీదేవికూడ ఆయా సమయములయందు స్తోత్రములు చేయు స్తుతిపాఠకులయందు ప్రవేశించినదియై అర్థవంతములైన స్తోత్రములతో నతనిని స్తుతించి పూజించెను. "నా విష్ణుః పృథివీపతిః" అనియు, "అష్టాభిర్లోకపాలానాం మాత్రాభిర్నిర్మితో నృపః" అనియున్న ప్రమాణవచనములవలన సరస్వతి రఘువును దేవతాబుద్ధిచేతను, విష్ణుభావముచేతను స్తుతించుట దోషముకాదని భావము.

శ్లో. మనుప్రభృతిభి ర్మాన్యై ర్భుక్తా యద్యపి రాజభిః,
తథాఽప్యనన్యపూర్వేవ తస్మి న్నాసీ ద్వసుంధరా. 7

వ్యాఖ్య: వసుంధరా - భూమి, మను ప్రభృతిభిః - మనువు మొదలగు, మాన్యైః రాజభిః - పూజ్యులైన రాజులచేత, భుక్తా యద్యపి - అనుభవింపఁ బడినదే, తథాఅపి - అట్లయినను, తస్మిన్ - ఆ రఘుమహారాజు విషయమున, అనన్యపూర్వా ఇవ - పూర్వము తన నెవ్వఁడును అనుభవింపని దానివలె, ఆసీత్ - ప్రవర్తించెను. పూర్వము మను ప్రభృతులగువారిచేత ననుభవింపఁ బడినదేయైనను భూదేవి, రఘుమహారాజును జేరి ప్రథమ భర్తయం దనురక్తురాలైన యువతివలె

నడచుకొనెను. అనగా పూర్వరాజుల పరిపాలనమునందుకంటె రఘు పరిపాలనము నందు భూమి సస్యశ్యామలకాగా, భూప్రజలు భక్తిసంతోషములు గలవారై యుండిరని భావము.

శ్లో. స హి సర్వస్య లోకస్య యుక్తదండతయా మనః
ఆదదే నాతిశీతోష్ణో నభస్వా నివ దాక్షిణః. 8

వ్యాఖ్య: హి - ఏలయనగా, సః - అతఁడు, యుక్త దండతయా - అపరాధమునకు తగిన దండన చేయువాఁడగుటచేత, సర్వస్య, లోకస్య - సమస్త జనముయొక్క, మనః - మనస్సును, నాతి శీతోష్ణః - అంత యెక్కువచల్లదనము గాని, అంత యెక్కువవేడిగాని లేనట్టి, దాక్షిణః - దక్షిణదిక్కునుండి వచ్చునది యగు, నభస్వాన్ ఇవ - గాలివలె (మలయమారుతము వలె), ఆదదే - ఆకర్షించెను. తీక్ష్ణదండముగాని మెత్తదనముగాని లేక యుక్తదండనము చేయునట్టి రఘు మహారాజు ప్రజల మనస్సును శీతోష్ణములు తగుమాత్రముగానున్న మలయ మారుతమువలె నాకర్షించెను. ప్రజలకు తీక్ష్ణదండముగల రాజుపై నేవగింపును, మృదుదండుడైనచో చులకదనమును కలుగును గనుక పాలకుఁడు యుక్త దండుడుగా నుండవలెనని కామందకనీతిసారము చెప్పుచున్నది.

శ్లో. మందోత్కంఠాః కృతా స్తేన గుణాధికతయా గురౌ,
ఫలేన సహకారస్య పుష్పోద్గమ ఇవ ప్రజాః. 9

వ్యాఖ్య: తేన - అతనిచేత, గుణాధికతయా - గుణములచే గొప్పవాఁడగుటచేత, ప్రజాః ప్రజలు, గురౌ - తండ్రియగు దిలీపునియెడల, సహకారస్య - తియ్యమామిడియొక్క, ఫలేన - పండుచేత, పుష్పోద్గమే ఇవ - పూత పట్టుటయందువలె, మందోత్కంఠాః - సన్నగిల్లిన యౌత్సుక్యము గలవారుగా, కృతాః - చేయఁబడిరి. తియ్యమామిడికి పరిమళవంతమైన పూతవచ్చినప్పుడు ప్రజలు సంతసింతురు. తరువాత కాయలు, పండ్లురాగానే పూతమీది ప్రేమ సన్నగిల్లును. అట్లే దిలీపునియందున్న భక్తి విశ్వాసములు ప్రజలకు రఘువు రాగానే సన్నగిల్లి యితనిమీదనే యెక్కువగా కలిగెనని భావము.

శ్లో. నయవిద్భి ర్నవే రాజ్ఞి సదస చ్చోపదర్శితమ్,
పూర్వ ఏవాభవ త్పక్ష స్తస్మి న్నాభవ దుత్తరః. 10

  

వ్యాఖ్య: నయవిద్భిః - నీతిశాస్త్రవిదులగు మంత్రులచేత, నవే రాజ్ఞి - క్రొత్తగారాజైన రఘుమహారాజువిషయము, సత్ - ధర్మయుద్ధస్వరూపము, అసచ్చ - కూటయుద్ధ స్వరూపముకూడ, ఉపదర్శితం - తెలుపఁబడినది, తస్మిన్ - ఆ రఘువునందు, పూర్వః పక్షః ఏవ - మొదటిదగు ధర్మయుద్ధాదికమే, అనభవత్ - నిలిచెను, ఉత్తరః - రెండవదియగు నధర్మకూట యుద్ధాధికము, నా భవత్ (న+ అభవత్) - నిలువలేదు, రాజ్యపాలనమునం దనుభవము కలుగుటకై నీతికోవిదుల చేత రఘువున కుపదేశింపఁబడిన ధర్మాధర్మ యుద్ధములలో, నతనియందు మొదటిది యగు ధర్మయుద్ధ నైపుణ్యమే నిలిచెనుగాని, రెండవది చెవికెక్కలేదు. సత్పక్షము నవలంబించెనేగాని యసత్పక్షము నవలంబింపలేదని భావము. రెండవది తెలివిడికి మాత్రమే.

శ్లో. పంచానా మపి భూతానా ముత్కర్షం పుపుషు ర్గుణాః,
నవే తస్మిన్ మహీపాలే సర్వం నవ మివాభవత్. 11

వ్యాఖ్య: పంచానాం, అపి, భూతానాం - పృథివి మొదలయిన పంచ భూతములయొక్కగూడ, గుణాః - గంధాది గుణములు, ఉత్కర్షం - అతిశయ మును, పుపుషః - పొందినవి (పుష్టినొందినవి), తస్మిన్, నవే, మహీపాలేసతి - అతఁడు క్రొత్తరాజు కాగానే, సర్వం - సమస్తవస్తుజాతము, నవమివ - క్రొత్తది వలె, అభవత్ - అయినది. రఘుమహారాజు పాలకుఁడు కాగానే పంచభూతముల యొక్క గుణములకు అనగా భూమి, జలము, వాయువు మొదలయినవాని సహా యముతో పుట్టిన వస్తుజాత మంతటికిని క్రొత్తసోయగము క్రొత్తరుచి పెంపొంది, అనుభవించు ప్రజల కిదియేదో నూతన వస్తుజాతమన్న భావమును, ఆనందమును గలిగించెను. పూర్వమున్న వాటికే అపూర్వగుణములబ్బి శోభిల్లెనని భావము.

శ్లో. యథా ప్రహ్లాదనాచ్చంద్రః ప్రతాపా త్తపనో యథా,
తథైవ సోఽభూ దన్వర్థో రాజా ప్రకృతిరంజనాత్. 12

వ్యాఖ్య: యథా - ఏ విధముగా, చంద్రః - చంద్రుఁడు, ప్రహ్లాదనాత్ - చూచువారి నాహ్లాదపరచుటవలన, అన్వర్థః - సార్థకనామధేయుఁడయ్యెనో, యథా-ఏ విధముగానైతే, తపనః - సూర్యుఁడు, ప్రతాపాత్ - తపింపఁజేయుటవలన, అన్వర్థః - సార్థకనామధేయుఁడయ్యెనో, తథైవ - అదేవిధముగా, సః-రాజా-అరఘు

మహారాజు, ప్రకృతి రంజనాత్ - ప్రజలను సంతోషపెట్టుటవలన, అన్వర్థః - సార్థక నామధేయుఁడు, అభూత్ - అయ్యెను. చంద్రుఁడు, తపనశబ్ద వాచ్యుఁడైన సూర్యుఁడును శబ్ద వ్యుత్పత్తికిఁగల యర్థముచేత అన్వర్థ నామధేయులైరో అట్లే రఘువు రాజశబ్ద వ్యుత్పత్తిచేత సార్థకనామధేయుఁడై యుండెను. "చంద్రయతి (ఆహ్లాదపరచువాడు) ఇతి చంద్రః" అనియు, "తపతి(తాపమును గలిగించు వాఁడు) ఇతి తపనః" అనియు, రంజయతి (ప్రజలను రంజింపఁ జేయువాఁడు) ఇతి రాజా" అనియు నీమూడు శబ్దములయొక్క వ్యుత్పత్త్యర్థములు.

శ్లో. కామం కర్ణాంతవిశ్రాంతే విశాలే తస్య లోచనే,
చక్షుష్మత్తా తు శాస్త్రేణ సూక్ష్మకార్యార్థదర్శినా. 13

వ్యాఖ్య: విశాలే - పెద్దవియైన, తస్యలోచనే - అతనియొక్క కన్నులు, కామం - ఎక్కువగా, కర్ణాంతవిశ్రాంతే - చెవులవరకు వ్యాపించినవి, చక్షుష్మత్తాతు - కనులుగలిగి యుండుటవలని ఫలముమాత్రము, సూక్ష్మకార్యార్థదర్శినా— సూక్ష్మ - ఊహ కందని, కార్యార్థ - చేయఁదగిన పనుల ప్రయోజనమును, దర్శినా - తెలుపునట్టి, శాస్త్రేణ - శాస్త్రముచేతనే. రఘుమహారాజు కన్నులు సువిశాల దీర్ఘములై యుండినవి. కాని, కార్యాకార్య విచారముల యందలి సూక్ష్మదర్శనము మాత్రము శాస్త్రముచేతనే చేయుచుండెను. వివేకవంతులైనవారికి శాస్త్రదృష్టియే నిజమైన దృష్టియని భావము.

శ్లో. లబ్ధప్రశమనస్వస్థ మథైనం సముపస్థితా,
పార్థివశ్రీ ర్ద్వితీ యేవ శరత్ పంకజలక్షణా. 14

వ్యాఖ్య: అథ - తర్వాత, లబ్ధప్రశమన స్వస్థం — లబ్ధ - పొందఁబడిన రాజ్యముయొక్క, ప్రశమన - స్థిరీకరణముచేత, స్వస్థం - సమాహిత చిత్తుఁడయిన, ఏనం - ఈ రఘుమహారాజును, పంకజలక్షణా - కమలములు చిహ్నములుగా గల, శరత్ - శరదృతువు, ద్వితీయా - రెండవదియగు, పార్థివశ్రీః, ఇవ - రాజ్యలక్ష్మి వలె, సముపస్థితా - చేరెను. పితృప్రాప్తమైన రాజ్యమునకు శత్రు నిర్మూలనాదుల చేత స్థైర్యమును జేకూర్చి హాయిగానున్న రఘుమహారాజును కమలాలయయగు లక్ష్మి చేరినట్లే కమలశోభగల శరత్తు రెండవ రాజ్యలక్ష్మిగాఁ జేరెను. అతఁడట్లు సుఖియైయుండగా శరదృతువు వచ్చెనని భావము, "లబ్ధప్రశమనం" అనునది రాజ

నీతి శాస్త్రమందు వాడబడిన ఒకవిశేష శబ్దము. దానినిట్లు నిర్వచించినారు, "రాజ్య స్యాచిర లబ్ధస్య శమనం పరిపంథినాం రంజన ప్రతీకారాభ్యాం లబ్ధప్రశమనం విదుః".

శ్లో. నిర్వృష్టలఘుభి ర్మేఘై ర్ముక్తవర్త్మా సుదుస్సహః,
ప్రతాప స్తస్య భానోశ్చ యుగప ద్వ్యానశే దిశః. 15

వ్యాఖ్య : నిర్వృష్ట లఘుభిః - నిశ్శేషముగా వర్షించుటచేత తేలికపడిన, మేఘైః - మేఘములచేత, ముక్తవర్త్మా - విడువఁబడిన మార్గముగలది (అగుట చేతనే), సుదుస్సహః - మిక్కిలి సహింపరానిదగు, తస్య - అతనియొక్కయు, భానోశ్చ - సూర్యునియొక్కయు, ప్రతాపః - పరాక్రమము, ఎండయును, యుగపత్ - ఏకకాలమునందే, దిశః - దిక్కులను, వ్యానశే - నిశేషముగా వ్యాపించెను. నిశ్శేషముగా వర్షించిన మేఘము లాకాశమార్గమునుండి తొలఁగిపోగానే సూర్యుని యెండయు, వర్షాకాలముపోయి మార్గములు నిష్పంకములు కాగానే రఘుమహారాజు ప్రతాపము, (అనగా సైన్యములు) అన్ని దిక్కులకును వ్యాపించెను. అనఁగా శరదృతువు రాజులకు విజయయాత్రాకాలము గనుక సూర్యాతపమువలె రఘుపరాక్రమము వ్యాపించెనని భావము.

శ్లో. వార్షికం సంజహా రేంద్రో రఘు ర్జైత్రం ధను ర్దధౌ,
ప్రజార్థసాధనే తౌ హి పర్యాయోద్యత కార్ముకౌ. 16

వ్యాఖ్య : ఇంద్రః - ఇంద్రుఁడు, వార్షికం - వర్షహేతువైన, ధనుః - ధనుస్సును, సంజహార - ఉపసంహరించెను, రఘుః - రఘుమహారాజు, జైత్రం - జయశీలమైన, ధనుః - ధనుస్సును, దధౌ - ధరించెను, హి - ఎందువలననగా, తౌ - వారిద్దఱును, ప్రజార్థసాధనే - ప్రజల ప్రయోజనములు నెరవేర్చుట యందు, పర్యాయోద్యత కార్ముకౌ - వరుస ననుసరించి యెత్తబడు ధనుస్సులు గలవారు. మొదట యింద్రుఁడు అన్నపానాదులుగూర్చ వర్షార్థమై ధనువు నెత్తగా పిమ్మట విజయసౌఖ్యాదులు కూర్చుటకై రఘువు ధనుస్సు నెత్తును. ఇద్దఱును ప్రజల శ్రేయస్సునకై యట్లు వరుసతప్పక ధనుర్ధరులగుదురని భావము.

శ్లో. పుండరీకాతపత్ర స్తం వికసత్కాశచామరః,
ఋతు ర్విడంబయామాస న పునః ప్రాప తచ్ఛ్రియమ్. 17

వ్యాఖ్య: పుండరీకాతపత్రః—పుండరీక - శ్వేత పద్మము, ఆతపత్రః - గొడుగుగాగలదియై, వికసత్కాశ చామరః - విరిసిన తెల్లుపూవులు చామరములుగా గలదియై, ఋతుః - శరదృతువు, తం - ఆ రఘుమహారాజును, విడంబయామాస - అనుకరించెను, తచ్ఛ్రియంపునః - అతని కాంతిని మాత్రము, న ప్రాప - పొందలేకపోయెను. రాజుకు శ్వేతచ్ఛత్రము, వింజామరలు చిహ్నములు. ఆ చిహ్నములను బోలిన తామరపువ్వులను, తెల్లుపూవులను ధరించి శరదృతువునైతము రాజు వేషమును వేసెనుగాని యతని కాంతి విశేషమును మాత్రము పొందలేక పోయెనని భావము. శరత్తునందలి తెల్లదామరలు శ్వేతచ్ఛత్రములను, తెల్లుపూవులు తెల్లనివీచోపులను బోలి ఋతుశోభ వినుమడింపఁ జేయుచుండెనన్నది వర్ణనలోని పరమార్థము.

శ్లో. ప్రసాదసుముఖే తస్మిం శ్చంద్రే చ విశదప్రభే,
తదా చక్షుష్మతాం ప్రీతి రాసీత్ సమరసా ద్వయోః. 18

వ్యాఖ్య: ప్రసాదసుముఖే - ప్రసన్న ముఖుఁడైన, తస్మిన్ – ఆ రఘుమహారాజు నందును, విశద ప్రభే – నిర్మల కాంతిగల, చంద్రే చ - చంద్రుని యందును, ద్వయోః - ఇద్దరియందును, తదా - అప్పుడు, చక్షుష్మతాం - కన్నులుగలవారియొక్క, ప్రీతిః – అనురాగము, సమరసా - సమానమైన ఆస్వాదముగలది, ఆసీత్ - అయ్యెను. వెన్నెలలు కురియుచున్న చంద్రునిని, ప్రసన్నముఖుఁడైన రఘువును చూచి ప్రజలు సమానమైన ప్రీతినిఁ బొందుచుండిరి. రఘువు అంత చల్లనివాఁడై ప్రజాపాలనము జేయుచుండెననియు, శరత్తుచంద్రునితో ప్రకాశించుచుండెననియు భావము.

శ్లో. హంసశ్రేణీషు తారాసు కుముద్వత్సు చ వారిషు,
విభూతయ స్తదీయానాం పర్యస్తా యశసా మివ. 19

వ్యాఖ్య: హంసశ్రేణీషు - అంచల బారులయందును, తారాసు - నక్షత్రములయందును, కుముద్వత్సు, వారిషు, చ – తెల్ల కలువలుగల జలములయందును,

తదీయానాం, యశసాం - ఆ రఘుమహారాజువియైన కీర్తులయొక్క. విభూతయః- సంపదలు, పర్యస్తాః ఇవ - వెదజల్లబడినవో యనునట్లుండెను. శరత్తునందు, తెల్లని వైన హంసాదులు విశేష ధావళ్యముగలవై కనబడుచున్నందున వానిపై రఘురాజు కీర్తి సంపదలు చల్లిరాయేమి యన్నట్లుండెను. కీర్తి తెల్లగానున్నట్లు వర్ణించుట కవి సమయము.

శ్లో. ఇక్షుచ్ఛాయనిషాదిన్య స్తస్య గోప్తు ర్గుణోదయం,
ఆకుమారకథోద్ఘాతం శాలిగోప్యో జగు ర్యశః. 20

వ్యాఖ్య: ఇక్షుచ్ఛాయ నిషాదిన్యః - చెఱకుతోటల నీడలలోఁ గూర్చున్న, శాలిగోప్యః - వరిచేల కావరులైన స్త్రీలు, గోప్తుః తస్య - రక్షకుఁడైన ఆ రఘు మహారాజుయొక్క, గుణోదయం - సద్గుణములవలన బుట్టినదియు, ఆ కుమారక దోద్ఘాతం - బాల్యకథలు మొదలుకొని యారంభింపఁ బడినదియునగు, యశః - కీర్తిని, జగుః - గానముచేసిరి. వరిపంటచేలను కాయుటకువచ్చిన ముద్దరాండ్రు సమీపమున దట్టమైయున్న చెఱకుతోట నీడలందుఁగూర్చుని కాలక్షేపమునకై తమ యేలికయగు రఘుమహారాజుయొక్క బాల్యకథలు మొదలుకొని యున్న యశస్సును పాటలుకట్టి పాడుకొనుచుండిరి. శరచ్చిహ్నములైన వరిచేలు, చెరుకుతోటలు, ముద్ద రాండ్ర గానముతో మిక్కిలి శోభించెనని భావము.

శ్లో. ప్రససా దోదయా దంభః కుంభయోనే ర్మహౌజసః,
రఘోః పరిభవాశంకి చుక్షుభే ద్విషతాం మనః. 21

వ్యాఖ్య: మహౌజసః - గొప్ప తేజస్సుగల, కుంభయోనేః - అగస్త్యుని యొక్క (అగస్త్య నక్షత్రముయొక్క), ఉదయాత్ - ఉదయమువలన, అంభః - ఒండునీరు, ప్రససాద - తేరెను, మహౌ జసః - గొప్ప పరాక్రమముగల, రఘోః - రఘు మహారాజుయొక్క. ఉదయాత్ - అభ్యుదయమువలన, పరిభవా శంకి - పరాభవము నూహించుచున్న, ద్విషతాం - శత్రువులయొక్క, మనః - మనస్సు, చుక్షుభే - కలతఁ జెందెను. అగస్త్య నక్షత్రోదయము కాగానే నదీ తటాకములయందలి జలముతేరుకొని నిర్మలమయ్యెననియు, శరదృతువు కావున మహా పరాక్రమ వంతుఁడైన రఘువు జైత్రయాత్రకు బయలుదేరునేమో యని

శత్రురాజుల మనస్సు భయముచేత కలంకబాఱెననియు భావము. అగస్త్యోదయము వలన నీరు నిర్మలమగునని శాస్త్రము.

శ్లో. మదోదగ్రాః కకుద్మంతః సరితాం కూలముద్రుజాః,
లీలాఖేల మనుప్రాపు ర్మహోక్షా స్తస్య విక్రమమ్. 22

వ్యాఖ్య: మదోదగ్రాః - పొగరెక్కినవియు, కకుద్మంతః - గొప్ప మూపురములు గలవియు, సరితాం - నదులయొక్క, కూల ముద్రుజాః - గట్టులను గోరాడునవియు నగుచు, మహోక్షాః - ఆఁబోతులు, లీలాఖేలం - విలాసక్రీడలు గల, తస్య, విక్రమం - ఆ రఘు మహారాజుయొక్క పరాక్రమమును, అనుప్రాపుః - అనుకరించినవి. ఉత్సాహవంతుడు, ఆజానుబాహువు, శత్రుభంజనుడునైన రఘుమహారాజు విక్రమ విలాసమును ఆఁబోతులు అనుకరించుచుఁ దెలిపినవట.

శ్లో. ప్రసవైః సప్తపర్ణానాం మదగంధిభి రాహతాః,
అసూయ యేవ తన్నాగాః సప్తధైవ ప్రసుస్రువుః. 23

వ్యాఖ్య: మదగంధిభిః - మదజలమువంటి పరిమళముగల, సప్తపర్ణానాం, ప్రసవైః - ఏడాకుల యరఁటిచెట్లయొక్క పువ్వులచేత, ఆహతాః - కొట్టబడిన, తన్నాగాః (తత్ + నాగాః) - ఆ రఘు మహారాజుయొక్క యేనుఁగులు, అసూయయేవ (అసూయయా + ఇవ) - పువ్వులయుత్కర్షయందలి అసహనము చేతవలె, సప్తధైవ - ఏడు ప్రకారములుగానే, ప్రసుస్రువుః - మదమును స్రవించినవి. తమ మదమువంటి వాసనగల యేడాకులయరఁటి పువ్వులు తాకగానే వానిని శత్రువులనుగా భావించిన రఘుమహారాజు గజములు తాము మదమును ఏడు ప్రదేశముల నుండి స్రవించినవి. ఏనుఁగులకు తొండపు రెండు రంధ్రములనుండియు, రెండు గండస్థలముల నుండియు, పురుషాంగము నుండియు, రెండుకనులనుండియు మదము స్రవించునని శాస్త్రప్రసిద్ధి కలదు.

శ్లో. సరితః కుర్వతీ గాధాః పథ శ్చాశ్యానకర్దమాన్,
యాత్రాయై చోదయామాస తం శక్తేః ప్రథమం శరత్. 24

వ్యాఖ్య: సరితః - నదులను, గాధాః - లోతులేని వానినిగా (సులభముగా దాటుటకు వీలైనవి), పథశ్చ - మార్గములనుగూడ, ఆశ్యానకర్దమాన్ - ఎండి

పోయిన బురద కలవానిగాను, కుర్వతీ - చేయుచున్నదియై, శరత్ - శరదృతువు, తం - ఆ రఘుమహారాజును, శక్తేః ప్రథమం - ఉత్సాహశక్తికంటె ముందుగా, యాత్రాయై - దిగ్విజయ యాత్రకొఱకు, చోదయామాస - ప్రేరేపించెను. నదులను దాటుటకు వీలుగను, మార్గములను బురద లేనివానిగను మార్చి, శరత్తు, ప్రభు మంత్రశక్తి సంపన్నుఁడైన యతని కుత్సాహశక్తిని జేకూర్చి విజయయాత్ర కానుకూల్యమును గలిగించెను. పరిసరములుచూచిన యతని కుత్సాహము గలిగెననిభావము.

శ్లో. తస్మై సమ్యగ్ఘుతో వహ్ని ర్వాజినీరాజనా విధౌ,
ప్రదక్షిణార్చిర్వ్యాజేన హస్తే నేవ జయం దదౌ. 25

వ్యాఖ్య: వాజి నీరాజనా విధౌ - గుఱ్ఱములకు హారతినిచ్చు శాంతికర్మయందు, సమ్యగ్ఘుతః (సమ్యక్ + హుతః) - యథాశాస్త్రముగా హోమము చేయఁబడిన, వహ్నిః - అగ్ని, ప్రదక్షిణార్చి ర్వ్యాజేన—పదక్షిణ - ప్రదక్షిణముగాఁ దిరిగెడు, అర్చిః - జ్వాలయొక్క, వ్యాజేన - మిషచేత, హస్తేన ఇవ - చేతితోవలె, తస్మై - ఆ రఘువుకొఱకు, జయం - విజయమును, దదౌ - ఇచ్చెను. రఘుమహారాజు శరత్కాలమునందుఁ జేయవలసిన గజాశ్వాది నీరాజన కర్మయందు అగ్నికి హోమముచేయఁగా, ప్రదక్షిణముగాఁ దిరుగుచున్న జ్వాలలద్వారా అగ్ని రాబోవు విజయమును సూచించెనని భావము.

శ్లో. స గుప్తమూలప్రత్యంతః శుద్ధపార్ష్ణి రయాన్వితః,
షడ్విధం బల మాదాయ ప్రతస్థే దిగ్జిగీషయా. 26

వ్యాఖ్య: గుప్తమూలప్రత్యంతః—గుప్త - రక్షింపఁబడిన, మూల - తన నివాస స్థానము, ప్రత్యంతః - ప్రాంత దుర్గమును గలవాఁడును, శుద్ధపార్ష్ణిః - శత్రు నిర్మూలనముచేసి సైన్యముచేత కాపాడఁబడుచున్న పృష్ఠభాగము గలవాఁడును, అయాన్వితః - శుభావహమైన విధానమతోఁ గూడినవాఁడునునగు, సః - అతఁడు, షడ్విధం - ఆఱు విధములైన, బలం - సైన్యమును, ఆదాయ - వెంటఁ బెట్టుకొని, దిగ్జిగీషయా - దిక్కులను జయించు తలంపుచేత, ప్రతస్థే - బయలు

దేరెను. రఘుమహారాజు, తన రాజధానికిని, సమీపదుర్గమునకును, రక్షణ కల్పించి వెనుక భాగమునందు శత్రుభయము లేకుండఁజేసి, శుభప్రదములైన కర్మల నాచరించి, ఆఱు విధములైన దండును వెంటఁబెట్టుకొని, దిగ్విజయ యాత్రకు బయలు దేరెను. "మూలబలము, సుహృద్బలము, భృత్యబలము, శ్రేణీబలము, ద్విషద్బలము, ఆటవిక బలము" అనునవి షడ్విధబలములు.

శ్లో. అవాకిరన్ వయోవృద్ధా స్తం లాజైః పౌరయోషితః,
పృషతై ర్మందరోద్ధూతైః క్షీరోర్మయ ఇవాచ్యుతమ్. 27

వ్యాఖ్య: వయో వృద్ధాః - వయస్సుచేత పెద్దవారైన, పౌరయోషితః - పురస్త్రీలు, తం - ఆ రఘుమహారాజును, లాజైః - వరిపేలాలతో, క్షీరోర్మయః - క్షీర సముద్రమునందలి తరంగములు, మందరోద్ధూతైః - మందర పర్వతముచేత నెగురగొట్టబడిన, పృషతైః - పాలచుక్కలచేత, అచ్యుతం ఇవ - విష్ణుమూర్తిని వలె, అవాకిరన్ - చల్లిరి. రఘుమహారాజు విజయయాత్రకు బయలుదేరి వెళ్లుచుండగా పురమునందలి పెద్దముత్తైదువులు ఆయనమీద మంగళాచారము కొఱకై వరిపేలాలను చల్లిరి, అది మందర పర్వతముచేత చిలుకబడుచున్న క్షీరసాగర వీచికలు పాలతుంపురులను విష్ణుమూర్తిపైఁ జల్లినట్లు మనోహరముగా నుండెను.

శ్లో. స యయౌ ప్రథమం ప్రాచీం తుల్యః ప్రాచీనబర్హిషా,
అహితా ననిలోద్ధూతై స్తర్జయ న్నివ కేతుభిః 28

వ్యాఖ్య: ప్రాచీన బర్హిషా - ఇంద్రునితో, తుల్యః - సమానుఁడైన, సః - ఆతఁడు, అనిలోద్ధూతైః - అనుకూలవాయువుచే రెప రెప లాడింపఁబడుచున్న కేతుభిః - జెండాలచేత, అహితాన్ - శత్రువులను, తర్జయన్ ఇవ - బెదిరించుచున్నవాఁడువలె, ప్రథమం - మొదట, ప్రాచీం - తూర్పు దిక్కును గుఱించి, యయౌ - వెళ్లెను. ఇంద్రతుల్యుఁడైన రఘువు ఇంద్రాధిపత్యముగల తూర్పు దిక్కునకు మొదట బయలుదేరెను. అనుకూల వాయువుచే రెప రెప లాడుచున్న సైన్యపతాకములు శత్రువులను బెదిరించుచున్నట్లుండెను. అనుకూల వాయువు శుభశకునము.

శ్లో. రజోభిః స్యందనోద్ధూతైః గజైశ్చ ఘనసన్నిభైః,
భువ స్తల మివ వ్యోమ కుర్వన్ వ్యోమేవ భూతలమ్. 29

వ్యాఖ్య : స్యందనోద్ధూతైః - రథములచేత రేపఁబడిన, రజోభిః - ధూళులచేతను. ఘనసన్నిభైః - మేఘములతో సమానములైన గజైశ్చ - ఏనుఁగులచేతను, వ్యోమ - ఆకాశమును, భువః తలం ఇవ - భూతలమును వలెను, భూతలం - నేలను, వ్యోమేవ(వ్యోమ+ఇవ) -ఆకాశమునువలెను, కుర్వన్ - చేయుచున్నవాఁడై, యయౌ - వెళ్లెను, రఘుమహారాజుసైన్యసమేతుఁడై వెళ్లుచుండగా రథములచేత రేపఁబడిన దుమ్ము దట్టముగా నలముకొనుటచేత ఆకాశము భూప్రదేశముగాను, నేలపై నడయాడు గజములు ప్రమాణమువందును వర్ణమ్మియందును మేఘములను బోలియుండుటచేత భూతలము అకాశముగాను కనఁబడుచుండెను.

శ్లో. ప్రతాపోఽగ్రే తతః శబ్దః పరాగ స్తదనంతరం
యయౌ పశ్చా ద్రథా దీతి చతుస్కంధేవ సా చమూః 30

వ్యాఖ్య : అగ్రే - ముందు, ప్రతాపః - తేజోవిశేషము, తతః - తరువాత శబ్దం - ధండు యొక్క కలకలము, తదనంతరం - దానితర్వాత, పరాగః - దుమ్ము, పశ్చాత్ - ఆతరువాత, రథాది - రథములు మొదలైన చతురంగబలము. ఇతి - ఈవిధముగా, సా చమూః - ఆ సైన్యము, చతుస్కంధా ఇవ - నాలుగు వ్యూహములుగలదివలె, యయౌ - వెళ్లెను. రఘు మహారాజు సేన నడుచుచుండగా, ముందు ఒకానొక తేజో విశేషము, దాని వెంట సేనా కలకలము, ఆతరువాత ధూళి, అటు పిమ్మట చతురంగబలము, అను వరుసతో నాలుగు వ్యూహములు కలదానివలెఁగనబడెను.

శ్లో. మరుపృష్ఠా న్యుదంభాంసి, నావ్యాః సుప్రతరా నదీః,
విపినాని ప్రకాశాని, శక్తిమత్త్వా చ్చకార సః 31

వ్యాఖ్య : సః - ఆ రఘుమహారాజు, శక్తిమత్త్వాన్ - సమర్థుఁడగుటవలన, మరుపృష్ఠాని - ఎడారిప్రదేశములను, ఉదంభాసి - ఉబికిపైకివచ్చుచున్న జలములు గలవాటినిగాను, నావ్యాః - నౌకలతో దాటిపోఁదగిన, నదీః - నదులను, సుప్రతరాః - సులభముగా దాటఁదగిన వాటినిగాను. విపినాని - అరణ్యములను, ప్రకాశాని - బట్టబయళ్లనుగాను, చకార - చేసెను, సైన్య సమేతుఁడై వెళ్లుచున్న యతఁడు ప్రయాణ సౌకర్యము కొఱకై ఎడారి భూములలో జలమును పుట్టించి, బల్లకట్లతో దాటవలసిన నదులకు సులభముగా దాటు నుపాయములు చేసి, అరణ్యములను

కొట్టించి బయళ్లగా త్వరలో చేయించెను. లేదా ఆయాప్రదేశములను శక్తిసామర్థ్యములచేత సైన్యము సులభముగా దాటిపోవునట్లు చేసెనని భావము.

శ్లో. స సేనాం మహతీం కర్షన్ పూర్వసాగరగామినీం
బభౌ హరజటాభ్రష్టాం గంగా మివ భగీరథః 32

వ్యాఖ్య: పూర్వ సాగరగామినీం - తూర్పు సముద్రమునకు వెళ్లుచున్న, మహతీం, సేనాం - గొప్పసైన్యమును, కర్షన్ సః - వెంటఁగొని పోవుచున్న యతఁడు, హరజటాభ్రష్టాం - శివుని జటాజూటమునుండి జారినదియు, పూర్వసాగరగామినీం - తూర్పుసముద్రమునకు వెళ్లుచున్నదియునగు, గంగాం - గంగానదిని, కర్షన్ - వెంటగొనిపోవుచున్న, భగీరథః ఇవ - భగీరథునివలె, బభౌ - ప్రకాశించెను. అడ్డంకులన్నింటిని అధిగమించి యేక ప్రవాహముగా తూర్పునకు నడచుచున్న సేనను వెంటబెట్టుకొని ముందుకు నడచుచున్న రఘుమహారాజు. శివ జటాజూటమునుండి బయలుదేరి తూర్పు సముద్రమునకు వెళ్లుచున్న గంగానదికి ముందునడచు భగీరథునివలె ప్రకాశించెను. భగీరథుని సంబంధమువలననే గంగకు భాగీరథి యను పేరువచ్చినది. భగీరథుఁడు సగర చక్రవర్తి వంశమునందలి గొప్పరాజఋషి.

శ్లో. త్యాజితైః ఫల ముత్ఖాతై ర్భగ్నైశ్చ బహుధా నృపైః
తస్యాసీ దుల్బణో మార్గః పాదపై రివ దంతినః 33

వ్యాఖ్య: ఫలం - లాభమును, త్యాజితైః - విడిపింపఁబడిన వారును, ఉత్ఖాతైః - అధికారమునుండి తొలగింపబడినవారును, బహుధా - అనేక విధములుగా, భగ్నైశ్చ - భంగపరుపఁబడిన వారునునగు, నృపైః - శత్రురాజులచేత, ఫలం - కాచిన కాపును త్యాజితైః - వదలింప బడినవియు, ఉత్ఖాతైః - పెల్లగింప బడినవియు, భగ్నైశ్చ - విఱువఁబడినవియునగు, పాదపైః - వృక్షములచేత, దంతినః ఇవ - ఏనుగుయొక్కవలె, తస్య - ఆరఘుమహారాజుయొక్క, మార్గః - మార్గము, ఉల్బణః - స్పష్టమైనది, ఆసీత్ - అయ్యెను. ఒకయేనుఁగు వనమునందలి చెట్లయొక్క పూలు, కాయలురాల్చి, పెకలించి, కొమ్మలు విఱిచి ముందుకు వెళ్లిన దారివలె, కొందఱు రాజుల ధనములను గొని, కొందఱిని స్థానభ్రష్టులనుజేసి,

కొందఱినసేక విధములుగా నోడించుచు వెళ్లిన రఘుమహారాజు మార్గము అయన విజయములను స్పష్టముగాఁ దెలుపుచుండెనని భావము.

శ్లో. పౌరస్త్యా నేవ మాక్రామం స్తాంస్తాన్ జనపదాన్ జయీ
ప్రాప తాళీవనశ్యామ ముపకంఠం మహోదధేః 34

వ్యాఖ్య : జయీ - జయశీలుఁడైన రఘుమహారాజు, ఏవం - ఈప్రకారము పౌరస్త్యాన్ - తూర్పుననున్న, తాంస్తాన్ (తాన్ + తాన్) - అయా, జనపదాన్ - దేశములను, ఆక్రామన్ - ఆక్రమించుచు, తాళీవనశ్యామం - తాటితోపులతో శ్యామల వర్ణముగల, మహోదధేః - గొప్పసముద్రముయొక్క, ఉపకంఠం - సమీపమును, ప్రాప - చేరెను. ఈ విధముగా తూర్పు దిక్కునగల ఆ యాదేశము లను జయించి, ఆక్రమించుచు, తాటిచెట్లు దట్టముగా గల సముద్రపు టొడ్డును జేరెను. పౌరస్త్యాః (పౌరస్త్యులు) తూర్పున నున్నవారు; "పురః భవాః పౌరస్త్యాః" అని విగ్రహము. దాక్షిణాత్యాః (దాక్షిణాత్యులు) దక్షిణ దిశయందున్న వారు ; "దక్షిణా భవాః దాక్షిణాత్యాః" పాశ్చాత్యాః (పాశ్చాత్యులు) పడమటనున్నవారు ; "పశ్చాత్ భవాః పాశ్చాత్యాః" "దక్షిణాపశ్చాత్పురస స్త్యక్" అనుపాణిని సూత్రము చేత నీశబ్దములు సిద్ధించెను. ఇందలి "దక్షిణా" శబ్దముగూడ అవ్యయము.

శ్లో. అనమ్రాణాం సముద్ధర్తు స్తస్మాత్ సింధురయా దివ
ఆత్మా సంరక్షితః సుహ్మైః వృత్తి మాశ్రిత్య వైతసీమ్ 35

వ్యాఖ్య : అనమ్రాణాం - లొంగనివారిని, సముద్ధర్తుః - ఉన్మూలించు వాడగు, తస్మాత్ - ఆ రఘు మహారాజువలన, సింధురయాత్ ఇవ - నదీవేగము నుండివలె, సుహ్మైః - సుహ్మదేశపు రాజులచేత, వైతసీం - ప్రబ్బలి చెట్లది యగు, వృత్తిం - ప్రవర్తనను, ఆశ్రిత్య - అవలంబించి, ఆత్మా - ప్రాణము, సంరక్షితః - కాపాడుకోఁబడినది. వంగక లొంగక యెదురు తిరుగువారిని నిర్మూ లనము చేయుచు వచ్చుచున్న రఘుమహారాజు నుండి తప్పించు కొనుటకై సుహ్మ దేశపురాజులు వైతసీవృత్తి నవలంబించి లొంగిపోయి తమ ప్రాణములు కాపాడు కొనిరి. (నదీవేగమునందు నిలుచున్న వృక్షములు నిర్మూలములగును, ప్రవాహాను కూలముగా వంగిపోవునట్టి ప్రబ్బలి చెట్లు నిర్మూలింపబడక, విఱుగక, ప్రవాహము

తగ్గగానే మరల లేచి నిలుచుండును. దానికి "వైతసీవృత్తి" అనిపేరు. సుహ్మ దేశపు రాజు లట్లు చేసిరి.

శ్లో. వంగా నుత్ఖాయ తరసా నేతా నౌసాధనోద్యతాన్
నిచఖాన జయస్తంభాన్ గంగాస్రోతోంతరేషు సః 36

వ్యాఖ్య: నేతా - సైన్యమును వెంటఁగొని పోవుచున్న ఆ రఘురాజు, నౌసాధనోద్యతాన్ - నౌకా సైన్యములతో నెదురించిన, వంగాన్ - వంగ దేశపు రాజులను, తరసా - బలముచేత, ఉత్ఖాయ - ఉన్మూలించి, గంగా స్రోతోంతరేషు గంగాస్రోతః - గంగా నది పాయలయొక్క, అంతరేషు - మధ్యభాగమునగల లంకలయందు,జయస్తంభాన్ - జయ స్తంభములను, నిచఖాన - నాటెను. నాయకుఁడగు రఘుమహారాజు ఓడలపై నెక్కివచ్చి యెదుర్కొనిన వంగదేశపు రాజులను ఓడించి గంగానది లంకలలో తనజయ స్తంభములు నాటించెను.

శ్లో. ఆపాదపద్మప్రణతాః కలమా ఇవ తే రఘుం
ఫలైః సంవర్ధయామాసు రుత్ఖాత ప్రతిరోపితాః 37

వ్యాఖ్య: ఆపాదపద్మప్రణతాః - ఆపాదపద్మ - పాదకమలము వఱకు, ప్రణతాః - వంగిననమస్కరించిన వారు (అగుటవలన), ఉత్ఖాతప్రతిరోపితాః - మొదట రాజ్యాధికారమునుండి తొలగింపఁబడి, మరల ప్రతిష్ఠింపబడినవారగు, తే - ఆ వంగ దేశపురాజులు, ఆపాదపద్మప్రణతాః - పాదములకువరకు వంగినవియై (నారుగా నున్నప్పుడు), ఉత్ఖాతప్రతిరోపితాః - ఊడబెఱికి మరల నాటఁబడిన కలమాః ఇవ - వరిపైరులవలె, రఘుం - రఘుమహారాజును, ఫలైః ధనముల చేత, (వరి పక్షమున ధాన్యములచేత), సంవర్ధయామాసుః - వృద్ధిని పొందించిరి, పాదాక్రాంతులగుటచేత, పదభ్రష్టులై మరల రాజ్యమునందు నిలుపబడిన వంగ రాజులు, ఊడదీసి మరల నాటఁబడిన వరిపైరు దాన్యము నిచ్చునట్లు, రఘు మహా రాజుకు ధనములను కానుకలుగా నిచ్చి సంతోష పరచిరని భావము.

శ్లో. స తీర్త్వా కపిశాం సైన్యైః బద్ధద్విరదసేతుభిః
ఉత్కలైర్దర్శితపథః కళింగాభిముఖో యయౌ. 38

వ్యాఖ్య: సః - అతఁడు, బద్ధద్విరదసేతుభిః—బద్ధ - కట్టఁబడిన, ద్విరద సేతుభిః - ఏనుగులవరుస యనెడు వంతెనలు గల, సైన్యైః - సైన్యములచేత,

కపిశాం - కపిశానదిని, తీర్త్వా - దాటి, ఉత్కలైః - ఓఢ్రరాజులచేత, దర్శితపథః - చూపఁబడిన మార్గముగల వాఁడగుచు, కళింగాభిముఖః - కళింగదేశాభిముఖుడై, యయౌ - వెళ్లెను. వంగదేశవిజయము తరువాత రఘుమహారాజు, ఏనుగులను వరుసగానిలిపి కట్టబడిన వంతెనలమీదుగా కపిశానదిని సైన్య సమేతముగా దాటి ఉత్కలాధిపులు చూపిన మార్గము ననుసరించి కళింగదేశముపైకి వెళ్లెను. ఉత్కళులు దారిని చూపిరనగా వారు రఘుమహారాజు అడుగు పెట్టగానే లొంగి మిత్రులైరని భావము.

శ్లో. స ప్రతాపం మహేంద్రస్య మూర్ధ్ని తీక్ష్ణం న్యవేశయత్
అంకుశం ద్విరదస్యేవ యంతా గంభీరవేదినః. 39

వ్యాఖ్య: సః- ఆ రఘుమహారాజు, మహేంద్రస్య - మహేంద్రపర్వతముయొక్క, మూర్ధ్ని - శిఖరమునందు, తీక్ష్ణం - సహింపశక్యముకాని, ప్రతాపం - పరాక్రమమును, యంతా - మావటివాఁడు, గంభీరవేదినః,ద్విరదస్య - గంభీరవేది. యనఁబడు గజముయొక్క, మూర్ధ్ని -తలమీద, తీక్ష్ణం అంకుశంఇవ - మిక్కిలి పదునుగల అంకుశమును వలె, న్యవేశయత్ - ఉంచెను. కళింగదేశమును జేరిన రఘుమహారాజు అచ్చటి మహేంద్రపర్వతముపైన తన ప్రతాపమును, మావటివాఁడు గంభీరవేది యనఁబడు మదగజము తలపైన నంకుశమునువలె నిలిపెను. మహేంద్రము, సప్తకుల పర్వతములలో నొకటి; అవి "మహేంద్రము, మలయము, సహ్యపర్వతము, శుక్తిమంతము, వృక్షపర్వతము, వింధ్యపర్వతము, పారియాత్రము" అనునవి. "గంభీరవేది" యనఁగా, చర్మమును చీల్చినను, రక్తము కాఱినను, మాంసము ఊడిపడినను మదాతిరేకముచేత నెఱుఁగని గజము. తానెఱిఁగిన శిక్షనుసైతము మదముచే నాలస్యముగాఁ దెలిసికొను గజము "గంభీరవేది" యనఁబడునని మరియొక మతము.

శ్లో. ప్రతిజగ్రాహ కాళింగ స్తమస్త్రై ర్గజసాధనః
పక్షచ్ఛేదోద్యతం శక్రం శిలావర్షీవ పర్వతః. 40

వ్యాఖ్య: గజసాధనః - గజసైన్యము ఎక్కువగానున్న, కాళింగః - కళింగదేశపుఱాజు, అస్త్రైః - ఆయుధములతో, తం - ఆ రఘుమహారాజును, పక్షచ్ఛేదోద్యతం - పక్షచ్ఛేద - పర్వతములయొక్క ఱెక్కలను నఱుకుటయందు,

ఉద్యతం - ఉద్యుక్తుఁడైన, శక్రం - ఇంద్రుని, శిలావర్షి - ఱాళ్లను వర్షించునట్టి, పర్వతః ఇవ - కొండవలె, ప్రతిజగ్రాహ - ఎదుర్కొనెను. తనకుఁగూడ గజసైన్యమధికముగాఁ గలదను గర్వముతో కళింగరాజు, రాలవానతో నొక కొండ ఇంద్రుని దాకినట్లు, రఘుమహారాజును ఆయుధములతో నెదుర్కొనెను. ఈ యుపమానము పర్వత మింద్రునిచేతిలో నోడిపోయినట్లు కళింగరాజు రఘుమహారాజు చేతిలో నోడక తప్పదను విషయమును సూచించును.

శ్లో. ద్విషాం విషహ్య కాకుత్స్థ స్తత్ర నారాచదుర్దినం
సన్మంగళస్నాత ఇవ ప్రతిపేదే జయశ్రియమ్. 41

వ్యాఖ్య: తత్ర - అచ్చట, కాకుత్స్థః - రఘుమహారాజు, ద్విషాం - శత్రువులయొక్క, నారాచదుర్దినం - బాణవర్షమును, విషహ్య - ఓర్చి, సన్మంగళస్నాతః, ఇవ - శుభార్థమైన మంగళస్నానముఁ జేసినవాఁడువలె, జయశ్రియం - విజయలక్ష్మిని, ప్రతిపేదే - పొందెను. ఆ మహేంద్ర పర్వతముమీద కాళింగుల బాణవృష్టిని గురిపింపగా దానిని లీలగా శుభకర్మార్థమైన మంగళస్నానముగా భావించి, వారిని జయించి జయలక్ష్మినిఁ గొనెనని భావము. "దుర్దిన"మనగా నెడతెగని వర్షము పడుచు మేఘావృతమైన ఆకాశముగల రోజు. ఇచ్చట లక్షణచేత "వర్ష"మను నర్థమునందు ప్రయోగింపఁబడినది. యత్తు సర్వౌషధిస్నానం తన్మంగళ ముదీరితం" అని యాదవ నిఘంటువు, శుభకర్మాంగముగా జేయుస్నాన జలమునందు అనేక ఓషధులను గలుపవలసి యుండును. ఆయుద్ధ మతని కంత తేలికగా నుండెనన్నది పరమార్థము.

శ్లో. తాంబూలీనాం దళై స్తత్ర రచితాపానభూమయః
నారికేళాసవం యోధాః శాత్రవం చ పపు ర్యశః. 42

వ్యాఖ్య: తత్ర - ఆ మహేంద్రపర్వతముమీద, యోధాః - యుద్ధభటులు, రచితాపాన భూమయః - తయారు చేసుకోబడినమద్యపాన ప్రదేశములుగలవారై, నారికేళాసవం - కొబ్బరికల్లును, తాంబూలీనాం - తమలపు తీగలయొక్క, దళైః - ఆకులతో, శాత్రవం - శత్రువులకు సంబంధించిన, యశోవ - కీర్తినిబోలె, పపుః - త్రాగిరి. ఆమహేంద్రపర్వతముపై విజయోత్సాహవంతులైన రఘుసైనికులు పానగోష్ఠి ప్రదేశముల నేర్పరచుకొని యచ్చట విరివిగా దొరకునట్టి నారికేళమద్యమును తమల

పోకు దొన్నెలతో త్రాగిరి. కల్లు తెల్లగా నుండును గనుక అది యుద్ధభటులు శత్రువుల కీర్తిని (కీర్తిగూడ తెల్లనిది) త్రాగివేసినట్లుండెనని తాత్పర్యము. ఇచ్చట "యశోవ" అను పదమునందలి 'వ' కారము 'ఇవ' (వలె) అను నర్థమునందు ప్రయోగింపఁబడినది. "ఇవార్థే వ శబ్దో వా శబ్దోనా బోధ్యః" అని ప్రమాణ వచనము.

శ్లో. గృహీతప్రతిముక్తస్య స ధర్మవిజయీ నృపః
శ్రియం మహేంద్రనాథస్య జహార న తు మేదినీమ్. 43

వ్యాఖ్య: ధర్మవిజయీ - ధర్మముకొఱకే జయశీలుఁడైన, సః నృపః - ఆ రఘుమహారాజు, గృహీత ప్రతిముక్తస్య - పట్టుబడి మరల విడువఁబడిన. మహేంద్రనాథస్య - కళింగరాజుయొక్క, శ్రియం - చరాస్తిరూపమైన ధనాది సంపదను. జహార - తీసుకొనెను, మేదినీం తు - భూమినిమాత్రము. న జహార - అపహరించలేదు. జయశీలుఁడైన రఘువు తానుచేయనున్న ధర్మకార్యములకొరకై మహేంద్రనాథుని వస్తుసముదాయమును, ధనమును మాత్రము స్వీకరించి, శరణాగత వాత్సల్యముచేత నతని రాజ్యము నతనికే వదలిపెట్టెనని భావము.

శ్లో తతో వేలాతటేనైవ ఫలవత్పూగమాలినా
అగస్త్యచరితా మాశా మనాశాస్యజయో యయౌ. 44

వ్యాఖ్య: తతః - తూర్పుదిక్కు విజయమును సాధించినపిమ్మట, ఫలవత్పూగమాలినా — ఫలవత్ - బాగాపండిన, పూగ - పోకచెట్లయొక్క, మాలినా - వరుసలుగల, వేలాతటేన, ఏవ - సముద్రతీరము గుండానే, అగస్త్యచరితాం - అగస్త్యమునిచేఁ దిరుగబడిన, ఆశాం - దిక్కును (దక్షిణ దిశను), అనాశాస్యజయః - కోరనక్కరలేని విజయముగల రఘుమహారాజు, యయౌ - చేరెను. ప్రాగ్దిశావిజయమును సాధించినపిమ్మట పోకమ్రాకుల బారులతో మనోహరమైయున్న సముద్రతీర మార్గముగుండానే రఘువు దక్షిణదిక్కును జేరెను. వింధ్యపర్వత గర్వనిర్వాపణము తరువాత అగస్త్యుఁడు దక్షిణభారతము నందలి యరణ్యముననే యుండుటయు, అగస్త్య నక్షత్రము అకాశమునందలి దక్షిణభాగమునందే యుండుటయు, దక్షిణదిక్కును "అగస్త్యచరితామాశాం" అని

కవి నిర్దేశించుటకుఁ గారణములు. ఈవిషయమును బ్రహ్మాండపురాణమిట్లు వివరించి నది "అగస్త్యో దక్షిణా మాశామాశ్రిత్య నభసి స్థితః। వరుణస్యాత్మజో యోగీ వింధ్య వాతాపి మర్దనః".

శ్లో. స సైన్యపరిభోగేన గజదానసుగంధినా
కావేరీం సరితాం పత్యుః శంకనీయా మి వాకరోత్. 45

వ్యాఖ్య: సః - ఆ రఘుమహారాజు, గజదాన సుగంధినా—గజదాన - ఏనుఁగుల మదజలముచేత, సుగంధినా -పరిమళముగలది యగు, సైన్య పరిభోగేన - సైనికులయొక్క అనుభవముచేత, కావేరీం - కావేరీనదిని, సరితాం, ప్రత్యుః - నదులకు భర్తయగు సముద్రునికి, శంకనీయాం, ఇవ - అనుమానింపఁ దగిన దానినివలె, అకరోత్ - చేసెను. రఘుసైన్యగజములు, సైనికులు, తనలో మునుగుటచేత కావేరీజలము పరిమళవంతమైనది. అట్టి కావేరి సముద్రమును జేరినపుడు అమె ఇతరపురుష సంభోగమును జేసెనా యేమి? యని సముద్రుఁడను మానపడునట్లు చేసెనని భావము. ఈశ్లోకమునందలి "గజదాన సుగంధినా" యను సమాసము పాణినీయ వ్యాకరణ విరుద్ధమైనను, "నిరంకుశాః కవయః" యను నభియుక్తోక్తి ప్రకారము గ్రాహ్యమని మల్లినాథసూరి యభిప్రాయము.

శ్లో. బలై రధ్యుషితా స్తస్య విజిగీషో ర్గతాధ్వనః
మరీచోద్భ్రాంతహారీతా మలయాద్రే రుపత్యకాః. 46

వ్యాఖ్య: విజిగీషోః - విజయేచ్ఛ గలవాఁడును, గతాధ్వనః - కడచిన మార్గము గలవాఁడునునగు, తస్య - ఆ రఘుమహారాజుయొక్క, బలైః - సైన్యములచేత, మరీచోద్భ్రాంత హారీతాః—మరీచ - మిరియాల తోటలయందు, ఉద్భ్రాంత - ఎగురుచున్న, హారీతాః - పచ్చపిట్టలు కలవైన, మలయాద్రేః, ఉపత్యకాః - మలయపర్వతముయొక్క క్రింది ప్రదేశములు, అధ్యుషితాః - అధిష్ఠింపఁ బడినవి. దక్షిణదిక్కున కొంతదూరము వెళ్లిన రఘుసైనికులు మిరియాల తోటలు గల మలయపర్వత పాదములమీద విశ్రమించిరి. ఉపత్యకలనగా పర్వతముల నామకొన్న క్రిందిభాగములు.

శ్లో. ససంజు రశ్వక్షుణ్ణానా మేలానా ముత్పతిష్ణవః
తుల్యగంధిషు మత్తేభకటేషు ఫలరేణవః. 47

వ్యాఖ్య : అశ్వక్షుణ్ణానాం - గుఱ్ఱములచేత నలగఁద్రొక్కఁబడిన, ఏలానాం - ఏలకితీగలయొక్క, ఉత్పతిష్ణవః - పై కెగురునవియైన, ఫలరేణవః - కాయల ధూళులు, తుల్యగంధిషః - సమానమైన పరిమళముగల, మత్తేభకటేషు - మదపు టేనుఁగులయొక్క గండస్థలముల యందు, ససంజుః - అంటుకొన్నవి. గుఱ్ఱముల త్రొక్కుడుచేత నలిగి పై కెగసిన యేలకికాయల పొడులు తమవంటి వాసనగల గజ గండస్థలములం దంటుకొన్నవి. అనగా తమవంటివే కనుక మైతిచేత నేలకి పొడుము లచ్చట చేరినవన్నది చమత్కారము.

శ్లో. భోగివేష్టనమార్గేషు చందనానాం సమర్పితం
నాస్రసత్ కరిణాం గ్రైవం త్రిపదీచ్ఛేదినా మపి 48

వ్యాఖ్య : చందనానాం - గంధపు చెట్లయొక్క, భోగివేష్టనమార్గేషు— భోగి - సర్పములయొక్క, వేష్టన - చుట్టుకొనుటచేత నేర్పడిన, మార్గేషు - నిమ్న ప్రదేశములయందు (నరదలయందు). సమర్పితం - ఉంచబడినదై, త్రిపదీ చ్ఛేదినాం, అపి - కాలికట్లను త్రెంచుకొనునవియైనను, కరిణాం - ఏనుఁగుల యొక్క, గ్రైవం - మెడకట్టు, నాస్రసత్ - జాఱలేదు. నిరంతరము సర్పములు చుట్టుకొనుటచేత నరదలేర్పడిన శ్రీగంధపు చెట్లకు గజము మెడకట్లను తగిలించుట చేత ఏనుగులు కాలికట్లు త్రెంచుకున్నను కంఠబంధనలు మాత్రము జారిపోలే దనియు, గంధపు మ్రాకులవద్దనే గజములు నిలిచియుండెననియు భావము. 'త్రిపదీ' యనఁగా ఏనుఁగు కాలిగొలుసు. గంధపుచెట్ల స్కంధములపైఁగల సర్పవేష్టన చిహ్నములు, వానివద్ద నిలిచిన యేనుఁగులు మలయపర్వత శోభ నినుమడింపఁజేసె నన్నది చమత్కారము.

శ్లో. దిశి మందాయతే తేజో దక్షిణస్యాం రవే రపి
తస్యామేవ రఘోః పాండ్యాః ప్రతాపం న విషేహిరే. 49

వ్యాఖ్య : దక్షిణస్యాం దిశి - దక్షిణ దిక్కునందు, రవేః అపితేజః - సూర్యునియొక్క తేజస్సుకూడ, మందాయతే - తగ్గును, తస్యాం ఏవ దిశి - ఆ దిక్కునందే, పాండ్యాః - పాండ్యదేశరాజులు, రఘోః ప్రతాపం - రఘుమహా రాజుయొక్క పరాక్రమమును, న విషేహిరే - సహింపలేకపోయిరి. దక్షిణాయ నమునందు సూర్యునియెండ తక్కువగానుండును. అనగా దక్షిణ దిశయందు

సూర్యుఁడు సైతము పాండ్యరాజులకు వెఱచి మందతేజుఁడగుచున్నాఁడు. అట్టి దక్షిణదిశయందు విజయమునకై వచ్చిన రఘుమహారాజు తేజమును పాండ్యులు సహించలేకపోయిరి. సూర్యునిగూడ జయించిన పాండ్యులను జయింపఁగలుగుట రఘుమహారాజుయొక్క పరాక్రమమునకు ఉత్కర్ష.

శ్లో. తామ్రపర్ణీసమేతస్య ముక్తాసారం మహోదధేః
తే నిపత్య దదు స్తస్మై యశః స్వమివ సంచితమ్ 50

వ్యాఖ్య: తే - ఆపాండ్యరాజులు, తామ్రపర్ణీసమేతస్య - తామ్ర పర్ణీనదితో గూడిన, మహోదధేః - మహాసముద్రము యొక్క, సంచితం - కూడ బెట్టబడిన ముక్తాసారం - శ్రేష్ఠమైన ముత్యమును, స్వం సంచితం యశః ఇవ - తమ దాచి యుంచబడిన కీర్తినివలె, తస్మై - ఆ రఘుమహారాజు కొఱకు, నిపత్య - నమస్కరించి, దదుః - ఇచ్చిరి. పాండ్యరాజులు రఘుమహారాజు కాళ్లపైఁబడి, తామ్రపర్ణీ సాగర సంగమ ప్రదేశమున తమకు లభించిన ఒక గొప్పముత్యమును (లేదా ముత్తెముల రాశిని), చిరసంచితమైన తమ యశస్సును వలె నతనికి సమర్పించిరి. ఆవిధముగా శరణు వేడిరని భావము. ముత్యములు, యశస్సును తెల్లనివి గనుక పోలిక చెప్పఁబడినది.

శ్లో. స నిర్విశ్య యథాకామం తటే ష్వాలీఢ చందనౌ
స్తనా వివ దిశ స్తస్యాః శైలౌ మలయదర్దురౌ. 51

అసహ్యవిక్రమః సహ్యం దూరాన్ముక్త ముదన్వతా
నితంబ మివ మేదిన్యాః స్రస్తాంశుక మలంఘయత్. 52

వ్యాఖ్య: అసహ్యవిక్రమః సః - సహింపరాని పరాక్రమముగల ఆ రఘుమహారాజు, తటేషు - చఱియలమీద, ఆలీఢచందనౌ - వ్యాపించిన చందన వృక్షములుగలవియై, (స్తనముల పక్షమున గంధపుఁబూతగల), తస్యాః దిశః - ఆ దక్షిణ దిశకు, స్తనౌ ఇవ - స్తనములవలెనున్న, మలయదర్దురౌ శైలౌ - మలయము, దర్దురము అను పేరుగల పర్వతములను, యథాకామం - ఇచ్చ వచ్చినట్లు నిర్విశ్య - అనుభవించి, ఉదన్వతా - సముద్రునిచేత, దూరాన్ముక్తం (దూరాత్ + ముక్తం)-దూరముగా వదలబడినదియై, స్రస్తాంశుకం - జాఱిన చీరగల, మేదిన్యాః

నితంబమివ - భూదేవి పిఱుదువలెనున్న, సహ్యం - సహ్య పర్వతమును, అలంఘయత్ - దాటెను. సైన్యసమేతుఁడైన రఘుమహారాజు మలయ దర్దుర పర్వతముల విడుదులను పూర్తి చేసికొని, సహ్యాద్రిని దాటి వెళ్లెననునది ముఖ్యాంశము. కాని చందన బహుళములైన మలయ దర్దురములు భూదేవి స్తనములుగా నుత్ప్రేక్షింపఁబడుట వలన వాటిని యథేచ్ఛగా అనుభవించి, సముద్రమునకు కొంచెము దూరముగా నున్న సహ్యాద్రి తెల్లనిచీర క్రిందికి జాఱిన భూదేవినితంబముగా నుత్ప్రేక్షింపఁబడుటచేత దానిని దాటి వెళ్లెననునది తాత్పర్యము. కాగా, భూభర్తయగు రఘువు, చందన చర్చిత స్తనద్వయము, స్రస్తాంశుకమైన నితంబమును గల భూదేవిని భోగించెనని ననునది ఉత్ప్రేక్ష లబ్ధమైన వ్యంగ్యార్థము. ఇది రెండు శ్లోకములు కలిపి చెప్పిన వాక్యము. ఇట్టి దానిని "కుళకం" అందురు.

శ్లో. తస్యానీకై ర్విసర్పద్భి రపరాంతజయోద్యతైః
రామాస్త్రోత్సారితో ప్యాసీత్ సహ్యాలగ్న ఇవార్ణవః. 53

వ్యాఖ్య : అపరాంతజయోద్యతైః అపరాంత - పశ్చిమదేశముల యొక్క జయోద్యతైః జయమునందు ఉద్యుక్తము లైనవియు, విసర్పద్భిః - ముందుకు నడుచుచున్నవి యునైన, తస్యఅనీకైః - అరఘుమహా రాజుయొక్క సైన్యముల చేత, అర్ణవః - సముద్రము, రామాస్త్రోత్సారితోపి. రామాస్త్ర - పరశురాముని బాణములచేత, ఉత్సారితః అపి-దూరముగా తొలగింపఁబడినదైనను, సహ్యలగ్నః ఇవ - సహ్య పర్వతమునకంటుకొని యున్నదాని వలెనే, ఆసీత్ - ఉండెను (కనపడెను). పూర్వము సహ్యపర్వతము నంటుకొనియున్న సముద్రమును పరశురాముఁ డస్త్రములచేత దూరముగా నెట్టుటవలన సహ్యాద్రికిని సముద్రమునకును నడుమ బయలు ఏర్పడెను. ఇప్పుడు రఘు సైన్యములు సహ్యాద్రిని దిగి పశ్చిమాభిముఖములై వెళ్లుచుండగా బయలు ప్రదేశము నిండిపోయి మరల సముద్రము సహ్యాద్రినంటుకొని యున్నట్లుగానే కనబడుచుండెనని భావము. అపరాంతాః - పాశ్చాత్య దేశములు. "అపరాంతాస్తు పాశ్చాత్యాః" అని యాదవ నిఘంటువు.

శ్లో. భయోత్సృష్టవిభూషాణాం తేన కేరళయోషితాం
అలకేషు చమూరేణు శ్చూర్ణప్రతినిధీకృతః 54

వ్యాఖ్య: తేన - అరఘుమహారాజు చేత, భయోత్సృష్టవిభూషాణాం - భయముచేత తీసివేయఁబడిన సొమ్ములుగల, కేరళయోషితాం - కేరళ దేశ స్త్రీల

యొక్క, అలకేషు - ముంగురులయందు, చమూరేణుః - సైన్యధూళి, చూర్ణప్రతినిధీకృతః - చూర్ణ - కుంకుమాది చూర్ణములకు, ప్రతినిధీకృతః - బదులుగాఁ జేయబడెను. రఘుసైన్యములు ప్రవేశింపగానే భయపడి, ఆభరణములు తీసివేసి పారిపోవుచున్న కేరళ దేశస్త్రీలముంగురులపైఁబడిన సైన్యధూళి వారికి కుంకుమాది చూర్ణముల శోభను గలిగించెను.

శ్లో. మురళా మారుతోద్ధూత మగమత్ కైతకం రజః
తద్యోధ వారవాణానా మయత్న పటవాసతామ్. 55

వ్యాఖ్య: మురళామారుతోద్ధూతం - మురళామారుత - మురళానదిపైనుండివచ్చు గాలిచేత, ఉద్ధూతం - రేపఁబడినదియగు, కైతకం - మొగలి పూలకు సంబంధించిన, రజః - ధూళి, తద్యోధవారవాణానాం - తద్యోధ - ఆ రఘుమహారాజు యుద్ధభటులయొక్క, వారవాణానాం - కవచములకు, అయత్నపటవాసతాం - ప్రయత్నము లేకయే కలిగిన బుక్కాతనమును, అగమత్ - పొందెను. మురళానదిపై నుండి వచ్చుగాలిచే నెగిరిన మొగలిపుప్పొడి ఆ రఘుసైనికుల కవచములపైఁబడి, అప్రయత్నముగా వారికి లభించిన బుక్కాపొడివలె నుండెను. చల్లదనము, మెల్లదనము, పరిమళమును గల వాయువులచేత సైనికుల శ్రమ తగ్గుచుండెనని భావము.

శ్లో. అభ్యభూయత వాహానాం చరతాం గాత్రసంజితైః
వర్మభిః పవనోద్ధూత రాజతాళీ వనధ్వనిః. 56

వ్యాఖ్య: చరతాం - నడచుచున్న, వాహానాం - గుఱ్ఱములయొక్క, గాత్రసంజితైః - శరీరములపైఁ గట్టబడిన, వర్మభిః - కవచములచేత (కొయిరాలేక జీను అనఁబడువాని చేత), పవనోద్ధూత రాజతాళీవన ధ్వనిః—పవన - గాలిచేత, ఉద్ధూత - బాగా కదల్పఁబడిన, రాజతాళీవన - శ్రీతాళవృక్షవనముయొక్క, ధ్వనిః - శబ్దము, అభ్యభూయత - మరుగుపరుపఁ బడెను. గుఱ్ఱపుసైన్యము నడచుచుండగా గుఱ్ఱములమీది జీనులచప్పుడు అధికముగా వినవచ్చుచు, తాటితోపుల మర్మరధ్వనిని మరగుపరచెను. అనగా రెండు ధ్వనులును ఒకమాదిరివే యగుటచేత గుఱ్ఱముల కవచధ్వనులలో అంతకంటె తక్కువస్థాయిలోనున్న తాళీవనధ్వని వినపడకపోయెనని భావము.

శ్లో. ఖర్జూరీ స్కంధ నద్ధానాం మదోద్గార సుగంధిషు
కటేషు కరిణాం పేతుః పున్నాగేభ్యః శిలీముఖాః. 57

వ్యాఖ్య: ఖర్జూరీ స్కంధ నద్ధానాం — ఖర్జూరీ - చిట్టీత చెట్లయొక్క, స్కంధ - బోదెలకు, నద్ధానాం - కట్టివేయఁబడిన, కరిణాం - ఏనుఁగులయొక్క, మదోద్గార సుగంధిషు—మదోద్గార - మదస్రావముచేత, సుంగంధిషు - సువాసన గల, కటేషు - గండస్థలముమీది, శిలీముఖాః - తుమ్మెదలు, పున్నాగేభ్యః - పొన్నపూవులనుండి, పేతుః - వ్రాలినవి. దండు విడిసినప్పుడు ఏనుఁగులను చిట్టీత చెట్లకుఁగట్టివేయగా, సమీపమున పొన్నచెట్లపైనున్న తుమ్మెదలు పొన్న పూవులను విడిచి మదస్రావ సుగంధముగల గజ గండస్థలములపై వ్రాలెను. పొన్నలకంటె కరి గండస్థలములు ఎక్కువ పరిమళముగలవియై యుండుట కారణ మని భావము.

శ్లో. అవకాశం కిలోదన్వాన్ రామాయాభ్యర్థితో దదౌ
అపరాంత మహీపాల వ్యాజేన రఘవే కరమ్. 58

వ్యాఖ్య: ఉదన్వాన్ - సముద్రుఁడు, రామాయ - పరశురామునికి, అభ్యర్థితః - యాచింపఁబడిన వాఁడై అవకాశం - నివసించుటకు చోటును, దదౌకిల - పూర్వమిచ్చియుండెనుగదా, రఘవేతు - రఘు మహారాజు కొఱకేమో, అపరాంత మహీపాల వ్యాజేన - పాశ్చాత్యరాజులను మిష చేత, కరం - కప్పమునే, దదౌ - ఇచ్చెను. పూర్వము బ్రాహ్మణులు కోరగా భూమండలమును వదలిపెట్టుట కంగీక రించిన పరశురాముఁడు, తనకు నివసించుట కవకాశమునిమ్మని ప్రార్థింపఁగా సముద్రుఁ డంగీకరించి యిచ్చెను. ఇప్పుడు రఘుమహారాజు కోరకపోయినను పాశ్చాత్యప్రభువులను నెపమున తానే కప్పమునిచ్చెను. అపరాంత దేశములు సముద్ర మధ్యస్థములగుటచేత వారిచ్చిన కప్పములను సముద్రుఁడే యిచ్చినట్లు ఆరోపింపఁబడినది. ఈదానము భయముచేతగాని యాచనచేతగాదు, కనుక పరశు రామునికన్న రఘుమహారాజు గొప్పవాఁడని భావము.

శ్లో. మత్తేభ రదనోత్కీర్ణ వ్యక్త విక్రమ లక్షణం
త్రికూట మేవ తత్రోచ్చై ర్జయ స్తంభం చకార సః. 59

వ్యాఖ్య: తత్ర - ఆ పడమటిదిక్కున, సః - ఆ రఘుమహారాజు, మత్తేభ రదనోత్కీర్ణ వ్యక్తవిక్రమ లక్షణం—మత్తేభరదన - మదవుటేనుఁగుల దంతములయొక్క, ఉత్కీర్ణ - గీరలనెడి, వ్యక్తవిక్రమ లక్షణం - స్పష్టముగాఁ గనపడునట్టి విక్రమ చిహ్నములుగల, త్రికూట మేవ - త్రికూట పర్వతమునే, ఉచ్చైః - ఉన్నతమైన, జయస్తంభం - విజయధ్వజమునుగా, చకార - చేసెను. అక్కడ రఘుసైన్య గజములు కోరాడుటచేత త్రికూటపర్వత సానువులపై స్పష్టమైన గీతలేర్పడెను. ఆ గీతలే విజయమును దెలుపు నక్షరములుగా భావింపఁ బడి, సమున్నతమైన త్రికూటపర్వతమునే తన దిగ్విజయ స్తంభమునుగా జేసెనని భావము. 'ఉత్కీర్ణ' శబ్దము చెక్కబడిన యక్షరములను సూచించును.

శ్లో. పారసీకాం స్తతో జేతుం ప్రతస్థే స్థలవర్త్మనా
ఇంద్రియాఖ్యా నివ రిపూం స్తత్త్వజ్ఞానేన సంయమీ. 60

వ్యాఖ్య: తతః - అటుతర్వాత, సః - ఆ రఘుమహారాజు, సంయమీ - యోగి, తత్త్వజ్ఞానేన - ఆత్మజ్ఞానముచేత, ఇంద్రియాఖ్యాన్ - ఇంద్రియములను పేరుగల, రిపూన్ ఇవ - శత్రువులనువలె, స్థలవర్త్మనా - భూమార్గముద్వారా, పారసీకాన్ - పారసీక దేశపురాజులను, జేతుం- గెలుచుటకు, ప్రతస్థే - ప్రయాణము చేసెను. యోగీశ్వరుఁడు తత్త్వజ్ఞానముచేత అంతశ్శత్రువులైన యింద్రియములను జయించినట్లు, సంపూర్ణముగా జయించుటకై పారసీకులపైకి వెళ్లెను. సముద్రయానము నిషిద్ధమగుటచేత జలమార్గము దగ్గరిదైనను స్థలమార్గమునందే ప్రయాణము చేసెను.

శ్లో. యవనీ ముఖ పద్మానాం సేహే మధుమదం న సః
బాలాతప మివాబ్జానా మకాలజలదోదయః. 61

వ్యాఖ్య: సః - ఆ రఘుమహారాజు, యవనీముఖ పద్మానాం—యవనీ - యవనస్త్రీలయొక్క, ముఖపద్మానాం - కమలములవంటి ముఖములయొక్క, మధుమదం - మద్యముచేత గలుగు మదరాగమును, అకాల జలదోదయః - వర్షాకాలము కాని సమయమునందలి, మేఘోదయము, అబ్జానాం - తామర పువ్వులకు సంబంధించిన, బాలాతపం ఇవ - లేత యెండనువలె, నసేహే - సహింపకపోయెను, అకాలమునవచ్చిన మేఘము కమలవికాసమును గలిగించు లేతయెండను దొల

గించునట్లు రఘు మహారాజు యవనస్త్రీల ముఖములపైఁ గలుగు మధుమదమును సహింపలేకపోయెను. అనగా రఘువు యవనవీరులను యుద్ధమున కాహ్వానించుట చేత యవనస్త్రీలకు భర్తలతోఁగలిసి చేయునట్టి మధుపానము, తన్మూలకమైన ముఖమునందలి మదవిలాసము లేకపోయెనని భావము. వర్షాకాలమునందు కమల వికాసమునకే యవకాశలేదుకనుక "అకాల జలదోదయః" అనిచెప్పెను. దీనివలన యవనులకు గలిగిన హఠాద్వియోగము సూచితము.

శ్లో. సంగ్రామ స్తుముల స్తస్య పాశ్చాత్త్యై రశ్వసాధనైః
శార్ఙ్గకూజిత విజ్ఞేయ ప్రతియోధే రజ స్యభూత్. 62

వ్యాఖ్య: తస్య - ఆ రఘుమహారాజునకు, అశ్వసాధనైః - గుఱ్ఱములు ముఖ్యసాధనములుగాగల, పాశ్చాత్త్యైః - పడమటివారైన యవనులతో, శార్ఙ్గకూజిత విజ్ఞేయ ప్రతియోధే—శార్ఙ్గకూజిత - ధనుష్టంకారములచేత (లేదా ఊద బడుచున్న కొమ్ములధ్వనితో), విజ్ఞేయ - తెలిసికోఁదగిన, ప్రతియోధే - శత్రు భటులుగల, రజసి - ధూళియందు, తుములః సంగ్రామః - సంకులయుద్ధము, అభూత్ - జరిగెను. పారసీకులకు గుఱ్ఱపుదండు ముఖ్యసాధనము కనుక దానితో వారు రఘుమహారాజు సైన్యము నెదుర్కొనగా విశేషమైన దుమ్ము రేగెను. ఆ ధూళిలో ఎవరు తమవారో ఎవరు పగవారో తెలియకుండుటచేత ధనుష్టంకారమువల్లను, కొమ్ముబాకాల ధ్వనులచేతను గుర్తించుచు యుద్ధముచేసిరి. ఆ విధముగా నచ్చట దొమ్మియుద్ధము జరిగెను. శృంగముచేత చేయఁబడినది శార్ఙ్గము - ధనుస్సు. శృంగమునకు సంబంధించిన ధ్వనియు శార్ఙ్గమే.

శ్లో. భల్లాపవర్జితై స్తేషాం శిరోభిః శ్మశ్రులై ర్మహీం
తస్తార సరఘావ్యాప్తైః స క్షౌద్రపటలై రివ. 63

వ్యాఖ్య: సః - ఆ రఘుమహారాజు, భల్లాపవర్జితైః - బల్లెములచేత తొలగింపఁ బడినవియు, శ్మశ్రులైః - పెరిగిన గడ్డములును, మీసములును గలవియు నగు, తేషాంశిరోభిః - ఆ యవనులయొక్క తలలతో, సరఘావ్యాప్తైః - తేనెటీగల చేత వ్యాపించిన, క్షౌద్రపటలైఃఇవ - తేనెపట్టులచేతవలె (తేనెతెట్టెలచేత), మహీం - నేలను, తస్తార - కప్పివేసెను. గడ్డములు, మీసములు పెరిగియున్న

పారసీక సైనికుల తలలను బల్లెములతో తొలగించి నేలపైఁ బడవేయగా, అవి తేనెటీగలతో చుట్టుకోఁబడిన తేనెపట్టులుగా నుండినవి. అట్టి యసంఖ్యాకములైన శిరస్సులతో రఘుమహారాజు నేలను కప్పివేసెను. నేలయంతయు శ్మశ్రులములగు తలకాయలతో పరువఁబడి యుండెనని భావము.

శ్లో. అపనీతశిరస్త్రాణాః శేషా స్తం శరణం యయుః ;
ప్రణిపాతప్రతీకారః సంరంభో హి మహాత్మనామ్. 64

వ్యాఖ్య : శేషాః - చావక మిగిలిన పారసీకులు, అపనీత శిరస్త్రాణాః - తీసివేయబడిన శిరస్త్రాణములు (బొమిడికలు) గలవారగుచు, తం - ఆ రఘుమహారాజును, శరణంయయుః - శరణుజొచ్చిరి, హి - అదియుక్తమే, మహాత్మనాం - గొప్పవారియొక్క, సంరంభః - కలఁత (ఉద్రేకము), ప్రణిపాత ప్రతీకారః___ ప్రణిపాత - నమస్కారమే (కాళ్లపైఁబడుటయే), ప్రతీకారః - ప్రతిక్రియగాఁ గలది. హతశేషులైన పారసీకులు తమ తలలపైనుండిన శిరస్త్రాణములను దీసి రఘుమహారాజు పాదములపైఁబడి శరణువేడిరి. మహాత్ములకు పరుల యౌద్ధత్యమే కిట్టదుగాని వారి ప్రాణములు కావు కనుక, రఘుమహారాజు సంరంభమును తగ్గించుటకై వారట్లుచేసిరి. యుద్ధమునందు శిరస్త్రాణములుదీయుట శరణాగత లక్షణము. రఘువు శాంతించెనని భావము.

శ్లో. వినయంతేస్మ తద్యోధా మధుభి ర్విజయశ్రమం
ఆస్తీర్ణాజినరత్నాసు ద్రాక్షావలయభూమిషు. 65

వ్యాఖ్య ; తద్యోధాః - ఆ రఘుమహారాజుయొక్క భటులు, ఆస్తీర్ణాజిన రత్నాసు___ఆస్తీర్ణ - పరువఁబడిన. అజినరత్నాసు - శ్రేష్ఠములైన చర్మములుగల, ద్రాక్షావలయభూమిషు - ద్రాక్షపొదలక్రింది నేలలమీద, మధుభిః - మద్యములచేత, విజయశ్రమం - విజయమువలన గలిగిన యలసటను, వినయంతేస్మ - తొలగించుకొనిరి. పారసీక విజయానంతరము రఘురాజ భటులు ద్రాక్షపొదలక్రింది నేలలపై మంచి చర్మములు పరచుకొని, యచ్చట కూర్చుని, మంచి మద్యములు త్రాగుచు, తమ యుద్ధవిజయశ్రమను పోగొట్టుకొనిరి. "వినయంతే" అను వర్తమాన క్రియకు 'స్మ' అనుదానిని చేర్చినందున అది భూతకాలికమైన అర్థమును దెలుపును.

  

శ్లో. తతః ప్రతస్థే కౌబేరీం భాస్వా నివ రఘు ర్దిశం
శరై రుస్రై రివోదీచ్యా నుద్ధరిష్యన్ రసా నివ. 66

వ్యాఖ్య: తతః - తర్వాత, రఘుః - రఘుమహారాజు, భాస్వానివ - సూర్యుఁడువలె, శరైః - బాణములచేత, ఉస్రైరివ (ఉస్రైః + ఇవ) - కిరణములచేతవలె, ఉదీచ్యాన్ - ఉత్తరప్రాంత రాజులను, రసానివ - ఉదకములనువలె, ఉద్ధరిష్యన్ - నిర్మూలము చేయఁగలవాడగుచు, పీల్చివేయఁగలవాఁ డగుచు, కౌబేరీం - కుబేరునికి సంబంధించిన, దిశం - దిక్కును (ఉత్తర దిక్కును గుఱించి), ప్రతస్థే - తరలెను. ఉత్తరాయణమునందు సూర్యుఁ డేవిధముగా తన కిరణములచేత నుదకములను పీల్చివేయునో అట్లు ఉదీచ్యులగు రాజులను తన బాణములచేతనిర్మూలింపఁగలవాఁడై ఉత్తర దిక్కునకు రఘుమహారాజు పయనించెను. "కుబేరస్య ఇయం కౌబేరీ" కుబేరుఁడు దిక్పాలకుం డగుటచేత నుత్తర దిక్కునకు "కౌబేరి" అన్న పేరు వచ్చినది. "ఉదక్ భవాః" ఉదీచ్యాః - ఉత్తర దిక్కున నున్నవారు.

శ్లో. వినీతాధ్వశ్రమా స్తస్య సింధుతీర విచేష్టనైః
దుధువు ర్వాజినః స్కంధాన్ లగ్నకుంకుమకేసరాన్. 67

వ్యాఖ్య: సింధుతీరవిచేష్టనైః—సింధుతీర - సింధునదముయొక్క ఒడ్డుల మీద, వి చే ష్ట నై ః - పొరలుటలచేత, వినీతాధ్వశ్రమాః - తొలగించుకోఁబడిన మార్గాయాసముగల, తస్యవాజినః - ఆ రఘుమహారాజుయొక్క గుఱ్ఱములు, లగ్నకుంకుమకేసరాన్ — లగ్న - తమ కంటుకొన్న, కుంకుమకేసరాన్ - కుంకుమపూలయొక్క కింజల్కములుగల, స్కంధాన్ - జూలుతోనున్న బుజములను (కందములను) దుధువుః - దులుపుకొన్నవి. కాశ్మీరదేశమునందలి సింధునదముయొక్క గట్టులమీద ఇటునటు దొరలి మార్గాయాసమును దీర్చుకొన్న రఘుమహారాజు గుఱ్ఱములు, అక్కడ తమ జూలువెంట్రుకలకును, శరీరములకును అంటుకొన్న కుంకుమపూల కింజల్కములను లేచి నిల్చుని బాగా దులుపుకొన్నవి. కాశ్మీరదేశమునందలి కాశ్మీర బాహుళ్యమును ఈ వర్ణనము సూచించును.

శ్లో. తత్ర హూణావరోధానాం భర్తృషు వ్యక్తవిక్రమం
కపోలపాటలాదేశి బభూవ రఘుచేష్టితమ్. 68

వ్యాఖ్య: తత్ర - ఆ యుత్తర దేశమునందు. భర్తృషు - తమ భర్తల విషయమున, వ్యక్తవిక్రమం - స్పష్టమైన పరాక్రమముగలది యగు, రఘుచేష్టితం - రఘువుయొక్క వ్యాపారము, హూణావరోధానాం—హూణ - హూణదేశపు రాజులయొక్క, అవరోధానాం - అంతఃపుర స్త్రీలకు, కపోల పాటలాదేశి - చెక్కిళ్లపై నెఱ్ఱదనమును నేర్పునది. బభూవ - అయ్యెను. హూణరాజుల వధచేత వ్యక్తమైన రఘుమహారాజు పరాక్రమము వారి భార్యలకు చెక్కిళ్లపై పాటల వర్ణము నుపదేశించినది. అనగా మృతులైన భర్తలకొఱకై యేడ్చుచు మొగమ్మును బాదుకొన్నవారి కపోలములమీద నెఱ్ఱదనము కలిగెననియు, అది రంజకద్రవ్యము లేకయే కలిగినదనియు భావము. పరాక్రమ మెఱ్ఱనిది కనుక అట్లు సర్వత్ర వ్యాపించగలిగినది.

శ్లో. కాంభోజాః సమరే సోఢుం తస్య వీర్య మనీశ్వరాః
గజాలాన పరిక్లిష్టై రంకోలైః సార్థ మానతాః. 69

వ్యాఖ్య: కాంభోజాః - కంబోజదేశపు రాజులు, సమరే - యుద్ధములో, తస్య - అతనియొక్క, వీర్యం - పరాక్రమమును, సోఢుం - సహించుటకు, అనీశ్వరాః - శక్తిలేనివారగుచు, గజాలాన పరిక్లిష్టైః—గజాలాన - ఏనుగుల కాలి కట్లచేత, పరిక్లిష్టైః - రాచుకొఁబడిన, అంకోలైః సార్థం - ఊడుగుచెట్లతోగూడ, ఆనతాః - వంగిపోయిరి. కంభోజదేశపు రాజులు యుద్ధమునందు రఘుమహారాజు పరాక్రమమునకు తట్టుకొనఁజాలనివారై, సైన్యగజములవి కాలిగొలుసుల రాపిడికిన్ని ఈడ్పునకున్ను అచ్చటి యూడుగచెట్లు వంగిపోయినట్లే తామున్ను లొంగిపోయిరి.

శ్లో. తేషాం సదశ్వభూయిష్ఠా స్తుంగద్రవిణ రాశయః
ఉపదా వివిశుః శశ్వ న్నోత్సేకాః కోసలేశ్వరమ్. 70

వ్యాఖ్య: తేషాం - ఆ కాంబోజరాజులయొక్క, సదశ్వ భూయిష్ఠాః - మంచి గుఱ్ఱములచేత నధికములైన, తుంగద్రవిణరాశయః - ఎత్తైన ధనరాసుల రూపముననున్న. ఉపదాః - కానుకలు, శశ్వత్ - మాటిమాటికిని (అడుగడుగున), కోసలేశ్వరం - రఘుమహారాజును, వివిశుః - చేరినవి, ఉత్సేకాః - గర్వములు మాత్రము, నవివిశుః - చేరలేదు. మంచిమంచి గుఱ్ఱము లెక్కువగానున్న గొప్ప

ఘనతాసులను ఆ కాంభోజరాజులు రఘుమహారాజుకు కానుకలుగా ననేక పర్యాయములుగా నిచ్చిరి. అన్ని కానుకలు లభించినను రఘువు గర్వపడలేదు.

శ్లో. తతో గౌరీగురుం శైల మారురోహాశ్వసాధనః
వర్ధయ న్నివ తత్కూటా నుద్ధూతై ర్ధాతురేణుభిః 71

వ్యాఖ్య : తతః - తర్వాత, అశ్వసాధనః - గుఱ్ఱములను సాధనముగాఁ జేసి కొన్న రఘుమహారాజు, గౌరీగురుం - పార్వతికి తండ్రియగు, శైలం - పర్వతమును (హిమవత్పర్వతమును), ఉద్ధూతైః - గుఱ్ఱముల గిట్టలచే రేపఁబడిన ధాతురేణుభిః - గైరికాది ధాతువుల యొక్క ధూళులచేత, తత్కూటాన్ - ఆహిమాలయము యొక్క శిఖరములను, వర్ధయన్ ఇవ - వృద్ధిని పొందించుచున్న వాఁడువలె, ఆరురోహ - ఎక్కెను. అంతవఱకు గజసాధనుఁడై వెళ్లిన రఘు మహారాజు, అప్పుడు కాంభోజులిచ్చిన గుఱ్ఱముల నుపయోగించుకొని (అవి పర్వతము లెక్కజాలును గనుక) హిమాలయముపైకిఁ దరలెను. అట్లు వెళ్లుచున్నప్పుడు గుఱ్ఱముల గొరిజల త్రొక్కిడిచే రేగిన ఆయాధాతువుల ధూళి పైకెగసి హిమవత్పర్వత శిఖరములను పెంచుచున్నట్లు కనబడెను.

శ్లో. శశంస తుల్యసత్త్వానాం సైన్యఘోషేప్యసంభ్రమం
గుహాశయానాం సింహానాం పరివృత్త్యావలోకనమ్. 72

వ్యాఖ్య : తుల్యసత్త్వానాం - సైన్యములతో సమానమగు బలముగలవియై, గుహాశయానాం - గుహలయందు పరుండియున్న, సింహానాం - సింహముల యొక్క, (సింహములు) పరివృత్య - మెడలను వెనుకకు (తిప్పి) అవలోకనం - చూచుట, సైన్యఘోషే, అపి - సేనయొక్క కలకలమునందుఁగూడ, అసంభ్రమం - మనస్సు చెదరకుండుటను, శశంస - చెప్పెను. రఘు సైన్యములు మహా కోలాహలముతో హిమగిరి నెక్కుచున్నప్పుడు ప్రక్కన గుహలలో పరుండియున్న సింహములు లేచిపోక పడుకొనియే మెడలు మాత్రము త్రిప్పిచూచినవి. ఆ చూపు వాటి ధైర్యమును, సైనికులను లెక్క చేయకపోవుటను చెప్పకయే చెప్పినది,

శ్లో. భూర్జేషు మర్మరీభూతాః కీచక ధ్వని హేతవః
గంగాశీకరిణో మార్గే మరుత స్తం సిషేవిరే. 73

వ్యాఖ్య : భూర్జేషు - భుజపత్ర వృక్షముల మీద, మర్మరీభూతాః - ఎండుటాకుల చప్పుడుగా మారినవియై, కీచకధ్వనిహేతవః - కీచక - రంధ్రములు గల వెదుళ్లయొక్క, ధ్వని - నాదములకు, హేతవః - కారణములై, గంగాశీకరిణః — గంగానదియొక్క నీటి తుంపరులుగలవియగు, మరుతః - వాయువులు, మార్గే - దారిలో, తం - ఆ రఘు మహారాజును, సిషేవిరే - సేవించినవి. రఘువుహిమగిరి నెక్కుచున్నప్పుడు, వాయువులు భుజపత్ర వృక్షముల ఆకుల యందు మర్మర ధ్వనిని, వెదుళ్లయందు మధుర నాదములను బుట్టించుచు, గంగాజల శీకరయుక్తములై యతనిని సేవించినవి. అనగా మెల్లని చల్లని మందమారుతములు రఘురాజునకు సేదదీర్చిన వని భావము. వాయువర్ణనము, శైత్యసౌరభ్య మాంద్య యుతముగా నుండవలెనని కవిసమయము.

శ్లో. విశశ్రము ర్నమేరూణాం ఛాయా స్వధ్యాస్య సైనికాః
దృషదో వాసితోత్సంగా నిషణ్ణ మృగనాభిభిః 74

వ్యాఖ్య : సైనికాః - భటులు, నమేరూణాం - సురపొన్న చెట్లయొక్క, ఛాయాసు - నీడలయందు, నిషణ్ణమృగనాభిభిః నిషణ్ణ - అంతకుముందే పడుకొని లేచి పోయిన, మృగ - కస్తూరి మృగములయొక్క, నాభిభిః - కస్తూరులచేత, వాసితోత్సంగాః - పరిమళింపఁజేయఁబడిన ఉపరితలములుగల, దృషదః - బండలను, అధ్యాస్య - అధిష్ఠించి, విశశ్రముః - విశ్రమించిరి. రఘుమహారాజు సైనికులు, సురపొన్న చెట్లనీడలలో, అంతకుముందు పడుకొని లేచిపోయిన కస్తూరి మృగములచే పరిమళింపఁజేయఁబడిన బండలమీదఁ గూర్చుని, యలసటను బాపుకొనిరి.

శ్లో. సరళా సక్త మాతంగ గ్రైవేయ స్ఫురిత త్విషః
అస న్నోషధయో నేతు ర్నక్త మస్నేహదీపికాః 75

వ్యాఖ్య : సరళా....త్విషః-సరళ - దేవదారుచెట్లకు, ఆసక్త - కట్టి వేయఁబడిన, మాతంగ - ఏనుగులయొక్క, గ్రైవేయ - మెడ గొలుసుల యందు, స్ఫురిత - ప్రతిబింబించిన, త్విషః - కాంతులుగలవియైన, ఓషధయః - వెలుతురు మొక్కలు, నేతుః - నాయకుఁడగు రఘువునకు, నక్తం - రాత్రియందు, అస్నేహదీపికాః - నూనెలేని దీపములు, ఆసన్ - అయినవి. అచ్చట రాత్రివేళల యందు,

  

దేవదారు చెట్లకుఁ గట్టివేయఁబడిన యేనుగుల మెడగొలుసులయందు ప్రతిఫలించు చున్న వెలుతురు తీగలు, రాజుకు, సైనికులకు నూనెయక్కఱలేని దీపములుగా నుపయోగపడినవి. వారికి చీకటి బాధ లేకపోయెను.

శ్లో. తస్యోత్సృష్ట నివాసేషు కంఠరజ్జు క్షత త్వచః
గజవర్ష్మ కిరాతేభ్యః శశంసు ర్దేవదారవః 76

వ్యాఖ్య: తస్య - ఆ రఘు మహారాజుయొక్క. ఉత్సృష్టనివాసేషు - విడువఁబడిన మజిలీలయందు, కంఠరజ్జుక్షత త్వచః—కంఠరజ్జు - మెడల సరిపెణల చేత, క్షత - నలిపివేయఁబడిన, త్వచః - చర్మములుగలవియగు, దేవదారవః - దేవదారుచెట్లు, కిరాతేభ్యః - బోయలకొరకు(వేటకాండ్రకు), గజవర్ష్మ - రఘుసైన్య గజములయొక్క, ఎత్తును, శశంసుః - సూచించినవి. రఘుసైన్యములు విడిచివెళ్లిన మజిలీలకు వేఁటకై వచ్చిన బోయలుకొలకు అచ్చటిదేవదారు వృక్షములకు గజములను కట్టివేయుటచేత వాటి మెడ సరిపెణల రాపునకు నలిగిన చర్మముల గుర్తులు గల ఆ చెట్లనుజూచి 'ఆయేనుగుల యెత్తు ఇంత గొప్పదా? రఘుమహారాజుకు ఇంతింత పెద్ద యేనుఁగులుగలవా?' యని యాశ్చర్యపడిరని భావము. 'వర్ష్మ' అనగా ప్రమాణము, దేహము అని యర్థములు.

శ్లో. తత్ర జన్యం రఘో ర్ఘోరం పార్వతీయై ర్గణై రభూత్
నారాచ క్షేపణీయాశ్మ నిష్పేషో త్పతితానలమ్. 77

వ్యాఖ్య: తత్ర - ఆహిమాలయమునందు, రఘోః - రఘువునకు, పార్వతీయైః - పర్వతముపై నివసించువారైన, గణైః - ఉత్సవ, సంకేతు లనెడు గణములతో, నారాచక్షేపణీయాశ్మ నిష్పేషోత్పతితానలం—నారాచ - ఒక విధమైన బాణములయొక్కయు, క్షేపణీయ - విసరి వేయఁదగిన భిండివాలములయొక్కయు, అశ్మ - పాషాణములయొక్కయు, నిష్పేష - రాపిడులచేత, ఉత్పతితానలం - ఎగయుచున్న మంటలు గలదియై, ఘోరం - భయంకరమైన, జన్యం - యుద్ధము అభూత్ - జరిగెను. అక్కడ రఘుసైన్యములకును "ఉత్సవ సంకేతు"లను పేరు గల పర్వతగణములకును యుద్ధము జరిగెను. ఆ యుద్ధమునం దుపయోగింపఁబడిన నారసములు భిండివాలములును పర్వత గణాలెక్కువగా విసరిన పాషాణములును ఒరసికొనుటచేత మంటలు బయలుదేరి భయంకరముగా నుండెను. "గణానుత్సవ

సంకేతా నజయత్ స ప్తపాండవః" అను మహాభారత ప్రమాణమువలన ఆ గణము లేదుగా నుండెనని గ్రహింపవలయును.

శ్లో. శరై రుత్సవసంకేతాన్ స కృత్వా విరతోత్సవాన్
జయోదాహరణం బాహ్వో ర్గాపయామాస కిన్నరాన్. 78

వ్యాఖ్య: సః - ఆ రఘుమహారాజు, శరైః - బాణములచేత, ఉత్సవ సంకేతాన్ - ఉత్సవ సంకేతగణములను, విరతోత్సవాన్ - చాలింపఁబడిన యుత్సవములు గలవారినిగా, కృత్వా - చేసి (జయించియని యర్థము), కిన్నరాన్ - అచ్చటి కిన్నరులను, బాహ్వోః - తన భుజములయొక్క, జయోదాహరణం - జయమును వర్ణించునట్టి "ఉదాహరణ"మను కావ్యమును, గాపయామాస - గానము చేయించెను. రఘుమహారాజు, ఆ పార్వతీయ గణములను ఓడించి, అది అపూర్వ విజయము గనుక, తన బాహుపరాక్రమ జయమును వర్ణించునట్టి "ఉదాహరణ" కావ్యమును రచింపఁజేసి, కిన్నరులచేత గానము చేయించెను. ఆ గణముల కది అపూర్వమైన ఓటమి.

శ్లో. పరస్పరేణ విజ్ఞాత స్తేషూ పాయనపాణిషు
రాజ్ఞా హిమవతః సారో రాజ్ఞః సారో హిమాద్రిణా. 79

వ్యాఖ్య: తేషు - ఆ యుత్సవ సంకేత గణములు, ఉపాయన పాణిషు - కానుకలు చేతులయం దుంచుకొన్నవారుకాగా, రాజ్ఞా - రఘుమహారాజు చేత, హిమవతః - హిమవంతునియొక్క, సారః - ధనరూపమైన సారము, హిమాద్రిణా - హిమవంతుని చేత, రాజ్ఞః - రఘుమహారాజుయొక్క, సారః - బలరూపమైనసారము, పరస్పరేణ - ఒండొరులచేత, విజ్ఞాతః - తెలిసికొనఁ బడినది. ఓడిపోయిన పార్వతగణములు రాజుకొఱకు కానుకలను గొనిరాగా, హిమవంతునికి రఘు పరాక్రమమును, రఘురాజున కట్టి వెలకట్టజాలని కానుకలకు మూలమైన హిమవంతుని ధనసంపదయు బోధపడినవి.

శ్లో. తత్రాక్షోభ్యం యశోరాశిం నివేశ్యావరురోహ సః
పౌలస్త్యతులితస్యాద్రే రాదధాన ఇవ హ్రియమ్. 80

వ్యాఖ్య: సః - ఆ రఘుమహారాజు, తత్ర - ఆహిమవత్పర్వతమునందు, అక్షోభ్యం - కదల్పుటకు వీలుపడని, యశోరాశిం - కీర్తిరాశిని, నివేశ్య - పేర్చి,

పౌలస్త్యతులితస్య - రావణునిచేత నెత్తఁబడిన, అద్రేః - పర్వతమునకు (కైలాస పర్వతమునకు), హ్రియం - సిగ్గును, ఆదధానఃఇవ - కలిగించుచున్నవాఁడువలె, అవరురోహ - దిగెను. అట్లు హిమవత్పర్వతముమీద నితరులు కదల్చుటకు వీలు కాని యశోరాశినిఉంచి, రావణునిచే నొకప్పు డెత్తి తూచబడిన కైలాస పర్వతము నకు వెళ్లక, ఆ పర్వతమునకు సిగ్గును గలిగించుచున్నవాఁడువోలె హిమాలయము నుండి క్రిందికి దిగెను. శూరులైనవారు పూర్వమొకరు గెల్చినదాని నంటుట సహ జముగాదుగనుక రావణుఁడు గెల్చిన కైలాసమునంటక విడిచెను. ఆ కారణము చేతను, తనవలెనే తెల్లనిదగు యశోరాశిని తన ప్రక్కనే నిలుపుటచేతను, కైలాస మునకు సిగ్గువాటిల్లెనని భావము.

శ్లో. చకంపే తీర్ణలౌహిత్యే తస్మిన్ ప్రాగ్జ్యోతిషేశ్వరః
తద్గజాలానతాం ప్రాప్తైః సహ కాలాగరుద్రుమైః 81

వ్యాఖ్య : తస్మిన్ - ఆ రఘుమహారాజు, తీర్ణలౌహిత్యే (సతి) - దాటఁ బడిన లౌహిత్యయను నదికలవాడుకాగా, ప్రాగ్జ్యోతిషేశ్వరః – ప్రాగ్జ్యోతిషదేశపు రాజు, తద్గజాలానతాం—తద్గజ - ఆ రఘు మహారాజుయొక్క యేనుగులకు, ఆలాన తాం - కట్టుకంబమగుటను, ప్రాప్తైః – పొందినట్టి, కాలాగరుద్రుమైః సహ – నల్లయగరు చెట్లతోఁగూడ, చకంపే – వణకిపోయెను. రఘుమహారాజు లౌహిత్యా నదిని దాటిన వార్త తెలియగానే (ప్రాగ్జ్యోతిషమనగా నేటి అస్సాం), రఘు గజము లకు కట్టుకంబములుగా సైనికులచే నుపయోగింపబడిన అగరుచెట్లు ఎట్లు చలించినవో అట్లు వణికిపోయెను. అగరుచెట్లు చిన్నవి కనుక ఏనుఁగులఊపునకు కదులుచుండెను.

శ్లో. న ప్రసేహే స రుద్ధార్క మధారావర్ష దుర్దినం
రథవర్త్మరజోఽ ప్యస్య కుత ఏవ పతాకినీమ్. 82

వ్యాఖ్య : సః – ఆప్రాగ్జ్యోతిషరాజు, రుద్ధార్కం – అడ్డగింపఁబడిన సూ ర్యుఁడు గలదియు, అధారావర్షదుర్దినం—అధారావర్ష - ధారావర్షములేని, దుర్దినం – మేఘావృతమైన పగలుగల (మబ్బులు పట్టినరోజు)దియును నగు, అస్య - ఈ రఘుమహారాజుయొక్క, రథవర్త్మరజఃఅపి—రథవర్త్మ - రథ మార్గము నందలి, రజః అపి - ధూళినిగూడ, నప్రసేహే - ఓర్వలేకపోయెను, పతాకినీం - సేనను, కుతఏవప్రసేహే - ఎక్కడ ఓర్వగలడు? రఘురథము యొక్క దాతిలో రేగిన

ధూళి, సూర్యబింబమును కనపడనీక, వర్షధారలు, మేఘములును లేని దుర్దినమును సృజించి వచ్చుచుండగా, దానికే ప్రాగ్జ్యోతిషపతి తట్టుకొన లేకపోయెను. ఇకనా దుమ్ము వెనుక వచ్చు సైన్యమే వచ్చి మీదఁబడినచో తట్టుకొనఁగలడను మాటయే యెక్కడిది? సులభముగా లొంగిపోయెనని భావము.

శ్లో. త మీశః కామరూపాణా మత్యాఖండల విక్రమం
భేజే భిన్నకటై ర్నాగై రన్యా నుపరురోధ యైః 83

వ్యాఖ్య: కామరూపాణాం - కామరూప దేశముయొక్క, ఈశః - రాజు, అత్యాఖండలవిక్రమం - ఇంద్రుని కంటె మించిన పరాక్రమముగల, తం - ఆ రఘుమహారాజును, యైః - వేనిచేత, అన్యాన్ - ఇతరరాజులను, ఉపరురోధ - అడ్డగించెనో (జయించెనో), అట్టి, భిన్నకటైః - మదస్రావ యుక్తమైన గండస్థలములుగల, నాగైః - గజములచేత, భేజే - సేవించెను. కామరూపదేశపతి యేగజములచేత నితరరాజులందఱిని జయించెనో ఆమదపుటేనుగులనే ఇంద్రుని కన్న పరాక్రమవంతుఁడైన రఘుమహారాజున కిచ్చి సేవించెను. రఘువు శూరులకు శూరుఁడని భావము.

శ్లో. కామరూపేశ్వర స్తస్య హేమపీఠాధిదేవతాం
రత్నపుష్పోపహారేణ చ్ఛాయా మానర్చ పాదయోః 84

వ్యాఖ్య: కామరూపేశ్వరః - కామరూప దేశపురాజు, హేమపీఠాధిదేవతాం హేమపీఠ - బంగారుపాదపీఠమునకు, అధిదేవతాం - అధిష్ఠాన దేవతయగు, తస్య పాదయోః, ఛాయాం - ఆ రఘువుయొక్క పాదములకాంతిని, రత్నపుష్పోపహారేణ - రత్న - రత్నములనెడు, పుష్ప - పువ్వులయొక్క, ఉపహారేణ - సమర్పణముచేత, ఆనర్చ - పూజించెను. కామరూపేశ్వరుఁడు రఘుమహారాజు పాదములను బంగారు పీఠముపైనుంచి, రత్నములతో పూజించెనని భావము.

శ్లో. ఇతి జిత్వా దిశో జిష్ణు ర్న్యవర్తత రథోద్ధతం
రజో విశ్రామయన్ రాజ్ఞాం ఛత్రశూన్యేషు మౌళిషు. 85

వ్యాఖ్య: జిష్ణుః - జయశీలుఁడైన రఘువు, ఇతి - ఈవిధముగా (వెనుక వర్ణించినరీతిగా) దిశః - దిక్కులను, జిత్వా - జయించి, రథోద్ధతం - రథములచేత

రేపఁబడిన, రజః - ధూళిని, రాజ్ఞాం - రాజులయొక్క, ఛత్రశూన్యేషు - ఛత్రములులేని, మౌళిషు - ముడిచిన సిగలుగల తలలపై, విశ్రామయన్ - సంక్రమింపఁజేయుచు, న్యవర్తత - వెనుకకు మరలెను. ఈవిధముగా దిగ్విజయమును సాధించి, రథవేగమున రేగుచున్న ధూళిని ఛత్రహీనములైన రాజుల మౌళులపై బడునట్లు చేయుచు, స్వదేశమునకు మరలి వెళ్లెను. రఘుమహారాజు ఏకచ్ఛత్రాధిపతిగా నిర్ణయింపఁబడుటచేత ఇతర రాజులందఱును ఛత్రహీనులుగా మారిపోయిరని భావము.

శ్లో. స విశ్వజిత మాజహ్రే యజ్ఞం సర్వస్వదక్షిణం
ఆదానం హి విసర్గాయ సతాం వారిముచా మివ. 86

వ్యాఖ్య: సః - ఆ రఘు మహారాజు, సర్వస్వదక్షిణం - సర్వధనమును దక్షిణగా నీయవలసిన, విశ్వజితం - విశ్వజిత్తు అను పేరుగల, యజ్ఞం - యజ్ఞమును, ఆజహ్రే - చేసెను. (అదియుక్తమే) సతాం - సత్పురుషులకు, వారిముచాం ఇవ - మేఘములకువలె, ఆదానం - ఆర్జనము, విసర్గాయహి - త్యాగము కొఱకే గదా: సర్వదిగ్విజయమునం దార్జించిన ధనరాసులతో నిల్లుచేరిన రఘుమహారాజు, సర్వస్వదక్షిణాకమైన విశ్వజిద్యాగమును తలపెట్టి, అందులో నాధనమునే కాక తనయొద్దనున్న ధనమునంతటిని సత్పాత్రదానము చేసెను. సత్పురుష లార్జించుట దానము చేయుట కొఱకే గాని తమ భోగార్థము కాదుగదా: మేఘములు తాము గ్రహించిన నీటిని లోకోపకారార్థము వర్షించుచున్నవి. విశ్వజిద్యాగమును జేయుట విజయ గర్వముచేతగాక, "విశ్వజిత్సర్వదక్షిణః" అను శ్రుతి ప్రమాణమననుసరించి లోకోపకారార్థము శుభకర్మచేయుటకని భావము.

శ్లో. సత్త్రాంతే సచివసఖః పురస్క్రియాభిః
గుర్వీభిః శమిత పరాజయ వ్యలీకాన్
కాకుత్స్థ శ్చిరవిరహోత్సుకావరోధాన్
రాజన్యాం త్స్వపురనివృత్తయేఽ నుమేనే. 87

వ్యాఖ్య: కాకుత్స్థః - రఘు మహారాజు, సత్త్రాంతే - విశ్వజిద్యాగము యొక్క అంతమునందు, సచివసఖః - మంత్రులతో కూడినవాఁడై, గుర్వీభిః -

గొప్పనియగు, పురస్క్రియాభిః - సత్కారములచేత, శమిత పరాజయ వ్యళీకాన్ - శమిత - చల్లార్పఁబడిన, పరాజయవ్యళీకాన్ - ఓటమిచేతఁ గలిగిన దుఃఖముగల వారును, చిరవిరహోత్సుకావరోధాన్—చిరవిరహ - బహుకాల వియోగముచేత, ఉత్సుక - భర్తలను కలిసికొనుటకు త్వరపడుచున్న, అవరోధాన్ - అంతఃపుర స్త్రీలుగలవారును, (అయిన) రాజన్యాన్ - రాజులను, స్వపురనివృత్తయే - తమ నగరములకు తిరిగి వెళ్లుటకై, అనుమేనే - అంగీకరించెను. యాగము ముగిసిన పిమ్మట రఘుమహారాజు, మంత్రులతో కలిసిన వాడగుచు, తనచే నోడింపఁబడి తన సైన్యమునందుఁగలిసి వచ్చి యాగసమాప్తి వఱకు నుండిన, రాజులందఱిని గొప్ప బహుమానములతో సత్కరించి వారి మనస్సులందుఁగల పరాజయ దుఃఖమును, ముఖములందలి ఖిన్నతను తొలగింపఁజేసెను, చిరకాలవియోగము ననుభవించుచున్న భార్యలుగల ఆరాజులందఱినీ తమతమ నగరములకు దిరిగి వెళ్లిపోవుటకై యనుమతి నిచ్చెను. ఓడిపోయిన రాజులందఱును విజేతయగు రాజు చేయునట్టి రాజసూయాది యాగములకు రావలసియుండుట అనాటి యాచారము, అట్లు వచ్చిన వారిని సత్కరించి మైత్రిని నెఱపుట విజేత ధర్మము, అట్టి దంతయు రఘుమహారాజు చేసిన విశ్వజిద్యాగమునందు జరిగెనని భావము. 'సత్త్రి' మనగా యాగము. ఆశబ్దము నేడు గౌణార్థమున నుపయోగింపఁబడుచున్నది.

శ్లో॥ తే రేఖాధ్వజకలశాతపత్త్రచిహ్నం
సమ్రాజ శ్చరణయుగం ప్రసాదలభ్యం
ప్రస్థానప్రణతిభి రంగుళీషు చక్రుః
మౌళిస్రక్చ్యుత మకరంద రేణు గౌరమ్. ౪౪

వ్యాఖ్య: తే - ఆ రాజులు, రేఖా కలశాతపత్త్రచిహ్నం—రేఖా - రేఖల రూపముననున్న, ధ్వజ - కేతనము, కలశ - పాత్ర, ఆతపత్త్ర - ఛత్రము చిహ్నం - చిహ్నములుగా గలదియు, ప్రసాదలభ్యం - అనుగ్రహముచేతనే లభించునదియునగు, సమ్రాజః - సార్వభౌముఁడైన రఘుమహారాజుయొక్క, చరణయుగం - పాదములజంటను, ప్రస్థానప్రణతిభిః - ప్రయాణ సమయమందలి నమస్కారములచేత, అంగుళీషు - రఘువుయొక్క కాలివ్రేళ్లమీద, మౌళిస్రక్చ్యుత మకరంద రేణు గౌరం—మౌళిస్రక్ - శిరములందలి పుష్పమాలలనుండి, చ్యుత - జాఱిన, మకరంద - పుష్పముల రసములచేతను, రేణు - పుప్పొడుల

  

చేతను, గౌరం - పసుపువర్ణమును, చక్రుః - కలిగించిరి. రఘుమహారాజు పాదములయందు సార్వభౌమ లక్షణములైన ధ్వజరేఖ, కలశరేఖ, ఛత్రరేఖ యుండినవి. అతని యనుగ్రహము పొందినవారికే ఆపాదస్పర్శ లభ్యము. అట్టి చరణ యుగ్మముయొక్క వ్రేళ్లపైన స్వదేశములకు వెళ్లనున్న రాజులు నమస్కారములు చేయుచు తమ శిరస్సులనుంచుటచేత, తలపూమాలలనుండి మకరందమును, పుష్పాదులును రాలి యా పాదాంగుళులమీద ఒకమనోహరమైన గౌరవర్ణము నెలకొనెను. ఎందఱో రాజులు నమస్కరించి వెళ్లిరని భావము. ఇది ప్రహర్షిణీవృత్తము.

ఇది మహాకవి కాళిదాసకృత రఘువంశ కావ్యమున

చతుర్థ సర్గమునకు తెలుఁగు

లఘు వ్యాఖ్య.

# మహాకవి కాళిదాసకృత రఘువంశము

## పంచమ సర్గము

శ్లో. త మధ్వరే విశ్వజితి క్షితీశం
నిశ్శేష విశ్రాణిత కోశజాతం
ఉపాత్తవిద్యో గురుదక్షిణార్థీ
కౌత్సః ప్రపేదే వరతంతుశిష్యః. 1

వ్యాఖ్య: విశ్వజితి - విశ్వజిత్ అనుపేరుగల, అధ్వరే - యాగమునందు, నిశ్శేష విశ్రాణిత కోశజాతం—నిశ్శేష - పూర్తిగా, విశ్రాణిత - దానము చేయఁబడిన, కోశజాతం - ధన సమూహము గలవాఁడైన, తం, క్షితీశం - ఆ రఘు మహారాజును, ఉపాత్తవిద్యః - పొందఁబడిన విద్యలు గలవాఁడును, వరతంతు శిష్యః - వరతంతుఁడను మునికి శిష్యుఁడుననగు, కౌత్సః - కౌత్సుఁడను పేరుగల మునికుమారుఁడు, గురుదక్షిణార్థీ - గురుదక్షిణను గోరువాఁడై, ప్రపేదే - చేరెను. సర్వస్వ దక్షిణాకమైన విశ్వజిద్యాగమునుచేసి, నిర్ధనుఁడైయున్న రఘు మహారాజు వద్దికి, కౌత్సుఁడను ఋషికుమారుఁడు, తన గురువగు వరతంతుమునికీయఁదలచుకొన్న గురుదక్షిణాధనమును యాచించుటకై వచ్చెను. ఈ సర్గయందలి శ్లోకములు ఉపజాతివృత్తమున రచింపఁబడినవి.

శ్లో. స మృణ్మయే వీతహిరణ్మయత్వాత్
పాత్రే నిధా యార్ఘ్య మనర్ఘశీలః
శ్రుతప్రకాశం యశసా ప్రకాశః
ప్రత్యుజ్జగా మాతిథి మాతిథేయః. 2

వ్యాఖ్య: అనర్ఘశీలః - అమూల్య స్వభావముగలవాఁడును, ఆతిథేయః - అతిథులయందు భక్తిగలవాఁడును నగు, సః - ఆ రఘుమహారాజు, వీతహిరణ్మ

యత్వాత్—వీత - ఖర్చయిపోయిన, హిరణ్మయత్వాత్ - బంగారుపాత్రలు గల వాఁడగుటవలన, మృణ్మయే, పాత్రే - మట్టిదియైన పాత్రయందు, అర్ఘ్యం - పూజాద్రవ్యమును (పువ్వులు గంధం మొదలగువానిని), నిధాయ - ఉంచుకొని, శ్రుతప్రకాశం - శాస్త్రజ్ఞానముచేత ప్రకాశించుచున్న, అతిథిం - అభ్యాగతుఁడగు కౌత్సమునిని, ప్రత్యుజ్జగామ - ఎదురుకొనెను. యశస్వియు, అతిథిభక్తుఁడుననగు రఘుమహారాజు, తానుచేసిన యాగమునందు సువర్ణపాత్రలన్నియు ఖర్చయి పోయినందున, మట్టిపాత్రలో పూజాద్రవ్యములు పెట్టుకొని, విద్యలచేత నొకానొక కాంతి విశేషముగల యతిథిని యెదురేగి సత్కరించెను. "అతిథిషు సాధుః ఆతిథేయః" అని విగ్రహము.

శ్లో. త మర్చయిత్వా విధివత్ విధిజ్ఞః
తపోధనం మానధనాగ్రయాయీ
విశాంపతి ర్విష్టరభాజ మారాత్
కృతాంజలిః కృత్యవి ది త్యువాచ. 3

వ్యాఖ్య : విధిజ్ఞః - శాస్త్రము నెఱిఁగినవాఁడును, మానధనాగ్రయాయీ— మానధన - అభిమానవంతులలో, అగ్రయాయీ - ముందడుగు వేసినవాడును, కృత్యవిత్ - కార్యజ్ఞుఁడుననగు, విశాంపతిః - నరపతియైన రఘుమహారాజు, విష్టరభాజం - ఆసనముపైఁ గూర్చున్నట్టి, తం, తపోధనం - ఆ తపోధనుఁడగు కౌత్సమునిని, విధివత్ - శాస్త్రప్రకారముగా, అర్చయిత్వా - పూజించి, ఆరాత్ - సమీపమున, కృతాంజలిః - చేతులు జోడించుకొన్నవాఁడగుచు, ఉవాచ - ముందు చెప్పఁబోవు రీతిగా పలికెను. అభిమానధనుడైన రఘువు అతిథిపూజాదుల విధానమును, అవి చేయకపోయినచో వచ్చు ప్రత్యవాయాది దోషములను ఎఱిఁగినవాఁడు కనుక కౌత్సమునిని ఒక ఉన్నతాసనమున గూర్చుండఁబెట్టి, యతిథిపూజ చేసి, దగ్గరగా నిల్చుని, బద్ధాంజలియై సంభాషించెనని భావము. ఇచ్చట 'విష్టర'ము దర్భాసనము, లేక అడుగున దర్భలు వేయఁబడిన పీఠము అవి గ్రహింపవలెను. అది పవిత్రమైనట్టిది. ఇందలి విశేషణములన్నియు రఘుమహారాజుయొక్క ఔన్నత్యమును సూచించుచున్నవి.

శ్లో. అప్యగ్రణీ ర్మంత్రకృతా మృషీణాం
కుశాగ్రబుద్ధే! కుశలీ గురు స్తే,

యత స్త్వయా జ్ఞాన మశేష మాత్తం
లోకేన చైతన్య మి వోష్ణరశ్మేః. 4

వ్యాఖ్య: హే కుశాగ్రబుద్ధే! - ఓ సూక్ష్మబుద్ధిగలవాఁడా! మంత్రకృతాం - వేదమంత్ర ద్రష్టలైన, ఋషీణాం - ఋషులలో, అగ్రణీః - శ్రేష్ఠుఁడైన, తేగురుః - నీ గురువు, అపికుశలీ - కుశలముగా నున్నాఁడా?, యతః - ఏ గురువు వలన, త్వయా - నీచేత, అశేషం, జ్ఞానం - సమస్తమైన జ్ఞానము, లోకేన - జనముచేత, ఉష్ణరశ్మేః - సూర్యునివలన, చైతన్యం ఇవ - ప్రబోధము వలె, ఆత్తం - స్వీకరింపఁబడినదో. మిక్కిలి తెలివితేటలుగల ఓ మునికుమారా! సూర్యునినుండి జనులు చైతన్యమును పొందినట్లు, యే మహనీయునినుండి నీవు సమస్తమైన శాస్త్రజ్ఞానమును స్వీకరించితివో, ఆ ఋషిశ్రేష్ఠుఁడు, మంత్రద్రష్టయు నైన నీ గురువు కుశలియేకదా? అని రఘువు కౌత్సమునిని ప్రశ్నించెను. కుశాగ్రం అనఁగా దర్భకఱ్ఱయొక్క చివర. అది చాలా సన్నగానుండును. దానివంటి బుద్ధి అనఁగా "సూక్ష్మబుద్ధి"కలవాఁడని యర్థము, దీనికి విరుద్ధపదము "ముసలాగ్రబుద్ధి" అనఁగా మొద్దుబుద్ధి కలవాఁడిని యర్థము.

శ్లో. కాయేన వాచా మనసాపి శశ్వత్
యత్సంభృతం వాసవధైర్యలోపి,
ఆపాద్యతే న వ్యయ మంతరాయైః
కచ్చి న్మహర్షే స్త్రివిధం తప స్తత్. 5

వ్యాఖ్య: కాయేన - శరీరముచేతను, వాచా - వాక్కుచేతను, మనసా - మనస్సుచేతను, వాసవధైర్యలోపి - ఇంద్రునియొక్క మనోధైర్యమును పోఁగొట్టునట్టి, యత్, తపః - ఏ తపస్సు, శశ్వత్ - నిరంతరముగా, సంభృతం - సమకూర్చుకోఁబడి యున్నదో, మహర్షేః - వరతంతు మహర్షియొక్క, త్రివిధం - మూఁడు విధములైన (కాయికము, వాచికము, మానసికమునైన), తత్, తపః - ఆ తపస్సు, అంతరాయైః - విఘ్నములచేత (అప్సర శ్శాపాదులచేత), వ్యయం - నాశమును, నాపాద్యతే కచ్చిత్ (న + ఆపాద్యతే + కచ్చిత్) - పొందింపఁబడుట లేదుకదా? శరీరముచేత చేయు తపస్సు కాయికము, అది ఉపవాస కృచ్ఛ్ర చాంద్రయణాది రూపము; వాక్కుచేత చేయునట్టి తపస్సు వాచికము, అది వేదశాస్త్ర

పఠనరూపము; మనస్సుచేత చేయునది మానసిక తపస్సు. అది గాయత్రీ మొద లగు మహామంత్రజపరూపము; ఇట్టి త్రివిధతపస్సును నిరంతరమును సాగించు చున్న వరతంతుమహర్షికి ఇంద్రుఁడు తన పదవికి భంగము రాఁగలదేమోయను భయముచేత అప్సరసాదుల మూలమున విఘ్నములను గలిగింపగా, ఆ విఘ్న శాంతికై శాపమును బెట్టవలసివచ్చి, తన్మూలకముగాఁ గొంతతపస్సును వ్యయ పఱుపవలసిన చిక్కులు, (మీ గురువుగారికి) కలుగుటలేదుగదా ! యని రఘుమహా రాజు కౌత్సమునిని అడిగెను.

శ్లో. ఆధారబంధప్రముఖైః ప్రయత్నైః
సంవర్ధితానాం సుతనిర్విశేషం,
కచ్చి న్న వాయ్వాది రుపప్లవో వః
శ్రమచ్ఛిదా మాశ్రమపాదపానామ్. 6

వ్యాఖ్య: ఆధారబంధప్రముఖైః—ఆధార - పాదులయొక్క, బంధ - కట్టుటయే, ప్రముఖైః - ముఖ్యముగాగల, ప్రయత్నైః - ఎఱువులువేయుట మొద లయిన ప్రయత్నములచేత, సుతనిర్విశేషం – పుత్రుల కంటే భేదములేనియట్లు, సంవర్ధితానాం – పెంచఁబడినవియు, శ్రమచ్ఛిదాం - అలసటను పోఁగొట్టునవియు నైన, వః ఆశ్రమపాదపానాం - మీయాశ్రమ వృక్షములకు, వాయ్వాదిః ఉపప్లవః- గాడ్పులు మొదలయిన బాధ, నకచ్చిత్ – లేదుగదా? పాదులుకట్టి నీళ్లుపెట్టి యెఱు వులు మొదలయిన దోహదములుచేసి పుత్రులవలె పెంచబడినవియు మునిజనుల యలసటను దీర్చునవియునగు మీయాశ్రమవృక్షములకు సుడిగాలులు దావాగ్ని మొదలయిన యుపద్రవములు లేవుగదా? అని రఘువు ఆశ్రమవాసియగు కౌత్సుని నడుగ తగిన క్షేమసమాచారము నడిగెను. ఆధారశబ్దమునకు ఆలవాలము, అంబు బంధము, అధికరణము (ఆధారము) అర్థములు.

శ్లో. క్రియానిమిత్తే ష్వపి వత్సలత్వా
దభగ్నకామా మునిభిః కుశేషు
తదఙ్కశయ్యాచ్యుతనాభినాళా
కచ్చి న్మృగీణా మనఘా ప్రసూతిః.

వ్యాఖ్య : యైః - వేటిచేత, నియమాభిషేకః - నిత్యస్నానము (త్రిషవణ స్నానాదికము), నిర్వర్త్యతే - చేయఁబడుచున్నదో, యేభ్యః - వేనివలన (నదుల నుండి పైకి తెచ్చిన జలములవలన), పితౄణాం - అగ్నిష్వాత్తాది పితృదేవతలకు నివాపాంజలయః - తర్పణాంజలులు, నిర్వర్త్యంతే - ఇయ్యఁబడుచున్నవో, ఉంఛ షష్ఠాంకితసైకతాని_ఉంఛ - పొలములయందురాలిపడగా నేఱుకొనితెచ్చినధాన్యము యొక్క, షష్ఠ - రాజుకీయవలసిన యాఱవభాగములచేత, అంకిత - గుర్తులుగల, సైకతాని - ఇసుక దిబ్బలు కలవియగు, వః - మీయొక్క, తాని, తీర్థజలాని - ఆతీర్థజలములు, శివానికచ్చిత్ - భద్రములైయున్నవికదా ? ఆశ్రమవాసులకు నిత్య స్నాన సంధ్యా పితృతర్పణాదులకు పరిశుద్ధములైన నదీజలములు ముఖ్యము. తీర్థ మనఁగా నదిలోనికి దిగుదారి. ఉంఛశబ్దమునకు పఱిగెధాన్యము, లేక రాలినగింజలు అని యర్థము. తపస్విజను లట్టి ఉంఛవృత్తితో జీంవిపవలయును. ఆవిధముగా, దెచ్చుకొన్న ధాన్యమునందు సైతము రాజుకు ఆఱవభాగమును పన్నుగా నిచ్చుట, యాచారము, కనుక ఈ విషయములన్నిఁటిని యెఱిఁగిన రఘుమహారాజు, కౌత్సు నితో మీమునిజన నిత్యస్నాన పితౄతర్పణాదుల కుపయోగించునవియు, తమ చుట్టున్న యిసుక దిబ్బలపై చిహ్నములుగా నుంచబడిన యుంఛ ధాన్య షష్ఠ భాగ ములతో విరాజిల్లునవియునగు మీతీర్థజలములు ఇతరులచేతను, మృగాదులచేతను కలుషితములు చేయబడక నిర్మలములుగా, భద్రములుగా, నున్నవికదా ? అని యడిగెను. "ఉంఛవృత్తి, శిలావృత్తి" అని ఆర్షజీవన పద్ధతి రెండు విధములు కర్షకులు పూర్తిగా తీసుకొని వదిలిపెట్టినచేలలో నక్కడక్కడ నున్న పఱిగకంకులు తెచ్చుకొనుట ఉంఛవృత్తి; పొలమునగాని కళ్లమునగాని రాలిన గింజల నేఱుకొని తెచ్చుకొనుట శిలావృత్తి; "ఉంఛోధాన్యాంశకాదానం కణిశాద్యార్జనం శిలం" అని నిఘంటువు.

శ్లో. క్రియానిమిత్తేష్వపి వత్సలత్వాత్
అభగ్నకామా మునిభిః కుశేషు
తదంకశయ్యా చ్యుత నాభినాళా
కచ్చి న్మృగీణా మనఘా ప్రసూతిః 8

వ్యాఖ్య : క్రియానిమిత్తేషు,అపి - అనుష్ఠానములకు సాధనములైనవియైనను, కుశేషు - దర్భలయందు, మునిభిః - మునులచేత, వత్సలత్వాత్ - వాత్సల్యము

వలన, అభగ్నకామా - భంగ పరుపఁబడని కోరికగలదియును, తదంకశయ్యాచ్యు తనాభినాళా—తదంక - ఆమునుల తొడలనెడి, శయ్యా - పడకలమీద, చ్యుత - ఊడిపడిన, నాభినాళా - బొడ్డుచేరులు గలదియునగు, మృగీణాం,ప్రసూతిః - ఆడు లేళ్ల సంతతి, అనఘాకచ్చిత్ - అపాయము లేనిదిగా నున్నదికదా ? హోమాది క్రియలకై తెచ్చిపెట్టుకున్న దర్భలపైఁబడి చెదరగొట్టుచున్నను, తమ తొడలపై నెక్కి కూర్చుని బొడ్డు చేరులను వదిలి వేసినను, వాత్సల్యాతిశయముచేత, మును లచే నదిలింపఁబడక యథేష్టముగా దిరుగాడు లేడిపిల్లల కెట్టి యపాయమును గలు గక సుఖముగా నున్నవికదా ? క్రూరమృగములు చంపునను భయముచేత ఆడు లేళ్ల ప్రసవింపగానే మునులు పదిరాత్రులవఱకు నామృగశిశువులను తమ యొడుల లో బెంచుచుండిరట.

శ్లో. నీవారపాకాది కడంగరీయై
రామృశ్యతే జానపదై ర్న కచ్చిత్
కాలోపపన్నాతిథి కల్ప్య భాగం
వన్యం శరీరస్థితి సాధనం వః 9

వ్యాఖ్య: కాలోపపన్నాతిథికల్ప్యభాగం—కాల - యోగ్యకాలములయందు, ఉపపన్న - వచ్చిన, అతిథి - అతిథులకు, కల్ప్య - చేకూర్పఁదగిన, భాగం - భాగములుగలదియును. వన్యం - అరణ్యమునఁబండినదియు, శరీరస్థితిసాధనం - దేహస్థితికి సాధనమైనదియునగు, వః - మీయొక్క, నీవారపాకావి - నివ్వరి, చామలు, మొదలయిన ధాన్యము, జానపదైః - సమీప గ్రామములనుండి వచ్చిన, కడంగరీయైః - గోమహిషాదులచేత, నామృశ్యతేకచ్చిత్ (న + అమృశ్యతే + కచ్చిత్) తాకఁబడుటలేదుగదా ? అవి వచ్చి తినివేయుట లేదుగదా ? యని అర్థము. అరణ్యమునందు కృషి లేకయే పండిన నివ్వరి, చామలు, మొదలగు గడ్డి ధాన్య ములు మీ శరీరపోషణమునకును, మీవద్దికి యుక్తకాలములందు వచ్చునట్టి యతిథు లకును నుపయోగపడునట్టివి. అట్టి తృణధాన్యములను పల్లెలమండి వచ్చిన వృషభ మహిషాదులు ముట్టుటలేదు గదా ? యని అడిగెను. 'కాల'మనగా ఇష్టి, కుతప మొదలయిన కాలములందును, భోజన సమయమందును వచ్చిన అతిథులకునని యర్థము; 'కడంగరం' అనగా గడ్డి, పొట్టు మొదలయినవి. అవి తినుట కర్త మైనవి "కడంగరీయములు" గోమహిషాదులు. "అమృశ్యతే" అనుక్రియ మహి షాదులు తాకినను ఆధాన్యము పనికి రాకపోవునను శౌచవిధిని సూచించును.

శ్లో. అపి ప్రసన్నేన మహర్షిణా త్వం
సమ్యగ్వినీ యానుమతో గృహాయ
కాలో హ్యాయం సంక్రమితుం ద్వితీయం
సర్వోపకారక్షమ మాశ్రమం తే. 10

వ్యాఖ్య: త్వం - నీవు, ప్రసన్నే - శాంతచిత్తుఁడైన, మహర్షిణా - వరతంతు మహర్షిచేత, సమ్యక్ - చక్కఁగా, వినీయ - శిక్షింపఁబడి (చక్కఁగా విద్యలునేర్పి), గృహాయ - గృహస్థాశ్రమ ప్రవేశముకొఱకు, అనుమతః, అపి - అంగీకరింపఁ బడితివా? తే - నీకు, సర్వోపకారక్షమం—సర్వ - అన్ని ఆశ్రమములయొక్కయు, ఉపకార - ఉపకారము చేయుటయందు, క్షమం - సమర్థమయిన, ద్వితీయం, ఆశ్రమం - రెండవదియగు గృహస్థాశ్రమమును, సంక్రమితుం - ప్రవేశించుటకు, అయం, కాలః, హి - ఇది సమయముగదా! ఇంతవఱకు కౌత్సుని గురువునకును అతడు నివసించు నాశ్రమమునకును సంబంధించిన కుశలప్రశ్నలు చేసి, ఇప్పుడు కౌత్సునికే సంబంధించిన ప్రశ్న నడుగుచున్నాఁడు; చక్కఁగా విద్యలన్నియునేర్పి ప్రసన్న హృదయుండైన మీగురువు నీవు గృహస్థాశ్రమమున ప్రవేశించుట కనునుతించెనా? బ్రహ్మచర్య, వానప్రస్థ, సన్యాసాశ్రమములందుండు వారందరికిని ఉపకారము చేయుటకు శక్తిగల రెండవ యాశ్రమమును అనఁగా గృహస్థాశ్రమమును స్వీకరించుటకునీ కిది తగిన సమయముగదా! ఇట్లడుగుటకు, కౌత్సుడు సకల విద్యావంతుఁడైన బ్రహ్మచారి కనుక ఇఁక జరుగవలసినది వివాహమేకదా? యనియు, తదర్థమైన సహాయమును తనను వేడుటకు వచ్చెనేమో యను సందేహమును కారణములు.

శ్లో. తవార్హతో నాభిగమేన తృప్తం
మనో నియోగక్రియ యోత్సుకం మే
అప్యాజ్ఞయా శాసితు రాత్మనా వా
ప్రాప్తోసి సంభావయితుం వనాన్మామ్. 11

వ్యాఖ్య: అర్హతః - పూజ్యుఁడవైన, తవ - నీయొక్క, అభిగమేన - రాకచేత మాత్రమే, మే, మనః - నాయొక్క మనస్సు, న తృప్తం - తృప్తి పడలేదు, (కింతు - మరియేమనగా) నియోగక్రియయా - ఆజ్ఞాకరణమునందు (స ప్త

మ్యర్థమున తృతీయా విభక్తి), ఉత్సుకం - వేగిరపడుచున్నది, శాసితుః - నీకు శాసకుఁడగు గురువుయొక్క, ఆజ్ఞయా, అపి - ఆజ్ఞచేతనా? ఆత్మనా, వా - స్వయముగానా? మాం - నన్ను. సంభావయితుం - గౌరవించుటకు, వనాత్ - వనమునుండి, ప్రాప్తోసి (ప్రాప్తః + అసి) - వచ్చితివి? పూజ్యుఁడవైన నీవు వచ్చుటచేత మాత్రమే నా మనస్సు తృప్తిని పొందలేదు. నీ యాజ్ఞ ననుసరించుటకు త్వరపడుచున్నది; మీ గురువుగారి యాజ్ఞచేతనా? లేక స్వబుద్ధిచేతనా? నీ విట్లు వనమునుండి వచ్చి నన్ను ధన్యునిజేయుటకుఁగల కారణమని రఘువు కౌత్సుని ప్రశ్నించెను. కుశలప్రశ్నలపిమ్మట వచ్చినకారణ మడిగెనని భావము.

శ్లో. ఇ త్యర్ఘ్యపాత్రానుమిత వ్యయస్య
రఘో రుదారా మపి గాం నిశమ్య
స్వార్థోపపత్తిం ప్రతి దుర్బలాశః
త మి త్యవోచత్ వరతంతుశిష్యః. 12

వ్యాఖ్య: అర్ఘ్యపాత్రానుమిత వ్యయస్య—అర్ఘ్యపాత్ర - పూజాద్రవ్యము లుంచిన మట్టిపాత్రచేతనే, అనుమిత - ఊహింపఁబడిన, వ్యయస్య - సర్వధన వ్యయముగల, రఘోః - రఘుమహారాజుయొక్క, ఇతి - ఇంతకుముందు పలికిన, ఉదారాం, అపి, గాం - ఔదార్యయుక్తమేయగు వాక్కును, నిశమ్య - విని, వర తంతు శిష్యః - కౌత్సుఁడు, స్వార్థోపపత్తిం, ప్రతి - స్వప్రయోజనసిద్ధిని గురించి, దుర్బలాశః - సడలినకోరిక గలవాఁడగుచు, తం - ఆ రఘుమహారాజును గురించి, ఇతి - ఇట్లు (ముందు పలుకబోవురీతిగా) అవోచత్ - భాషించెను. కౌత్సుఁడు తనను పూజించుటకుఁ దెచ్చిన మట్టిపాత్రచేతనే, రఘుమహారాజు ధన వ్యయముచేసి యున్నాడని యూహించి, అతఁడెంత యుదారముగా "మీ యాజ్ఞను చేయుటకు సంసిద్ధుడనై యున్నానని" పలికినను, వచ్చినపని వాకిటనే జరిగినదని నిరుత్సాహపడి యీ క్రిందిరీతిగా పలికెను.

శ్లో. సర్వత్ర నో వార్త మవేహి రాజన్!
నాథే కుత స్త్వ య్యశుభం ప్రజానామ్,
సూర్యే తప త్యావరణాయ దృష్టేః
కల్పేత లోకస్య కథం తమిస్రా. 13

వ్యాఖ్య : హే రాజన్ ! - ఓరాజా !, సర్వత్ర - అంతటను, నః - మాకు, వార్తం - స్వాస్థ్యమును(క్షేమమేయని), అవేహి - తెలిసికొనుము, త్వయి, నాథే - నీవు అధిపతివై యుండగా, ప్రజానాం - ప్రజలకు, అశుభం - అశుభము, కుతః - ఎక్కడిది ? సూర్యే - సూర్యుడు, తపతి (సతి) - ప్రకాశమానుఁ డగుచుండఁగా, తమిస్రా - అంధకారము, లోకస్య - జనముయొక్క, దృష్టేః, ఆవరణాయ - చూపును అడ్డగించుటకు, కథం కల్పేత - ఎట్లు సమర్థవంతమగును ? రాజా ! నీవు నాథుఁడవై యున్నంతకాలము ప్రజలకు క్షేమమేయని తలంపుము, సూర్యుఁడు వెలుఁగుచుండగా చీకటి లోకముయొక్క చూపును అడ్డగింపగల్గునా ?

శ్లో. భక్తిః ప్రతీక్ష్యేషు కులోచితా తే
పూర్వాన్ మహాభాగ ! త యాతిశేషే,
వ్యతీతకాల స్త్వహ మభ్యుపేతః
త్వా మర్థిభావా దితి మే విషాదః. 14

వ్యాఖ్య : ప్రతీక్ష్యేషు - పూజ్యులయందు (అతిథులయందు), భక్తిః - భక్తి, తవ - నీకు, కులోచితా - వంశాభ్యస్తము (వంశక్రమాగతము), హే మహాభాగ - ఓ సార్వభౌమా ! తయా - ఆ భక్తిచేత, పూర్వాన్ - మీ పూర్వులను, అతిశేషే - మించుచున్నావు, అహం - నేను, వ్యతీతకాలః - అతిక్రమించిన సమయము గలవాఁడనై, అర్థిభావాత్ - యాచకత్వమువలన, త్వాం - నిన్ను, అభ్యుపేతః - సమీపించితిని, ఇతి - ఇట్లని, మే - నాకు, విషాదః - ఖేదము. పూజ్యులయిన అతిథులయందు భక్తిగలిగియుండుట మీకు కులక్రమాగతము, అందులోను నీవు మీ పూర్వులను మించినావు, కాని నేను సమయము నతిక్రమించి యాచకత్వముతో నిన్ను జేరితిని గదా ! యని నా మనస్సు ఖేదపడుచున్నది. అని కౌత్సుఁడు రఘుమహారాజుతో ననెను. పంచయజ్ఞములు ప్రతిదినము జేయువారు అతిథికోసము ప్రతీక్షించుచుందురు. అందువలన అతిథికి "ప్రతీక్ష్యః" అను పేరు వచ్చినది.

శ్లో. శరీరమాత్రేణ నరేంద్ర ! తిష్ఠన్
ఆభాసి తీర్థ ప్రతిపాదితర్ధిః,

అరణ్యకోపాత్త ఫలప్రసూతిః
స్తంబేన నీవార ఇ వావశిష్టః. 15

వ్యాఖ్య: హే నరేంద్ర! - ఓ రాజా! తీర్థప్రతిపాదితర్ధిః — తీర్థ - సత్పాత్రమునందు, ప్రతిపాదిత - దానము చేయఁబడిన, ఋద్ధిః - సంపదగల వాఁడవైననీవు, శరీరమాత్రేణ - శరీరముతో మాత్రము, తిష్ఠన్ - నిలిచిన వాఁడ వగుచు (మిగిలి), అరణ్యకోపాత్త ఫలప్రసూతిః — అరణ్యక - అరణ్యము నందుండు మునులు మొదలగువారిచేత, ఉపాత్త - తీసుకోఁబడిన, ఫలప్రసూతిః - పంటకలదియై, స్తంబేన - కాండముతో మాత్రము, అవశిష్టః - మిగిలిన, నీవారః ఇవ - నివ్వరి ధాన్యపు మొక్కవలె, ఆభాసి - ప్రకాశించుచున్నావు. ఓ రాజా! నీ సంపద నంతను సత్పాత్రదానము చేసి శరీరముమాత్రము మిగిలిన వాఁడవైన నీవు, అరణ్యమునందు మునులు మొదలగువారిచే గ్రహింపఁబడిన కంకులుగలది యై దంటుతోమాత్రము మిగిలిన నివ్వరి సస్యమువలె ప్రకాశించుచున్నావు. "తీర్థ" శబ్దమునకు సత్పాత్రము, దర్శనము, పుణ్యక్షేత్రము, రేవు మొదలయిన అర్థములు గలవు.

శ్లో. స్థానే భవా నేకనరాధిపః స
న్నకించనత్వం మఖజం వ్యనక్తి
పర్యాయ పీతస్య సురైర్హిమాంశోః
కలాక్షయః శ్లాఘ్యతరోహి వృద్ధేః 16

వ్యాఖ్య: భవాన్ - నీవు, ఏకనరాధిపఃసన్ - సార్వభౌముఁడవగుచును, మఖజం - యజ్ఞమువలన గలిగిన, అకించనత్వం - నిర్ధనత్వమును, వ్యనక్తి - ప్రకటించుచున్నావు, స్థానే - యుక్తమైయున్నది, సురైః - దేవతలచేత, పర్యాయ పీతస్య - క్రమానుసారముగా పానము చేయఁబడిన, హిమాంశోః - చంద్రుని యొక్క, కళాక్షయః - కళల తఱుగుబాటు వృద్ధేః - పెఱుగుటకంటెను, శ్లాఘ్య తరోహి (శ్లాఘ్యతరః + హి) - ఎక్కువ మెచ్చుకోఁదగినది కదా! నీవు సార్వ భౌముఁడ వయ్యును యజ్ఞమునందు సర్వస్వమును దానముచేసి దారిద్ర్యము నొందుట యుక్తముగా నున్నది. దేవతలచేత పానముచేయఁబడిన యమృతకిరణుని క్షయము వృద్ధికంటెను మిక్కిలి పొగడఁదగినదికదా! "ధర్మార్థం క్షీణకోశస్య

క్షీణత్వమపి శోభతే ; సురైః పీతావశేషస్య కృష్ణపక్షే విధోరివ" అని కామందక నీతిసారము.

శ్లో. త దన్యత స్తావ దనన్యకార్యో
గుర్వర్థ మాహ ర్తు మహం యతిష్యే
స్వ స్త్యస్తు తే నిర్గళితాంబుగర్భం
శరద్ఘనం నార్దతి చాతకోపి 17

వ్యాఖ్య : తత్ - అందువలన, అనన్యకార్యః - గురుకార్యము తప్ప మఱియొక పనిలేని, అహం నేను, అన్యతః,తావత్ - మఱియొక దాతనుండియే, గుర్వర్థం - గురుధనమును, ఆహ ర్తుం - తెచ్చుకొనుటకు, యతిష్యే - ప్రయత్నింపఁగలను, తే, స్వ స్తి, అస్తు - నీకు మంగళమగుగాక, చాతకః, అపి - వానకోయిల కూడా, నిర్గళితాంబుగర్భం - నిశ్శేషముగా కురిసిన జలముగల, శరద్ఘనం - శరదృతువు నందలి మేఘమును, నార్దతి (న + అర్దతి) - యాచింపదుగదా ! అందువలన గురుధనార్జనము తప్ప మరియొక పనిలేని నేను మరియొక దాత వద్ది నుండియే నాగురుధనమును సంపాదించుకొనుటకు ప్రయత్నింతును. ఎందుకనగా నిశ్శేషముగా వర్షించిన శరత్కాల మేఘమును చాతకపక్షి యాచింపదుగదా ; అని కౌత్సుఁడు రఘుమహారాజుతో ననెను. నేలపైఁబడిన జలము చాతకమునకు రోగహేతువు. కనుక అనన్య గతికమైనను అది నీరులేని శరన్మేఘమును యాచించి యేమిపొందగలదు ? అని భావము.

శ్లో. ఏతావ దుక్త్వా ప్రతియాతు కామం
శిష్యం మహర్షే ర్నృపతి ర్నిషిధ్య
కిం వస్తు విద్వన్ ! గురవే ప్రదేయం
త్వయా కియ ద్వేతి త మన్వయుంక్త 18

వ్యాఖ్య : ఏతావత్ - ఇంతమాత్రము, ఉక్త్వా - పలికి, ప్రతియాతుకామం - తిరిగి వెళ్ళదలఁచినట్టి, మహర్షేః శిష్యం - వరతంతు శిష్యుఁడైన కౌత్సుని, నృపతిః - రాజు, నిషిధ్య - వద్దనిఆపి, హేవిద్వన్ - ఓవిద్వాంసుఁడ! త్వయా - నీచేత, గురవే - మీగురువునకు, ప్రదేయం - ఇయ్యవలసిన, వస్తు - ద్రవ్యము,

కిం - ఏది ? కియద్వా (కియత్ + వా) - ఎంత పరిమాణము గలది ? ఇతి - ఇట్లని, తం - ఆకౌత్సుని అన్వయుంక్త - ప్రశ్నించెను. క్లుప్తముగా పలికి మరలి పోఁదలచిన కౌత్సుని ఆపి, ఓపండితుడా ! మీగురువుగారి కియ్యవలసిన వస్తువేది? అది యెంత ? అని రఘుమహారాజు ప్రశ్నించెను.

శ్లో. తతో యథావ ద్విహితాధ్వరాయ
తస్మై స్మయావేశ వివర్జితాయ
వర్ణాశ్రమాణాం గురవే స వర్ణీ
విచక్షణం ప్రస్తుత మాచచక్షే. 19

వ్యాఖ్య : తతః - తర్వాత, యథావత్ - తగినరీతిగా, విహితాధ్వరాయ - అనుష్ఠింపఁబడిన యజ్ఞము గలిగినట్టియును, స్మయావేశ వివర్జితాయ - గర్వము లేనివాఁడును, వర్ణాశ్రమాణాం - బ్రాహ్మణాది వర్ణములకును, బ్రహ్మచర్యాద్యాశ్రమములకును, గురవే - నియామకుఁడునునగు, తస్మై - ఆరఘుమహారాజు కొఱకు (రఘువునకు), విచక్షణః - పండితుఁడును, వర్ణీ - బ్రహ్మచారి యునైన, సః - ఆ కౌత్సుఁడు, ప్రస్తుతం - ప్రకృత విషయమును, ఆచచక్షే - విపులముగాఁజెప్పెను. విధి విహిత ప్రకారముగా యజ్ఞముచేసి, గర్వము రవంతయులేక, వర్ణాశ్రమ ధర్మ రక్షకుఁడై యున్న రఘుమహారాజు వినయముతో నడిగినప్పుడు, తన కార్యము సిద్ధించునన్న యాశ లేక పోయినను, సమాధానము చెప్పుట కౌత్సుని ధర్మము, కనుక పండితుఁడై బ్రహ్మచారియునై యున్న యతఁడు తాను వచ్చిన పనిని రఘుమహారాజుతో విపులముగాఁ జెప్పుట కారంభించెను.

శ్లో. సమాప్తవిద్యేన మయా మహర్షిః
విజ్ఞాపితో భూత్ గురుదక్షిణాయై
స మే చిరా యాస్ఖలితోపచారాం
తాం భక్తి మే వాగణయత్ పురసాత్. 20

వ్యాఖ్యః సమాప్తవిద్యేన - ముగింపఁబడిన విద్యలుగల, మయా - నాచేత, మహర్షిః - వరతంతు మహాఋషి, గురుదక్షిణాయై - గురుదక్షిణను స్వీకరించుటకొఱకై, విజ్ఞాపితః - అభూత్ మనవిచేయబడినవాఁడయ్యెను. సః - ఆయన

చిరాయ - బహుకాలము, అస్ఖలితోపచారాం - పొరపాటులేని సేవగల, తాం,మే, భక్తిమేవ - ఆనాగురుభక్తినే, పురస్తాత్ - ప్రథమముగా, అగణయత్ - లెక్కించెను. నేను విద్యలు ముగించిన పిమ్మట గురు దక్షిణను స్వీకరించుట కనుమతిని వేడగా, మాగురువు వరతంతు మహర్షి, నేను తొట్రుపాటు లేక చిరకాలము చేసిన సేవారూపమగు గురుభక్తినే మొదట లెక్కించెను, అదియే దక్షిణ, దానితోనే సంతసించితి ననెను.

శ్లో. నిర్బంధ సంజాత రుషా ర్థకార్శ్య
మచింతయిత్వా గురుణా హ ముక్తః
వి త్తస్య విద్యా పరిసంఖ్యయా మే
కోటీ శ్చతస్రో దశ చాహరేతి. 21

వ్యాఖ్య : నిర్బంధ సంజాతరుషా—నిర్బంధ - బలవంత పెట్టుటచేత, సంజాత - కలిగిన, రుషా - కోపముగలవాఁడైన, గురుణా - మా గురువుచేత. అర్థకార్శ్యం - సాధనహీనత్వమును, అచింతయిత్వా - ఆలోచింపకయే, అహం - నేను, వి త్తస్య - ధనముయొక్క, చతస్రః - దశచ - నాలుగున్ను పదియునైన, కోటీః - కోట్లను, మే, ఆహర - నాకొఱకు తెమ్ము. ఇతి - ఇట్లని, విద్యాపరిసంఖ్యయా-విద్యా - నేను ఆయన వద్ద చదువుకొన్న విద్యల యొక్క, పరిసంఖ్యయా - లెక్కప్రకారము, ఉక్తః - చెప్పఁబడినవాఁడనైతిని. మనుస్మృతి ప్రకారము, "ఋగ్వేదము, యజుర్వేదము, సామవేదము, అథర్వవేదము, శిక్ష, వ్యాకరణము, ఛందస్సు, నిరుక్తము, జ్యోతిషము, కల్పము, మీమాంస, న్యాయము, పురాణము, ధర్మశాస్త్రము" అనునవి 14 విద్యలు. వీనిని కౌత్సుఁడు వరతంతుముని వద్ద చదివి యుండుటచేత, గురుదక్షిణ స్వీకరింపుఁడని కౌత్సుఁడు పదే పదే ప్రార్థించి బలవంత పెట్టుటవలన వరతంతు మునికి కోపమువచ్చి, ఇతఁడు ధనవంతుఁడా దరిద్రుఁడా అన్న విచారమునుమాని, నీవు నావద్ద పదునాలుగు విద్యలు నేర్చితివిగదా! విద్యకొక కోటి ప్రకారము పదునాలుగు కోట్ల బంగారు నాణెములు తెచ్చి యిమ్మని యడిగెనని కౌత్సుఁడు రఘుమహారాజుతోఁ జెప్పెను.

శ్లో. సో హం సపర్యావిధి భాజనేన
మత్వా భవంతం ప్రభుశబ్దశేషమ్

అభ్యుత్సహే సంప్రతి నోపరోద్ధు
మల్పేతరత్వాత్ శ్రుతనిష్క్రయస్య. 22

వ్యాఖ్య: సోఽహం (సః + అహం) - అట్టినేను, సపర్యావిధిభాజనేన- సపర్యావిధి - పూజావిధానమునకు సంబంధించిన, భాజనేన - పాత్రచేత (పూజా పాత్రచేత), భవంతం - నిన్ను, ప్రభుశబ్దశేషం - 'ప్రభువు' అనుమాటచేతనే మి గి లి యు న్న వానినిగా, మత్వా - తెలిసికొని, శ్రుతనిష్క్రయస్య - విద్యా మూల్యము, అల్పేతరత్వాత్ - కొంచెము కానిదగుటవలన, సంప్రతి - ఈ సమ యమున, ఉపరోద్ధుం - నిర్బంధ పెట్టుటకు, నాభ్యుత్సహే - ఇష్టపడను. గురువు చేత పదునాలుగు కోట్లు తెమ్మని కోరఁబడిన నేను, నన్ను పూజించుటకు తెచ్చిన మట్టి పాత్రచేతనే నీవు సర్వస్వమును వ్యయించి "ప్రభువు" అ న్న మా ట తో మాత్రమే మిగిలియున్నావని గ్రహించితిని. ఇట్టి సమయమున అత్యధికమైన ధనము కోసమై నిన్ను ఇబ్బంది పెట్టుట కిష్టపడుటలేదు,

శ్లో. ఇత్థం ద్విజేన ద్విజరాజకాంతి
రావేదితో వేదవిదాం వరేణ
ఏనో నివృత్తేంద్రియవృత్తి రేనం
జగాద భూయో జగదేకనాథః. 23

వ్యాఖ్య: ద్విజరాజ కాంతిః - చంద్రునియొక్క కాంతివంటి కాంతిగల వాఁడును, ఏనోనివృత్తేంద్రియ వృత్తిః—ఏనః - పాపమునుండి, నివృత్త - మర లిన, ఇంద్రియవృత్తిః - ఇంద్రియవ్యాపారము గలవాఁడును, జగదేకనాథః - లోకమునకేకైక ప్రభువునైన రఘుమహారాజు, వేదవిదాం, వరేణ - వేదవేత్త లలో శ్రేష్ఠుడైన, ద్విజేన - బ్రాహ్మణునిచేత (కౌత్సునిచేత), ఇత్థం - ఇట్లు (పూర్వమతఁడు చెప్పినరీతిగా), ఆవేదితః - విన్నవింపఁబడిన వాఁడగుచు, ఏనం - ఇతనిని గుఱించి, భూయః - మరల, జగాద - పలికెను. వచ్చినవాఁడు ద్విజుఁడు, తాను ద్విజరాజ కాంతిగలవాఁడు, చంద్రుఁడు ద్విజులకు రాజైనట్లు శ్రుతిప్రమాణము కలదు. ఏ విధమైన పాపస్పర్శలేని చిత్తవృత్తిగల రఘువు వేద వేత్తయైన యాచకుఁడు నిరాశతో వెనుకకు మరలుటను సహించునా? కనుక అత నితో మరల నీ క్రిందివిధముగా పలుకుచున్నాఁడు.

శ్లో. గుర్వర్థ మర్థీ శ్రుతపారదృశ్వా
రఘోః సకాశా దనవాప్య కామం
గతో వదాన్యాంతర మి త్యయం మే
మాభూత్ పరీవాదనవావతారః. 24

వ్యాఖ్య: శ్రుతపారదృశ్వా - శాస్త్రముల అంతమును చూచినవాఁడును గుర్వర్థం - గురువుకొఱకు, అర్థీ - యాచకుఁడైన ఒకవ్యక్తి, రఘోఃసకాశాత్ - రఘువువద్దనుండి, కామం - కోరికను, అనవాప్య - పొందక, వదాన్యాంతరం - మఱియొక దాతనుగురించి, గతః - వెళ్లెను, ఇతి ఈ విధమైన, అయం - ఈ, పరీవాదనవావతారః—పరీవాద - అపకీర్తియొక్క, నవావతారః - క్రొత్తపుట్టుక, మే - నాకు, మాభూత్ - లేకపోవుగాక. ఓ కౌత్సుడా! 'సకలశాస్త్ర పారంగతుఁడై గురుదక్షిణను యాచింపవచ్చిన ఒక ద్విజుఁడు, రఘువువద్ద తన కోరికను పొందలేక మఱియొక దాతను యాచించుటకై వెళ్లెను.' అను క్రొత్త యపకీర్తి నాకు రాకుండునుగాక యని రఘుమహారాజు వేడుకొని, ఇంకను ఈ క్రింది రీతిగా పలికెను. అన్యః వదాన్యః - వదాన్యాంతరం; అన్యఃగ్రామః - గ్రామాంతరం. ఇట్టి విగ్రహములుగల ఈ పదములు అవ్యయీభావ సమాసములు. ఇచ్చట "రఘోః" అను స్వనామోచ్చారణము, తనవంటి సంభావితునికి అని సూచించుటకు

శ్లో. స త్వం ప్రశస్తే మహితే మదీయే
వసం శ్చతుర్థోఽగ్ని రి వాగ్న్యగారే,
ద్విత్రా ణ్యహా న్యర్హసి సోఢు మర్హన్
యావ ద్యతే సాధయితుం త్వదర్థమ్. 25

వ్యాఖ్య: సః, త్వం - అట్టినీవు (పండితుఁడవై గురుదక్షిణార్థము వచ్చిన నీవు నాకు అవమానముఁ గూర్పఁదగవు కనుక), మహితే - పూజితమై, ప్రశస్తే - ప్రసిద్ధమైన, మదీయే, అగ్న్యగారే - నాత్రేతాగ్నిశాల యందు, చతుర్థః, అగ్నిః, ఇవ - నాలుగవ అగ్నివలె, ద్విత్రాణి - రెండుమూడు, అహాని - దినములను, సోఢుం - సహించుటకు, అర్హసి - తగుదువు. హేఅర్హన్ - ఓ పూజ్యుఁడా! త్వదర్థం - నీవు కోరిన ధనమును, సాధయితుం - చేకూర్చుటకు, యావద్యతే

(యావత్ + యతే) - ప్రయత్నింపఁగలను. నీవు నిరాశచెంది మరియొక దాత వద్దకి వెళ్లితివను క్రొత్త యవమానమును నాకు కలిగింపక పవిత్రమైన నా యాగశాలయందు పవిత్రుఁడైన నాలుగవ యగ్నిహోత్రునివలె రెండుమూడు రోజులు నివసింపుము, నీ గురుద్రవ్యమును సంపాదించుటకు తప్పక ప్రయత్నింపఁ గలనని రఘుమహారాజు కౌత్సమునితో ననెను. ద్వేత్రీణివా - ద్విత్రాణి (రెండు మూడు), పంచషట్వా పంచషాః (అయిదాఱు) అను విగ్రహములుగల బహు వ్రీహి సమాసములు. త్రేతాగ్నులనగా యజ్ఞముచేసిన వ్యక్తి యింటిలో నిరంతర ముగా మూడు కుండములలో నుండవలసిన మూడు అగ్నులు. వాటికి ఆహవనీ యాగ్ని, దాక్షిణాగ్ని, గార్హపత్యాగ్ని అనిపేర్లు. నీవు చతుర్థాగ్నివలె మండు మను టలో రఘుమహారాజుకు కౌత్సునిపైఁగల పవిత్రభావము వ్యక్తమగును.

శ్లో. తథేతి తస్యావితథం ప్రతీతః
ప్రత్యగ్రహీ త్సంగర మగ్రజన్మా,
గా మాత్తసారాం రఘు ర ప్యవేత్య
నిష్క్రష్టు మర్థం చకమే కుబేరాత్. 26

వ్యాఖ్య: అగ్రజన్మా - బ్రాహ్మణుఁడు (కౌత్సుడు), ప్రతీతః సన్ - సంతోషించినవాఁడగుచు, తస్య - ఆ రఘుమహారాజుయొక్క, అవితథం - అస త్యముకాని, సంగరం - ప్రతిజ్ఞను, తథేతి (తథా + ఇతి) - సరేయని, ప్రత్య గ్రహీత్ - ఒప్పుకొనెను, రఘురపి - రఘుమహారాజుకూడా, గాం - భూమిని, ఆత్తసారాం - అంతకుపూర్వమే గ్రహింపఁబడిన ధనము కలదానినిగా, అవేక్ష్య - చూచి, కుబేరాత్ - కుబేరునివలన, అర్థం - ధనమును, నిష్క్రష్టుం - బలాత్కార ముగా తెచ్చుటకు, చకమే - తలంచెను. రఘువు సత్యప్రతిజ్ఞుఁడు కనుక ఆతని మాటను కౌత్సుఁడు సరేయని యంగీకరించెను. రఘుమహారాజుకూడా, తన రాజ్యమునుండి విశ్వజిద్యాగ సమయమునందే సర్వధనములను స్వీకరించి యుండుటచేత నిప్పుడు నిస్సారమైనదానినిగా గ్రహించి, ధనపతియైన కుబేరుని వలన క్షాత్రధర్మప్రకారము యుద్ధముప్రకటించి ధనమును తెచ్చుటకై తలంచెను. "సంగర" శబ్దమునకు "ప్రతిజ్ఞ, యుద్ధము, జ్ఞానము, ఆపద" అర్థములు. ఇచ్చటి సంగర శబ్దమునకు వాచ్యార్థము ప్రతిజ్ఞయైనను, అది రాఁబోవు యుద్ధప్రకటనమును సూచించును.

శ్లో. వసిష్ఠ మంత్రోక్షణ జాత్ ప్రభావాత్
ఉదన్వ దాకాశ మహీధరేషు.
మరుత్సఖ స్యేవ వలాహకస్య
గతి ర్విజఘ్నే న హి తద్రథస్య. 27

వ్యాఖ్య : వసిష్ఠ మంత్రోక్షణ జాత్ — వసిష్ఠ - వసిష్ఠ మహర్షియొక్క, మంత్రోక్షణ - మంత్రోచ్చారణముచే ప్రోక్షించుటవలన, జాత్ - కలిగిన, ప్రభావాత్ - సామర్థ్యమువలన, ఉదన్వ దాకాశ మహీధరేషు—(ఉదన్వత్ + ఆకాశ + మహీధరేషు) - సముద్రముల మీదను, ఆకాశమునందును, పర్వతములపైనను, మరుత్సఖస్య, వలాహకస్య, ఇవ - వాయుసహాయుఁడైన మేఘునియొక్క వలె, తద్రథస్య - ఆ రఘుమహారాజు రథముయొక్క, గతిః - గమనము (సంచారము), న, విజఘ్నే, హి - అకుంఠితమై యున్నది సుమా! వసిష్ఠమహాఋషి అభిమంత్రించి చల్లిన మంత్రోదకముల ప్రభావమువలన రఘుమహారాజు రథమునకు, వాయుసహితమైన మేఘమునకువలె, సముద్రముల మీదను, అంతరిక్షమునందును, పర్వతములపైనను అప్రతిహతమైన (అడ్డులేని) గమనము కలదుసుమా!

శ్లో. అథాధిశిశ్యే ప్రయతః ప్రదోషే
రథం రఘుః కల్పితశస్త్రగర్భం
సామంతసంభావన యైవ ధీరః
కైలాసనాథం తరసా జిగీషుః. 28

వ్యాఖ్య : అథ - పిమ్మట, ప్రదోషే - మునిమాపున, ధీరః - ధీరుఁడును, ప్రయతః - నియమ పరిశుద్ధుఁడునునగు, రఘుః - రఘుమహారాజు, సామంత సంభావనయా, ఏవ - తనకు లొంగిపోగల సామాన్యరాజు అను తలంపు చేతనే, కైలాసనాథం - కైలాసపర్వత ప్రాంతాధిపతియగు కుబేరుని, తరసా - బలముచేత, జిగీషుః - జయింపఁ దలఁచిన వాడగుచు, కల్పిత శస్త్రగర్భం - సిద్ధపరుపఁబడిన యస్త్రములు లోన నుంచఁబడిన, రథం - రథమునందు, అధిశిశ్యే - ఎక్కి పరుండెను. (ఇచ్చటి రథం అను ద్వితీయకు సప్తమి అర్థము) దిక్పాలకుఁడైన కుబేరుఁడుగూడ ఒక సామాన్య సామంతరాజే అను భావనతో రఘుమహారాజతనిని బలముతో జయింప దలఁచి, శస్త్రాస్త్రములచేత యుద్ధమునకు సన్నద్ధ

పరుపఁబడిన రథముమీద ఆనాటి పూర్వరాత్రివేళ యెక్కిపరుండెను. రాజులు ప్రదోష సమయమున యానారోహణమును జేయవలయునిని శాస్త్రము. శివుఁడు కైలాసవాసిమాత్రమే. కైలాసమునకు కుబేరుఁడే అధిపతి. కనుక కైలాసనాథం అని ప్రయోగము.

శ్లో. ప్రాతః ప్రయాణాభిముఖాయ తస్మై
సవిస్మయాః కోశగృహే నియుక్తాః
హిరణ్మయీం కోశగృహస్య మధ్యే
వృష్టిం శశంసుః పతితాం నభస్తః 29

వ్యాఖ్య: ప్రాతః - ఆమరునాటి వేకువయందు, ప్రయాణాభిముఖాయ - బయలు దేరుటకు సిద్ధముగానున్న. తస్మై - అతనికొఱకు (అరఘుమహారాజుకు) కోశగృహే. నియుక్తాః - ధనాగారము నందలి యుద్యోగులు, సవిస్మయాః - ఆశ్చర్యముతో కూడిన వారగుచు, కోశగృహస్యమధ్యే - ధనాగారముయొక్క నడుమ, నభస్తః - అకాశమునుండి, పతితాం - పడిన, హిరణ్మయీం, వృష్టిం - సువర్ణ వృష్టిని, శశంసుః - తెలిపిరి, రథముపై నిద్రించి, వేకువజామున ప్రయాణమగుచున్న రఘుమహారాజు వద్దికి భాండాగార నియుక్తులైన ఉద్యోగులు వచ్చి, గతరాత్రియందు ఆకాశమునుండి, ధనాగారగవాక్షముద్వారా, సువర్ణ వృష్టి కురిసినట్లుతెలిపిరి, మహాపరాక్రమవంతుఁడగు రఘుమహారాజు తనపైకి యుద్ధమునకు రానున్నాఁడని తెలిసి, భయపడి కుబేరుఁడు సువర్ణవృష్టిని గురుపించెనని భావము,

శ్లో. తం భూపతి ర్భాసుర హేమరాశిం
లబ్ధం కుబేరా దభియాస్యమానాత్
దిదేశ కౌత్సాయ సమస్త మేవ
శృంగం సుమేరో రివ వజ్రభిన్నమ్. 30

వ్యాఖ్య: భూపతిః - రఘుమహారాజు, అభియాస్యమానాత్ - తానుదండెత్తి పోఁదలఁపబడినవాఁడగు, కుబేరాత్ - కుబేరునివలన, లబ్ధం - పొందఁబడినదియు, వజ్రభిన్నం - ఇంద్రుని వజ్రాయుధముచేత పగులగొట్టఁబడిన, సుమేరోః, శృంగమివ (స్థితం) - మేరు పర్వతముయొక్క శిఖరము వలెనున్నదియు నగు, తం,

భాసుర హేమరాశిం - అప్రకాశించుచున్న బంగారపురాశిని, సమస్తమేవ - అంతటిని, కౌత్సాయ - కౌత్సమునికి, దిదేశ - ఇచ్చెను. తాను దండు వెడలనున్న కుబేరుఁడు స్వయముగా లొంగిపోయినట్లు సూచించుటకై కురిపించిన సువర్ణవృష్టివలన తనకు లబ్ధమైన బంగారము, ఇంద్రునివజ్రాయుధముచేత ఛేదింపబడినేలపైఁబడిన మేరు పర్వత శిఖరమువలెనుండెను. ఆసువర్ణ రాశినంతటిని రఘుమహారాజు కౌత్సమునికి ఇచ్చి వేసెను, అనఁగా పదునాలుగు కోట్లకంటె అధికముగా నిచ్చెనని భావము,

శ్లో. జనస్య సాకేతనివాసిన స్తౌ
ద్వా వప్యభూతా మభినంద్యస త్త్వౌ;
గురుప్రదేయాధిక నిఃస్పృహోఽర్థీ
నృపోఽర్థికామా దధికప్రదశ్చ. 31

వ్యాఖ్య: తౌ, ద్వావపి - ఆయాచకుఁడు, ఆదాతయును, సాకేతనివాసినః - అయోధ్యానగరమందున్న, జనస్య – జనమునకు, అభినంద్యసత్త్వౌ - మెచ్చుకోఁదగిన ప్రయత్నములుగలవారు అభూతాం - అయిరి; అర్థీ - యాచకుఁడైన కౌత్సుడు గురుప్రదేయాధికనిస్పృహః - గురుప్రదేయాధిక - గురువుగారి కీయవలసిన దానికంటె అధికమైన ధనమునందు, నిస్పృహః - కోరికలేనివాడును ; నృపః - రఘు మహారాజు, అర్థికామాత్ - యాచకుని కోరికకంటే, అధికప్రదశ్చ - ఎక్కువగాఇచ్చువాఁడును, మహారాశిగా వచ్చిపడిన బంగారమునంతటిని గొని పొమ్మని రఘుమహారాజును, మాగురువుగారి కీయవలసిన పదునాలుగు గోట్ల ధనము కంటె ఎక్కువ నాకక్కఱలేదని కౌత్సుఁడును పలుకుచు నొకరి నొకరు ఒప్పించుటకు వారు చేయుచున్న ప్రయత్నమువలన ఆదాత, ఆయాచకుడు, ఇద్దఱును సాకేత నగర వాసులగు ప్రజలకు మెచ్చుకోఁదగిన వారై యుండిరి. ఇద్దఱిని జనము మెచ్చుకొనిరని భావము. 'సత్త్వ' శబ్దమునకు ద్రవ్యము, ప్రాణము, వ్యవసాయము (ప్రయత్నము), జంతువు, అర్థములు.

శ్లో. అథోష్ట్రవామీ శత వాహితార్థం
ప్రజేశ్వరం ప్రీతమనా మహర్షిః
స్పృశన్ కరే ణానతపూర్వకాయం
సంప్రస్థితో వాచ మువాచ కౌత్సః. 32

వ్యాఖ్య : అథ - ఎట్లో ఒప్పించి ధనమంతయు నిచ్చినపిమ్మట, ప్రీతః మనాః - సంతోషించిన మనస్సుగల, మహర్షిః - కౌత్సుఁడు, సంప్రస్థితః - బయలుదేరగల వాఁడగుచు, ఉష్ట్రవామీ శతవాహితార్థం—ఉష్ట్ర - ఒంటెల యొక్కయు, వామీ - ఆడుగుఱ్ఱములయొక్కయు, శత - శతములచేత, వాహిత- మోయింపబడిన, అర్థం - ధనముగలవాఁడును, ఆనతపూర్వకాయం - వినయ - వినమ్రశరీరము గలవాఁడును నగు, ప్రజేశ్వరం - రఘుమహారాజును, కరేణ హస్తముచేత, స్పృశన్ - తాకుచు, వాచం - మాటను, ఉవాచ - పలికెను. ఎట్టకేలకు కౌత్సుని అంగీకరింపఁజేసి రఘుమహారాజు ధనము నంతటిని ఒంటెల మీదను, ఆడుగుఱ్ఱములమీదను వేయించెను. దానిని గ్రహించి వెళ్లబోవుచున్న కౌత్సుని పాదములపై వంగి నమస్కరించుచున్న రఘువును చేతితో స్పృశించుచు కౌత్సుఁడు ఇట్లు పలికెను.

శ్లో. కి మత్ర చిత్రం యది కామసూ ర్భూః
వృత్తే స్థిత స్యాధిపతేః ప్రజానామ్
అచింతనీయస్తు తవ ప్రభావో
మనీషితం ద్యౌ రపి యేన దుగ్ధా. 33

వ్యాఖ్య : వృత్తే - చతుర్విధమైనే రాజవృత్తమునందు (నడవడియందు), స్థితస్య - ఉన్నట్టి, ప్రజానాం,అదిపతేః - రాజునకు, భూః - భూమి, కామసూః యది - కోరికల నిచ్చునది యగునన్నచో, అత్ర,కిం,చిత్రం - ఈవిషయమునందాశ్చర్యమేమున్నది ? కింతు - కాని, యేన - ఏనీచేత, ద్యౌరపి - స్వర్గము గూడా మనీషితం - కోరికను, దుగ్ధా - పితుకఁబడినదో, తవ అట్టి నీయొక్క, ప్రభావః తు - మహిమమాత్రము, అచింతనీయః - ఊహింపరానిది. చక్రవి ప్రవర్తన గల రాజునకు భూమి కోరికల నిచ్చుటలో ఆశ్చర్యములేదు. కాని స్వర్గము నుండి కూడ కోరికలను దీర్చుకోఁగలిగిన నీ ప్రభావము అద్భుతముగా నున్నది. "న్యాయేనార్జన మర్థస్య వర్ధనం పాలనం తథా ౹ సత్పాత్రే పతిపత్తిశ్చ రాజవృత్తం చతుర్విధమ్" అనుకామందక నీతిసారము ననుసరించి, న్యాయమార్గమున ధనము నార్జించుట, దానిని వృద్ధిపరచుట, రక్షించుట, తగిన వారికి దానమిచ్చుట యనునవి నాలుగును రాజవృత్తములు. అట్లు చేయు రాజుకు ధనలోప ముండదు.

శ్లో. ఆశాస్య మన్యత్ పునరుక్తభూతం
శ్రేయాంసి సర్వా ణ్యధిజగ్ముష స్తే
పుత్రం లభ స్వాత్మగుణానురూపం
భవంత మీడ్యం భవతః పితేవ. 84

వ్యాఖ్య: సర్వాణి, శ్రేయాంసి - సమస్తములైన శ్రేయస్సులను, అధిజగ్ముషః - పొందియున్నట్టి, తే - నీకు, అన్యత్ - మఱియొక, ఆశ్యాసం - ఆశీర్వచన సాధ్యమగునది, పునరుక్త భూతం - అన్నదే మఱల యనుటవంటిది, కింతు - అయితే, ఈడ్యం - స్తుతి పాత్రుఁడవైన, భవంతం - నిన్ను, భవతః - నీ యొక్క, పితేవ - తండ్రివలె, ఆత్మగుణానురూపం - నీగుణములకు తగినవాఁడగు(నీతో సమానుఁడగు) పుత్రం - కుమారుని, లభస్వ - పొందుము, రథగజతురగాది సమస్త సంపదలు గల నీకు ఆశీర్వచనముతో నే వస్తువును కోరినను అది పునరుక్తమై కలిగియున్న వస్తువే మరల కలుగుగాక యని దీవించినట్లగును. కనుక స్తుతి యోగ్యుఁడవైన నిన్ను నీతండ్రి కన్నట్లు, నీవును నీవంటి సద్గుణములు గల కుమారునిఁ గనుము అని కౌత్సుఁడు ఆశీర్వదించెను.

శ్లో. ఇత్థం ప్రయు జ్యాశిష మగ్రజన్మా
రాజ్ఞే ప్రతీయాయ గురోః సకాశమ్
రాజాపి లేభే సుత మాశు తస్మాత్
ఆలోక మర్కా దివ జీవలోకః. 35

వ్యాఖ్య: అగ్రజన్మా - బ్రాహ్మణుఁడైన కౌత్సుఁడు, ఇత్థం - ఈవిధముగా రాజ్ఞే - రాజుకు, అశిషం - ఆశీర్వచనమును, ప్రయుజ్య - ఇచ్చి, గురోః, సకాశమ్ - తన గురువు వద్దకి, ప్రతీయాయ (పతి + ఇయాయ) - తిరిగి వెళ్లెను. రాజాపి - రఘుమహారాజు కూడ, జీవలోకః - ప్రాణిసమూహము, అర్కాత్ - సూర్యునివలన, ఆలోకం, ఇవ - వెలుతురును వలె, తస్మాత్ - ఆకౌత్స ముని యాశీర్వచనము వలన, ఆశు - శీఘ్రకాలము నందే, సుతం - కుమారుని, లేభే - పొందెను. "నీవు సద్గుణవంతుఁడవైనట్లు నీవంటి కుమారుని కనుము." అని యాశీర్వదించి కౌత్సుఁడు గురువగు వరతంతు మహర్షి యాశ్రమమునకుఁ దిరిగి వెళ్లిపోయెను. రఘుమహారాజుకూడ, సూర్యునివలన జీవలోకము వెలుతురును

పొందినట్లు ఆముని దీవెనవలన శీఘ్రముగానే పుత్రునిఁగనెను. పుత్ర దర్శనము లేకుండుట మానవునికి అంధకారమనియు, కుమారోదయము జీవితమునకు వెలుతురనియు భావము,

శ్లో. బ్రాహ్మే ముహూర్తే కిల తస్య దేవీ
కుమారకల్పం సుషువే కుమారం
అతః పితా బ్రహ్మణ ఏవ నామ్నా
త మాత్మజన్మాన మజం చకార. 36

వ్యాఖ్య: తస్య - ఆరఘుమహారాజుయొక్క, దేవీ - భార్య, బ్రాహ్మే - బ్రహ్మ అధి దేవతగాఁగల, ముహూర్తే - ముహూర్తమునందు, కుమారకల్పం - కుమారస్వామితో సమానుఁడైన, కుమారం - పుత్రుని, సుషువేకిల - కనెనట అతః - బ్రాహ్మముహూర్తాన పుట్టినందున, పితా - తండ్రియగు రఘువు బ్రహ్మణ ఏవనామ్నా - బ్రహ్మ పేరుతోనే, తం, ఆత్మజన్మానం - ఆకుమారుని, అజం - అజుఁడను పేరుగలవానిని, చకార - చేసెను, రఘుమహారాజు పట్టపురాణి ఒక, నాటిబ్రాహ్మముహూర్తనందు కుమారస్వామి వంటి పుత్రునిప్రసవించెను, బ్రహ్మకు 'అజః' అనునది పర్యాయ పదము కనుక ముహూర్తము ననుసరించి, రఘు మహారాజు పుత్రునికి 'అజః' (అజుఁడు) అని నామకరణము చేసెను, 'బ్రాహ్మే ముహూర్తే' అనుదానికి మల్లినాథ వ్యాఖ్య బొంబాయి ప్రతిలో అభిజిన్ముహూర్తే అని యుండగా, వేదము వేంకటరాయశాస్త్రిగారి ప్రతిలో "అజనామకే ముహూర్తే" అని యున్నది. 'అభిజిత్' అను ముహూర్తమునకు బ్రహ్మ అధిపతియని జ్యోతిష గ్రంథములు చెప్పుచున్నవి. "అజచరణ" మను నొక ముహూర్తము కలదు, కాని అది బ్రహ్మ దేవతాకము కాదు. కనుక అభిజిత్తనుట మేలు,

శ్లో. రూపం త దోజస్వి త దేవ వీర్యం
త దేవ నైసర్గిక మున్నతత్వం
న కారణాత్ స్వాద్ బిభిదే కుమారః
ప్రవర్తితో దీప ఇవ ప్రదీపాత్. 37

వ్యాఖ్య: ఓజస్వి - తేజస్సుగల, రూపం - దేహము, తదేవ - అదియే, (రఘుమహారాజుదే); వీర్యం - శౌర్యము, తదేవ - అదియే; నైసర్గికం - స్వభావ

పిద్ధమైన, ఉన్నతత్వం - ఎత్తు, తదేవ - అదియే; కుమారః - బాలుఁడు(అజుఁడు) ప్రవర్తితః - వెలిగింపబడిన, దీపః - దీపము, ప్రదీపాత్ ఇవ - తనను వెలిగించిన పెద్ద దీపమునుండిపలె, స్వాత్, కారణాత్ - తన పుట్టుకకు కారణమైన రఘుమహారాజు కంటె, నబిభిదే - భేదమును పొందలేదు, ఒక పెద్ద దీపమునుండి వెలిగింపబడిన చిన్న దీపము రూపకాంతులలో నెట్లు ఒకే మాదిరిగా నుండునో, అట్లే పుట్టిన పిల్లవాడు రూప వీర్యాదుల యందు అచ్చముగా రఘుమహారాజును పోలియుండెనని భావము.

శ్లో. ఉపాత్తవిద్యం విధివత్ గురుభ్యః
తం యౌవనోద్భేద విశేష కాంతం
శ్రీః సాభిలాషా ఽపి గురో రనుజ్ఞాం
ధీరేవ కన్యా పితు రాచకాంక్ష. 38

వ్యాఖ్య : గురుభ్యః - గురువుల వలన, విధివత్ - శాస్త్రప్రకారముగా, ఉపాత్తవిద్యం - పొందఁబడిన విద్యలు కలవాఁడును, యౌవనోద్భేదవిశేషకాంతం -యౌవనోద్భేద - యౌవనము వచ్చుటవలన, విశేషకాంతం - మిక్కిలి మనోహరుఁడై యున్న, తం - ఆయజుని గుఱించి, సాభిలాషా,అపి - కోరిక గలదియే యైనను, శ్రీః - రాజ్యలక్ష్మి, ధీరా - స్థిరము, ఉన్నతమునైన చిత్తముగల, కన్యా - కన్య, పితుఃఇవ - తండ్రియొక్కవలె, గురోః - పెద్దవాఁడైన రఘువు యొక్క, అనుజ్ఞాం - అనుమతిని, ఆచకాంక్ష - కోరెను. చక్కగా విద్యలునేర్చుకొని, యౌవనావిర్భావముచేత మిక్కిలి యందగాఁడైయున్న అజునిఁ జేరుటకు రాజ్యలక్ష్మి యువిళ్లూరుచున్నను, హృదయమును చిక్కబట్టుకోఁగల యొకా నొక కన్య తండ్రి యాజ్ఞకెదురు చూచుచున్నట్లు, రఘుమహారాజు సమ్మతికై ప్రతీక్షించుచుండెను. యుక్తవయస్కుఁడైన యజునికి యౌవరాజ్య పట్టాభిషేకము చేయు ప్రయత్నములు జరుగుచుండెనని భావము.

శ్లో. అథేశ్వరేణ క్రథకైశికానాం
స్వయంవరార్థం స్వసు రిందుమత్యాః,
ఆప్తః కుమారానయనోత్సుకేన
భోజేన దూతో రఘవే విసృష్టః. 39

వ్యాఖ్య: అథ - తర్వాత, స్వసుః, ఇందుమత్యాః - చెల్లెలయిన యిందుమతి యొక్క, స్వయంవరార్థం - స్వయంవరముకొఱకు, కుమారానయనోత్సుకేన— కుమార - అజునియొక్క, ఆనయన - రప్పించుటయందు, ఉత్సుకేన - కుతూహలముగల, క్రథ కైశికానాం, ఈశ్వరేణ - విదర్భ దేశమునకు రాజైన, భోజేన - భోజునిచేత, ఆప్తః - హితుఁడైన, దూతః - దూత, రఘవే - రఘుమహారాజు కొఱకు (వద్దకి), విసృష్టః - పంపఁబడెను. అజునికి మంచి యౌవనదశ వచ్చిన సమయమున, విదర్భదేశపు రాజైన భోజుఁడు తన చెల్లెలగు ఇందుమతికి స్వయం వరోత్సవము ప్రకటించి. ఆప్తుఁడైన యొకదూతద్వారా కుమారుఁడైన యజునిఁ బంపవలసినదిగా రఘుమహారాజును వేడెను.

శ్లో. తం శ్లాఘ్యసంబంధ మసౌ విచింత్య
దారక్రియా యోగ్యదశం చ పుత్రమ్
ప్రస్థాపయామాస ససైన్య మేన
మృద్ధాం విదర్భాధిపరాజధానీమ్. 40

వ్యాఖ్య: అసౌ - ఇతఁడు (రఘుమహారాజు), తం - ఆ భోజుని, శ్లాఘ్య సంబంధం - మెచ్చుకోఁదగిన బాంధవ్యము గలవానిగాను, పుత్రం చ - కుమారుని గూడ, దారక్రియా యోగ్యదశం—దారక్రియా - వివాహమునకు, యోగ్యదశం - తగినవయస్సు కలవానినిగాను, విచింత్య - ఆలోచించి, ససైన్యంఏనం - సైన్య సమేతుఁడైన పుత్రుని, ఋద్ధాం - సర్వ సమృద్ధమైన, విదర్భాధిపరాజధానీం - భోజునియొక్క రాజధానిని గుఱించి, ప్రస్థాపయామాస - పయనము చేయించెను (పంపెను). భోజునిదూత ఇందుమతి స్వయంవర విషయమును జెప్పగానే రఘు మహారాజు, భోజుని చుట్టఱికము మంచిదై యుండుటను, కుమారునికి వివాహ యోగ్యమైన వయస్సు వచ్చియుండుటను ఆలోచించి, సైన్యసమేతముగా అజుని పంపించెను. రాజధానీ శబ్దమునకు, "ధీయతే అస్యాం ఇతిధానీ. రాజ్ఞాం ధానీ రాజ ధానీ" అని విగ్రహము చెప్పవలెను.

శ్లో. తస్యోపకార్యారచితోపచారా
వన్యేతరా జానపదోపదాభిః
మార్గే నివాసా మనుజేంద్రసూనోః
బభూవు రుద్యానవిహారకల్పాః 41

వ్యాఖ్య: ఉపకార్యారచితోపచారాః—ఉపకార్యా - డేరాలయందు, రచిత - చేకూర్చఁబడిన, ఉపచారాః - పరుపు మొదలయిన వస్తువులు గలవియు, జానపదోపదాభిః—జానపద - పల్లెలనుండి వచ్చినవారియొక్క (వారుతెచ్చిన), ఉపదాభిః - కామకలచేతను, వన్యేతరాః - వనమునందలివి కానట్లున్న, తస్య, మనుజేంద్ర సూనోః - ఆ రాజకుమారునియొక్క, మార్గే, నివాసాః - మార్గమునందలి మజిలీలు, ఉద్యాన విహారకల్పాః - ఇంచుమించుగా ఉపవన విహారములవంటివి, బభూవుః - అయినవి. దారిలో డేరాలువేసి, అందులో శయనాదులను సమకూర్చి, జానపదులు ఉపాయనములుగా తెచ్చిన వస్తువుల నచ్చట నుంచుటచేత, ఆజానివాసనికములు (మజిలీలు) ఉద్యాన విహారములుగా నుండెనేకాని యడవిలోని విడుదులవలె నుండలేదని భావము.

శ్లో. స నర్మదారోధసి శీకరార్ద్రైః
మరుద్భి రానర్తితనక్తమాలే
నివేశయామాస విలంఘితాధ్వా
క్లాంతం రజోధూసరకేతు సైన్యమ్. 42

వ్యాఖ్య; విలంఘితాధ్వా - అతిక్రమింపఁబడిన మార్గముగల, సః - ఆ యజుఁడు, శీకరార్ద్రైః - నీటి తుంపురులచేత తడిసిన మరుద్భిః - వాయువులచేత. ఆనర్తిత నక్తమాలే—ఆనర్తిత - కదలింపఁబడిన, నక్తమాలే - క్రానుగుచెట్లుగల, నర్మదారోధసి - నర్మదానది యొడ్డున, క్లాంతం - అలసినదియు, రజోధూసరకేతు - దుమ్ముతో కప్పబడిన జెండాలు కలదియునగు, సైన్యం - సేనను, నివేశయామాస - విడిది చేయించెను. చాలామార్గము దాటి వచ్చినపిమ్మట బడలినదియు, దుమ్ముతోఁ బూడిదవర్ణములై పోయిన జండాలతో నున్నదియు నగు తన సైన్యమును, అజుఁడు చల్లని నీటి తుంపురులతో వచ్చుచు మెల్లగా క్రానుగు చెట్లను కదలించుచున్న మంద మారుతములుగల నర్మదానది యొడ్డున విశ్రమించుట కాజ్ఞనిచ్చెను. క్రానుగుచెట్లు దట్టమైన నీడను, చల్లదనమును ఇచ్చును.

శ్లో. అథోపరిష్టాత్ భ్రమరైః భ్రమద్భిః
ప్రాక్సూచితాంతః సలిలప్రవేశః

  

నిర్ధౌత దానామల గండభిత్తిః
వన్యః సరిత్తో గజ ఉన్మమజ్జ. 43

వ్యాఖ్య: అథ - అట్లు విడిసిన పిమ్మట, ఉపరిష్టాత్ - నీటి పైభాగమున, భ్రమద్భిః - వర్తులముగాఁ దిరుగుచున్న, భ్రమరైః - తుమ్మెదలచేత, ప్రాక్సూచితాంత స్సలిల ప్రవేశః—ప్రాక్ - ముందుగా, సూచిత - తెలుపఁబడిన, అంత స్సలిల - నీటిలోని, ప్రవేశః - ప్రవేశముగలదియు, నిర్ధౌతదానామలగండభిత్తిః—నిర్ధౌత - కడిగి వేయఁబడిన, దాన - మదస్రావముగలవి యగుటచేత, అమల - నిర్మలములైన, గండభిత్తిః - ప్రశస్తములైన గండస్థలములు గలదియు నగు, వన్యఃగజః అడవియేనుగు, సరిత్తః నర్మదానదిలో నుండి, ఉన్మమజ్జ - పైకిలేచెను. అజుఁడట్లు సైన్యసమేతుఁడై నర్మదానదీ తీరమునందు విడిసిన పిమ్మట, ఆ నదిలో, మొదట, తిరుగుచున్న తుమ్మెదలతో తాను ముందే నీటిలో మునిగి యున్నట్లు సూచించి, కడిగివేయఁబడిన మదస్రావముగల పెద్ద గండస్థలములతో నొక యడవియేనుఁగు నదీజలమునుండి పైకిలేచెను ఇచ్చటి 'భిత్తి' శబ్దము గోడ అనునర్థము నందుకాక ప్రశస్తమైన అనునర్థమునఁ బ్రయోగింపఁబడినది. "మతల్లికోద్ఘమిశ్రాః స్యుః ప్రకాండ స్థలభిత్తయః" అని గణరత్న మహోదధి.

శ్లో. నిశ్శేషవిక్షాళితధాతునాఽపి
వప్రక్రియా మృక్షవత స్తటేషు
నీలోర్ధ్వరేఖాశబలేన శంసన్
దంతద్వయే నాశ్మవికుంఠితేన. 44

శ్లో. సంహారవిక్షేపలఘుక్రియేణ
హస్తేన తీరాభిముఖః సశబ్దమ్,
బభౌ స భిందన్ బృహత స్తరంగాన్
వార్యర్గలాభంగ ఇవ ప్రవృత్తః. (యుగ్మం) 45

వ్యాఖ్య: నిశ్శేషవిక్షాళిత ధాతునా, అపి—నిశ్శేష - పూర్తిగా. విక్షాళిత - కడిగివేయఁబడిన, ధాతునాపి - గైరికాది ధాతువులుగలది యైనను, నీలోర్ధ్వరేఖాశబలేన—నీల - నల్లనివియైన, ఊర్ధ్వరేఖా - పైకిఁ గనబడు గీఱలచేత, శబలేన -

చిత్రవర్ణము గలిగినట్టియును, అశ్మవికుంఠితేన - పాషాణములచేత మొక్కలుపోయిన, దంతద్వయేన - రెండు దంతములచేత, ఋక్షవతః - ఋక్షవంతమను పేరుగల యచ్చటి పర్వతముయొక్క, తటేషు - చఱియలయందు, వప్రక్రియాం-తాను ఆడిన ఉత్ఖాతకేళిని (చెలగాటమును), శంసన్ - సూచించుచును. సంహార విక్షేపలఘుక్రియేణ—సంహార - ముడుచుకొనుటయందును, విక్షేప - చాచుట యందును, లఘుక్రియేణ - వేగమైన చలనముగల, హస్తేన - తొండముచేత, సశబ్దం - ఘీంకార యుక్తముగా, బృహతః, తరంగాన్ - పెద్ద పెద్ద యలలను, భిందన్ - చెదరగొట్టుచు, తీరాభిముఖః, సః - ఒడ్డున కెదురుగా నిలుచున్న ఆ యడవియేనుఁగు, వార్యర్గలాభంగే—వారీ - గజబంధనియగు, అర్గలా - గొలుసు యొక్క, భంగే - తెగిన సందర్భమునందు, ప్రవృత్తః ఇవ - ముందుకు రాఁబోవు నదివలె, బభౌ - ప్రకాశించెను. నర్మదానదిలో యథేష్టముగా నీదుటచేత దంతముల కంటుకొనిన గైరికాది ధాతువులు కడుగబడి యున్నను, ఋక్షవత్పర్వత పాషాణములను గోరాడుటచేత రెండు దంతములమీదను నల్లనిచారలుకలిగి, శీఘ్రగతిని తొండమును ముడుచుకొనుచు, చాచుచు, తాను నిలుచుండి కదలుటచేత దగ్గఱికివచ్చిన పెద్ద పెద్ద యలలను జెదరఁగొట్టుచు, కాలి గొలుసు తెగినదానివలె తీరమును జూచుచు నా యరణ్య గజము ప్రకాశించెను. (నిలుచుని తీరస్థులను జూచెను).

శ్లో. శైలోపమః శైవలమంజరీణాం
జాలాని కర్ష న్నురసా స పశ్చాత్
పూర్వం తదుత్పీడిత వారిరాశిః
సరిత్ప్రవాహ స్తట ముత్ససర్ప. 46

వ్యాఖ్య: శైలోపమః - పర్వతముతో సమానమగు, సః - ఆ గజము, శైవలమంజరీణాం - నాచుతీగల చుట్టలయొక్క, జాలాని - మొత్తములను, ఉరసా - వక్షస్థలముచేత, కర్షన్ - లాగుచు, పశ్చాత్ - తర్వాత, తటం - ఒడ్డును. ఉత్ససర్ప - ఎక్కివచ్చెను, పూర్వం - ఆ ఏనుగుకంటె ముందు, తదుత్పీడిత వారరాశిః—తదుత్పీడిత - ఆ ఏనుగుచేత పైకి త్రోయబడిన, వారరాశిః - జలసమూహముగల, సరిత్ప్రవాహః - నదీప్రవాహము, తటం - తీరమును, ఉత్ససర్ప - ఎక్కివచ్చెను. ఉన్నతమైన ఆ యడవియేనుఁగు తీరమునకు నెక్కినప్పుడు

ముందుగా దానిచే త్రోయఁబడిన నదీజలము, పిమ్మట వక్షస్థలముచేత నాచుతీగలను లాగుకొని వచ్చుచున్న తానును, ఒడ్డును జేరినవి.

శ్లో. తస్యైకనాగస్య కపోలభిత్త్యోః
జలావగాహ క్షణమాత్ర శాంతా,
వన్యేతరానేకప దర్శనేన
పున ర్దిదీపే మదదుర్దినశ్రీః 47

వ్యాఖ్య: తస్య, ఏకనాగస్య - అద్వితీయమైన ఆ యేనుఁగుయొక్క, కపోల భిత్త్యోః - విశాలమైన గండస్థలములయందు, జలావగాహక్షణ మాత్ర శాంతా — జలావగాహ - నీటిలో మునుగుటచేత, క్షణమాత్ర - క్షణకాలము మాత్రము, శాంతా - తగ్గిపోయిన, మదదుర్దినశ్రీః ఎడతెగక స్రవించు మద సంపద, వన్యేతరానేకపదర్శనేన—వన్యేతర - అడవియందలివికాని, అనేకప - ఏనుగులయొక్క, దర్శనేన - దర్శనముచేత, పునః - మరల, దిదీపే - ప్రకాశిం చెను (వృద్ధిపొందెను). మహోన్నతమైన యా గజముయొక్క గండస్థలములమీద స్రవించు మదజలము నీటిలో మునుగుటచేత క్షణకాలము శాంతించినను, నగరముల నుండి వచ్చిన సైన్యగజములను జూచుటచేత మరల మదోదకము స్రవించుట కారంభించెనని భావము. "అనేకప" అనగా ద్విపము, రెండుసాధనములతో (తొండముతోను నోటితోను) నీళ్లుత్రాగునది యని వ్యుత్పత్తి.

శ్లో. సప్తచ్ఛద క్షీర కటుప్రవాహ
మసహ్య మాఘ్రాయ మదం తదీయమ్,
విలంఘి తాధోరణ తీవ్రయత్నాః
సేనాగజేంద్రా విముఖా బభూవుః. 48

వ్యాఖ్య: సప్తచ్ఛద క్షీరకటుప్రవాహం—సప్తచ్ఛద - ఏడాకుల యరఁటి చెట్లయొక్క, క్షీర - పాలవలె, కటుప్రవాహం - పరిమళవంతమైన యోడిక గలది యును, అసహ్య - వెగటుగానున్న, తదీయ, మదం - ఆ యడవి యేనుఁగు మదమును, ఆఘ్రాయ - వాసనచూచి, సేనా గజేంద్రాః - సైన్యమునందలి పెద్ద యేనుఁగులు, విలంఘితాధోరణతీవ్రయత్నాః—విలంఘిత - అతిక్రమింపఁబడిన,

ఆధోరణ - మావటివాండ్రయొక్క, తీవ్రయత్నాః దృఢ ప్రయత్నములు గలవి యగుచు విముఖాః వెనుకకు మొగములు పెట్టినవి, బభూవుః - అయినవి. ఏడాకుల యరంటి పాలవంటి పరిమళము గలిగి, వెగటుగానున్న ఆ యరణ్యగజ మదమును వాసనబట్టిన సైన్యగజములు, మావటివాండ్రెంత ప్రయత్నించినను ఆగక యింటిమొగముపట్టి పారిపోవుచుండెనని భావము. 'కటు' శబ్దమునకు సాధారణముగా కారము అని యర్థము. ఇచ్చట పరిమళముగలయను నర్థమునఁ బ్రయోగింపఁ బడినది. "కటుతిక్త కషాయాస్తు సౌరభ్యేఽపి ప్రకీర్తితాః" అని యాదవ నిఘంటువు.

శ్లో. స చ్ఛిన్నబంధ ద్రుత యుగ్యశూన్యం
భగ్నాక్ష పర్యస్త రథం క్షణేన
రామా పరిత్రాణ విహస్త యోధం
సేనానివేశం తుములం చకార. 49

వ్యాఖ్య: సః - ఆ యేనుఁగు, ఛిన్నబంధద్రుతయుగ్యశూన్యం — ఛిన్నబంధ - త్రెంచబడిన పగ్గములు కలవియై, ద్రుత - పరుగెత్తిపోయిన, యుగ్య — గుఱ్ఱములు కలవి గనుకనే, శూన్యం - శూన్యమైనదియును, భగ్నాక్ష పర్యస్త రథం - విరిగిన యిరుసులతో పడిపోయిన రథములు కలదియును, రామా పరిత్రాణ విహస్తయోధం—రామాపరిత్రాణ - స్త్రీలయొక్క రక్షణమునందు, విహస్త యోధం - వ్యాకులపడుచున్న భటులు కలదియునునగు, సేనానివేశం - శిబిరమును, క్షణేన - క్షణకాలమున, తుములం - చెల్లాచెదరై పోయిన దానినిగా, చకార - చేసెను. ఆ యేనుగు తీరమును జేరగానే, గుఱ్ఱములు భయపడి పగ్గములు త్రెంచుకొని పరుగెత్తుటలో ఇరుసులు విరిగి పడిపోయిన రథములు, స్త్రీలను గాపాడుటలో నిటునటు పరుగెత్తు యోధులు మొదలగువాని కలకలముతో నతని శిబిరమంతయు నస్తవ్యస్తమైపోయెనని భావము. "విహస్త వ్యాకులౌ సమౌ" అని యమరము. కనుక 'విహస్త' శబ్దమునకు వ్యాకులపడిన అనియర్థము.

శ్లో. త మాపతంతం నృపతే రవధ్యో
వన్యః కరీతి శ్రుతవాన్ కుమారః

నివర్తయిష్యన్ విశిఖేన కుంభే
జఘాన నాత్యాయత కృష్ట శార్ఙ్గః. 50

వ్యాఖ్య: నృపతేః - రాజునకు, వన్యః, కరీ - అడవియేనుఁగు, అవధ్యః - చంపకూడనిది, ఇతి - అని, శ్రుతవాన్ - వినియున్న, కుమారః - అజుఁడు, ఆపతంతం, తం - వచ్చిపడుచున్న ఆ యేనుఁగును, నివర్తయిష్యన్ - వెనుకకుమాత్రము మరలింపగలవాఁడై, నాత్యాయత కృష్టశార్ఙ్గః—నాత్యాయత - అంత యెక్కువగాకాని యట్లు, కృష్ట - లాగబడిన, శార్ఙ్గః - ధనుస్సుగలవాఁడై, విశిఖేన - బాణముచేత, కుంభే - కుంభస్థలముమీఁద, జఘాన - కొట్టెను. "యుద్ధమునందు తప్ప ఇతరత్ర రాజు ఏనుఁగును చంపరాదు" అను శాస్త్ర వచనమును విన్న యజుఁడు, ఆ యడవియేనుగును చంపక వెనుకకుమాత్రము మరల్ప దలచినవాఁడై కొద్దిగా లాగబడిన ధనుస్సుగల బాణముచేత దాని కుంభస్థలముమీద కొట్టెను. "లక్ష్మీకామో యుద్ధాదన్యత్ర కరివధం న కుర్యాత్, ఇయం హి శ్రీర్యేకరిణః" అని ధర్మశాస్త్ర వచనము. అందుకే 'వన్యః' అను విశేషణము.

శ్లో. స విద్ధమాత్రః కిల నాగరూప
ముత్సృజ్య తద్విస్మితసైన్య దృష్టః
స్ఫురత్ప్రభా మండల మధ్య వర్తి
కాంతం వపు ర్వ్యోమచరం ప్రపేదే. 51

వ్యాఖ్య: సః - ఆ యేనుఁగు, విద్ధమాత్రఃకిల - బాణముచే గ్రుచ్చబడినంతలోనే, నాగరూపం - గజశరీరమును, ఉత్సృజ్య - విడిచి, తద్విస్మితసైన్యదృష్టః (సన్)—తత్ - ఆ సంఘటనచేత, విస్మిత - ఆశ్చర్యపడిన, సైన్య - సైన్యముచేత, దృష్టఃసన్ - చూడఁబడుచున్న దగుచు, స్ఫురత్ప్రభా మండలమధ్యవర్తి—స్ఫురత్ప్రభా మండల - ప్రకాశించుచున్న కాంతిమండలముయొక్క - మధ్యవర్తి - నడుమనున్నదియు, కాంత - మనోహరమైనదియు, వ్యోమచరం - ఆకాశమున సంచరించుచున్న, వపుః - దేహమును, ప్రపేదే - పొందెను. అజుఁడు కొద్దిపాటి దెబ్బతగులునట్లు విడిచినబాణము గ్రుచ్చుకొన్నంతలోనే ఆ గజము గజ శరీరమునువిడిచి, సైనికులందఱును ఆశ్చర్యచకితులై చూచుచుండగా మండలాకారమైన కాంతిపుంజమునడుమ ఆకాశముపై మనోహరమగు గంధర్వ రూపమును ధరించెను.

శ్లో. అథ ప్రభావోపనతైః కుమారం
కల్పద్రుమోత్థై రవకీర్య పుష్పైః
ఉవాచ వాగ్మీ దశనప్రభాభిః
సంవర్ధితోరఃస్థల తారహారః. 52

వ్యాఖ్య: అథ - తర్వాత. ప్రభావోపనతైః - తన ప్రభావముచేత సమీపమునకుపచ్చిన, కల్పద్రుమోత్థైః, పుష్పైః - కల్పవృక్ష పుష్పములచేత, కుమారం - అజుని, అవకీర్య - చల్లి (అజునిపై పుష్పములుచల్లి) దశనప్రభాభిః - దంతకాంతులచేత, సంవర్ధితోరస్థల తారహారః—సంవర్ధిత - ఎక్కువ కాంతి గలదిగాఁ జేయబడిన, ఉరస్థల - వక్షస్థలముమీది, తారహారః - పెద్దముత్తెముల దండగలవాఁడును. వాగ్మీ - వక్తయునగు పురుషుఁడు, ఉవాచ - పలికెను. ఆ గజము దివ్యపురుషరూపమును ధరించినపిమ్మట. ఆ పురుషుఁడు తన మహిమ చేతవచ్చిన కల్పవృక్ష పుష్పములను అజునిపైఁజల్లి, తన దంతకాంతులచేత మెడలోని తారహారకాంతుల నినుమడింపఁ జేయుచు నజునితో నిట్లుపలికెను.

శ్లో. మతంగశాపా దవలేపమూలాత్
అవాప్తవా నస్మి మతంగజత్వమ్
అవేహి గంధర్వపతే స్తనూజం
ప్రియంవదం మాం ప్రియదర్శనస్య. 53

వ్యాఖ్య: అవలేపమూలాత్ - గర్వహేతుకమైన, మతంగశాపాత్ - మతంగమహాముని శాపమువలన, మతంగజత్వం - గజత్వమును, అవాప్తవాన్ - పొందినవాఁడను, అస్మి - అయితిని, మాం - నన్ను, ప్రియదర్శనస్య, గంధర్వపతేః - ప్రియదర్శనుండను పేరుగల గంధర్వరాజుయొక్క, తనూజం - కుమారుఁడనైన, ప్రియంవదం - ప్రియంవదుఁడను పేరు గలవానినిగా, అవేహి - ఎఱుగుము. ఒకానొకప్పుడు నాగర్వప్రవర్తనముచేత కినిసిన మతంగమహాముని శాపమువలన నేను గజమునై జన్మించితిని, నిజమునకు నేను ప్రియదర్శనుఁడను పేరుగల గంధర్వ రాజపుత్రుఁడను, నాపేరు ప్రియంవదుఁడు అని చెప్పెను. మతంగపర్వతమునందు విశేషముగా నేనుఁగులు పుట్టుటవలన వాటికి "మతంగజములు"అను వ్యవహారము కలిగినది.

  

శ్లో. స చా నునీతః ప్రణతేన పశ్చాత్
మయా మహర్షి ర్మృదుతా మగచ్ఛత్
ఉష్ణత్వ మగ్న్యాతపసంప్రయోగాత్
శైత్యం హి యత్సా ప్రకృతి ర్జలస్య. 54

వ్యాఖ్య : సః, మహర్షిః చ - ఆమతంగమహాముని యు ప్రణతేన, మయా - వినమ్రుండనైన నాచేత, అనునీతః - బ్రతిమాలుకోబడినవాఁడై, పశ్చాత్ - తరువాత, మృదుతాం - మెత్తదనమును (శాంతిని), అగచ్ఛత్ - పొందెను. హి - అదియట్లే, జలస్య - నీటికి, ఉష్ణత్వం - వేడిమి, అగ్న్యాతపసంప్రయోగాత్ - అగ్నియొక్కగాని, ఆతపము యొక్కగాని, సంపర్కమువలననే (కలుగును), యత్, శైత్యం - ఏచల్లదనమైతే కలదో, సా - అదియే, ప్రకృతిః - నిజస్వభావము. నేను వినమ్రుండనై నమస్కరించి బ్రతిమాలుకొనుటచేత మతంగముని శాంతిని పొంది కనికరించెను. నీటికి వేడిమి, నిప్పుయొక్కగాని, యెండయొక్కగాని సంబంధమువలన నేర్పడునదే కాని చల్లదనమేకదా దాని స్వభావము, మహామునులకు శాంతియే స్వభావము, నేను పొగరుబోతునై వ్యవహరించుటచేతనే మతంగమునికి కోపము వచ్చినది, నేను మళ్లీ నమస్కరించి బ్రతిమాలుకొనుటచేత నతఁడు స్వభావసిద్ధమైన శాంతిని వహించెనని భావము (జలమునకు చల్లదనమువలె ఋషులకు శాంతి సహజము).

శ్లో. ఇక్ష్వాకు వంశ ప్రభవో యదా తే
భేత్స్య త్యజః కుంభ మయోముఖేన
సంయోక్ష్యసే స్వేన వపుర్మహిమ్నా
తదే త్యవోచత్ స తపోనిధి ర్మామ్. 55

వ్యాఖ్య : ఇక్ష్వాకువంశప్రభవః - ఇక్ష్వాకువంశమునఁబుట్టిన, అజః - అజమహారాజు, యదా - ఎప్పుడు, తే - నీయొక్క, కుంభం - కుంభ స్థలమును, అయోముఖేన - బాణముచేత, భేత్స్యతి - భేదింపగలడో, (చీల్చునో) తదా - అప్పుడు, స్వేన - స్వకీయమైన, వపుర్మహిమ్నా - శరీరమహిమచేత. సంయోక్ష్యసే - సంబంధమునుపొందగలవు (కూడుకొందువు), ఇతి - ఇట్లని, సః తపోనిధిః - ఆతపోనిధియైన మతంగ మహాముని, మాం - నన్నుగూర్చి, అవోచత్ -

ఫలికెను. ఇక్ష్వాకు రాజువంశమునఁబుట్టిన అజుఁడు ఎప్పుడైతే గజరూపమునమన్న నీకుంభ స్థలమును బాణముచేత భేదింపఁగలడో అప్పుడు నీవుగజశరీరమును విడచి మహిమోపేతమైన స్వశరీరమును పొందఁగలవని తపోనిధియైన యామతంగముని నాతోఁ జెప్పెను.

శ్లో. సమ్మోహితః సత్త్వవతా త్వయా ఽహం
శాపాత్ చిర ప్రార్థిత దర్శనేన
ప్రతిప్రియం చేత్ భవతో న కుర్యాం
వృథా హి మే స్యాత్ స్వపదోపలబ్ధిః. 56

వ్యాఖ్య: చిరప్రార్థితదర్శనేన—చిరం - బహుకాలమునుండి, ప్రార్థిత - కోరబడిన, దర్శనేన - దర్శనము కలిగినట్టియును, సత్త్వవతా - బలవంతుఁడవైన త్వయా - నీచేత, అహం - నేను, శాపాత్ - మునిశాపమునుండి, సమ్మోచితః— అస్మి - విడిపింపఁబడిన వాఁడనైతిని; భవతః - నీకు, ప్రతిప్రియం - ప్రత్యుప కారమును, న,కుర్యాం,చేత్ - చేయనివాఁడనైనచో, మే - నాయొక్క, స్వపదోప లబ్ధిః - స్వస్థానప్రాప్తి, వృథా,స్యాత్‌హి - వ్యర్థమైపోవునుగదా!, బహుకాలము నుండి నీదర్శనమునకై వేచియుండగా ఇప్పుడు బలశాలివైన నీచేత ముని శాపము నుండి విడిపింపఁబడితిని. దీనికిఁదగిన ప్రతిప్రియమును నీకు నేను జేకూర్పవిచో నాకు గలిగిన స్వస్థాన ప్రాప్తి నిరుపయోగమేకదా? అని ప్రియంవదుఁడు అజునితో ననెను.

శ్లో. సమ్మోహనం నామ సఖే! మమాస్త్రం
ప్రయోగ సంహార విభక్త మంత్రమ్
గాంధర్వ మాదత్స్వ యతః ప్రయోక్తుః
న చారిహింసా విజయశ్చ హస్తే. 57

వ్యాఖ్య: హేసఖే - ఓ ప్రాణమిత్రమా! ప్రయోగసంహార విభక్తమంత్రం- ప్రయోగ ప్రయోగించుట యందును, సంహార - ఉపసంహరించుట యందును, విభక్త - వేరువేరుగానున్న, మంత్రం - మంత్రములు కలదియును, గాంధర్వం- గంధర్వ దేవతాకమై, సమ్మోహనం నామ - సమ్మోహనమను పేరుగల, మమ అస్త్రం - నాయొక్క అస్త్రమును, ఆదత్స్వ - స్వీకరింపుము; యతః ఏయస్త్రము

  

వలన ప్రయోక్తుః - ప్రయోగించువానికి, అరిహింసా - శత్రుపులవలనిబాధ(లేదా శత్రువులను చంపవలసిన యవసరము), నచ - ఉండదో, విజయశ్చ - విజయము కూడ హస్తే - చేతియందు (ఉండునో). ఏయస్త్రమునలన ప్రయోక్తకు శత్రు బాధగాని, శత్రువును చంపవలసిన యవసరముగాని లేక, విజయము హస్తగత మగునో అట్టిదియై, ప్రయోగ, ఉపసంహారములకు, వేఱు వేఱు మంత్రములు గలిగి, గంధర్వ దేవతాకమై, సమ్మోహనమనుపేరుగల నాయస్త్రమును ప్రతిప్రియ ముగ స్వీకరింపుమని ప్రియంవదుఁ డజునితో ననెను. బంధు, సుహృత్, మిత్ర, సఖి శబ్దములకు ప్రత్యేకమైన యర్థములున్నవి.

శ్లో. "అత్యాగ సహనో బంధుః, సదైవానుమతః సుహృత్,
ఏకక్రియం భవే న్మిత్రం, సమప్రాణః సఖా మతః"

శ్లో. అలం హ్రియా మాం ప్రతి య న్ముహూర్తం
దయాపరో౽భూః ప్రహర న్నపి త్వమ్
తస్మా దుపచ్ఛందయతి ప్రయోజ్యం
మయి త్వయా న ప్రతిషేధరౌక్ష్యమ్. 58

వ్యాఖ్య: మాంప్రతి - హ్రియా - సిగ్గుచేత, అలం - చాలును (నావిషయ మునసిగ్గుపడబోకుము), యత్ - ఏకారణమువలన, త్వం - నీవు, ప్రహరన్అపి- కొట్టుచున్నవాడవయ్యును, ముహూర్తం - క్షణకాలము, దయాపరః - దయగల వాఁడవు, అభూః - అయితివో, తస్మాత్ - అదేకారణమువలన, ఉపచ్ఛందయతి, మయి - ప్రార్థించుచున్న నావిషయమున, త్వయా - నీచేత, ప్రతిషేధరౌక్ష్యం- నిషేధించుట యను పరుషత్వము, నప్రయోజ్యం - ప్రయోగింపఁదగినది కాదు. నాయెదుట సిగ్గుపడ బోకుము, నాపైన బాణమునువేయుటలో చిన్నగాఁగొట్టి దయను జూపితివి. నీవు సహజముగా దయాపరుఁడవు గావున ఇంతగా బ్రతిమాలు కొను చున్న నామీద 'సమ్మోహనాస్త్రము నాకక్కఱలేదు.' అను పరుషవాక్యమును ప్రయో గింపకుము. అని గంధర్వుఁడజునితో ననెను.

శ్లో. తథే త్యుపస్పృశ్య పయః పవిత్రం
సోమోద్భవాయాః సరితో నృసోమః

ఉదఙ్ముఖః సోఽస్త్రవి దస్త్రమంత్రం
జగ్రాహ తస్మా న్నిగృహీతశాపాత్. 59

వ్యాఖ్య : నృసోమః - పురుషశ్రేష్ఠుఁడై, అస్త్రవిత్ - అనేకాస్త్రముల నెఱిఁగిన, సః - ఆ య జ మ హా రా జు, తథాఇతి - సరేయని సమ్మతించి, సోమోద్భవాయాః, సరితః - నర్మదా నదియొక్క, పవిత్రం, పయః - పావనమైనజలమును, ఉపస్పృశ్య - ఆచమనము చేసి, ఉదఙ్ముఖః - ఉత్తరాభిముఖుఁడై, నిగృహీత శాపాత్ - నివర్తింపఁబడిన శాపముగల, తస్మాత్ - ఆప్రియంవదునివలన, అస్త్రమంత్రం - ఆసమ్మోహనాస్త్ర మంత్రమును, జగ్రాహ - స్వీకరించెను. అజుఁడు గంధర్వుని మాటకు సమ్మతించి నర్మదా జలము నాచమనముచేసి, ఉత్తరదిశాభిముఖుఁడై తనవలన శాపనివృత్తిని పొందిన అప్రియంవదుని వలన సమ్మోహనాస్త్రముయొక్క ప్రయోగ, ఉపసంహార మంత్రములను స్వీకరించెను. బాణములలో, మంత్రసహితమైన దానికి అస్త్రమనియు, మంత్రములేని దానికి శస్త్రమనియు పేర్లు, సోమోద్భవయనఁగా నర్మదానది. "రేవా తు నర్మదా సోమోద్భవా మేఖలకన్యకా" అని యమరము,

శ్లో. ఏవం తయో రధ్వని దైవయోగాత్
ఆసేదుషోః సఖ్యమచింత్యహేతు
ఏకో యయౌ చైత్ర రథ ప్రదేశాన్
సౌరాజ్యరమ్యా నపరో విదర్భాన్. 60

వ్యాఖ్య : ఏవం - ఇట్లు, అధ్వని - మార్గమునందు, దైవయోగాత్ - దైవికముగా, అచింత్యహేతు - ఊహింపరాని కారణముగల, సఖ్యం - మైత్రిని, ఆసేదుషోః - పొందినట్టి. తయోః - వారిద్దరిలో. ఏకః - ఒకడైన ప్రియంవదుఁడు, చైత్రరథప్రదేశాన్ - కుబేరోద్యాన ప్రదేశములను గుఱించియు, అపరః - మరియొకఁడైన యజమహారాజు, సౌరాజ్యరమ్యాన్ - మంచి రాజుండుటచే రమ్యములయిన, విదర్భాన్ - విదర్భదేశమును గుఱించియు, యయౌ - వెళ్లెను. అట్లు దారిలో దైవవశమున నూహింపరాని కారణముగల సఖ్యమును పొందిన ఆయిద్దరిలో ప్రియంవదుఁడు కుబేరోద్యానవనమునకును, అజమహారాజు విదర్భదేశమునకును వెళ్లిరి. కుబేరుని యుద్యానవనమునకు "చైత్రరథము" అని పేరు.

దేశవాచకపదములు సంస్కృతమునందు బహువచనములుగాఁ బ్రయోగింపఁబడు చుండును, ఉదా: కాశ్మీరాః, వంగాః, కళింగాః, ఆంధ్రాః మొ.

శ్లో. తం తస్థివాంసం నగరోపకంఠే
తదాగమారూఢ గురుప్రహర్షః
ప్రత్యుజ్జగామ క్రథకైశికేంద్రః
చంద్ర ప్రవృద్ధోర్మి రివోర్మిమాలీ 61

వ్యాఖ్య: నగరోపకంఠే - రాజధానీ నగరమునందు, తస్థివాంసం - నిలిచి యుండిన, తం - ఆ యజమహారాజ కుమారుని, తదాగమారూఢ గురుప్రహర్షః— తదాగమ - అతని రాకచేత, ఆరూఢ - ఉత్పన్నమైన, గురుప్రహర్షః - గొప్ప సంతోషముగల, క్రథకైశికేంద్రః - విదర్భదేశాధిపతి, ప్రవృద్ధోర్మిః - మిక్కిలి పైకిలేచిన యలలుగల, ఊర్మిమాలీ - సముద్రుఁడు, చంద్రంఇవ - చంద్రునిని వలె, ప్రత్యుజ్జగామ (ప్రతి + ఉత్ + జగామ) - ఎదుర్కొనెను. అజుఁడు స్వయంవరోత్సవమున పాల్గొనుటకై వచ్చి, నగరసమీపమున నిలిచిన వార్త తెలిసిన భోజుఁడు, గొప్పసంతోషముగలవాఁడై, ఉదయించుచున్న చంద్రునిని ఉవ్వెత్తున లేచిన తరంగ హస్తములతో సముద్రుఁడువలె స్వాగతపూర్వకముగా నెదురుకొనెను. "ఊర్మిమాలీ" యను విశేషణము సర్వనదీతటాక తరంగములకన్న నత్యున్నతములైన తరంగములుగల సముద్రమునకే చెల్లును.

శ్లో. ప్రవేశ్య చైనం పుర మగ్రయాయీ
నీచై స్తథోపాచర దర్పితశ్రీః
మేనే యథా తత్ర జనః సమేతో
వైదర్భ మాగంతు మజం గృహేశమ్. 62

వ్యాఖ్య: (సః - ఆ విదర్భరాజు) ఏనం - ఈ వచ్చిన యజకుమారుని అగ్రయాయీ - ముందు నడచుచున్నవాఁడై, నీచైః - వినమ్రుఁడై, పురం, ప్రవేశ్య - నగరమును ప్రవేశింపఁజేసి, అర్పితశ్రీః - సమర్పింపఁబడిన సకలోపచారసంపదలు గలవాఁడగుచు, తథా, ఉపాచరత్ - ఆ విధముగా మర్యాద

చేసెను; యథా - ఏవిధముగానైతే, తత్ర, సమేతః, జనః - అచ్చట గుమి గూడిన జనము. వైదర్భం - భోజరాజును, ఆగంతుం - ఇతర ప్రదేశమునుండి వచ్చిన యతిథినిగాను, అజం - అజకుమారుని, గృహేశం - యజమానునిగాను, మేనే - తలఁచెనో. భోజుఁడు ముందు నడచుచు వినమ్రుఁడై యజుని నగర ప్రవేశము చేయించి, సకలోపచార సంపదలును సమకూర్చి, అచ్చటికి చూడవచ్చిన జనము భోజుఁడే యతిథి, అజుఁడే గృహయజమాని అని తలంచునట్లుగా ఉపచారము (మర్యాద) చేసెను. "ఆగంతుః" అను శబ్దము తెలుఁగున 'క' ప్రత్యయము చేర్చి "ఆగంతుకుఁడు" అని సాధారణముగాఁ బ్రయోగింపఁబడుచుండును. లేనిచో "ఆగంతువు" లేదా ఆగంతుఁడు అని యనవలెను.

శ్లో. తస్యాధికార పురుషైః ప్రణతైః ప్రదిష్టాం
ప్రాగ్ద్వార వేది వినివేశిత పూర్ణకుంభాం
రమ్యాం రఘుప్రతినిధిః స నవోపకార్యాం
బాల్యాత్ పరా మివ దశాం మదనోఽధ్యువాస. 63

వ్యాఖ్య: రఘుప్రతినిధిః - రఘుమహారాజుతో సమానుఁడగు, సః - ఆ యజుఁడు, ప్రణతైః - వినమ్రులైన, తస్య అధికారపురుషైః - ఆ భోజుని యొక్క ఉద్యోగులచేత, ప్రదిష్టాం - చూపబడినదియు, ప్రాగ్ద్వార వేది వినివేశిత పూర్ణకుంభాం—ప్రాగ్ద్వారవేది - తూర్పువాకిలి వద్దయరుగు మీద, వినివేశిత - ఉంచఁబడిన, పూర్ణకుంభాం - మంగళకలశము గలదియును, రమ్యాం - అందమైనదియునగు, నవోపకార్యాం (నవ + ఉపకార్యాం) - క్రొత్తడేరాతో వేయఁబడిన విడిదిని (ఒక క్రొత్త రాజభవనమును), మదనః - మన్మథుఁడు, బాల్యాత్, పరాం - బాల్యము తర్వాతిదియైన, దశాంఇవ - యౌవన దశనువలె, అధ్యువాస (అధి + ఉవాస) - అధిష్ఠించెను (ప్రవేశించెను). రఘుసమానుఁడగు నజుఁడు, భోజుని యధికార పురుషులు ప్రణమిల్లి వినమ్రులై చూపినదియు, తూర్పువాకిఁటి యరఁగుమీద నిండుకలశ ముంచఁ బడినదియు, మనోహరమైనదియునగు విడిదియింటిని, మన్మథుడు బాల్యదశనుండి యౌవనదశనువలె ప్రవేశించెను. ఇచ్చటి "రఘు ప్రతినిధి" శబ్దమునందలి 'ప్రతినిధి' శబ్దము సాదృశ్యవాచకము. "కల్ప, దేశీయ, దేశ్య, ప్రఖ్య, ప్రతినిధి" శబ్దములు సమానార్థకములని దండి చెప్పెను మరియొక విశేష మేమనఁగా, స్వయంవరోత్స వాహ్వానము వచ్చినప్పుడు, సార్వ

భౌముఁడైన రఘుమహారాజు, కొందఱు రాజులనలె స్త్రీలోలుఁడుగాక యుచిత జ్ఞుఁడై, తనకు బదులు యువరాజైన తన కుమారునిఁ బంపెనను విషయమును స్ఫురింపఁజేయుటకే 'ప్రతినిధి' శబ్దము నుపయోగించుట యని తలంపవలయును.

శ్లో. తత్ర స్వయంవర సమాహృత రాజలోకం
కన్యాలలామ కమనీయ మజస్య లిప్సోః,
భావావబోధకలుషా దయితేవ రాత్రౌ
నిద్రా చిరేణ నయనాభిముఖీ బభూవ. 64

వ్యాఖ్య: తత్ర - ఆ నివాస భవనమునందు, స్వయంవర సమాహృతరాజ లోకం—స్వయంవర - స్వయంవరమునకై, సమాహృత - ఒకచోటికి తీసుక రాఁబడిన, రాజలోకం - రాజబృందము గలదియును, కమనీయం - కోరదగినదియు నగు, కన్యాలలామ - కన్యారత్నమైన ఇందుమతిని, లిప్సోః - పొందఁదలఁచిన, అజస్య - అజునికి, భావావబోధకలుషా—భావ - పురుషుని భావముయొక్క, అవ బోధ - ఎఱుఁగుటయందు, కలుషా - అసమర్థురాలగు, దయితా, ఇవ - ప్రియు రాలువలె, రాత్రౌ - ఆనాటి రాత్రియందు, నిద్రా - నిద్ర, చిరేణ - చాలసేపటికి, నయనాభిముఖీ - కన్నులపువైపునకు వచ్చునది, బభూవ - అయ్యెను. ఆ స్వయంవర నివాస భవనమునకు, అందఱు రాజకుమారులను రప్పించుటకు కారణమైన కన్యా రత్నమగు ఇందుమతిని పొందఁదలచుచున్న అజునికి, ఆ రాత్రియందు నిద్ర, ప్రియునిభావము నెఱుఁగు చుఱుకుదనమలేని ప్రియురాలివలె చాలసేపటికి వచ్చెను. "నయనాభిముఖీ" యనుశబ్దము వచ్చీరాని నిద్రను తెలుపును. ఆ రాత్రి అజుని కి నిద్రపట్టలేదని భావము.

శ్లో. తం కర్ణభూషణ నిపీడితపీవరాంసం
శయ్యోత్తరచ్ఛద విమర్ద కృశాంగరాగమ్,
సూతాత్మజాః సవయసః ప్రథితప్రబోధం
ప్రాబోధయ న్నుషసి వాగ్భి రుదారవాచః. 66

వ్యాఖ్య: కర్ణభూషణ నిపీడిత పీవరాంసం - బలిసిన పై భుజములు కల వాఁడును, శయ్యోత్తరచ్ఛద విమర్ద కృశాంగరాగం—శయ్యా - పరుపుయొక్క;

ఉత్తరచ్ఛద విమర్ద - పై వస్త్రము రాపిడిచేత, కృశాంగరాగం - తరిగిపోయిన మైపూత కలిగినట్టియును, ప్రథితప్రబోధం - ప్రఖ్యాతమైన జ్ఞానము గలవాఁడుననగు, తం - ఆ యజమహారాజును, సవయసః - సమానమైన యీడుగలవారును, ఉదారవాచః - గుణవంతములగు ప్రౌఢవాక్కులుగల, సూతాత్మజాః - వంది పుత్రులు, వాగ్భిః - స్తుతి పాఠములచేత, ఉషసి - తెల్లవారు జామున, ప్రాబోధయన్ - మేలుకొలిపిరి. నిద్రపట్టక యిటునటు పొరలుటచేత చెపుల పోగులొత్తిన పై భుజములతోను, పఱుపుమీది గుడ్డ రాచుకొనుటచేత రాలిపడిన మైపూతతోను పడుకొనియున్న అజమహారాజును, అతని యీడువారై, మధుర ప్రగల్భములైన వాక్కులు గలవారై వెంటవచ్చిన వైతాళిక కుమారులు, సహజ ప్రబోధము గల వాఁడని యెఱిఁగియు రాజలాంఛనములగు స్తుతి గీతములతో వేకువజామున (ముందు చెప్పబోవురీతిగా) మేలుకొలిపిరి, మేలుకొలుపులు పాడిరి.

శ్లో. రాత్రి ర్గతా మతిమతాం వర ! ముంచ శయ్యాం
ధాత్రా ద్విధైవ నను ధూ ర్జగతో విభక్తా,
తా మేకత స్తవ బిభర్తి గురు ర్వినిద్రః
తస్యా భవా నపర ధుర్య పదావలంబీ. 66

వ్యాఖ్య: హేమతిమతాం, వర ! - బుద్ధిమంతులలో శ్రేష్ఠుఁడవైన ఓ అజ మహారాజా ! రాత్రిః, గతా - రాత్రి వెళ్లిపోయినది, శయ్యాం, ముంచ - పడకను విడువుము, ధాత్రా - బ్రహ్మచేత, జగతఃధూః - లోకముయొక్క భారము, ద్విధైవ - రెండు విధములుగానే, విభక్తాననుపంచబడియున్నదిగదా !, తాం - ఆ భారమును, ఏకతః - ఒక ప్రక్కన, తవ, గురుః - మీ తండ్రి, వినిద్రః - జాగరూకుడై (నిద్రను విడిచి), బిభర్తి - మోయుచున్నాఁడు, తస్యాః - ఆ భారమునకు, భవాన్ - నీవు, అపరధుర్య పదావలంబీ—అపరధుర్య - రెండవమోతకాని యొక్క, పద - చోటును, అవలంబీ - పట్టుకొనవలసిన వాఁడవుగదా ! (కనుక మేల్కొనుము). ఓ మతిమంతులలో గొప్పవాడవైన అజమహాలాజా ! రాత్రి గడచిపోయినది, ప్రక్కమీదినుండి లెమ్ము ; బ్రహ్మదేవుఁడు జగద్భారమును రెండు భాగములుగానే విభజించియున్నాడు. బండికి కట్టు కాడికొనవలె నున్న ఆ భారములలో ఒకప్రక్క భారమును మీ తండ్రి తన భుజములపై పెట్టుకొని మోయుచున్నాఁడు ; ఆ బరువుయొక్క రెండవప్రక్కగల కాడికొనను మోయ

వలసిన చోటు నీది. కనుక నిద్రలేచి నీ కర్తవ్యమును పూర్తిచేయుము. బండిని లాగుటకు కాడికి రెండెద్దులును గావలయును.

శ్లో. నిద్రావశేన భవతా ప్యనవేక్షమాణా
పర్యుత్సుకత్వ మబలా నిశి ఖండితేవ,
లక్ష్మీ ర్వినోదయతి యేన దిగంతలంబీ
సోఽపి త్వదాననరుచిం విజహాతి చంద్రః. 67

వ్యాఖ్య: నిద్రావశేన, భవతా - నిద్రాధీనుఁడవైన నీ చేత, (నీ యందలి) పర్యుత్సుకత్వం, అపి - అనురక్త భావమునుసైతము, నిశి - గతరాత్రియందు, ఖండితా, అబలా, ఇవ - ఖండితా నాయికవలె, అనవేక్షమాణా - ఆలోచింపని దగుచు, లక్ష్మీః - లక్ష్మి, యేన - ఎవనిచేత, పర్యుత్సుకత్వం - నీ విరహ వేదనను, వినోదయతి(వి + నోదయతి) - తొలగించుకొనుచుండెనో, సోఽపిచంద్రః- ఆ చంద్రుడుసైతము, దిగంతలంబీ - పడమటి దిక్కు చివరను జేరినవాఁడగుచు, త్వదాననరుచిం - నీ ముఖకాంతివంటి కాంతిని, విజహాతి - విడిచివేయుచున్నాఁడు, "చంద్ర, అరవింద, రాజవదనములు లక్ష్మీ నివాసస్థానములు" అను ప్రసిద్ధి ననుసరించిన వర్ణనము ఇది, ఓ రాజా! నీవు నిద్రానాయికకు వశుఁడవై యుండుటచేత నీ యందలి యనురాగాతిశయమునుగూడ వదలి, రాత్రియందు, అన్యస్త్రీ సంబంధము చేతఁ గినిసిన ఖండితా నాయికవలె, లక్ష్మి, యెవనిని జేరి నీ వలనివియోగ బాధను దొలఁగించుకొను చుండెనో ఆ చంద్రుఁడుగూడ పశ్చిమ దిక్కువద్దకిఁ జేరుచు నీ ముఖకాంతి సదృశమైన తన కాంతిని వదలి వేసినాడు. అందువలన అనన్యగతికయైన లక్ష్మి నిన్నుఁ జేరుటకై నీవు నిద్రమేల్కొనుము అని భావము. 'నిద్రా' శబ్దము స్త్రీ లింగము కనుక ఆజుని నిద్రావశత్వము పరకీయ నాయికా సంబంధము వంటిది. లక్ష్మి ఏకాకినియై ఖండితయై, అజ ముఖకాంతి సాదృశ్యముకల చంద్రుని నాశ్రయించి తన విరహ వేదనను దొలగించుకొనుచుండినది. విరహిజనులు అసలు వస్తువు లేనప్పుడు సదృశవస్తువును జూచి యూరడిల్లుచుందురు. లక్ష్మి అట్లు చేసినది. చంద్రుఁడుకూడ పశ్చిమ దిగంగన వద్దికి చేరుటచేత నిప్పుడా వినోద స్థానముగూడ పోయినది. కనుక నీవే లక్ష్మికి దిక్కు అన్నది వ్యంగ్యార్థము. ఖండిత అష్టవిధ శృంగార నాయికలలో నొకతె. "జ్ఞాతేఽన్యాసంగవికృతే ఖండితే ర్ష్యా కషాయితా" అని లక్షణము. అనఁగా భర్త అన్యస్త్రీ

సంగమ చిహ్నములుగల వాఁడగుట నెఱిఁగి యీర్ష్యతోఁ గోపమువచ్చిన నాయిక. ప్రకృతమున లక్ష్మి అట్టినాయికగా వర్ణింపఁబడినది.

శ్లో. త ద్వల్గునా యుగప దున్మిషి తేన తావత్
సద్యః పరస్పరతులా మధిరోహతాం ద్వే
ప్రస్పందమానపరుషేతరతార మంతః
చక్షు స్తవ ప్రచలితభ్రమరం చ పద్మమ్. 68

వ్యాఖ్య: తత్ - అందువలన, వల్గునా - మనోహరమైన. యుగపత్ తావత్ - ఒకే సమయము నందలి, ఉన్మిషితేన - వికసనముచేత, అంతః - లోపల, ప్రస్పందమాన పరుషేతరతారం—ప్రస్పందమాన – కదలుచున్న, పరుషేతర – స్నిగ్ధమైన (నున్నని), తారం - కనుపాపగల, తవ,చక్షుః - నీ నేత్రమున్ను అంతః – లోనిభాగమున, ప్రచలితభ్రమరం—ప్రచలిత – కదులుచున్న, భ్రమరం- తుమ్మెదగల, పద్మం - కమలమున్ను ద్వే - ఈ రెండును, సద్యః - వెంటనే, పరస్పరతులాం - ఒండొకటితో పోలికను, అధిరోహతాం – పొందునుగాక. లక్ష్మీపరిగ్రహము చేయవలసియున్నది కనుక, లోపల కదలుచున్న నల్లగ్రుడ్డు గల నీ నేత్రము, లోపల చలించుచున్న తుమ్మెదగల పద్మమును, ఇప్పటికే పోలిక గల యీ రెండును, ఒకే సమయమునందు మనోహరముగా వికసించుట చేత గూడ తమ సాదృశ్యమును నిలుపుకొని ఒకదాని నొకటి పోలునుగాక. కమల ములు వికసించుచున్నవి, నీ కన్నులు గూడ వాటితోపాటు వికసించునుగాక; మేలుకొనుము అని భావము.

శ్లో. వృంతా చ్ఛథం హరతి పుష్ప మనోకహానాం
సంసృజ్యతే సరసిజై రరుణాంశుభిన్నైః
స్వాభావికం పరగుణేన విభాతవాయుః
సౌరభ్య మీప్సు రివ తే ముఖమారుతస్య. 69

వ్యాఖ్య: విభాతవాయుః - ప్రాతఃకాలపు గాలి, స్వాభావికం – ప్రకృతి సిద్ధమైన, తే ముఖమారుతస్య - నీ నిశ్వాస వాయువుయొక్క, సౌరభ్యం - పరి మళమును బోలిన పరిమళమును, పరగుణేన - తనది కాని గుణముచేత, ఈప్సురివ

– పొందఁదలఁచినదివలె, అనోకహానాం - ఎత్తైన చెట్లయొక్క, శ్లథం, పుష్పం – తొడిమ సడలిన పువ్వును (తొడిమలూడిన పూలను), వృంతాత్ - తొడిమ నుండి హరతి – ఎత్తుక పోవుచున్నది; అరుణాంశుభిన్నైః - సూర్యకిరణముల చేత వికసింప జేయఁబడిన, సరసిజైః – కమలములతో, సంస్పృజ్యతే - కలియుచున్నది. సహజ పరిమళముగల నీ నిట్టూర్పును బోలియిండవలెనన్న కాంక్షతో ప్రాతః కాల వాయువు పెద్ద వృక్షములపై నుండి తొడిమ సడలిన పూవులను తొడిమలనుండి అపహరించుచున్నది. సూర్య కిరణ స్పర్శచే వికసించిన కమలములను గలియు చున్నది. తనకు సహజము కాక పోయినను పరగుణములనే సంక్రమింపఁ జేసి కొనియైనను నీ నిట్టూర్పుతో పోలికను సంపాదించుకొనుటకు ప్రయత్నించు చున్నది. అనగా చెట్ల నుండి పూలు రాలు చున్నవి, తామరలు విచ్చుకొనుచున్నవి, ప్రాతః కాల వాతూలములు వీచుచున్నవి, నిద్ర మేలుకొనుమని భావము.

శ్లో. తామ్రోదరేషు పతితం తరుపల్లవేషు
నిర్ధౌతహారగుళికావిశదం హిమాంభః
ఆభాతి లబ్ధ పరభాగతయ ఒధరోష్ఠే
లీలాస్మితం సదశనార్చి రివ త్వదీయమ్. 70

వ్యాఖ్య : తామ్రోదరేషు – ఎఱ్ఱని లోనిభాగములుగల, తరుపల్లవేషు - చెట్ల చిగుళ్లమీద, పతితం - పడినదియై, నిర్ధౌతహారగుళికా విశదం—నిర్ధౌత - పులు గడిగిన, హారగుళికా - ముత్యాలదండ యందలి ముత్తెములవలె, విశదం - నిర్మల మైన, హిమాంభః – మంచునీరు, లబ్ధపరభాగతయా—లబ్ధ - పొందఁబడిన, పర భాగతయా - గుణోత్కర్ష కలదగుటచేత, అధరోష్ఠే – క్రింది పెదవి మీద, త్వదీయం - నీదియగు, సదశనార్చిః - దంత కాంతితోఁగూడిన, లీలాస్మితంఇవ- విలాసహాసమువలె, ఆభాతి - బాగుగా ప్రకాశించుచున్నది. ఎఱ్ఱని లోభాగములు గల చెట్ల చిగుళ్లమీద పడి, పులుగడిగిన ముత్తెపు సరుల ముత్యాల వరుస వలె నున్న మంచు నీరు, చిగురాకుల యెఱ్ఱదనము తనలో ప్రతిఫలింపఁగా గుణోత్క ర్షను పొంది, క్రింది పెదవిపైఁబడి గుణోత్కర్షను పొందిన, దంత కాంతిసహిత మైన నీ చిఱునగవు వలె మిక్కిలి యందముగా నున్నది. "పరభాగ" శబ్దమునకు గుణాధిక్యమర్థము "పరభాగో గుణోత్కర్షః" అని యాదవ నిఘంటువు.

శ్లో. యావత్ ప్రతాపనిధి రాక్రమతే న భాను
రహ్నాయ తావ దరుణేన తమో నిరస్తమ్
ఆయోధనాగ్రసరతాం త్వయి వీర! యాతే
కింవా రిపూం స్తవ గురుః స్వయ ముచ్ఛినత్తి. 71

వ్యాఖ్య: ప్రతాపనిధిః - తేజస్సునకు ఆకరమైన, భానుః - సూర్యుఁడు, యావత్ - ఎంతవఱకు, న ఆక్రమతే - ఉన్నతిని పొందఁడో, తావత్ - అంత వఱకే, అహ్నాయ - శీఘ్రముగా, అరుణేన - అనూరునిచేత, తమః - చీకటి. నిరస్తం - పోఁగొట్టఁ బడినది, (తథాహి - అదియుక్తమే) హేవీర! ఓ వీరుడా! త్వయి - నీవు, ఆయోధనాగ్రసరతాం - యుద్ధములందు అగ్రగామిత్వమును, యాతే (సతి)- పొందిన వాఁడవగుచుండఁగా, తవ, గురుః - నీ తండ్రి, రిపూన్ - శత్రువులను, స్వయం - తాను, ఉచ్ఛినత్తికింవా - తెగటార్చునా యేమి? తేజోనిధి యగు సూర్యుడాకసము పైకెక్కుటకు ముందు మాత్రమే అనూరుఁడు చీకటినిఁ బాఱద్రోలునుగదా! నీవు యుద్ధములం దగ్రగామిత్వమును పొందిన పిమ్మట మీ తండ్రి స్వయముగా శత్రువులను బరిమార్చునా. సమర్థుఁడైన పుత్రునియం దుంచ బడిన రాజ్య భారముగల మీ తండ్రికి తాను శ్రమపడవలసిన పనియేమి యని భావము. జీవలోకమున కాలోకమును ప్రసాదించుట సూర్యుని పని యైనట్లు పితృదత్త రాజ్య పర్యవేక్షణము నీ పని గనుక నిద్రమేల్కొనుమని తాత్పర్యము. ఈ శ్లోకమునందలి "ఆక్రమతే" అను క్రియ చాల అర్థవంతముగా నుపయోగింపఁ బడనది. సహజముగా పరస్మైపది యగు "క్రము" ధాతువునకు 'ఆఙ్' అను ఉపసర్గమును జేర్చుటచేత నది ఆత్మనేపదియై, ఉద్గమనము (పైకివచ్చుట) సూర్యుని పక్షమునందును, అభ్యుదయము అజుని పక్షమునను అర్థములగునట్లు చేసినది.

శ్లో. శయ్యాం జహ త్యుభయపక్ష వినీత నిద్రాః
స్తంబేరమా ముఖర శృంఖల కర్షిణ స్తే,
యేషాం విభాంతి తరుణారుణరాగయోగాత్
భిన్నాద్రిగైరికతటా ఇవ దంతకోశాః. 72

వ్యాఖ్య: ఉభయపక్ష వినీతనిద్రాః—ఉభయపక్ష - ఇటునటు పొరలుట చేత రెండు పార్శ్వముల యందును, వినీతనిద్రాః - తీర్చుకోఁబడిన నిద్రగలవియు, ముఖరశృంఖల కర్షిణః—ముఖర - ధ్వనించుచున్న, శృంఖల - కట్టుగొలుసులను కర్షిణః - లాగుకొనుచున్నవియు నగు, తే, స్తంబేరమాః - నీయొక్క యేనుఁగులు, శయ్యాం - పడకను, జహాతి - విడుచుచున్నవి; యేషాం - ఏనీ యేనుఁగులయొక్క, దంతకోశాః - మొగ్గలవంటి దంతములు, తరుణారుణ రాగ యోగాత్ - బాలసూర్యుని కాంతి సంబంధమువలన, భిన్నాద్రి గైరికతటాఃఇవ— భిన్న - తమచే కోరాడి పగులగొట్టఁబడిన, అద్రి - పర్వతములయొక్క, గైరిక తటాః ఇవ - మణిశిలాది ధాతుమయములైన చరియలు గలవివలె, విభాంతి - ప్రకాశించుచున్నవో, కుడిప్రక్కన కొంతసేపును, ఎడమప్రక్కన కొంతసేపును పడుకొని నిద్రను తీర్చుకొన్నవియై, గల గల శబ్దము కలుగునట్లు కాలి గొలుసుల నీడ్చుకొనుచున్న నీ యేనుఁగులు పడకలను విడిచి లేచుచున్నవి. అట్లు లేచిన యా యేనుఁగుల మొగ్గలవంటి దంతములు, బాల సూర్యకాంతులు తమపైఁ బడుటచేత, మణిశిలాది పర్వత సానువులను గోరాడి యున్నట్లు ప్రకాశించుచున్నవి, ఆ యంద మును జూచుటకు మేల్కొనుమని యభిప్రాయము.

శ్లో. దీర్ఘేష్వమీ నియమితాః పటమండపేషు
నిద్రాం విహాయ వనజాక్ష! వనాయుదేశ్యాః,
వక్త్రోష్మణా మలినయంతి పురోగతాని
లేహ్యాని సైంధవశిలా శకలాని వాహాః. 73

వ్యాఖ్య: హేవనజాక్ష - ఓ కమలనయన! దీర్ఘేషు, పటమండపేషు - పొడవుగా వేయఁబడిన డేరాలయందు, నియమితాః - కట్టివేయఁబడినవియు, వనాయుదేశ్యాః - పారశీక దేశమునఁ బుట్టినవియునగు, అమీ, వాహాః - ఈ గుఱ్ఱములు, నిద్రాంవిహాయ - నిద్రను విడిచి, పురోగతాని - తమముందున్న, లేహ్యాని - నాలుకతో రుచిచూడఁదగిన, సైంధవశిలాశకలాని - సైంధవ లవణపు ముక్కలను, వక్త్రోష్మణా - నోటి వెచ్చదనముచేత, మలినయంతి - నల్లబరచు చున్నవి. ఓ పద్మాక్ష! నిడివిగా వేయబడిన డేరాలయందుఁ గట్టి వేయఁబడినవియు, పారశీక దేశమునుండి తెప్పింపఁబడినవియునగు నీ యీ గుఱ్ఱములు, తమ ముందుంచబడిన సైంధవలవణపు ముక్కలను నోటి వేడిమిచేత నల్లబడునట్లుగాఁ

జేయుచున్నవి. అనఁగా గుఱ్ఱములకు ప్రాతఃకాలమున లవణము పెట్టు సమయమైనది నిద్ర లెమ్మనిభావము. సైంధవలవణము మిక్కిలి తెల్లనిది కనుక నోటి వేడిమికి నల్లఁబడుచున్నట్లు చెప్పెను. గుఱ్ఱములకు ఉదయ కాలమున లవణమును బెట్టుట ఆరోగ్యకరమని సిద్ధయోగ సంగ్రహమను గ్రంథమున నున్నట్లు మల్లినాథ వ్యాఖ్య.

"పూర్వాహ్ణకాలే చాశ్వానాం ప్రాయశో లవణం హితం।
అరుచి గ్లాని శూలఘ్నం లవణం సైంధవం వరమ్."

శ్లో. భవతి విరళభక్తి ర్మ్లాన పుష్పోపహారః
స్వకిరణ పరివేషోద్భేద శూన్యాః ప్రదీపాః
అయ మపి చ గిరం న స్త్వత్ప్రబోధప్రయుక్తా
మనువదతి శుక స్తే మంజువాక్ పంజరస్థః 74

వ్యాఖ్య: మ్లానపుష్పోపహారః——(పూజలకై, అలంకరణమునకై వేయ బడినవియై) మ్లాన - వాడిపోయిన, పుష్పోపహారః - మాలారూపమున సమర్పింప బడిన పూలకానుక, విరళ భక్తిః – సడలిన కూర్పుకలది, భవతి – అగుచున్నది; ప్రదీపాశ్చ - పెద్ద పెద్ద దీపములు సైతము, స్వకిరణ పరివేషోద్భేదశూన్యాః—— స్వకిరణ - తమకిరణముల యొక్క, పరివేష - మండలముయొక్క, ఉద్భేద - స్ఫురణము చేత, శూన్యాః - శూన్యములైనవి (కిరణ మండలములు లేనివి). భవంతి - అగుచున్నవి, అపిచ - మరియును, అయం - ఈ, మంజువాక్ - ముద్దు పలుకులు గలదియు, పంజరస్థః - పంజరమున నున్నదియునగు, తే, శుకః- నీ చిలుక, త్వత్ప్రబోధప్రయుక్తాం——త్వత్ప్రబోధ - నిన్ను మేల్కొలుపుటకై, ప్రయుక్తాం - ఉచ్చరింపబడిన, నః, గిరం - మా వాక్కును, అనువదతి - తిరిగి పలుకుచున్నది. దేవతాది విగ్రహములకు, గృహాలంకరణాదులకు సమర్పింపబడిన పూలదండల కూర్పు, పూలు వాడుటచేత సడలి పోవుచున్నది, దీపములు తమ చుట్టు నేర్పడిన కిరణమండలములను గోల్పోవుచున్నవి, పంజరము నందున్న యీ నీ చిలుక మేము పాడుచున్న ప్రబోధ గీతములను పలుకుచున్నది. కనుక నిద్ర మేల్కొనుము అని భావము. అనువదతి అనునది క్రియ, అనువాదము నామవాచకము.

శ్లో. ఇతి విరచితవాగ్భి ర్వందిపుత్రైః కుమారః
సపది విగతనిద్రః తల్ప ముజ్ఝాంచకార;
మదపటు నినదద్భి ర్బోధితో రాజహంసైః
సురగజ ఇవ గాంగం సైకతం సుప్రతీకః 75

వ్యాఖ్య: ఇతి - ఈ ప్రకారముగా, వందిపుత్రైః - వైతాళిక యువకుల చేత, విరచితవాగ్భిః - స్తుతివర్ణనాత్మకముగా రచింపఁబడిన వాక్కులచేత, సపది - తక్షణమే, విగతనిద్రః - తొలఁగిన నిద్రగల, కుమారః - అజుఁడు, తల్పం-శయ్యను, మదపటునినదద్భిః—మదముచేత మధురముగా అరచుచున్న. రాజహంసైః - రాయంచల చేత, బోధితః - మేలుకొలుపఁబడిన, సుప్రతీకః - సుప్రతీక మను పేరిటి, సురగజః - ఈశానదిగ్గజము, గాంగం, సైకతం, ఇవ - గంగానది యందలి యిసుక దిబ్బను వలె, ఉజ్ఝాంచకార - వదలెను. మధుర రచనాత్మకములైన వైతాళికుల స్తుతి గీతములను విన్న వెంటనే, నిద్ర తొలగిన యజ మహారాజు, తన తల్పమును, మదమధురములైన రాయంచల, యరపుల చేత సుప్రతీక మను దిగ్గజము గంగ యందలి యిసుకదిబ్బనువలె, విడిచిలేచెను. ఇచ్చట సుప్రతీకము నుపమానముగాఁ జెప్పుటకు కారణము, అది ఈశాన్యదిగ్గజమై కైలాస వాసము గలది యగుటచేత గంగాస్నాన, గంగా సైకత శయనములు దానికి నిత్యము లభించుచుండునని సూచించుటకు. "ఐరావతము, పుండరీకము, వామనము, కుముదము, అంజనము, పుష్పదంతము, సార్వభౌమము, సుప్రతీకము" అనునవి వరుసగా దిగ్గజముల పేర్లు.

శ్లో. అథ విధి మవసాయ్య శాస్త్రదృష్టం
దివసముఖోచిత మంచితాక్షిపక్ష్మా,
కుశల విరచితానుకూల వేషః
క్షితిపసమాజ మగాత్ స్వయంవరస్థమ్. 76

వ్యాఖ్య: అథ - నిద్రమేల్కొని పాన్పును వదలి వచ్చినతరువాత, అంచితాక్షిపక్ష్మ - అందమైన కనురెప్పలుగల యజమహారాజు, శాస్త్రదృష్టం - శాస్త్రమునందుఁ జూడబడినదియు, దివసముఖోచితం — దివసముఖ - ప్రాతః కాలమునందు, ఉచితం - చేయఁదగిన, విధిం - కర్మానుష్ఠానమును, అవసాయ్య -

ముగించి, కుశలవిరచితానుకూలవేషః—కుశల - అలంకరించుటలో నేర్పరులైన వారిచేత, విరచిత - ధరింపఁ జేయఁబడిన, అనుకూలవేషః - స్వయంవరమున కనుకూలమైన వేషము గలవాఁడై, స్వయంవరస్థం - స్వయంవర మంటపము నందున్న, క్షితిపసమాజం - రాజబృందమును, అగాత్ - చేరెను. నిద్రనుండి మేలుకొనిన పిమ్మట నజుఁడు శాస్త్రమునందుఁ జూడఁబడిన ప్రాతఃకాల కర్మలను నిర్వర్తించి, నేర్పరులైన వారిచే రచింపఁబడిన వేష భూషణములు గలవాఁడై, స్వయంవర మంటపమునందున్న రాజబృందమును జేరెను. ఇచ్చటి "అంచితాక్షి పక్ష్మ" యను విశేషణము, అజుఁడు నిద్రనుండి లేవగానే ఎట్లు ప్రసన్న ముఖముతో నుండెనో. అతని కనులయం దెట్లు శాస్త్ర దర్శనము వెల్లివిరియు చుండెనో తెలుపుటకు. అసలు ప్రతివర్ణనమును ఒక చిత్రముగీసి చూపుట కాళిదాసుకు సహజముగదా !

ఇది మహాకవి కాళిదాసకృత

రఘువంశ కావ్యమున పంచమ సర్గమునకు

తెలుఁగు లఘువ్యాఖ్య

# మహాకవి కాళిదాసకృత రఘువంశము



## షష్ఠ సర్గము

శ్లో. స తత్ర మంచేషు మనోజ్ఞవేషాన్
సింహాసనస్థా నుపచారవత్సు,
వైమానికానాం మరుతా మపశ్య
దాకృష్టలీలాన్ నరలోకపాలాన్. 1

వ్యాఖ్య: సః - ఆ యజమహారాజు, తత్ర - ఆ స్వయంవర మంటపము నందు, ఉపచారవత్సు - రాజోపచారములతోఁ గూడిన, మంచేషు - సుఖముగా కూర్చునిచూచుటకు పీటలైన ఉన్నతాసనములగు మంచలయందు, సింహాసనస్థాన్ - భద్రాసనముల మీద కూర్చున్న వారును, మనోజ్ఞ వేషాన్ - మనోహరమైన వేషములు గలవారును, వైమానికానాం - విమానములపై సంచరించుచున్న, మరుతాం- దేవతలయొక్క, అకృష్టలీలాన్-ఆకర్షింపఁబడిన విలాసములు గలవారైన, నరలోక పాలాన్ - రాజకుమారులను, అపశ్యత్ - చూచెను. స్వయంవరార్థమై వచ్చిన రాజకుమారులందఱు వరుసగానున్న మంచెలమీద దేవతల వైభవముతో గూర్చుని యుండుటను అజమహారాజు చూచెనని భావము.

శ్లో. రతే ర్గృహీతానునయేన కామం
ప్రత్యర్పితస్వాంగ మివేశ్వరేణ,
కాకుత్థ్స మాలోకయతాం నృపాణాం
మనో బభూవేందుమతీ నిరాశమ్. 2

వ్యాఖ్య: రతేః - రతిదేవియొక్క, గృహీతానునయేన — గృహీత - స్వీకరింపఁబడిన, అనునయేన - బ్రతిమాలుకొనుటగల (రతిదేవి ప్రార్థనకు ప్రస

న్నదైన) ఈశ్వరేణ - శివునిచేత, ప్రత్యర్పిత స్వాంగం - తిరిగి యిచ్చివేయఁబడిన తన శరీరముగల, కామమివ - మన్మథుఁడో యనునట్లు, స్థితం - ఉన్నట్టి, కాకుత్సం - అజమహారాజును, ఆలోకయతాం - చూచుచున్నట్టి, నృపాణాం - రాజులయొక్క, మనః - మనస్సు, ఇందుమతీ నిరాశం - ఇందుమతియందు నిరాశగలది, బభూవ - ఆయెను. మన్మథునివలెనున్న అజమహారాజును జూచినపిమ్మట ఇందుమతి తమను పరింపఁబోదని స్వయంవరాగతులైన రాజులు నిరాశ బొందిరని భావము.

శ్లో. వైదర్భ నిర్దిష్ట మసౌ కుమారః
క్లృప్తేన సోపానపథేన మంచం,
శిలావిభంగై ర్మృగరాజ శాబ
స్తుంగం నగోత్సంగ మివారురోహ. 3

వ్యాఖ్య: అసౌ - ఈ, కుమారః - యువకుఁడైన అజుఁడు, వైదర్భ నిర్దిష్టం - విదర్భ రాజైన భోజునిచేత చూపఁబడిన, మంచం-మంచెను, క్లృప్తేన - చక్కగా తయారు చేయఁబడిన, సోపానపథేన - మెట్లదారిచేత, మృగరాజశాబః - సింహపుపిల్ల, శిలావిభంగైః — శిలా - ఱాళ్లయొక్క, విభంగైః - మెట్లు మెట్లుగా నేర్పడిన ఱాళ్లచేత, తుంగం - ఎత్తయిన, నగోత్సంగం ఇవ—నగ - పర్వతముయొక్క, ఉత్సంగంఇవ - అగ్రభాగమువలె, ఆరురోహ - ఎక్కెను. ఈనాటి సర్కస్ గ్యాలరీవలె సోపానమార్గమును, దానిపై మంచెలను ఉన్నతముగా నమర్చియుండిరని భావము. అట్టి మంచెమీదికి సింహపుపిల్ల కొండమీదికి ఎక్కినట్లు అజుడు ఎక్కెను.

శ్లో. పరార్ధ్య వర్ణాస్తరణోపపన్న
మాసేదివా౯ రత్నవదాసనం సః,
భూయిష్ఠ మాసీ దుపమేయకాంతి
ర్మయూరపృష్ఠాశ్రయిణా గుహేన. 4

వ్యాఖ్య: పరార్ధ్య వర్ణాస్తరణోపపన్నం—పరార్ధ్య - శ్రేష్ఠములైన, వర్ణ-రంగులుగల, ఆస్తరణ - పరువఁబడిన రత్న కంబళాదులతో, ఉపపన్నం - కూఢి

నదియు, రత్నవత్ - వివిధ రత్నములుగల, ఆసనం - పీఠమును, ఆసేదివాన్ - ఎక్కిన, సః - ఆ యజమహారాజు, మయూర పృష్ఠాశ్రయిణా - నెమలి వీపుమీద కూర్చున్న, గుహేన - కుమారస్వామితో, భూయిష్ఠం - ఎక్కువగా, ఉపమేయ కాంతిః - పోల్పఁదగిన కాంతి గలవాఁడు, ఆసీత్ - ఆయెను. రంగురంగుల యీకలుగల నెమలిమీద కూర్చున్న షణ్ముఖునివలె రత్నకంబళము పరచిన మంచె మీద కూర్చున్న యజుఁడు ప్రకాశించెనని భావము.

శ్లో. తాసు శ్రియా రాజపరంపరాసు
ప్రభావిశేషోదయ దుర్నిరీక్ష్యః,
సహస్రధాఽఽత్మా వ్యరుచ ద్విభక్తః
పయోముచాం పంక్తిషు విద్యుతేవ. 5

వ్యాఖ్య: తాసు, రాజపరంపరాసు - ఆ రాజులయొక్క వరుసలయందు, శ్రియా - కాంతిచేత, పయోముచాం - మేఘములయొక్క, పంక్తిషు - వరుసల యందు, విద్యుతేవ (విద్యుతా + ఇవ) - మెఱుపుచేతవలె, సహస్రధా - వేయి విధములుగా, విభక్తః - విభజింపబడినట్టిదై, ప్రభావిశేషోదయ దుర్నిరీక్ష్యం— ప్రభావిశేష - ఒక్కొక్క కాంతియొక్క, ఉదయ - పుట్టుకచేత, దుర్నిరీక్ష్యం - చూడ శక్యముగానిదైన, ఆత్మా - కాంతిస్వరూపము, వ్యరుచత్ - ప్రకాశించెను. జల తరంగములయందు సూర్యుఁడువలె కాంతిస్వరూపము ఒక్కొక్క రాజునం దొక్కొక్క విధముగా సంక్రమించి స్వయంవర మంటపమునందు కనులు మిరు మిట్లు గొలుపుచు ప్రకాశించెనని భావము.

శ్లో. తేషాం మహార్హాసన సంస్థితానాం
ఉదార నైపథ్య భృతాం స మధ్యే,
రరాజ ధామ్నా రఘుసూను రేవ
కల్పద్రుమాణా మివ పారిజాతః. 6

వ్యాఖ్య: మహార్హాసన సంస్థితానాం — మహార్హాసన - శ్రేష్ఠములైన పీఠ ముల మీద, సంస్థితానాం - కూర్చున్నట్టియును, ఉదార నైపథ్యభృతాం - ఉజ్జ్వల మైన వేషములను ధరించినట్టి, తేషాం - ఆ రాజులయొక్క, మధ్యే - నడుమ, కల్పద్రుమణాం - దేవతా వృక్షములయొక్క, మధ్యే - నడుమ

పారిజాతః ఇవ - పారిజాత వృక్షమువలె, సః - ఆ, రఘుసూనుః ఏవ - రఘు రఘుమహారాజు కుమారుఁడైన యజుఁడే, ధామ్నా - తేజస్సుచేత, రరాజ - ప్రకాశించెను. ఆసనములమీధ ఉజ్వల వేషధారులై యున్న ఆ రాజకుమారు లందఱిలోను కల్పవృక్షముల నడుమ పారిజాతమువలె అజుఁడే మహోజ్జ్వలముగా ప్రకాశించెనవి భావము. ఇచ్చట 'కల్పద్రుమ' శబ్దము 'కల్పవృక్ష' పర్యాయమేయైనను కల్పయంతి మనోరథాన్ (కోరికలనిచ్చునది) అను వ్యుత్పత్తిచేత దేవతరువు లన్నిటికిపీ ఉపలక్షకముగాఁ బ్రయోగింపఁబడినది. కనుక కల్పవృక్షములలో పారిజాతము వలె నని భావము. 'ధామ్నా' అనుచోట 'భూమ్నా' అను పాఠము గలదు. అప్పుడు 'భూమ్నారరాజ' అనగా నెక్కువగా ప్రకాశించెనని యర్థము.

శ్లో. నేత్రవ్రజాః పౌరజనస్య తస్మిన్
విహాయ సర్వాన్ నృపతీన్ నిపేతుః,
మదోత్కటే రేచితపుష్పవృక్షా
గంధద్విపే వన్యా ఇవ ద్విరేఫాః. 7

వ్యాఖ్య: పౌరజనస్య - పురజనముయొక్క, నేత్రవ్రజాః - నయన సమూహములు(చూపులన్నియు), సర్వాన్ నృపతీన్ - రాజులందరిని, విహాయ - విడిచిపెట్టి, తస్మిన్-ఆ యజునియందు, మదోత్కటే - మదము కారుచున్నగండస్థలములు గలదియు, వన్యే - వనమునందలిది యైన, గంధద్విపే - మదగజముమీద, రేచితపుష్ప వృక్షాః—రేచిత - రిక్తములుగాఁజేయఁబడిన, పుష్పవృక్షాః -పూలచెట్లుగల, ద్విరేఫాః ఇవ-తుమ్మెదలువలె, నిపేతుః - పడినవి. మదస్రావముగల గంధ గజము రాగానే తుమ్మెదలు తామున్న పూలచెట్లను పూర్తిగా వదలి యా యేనుఁగుపై వ్రాలినట్లు పురజనుల చూపులు అజుఁడురాగానే రాజులందఱిని వదలి యతనిపై వ్రాలెనని భావము. ఇందలి 'వన్య' శబ్దము తుమ్మెదలు పుష్పవృక్షములను వదలుటకును, 'గంధద్విప' శబ్దము పుష్పపరిమళ మకరందములకంటెఁ దుమ్మెదలకు గజమదము మిక్కిలి యాకర్షకమనుటకును ఉపయుక్తములు. నేత్రవ్రజములకు ద్విరేఫసామ్యము పోలికయందేకాక ఏకకాల పతనమునకు నుపయోగించుచున్నది. పరికర, పరికరాంకురములను నలంకారముల సహాయమును పొందిన యుపమాలంకారము స్ఫుటముగా నున్నది.

శ్లో. అథ స్తుతే వందిభి రన్వయజ్ఞైః
సోమార్కవంశ్యే నరదేవలోకే
సంచారితే చాగరుసారయోనౌ
ధూపే సముత్సర్పతి వైజయంతీః. 8

వ్యాఖ్య: ఈ శ్లోకమునుండి మూడు శ్లోకముల వఱకు నొకే మహావాక్యము. అథ - పిమ్మట, అన్వయజ్ఞైః - రాజవంశముల నెఱిఁగినవారైన, వందిభిః - స్తుతి పాఠకులచేత, సోమార్క వంశ్యే - చంద్ర సూర్యవంశములందుఁ బుట్టిన, నరదేవలోకే—నరదేవ - స్వయంవరమునకు వచ్చిన రాజులయొక్క, లోకే - సమూహము, స్తుతే (సతి) - పొగడఁబడిన దగుచుండగా, సంచారితే - అంతటను ప్రసరించునట్లు చేయబడినదియు, అగరుసారయోనౌ - శ్రేష్ఠమైన యగరువలన బుట్టినదియునగు, ధూపే - ధూపము (పరిమళ యుక్తమైన పొగ), వైజయంతీః - జెండాలను (అందఱు రాజులవి), సముత్సర్పతి (సతి) - ఎగబ్రాకుచున్నది యగుచుండగా.

శ్లో. పురోపకంఠోపవనాశ్రయాణాం
కలాపినా ముద్ధత నృత్తహేతౌ,
ప్రాధ్మాతశంఖే పరితో దిగంతాన్
తూర్యస్వనే మూర్ఛతి మంగళార్థే. 9

వ్యాఖ్య: పురోపకంఠోపవనాశ్రయాణాం — పురోపకంఠ - పట్టణ సమీపమునందలి, ఉపవనాశ్రయాణాం - ఉద్యానములు నివాసములుగాఁగల, కలాపినాం - నెమళ్లయొక్క, ఉద్ధత నృత్తహేతౌ - ఉత్కృష్టతాండవమునకు కారణమైనదియు, ప్రాధ్మాతశంఖే - పెద్దగా ఊదఁబడన శంఖములు గలదియు, మంగళార్థే - శుభప్రయోజనము గలదియు నగు, తూర్యస్వనే - వాద్యముల ధ్వని, పరితః - అంతట, దిగంతాన్ - దిగంతములను, మూర్ఛతి (సతి) - వ్యాపించుచున్నదగుచుండగా.

శ్లో. మనుష్యవాహ్యం చతురంతయాన
మధ్యాస్య కన్యా పరివారశోభి,

వివేశ మంచాంతర రాజమార్గం
పతింవరా క్లృప్త వివాహవేషా. 10

వ్యాఖ్య: పతింవరా - పతిని వరించునదియు, క్లృప్తవివాహవేషా - రచింపఁబడిన పెండ్లికూతురు వేషము గలదియునగు, కన్యా - కన్యక (ఇందుమతి), మనుష్యవాహ్యం - మనుష్యులచేత మోయఁబడినదియు, పరివారశోభి - దాస దాసీ జనముచేత ప్రకాశించుచున్నదియునగు, చతురంతయానం - పల్లకిని, అధ్యాస్య - ఎక్కి, మంచాంతర రాజమార్గం - మంచెల నడుమనున్న రాజమార్గమును (రాజులు ఇరుప్రక్కలగల మార్గమనవి యర్థము), వివేశ - ప్రవేశించెను. ఇట్లు మూడు శ్లోకములు కలిసి యొక వాక్యముగా నేర్పడుదానికి విశేషకమనియు, కుళకమనియుఁ బేర్లు వైభవోపేతముగా పల్లకి యందు గూర్చొని స్వయంవర మంటపము లోనికి ఇందుమతి ప్రవేశించెనని భావము.

శ్లో. తస్మిన్ విధానాతిశయే విధాతుః
కన్యామయే నేత్రశతైకలక్ష్యే
నిపేతు రంతఃకరణై ర్నరేంద్రా
దేహైః స్థితాః కేవల మాసనేషు. 11

వ్యాఖ్య: నేత్రశతైకలక్ష్యే—నేత్రశత - అసంఖ్యాకమైన నేత్రములకు, ఏకలక్ష్యే - ఒకేయొక దృశ్యమైనదియు, కన్యామయే - కన్యారూపమున నున్నదియునగు. విధాతుః - బ్రహ్మయొక్క, తస్మిన్ - ఆ, విధానాతిశయే - సృష్టివిశేషమునందు, నరేంద్రాః - రాజులు, అంతఃకరణైః - మనస్సులచేత, నిపేతుః - పడిరి, ఆసనేషు - పీఠములయందు, దేహైఃకేవలం - శరీరములచేత మాత్రము, స్థితాః - ఉండిరి. రాజులందఱును దేహములను మఱచి యిందుమతియందు చిత్తములను నిలిపిరని భావము.

శ్లో. తాం ప్రత్యభివ్యక్త మనోరథానాం
మహీపతీనాం ప్రణయాగ్రదూత్యః,

  

ప్రవాళశోభా ఇవ పాదపానాం
శృంగారచేష్టా వివిధా బభూవుః. 12

వ్యాఖ్య: తాం ప్రతి - ఆ యిందుమతీదేవిని గూర్చి, అభివ్యక్తమనోరథానాం - ప్రకటమైన వాంఛలుగల, మహీపతీనాం - రాజులకు, ప్రణయాగ్రదూత్యః—ప్రణయ - ప్రేమవాంఛ నెఱుకపరచుటయందు, అగ్రదూత్యః - మొదటి దూతికలైన (కుంటెనకత్తె లయిన), వివిధాః - అనేక విధములగు, శృంగారచేష్టాః - శృంగార వికారములు, పాదపానాం - చెట్లకు, ప్రవాళశోభాః ఇవ - చిగురుజొంపముల సొగసులవలె, బభూవుః - ఆయినవి (ఉప్పతిల్లినవి), ఇందుమతియందు రాజులకుఁగల ప్రేమవాంఛలు వసంత ఋతువునందు వృక్షముల నుండి పుట్టుకవచ్చు చిగురు జొంపముల వలె నొక్కసారిగా నుప్పతిల్లినవని భావము. శృంగార చేష్టలను దూతికలనుగా భావించుటచేత నలంకారము: ఉత్ప్రేక్ష; విభావానుభావ సాత్త్విక సంచారి భావములచేత సహృదయాస్వాద నీయతను పొందిన రతికి 'శృంగార' మని పేరు. 'రతి' యనఁగా నాయికా నాయకులకు పరస్పరముగా నేర్పడిన స్థిరమైన ఇచ్ఛ. చేష్ట లనగా దాని అనుభావములు.

శ్లో. కశ్చిత్కరాభ్యా ముపగూఢనాళ
మాలోల పత్త్రాభిహత ద్విరేఫమ్
రజోభి రన్తఃపరివేష బంధి
లీలారవిందం భ్రమయాంచకార. 13

వ్యాఖ్య: కశ్చిత్ - ఒకఁడు (స్వయంవరమంచస్థుఁడైన యొక్క రాజు) కరాభ్యాం - చేతులతో, ఉపగూఢనాళం - పట్టుకోఁబడిన కాడగలదియు, ఆలోలపత్త్రాభిహతద్విరేఫం—ఆలోల - కదలుచున్న, పత్త్ర - రేకలచేత, అభిహత - కొట్టఁబడిన, ద్విరేఫం - తుమ్మెదలు గలదియు, రజోభిః - పుప్పొడులచేత, అంతఃపరివేషబంధి-లోపల వర్తులాకారము నేర్పరచు నదియునగు, లీలారవిందం- విలాసార్థమై చేతిలో పట్టుకోబడిన కమలమును, భ్రమయాంచకార - గుండ్రముగా త్రిప్పెను, ఆరాజు లీలారవింద భ్రమణ రూపమైన శృంగార చేష్టను ఇందుమతి యెదుట కనబఱచెనని యర్థము. నీవు నన్ను పెండ్లి చేసికొన్న పిమ్మట, నేనిప్పుడు కమలమును తిప్పుచున్నట్లు నీవు నన్ను త్రిప్పవలయునని ఆరాజు భావము. ఇందు

మతి యతనిని "హస్తఘూర్ణకుఁడు - చేతులు నిర్ణిమిత్తముగాఁ ద్రిప్పువాఁడు, అవలక్షణకుఁడు" అని భావించి వరింపకపోయెను.

శ్లో. విస్రస్త మంసా దపరో విలాసీ
రత్నానువిద్ధాంగద కోటి లగ్నమ్
ప్రాలంబ ముత్కృష్య యథాప్రదేశం
నినాయ సాచీకృత చారువక్త్రః 14

వ్యాఖ్య : విలాసీ - విలాస స్వభావముగల. అపరః - మరియొక్క రాజు, అంసాత్ - భుజమునుండి, విస్రస్తం - జాఱినదియు. రత్నానువిద్ధాంగద కోటి లగ్నం—రత్న - మణులతో, అనువిద్ధ - చెక్కఁబడిన, అంగద - భుజకీర్తి యొక్క, కోటి - కొనయందు, లగ్నం - తగుల్కొనిన, ప్రాలంబం - చక్కగా వ్రేలాడుచున్న హారమును; ఉత్కృష్య - పైకియెత్తి (రెండు చేతులతో నని భావము), సాచీకృత చారువక్త్రః - అడ్డముగా త్రిప్ప బడిన అందమగు ముఖము కలవాఁడగుచు, యథాప్రదేశం - దాని స్థానమును, నినాయ - పొందించెను. నిన్ను ఈవిధముగా కౌఁగిలించుకొనెదనని యతని యభిప్రాయము. ఇతని దేహమునందు దాచుకొన వలసిన లోపమేదియో కలదని యిందుమతి యనుమానము. ఈ శ్లోకము నందలి "ప్రాలంబ" శబ్దమును "ప్రావార" మని గ్రహించిన పాఠము కలదు. ప్రావారమనగా నుత్తరీయము. శరీరమును దాచుకొనుటకు హారముకంటె ఉత్తరీయ మనుకూలముగా నుండును, కనుక ఆపాఠమే సమంజసముగాఁ గనబడు చున్నది.

శ్లో. ఆకుంచితాగ్రాంగుళినా తతోఽన్యః
కించి త్సమావర్జిత నేత్రశోభః
తిర్య గ్విసంసర్పి నఖప్రభేణ
పాదేన హైమం విలిలేఖ పీఠమ్. 15

వ్యాఖ్య : తతః - వానికంటె, అన్యః - మరియొకఁడు, కించిత్సమావర్జిత-నేత్రశోభః—కించిత్ - కొంచెముగా. సమావర్జిత - వంచఁబడిన, నేత్రశోభః-కన్నుల సోయగము గలవాఁడగుచు, ఆకుంచితాగ్రాంగుళినా—ఆకుంచిత - వంచ

బడిన, ఆగ్రాంగుళినా - కొనవేళ్లు గలదియు, తిర్యగ్విసంసర్పినఖప్రభేణ--తిర్యక్- అడ్డముగా, విసంసర్పి - ప్రసరించుచున్న. నఖప్రభేణ - గోళ్లకాంతులుగలదియు నగు, పాదేన - పాదముచేత, హైమం - బంగారపుదైన, పీఠం - పాదపీఠమును, విలిలేఖ - గీచెను. నా వద్దికి రమ్మనునది యాతని యభిప్రాయము. నేలగీఁకు వాఁడు అవలక్షణపు పెండ్లి కొడుకని యిందుమతి యనుమానము. నేలను గీఁకుట లక్ష్మీవినాశహేతువని లోకాభిప్రాయము.

శ్లో. నివేశ్య వామం భుజ మాసనార్ధే
తత్సన్నివేశా దధికోన్నతాంసః
కశ్చి ద్వివృత్త త్రిక భిన్నహారః
సుహృత్సమాభాషణ తత్పరోఽభూత్. 16

వ్యాఖ్య : కశ్చిత్ - ఒకానొకరాజు. వామం, భుజం - ఎడమ బాహువును. ఆసనార్ధే - సింహాసనముయొక్క సగమునందు, నివేశ్య - ఉంచి. తత్సన్నివేశాత్ -దాని నట్లుంచుటవలన, అధికోన్నతాంసః—అధికోన్నత - మిక్కిలియెత్తైన, అంసః - భుజ శిరస్సు గలవాఁడగుచు, వివృత్తత్రిక భిన్నహారః—వివృత్త - తిరిగిన, త్రిక - వెన్నెముక యొక్క క్రింది భాగమునందు, భిన్న - చెదరి వ్రేలాడు చున్న, హారః - ముత్యాల హారము గలవాఁడగుచు, సుహృత్సమాభాషణతత్పరః— సుహృత్ - మిత్రునితో (ఎడమ ప్రక్కన గూర్చున్నవాఁడు), సమాభాషణ - మక్కువతో మాట్లాడుకొనుట యందు, తత్పరః - ఆసక్తిగలవాఁడు. అభూత్- అయ్యెను. "పృష్ఠవంశాధరే త్రికమ్" అని యమరము. నన్ను వా మాంకముపైఁ గూర్చుండ బెట్టుకొని యిట్లు ముచ్చట లాడెదనని యీరాజు భావము. నన్ను జూచి పెడ మొగము పెట్టుకొన్న యితనిని వరించి యేమి లాభమని యిందుమతి యభిప్రాయము.

శ్లో. విలాసినీ విభ్రమ దంతపత్ర
మాపాండురం కేతకబర్హ మన్యః
ప్రియా నితంబోచిత సన్నివేశై
ర్విపాటయామాస యువా నఖాగ్రైః 17

వ్యాఖ్య : అన్యః - మరియొక, యువా - యువకుడు, విలాసినీవిభ్రమ దంతపత్రం—విలాసినీ - విలాసవతులగు స్త్రీలకు, విభ్రమ - విలాసార్థమైన, దంతపత్రం - చెవి కమ్మయైనట్టిదియు. ఆపాండురం - అంతటను తెల్లగా నున్న కేతకబర్హం - మొగలి రేకును. ప్రియానితంబోచితసన్నివేశైః—ప్రియానితంబ- ప్రియురాలి పిఱుదల యందు, ఉచిత సన్నివేశైః - అభ్యసించిన ఉనికిగల, నఖాగ్రైః - గోళ్ల కొనలచేత, విపాటయామాస - చీల్చుచుండెను. ఈ విధముగా నీనితంబమునందు నఖక్షతములుంచెదనని రాజు నభిప్రాయము. ఇతఁడు తృణచ్ఛేదకుఁడైన యవలక్షణుఁడని యిందుమతి యతని నంగీకరింపలేదు.

శ్లో. కుశేశయాతామ్ర తలేన కశ్చిత్
కరేణ రేఖాధ్వజ లాంఛనేన
రత్నాంగుళీయ ప్రభయా ఽనువిద్ధాన్
ఉదీరయామాస సలీల మక్షాన్ 18

వ్యాఖ్య : కశ్చిత్ - ఒకానొక రాజు, కుశేశయాతామ్రతలేన—కుశేశయ- నూఱురేకుల తామర పువ్వువలె, ఆతామ్ర - అంతటను ఎఱ్ఱగా నున్న, తలేన- అరచేయి కలదియు, రేఖాధ్వజలాంఛనేన—రేఖాధ్వజ - రేఖా రూపమున నున్న ధ్వజముచేత (సాముద్రిక శాస్త్ర ప్రసిద్ధమైన ధ్వజరేఖచేత) లాంఛనేన - చిహ్నము గలిదియునగు, కరేణ - చేతితో, రత్నాంగుళీయ ప్రభయా - రత్నాలు చెక్కిన యుంగరపు కాంతిచేత. అనువిద్ధాన్ - వ్యాప్తములైన, అక్షాన్ - పాచికలను, ఉదీరయామాస - ఎత్తివేసెను. నీతో నేనిట్లు క్రీడలు సల్పుదునని యతనిభావము. ఈతఁడు జూదగాఁడు గాని సత్పురుషుఁడు గాడని యిందుమతి యభిప్రాయము. వేయి ఱేకులు గల తామర పువ్వునకు 'కమల' మనియు, నూఱురేకులు గల దానికి 'కుశేశయ' మనియుఁ బేర్లు. "అక్షైర్మాదీవ్య" అని వేదము జూదమాడుటను నిషేధించినది. కనుక ఇందుమతి యతనిని వరింపలేదు.

శ్లో. కశ్చి ద్యథాభాగ మవస్థితేఽపి
స్వసన్నివేశాత్ వ్యతిలంఘి నీవ
రత్నాంశు గర్భాంగుళి రంధ్ర మేకం
వ్యాపారయామాస కరం కిరీటే. 19

వ్యాఖ్య : కశ్చిత్ - ఒకరాజు, యథాభాగం - ఉండవలసినచోట, అవస్థితే అపి - ఉన్నదేయైనను, స్వసన్నివేశాత్ - తానుండవలసినచోట. నుండి, వ్యతిలంఘిని ఇవ - తొలగియున్నట్టి దానియందువలె, కిరీటే - తన కిరీటమునందు, రత్నాంశుగర్భాంగుళిరంధ్రం—రత్నాంశు - మ ణి కా ం తు లు, గర్భ - లోపల గలిగిన, అంగుళి - వ్రేళ్లయొక్క, రంధ్రం - సందులు గలిగిన, ఏకంకరం- ఒక చేతిని, వ్యాపారయామాస - ప్రవర్తింపఁజేసెను. ప్రేమతో ఈ కిరీటమును వలె నిన్ను తలపై నెక్కించుకొని లాలనము చేయుదునని యతని యభిప్రాయము, శుభసమయమున నెత్తి మీద చేతిని పెట్టుకొన్న యితఁ డపలక్షణుఁడవి యిందుమతి భావము. ఇట్లు స్వయంవరమంచస్థులైన రాజులు ఇందుమతిని చూడగానే, నన్ను వరింపుము, నన్ను వరింపుము, అని శృంగార చేష్టలు చేసిరనియు, ఆచేష్టలేవియు నిందుమతికి సమ్మతినిఁ జేకూర్పఁజాలక పోయెననియుఁ గడచిన యేడు శ్లోకములవర్ణనకుఁ దాత్పర్యము,

శ్లో. తతో నృపాణాం శ్రుతవృత్తవంశా
పుంవత్ ప్రగల్భా ప్రతిహారరక్షీ
ప్రాక్సన్నికర్షం మగధేశ్వరస్య
నీత్వా కుమారీ మవదత్ సునందా 20

వ్యాఖ్య : తతః - పిమ్మట, నృపాణాం - రాజులయొక్క, శ్రుతవృత్తవంశా - శ్రుత - వినఁబడియున్న, వృత్త - నడవడికలును, వంశా - వంశములును గలదియు. ప్రగల్భా - వాగ్మినియునైన సునందా - సునంద యను పేరుగల ప్రతిహారరక్షీ - అంతఃపుర ద్వారపాలకురాలు. ప్రాక్ - మొట్టమొదట, కుమారీం- ఇందుమతిని, మగధేశ్వరస్య - మగధ రాజు యొక్క, సన్నికర్షం - సమీపమును, నీత్వా - చేర్చి, పుంవత్ - పురుషునివలె (దిట్టతనముతో), అవదత్ - పలికెను, రాజకుమారుల కుల శీల విశేషముల నెఱిగినట్టి సునందయను సఖి మొదట మగధ రాజు వద్ద నిలిపి వర వర్ణనము చేయుట కారంభించెనని భావము.

శ్లో. అసౌ శరణ్యః శరణోన్ముఖానాం
అగాధసత్త్వో మగధప్రతిష్ఠః

రాజా ప్రజారంజన లబ్ధవర్ణః
పరంతపో నామ యథార్థనామా 21

వ్యాఖ్య: అసౌ - ఈ యెదుటనున్న, రాజా - రాజు, శరణోన్ముఖానాం- శరణార్థులకు, శరణ్యః - రక్షకుఁడును, అగాధసత్త్వః - లోతైన స్వభావము గల వాఁడును, మగధప్రతిష్ఠః - మగధ దేశమునందు నివాసము గలవాఁడును, ప్రజారంజనలబ్ధవర్ణ—ప్రజారంజన - ప్రజారంజనమునందు, లబ్ధవర్ణః - సంపాదింపబడిన యశస్సు గలవాఁడును, పరంతపః నామ - పరంతపపుఁడను పేరున ప్రసిద్ధుఁడైన, యథార్థనామా - సార్థకనామధేయుఁడైన రాజు. (శత్రువులను భయపెట్టువాఁడు) ఇతఁడు శరణాగత రక్షణ గాంభీర్య, ప్రజారంజనాది గుణములు గలవాఁడు, ఇతని పేరు "పరంతపుడు" అని చెప్పెను.

శ్లో. కామం నృపాః సంతు సహస్రశోఽన్యే
రాజన్వతీ మాహు రనేన భూమిం
నక్షత్ర తారాగ్రహ సంకులాఽపి
జ్యోతిష్మతీ చంద్రమసైవ రాత్రిః 22

వ్యాఖ్య: అన్యే - ఇతరులైన, నృపాః - రాజులు, కామం - యధేచ్ఛగా, సహస్రశః - వేలకొలది. సన్తు - ఉందురుగాక, భూమిం - భూమిని. అనేన- ఈ పరంతపుని చేతనే, రాజన్వతీం - మంచి రాజు కల దానినిగా, ఆహుః- చెప్పుదురు. (అదియుక్తమే) నక్షత్ర తారాగ్రహసంకులా, అపి—నక్షత్ర-అశ్వని మొదలగు నక్షత్రములచేతను, తారా - సామాన్య తారలచేతను, గ్రహ - కుజాది గ్రహములచేతను, సంకులాపి - క్రిక్కిఱిసి యున్నదైనను, రాత్రిః - రాత్రి, చంద్రమసైవ (చంద్రమసా + ఏవ) చంద్రుని చేతనే. జ్యోతిష్మతీ - వెలుతురు కలది యగును. ఎందఱు రాజులున్నను పరంతపుని వలె దేశమునకు కీర్తిని దెచ్చిన వారులేరనియు నితఁడొకఁడే గొప్పరాజనియు భావము ఎన్ని నక్షత్రము లున్నను చంద్రుని వలె రాత్రికి వెలుతురు నియ్యజాలవు కదా!

శ్లో. క్రియాప్రబంధా దయ మధ్వరాణాం
అజస్ర మాహూత సహస్రనేత్రః

శచ్యాశ్చిరం పాండుకపోల లంబాన్
మందారశూన్యా నలకాంశ్చకార. 23

వ్యాఖ్య: అయం - ఇతఁడు, అధ్వరాణాం - యజ్ఞములయొక్క, క్రియా ప్రబంధాత్ - అనుష్ఠాన నిత్యతవలన (అవిచ్ఛిన్నముగా యాగములు చేయు చుండుటవలన), అజస్రం - నిత్యమును, అహూత సహస్రనేత్రః - ఆహ్వానింపఁ బడిన యింద్రుఁడు కలవాఁడగుచు (ఇంద్రుని యాహుతిలేని యజ్ఞముండదు కనుక దైనందినముగా నింద్రుఁ డితనివద్దకి వచ్చుటయో లేక యిచ్చటనే యుండి పోవుటయో జరుగుచుండునని భావము). చిరం - బహుకాలము, శచ్యాః - శచీదేవి యొక్క, అలకాన్ - ముంగురులను, పాండుకపోల లంబాన్—పాండుకపోల - తెల్లబాఱిన చెక్కిళ్లయందు, లంబాన్ - వ్రేలాడుచుండు వానినిగాను, మందార శూన్యాన్ - కల్పవృక్ష కుసుమ శూన్యములుగాను, చకార - చేసెను. నిత్యము నింద్రుఁడితని వద్దికి వచ్చుచుండుటచేత శచికిని ఇంద్రునికిని వియోగము కల్గిన దనియు, ఆమె పతివ్రతగావున మొగము తెల్లబడుటయేగాక కేశసంస్కార, కుసుమధారణాదులను మానివేసినదని భావము. "ప్రోషితే మలినా కృశా" అనియు, "క్రీడాం శరీర సంస్కారం సమాజోత్సవ దర్శనం, హాస్యం పరగృహేయానం త్యజేత్ ప్రోషిత భర్తృకా" అనియు లక్షణములు.

శ్లో. అనేన చే దిచ్ఛసి గృహ్యమాణం
పాణిం వరేణ్యేన కురు ప్రవేశే
ప్రాసాద వాతాయిన సంస్థితానాం
నేత్రోత్సవం పుష్పపురాంగనానామ్. 24

వ్యాఖ్య: వరేణ్యేన - వరింపఁ దగినవాఁడయిన, అనేన - ఈ పరంతప మహారాజుచేత, గృహ్యమాణం - పట్టుకోబడు దానినిగా, పాణిం - చేతిని, ఇచ్ఛసిచేత్ - కోరుదువేని (ఇతనిచేత పాణిగ్రహణమున కిష్టపడెదవేని), ప్రవేశే- పురప్రవేశమునందు, ప్రాసాద వాతాయన సంస్థితానాం - మేడలయొక్క కిటికీల వద్ద నిలుచుండిన, పుష్పపురాంగనానాం - పాటలీపుత్ర నగరమునందలి స్త్రీలకు, నేత్రోత్సవం -- కన్నుల పండుగను, కురు - చేయుము. అందగత్తెలయిన ఆ రాచనగరు స్త్రీలకు సైతము దర్శనీయమూర్తి వగుదువు కనుక ఇతనిని వరింప దలచినచో వరింపుమని భావము.

శ్లో. ఏవం తయోక్తే త మవేక్ష్య కించి
ద్విస్రంసి దూర్వాంక మధూక మాలా
ఋజుప్రణామ క్రియయైవ తన్వీ
ప్రత్యాదిదేశై న మభాషమాణా. 25

వ్యాఖ్య: ఏవం - ఈ విధముగా, తయా - ఆ సునందచేత, ఉక్తేసతి - చెప్పఁబడినది కాగా, తం - మగధరాజైన ఆ పరంతపుని, అవేక్ష్య - చూచి, కించిద్విస్రంసిదూర్వాక మధూకమాలా—కించిత్ - కొంచెముగా, విస్రంసి - జారుచున్న, దూర్వాంక - గఱిక పఱకల చిహ్నముగల (నడుమ నడుమ గఱిక పఱకలు పెట్టి యల్లిన అని యర్థము), మధూకమాలా - ఇప్పపూల దండగల, తన్వీ - ఇందుమతి, ఏనం - ఈ పరంతపుని, అభాషమాణా - పలుకరింపనిదగుచు, ఋజుప్రణామ క్రియయైన—ఋజు - సాధారణమైన (ఏ విధమైన వక్రతలేని, అనగా భావశూన్యమును, భాషణశూన్యమునగు), ప్రణామక్రియయాఏవ - నమస్కారము చేయుటచేతనే, ప్రత్యాదిదేశ - పరిహరించెను (అతనిని వరింపక పోయెను). ఒక నమస్కారము పెట్టి ముందుకు సాగెను. పరంతపుఁడు నిరంతరముగా శత్రు నిర్మూలనార్థమైన యుద్ధముల యందును, యజ్ఞ దీక్షలయందును ఆసక్తి గలవాఁడు గనుక పూజ్యుఁడేకాని రసజ్ఞుఁడు కాడని యిందుమతి యభిప్రాయము.

శ్లో. తాం సైవ వేత్రగ్రహణే నియుక్తా
రాజాంతరం రాజసుతాం నినాయ
సమీరణోత్థేవ తరంగరేఖా
పద్మాంతరం మానసరాజహంసీమ్. 26

వ్యాఖ్య: సైవ, వేత్రగ్రహణే, నియుక్తా - దౌవారికియైన ఆసునందయే, తాం, రాజసుతాం - ఆ యిందుమతిని, రాజాంతరం - మరియొక రాజును గురించి (మరియొకని వద్దికి), సమీరణోత్థా—సమీరణ - గాలిచేత, ఉత్థా - పైకిలేచిన, తరంగరేఖా - రేఖారూపమైన తరంగపంక్తి, మానసరాజహంసీం - మానస సరోవరమునందలి రాజహంసిని, పద్మాంతరం, ఇవ - మరియొక పద్మమువద్దికి వలె, నినాయ - చేర్చెను. ఇది చక్కని యుపమానముగల ఉపమాలంకారము. గాలికి

కదలిన తరంగమాల రాజహంసిని మరియొక కమలమువద్దికిఁ జేర్చినట్లు సునంద యిందుమతిని మరియొక రాజువద్దికిఁ జేర్చినదట.

శ్లో. జగాద చైనా మయ మంగనాథః
సురాంగనా ప్రార్థిత యౌవనశ్రీః
వినీతనాగః కిల సూత్రకారైః
ఐంద్రం పదం భూమిగతోఽపి భుజ్తే. 27

వ్యాఖ్య: అసునంద, ఏనాం జగాదచ - ఈ యిందుమతికి ఇట్లు చెప్పెనుగూడ, అయం - ఇతఁడు, అంగరాజః - అంగదేశాధిపతి, సురాంగనా ప్రార్థిత యౌవనశ్రీః—సురాంగనా - అప్సరసలచేత, ప్రార్థిత - కోరఁబడిన, యౌవనశ్రీః - జవ్వనపు సొంపుగలవాఁడు, సూత్రకారైః - గజశాస్త్రకారులచేత (పాలకాదులగు మహర్షులచేత), వినీతనాగః, కిల - శిక్షింపఁబడిన ఏనుగులు కలవాఁడనియందురు, భూమిగతః, అపి - భూమిమీద నున్నవాఁడైనను, ఐంద్రం - ఇంద్రుని సంబంధమైన, పదం - పదవిని (ఐశ్వర్యమును), భుజ్తే - అనుభవించుచున్నాఁడు. పూర్వమొకప్పు డింద్రసహాయార్థమై యితఁడు స్వర్గమునకు వెళ్లినప్పుడు అప్సరసలు ఇతనిని కామించిరనియు, ఏదో కారణమువలన భూలోకమున కవతరించిన దిగ్గజవర్గ మితనికి లొంగకపోగా నింద్రుఁడు పంపిన పాలకాదులైన గజశాస్త్రకారులగు మహర్షులవలన నా గజశాస్త్రమునునేర్చి వాటిని లొంగదీసి భూలోకమున గజశాస్త్ర సంప్రదాయమును విస్తరింపఁజేసె ననియుఁ జెప్పుదురు. కనుక నితఁడు భూలోకమందున్నను, దిగ్గజములచేతను, దేవర్షులచేతను సేవింపబడుటవలన నింద్రపదము ననుభవించుచున్నాఁడనియు, నితనిని వరించినచో నీకు స్వర్గసుఖ, స్వర్గగమనాగమనాదులు సుకరము లగుననియు సునంద ఇందుమతికి సూచించెను.

శ్లో. అనేన పర్యాసయతాఽస్రబిందూన్
ముక్తాఫల స్థూలతమాన్ స్తనేషు,
ప్రత్యర్పితాః శత్రువిలాసినీనా
మున్మచ్య సూత్రేణ వినైవ హారాః. 28

వ్యాఖ్య: శత్రువిలాపినీనాం - శత్రువుల భార్యలయొక్క, స్తనేషు - స్తనములయందు, ముక్తాఫల స్థూలతమాన్ - ముత్యములవలె మిక్కిలి పెద్దవైన,

అస్రబిందూన్ - కన్నీటి చుక్కలను, పర్యాసయతా - ప్రవర్తించుచున్న (ఒక చుక్క వెంబడి మరియొక చుక్క యెడతెగక వచ్చునట్లు చేయుచున్న), అనేన - ఈ యంగరాజుచేత, ఉన్ముచ్య - ఎత్తునుండి జార్చి, సూత్రేణవినా - దారము లేకయే, హారాః ఏవ - ముత్యాల హారములే, ప్రత్యర్పితాః - ఉంచఁబడినవి ఇతఁడు శత్రువిజేత, వీరుఁడు. అవిచ్ఛిన్నమైన అశ్రుబిందు ప్రవర్తనమువలన దారములేని హారమే వారి స్తనములయం దుంపఁబడినదా ! యను భావము గోచరించుచుండుటవలన నలంకారము : గమ్యోత్ప్రేక్ష.

శ్లో. నిసర్గ భిన్నాస్పద మేకసంస్థం
అస్మిన్ ద్వయం శ్రీశ్చ సరస్వతీ చ
కాంత్యా గిరా సూనృతయా చ యోగ్యా
త్వమేవ కల్యాణి ! తయో స్తృతీయా. 29

వ్యాఖ్య : నిసర్గ భిన్నాస్పదం—నిసర్గ - స్వభావముచేతనే, భిన్నాస్పదం - వేరువేరు స్థానములందుండునట్టి, శ్రీశ్చ - లక్ష్మియు, సరస్వతీచ - సరస్వతియు ననెడి, ద్వయం - జంట, అస్మిన్ - ఇతనియందు, ఏకసంస్థం - ఒకే యునికి గలదై యున్నది, హే కల్యాణి ! - ఓ శుభాంగి ! కాంత్యా - శరీర లావణ్యము చేతను, సూనృతయా - సత్యప్రియమైన, గిరాచ - వాక్కుచేతను, యోగ్యా - తగినదానవైన, త్వమేవ (త్వం + ఏవ) - నీవే, తయోః - ఆ యిద్దఱికిని, తృతీయా - మూడవదానవు. నీవే ఇతనికిఁ దగినదానవు. లక్ష్మి, సరస్వతుల యందలి లావణ్య వాగ్మిత్వములుగల నీవు భార్యవగుటకుఁ దగినదానవై యితనిని వరింపుమనియు, నీతని దక్షిణ నాయకత్వమును నిలుపుమనియు భావము.

శ్లో. అథాంగరాజా దవతార్య చక్షుః
యాహీతి జన్యా మవదత్ కుమారీ
నాసౌ నకామ్యో న చ వేద సమ్యక్
ద్రష్టుం న సా భిన్నరుచిర్హి లోకః. 30

వ్యాఖ్య : అథ - ఆ తరువాత, కుమారీ - ఇందుమతీదేవి, అంగరాజాత్ - అంగరాజునుండి, చక్షుః - చూపును, అవతార్య - దింపి, జన్యాం - తల్లిచెలికత్తె

యైన సునందను, యాహి - వద, ఇతి - అని, అవదత్ - పలికెను; అసౌ - ఈ యంగరాజు, కామ్యః - కోరదగినవాఁడు, నేతి న (న + ఇతి + న) - కాడు అనికాదు, సా - ఆ యిందుమతి, సమ్యక్ - చక్కఁగా, ద్రష్టుం - వివేచన చేయుటకు, న వేద ఇతి న - ఎఱుఁగదు అనుటయుకాదు; లోకః - జనము, భిన్నరుచిః- వేర్వేరురుచి కలది, హి - కదా! సకల గుణసంపన్నుఁడే యైనను అంగరాజును యిందుమతి వరింపలేదు. ఇరువురును గుణవంతులే యైనను ఒకరికొకరు నచ్చకపోవుట లోకస్వభావము. దానికిఁ గారణమును జెప్పఁజాలమని భావము. "జన్యా" యనగా మాతృసఖి. "జన్యా మాతృసఖీ ముదోః" అని విశ్వకోశము. లేక "జన్యా వధూ భృత్యా" అను కేశవ నిఘంటువు ననుసరించి, పెండ్లికుమార్తె దాసి యని యర్థము.

శ్లో. తతః పరం దుష్ప్రసహం ద్విషద్భిః
నృపం నియుక్తా ప్రతిహారభూమౌ
నిదర్శయామాస విశేషదృశ్య
మిందుం నవోత్థాన మివేందుమత్యై. 31

వ్యాఖ్య: తతః - తర్వాత, ప్రతిహారభూమౌ - ద్వార ప్రవేశమునందు, నియుక్తా - నియుక్తురాలైన సునంద, ద్విషద్భిః - శత్రువులచేత, దుష్ప్రసహం - సహింప శక్యముగాని వాఁడును, విశేష దృశ్యం - ఎక్కువగా చూడఁదగిన వాఁడును (రూపవంతుఁడని యర్థము), పరం - మఱియొకఁడైన, నృపం - రాజును, నవోత్థానం - నూతనోదయముగల, ఇందుం, ఇవ - చంద్రునివలె, ఇందుమత్యై - ఇందుమతికి, నిదర్శయామాస - బాగా చూపించెను. శౌర్యవంతుండును, రూపవంతుఁడునైన మఱియొక రాజును చూపెనని భావము. విశేషము: "ప్రతిహార" మనగా ద్వారము, "స్త్రీ ద్వార్ద్వారం ప్రతీహారః" అని యమరము.

శ్లో. అవంతినాథోఽయ ముదగ్రబాహు
ర్విశాలవక్షా స్తనువృత్తమధ్యః
ఆరోప్య చక్రభ్రమ ముష్ణతేజాః
త్వష్ట్రేవ యత్నోల్లిఖితో విభాతి. 32

వ్యాఖ్య: ఉదగ్రబాహుః - పొడవైన బాహువులు గలవాఁడును, విశాల వక్షః - వెడల్పైన వక్షస్థలము గలవాఁడును, తనువృత్తమధ్యః - సన్నపాటి గుండ్రని నడుము గలవాఁడును అయిన, అయం - ఇతఁడు, అవంతినాథః - అవంతి దేశాధీశ్వరుఁడు, త్వష్ట్రా - విశ్వకర్మచేత, చక్రభ్రమం - చక్రాకారమైన సానను, ఆరోప్య - ఎక్కించి, యత్నోల్లిఖితః—యత్న - ప్రయత్నముచేత, ఉల్లిఖితః - చెక్కఁబడిన, ఉష్ణతేజాః, ఇవ - సూర్యునివలె, విభాతి - ప్రకాశించుచున్నాఁడు. సానబట్టిన సూర్యునివలె చూచుటకు వీలైనవాఁడై ప్రకాశించుచున్నాఁడని భావము. విశ్వకర్మ కూతురు సంజ్ఞాదేవి సూర్యునిభార్య; ఆమె తన భర్తయొక్క తేజస్సునకు తట్టుకొనలేక తండ్రిని ప్రార్థింపగా, నతఁడు (త్వష్ట), సూర్యునిచేత ననుజ్ఞాతుఁడై చక్రాకారమైన యంత్రముపై సూర్యుని నఱగరాచుటకు ప్రయత్నించెనని మార్కండేయ పురాణము చెప్పుచున్నది.

"విశ్వకర్మాత్వనుజ్ఞాతః శాకద్వీపే వివస్వతా।
భ్రమ మారోప్య తత్తేజ శ్శాతనాయోపచక్రమే".

కనుక సూర్యుని సానబట్టుట కవి కల్పితముగాక పురాణ ప్రసిద్ధమనియు, అట్టి సూర్యుడు ప్రకృతరాజునకు ఉపమానముగా జెప్పఁబడెననియు గ్రహింపవలయును.

శ్లో. అస్య ప్రయాణేషు సమగ్రశక్తే
రగ్రేసరై ర్వాజిభి రుత్థితాని
కుర్వంతి సామంత శిఖామణీనాం
ప్రభా ప్రరోహా స్తమయం రజాంసి. 33

వ్యాఖ్య: సమగ్రశక్తేః - సంపూర్ణమైన శక్తిగల (రాజున కుండివలసిన ప్రభుశక్తి, మంత్రశక్తి, ఉత్సాహశక్తి అనఁబడు శక్తిత్రయము గలవాఁడని యర్థము), అస్య - ఈ యవంతిరాజుయొక్క, ప్రయాణేషు - జైత్రయాత్రలందు, అగ్రేసరైః - ముందుగా నడచుచున్న, వాజిభిః - గుఱ్ఱములచేత, ఉత్థితాని - పైకి చిమ్మబడిన, రజాంసి - దుమారములు, సామంత శిఖామణీనాం—సామంత - అంతటనుగల శత్రురాజులయొక్క, శిఖామణీనాం - తలలపైఁగల మణులయొక్క, ప్రభాప్రరోహా స్తమయం—ప్రభాప్రరోహ - వెలుగు మొలకలయొక్క, అస్త

  

మయం - వినాశమును, కుర్వంతి - చేయుచున్నవి. ఇతని విజయ యాత్రలందు లేచినధూళి శత్రురాజుల కిరీట మణికాంతులను మాయించుచుండును అనగా, శత్రువులను తేలికగా జయించువాఁడని భావము.

శ్లో. అసౌ మహాకాళ నికేతనస్య
వస న్నదూరే కిల చంద్రమౌళేః
తమిస్రపక్షేఽపి సహ ప్రియాభిః
జ్యోత్స్నావతో నిర్విశతి ప్రదోషాన్. 34

వ్యాఖ్య: అసౌ - ఈ అవంతిదేశాధిపతి, మహాకాళ నికేతనస్య - మహాకాళమను క్షేత్రము ఆలయముగాఁగల, చంద్రమౌళేః - శిరస్సునందు చంద్రుఁడు గల శివునికి, అదూరే - సమీపమునందు, వసన్ - నివసించుచున్నవాఁడగుచు, తమిస్రపక్షేఅపి - కృష్ణపక్షమునందు సైతము, ప్రియాభిఃసహ - ప్రియురాండ్రతో గూడ, జ్యోత్స్నావతః - వెన్నెలగల, ప్రదోషాన్ - పూర్వరాత్రులను, నిర్విశతి కిల - అనుభవించుచున్నాఁడు సుమా! మహాకాళనాథుని శిరమునందలి చంద్రుని వెన్నెలలో నిరంతరము నితఁడు సుఖించుననియు, అన్య దుర్లభమైన యట్టి సుఖము నీకు వాంఛనీయమనియు దూతిక యభిప్రాయము. మహాకాళనాథుఁడు ఉజ్జయినికి సన్నిహిత దైవము. అవంతి దేశమునకు ఉజ్జయిని రాజధాని. కాళిదాసుకు ఉజ్జయినియందు మిక్కిలి ప్రీతి, కనుకనే చారిత్రకులు కాళిదాసు జన్మస్థానము ఉజ్జయినియై యుండునని భావించుచున్నారు. మేఘసందేశ కావ్యమునందు సైతము కాళిదాసు ఉజ్జయినీ పట్టణమును, సిప్రానదిని మిక్కిలి మక్కువతో వర్ణించెను.

శ్లో. అనేన యూనా సహ పార్థివేన
రంభోరు! కచ్చి న్మనసో రుచి స్తే
సిప్రా తరంగానిల కంపితాసు
విహర్తు ముద్యాన పరంపరాసు? 35

వ్యాఖ్య: హేరంభోరు - ఓ సౌందర్యవతీ! (అరఁటి బోదెవంటి తొడలు గలదానా యని యర్థము), యూనా - యువకుఁడైన, అనేన, పార్థివేన, సహ - ఈ రాజుతోఁగూడ, సిప్రాతరంగా నిలకంపితాసు—సిప్రా - సిప్రానదియొక్క,

తరంగానిల - అలల మీదుగావచ్చు గాలిచేత, కంపితాసు - కదల్పఁబడిన, ఉద్యాన పరంపరాసు - ఉద్యానవన పంక్తులయందు, విహర్తుం - విహరించుటకు తే - నీయొక్క, మనసః - మనస్సునకు, రుచిః కచ్చిత్ - కోరికయున్నదా?, యువకుఁడైన యితనితో సిప్రానది మీదనుండి వచ్చు మందమారుతములచే గదల్పఁబడుచున్న ఉద్యాన వనములయందు క్రీడించుటకు వాంఛకలదా? అని యడిగినది.

శ్లో. తస్మి న్నభిద్యోతిత బంధుపద్మే
ప్రతాప సంశోషిత శత్రుపంకే
బబంధ సా నోత్తమసౌకుమార్యా
కుముద్వతీ భానుమతీవ భావమ్. 36

వ్యాఖ్య: ఉత్తమ సౌకుమార్యా - శ్రేష్ఠమైన శరీర మార్దవముగల, సా - ఆ యిందుమతి, అభిద్యోతిత బంధుపద్మే—అభిద్యోతిత - ప్రకాశింపఁ జేయఁబడిన, బంధు - బాంధువులనెడు, పద్మే - కమలములు గలవాఁడును, ప్రతాపసంశోషితశత్రుపంకే—ప్రతాప - తేజస్సుచేత, సంశోషిత - ఎండింపఁబడిన, శత్రు - శత్రువులనెడు, పంకే - బురదకలవాఁడును నగు, తస్మిన్ - ఆ యవంతి రాజునందు, కుముద్వతీ - కలువ తీఁగ, భానుమతీవ (భానుమతి + ఇవ) - సూర్యుని యందువలె, భావం - చిత్తమును, నబబంధ - నిలుపలేదు. అతనిని ప్రేమింప లేదని భావము. బంధువులను పద్మములుగాను, శత్రువులను బురదగాను రూపణము చేయుటచేత ఆ రాజునకు సూర్యసామ్యము గోచరించుచున్నది. కలువతీగ చల్లని చంద్రుని వరించునుగాని వేడివెలుఁగుల ఱేడైన సూర్యుని వరింపదుగదా! కనుక ఇందుమతి యంగీకరింపకపోవుట సమంజసమే.

శ్లో. తా మగ్రత స్తామరసాంత రాభాం
అనూపరాజస్య గుణై రనూనాం
విధాయ సృష్టిం లలితాం విధాతుః
జగాద భూయః సుదతీం సునందా. 37

వ్యాఖ్య: సునందా - సునంద, తామరసాంతరాభాం—తామరసాంతర - తామరపువ్వు లోపలిభాగముయొక్క, ఆభాం - కాంతివంటి కాంతి గలదియు (బంగారపురంగు శరీరముకలది యని యర్థము), గుణైః - రూపశీలాది గుణముల

చేత, అనూనాం - లోపములేనిదియు, సుదతీం - చక్కని పలువరుస గలదియు, విధాతుః - బ్రహ్మయొక్క, లలితాం, సృష్టిం - మధుర నిర్మాణమైన, తాం - ఆ యిందుమతీదేవిని, అనూపరాజస్య - అనూపదేశ రాజుయొక్క, అగ్రతః - ఎదుట, నిధాయ - నిలువఁబెట్టి, భూయః - మరల, జగాద - పలికెను. "జల ప్రాయ మనూపం స్యాత్" అని యమరము. జలసమృద్ధిగల దేశమునకు "అనూపము" అని పేరు. అనుగతాః ఆపః యేషు తే అనూపాః అని వ్యుత్పత్తి. సంస్కృత భాషయందు దేశవాచక శబ్దములు బహువచనాంతములై యుండును, ఆంధ్రాః, కళింగాః, కేరళాః, కాశ్మీరాః" ఇత్యాదులు. తెలుఁగునందు "ఆంధ్రము, కళింగము, కాశ్మీరము" అని యందురు. ఆ రాజు పాలించు దేశము జలసమృద్ధి గలదై యుండుటచేత దానికి "అనూప" శబ్దము రూఢమైనది. కనుక "అనూప రాజస్య" యని కాళిదాసు ప్రయోగించెను. ఆ యనూపరాజువద్ద ఇందుమతిని సునంద ఆపెనని యర్థము. ప్రతిచోటను ఇందుమతి పల్లకిపైఁ గూర్చుని చూచిన దనియు, సునంద ప్రక్కన నిలిచి చెప్పినదనియు మనము గ్రహింపవలెను.

శ్లో. సంగ్రామ నిర్విష్ట సహస్ర బాహు
రష్టాదశ ద్వీప నిఖాత యూపః
అనన్యసాధారణ రాజ శబ్దో
బభూవ యోగీ కిల కార్తవీర్యః. 38

వ్యాఖ్య: సంగ్రామనిర్విష్టసహస్రబాహుః - యుద్ధములయం దను భవముగల వేయిచేతులు గలవాఁడును, అష్టాదశ ద్వీపనిఖాత యూపః—అష్టా దశ - పదునెనిమిది యైన, ద్వీప - ద్వీపములయందు, నిఖాత - నాటఁబడిన' యూపః - యూపస్తంభములు గలవాఁడును, అనన్యసాధారణ రాజశబ్దః - ఇత రుల కెవ్వరికిని లేని రాజశబ్దము గలవాఁడును, యోగీ - బ్రహ్మవేత్తయునైన, కార్తవీర్యః - కార్తవీర్యు డను రాజు, బభూవకిల - ఉండెనుగదా! కార్తవీర్య మహారాజు నెఱుఁగుదువుగదా! అని భావము. నలచక్రవర్తి మొదలయిన భారత దేశ సార్వభౌములు అష్టాదశ ద్వీపములను జయించినట్లు కలదు. 'యూపము' అనగా యజ్ఞపశువును మంత్రపూతముగాఁ గట్టివేయునట్టి చిన్న స్తంభము. ఇతరులకు సాధారణముగాని 'రాజ' శబ్దమనఁగా నితఁడు సర్వభూతరంజనము చేయుటవలన

"రంజయతీతి రాజా" యను రాజశబ్దవ్యుత్పత్తి యితనియందు సమగ్రమై యుండిన దని భావము. కృతవీర్యుని కుమారుఁడు గావున నితనికి కార్తవీర్యుఁడని పేరు. అన్నిదీవులయందు యజ్ఞములుచేసిన సార్వభౌముఁడనియు, పరాక్రమవంతుఁ డనియు, బ్రహ్మవిద్యావేత్త యనియు భావము.

శ్లో. అకార్యచింతా సమకాల మేవ
ప్రాదుర్భవన్ చాపధరః పురస్తాత్
అంతశ్శరీరేష్వపి యః ప్రజానాం
ప్రత్యాదిదేశావినయం వినేతా. 39

వ్యాఖ్య: వినేయ - శిక్షకుఁడైన, యః - ఏ కార్తవీర్యుఁడు, అకార్య చింతా సమకాలమేవ - చెడ్డపని చేయుదమను తలంపుకలిగిన సమయమునందే, పురస్తాత్ - (అట్టి తలంపుకలిగిన వాని) యెదుట, చాపధరః - ధనుర్ధారియై, ప్రాదుర్భవన్ - సాక్షాత్కరించుచు, ప్రజానాం - ప్రజలయొక్క, అంతశ్శరీరేషు - మనస్సులయందలి, అవినయం, అపి - అపరాధమును సైతము, ప్రత్యాదిదేశ - తొలగించెనో. అట్టికార్తవీర్యుఁ డుండెనుకదా యని యన్వయము. ఇచ్చటి శరీర శబ్దమునకు లక్షణావృత్తిచేత ఇంద్రియమని యర్థము. కాగా అంతశ్శరీరమనగా అంతఃకరణమని యర్థము. ప్రజల మనస్సులలో కలుగు దురాలోచనలను సైతము గుర్తించి శిక్షించువాఁడని భావము.

శ్లో. జ్యా బంధ నిష్పంద భుజేన యస్య
వినిశ్వస ద్వక్త్రపరంపరేణ
కారాగృహే నిర్జితవాసవేన
లంకేశ్వరేణోషిత మాప్రసాదాత్. 40

వ్యాఖ్య: జ్యాబంధనిష్పందభుజేన__జ్యా - అల్లెత్రాటిచేతనైన, బంధ - బంధనముచేత, నిష్పంద - కదలజాలని, భుజేన - బాహువులు గలవాఁడును, వినిశ్వస ద్వక్త్ర పరంపరేణ__వినిశ్వసత్ - నిట్టూర్చుచున్న, వక్త్ర - ముఖముల యొక్క, పరంపరేణ - వరుసగల వాఁడును (దశముఖుఁడు కనుక), నిర్జితవాసవేన - ఓడింపఁబడిన యింద్రుఁడు గలవాఁడునునగు, లంకేశ్వరేణ - రావణా

సురునిచేత (రావణుడు) యస్య - ఏకార్తవీర్యునియొక్క, కారాగృహే - చెరసాలయందు, ఆప్రసాదాత్ - కార్తవీర్యుని కనుగ్రహము గలుగు పర్యంతము, ఉషితం - ఉండుటయో. అట్టి కార్తవీర్యుఁడని భావము. "లంకేశ్వరేణ ఉషితమ్" (రావణాసురుఁడుండుట) ఇది "రామేణ భూయతే" వంటి భావార్థక ప్రయోగము.

శ్లో. తస్యాన్వయే భూపతి రేష జాతః
ప్రతీప ఇత్యాగమవృద్ధ సేవీ
యేన శ్రియః సంశ్రయ దోష రూఢం
స్వభావలోలే త్యయశః ప్రమృష్టమ్. 41

వ్యాఖ్య: ఆగమవృద్ధసేవీ — ఆగమ - శాస్త్రముచేత, వృద్ధ - పెద్దలయిన వారిని, సేవీ - సేవించువాఁడును, ప్రతీపః ఇతి - ప్రతీపుఁడను పేరుతో ప్రసిద్ధుఁడైన, ఏషః భూపతిః - ఈ రాజు, తస్య - ఆ కార్తవీర్యునియొక్క, అన్వయే- వంశమునందు, జాతః - పుట్టినవాఁడు, యేన - ఎవనిచేతనైతే, సంశ్రయదోష రూఢం—సంశ్రయ - ఆశ్రయింపఁబడిన వానియొక్క, దోష - వ్యసన దుర్వ్యశయాదులగు తప్పిదముల వలన, రూఢం - పుట్టినట్టి, శ్రియః - లక్ష్మికి, స్వభావ లోలా - ప్రకృతి ఛంచల, ఇతి - అనెడి, అయశః - అపకీర్తి, ప్రమృష్టం- తుడిచి వేయఁబడినదో, లక్ష్మి ఛంచల యను నపకీర్తి పురుషదోషము వలన నేర్పడినదే యని తన సత్ప్రవర్తనతో నిరూపించిన యితఁడు నిరంతరము లక్ష్మీ వంతుఁడై యుండునని భావము.

శ్లో. ఆయోధనే కృష్ణగతిం సహాయ
మవాప్య యః క్షత్రియకాళరాత్రిం
ధారాం శితాం రామపరశ్వధస్య
సంభావయ త్యుత్పలపత్ర సారామ్. 42

వ్యాఖ్య: యః - ఏప్రతీపమహారాజు, ఆయోధనే - యుద్ధమునందు, కృష్ణ గతిం - అగ్నిని, సహాయం - తోడుగా, అవాప్య - పొంది, క్షత్రియకాళరాత్రీం- క్షత్రియులకు సంహార రాత్రియైన, రామపరశ్వధస్య - పరశు రాముని గండ్ర గొడ్డలి యొక్క, శితాం - వాడియైన, ధారాం - అంచును, ఉత్పలపత్రసారాం-

ఉత్పలపత్ర - కలువ రేకుల యొక్క, సారాం - గట్టిదనము వంటి గట్టితనము గల దానినిగా, సంభావయతి - తలంచునో. అగ్నిహోత్రుఁడు నీ నగరము పైకి వచ్చిన శత్రువులను నేనే కాల్చి వేయుదునని యీప్రతీపరాజుకు వరమిచ్చి, అట్లు చేయుచుండుట వలన సర్వక్షత్రియ కాళరాత్రియైన పరశురాముని గొడ్డలి వాదర నితఁడు కలువ రేకువలె మెత్తనయిన దానిగా భావించి లెక్క చేయఁడు కనుక నితనికి శత్రు భయము లేదని భావము.

శ్లో. అస్యాంకలక్ష్మీర్భవ దీర్ఘబాహోః
మాహిష్మతీ వప్రనితంబ కాంచీం
ప్రాసాదజాలై ర్జలవేణిరమ్యాం
రేవాం యది ప్రేక్షితు మస్తి కామః 43

వ్యాఖ్య : మాహిష్మతీ వప్రనితంబ కాంచీం—మాహిష్మతీ - మాహిష్మతీ పురి యొక్క, వప్రనితంబ - ప్రాకార మనెడి నితంబమునకు (నితంబ మనగా పిఱుదులును వానిపై నున్న కటి ప్రదేశమును గలసిన భాగము), కాంచీం- మొలనూలు వంటిదై, జలవేణిరమ్యాం - జలవేణి - జడల రూజమునఁ బ్రవహించు జలము చేత, లేక జలము యొక్క వేణీ రూపములైన పాయలచేత, రమ్యాం - అందముగా గనపడునట్టి, రేవాం - నర్మదానదిని, ప్రాసాదజాలైః- మేడల యొక్క కిటికీల ద్వారా, ప్రేక్షితుం - చూచుటకు. కామః - కోరిక, అస్తి యది - ఉండినచో, దీర్ఘబాహోః - అజానుబాహువైన, అస్య - ఈప్రతీప మహారాజునకు, అంకలక్ష్మీః - తొడ మీది కాంత్యధి దేవతవు, భవ - కమ్ము. మాహిష్మతీ నగర సౌధము నుండి నర్మదా నదీ సౌందర్యమును జూడ దలచినచో ఇతని తొడ మీద కూర్చొనుము-వరింపుము అని భావము.

శ్లో. తస్యాః ప్రకామం ప్రియదర్శనోఽపి
న స క్షితీశో రుచయే బభూవ
శరత్ప్రమృష్టాంబుధరోపరోధః
శశీవ పర్యాప్తకళో నళిన్యాః 44

వ్యాఖ్య : ప్రకామం - మిక్కిలి, ప్రియదర్శనోఽపి (పియదర్శనః + అపి) ప్రీతితోఁ జూడఁ దగినవాఁడే యైనను (చాలా అందగాడేయైనను), సః క్షితీశః- ఆరాజు, శరత్ ప్రమృష్టాంబుధరోపరోధః__శరత్ ప్రమృష్ట - శరదృతువుచేత తుడిచి వేయఁబడిన, అంబుధర - మేఘముల యొక్క, ఉపరోధః - అడ్డంకి గల వాఁడును (మేఘములు క్రమ్ముకొనుట పోయి నిర్మలాకాశమునఁ బ్రకాశించువాఁడైనను) పర్యాప్తకళః - సంపూర్ణ కళలు గలవాఁడైనను (పూర్ణిమనాటి వాఁడైనను), శశీ - చంద్రుఁడు, నళిన్యాః ఇవ - పద్మలతకువలె, తస్యాః - ఆ యిందుమతి యొక్క, రుచయే - ఇష్టము కొఱకు, న బభూవ - కాకపోయెను. ప్రతీపుఁడెంత గుణవంతుఁడైనను ఆమెకు రుచింపక పోయెను "లోకోభిన్నరుచి:" యనిభావము.

శ్లో. సా శూరసేనాధిపతిం సుషేణ
ముద్దిశ్య లోకాంతరగీత కీర్తిమ్
ఆచారపూతోభయవంశ దీపం
శుద్ధాంతరక్ష్యా జగదే కుమారీ 45

వ్యాఖ్య : లోకాంతరగీతకీర్తిం - ఇతర లోకముల యందును గొనియాడఁ బడిన కీర్తి గలవాఁడును ఆచారపూతోభయ వంశ దీపం__ఆచారపూత - సదాచారముచేతఁ బవిత్రములైన, ఉభయవంశ - మాతా పితృ వంశములకు దీపం- ప్రకాశకుఁడైనవాఁడును, (అయిన) శూరసేనాధిపతిం - శూరసేన దేశమున కధిపతి యగు, సుషేణం, ఉద్దిశ్య - సుషేణుని గుఱించి. శుద్ధాంతరక్ష్యా - అంతఃపుర పాలికయగు సునందచేత, సాకుమారీ - ఆయిందుమతి, జగదే - చెప్పఁబడెను. ప్రతీపుని నిరాకరించిన పిమ్మట సునంద ఇందుమతిని శూరసేన దేశపు రాజైన సుషేణుని గురించి చెప్పుటకు మొదలు పెట్టెను.

శ్లో. నీపాన్వయః పార్థివ ఏష యజ్వా
గుణై ర్యమాశ్రిత్య పరస్పరేణ
సిద్ధాశ్రమం శాంత మివైత్య సత్త్వైః
నైసర్గికోఽప్యుత్ససృజే విరోధః. 46

వ్యాఖ్య : యజ్వా - యజ్ఞములు చేసినట్టి, ఏషః, పార్థివః - ఈరాజు, నీపాన్వయః - నీప వంశమున బుట్టినవాఁడు; యం - ఏయితనిని (సుషేణుని),

ఆశ్రిత్య - ఆశ్రయించి, గుణైః - జ్ఞాన మౌన క్రోధ దయాది గుణములచేత. శాంతం - ప్రసన్నమైన, సిద్ధాశ్రమం - ఋష్యాశ్రమమును, ఏత్య - చేరి, సత్త్వైః- ఇవ - గజ సింహాది జంతువులచేతవలె, నైసర్గికః అపి - స్వాభావికమేయైనను, పరస్పరేణ - ఒండొకటి చేత, విరోధః - విరోధము, ఉత్ససృజే - విడువఁబడి నదో; ఒకటి యున్నచోట మరియొకటి యుండని క్రోధ శాంతములు, జ్ఞాన మౌనములు ఒక సిద్ధాశ్రమము నందలి గజ సింహాది మృగములవలె పరస్పర విరోధమును విడిచి యితని యందున్నవనియు, నితఁడు శీల గుణభూషితుఁడనియు భావము.

శ్లో. యస్యాత్మగేహే నయనాభిరామా
కాంతి ర్హిమాంశో రివ సన్నివిష్టా
హర్మ్యాగ్ర సంరూఢ తృణాంకురేషు
తేజోఽవిషహ్యం రిపుమందిరేషు 47

వ్యాఖ్య : హిమాంశోః - చంద్రునియొక్క, కాంతిః ఇవ - వెన్నెలవలె, నయనాభిరామా - కన్నుల కింపైన, యస్య - ఎవనియొక్క, కాంతిః - ప్రకాశము ఆత్మగేహే - తనయింట (తానున్నచోట), సన్నివిష్టా - సంక్రమించినదో; అవిషహ్యం - సహింప శక్యముగాని, తేజః - పరాక్రమము, హర్మ్యాగ్ర సంరూఢ తృణాంకురేషు___హర్మ్యాగ్ర - మేడలపై భాగములయందు, సంరూఢ మొలచిన, తృణాంకురేషు - గడ్డి మొలకలు గల, రిపుమందిరేషు - శత్రునగరముల యందు, సన్నివిష్టం - సంక్రమించి యున్నదో; ఆసుషేణుని వరింపు మని యర్థము. ఇతఁడు స్వజనమునకును, ఆశ్రితులకును చంద్రుని వలె చల్లనివాఁడును, శత్రువులకు పరంతపుడు నని భావము. శత్రువుల మేడలపై గడ్డి మొలచుట యనగా వారు నశించిపోవుట. ఇచ్చటి మందిర శబ్దమునకు నగరమని యర్థము. "మందిరం నగరే గృహే" అని విశ్వకోశము.

శ్లో. యస్యావరోధ స్తన చందనానాం
ప్రక్షాళనా ద్వారివిహారకాలే
కళిందకన్యా మధురాం గతాఽపి
గంగోర్మి సంసక్త జలేవ భాతి 48

వ్యాఖ్య : యస్య - ఏసుషేణుని యొక్క, వారి విహారకాలే - జలక్రీడా సమయమునందు, అవరోధస్తనచందనానాం—అవరోధ - అంతఃపుర స్త్రీల యొక్క, స్తన - స్తనములమీది, చందనానాం - గంధముల యొక్క, ప్రక్షాళనాత్ -కడుగుట వలన, కళిందకన్యా - యమునానది, మధురాం - ఇతని నగరమైన మధురా పురమును, గతాపి (గతా + అపి) - చేరినదైనను, గంగోర్మిసంసక్తజలేవ గంగోర్మి - గంగానది యొక్క తరంగములతో, సంసక్త - కలుసుకొనిన. జలేవ- నీరు కలదివలె, భాతి - ప్రకాశించునో ; "కళిందకన్యా" కళింద పర్వతమునందు పుట్టుటచేత యమునకీ పేరు వచ్చినది. మధుర వద్ద నున్న యమున యింకను గంగతో కలియ లేదు కనుక యీ విధముగా నుత్ప్రేక్షింపఁబడినది. స్తనగంధము కారణము.

శ్లో. త్రస్తేన తార్క్ష్యాత్ కిల కాళియేన
మణిం విసృష్టం యమునౌకసా యః
వక్షస్థల వ్యాపి రుచిం దధానః
సకౌస్తుభం హ్రేపయతీవ కృష్ణమ్ 49

వ్యాఖ్య : తార్క్ష్యాత్ - గరుత్మంతునివలన, త్రస్తేన - భయపడి నట్టియు, యమునౌకసా - యమునానది నివాసముగాఁగల వాఁడును నగు, కాళియేన - కాళి యుఁడను సర్పముచేత, విసృష్టం కిల - ఈయఁబడి యున్నది గదా ; వక్షస్థల వ్యాపిరుచిం - వక్షస్థలము మీద వ్యాపించుచున్న కాంతిగల, మణిం - ఆరత్నమును దధానః - ధరించుచున్న, యః - ఏసుషేణుఁడు, సకౌస్తుభం - కౌస్తుభ రత్నసహి తుఁడైన, కృష్ణం - విష్ణుమూర్తిని, హ్రేపయతీవ (హ్రేపయతి + ఇవ) - సిగ్గుల జేయుచున్నట్లున్నాఁడో ; అభయ ప్రదాత యగు సుషేణునికి కాళియుఁడొకమణిని ప్రతిఫలముగా నిచ్చెనని యొక కథ. అమణి కౌస్తుభ రత్నము కంటెను మిక్కిలి కాంతి గలదియై యున్నదనియు దానిని ధరించి యతఁడు విష్ణుమూర్తిని సిగ్గుపడు నట్లు చేయుచున్నాడనియు భావము.

శ్లో, సంభావ్య భర్తార మముం యువానం
మృదుప్రవాళోత్తర పుష్పశయ్యే
బృందావనే చైత్రరథా దనూనే
నిర్విశ్యతాం సుందరి! యౌవనశ్రీః 50

వ్యాఖ్య : యువానం - యువకుఁడైన, అముం - ఇతనిని (సుషేణుని), భర్తారం - భర్తనుగా, సంభావ్య - అంగీకరించి, మృదుప్రవాళోత్తరపుష్పశయ్యే- మృదుప్రవాళ - లేత చిగురాకులు, ఉత్తర - పై భాగమునగల, పుష్పశయ్యే - పూల పానుపుగలదియు, చైత్రరథాత్ - కుబేరుని యుద్యానముకంటె, అనూనే- తక్కువగాని, బృందావనే - 'బృందావన' మను పేరుగల,యుద్యాన వనమునందు హేసుందరి - ఓ సౌందర్యవతీ! యౌవనశ్రీః - యౌవనసంపద, నిర్విశ్యతాం - అనుభవింప బడుగాక. యువకుఁడైన యితనిని భర్తనుగా స్వీకరించి బృందావన మందు పూల పాన్పు మీద యౌవన సుఖము ననభవింపుము.

శ్లో. అధ్యాస్య చాంభఃపృషతోక్షితాని
శైలేయగంధీని శిలాతలాని
కలాపినాం ప్రావృషి పశ్య నృత్తం
కాంతాసు గోవర్ధన కందరాసు 51

వ్యాఖ్య : చ (కించ) - మఱియు, ప్రావృషి - వర్షాకాలము నందు. కాంతాసు - రమణీయములైన, గోవర్ధన కందరాసు - గోవర్ధన పర్వతముయొక్క గుహల యందు. అంభఃపృషతోక్షితాని—అంభఃపృషత్ - నీటి చుక్కలచేత, ఉక్షితాని - తడుపబడినవియు, శైలేయగంధీని - శిలాజిత్తుయొక్క వాసనలు గలవి యునగు, శిలాతలాని - ఱాతి ప్రదేశములను, అధ్యాస్య - అధిష్ఠించి (ఱబండలమీద కూర్చుని). కలాపినాం - నెమళ్లయొక్క. నృత్తం - నృత్తమును పశ్య - చూడుము (నృత్తమనగా తాళానుకూలమైన పాదవిన్యాసము. ఇందులో భావ ప్రదర్శనముండదు) మరియు నితనితో గలిసి గోవర్ధన పర్వతముపైఁ గూర్చుని అచ్చటి నెమళ్ల నృత్తమును జూడుమని భావము. శైలేయమనగా శిలాజిత్తు; లేదా ఱాతి పువ్వు అనబడు ఓషధి,

శ్లో. నృపం తమావర్తమనోజ్ఞ నాభిః
సా వ్యత్యగా దన్యవధూ ర్భవిత్రీ
మహీధరం మార్గవశా దుపేతం
స్రోతోవహా సాగర గామినీవ 52

వ్యాఖ్య: ఆవర్తమనోజ్ఞనాభిః—ఆవర్త - నీటి సుడివలె, మనోజ్ఞమనోహరమైన, నాభిః - బొడ్డుగల, సా - ఆ యిందుమతి, అన్యవధూః - మరియొకనికి భార్య, భవిత్రీ - కాఁగలదియై, తం నృపం - ఆరాజును, సాగరగామినీ - సముద్రమును గూర్చి పోవునట్టిది యగు, స్రోతోవహా - మహానది, మార్గవశాత్ - మార్గవశమున, ఉపేతం - వచ్చిన, మహీధరం ఇవ - పర్వతమునువలె, వ్యత్యగాత్ - దాటి వెళ్లి పోయెను, మఱియొకనికి భార్యకాఁగలదియై సుషేణుని వద్ద నిలువక సముద్రమునకు వెళ్ల మహానది దారిలో వచ్చిన కొండను త్రోసుకొని వెళ్లినట్లు ముందుకు సాగెనని భావము.

శ్లో. అథాంగదాశ్లిష్ట భుజం భుజిష్యా
హేమాంగదం నామ కళింగనాథమ్
ఆసేదుషీం సాదిత శత్రుపక్షం
బాలా మబాలేందుముఖీం బభాషే 53

వ్యాఖ్య: అథ - తరువాత, భుజిష్యా - సేవకురాలు (సునంద), అంగదాశ్లిష్టభుజం—అంగద - భుజకీర్తులతో అశ్లిష్ట - కూడిన, భుజం - బాహువులు గలవాఁడును, సాదితశత్రుపక్షం—సాదిత - నశింపఁజేయబడిన, శత్రుపక్షం - శత్రువర్గము గలవాడును, హేమాంగదం,నామ - హేమాంగదుఁడను పేరు గలవాఁడును నగు, కళింగనాథం - కళింగ దేశపురాజును, ఆసేదుషీం - సమీపించినదియు, అబాలేందుముఖీం - పూర్ణ చంద్రుని వంటి ముఖము గలదియునగు, బాలాం - ఇందుమతిని గురించి, బభాషే - పలికెను. ఆతరువాత కళింగ రాజైన హేమాంగదుని వద్దకి వెళ్లి యిందుమతికి నతనిని గురించి చెప్పుటకు సునంద మొదలిడెను. "భుజిష్యాకింకరీమతా" అని హలాయుధ నిఘంటువు. ఇచ్చట "అబాలేందు" శబ్దము పూర్ణచంద్రుఁడను నర్థమున శబ్దాలంకారమునకై ప్రయోగింపఁబడినది.

శ్లో. అసౌ మహేంద్రాద్రి సమానసారః
పతి ర్మహేంద్రస్య మహోదధేశ్చ
యస్యక్షరత్సైన్య గజచ్ఛలేన
యాత్రాసు యాతీవ పురో మహేంద్రః 54

వ్యాఖ్య : అసౌ - ఇతడు, మహేంద్రాద్రిసమానసారః - మహేంద్రపర్వతమునకు సమానమైన సారము (స్థైర్యము) గలవాఁడు. మహేంద్రస్య - మహేంద్రపర్వతమునకును, మహోదధేశ్చ - తూర్పు సముద్రమునకును, పతిః - అధిపతి; యస్య - ఎవనియొక్క, యాత్రాసు - విజయ యాత్రల యందు, క్షరత్సైన్య గజచ్ఛలేన—క్షరత్ - మదమును స్రవించుచున్న. సైన్యగజ - సేన యందలి యేనుగులయొక్క, ఛలేన - మిషచేత. మహేంద్రః - మహేంద్ర పర్వతము, పురః - ముందు, యాతీవ (యాతి + ఇవ) - నడచుచున్నట్లుండునో; ఇతని గజములు అద్రులతో సమానము లనియు ఇతఁడు తూర్పు సముద్రమునకును మహేంద్ర పర్వతమునకును అధిపతియనియు భావము. ఇచ్చటి మహేంద్ర శబ్దము శబ్దాలంకారమును నిర్వహించుటయే కాక ఇంద్రవాచకము గూడనగుట చేత విరోధాభాసమను నర్థాలంతరమును సైతము స్ఫురింపఁజేయుచున్నది.

శ్లో. జ్యా ఘాత రేఖే సుభుజో భుజాభ్యాం
బిభర్తి య శ్చాపభృతాం పురోగః
రిపుశ్రియాం సాంజన బాష్పసేకే
బందీకృతానా మివ పద్ధతీ ద్వే 55

వ్యాఖ్య : సుభుజః - దీర్ఘ బాహువులు గలవాఁడును, చాపభృతాం - ధనుర్ధారులలో, పురోగః - అగ్రేసరుఁడును నగు, యః - ఏ హేమాంగద మహారాజు, బందీకృతానాం - చెఱసాలయం దుంచబడిన, రిపుశ్రియాం - శత్రురాజ్య లక్ష్మలయొక్క, సాంజనబాష్పసేకే - కాటుక కన్నీటియోడికలు గలవియునగు, పద్ధతీఇవ - దారులవలెనున్న, ద్వే - రెండైన, జ్యాఘాతరేఖే—జ్యాఘాత - అల్లెత్రాటి దెబ్బలవలన కాయలు కాసిన, రేఖే - రెండు చాఱలను, భుజాభ్యాం - రెండు భుజములచేతను, బిభర్తి - ధరించుచున్నాఁడో; ఇతఁడు రెండు చేతులతోను బాణములు వేయు సవ్యసాచియగు ధనుర్ధరుఁడు. కనుక రెండు భుజముల మీదను అల్లెత్రాడును లాగునప్పుడు తగిలిన దెబ్బలతో కాయలుకాచి నల్లని చారలేర్పడినవి. అవి, యితఁడు శత్రులక్ష్మలను బందీలుగా తెచ్చుచుండ వారి కాటుక కన్నీటి చారలు జారిన మార్గములో యనునట్లున్నవి అని భావము. అలంకారము : ఉత్ప్రేక్ష.

శ్లో. య మాత్మనః సద్మని సన్నికృష్టో
మంద్రధ్వని త్యాజిత యామతూర్యః
ప్రాసాద వాతాయన దృశ్య వీచిః
ప్రబోధయ త్యర్ణవ ఏవ సుప్తమ్. 56

వ్యాఖ్య: ఆత్మనః - తనయొక్క, సద్మని - యింటియందు, సుప్తం - శయనించిన, యం - ఏ హేమాంగద మహారాజును, సన్నికృష్టః - సమీపమునందున్న వాఁడును, ప్రాసాద వాతాయనదృశ్యవీచిః—ప్రాసాదవాతాయన - హేమాంగదుని మేడల కిటికీలద్వారా, దృశ్య - చూచుటకు వీలైన, వీచిః - తరంగములు గల వాఁడును, మంద్రధ్వని త్యాజితయామతూర్యః—మంద్రధ్వని - గంభీరధ్వనిచేత, త్యాజిత - మాన్పబడిన, యామ - జాముయొక్క (ప్రతిరోజు చివరియందు కొట్టవలసిన), తూర్యః - భేర్యాది వాద్యములు కలవాడును నగు, అర్ణవః, ఏవ - సముద్రుఁడే, ప్రబోధయతి - మేలుకొలుపు చున్నాఁడో ! తన తరంగముల మంద్ర ధ్వని చేతనే యామతూర్య కార్యక్రమమును నిర్వహించుచు సముద్రుఁడే యితనిని సేవించుచుండును. ఇక యితరు లితనిని సేవించు విషయమును గురించి చెప్ప నేల ? యని భావము.

శ్లో. అనేన సాకం విహరాం బురాశేః
తీరేషు తాళీవన మర్మరేషు
ద్వీపాంతరానీత లవంగ పుష్పైః
అపాకృత స్వేదలవా మరుద్భిః. 57

వ్యాఖ్య : అనేన, సాకం - ఇతనితోకూడ, తాళీవనమర్మరేషు—తాళీవన - తాటి తోపులచేత, మర్మరేషు - మర్మరధ్మనులుగల (తాటియాకుల గలగల ధ్వనులు గల), అంబురాశేః - సముద్రముయొక్క, తీరేషు - తీరములయందు, ద్వీపాంతరానీతలవంగపుష్పైః - ఇతర ద్వీపములనుండి తీసుకరాబడిన దేవకుసుమములు గల, మరుద్భిః - వాయువులచేత, అపాకృతస్వేదలవా - తొలగింపఁబడిన చెమట బిందువులు కలదానవై, విహర - విహరింపుము. ఇతనితోకలసి తాటి తోపులుగల సముద్ర తీరమునందు ద్వీపాంతరములనుండి వచ్చు గాడ్పులచేత తొలగింపఁ బడిన రతిశ్రమజనిత స్వేదబిందువులు కలదానివై విహరింపుమని భావము.

శ్లో. ప్రలోభితా౽ప్యాకృతి లోభనీయా
విదర్భరాజావరజా తయైవమ్
తస్మా దపావర్తత దూరకృష్టా
నీత్యేవ లక్ష్మీః ప్రతికూలదైవాత్. 58

వ్యాఖ్య: ఆకృతిలోభనీయా - రూపముచేత ఆకర్షింపఁ బడదగినదైన, విదర్భరాజావరజా (విదర్భరాజ + అవరజా) - విదర్భరాజు చెల్లెలు (ఇందుమతి) తయా - ఆ సునందచేత, ఏవం - ఇట్లు, ప్రలోభితా, అపి - ప్రోత్సాహింపఁ బడినదైనను, నీత్యా - పురుష ప్రయత్నముచేత, దూరకృష్టా - చాలావరకు తీసుకురాఁబడిన, లక్ష్మీః - సంపద, ప్రతికూలదైవాత్, ఇవ - విరుద్ధమైన యదృష్టముగల పురుషునినుండివలె, తస్మాత్ - ఆ హేమాంగదరాజు వద్దినుండి, అపావర్తత - ప్రక్కకుతొలగి వెళ్లెను. ఎంత ప్రయత్నించినను దురదృష్టవంతుని వద్దికి లక్ష్మి చేరనియట్లు, ఎంత వర్ణించినను హేమాంగదుని రూపము ఇంధుమతికి నచ్చక ముందుకుసాగెనని భావము.

శ్లో. అథోరగాఖ్యస్య పురస్య నాథం
దౌవారికీ దేవసరూప మేత్య
ఇత శ్చకోరాక్షి ! విలోకయేతి
పూర్వానుశిష్టాం నిజగాద భోజ్యామ్. 59

వ్యాఖ్య: అథ - తరువాత, దౌవారికీ - ద్వారపాలకురాలైన సునంద, దేవసరూపం - దేవతలతో సమానమైన రూపము గలవాడును, ఉరగాఖ్యస్య, పురస్య - నాగపురమునకు, నాథం - ప్రభువగువానిని, ఏత్య - సమీపించి, చకోరాక్షి - ఓ యిందుమతీ! (చకోరపక్షుల కన్నులవంటి కన్నులు గలదానా). ఇతః, ఇటు, విలోకయ - చూడుము, ఇతి - అని, పూర్వానుశిష్టాం - ముందుగా హెచ్చరింపఁబడిన, భోజ్యాం - భోజరాజు కూతురైన యిందుమతిని గూర్చి, నిజగాద - పలికెను. ఇటుచూడు అని హెచ్చరించి, చెప్పవలసినది చెప్పెనని భావము. నాగపురము, పాండ్యదేశము నందలి కాయకులార నదీతీరమునం దుండినట్లు మల్లినాథవ్యాఖ్య.

శ్లో. పాండ్యోఽయ మంసార్పిత లంబహారః
క్లుప్తాంగరాగో హరిచందనేన
ఆభాతి బాలాతప రక్తసానుః
సనిర్ఝరోద్గార ఇవాద్రిరాజః. 60

వ్యాఖ్య: అంసార్పిత లంబహారః - భుజములయం దుంచబడి వ్రేలాడుచున్న ముత్యాలహారము గలవాఁడును, హరిచందనేన - గోశీర్షకమను చందనము చేత, క్లుప్తాంగరాగః - చేయఁబడిన మైపూతగల వాఁడును, అయిన, అయం, పాండ్యః - ఈ పాండ్యదేశాధిపతి, బాలాతపరక్తసానుః—బాలాతప - లేత యెండచేత, రక్త - ఎఱ్ఱబారిన. సానుః - చఱియలు గలదై. సనిర్ఝరోద్గారః - సెలయేళ్ల ప్రవాహ స్యందముగల, అద్రిరాజః ఇవ - పర్వత రాజువలె, ఆభాతి - ప్రకాశించుచున్నాడు. కొంచము ఎఱ్ఱగానున్న హరిచందనముచేత పూయఁబడిన శరీరము, ఇరు భుజములమీదనుండి క్రిందికి జాఱుచున్న ముత్యాలహారములు గల పాండ్యరాజు, లేతయెండకు ఎఱ్ఱబారిన సానుప్రదేశములును, పైనుండి క్రిందికి ప్రవహించుచున్న సెలయేటి కాల్వలును గల ఒక పర్వతమువలె ప్రకాశించుచున్నాఁడని భావము. అలంకారము: ఉపమ.

శ్లో. వింధ్యస్య సంస్తంభయితా మహాద్రేః
నిశ్శేష పీతోజ్ఝిత సింధురాజః
ప్రీత్యాఽశ్వమేధావభృథార్ద్రమూర్తేః
సౌస్నాతికో యస్య భవత్యగస్త్యః. 61

వ్యాఖ్య: వింధ్యస్య - వింధ్యయను, మహాద్రేః - మహా పర్వతమునకు, సంస్తంభయితా - స్తంభనము కలిగించిన వాఁడును (సూర్యగమనము నడ్డగించుటకై పెరుగుచున్న వింధ్యాద్రిని పెరగనీయక ఆపినవాఁడు). నిశ్శేష పీతోజ్ఝిత సింధురాజః - నిశ్శేషముగా పానము చేయఁబడి మరల వదలబడిన మహాసముద్రము గలవాఁడునైన, అగస్త్యః - అగస్త్య మహర్షి, అశ్వమేధావభృథార్ద్రమూర్తేః—అశ్వమేధావభృథ - అశ్వమేధయాగముయొక్క దీక్షాంత స్నానము నందు, ఆర్ద్రమూర్తేః - తడిసిన శరీరముగల. యస్య - యే పాండ్యరాజునకు,

ప్రీత్యా - స్నేహముచేత, సౌస్నాతికుఁడు - స్నానము చక్కఁగా జరిగెనా? యని అడుగువాఁడు, భవతి - అగుచున్నాఁడో. మహర్షి యగస్త్యునంతటివాఁ డితనికి మిత్రుఁడనియు, అతడు "అవభృథస్నానము చక్కఁగా చేసితివా?" అని యడుగుచుండుననియు భావము. "అవభృథ"మనగా యజ్ఞము, వివాహము మొదలయిన వైదిక కర్మలను దీక్షాపూర్వకముగా నిర్వహించి, ముగింపులో నదీ తటాకాదుల యందు చేయుస్నానము (ఈ యుత్సవమునందు స్నానముకంటె ముందు వసంతము (రంగులు) చల్లుకొనుటయుఁ గలదు). "సౌస్నాతికః" సుస్నాతం పృచ్ఛతి ఇతి సౌస్నాతికః అని వ్యుత్పత్తి. ఇట్లే "సౌఖశాయనికః" అని యగును. సుఖశాయినం పృచ్ఛతి ఇతి సౌఖశాయనికః (సుఖనిద్ర పట్టినదా? యని యడుగువాఁడని యర్థము).

శ్లో. అస్త్రం హరా దాప్తవతా దురాపం
యే నేంద్రలోకావజయాయ దృప్తః
పురా జనస్థాన విమర్దశంకీ
సంధాయ లంకాధిపతిః ప్రతస్థే. 62

వ్యాఖ్య: పురా - పూర్వము, జనస్థానవిమర్దశంకీ___జనస్థాన - ఖరాసుర నివాసమైన జనస్థానమునకు, విమర్ద - దేవతలవలని యుపద్రవమును, శంకీ - ఊహించువాఁడై, దృప్తః - గర్వితుండైన, లంకాధిపతిః - రావణుఁడు, దురాపం- దృప్తః - దుర్లభమైన, అస్త్రం - బ్రహ్మశిరోనామకాస్త్రమును, హరాత్ - శివుని వలన, ఆప్తవతా - పొందియుండిన, యేన - యే పాండ్య రాజుతో, సంధాయ - సంధి చేసికొని, ఇంద్రలోకావజయాయ - ఇంద్రలోకమునకు అపజయమును గలిగించుటకొఱకు (అనగా తాను స్వర్గమును జయించుటకొఱకు), ప్రతస్థే - బయలుదేరెనో. జనస్థానమునకు దేవత లుపద్రవమును గల్పింతురేమోయను శంకతో రావణుఁడు స్వర్గమునోడించి తన గుప్పిట నుంచుకొనఁ దలఁచెను. కాని పాండ్యుఁడు దేవతలకు సహాయమును జేయఁబూనెనేని తన యాట కట్టును. పాండ్యునిపద్ద శివప్రసాదలబ్ధమైన బ్రహ్మశిరోనామకమగు మహాస్త్రమున్నది. కనుక పాండ్యరాజుతోఁ సంధిచేసికొని స్వర్గముమీదికి దండెత్తెను. ఇంద్రునిసయితము జయించిన రావణునికి పాండ్యదేశాధీశుఁడన్న భయము. ఇట్టి మహావీరుని వరింపుమని సునంద యిందుమతి నుద్బోధించెనని భావము.

శ్లో. అనేన పాణౌ విధివద్ గృహీతే
మహాకులీనేన మహీవ గుర్వీ
రత్నానువిద్ధార్ణవ మేఖలాయా
దిశః సపత్నీ భవ దక్షిణస్యాః. 63

వ్యాఖ్య: మహాకులీనేన - గొప్ప వంశమునందు పుట్టిన, అనేన - ఇతని చేత, పాణౌ - నీ హస్తము, విధివత్ - శాస్త్ర ప్రకారముగా, గృహీతే (సతి) - గ్రహింపఁబడినదికాగా, గుర్వీ - గొప్పదియైన, మహీ, ఇవ - భూమివలె, రత్నానువిద్ధార్ణవ మేఖలాయాః — రత్నానువిద్ధార్ణవ - రత్నములచేత వ్యాప్తమై యున్న సముద్రమే, మేఖలాయాః - మొలనూలుగాఁ గలదైన, దక్షిణస్యాః దిశః - దక్షిణ దిక్కునకు, సపత్నీ - సవతివి, భవ - అగుము, ఇతనిచే పాలింపఁబడు భూదేవి దక్క మరియొక సవతి నీకుండదని సూచనచేయుచు గొప్ప వంశపువాఁడైన యితనిని వరించి దక్షిణ దిక్కుకు సపత్నివికమ్మని చెప్పెను.

శ్లో. తాంబూలవల్లీ పరిణద్ధ పూగా
స్వేలా లతా లింగిత చందనాసు
తమాల పత్రా స్తరణాసు శశ్వత్
ప్రసీద రంతుం మలయస్థలీషు. 64

వ్యాఖ్య: తాంబూలవల్లీపరిణద్ధపూగాసు — తాంబూలవల్లీ - తమలపాకుల తీగలచేత, పరిణద్ధ - చుట్టుకొనఁబడిన (ఆలింగనము చేసుకోఁబడిన), పూగాసు - పోకచెట్లు గలవియు, ఏలాలతాలింగిత చందనాసు - ఏలకి తీగలచేత ఆలింగనము చేసుకోబడిన గంధపుచెట్లు గలవియు, తమాలపత్రా స్తరణాసు—తమాలపత్ర - క్రానుగఆకులు, ఆస్తరణాసు - నేలపైఁ బఱచిన తివాచీలుగా గలవియునగు, మలయస్థలీషు - మలయ పర్వతముమీద నేలలయందు, శశ్వత్ - నిరంతరమును, రంతుం - క్రీడించుటకు, ప్రసీద - ప్రసన్నురాలవుకమ్ము. తమలపాకుల తీగల చేత చుట్టుకోబడిన పోకమ్రాకులు, ఏలకిలతలచేత చుట్టుకోబడిన శ్రీగంధము చెట్లునుగల మలయ పర్వతముమీద క్రానుగాకులు పరచిన నేలలపై నితనితో క్రీడించి సుఖింపుమని భావము.

శ్లో. ఇందీవరశ్యామ తను ర్నృపో౽సౌ
త్వం రోచనా గౌర శరీర యష్టిః
అన్యోన్యశోభా పరివృద్ధయే వాం
యోగ స్తటిత్తోయదయో రివాస్తు. 65

వ్యాఖ్య : అసౌ - ఈ, నృపః - రాజు, ఇందీవర శ్యామతనుః - కలువ వంటి నలుపుగల దేహమువాఁడు, త్వం - నీవు, రోచనాగౌర శరీరయష్టిః—రోచనాగౌర - గోరోచనమువంటి పచ్చని, శరీరయష్టిః - చక్కని శరీరము గలదానవు, తటిత్తోయదయోఃఇవ - మెఱుపుతీఁగ మేఘములకువలె, వాం - మీ యిద్దరికిని, యోగః - సంబంధము, అన్యోన్య శోభాపరివృద్ధయే - పరస్పర కాంతియొక్క అధిక్యముకొఱకు, అస్తు - అగునుగాక. కలువనలుపు మేనుగల యీ రాజుకును గోరోచనా కాంతిగల నీకును గలుగబోవు సంబంధము, మేఘమునకును మెఱవు తీగకును గల సంబంధమువలె రమణీయముగా నుండునని భావము.

శ్లో. స్వసు ర్విదర్భాధిపతే స్తదీయో
లేభే౽న్తరం చేతసి నోపదేశః
దివాకరాదర్శన బద్ధకోశే
నక్షత్రనాథాంశు రివారవిందే. 66

వ్యాఖ్య : విదర్భాధిపతేః - విదర్భరాజుయొక్క, స్వసుః - చెల్లెలియొక్క (ఇందుమతియొక్క), చేతసి - మనస్సునందు, తదీయః - ఆ సునందదియగు, ఉపదేశః - వాక్యము, దివాకరాదర్శన బద్ధకోశే—దివాకరాదర్శన - సూర్యుని అదర్శనముచేత, బద్ధకోశే - మొగ్గగా ముకుళించుకపోయిన, అరవిందే - కమలమునందు, నక్షత్రనాథాంశుః, ఇవ - చంద్రునియొక్క కిరణమువలె, అంతరం - అవకాశమును, నలేభే - పొందలేదు. సూర్యకిరణ స్పర్శకోసము ఎదురుచూచుచున్న తామరమొగ్గపై చంద్రకిరణము పడినను అది వికసించనట్లు, తనకు నచ్చువానికై యెదురుచూచుచున్న యిందుమతిచిత్తము ఆ రాజును చూచినను ఉన్ముఖమై వికసింపలేదని భావము.

శ్లో. సంచారిణీ దీపశిఖేవ రాత్రౌ
యం యం వ్యతీయాయ పతింవరా సా
నరేంద్ర మార్గాట్ట ఇవ ప్రపేదే
వివర్ణభావం స స భూమిపాలః. 67

వ్యాఖ్య : పతింవరా - భర్తను వరించునదియగు, సా - ఆ యిందుమతి, రాత్రౌ - రాత్రివేళయందు, సంచారిణీ - నడచుచున్న, దీపశిఖేవ (దీపశిఖా + ఇవ) - దీపజ్వాలవలె, యం యం - ఏ యే రాజును, వ్యతీయాయ - అతిక్రమించి వెళ్లెనో, సః సః - ఆయా, భూమిపాలః - రాజు, నరేంద్రమార్గాట్టః, ఇవ- నరేంద్రమార్గ - రాజవీథి యందలి, అట్టః ఇవ - అట్టాలమువలె, వివర్ణభావం - కాంతిహీనతను (ప్రకాశరాహిత్యమును), ప్రపేదే - పొందెను. నడచుచున్న దీపశిఖవంటి యిందుమతి యే యే రాజును వరింపక విడిచి ముందుకు సాగుచుండెనో ఆయా వెనుకబడిన రాజు ముఖము కాంతిహీనమై నల్లబడెను. అది యెట్లున్న దనగా రాజమార్గమునందు పెద్ద దివ్విటీని పట్టుకొని వెళ్లునప్పుడు వెనుకకు పోయిన మేడలమీది యట్టాలక గృహములు (మీది బాల్కనీల గదులు) చీకటిలోఁబడి ప్రకాశరాహిత్యమును పొందినట్లున్నదట. ఇది కాళిదాసు లోకానుభవమును సూచించుచున్నట్టి గొప్ప ఉపమాలంకారము. ఈ శ్లోకమువలన కాళిదాసుకు "దీపశిఖా కాళిదాసు" అని ప్రసిద్ధి కలిగినట్లు పరంపరాగతమైన అభియుక్తోక్తి.

శ్లో. తస్యాం రఘోః సూను రుపస్థితాయాం
వృణీత వా నేతి సమాకులోఽభూత్
వామేతరః సంశయ మస్య బాహుః
కేయూరబంధోచ్ఛ్వసితై ర్నునోద. 68

వ్యాఖ్య : తస్యాం ఉపస్థితాయాం - ఆ యిందుమతీదేవి సమీపించినది కాగా, రఘోః సూనుః - రఘుమహారాజుయొక్క కుమారుఁడు (అజుఁడు), వృణీత - వరించునా ? న వా - లేదా, ఇతి - ఇట్లని, సమాకులః, అభూత్ - సంశయము కలవాఁడాయెను, అస్య - ఈతనియొక్క, వామేతరః, బాహుః - కుడి భుజము, కేయూరబంధో చ్ఛ్వసితైః — కేయూరబంధ - భుజకీర్తులు కట్టుకొను

ప్రదేశముయొక్క, ఉచ్ఛ్వసితైః - అదరుపాటులచేత. సంశయం - సందేహమును, నునోద - పోగొట్టెను. ఇందుమతి తనవద్దికి వచ్చినప్పు డామె తనను వరించునా? లేదా? యని యజుఁడు సంశయించెను. కాని యతని కుడిభుజము పదేపదే యదరుచుండెను. అది శుభశకునము గావున నతని సంశయముతీరెను. శాకుంతలమునందును శకుంతలా దర్శనమునకన్న ముందుగా దుష్యంతుని భుజము అదరెను. "స్ఫురతిచ మే బాహుః కుతః ఫలమిహాస్య?" అని దుష్యంత వచనము.

శ్లో. తం ప్రాప్య సర్వావయవా ఽనవద్యం
న్యవర్తతా న్యోపగమాత్ కుమారీ
న హి ప్రఫుల్లం సహకార మేత్య
వృక్షాంతరం కాంక్షతి షట్పదాళిః. 69

వ్యాఖ్య: కుమారీ - ఇందుమతి, సర్వావయవానవద్యం - అన్ని అవయవములందును దోషరహితుఁడైన, తం - ఆ యజుని, ప్రాప్య - సమీపించి, అన్యోపగమాత్ - మరియొకనిని సమీపించుటనుండి, న్యవర్తత - మరలెను (ముందుకు వెళ్లుట మానెను), తథాహి - అంతేకదా! షట్పదాళిః - తుమ్మెదలబారు, ప్రఫుల్లం - బాగా పూచిన, సహకారం - తీయమామిడి చెట్టును, ఏత్య - చేరి, వృక్షాంతరం - మరియొక చెట్టును, న కాంక్షతి - కోరదు. సర్వోత్కృష్టమైన వస్తువు లభించినప్పుడు, మరియొక వస్తువుపై అభిలాష కలుగదు కనుక తనకు నచ్చిన వరుఁడైన అజుడు కనపడగానే ముందుకు సాగుట మానెనని భావము.

శ్లో. తస్మిన్ సమావేశిత చిత్తవృత్తి
మిందుప్రభా మిందుమతీ మవేక్ష్య
ప్రచక్రమే వక్తు మనుక్రమజ్ఞా
సవిస్తరం వాక్య మిదం సునందా. 70

వ్యాఖ్య: తస్మిన్ - ఆ యజునియందు, సమావేశిత చిత్తవృత్తిం - చేర్చఁబడిన మనోవ్యాపారము గలదియు, ఇందుప్రభాం - చంద్రునియొక్క కాంతి వంటి కాంతి గలదియునగు, ఇందుమతీం - ఇందుమతిని, అవేక్ష్య - చూచి, అను

క్రమజ్ఞా - పూర్వాపరవాక్య క్రమము నెఱిఁగినది యగు, సునందా - సునంద, సవిస్తరం - వివరములతోఁ గూడిన, ఇదం వాక్యం - ఈ చెప్పఁబోవు వాక్యమును, వక్తుం - చెప్పుటకు, ప్రచక్రమే - మొదలిడెను. ఇందుమతి యభిప్రాయమును గ్రహించిన సునంద అజుని పూర్వచరిత్రను చక్కని క్రమముతోఁ జెప్పుటకు ప్రారంభించెను.

శ్లో: ఇక్ష్వాకువంశ్యః కకుదం నృపాణాం
కకుత్స్థ ఇత్యాహితలక్షణోఽభూత్
కాకుత్స్థశబ్దం యత ఉన్నతేచ్ఛాః
శ్లాఘ్యం దధత్యుత్తర కోసలేంద్రాః 71

వ్యాఖ్య : ఇక్ష్వాకువంశ్యః - మనువు పుత్రుఁడైన యిక్ష్వాకుని వంశమునందు పుట్టినవాఁడును, నృపాణాం - రాజులలో, కకుదం - శ్రేష్ఠుడును, ఆహితలక్షణః - ప్రఖ్యాత గుణములు కలవాఁడును నగు, కకుత్స్థఃఇతి - కకుత్స్థుఁ డను రాజు, అభూత్ - ఉండెను; యతః - ఏకకుత్స్థుని నుండి (అతనితో ప్రారంభించి) ఉన్నతేచ్ఛాః - ఉన్నతాశయులైన, ఉత్తరకోసలేంద్రాః - ఉత్తర కోసలదేశాధిపతులైన దిలీపాదులు, శ్లాఘ్యం - ప్రసిద్ధమైన (మెప్పును బడసిన), కాకుత్స్థశబ్దం-కాకుస్థ అను శబ్దమును, దధతి - ధరించుచున్నారో ; కకుది (వృషభము మీద) తిష్ఠతి,ఇతి (కూర్చుండువాడు కనుక) కకుత్స్థః అని వ్యుత్పత్తి, కకుత్స్థస్య అపత్యం పుమాన్ 'కాకుత్స్థః' (కకుత్స్థుని పుత్రుఁడు, లేదా అవంశమున బుట్టినవాఁడు కాకుత్స్థుఁడు). పూర్వము విష్ణుమూర్తి యొక్క అంశావతారముగా, ఇక్ష్వాకువంశము నందు పురంజయుఁడను రాజు పుట్టెను, అతడు దేవతలతో కలిసి, వారి కోరిక ప్రకారము మహావృషభ రూపమును ధరించిన యింద్రునిపై నెక్కి, శివలీలావిలాసము గలవాఁడై నిఖిలమైన రాక్షస సంఘముష వధించి "కకుత్స్థః" అను బిరుదమును పొందెను. అ బిరుదము వంశమునకుఁ గీర్తిని దెచ్చునది కనుక నాటినుండి "ఇక్ష్వాకు వంశము" కకుత్స్థ వంశముగూడ నయ్యెను. కనుక ఆ వంశము వారికి "ఐక్ష్వాకులు కాకుత్స్థులు" అను రెండు పేర్లను గలిగి వాఙ్మయము నందు స్థిరపడినవి. ఉత్తర కోసల రాజుల కది యింటి పేరయ్యెను.

శ్లో. మహేంద్ర మాస్థాయ మహోక్షరూపం
యః సంయతి ప్రాప్తపినాకిలీలః

చకార బాణై రసురాంగనానాం
గండస్థలీః ప్రోషిత పత్రరేఖాః 72

వ్యాఖ్య: యః - ఏకకుత్థ్స మహారాజు, సంయతి - యుద్ధము నందు, మహోక్ష రూపం - ఆఁబోతు రూపము నొందిన, మహేంద్రం - దేవేంద్రుని, ఆస్థాయ - ఎక్కి, ప్రాప్తపినాకిలీలః - పొందబడిన శివవిలాసము గలవాఁడై బాణైః - బాణములచేత, అసురాంగనానాం - రాక్షస స్త్రీల యొక్క, గండస్థలీః - చెక్కిటి ప్రదేశములను, ప్రోషిత పత్రరేఖాః - ఎడబాసిన మకరికాది పత్ర రచనలు కలవానినిగా, చకార - చేసెనో, రాక్షస స్త్రీలు తమ భర్తలను కకుత్థ్సుడు చంపుట చేత వారు విధవలై సొగసు చేసికొనుట మానిరి కనుక వారి చెక్కిళ్లు మకరికాది పత్ర రచనలు లేని వయ్యెనని భావము.

శ్లో. ఐరావణాస్ఫాలన విశ్లథం యః
సంఘట్టయ న్నంగద మంగదేన
ఉపేయుషః స్వామపి మూర్తి మగ్ర్యా
మర్ధాసనం గోత్రభిదో ఽధితష్ఠౌ 73

వ్యాఖ్య: యః - ఏకకుత్థ్సరాజు, ఐరావణాస్ఫాలనవిశ్లథం—ఐరావణ- ఐరావతము యొక్క, ఆస్ఫాలన - అప్పళించుటచేత, విశ్లథం - వదులయిన, అంగదం - ఇంద్రుని భుజకీర్తిని, అంగదేన - తన భుజకీర్తితో, సంఘట్టయన్- రాచుకొనునట్లు చేయుచు, స్వాం, అగ్ర్యాం, మూర్తిం - తన శ్రేష్ఠమైన రూపమును ఉపేయుషః అపి - పొందియున్న వాఁడైనను, గోత్రభిదః - ఇంద్రుని యొక్క అర్ధాసనం - సింహాసనార్థ భాగమును, అధితష్ఠౌ - ఎక్కెనో, కకుత్థ్సుఁడు వృషభ రూప ధారియైన యింద్రుని బుజముపై నెక్కుటయేకాదు, రాక్షస వధానంతరము నిజరూప ధారియైన యింద్రుని ప్రక్కన నతని సింహాసనార్థ భాగమున తన భుజ కీర్తితో నింద్రుని భుజకీర్తిని రాచుకొనుచు గూర్చున్న గొప్ప పరాక్రమ వంతుఁ డని భావము. 'తష్ఠౌ' అను క్రియను "అధితష్ఠౌ" అని ప్రయోగించుట పాండితీ విశేషస్ఫోరకము.

శ్లో. జాతః కులే తస్య కిలోరుకీర్తిః
కులప్రదీపో నృపతి ర్దిలీపః

అతిష్ఠ దేకోన శతక్రతుత్వే
శక్రాభ్యసూయా వినివృత్తయే యః 74

వ్యాఖ్య: ఉరుకీర్తి: - గొప్ప కీర్తిగల వాఁడును, కులప్రదీపః - వంశ ప్రకాశకుఁడును అయిన, దిలీపః,నృపతిః - దిలీపుఁడనురాజు, తస్య - కూటస్థుఁడైన అకకుత్థ్సుని యొక్క, కులే - వంశమునందు. జాతఃకిల - పుట్టెను సుమా; యః - ఏదిలీపుఁడైతే, శక్రాభ్యసూయావినివృత్తయే - ఇంద్రుని యసూయ తొలఁగుటకై, ఏకోన శతక్రతుత్వే - ఒకటి తక్కువగా నూరశ్వమేధములు చేసిన వాని స్థానమునందు, అతిష్ఠత్ - నిలిచెనో; దిలీపుడు నూఱవ క్రతువును పూర్తి చేయఁగల శక్తియున్నను, ఇంద్రునికి తనపై నసూయ కలుగకుండుటకును, ఇంద్ర ప్రీతి కొఱకును, తొంబది తొమ్మిది అశ్వమేధ యాగములు మాత్రము చేసి విర మించెనని భావము.

శ్లో. యస్మిన్ మహీం శాసతి వాణినీనాం
నిద్రాం విహారార్ధపథే గతానామ్
వాతోఽపి నాస్రంసయ దంశుకాని
కో లంబయే దాహరణాయ హస్తమ్ 75

వ్యాఖ్య:: యస్మిన్ మహీం శాసతి - యే దిలీపమహారాజు భూమినిపాలించు చుండగా, విహారార్ధపథే - క్రీడా స్థానము యొక్క నగము దారి యందు, నిద్రాం- నిద్రను, గతానాం - పొందిన. వాణినీనాం - మత్తెక్కిన స్త్రీల యొక్క, అంశు కాని - వస్త్రములను, వాతోఽపి - గాలికూడా, నాస్రంసయత్ (న + అస్రంస యత్) - కదిలింప జాలకపోయెనో, ఆహరణాయ - ఆ వస్త్రములను లాగుట కొఱకు, కః - ఎవఁడు, హస్తం. లంబయేత్ - చేతిని జాచును ; దిలీపునిరాజ్యము నం దతని యాజ్ఞాప్రభావము వలన జార చోరత్వములు లేవనియు, ప్రజలు నిర్భయ ముగా సంచరించుచుండెడి వారనియు అందువలన మధుపానమత్తలైన స్త్రీల శీలము చెడకుండెననియు భావము. "వాణినీ నర్తకీ మత్తా విదగ్ధవనితాసు చ" అని విశ్వ కోశము, "మత్తా విదగ్ధా వాణిన్యౌ" అని యమరము. వాణిని యనగా మత్తెక్కిన మగువ.

శ్లో. పుత్రో రఘు స్తస్య పదం ప్రశాస్తి
మహాక్రతో ర్విశ్వజితః ప్రయోక్తా
చతుర్దిగావర్జిత సంభృతాం యో
మృత్పాత్రశేషా మకరో ద్విభూతిమ్ 76

వ్యాఖ్య : విశ్వజితః, మహాక్రతోః - 'విశ్వజిత్' అను పేరుగల మహా యాగము యొక్క, ప్రయోక్తా - అనుష్ఠాతయు (చేసినవాడైన), తస్యపుత్రః - ఆ దిలీపుని యొక్క కుమారుఁడునగు, రఘుః - రఘుమహారాజు, పదం - ఆస్థానమును (రాష్ట్రమును), ప్రశాస్తి - పాలించుచున్నాఁడు; యః - ఏ రఘుమహారాజు, చతుర్దిగా వర్జితసంభృతాం—చతుర్దిక్ - నాలుగుదిక్కుల నుండి, ఆవర్జిత - తేఁబడినదియు, సంభృతాం - కూడఁబెట్ట బడినదియు నగు, విభూతిం - సంపదను మృత్పాత్రశేషాం - మట్టి ముంత మాత్రమే మిగులుదల గల దానినిగా, అకరోత్ - చేసెనో. ఉన్నది, తెచ్చినది, కూడఁ బెట్టినదియునగు సంపదనంతటిని అయాగము నందు దానము చేసిన ఆ రఘుమహారాజు ప్రస్తుతము రాజ్యము చేయుచున్నాడు. "విశ్వజి ద్యాగము సర్వస్వ దక్షిణాకము" కనుక అట్లు చేసెను.

శ్లో. ఆరూఢ మద్రీ నుదధీన్ వితీర్ణం
భుజంగమానాం వసతిం ప్రవిష్టమ్
ఊర్ధ్వం గతం యస్య న చానుబంధి
యశః పరిచ్ఛేత్తు మియత్తయాఽలమ్ 77

వ్యాఖ్య : అద్రీన్ - పర్వతములను, ఆరూఢం - యెక్కినది, ఉదధీన్ - సముద్రములను, వితీర్ణం - దొచ్చుక పోయినది, భుజంగమానాం-వసతిం - సర్పములకు నివాసమైన పాతాళమును, ప్రవిష్టం - ప్రవేశించినది. ఊర్ధ్వం - స్వర్గాదికమును, గతం - చేరినది. (ఇట్లు) అనుబంధి - అవిచ్ఛన్నము కాలత్రయవ్యాపకమునైన, యస్య - ఏ రఘుమహారాజుయొక్క, యశః - కీర్తి, ఇయత్తయా - ఇంత అని తెలుపు దానిచేత, పరిచ్ఛేత్తుం - కొలుచుటకు, న,అలం - శక్యముకాదో; "అనుబధ్నాతి ఇతి అనుబంధి" అనగా తెంపులేనిది యని అర్థము. ఇయత్తయా - ఇంత ప్రదేశము నాక్రమించినది, ఇంత కాలముందును, అని దేశతః, కాలతః

కొలుచు కొలమానము చేత, పరిచ్ఛేత్తుం - కొలుచుటకు వీలులేని వైశాల్యము గల యశస్సు గలవాడు రఘు మహారాజు అని భావము.

శ్లో. అసౌ కుమార స్తమజోఽనుజాతః
త్రిపిష్టపస్యేవ పతిం జయంతః
గుర్వీం ధురం యో భువనస్య పిత్రా
ధుర్యేణ దమ్యః సదృశం బిభర్తి 78

వ్యాఖ్య : అజః - అజుఁడను పేరుగల, అసౌ,కుమారః - ఈ యువకుడు, త్రివిష్టపస్య,పతిం - స్వర్గమునకు అధిపతియగు నింద్రుని, జయంతః,ఇవ-జయంతుఁడువలె, తం - ఆ రఘుమహారాజును. అనుజాతః - అనుసరించి పుట్టిన వాఁడు (వంశక్రమమునందు రఘువు తరువాత అజుఁడు; రఘు మహారాజు పుత్రుడని యర్థము). దమ్యః - శిక్షణ నీయవలసిన వయస్సులోనున్న. యః-ఏయితఁడు. గుర్వీం - బరువైన, భువనస్య, ధురం - జగము యొక్క భారమును, ధుర్యేణ,పిత్రా - భారమును మోయఁగలిగిన తండ్రితో, సదృశం - సమానమగు నట్లుగా, బిభర్తి - మోయుచున్నాఁడో; రఘు మహారాజుతో కలిసి రాజ్యము చేయు చున్నాడు. ఒక కోడె మహావృషభముతో సమానముగా బరువును మోయుచున్నట్లు అన్న పోలిక స్ఫురించుటచేత, ఇది ఉపమాలంకారధ్వని. "దమ్యః, వత్సతరః" అనునవి కోడెపేర్లు. ఇచ్చటి "అనుజాత" శబ్దము పుత్రార్థకము.

శ్లో. కులేన కాంత్యా వయసా నవేన
గుణైశ్చ తై స్తై ర్వినయప్రధానైః
త్వ మాత్మన స్తుల్య మముం వృణీష్వ
రత్నం సమాగచ్ఛతు కాంచనేన 79

వ్యాఖ్య: కులేన - వంశముచేతను, కాంత్యా - లావణ్యము చేతను, నవేన వయసా - యౌవనము చేతను, వినయప్రధానైః - వినయము ముఖ్యముగాఁ గల, తైః తైః గుణైః చ - విద్యాశీలాదులగు నాయాగుణముల చేతను, ఆత్మనః, తుల్యం - నీకు తగిన వాడైన అముం - ఇతనిని (ఈయజమహా రాజును) త్వం - నీవు, వృణీష్వ - వరింపుము. రత్నం - మణి, కాంచనేన - బంగారముతో,

సమాగచ్ఛతు - కూడునుగాక. రత్నము కాంచనమువలె మిక్కిలి యానురూప్యము గల మీయుభయుల సమాగమము చూడ ముచ్చటగా నుండును కనుక వరింపుమని ఇందుమతిని బోధించెను.

శ్లో. తతః సునందా వచనావసానే
లజ్జాం తనూకృత్య నరేంద్రకన్యా
దృష్ట్యా ప్రసాదామలయా కుమారం
ప్రత్యగ్రహీత్ సంవరణస్రజేవ. 80

వ్యాఖ్య: తతః - తరువాత, సునందావచనావసానే - సునంద మాటలు ముగియగానే, నరేంద్రకన్యా - రాజకుమారి (ఇందుమతి), లజ్జాం - సిగ్గును, తనూకృత్య - తగ్గించుకుని, ప్రసాదామలయా - మనోనైర్మల్యము చేత తేటయైన, దృష్ట్యా - చూపుచేత, సంవరణ స్రజేవ - స్వయంవరణమాల చేతవలె, కుమారం - అజ మహారాజును, ప్రత్యగ్రహీత్ - అంగీకరించెను. ఇందుమతి అజుని చక్కగా ప్రేమతో చూచెననియు, అపేక్షణ పరంపర స్వయంవర మాలవలె నుండెననియు భావము. ఇచ్చటి ''కన్యా, కుమార, సంవరణ స్రజా'' అను పదములు మానసిక స్వయంవర వివాహము జరిగినట్లు సూచించుచున్నవి.

శ్లో. సా యూని తస్మిన్నభిలాషబంధం
శశాక శాలీనతయా న వక్తుమ్
రోమాంచలక్ష్యేణ స గాత్రయష్టిం
భిత్త్వా నిరాక్రామ దరాళకేశ్యాః. 81

వ్యాఖ్య: సా - ఆ యిందుమతి, యూని, తస్మిన్ - యువకుడైన ఆతని యందు, అభిలాషబంధం - ప్రేమబంధమును, శాలీనతయా - సిగ్గరితనము చేత, వక్తుం - చెప్పుటకు, న శశాక - శక్తురాలు కాకపోయెను. (అయినను) అరాళ కేశ్యాః - వంకరలు దీరిన శిరోజములుగల ఆ యిందుమతియొక్క, సః - ఆ ప్రేమబంధము, రోమాంచ లక్ష్యేణ - గగుర్పాటుయొక్క మిషచేత, గాత్రయష్టిం - చక్కని యామె శరీరమును, భిత్త్వా - పొడుచుకొని, నిరాక్రామత్ - బయటికి వచ్చెను. మనస్సులోనున్న ప్రేమ, పులకలరూపమున శరీరమునుండి వెలువడినట్లు

చేత సిగ్గుతో ఆమె చెప్పకపోయినను ఆమె యజమహారాజును ప్రేమించుచున్నట్లు సునందకు తెలిసెనని భావము.

శ్లో. తథాగతాయాం పరిహాసపూర్వం
సఖ్యాం సఖీ వేత్రభృ దాబభాషే
"ఆర్యే! వ్రజావో ఽన్యత" ఇత్యథైనాం
వధూ రసూయా కుటిలం దదర్శ. 82

వ్యాఖ్య: సఖ్యాం, తథాగతాయాం (సత్యాం) - స్నేహితురాలైన యిందుమతి అట్టి పరిస్థితి నొందినదికాగా (అనురాగ ప్రకటనమును చేయగా), సఖీ, వేత్రభృత్ - సఖియు, ప్రతీహారిణియు నగు సునంద, ఆర్యే! - ఓ పూజ్యురాలా, అన్యతః - మరియొక రాజువద్దికి, వ్రజావః - వెళ్లుదము, ఇతి - అని, పరిహాసపూర్వం - వేళాకోళముగా, ఆబభాషే - పలికెను, అథ - అంతట, వధూః - పెండ్లికూతురు కాబోవునట్టి యిందుమతి, ఏనాం - అట్లు పలికిన సునందను, అసూయాకుటిలం - ఇష్టములేని వంకరచూపుతో, దదర్శ - చూచెను. సునంద పతిప్రసక్షమునకై ముందుకుపద అని యనగా ఇందుమతి ఎందుకు? అని ప్రశ్నించుచున్న వంకరచూపు చూచెనని భావము.

శ్లో. సా చూర్ణగౌరం రఘునందనస్య
ధాత్రీకరాభ్యాం కరభోపమోరూః
ఆసంజయామాస యథాప్రదేశం
కంఠే గుణం మూర్త మివానురాగమ్. 83

వ్యాఖ్య: కరభోపమోరూః - కరభ - మణికట్టు మొదలు చిటికెనవ్రేలివరకుగల చేతిభాగము, ఉపమ - ఉపమానముగాఁగల, ఊరూః - తొడలు గలదైన, సా - ఆ యిందుమతి, చూర్ణగౌరం - కుంకుమ పొడిచేత ఎఱ్ఱనైన (లేదా పసుపుపొడిచేత పచ్చనిదైన), గుణం - మాలికను, మూర్తం - రూపమును ధరించిన, అనురాగమివ - ప్రేమనువలె, ధాత్రీకరాభ్యాం - దాదియైన సునంద చేతులతో, రఘునందనస్య - అజమహారాజుయొక్క, కంఠే - కంఠమునందు, యథాప్రదేశం - తగియైన చోట, ఆసంజయామాస - వేయించెను. బహుజన మధ్య

మున స్వయంవర మాలను స్వయముగా అజుని కంఠమునం దుంచుట యౌచిత్య కాదని, సరియైన ప్రదేశమును జూపుచు సునందతో ఆ స్వయంవరణ మాలను వేయించి యిందుమతి అజ మహారాజును వరించెనని భావము.

శ్లో. తయా స్రజా మంగళపుష్పమయ్యా
విశాల వక్షస్థల లంబయా సః
అమంస్త కంఠార్పిత బాహుపాశాం
విదర్భ రాజావరజాం వరేణ్యః. 84

వ్యాఖ్య: వరేణ్యః, సః - వరించుట కర్హుఁడైన ఆ యజమహారాజు, మంగళపుష్పమయ్యా - శుభపుష్పమయ మైనదియు, విశాల వక్షస్థలలంబయా - విశాలమైన తన వక్షస్థలమునందు వ్రేలాడుచున్న, తయా, స్రజా - ఇందుమతి తన కంఠమునందు వేసిన ఆ మాలికచేత, విదర్భరాజా వరజాం - భోజరాజు చెల్లెలైన యిందుమతీదేవిని, కంఠార్పిత బాహుపాశాం - తనకంఠము చుట్టుంచబడిన బాహువులు కలదానినిగా, అమంస్త - తలంచెను. ఇందుమతీ బాహుబంధన సౌఖ్యమును మనస్సున భావించు అజుఁడు ఆ మాలను తన వక్షస్థలమున యిష్టపూర్వకముగా ధరించెను.

శ్లో. శశిన ముపగతేయం కౌముదీ మేఘముక్తం
జలనిధి మనురూపం జహ్నుకన్యా ఽవతీర్ణా
ఇతి సమగుణయోగ ప్రీతయ స్తత్ర పౌరాః
శ్రవణకటు నృపాణా మేకవాక్యం వివవ్రుః. 85

వ్యాఖ్య: తత్ర - ఆ స్వయంవర మంటపమునందలి, సమగుణయోగ ప్రీతయః - సమాన గుణవంతులైన యిందుమతీ రఘునందనులయొక్క సంబంధముచేత ప్రీతినిజెందిన, పౌరాః - పురజనులు, ఇయం - అజునిఁ జేరిన ఈ యిందుమతి, మేఘముక్తం - మేఘములచేత విడువఁబడిన, శశినం - చంద్రుని (శరచ్చంద్రుని), ఉపగతా - చేరినట్టి, కౌముదీ - వెన్నెల, అనురూపం, జలనిధిం - తనకుఁదగిన సముద్రునిఁగూర్చి, అవతీర్ణా, జహ్నుకన్యా - ప్రవేశించిన గంగానది, ఇతి - అని, నృపాణాం, శ్రవణకటు - స్వయంవరమునకు వచ్చిన

రాజుల చెవులకు పరుషమైన, ఏకవాక్యం - ఒకేమాటను (పరస్పర విరుద్ధముగాని మాటను), వివవ్రుః - స్ఫుటముగాఁ బలికిరి. స్వయంవరమంటపమునందలి పుర జనులు ఈః యిందుమతి శరచ్చంద్రునిజేరిన కౌముది, సముద్రుని జేరిన గంగ అని ఐకకంఠ్యముగా బలికిరి. అది యితరరాజులకు శ్రుతికటువుగా నుండెను. చంద్ర చంద్రికా, జాహ్నవీ సాగరముల యౌపమ్యము ఇందుమతీ రఘునందనుల యవినాభావ సంబంధమును, ఆహ్లాదకర జీవితమును, పవిత్ర దాంపత్యమును సూచించుచున్నది.

శ్లో. ప్రముదిత వరపక్ష మేకత స్తత్
క్షితిపతి మండల మన్యతో వితానమ్
ఉషసి సర ఇవ ప్రఫుల్లపద్మం
కుముదవన ప్రతిపన్న నిద్ర మాసిత్. 86

వ్యాఖ్య: ఏకతః - ఒక ప్రక్కన, ప్రముదిత వరపక్షం - హర్షము చెందిన వరుని పక్షమైనదియు, అన్యతః - మరియొక ప్రక్కన, వితానం - సంతోష శూన్యమైనదియునగు, తత్, క్షితిపతి మండలం - ఆ స్వయంవరాగత రాజ సమూహము. ఉషసి - ప్రాతఃకాలమునందు, ప్రఫుల్ల పద్మం - వికసించిన కమలములు గలదియు, కుముదవన ప్రతిపన్న నిద్రం - ముకుళించిన కలువగుంపు గలదియునగు, సరః ఇవ - సరస్సువలె, ఆసీత్ - ఉండెను. ఇందుమతి వరింపని రాజులలో అజుని పక్షమువారి ముఖములు పద్మములుగాను ఇతరులవి ముకుళించిన కలువలుగాను గనపడుటచేత రాజమండలము కమలములును గలువలును-గల కాసారమువలె నున్నట్లు గోచరించెను.అజుని పక్షమువా రానందోత్ఫుల్ల వదనులు కాగా, అతని శత్రుపక్షమువారు ఖిన్నవదనులైరని తాత్పర్యము.

ఇది మహాకవి కాళిదాసకృత రఘువంశ కావ్యమున
షాఅవ సర్గమునకు
తెలుఁగు లఘువ్యాఖ్య

# మహాకవి కాళిదాసకృత రఘువంశము

## సప్తమ సర్గము

శ్లో. అథోపయంత్రా సదృశేన యుక్తాం
స్కందేన సాక్షాదివ దేవసేనాం
స్వసార మాదాయ విదర్భనాథః
పురప్రవేశాభిముఖో బభూవ. 1

వ్యాఖ్య : అథ - పిమ్మట, విదర్భనాథః - భోజుఁడు, సదృశేన - సమానుఁడైన, ఉపయంత్రా - వరునితో, యుక్తాం - కూడినదియు, సాక్షాత్, స్కందేన - ప్రత్యక్షముగా కుమారస్వామితో, యుక్తాం, దేవసేనాం ఇవ - కలుసుకొనియున్న దేవసేనవలె నున్న, స్వసారం - చెల్లెలిని (ఇందుమతిని), ఆదాయ - పిలుచుకొని, పురప్రవేశాభిముఖః - నగర ప్రవేశమునకు బయలుదేరినవాఁడు, బభూవ - అయ్యెను. స్వయంవర మండపము బహువిశాలముగా నుండవలసినట్టిది కనుక నగర బహిర్భాగమునందు దానిని తాత్కాలికముగా నిర్మించిరనియు, స్వయంవర కార్యము పూర్తికాగానే భోజుఁడు వధూవరులను నగర ప్రవేశమునకై తీసుకవెళ్లెననియు భావము.

శ్లో. సేనానివేశాన్ పృథివీక్షితోఽపి
జగ్ముర్విభాత గ్రహ మందభాసః
భోజ్యాం ప్రతి వ్యర్థమనోరథత్వాత్
రూపేషు వేషేషు చ సాభ్యసూయాః. 2

వ్యాఖ్య : భోజ్యాం ప్రతి - ఇందుమతిని గురించి, వ్యర్థమనోరథత్వాత్ - వృథయైన కోరికలుగలవా రగుటవలన, రూపేషు - తమ చక్కదనముల విషయమునను, వేషేషు చ - వస్త్రాలంకరణాది నేపథ్యముల విషయమునను, సాభ్యసూయాః - అసూయ కలవారును (వృథా అని నిందించుకొనుచున్నవారును),

  

మరియు, విభాత గ్రహమందహాసః—విభాత - ప్రాతఃకాలమునందలి, గ్రహ - చంద్రాది గ్రహములవలె, మందభాసః - తగ్గిపోయిన ముఖకాంతులు గలవారును నగు, పృథివీక్షితః, అపి - స్వయంవర మంటపమునకు వచ్చిన రాజులుసైతము, సేనానివేశాన్ - తమ తమ శిబిరములను (విడుదులను) జగ్మః - చేరిరి. ఇందు మతి తమను వరింపకపోవుటచేత తమతమ సౌందర్య వేష భూషాదులు వృథాయని నిందించుకొనుచు తమ విడుదులకు వెళ్లిపోయిరి.

శ్లో. సాన్నిధ్యయోగాత్ కిల తత్ర శచ్యాః
స్వయంవర క్షోభకృతా మభావః
కాకుత్స్థ ముద్దిశ్య సమత్సరోఽపి
శశామ తేన క్షితిపాలలోకః. 3

వ్యాఖ్య : తత్ర - ఆ స్వయంవర మంటపమువందు, శచ్యాః - ఇంద్రుని భార్యయగు శచీదేవియొక్క, సాన్నిధ్యయోగాత్ - సన్నిధి సంబంధము వలన (శచీదేవి అచ్చట నుండుటవలన), స్వయంవరక్షోభకృతాం - స్వయంవరమునకు విఘ్నము కలిగించువారియొక్క, అభావః, కిల - లేకపోవుట జరిగినదిసుమా! తేన - ఆ కారణముచేతనే, కాకుత్స్థం, ఉద్దిశ్య - ఆ యజమహారాజును గుఱించి, సమత్సరః, అపి - వైరము కలదియైనను, క్షితిపాలలోకః - రాజసమూహము, శశామ - శాంతి వహించియుండెను. స్వయంవరవిఘ్నములు శచీదేవిచేత నశింపఁ జేయబడుచుండునని యాగమశాస్త్రము. కనుక అల్లరి చేయఁ దలచిన భగ్న మనోరథుల ఆట సాగలేదని భావము.

శ్లో. తావత్ప్రకీర్ణాభినవోపచార
మింద్రాయుధ ద్యోతిత తోరణాంకమ్
వరః స వధ్వా సహ రాజమార్గం
ప్రాప ధ్వజచ్ఛాయ నివారితోష్ణమ్. 4

వ్యాఖ్య : తావత్ప్రకీర్ణాభినవోపచారం (తావత్ + ప్రకీర్ణ + అభినవ + ఉపచారం) - పూర్తిగా చల్లబడిన క్రొత్తపువ్వులు మొదలయిన ఉపచారములు గలదియును, ఇంద్రాయుధద్యోతిత తోరణాంకం - ఇంద్రధనుస్సులవలె ప్రకాశించు

చున్న తోరణములతో కూడినదియు, ధ్వజచ్ఛాయ నివారితోష్ణం - జెండాల నీడచే తొలగింపఁబడిన యెండ గలదియునగు, రాజమార్గం - నగరమునందలి ప్రధానమార్గమును, సః, వరః - ఆ వరుఁడైన యజుఁడు, వధ్వాసహ - వధువైన ఇందుమతితో గూడ, ప్రాప - ప్రవేశించెను. నవవధువగు ఇందుమతితో సహ అజుడు తోరణములు, జెండాలుకట్టి పూలుచల్లిన నగర రాజమార్గమునందు ప్రవేశించెను. ''యావత్తావచ్చసాకల్యే'' అని యమరము. కనుక యిచ్చట 'తావత్' అనగా పూర్తిగా (అంతట) అని యర్థము. కనుకనే తెలుఁగులో మొత్తము అను అర్థమునందు "యావత్తు" అని యనుచుందురు.

శ్లో. తత స్తదాలోకన తత్పరాణాం
సౌధేషు చామీకరజాలవత్సు
బభూవు రిత్థం పురసుందరీణాం
త్యక్తాన్యకార్యాణి విచేష్టితాని. 5

వ్యాఖ్య: తతః - తరువాత, చామీకరజాలవత్సు - బంగారు గవాక్షములు (కిటికీలు) కలవియగు, సౌధేషు - మేడలయందు, తదాలోకన తత్పరాణాం— తత్ - అజుని, ఆలోకన - చూచుటయందు, తత్పరాణాం - ఆసక్తిగల, పురసుందరీణాం - నగరస్త్రీలయొక్క, త్యక్తాన్యకార్యాణి - విడిచిపెట్టబడిన యితర కార్యములుగల (కేశాలంకరణ వస్త్రధారణాది కార్యములు), విచేష్టితాని - వ్యాపారములు (ప్రవృత్తులు), ఇత్థం, బభూవుః - ఇకముందు చెప్పఁబోవు రీతిగా జరిగినవి. (ఇత్థం - ఇట్లు) ఆ స్త్రీల చేష్టలు ఈ క్రింది యైదు శ్లోకములలో వర్ణింపఁబడినవి. నగరస్త్రీలు తమ పనులు విడిచి ఊరేగింపుగా వచ్చుచున్న వధూవరులను జూచుటకు మేడలమీది కిటికీల వద్దికిఁ జేరుచుండిరి.

శ్లో. ఆలోకమార్గం సహసా వ్రజంత్యా
కయాచి దుద్వేష్టన వాంతమాల్యః
బంధుం న సంభావిత ఏవ తావత్
కరేణ రుద్ధోఽపి చ కేశపాశః. 6

వ్యాఖ్య: సహసా - హఠాత్తుగా, ఆలోకమార్గం - గవాక్షము వద్దికి, వ్రజంత్యా - వెళ్లుచున్న, కయాచిత్ - ఒకానొక పురకాంతచేత, ఉద్వేష్టనవాంత

మాల్యః—ఉద్వేష్టన - ఊడిపోయిన ముడి కలదియగుటచేత, వాంత - జారిపడిన, మాల్యః - పూలదండకలదియు, కరేణ - చేతితో, రుద్ధః, అపి (రుద్ధోఽపి) - పట్టుకోబడినదై నను, కేశ పాశః - కేశకలాపము (జుట్టు), తావత్ - అంతవఱకు (కిటికీవద్దకు చేరువరకు), బంధుం - ముడివేసికొనుటకు, న, సంభావితః, ఏవ - అలోచింపఁ బడనేలేదు. కొప్పుముడి యూడుటచేత జారిపడిన పూలదండ గల జుట్టును చేతితో పట్టుకొనియే కిటికీవద్దికి హఠాత్తుగా పరుగెత్తిన ఒక సుందరి జుట్టు ముడివేసుకొను విషయమునే మరచినదని భావము. నవ దంపతులను జూడవలె నను త్వరతో నామె యట్లు ప్రవర్తించినది. వాంత - జాఱిన; ఇది గౌణ ప్రయోగము. శబ్దార్థమును వాచ్యముగాఁ జెప్పినచో క్రక్కిన, వమనము చేయబడిన యని చెప్పవలెను, అట్లు చెప్పరాదు. గౌణవృత్తి నాశ్రయించియే చెప్పవలెను. "నిష్ఠ్యూతో ద్గీర్ణ వాంతాది గౌణవృత్తి వ్యపాశ్రయం, అతిసుందర మన్యత్ర గ్రామ్య కక్షాం విగాహతే", అని దండి.

శ్లో. ప్రసాధికా లంబిత మగ్రపాద
మాక్షిప్య కాచిత్ ద్రవరాగ మేవ
ఉత్సృష్ట లీలాగతి రాగవాక్షాత్
అలక్తకాంకాం పదవీం తతాన. 7

వ్యాఖ్య: కాచిత్ - ఒకానొక సుందరి, ప్రసాధికాలంబితం - అలంకారము చేయు దాసిచేత పట్టుకోబడిన, అగ్రపాదం - పాదాగ్రమును, ద్రవరాగం. ఏవ - దవ రూపమైన లత్తుక కలదానినిగానే, ఆక్షిప్య - లాగుకొని, ఉత్సృష్టలీలాగతిః - విడిచి పెట్టబడిన మంద గమనము కలదియగుచు (త్వరత్వరగా పరుగెత్తుచు), ఆగవాక్షాత్ - కిటికీ వరకుండిన, పదవీం - దారిని, అలక్తకాంకాం - లాక్షారసము చేత గుర్తులు కలదానినిగా, తతాన - విస్తరింపజేసెను. కారుచున్న లాక్షారసముతో మందగమనమును వదలి పరుగెత్తుట చేత కిటికీ దారి యంతయు లక్క గుర్తులు పడెననియు, ఆకాంత, తన యలంకారమును, సహజగమనమును. మరచి వధూవరులను జూచుటకు కిటికీ వద్దికి పరుగెత్తె ననియు భావము. "అగ్రపాదం" పాదాగ్రం అనుటకు బదులిట్లు ప్రయోగించెను, "అగ్రశ్చాసౌ పాదశ్చ అగ్రపాదః" అని కర్మధారయ సమాసమును జెప్పవలెను. ఇట్టి ప్రయోగములను "హస్తాగ్రా

గ్రహాస్త్రాదయో గుణ గుణినోర్భేదాభేదాభ్యామ్” అని, కావ్యాలంకార సూత్రకర్త యగు వామనుఁడు సమర్థించెను. ఇచ్చట “తతాన” యను క్రియ దారివిండుగా లాక్షారసమయ్యెనని తెలుపును.

శ్లో. విలోచనం దక్షిణ మంజనేన
సంభావ్య తద్వంచిత వామనేత్రా
తథైవ వాతాయన సన్నికర్షం
యయౌ శలాకా మపరా వహంతీ

వ్యాఖ్య: అపరా - మరియొక సుందరి, దక్షిణం, విలోచనం - కుడి కంటిని, అంజనేన - కాటుకచేత, సంభావ్య - అలంకరించుకొని, తద్వంచిత వామనేత్రా—తత్ - ఆ కాటుకచేత, వంచిత - మోసగింపఁబడిన. అనగా వర్జింపఁబడిన, వామనేత్రా - ఎడమ కన్ను గలది యగుచు (ఎడమ కంటికి కాటుకపెట్టుకొనక౹ తథైవ - అట్లే, శలాకాం - కాటుకకుంచెను, వహంతీ - పట్టుకొన్నది యగుచు, వాతాయన సన్నికర్షం - గవాక్ష సమీపమును, యయౌ - చేరెను. ఒక సుందరి ఒక్క కంటికే కాటుకను బెట్టుకొని పరుగెత్తెను. ‘దక్షిణం’ అనుట, త్వరచేత మొదట వామనేత్రమునకు బెట్టుకొనుట మరచెనని సూచించుటకు. సవ్యం హిపూర్వం మనుష్యా అంజతే” అను శ్రుతివలన మొదట సవ్యం అనగా ఎడమ కంటిని అలంకరించుకొనవలెను. అట్టి యాచారమును వధూవర దర్శన లాలసత్వమున మరచెనట.

శ్లో. జాలాంతర ప్రేషిత దృష్టి రన్యా
ప్రస్థానభిన్నాం న బబంధ నీవీమ్
నాభిప్రవిష్టాభరణ ప్రభేణ
హస్తేన తస్థా వవలంబ్య వాసః

వ్యాఖ్య: అన్యా - మరియొక్క స్త్రీ, జాలాంతరప్రేషితదృష్టిః—జాలాంతర - గవాక్ష మధ్యమునుండి, ప్రేషిత - పంపబడిన, దృష్టిః - చూపుగలది యగుచు (గవాక్షమునుండి చూచుచు), ప్రస్థానభిన్నాం - శీఘ్రగమనముచేత ఊడిపోయిన, నీవీం - చీరముడిని, నబబంధ - మరల ముడివేసుకోలేదు; (కాని)

నాభిప్రవిష్టాభరణప్రభేణ—నాభిప్రవిష్ట - బొడ్డున ప్రవేశించిన, ఆభరణప్రభేణ- రత్నాంగుళీయక,కంకణాద్యాభరణముల యొక్క కాంతులుగల, హస్తేన - చేతితో వాసః - సడలిన వస్త్రమును, అవలంబ్య - పట్టుకొని. తస్థౌ-నిలుచుండెను (ఊడిన చీరముడిని మరల బిగించుకొను నంతటి యవకాశము లేక ఒక సుందరి వధూవరు లను చూచుటకు నిలుచుండె నవియు, ఆమె హస్తము నందలి రత్నాభరణముల కాంతులే నాభి ప్రదేశమును గప్పివైచి అక్కడ వస్త్రములేని లోపమును దీర్చె ననియు భావము.

శ్లో. అర్ధాంచితా సత్వర ముత్థితాయాః
పదే పదే దుర్నిమితే గలంతీ
కస్యాశ్చి దాసీ ద్రశనా తదానీం
అంగుష్ఠమూలార్పిత సూత్ర శేషా. 10

వ్యాఖ్య : సత్వరం,ఉత్థితాయాః - తొందరపాటున లేచి నిలుచున్న, కస్యా శ్చిత్ - ఒకానొక సుందరి యొక్క, అర్ధాంచితా - సగము కూర్చబడిన మణులు కలదియై, దుర్నిమితే - వ్యత్యస్తముగా వేయబడిన (సంభ్రమము వలన), పదే పదే - ప్రతి యడుగు నందును, గలంతీ - జారుచున్న రత్నములు గలది యగుచున్న, రశనా - మేఖల (మొలనూలు). తదానీం - అప్పుడు, అంగుష్ఠమూలార్పిత సూత్రశేషా—అంగుష్ఠమూల - చేతిబొట్టన వేలి మొదట. అర్పిత - ఉంచఁబడిన, సూత్ర - దారమే, శేషా - మిగిలినదిగాఁగలది, ఆసీత్ - అయ్యెను. తన మొల నూలుకు రత్నము లెక్కించు కొనుచున్న ఒక యంగన హఠాత్తుగా లేచి, గబగబ వెళ్లుచున్నందున ఆమేఖల యందు సగము కూర్చిన రత్నము లడుగడుగునను జారి పోయి చివరికా మేఖల బొట్టన వ్రేలికి చుట్టుకున్న దారము మాత్రమే మిగిలి యుండెనని భావము.

శ్లో. తాసాం ముఖై రాసవగంధ గర్భైః
వ్యాప్తాంతరాః సాంద్ర కుతూహలానామ్
విలోల నేత్రభ్రమరై ర్గవాక్షాః
సహస్రపత్రాభరణా ఇవాసన్. 11

వ్యాఖ్య : అప్పుడు,సాంద్రకుతూహలానాం - మిక్కుటమైన కుతూహలము గల, తాసాం - ఆ పురస్త్రీల యొక్క, ఆసవగంధగర్భైః - పానీయముల పరిమళము గలవియు (ఆసవ గంధము గర్భమునందు కలవి), విలోలనేత్రభ్రమరైః- చంచలములగు నేత్రములను తుమ్మెదలు గలవియునగు, ముఖైః - ముఖముల చేత, వ్యాప్తాంతరాః - కప్పబడిన మధ్యభాగములుగల, గవాక్షాః - గవాక్షములు, సహస్రపత్రాభరణాఃఇవ—సహస్రపత్ర - కమలములు, ఆభరణాఇవ - ఆభరణములుగాగలవి వలె, ఆసన్ - ఉండినవి. గవాక్షముల యందు మూగి చూచుచున్న ఆ పుర సుందరుల ముఖములచేత నిండిన గవాక్షములు కమలాలంకృతములైనట్లుగాఁ గనపడెనని భావము. కమలముల యందు పరిమళముండుట, దళములు చలించుట సహజము. వాటిపోలిక సరిపోవుటకై నారీ ముఖములందు మత్తు పానీయముల పరిమళము, నేత్రముల చంచలత్వమును కూర్పఁబడినది. అలంకారము: ఉత్ప్రేక్ష.

శ్లో. తా రాఘవం దృష్టిభి రాపిబంత్యో
నార్యో న జగ్ము ర్విషయాంతరాణి
తథాహి శేషేంద్రియవృత్తిరాసాం
సర్వాత్మనా చక్షు రివ ప్రవిష్టా. 12

వ్యాఖ్య: తాఃనార్యః - ఆపురస్త్రీలు, రాఘవం - రఘుకుమారుఁడైనయజుని, దృష్టిభిః - కన్నులతో, ఆపిబంత్యః - త్రాగుచున్నవారగుచు (మిక్కిలి యాసక్తితో చూచుచున్న వారగుచు), విషయాంతరాణి - అన్య విషయములను, న జగ్ముః- తెలిసికొన లేకపోయిరి. తథాహి - అదియట్లే, ఆసాం ఆస్త్రీలయొక్క, శేషేంద్రియవృత్తిః—శేష - కన్నులుకాక తక్కిన, ఇంద్రియ - శ్రోత్రాదులైన యింద్రియముల యొక్క, వృత్తిః - వ్యాపారము, సర్వాత్మనా - సంపూర్ణ స్వస్వరూపము చేత, చక్షుః - నేత్రేంద్రియమును, ప్రవిష్టా, ఇవ - ప్రవేశించినదివలె నున్నది. ఆ పుర స్త్రీలు అజమహారాజును ఆసక్తితో చూచుచున్నప్పుడు వారికి ప్రక్కవారి మాటలుగాని, స్పర్శగాని యెఱుక పడుట లేదు. అట్లగుటకు, శ్రవణాదీంద్రియములు అజరూపమును సాక్షాత్తుగా అనుభవింపఁజాలక చక్షురింద్రియము నందే తాము సర్వాత్మ నా ప్రవేశించి యట్టి యనుభవమును పొందుచుండుటయే కారణము కాఁబోలునని భావము, అలంకారము: ఉత్ప్రేక్ష.

  

శ్లో. స్థానే వృతా భూపతిభిః పరోక్షైః
స్వయంవరం సాధు మమంస్త భోజ్యా
పద్మేవ నారాయణ మన్యథాసౌ
లభేత కాంతం కథ మాత్మతుల్యమ్ 13

వ్యాఖ్య : ఈశ్లోకము మొదలు మూడు శ్లోకములలో పౌర స్త్రీలు వధూవరుల యానురూప్య, సౌందర్యములను గూర్చి ముచ్చటించుకొనుట వర్ణింపఁబడినది. భోజ్యా - ఇందుమతి, పరోక్షైః - తనచే చూడబడని, భూపతిభిః-రాజులచేత, వృతా - వరింపబడినదైనను, స్వయంవరం - స్వయంవరమును, సాధుం-మేలైన దానినిగా, అమంస్త - తలచినది, స్థానే - ఇది యుక్తముగా నున్నది (తనను కోరుచున్న ఒక రాజును తాను చూడకయే వరించుటకంటె స్వయం వరమును ప్రకటింప మనుట యుక్తముగా నున్నదని భావము). అన్యథా - అట్లు కానిచో, అసౌ - ఈయిందుమతి, పద్మా - లక్ష్మీదేవి, నారాయణం,ఇవ - విష్ణుమూర్తినివలె, ఆత్మతుల్యం - తనకు తగిన, కాంతం - పతిని, కథంలభేత - ఎట్లు పొందఁగలిగి యుండును? సదసద్వివేక సౌకర్యము స్వయంవరము నందే కలదు, కనుక తగిన భర్తను ఎన్నుకొనఁ గలుగుటకు తగిన యవకాశము ఇందుమతికి లభించినదని పౌరస్త్రీలు ముచ్చటించుకొనిరి. పద్మం అస్యాః అస్తి ఇతి పద్మా అని వ్యుత్పత్తి. "అర్శ ఆదిభ్యోఽచ్" అని వ్యాకరణసూత్రము. "స్థానే" యుక్తమే అను నర్థముగల అవ్యయము. భోజ్యా - భోజస్య అపత్యం స్త్రీ 'భోజ్యా' అని వ్యుత్పత్తి.

శ్లో. పరస్పరేణ స్పృహణీయ శోభం
నచే దిదం ద్వంద్వ మయోజయిష్యత్
అస్మిన్ ద్వయే రూపవిధానయత్నః
పత్యుః ప్రజానాం వితథోఽభవిష్యత్. 14

వ్యాఖ్య : స్పృహణీయశోభం - వాంఛనీయమైన సౌందర్యముగల, ఇదం, ద్వంద్వం - ఈ జంటను, పరస్పరేణ - ఒకరితో నొకరిని, న, అయోజయిష్యత్, చేత్ - కూర్చకపోయి యుండినచో, ప్రజానాం, పత్యుః - బ్రహ్మదేవునియొక్క, అస్మిన్, ద్వయే - ఈ జంటయందలి, రూపవిధానయత్నః - సౌందర్య నిర్మాణ

ప్రయాసము, వితథః - విఫలమైనది, అభవిష్యత్ - అయియుండ గలిగెడిది (వీరికి వీరేకాని, ఇందుమతికిఁ దగిన మరియొక పురుషుడుగాని, అజునికిఁ దగిన మరియొక స్త్రీగాని సృష్టిలోలేరు) కనుక తన సృష్టినైపుణ్యము సఫలమగునట్లు బ్రహ్మ ఈ జంటను గూర్చెనని భావము.

శ్లో. రతిస్మరౌ నూన మిమా వభూతాం
రాజ్ఞాం సహస్రేషు తథాహి బాలా
గతేయ మాత్మప్రతిరూప మేవ
మనోహి జన్మాంతర సంగతి జ్ఞమ్. 15

వ్యాఖ్య: రతిస్మరౌ - (నిత్యసహచరులైన) రతిమన్మథులు, నూనం - నిజముగా, ఇమౌ - ఈ యిద్దఱుగా (దంపతులుగా), అభూతాం - అయిరి, తథాహి - అది యట్లే, ఇయం, బాలా - ఈ పడుచు, రాజ్ఞాం, సహస్రేషు - రాజులయొక్క సహస్రములయందు (అంతమంది రాజులలో). ఆత్మప్రతిరూపం, ఏవ - తనకు తగినవానినే, గతా - చేరినది, హి - ఎందువల్లనైతే, మనః - మనస్సు, జన్మాంతరసంగతిజ్ఞం—జన్మాంతర - ఇతర జన్మమునందలి, సంగతిం - సంబంధమును, జ్ఞం - ఎఱుఁగునట్టిదో, లేదా, మనః - మనస్సు, జన్మాంతరసంగతిజ్ఞం, హి - జన్మాంతర సంబంధము నెఱుఁగునట్టిదికదా। ఈ దంపతులు పూర్వజన్మమునందు రతిమన్మథులు. కనుక పూర్వజన్మవాసనతో ఇందుమతి అందఱు రాజులలో తన భర్తయైన అజమహారాజునే వరించినదని యనుకొనిరి. అదియే ఇది యను ప్రత్యభిజ్ఞానము లేకున్నను, వాసనా విశేషమువలన మనస్సు జన్మాంతర సంబంధమును గుర్తించును. కనుక ఇచ్చట జన్మాంతర సాహచర్యమే ప్రవర్తకమని భావము.

శ్లో. ఇత్యుద్గతాః పౌరవధూ ముఖేభ్యః
శృణ్వన్ కథాః శ్రోత్రసుఖాః కుమారః
ఉద్భాసితం మంగల సంవిధాభిః
సంబంధినః సద్మ సమాససాద. 16

వ్యాఖ్య: ఇతి - ఈ విధముగా ('స్థానేవృతా' అను శ్లోకము మొదలుకొని చెప్పఁబడినరీతిగా), పౌరవధూముఖేభ్యః - పురస్త్రీల ముఖములనుండి, ఉద్గతాః -

  

బయలువెడలినవియు, శ్రోత్రసుఖాః - చెవులకింపయినవియునగు, కథాః - ప్రసంగములను, శృణ్వన్ - వినుచు, కుమారః - అజుఁడు, మంగలసంవిదాభిః - శుభసూచక వస్తురచనలచేత (మామిడి తోరణములు, పుష్పమాలాద్యలంకారములు కూర్చుటచేత), ఉద్భాసితం - ఎక్కువగా ప్రకాశించునట్లు చేయఁబడిన, సంబంధినః, సద్మ - కన్యాదాతయొక్క గృహమును, సమాససాద - చేరెను. అట్లు చెవులకింపయిన పౌరస్త్రీ వచనములను వినుచు అజుడు అలంకరింపబడిన పెండ్లి యింటిలో ప్రవేశించెను. "సంబంధి" అనగా వియ్యముచేసిన వ్యక్తి. ఇప్పటికిని "ఈతఁడు మా సంబంధి" అనుట వ్యవహారమునందున్నది.

శ్లో. తతోఽవతీర్యాశు కరేణుకాయాః
స కామరూపేశ్వర దత్త హస్తః
వైదర్భ నిర్దిష్ట మథో వివేశ
నారీమనాంసీవ చతుష్క మంతః. 17

వ్యాఖ్య: తతః - అనంతరము, కరేణుకాయాః - ఆడయేనుఁగుపైనుండి, ఆశు - శీఘ్రముగా, అవతీర్య - దిగి, కామరూపేశ్వర దత్తహస్తః - కామరూపదేశాధిపతిమీద ఉంచబడిన చేయికలవాడైన అజుఁడు. అథో - వెంటనే, వైదర్భ నిర్దిష్టం - భోజునిచేత చూపఁబడిన, అంతఃచతుష్కం - చతుశ్శాల భవంతిలోని భాగమును, నారీమనాంసి, ఇవ - అచ్చటి స్త్రీల మనస్సులనువలె, వివేశ - ప్రవేశించెను. అజుని యెక్కించుకొని వచ్చినది ఆడయేనుఁగుమీద, అది శుభకరము, భయరహితమును గనుక, మగయేనుఁగుకు హఠాత్తుగా మదమెక్కవచ్చును కనుక శుభకార్యములందు కరేణుకనువాడుట సంప్రదాయము. స్త్రీల మనస్సులందు ప్రవేశించినట్లని చెప్పుట అజుని సౌందర్య విశేష ద్యోతకము.

శ్లో. మహార్హ సింహాసన సంస్థితోఽసౌ
సరత్న మర్ఘ్యం మధుపర్కమిశ్రమ్
భోజోపనీతం చ దుకూలయుగ్మం
జగ్రాహ సార్ధం వనితాకటాక్షైః. 18

వ్యాఖ్య: మహార్హసింహాసన సంస్థితః - ఎక్కువ విలువగల సింహాసనమునందు కూర్చునియున్న, అసౌ - ఈ యజుఁడు, భోజోపనీతం (భోజ + ఉప

నీతం) - భోజునిచేతఁ గొనిరాబడిన, సరత్నం - రత్నసహితమైనదియు, మధు పర్కమిశ్రం - మధుపర్కముతో కూడినదియు నగు, అర్ఘ్యం - పూజాసాధన వస్తుసామగ్రిని, దుకూలయుగ్మంచ - పట్టుపంచల జతనుగూడ, వనితాకటాక్షైః సార్థం - అచ్చటచేరిన వనితల క్రేగంటి చూపులతోగూడ, జగ్రాహ - స్వీకరించెను. వనితలు ఆ పెండ్లికొడుకు చక్కదనమునకు మనస్సులు చలించి క్రేఁగంటి చూపులతోఁ జూచుటను అజుడు గ్రహించెననియు మధుపర్కాలను స్వీకరించెననియు భావము. "మధుపర్కము" అనఁగా దధిమధుమిశ్రమము (పెరుగును, తేనెను కలిపి యుంచినది) దీనిని కన్యాదాత వరునికి కన్యాదానము చేయునపుడు ముందుగా ఇచ్చి తీర్థమువలె తీసుకొనునట్లు చేయవలెను. ఈ సమయమునందిచ్చు వస్త్రములకు "మధుపర్కములు" అని లోకవ్యవహారము.

శ్లో. దుకూలవాసాః స వధూసమీపం
నిన్యే వినీతై రవరోధరక్షైః
వేలాసకాశం స్ఫుట ఫేనరాజీ
ర్నవై రుదన్వా నివ చంద్రపాదైః. 19

వ్యాఖ్య: దుకూలవాసాః - తెల్లని పట్టువస్త్రములు ధరించిన, సః - ఆ యజమహారాజు, వినీతైః - నమ్రులైన, అవరోధరక్షైః - అతఃపురోద్యోగుల చేత, వధూసమీపం - పెండ్లికూతురు వద్దికి, స్ఫుటఫేనరాజీః - స్పష్టమైన నురుగుల బారులుగల, ఉదన్వాన్ - సముద్రుఁడు, నవైః, చంద్రపాదైః - క్రొత్త చంద్రకిరణములచేత, వేలావకాశం, ఇవ - చెలియలికట్ట వద్దికివలె, నిన్యే - చేర్చఁబడెను. తెల్లని వస్త్రములు ధరించిన యజుఁడు చంద్ర కిరణములచేత సముద్రుఁడు వేలా సమీపమునకువలె వధువుపద్దికి తీసుకపోబడెను. వధూ వేలా శబ్దములు స్త్రీ లింగము లగుటచేతను, ఇతర పదసామ్యముచేతను ఇచ్చట దృష్టాంతాలంకారము.

శ్లో. తత్రార్చితో భోజపతేః పురోధాః
హుత్వాగ్ని మాజ్యాదిభి రగ్నికల్పః
తమేవ చాధాయ వివాహ సాక్ష్యే
వధూవరౌ సంగమయాంచకార. 20

వ్యాఖ్య: తత్ర - అచ్చట (విదర్భ రాజభవనమునందు), అర్చితః - పూజింపఁబడిన వాఁడును, అగ్నికల్పః - అగ్నితో సమానుఁడును (పవిత్రత యందవి యర్థము), భోజపతేః - భోజదేశాధీశ్వరునియొక్క, పురోధాః - పురోహితుఁడు, ఆజ్యాదిభిః - నెయ్యి మొదలగు హోమ ద్రవ్యములచేత, అగ్నిం - అగ్నిని, హుత్వా - హోమముచేసి, తమేవ (తం + ఏవ) - ఆయగ్నినే, వివాహసాక్ష్యే - వివాహముయొక్క సాక్ష్యమునందు, ఆధాయ - నిలిపి, వధూవరౌ - వధూవరులను, సంగమయాంచకార - కూర్చెను. అగ్నిసాక్షికముగా ఇద్దరికి బ్రహ్మముడివేసి పురోహితుఁడు వివాహకర్మను సమంత్రకముగా ఆరంభించెను.

శ్లో. హస్తేన హస్తం పరిగృహ్య వధ్వాః
స రాజసూనుః సుతరాం చకాశే
అనంతరాశోకలతాప్రవాళం
ప్రాప్యేవ చూతః ప్రతిపల్లవేన. 21

వ్యాఖ్య: సః, రాజసూనుః - ఆ రాజకుమారుఁడు, హస్తేన - తన చేతితో, వధ్వాః - పెండ్లికూతురుయొక్క, హస్తం - చేతిని, పరిగృహ్య - పట్టుకొని, అనంతరాశోకలతా ప్రవాళం—అనంతర - తన ప్రక్కనయున్న, అశోకలతా - అశోకలతయొక్క, ప్రవాళం - చిగురాకును, ప్రతిపల్లవేన - దాని కెదురుగానున్న తన చిగురాకుచేత, ప్రాప్య - అంటుకొని యుండిన, చూతః, ఇవ - మామిడిచెట్టువలె, సుతరాం - ఎక్కువగా, చకాశే - ప్రకాశించెను. వధూవరులకు పాణిగ్రహణ మహోత్సవము జరిగెననియు, అది అశోకలతాచూత సమాగమము వలె నుండెననియు భావము. అశోక పల్లవములు, చూత పల్లవములును ఎఱ్ఱనివై యుండుట సామాన్యమే కాని, అవి వ్రేళ్లవలె దీర్ఘాకారము గలవియై యుండుట విశేషము. కనుక హస్తములకు చక్కని యుపమానమైనవి. చూతాశోకములు మంగళకరము లగుట మరియొక విశేషము.

శ్లో. ఆసీ ద్వరః కంటకిత ప్రకోష్ఠః
స్విన్నాంగులిః సంవవృతే కుమారీ
తస్మిన్ ద్వయే తత్క్షణ మాత్మవృత్తిః
సమం విభక్తేవ మనోభవేన. 22

వ్యాఖ్య: వరః - పెండ్లికుమారుఁడు, కంటకిత ప్రకోష్ఠః - పులకలెత్తిన ముంజేయి కలవాఁడు, ఆసీత్ - అయ్యెను, కుమారీ - పెండ్లికూతురు, స్విన్నాంగులిః - చెమర్చినవ్రేళ్లు గలదియై, సంవవృతే - మనసార వరించెను, అస్మిన్ ద్వయే - ఆ జంటయందు, తత్క్షణం - ఆ క్షణము నందు, ఆత్మవృత్తిః - సాత్త్వికోదయ రూపమైన తన వ్యాపారము, మనోభవేవ - మన్మథునిచేత, సమం - సమానముగా, విభక్తేవ (విభక్తా + ఇవ) - విభజింపబడినట్లుండినది అంతకు ముందే యిద్దఱికిని అనురాగము సమానముగానే యుండినను, పాణిస్పర్శ వలన గలిగిన పులకాంకుర స్వేదముల వలన ఇప్పుడు వ్యక్తమైనను విభక్తమై యుండినట్లూహించుట కవకాశము గలిగినదని భావము. వధూవరులకు పరస్పరానురాగ మున్నదో లేదో పరీక్షించుటకు ఇవి వాత్స్యాయనుఁడు కామ సూత్రములందు చెప్పెను. "కన్యాతు ప్రథమ సమాగమే స్విన్నాంగులిః స్విన్నముఖీ చ భవతి, పురుషస్తు రోమాంచితో భవతి ఏభిరనయోర్భావం పరీక్షేత."

శ్లో. తయో రపాంగ ప్రతిసారితాని
క్రియాసమాపత్తి నివర్తితాని
హ్రీయంత్రణా మానశిరే మనోజ్ఞా
మన్యోన్యలోలాని విలోచనాని. 23

వ్యాఖ్య: అపాంగ ప్రతిసారితాని—అపాంగ - కన్నుల చివరియందు, ప్రతిసారితాని - ప్రసరింపఁ జేయబడినవియు, క్రియా సమాపత్తి నివర్తితాని— క్రియా - ఒకరినొకరు చూచుటయందు, సమాపత్తి - అప్రయత్నముగా కలిసుకొనుటచేత, నివర్తితాని - వెనుకకు మరల్చబడినవియు, అన్యోన్యలోలాని - ఒడొరులయందు ఆశగలవియు (నగు), తయోః, విలోచనాని - ఆ దంపతులిద్దఱియొక్క చూపులు, మనోజ్ఞాం - రమ్యమైన, హ్రీయంత్రణాం - సిగ్గుచేత కలుగు సంకోచమును, ఆనశిరే - పొందెను. ఆ వధూవరులు ఒకరినొకరు చూడవలెనను వాంఛతో కనుదమ్ముల చివరలనుండి చూపులను ప్రసరింపఁజేయుచు, ఒకరి చూపు లొకరి చూపుల నెదుర్కొన్నప్పుడు వాటి నుపసంహరించుకొనుచు, మరల నొకరియం దొకరి చూపులు ప్రసరింపగా సిగ్గుతో సంకోచమును పొందించుకొనుట చూచువారికి మిక్కిలి రమణీయముగా నుండెనని భావము. నాయికా నాయకుల లజ్జావలోకనములను ఇంత రమణీయముగా వర్ణించిన కవి యరుదు.

శ్లో. ప్రదక్షిణ ప్రక్రమణాత్ కృశానోః
ఉదర్చిష స్తన్మిథునం చకాశే
మేరో రుపాంతేష్వివ వర్తమాన
మన్యోన్య సంసక్త మహస్త్రియామమ్. 24

వ్యాఖ్య: తన్మిథునం - ఆ దంపతుల జంట, ఉదర్చిషః - ఎగయుచున్న జ్వాలలుగల, కృశానోః - అగ్నియొక్క, ప్రదక్షిణ ప్రక్రమణాత్ - ప్రదక్షిణా రంభమువలన, మేరోః - మేరు పర్వతముయొక్క, ఉపాంతేషు - సమీప ప్రదేశ ముల యందు, వర్తమానం - తిరుగుచున్నట్టియు (మేరువునకు ప్రదక్షిణము చేయుచున్న), అన్యోన్య సంసక్తం - పరస్పరము కలుసుకొన్నదియు నగు, అహ స్త్రియామం, ఇవ - అహోరాత్రుల జంటవలె, చకాశే - ప్రకాశించెను. "అన్యోన్య సంసక్తం" అను విశేషణము ఉభయత్ర అన్వయించును. "సువర్ణంతైజసమ్" బంగారము తేజోద్రవ్యమని తర్కశాస్త్రము చెప్పుటచేత మేరుపర్వతము అగ్నితో పోల్పఁబడినది. అహస్సు అజుఁడుగాను, ఇందుమతి త్రియామ (రాత్రి) గాను ఉప మింపబడినారు. అలంకారము: ఉపమ. వధూవరులు అగ్నిప్రదక్షిణకర్మ నాచ రించిరనియు, అది మేరువుచుట్టు దినము రాత్రియు తిరుగుచున్న ట్లుండెవనియు భావము.

శ్లో. నితంబగుర్వీ గురుణా ప్రయుక్తా
వధూ ర్విధాతృప్రతిమేన తేన
చకార సా మత్తచకోరనేత్రా
లజ్జావతీ లాజవిసర్గ మగ్నౌ. 25

వ్యాఖ్య: నితంబగుర్వీ - నితంబభాగము చేత లావుగా కనబడుచున్నదియై, విధాతృప్రతిమేన, తేన, గురుణా - బ్రహ్మతో సమానుఁడైన ఆ పురోహితుని చేత, ప్రయుక్తా - 'హోమము చేయుము' అని నియోగింపఁబడిన, మత్తచకోర నేత్రా - మదించిన చకోరముయొక్క కన్నులవంటి కన్నులుగలదియు, లజ్జావతీ - సిగ్గరియునగు, సా, వధూః - ఆ పెండ్లికూతురగు ఇందుమతి, అగ్నౌ - హోమాగ్నియందు, లాజవిసర్గం - వరి పేలాలు వేయుటను, చకార - చేసెను. తన నితంబభారాది సౌందర్యము నితరులు చూచి పోదురను సిగ్గుతో, పురోహితుని

యాజ్ఞమేరకు ఇందుమతి "లాజాహోమ" మను వివాహకృత్యమును నెరవేర్చెనని భావము. అలంకారము : పరికరము.

శ్లో. హవిః శమీ పల్లవ లాజ గంధీ
పుణ్యః కృశానో రుదియాయ ధూమః
కపోల సంసర్పి శిఖః స తస్యాః
ముహూర్త కర్ణోత్పలతాం ప్రపేదే. 26

వ్యాఖ్య : హవిః శమీపల్లవ లాజగంధీ—హవిః - ఆజ్యము మొదలయిన వస్తువులయొక్కయు, శమీపల్లవ - జమ్మియాకుల యొక్కయు, లాజ - ప్రేలాల యొక్కయు, గంధీ - పరిమళము గలదియు, పుణ్యః - పవిత్రమైనదియు నగు, ధూమః - పొగ, కృశానోః - ఆ యగ్నినుండి, ఉదియాయ - పైకి లేచెను. కపోల సంసర్పిశిఖః—కపోల - ఇందుమతి చెక్కిళ్లయందు, సంసర్పి - ప్రాకుచున్న, శిఖః - కొనలు కలదియై, తస్యాః - ఆమెకు, ముహూర్తకర్ణోత్పలతాం—ముహూర్త - క్షణకాలము, కర్ణోత్పలతాం - చెవి సందున నుంచుకొను కలువ పూవగుటను, ప్రపేదే - పొందెను. హోమాగ్నినుండి లేచి పైకి ఎగబ్రాకుచున్న పొగ ఇందుమతి చెవులపైఁ గలుపరేకులవలెఁ గనఁబడుచుండెనని భావము, అలంకారము : ఉత్ప్రేక్ష.

శ్లో. త దంజనక్లేద సమాకులాక్షం
ప్రమ్లాన బీజాంకుర కర్ణపూరమ్
వధూముఖం పాటల గండలేఖ
మాచార ధూమ గ్రహణా ద్బభూవ. 27

వ్యాఖ్య : తత్, వధూముఖం - ఆ పెండ్లికూతురు మొగము, ఆచారధూమ గ్రహణాత్ - ఆచారప్రాప్తమైన ధూమమును గ్రహించుటచేత, అంజనక్లేద సమాకులాక్షం—అంజనక్లేద - కాటుక కన్నీళ్లచేత, సమాకులాక్షం - చెదరిన కన్నులు గలదియు, ప్రమ్లాన బీజాంకుర కర్ణపూరం - వాడిపోయిన యవాంకురములనెడు అవతంసములు గలదియు, పాటలగండరేఖం - ఎఱ్ఱబడిన చెక్కిళ్లు గలదియు, బభూవ - అయ్యెను. ఇందుమతి ముఖము, ఆ లాజాహోమ సమయమునందు

కాటుక కన్నీటితో చెదరిన కన్నులు, వాడిపోయిన అవతంసాంకురములు, ఎఱ్ఱబడిన చెక్కిళ్లుగలది యయ్యెనని భావము. ఇట్లు గత మూడు శ్లోకములందును ఇందుమతి యొంపుసొంపులను వర్ణించెను.

శ్లో. తౌ స్నాతకై ర్బంధుమతా చ రాజ్ఞా
పురంధ్రిభిశ్చ క్రమశః ప్రయుక్తమ్
కన్యా కుమారౌ కనకాసనస్థౌ
ఆర్ద్రాక్షతారోపణ మన్వభూతామ్. 28

వ్యాఖ్య: కనకాసనస్థౌ - బంగారు గద్దెలపైఁ గూర్చునియున్న, తౌ, కన్యా కుమారౌ - ఆ పెండ్లికూతురును, పెండ్లికొమరుఁడును, స్నాతకైః - వ్రతవినయ మముగల గృహస్థులచేతను, బంధుమతా, రాజ్ఞా చ - బంధు సహితుండైన భోజ రాజు చేతను, పురంధ్రిభిశ్చ - పతిపుత్రవతులైన ముత్తైదువలచేతను, క్రమశః - వరుసగా (ఒకరి తరువాత నొకరుగా), ప్రయుక్తం - చేయఁబడిన, ఆర్ద్రాక్షతారో పణం - పసుపుతోఁ గలిపిన అక్షతలను తలపై నుంచుటను, అన్వభూతాం - అనుభవించిరి. ఆ వధూవరుల తలలపై గృహస్థులు, ముత్తైదువలు బంధు సహితు డైనభోజుడు వరుసగా తలంబ్రాల నుంచిరి. "అక్షతారోపణ" మనఁగా తలంబ్రాలు పోయుట, సేసలు పెట్టుట; 'పురంధ్రి' యనఁగా భర్తయు పుత్రులును గల ముత్తైదువ.

శ్లో. ఇతి స్వసు ర్భోజకుల ప్రదీపః
సంపాద్య పాణిగ్రహణం స రాజా
మహీపతీనాం పృథ గర్హణార్థం
సమాదిదేశాధికృతా నధిశ్రీః. 29

వ్యాఖ్య: అధిశ్రీః - అధిక సంపన్నుఁడును, భోజకుల ప్రదీపః - భోజ వంశమునకు పేరుతెచ్చిన, సః, రాజా - ఆరాజు, ఇతి - ఈ వెనుక చెప్పిన విధ ముగా, స్వసుః - చెల్లెలియొక్క (ఇందుమతియొక్క), పాణిగ్రహణం - వివాహ మును, సంపాద్య - జరిపించి, మహీపతీనాం - స్వయంవరమునకువచ్చిన రాజుల యొక్క, పృథక్, అర్హణార్థం - ఒక్కొక్కరినిగా గౌరవించుటకొఱకు, అధికృ

తాన్ - ఉద్యోగులను, సమాదిదేశ - ఆజ్ఞాపించెను. చెల్లెలి వివాహమును పూర్తి చేసిన భోజుడు పెండ్లికి వచ్చినవారి కందఱికిని అర్చనలు, కట్నములు, కానుకలు చెందునట్లు చేయుటకు అధికారులను నియమించెను.

శ్లో. లింగై ర్ముదః సంవృతవిక్రియా స్తే
హ్రదాః ప్రసన్నా ఇవ గూఢనక్రాః
వైదర్భ మామంత్ర్య యయు స్తదీయాం
ప్రత్యర్ప్య పూజా ముపదాచ్ఛలేన. 30

వ్యాఖ్య: ముదః - సంతోషముయొక్క, లింగైః - చిహ్నములచేత (కపటపు నవ్వు మొదలయినవాటిచేత), సంవృత విక్రియాః - దాచుకొనఁబడిన మత్సరము గలవారై, ప్రసన్నాః - పైన నిర్మలోదకము గలవియు, గూఢనక్రాః - లోనదాగిన మొసళ్లుకలవియునగు, హ్రదాః, ఇవ - మడుగులవలె, (స్థితాః - ఉండిన), తే - ఆ రాజులు, వైదర్భం, ఆమంత్ర్య - విదర్భరాజుతో వెళ్లివచ్చెదమని చెప్పి, తదీయాం, పూజాం - అతడు తమకు చేసిన పూజను (బహుమానమును), ఉపదాచ్ఛలేన - కానుకలర్పించుట యను నెపముతో, ప్రత్యర్ప్య - వెనుకకిచ్చివేసి, యయుః - వెళ్లిపోయిరి. ఆ రాజులకు తమను ఇందుమతి వరింపలేదను కోపమును, అజునియందు మత్సరమును ఉండుటవలన పైకి మాత్రము సంతోషమును ప్రకటించుచు, తమకిచ్చిన బహుమతులను, కానుకల నెపమున తిరిగి యిచ్చివేసి, అసమ్మతితో వెళ్లిపోయిరని భావము.

శ్లో. స రాజలోకః కృతపూర్వ సంవి
దారంభసిద్ధౌ సమయోపలభ్యమ్
ఆదాస్యమానః ప్రమదామిషం త
దావృత్య పంథాన మజస్య తస్థౌ 31

వ్యాఖ్య : ఆరంభసిద్ధౌ - కార్యసిద్ధి విషయమై, కృతపూర్వ సంవిత్ - పూర్వము చేసుకోబడిన సంకేతముగల, సః, రాజలోకః - ఆ రాజసమూహము, సమయోపలభ్యం - అజుని ప్రయాణ సమయమునందు లభ్యమైన, తత్, ప్రమదామిషం - ఆస్త్రీయను భోగ్యవస్తువును, ఆదాస్యమానః - గ్రహింప బోవునది

యగుచు, అజస్య. పంథానం - అజుని యొక్క మార్గమును. ఆవృత్య - అడ్డగించి, తస్థౌ - నిలిచియుండెను - ఒంటరిగా వెళ్లునట్టి యజునివద్ది నుండి యిందుమతిని అపహరించుకొని పోవుటకై ముందే సంకేతము నేర్పాటు చేసుకొన్న రాజ సమూహమంతయు మార్గము నడ్డగించి నిలచి యుండెనని భావము. - "సంవిత్" - యుద్ధము, ప్రతిజ్ఞ, సంకేతము, ఆచారము, పేరు అని నానార్థములు; ఆమిషము - మాంసము, భోగ్యవస్తువు.

శ్లో. భర్తాపి తావత్ క్రథకైశికానాం
అనుష్ఠితానంతరజా వివాహః
సత్త్వానురూపాహరణీకృతశ్రీః
ప్రాస్థాపయ ద్రాఘవ మన్వగాచ్చ. 82

వ్యాఖ్య : అనుష్ఠితానంతరజావివాహః - అనుష్ఠిత - చేయఁబడిన, అనంతరజా - చెల్లెలియొక్క, వివాహః - వివాహముగల వాడైన, క్రథకైశికానాం, భర్తా, అపి - క్రథకైశిక దేశమునకు ప్రభువైన భోజుఁడుకూడా, తావత్ - అప్పుడు, సత్త్వానురూపాహరణీ కృతశ్రీః - సత్త్వాను రూప - ఉత్సాహమునకు తగినట్లుగా ఆహరణీకృత - ఎక్కువ అరణముగాఁ జేయఁబడిన, శ్రీః - సంపదకలవాఁడై, రాఘవం - అజుని, ప్రాస్థాపయత్ - ప్రయాణము చేయించెను, అన్వగాత్‌చ - తానును సాగనంపుటకు వెంటవెళ్లెను. చెల్లెలికి దాస దాసీ జన ధనకనకాదులను విశేషముగా అరణమిచ్చి పంపెననియు, తాను సాగనంపుటకు వెంటవెళ్లెననియు భావము. "హరణం" అనగా పుట్టింటివారు కన్యకిచ్చి పంపు ధనము. ఈ శబ్దమే తెలుఁగున "అరణము"గా మారినది.

శ్లో. తిస్రస్త్రిలోకప్రథితేన సార్థ
మజేన మార్గే వసతీ రుషిత్వా
తస్మా దపావర్తత కుండినేశః
పర్వాత్యయే సోమ ఇవోష్ణరశ్మేః. 83

వ్యాఖ్య : కుండినేశః - కుండిన నగరాధిపతియగు భోజుఁడు (కుండిన నగరము విదర్భ దేశమునకు రాజధాని). త్రిలోక ప్రథితేన - మూఁడు లోకము

లందును ప్రసిద్ధుఁడైన, అజేన, సార్ధం - అజునితోఁగూడ, మార్గే - దారిలో, తిస్రః, వసతీః - మూడు రాత్రులు, ఉషిత్వా - ఉండి, పర్వాత్యయే - 'దర్శ' యను పర్వము ముగియగానే, ఉష్ణరశ్మేః - సూర్యుని వద్దినుండి, సోమః, ఇవ - చంద్రుఁడువలె, తస్మాత్ - ఆయజునివద్దినుండి, అపావర్తత - వెనుకకు మరలెను. మూడు రాత్రులు నూతనదంపతులవెంట ప్రయాణముచేసి వారిని సాగనంపి యింటికి మరలి వెళ్లెనని భావము "త్రిలోక ప్రథితేన" అను విశేషణము అజుని అసహాయ శూరత్వమును వెల్లడించు చున్నది. "దర్శః" అనగా సూర్యచంద్రు లొక్కచోట కలియునట్టి అమావాస్య. "దర్శః సూర్యేందుసంగమః" అని యమరము. అది యొక పర్వము.

శ్లో. ప్రమన్యవః ప్రాగపి కోసలేంద్రే
ప్రత్యేక మాత్తస్వతయా బభూవుః
అతో నృపా శ్చక్షమిరే సమేతాః
స్త్రీరత్నలాభం న తదాత్మజస్య. 34

వ్యాఖ్య : నృపాః - ఆదారిలో నుండిన రాజులు, ప్రాగపి (ప్రాక్ + అపి)- పూర్వముగూడ, ప్రత్యేకం - ఒక్కొక్కరుగా. ఆత్తస్వతయా - (దిగ్విజయ యాత్ర యందు రఘుమహారాజు చేత) తీసుకోఁబడిన ధనముగల వారగుటచేత, కోసలేంద్రే - రఘు మహారాజుపైన, ప్రమన్యవః - అధిక కోపముగల వారు, బభూవుః - అయియుండిరి; అతః - ఈ కారణమువలన, సమేతాః - ఏకీభవించిన వారగుచు; తదాత్మజస్య - అతని కుమారుని యొక్క (రఘు కుమారుఁడైన యజుని యొక్క), స్త్రీరత్న లాభం - ఉత్తమస్త్రీ లాభమును, న చక్షమిరే - సహింపలేక పోయిరి. ఆ రాజసమూహము యొక్క అసహనమునకు స్వయంవర పరాభవముతో పాటు పూర్వవైరము గూడ కారణమై యుండెననియు అందువలన అందఱును చేరి అజుని జయించి యిందుమతిని అపహరించుకొని పోవుటకు సిద్ధపడిరనియు భావము.

శ్లో. త ముద్వహంతం పథి భోజకన్యాం
రురోధ రాజన్యగణః స దృప్తః

  

బలిప్రదిష్టాం శ్రియ మాదదానం
త్రైవిక్రమం పాద మివేంద్రశత్రుః. 35

వ్యాఖ్య: దృప్తః - గర్వించిన, సః, రాజన్యగుణః - ఆ రాజసమూహము, భోజకన్యాం - ఇందుమతిని, ఉద్వహంతం - తీసుకొని వెళ్లుచున్న, తం - ఆ యజమహారాజును, బలి ప్రదిష్టాం - బలిచక్రవర్తిచేత ఈయఁబడిన, శ్రియం - సంపదను, ఆదదానం - స్వీకరించుచున్నదియు, త్రైవిక్రమం - వామనునిదియు నగు, పాదం - పాదమును, ఇంద్రశత్రుః - ప్రహ్లాదుఁడువలె, పథి - మార్గమువందు, రురోధ - అడ్డగించెను. ప్రహ్లాదుఁడు విష్ణుభక్తుఁడైయైనను ఇంద్రశత్రువు ఉపేంద్రుఁడైన వామనుని పాదము స్వర్గాదుల నాక్రమించుటను సహింపలేక దానిని అడ్డగించెనని బ్రహ్మాండపురాణమునఁ గలదు. "విరోచన విరోధేఽపి ప్రహ్లాదః ప్రాక్తనం స్మరన్, విష్ణోస్త్రుక్రమమాణస్య పాదాంభోజం రురోధహ" అట్లు వారు అజుని నాపి యుద్ధమునకుఁ బూనిరి.

శ్లో. తస్యాః స రక్షార్థ మనల్పయోధం
ఆదిశ్య పిత్ర్యం సచివం కుమారః
ప్రత్యగ్రహీత్ పార్థివవాహినీం తాం
భాగీరథీం శోణ ఇవోత్తరంగః. 36

వ్యాఖ్య: సః, కుమారః - ఆ యజుఁడు, తస్యాః, రక్షార్థం - ఇందుమతి యొక్క రక్షణముకొఱకు, అనల్పయోధం - ఎక్కువమంది యుద్ధభటులు కలవాఁడును, పిత్ర్యం - తన తండ్రి కాలమునుండి వచ్చుచున్నవాఁడును (ఆప్తుఁడని యర్థము) అగు, సచివం - మంత్రిని, ఆదిశ్య - ఆజ్ఞాపించి, తాం, పార్థివ వాహినీం - ఆ రాజసైన్యమును, భాగీరథీం - గంగానదిని, ఉత్తరంగః - ఎగయుచున్న యలలుగల, శోణః, ఇవ - శోణనదమువలె, ప్రత్యగ్రహీత్ - ఎదుర్కొనెను. ఇందుమతి రక్షణార్థమై బహుళ సైన్య సమేతుఁడై, ఆప్తుడైన మంత్రిని నియమించి, కొద్దిపాటి సైన్యముతో తాను శత్రుసేనపై దూకెనని భావము. శోణ నదము పెద్దపెద్ద యలలతో భాగీరథిని ముంచివేయును.

శ్లో. పత్తిః పదాతిం రథినం రథేశః
తురంగసాదీ తురగాధిరూఢమ్

యంతా గజస్యాభ్యపతత్ గజస్థం
తుల్య ప్రతిద్వంది బభూవ యుద్ధమ్. 37

వ్యాఖ్య: పత్తిః - కాలిబంటు, పదాతిం - కాలిబంటును, అభ్యపతత్ - ఎదుర్కొనెను; రథేశః - రథికుఁడు, రథినం - రథముగల వానిని, అభ్యపతత్ - ఎదుర్కొనెను, తురంగసాధీ - గుఱ్ఱపురౌతు, తురంగాధిరూఢం - గుఱ్ఱమునెక్కిన సైనికుని, అభ్యపతత్ - ఎదుర్కొనెను, గజస్య, యంతా - ఏనుగుయొక్క శిక్షకుఁడు (గజసైనికుఁడు), గజస్థం - ఏనుగుపైనున్న భటుని, అభ్యతతత్ - ఎదుర్కొనెను, (ఇత్థం - ఇట్లు) తుల్యప్రతిద్వంది - సమానమైన ప్రతిభటులుగల, యుద్ధం - యుద్ధము, బభూవ - జరిగెను. ఏ తెగకుచెందిన యుద్ధభటుడు ఆ తెగ భటునితో తలపడెనని భావము.

శ్లో. నదత్సు తూర్యేష్వవిభావ్య వాచో
నోదీరయంతిస్మ కులోపదేశాన్
బాణాక్షరై రేవ పరస్పరస్య
నామోర్జితం చాపభృతః శశంసుః. 38

వ్యాఖ్య: తూర్యేషు, నదత్సు - వాద్యములు మ్రోగుచుండగా, అవిభావ్య వాచః - తెలిసికొనుట వీలుపడని పలుకులుగల, చాపభృతః - విలుకాండ్రు, కులోపదేశాన్ - వంశనామములను, నోదీరయంతిస్మ (న + ఉదీరయంతి + స్మ) చెప్పుటలేదు (పేరుచెప్పి బాణమువేయుట శూరుని లక్షణము), (కింతు - కాని) బాణాక్షరై రేవ - బాణములమీద చెక్కబడిన యక్షరములచేతనే, పరస్పరస్య - ఒండొరులయొక్క, ఊర్జితం - ప్రఖ్యాతమైన, నామ - పేరును, శశంసుః - తెలిపిరి, బాణములపైగల యక్షరములతోనే తమనుతాము పరిచయము చేయుచుండిరట.

శ్లో. ఉత్థాపితః సంయతి రేణు రశ్వైః
సాంద్రీకృతః స్యందన వంశ చక్రైః
విస్తారితః కుంజరకర్ణతాలైః
నేత్రక్రమేణోపరురోధ సూర్యమ్. 39

వ్యాఖ్య: సంయతి - యుద్ధమునందు, అశ్వైః - గుఱ్ఱములచేత, ఉత్థాపితః - ఎగురగొట్టఁబడినదియు, స్యందన వంశచక్రైః - రథ సమూహముయొక్క చక్రములచేత, సాంద్రీకృతః - దట్టముగాఁ జేయఁబడినదియు, కుంజర కర్ణతాలైః - ఏనుగుల చెవుల తాడనలచేత, విస్తారితః - వ్యాపింపఁ జేయఁబడినదియు నగు, రేణుః - ధూళి, నేత్రక్రమేణ - వస్త్రమును పరచిన రీతిగా, సూర్యం - సూర్యుని, ఉపరురోధ - కప్పి అడ్డగించెను. యుద్ధమున బయలుదేరిన ధూళి ఆకాశమును గప్పివైచెనని భావము. 'నేత్ర' శబ్దమునకు వస్త్రమనియు, 'క్రమ' శబ్దమునకు రీతియనియు నర్థములు.

శ్లో. మత్స్యధ్వజా వాయువశాత్ విదీర్ణైః
ముఖైః ప్రవృద్ధ ధ్వజినీ రజాంసి
బభుః పిబంతః పరమార్థ మత్స్యాః
పర్యావిలానీవ నవోదకాని. 40

వ్యాఖ్య: వాయువశాత్ - గాలిమూలమున, విదీర్ణైః - చిరిగిన, ముఖైః - కొనలచేత, ప్రవృద్ధధ్వజినీ రజాంసి—ప్రవృద్ధ - పైకి లేచిన, ధ్వజినీ రజాంసి - సైన్య ధూళులను, పిబంతః - గ్రహించుచున్న, మత్స్యధ్వజాః - మత్స్యాకారము గల జెండాగుడ్డలు, పర్యావిలాని - అంతట కలుషితములైన (ఒండుమట్టితో కలిసిన), నవోదకాని - క్రొత్తనీళ్లను, పిబంతః - త్రాగుచున్న, పరమార్థమత్స్యాః ఇవ - నిజమైన చేపలవలె, బభుః - ప్రకాశించినవి. గాలివలన పైన కదలుచు ధూళిలో రెపరెపలాడుచున్న చిరిగిన జెండాగుడ్డపేలికలు ఒండ్రుమట్టి కలిసిన క్రొత్త నీటిని త్రాగుచున్న నిజమైన చేపలవలెఁ గనఁబడుచుండెను. అలంకారము: ఉపమ.

శ్లో. రథో రథాంగధ్వనినా విజజ్ఞే
విలోల ఘంటాక్వణితేన నాగః
స్వభర్తృ నామగ్రహణా ద్బభూవ
సాంద్రే రజస్యాత్మ పరావబోధః. 41

వ్యాఖ్య: సాంద్రే, రజసి - దట్టముగా వ్యాపించిన ఆ ధూళియందు, రథః - రథము, రథాంగ ధ్వనినా - చక్రముల ధ్వనిచేతనే, విజజ్ఞే - తెలియఁబడెను, నాగః - గజము, విలోలఘంటా క్వణితేన - కదలుచున్న గంటలయొక్క మ్రోతచేతనే, విజజ్ఞే - తెలియఁబడెను, ఆత్మ పరావబోధః - తమవాఁడు, శత్రు పక్షమువాఁడు అను వివేకము (యుద్ధభటులకు), స్వభర్తృనామ గ్రహణాత్— స్వభర్తృ - తమ ప్రభువుయొక్క, నామగ్రహణాత్ - పేరును ఉచ్చరించుట వలననే, బభూవ - కలిగెను ఆ రజోంధకారమునందు భటులందఱును స్వపర భేదమును ఆయా శబ్దమువలననే తెలిసికొని యుద్ధము చేయుచుండిరని భావము.

శ్లో. ఆవృణ్వతో లోచనమార్గ మాజౌ
రజోఽంధకారస్య విజృంభితస్య
శస్త్రక్షతాశ్వ ద్విప వీర జన్మా
బాలారుణోఽభూత్ రుధిరప్రవాహః. 42

వ్యాఖ్య: లోచనమార్గం - దృష్టి పథమును, ఆవృణ్వతః - కప్పివేయు చున్నట్టియు, ఆజౌ - యుద్ధభూమియందు, విజృంభితస్య - ఉద్ధృతముగా వ్యాపించి నట్టి,దగు రజోంధకారస్య - ధూళియను నంధకారమునకు, శస్త్రక్షతాశ్వ ద్విపవీర జన్మా—శస్త్రక్షత - ఖడ్గముచేత నఱుకబడిన, అశ్వ ద్విపవీర - గుఱ్ఱములనుండి. ఏనుగులనుండి వీరభటులనుండియు, జన్మా - పుట్టిన, రుధిర ప్రవాహః - రక్త ప్రవాహము, బాలారుణః - బాల సూర్యుఁడు, అభూత్ - అయ్యెను. ఆ దుమ్ము రూపముననున్న అంధకారమునకు శస్త్రహతులవలన పుట్టిన రక్తప్రవాహము బాల భానుఁడయ్యెను. అనఁగా అంధకారమును తగ్గించుటలో రుధిరము సూర్యునివంటి దయ్యెనని భావము. 'అరుణ' శబ్దమునకు సూర్యుఁడనియు నర్థము. బాల విశేషణము రుధిరముతో సమానమైన వర్ణము కలిగియుండుటకు; ఇఁకమీద ధూళివ్యాప్తి తగ్గుటను వర్ణించుట జరుగును గనుక ఇది సముచిత రూపకము. ధూళి చీకటి, రక్త ప్రవాహము సూర్యుఁడని రూపణము.

శ్లో. స చ్ఛిన్నమూలః క్షతజేన రేణుః
తస్యోపరిష్టాత్ పవనావధూతః
అంగార శేషస్య హుతాశనస్య
పూర్వోత్థితో ధూమ ఇవాబభాసే. 43

  

వ్యాఖ్య : క్షతజేన - ర క్తముచేత, ఛిన్నమూలః - వదిలింప బడిన ఆధారము కలదియు, తస్య - ఆ ర క్తముయొక్క, ఉపరిష్టాత్ - పై భాగమునందు, పవనావధూతః - గాలిచేత కంపింపఁబడినదియు నగు, సః, రేణుః - ఆ ధూళి, అంగార శేషస్య - బొగ్గులతో మిగిలిన, హుతాశనస్య - అగ్నియొక్క, పూర్వో త్థితః - అగ్ని వెలుగుటకంటె ముందు బయలుదేరిన, ధూమః ఇవ - పొగవలె, ఆబభాసే - ప్రకాశించెను. ర క్తముచేత నేల తడియుటవలన అచ్చటలేక, గాలిచేత మరికొంచము పై కెగురగొట్టఁబడిన దుమ్ము, అగ్నిసంబంధములేక పై కెగసిన పొగవలె నుండెనని భావము. అలంకారము : ఉత్ప్రేక్ష.

శ్లో. ప్రహార మూర్ఛాపగమే రథస్థాః
యంతౄ నుపాలభ్య నివర్తితాశ్వాన్
యైః సాదితా లక్షితపూర్వ కేతూన
తానేవ సామర్షతయా నిజఘ్నుః. 44

వ్యాఖ్య : రథస్థాః - ఆ యుద్ధము నందలి రథికులు, ప్రహార మూర్ఛాపగమే - శత్రువుకొట్టిన దెబ్బచేత కలిగిన మూర్ఛ తొలగగానే, నివర్తితాశ్వాన్ - మరల్పఁబడిన గుఱ్ఱములుగల, యంతౄన్ - సారథులను, ఉపాలభ్య - నిందించి, యైః - ఏ వ్యక్తులచేత, సాదితాః - పూర్వము తాము కొట్ట బడియుండిరో, లక్షిత పూర్వకేతూన్ — లక్షితపూర్వ - పూర్వము చూడఁబడిన, కేతూన్ - పతాకములు గల, తానేవ (తాన్ + ఏవ) - ఆ వ్యక్తులనే, సామర్షయా - క్రుద్ధభావము చేత, నిజఘ్నుః - బాగా కొట్టిరి. రథికులు శత్రు ఘాతములచేత మూర్ఛపడగా ప్రాణ రక్షణార్థమై సారథులు వారి రథములను మరల్చిరనియు, మూర్ఛనుండి తేఱిన యా రథికులు అశ్లీల చేసితిరని సారథులను తిట్టి, యుద్ధరంగమున తమపై దెబ్బవేసిన వ్యక్తిని, వాని రథపతాకముతో గుర్తించి తిరుగు దెబ్బ కొట్టిరనియు భావము. అది యుద్ధ ధర్మము కదా!

శ్లో. అప్యర్ధమార్గే పరబాణ లూనా
ధనుర్భృతాం హస్తవతాం పృషత్కాః
సంప్రాపు రేవాత్మజవానువృత్త్యా
పూర్వార్ధభాగైః ఫలిభిః శరవ్యమ్. 45

వ్యాఖ్య: అర్ధమార్గే - సగము దారిలో, పరబాణలూనాః, అపి - శత్రువుల బాణములచేత ఛేదింపఁబడినవి యైనను, హస్తవతాం - కృతహస్తులైన (విలువిద్యయందు నేర్పరులైన), ధనుర్భృతాం - విలుకాండ్రయొక్క, పృషత్కాః - శరములు, ఆత్మజవానువృత్త్యా - తమ వేగము ననుసరించుటచేత, ఫలిభిః - లోహాగ్రములుగల (ఇనుప పిడులుగల), పూర్వార్ధభాగైః - మొదటి సగభాగములచేత, శరవ్యం - లక్ష్యమును (చేరవలసిన చోటును), సంప్రాపురేవ (సంప్రాపుః + ఏవ) - చేరనే చేరినవి. కృతహస్తులైన విలుకాండ్ర బాణములు విరిగియు దారిలో పడిపోలేదని భావము. "సస్య బాణాగ్రయోః ఫలమ్" అని విశ్వ నిఘంటువు. కనుక ఫలమనఁగా నిచ్చట బాణాగ్రమని యర్థము.

శ్లో. ఆధోరణానాం గజ సన్నిపాతే
శిరాంసి చక్రైర్నిశితైః క్షురాగ్రైః
హృతాన్యపి శ్యేన నఖాగ్రకోటి
వ్యాసక్త కేశాని చిరేణ పేతుః. 46

వ్యాఖ్య: గజసన్నిపాతే - గజ యుద్ధమునందు, నిశితైః - వాడియైనవియు, క్షురాగ్రైః - మంగలి కత్తులయొక్క పదునువంటి పదునుగల అంచులు గలవియు నగు, చక్రైః - చక్రాయుధములచేత, హృతాని, అపి - ఛేదింపఁ బడినవైనను, శ్యేనసఖాగ్ర కోటి వ్యాసక్తకేశాని___శ్యేన - డేగపక్షులయొక్క, నఖ - గోళ్లయొక్క, అగ్రకోటి - చివరి యంచులయందు, వ్యాసక్త - తగులుకొన్న, కేశాని - జుట్లు గల, ఆధోరణానాం - గజారోహకులయొక్క, శిరాంసి - తలకాయలు, చిరేణ - చాల ఆలస్యముగా, పేతుః - నేలపైఁ బడినవి (తలలు తెగీ తెగకముందే వానిని పట్టుకొని రక్తమాంసములు తిను డేగలు (గ్రద్దలవంటివి) ఆకాశముపై కెగురుటచేత, ఆ డేగల కాలిగోళ్లలో చిక్కుకొన్న జుట్లుగల గజ సైనికుల తలలు చాలాసేపటికి ఆకసమునుండి నేలపైఁ బడుచుండెనని భావము.

శ్లో. పూర్వం ప్రహర్తా న జఘాన భూయః
ప్రతిప్రహారాక్షమ మశ్వసాదీ
తురంగమ స్కంధ నిషణ్ణ దేహం
ప్రత్యాశ్వసంతం రిపు మాచకాంక్ష. 47

వ్యాఖ్య: పూర్వం - మొదట, ప్రహర్తా - కొట్టిన వాఁడగు, అశ్వసాదీ - గుఱ్ఱపుబంటు, ప్రతిప్రహారాక్షమం - తనను మరలఁ గొట్టుటయందు శక్తుఁడు కానట్టియు, తురంగమస్కంధ నిషణ్ణదేహం—తురంగమస్కంధ - గుఱ్ఱము వీపు మీద, నిషణ్ణదేహం - నిలచిన శరీరముగల (మూర్ఛితుఁడైన), రిపుం - శత్రువును, భూయః - మరల, న జఘాన - కొట్టలేదు. (కింతు - మరియు) ప్రత్యాశ్వసంతం - మరల నిట్టూర్పు విడుచువానినిగా (మరల బ్రతుకువానిగా), ఆచకాంక్ష - కోరెను. తాను వేసిన మొదటి దెబ్బతోనే మూర్ఛితుఁ డగువానిని మరలకొట్టక అతఁడు బ్రతకవలెనని ఆశ్వికసైనికుఁడు కోరుచుండెనట. ఆ యుధము లేనివానిని, ఆర్తుఁడగువానిని, ఎక్కువ దెబ్బలు తిన్నవానిని కొట్టుట యుద్ధధర్మము కాదని మానివేసెనని భావము.

శ్లో. తనుత్యజాం వర్మభృతాం వికోశైః
బృహత్సు దంతేష్వసిభిః పతద్భిః
ఉద్యంత మగ్నిం శమయాంబభూవు
ర్గజా వివిగ్నాః కర శీకరేణ. 48

వ్యాఖ్య: తనుత్యజాం - నిస్పృహతో శరీరములు విడుచుచున్న, వర్మభృతాం - కవచములుగల సైనికులయొక్క (వారికి సంబంధించినవియు), బృహత్సు - పెద్దవియైన, దంతేషు - తమ దంతములమీద, పతద్భిః - పడుచున్నట్టివి కనుకనే, వికోశైః - ఒరలనుండి పైకి తీయబడిన, అసిభిః - ఖడ్గములచేత, ఉద్యంతం - పైకి లేచుచున్న, అగ్నిం - అగ్నిని, వివిగ్నాః - భయపడిన, గజాః - ఏనుగులు, కరశీకరేణ - తొండమునుండి స్రవించు జలకణముచేత, శమయాం బభూవుః - చల్లార్చినవి. ఏనుగులు తమ దంతములపై బడిన ఖడ్గములవల్ల బయలుదేరిన అగ్నిని తొండపు తుంపురులచేత చల్లార్చినవి.

శ్లో. శిలీముఖోత్కృత్త శిరః ఫలాఢ్యా
చ్చ్యుతైః శిరస్త్రైశ్చషకోత్తరేవ
రణక్షితిః శోణిత మద్యకుల్యా
రరాజ మృత్యో రివ పానభూమిః. 49

వ్యాఖ్య: శిలీ....ఫలాఢ్యా—శిలీముఖ - బాణములచేత, ఉత్కృత్త - నఱికి వేయఁబడిన, శిరఃఫలాఢ్యా - శిరస్సులనెడి ఫలములతో కూడినదియు, చ్యుతైః-జారి పడిన, శిరస్త్రైశ్చ - శిరస్త్రాణముల చేతనేమో (శిరస్త్రాణములనగా సైనికులు తలకు పెట్టుకొనునట్టి లోహపు టోపీలు), చషకోత్తరేవ - పానపాత్రలు కలదియో యను నట్లున్నదియు, శోణితమద్యకుల్యా - రక్తమనెడి మద్యముయొక్క కాలువలు గల దియు నగు. రణక్షితిః - యుద్ధభూమి, మృత్యోః - మృత్యు దేవతయొక్క, పాన భూమిః, ఇవ - మద్యపాన ప్రదేశమువలె, రరాజ - ప్రకాశించెను. ఆ రణభూమి తెగిన తలలనెడు పండ్లతోను, పడిన శిరస్త్రాణములనెడి పానపాత్రలతోను, రక్తమ నెడి మద్యపు కాలువలతోను నిండి మృత్యుదేవత మద్యపాన ప్రదేశమువలె నుండె నని భావము.

శ్లో. ఉపాంతయో ర్నిష్కుషితం విహంగైః
ఆక్షిప్య తేభ్యః పిశితప్రియాపి
కేయూరకోటి క్షత తాలుదేశా
శివా భుజచ్ఛేద మపాచకార. 50

వ్యాఖ్య: ఉపాంతయోః - రెండు పార్శ్వములయందును, విహంగైః - పక్షులచేత, నిష్కుషితం - ఖండింపబడినదియగు, భుజచ్ఛేదం - భుజఖండమును (ఒక సైనికుని భుజపుముక్కను), తేభ్యః - ఆ పక్షులనుండి, ఆక్షిప్య - లాగు కొని, పిశితప్రియాపి - మాంసమునందు ప్రీతి గలదియైనను, శివా - ఆడునక్క, కేయూరకోటి క్షతతాలుదేశా—కేయూరకోటి - భుజకీర్తి యంచులచేత, క్షత - తెగిన, తాలుదేశా - దవడలు కలది యగుచు, అపాచకార - పారవేసెను. ఒక నక్క భుజఖండమును తినబోయి, ఆ భుజఖండపు భుజకీర్తి యంచులు గ్రుచ్చు కొని దవడలు తెగుటవలన దానిని దూరముగా పారవేసెనని భావము. 'శివా' యనఁగా ఆడునక్క, కనుక భయపడెను. "శివః కీలః శివా క్రోష్ట్రీ" అని విశ్వ నిఘంటువు.

శ్లో. కశ్చి ద్ద్విషత్ఖడ్గ హృతోత్తమాంగః
సద్యో విమానప్రభుతా ముపేత్య

వామాంగ సంసక్త సురాంగనః స్వం
నృత్యత్కబంధం సమరే దదర్శ. 51

వ్యాఖ్య: ద్విషత్ఖడ్గ హృతోత్తమాంగః — ద్విషత్ఖడ్గ - శత్రువుయొక్క ఖడ్గముచేత, హృత - నఱికి వేయఁబడిన, ఉత్తమాంగః - శిరస్సుగల, కశ్చిత్ - ఒకానొక యుద్ధవీరుఁడు, సద్యః - అప్పుడే, విమాన ప్రభుతాం - విమానమునకు అధిపతియగుటను (దేవత్వమును), ఉపేత్య - పొంది, వామాంగసంసక్తసురాంగనః—వామాంగ - ఎడమతొడపైన, సంసక్త - కూర్చున్న, సురాంగనః - ఒక దేవ వేశ్య కలవాఁడగుచు, సమరే - యుద్ధరంగమునందు, నృత్యత్ - నాట్యము చేయుచున్న, స్వం, కబంధం-తన మొండెమును, దదర్శ-చూచెను. తల తెగగానే దేవత్వమునుపొందిన ఒకఁడు తన సంపూర్ణ దైవదేహముతో సురాంగనాయుతుఁడై, నేలపై నర్తన చేయుచున్న తన మొండెమును చూచెనని భావము. తల లేక పోయినను కదలుచున్న మొండెమునకు "కబంధము" అని పేరు "కబంధోఽ స్త్రీ క్రియాయుక్త మపమూర్ధ కళేబరమ్" అమరము.

శ్లో. అన్యోన్య సూతోన్మథనా దభూతాం
తావేవ సూతౌ రథినౌ చ కౌచిత్
వ్యశ్వౌ గదావ్యాయత సంప్రహారౌ
భగ్నాయుధౌ బాహువిమర్ద నిష్ఠౌ. 52

వ్యాఖ్య: కౌచిత్ - ఒక యిద్దఱు వీరులు, అన్యోన్యసూతోన్మథనాత్ - ఒకరి సారథి నొకరు చంపుటవలన, తావేవ (తౌ + ఏవ) - వారే, సూతౌ - సారథులుగాను, రథినౌచ - రథికులుగాను, అభూతాం - అయిరి, వ్యశ్వౌ - గుఱ్ఱములుగూడా చచ్చిన ఆ యిద్దరే, గదావ్యాయత సంప్రహారౌ - గదలచేత సుదీర్ఘమైన యుద్ధము కలవారుగాను, అభూతాం - అయిరి, భగ్నాయుధౌ - విరిగిన గదాయుధములుగల ఆ యిద్దరే, బాహువిమర్దనిష్ఠౌ—బాహువిమర్ద - బాహులతో కొట్టుకొనుటయందు, నిష్ఠౌ - చనిపోయినవారు, అభూతాం - అయిరి. ఒక యిద్దరు పరస్పరం సారథులను చంపుకొని, తామే సారథులై, గుఱ్ఱములను చంపుకొని రథములు విడిచి, గదలతోను అవి విరుగగా బాహు యుద్ధముచేసి చచ్చిరి. 'నిష్ఠా' అనఁగా నాశము. "నిష్ఠా నిష్పత్తి నాశాంతాః" అని యమరము.

శ్లో. పరస్పరేణ క్షతయోః ప్రహర్త్రోః
ఉత్క్రాంతవాయ్వోః సమకాల మేవ
అమర్త్యభావేఽపి కయోశ్చి దాసీత్
ఏకాప్సరః ప్రార్థితయో ర్వివాదః. 53

వ్యాఖ్య: పరస్పరేణ - ఒకనిచేత నొకఁడు, క్షతయోః - నఱుకఁబడినట్టియు, సమకాలమేవ - ఒకే సమయమునందు, ఉత్క్రాంతవాయ్వోః - పైకి వెళ్లిపోయిన ప్రాణములు గలిగినట్టియు, ఏకాప్సరః ప్రార్థితయోః - ఒకే యప్సరస యందు కోరిక గలిగియున్నట్టి, కయోశ్చిత్, ప్రహర్త్రోః - ఒక యిద్దఱు యుద్ధభటులకు, అమర్త్యభావేఽపి - దేవత్వము వచ్చినపిమ్మటగూడ, వివాదః - కలహము, ఆసీత్ - జరిగెను. ఇద్దఱు భటులు ఒకే సమయమున ఒకరినొకరు నఱుకుకొని. గతప్రాణులై, స్వర్గమార్గమును బట్టగా, వారియెదుట నిల్చిన యప్సరసలలో నొకతె మిక్కిలి చక్కనిదై యుండెను. ఆమెయే నాకంటే నాకు కావలెనని వారు మరల కలహించుకొనిరని భావము. దేవత్వము వచ్చినదికాని వైరము పోలేదు. ఏకవస్తువాంఛ గొప్ప వైరమునకు బీజము.

శ్లో. వ్యూహౌ వుభౌ తా వితరేతరస్మాత్
భంగం జయం చాపతు రవ్యవస్థమ్
పశ్చా త్పురో మారుతయోః ప్రవృద్ధౌ
పర్యాయవృత్త్యేవ మహార్ణవోర్మీ. 54

వ్యాఖ్య: తౌ. ఉభౌ, వ్యూహౌ - ఆ రెండు సైన్య వ్యూహములను (వ్యూహ మనగా ఒక పద్ధతిపై నిల్చిన సైన్య విన్యాసము), పశ్చాత్పురోమారుతయోః - వెనుకకును ముందునకును వీచుచున్న వాయువులయొక్క, పర్యాయవృత్త్యా - క్రమవర్తనముచేత, ప్రవృద్ధౌ - వృద్ధిని పొందిన, మహార్ణవోర్మీఇవ - రెండు గొప్ప సముద్ర తరంగములవలె, ఇతరేతరస్మాత్ - ఒకదానివలన నొకటి. అవ్యవస్థం - నిలుకడలేని, జయం - జయమును, భంగం చ - పరాజయమును గూడ, ఆపతుః - పొందినవి. ఒకప్పు డజాని సైన్యమునకును మరియొకప్పుడు శత్రు సైన్యమునకును జయ పరాజయములు కలుగుచుండెననియు, నది గాలి తాకి

దికి వెనుకకును ముందునకును వచ్చుచు పోవుచున్న రెండు గొప్ప సముద్ర తరంగముల కదలికవలె మనోహరముగా నుండెననియు భావము.

శ్లో. పరేణ భగ్నేఽపి బలే మహౌజాః
యయావజః ప్రత్యరిసైన్య మేవ
ధూమో నివర్త్యేత సమీరణేన
యతస్తు కక్ష స్తత ఏవ వహ్నిః. 55

వ్యాఖ్య: బలే - తన సైన్యము, పరేణ - శత్రుసైన్యముచేత, భగ్నేఽపి - పరాజయము నొందినదైనను, మహౌజాః - మహాబల సంపన్నుఁడైన, అజః - అజుఁడు, అరిసైన్యం, ప్రతి, ఏవ - శత్రుసైన్యము మీదికే, యయౌ - వెళ్లెను, సమీరణేన - గాలిచేత, ధూమః - పొగ, నివర్త్యేత - మరలింపబడవచ్చును (గడ్డిపరకల మీదినుండి పొగను గాలిప్రక్కకు త్రోయఁ గలుగవచ్చును). వహ్నిః తు - అగ్నియైనచో, యతః - ఎచ్చట, కక్షః - గడ్డికలదో, తతః ఏవ - అచ్చటనే జ్వలించును. సైన్యము పొగవలె చలించినను, అజుఁ డగ్నివలె చలింపక శత్రు సైన్యమును దహించెనని భావము.

శ్లో. రథీ నిషంగీ కవచీ ధనుష్మాన్
దృప్తః స రాజన్యక మేకవీరః
నివారయామాస మహావరాహః
కల్పక్షయోద్వృత్త మివార్ణవాంభః. 56

వ్యాఖ్య: రథీ - రథారూఢుడు, నిషంగీ - తూణీరమును (అమ్ముల పొదిని) ధరించినవాఁడును, కవచీ - మంచి కవచమును దొడిగిన వాడును, ధనుష్మాన్ - ధనుర్ధరుఁడును, దృప్తః - రణ గర్వితుఁడును, ఏకవీరః - అసహాయ శూరుఁడును నగు, సః - ఆ యజమహారాజు, రాజన్యకం - రాజ సమూహమును, మహావరాహః - వరహావతారమునెత్తిన విష్ణువు, కల్పక్షయోద్వృత్తం - ప్రళయ కాలమునందు చెలియలికట్టలు దాటి యెగసి పడుచున్న, అర్ణవాంభః ఇవ సముద్ర జలమునువలె, నివారయామాస - వెనుకకు నెట్టివేసెను. అజుఁడు శత్రు సైన్యమును వెనుకకు నెట్టివేసెను. కల్పమనగా బ్రహ్మకల్పము (సృష్టి); దాని క్షయము ప్రళయము.

శ్లో. స దక్షిణం తూణముఖేన వామం
వ్యాపారయన్ హస్త మలక్ష్య తాజౌ
ఆకర్ణకృష్టా సకృ దస్య యోద్ధుః
మౌర్వీవ బాణాన్ సుషువే రిపుఘ్నాన్. 57

వ్యాఖ్య: సః - ఆ యజుఁడు, ఆజౌ - యుద్ధమునందు, దక్షిణం. హస్తం - కుడిచేతిని, తూణముఖేన - తూణీర రంధ్రముతో, వామం - అతి సుందరముగా, వ్యాపారయన్ - పనికలదానినిగా చేయుచున్నవాఁడై, అలక్ష్యత - ఇతరులచేత చూడఁబడెను (అతని కుడిచేయి అమ్ములపొది రంధ్రమువద్ద కదలుచున్నట్లు కనపడుచుండెనే కాని బాణములు తీయుట వేయుట మొదలైన కదలికలు కనఁబడకుండెను) సకృత్ - ఒకప్పుడు, ఆకర్ణకృష్టా - చెవివరకును లాగఁబడినదియగు, యోద్ధుః, అస్య, మౌర్వీ - యుద్ధవీరుఁడగు నతని యల్లెత్రాడు, రిపుఘ్నాన్ - శత్రువులను చంపునట్టి, బాణాన్ - శరములను, సుషువే, ఇవ - ప్రసవించినదివలె నుండెను (మౌర్వి నుండి బాణములు బయలుదేరుటయే తప్ప వాని నతఁడు నిషంగమునుండి తీసి సంధించినది కనపడకుండెనని భావము, అనఁగా నంత వేగముగా శరసంధానాదులు జరిగినవని తాత్పర్యము). అలంకారము: ఉత్ప్రేక్ష. 'మౌర్వీ' స్త్రీ లింగము కనుక బాణములను ప్రసవింపఁ గలిగినది.

శ్లో. స రోషదష్టాధిక లోహితోష్ఠైః
వ్యక్తోర్ధ్వరేఖా భ్రుకుటీ ర్వహద్భిః
తస్తార గాం భల్లనికృత్త కంఠైః
హుంకారగర్భైః ద్విషతాం శిరోభిః. 58

వ్యాఖ్య: సః - ఆ యజుఁడు, రోషదష్టాధిక లోహితోష్ఠైః - క్రోధముచేత కొఱుకబడి యెక్కువ యెఱ్ఱబారిన పెదవులు గలవియును, వ్యక్తోర్ధ్వ రేఖాః - స్పష్టముగాఁ గనపడుచున్న ఊర్ధ్వరేఖలుగలవియు నగు, భ్రుకుటీః - బొమముడులను, వహద్భిః - కలిగియున్నట్టివియు, భల్లనికృత్త కంఠైః - బల్లెములచేత తెగవేయఁబడిన కంఠములు గలవియు, హుంకారగర్భైః-'హుం' అని పలుచున్నవియు నగు, ద్విషతాం, శిరోభిః - శత్రువులయొక్క శిరస్సులచేత, గాం - భూమిని,

తస్తార - పరచివేసెను. క్రోధముచేత పెదవులు గఱచిపట్టి, బొమముడులు వేసి కొని తెగిపడిన శత్రువుల తలలతో అర్జునుడు భూమిని పరచివేసెనని భావము.

శ్లో. సర్వై ర్బలాంగై ర్ద్విరద ప్రధానైః
సర్వాయుధైః కంకటభేదిభిశ్చ
సర్వప్రయత్నేన చ భూమిపాలాః
తస్మిన్ ప్రజహ్రు ర్యుధి సర్వ ఏవ. 59

వ్యాఖ్య: ద్విరద ప్రధానైః-ఏనుగులు మొదలయిన, సర్వైః, బలాంగైః- అన్ని సేనాంగములచేతను, కంకటభేదిభిః - కవచములను జీల్చగల, సర్వాయుధైశ్చ - అన్ని ఆయుధములచేతను, సర్వప్రయత్నేనచ - సమస్త ప్రయత్నము చేతను, సర్వఏవ (సర్వే + ఏవ) - అందరునుగూడ, భూమిపాలాః - రాజులు, యుధి - యుద్ధమునందు, తస్మిన్ - ఆ యర్జునియందు, ప్రజహ్రుః - ఎక్కువగా కొట్టిరి (అతనిని కొట్టిరని యర్థము). ఒకనిపై నందఱుఁ గవిసిరి. ఇచ్చట 'తస్మిన్' అను సప్తమ్యంతము, 'తం' అను ద్వితీయా విభక్త్యర్థమునందు ప్రయోగింపఁ బడినది. అతని పైఁబడి కొట్టిరనిభావము.

శ్లో. సోఽస్త్రవ్రజై శ్ఛన్నరథః పరేషాం
ధ్వజాగ్ర మాత్రేణ బభూవ లక్ష్యః
నీహార మగ్నో దిన పూర్వభాగః
కించిత్ ప్రకాశేన వివస్వతేవ. 60

వ్యాఖ్య: పరేషాం - శత్రువులయొక్క, అస్త్రవ్రజైః - బాణ సమూహములచేత, ఛన్నరథః - కప్పిచేయబడిన రథముగల, సః - ఆ యర్జునుఁడు, నీహార మగ్నః - మంచు చేత ముంచివేయఁబడిన, దినపూర్వభాగః - ప్రాతః కాలము, కించిత్ ప్రకాశేన-కొంచెముగా కనపడుచున్న. వివస్వతేవ (వివస్వతా + ఇవ) సూర్యునిచేతవలె, ధ్వజాగ్రమాత్రేణ - రథ పతాకముయొక్క చివరి భాగము చేత మాత్రము, లక్ష్యః - కనపడువాడు, బభూవ - అయ్యెను. ఆ పతాకాగ్ర భాగముతప్ప మరి యేదియు చూపఱులకు గానరాకుండెనని భావము.

శ్లో. ప్రియంవదాత్ ప్రాప్త మసౌ కుమారః
ప్రాయుంక్త రాజ స్వధిరాజసూనుః
గాంధర్వ మస్త్రం కుసుమాస్త్ర కాంతః
ప్రస్వాపనం స్వప్న నివృత్త లౌల్యః. 61

వ్యాఖ్య: అధిరాజసూనుః - మహారాజపుత్రుఁడును, కుసుమాస్త్ర కాంతః - మదన సుందరుఁడును, స్వప్న నివృత్తలౌల్యః—స్వప్న - నిద్రనుండి, నివృత్త- మరలిన, లౌల్యః - చాపల్యము గలవాఁడునగు (అనగా జాగరూకుఁడు), అసౌ కుమారః - ఈ అజమహారాజు, ప్రియంవదాత్ - పూర్వముచెప్పిన ప్రియంవదుఁడును గంధర్వునివలన, ప్రాప్తం - లభించిన, గాంధర్వం - గంధర్వ దేవతాకమైనదియు, ప్రస్వాపనం - నిద్రింపఁజేయునదియునగు, అస్త్రం - అస్త్రమును, రాజసు - రాజులమీద, ప్రాయుంక్త - ప్రయోగించెను. మిక్కిలి జాగ్రత్తగలయతఁడు వారిపై తనవద్దనున్న గాంధర్వాస్త్రమును ప్రయోగించెను. అజుఁడు స్వయంవరార్థము భోజరాజధానికి బయలుదేరినప్పుడు దారిలో నర్మదానది నుండి లేచి వచ్చిన వనగజముగా నుండిన గంధర్వుఁడే యీ ప్రియంవదుఁడు. అట్టి అస్త్రమువేసి ఆ రాజులందఱును మూర్ఛిల్లునట్లు చేసెనని భావము.

శ్లో. తతో ధనుష్కర్షణ మూఢ హస్త
మేకాంస పర్యస్త శిరస్త్ర జాలమ్
తస్థౌ ధ్వజస్తంభ నిషణ్ణ దేహం
నిద్రావిధేయం నరదేవ సైన్యమ్. 62

వ్యాఖ్య: తతః - తర్వాత, ధనుష్కర్షణమూఢహస్తం—ధనుష్కర్షణ - చాపమును లాగుటయందు, మూఢహస్తం - పనిచేయని చేతులు కలదియును, ఏకాంస పర్యస్త శిరస్త్రజాలం—ఏకాంస - ఒక బుజముమీద, పర్యస్త - జారిపడిన, శిరస్త్రజాలం - కిరీటములు కలదియును, ధ్వజస్తంభ నిషణ్ణదేహం - తమ తమ జెండా కఱ్ఱలమీద జేరఁగిలబడిన శరీరములు కలదియునగు, నరదేవసైన్యం - శత్రురాజులయొక్క సైన్యము, నిద్రావిధేయం - నిద్రకు వశమైనదియై, తస్థౌ - కదలక నిలచిపోయెను. అనగా ప్రతిసైనికుఁడును ధనుస్సును లాగలేక, కిరీటము

భుజముపై జాఱి, జెండాకొయ్యకుఁ జేరగిలపడి, నిద్రవోయెనట; అనగా మూర్ఛిల్లె నని భావము.

శ్లో. తతః ప్రియోపాత్తరసే ఽధరోష్ఠే
నివేశ్య దధ్మౌ జలజం కుమారః
తేన స్వహస్తార్జిత మేకవీరః
పిబన్ యశో మూర్తమివావభాసే. 63

వ్యాఖ్య: తతః - పిమ్మట, కుమారః - అజుఁడు, ప్రియోపాత్తరసే—ప్రియా - ప్రియురాలైన యిందుమతిచేత, ఉపాత్త - ఆస్వాదింపబడిన, రసే - మాధుర్యముగల, అధరోష్ఠే - క్రింది పెదవిమీద, జలజం - శంఖమును, నివేశ్య-ఉంచుకొని, దధ్మౌ - పూరించెను, తేన - ఆ శంఖముచేత, ఏకవీరః - అస హాయ శూరుడైన యతఁడు, స్వహస్తార్జితం - తనచేతితో సంపాదింప బడినదియు, మూర్తం - ఒక స్వరూపము ధరించినదియునగు, యశః - కీర్తిని, పిబన్, ఇవ - త్రాగుచున్నవాఁడువలె, అవభాసే - ప్రకాశించెను (యశస్సు తెల్లనిది కనుక శంఖము మూర్తిమంతమైన యశస్సుగా నూహింపఁబడినది). 'జలజ' శబ్దమునకు కమల మనియు, శంఖ మనియు నర్థములు. విజయసూచక శంఖారావమును జేసె నని భావము.

శ్లో. శంఖస్వనాభిజ్ఞతయా నివృత్తాః
తం సన్నశత్రుం దదృశుః స్వయోధాః
నిమీలితానా మివ పంకజానాం
మధ్యే స్ఫురంతం ప్రతిమాశశాంకమ్. 64

వ్యాఖ్య: శంఖ స్వనాభిజ్ఞతయా - ఆ శంఖ నాదము నెఱిఁగి యుండుట చేత, నివృత్తాః - వెనుకకు మరలివచ్చిన. స్వయోధాః - తన సైనికులు, సన్న శత్రుం - మూర్ఛితులైన శత్రువులుగల, తం - ఆ యజమహారాజును, నిమీలితానాం - ముకుళించినట్టి, పంకజానాం - కమలములయొక్క. మధ్యే - మధ్య ప్రదేశమునందు, స్ఫురంతం - ప్రకాశించుచున్న, ప్రతిమాశశాంకం, ఇవ - ప్రతి బింబరూపమున నున్న చంద్రునివలె, దదృశుః - చూచిరి. చంద్రుఁడున్న సమయ

మున కమలములు ముకుళించును కనుక కనులు మూసుకొని పడియున్న శత్రుముఖ ములనడుమ ప్రకాశించుచున్న అజుఁడు చంద్రుని ప్రతిబింబముగా నూహింపఁ బడినాడు. అట్లున్న యజుని వెనుకకు మరలివచ్చిన యతని సైనికులు సంతోషమున జూచిరి.

శ్లో. సశోణితై స్తేన శిలీముఖాగ్రైః
నిక్షేపితాః కేతుషు పార్థివానామ్
"యశో హృతం సంప్రతి రాఘవేణ
న జీవితం వః కృపయేతి" వర్ణాః. 65

వ్యాఖ్య: సంప్రతి - ఇప్పుడు, రాఘవేణ - రఘుకుమారుఁడైన అజుని చేత (పూర్వము రఘు మహారాజుచేత నని భావము), హే రాజానః - ఓ రాజులారా! వః - మీయొక్క, యశః - కీర్తి, హృతం - హరింపఁ బడినది, జీవితం - ప్రాణము, కృపయా - దయచేత, న - హరింపఁ బడలేదు, ఇతివర్ణాః - ఈ విధమైన అక్షరములు, సశోణితైః - రక్తముతో తడిపిన, శిలీముఖాగ్రైః - బాణాగ్రములచేత, తేన - ఆ యజునిచేత, పార్థివానాం - మూర్ఛితులైన రాజుల యొక్క, కేతుషు - జెండాలమీద, నిక్షేపితాః - వ్రాయింపబడినవి". ఓ రాజులారా! రఘు కుమారుఁడైన యజునిచేత మీకీర్తి మాత్రమే హరింపఁ బడినది, దయచేత మీ ప్రాణములు హరింపఁ బడలేదు" అను వాక్యమును రక్తముతో వారి ధ్వజ స్తంభములమీద వ్రాయించెను. అది చూచుకొని వారు తమ తమ రాజ్యములకు వెళ్లి పోవలయునని యభిప్రాయము.

శ్లో. స చాపకోటీ నిహితైక బాహుః
శిరస్త్ర నిష్కర్షణ భిన్న మౌళిః
లలాటబద్ధ శ్రమవారి బిందుః
భీతాం ప్రియా మేత్య వచో బభాషే. 66

వ్యాఖ్య: చాపకోటీ నిహితైకబాహుః — చాపకోటీ - వింటికప్పుమీద, నిహిత - ఉంచబడిన, ఏకబాహుః - ఒక బాహువు కలవాడును, శిరస్త్ర నిష్కర్షణ భిన్నమౌళిః — శిరస్త్ర నిష్కర్ష - కిరీటమును తీయుటచేత, భిన్నమౌళిః - చెదరిన

జుట్టు కలవాఁడును, లలాటబద్ధ శ్రమవారిబిందుః - లలాటమునందు నిల్చిన చెమట చుక్కలు కలవాఁడును నగు. సః - ఆ యజమహారాజు, భీతాం - భయపడి యున్న, ప్రియాం - ప్రియురాలైన యిందుమతిని, ఏత్య - చేరి, వచః బభాషే - మాట్లాడెను. యుద్ధమును విరమించిన యజుడు వింటికొప్పుపై బాహువును పెట్టు కొని కిరీటముతీసి చెదరిన జుట్టుతో చెమటపట్టిన ముఖముతో ఇందుమతిని పలుక రించెను. అంతవఱకు యుద్ధాసక్తుఁడై ప్రియురాలినిసైతము పలుకరింపలేదని భావము. ఇందులో అజునిమూర్తి చక్కఁగా చిత్రింపఁబడినది.

అవ : ఏమని భాషించెనో చెప్పుచున్నాడు.

శ్లో. ఇతః పరా నర్భక హార్య శస్త్రాన్
వైదర్భి ! పశ్యానుమతా మయాసి
ఏవం విధేనాహావ చేష్టితేన
త్వం ప్రార్థ్యసే హస్తగతా మమైభిః. 67

వ్యాఖ్య : హే వైదర్భి! - ఓ యిందుమతీ! ఇతః - ఇటువైపున, అర్భక హార్య శస్త్రాన్ - పసివానిచేత గూడ నెత్తుకుపోవుటకు వీలైన శస్త్రములుగల, పరాన్ - శత్రువులను, పశ్య - చూడుము, మయా - నాచేత, అనుమతా, అసి - చూచుట కంగీకరింపఁ బడితివి (నీవు చూడవచ్చును), ఏభిః - ఈ రాజులచేత, ఏవంవిధేన - ఈ విధమైన (నిద్రారూపమైన), చేష్టితేన - రణకర్మచేత, మమ, హస్తగతా - నా చేతిలోనున్న, త్వం - నీవు, ప్రార్థ్యసే - కోరబడుచున్నావు (అపహరింప దలపబడుచున్నావు). అనగా ఇంత శౌర్య హీనులైన వీరు నిన్ను నా చేతినుండి తప్పించి యెత్తుకుపోదలఁచి యున్నారని చేతితో వారిని జూపుచు ఇందుమతితో పరిహాస పూర్వకముగా భాషించెను. పసిపిల్లలుగూడ ఇప్పుడు వారి చేతిలోని శస్త్రములను లాగుకొనవచ్చును, కనుక నీవు నిర్భయముగా చూడుమని భావము.

శ్లో. తస్యాః ప్రతిద్వంద్విభవా ద్విషాదాత్
సద్యో విముక్తం ముఖ మాబభాసే
నిశ్వాస బాష్పాపగమా త్ప్రపన్నః
ప్రసాద మాత్మీయ మివా త్మదర్శః. 68

వ్యాఖ్య : ప్రతిద్వంది భవాత్ - శత్రువులవలన కలిగిన, విషాదాత్ - దైన్యమునుండి, సద్యః - వెంటనే, విముక్తం - విడువఁబడిన, తస్యాః, ముఖం - ఆ యిందుమతియొక్క ముఖము, నిశ్వాస బాష్పాపగమాత్ - నిట్టూర్పు యొక్క ఆవిరి తొలఁగిపోవుట వలన, ఆత్మీయం - తనదియైన, ప్రసాదం - నిర్మలత్వమును, ప్రపన్నః - పొందిన, ఆత్మదర్శః, ఇవ - అద్దమువలె, ఆబభాసే - చక్కగా ప్రకాశించెను. ఆ మాటలువిని దుఃఖమును విడిచిన ఇందుమతి ముఖము ప్రసన్నమై దర్పణము వలె ప్రకాశించెను. "ఆత్మదర్శః" అనగా అద్దము, ఆత్మా - స్వరూపం, దృశ్యతే అనేన ఇతి ఆత్మదర్శః అని విగ్రహము. అనగా దీనిచేత మన స్వరూపము చూపబడునని యర్థము. దీనికి పర్యాయపదము "ఆదర్శము". "దర్పణే ముకురాదర్శౌ" అని యమరము.

శ్లో. హృష్టాఽపి సా హ్రీవిజితా న సాక్షాత్
వాగ్భిః సఖీనాం ప్రియ మభ్యనందత్
స్థలీ నవాంభఃపృషతాభివృష్టా
మయూర కేకాభి రివాభ్ర బృందమ్. 69

వ్యాఖ్య : సా - ఆ యిందుమతి, హృష్టాపి - భర్తయొక్క పౌరుషము చేత మిక్కిలి సంతోషించినదైనను, హ్రీవిజితా - సిగ్గుచేత జయింపఁబడినదియై యుండుటవలన (ముగ్ధ కావున ఇంకను సిగ్గే ఆమెకు ఎక్కువగా నుండెనని భావము), ప్రియం - పతియగు నజుని, సాక్షాత్ - తానుగా, న అభ్యనందత్ - మెచ్చుకొనలేదు, (కింతు - కాని), నవాంభఃపృషతాభివృష్టా—నవాంభఃపృషత - తొలకరి వాన చినుకులచేత, అభివృష్టా - బాగా వర్షింపఁబడిన (తడుపబడిన), స్థలీ - భూమి, అభ్రబృందం - మేఘ సంఘమును, మయూరకేకాభిః, ఇవ - నెమలికేకలచేత వలె, సఖీనాం, వాగ్భిః - చెలికత్తెల వాక్కులచేత (చెలుల పలుకులద్వారా) అభ్యనందత్ - ప్రశంసించెను. తొలకరి వర్షముచేత తృప్తిపడినఁ భూమి నెమలి కేకలద్వారా మేఘమును ప్రశంసించినట్లు, ముగ్ధయైన యిందుమతి, హర్షించినదైనను, సిగ్గుచేత తాను స్వయముగా గాక చెలికత్తెలద్వారా వీరాగ్రేసరుడైన యజునికి అభినందనములు తెలిపెనని భావము.

శ్లో. ఇతి శిరసి స వామం పాద మాధాయ రాజ్ఞాం
ఉదవహ దనవద్యాం తా మవద్యా దపేతః

రథ తురగ రజోభి స్తస్య రూక్షాలకాగ్రా
సమరవిజయలక్ష్మీః సైవ మూర్తా బభూవ. 70

వ్యాఖ్య: అవద్యాత్, అపేతః - నింద్యమునుండి తొలఁగిన (నిర్దోషి యైన), సః - ఆ యజుఁడు, ఇతి - ఈ విధముగా (వెనుక చెప్పినట్లు), రాజ్ఞాం - రాజులయొక్క, శిరసి - తలమీద, వామం, పాదం - ఎడమకాలిని, ఆధాయ - ఉంచి (అందఱిని ఓడించి), అనవద్యాం - దోషరహితయైన, తాం - ఆ యిందుమతిని, ఉదవహత్ - తీసుకవెళ్లెను (తనదానినిగాఁ జేసికొనెను), తస్య - ఆ యజునికి, రథతురగరజోభిః - రథముల యొక్కయు, గుఱ్ఱముల యొక్కయు దుమ్ములచేత, రూక్షాలకాగ్రా—రూక్ష - గలుసుబాఱిన (మెత్తదనము పోయిన), అలకాగ్రా - ముంగురుల కొనలుగల, సైవ (సా + ఏవ) - ఆ యిందుమతియే, మూర్తా - శరీరమును ధరించిన, సమర విజయలక్ష్మీః - యుద్ధమునందు లభించిన విజయలక్ష్మి, బభూవ - అయ్యెను. అట్లు శత్రువుల నోడించి, తన రథముపైఁ దీసుక పోబడుచున్న యిందుమతి సైన్య ధూళిచే గలుసుబారిన ముంగురులు గలది యగుచు, విజయలక్ష్మి సాక్షాత్కరించి అజుని రథముపై నెక్కివచ్చుచున్న ట్లుండె నని భావము. అంతకంటె వేరైన విజయలక్ష్మి లాభమేమున్నది?

శ్లో. ప్రథమపరిగతార్థ స్తం రఘుః సన్నివృత్తం
విజయిన మభినంద్య శ్లాఘ్య జాయా సమేతమ్
తదుపహితకుటుంబః శాంతిమార్గోత్సుకోఽభూత్
న హి సతి కులధుర్యే సూర్యవంశ్యా గృహాయ. 71

వ్యాఖ్య: ప్రథమ పరిగతార్థః—ప్రథమ - అజుఁడు రాకముందే, పరిగత- తెలియబడిన, అర్థః - వివాహ, విజయరూపమైన విషయముగల. రఘుః - రఘు మహారాజు, విజయినం - విజయముతోఁ గూడిన వాఁడును, శ్లాఘ్యజాయా సమేతం - మెచ్చుకో దగిన భార్యతోఁ గూడిన వాఁడును, సంనివృత్తం - తిరిగి వచ్చిన వాఁడుననగు, తం - ఆ యజుని, అభినంద్య - అభినందించి, తదుపహిత కుటుంబఃసన్ - ఆ యజుని పోషణము నందుంచబడిన భార్య గలవాఁడగుచు (తన భార్యను కుమారుఁడైన యజునివద్దనుంచి), శాంతి మార్గోత్సుకః—శాంతిమార్గ -

మోక్షమార్గమునందు, ఉత్సుకః - అభిలాష గలవాఁడు. అభూత్ - అయ్యెను, హి - అదియుక్తమే, కులధుర్యే - ఇంటిని చక్కదిద్దగలవాఁడు లేదా కుటుంబభార మును మోయఁగలవాఁడు, సతి - ఉన్నవాఁడుకాగా, సూర్యవంశ్యాః - సూర్య వంశమునందు పుట్టిన రాజులు, గృహాయ - గృహస్థాశ్రమముకొఱకై, నభవంతి - ఉండరు. చారులద్వారా ముందే అజుని వృత్తాంతము నెఱిఁగిన రఘు మహారాజు ఆతడు రాగానే అభినందించి, విజయవంతుడు యోగ్యురాలైన భార్యగలవాడు నగు అజుని పోషణమునందు తల్లిని నిల్పి, తమ వంశాచారానుసారముగా మోక్షార్థమై వానప్రస్థాశ్రమమును స్వీకరించుటకు ఉద్యుక్తుఁడయ్యెను. "వార్ధకే మునివృత్తీనాం" అని పూర్వము చెప్పఁబడిన రీతిగా నని భావము.

ఇది మహాకవి కాళిదాసకృత రఘువంశ

కావ్యమున సప్తమ సర్గమునకు

తెలుఁగు లఘువ్యాఖ్య

# మహాకవి కాళిదాసకృత రఘువంశము

## అష్టమ సర్గము

శ్లో. అథ తస్య వివాహ కౌతుకం
లలితం బిభ్రత ఏవ పార్థివః
వసుధా మపి హస్తగామినీం
అకరో దిందుమతీ మివాపరామ్. 1

వ్యాఖ్య: అథ - తరువాత, పార్థివః - రఘుమహారాజు, లలితం - మనోహరమైన, వివాహకౌతుకం - వివాహ మంగళమును (వివాహ దీక్షాకంకణమును), బిభ్రతః, ఏవ - ధరించినవాఁ డగుదుండగానే, తస్య - ఆ యజునికి, అపరాం - రెండవదియైన, ఇందుమతీం, ఇవ - ఇందుమతినివలె, వసుధాం, అపి - భూమిని గూడ, హస్తగామినీం - చేతికి వచ్చినదానిని (స్వాధీనమైన దానినిగా), అకరోత్ - చేసెను. వివాహదీక్షా కంకణ విసర్జనం చేయకమునుపే అజునిపై రాజ్యభారము నుంచి కోసలభూపతిని జేసెనని భావము.

శ్లో. దురితై రపి కర్తు మాత్మసాత్
ప్రయతంతే నృపసూనవో హి యత్
త దుపస్థిత మగ్రహీ దజః
పితు రాజ్ఞేతి న భోగతృష్ణయా. 2

వ్యాఖ్య: నృపసూనవః - రాజపుత్రులు, యత్ - ఏ రాజ్యమును, దురితైః, అపి - పాపకృత్యముల చేతఁగూడ (తండ్రికి, అన్నలకు విషముపెట్టుట, రహస్యముగా చంపుట మొదలైన అకృత్యములచేత నని యర్థము). ఆత్మసాత్, కర్తుం - స్వాధీనము చేసుకొనుటకొఱకు, ప్రయతంతేహి - ప్రయత్నించుచుందురుగదా! ఉపస్థితం - అప్రయత్నముగా వచ్చిన, తత్ - అట్టి రాజ్యమును, అజః - అజుఁడు, పితురాజ్ఞేతి (పితుః + ఆజ్ఞా + ఇతి) - తండ్రియొక్క ఆజ్ఞగదా

అను కారణమువలననే, అగ్రహీత్ - స్వీకరించెను. భోగాభిలాషచేత గాక తండ్రి యాజ్ఞ అనుల్లంఘనీయమను కారణముచేతనే అజుఁడు రాజ్యభారమును వహించె నని భావము.

శ్లో. అనుభూయ వసిష్ఠసంభృతైః
సలిలై స్తేన సహాభిషేచనమ్
విశదోచ్ఛ్వసితేన మేదినీ
కథయామాస కృతార్థతా మివ. 3

వ్యాఖ్య: మేదినీ - భూమి, వసిష్ఠేన - వసిష్ఠమునిచేత, సంభృతైః - సంపాదింపఁ బడిన, సలిలైః - (చతుస్సముద్రములయు, మహానదులయు జలములచేత) ఉదకములచేత, తేనసహ - ఆ యజమహారాజుతోఁ గూడ, అభిషేచనం - అభిషేకమును (స్నానమును), అనుభూయ - అనుభవించి, విశదోచ్ఛ్వసితేన - స్ఫుటమైన నిట్టూర్పుచేత, కృతార్థతాం - తన ధన్యత్వమును, కథయామాస, ఇవ - చెప్పినదివలె నుండెను. అజునికి సమంత్రకముగా పట్టాభిషేకము జరిగినది. ఇచ్చట 'మేదినీ' శబ్దమువలన పట్టమహిషికానున్న యిందుమతియు నని ధ్వన్యర్థము. జలసిక్తమైన భూమి వెచ్చని గాలిని పైకి విడుచుట సహజము. అది యిచ్చటభూదేవి ఉచ్ఛ్వాసముగను, అజునితో కలిసి పట్టాభిషేక సుఖము ననుభవించిన యిందుమతియొక్క ఆనంద నిర్మలోచ్ఛ్వాసముగను వర్ణింపఁ బడినది. ఇందుమతియు, భూదేవియు ధన్యం మన్యలైనారని తాత్పర్యము. భూదేవి యితని వల్లనే మిక్కిలి తృప్తురాలైనది పూర్వులైన దిలీపాదులచేత కాలేదని యర్థముకాదు, ఇది అజ ప్రశంసామాత్రపరము.

శ్లో. స బభూవ దురాసదః పరైః
గురుణాఽథర్వవిదా కృతక్రియః
పవనాగ్ని సమాగమో హ్యయం
సహితం బ్రహ్మ యదస్త్రతేజసా. 4

వ్యాఖ్య: అథర్వవిదా - అథర్వ వేదము తెలిసిన, గురుణా - కులగురువగు వసిష్ఠునిచేత, కృతక్రియః - అథర్వ వేదోక్త విధానముచేత చేయఁబడిన అభి

షేక సంస్కారము గలవాఁడైన, సః - ఆ యజుఁడు, పరైః - శత్రువులచేత, దురాసదః - ఎదిరించుటకు వీలులేనివాఁడు, బభూవ - అయ్యెను, (తథాహి - అది యుక్తమే), అస్త్రతేజసా - క్షాత్రతేజముచేత, సహితం - కూడిన, యత్, బ్రహ్మ - ఏ బ్రహ్మతేజమైతే కలదో, అయం - ఇది, పవనాగ్ని సమాగమః, హి - అగ్ని వాయువుల కలయికవంటిది గదా ; అజుఁడు క్షాత్రతేజముచేతనే శత్రువులకు ఎదిరింప వీలుపడనివాఁడు, ఇక నతనికి వసిష్ఠ మంత్ర ప్రభావముకూడ చేకూరిననాడు చెప్పవలసిన దేమున్నదని భావము. క్షాత్ర సహాయములేని బ్రహ్మతేజముగాని బ్రహ్మతేజస్సహాయము లేని క్షాత్రతేజము గాని వృద్ధిని జెందఁజాలవు. ఆ రెండు కలిసి పనిచేయునప్పుడే యైహికాముష్మికఫలము, దేశశ్రేయస్సు వృద్ధి చెందునని మనువు చెప్పెను. "నాక్షత్రం బ్రహ్మ భవతి, క్షత్రం నాబ్రహ్మ వర్ధతే, బ్రహ్మక్షత్రే తు సంయుక్తే ఇహాముత్ర చ వర్ధతే". అనగా విద్యా వైజ్ఞానిక బలము సైన్య బలము కలిసి పనిచేయుటయే ప్రజాసౌఖ్యమునకు మూలమగునని తాత్పర్యము.

శ్లో. రఘు మేవ నివృత్తయౌవనం
త మమన్యంత నవేశ్వరం ప్రజాః
స హి తస్య న కేవలాం శ్రియం
ప్రతిపేదే సకలాన్ గుణా నపి. 5

వ్యాఖ్య : ప్రజాః - ప్రజలు, నవేశ్వరం - క్రొత్త ప్రభువైన, తం - ఆ యజుని, నివృత్తయౌవనం - తిరిగివచ్చిన యౌవనదశగల, రఘుమేవ - రఘు మహారాజును గానే, అమన్యంత - తలంచిరి, హి - ఎందువలన ననగా, సః - అజుఁడు, తస్య - ఆ రఘుమహారాజుయొక్క, కేవలాం, శ్రియం - ఒక రాజ్య లక్ష్మినే, న ప్రతిపేదే - పొందలేదు, సమాన్, గుణాన్, అపి - సమస్తమైన శౌర్యదాక్షిణ్యాది గుణములను సైతము ప్రతిపేదే - పొందెను. అజుఁడు సర్వ విధముల తండ్రిని పోలి యుండుటచేత నతనిని జూచినప్పుడు ప్రజలు రఘు మహారాజుకే తిరిగి యౌవనము వచ్చి యిట్లున్నాడా ? యని భావించుచుండిరని భావము. అలంకారము : ఉత్ప్రేక్ష.

శ్లో. అధికం శుశుభే శుభంయునా
ద్వితయేన ద్వయ మేవ సంగతమ్
పద మృద్ధ మజేన పైతృకం
వినయేనాస్య నవం చ యౌవనమ్. 6

వ్యాఖ్య: ద్వయమేవ - ఒక జంటయే, శుభంయునా - శుభాన్వితమైన, ద్వితయేన - మరియొక జంటతో, సంగతం - కూడినదియై, అధికం - ఎక్కువగా, శుశుభే - ప్రకాశించెను, (ఏ జంట యే జంటతోననగా) పైతృకం - తండ్రి నుండి వచ్చినదియు, ఋద్ధం - సమృద్ధిగల, పదం - రాజ్యస్థానము, అజేన - అజునితోను, అస్య - అజునియొక్క, నవం, యౌవనం - నూతనమైన యౌవనము, వినయేనచ - ఇంద్రియ నిగ్రహ రూపమైన వినయముతోను అని. రాజ్యమునకు అజుఁడు అలంకారముగాను, అజునికి వినయము అలంకారముగాను ఉండెననియు, రాజ్యలాభము వలన ఒక ప్రాకృతునివలె అజుఁడు గర్వము పొందినవాఁడు కాలేదనియు తాత్పర్యము.

శ్లో. సదయం బుభుజే మహాభుజః
సహసోద్వేగ మియం వ్రజేదితి
అచిరోపనతాం స మేదినీం
నవ పాణిగ్రహణాం వధూ మివ. 7

వ్యాఖ్య: మహాభుజః, సః - పరాక్రమవంతుఁడైన ఆ యజుఁడు, అచిరోపనతాం - క్రొత్తగాఁ దనను చేరిన, మేదినీం - భూమిని, నవపాణిగ్రహణాం - క్రొత్తగా వివాహమైన, వధూంఇవ - స్త్రీనివలె, సహసా (చేత్) - బలాత్కారముచేత నైనచో, ఇయం - ఈ మేదిని, ఉద్వేగం - భయమును, వ్రజేత్ - పొందవచ్చును, ఇతి - అనుకారణమున, సదయం - దయగలుగునట్లుగా, బుభుజే - అనుభవించెను. నవవధూ సమాగమమునందు బలాత్కారము పనికి రానట్లే, నూతన రాజ్యానుభవమునందు కర్కశ కఠిన కోపములు పనికిరావు కనుక దయాపూర్వకముగా ప్రజాపాలనము చేయుట కారంభించెనని భావము. ఇచ్చట మేదినీ శబ్దము నవవధువుతో పోల్చఁబడుట రమణీయముగా నుండుటయేకాక క్రొత్తగా రాజ్యమునకు వచ్చిన వాఁడెట్లు ప్రవర్తింపవలెనో సూచింపఁబడినది. కాళిదాసు సందేశము లన్నియు నిట్లే లలిత లలితములుగా నుండును. అదియేగదా కావ్యమునందలి కాంతాసమ్మితత్వము.

శ్లో. అహ మేవ మతో మహీపతే
రితి సర్వః ప్రకృతి ష్వచింతయత్

ఉదధే రివ నిమ్నగాశతే
ష్వభవన్నాస్య విమాననా క్వచిత్. 8

వ్యాఖ్య : ప్రకృతిషు - ప్రజలయందు, సర్వః - ప్రతివాఁడును, అహమేవ - నేనే, మహీపతేః - రాజునకు, మతః - ఇష్టమైనవాఁడను, ఇతి - ఇట్లని, అచింతయత్ - తలంచెను, ఉదధేః - సముద్రమునకు, నిమ్నగాశతేషు, ఇవ - నదీ శతములయందువలె (అనేక నదులయందు వలె), అస్య - ఈ అజమహారాజునకు, క్వచిదపి - ఎవనియందును, విమాననా - తిరస్కారము, న అభవత్ - లేకుండెను. అజుఁ డెవనినికూడా తక్కువవాఁడుగా చూచుట లేనందున, ప్రతివాఁడును తానే ప్రభువునకు సమ్మతమైన వాఁడనని తలంచుచుండెనని భావము.

శ్లో. న ఖరో న చ భూయసా మృదుః
పవమానః పృథివీరుహానివ
స పురస్కృత మధ్యమ క్రమో
నమయామాస నృపా ననుద్ధరన్. 9

వ్యాఖ్య: సః - ఆ యజుఁడు, భూయసా - ఎక్కువగా, ఖరః - తీక్ష్ణమైనవాఁడు, న - కాడు, మృదుః చ - మెత్తని వాఁడును, న - కాఁడు, పురస్కృత మధ్యమక్రమః సన్ - అంగీకరింపఁబడిన మధ్యమ పరిపాటిగల వాఁడగుచు, పవమానః - వాయువు, పృథివీరుహాన్, ఇవ - వృక్షములను వలె, శత్రురాజులను, అనుద్ధరన్ - పైకి లాగకయే (పదవీ భ్రష్టులను చేయకయే), నమయామాస - వంచెను (లొంగునట్లు చేసెను) వాయువు వృక్షములను పెకలింపక వంచినట్లు అజుఁడు పరరాజులను నిర్మూలించుట మాని తనకు లొంగునట్లు మాత్రము చేసెనని భావము, అది రాజనీతి గదా!

శ్లో. అథ వీక్ష్య రఘుః ప్రతిష్ఠితం
ప్రకృతిష్వాత్మజ మాత్మవత్తయా
విషమేషు వినాశధర్మసు
త్రిదివస్థేష్వపి నిస్పృహో ౽భవత్. 10

వ్యాఖ్య: అథ - పిమ్మట, రఘుః - రఘుమహారాజు, ఆత్మజం - పుత్రుని, ఆత్మ వత్తయా - నిర్వికార మనస్కుఁడగుటచేత, ప్రకృతిషు - అమాత్యాదులయందు, ప్రతిష్ఠితం - దృఢముగా నిలుపఁబడిన వానినిగా, వీక్ష్య - చూచి (గ్రహించి), వినాశ ధర్మసు - నశించు స్వభావము గలవియగు (అనిత్యము లగునవి), త్రిదివస్థేష్వపి - స్వర్గమునం దున్నవియైనను, విషయేషు - భోగ్యవస్తువుల యందు, నిస్పృహః - వాంఛ లేనివాఁడు, అభవత్ - అయ్యెను. కుమారుఁడు రాజ్యమునందు సుప్రతిష్ఠితుఁడై యిక నా సహాయ మక్కఱలేక యున్నాఁడని తోచినపిమ్మట రఘు మహారాజు విషయవాంఛలు విడిచి సంసారమునందు విరక్తుఁడయ్యెనని భావము.

శ్లో. గుణవత్సుత రోపిత శ్రియః
పరిణామే హి దిలీపవంశజాః
పదవీం తరువల్కవాససాం
ప్రయతాః సంయమినాం ప్రపేదిరే. 11

వ్యాఖ్య: దిలీప వంశజాః - దిలీపుని వంశమున పుట్టినవారు, పరిణామేహి - వార్ధక్యమునందు, గుణవత్సుత రోపితశ్రియః - గుణవంతులైన కుమారుల యందు ఉంచబడిన రాజ్యలక్ష్మి కలవారై, ప్రయతాః - నియమవంతులునై, తరు వల్కవాససాం - వల్కములే వస్త్రములుగాగల, సంయమినాం - యతీశ్వరుల యొక్క, పదవీం - మార్గమును, ప్రపేదిరే - అనుసరించిరి. దిలీప వంశజు లందఱును వార్ధక్య దశయందు మునివృత్తి నవలంబించుట పరిపాటి గావున రఘుమహారాజు సైతము యత్యాశ్రమమును స్వీకరించుటకు సిద్ధపడెనని భావము. 'వల్క' శబ్దము 'వల్కల' శబ్దమునకు రూపాంతరము.

శ్లో. త మరణ్య సమాశ్రయోన్ముఖం
శిరసా వేష్టనశోభినా సుతః
పితరం ప్రణిపత్య పాదయోః
అపరిత్యాగ మయాచ తాత్మనః. 12

వ్యాఖ్య: అరణ్య సమాశ్రయోన్ముఖం - వనవాసమునకు సంసిద్ధుఁడైన, పితరం, తం - తండ్రియైన ఆ రఘుమహారాజును, సుతః - కుమారుఁడైన

యజుఁడు. వేష్టన శోభినా - తలపాగ చేత అందముగానున్న, శిరసా - శిరస్సుచేత, పాదయోః - పాదములమీద, ప్రణిపత్య - పడి (నమస్కరించి), ఆత్మనః తన యొక్క, అపరిత్యాగం - విడువకుండుటను, అయాచత - కోరెను. అజుఁడు తండ్రి కాళ్లపైఁబడి తనను విడిచిపెట్టి వనమునకు వెళ్లవద్దని ప్రార్థించెనని భావము.

శ్లో. రఘు రశ్రుముఖస్య తస్య తత్
కృతవా నీప్సిత మాత్మజ ప్రియః
న తు సర్ప ఇవ త్వచం పునః
ప్రతిపేదే వ్యపవర్జితాం శ్రియమ్. 13

వ్యాఖ్య: ఆత్మజప్రియః - పుత్రవాత్సల్యముగల వాఁడగు, రఘుః - రఘు మహారాజు, అశ్రుముఖస్య - కన్నీరు గారుచున్న ముఖము గలవాఁడగు, తస్య - ఆ యజునియొక్క, తత్ - ఆ యపరిత్యాగ రూపమైన, ఈప్సితం - కోరికను, కృతవాన్ - తీర్చెను, తు - కాని, సర్పః - పాము, త్వచం ఇవ - తన కుబుసమునువలె, వ్యపవర్జితాం - విడిచిపెట్టబడిన, శ్రియం - రాజ్యసంపదను, పునః - మరల, న ప్రతిపేదే - స్వీకరింపలేదు. రఘుమహారాజు రాజ్యసంపదను మరల స్వీకరింపని పద్ధతిలో కుమారునికి సమీపముగా నుండుట కిష్టపడెను.

శ్లో. స కిలాశ్రమ మంత్య మాశ్రితో
నివసన్నావసథే పురా ద్బహిః
సముపాస్యత పుత్రభోగ్యయా
స్నుషయేవా ఽవికృతేంద్రియః శ్రియా. 14

వ్యాఖ్య: సః - ఆ రఘుమహారాజు, అంత్యం ఆశ్రమం - చివరిదియగు నాశ్రమమును (సన్యాసాశ్రమమును). ఆశ్రితః - స్వీకరించిన వాఁడై, పురాత్ బహిః - నగరమునకు వెలుపటనున్న, ఆవసథే - స్థానమునందు, నివసన్ - నివసించుచున్నవాఁడగుచు, అవికృతేంద్రియః - జితేంద్రియుఁడై, స్నుషయేవ (స్నుషయా + ఇవ) - కోడలిచేతవలె, పుత్రభోగ్యయా - కుమారునిచేత మాత్రమే అనుభవింపఁదగిన, శ్రియా - రాజ్యలక్ష్మిచేత, సముపాస్యత కిల - శుశ్రూషమాత్రము చేయఁబడిన వాఁడయ్యెనుసుమా, జితేంద్రియుఁడైన యతనికి

కోడలిచేతవలె రాజ్యలక్ష్మిచేతగూడ పుష్పఫలోదకాహరణాది శుశ్రూష తప్ప మరి యొక అపేక్షిత వస్తువు లేదయ్యెనని భావము (యతి జీవనము గడపెను). క్షత్రియుఁడు యత్యాశ్రమమును స్వీకరించుట ధర్మ్యమగునా కాదా? యను విషయమును సుదీర్ఘముగా చర్చించి, మల్లినాథుఁడు యత్యాశ్రమమునకు క్షత్రియుఁడు సైత మర్హుఁడే యని యీ శ్లోకవాఖ్యానమునందు నిర్ణయించియున్నాఁడు. కాళిదాసు నభిప్రాయముగూడ నదియే యైనట్లు సోదాహరణముగా నిరూపించియున్నాఁడు.

శ్లో. ప్రశమ స్థిత పూర్వ పార్థివం
కుల మభ్యుద్యత నూతనేశ్వరమ్
నభసా నిభృతేందునా తులాం
ఉదితార్కేణ సమారురోహ తత్. 15

వ్యాఖ్య: ప్రశమస్థిత పూర్వపార్థివం - శాంతి నాశ్రయించిన పూర్వపు రాజు గలదియును, అభ్యుద్యత నూతనేశ్వరం - అభ్యుదయమునొందిన క్రొత్తరాజు (అజుఁడు) గలదియునగు, తత్, కులం - ప్రసిద్ధమైన ఆ దిలీపవంశము, నిభృతేందునా - అస్తమింపనున్న చంద్రుడు గలదియును, ఉదితార్కేణ - ఉదయించిన సూర్యుఁడు గలదియును నగు, నభసా - ఆకాశముచేత, తులాం - సామ్యమును, సమారురోహ - పొందెను. అస్తమింపబోవు చంద్రునితోను, ఉదయించిన సూర్యునితోను గూడిన నిర్మలాకాశమువలె, పూర్వరాజై యత్యాశ్రమమును స్వీకరించిన రఘువుచేతను, నూతన వైభవోపేతుఁడైన అజునిచేతను దిలీపవంశము మిక్కిలి శ్లాఘాపాత్రముగ నుండెనని భావము.

శ్లో. యతి పార్థివ లింగ ధారిణౌ
దదృశాతే రఘురాఘవౌ జనైః
అపవర్గ మహోదయార్థయోః
భువ మంశా వివ ధర్మయో ర్గతౌ. 16

వ్యాఖ్య: యతి పార్థివ లింగ ధారిణౌ — యతి - సన్యాసి యొక్కయు, పార్థివ - రాజుయొక్కయు, లింగ - వేషములను, ధారిణౌ - ధరించినట్టి, రఘు రాఘవౌ - రఘువును, అతని కుమారుఁడగు అజుఁడును, అపవర్గ మహోదయా

ర్థయోః - మోక్షము, అభ్యుదయమును, ఫలములుగాగల, ధర్మయోః - నివర్తక, ప్రవర్తక, ధర్మములయొక్క, భువంగతౌ - భూలోకమునం దవతరించిన, అంశౌ, ఇవ - అంశములవలె, జనైః - ప్రజలచేత, దదృశాతే - చూడఁబడిరి. జనులకు, రఘువు మోక్షఫలకమైన నివృత్తిధర్మము యొక్క అవతారముగను అజుడు అభ్యుదయ ఫలమైన ప్రవృత్తి యొక్క అవతారము గను గన్పట్టిరని తాత్పర్యము.

శ్లో. అజితాధిగమాయ మంత్రిభిః
యుయుజే నీతివిశారదైః రజః
అనపాయి పదోపలబ్ధయే
రఘు రాప్తైః సమియాయ యోగిభిః 17

వ్యాఖ్య: అజః - అజుఁడు, అజితాధిగమాయ - జయింపబడని దేశముల యొక్క విజయముకొఱకు, నీతివిశారదైః - రాజనీతిజ్ఞులైన, మంత్రిభిః - మంత్రులతో, యుయుజే - కలిసికొనెను, రఘుః - రఘుమహారాజుగూడ, అనపాయిపదోపలబ్ధయే—అనపాయిపద వినాశములేని పదము అనగా మోక్షముయొక్క, ఉపలబ్ధయే - ప్రాప్తికొఱకు, ఆప్తైః - సత్యము నెఱిఁగినవారును యధార్థమును జెప్పువారునునగు, యోగిభిః - యోగులతో, సమియాయ - చేరెను. ఉభయులును తమ లక్ష్యము సిద్ధించుటకై ఉపాయాన్వేషణమునకు బూనుకొనిరని భావము.

శ్లో. నృపతిః ప్రకృతీ రవేక్షితుం
వ్యవహారాసన మాదదే యువా
పరిచేతు ముపాంశు ధారణాం
కుశపూతం ప్రవయాస్తు విష్టరమ్. 18

వ్యాఖ్య: యువా, నృపతిః - యువకుఁడైన రాజు (అజుఁడు), ప్రకృతీః - ప్రజలను, అవేక్షితుం - చూచుటకు (కార్యార్థులైన జనులలో దుష్టులను, అదుష్టులను ఎఱుఁగుటకు), వ్యవహారాసనం - ధర్మాసనమును, ఆదదే - స్వీకరించెను, ప్రవయాః - వృద్ధుఁడగు, నృపతిస్తు - రఘుమహారాజేమో, ధారణాం - మనస్సుయొక్క యేకాగ్రతను, పరిచేతుం - అభ్యసించుటకు (కూర్చుకొనుటకు), ఉపాంశు - విజన ప్రదేశమునందు, కుశపూతం - దర్భలచేత పవిత్రమైన,

విష్టరం - ఆసనమును, అదదే - స్వీకరించెను. అజుఁడు ప్రజాపాలనము కొఱకై ధర్మాసనమునెక్కెను. రఘువు యోగాభ్యాసము కొఱకై ఏకాంతమునందలి దర్భాసనముపై గూర్చుండెను. "యమాది గుణసంయుక్తే మనసః స్థితిరాత్మని, ధారణా ప్రోచ్యతే సద్భిర్యోగశాస్త్రవిశారదైః" అని వసిష్ఠస్మృతి ధారణా పదమును నిర్వచించినది. అట్టి ధారణకు రఘువు పూనెను.

శ్లో. అనయత్ ప్రభుశక్తి సంపదా
వశ మేకో నృపతీ ననంతరాన్
అపరః ప్రణిధాన యోగ్యయా
మరుతః పంచ శరీ గోచరాన్. 19

వ్యాఖ్య: ఏకః - ఒకడు (అజుఁడు), అనంతరాన్ - తన రాజ్యమున కంటుకొనియున్న దేశములవారగు, నృపతీన్ - రాజులను, ప్రభుశక్తి సంపదా- కోశదండముల మహిమచేత, వశం, అనయత్ - స్వాధీనులనుగాఁ జేసికొనెను, అపరః - రెండవవాఁడు (రఘుమహారాజు), ప్రణిధానయోగ్యయా - సమాధి యొక్క అభ్యాసముచేత, శరీరగోచరాన్ - దేహము నాశ్రయించియున్న, పంచ, మరుతః - అయిదు వాయువులను (పంచప్రాణము లనఁబడు ప్రాణ, అపాన, వ్యాన, ఉదాన, సమాన వాయువులను) వశం, అనయత్ - స్వాధీనపరచుకొనెను. రాజ్య స్థైర్యమునకై యజుఁడు కోశదండ ప్రభావముచేత ఇరుగు పొరుగు రాజులను స్వాధీనము చేసికొనెననియు, మోక్షప్రాప్తికై రఘువు యోగాభ్యాసముచేత ప్రాణాయామమునందు కృతార్థుఁడయ్యెననియు భావము. ఇద్దఱును వారి లక్ష్యమునందు మొదటిమెట్టు నెక్కిరని తాత్పర్యము.

శ్లో. అకరో దచిరేశ్వరః క్షితౌ
ద్విష దారంభఫలాని భస్మసాత్
ఇతరో దహనే స్వకర్మణాం
వవృతే జ్ఞానమయేన వహ్నినా. 20

వ్యాఖ్య: అచిరేశ్వరః - కొద్దికాలముక్రింద రాజైన (అజుఁడు), క్షితౌ - భూమిమీద, ద్విషదారంభఫలాని - శత్రుప్రయత్నముల ఫలితములను, భస్మసాత్,

అకరోత్ - పూర్తిగా భస్మీపటలము చేసెను (వ్యర్థముచేసెను). ఇతరః - ఇతరుఁడైన రఘువు, జ్ఞానమయేన - తత్త్వజ్ఞాన ప్రచురమైన, వహ్నినా - అగ్నిచేత, స్వకర్మణాం - సంసారబీజ భూతములైన తన కర్మలయొక్క, దహనే - భస్మీకరణమునందు, ప్రవృతే - ప్రవర్తించెను. ఉభయులకును ఇది లక్ష్యసాధనలో రెండవమెట్టు. ఆగామి, సంచిత, ప్రారబ్ధరూపములైన కర్మఫలముల నన్నిటిని జ్ఞానాగ్ని (ఆత్మసాక్షాత్కారము) దహించివేయునని శాస్త్రము. "జ్ఞానాగ్నిః సర్వకర్మాణి భస్మసాత్ కురుతే తథా" అని గీతావచనము. కనుక రఘువు జ్ఞానాగ్నిచేత అంతశ్శత్రువులను జయింపగా అజుఁడు బాహ్యశత్రువులను జయించెనని భావము.

శ్లో. పణబంధ ముఖాన్ గుణా నజః
షడుపాయుంక్త సమీక్ష్య తత్ఫలమ్
రఘు రప్యజయ ద్గుణత్రయం
ప్రకృతిస్థం సమలోష్ఠ కాంచనః 21

వ్యాఖ్య : అజః - అజుఁడు, పణబంధముఖాన్ - సంధి మొదలగు, షట్ గుణాన్ - ఆరు గుణములను, తత్ఫలం - వాటి ఫలమును, సమీక్ష్య - ఆలోచించి, ఉపాయుంక్త - ప్రయోగించెను, సమలోష్ఠ కాంచనః - సమానముగా భావింపఁబడిన మట్టిగడ్డయు, బంగారమును గల, (నిస్పృహుఁడైన) రఘురపి - రఘుమహారాజుగూడ, గుణత్రయం - సత్త్వము మొదలగు మూడుగుణములను, ప్రకృతిస్థం - వికార శూన్యములగునట్లుగా, అజయత్ - జయించెను. అజుఁడు, శత్రువులపై ప్రయోగింపవలసిన సంధి విగ్రహాది గుణములలో నేది ఫలింపఁగలదో దానినే ప్రయోగించెననియు, రఘురాజు సత్త్వరజస్తమోగుణముల యుద్రేకమును యోగశక్తిచేత తగ్గించి వాటిని సామ్యావస్థలో అనగా వికారరహితములనుగా నుంచెననియు భావము. "పణబంధః" అనగా సంధియని, కౌటిల్యార్థశాస్త్రము, "సంధి, విగ్రహము, యానము, ఆసనము, ద్వైధీభావము, సమాశ్రయము" అను ఆరుగుణములు రాజు తనశత్రువులపైఁ బ్రయోగింపఁ దగిన యుపాయములు.

శ్లో. న నవః ప్రభు రాఫలోదయాత్
స్థిరకర్మా విరరామ కర్మణః

న చ యోగవిధే ర్న వేతరః
స్థిరధీ రాపరమాత్మ దర్శనాత్. 22

వ్యాఖ్య: స్థిరకర్మా - చేపట్టిన పనిని ఫలించువఱకును విడువనట్టి, సవః, ప్రభుః - క్రొత్తరాజు (అజుఁడు), అఫలోదయాత్ - ఫలసిద్ధి పర్యంతము, కర్మణః - ప్రయత్నమునుండి, న విరరామ - మరలలేదు (ప్రయత్నమును మానలేదు), స్థిరధీః - నిశ్చల చిత్తుఁడైన, సవేతరః చ - ప్రాతరాజుకూడ (రఘువు), ఆపరమాత్మ ధర్శనాత్ - పరమాత్మ సాక్షాత్కార పర్యంతము, యోగవిధేః - ఐక్యాను సంధానమునుండి, న విరరామ - విరమింపలేదు. ఆరంభించిన పనిని ఫలసిద్ధియగువఱకు ఉభయులును విడుచువారు కారనియు, విడువలేదనియు భావము.

శ్లో. ఇతి శత్రుషు చేంద్రియేషు చ
ప్రతిషిద్ధ ప్రసరేషు జాగ్రతౌ
ప్రసితా వుదయాపవర్గయోః
ఉభయీం సిద్ధి ముభా వవాపతుః. 23

వ్యాఖ్య: ఇతి - ఇట్లు, ప్రతిషిద్ధప్రసరేషు - నిషేధింపబడియు ముందుకు వచ్చినట్టి, శత్రుషు - శత్రువుల విషయమునను, ఇంద్రియేషు చ - ఇంద్రియముల విషయమునను, జాగ్రతౌ - జాగ్రత్త గలవారును, ఉదయాపవర్గయోః - అభ్యుదయ మోక్షములయందు, ప్రసితౌ - ఆసక్తులును నగు, ఉభౌ - ఇద్దఱును (అజ రఘువులు), ఉభయీం - రెండు విధములయిన (అభ్యుదయ, మోక్షరూపమైన), సిద్ధిం - ఫలసిద్ధిని, అవాపతుః - పొందిరి. అజుఁడు శత్రునిర్మూలన రూపమైన అభ్యుదయమును, రఘువు ఇంద్రియ నిగ్రహమూలకమైన మోక్షమును పొందిరని భావము. "ప్రతిషిద్ధప్రసరేషు" వద్దని వెనుకకు త్రోసినను స్వార్థపరులైన శత్రువులు ముందుకు వచ్చుచుందురు; అట్లే ఇంద్రియములు నిగ్రహింపబడుచున్నను భోగ్యవిషయముల మీదికి ప్రసరించుచుండునన్న భావమును ఈ పదము చక్కఁగా వివరించుచున్నది.

శ్లో. అథ కాశ్చి దజవ్యపేక్షయా
గమయిత్వా సమదర్శనః సమాః

తమసః పర మాప దవ్యయం
పురుషం యోగసమాధినా రఘుః. 24

వ్యాఖ్య: అథ - పిమ్మట, రఘుః - రఘుమహారాజు, సమదర్శనః - సర్వభూతములయందును సమాన దృష్టిగలవాఁ డగుచు, అజవ్యపేక్షయా - అజుని యొక్క కోరిక ననుసరించి, కాశ్చిత్, సమాః - కొన్ని సంవత్సరములు, గమయిత్వా - గడపి, యోగసమాధినా - జీవాత్మ పరమాత్మల అనుసంధానముచేత, అవ్యయం - నాశము లేనివాఁడును, తమసః పరం - అజ్ఞానమునకు దూరమైన వాఁడును అగు (అవిద్యకు పరమైనవాఁడు మాయాతీతుఁడు అని యర్థము), పురుషం - పరమాత్ముని, ఆపత్ - చేరెను. యోగసమాధిచేత సాయుజ్య మోక్షమును పొందెనని భావము.

శ్లో. శ్రుత దేహవిసర్జనః పితుః
చిర మశ్రూణి విముచ్య రాఘవః
విదధే విధి మస్య నైష్ఠికం
యతిభిః సార్థ మనగ్ని మగ్నిచిత్. 25

వ్యాఖ్య: అగ్నిచిత్ - ఆహితాగ్నియైన (యజ్ఞములు చేసినట్టి), రాఘవః - రఘుకుమారుఁడు (అజుఁడు), పితుః - తండ్రియొక్క, శ్రుతదేహ విసర్జనః - వినఁబడిన శరీర త్యాగవార్తగలవాఁడై (తండ్రి మరణవార్త విన్నవాఁడగుచు), చిరం - చాలాసేపు, అశ్రూణి, విముచ్య - కన్నీళ్లుకార్చి, అస్య - అతనికి (తండ్రికి), అనగ్నిం - అగ్ని సంస్కారరహిత మైనదియు, నైష్ఠికం - తపోనిష్ఠ యొక్క అంతమందుఁ జేయఁదగినదియు నగు, విధిం - ఆచారమును (అంత్య కర్మను), యతిభిః, సార్థం - సన్యాసులతోగూడ, విదధే - చేసెను. రఘు శరీరమును దహనముచేయక ఖననము చేసి సమాధి చేయించెనని యర్థము. సర్వసంగ పరిత్యాగము చేసి, ధ్యానయోగ రతుఁడైనవాని దేహమును కాల్చివేయఁగూడదనియు, గుంటలో శరీరమునుంచి ఓంకారోచ్చారణము చేయుచు మట్టి కప్పవలయుననియు 'అనగ్ని' విధిని శౌనక స్మృతి నిర్దేశించినది. "సర్వసంగ నివృత్తస్య ధ్యానయోగరతస్య చ. న తస్య దహనం కార్యం, నైవ పిండోదకక్రియా, నిదధ్యాత్ ప్రణవేనైవ బిలే భిక్షోః కలేబరమ్, ప్రోక్షణం ఖననం చైవ సర్వంతే

నైవ కారయేత్" అని. కనుక అజుడు తండ్రికి దహనముకాక సమాధిని చేయించె నని భావము.

శ్లో. అకరోత్స తదౌర్ధ్వదైహికం
పితృభక్త్యా పితృకార్యకల్పవిత్
స హి తేన పథా తనుత్యజః
తనయావర్జిత పిండ కాంక్షిణః. 26

వ్యాఖ్య: పితృకార్యకల్పవిత్ - తండ్రియొక్క శ్రాద్ధవిధానము నెఱింగిన, సః - ఆ యజుఁడు, పితృభక్త్యా - తండ్రియందలి ప్రేమచేత, తస్య - ఆ రఘుమహారాజుకు, ఔర్ధ్వదైహికం - శరీరమును విడిచిన పిమ్మట చేయవలసిన తిలోదక, పిండదానాదికమును, అకరోత్ - చేసెను, తేనపథా - ఆ మార్గముచేత (యోగమార్గముచేత), తనుత్యజః - శరీరమును విడిచినివారు, తనయావర్జిత పిండ కాంక్షిణః - కుమారునిచేత నీయబడిన పిండాదికమును గోరువారు, నహి భవంతి - కారుసుమా! అజుడు తండ్రిపైన ప్రేమచేత తిలోదకాదులను ఇచ్చెనేకాని అది విధి విహితముకాదని భావము.

శ్లో. స పరార్ధ్యగతే రశోచ్యతాం
పితు రుద్దిశ్య సదర్థవేదిభిః
శమితాధి రధిజ్య కార్ముకః
కృతవా నప్రతిశాసనం జగత్. 27

వ్యాఖ్య: పరార్థ్యగతేః - ప్రశస్తమైన గతిగల (మోక్షమును పొందిన), పితుః - తండ్రియొక్క, అశోచ్యతాం - అశోచనీయత్వమును, ఉద్దిశ్య - బోధించి (శోకించుట తగదని యుపదేశించి), సదర్థవేదిభిః - పరమార్థము నెఱింగిన విద్వాంసులచేత, శమితాధిః - నివారింపఁబడిన మనోవ్యధగల, సః - ఆ యజుఁడు, అధిజ్య కార్ముకః - ఎక్కు పెట్టఁబడిన ధనుస్సుగలవాఁ డగుచు, జగత్ - లోకమును, అప్రతిశాసనం - రెండవవాని యాజ్ఞ లేనిదానినిగా, కృతవాన్ - చేసెను. విద్వాంసుల యోదార్పుచేత పితృమరణ దుఃఖమునుండి తేఱుకొని మరల రాజ్యపాలన తత్పరుఁడయ్యెననియు శత్రురాజుల నణచి ఏకచ్ఛత్రాధిపతి యయ్యెననియు భావము.

శ్లో. క్షితి రిందుమతీ చ భామినీ
పతి మాసాద్య త మగ్ర్యపౌరుషమ్
ప్రథమా బహురత్నసూ రభూ
దపరా వీర మజీజన త్సుతమ్. 28

వ్యాఖ్య: క్షితిః - భూమియు, భామినీ - ప్రియురాలైన, ఇందుమతీచ - ఇందుమతియు. అగ్ర్యపౌరుషం-గొప్పదైన పరాక్రమమును, ఉత్కృష్ట భోగనైపుణ్య మునుగల, తం - ఆ యజుని, పతిం - భర్తనుగా, ఆసాద్య - పొంది, ప్రథమా - మొదటిదియగు భూమి (పెద్దభార్యయని ధ్వని), బహురత్నసూః - అనేక శ్రేష్ఠవస్తువులను, రత్నములను ప్రసవించినది, అభూత్ - అయ్యెను, అపరా - రెండవది యగు ఇందుమతి, వీరంసుతం - వీరుడైన కుమారుని, అజీజనత్ - కనెను. సత్పరిపాలనము వలన భూమి రత్నరాసులను గ్రుమ్మరించెనవియు, ప్రేమోపలాలితయగు ఇందుమతి చక్కని కుమారునిఁ గనెననియు భావము. భిన్న ధర్మములుగల జంటనుకలిపి వర్ణింపవలయునను మనోభావముతో కాళిదాసు పూర్వశ్లోకమువఱకు అజరఘువులను గలిపి వర్ణించెను, ఈ శ్లోకమునందు భూదేవిని, ఇందుమతినిఁ గలిపి వర్ణించుచు, అజునియొక్క వీర శృంగార నాయకత్వమును సూచించినాడు.

శ్లో. దశరశ్మిశతోపమ ద్యుతిం
యశసా దిక్షు దశస్వపి శ్రుతమ్
దశపూర్వరథం య మాఖ్యయా
దశకంఠారిగురుం విదు ర్బుధాః. 29

వ్యాఖ్య: దశరశ్మి శతోపమద్యుతిం—దశరశ్మిశత - పది కిరణ శతములు గల సూర్యుడు (సహస్రకిరణుఁడని యర్థము), ఉపమా - సాటిగాగల, ద్యుతిం- కాంతి గలవాఁడును, యశసా - కీర్తిచేత, దశస్వపి, దిక్షు - పది దిక్కుల యందును, శ్రుతం - ప్రసిద్ధుఁడును, దశకంఠారిగురుం—దశకంఠారి - రావణునికి శత్రువైన రామునికి, గురుం - తండ్రి యగువాఁడును అగు, యం - ఏ కుమారుని, ఆఖ్యయా - పేరుచేత, దశపూర్వరథం - దశశబ్దము మొదటగల

'రథ' శబ్దవాచ్యునిగా (దశరథ నామధేయునిగా), బుధాః - పండితులు, విదుః - చెప్పుచుండిరో అట్టికుమారుని ఇందుమతి కనెనని యర్థము. దశ సంఖ్యగల యా బాలుఁడు దశరథుఁడను పేరున ప్రసిద్ధుఁడగుట యుక్తమని పండితులు నుడివిరి. "దశపూర్వరథం" అనునది ఒక చమత్కార శబ్ద ప్రయోగము. కాళిదాసు మేఘ దూతమునందుఁగూడ ఇట్టి ప్రయోగముఁ జేసెను. "దేవపూర్వం గిరిం తే" దేవగిరి అని యర్థము. మాఘకవి "హిరణ్యపూర్వం కశిపుం ప్రచక్షతే" అని ప్రయోగిం చెను. హిరణ్యకశిపుఁడని యర్థము. భారవి "ధనురుపపద మస్మై వేదమన్వాది దేశ" అని ప్రయోగించెను. ధనుర్వేదమని యర్థము.

శ్లో. ఋషి దేవగణ స్వధా భుజాం
శ్రుత యాగ ప్రసవైః స పార్థివః
అనృణత్వ ముపేయివాన్ బభౌ
పరిధే ర్ముక్త ఇవోష్ణదీధితిః. 30

వ్యాఖ్య: శ్రుత, యాగ, ప్రసవైః — శ్రుత - వేద శాస్త్రాధ్యయనము చేతను, యాగ - యజ్ఞములచేతను, ప్రసవైః - సంతానము చేతను (యథా సంఖ్యముగా, వరుసగా), ఋషిదేవగణ స్వధాభుజాం—ఋషి - మంత్రద్రష్ట లును, శాస్త్రకర్తలుననగు ఋషులయొక్కయు, దేవగణ - ఇంద్రాది దేవతల యొక్కయు, స్వధాభుజాం - పితృదేవతలయొక్కయు, అనృణత్వం - ఋణము లేకుండుటను (వారివారి ఋణములనుండి విముక్తిఁ జెందుటను), ఉపేయివాన్ - పొందినవాఁడగు, సః పార్థివః - ఆరాజు (అజుఁడు), పరిధేః - పరివేషమునుండి, ముక్తః - వెడలి బయటికి వచ్చిన, ఉష్ణదీధితిః ఇవ - సూర్యుఁడువలె, బభౌ - ప్రకాశించెను (ఋణత్రయ విముక్తుఁడయ్యెను). మానవుఁడు ఋణత్రయ విము క్తుఁడు కావలెనని ధర్మశాస్త్రము. అవి పుట్టగానే ప్రతివానికిని తగులును. ఋషి ఋణ దేవఋణ పితృఋణములు క్రమముగా అధ్యయన, యజ్ఞ, పుత్రోదయముల చేత తీరిపోవును. కనుక అజుఁ డిట్లు చేసెనని భావము.

శ్లో. బల మార్త భయోపశాంతయే
విదుషాం సత్కృతయే బహుశ్రుతమ్
వసు తస్య విభో ర్న కేవలం
గుణవత్తాపి పరప్రయోజనా. 31

వ్యాఖ్య: తస్య, విభోః - ఆ ప్రభువుయొక్క (అజునియొక్క), కేవలం, వసు - ఒక ధనముమాత్రమే, పరప్రయోజనం - ఇతరుల కుపకరించునది, న - కాలేదు, గుణవత్తా, అపి - అతని సుగుణత్వముకూడ, పరప్రయోజనా - ఇతరుల ప్రయోజనముగలది యయ్యెను (ఎలాగననగా), బలం - అతని పౌరుషము, ఆర్తభయోపశాంతయే - ఆపన్నులయొక్క భయము శాంతించుట కొఱకును, బహు - అధికమైన, శ్రుతం - విద్య, విదుషాం సత్కృతయే - పండితుల యొక్క సత్కారము కొఱకును, (బభూవ - అయ్యెను). అజమహారాజుయొక్క ధనము ప్రజలకే యుపయోగించుచుండె ననుటలో గొప్పలేదు, ఆయన సద్గుణము లన్నిటికినీ పరప్రయోజనమే ఫలము గాని స్వార్థముగాని, పరపీడనముగాని లక్ష్యముకాదు; తాను బలవంతుఁడగుటకు ఫలము ఆర్తుల యాపదలను శమింపఁ జేయుటకును, విద్యావంతుఁ డగుటకు ఫలము తన రాజ్యమునందుఁగల విజ్ఞులను అజ్ఞులను గుర్తించి, విద్వాంసులను సత్కరించుటకేకాని తాను గర్వపడుటకు కాదని భావము. రాజు (పరిపాలకుఁడు) ధనబల విద్యాగుణములు కలిగి యుండవలెననియు, వాటిని స్వార్థమునకు పరపీడా పరాయణత్వమునకును వినియోగింపక, ప్రజల మేలునకై వినియోగించునట్టి బుద్ధిమంతుఁడు కావలయుననియు, అజుఁ డట్టి వాఁడై యుండెననియు కవిహృదయము.

శ్లో. స కదాచి దవేక్షితప్రజః
సహ దేవ్యా విజహార సుప్రజః
నగరోపవనే శచీసఖో
మరుతాం పాలయితేవ నందనే. 82

వ్యాఖ్య: అవేక్షితప్రజః - చక్కఁగాఁ జూడబడిన ప్రజలుగల (ఏలాటి భయము కష్టములు లేనట్లుగా ప్రజలను సుఖపెట్టు వాఁడగు). సః - ఆ యజుఁడు, సుప్రజః - మంచికుమారుఁడు కలవాఁడై (కుమారునిపై భారము నుంచినవాఁడై), కదాచిత్ - ఒకప్పుడు, దేవ్యాసహ - ఇందుమతితో గూడ, నగరోపవనే - నగర సమీపమునందలి యుద్యానవనమునందు, నందనే - స్వర్గపట్టణ సమీపమునను్న నందనవనమునందు, శచీసఖః - శచీదేవితోగూడ, మరుతాం - దేవతలయొక్క, పాలయితా ఇవ - పాలకుఁడగు ఇంద్రునివలె, విజహార - విహారము చేసెను. ఒకప్పుడు అజుఁడు ఇందుమతితో కలిసి యుద్యానవన విహారమునకు వెళ్లి

యచ్చట, నందనోద్యానమునందు శచీదేవితో ఇంద్రుడు విహరించుచున్నట్లు విహరించుచుండెను.

శ్లో. అథ రోధసి దక్షిణోదధేః
శ్రిత గోకర్ణ నికేత మీశ్వరమ్
ఉపవీణయితుం యయౌ రవే
రుదయావృత్తిపథేన నారదః. 33

వ్యాఖ్య : అథ - పిమ్మట (ఆ తరువాతకథ యేమనగా), దక్షిణోదధేః - దక్షిణ సముద్రముయొక్క, రోధసి - తీరమునందు. శ్రితగోకర్ణ నికేతం - అధివసింపబడిన గోకర్ణ క్షేత్రముగల, ఈశ్వరం - శివుని, ఉపవీణయితుం - వీణా గానముతో సేవించుట కొఱకు, నారదః - నారదుఁడు, రవేః - సూర్యునియొక్క, ఉదయావృత్తి పథేన - ఉదయ మార్గము అనగా ఆకాశమార్గముద్వారా, యయౌ - వెళ్లెను. సూర్యమార్గమనుటచేత నారదుఁడు మహా తేజస్వియై తన వీణానాదముచేత గోకర్ణక్షేత్ర నిలయుఁడైన శివుని సేవకై ఆకాశమున వెళ్లుచుండెనని భావము.

శ్లో. కుసుమై ర్గ్రథితా మపార్థివైః
స్రజ మాతోద్య శిరో నివేశితామ్
అహరత్ కిల తస్య వేగవాన్
అధివాస స్పృహయేవ మారుతః. 34

వ్యాఖ్య : అపార్థివైః - భూమిమీద పుట్టినవి కానట్టి (స్వర్గజాతములని యర్థము), కుసుమైః - పువ్వులచేత, గ్రథితాం - అల్లఁబడినదియు, తస్య - ఆ నారదునియొక్క, ఆతోద్య శిరోనివేశితాం — ఆతోద్య - వీణావాద్యముయొక్క, శిరః - అగ్రమునందు, నివేశితాం - ఉంచబడినదియు నగు, స్రజం - మాలను, వేగవాన్మారుతః - వేగముగల వాయువు, అధివాసస్పృహయా ఇవ - అలంకరించుకొను కోరికచేత వలె, అహరత్కిల - అపహరించినదట. నారదుని వీణ కొనయందుగల పుష్పమాల గాలికి జారి పడినదని భావము.

శ్లో. భ్రమరైః కుసుమా నుసారిభిః
పరికీర్ణా పరివాదినీ మునేః

దదృశే పవనావలేపజం
సృజతీ బాష్ప మివాంజనా విలమ్. 35

వ్యాఖ్య: కుసుమానుసారిభిః - పువ్వులవెంట వచ్చుచున్న, భ్రమరైః - తుమ్మెదలచేత, పరికీర్ణా - వ్యాపించిన, మునేః పరివాదినీ - నారదునియొక్క వీణ, పవనావలేపజం - వాయువుయొక్క గర్వముచేత పుట్టినదియు, అంజనా విలం - కాటుకచేత కలుషితమైనదియు నగు, బాష్పం - కన్నీటిని, సృజతీ ఇవ - విడుచుచున్నదివలె, దదృశే - కనఁబడెను. పువ్వులమీది తుమ్మెదలతోపాటు నేలకు జాఱుచున్న పుష్పమాల, నారదుని వీణ, వాయుదేవుని అధిక్షేపమునకు దుఃఖించుచు విడిచిన కాటుక కన్నీటి ధారవలె నుండెనని భావము. "పరివాదిని" యనగా ఏడు తంత్రులుగల వీణ.

శ్లో. అభిభూయ విభూతి మార్తవీం
మధుగంధాతిశయేన వీరుధామ్
నృపతే రమరస్ర గాప సా
దయితోరు స్తన కోటి సుస్థితిమ్. 36

వ్యాఖ్య: సా, అమరస్రక్ - ఆ దివ్యమాల, మధుగంధాతిశయేన - మకరందము యొక్కయు, పరిమళముయొక్కయు ఆధిక్యముచేత, వీరుధాం - తీగలయొక్క (నేలమీదివని యర్థము), ఆర్తవీం - ఋతువులవలన సంప్రాప్తించిన, విభూతిం - సమృద్ధిని, అభిభూయ - తిరస్కరించి, నృపతేః - అజునియొక్క, దయితోరు స్తన కోటిసుస్థితం - ప్రియురాలి పెద్ద స్తనముల చూచుకములయందు చక్కని స్థితిని, అప - పొందెను. నారదుని వీణపైనుండి జారిన యా మాలిక యిందుమతియొక్క స్తనచూచుకములు బిగువుగా నుండిన కారణమున అచ్చటపడి నిలుకడగా వ్రేలాడుచుండెనని భావము. ఇందుమతి నిలుచునియే యుండెననియు, ఆమె స్తనములు ముందుకు నిక్కపొడుచుకొని యుండెననియు గ్రహింపవలయును. అది కామోద్రేక సూచకము.

శ్లో. క్షణమాత్ర సఖీం సుజాతయోః
స్తనయో స్తా మవలోక్య విహ్వలా

నిమిమీల నరోత్తమ ప్రియా
హృతచంద్రా తమసేవ కౌముదీ. 37

వ్యాఖ్య : సుజాతయోః - చక్కగ పుట్టిన (సుందరములైన), స్తనయోః - స్తనములయందు, క్షణమాత్రసఖీం - క్షణకాలము మాత్రమే చెలికత్తెగా నుండిన, తాం - ఆ మాలను, అవలోక్య - చూచి, విహ్వలా - పరవశురాలైన, నరోత్తమ ప్రియా - ఇందుమతి, తమసా - రాహువుచేత, హృతచంద్రా - అపహరింపఁబడిన చంద్రుఁడుగల, కౌముదీ ఇవ - చంద్రికవలె (వెన్నెలవలె), నిమిమీల - మూర్ఛిల్లెను (మరణించెను). గ్రహణ సమయమునందు రాహువువలన చంద్రుఁడు అచ్ఛాదితుఁడు కాగా వెన్నెల ముడుచుకుపోవుచు అదృశ్యమైనట్లు ఇందుమతి కనులు మూయుచు తెలివిదప్పి గతప్రాణయై పడినదని భావము. అద్భుతమైన పోలికగల యుపమాలంకారము.

శ్లో. వపుషా కరణోజ్ఝితేన సా
నిపతంతీ పతి మప్యపాతయత్
నను తైలనిషేక బిందునా
సహ దీపార్చి రుపైతి మేదినీమ్. 38

వ్యాఖ్య : కరణోజ్ఝితేన - ఇంద్రియముల చేత విడువబడిన, వపుషా - శరీరముతో, నిపతంతీ - పడుచున్నదియగు, సా - ఆ యింధుమతి, పతిం అపి - అజునిగూడ, అపాతయత్ - పడునట్లు చేసెను; (ఎలాగనగా) తైలనిపేక బిందునా సహ - తైలనిషేక - తైలస్రావముయొక్క (కారుచున్న నూనెయొక్క), బిందునాసహ - బిందువుతోగూడ, దీపార్చిః - ద్వీపజ్వాల, మేదినీం - భూమిని, ఉపైతి నను - చేరును కదా! నిమీలితనేత్రయై పరవశురాలైయున్న యిందుమతిని అజుఁడు పట్టుకొనగా ఆమె నేలపై బడుటయు ఆధారముగానున్న అజుఁడు సైతము పడుటయు జరిగెను. ఇద్దఱును నైలపై వ్రాలిరని భావము. ఇచ్చట దీపార్చి (దీపజ్వాల) ఇందుమతికి ఉపమానము; అజునికి తైలబిందు వుపమానము; దీపజ్వాల పైనుండి నేలకు జారునప్పుడు తైలబిందువును ఆధారముగాఁ జేసికొనియే జారును. అట్లే ఇందుమతి అజ సహితముగా నేలపైఁ గూలెను. ఈ యౌపమ్యము నందలి విశేషమేమనగా దీపజ్వాల చల్లారినట్లు ఇందుమతి మరణించెననియు, తైల బిందువు శేషించినట్లు అజుఁడు బ్రతికియుండెననియు భావము. గొప్పదృష్టాంతము.

శ్లో. ఉభయో రపి పార్శ్వ వర్తినాం
తుములే నార్తరవేణ వేజితాః
విహగాః కమలాకరాలయాః
సమదుఃఖా ఇవ తత్ర చుక్రుశుః. 39

వ్యాఖ్య: ఉభయోః - ఇద్దఱియొక్కయు (ఇందుమత్యజులయొక్క). పార్శ్వవర్తినాం - ప్రక్కనఉన్న సేవకులయొక్క, తుములేన - సంకులమైన, ఆర్తరవేణ - శోక ధ్వనిచేత, వేజితాః - భయపడిన, కమలాకరాలయాః విహగాః - సరోవరమున నివసించు పక్షులు, తత్ర - అచ్చట, సమదుఃఖాః ఇవ - పరిజనమునకు సమానమైన శోకము గలవివలె, చుక్రుశుః - అరచినవి. పక్షుల యరపునందు గూడ శోకము వ్యక్తమైనదని భావము,

శ్లో. నృపతే ర్వ్యజనాదిభి స్తమో
నునుదే సా తు తథైవ సంస్థితా
ప్రతికార విధాన మాయుషః
సతి శేషే హి ఫలాయ కల్పతే. 40

వ్యాఖ్య: నృపతేః - అజునియొక్క. తమః - మూర్ఛ, వ్యజనాదిభిః - విసనకఱ్ఱ మొదలయినవాటిచేత, నునుదే - తొలగింపఁబడెను, సాతు - ఇందుమతియేమో, తథైవ - అట్లే నేలపైఁబడి, సంస్థితా - మరణించినది, హి - అదియట్లే, ప్రతికారవిధానం - చికిత్స, ఆయుషః - జీవితకాలముయొక్క. శేషే - శేషము, సతి - ఉన్నదైనచో, ఫలాయ - ఆరోగ్యసిద్ధి కొఱకు, కల్పతే - సమర్థమగును. అజునికి ఆయుశ్శేషముండుటచేత చికిత్సలు ఫలించెననియు, ఇందుమతికి జీవితకాలము శేషింపనందున చికిత్సలు ఫలింపక ఆమె మరణించెననియు భావము. ఇచ్చట "వ్యజనాది" శబ్దములోని ఆది శబ్దమునకు నీరుచల్లుట, కర్పూరము రాచుట మొదలైన చికిత్సలు అర్థము.

శ్లో. ప్రతియోజయితవ్య వల్లకీ
సమవస్థా మథ సత్త్వవిప్లవాత్

స నినాయ నితాంతవత్సలః
పరిగృహ్యోచిత మంక మంగనామ్. 41

వ్యాఖ్య: అథ - తరువాత, సత్త్వవిప్లవాత్ - ప్రాణము పోయినందు వలన, ప్రతియోజయితవ్య వల్లకీ సమవస్థాం — ప్రతియోజయితవ్య - తీగలతో కూర్పఁదగినదియగు, వల్లకీ - వీణయొక్క, సమవస్థాం - దశ (స్థితి)గలదియగు, అంగనాం - భార్యను, నితాంతవత్సలః - మిక్కిలి ప్రేమగలవాఁడగు, సః - ఆ యజుఁడు, పరిగృహ్య - చేతులలో నెత్తుకొని, ఉచితం - పరిచితమైన, అంకం - తన తొడను, నినాయ - చేర్చెను. వీణ తంత్రులు తెగినదశలో నున్నట్లు దయనీయస్థితిలోనున్న యిందుమతిని చేతులతోనెత్తి తన తొడపై మిక్కిలి ప్రేమతో అజుఁ డుంచుకొనెనని భావము.

శ్లో. పతి రంకనిషణ్ణయా తయా
కరణాపాయ విభిన్న వర్ణయా
సమలక్ష్యత బిభ్ర దావిలాం
మృగలేఖా ముషసీవ చంద్రమాః 42

వ్యాఖ్య: పతిః - భర్తయగు అజుఁడు, అంకనిషణ్ణయా - తొడ మీద నుండినదియు, కరణాపాయ విభిన్నవర్ణయా — కరణాపాయ - ఇంద్రియముల యొక్క వినాశముచేత, విభిన్నవర్ణయా - మారినరంగు గల, తయా - ఆ యిందుమతిచేత, ఉషసి - ప్రాతఃకాలమునందు, ఆవిలాం - మలినమైన, మృగలేఖాం - చిహ్నమగు మృగరూపమును, బిభ్రత్ - ధరించుచున్న, చంద్రమాః ఇవ - చంద్రుఁడువలె, సమలక్ష్యత - కనఁబడెను. మరణముచేత కాంతిహీనయగు ఇందుమతిని తొడపై నిదుకొన్న యజుఁడు కళాహీనమగు చిహ్నమును ధరించిన చంద్రునివలె నుండెనని భావము. అలంకారము: ఉపమ.

శ్లో. విలలాప స బాష్పగద్గదం
సహజా మప్యపహాయ ధీరతాం
అభితప్త మయోఽపి మార్దవం
భజతే కైవ కథా శరీరిషు. 43

  

వ్యాఖ్య : సః - అజుఁడు, సహజాం, అపి - స్వభావసిద్ధమైనదేయైనను, ధీరతాం - ధైర్యమును, అపహాయ - పోగొట్టుకొని, బాష్పగద్గదం - డగ్గుత్తికతో వణకు పలుకులు గలుగునట్లుగా. విలలాప - ఏడ్చెను; అభిత ప్తం - అగ్నిచేత తపింపఁజేయబడిన, అయోపి (అయః + అపి) - అచేతనమైన ఇనుము కూడ, మార్దవం - మెత్తదనమును, భజతే - పొందును, శరీరిషు - సంతప్తులైన మను ష్యుల విషయమున, కైవకథా - ఏమి సంగతి ? (చెప్పనే అక్కరలేదు). సహజ ధీరుఁడయ్యును ధైర్యము సడలి యజుఁడు గద్గదస్వరముతో విలపించెనని భావము. (ఆవిలాప వచనములు రాబోవు శ్లోకమునుండి యారంభమగును) అగ్నితప్తమైన ఇనుము కూడ మెత్తబడుచున్నప్పుడు దుఃఖతప్తులైన మానవులు తమ సహజ ధైర్యమును గోల్పోవుటలో నేమి వింతగలదు ?

శ్లో. కుసుమాన్యపి గాత్ర సంగమాత్
ప్రభవం త్యాయు రపోహితుం యది
న భవిష్యతి హంత సాధనం
కిమివాన్యత్ ప్రహరిష్యతో విధేః 44

వ్యాఖ్య : కుసుమాని, అపి - మిక్కిలి మెత్తని పువ్వులు గూడ, గాత్ర సంగమాత్ - దేహసంసర్గము వలన, ఆయుః - ఆయుష్యమును, అపోహితుం - అపహరించుటకు, ప్రభవంతియది - సమర్థములగుచున్నచో, హంత - అయ్యో, ప్రహరిష్యతః - చంపదలచుకొన్న, విధేః - దైవమునకు, అన్యత్ - మరియొకటి యగు (కుసుమాతిరిక్తమైన), కిమివ (కిం + ఇవ) ఏ వస్తువు, సాధనం - ఆయు ధము, నభవిష్యతి - కాజాలదు ? చంపదలఁచుకొన్న దైవమునకు పువ్వులే ఆయుధ మైనప్పుడు ఇక ఆయుధము కానిదేమున్నది, విధి దేనితోనైనను చంపఁగలదని భావము. 'హంత' ఇది అవ్యయము. ఇది సంతోషమును, దయను, దుఃఖమును తెలుపును. ప్రకృతమున దుఃఖార్థకము. దీనిని వాక్యారంభమునందు సైతముపయో గించుట కలదు. ఈ శ్లోకమునందలి 'ఇవ' శబ్దము వాక్యాలంకారము కొఱకే, దానికి ప్రత్యేకమైన యర్థములేదు.

శ్లో. అథవా మృదు వస్తు హింసితుం
మృదునై వారభతే ప్రజాంతకః

హిమసేక విపత్తి రత్ర మే
నలినీ పూర్వనిదర్శనం మతా. 45

వ్యాఖ్య: అథవా - లేదా (పక్షాంతరమునందు), ప్రజాంతకః - యముఁడు, మృదు, వస్తు - కోమలమైన వస్తువును, మృదునైవ - కోమలమగు వస్తువు చేతనే, హింసితుం - చంపుటకు, ఆరభతే - ప్రారంభించును; అత్ర - ఈ సందర్భమునందు, హిమసేకవిపత్తిః-మంచుకురియుటచేత నశించునట్టి, నలినీ-పద్మలత, మే - నాకు, పూర్వనిదర్శనం - మొదటి యుదాహరణముగా, మతా - తోచినది; హిమసేకము చల్లనిదియై కూడ పద్మమును నశింపఁజేయుట మొదట చూచితిని; ఇప్పుడు పుష్పమాల ఇందుమతిని చంపుట రెండవ యుదాహరణముగాఁ జూచితిని కనుక యముఁడు కోమలమైన వస్తువును కోమలమైన దానిచేతనే చంపుచుండునని భావము.

శ్లో. స్రగియం యది జీవితాపహా
హృదయే కిం నిహితా నహంతి మామ్
విష మప్యమృతం క్వచి ద్భవే
దమృతం వా విష మీశ్వరేచ్ఛయా. 46

వ్యాఖ్య: ఇయంస్రక్ - ఈ పూలమాల, జీవితాపహా, యది - ప్రాణము నపహరించునట్టిదే యైనచో, హృదయే - నా వక్షస్థలము మీద, నిహితా - ఉంచబడినది యగుచున్నను, మాం - నన్ను, కింనహంతి - ఎందుకు చంపుటలేదు? ఈశ్వరేచ్ఛయా - భగవంతుని కోరికచేత, క్వచిత్ - ఒకచోట, విషమపి - విషముగూడ, అమృతం, భవేత్ - అమృతముగా మారును, క్వచిత్ - మరియొక చోట, అమృతంవా - అమృతము సైతము, విషంభవేత్ - విషమగును. నా ప్రియురాలి ప్రాణమును హరించిన ఈ పుష్పమాల ప్రాణము తీయునట్టిదే యైనచో నా వక్షస్థలముమీద పెట్టుకొన్నప్పుడు నన్ను చంపుటలేదే? వస్తువునం దేమియు లేదు. ఈశ్వరేచ్ఛచేత ఒక్కొక్కచోట విషము అమృతముగాను, అమృతము విషముగాను మారుచుండునని భావము.

శ్లో. అథవా మమ భాగ్య విప్లవాత్
అశనిః కల్పిత ఏష వేధసా

య దనేన తరు ర్న పాతితః

క్షపితా తద్విటపాశ్రితా లతా. 47

వ్యాఖ్య: అథవా - లేదా, మమ - నాయొక్క, భాగ్యవిప్లవాత్ - భాగ్య విపర్యయమువలన (దురదృష్ట వశమున), ఏషః - ఇది (ఈమాల), వేధసా - బ్రహ్మచేత, అశనిః - పిడుగుగా, కల్పితః - కల్పింప బడినది, యత్ - ఎందు వలన, అనేన - ఈ పిడుగుచేతగూడ (నిజమైన పిడుగుచేతవలె), తరుః - వృక్షము (నేను), న పాతితః - పడగొట్టబడలేదు, (కింతు - కాని), తద్విట పాశ్రితా - ఆ చెట్టుకొమ్మ నాశ్రయించిన, లతా - తీగ (ఇందుమతి), క్షపితా - నశింపఁ జేయఁబడినది. బ్రహ్మచేత నాకై సృజింపబడిన పిడుగు నామీద పడక నన్నాశ్రయించిన యిందుమతిని చంపినదని భావము. పుష్పమాల గుణమునుబట్టి అశనిగా చెప్పబడినది, నశించిన యిందుమతి లతగా రూపణము చేయబడినది.

శ్లో. కృతవత్యసి నావధీరణాం

అపరాద్ధేఽపి యదా చిరం మయి,

కథ మేకపదే నిరాగసం

జన మాభాష్య మిమం న మన్యసే ? 48

వ్యాఖ్య: మయి - నేను, చిరం - అనేక పర్యాయములు, అపరాద్ధేపి - తప్పులు చేసినవాడనైనను, యదా - ఏ కారణమువలన, అవధీరణాం - అవమాన మును, న, కృతవతీ, అసి - చేయలేదో, తత్ - అందువలన, కథం - ఎట్లు, ఏక పదే - ఒక్కసారిగా, నిరాగసం - ఏ యపరాధమును జేయని, ఇమం, జనం - ఈ జనుని (నన్ను), అభాష్యం - సంభాషింప దగినవానినిగా, నమన్యసే - తలంప కున్నావు? పూర్వమెన్నోసార్లు తప్పులుచేసిన నన్ను కొంచెముగూడ అమర్యాద చెయ్యని నీవు ఇప్పుడొక్క క్షణంలో ఏ తప్పును జేయనివాఁడ నైనను ఏల నాతో మాట్లాడకున్నావని యజుడు మరణించిన యిందుమతి నుద్దేశించి పలికెను ఇచ్చట "యదా" అను శబ్దము యస్మాత్ కారణాత్ అను నర్థమునందు ప్రయోగింపఁ బడి నది. "స్వరాదౌ పఠ్యతే యదేతిహేతౌ" అని గణ వ్యాఖ్యానము, "ఏక పదమ్" అనగా తత్క్షణము ఒకేసారి. అని విశ్వనిఘంటువు.

శ్లో. ధ్రువ మస్మి శఠః శుచిస్మితే!
విదితః కైతవవత్సల స్తవ
పరలోక మసన్నివృత్తయే
య దనాపృచ్ఛ్య గతాసి మా మితః. 49

వ్యాఖ్య: హే శుచిస్మితే - ఓ చిఱునగవు మోముదానా! (ఓ ఇందుమతీ!) శఠః - మోసగాడను, కైతవవత్సలః - కపటప్రేమగలవాఁడను అని, ధ్రువం - నిజముగా, తవ విదితః - నీచేత తెలుసుకున్న వాఁడను, అస్మి - అగుచున్నాను, యత్ - ఏ కారణమువలన నైతే, మాం - నన్ను, అనాపృచ్ఛ్య - వెళ్లివచ్చెద నని యడుగక, ఇతః - ఈ లోకమునుండి, పరలోకం - స్వర్గమును, అసన్నివృత్తయే - మరల తిరిగి రాకుండుటకై, గతాసి - చేరితివో. నేను మోసగాడ ననియు, నా ప్రేమ కపటప్రేమ యనియు నీవు తలంచి యుండవలెను. అందు చేతనే ఈ లోకమునుండి స్వర్గమునకు వెళ్లినప్పుడు సైతము వెళ్లివచ్చెదనని చెప్పక వెళ్లిపోయితివని యజుఁడు చచ్చిపడియున్న ఇందుమతి నుద్దేశించి పలుకుచు విలపించెనని భావము.

శ్లో. దయితాం యది తావ దన్వగాత్
వినివృత్తం కిమిదం తయా వినా
సహతాం హతజీవితం మమ
ప్రబలా మాత్మకృతేన వేదనామ్. 50

వ్యాఖ్య: ఇదం, మమ, హతజీవితం, తావత్ - ఈ నాయొక్క పాడు జీవితమున్నదే, (ఆదౌ - మొదట) దయితాం - ప్రియురాలిని, అన్వగాత్, యది - అనుసరించియే వెళ్లినది (మొదట అజుఁడు సైతము మూర్ఛిల్లుట వలన). (తర్హి - అట్లయితే), తయావినా - ప్రియురాలు లేకుండా, కిం - ఎందుకొఱకై, వినివృత్తం- తిరిగి వచ్చినది? (అత ఏవ - అందువల్లనే) ఆత్మకృతేన - తన దుశ్చేష్టారూప మైన తప్పిదముచేత, ప్రబలాం - అత్యధికమైన, వేదనాం - బాధను, సహతాం - సహించునుగాక, ఇందుమతి మూర్ఛఁజెందినప్పుడు అజుఁడును మూర్ఛిల్లుటచేత, తన జీవితము ఇందుమతి వెంట వెళ్లి, ఆమెతో మరల తిరిగిరాక ఒంటరిగా వచ్చిన

ప్వయం కృతాపరాధమునకుఁ దగిన శాస్తిగా ఈ దుర్భర వేదనను సహింపవలసి నదే యని యజుడు విలపించెను.

శ్లో. సురత శ్రమ సంభృతో ముఖే
ధ్రియతే స్వేదలవోద్గమోఽపి తే
అథచాస్తమితా త్వ మాత్మనా
ధిగిమాం దేహభృతా మసారతామ్. 51

వ్యాఖ్య: సురతశ్రమ సంభృతః - సంభోగము యొక్క అలసట చేత కలిగిన, స్వేదలవోద్గమః, అపి - చెమట చుక్కల పుట్టుకగూడ, తే - నీయొక్క, ముఖే - ముఖము మీద, ధ్రియతే - ఇంకను ఉన్నది. అథచ - మరియేమో, త్వం - నీవు, ఆత్మనా - ప్రాణముచేత, అస్తం - నాశమును, ఇతా - పొందితివి. (అతః - ఈ కారణము వలన) దేహభృతాం - ప్రాణులయొక్క, ఇమాం - ఈ, అసారతాం - అస్థిరత్వమును గూర్చి, ధిక్ - నిందయగు గాక (ఛీ! అని యర్థము). నీ మొగము మీద సంభోగ శ్రమవలన మొలచిన చెమట చుక్కలింకను ఆరలేదు, నీవేమో ప్రాణమును విడచితివి, ఇంత స్వల్పకాలమునం దింతటి మార్పా? ఛీ! ప్రాణుల యస్థిరత్వమింతటిదే కదా! యని యజుని భావము.

శ్లో. మనసాపి న విప్రియం మయా
కృతపూర్వం తవ కిం జహాసి మామ్
నను శబ్దపతిః క్షితే రహం
త్వయి మే భావనిబంధనా రతిః. 52

వ్యాఖ్య: మయా - నాచేత, మనసాపి - మనస్సుతోనైనను, తవ - నీకు విప్రియం - ప్రియము కానిది, నకృతపూర్వం - పూర్వము చేయబడలేదు (ఇంతకు ముందెప్పుడు చేయలేదు). కిం - ఏ కారణము చేత (ఎందుకు), మాం, జహాసి - నన్ను విడుచుచున్నావు? నను - ఓ ప్రియా! అహం - నేను, క్షితేః - భూమికి, శబ్దపతిః - శబ్దమాత్రము చేతనే భర్తను (అర్థము వలన కాదని భావము). భావ నిబంధనా - అభిప్రాయ హేతుకమైన, మే - నాయొక్క, రతిః - ప్రేమ, త్వయి - నీయందే (కలదు). పేరుకు మాత్రమే నేను భూమికి పతినిగాని భార్యపై నుంద

వలసిన ప్రేమ మాత్రము నీయందే కలదనియు, రాజ్యమునందు కంటే భూమి మీది కంటె నీయందే అధిక ప్రేమ కలదనియు భావము.

శ్లో. కుసుమోత్థచితాన్ వలీభృతః
చలయన్ భృంగరుచ స్తవాలకాన్
కరభోరు కరోతి మారుతః
త్వదుపావర్తన శంకి మే మనః. 53

వ్యాఖ్య: కుసుమోత్థచితాన్ - పూలచేత నెత్తి కట్టబడినవియు, వలీభృతః - ఉంగరాలు తిరిగినవియు, భృంగరుచః - తుమ్మెదలవలె నల్లనైనవియునగు, తవ అలకాన్ - నీ ముంగురులను, చలయన్ - కదలించుచున్న, మారుతః - వాయువు, హేకరభోరు - చక్కని యూరువులు గలదానా! మే - నాయొక్క, మనః - మనస్సును, త్వదుపావర్తన శంకి - నీయొక్క పునరాగమన సందేహము కల దానినిగా, కరోతి - చేయుచున్నది. మనోహరమైన నీ ముంగురులు గాలికి కదలు చుండుట చేత నీవు మరల బ్రతుకుదువను ఆశ కలుగుచున్నదని భావము.

శ్లో. త దపోహితు మర్హసి ప్రియే
ప్రతిబోధేన విషాద మాశు మే
జ్వలితేన గుహాగతం తమః
తుహినాద్రే రివ నక్త మోషధిః. 54

వ్యాఖ్య: హే ప్రియే - ఓ ప్రియురాలా! తత్ - అందువలన, ఆశు - శీఘ్రముగా, మే - నాయొక్క, విషాదం - దుఃఖమును, నక్తం - రాత్రియందు, ఓషధిః - తృణజ్యోతియను పేరుగల లత, జ్వలితేన - తన ప్రకాశముచేత, తుహినాద్రేః - హిమాచలముయొక్క, గుహాగతం - గుహయందున్న, తమః ఇవ - అంధకారమును వలె, ప్రతిబోధేన - మేలుకొనుటచేత, అపోహితుం - తొలగించుటకు, అర్హసి - తగుదువు. నీవు ఈ నిద్రనుండిలేచి నా విషాదమును తొలగింపుమని భావము. అజుని విషాదమును హిమాచలగుహా గతమైన అంధ కారముతోను, ఇందుమతిని తృణజ్యోతిర్లతతోను పోల్చుట మిక్కిలి రమణీయ ముగా నున్నది.

శ్లో. ఇద ముచ్ఛ్వసితాలకం ముఖం
తవ విశ్రాంతకథం దునోతి మామ్
నిశి సుప్త మివైక పంకజం
విరతాభ్యంతర షట్పద స్వనమ్. 55

వ్యాఖ్య: ఇదం - ఈ, ఉచ్ఛ్వసితాలకం - కదలుచున్న ముంగురులు గలదియు, విశ్రాంతకథం - విశ్రమించిన సల్లాపములు కలదియునగు, తవముఖం - నీ ముఖము, నిశి - రాత్రియందు, సుప్తం - ముకుళించినదియు, విరతాభ్యంతర షట్పదస్వనం—విరత - ఆగిపోయిన, అభ్యంతరషట్పద - లోపలనున్న తుమ్మెదలయొక్క, స్వనం - ధ్వనిగలదియు నగు, ఏకపంకజం ఇవ - అద్వితీయమైన, కమలమువలె, మాం దునోతి - నన్ను పరితపింపఁజేయుచున్నది. నిశ్శబ్దభృంగమై ముకుళించిన మంచి కమలమువలె, కదలుచున్న అలకలతో పలుకులేని నీ ముఖము నన్నెంతగానో బాధించుచున్నదని యజుడు విలపించెను. ఉచ్ఛ్వసిత, విశ్రాంత, సుప్త శబ్దములు గౌణార్థకములు.

శ్లో. శశినం పున రేతి శర్వరీ
దయితా ద్వంద్వచరం పతత్త్రిణమ్
ఇతి తౌ విరహాంతరక్షమౌ
కథ మత్యంతగతా న మాం దహేః. 56

వ్యాఖ్య: శర్వరీ - రాత్రి, శశినం - చంద్రుని, పునరేతి (పునః + ఏతి) - తిరిగి చేరును, ద్వంద్వచరం - జంటగా తిరుగునట్టి, పతత్త్రిణం - పక్షిని (చక్రవాకమును), దయితా - ప్రియురాలైన యాడుచక్రవాకము, పునరేతి - మళ్లీ చేరును, ఇతి - ఈ కారణము వలన, తౌ - ఆ చంద్ర చక్రవాకములు, విరహాంతరక్షమౌ - విరహకాలముయొక్క అవధిని సహించునవై యున్నవి. అత్యంతగతా - అసలే వెళ్లిపోయిన, త్వం - నీవు. కథం - ఎట్లు, మాం - నన్ను, న దహేః - దహింపకుందువు? తప్పక దహింతువని యర్థము. కనుక చంద్ర చక్రవాకములవలె నేను ప్రియావియోగమును సహింపఁజాలను. వాటికి ప్రియురాలు తిరిగివచ్చునను ఆశకలదు. నాకు అట్టియాశ లేదుగదా! కనుక పరితపించి పోవుచున్నాను. ఇచ్చట 'అంతర' శబ్దమునకు అవధి (హద్దు)అని యర్థము.

శ్లో. నవ పల్లవ సం స్తరేఽపి తే
మృదు దూయేత యదంగ మర్పితమ్
తదిదం విషహిష్యతే కథం
వద వామోరు! చితాధిరోహణమ్. 57

వ్యాఖ్య: నవపల్లవ సంస్తరే - క్రొత్త చిగుళ్ల పరుపుమీద, అర్పితం - ఉంచబడినదియై, మృదు - సుకుమారమైన, తే - నీయొక్క, యదంగం - ఏ శరీరము, దూయేత - బాధనొందెడిదో, వామోరు! - అందమైన తొడలు గలదానా! తదిదం - ఆ యీ శరీరము, చితాధిరోహణం - కాష్ఠము నెక్కుటను, కథంసహిష్యతే - ఎట్లు సహింపగలదు? వద - చెప్పుము. చిగురాకు పడకమీదనే యొత్తిడివి సహింపలేని నీ శరీరము కాష్ఠముల చితిమీద నెట్లు పరుండగలదు? 'వామ' శబ్దమునకు సుందరము, సవ్యము అని యర్థములు. "వామంస్యాత్సుందరే సవ్యే" అని కేశవ నిఘంటువు. 'చితా' యనగా చితి - కాష్ఠసంచయము.

శ్లో. ఇయ మప్రతిబోధ శాయినీం
రశనా త్వాం ప్రథమా రహఃసఖీ
గతి విభ్రమ సాద నీరవా
న శుచా నానుమృతేవ లక్ష్యతే. 58

వ్యాఖ్య: ఇయం - ఈ, ప్రథమా, రహః సఖీ - మొట్టమొదటి రహస్య సఖియైనదియు, గతివిభ్రమ సాదనీరవా — గతివిభ్రమ - నీ గమన విలాసము యొక్క, సాద - వినాశముచేత, నీరవా - నిశ్శబ్దమైనదియు నగు, రశనా - మేఖల (మొలనూలు), అప్రతిబోధ శాయినీం - మరల మేలుకొనుటలేని నిద్రను పోవుచున్న (చచ్చిపోయిన), త్వాం అను - నీతో గూడి, శుచా - శోకముచేత, మృతేవ - చనిపోయిన దానివలె, న లక్ష్యతేన - కనబడుటలేదు అనునదిలేదు (కనబడుచునేయున్నది). నీవు దీర్ఘనిద్రను బొందియుండగా నీ ముఖ్య సఖియగు నీ మొలనూలుకూడా గమనవిలాసము, పలుకులేక చనిపోయిన దానివలె నున్నది. 'రశనా' మొలనూలును. మొదటి లేక ముఖ్యమైన రహస్యసఖి యని చెప్పుటకు కారణము అది సంభోగ సమయమునందును విడువక వెంటవచ్చునది కనుక. నీ విలాసగమన సమయములందు గల్లుమని మ్రోగు మేఖల యిప్పుడు నిశ్శబ్దమై నీతోపాటు మరణించినట్లు కనపడుచున్నదని భావము.

శ్లో. కల మన్యభృతాసు భాషితం
కలహంసీషు మదాలసం గతమ్
పృషతీషు విలోల మీక్షితం
పవనాధూత లతాసు విభ్రమాః. 59

త్రిదివోత్సుకయా ప్యవేత్య మాం
నిహితాః సత్య మమీ గుణా స్త్వయా
విరహే తవ మే గురువ్యథం
హృదయం న త్వవలంబితుం క్షమాః. 60

వ్యాఖ్య : ఇది యుగ్మము, రెండు శ్లోకములకును కలిపియే యన్వయము ; అన్యభృతాసు - ఆడుకోకిలల యందు, కలం భాషితం - మధుర భాషణమును, కలహంసీషు - విశిష్టమైన హంసాంగనలయందు, మదాలసం, గతం - మంద గమనమును, పృషతీషు - ఆడులేళ్ల యందు, విలోలం ఈక్షితం - చంచలమైన దృష్టిని, పవనాధూతలతాసు—పవన - వాయువుచేత, ఆ ధూత - కొద్దిగా కదల్ప బడిన, లతాసు - తీఁగలయందు, విభ్రమాః - విలాసములను, ఇతి - ఇట్లు, అమీ గుణాః - ఈ నీ గుణములు, ఏషు - ఈ కోకిలాదులయందు, త్రిదివోత్సుకయా - స్వర్గమునకు వెళ్లుటకై త్వరపడుచున్న, త్వయా - నీచేత, మాం, అవేక్ష్య - నన్ను చూచి (నేను నీ విరహమును సహింపజాలనని గ్రహించి), సత్యం నిహితాః - నిజముగా ఉంచఁబడినవి (నా ప్రాణమును కాపాడుటకై యుంచబడినవి), కాని, తవవిరహే - నీ వియోగమునందు, గురువ్యథం - అతి దుఃఖముగల, మే హృదయం - నా మనస్సును, అవలంబితుం - నిలకడగా నుంచుటకు, న క్షమాః- సమర్థములు కాకున్నవి. నేను నీ విరహమును సహింపఁజాలనని యెఱిఁగి నీ మృదుభాషణ మందగమన, చంచలదృష్టి విలాసాదులను కోకిలాదులయం దుంచి వెళ్లినావు కాని అవి యన్నియు నీతో నేను కలిసియున్నప్పుడే యానందమును జేకూర్పఁగలిగెడివి. నీవు లేనప్పుడు వృథాయగుచున్నవి, మీదుమిక్కిలి ఇప్పు డవి యన్నియు నా ప్రాణాపహారకములై యున్నవి అని తాత్పర్యము.

శ్లో. మిథునం పరికల్పితం త్వయా
సహకారః ఫలినీ చ నన్విమౌ

అవిధాయ వివాహ సత్క్రియా
మనయో ర్గమ్యత ఇత్యసాంప్రతమ్. 61

వ్యాఖ్య: నను - ఓ ప్రియురాలా! సహకారః - తియ్యమామిడిగున్నయు, ఫలినీచ - ప్రియంగు లతయు, ఇమౌ - ఈ రెండును, త్వయా - నీచేత, మిథునం - జంటగా, పరికల్పితం - కల్పింపఁబడినది, అనయోః - ఈ ఫలినీ సహకారములకు, వివాహసత్క్రియాం - వివాహ మంగళమును, అవిధాయ - చేయక, గమ్యతే - నీచే వెళ్లబడుచున్నది, ఇతి - ఇట్లు వెళ్లుట, అసాంప్రతం - అయుక్తము. నీవు పెంచి పెద్దచేసి దంపతులను చేయదలచుకొన్న వీటికి వివాహ మంగళమును జరుపక నీవు స్వర్గమునకువెళ్లినచో మాతృహీనములగు నివి మిక్కిలి దుఃఖించునని భావము.

శ్లో. కుసుమం కృతదోహద స్త్వయా
యదశోకోఽయ ముదీరయిష్యతి
అలకాభరణం కథం ను తత్
తవ నేష్యామి నివాపమాల్యతామ్. 62

వ్యాఖ్య: త్వయా - నీచేత, కృతదోహదః - చేయబడిన పాదతాడన రూపమగు దోహదముగల, అయం అశోకః - ఈ యశోకవృక్షము, యత్ కుసుమం - ఏ పుష్పమును, ఉదీరయిష్యతి - పూయఁగలదో, తవ - నీకు, అలకాభరణం - ముంగురులయందు ముడువదగిన సొమ్మగు, తత్ - ఆ పుష్పమును, కథంను - ఏ విధముగా, నివాపమాల్యతాం - దహనసమయ కుసుమాంజలిత్వమును, నేష్యామి - పొందింపగలను? బ్రతికియుండి ముంగురులపై నలంకరించుకొనుట కుద్దేశింపబడిన యశోక పుష్పములను శవాలంకారముగా నెట్లు మార్చగలనని యజుఁడు విలపించెనని భావము. స్త్రీపాదతాడనము అశోకమునకు దోహదము 'నివాప' మనగా పితృదానము. చనిపోయిన వారికి విడుచు తర్పణజలము, పూజా ద్రవ్యములు నివాప శబ్దముచేత చెప్పబడును.

శ్లో. స్మరతేవ సశబ్ద నూపురం
చరణానుగ్రహ మన్యదుర్లభమ్

అమునా కుసుమాశ్రు వర్షిణా
త్వ మశోకేన సుగాత్రి! శోచ్యసే. 63

వ్యాఖ్య: అన్యదుర్లభం - ఇతరులకు లభ్యముకానిదియు, నళబ్దనూపురం - ధ్వనించు మంజీరము గలదయిన, చరణానుగ్రహం - పాదముయొక్క తాడన రూపమైన యనుగ్రహమును, స్మరతేవ (స్మరతా + ఇవ) - స్మరించుచున్న దాని చేతవలె, కుసుమాశ్రు వర్షిణా - పువ్వులనెడు కన్నీళ్లను కురియుచున్న, అమునా అశోకేన - ఈ యశోక వృక్షముచేత, హే సుగాత్రి! - ఓ సుందరి! త్వం - నీవు, శోచ్యసే - దుఃఖింపబడుచున్నావు. నిన్ను గుఱించి యేడ్చుచున్న యీ యశోకము నీ దోహదమును స్మరించి పూలరూపమున కన్నీళ్లు రాల్చుచున్నది సుమా! "అన్యదుర్లభం" అనగా అశోకమునకు మాత్రమే అపాదతాడన మొక ప్పుడు లభ్యమైనదనియు, అదియు నికమీద స్మరణయోగ్యమేకాని అనుభవ యోగ్యము కాజాలదనియు భావము. అది అశోకమయ్యును నేడు శోకించుచున్నది. 'సుగాత్రి' శబ్దము సార్థకము. కనుకనే స్మృతి హేతువు.

శ్లో. తవ నిశ్వసి తానుకారిభిః
వకులై రర్ధచితాం సమం మయా
అసమాప్య విలాసమేఖలాం
కిమిదం కిన్నరకంఠి! సుప్యతే. 64

వ్యాఖ్య: తవ - నీయొక్క, నిశ్వసితానుకారిభిః - నిట్టూర్పులను బోలిన, వకులైః - పొగడ పూవులచేత, మయానమం - నాతో గూడ, అర్ధచితాం - సగమే కూర్చబడిన, విలాస మేఖలాం - విలాసార్థమైన మొలనూలును, అస మాప్య - పూర్తిచేయక, హే కిన్నరకంఠి! ఓ కిన్నరుల కంఠస్వరమువంటి కంఠ స్వరము గలదానా! కిమిదం - ఏమిటి? సుప్యతే - నిద్రబోవుచున్నావు. నాతో కలపి సగము మాత్రమే కూర్చఁబడిన పొగడదండను పూర్తిచేయక ఇట్లు నిద్రిం చుట తగునా? వకుళ పుష్పములు ఇందుమతి నిట్టూర్పులను బోలియున్నవనుట పరిమళసామ్యము. ఇందుమతి నిట్టూర్పులు పొగడపూవుల వాసనవంటి మంచి పరి మళము గలిగి యుండెనని భావము. 'కిన్నరకంఠి' శబ్దము మూగవోయిన ఇందు మతి కంఠమును స్మరింపఁజేయుచు అజుని పరితాపమును వెల్లడించును. తదితర ములగు పదముల భావ విశేషములను చదువరు లూహించుకొనవలెను.

శ్లో. సమ దుఃఖ సుఖః సఖీజనః
ప్రతిపచ్చంద్ర నిభోయ మాత్మజః
అహ మేకరస స్తథాపి తే
వ్యవసాయః ప్రతిపత్తి నిష్ఠురః. 65

వ్యాఖ్య: సఖీజనః - నీ చెలికత్తెలు, సమదుఃఖ సుఖః - నీ సుఖ దుఃఖములను సమానముగా పంచుకొనునట్టివారు (నీవు సుఖించిన తాము సుఖించుచు, నీవు దుఃఖించిన తాము దుఃఖించుచు నుండువారని యర్థము), అయం ఆత్మజః - ఈ నీ కుమారుఁడు, ప్రతిపచ్చంద్రనిభః - పాడ్యమినాటి చంద్రునితో సమానుఁడు (ప్రయత్న పూర్వకముగా చూడదగిన వర్ధిష్ణువు, అతిబాలుఁడు అని భావము). అహం - నేను, ఏకరసః - నీ యభిరుచికి భిన్నము గాని యనురాగము గల వాఁడను, తథాపి - అట్లయినను (నీకు కావలసిన జీవితసామగ్రి యంతయు నున్నప్పటికిని). తే - నీయొక్క, వ్యవసాయః - వ్యాపారము (మమ్ములను విడిచి వెళ్లుట). ప్రతిపత్తినిష్ఠురః - నీ నిశ్చయమునేత కఠినమై యున్నది. విలపించుచున్న నీ సఖీజనమును, పసికందుగానున్న కుమారుని, నీ యందే, నీ యభిరుచికి భిన్నముగాని, యేకరసుఁడనైన నన్నువిడిచి నీవు వెళ్లుట క్రూరమైనపని. తలచుటకుగూడ కఠినముగాకున్నది ఇక ననుభవించుట యెట్లని భావము.

శ్లో. ధృతి ర స్తమితా రతి శ్చ్యుతా
విరతం గేయ మృతు ర్నిరుత్సవః
గత మాభరణ ప్రయోజనం
పరిశూన్యం శయనీయ మద్య మే. 66

వ్యాఖ్య: అద్య - ఇప్పుడు, మే - నాయొక్క, ధృతిః - ధైర్యము (లేదాకీర్తి), అస్తం - నాశమును, ఇతా - పొందినది, రతిః - క్రీడ, చ్యుతా - పోయినది, గేయం - గానము, విరతం - ఆగిపోయినది, ఋతుః - వసంతాదికము, నిరుత్సవః - ఉత్సవములేనిదైనది, ఆభరణ ప్రయోజనం - ఆభరణముల ప్రయోజనము, గతం - తొలఁగిపోయినది, శయనీయం - తల్పము, పరిశూన్యం - శూన్యమైనది. నీవు లేనప్పుడు నాకుగల సరస్వమును నిష్ఫలమే, ధైర్యము సడలి

నది, ఇచ్ఛ, గానము, ఋతువిలాసము, ఆభరణ ప్రయోజనము అన్నియు పోయినవి. నాతల్పము శూన్యమైనది.

శ్లో. గృహిణీ సచివః సఖీ మిథః
ప్రియశిష్యా లలితే కలావిధౌ
కరుణావిముఖేన మృత్యునా
హరతా త్వాం వద కిం న మే హృతమ్. 67

వ్యాఖ్య: త్వమేవ - నీవే, గృహిణీ - గృహిణివి (సర్వకుటుంబ భారము నీదేయని యర్థము), సచివః - బుద్ధికి సహాయభూతమైన మంత్రివి, మిథః - ఏకాంతమునందు, సఖీ - నర్మసచివురాలవు (నా సర్వోప భోగములకును నీవే యాధారము), లలితే కలావిధౌ - మనోహరమైన వాదిత్రాది చతుః షష్టి కళల యందు, ప్రియశిష్యా - కళా ప్రయోగమునకుఁ దగిన శిష్యురాలవు, నా సర్వానందమునకును ముఖ్యకారణమవై యున్నావు కనుక, త్వాం - నిన్ను, హరతా - అపహరించుకొని పోవుచున్న, కరుణావిముఖేన, మృత్యునా - కృపాశూన్యమైన మృతువుచేత, మే కిం - నాకు సంబంధించిన యే వస్తువు, నహృతం - అపహరింపబడలేదో, వద - చెప్పుము. గృహిణివి, మంత్రివి, ప్రియసఖివి, కళా ప్రయోగ శిష్యురాలవు నయిన నీవు మృత్యువుచేత హరింపఁ బడినప్పుడు ఇక నాకు మిగిలిన దేమున్నది? అంతయు అపహరింపబడినట్లే, అన్నిటికినీ నీవు సమష్టి రూపిణివికాదా? చెప్పుము, అని యజుడు విలపించెను.

శ్లో. మదిరాక్షి! మదాననార్పితం
మధు పీత్వా రసవత్కథం ను మే
అనుపాస్యసి బాష్పదూషితం
పరలోకోపనతం జలాంజలిమ్. 68

వ్యాఖ్య: మదిరాక్షి - దర్శనమాత్రముచేత మత్తెక్కించునట్టి కన్నులుగల దానా! మదాననార్పితం - నా నోటితో నీయఁబడినదియు, రసవత్ - మిక్కిలి రుచికరమైనదియునగు, మధు - మద్యమును, పీత్వా - త్రాగి, బాష్పదూషితం - కన్నీటిచేత వేడియెక్కినదియు, పరలోకోపనతం - స్వర్గమునందు ప్రాప్తించి

నదియునగు, మే జలాంజలిం - నే నిచ్చు తిలోదకాంజలిని, కథం-ఎట్లు, అనుపా స్యసి - దాని తరువాత త్రాగఁగలవు? నా నోటితో నందింపబడిన మధుపానానంతరము నేనిప్పుడిచ్చు తిలాంజలిని త్రాగుట నీకెట్లు రుచింపఁగలదు? అంతేకాక అది వైద్యశాస్త్ర విరుద్ధము. బ్రతికియున్నప్పుడు మధుర మధుపానము చేయించిన నేను ఇప్పుడు తిలాంజలి నీయవలసి వచ్చినదికదా! ఇది మధుపాన ప్రసక్తి కనుక మదిరాక్షి అని సంబోధించుట మిక్కిలి సమంజసము. 'అనుపాస్యసి' యనఁగా అనుపానముగా త్రాగెదవని యర్థము. పెఱుగు, మద్యము, ద్రాక్ష, మరికొన్ని సేవించిన వెంటనే వేడినీరు త్రాగరాదని వైద్యశాస్త్రము. కనుక ఇచ్చట లభించు శీతజలమే యుక్తముగాని, నా కన్నీరుపడి వేడి యెక్కిన తిలాంజలి జలము అనుపానముగా పనికిరాదని భావము. "అనుపానం హిమజలం యవగోధూమ నిర్మితే, దధ్నిమద్యే విషేద్రాక్షే పిష్టే పిష్టమయేఽపిచ", అని భట్టమల్లుఁడు చెప్పెను. కనుక మద్యపానమువెంట చల్లని నీటినే త్రాగవలయును.

శ్లో. విభవేఽపి సతి త్వయా వినా
సుఖ మేతావ దజస్య గణ్యతామ్
అహృతస్య విలోభనాంతరై
ర్మమ సర్వే విషయా స్త్వదాశ్రయాః. 69

వ్యాఖ్య: విభవే, సతి, అపి - ఐశ్వర్య మున్నప్పటికిని, త్వయావినా - నీవు లేనప్పుడు, అజస్య - అజునికి, ఏతావత్ - ఇంతవఱకు మాత్రమే, సుఖం - సుఖమని, గణ్యతాం - లెక్కింపబడునుగాక (దీని తరువాత సుఖమేదియు నుండబోదని యెఱుఁగుము) ఎందువలన ననగా, విలోభనాంతరైః - ఇతర భోగ్య విషయములచేత, అహృతస్య - ఆకర్షింపఁబడనట్టి, మమ - నాయొక్క, సర్వే విషయాః - సర్వభోగములును, త్వదాశ్రయాః - నీ యధీనములే యై యున్నవి. నీవు లేక నాకు ఏ భోగముకూడ రుచింపదని భావము. సర్వోత్కృష్ట సౌందర్య గుణ సాహచర్యాది సద్గుణములుగల నీవు నాకు దక్కియున్నప్పుడు, ఇతర భోగ్య విషయములేవియు నన్నాకర్షింపలేక పోయినవనియు, ఇప్పుడుకూడా నా మనస్సునందు స్మృతి రూపమున నీవు సాక్షాత్కరించియే యుండుటవలన మరియొక విషయము నన్నాకర్షించు ప్రసక్తి లేనేలేదనియు "అహృతస్య విలోభనాంతరైః" అను

వాక్యమునకు తాత్పర్యము. కనుకనే నా సుఖము నీ వుండువఱకే యని లెక్కింపుము, ఇక నేను సుఖించుట యసంభవము.

శ్లో. విలప న్నితి కోసలాధిపః
కరుణార్థగ్రథితం ప్రియాం ప్రతి
అకరోత్ పృథివీరుహా న పి
స్రుత శాఖారస బాష్ప దూషితాన్. 70

వ్యాఖ్య: కోసలాధిపః - కోసల దేశాధిపతియగు అజుఁడు, ఇతి - ఈ విధముగా, కరుణార్థ గ్రథితం - శోక రసార్థముచేత కూర్పబడినట్లుగా, ప్రియాం ప్రతి - ప్రియురాలిని గురించి, విలపన్ - దుఃఖించుచు, పృథివీరుహాన్. అపి - వృక్షములనుగూడ, స్రుతశాఖారస భాష్పదూషితాన్ — స్రుత - స్రవించుచున్న, శాఖారస - మకరందములనెడు, బాష్ప - కన్నీళ్లచేత, దూషితాత్ - మలినమైన వానినిగా, అకరోత్ - చేసెను. అజుడు తాను దుఃఖించుచు తన సమీపము నందున్న వృక్షాద్యచేతనములను సైతము దుఃఖింపఁజేసెననియు ఆ వృక్షములు ప్రేక్షకవర్గమనియు భావము. "కరుణార్థ గ్రథితం" కరుణరసము ప్రధానమగునట్లు కూర్పఁబడినది అని యర్థము. ఇందలి యర్థశబ్దము వ్యంగ్యార్థపరము. ఆ వ్యంగ్యార్థమే కరుణరస కావ్యఖండమని కాళిదాసు హృదయము కానోపును.

శ్లో. అథ తస్య కథంచి దంకతః
స్వజన స్తా మపనీయ సుందరీమ్
విససర్జ త దంత్య మండనాం
అనలా యాగురు చంద నైధసే. 71

వ్యాఖ్య: అథ - పిమ్మట, స్వజనః - బంధువర్గము, తస్య - ఆ యజుని యొక్క, అంకతః - తొడనుండి, కథంచిత్ - అతి కష్టముతో, అపనీయ - ప్రక్కకు తొలగించి, తదంత్యమండనాం—తత్-ఆ దివ్యకుసుమమాలయే, అంత్య మండనాం - చివరి అలంకారముగా గల, తాం సుందరీం - ఆ యిందుమతిని, అగురుచందనైధసే - అగురు చందన కాష్ఠములు ఇంధనములుగాఁగల, అన లాయ - అగ్నికొఱకు, విససర్జ - వదలిపెట్టెను. ఏడ్చుచున్న యజుని తొడమీది

నుండి అతి ప్రయత్నముచేత ఇందుమతి శరీరమును ప్రక్కకుతీసి, బంధువర్గ మామె కా సుమమాలనే తుది యలంకారముగా చేసి, చందనాగురు కాష్ఠములతో మందు చితాగ్నికి సమర్పించిరని భావము.

శ్లో. ప్రమదా మను సంస్థితః శుచా
నృపతిః సన్నపి వాచ్యదర్శనాత్
న చకార శరీర మగ్నిసాత్
సహ దేవ్యా నతు జీవితాశయా. 72

వ్యాఖ్య: నృపతిః - అజుఁడు, సన్నపి (సన్ + అపి) - విద్వాంసుఁడైనను, శుచా - శోకముచేత, ప్రమదాం, అను - భార్యతోగూడ, సంస్థితః - చనిపోయినాడు, ఇతి - ఇట్లను, వాచ్యదర్శనాత్ - నింద నెఱిఁగి యుండుటవలన, దేవ్యాసహ - ఇందుమతితో పాటు, శరీరం - తన శరీరమును, అగ్నిసాత్ - అగ్నికి అధీనముగా, న చకార - చేయలేదు. జీవితాశయా తు - ప్రాణములమీది యాశతోనైతే, న - కాదు. "అజుఁడు పండితుఁడై కూడ శోకోపహతుఁడై ఆడుదానిమీది ప్రేమతో చచ్చె" నని లోకము నిందింపబోవునను కారణముచేత తన శరీరమును ప్రియాదేహముతో పాటు అగ్నికి అర్పింపలేదుగాని, ప్రాణముమీది తీపిచేత తాను బ్రతికి యుండుటకు కాదని భావము.

శ్లో. అథ తేన దశాహతః పరే
గుణశేషా ముపదిశ్య భామినీమ్
విదుషా విధయో మహర్ధయః
పుర ఏవోపవనే సమాపితాః 73

వ్యాఖ్య: అథ - పిమ్మట, విదుషా - విద్వాంసుఁడైన, తేన - ఆ యజుని చేత, గుణశేషాం - గుణములు మాత్రమే మిగిలినట్టి, భామినీం-ఇందుమతిని, ఉపదిశ్య - ఉద్దేశించి, దశాహతః - పదియవ దినముకంటె, పరే - తరువాత చేయదగినట్టి, మహర్ధయః - మహాసమృద్ధములయిన, విధయః - అపరక్రియలు, పురః - పట్టణముయొక్క, ఉపవనే ఏవ - ఉద్యానవనమునందే, సమాపితాః - పూర్తి గావింపఁ బడినవి. ఇందుమతికి చేయవలసిన ఉత్తర క్రియలు శాస్త్రీయము

గాను, కావలసిన యుత్తమ వస్తుసంపదతోను నిర్వహింపఁబడి ప్రేతకర్మ పూర్తి చేయబడినది. ఇచ్చటి "గుణశేషా" శబ్దము, ఈ కాలమున వాఁడబడుచున్న "కీర్తిశేషులు" వంటి ప్రయోగము. "దశాహతః" విప్రఃశుద్ధ్యేత్ దశాహేన, ద్వాదశాహేన భూమిపః" అను మనువచన విరోధము కనఁబడుచున్నది. బ్రాహ్మణునికి పదిరోజులతోను, క్షత్రియునికి పన్నెండు రోజులతోను మృతాశౌచము తీరునని మనువచనమున కర్థము కాని, అది సామాన్యులగు క్షత్రియుల విషయమనియు, గుణవంతుఁడగు క్షత్రియునికి కాదనియు పరాశరుఁడు తన స్మృతిలో నిట్లు చెప్పెను. "క్షత్రియస్తు దశాహేన స్వధర్మ నిరతః శుచిః" రఘువంశరాజులు స్వధర్మ నిరతులు, వేదవేత్తలు, యజ్ఞకర్తలు నగుటచేత పరాశర వచనానుసారముగాఁగల ధర్మరహస్యము నెఱిఁగిన కాళిదాసు అజునికి "విదుషా" అను విశేషణము వేసి "దశాహతః" అని చెప్పెను. అందువలన ధర్మవిరోధ మెంతమాత్రమును లేదు.

శ్లో. స వివేశ పురీం తయా వినా
క్షణదాపాయ శశాంక దర్శనః
పరివాహా మివావలోకయన్
స్వశుచః పౌరవధూ ముఖాశ్రుషు. 74

వ్యాఖ్య: తయావినా - ఆమెలేక (ఇందుమతి లేక), క్షణదాపాయ శశాంక దర్శనః — క్షణదా - రాత్రియొక్క, అపాయ - తొలగుటయందలి, శశాంక దర్శనః - చంద్రునిలెఁ గనఁబడుచున్న (కాంతిహీనుఁడగు ప్రాతఃకాల చంద్రుని వలెనున్న), సః - ఆ యజుఁడు, పౌరవధూ ముఖాశ్రుషు - పురస్త్రీల ముఖములపై స్రవించు కన్నీళ్లయందు, స్వశుచః - తన దుఃఖముయొక్క, పరివాహం - వెల్లువను, అవలోకయన్ - చూచుచు, పురీం - పట్టణమును, వివేశ - ప్రవేశించెను. పురస్త్రీలు దుఃఖించుచుండగా వారి ముఖములమీది జలధారలయందు తన శోకజల ప్రవాహముయొక్క ప్రతిబింబమును చూచుచు అజుఁడు నగరమును ప్రవేశించెనని భావము. ఇక్కడ ఇందుమతీ మరణానంతరమున్న అజుఁడు నిశావసానమందలి చంద్రుడుగా ఉపమింపఁబడుట చక్కని పోలిక.

శ్లో. అథ తం సవనాయ దీక్షితః
ప్రణిధానాత్ గురు రాశ్రమస్థితః

అభిషంగ జడం విజజ్ఞివాన్
ఇతి శిష్యేణ కిలా న్వబోధయత్. 75

వ్యాఖ్య: అథ - తరువాత, సవనాయ - ఒకానొక యాగముకొఱకై, దీక్షితః - దీక్ష వహించినట్టి, గురుః - కులగురువైన వసిష్ఠుడు, ఆశ్రమస్థితః సన్ - తన యాశ్రమమునందున్న వాఁడగుచునే, తం - అజునిని, అభిషంగజడం - దుఃఖమోహితునిగా, ప్రణిధానాత్ - చిత్తముయొక్క ఏకాగ్రతవలన, విజజ్ఞివాన్ - తెలుసుకున్నాఁడు, ఇతి - ముందు చెప్పబోవురీతిగా (ఇట్లని), శిష్యేణ - శిష్యుని ద్వారా, అన్వబోధయన్‌కిల - తెలియఁజేసెనుగూడ. యజ్ఞదీక్షితుఁడు పొలిమేరను దాటరాదు కనుక వసిష్ఠుఁడు స్వయముగా రాలేదు. యోగదృష్టిచేతనే యజునికి వచ్చిన ఆపత్తును దెలిసికొని, తన శిష్యునిద్వారా ఓదార్పును (ఆదరింపుమాటలను) దెలిపెను.

శ్లో. అసమాప్త విధి ర్యతో ముని
స్తవ విద్వానపి తాప కారణమ్
న భవంత ముపస్థితః స్వయం
ప్రకృతౌ స్థాపయితుం పథశ్చ్యుతమ్. 76

వ్యాఖ్య: యతః - ఏ కారణమువలన నైతే, మునిః - వసిష్ఠుఁడు, అసమాప్తవిధిః - పూర్తిచేయఁబడని యాగము కలవాఁడై యున్నాడో, తతః - ఆ కారణము వలననే, తవ - నీయొక్క, తాపకారణం - దుఃఖ హేతువును (కళత్ర నాశరూపమైనట్టిది), విద్వాన్‌అపి - తెలుసుకొన్నవాఁడైనప్పటికిని, పథశ్చ్యుతం - మార్గమునుండి జాఱిన (మనస్సు సరిగాలేని), భవంతం - నిన్ను, ప్రకృతౌ - స్వభావమునందు (మామూలు పరిస్థితియందు), స్థాపయితుం - నిలువుటకు (ఓదార్చుటకు), స్వయం - స్వయముగా, న ఉపస్థితః - రాలేదు. యాగదీక్షితుఁడై యున్న వసిష్ఠుఁడు, నీ దుఃఖము నెఱిఁగి యున్నవ్పటికిని రాజాలక, నా ద్వారా ఓదార్పుమాటలను జెప్పి పంపినాడని శిష్యుడజునితోఁ జెప్పెను.

శ్లో. మయి తస్య సువృత్త వర్తతే
లఘు సందేశ పదా సరస్వతీ

శ్రుణు విశ్రుతసత్త్వసార ! తాం
హృది చైనా ముపధాతు మర్హసి. 77

వ్యాఖ్య : ఆ శిష్యుడిట్లు చెప్పుచున్నాడు : హే సువృత్త - ఓ సదాచారము గలవాఁడా ! లఘు సందేశపదా—లఘు - సంక్షిప్తములైన, సందేశపదా - చెప్ప వలసిన యర్థమును దెలుపు పదములుగల, తస్య సరస్వతీ - ఆ వసిష్ఠునియొక్క వాక్కు, మయి - నాయందు, వర్తతే - ఉన్నది, హే విశ్రుత సత్త్వసార - ఓ ప్రఖ్యాత ధైర్య స్థైర్యములు గలవాఁడా ! తాం - ఆ వాక్కును, శ్రుణు - వినుము, ఏనాం - ఈ యా చెప్పబోవు ఋషివాక్కును, హృది - హృదయమునందు, ఉప ధాతుంచ - నిలుపుకొనుటకును, అర్హసి - తగుదువు. వసిష్ఠుని ఆ మాటలు చక్కగావిని మనస్సున నిలుపుకొనుమని శిష్యుఁడనెను.

శ్లో. పురుషస్య పదే ష్వజన్మనః
సమతీతం చ భవచ్చ భావిచ
స హి నిష్ప్రతిఘేన చక్షుషా
త్రితయం జ్ఞానమయేన పశ్యతి. 78

వ్యాఖ్య : అజన్మనః పురుషస్య - జన్మలేని పురుషుఁడగు విష్ణువుయొక్క (వామనావతారము), పదేషు - పాదముద్రలయందు (మూడు లోకముల యందును). సమతీతంచ, భవచ్చ, భావిచ - భూతము, వర్తమానము, భవిష్యత్తు అవబడు, త్రితయం - మూడింటిని, సః - ఆ వసిష్ఠముని, నిష్ప్రతిఘేన - ఏ ప్రతిబంధమును లేని, జ్ఞానమయేన చక్షుషా - జ్ఞాన నేత్రముచేత, పశ్యతి హి - చూచునుగదా ! భూత భవిష్యద్ వర్తమాన కాలములందు ముల్లోకములలో నేమి జరుగునో జ్ఞాననేత్రముచేత ఆ వసిష్ఠముని తెలుసుకొనును గనుక ఆయన పలుకులు విశ్వసనీయములని భావము.

శ్లో. చరతః కిల దుశ్చరం తప
స్తృణ బిందోః పరిశంకితః పురా
ప్రజిఘాయ సమాధిభేదినీం
హరి రస్మై హరిణీం సురాంగనామ్. 79

వ్యాఖ్య : పురాకిల - పూర్వాకాలాన, దుశ్చరం - తీవ్రమైన, తపః - తపస్సును, చరతః - ఆచరించుచున్న, తృణబిందోః - తృణబిందుఁడను పేరుగల ఋషివలన, పరిశంకితః - భయపడినవాఁడగు, హరిః - ఇంద్రుఁడు, సమాధిభేదినీం - ఆ ముని తపస్సును భంగము జేయగల, హరిణీం - హరిణియను పేరుగల అప్సరసను, అస్మై - ఆ తృణబిందు మునికొఱకు, ప్రజిఘాయ - పంపెను. పూర్వ మొకప్పుడు తృణబిందుడను ముని ఘోరతపస్సును జేయుచుండగా నతని తపస్సును భగ్నము చేయుటకై యింద్రుఁడు 'హరిణి' అను అప్సరసను ఆ ముని వద్దికి పంపెను.

శ్లో. స తపఃప్రతిబంధ మన్యునా

ప్రముఖావిష్కృత చారు విభ్రమామ్

అశపత్ భవ మానుషీతి తాం

శమ వేలా ప్రలయోర్మిణా భువి. 80

వ్యాఖ్య సః - ఆ ముని, శమవేలా ప్రలయోర్మిణా — శమ - శాంతి యనెడు, వేలా - చెలియలికట్టకు (హద్దుకు), ప్రలయోర్మిణా - ప్రళయకాలపు తరంగమువంటిదైన (శాంతి విఘాతుకమైన అని యర్థము). తపః ప్రతిబంధ మన్యునా - తపస్సుయొక్క విఘ్నముచేత కలిగిన కోపముచేత. ప్రముఖావిష్కృత చారువిభ్రమాం—ప్రముఖ - తన యెట్టయెదుట, అవిష్కృత - ప్రకటింపఁబడిన, చారువిభ్రమాం - మనోహరములగు విలాసములు గల (ఎదుట నిల్చి కచ కుచ నితంబాదుల వయ్యారములను జూపినట్టి), తాం - ఆ హరిణియను దేవాంగనను, "భువి, మానుషీ, భవ" - భూలోకమునందు మనుష్యస్త్రీవి కమ్ము, ఇతి - ఇట్లని, అశపత్ - శపించెను. ఆ ముని తపస్సును భంగపరచుటకై హరిణి తన విలాసములను జూపగా మునికి తీవ్రకోపమువచ్చి నీవు మానవస్త్రీగా పుట్టుమని శపించెను.

శ్లో. భగవన్ !పరవా నయం జనః

ప్రతికూలాచరితం క్షమస్వ మే

ఇతి చోపనతాం క్షితిస్పృశం

కృతవా నా సుర పుష్ప దర్శనాత్. 81

వ్యాఖ్య: హే భగవన్ - ఓ షడ్గుణైశ్వర్య సంపన్నుఁడా! (ఓ మహర్షి). అయంజనః - ఈ నేను, పరవాన్ - పరాధీనురాలను (ఒకరి యాజ్ఞ ప్రకారము వర్తించు దానను), మే - నాయొక్క, ప్రతికూలాచరితం - విరుద్ధమైన నడవడిని (అపరాధమును). క్షమస్వ - క్షమింపుము, ఇతి - ఇట్లని ప్రార్థించుచు, ఉపనతాం - శరణువేడిన యా హరిణిని, ఆ సురపుష్ప దర్శనాత్ - దేవతా పుష్పములను దర్శించువఱకు, క్షితిస్మృశం - నేలనంటి యుండుదానినిగా (మానవస్త్రీయై యుండుదానినిగా), కృతవాన్ - చేసెను. అట్లు శపించిన తృణబిందు మహర్షినిజేరి మహాత్మా! నేను ఇంద్రుని యాజ్ఞవలన ఇట్లు మీకు విరుద్ధముగా ప్రవర్తించినందులకు క్షమింపుమని హరిణి వేడుకొనగా ప్రసన్నుడైన ముని "నీకు దివ్యపుష్ప దర్శన పర్యంతమే మానవత్వ ముండుననియు, ఆ వెంటనే మరల దేవత్వము కలుగుననియు" శాపావధిని అనుగ్రహించెనని భావము.

శ్లో. క్రథకైశిక వంశ సంభవా
తవ భూత్వా మహిషీ చిరాయ సా
ఉపలబ్ధవతీ దివశ్చ్యుతం
వివశా శాప నివృత్తి కారణమ్. 82

వ్యాఖ్య: క్రథకైశిక వంశసంభవా - క్రథకైశిక దేశాధిపతులైన రాజుల వంశమునందు పుట్టుకగలదియై, సా - ఆ హరిణి, తవ - నీకు, మహిషీభూత్వా - పట్టపు రాణియై, చిరాయ - బహుకాలమునకు, దివః - స్వర్గమునుండి, చ్యుతం - జాఱిపడిన, శాపనివృత్తి కారణం - శాపము తొలఁగుటకు హేతువైన పుష్పదామమును, ఉపలబ్ధవతీ - పొందినదియై, వివశా - మృతిచెందినది, అభూత్ - అయ్యెను. ఆ హరిణి విదర్భరాజుల వంశమునందు పుట్టి, చిరకాలము నీకు భార్యగానుండి, ఇప్పుడు దేవకుసుమ దర్శనముకాగా శాపకాలము ముగిసి మృతి నొందినది.

శ్లో. తదలం తదపాయ చింతయా
విపదుత్పత్తిమతా ముపస్థితా
వసుధేయ మవేక్ష్యతాం త్వయా
వసుమత్యా హి నృపాః కళత్రిణః. 83

వ్యాఖ్య : తత్ - అందువలన, తదపాయ చింతయా - ఆమె వినాశము వలని చింతచేత, అలం - చాలును (ఆమె మరణమును గుఱించి చింతింపవద్దని భావము), ఎందుకనగా, ఉత్పత్తిమతాం - పుట్టుకగల వారికి, విపత్ - మరణము, ఉపస్థితా - సిద్ధమై యున్నది (తప్పనిది), కళత్రములేని జీవితము వృథాయని తలంపక, త్వయా - నీచేత, ఇయం, వసుధా - ఈ భూమి, అవేక్ష్యతాం - చూడబడునుగాక (పాలింపబడునుగాక), హి - ఎందువలన ననగా, నృపాః - రాజులు, వసుమత్యా - భూదేవిచేతనే, కలత్రిణః - భార్యావంతులు. అందువలన ఇందుమతిని గుఱించి దుఃఖింప వలదని భావము.

శ్లో. ఉదయే మదవాచ్య ముజ్ఝితా
శ్రుత మావిష్కృత మాత్మవత్తయా
మనస స్తదుపస్థితే జ్వరే
పున రక్లీబతయా ప్రకాశ్యతామ్. 84

వ్యాఖ్య : ఉదయే (సతి) - అభ్యుదయము కలిగిన సమయమునందు, మదవాచ్యం - మదముచేత కలుగు నిందా దుఃఖమును, ఉజ్ఝితా - పరిహరించునట్టి, త్వయా - నీచేత, ఆత్మవత్తయా - అధ్యాత్మభావము కలిగియుండిన కారణమున, శ్రుతం - శాస్త్రజ్ఞానము, ఆవిష్కృతం - వెల్లడింపబడినదో, తత్ - ఆ శాస్త్రజ్ఞానము, మనసః - మనస్సునకు, జ్వరే, ఉపస్థితే - సంతాపము కలిగినప్పుడును, అక్లీబతయా - ధైర్యముచేత, పునః - మరల, ప్రకాశ్యతాం - వెల్లడింపబడునుగాక. సంపదభ్యుదయ సమయమునందు "ఇతఁడు సంపద్గర్వము గలవాఁడని" లోకము నిందిచునని వెఱచి మదోన్మత్తుఁడవు గాక శాస్త్రజ్ఞానమును వెల్లడించినట్లే, అనగా దమరూపమైన ఇంద్రియ నిగ్రహముగలిగి యుండినట్లే, ఈ విపత్సమయమునందును "ఆడుదానికై శోకించుచున్నాఁడను లోకనిందకు లోనుగాక, ధైర్యరూపమున మరల నీ శాస్త్రజ్ఞానమును ప్రకటింపుమని భావము. విద్వాంసుఁడు సర్వావస్థల యందును ధీరుఁడై యుండవలయునని సారాంశము.

శ్లో. రుదతా కుత ఏవ సా పున
ర్భవతా నానుమృతాపి లభ్యతే
పరలోకజుషాం స్వకర్మభిః
గతయో భిన్నపథా హి దేహినామ్. 85

వ్యాఖ్య: రుదతా - దుఃఖించుచున్న, భవతా - నీచేత, సా - ఆ యిందుమతి, కుతఏవ - ఎక్కడినుండి, లభ్యతే - లభించును? (లభింపదని యర్థము), అనుమృతా, అపి - ఆమె వెంటనే మరణించు వాడవైనను, భవతా - నీచేత, పునః నలభ్యతే-మళ్లీ పొందఁబడదు, ఎందువల్ల ననగా, పరలోక జుషాం-స్వర్గాదులను పొందునట్టి, దేహినాం - మనుష్యులయొక్క, గతయః - గమ్యస్థానములు, స్వకర్మభిః - తమతమ పుణ్య పాపములయొక్క ఫలములచేత, భిన్నపథాః హి - వేరువేరుగా నున్నమార్గములు కలవిసుమా! నీవు ఏడ్చినచో ఆమె ఎక్కడినుండి వచ్చును? నీవు ఆమెవెంట చనిపోయినప్పటికిని ఆమె నీకు దొరకదు. కారణమేమనగా పరలోకమునకు వెళ్లు మానవుల గమ్యస్థానములు, ఆ స్థానములకు మార్గములు భిన్న భిన్నములుగా నుండును, కనుక నీవు సహగమనము చేయఁదలచినను అది సిద్ధింపదు. ఆమె యేదారిన వెళ్లనో నీ వేదారిన వెళ్లదువో తెలియదు. కనుక అట్టివన్నియు వ్యర్థప్రయత్నములని భావము.

శ్లో. అపశోకమనాః కుటుంబినీం
అనుగృహ్ణీష్వ నివాపదత్తిభిః
స్వజనాశ్రు కిలాతిసంతతం
దహతి ప్రేత మితి ప్రచక్షతే. 86

వ్యాఖ్య: అపశోకమనాః - దుఃఖము తొలగిన మనస్సుకల వాఁడవగుచు, కుటుంబినీం - భార్యను. నివాపదత్తిభిః - పిండోదకాది దానములచేత, అనుగృహ్ణీష్వ - అనుగ్రహింపుము (తర్పణము చేయుమని యర్థము), అతి సంతతం - అవిచ్ఛిన్నమైన, స్వజనాశ్రు - ఆత్మబంధువుల కన్నీరు, ప్రేతం - చచ్చినవానిని, దహతి ఇతి - కాల్చివేయునని (బాధించునని), ప్రచక్షతే కిల - చెప్పుదురు గదా! నీ వామెకు తర్పణాదులు చేయుట తగునుగాని ఏడ్చుట తగదు.

"శ్లేష్మాశ్రు బంధుభిర్ముక్తం ప్రేతో భుంక్తే యతోఽవశః,
అతో న రోదితవ్యంహి క్రియాః కార్యాః స్వశక్తితః.

అని యాజ్ఞవల్క్య స్మృతి చెప్పుచున్నది. ప్రేతమనగా చనిపోయిన వ్యక్తి స్వర్గ నరకములను చేరుటకుముందుగల యాతనా శరీరముతోఁ గూడిన ప్రాణి. అతఁడు తన బంధువులు విడిచిన కన్నీటిని, శ్లేష్మమును అవశుఁడై భక్షించును. కనుక

బంధువులు ఏడ్చుటమాని చనిపోయిన వ్యక్తికి యథాశక్తిగా అంత్యక్రియలు పిండోదకాదులచేత చేయవలయునని స్మృత్యర్థము. కనుక వసిష్ఠుఁడు ఇందు మతినిఁగూర్చి యేడ్చుచుఁ గూర్చున్న లాభములేదని యజునికిఁ జెప్పి పంపెను.

శ్లో. మరణం ప్రకృతిః శరీరిణాం
వికృతి ర్జీవిత ముచ్యతే బుధైః
క్షణ మప్యవతిష్ఠతే శ్వసన్
యది జంతు ర్నను లాభవా నసౌ. 87

వ్యాఖ్య: శరీరిణాం - మనుష్యులకు (దేహముగల ప్రాణులన్నిటికిని), మరణం - మరణము, ప్రకృతిః - సహజము, జీవితం - జీవించి యుండుట, వికృతిః - యాదృచ్ఛికము (ఎలాగో వచ్చినట్టిది) అని, బుధైః - పండితులచేత, ఉచ్యతే - చెప్పఁబడుచున్నది, (ఇలావుండగా) జంతుః - ప్రాణి, క్షణమపి - ఒక్కక్షణమైనను, శ్వసన్ - నిట్టూర్పు విడుచుచు (జీవించుచు), అవతిష్ఠతేయది - నిలిచి యున్నట్లయితే, అసౌ - ఆ క్షణజీవి, లాభవాన్ నను - లాభము కలవాఁడే కదా, జీవుఁడు, నిర్గుణము, నిర్వికారమునైన శూన్యమువంటి శుద్ధ చైతన్యమునుండి అవిద్యా మూలమున వేరుపడి, తాను "జనన మరణములుగల ప్రాణిని" అని భ్రమపడుచున్నాఁడు. నిజమునకు నిత్యసత్యమైన లయమునందే అతనికి స్థానము. కనుక మరణము ప్రకృతి అని చెప్పఁబడినది. ఇక పుణ్య పాప ఫలములుగల కర్మల నాచరించుటచేత ఆ కర్మఫలానుభూతికై యాదృచ్ఛికముగా తనకు వికృతి రూపమైన దేహము, జీవితము లభించుచున్నవి. కనుక ఒక వ్యక్తి మరణించుట యనగా తన చోటునకు తాను చేరుట ,జీవించుట, సుఖాదుల ననుభవించుట యెంత లభించితే అంతకే సంతోషపడ వలెనుగాని, మరణమునకు శోకించుట తగదని తాత్పర్యము. వేదాంతశాస్త్ర రహస్యమంతయు నీ శ్లోకము నందున్నది.

శ్లో. అవగచ్ఛతి మూఢచేతనః
ప్రియనాశం హృది శల్య మర్పితమ్
స్థిరధీస్తు తదేవ మన్యతే
కుశలద్వారతయా సముద్ధృతమ్. 88

వ్యాఖ్య : మూఢచేతనః - భ్రాంతిచెందిన బుద్ధిగలవాఁడు, ప్రియనాశం - తనకు ప్రియమైన వస్తువుయొక్క నాశమును, హృది - హృదయమునందు, అర్పితం - గ్రుచ్చఁబడిన, శల్యం - శంకువునుగా (ఇనుప మేకునుగా), అవ గచ్ఛతి - తలఁచుచున్నాఁడు; స్థిరధీఃతు - విద్వాంసుఁడైనచో (స్థితప్రజ్ఞుడైనచో) తదేవ - ఆశల్యమే, సముద్ధృతం - హృదయమునుండి తీసివేయఁబడిన దానినిగా, మన్యతే - తలఁచును. (ఎందుకనగా) కుశల ద్వారతయా - ఆప్రియనాశము మోక్షోపాయ మగుటచేత అని యర్థము. భోగ్యవస్తువుల లాభము మంచిదనియు, తద్వినాశము అహితమనియు పామరులు తలంతురు. విద్వాంసులు దానికి విపరీత ముగా అనగా ప్రియవస్తు నాశము శ్రేయస్కరమనియు, తల్లాభము దుఃఖ దాయక మనియు భావింతురని భావము.

శ్లో. స్వశరీర శరీరిణా వపి
శ్రుత సంయోగ విపర్యయౌ యదా
విరహః కిమి వానుతాపయేత్
వద బాహ్యై ర్విషయై ర్విపశ్చితమ్. 89

వ్యాఖ్య : స్వశరీర శరీరిణౌ, అపి - తనయొక్క దేహము, ఆత్మయు కూడ, యదా-ఎప్పుడైతే (ఏకారణమువలన నైతే) శ్రుతసంయోగ విపర్యయౌ - శ్రుత - మనచే విని తెలుసుకోఁబడిన, సంయోగ - సంబంధమును, విపర్యయౌ - సంబంధము విడిపోవుటయును గలిగి యున్నవో, తదా - అప్పుడు (అట్టి పరిస్థితి యందు) బాహ్యైః - వెలుపటివి యగు, విషయైః - పుత్రమిత్ర కళత్రాదులచేత, విరహః - ఎడబాటు, విపశ్చితం - విద్వాంసుని, కిమివ - ఏమని, అనుతాపయేత్ - సంతాపము గలవానిని గా జేయఁ గలుగునో : వద - చెప్పుము. తన శరీరము, ఆత్మ, కొంతకాలము కలిసియుండుటయు, తరువాత నొకదాని కొకటి దూరమగు టయు నెఱిఁగిన విద్వాంసుని, దూరమునందున్న పుత్రమిత్ర కళత్రాదుల వియోగము ఏవిధముగా సంతాపతప్తుని జేయునో నీవే చెప్పుము. తనవిగా భావింపఁబడిన దేహాత్మలకే నిత్యసంబంధము లేనప్పుడు, బాహ్యవస్తువు లగువానివి తనవిగా భావించి దుఃఖించుట వివేకవంతుని లక్షణము కాదని తాత్పర్యము.

శ్లో. న పృథగ్జనవ చ్ఛుచో వశం
వశినా ముత్తమ ! గంతు మర్హసి
ద్రుమ సానుమతాం కి మంతరం
యది వాయౌ ద్వితయేఽపి తే చలాః. 90

వ్యాఖ్య : హే వశినాం ఉత్తమ ! - ఓ జితేంద్రియులలో శ్రేష్ఠుఁడా !, పృథక్ జనవత్ - ఇతరునివలె (పామరునివలె), శుచః - శోకమునకు, వశం గంతుం - లొంగిపోవుటకు, న అర్హసి - తగవు; వాయౌ(సతి)-గాలివీచినప్పుడు, ద్వితయేఽపి - భిన్నధర్మములు కలవియై యున్నను, తే - అవి, చలాఃయది - చలించునవియే యైనచో, ద్రుమ సానుమతాం - వృక్షములకును పర్వతములకును, కిం అంతరం - ఏమిభేదము ? గాలివచ్చినప్పుడు వృక్షములు చలించినట్లే పర్వతములును చలించినచో వాటికి "అచలములు" అను పేరెందుకు ? అట్లే పామరునివలె దుఃఖమునకు పండితుఁడును లోనైనచో వారిద్దఱికిని భేదమేమి కలదు ? కనుక నీవు శోకింపరాదని వసిష్ఠ వచనము. "వశినాం ఉత్తమ" నీవు జితేంద్రియుఁడవు కనుక శోకింపఁ దగదని చెప్పుటకు వేసిన సంబోధనమిది. ఇచ్చట పామరునికి పోలికగా "ద్రుమ" శబ్దమును వాడుట మిక్కిలి రమణీయముగా నున్నది. "ద్రు - గతౌ" అనుధాతువుమీద ద్రుమశబ్ద మేర్పడినది! కనుక అది చల మనియు, సానుమంతమగు పర్వతము "అచల"మనియు భావము. అచలము అజునికి ఉపమానము.

శ్లో. స తథేతి వినేతు రుదారమతేః
ప్రతిగృహ్యా వచో విససర్జ మునిమ్
తదలబ్ధపదం హృది శోకఘనే
ప్రతియాత మివాంతిక మస్య గురోః 91

వ్యాఖ్య : సః - అజుఁడు, ఉదారమతేః - విశాల బుద్ధియగు, వినేతుః - గురువగు వసిష్ఠునియొక్క. వచః - ఉపదేశ వాక్యమును, తథేతి - అట్లేయని, ప్రతిగృహ్య - అంగీకరించి, మునిం - వసిష్ఠ శిష్యుఁడగు మునిని. విససర్జ - పంపివేసెను; (కింతు - కాని) తత్ - ఆ గురువచనము, శోకఘనే - దుఃఖముతో నిండిన, అస్య, హృది - ఈ యజునియొక్క హృదయమునందు, అలబ్ధపదం - దొరకని యవకాశముగలది యగుచు. గురోః - వసిష్ఠునియొక్క, అంతికం -

సమీపమును, ప్రతియాతం ఇవ - తిరిగి చేరినట్లున్నది। కులగురు వగు వసిష్ఠుని యుపదేశ వాక్యమును కాదనలేక అజుఁడు స్వీకరించి గురు శిష్యునిఁ బంపివేసెను కాని, ఆ గురు వచనము శోకఘనమైన యజుని హృదయమును జొరఁ జాలక తిరిగి వసిష్ఠుని చెంతకే వెళ్ళిపోయెనా? యేమి యనునట్లుండెను. అనఁగా గురూప దేశము ననుసరింపలేక యజుఁడు ప్రియావియోగ దుఃఖము ననుభవించుచునే యుండెనని తాత్పర్యము. "శోకఘన" అలబ్ధపద" శబ్దములు సార్థకములు. అలం కారము: ఉత్ప్రేక్ష.

శ్లో. తేనాష్టౌ పరిగమితాః సమాః కథంచిత్
బాలత్వా దవితథసూనృతేన సూనోః
సాదృశ్య ప్రతికృతి దర్శనైః ప్రియాయాః
స్వప్నేషు క్షణిక సమాగమోత్సవైశ్చ. 92

వ్యాఖ్య: అవితథ సూనృతేన - సత్యప్రియ వచనుఁడైన, తేన - ఆ యజునిచేత, సూనోః బాలత్వాత్ - కుమారుఁడగు దశరథుఁడు బాలుఁడై యుండుట వలన, ప్రియాయాః - ప్రియ భార్యయగు ఇందుమతియొక్క, సాదృశ్య ప్రతికృతి దర్శనైః - పోలికగల వస్తువులయొక్కయు, చిత్తరువుల యొక్కయు దర్శన ముల చేతను, స్వప్నేషు - స్వప్నములయందలి, క్షణిక సమాగమోత్సవైశ్చ - క్షణకాలము సంభవించునట్టి సమాగమ సుఖానుభవములచేతను, కథం చిత్ - అతి కష్టముగా, అష్టౌ - ఎనిమిది, సమాః - సంవత్సరములు, పరిగమితాః - గడపఁ బడినవి; కుమారుఁడు పనివాఁడై రాజ్యముచేయుటకు శక్తుఁడు కానందున ప్రియా వియోగ దుఃఖము నెట్లో భరించుచు నెనిమిది సంవత్సరములను గడిపెనని భావము.

శ్లో. తస్య ప్రసహ్య హృదయం కిల శోకశంకుః
ప్లక్షప్రరోహ ఇవ సౌధతలం బిభేద
ప్రాణాంతహేతు మపి తం భిషజా మసాధ్యం
లాభం ప్రియానుగమనే త్వరయా స మేనే. 93

వ్యాఖ్య: శోకశంకుః - దుఃఖమనెడు మేకు, తస్య - ఆ యజునియొక్క, హృదయం - హృదయమును, ప్లక్షప్రరోహః - రావిమొలక, సౌధతలం ఇవ -

మేడనువలె, ప్రసహ్య - బలాత్కారముగా, బిభేదకిల - వ్రయ్యలుచేసెను సుమా! సః - అజుఁడు, ప్రాణాంతహేతుం, అపి - మరణమునకు కారణమైన దయి నప్పటికిని, భిషజాం - వైద్యులకు, అసాధ్యం - చికిత్సచేయుటకు సాధ్యముగాని తం - ఆశోకశంకువును, (రోగముగా మారిన దుఃఖమును), ప్రియానుగమనే - ప్రియురాలగు ఇందుమతిని అనుసరించి వెళ్ళుట యందలి, త్వరయా - ఉత్కంఠ చేత, లాభం మేనే - లాభమునుగాఁ దలంచెను. మొదట మొలకగానున్నను క్రమక్రమముగా మహావృక్షముగా మారిన రావిచెట్టు తనకాశ్రయమైన సౌధము యొక్క గోడలను వ్రయ్యలుచేసి సౌధమునే కూల్చినట్లు అజుని హృదయమున నాటుకొన్న యిందుమతీ విరహజన్యమైన శోకశంకువు అతని హృదయమును బ్రద్దలుచేసి, ప్రాణాంతకమైన రోగముగా మారెను. అట్లుమారుట తాను ప్రియురాలి వెంట వెళ్ళుటకు తగిన యుపాయమే యని దానిని అజుఁడు లాభముగానే భావించె నని భావము.

శ్లో॥ సమ్యగ్వినీత మథ వర్మహరం కుమార
మాదిశ్య రక్షణవిధౌ విధివత్ ప్రజానామ్
రోగోపసృష్ట తను దుర్వసతిం ముముక్షుః
ప్రాయోపవేశనమతిః నృపతి ర్బభూవ. 94

వ్యాఖ్య : అథ - తరువాత, నృపతిః - అజుఁడు, సమ్యగ్వినీతం - స్వభావముచేతను, విద్యాది సంస్కారములచేతను వినయవంతుఁడై నట్టియును, వర్మహరం - కవచమును ధరించుట కర్హమైన వయస్సు కలవాఁడును నగు, కుమారం - పుత్రుఁడైన దశరథుని, ప్రజానాం - ప్రజలయొక్క, రక్షణవిధౌ - పరిపాలనమునందు (రాజ్యమునందు), విధివత్ - యథాశాస్త్రముగా (శాస్త్రోక్త ప్రకారముగా), ఆదిశ్య - నియోగించి, రోగోపసృష్టతను దుర్వసతిం—రోగోప సృష్ట - రోగముచేత వ్యాప్తమైన, తను దుర్వసతిం - శరీరముయొక్క దుఃఖావ స్థితిని, ముముక్షుఃసన్ - వదిలింపదలచుకున్న వాఁడగుచు, ప్రాయోపవేశనమతిః - ఆహారమును విడిచి యుండుటయందు మనస్సుగలవాఁడు. బభూవ - అయ్యెను. కుమారుఁడు కొంచెము ఎదిగి వచ్చుటచేత అతనిపై రాజ్యభారము నుంచి అజుఁడు రోగముతో బాధపడలేక త్వరగా చనిపోవుటకై నిరాహారదీక్షను బూనెనని భావము. మహాపాతకములచేతగాని, చికిత్స చేయుటకు సాధ్యగాని రోగములచేత బాధపడు

వాఁడుగాని, మరణకాలము ఆసన్న మైనప్పుడు మోక్ష స్వర్గాదులను పొందుటకై అగ్ని ప్రవేశమునుగాని, ప్రాయోపవేశముగాని చేయ వచ్చునని ఈ క్రింది పురాణ వచనము తెలుపుచున్నది. కనుక అజుఁడు ప్రాయోపవేశమును జేసెననియు నది ఆత్మహత్యాదోషము గాదనియు భావము.

శ్లో. "సమాసక్తో భవేద్యస్తు పాతకై ర్మహ దాదిభిః
దుశ్చికిత్స్యై ర్మహారోగైః పిడితో వా భవే త్తుయః
స్వయం దేహవినాశస్య కాలే ప్రాప్తే మహామతిః
ఆ బ్రహ్మాణం వా స్వర్గాది మహాఫల జిగీషయా
ప్రవిశేత్ జ్వలనం దీ ప్తం కుర్యాదనశనం తథా
ఏతేషా మధికారోఽ స్తి నాన్యేషాం సర్వజంతుషు
నరాణా మథ నారీణాం సర్వవర్ణేషు సర్వదా."

శ్లో. తీర్థే తోయవ్యతికరభవే జహ్నుకన్యా సరయ్వోః
దేహత్యాగా దమరగణనా లేఖ్య మాసాద్య సద్యః
పూర్వాకారా దధికతర రుచా సంగతః కాంతయాఽసౌ
లీలాగారే ష్వరమత పున ర్నందనాభ్యంతరేషు. 95

వ్యాఖ్య: అసౌ - అజుఁడు, జహ్నుకన్యా సరయ్వోః - గంగా సరయూ నదులయొక్క, తోయవ్యతికరభవే - ప్రవాహముల తాకిడిచేత నేర్పడిన, తీర్థే - గంగా సరయూ సంగమ తీర్థమునందు (తీర్థమనగా నదిలోనికి దిగు మార్గము), దేహత్యాగాత్ - శరీరమును విడుచుటవలన, సద్యః - వెంటనే, అమరగణ నాలేఖ్యం - దేవతల లెక్కలో వ్రాయబడుటను, అసాద్య - పొంది, పూర్వాకా రాత్ - పూర్వపు రూపముకంటె, అధికతరరుచా - మిక్కిలి యెక్కువకాంతిగల, కాంతయా - ప్రియురాలిచేత (పూర్వము ఇందుమతి, ఇప్పుడు హరిణి), సంగతః సన్ - కలుసుకొన్నవాఁ డగుచు, నందనాభ్యంతరేషు - ఇంద్రునియొక్క నందన వనములోన నున్న, లీలాగారేషు - క్రీడాగృహములయందు, పునః - మరల, ఆర మత - క్రీడించెను, రోగగ్రస్తమైన శరీరమును గంగా సరయూ సంగమతీర్థము నందు విడుచుటచేత మరణించిన తక్షణమే అజునిపేరు దేవతల జాబితాలో వ్రాయఁ బడెననియు, దేవత్వ లాభమునకు ఫలముగా నొక యప్సరఃకాంత యతని కప్పు

గింపఁ బడెననియు, ఆ యప్సరఃకాంత భూలోకమునందు ఇందుమతియై పుట్టి తన సహధర్మచారిణిగా నుండిన హరిణియే యగుటచేత నజుఁడు నందనోద్యానము నందలి విలాస భవనములయందు మరల తన యిష్టసఖిని గూడి యదేష్టముగా సుఖము ననుభవించెననియు భావము. మానవ దేహములందు శృంగార కరుణరస ముల కాలంబనములుగా వర్ణింపఁబడిన యీ నాయికా నాయకులకు దేహాంతర ప్రాప్తియందు (దేవత్వమును బొందిన పిమ్మట) మరల శృంగారము లభించుట చేత అజ విలాపకావ్యమునందు ప్రతీయమానమైన రసము విప్రలంభ శృంగార ముగా ముగిసినదని భావింపవచ్చును.

ఇది మహాకవి కాళిదాస కృత రఘువంశ

కావ్యమునందలి అష్టమ సర్గకు

తెలుఁగు లఘువ్యాఖ్య

# మహాకవి కాళిదాసకృత రఘువంశము

## న వ మ  స ర్గ ము

శ్లో. పితు రనంతర ము త్తరకోసలాన్
సమధిగమ్య సమాధి జితేంద్రియః
దశరథః ప్రశశాస మహారథో
యమవతా మవశాంచ ధురి స్థితః   1

వ్యాఖ్య: సమాధిజితేంద్రియః - నియమముచేత జయింపఁబడిన యింద్రియములు గలవాఁడును, యమవతాం - నియమముగల వారియొక్కయు, అవశాంచ - పాలకులగు రాజులయొక్కయు, ధురి - అగ్రస్థానమునందు, స్థితః - నిల్చిన వాఁడును, మహారథః - మహారథుఁడును నగు. దశరథః - దశరథుఁడు, పితుః, అనంతరం - తండ్రియగు అజుని తరువాత, ఉత్తర కోసలాన్ - ఉత్తర కోసలదేశమును, సమధిగమ్య - చక్కగా స్వాయత్తము చేసికొని, ప్రశశాస - బాగుగా నేలెను. అజుని పిమ్మట దశరథుఁడు రాజయ్యెననియు నతడు ఇంద్రియ నిగ్రహము గలిగి, రాజాధిరాజై ఉత్తర కోసలదేశమును చక్కగా పాలింపగలిగెననియు భావము. బాణవిద్యయందు ప్రవీణుఁడై పదివేల ధనుర్ధరులను తానొక్కడే జయింపఁగల వీరునికి "మహారథుఁడని" పేరు. "ఏకో దశసహస్రాణి యోధయేత్ యస్తుధన్వినామ్। శస్త్రశాస్త్ర ప్రవీణశ్చ స మహారథ ఉచ్యతే॥"అని ప్రమాణము. ఈ సర్గయందలి శ్లోకములు ద్రుతవిలంబిత వృత్తమున రచింపఁబడినవి.

శ్లో. అధిగతం విధివ ద్యదపాలయత్
ప్రకృతిమండల మాత్మకులోచితమ్
అభవ దస్య తతో గుణవ త్తరం
సనగరం నగ రంధ్ర కరౌజసః.   2

వ్యాఖ్య: అధిగతం - తనకు ప్రాప్తించినదియు, ఆత్మకులోచితం - తమ వంశానుగత మైనదియు, స నగరం - నగర జన సహితమైనదియు నగు. ప్రకృతి మండలం - జానపద మండలమును, యత్ - ఏ కారణము వలన నైతే, విధి వత్ - శాస్త్రప్రకారముగా, అపాలయత్ - పాలించెనో, తతః - ఆ కారణము వలననే, నగరంధ్రకరౌజసః—నగరంధ్రకర - క్రౌంచ పర్వతమునకు రంధ్రము చేసిన కుమారస్వామియొక్క, ఓజసః - పరాక్రమమువంటి పరాక్రమముగల, అస్య - ఆ దశరథునికి, గుణవత్తరం - పూర్వముకంటె మంచి గుణములు గలది. అభవత్ - అయ్యెను. చక్కగా పాలించుచున్న దశరథునిపై పౌరజానపద మండలము అధికతరమైన ఆసక్తిని జూపెనని భావము. ఈ సర్గయందు కాళిదాసు ద్రుతవిలంబిత వృత్తమును స్వీకరించి, పూర్వసర్గల యందుకంటె కొంచ మెక్కువగా శబ్దాలంకార ములకు స్థాన మొసగెను.

శ్లో. ఉభయ మేవ వదంతి మనీషిణః
సమయవర్షి తయా కృతకర్మణామ్
బలనిషూదన మర్థపతిం చ తం
శ్రమనుదం మను దండధరాన్వయమ్. 3

వ్యాఖ్య: మనీషిణః - విద్వాంసులు, బలనిఘూదనం - ఇంద్రుని, మను దండ ధరాన్వయం - మను వంశీయుఁడగు, తం అర్థపతించ - ఆ దశరథుని, ఉభయమేవ - ఈ జంటనే, సమయవర్షితయా - అవసరమునందు జలమును, ధనమును వర్షించువా రగుటచేత, కృతకర్మణాం - స్వకర్మ నిరతులకు, శ్రమనుదం - శ్రమను పోగొట్టువానినిగా, వదంతి - చెప్పుచున్నారు. భూ మండలమునందు ఎందఱు రాజులున్నను శ్రమజీవులగువారి శ్రమను పోగొట్టగలవారు ఇంద్రుఁడు, దశరథుఁడు మాత్రమే యని యర్థము. ఇంద్రుఁడు కర్షకులకు వర్షము కురిపించును, దశరథుడు ధనమును కురిపించును. కనుక ఆ జంటకు మరియొకరి సామ్యము లేదని భావము. దశరథుఁ డింద్రుని యంతవాఁడనుట, దండధరుఁ డనగా రాజు, మను దండధరుఁ డనగా మనువు; ఇందలి "దండధర, అర్థపతి, కృతకర్మ శబ్దములు సాభిప్రాయములు.

శ్లో. జనపదే న గదః పద మాదధా
అభిభవః కుత ఏవ సపత్నజః

క్షితి రభూత్ ఫలవ త్యజనందనే
శమరతే ఽమరతేజసి పార్థివే. 4

వ్యాఖ్య: శమరతే - శాంతిపరుఁడును, అమరతేజసి - దేవతేజస్సు గలవాడును నగు, అజనందనే - దశరథుఁడు, పార్థివే సతి - పృథివీ పతియై యుండగా, జనపదే - దేశమునందు, గదః - వ్యాధి, పదం - అడుగును, న ఆదధౌ - పెట్టలేదు, సపత్నజః - శత్రుజన్యమైన, అభిభవః - తిరస్కారము, కుతఏవ - ఎక్కడిది? క్షితిః - భూమి, ఫలవతీ - పంటలు పండునది, అభూత్ - అయినది. ఈ శ్లోకమునందు దశరథునికిఁ జేర్చిన "శమరతే, అమర తేజసి, పార్థివే" అను విశేషణములు సాభిప్రాయములు. శమగుణము ప్రజలలో వ్యాపించుట వలన ఆయా చిత్తవికార హేతువులగు వ్యాధులు వారికి రాలేదు; అమర తేజస్సుగల దశరథుని రాజ్యమునం దడుగుపెట్టుట కితరరాజులు జంకిరిగావున ప్రజలకు శత్రుభయము పోయినది; ఈతఁడు పృథివీపతి యగుటవలన పృథివి సర్వ సస్యములను ఫలించినదని భావము. అలంకారము : పరికరము.

శ్లో. దశదిగంత జితా రఘుణా యథా
శ్రియ మపుష్య దజేన తతః పరమ్
త మధిగమ్య తథైవ పున ర్బభౌ
న న మహీన మహీన పరాక్రమమ్. 5

వ్యాఖ్య: మహీ - భూమి, దశదిగంతజితా - దశదిశలను జయించిన రఘుణా - రఘుమహారాజుచేత, యథా - ఏ ప్రకారమున, శ్రియం, అపుష్యత్ - కాంతిని పెంచుకొనెనో, తతఃపరం - ఆతని యనంతరము, అజేనచ - అజునిచేత గూడ నెట్లు విరాజిల్లెనో, తథైవ - ఆ ప్రకారముననే, అహీన పరాక్రమం - వారి కంటే తక్కువకాని శౌర్యముకల, తం - దశరథుని, ఇనం - రాజునుగా, అధిగమ్య - పొంది, పునః - మరల, న బభౌ ఇతిన - ప్రకాశింపలేదు అనునదిలేదు (ప్రకాశించెననియే యర్థము). తాత తండ్రుల పరిపాలనమునందు వలెనే దశరథుని యేలుబడియందును దేశము చక్కగా విరాజిల్లెనని భావము.

శ్లో. సమతయా వసు వృష్టి విసర్జనైః
నియమనా దసతాం చ నరాధిపః

అనుయయౌ యమ పుణ్యజనేశ్వరౌ
సవరుణా వరుణాగ్రసరం రుచా. 6

వ్యాఖ్య: నరాధిపతిః - దశరథుఁడు, సమతయా - అందఱి యందును సమభావము గలవాఁ డగుటచేతను (మధ్యస్థుఁ డగుటచేత), వసువృష్టివిసర్జనైః - ధనవర్షమును గురిపించుటచేతను, అసతాం - దుష్టులయొక్క, నియమనాత్ చ - నిగ్రహము వలనను, సవరుణౌ - వరుణదేవ సహితులైన, యమ పుణ్యజనేశ్వరౌ - యమ కుబేరులను, అనుయయౌ-అనుకరించెను. రుచా-శరీరకాంతిచేత, అరుణాగ్రసరం - సూర్యుని, అనుయయౌ - అనుకరించెను. దుష్టశిక్షణ సమతాభావములచేత యముని, ధనదానముచేత వరుణ కుబేరులను, తేజస్సుచేత సూర్యునిఁ బోలియుండెనని భావము. "వసువృష్టి విసర్జనైః" అనుచోట సభంగ శ్లేష దశరథుని పరముగా ధనవర్షములు కురిపించుటచేతనని యర్థము. వసువిసర్జనము కుబేరుని పక్షమునను, వృష్టి విసర్జనము వరుణుని పక్షమునను గ్రహింపవలయును. "అరుణాగ్రసర" శబ్ద మనుప్రాస కొఱకేగాక తేజస్సుయొక్క అరుణిమను సూచించుటకు వేయఁబడినది. అరుణు డు ముందుగలవాఁడు సూర్యుఁడని యర్థము. అలంకారము: శ్లేష.

శ్లో. న మృగయాభిరతి ర్న దురోదరం
నచ శశిప్రతిమాభరణం మధు
త ముదయాయ న వా నవయౌవనా
ప్రియతమా యతమాన మపాహరత్. 7

వ్యాఖ్య: ఉదయాయ - అభ్యుదయము కొఱకు, యతమానం - ప్రయత్నించుచున్న, తం - ఆ దశరథుని, మృగయాభిరతిః - వేటయందలి వాంఛ, న అపాహరత్ - ఆకర్షింపలేదు, దురోదరం - జూదము, నాపాహరత్ - ఆకర్షింపలేదు, శశిప్రతిమాభరణం - చంద్రుని ప్రతిబింబము ఆభరణముగా గల, మధుచ - మద్యముగూడ, నా పాహరత్ - ఆకర్షింపలేదు, నవ యౌవనా - క్రొత్త జవ్వనముగల, ప్రియతమావా - ప్రేమపాత్రము గాఁదగిన స్త్రీ గూడా, నాపాహరత్ - ఆకర్షింపలేదు. అతనికి ఏ వ్యసనము నందును ఆసక్తి లేకుండెననియు సజ్జనుఁడనియు భావము. "శశి ప్రతిమాభరణం మధు" అనగా వెన్నెల రాత్రులలో మధుపాత్ర యందు చంద్రుని ప్రతిబింబము కనఁబడుచుండగా, ప్రియురాలితో గలిసి

మధుపానము చేయుట మహాభోగ లక్షణముగా రసికులు భావింతురు. అట్టిదానిని గూడ దశరథుఁడు విడనాడెననియు, అభ్యుదయ ప్రయత్నమునందే నిమగ్నుఁడై యుండె ననియు భావము.

శ్లో. న కృపణా ప్రభవత్యపి వాసవే
న వితథా పరిహాస కథాస్వపి
న చ సపత్న జనేష్వపి తేన వా
గపరుషా పరుషాక్షర మీరితా. 8

వ్యాఖ్య : తేన - ఆదశరథునిచేత, ప్రభవతి - ప్రభుత్వమును నెఱపుచున్న, వాసవే అపి - ఇంద్రుని విషయమునఁగూడ, కృపణా - దీనమైన, వాక్ - వాక్కు, న ఈరితా - పలుకఁబడలేదు; పరిహాసకథాసు అపి - హాస్యకథల యందుఁ గూడ, వితథా, వాక్ - అసత్యవాక్కు, నేరితా - పలుకఁబడలేదు; చ - మరియు, అపరుషా - రోషశూన్యుఁడైన (పోయినకోపముగల, "అపగతారుట్ యస్యసః అపరుట్, తేన అపరుషా" అని విగ్రహము), తేన ఆదశరథునిచేత, సపత్నజనేషు అపివా - శత్రుజనుల విషయమునందు సైతము, పరుషాక్షరం - కఠినాక్షరములు గలుగునట్లుగా, వాక్ - వాక్కు, నేరితా - పలుకబడలేదు; ఇక నితర ప్రదేశములను గుఱించి యేమి చెప్పవలెననియు, దశరథుని వాక్కు అదీనము, సత్యనిరతము, మధురమునై యుండెననియు తాత్పర్యము.

శ్లో. ఉదయ మస్తమయం చ రఘూద్వహా
దుభయ మానశిరే వసుధాధిపాః
స హి నిదేశ మలంఘయతా మభూత్
సుహృ దయోహృదయః ప్రతిగర్జితామ్. 9

వ్యాఖ్య : వసుధాధిపాః - దేశమునందలి రాజులు, రఘూద్వహాత్ - రఘువంశపు రాజులలో నాయకుఁడైన ఆ దశరథుని వలన, ఉదయం - అభివృద్ధిని, అస్తమయంచ - నాశమును, ఉభయం - రెండింటిని, ఆనశిరే పొందిరి; (ఎందువలన ననగా) హి - ఏ కారణమువలననైతే, సః - ఆ దశరథుఁడు, నిదేశం - ఆజ్ఞను, అలంఘయతాం - అతిక్రమింపని వారికి (పాలించువారికి), సుహృత్ - మంచి హృదయముగల మిత్రుఁడు, అభూత్ - అయ్యెనో, ప్రతిగర్జితాం - ఎదిరి

రించు వారికి (ఎదురుపల్కు పొగరుబోతులకు). అయో హృదయః - ఉక్కు మనస్సు గలవాఁడు (కఠిన చిత్తుఁడు), అభూత్ - అయ్యెనో; వినయవంతులను రక్షించుచుండెను. గర్వముగలవారిని శిక్షించుచుండెను. కనుక కొందఱు అభ్యుదయమును పొందగా మరికొందఱు గర్వముచే నశించిరని భావము.

శ్లో. అజయ దేకరథేన స మేదినీ
ముదధినేమి మధిజ్య శరాసనః
జయ మఘోషయ దస్య తు కేవలం
గజవతీ జవతీవ్రహయా చమూః. 10

వ్యాఖ్య : అధిజ్యశరాసనః - అల్లె త్రాడు కూర్చబడిన ధనువుగల, సః ఆదశరథుఁడు, ఉదధినేమిం - సముద్రముచే చుట్టఁబడిన, మేదినీం భూమిని, ఏకరథేన - ఒకే రథముచేత, అజయత్ - జయించెను (తానొక్కఁడే జయించెనని యర్థము). గజవతీ - ఏనుగులు కలదియు, జవతీవ్రహయా - వేగాధిక్యముగల గుఱ్ఱములు గలదియునగు. చమూఃతు - సైన్యమైతే, అస్య - దశరథునియొక్క కేవలం జయం - విజయమును మాత్రము, అఘోషయత్ - ప్రకటించెను. ఏక వీరుఁడగు నతనికి సైన్యము కేవల ముపకరణ మాత్రముగా నుండెననియు తానొక్కఁడే విజయమును సంపాదించుచు సమస్త భూమండలమును స్వాధీనపరచుకొనెననియు భావము. నేమి. యనగా బండిచక్రము చుట్టునుండు ఇనుపకమ్మి; సముద్రము భూచక్రమున కట్లుండెనని యర్థము.

శ్లో. అవని మేకరథేన వరూథినా
జితవతః కిల తస్య ధనుర్భృతః
విజయ దుందుభితాం యయు రర్ణవా
ఘనరవా నరవాహన సంపదః. 11

వ్యాఖ్య : వరూథినా - ఇతరులకు గోచరింపని, ఏకరథేన అసాధారణమైన రథముచేత, అవనిం - భూమిని, జితవతః - జయించినట్టియు, ధనుర్భృతః - ఉత్తమ ధనుర్ధరుఁడైనట్టియు, నరవాహనసంపదః - కుబేరునియొక్క సంపదవంటి సంపదగలవాడును నగు తస్య - ఆ దశరథునికి, ఘనరవాః - మేఘగర్జనముల

వంటి ధ్వనులుగల, అర్ణవాః - నాలుగు సముద్రములును, విజయ దుందుభితాం - విజయ దుందుభుల భావమును, యయుఃకిల - పొందినవి సుమా! "ఆ సముద్ర క్షితీశానాం" అని మొదటి సర్గలో చెప్పినట్లు సర్వభూభాగములను జయించినట్టి దశరథునికి నాలుగు దిక్కులందున్న సముద్రములు విజయ దుందుభులై యతని మేటి విలుకానితనమును, కుబేరునివంటి సంపన్నతను, అద్వితీయ రథికత్వమును చాటించినవని భావము. సముద్రఘోషలు నగారామ్రోతలుగా రూపణచేయఁబడినవి. "వరూథః" అనగా రథగుప్తి వేగాధిక్యముచేత, లేక మంత్రశక్తిచేత, రథము తిరోధానమును పొంది శత్రువులకంటికి కనబడకుండుట. వరూథః అస్య అస్తీతి వరూథీ అని విగ్రహము. దాని తృతీయా విభక్తి యేకవచమున "వరూథినా" యని యగును.

శ్లో. శమితపక్షబలః శతకోటినా
శిఖరిణాం కులిశేన పురందరః
స శరవృష్టిముచా ధను షా ద్విషాం
స్వనవతా నవ తామరసాననః. 12

వ్యాఖ్య: పురందరః - ఇంద్రుఁడు, శతకోటినా - నూరు అంచులుగల, కులిశేన - వజ్రాయుధముచేత, శిఖరిణాం - పర్వతములయొక్క, శమిత పక్షబలః - నశింపఁజేయబడిన ఱెక్కల బలిమి గలవాఁడు, నవ తామరసాననః - నూతన కమలమువంటి ముఖము గలవాఁడగు, సః - ఆ దశరథుఁడు, శరవృష్టిముచా - బాణవర్షమును గురియునదియు, స్వనవతా - టంకార ధ్వనితోఁ గూడినదియు నగు, ధనుషా - ధనుస్సుచేత, ద్విషాం - శత్రువులయొక్క, శమిత పక్షబలః - నశింపజేయఁబడిన సహాయమును, బలమును గలవాఁడు. శమితపక్ష బలత్వమునందు ఇద్దఱును సమానులేయనియు, నింద్రుఁడు వజ్రాయుధముచేత చేయఁగలిగిన పనిని దశరథుఁడు తన ధనుస్సుచేతనే చేయగలిగెననియు భావము.

శ్లో. చరణయో ర్నఖరాగ సమృద్ధిభిః
ముకుట రత్న మరీచిభి రస్పృశన్
నృపతయః శతశో మరుతో యథా
శతమఖం త మఖండిత పౌరుషమ్. 13

వ్యాఖ్య: శతశః - నూర్లకొలఁదిగా, నృపతయః - రాజులు, అఖండిత పౌరుషం - మొక్కవోని మగటిమిగల, తం - ఆ దశరథుని, మరుతః - దేవతలు, శతమఖం, యథా - ఇంద్రునివలె, నఖరాగ సమృద్ధిభిః - దశరథుని పాద నఖ కాంతులచేత సంతరించుకొన్న యభివృద్ధిగల, ముకుట రత్న మరీచిభిః - కిరీట మణి కాంతులతో, చరణయోః - పాదములపై వి, అస్పృశన్ - తాకిరి. రాజులందఱును కిరీట రత్నకాంతులతో వెలుగు శిరస్సులతో దశరథుని పాదములను నమస్కరించిరనియు అది దేవత లందఱును నింద్రునికి నమస్కరించినట్టు లుండెననియు భావము.

శ్లో. నివవృతే స మహార్ణవరోధసః
సచివ కారిత బాల సుతాంజలీన్
సమనుకంప్య సపత్న పరిగ్రహా
ననలకా నలకానవమాం పురీమ్. 14

వ్యాఖ్య: సః-ఆ దశరథుఁడు, సచివ కారిత బాలసుతాంజలీన్ - మంత్రుల చేత చేయింపబడిన బాలకులగు కుమారులయొక్క అంజలులు గలవారును, అనలకాన్ - ముంగురులు లేనివారును (అనగా చంపబడిన భర్తలుగలవారగుటచేత అలకలు దువ్వుకొనని వారని యర్థము), అగు సపత్న పరిగ్రహాన్ - శత్రువుల భార్యలను, సమనుకంప్య - దయతో ఆదరించి, అలకా నవమాం (అలకా + అనవమాం) - అలకా పట్టణముకంటె తక్కువకాని, పురీం - అయోధ్యా నగరమును గురించి, మహార్ణవ రోధసః - సముద్రముయొక్క ఒడ్డునుండి, నివవృతే - వెనుకకు మరలెను (తిరుగు ప్రయాణము చేసెను). దశరథునిచే నిహతులగు శత్రువులయొక్క భార్యలు తాము రాణివాసస్త్రీ లగుటచేత దశరథుని యెదుటఁబడక, పసిబాలురగు తమ కుమారులను మంత్రులద్వారా పంపి మంత్రులు చేయించిన బాలుర ప్రార్థనాంజలులతో వేడుకొనగా, హత భర్తృకలైన ఆ స్త్రీల నందరిని దయతో పరామర్శించి వెనుకకు మరలెనని భావము. "సపత్నః" అనగా శత్రువనియు, "పరిగ్రహః" అనగా భార్యయనియు నర్థములు.

శ్లో. ఉపగతోఽపిచ మండల నాభితా
మనుదితాన్య సితాతప వారణః

  

శ్రియ మవేక్ష్య స రంధ్రచలా మభూ
దనలసో ఽనల సోమ సమ ద్యుతిః. 15

వ్యాఖ్య: అనుదితాన్య సితాతపవారణః — అనుదిత - పైకి యెత్తబడిని, అన్య - మరియొకనియొక్క, సితాతపవారణః (సిత + ఆతపవారణః) - శ్వేత చ్ఛత్రముగల వాఁడును, అనల సోమ సమద్యుతిః - అగ్ని చంద్రులకు సమాన మగు తేజస్సు, కాంతియు గలవాఁడును, శ్రియం - లక్ష్మిని, రంధ్రచలాం - అన్యాయ, ఆలస్యాది దోషములయందు చలించునట్టిదానినిగా, అవేక్ష్య - గుర్తించి యుండిన వాఁడునగు, సః - ఆ దశరథుఁడు, మండల నాభితాం - ద్వాదశ రాజ మండలమునకు ప్రధాన మహీపతిత్వమును, ఉపగతః అపి - పొందినవాఁడై యున్నను (చక్రవర్తియై యున్నను), అనలసః - అప్రమత్తుఁడు, అభూత్ - అయ్యెను. సర్వ శత్రువులను జయించి చక్రవర్తియై యున్నను, ఇంకను జయింప వలసినవా రున్నట్లు జాగరూకుఁడై యుండెను. ద్వాదశ రాజమండలమును గుఱించి కామందకుఁ డిట్లు చెప్పెను, "తన శత్రువు, తన మిత్రుడు, శత్రువుయొక్క మిత్రుఁడు, తన మిత్రుని మిత్రుఁడు, శత్రువు మిత్రుని మిత్రుఁడు, పార్ష్ణిగ్రాహుఁడు, ఆక్రందు డు, పార్ష్ణిగ్రాహాసారుఁడు, ఆక్రందాసారు డు, మధ్యముఁడు, ఉదాసీనుఁడు, విజిగీషువు" అని వారు పన్నెండుగురు, ఇందులో ముఖ్యుడు విజిగీషువు, అతడు మధ్యలో రథచక్రము నడిమి కుండవలె నిల్చి, ఇతరుల నందఱినీ చక్రా కారముగ నిల్చునట్లుచేసి జయించినవాఁడు చక్రవర్తి యనఁబడును. మొదటి అయిదుగురు తనకు ముందుగాను, తరువాతి నలుగురు వెనుకభాగమునందును, ఉదాసీన, మధ్యములు తనకు దక్షిణ భాగమునందును ఉండునట్లు చేసికొని విజిగీషువు (దిగ్విజయము చేయ దలఁచిన రాజు) ఉత్తరాభిముఖుఁడై యుండవలెనట. దశరథుఁడట్టి చక్రవర్తియై యుండెనని భావము.

శ్లో. త మపహాయ కకుత్స్థ కులోద్భవం
పురుష మాత్మభవం చ పతివ్రతా
నృపతి మన్య మసేవత దేవతా
సకమలా క మలా ఘవ మర్థిషు. 16

వ్యాఖ్య : పతివ్రతా - పతివ్రతయగు, సకమలా, దేవతా - కమలహస్త దేవత, అనగా లక్ష్మీదేవి, అర్థిషు - యాచకుల విషయమున, అలాఘవం - చులకదనమును చూపని, కకుస్థకులోద్భవం, తం - కకుస్థ వంశమునందు పుట్టిన ఆ దశరథ మహారాజును, ఆత్మభవం, పురుషం, చ - విష్ణుమూర్తిని, అపహాయ - తప్ప, అన్యం - మరియొకఁడగు, కం, నృపతిం - ఏ రాజును, అసేవత - సేవించెను ? (సేవింపలేదని యర్థము). విష్ణువునందును, విష్ణుతుల్యుఁడైన దశరథుని యందు మాత్రమే లక్ష్మీదేవి స్థిరత్వమును బొందియుండెనని భావము.

శ్లో. తమలభంత పతిం పతిదేవతాః
శిఖరిణా మివ సాగర మాపగాః
మగధ కోసల కేకయ శాసినాం
దుహితరో ఽహితరోపిత మార్గణమ్. 17

వ్యాఖ్య : పతిదేవతాః - పతివ్రతలైన, మగధ కోసల కేకయ శాసినాం - మగధ, కోసల, కేకయ దేశములను పాలించు రాజులయొక్క, దుహితరః - కుమార్తెలు (సుమిత్ర, కౌసల్య, కైకేయి), అహితరోపిత మార్గణం - శత్రువులపై నాటబడిన శరములుగల, తం - ఆ దశరథుని, శిఖరిణాం - పర్వతముల యొక్క, దుహితరః - కుమార్తెలయిన, ఆపగాః - నదులు, సాగరం, ఇవ - సముద్రమునువలె, పతిం - భర్తనుగా, అలభంత - పొందిరి. మగధ రాజపుత్రిక యగు సుమిత్ర, దక్షిణకోసలాధిపతి కూతురు కౌసల్య, కేకయరాజు కుమారి కైక దశరథుని పరాక్రమాది గుణములు విని స్వయముగా వరించి భార్యలైరి. ఇచ్చట దశరథ పత్నుల పేర్లలో క్రమమును పాటింపలేదు.

శ్లో. ప్రియతమాభి రసౌ తిసృభి ర్బభౌ
తిసృభిరేవ భువం సహ శక్తిభిః
ఉపగతో వినినీషు రివ ప్రజాః
హరిహయో ఽరిహయోగ విచక్షణః. 18

వ్యాఖ్య : అరిహయోగ విచక్షణః—అరిహ - శత్రు వినాశకరములగు, యోగ - ఉపాయములందు, విచక్షణః - దక్షుఁడగు, అసౌ - ఈ దశరథుఁడు,

తిసృభిః - ముగ్గురగు, ప్రియతమాభిః సహ - ప్రియురాండ్రతో గూడ, ప్రజాః - ప్రజలను, వినినీషుః - శిక్షింపఁదలచిన వాడగుచు (నీతిమార్గమును నేర్పఁ దలచిన వాఁడై). తిసృభిరేవ - మూడేయైన, శక్తిభిః - ప్రభు మంత్రోత్సాహ శక్తులతో గూడ, భువం - భూలోకమును, ఉపగతః - చేరిన, హరిహయః ఇవ - ఇంద్రుఁడువలె, బభౌ - ప్రకాశించెను. ప్రజా పాలనమునకు వలసిన శక్తిత్రయము సాక్షాత్కరించిన విధముననున్న ముగ్గురు భార్యలును ప్రజలను నీతి మార్గమున నడపుటకుఁ దోడ్పడుచుండిరి, దశరథుఁడు రెండవ యింద్రుఁడుగా ప్రకాశించెను.

శ్లో. స కిల సంయుగమూర్ధ్ని సహాయతాం
మఘవతః ప్రతిపద్య మహారథః
స్వభుజవీర్య మగాపయ దుచ్ఛ్రితం
సురవధూ రవధూతభయాః శరైః. 19

వ్యాఖ్య: మహారథః సః - మహారథుఁడైన ఆ దశరథుఁడు, సంయుగ మూర్ధ్ని - రణాంగణమునందు, మఘవతః - ఇంద్రునికి, సహాయతాం - సహాయమును, ప్రతిపద్య - పొంది, శరైః - బాణములచేత, అవధూత భయాః - తొలగింపఁబడిన భయముగల, సురవధూః - దేవకాంతలను, ఉచ్ఛ్రితం - ఉన్నతమైన, స్వభుజవీర్యం - తన బాహు పరాక్రమమును, అగాపయత్, కిల - గానము చేయించెను సుమా! దేవదానవుల యుద్ధములందు ఇంద్రునికి తోడ్పడి విజయములు సాధించుటచేత, భయము తొలఁగిన దేవకాంతలు దశరథుని పరాక్రమమును గానము చేసిరని భావము.

శ్లో. క్రతుషు తేన విసర్జితమౌలినా
భుజ సమాహృత దిగ్వసునా కృతాః
కనక యూప సముచ్ఛ్రయ శోభినో
వితమసా తమసాసరయూ తటాః. 20

వ్యాఖ్య: క్రతుషు - అశ్వమేధయాగములందు, విసర్జితమౌలినా - తీసియుంచిన కిరీటముగలవాఁడును, భుజ సమాహృత దిగ్వసునా - భుజబలార్జితమైన

దిగంతసంపదలు గలవాడును, వితమసా - తమోగుణ రహితుడును నగు, తేన - ఆ దశరథునిచేత, తమసా, సరయూతటాః - తమసా, సరయూనదులతీరములు, కనకయూప సముచ్ఛ్రియ శోభినః—కనకయూప - బంగారపుయూప స్తంభముల యొక్క, సముచ్ఛ్రియ - ఉన్నమనముచేత (ఎత్తుగా నుంచుటచేత), శోభినః - ప్రకాశించునవిగా, కృతాః - చేయఁబడినవి. అయోధ్యానగరమున కిరువైపు లందున్న తమసా, సరయూనదుల తీరములు దశరథుఁడు చేసిన అశ్వమేధ పశు బంధన స్తంభములతో విరాజిల్లెనని భావము. "విసర్జితమౌలినా" యనుట రాజు, యజ్ఞ సమయమున రాజ చిహ్నములు ధరింపరాదు గనుక, అప్పుడు అధ్వర్యుఁడే సర్వాధికుఁడు; దిగ్విజయము క్షత్రియునికి విహిత ధర్మము. 'యూప, మనగా యజ్ఞమునందు యజ్ఞపశువును గట్టివేయు స్తంభము. అది కనకమయముగా నుండె నని వర్ణించుట శోభార్థమేకాని విధికాదు, అవి సమున్నతములై దశరథుఁడు చేసిన బహుయాగములను సూచించుచు, తమసా సరయూనదీ తీరముల కలంకారములుగా నుండెనని భావము.

శ్లో. అజిన దండ భృతం కుశమేఖలాం
యతగిరం మృగశృంగ పరిగ్రహామ్
అధివసం స్తను మధ్వరదీక్షితా
మసమభాస మభాసయ దీశ్వరః. 21

వ్యాఖ్య : ఈశ్వరః - అష్టమూర్తియగు శివుఁడు, అజినదండ భృతం - కృష్ణాజినమును, ఔదుంబరదండమును ధరించినట్టియును (లేడి చర్మమును, మేడి కఱ్ఱను యజ్ఞదీక్షితుఁడు ధరింపవలయునని ప్రమాణ వచనము), కుశమేఖలాం - దర్భలతో చేసిన త్రాడు కలదియును, యతగిరం - నియమము చేయఁబడిన వాక్కులు గలదియును, మృగశృంగ పరిగ్రహం - లేడికొమ్ము కండూయన సాధనముగాఁ గలదియును, అధ్వర దీక్షితాం - సంస్కార విశేషముతో గూడినదియు నగు, తనుం - దశరథుని శరీరమును, అధివసన్ - అధిష్ఠించిన వాఁడగుచు, అస మభాసం - అసాధారణమైన కాంతులు గలుగునట్లుగా, అభాసయత్ - ప్రకాశింపఁ జేసెను. శివుని అష్టమూర్తులు "భూతార్కచంద్రయజ్వానో మూర్తయోష్టౌ ప్రకీర్తితాః" అను ప్రమాణ వచనముచేత పృథివి, జలము, అగ్ని, వాయువు, ఆకాశము, సూర్యుఁడు, చంద్రుఁడు, యజ్ఞముచేయు సోమయాజి అనునవి; వాటిలో

యజ్ఞదీక్షితుఁడైన దశరథుఁడు ప్రకృతమున ఒక శివమూర్తి. కనుక అట్టి సంస్కారమును పొందిన దశరథుని తనువునందు శివుఁడు ప్రవేశించి యా తనువును మిక్కిలి ప్రకాశింపఁ జేసెనని తాత్పర్యము. ఇందులో శ్రుతి స్మృతి ప్రమాణాను సారముగా యజ్ఞదీక్షితుని స్వరూపమును కవి వర్ణించెను.

శ్లో. అవభృథ ప్రయతో నియతేంద్రియః
సుర సమాజ సమాక్రమణోచితః
నమయతిస్మ స కేవల మున్నతం
వనముచే నముచే రరయే శిరః. 22

వ్యాఖ్య : అవభృధ ప్రయతః - అవభృథ స్నానముచేత నియమ నిష్ఠలు గలవాఁడును, నియతేంద్రియః - నిగ్రహింపబడిన యింద్రియములు గలవాఁడును, సుర సమాజ సమాక్రమణోచితః - దేవ సంఘమునకు సమానమగు పీఠమునకు దగినవాఁడును నగు, సః - ఆ దశరథుఁడు, ఉన్నతం - ఎత్తఁబడిన, శిరః - తన శిరస్సును, వనముచే - అవభృథ జలమును తనపై వర్షించునట్టి, నముచేః అరయే- ఇంద్రుని కొఱకు మాత్రమే (నముచికి శత్రువు). నమయతిస్మ - వంచెను. తన తలపై అవభృథ జలము నభిషేకించు సమయమునందును ఒక యింద్రునికొఱకు మాత్రమే తలను వంచెనుగాని, మనుష్యమాత్రుని కెవ్వనికిని తలవంచలేదనియు అట్టి ధీర గంభీర శాంతమూర్తి యనియు భావము. 'అవభృథ' మనగా శుభకర్మ యొక్క దీక్షాంతమున జేయునట్టి స్నానము; ఇచ్చట 'ఆక్రమణ'మనగా పీఠము.

శ్లో. అసకృ దేకరథేన తరస్వినా
హరిహయాగ్రసరేణ ధనుర్భృతా
దినకరాభిముఖా రణ రేణవో
రురుధిరే రుధిరేణ సురద్విషామ్. 23

వ్యాఖ్య : ఏకరథేన - అద్వితీయమైన రథము గలిగినట్టియును, తరస్వినా- బలవంతుఁ డైనట్టియును, హరిహయాగ్రసరేణ - ఇంద్రునికి ముందునడచునట్టి, ధనుర్భృతా - విలుకాఁడైన దశరథునిచేత, అసకృత్ - అనేక పర్యాయములు, దినకరాభిముఖాః - సూర్యునికి యెదురుగా లేచిన, రణరేణవః - యుద్ధసంబంధమైన

ధూళులు, సురద్విషాం, రుధిరేణ - రాక్షసులయొక్క రక్తముచేత, రురుధిరే - నివారింపఁబడినవి. ఇంద్రుడు తూర్పుదిక్కునుండి పశ్చిమాభిముఖుఁడై రాక్షసులతో జేయుచున్న యుద్ధములలో, నతనికి తోడుగా అగ్రభాగమున నిల్చి యుద్ధమునందు రేగి సూర్యునిఁ గప్పివేయుచున్న రణధూళిని దశరథుఁ డెన్నో పర్యాయములు రాక్షస రక్తముతో నణచివేసెనని భావము. అనగా దశరథుఁ డనేక పర్యాయములు యుద్ధములం దింద్రునికిఁ దోడ్పడి రాక్షస సంహారముఁ జేసెనని భావము.

శ్లో. అథ సమావవృతే కుసుమై ర్నవై
స్త మివ సేవితు మేకనరాధిపమ్
యమ కుబేర జలేశ్వర వజ్రిణాం
సమధురం మధు రంజిత విక్రమమ్. 24

వ్యాఖ్య: అథ - పిమ్మట, యమ కుబేర జలేశ్వర వజ్రిణాం - యమ కుబేర, వరుణేంద్రులకు, సమధురం - సమానమైన భారము గలవాఁడును (వారితో సమానుడు), అంచిత విక్రమం - మెచ్చుకొనబడిన పరాక్రమము గలవాఁడును, ఏకనరాధిపం - అద్వితీయ ప్రజాపాలకుండునైన, తం - ఆ దశరథుని, సేవితుం, ఇవ - సేవించుటకువలె, మధుః - వసంతుఁడు, నవైః, కుసుమైః - నూత్నములగు పుష్పములతో (పుష్పహస్తుఁడై), సమావవృతే - వచ్చెను (తిరిగి వచ్చెను) దశరథుఁడు, ధర్మాధర్మ నిర్ణయమునందు యమధర్మరాజుతోను, ధనము నిచ్చుటయందు కుబేరునితోను, నియమ పరిపాలనమున వరుణునితోను, ఐశ్వర్యమునం దింద్రునితోను సమానుఁడై యుండెను. "రిక్త హస్తేన నోపేయాత్ రాజానం, దేవతాం, గురుమ్" అను వచనముచేత వసంతుఁడు రాజైన దశరథుని వద్దికి వట్టి చేతులతో కాక సపుష్పహస్తుఁడై వచ్చి దర్శించెను. అనగా వసంతఋతువు వచ్చెనని భావము.

శ్లో. జిగమిషు ర్ధనదాధ్యుషితాం దిశం
రథయుజా పరివర్తిత వాహనః
దినముఖాని రవి ర్హిమనిగ్రహై
ర్విమలయన్ మలయం నగ మత్యజత్. 25

వ్యాఖ్య: ధనదాధ్యుషితాం - కుబేరునిచేత నివసింపబడిన, దిశం - దిక్కును (ఉత్తర దిక్కునని యర్థము), జిగమిషుః - చేరదలచినవాఁడై, రథయుజా (రథమును కట్టువాఁడు) - సారథిచేత, పరివర్తిత వాహనః - ప్రక్కకు త్రిప్పఁబడిన గుఱ్ఱములుగల, రవిః - సూర్యుడు, హిమనిగ్రహైః - మంచును తొలగించుటచేత, దిన ముఖాని - ప్రాతః కాలములను, విమలయన్ - స్వచ్ఛ పరచుచు, మలయం, నగం - మలయ పర్వతమును, అత్యజత్ - విడిచెను. దక్షిణ దిక్కును విడిచెనని యర్థము. ఉత్తరాయణ ప్రారంభముకాగా సూర్యుఁడు దక్షిణ దిశను విడిచి యుత్తరమున నడచుట ప్రారంభించెను.

శ్లో. కుసుమజన్మ తతో నవపల్లవాః
తదను షట్పద కోకిలకూజితమ్
ఇతి యథాక్రమ మావిరభూ న్మధుః
ద్రుమవతీ మవతీర్య వనస్థలీమ్. 26

వ్యాఖ్య: కుసుమజన్మ - మొదట పువ్వులు పూయుట, తతః - తరువాత, నవపల్లవాః - లేఁ జిగురాకులు, తదను - ఆ తరువాత, షట్పదకోకిల కూజితం - తుమ్మెదల యొక్కయు, కోయిలల యొక్కయు ధ్వని, ఇతి - ఈ విధముగా, యథాక్రమం - వరుసగా, ద్రుమవతీం - వృక్షములుగల, వనస్థలీం - వనభూమిని, అవతీర్య - చేరి (వనభూమి మీద దిగియని యర్థము), మధుః - వసంతుఁడు, ఆవిరభూత్ - ఆవిర్భవించెను. వసంతుఁ డావిధముగా సాక్షాత్కరించెనని భావము. మొదట చిగురాకులు తరువాత పువ్వులు పుట్టుట సాధారణముగా నన్ని చెట్లయందును గనపడును. కాని కొన్ని వృక్షములు మొదటనే పువ్వులు పూయునవి కలవు. ఆ విశేష జ్ఞానముగల కాళిదాసు "కుసుమజన్మ" అని ప్రారంభించెను.

శ్లో. నయగుణోపచితా మివ భూపతేః
సదుపకార ఫలాం శ్రియ మర్థినః
అభియయుః సరసో మధుసంభృతాం
కమలినీ మలి నీరపతత్త్రిణః 27

వ్యాఖ్య: నయగుణోపచితాం - నీతియుక్తములగు శౌర్యాది గుణముల చేత, ఉపచితాం - అభివృద్ధిని పొందింపబడినట్టిదియును, సదుపకార ఫలాం -

సజ్జనుల కుపకారము చేయుటయే ఫలముగాగలదియు నగు, భూపతేః, శ్రియం - దశరథునియొక్క సంపదను, అర్థినః ఇవ - యాచకులువలె, మధుసంభృతాం - వసంతునిచేత చక్కగా పోషింపఁబడినది యగు, సరసః, కమలినీం - కాసారము యొక్క తామరతీగను, అలినీరపతత్త్రిణః—అలి - తుమ్మెదలును, నీర పతత్త్రిణః - జలపక్షులైన హంసాదులును, అభియయుః - చేరెను. దశరథుని సంపదకై యర్థులు గుంపులు గుంపులుగా చేరునట్లు, సరోవరములందలి పద్మలతల వద్దికి తుమ్మెదలు, హంసలు మొదలయినవి చేరెనని భావము. దీనివలన దశరథుని యీవి, వసంతశోభ విరివిగా వర్ణితములైనవి.

శ్లో. కుసుమ మేవ న కేవల మార్తవం
నవ మశోకతరోః స్మరదీపనమ్
కిసలయ ప్రసవోఽపి విలాసినాం
మదయితా దయితా శ్రవణార్పితః. 28

వ్యాఖ్య: ఆర్తవం - ఋతుకాలమున వచ్చిన, నవం - నూతనమగు. అశోకతరోః - అశోక వృక్షముయొక్క, కేవలం - ఒక, కుసుమమేవ - పుష్పము మాత్రమే, స్మరదీపనం - మన్మథోద్దీపము, న - కాలేదు, కింతు - ఇక నేమ నగా, విలాసినాం - భోగాభిలాష గలవారికి, మదయితా - మత్తెక్కించునట్టి, దయితాశ్రవణార్పితః - ప్రియురాలి చెవిసందున నుంచబడిన, కిసలయ ప్రసవః, అపి - చిగుటాకు జొంపమునైతము, స్మరదీపనః - మన్మథోద్దీపకములయ్యెను. విలాస వంతులకు అశోకపుష్పము, ప్రియురాలి వసంత పల్లవము, ఏకకాలమున మదనోద్దీపకము లైనవని.

శ్లో. విరచితా మధు నోపవనశ్రియా
మభినవా ఇవ పత్రవిశేషకాః
మధులిహాం మధుదాన విశారదాః
కురవకా రవ కారణతాం యయుః 29

వ్యాఖ్య: మధునా - వసంతునిచేత, విరచితాః - విరచింపబడిన, ఉపవన శ్రియాం - ఉద్యానవన లక్ష్మలయొక్క, అభినవాః - నూతనములైన, పత్రవిశేష

కాః ఇవ - మకరికాది పత్రవిషశేములవలె నున్న, మధుదాన విశారదాః - మద్యమును దానము చేయుటయందు నేర్పరులైన, కురవకాః - గోరంటచెట్లు, మధులిహాం - తుమ్మెదలయొక్క, రవకారణతాం - ఝుంకారమునకు కారణమగుటను, యయుః - పొందినవి. పుష్పించిన గోరంటచెట్లు వసంతుఁడు వనలక్ష్మల బుగ్గలపై రచించిన మకరికాది పత్రరచనలను బోలియుండి, విస్తారమైన తమ మకరంద మధువును భ్రమరములకు దానముచేసి, వాటిచేత ఝుంకార రూపమున వసంత స్తోత్రములను జేయించెనని భావము. అర్థిజనులు దాన శౌండులను స్తుతించుట లోక పరిపాటిగదా !

శ్లో. సువదనా వదనాసవ సంభృత
స్తదనువాది గుణః కుసుమోద్గమః
మధుకరై రకరో న్మధులోలుపైః
వకుల మాకుల మాయత పంక్తిభిః 30

వ్యాఖ్య : సువదనా వదనాసవ సంభృతః — సువదనా - చక్కని స్త్రీల యొక్క, వదనాసవ - పుక్కిలింపు మద్యముచేత, సంభృతః - పుట్టి పుంజుకొన్న, కుసుమోద్గమః - పుష్పోద్గమము, తదనువాదిగుణః - ఆ మద్యమును పోలిన గుణముగలదియై, మధులోలుపైః - మకరందముపై మక్కువగలవియు. ఆయత పంక్తిభిః - దీర్ఘములైన పంక్తులు దీరినవియు నగు, మధుకరైః-తుమ్మెదలచేత, వకులం - పొగడచెట్టును, ఆకులం - చలించుదానినిగా, అకరోత్ - చేసెను. వనితల పుక్కిలింపు మద్యముచేత పుట్టుకవచ్చిన పొగడపూల మొత్తము "కారణా గుణాః కార్యే సంక్రామంతి" అను న్యాయమున మద్యమునుపోలిన మకరందము గలదియై, ఆ మకరందపానము చేయుటకు పొడవైన బారులుదీరి వచ్చిన తుమ్మెదలచేత పొగడచెట్టు కదలునట్లు చేసెను. అనగా మధుపానమువలన తుమ్మెదలు మత్తెక్కి తనపై సోలిపడగా, తాను (పొగడచెట్టు) సోలిపోయెననిగాని, సువదనా వదన మద్యప్రభావము పుష్ప సమూహమునకును, బంభరములకును, తదాశ్రయమైన వకుళ వృక్షమునకును సోకెనని తాత్పర్యము. వనితల పుక్కిలింపు మద్యము పొగడచెట్టు పూచుటకు దోహదము.

శ్లో. ఉపహితం శిశిరాపగమ శ్రియా
ముకులజాల మశోభత కింశుకే

ప్రణయి నీవ నఖక్షతమండనం
ప్రమదయా మద యాపిత లజ్జయా. 31

వ్యాఖ్య: శిశిరాపగమశ్రియా - వసంతలక్ష్మిచేత, కింశుకే - మోదుగచెట్టునందు, ఉపహితం - ఉంచఁబడిన, ముకులజాలం - మొగ్గల మొత్తము, మదయాపితలజ్జయా - మదముచేత తొలగింప బడిన సిగ్గుగల, ప్రమదయా - జవ్వనిచేత, ప్రణయిని-ప్రియునిమీద, ఉపహితం - ఉంచబడిన, నఖక్షత మండనం ఇవ-నఖక్షతములను భూషణమువలె, అశోభత - ప్రకాశించెను. వసంతర్తువునందు మోదుగుచెట్టుపై నుప్పతిల్లిన మొగ్గలు, మదిరా మదవశమున జాఱవిడిచిన సిగ్గుగల పడుచు తన ప్రియుని దేహముపై నుంచిన నఖక్షతములవలె ప్రకాశించెనని భావము.

శ్లో॥ వ్రణ గురు ప్రమదాధర దుఃసహం
జఘన నిర్విషయీకృత మేఖలమ్
న ఖలు తావ దశేష మపోహితుం
రవి రలం విరలం కృతవాన్ హిమమ్. 32

వ్యాఖ్య: వ్రణగురు ప్రమదాధర దుస్సహం — వ్రణగురు - దంతక్షత వ్రణములచేత పెద్దవియైన, ప్రమదాధర - స్త్రీల యధరోష్ఠములచేత, దుస్సహం - ఓర్చుటకు శక్యముగానిదియు, జఘన నిర్విషయీకృత మేఖలమ్—జఘన - స్త్రీల కటి ప్రదేశముమీద, నిర్విషయీకృత - లేకుండా చేయఁబడిన, మేఖలం - మొలనూలు గలదియునగు, హిమం - మంచును, రవిః - సూర్యుఁడు, తావత్ - అంతవఱకు (వసంతర్తువు వచ్చువఱకు), అశేషం - నిశ్శేషముగా, అపోహితుం - తొలగించుటకు, న, అలం ఖలు - సమర్థుఁడు కాలేదు సుమా! (కాని) విరలం - పలచబడినదానినిగా, కృతవాన్ - చేసెను. శిశిరర్తువునందు మంచు గాఢముగా నుండి వసంతము రాగానే సూర్యకిరణములచే పలచబాఱెననియు, అది శృంగార నాయికలకు కొంతమేలు చేసెననియు భావము. దంతక్షతములచేత పుండుబడిన స్త్రీల యధరోష్ఠములమీద మంచుబడినచో మిక్కిలి బాధగలుగుచుండెనట! అంతేకాక యా వనితలు స్వర్ణ రజతములతో జేయబడిన వడ్డాణములు చలికాలమున మిక్కిలి చల్లనివై బాధించునవి యగుటచేత వానిని జఘనములపై ధరింపకుండిరట! దీనికి మూలమైన హిమమును సూర్యుఁడప్పుడు తొలగింపలేకపోయినను

వసంతారంభమునుండి కొంచ కొంచముగా పలచబాఱఁ జేయుచుండెనట: ప్రకృతి యందలి యే వస్తువునైనను రసదృష్టితో మలచుట కాళిదాసు విశిష్టత. సూర్యుఁడా విధముగా నారీ జనమునకు మేలుచేసెనట.

శ్లో. అభినయాన్ పరిచేతు మివోద్యతా
మలయమారుత కంపిత పల్లవా
అమదయ త్సహాకార లతా మనః
సకలికా కలి కామజితా మపి. 33

వ్యాఖ్య: అభినయాన్ - అభినయములను (అర్థవ్యంజకములైన వ్యాపారములను), పరిచేతుం - అభ్యసించుటకు, ఉద్యతా ఇవ - నిలుచున్నదివలె (ప్రయత్నము చేయుచున్నదివలె), మలయ మారుత కంపితపల్లవా—మలయమారుత - దక్షిణపు గాలిచేత, కంపిత - కదల్పఁబడిన, పల్లవా - చిగురాకులు గలదియును, సకలికా - మొగ్గలతో గూడినదియు నైన, సహకారలతా - మామిడితీగ, కలికామజితాం, అపి - రాగద్వేషములను జయించినవారి యొక్కయు, మనః - మనస్సును, అమదయత్ - మదింపజేసెను. మందమారుతముచేతఁ గదల్పబడుచున్న చిగురుటాకులు, మొగ్గలుగల తీఁగమామిడి, యభినయమును నేర్చుకొనుచున్న పడుచువలె మనోహరముగా నుండెనని భావము. ఇచ్చట సహకార లత బాల నర్తకి, పల్లవములు ఆమె హస్తములు, మలయ మారుతము అభినయమును నేర్పుచున్న గురువు, సకలికా యనుట ఆమె స్తనోద్గమ సూచకము, కనుకనే ఆమె జితేంద్రియుల మనస్సునుగూడ మదింపజేయఁ గల్గినది.

శ్లో. ప్రథమ మన్యభృతాభి రుదీరితాః
ప్రవిరలా ఇవ ముగ్ధవధూ కథాః
సురభిగంధిషు శుశ్రువిరే గిరః
కుసుమితాసు మితా వనరాజిషు. 34

వ్యాఖ్య: సురభిగంధిషు - సువాసనలుగలవియు, కుసుమితాసు - పువ్వులు గలవియు నగు, వనరాజిషు - వనపంక్తులయందు, అన్యభృతాభిః - ఆడుకోకిలల చేత, ప్రథమం - ప్రారంభ సమయములందు, ఉదీరితాః - పలుకబడినవియై,

మితాః - పరిమితములైన, గిరః - పలుకులు (ఆలాపములు), ప్రవిరలాః - మిక్కిలి మితములైన, ముగ్ధవధూకథాః ఇవ - ముగ్ధస్త్రీ ప్రసంగములవలె, శుశ్రువిరే - వినఁబడినవి. వసంతారంభమునందు కొంచము కొంచముగా వినవచ్చుచున్న కోకిలాలాపములు, సిగ్గరితనము తగ్గని ముగ్ధల ప్రసంగములవలె మనోహరముగా నుండెనని భావము.

శ్లో. శ్రుతిసుఖ భ్రమరస్వన గీతయః
కుసుమ కోమల దంతరుచో బభుః
ఉపవనాంత లతాః పవనాహతైః
కిసలయైః సలయై రివ పాణిభిః 35

వ్యాఖ్య : శ్రుతిసుఖభ్రమర స్వనగీతయః ___ శ్రుతిసుఖ - చెవుల కింపైన, భ్రమరస్వన - తుమ్మెదల ఝుంకారము లనెడు, గీతయః - గీతములు గలవియు, కుసుమకోమల దంతరుచః - పువ్వులనెడు కోమలదంతముల కాంతులు గలవియు నగు, ఉపవనాంత లతాః - ఉద్యానవనము నందలి లతలు, పవనాహతైః - గాలిచేత కదల్పఁబడిన, కిసలయైః - చిగురాకులచేత, సలయైః పాణిభిః ఇవ - అభినయముతో కూడిన హస్తములచేత వలె, బభుః - ప్రకాశించినవి. ఉద్యాన లతలు పువ్వులనెడు దంతములు కనబడునట్లు భ్రమర ఝుంకారములనెడు గానములు చేయుచు, చిగురాకు చేతులతో నభినయమును జేయుచు, నర్తకీ సామ్యమును పొంది యుండెనని భావము. రాగతాళాభినయములుగల నర్తకీభావము లతలయందు చక్కగా ఆరోపింపఁబడినది.

శ్లో. లలిత విభ్రమ బంధ విచక్షణం
సురభి గంధ పరాజిత కేసరమ్
పతిషు నిర్వివిశు ర్మధు మంగనాః
స్మరసఖం రసఖండన వర్జితమ్. 36

వ్యాఖ్య : అంగనాః - స్త్రీలు, లలితవిభ్రమ బంధ విచక్షణం ___ లలిత విభ్రమ - సుందర విలాసములయొక్క, బంధ - కూర్పుటయందు, విచక్షణం - నేర్పరియైనదియు, సురభిగంధ పరాజిత కేసరం ___ సురభిగంధ - తన మంచి పరి

మళముచేత, పరాజిత కేసరం - ఓడింపఁబడిన పొగడపువ్వులు గలదియు, స్మర సఖం - మన్మదోద్దీపకమును నగు, మధుం - మద్యమును, పతిషు - భర్తల విష యమున, రసఖండన వర్జితం - అనురాగ భంగరహితముగా, నిర్వివిశుః - అను భవించిరి. స్త్రీలు పరస్పరానురాగ పూర్వకముగా సవిలాసముగా పతులతోఁ గలిసి మధుర మధుపానము చేసిరని భావము. ఆ మధువు పొగడ వాసనగలది. ఇచ్చట మధుశబ్దము పుంలింగముగాఁ బ్రయోగింపఁబడినది.

శ్లో. శుశుభిరే స్మిత చారుత రాననాః
స్త్రియ ఇవ శ్లథ శింజిత మేఖలాః
వికచ తామరసా గృహదీర్ఘికాః
మదక లోదక లోల విహంగ మాః 37

వ్యాఖ్య: వికచ తామరసాః - వికసించిన తామరపువ్వులు గలవియు, మదకలోదక లోలవిహంగమాః__మదకల - మదముచేత, అవ్యక్త మధుర ముగా పలుకుచున్న, ఉదకలోల విహంగమాః - జల ప్రియములైన హంసాది పక్షులు గలవియునగు, గృహదీర్ఘికాః - ఇండ్లయందలి దిగుడుబావులు, స్మితచారు తరాననాః - చిఱునగవుచేత మిక్కిలి యందమైన ముఖములుగల వారును, శ్లథ శించితమేఖలాః - జాఱినవియు, ధ్వనించునవియు నగు మొలనూళ్లు (వడ్డాణములు) గలవారునునగు, స్త్రియః ఇవ - స్త్రీలవలె శుశుభిరే - ప్రకాశించినవి. 'దీర్ఘికా' శబ్దము స్త్రీలింగ మగుటచేత స్త్రీలతో దీర్ఘికలు పోల్పఁబడినవి. జలపక్షుల కలకల ములు స్త్రీల జాఱిన యొడ్డాణముల గజ్జెల చప్పుడులుగా పోల్చుట రమణీయముగా నున్నది. దీర్ఘికలు (బావులు) స్త్రీలవలె మధురాలాప తనూవిలాస సౌందర్యమునఁ బొల్చెనని భావము.

శ్లో. ఉపయయౌ తనుతాం మధుఖండితా
హిమకరోదయ పాండు ముఖచ్ఛవిః
సదృశ మిష్ట సమాగమ నిర్వృతిం
వనిత యానితయా రజనీవధూః. 38

వ్యాఖ్య: మధుఖండితా - వసంత సమయముచేత కుఱుచగాఁ జేయఁబడి నదియు, హిమకరోదయ పాండుముఖచ్ఛవిః__హిమకర - చంద్రునియొక్క,

ఉదయ - ఉదయముచేత, పాండు - తెల్లబడిన, ముఖచ్ఛవిః - ప్రదోషకాంతి గల దియు (సాయంకాలశోభ)నగు, రజనీవధూః - రాత్రియనెడు కాంత, ఇష్టసమాగమనిర్వృతిం—ఇష్ట - ప్రియునియొక్క, సమాగమనిర్వృతిం - సమాగమ సుఖమును, అనితయా - పొందజాలనట్టి, వనితయా - స్త్రీతో, సదృశం - సమానమగు తనుతాం - కృశత్వమును. ఉపయయౌ - పొందెను. 'ఖండితా' శబ్దము చేత ధ్వనించు నాయికా పక్షమున, ఆమె మధువను ప్రియునికై వేచియుండి, చంద్రునివలె తెల్లబడిన ముఖకాంతి గలదియై, ప్రియ సమాగమ సుఖమును పొందని కారణమున కృశించిపోయెనని యర్థము. వేసవి కాలమున రాత్రులు కుఱచగా నుండుటను ఇట్లు నాయికాపరముగా వర్ణించెను. అలంకారము: రూపకము, ఉపమ. "స్వాధీనపతిక, వాసకసజ్జిక, విరహోత్కంఠిత, విప్రలబ్ధ, ఖండిత, కలహాంతరిత, ప్రోషిత భర్తృక, అభిసారిక", అని శృంగార నాయికలు ఎనిమిది విధములు. అందులో "ఖండిత" యనగా ప్రియుడు రాత్రినొకచోట గడిపి, ఇతర స్త్రీ సంభోగ చిహ్నములతో నింటికి వచ్చినపుడు చూచి కోపముతో మండిపడునట్టి నాయిక, ఇచ్చట కృశించినది.

శ్లో. అపతుషారతయా విశదప్రభైః
సురత సంగ పరిశ్రమ నోదిభిః
కుసుమచాప మతేజయ దంశుభిః
హిమకరో మకరోర్జిత కేతనమ్. 39

వ్యాఖ్య: హిమకరః - చంద్రుఁడు, అపతుషారతయా - మంచు తొలగియున్న కారణముచేత, విశదప్రభైః - నిర్మలమైన కాంతులు గలవియును, సురత సంగ పరిశ్రమ నోదిభిః - సంభోగము వలన కలిగిన యలసటను తొలగించునవియునగు, అంశుభిః - కిరణములచేత, మకరోర్జిత కేతనం - ఎత్తబడిన మకరధ్వజముగల, కుసుమచాపం - మన్మథుని, అతేజయత్ - పదునెక్కునట్లు చేసెను. విశదములైన చంద్ర కిరణములు మరికొంచెము మదనోద్దీపకము లయ్యెననియు, చంద్రమన్మథులు పరస్పర సహాయముతో విలాసి జనమునకు సంభోగవాంఛ లధికముగా జేసిరనియు భావము.

శ్లో. హుత హుతాశన దీప్తి వనశ్రియః
ప్రతినిధిః కనకాభరణస్య యత్

యువతయః కుసుమం దధు రాహితం
త దలకే దల కేసర పేశలమ్. 40

వ్యాఖ్య : హుత హుతాశన దీప్తి - హోమము చేయబడిన అగ్నియొక్క కాంతివంటి కాంతిగల, యత్ - ఏకర్ణికార పుష్పము (కొండగోగుపూవు), వన శ్రియః - ఉద్యాన లక్ష్మికి, కనకాభరణస్య - బంగారు నగకు, ప్రతినిధిః - బదులుగా నుండెనో, దలకేసర పేశలం - దళములయందును, కింజల్కముల యందును, మిక్కిలి మెత్తనిదియగు, ఆహితం - ప్రియులచేత తేఁబడిన, తత్ - ఆ కర్ణికార పుష్పమును, యువతయః - పడుచులు, అలకే - ముంగురుల యందు, దధుః - ధరించిరి బంగారు నగవలె ప్రకాశించుచున్న కొండగోగు పూవును ప్రియులుతెచ్చి యీయగా పడుచులు తమ ముంగురులపై ధరించిరి. ఇచ్చట కర్ణికారముయొక్క రంగు, సౌకుమార్యము తెలుపఁబడినవి. అది చొక్కపు బంగారువలెను, అగ్నిజ్వాల వలెను ప్రకాశించును. దాని దళములు సన్నగా దారములంతటివిగా మృదువుగా నుండును. కొంచెము పెద్దది గనుక యువతు లొక్కొక్క పువ్వునే ముంగురులయందు ముడుచుకొనిరట. మార్దవము గల యీ పుష్పము పరిమళము లేనిదైనను కాళిదాసుకు ప్రియమైనట్టిది. "వర్ణ ప్రకర్షే సతి కర్ణికారం దునోతి నిర్గంధతయాస్మ చేతః" అని కుమారసంభవము నందు దీనికి పరిమళమును లేకుండ సృజించినందులకు బాధపడుచు బ్రహ్మను నిందించెను.

శ్లో. అలిభి రంజనబిందు మనోహరైః
కుసుమ పంక్తి నిపాతిభి రంకితః
న ఖలు శోభయతిస్మ వనస్థలీం
న తిలక స్తిలకః ప్రమదా మివ. 41

వ్యాఖ్య : అంజన బిందు మనోహరైః - కాటుక చుక్కలవలె నందమైనవియు, కుసుమపంక్తి నిపాతిభిః - పువ్వుల వరుసలపైఁ బడుచున్నవియు నగు, అలిభిః - తుమ్మెదలచేత, అంకితః - చిహ్నములు గలిగిన, తిలకః - తిలకపు చెట్టు. వనస్థలీం - ఉపవనస్థలిని (ఇచ్చట స్థల శబ్దము స్త్రీ లింగముగా వాడబడినది, దానినట్లే గ్రహించుట యుచితము), తిలకః - పుట్టుమచ్చ. ప్రమదాం ఇవ -

యువతినివలె, నశోభయతిస్మ నఖలు - అలంకరింపలేదనునది లేదుసుమా! ఎక్కువగా నలంకరించెనని యర్థము. తుమ్మెదలు వ్రాలిన తిలకపుచెట్టు వనస్థలిని, పుట్టుమచ్చ యువతి నలంకరించినట్లు ప్రకాశింపఁ జేసెనని భావము.

శ్లో. అమదయ న్మధుగంధ సనాథయా
కిసలయాధర సంగతయా మనః
కుసుమ సంభృతయా నవమల్లికా
స్మితరుచా తరు చారువిలాసినీ. **42**

వ్యాఖ్య: తరుచారు విలాసినీ—తరు - వృక్షమునకు (పురుషునికి), చారు విలాసినీ - అందమైన వయ్యారియగు, నవమల్లికా - విరజాజితీగ, మధుగంధ సనాథయా—మధు - మకరందముయొక్క (మద్యముయొక్క), గంధసనాథయా- గంధముతోఁ గూడినదియు, కిసలయాధర సంగతయా—కిసలయాధర - చిగురనెడు పెదవియందు (చిగురువంటి పెదవియందు), సంగతయా - ప్రసరించినదియు, కుసుమ సంభృతయా - పువ్వులచేత సంపాదింపబడినదియు (పుష్పరూపమైనదియగు), స్మితరుచా - చిఱునగవు వంటి కాంతిచేత (చిఱునవ్వుచేత), మనః - చూచువారి మనస్సును, అమదయత్ - మత్తెక్కించెను. నవ మల్లికా లత మకరంద పరిమళముతో చిగురులపైని పువ్వులతో వృక్షము నల్లుకొని యుండగా నది మద్యపానముచేసిన యువతివిబోలుచు ప్రియునిఁ గౌఁగిలించుకొన్నట్లుండి చూచువారికి మత్తెక్కించెనట. ఇచ్చట నవమల్లికయందు నాయికా ధర్మము లారోపింపఁబడినవి.

శ్లో. అరుణరాగ నిషేధిభి రంశుకైః
శ్రవణ లబ్ధ పదైశ్చ యవాంకురైః
పరభృతాభిరుతైశ్చ విలాసినః
స్మరబలై రబలైకరసాః కృతాః. **43**

వ్యాఖ్య: విలాసినః - భోగ పరాయణులైన పురుషులు, అరుణరాగ నిషేధిభిః - తిరస్కరించునవియగు (కుసుంభ రాగము గల, చెంగావి రంగుగల), అంశుకైః - వస్త్రములచేతను, శ్రవణలబ్ధపదైః—శ్రవణ - చెవులయందు, లబ్ధ

పదైః - పొందబడిన స్థానముగల (చెవి నందున నుంచబడిన), యవాంకురైశ్చ - గఱిక పరవలచేత, పరభృతావిరుతైశ్చ - ఆడు కోయిలల కూతలచేతను (ఈ మొదలగు), స్మరబలైః - మన్మథ సైన్యములచేత, అబలైకరసాః—అబలా - స్త్రీలయందే, ఏకరసాః - అనురాగైకరసనిమగ్నులుగా (నిరంతర స్త్రీ పరాయణులుగా), కృతాః - చేయఁబడిరి. నాయికా నాయకులు చెంగావి వస్త్రములు ధరించి గఱికపరకలు మొదలయిన ప్రకృతి భూషణములను ధరించి కోకిలాలాప, భ్రమర ఝుంకారాది మన్మథోద్దీపనముల నడుమ విహరించిరని భావము. ప్రణయినీ ప్రియులు చెంగావి వస్త్రములు ధరించుట కామోద్దీపనము; అంతియేకాక నఖక్షతాదుల వలన గలిగిన రక్త ప్రసారమును మరుగు పరచుటకు వీలగునని భావము.

శ్లో. ఉపచితావయవా శుచిభిః కణై
రలి కదంబక యోగ ముపేయుషీ
సదృశకాంతి రలక్ష్యత మంజరీ
తిలకజా లకజాలక మౌక్తికైః 44

వ్యాఖ్య : శుచిభిః - తెల్లనివి యగు, కణైః - పుప్పొడులచేత, ఉపచితావయవా - పుష్టిచెందిన యవయవములుగలవియు, అలికదంబక యోగం - తుమ్మెదల గుంపుయొక్క సంబంధమును, ఉపేయుషీ - పొందినదియు, తిలకజా - తిలక వృక్షమునుండి పుట్టిన, మంజరీ - పుష్పగుచ్ఛము, అలక జాలక మౌక్తికైః—అలక - ముంగురులయందలి, జాలక - జాలకమను పేరుగల ఆభరణము యొక్క, మౌక్తికైః - ముత్తెములతో, సదృశకాంతిః - సమానమైన కాంతి గలదియై, అలక్ష్యత - కనఁబడెను. తుమ్మెదలతో కూడిన తెల్లని తిలక మంజరి ఒక స్త్రీ నల్లని ముంగురులపై వ్రేలాడుచున్న ముత్యాల కుచ్చువలె మనోహరముగా నుండెనని భావము.

శ్లో. ధ్వజపటం మదనస్య ధనుర్భృతః
ఛవికరం ముఖచూర్ణ మృతుశ్రియః
కుసుమ కేసర రేణు మలివ్రజాః
సపవ నోపవనోత్థిత మన్వయుః 45

వ్యాఖ్య: అలివ్రజాః - తుమ్మెదల మొత్తములు, ధనుర్భృతః - విలుకాం డైన, మదనస్య - మన్మథునియొక్క, ధ్వజపటం - జెండాబట్ట వంటిదియు, ఋతుశ్రియః - వసంతఋతు లక్ష్మికి, ఛవికరం - కాంతిని గలిగించునట్టి, ముఖ చూర్ణం - ముఖచూర్ణము వంటిదియు (ఈ కాలపు ఫేస్‌పౌడరు), సపవనోపవనో త్థితం—సపవన - గాలితో కూడిన, ఉపవన - ఉద్యాన వనమునందు, ఉత్థితం - లేచిన, కుసుమకేసర రేణుం - పువ్వులయొక్క కింజల్కములయందలి పుప్పొడిని, అన్వయుః - అనుసరించి వెళ్లినవి. తెల్లని పుప్పొడి గాలికి వస్త్రమువలె పఱచు కొని పోవుచుండగా దానివెంట నల్లని తుమ్మెద గుంపులు వెళ్లుచుండుట ఒక మనో హర దృశ్యముగా నుండెనని భావము. ఆ పుప్పొడి మన్మథుని జెండాబట్టగాను, వసంతలక్ష్మి ముఖచూర్ణముగాను ఉత్ప్రేక్షింపబడినది.

శ్లో॥ అనుభవ న్నవదోల మృతూత్సవం
పటు రపి ప్రియకంఠ జిఘృక్షయా
అనయ దాసనరజ్జు పరిగ్రహే
భుజలతాం జలతా మబలాజనః 46

వ్యాఖ్య: నవదోలం - క్రొత్త ఉయ్యాల లూగునట్టి, ఋతూత్సవం - వసంతోత్సవమును, అనుభవన్ - అనుభవించుచున్న, అబలాజనః - స్త్రీ జనము, పటుః అపి - నైపుణ్యము గలదియైనను (ఉయ్యాల లూగుటయందు మంచి నేర్పు గలదియైనను), ప్రియకంఠ జిగృక్షయా - ప్రియుని కంఠమును ఆలింగనము చేసు కొనవలయునను కోరికచేత, ఆసనరజ్జు పరిగ్రహే - పీఠమునకు గట్టిన పగ్గమును పట్టుకొనుటయందు, భుజలతాం - లతవలె మృదువైన బాహువును, జలతాం - శైథిల్యమును (పట్టు వదలుటను), అనయత్ - పొందించెను. డోలా క్రీడల యందు పడిపోవుదుమను భయమును నటించి, పీఠమునకు గట్టిన త్రాటినివదలి వసంతోత్సవ సంబంధమైన డోలాక్రీడలను జేయుచున్న స్త్రీ జనము ప్రియుని కంఠము నాలింగనము చేసికొని తమ ప్రియులనే కాక చూపరులనుసైత మానంద పరచిరి. "జలతాం" లడయోరభేదః అను వచనమువలన నిది "జడతాం" అను శబ్దము. బాహువునకు జడత్వముకలిగి త్రాటిని పట్టుకొను శక్తి పోయినదని భావము. 'జడతాం' అని ప్రయోగింపక శబ్దాలంకార నిమిత్తమై 'జలతాం' అని ప్రయోగించెనని గ్రహింపవలయును.

శ్లో. త్యజత మాన మలంబత విగ్రహైః
న పున రేతి గతం చతురం వయః
పరభృతాభి రితీవ నివేదితే
స్మరమతే రమతేస్మ వధూజనః. 47

వ్యాఖ్య: బత - ఏమండోయ్! (ఓ అంగనలారా!), మానం - కోపమును: త్యజత - విడవండి, విగ్రహైః - కలహములచేత, అలం - చాలును (కలహింప కుఁడని యర్థము), గతం - గడిచిపోయిన, చతురం,వయంః - ఉపభోగ నైపుణ్యము గల యౌవనము, పునః, న, ఏతి (పునర్నైతి) తిరిగిరాదు, ఇతి - ఈవిధమైన, స్మరమతే - మన్మథుని యభిప్రాయము, పరభృతాభిః - ఆడుకోకిలల చేత, నివేదితే (సతి) ఇవ - చెప్పబడిన దగుచున్నందువలననేమో! వధూజనః - స్త్రీ జనము, రమతేస్మ - క్రీడించెను. కోకిలా కూజితములచేత ఉద్దీపిత కామము గల స్త్రీ జనము, కాముఁడు శిక్షించునను భయము వలనవలె, ఉచ్ఛృంఖలముగా రతిక్రీడ సలిపెనని తాత్పర్యము. ఇచ్చట ఆడు కోకిలములు స్త్రీ జనముతో నిట్లు చెప్పుట మిక్కిలి సమంజసముగా నున్నది. స్త్రీల యౌవనము ప్రసవాంతమే, మీ యౌవనము స్వల్పకాలముననే ముగియును కనుక మాన విగ్రహాదులతో కాలము బుచ్చకుఁడని ఆడుకోయిలలు చెప్పుటలో నౌచిత్యమున్నది, అవి యెరుగును గావున. "మాన"మనగా ప్రియుఁడు ఇతర స్త్రీ సక్తుడైనప్పుడు, ఈర్ష్యచేఁ గలుగు ప్రియురాలి కోపము, "విగ్రహ" మనఁగా మగనితోఁజేసెడి కలహము. 'బత' అను నవ్యయము వలన ఖేదము, దయ, సంతోషము, విస్మయము, ఆమంత్రణము (పిలుపు) అను నర్థములు తెలుపఁబడును. ప్రకృతము నందలి 'బత' ఆమంత్రణార్థకము.

శ్లో. అథ యథాసుఖ మార్తవ ముత్సవం
సమనుభూయ విలాసవతీ సఖః
నరపతి శ్చకమే మృగయారతిం
స మధుమ న్మధు మన్మథ సన్నిభః. 48

వ్యాఖ్య: అథ-పిమ్మట, మదుమన్మధుమన్మథసన్నిభః—మధుమత్-విష్ణువునకును, మధు - వసంతునికిని, మన్మథ - మన్మథునికిని, సన్నిభః - సమానుఁడైన

సః నరపతిః - ఆ దశరథుఁడు, విలాసవతీసఖః - విలాసినులతో గూడిన వాఁడగుచు, ఆర్తవం - వసంత ఋతువు వచ్చుటచేత నేర్పడిన, ఉత్సవం - వసంతోత్సవమును, యథాసుఖం - సుఖముగా, సమనుభూయ - అనుభవించి, మృగయారతిం - వేటయందలి వేడుకను, చకమే - కోరెను. దశరథుఁడు సైతము విలాసినులతోఁగలిసి యథేష్టముగా వసంతోత్సవ విశేషముల ననుభవించిన పిమ్మట వేటకై వెళ్లుట కిష్టపడెను.

శ్లో. పరిచయం చల లక్ష్య నిపాతనే
భయరుషోశ్చ తదింగిత బోధనమ్
శ్రమజయాత్ ప్రగుణాం చ కరో త్యసౌ
తను మతోఽనుమతః సచివై ర్యయౌ. 49

వ్యాఖ్య: అసౌ - ఈవేట, చలలక్ష్యనిపాతనే - కదలుచున్న లక్ష్యము యొక్క [లేళ్లు మనుబోతులు మొదలయిన వానియొక్క] పడగొట్టుట యందు, పరిచయం - అభ్యాసమును కరోతి - చేయును. భయరుషోః - భయక్రోధముల యందు, తదింగిత బోధనం—తత్ - ఆకదలుచున్న మృగముల యొక్క, ఇంగిత - చేష్టితములయొక్క, బోధనం - జ్ఞానమును (తెలిసికొనుటను) కరోతి - కలిగించును. తనుం - శరీరమును, శ్రమజయాత్ - అలసటను తొలగించుటవలన, ప్రగుణాంచ - మంచి లాఘవము కల దానినిగా కూడా. కరోతి - చేయును. అతః - ఈ కారణముల వలన, సచివైః - మంత్రులచేత, అనుమతః - ఆమోదింపబడినవాఁడగుచు, యయౌ - వెళ్లెను. వేట వలన, కదలుచున్న లక్ష్యమును కొట్టగల శక్తి, మృగముల భయక్రోధ భావముల నెరుగుట,శరీర లాఘవము మొదలయిన గుణములు రాజున కను కబ్బునుక మంత్రులు వేటకు వెళ్లుమని దశరథుని ప్రోత్సహించిరి. ఇట్టి ఉపయోగము లన్నియు యుద్ధపాటవమును గలిగించునన్న భావముతో మృగయాప్రవృత్తి కాని వ్యసనముచేఁ గాదని భావము.

శ్లో. మృగవనోపగమ క్షమ వేషభృత్
విపుల కంఠ నిషక్త శరాసనః
గగన మశ్వఖురోద్ధత రేణుభిః
నృసవితా సవితాన మివాకరోత్. 50

వ్యాఖ్య : మృగవనోపగమక్షమవేషభృత్ - మృగవన - మృగారణ్యము యొక్క, ఉపగమ - ప్రవేశమునకు, క్షమ - తగిన, వేషభృత్ - వేషమును ధరించినవాఁడును, విపులకంఠ - నిషక్త శరాసనః - విశాలమైన కంఠమునందుంచ బడిన ధనస్సుగల వాఁడును, అగు, నృపషితా - పురుషశ్రేష్ఠుఁడైన దశరథుఁడు, అశ్వఖురోద్ధత రేణుభిః - గుఱ్ఱపు గెట్టెలచే నెగుర వేయఁబడిన పరాగ రేణువుల చేత, గగనం - ఆకాశమును, సవితానం, ఇవ - చాందినీ బట్టకల దానివలె, అక రోత్ - చేసెను. మృగయావేషమును ధరించి వెళ్లుచున్న దశరథుని గుఱ్ఱపు గిట్టలచే రేగిన ధూళి ఆకసము క్రింద చాందినీబట్ట కట్టినట్లుండెనని భావము. అట్లు బయలు దేరెను. "నృపవితా" ఇచ్చట సూర్యవాచకమైన సవితృ శబ్దము, ఇంద్రసింహ శార్దూలాది శబ్దములవలె శ్రేష్ఠవాచకము. ఇది నరేంద్ర, పురుష సింహాది శబ్దముల వలె ఉపమిత సమాసము.

శ్లో. గ్రథితమౌలి రసౌ వనమాలయా
తరుపలాశ సవర్ణ తనుచ్ఛదః
తురగవల్గన చంచల కుండలో
విరురుచే రురు చేష్టిత భూమిషు. 51

వ్యాఖ్య: వనమాలయా - వనపుష్పముల మాలికచేత, గ్రథితమౌలిః - కట్ట బడిన శిఖగల వాఁడును, తరుపలాశ సవర్ణతనుచ్ఛదః — తరుపలాశ - చెట్ల యాకులతో, సవర్ణ - సమానమైన రంగుగల, తనుచ్ఛదః - కవచము గల వాఁడును (కవచము ఆకుపచ్చగా నుండెననుట మృగాదుల విశ్వాసార్థము), తురగ వల్గన చంచల కుండలః - గుఱ్ఱము యొక్క కదనువలన చలించుచున్న కర్ణ భూషణములు గలవాడునునగు, అసౌ - దశరథుఁడు, రురుచేష్టిత భూమిషు — రురు - నల్లచారల దుప్పులచేత, చేష్టిత - తిరుగబడినట్టి, భూమిషు - ప్రదేశముల యందు, విరురుచే - మిక్కిలి ప్రకాశించెను. మృగములు బెదిరి చెదిరిపోకుండ అడవి పువ్వులనే తలకు జుట్టుకొని, ఆకుపచ్చని కవచము ధరించి, గుఱ్ఱముపై నెక్కి, ఎక్కువగా దుప్పులు, వేళ్లను తిరుగాడు ప్రదేశములకు వెళ్లెను.

శ్లో. తను లతా వినివేశిత విగ్రహాః
భ్రమర సంక్రమి తేక్షణవృత్తయః

దదృశు రధ్వని తం వనదేవతాః
సునయనం నయ నందిత కోసలమ్. 52

వ్యాఖ్య : తనులతా వినివేశిత విగ్రహాః — తనులతా - సుకుమారమైన లతలయందు, వినివేశిత - సంక్రమింపఁజేయఁబడిన విగ్రహాః - దేహములు గల వారును, భ్రమర సంక్రమితేక్షణ వృత్తయః - తుమ్మెదల యందు చేర్చఁబడిన చూపులుగల వారునగు, వనదేవతాః - వనదేవతలు, సునయనం - అందమైన కన్నులుగల వాఁడును, నయనందిత కోసలమ్— నయ - నీతి చేత, నందిత కోసలమ్ - సంతోష పరుపఁబడిన కోసల దేశము గలవాడును నగు, తం- ఆ దశరథుని, అధ్వని - మార్గమునందు, దదృశుః - చూచిరి. ప్రసన్న రూపము గల యతనిని వనదేవతలు సైతము చాటున నుండి లతల యందు చేర్చబడిన దేహములు, తుమ్మెదల యందు జేర్చబడిన చూపులు గలవారై చూచిరి.

శ్లో. శ్వగణి వాగురికైః ప్రథమాస్థితం
వ్యపగతానల దస్యు వివేశ సః
స్థిర తురంగమ భూమి నిపానవ
న్మృగ వయో గవయో పచితం వనమ్. 53

వ్యాఖ్య: సః - ఆ దశరథుఁడు, శ్వగణి - వేటకుక్కల గుంపుల నాయకుల చేతను, వాగురికైః - మృగములను పట్టుకొనుటకు వలలు పరచు వారిచేతను, ప్రథమాస్థితం - మొదట ఆక్రమింపఁబడినదియు, వ్యపగతానలదస్యు - తొలగిన దావాగ్నియు చోరులును గలదియు, స్థిరతురంగమ భూమి — స్థిర - బురద లేక గట్టిపడినవియు, తురంగమ - గుఱ్ఱములు నడచుటకు యోగ్యమైన, భూమి - నేలలు గలదియు, నిపానవత్ - సమీపమున బావులు చెఱువులు గలదియు, మృగ వయోగవయోపచితం—మృగ - లేళ్లు మొదలయిన వాని చేతను, వయో - పక్షుల చేతను, గవయ - ఆవుల వంటి మనుబోతులచేతను, ఉపచితం - సమృద్ధమై యున్న, వనం - అరణ్యమును, వివేశ - ప్రవేశించెను. అతడు మృగములు, పక్షులు గలిగి, వేటకు యోగ్యమైన అరణ్యమున ప్రవేశించునప్పుడు ముందుగా కొందరిని బంపి, దావాగ్నియు, దొంగలును లేకుండఁజేసి, అప్తులగు శస్త్రధారులను వెంట నిడుకొని పోయెను. కామందక నీతిశాస్త్రము చెప్పు మృగయా విధానమును దశరథుఁ డనుసరించెనని భావము.

శ్లో. అథ నభస్య ఇవ త్రిదశాయుధం
కనకపింగ తడిద్గుణ సంయుతమ్
ధను రధిజ్య మనాధి రుపాదదే
నరవరో రవరోషిత కేసరీ. 54

వ్యాఖ్య: అథ - ఆతరువాత, అనాధిః-మనోవ్యథా రహితుఁడైన, నరవరః- దశరథుఁడు, రవరోషిత కేసరీ - ధనుష్టంకార ధ్వనిచేత, రోషిత - క్రుద్ధములైన, కేసరీ - సింహములు గలవాఁడగుచును, కనకపింగ తడిద్గుణసంయుతమ్—కనక పింగ - బంగారమువలె పచ్చనిదైన, తటిద్గుణ - మెఱపు తీగయను అల్లెత్రాటితో, సంయుతమ్ - కూడినట్టియును, త్రిదశాయుధం - ఇంద్ర ధనస్సును, నభస్యః ఇవ- భాద్రపద మాసమువలె, అధిజ్యం - ఎక్కుపెట్టబడిన అల్లెత్రాడుగల, ధనుః - విల్లును, ఉపాదదే - స్వీకరించెను. భాద్రపద, త్రిదశాయుధోపమానములచేత విందు వర్షాకాలము నందలి వర్షధారలవలె దశరథుఁ డరణ్య మృగములపై శర వర్షము గురిపింప నున్నాఁడను విషయము స్ఫురించును. మేఘధ్వని విని సింహ ములు కోపముతో ప్రతిగర్జనము చేయును. ఇంద్ర ధనుస్సుకు మెఱుపు అల్లె త్రాటివలె నుండును.

శ్లో. తస్య స్తన ప్రణయిభి ర్ముహు రేణశాబై
ర్వ్యాహన్యమాన హరిణీగమనం పురస్తాత్
ఆవిర్బభూవ కుశగర్భ ముఖం మృగాణాం
యూథం తదగ్రసర గర్విత కృష్ణసారమ్. 55

వ్యాఖ్య: స్తనప్రణయిభిః - పాలు త్రాగుటయందు మక్కువగల, ఏణ శాబైః - లేడి పిల్లలచేత, ముహుః - మాటిమాటికీ, వ్యాహన్యమాన హరిణీ గమ నం—వ్యాహన్యమాన - అడ్డగింపఁ బడుచున్న (శిశువులమీది వాత్సల్యము వలన వాటి గమనము ననుసరించి తల్లులు ఆగుచుండెనని యర్థము), హరిణీ గమనం - ఆడులేళ్ల నడకగలదియును, కుశ గర్భముఖం - దర్భలునములు నోళ్లు కలదియును, తదగ్రసర గర్విత కృష్ణసారం - తదగ్రసర - దానిముందు నడుచునట్టి, గర్విత - గర్వమున తలనెత్తుకొనియున్న, కృష్ణసారం - నలుపు దిరిగిన మగలేడి కలది యునునను, మృగాణాం - జింకల యొక్క, యూథం - మంద, తస్య - ఆ దశ

రథుని యొక్క పురస్తాత్ - ఎదుట ఆవిర్బభూవ - అగపడెను. పిల్లలు పాలు త్రాగుతూ ఆపగా ఆగిన యాడులేళ్ళతోను, దర్భలు నమలుచున్న నోళ్లతోను, ముందు నడచుచున్న గంభీర కృష్ణసారముతోను ఒకలేళ్లమంద దశరథుని యెదుట బడెను. ఇచ్చటి నుండి కొన్ని శ్లోకముల వఱకు వసంత తిలకావృత్తము.

శ్లో. తత్ ప్రార్థితం జవన వాజి గతేన రాజ్ఞా
తూణీముఖోద్ధృత శరేణ విశీర్ణపంక్తి
శ్యామీచకార వన మాకుల దృష్టిపాతైః
వాతేరితోత్పల దలప్రకరై రివార్ద్రైః 56

వ్యాఖ్య: జవనవాజి గతేన - వేగముగ నడచు గుఱ్ఱముపై నెక్కినవాఁడును తూణీముఖోద్ధృత శరేణ - తూణీరము నుండి పైకి తీయఁబడిన బాణము గల వాఁడునునగు, రాజ్ఞా - దశరథునిచేత, ప్రార్థితం - ఎదురుకోబడినదియై, విశీర్ణ పంక్తి - చెదిరిపోయిన వరుసలుగల, తత్ - ఆ లేళ్లమంద, ఆర్ద్రైః - తడిసిన (భయముచే కన్నీరు గ్రమ్మినట్టి)ఆకుల, దృష్టిపాతైః-భయచకితములైన చూపుల చేత, వాతేరితోత్పల దల ప్రకరైః, ఇవ—వాతేరిత - గాలిచే కదల్చబడిన, ఉత్పలదల - కలువ రేకులయొక్క, ప్రకరైః ఇవ - మొత్తములచేత వలె, వనం అరణ్యమును,శ్యామీచకార - నల్లగాఁజేసెను. గుఱ్ఱపు వేగముతో ఉద్ధృతశరుఁడైన దశరథుఁ డెదురుపడుటచేత ఆలేళ్ల మంద చెదిరి చీలిపోయిన లేళ్లయొక్క భయ కంపితములైన చూపులచేత, నల్లకలువ రేకులు పరచినట్లు వనము శ్యామల వర్ణ ముగా మారెనని తాత్పర్యము. ఇచ్చటి 'ప్రార్థిత' శబ్దమునకు అభియానము (ఎదురుపడుట) అర్థము.

శ్లో. లక్ష్యీకృతస్య హరిణస్య హరిప్రభావః
ప్రేక్ష్య స్థితాం సహచరీం వ్యవధాయ దేహమ్
ఆకర్ణకృష్ట మపి కామితయా స ధన్వీ
బాణం కృపామృదుమనాః ప్రతి సంజహార. 57

వ్యాఖ్య: హరిప్రభావః - ఇంద్రుడు లేదా విష్ణువు యొక్క ప్రభావము వంటి ప్రభావముగల, ధన్వినః - విలుకాఁడైన ఆ దశరథుఁడు, లక్ష్యీకృతస్య -

బాణము వేయుటకు గుఱి పెట్టబడిన, హరిణస్య - మగలేడి యొక్క, దేహం - శరీరమును, వ్యవధాయ - చాటుపరచి, స్థితాం - నిలుచుని యున్న, సహచరీం - సహచరియగు ఆడులేడిని, ప్రేక్ష్య - చూచి, కామితయా - తాను కాముకుడగుట వలన, కృపామృదుమనాః - దయచేత మెత్తబడిన మనస్సు గల వాడఁగుచు, ఆ కర్ణకృష్టం అపి - చెవి వఱకు లాగబడినదైనను (ఉపసంహరించుటకు వీలుపడని దైనను), బాణం - బాణమును, ప్రతిసంజహార - నేర్పుతో ఉపసంహరించెను. మేటి విలుకాడైన దశరథుఁ డొక మగలేడిపై శరమును విడువబోగా దాని ప్రియురాలైన యొక ఆడు లేడి లక్ష్యమున కడ్డము వచ్చెను. కృపాళుడై బాణము నుపసంహరించెను. "ధన్వీ" పదము పై నైపుణ్యమును సమర్థించును.

శ్లో. తస్యాపరేష్వపి మృగేషు శరాన్ ముముక్షోః
కర్ణాంత మేత్య బిభిదే నిబిడోఽపి ముష్టిః
త్రాసాతిమాత్రచటులైః స్మరతః సునేత్రైః
ప్రౌఢప్రియా నయన విభ్రమ చేష్టితాని. 58

వ్యాఖ్య: త్రాసాతిమాత్రచటులైః— త్రాస - భయము వలన, అతిమాత్రచటులైః - మిక్కిలి చలించుచున్న, సునేత్రైః - లేళ్ల యొక్క అందమైన కనులచేత (కారణము), ప్రౌఢప్రియానయన విభ్రమచేష్టితాని—ప్రౌఢప్రియా - గడుసు కత్తెలైన తన ప్రియురాండ్రయొక్క, నయన విభ్రమ చేష్టితాని - కన్నుల వయ్యారితనపు చేష్టితములను, స్మరతః - స్మరించున్నట్టియు అపరేషు, మృగేషు, అపి - ఇతరములగు లేళ్ళమీదను, శరాన్ - బాణములను, ముముక్షోః - విడువ దలచుకొనుచున్న వాడునునగు, తస్య - ఆ దశరథుని యొక్క, ముష్టిః - పిడికిలి, నిబిడోఽపి (నిబిడః, అపి) - దృఢమైనదే యైనను, కర్ణాంతం - చెవి చివరిని, ఏత్య - చేరి, బిభిదే - సడలిపోయెను. కాముకుఁడైన యతనియొక్క ముష్టి ప్రియా నేత్ర విభ్రమస్మృతి చేత, లేళ్లయందుఁగల్గిన కృపాతిశయముచేత, సడలిపోయెనే గాని, నైపుణ్యము లేక కాదని తాత్పర్యార్థము.

శ్లో. ఉత్తస్థుషః సపది పల్వలపంక మధ్యాత్
ముస్తాప్రరోహ కబలావయ వానుకీర్ణమ్

జగ్రాహ స ద్రుతవరాహకులస్య మార్గం
సువ్యక్త మార్ద్రపద పంక్తిభి రాయతాభిః 59

వ్యాఖ్య: సః - అతఁడు, ముస్తాప్రరోహకబలావయవానుకీర్ణం—ముస్తాప్రరోహ - తుంగ మొలకలయొక్క, కబలావయవ - కబళ శకలములచేత, అనుకీర్ణం - వరుసగా వ్యాపించినదియు, ఆయతాభిః - పొడువుగా నున్న, ఆర్ద్రపద పంక్తిభిః - తడిసిన అడుగుల వరుసలచేత, సువ్యక్తం - స్పష్టముగాఁగనబడుచున్నదియు, సపది అప్పుడే, పల్వలపంక మధ్యాత్—పల్వల - చిన్నసీటి గుంటల లోని, పంకమధ్యాత్ - బురదనడిమినుండి, ఉత్తస్థుషః - పైకిలేచిన, ద్రుతవరాహ కులస్య - పరుగెత్తి పోయిన పందుల మంద యొక్క, మార్గం - దారిని, జగ్రాహ - అనుసరించెను. - లేడి గుంపును వదలి, నమలిన తుంగముక్కలుపడి, తడిసిన యడుగుల జాడలతో, అప్పుడే సీటి గుంటల నుండి పైకిలేచి పారిపోయిన పందుల మంద దారినిబట్టెనని భావము.

శ్లో. తం వాహనా దవన తోత్తరకాయ మీషత్
విధ్యంత ముద్ధృతసటాః ప్రతిహంతు మీషుః
నాత్మాన మస్య వివిదుః సహసా వరాహా
వృక్షేషు విద్ధ మిషుభి ర్జఘనాశ్రయేషు 60

వ్యాఖ్య: వరాహాః - పందులు, వాహనాత్ - గుఱ్ఱము నుండి, ఈషత్ - కొంచముగా, అవనతోత్తరకాయం- వంచబడిన శరీరోర్ధ్వ భాగము గలిగినట్టియు, విధ్యంతం - బాణము వేయుచున్నట్టియు, తం - ఆ దశరథుని, ఉద్ధృతసటాః - నిక్కపొడుచుకున్న జడలు కలవి యగుచు, ప్రతి హంతుం - ఎదురు దెబ్బ తీయుటకు, ఈషుః - తలచినవి, అస్య - ఈ దశరథునియొక్క, ఇషుభిః - బాణముల చేత, సహసా - హఠాత్తుగా, జఘనాశ్రయేషు - తమ కటిప్రదేశముల కాధార భూతములైన, వృక్షేషు - చెట్ల యందు, విద్ధం - గ్రుచ్చియుంచబడిన, ఆత్మానం- తమను, న వివిదుః - తెలిసికొన లేకపోయినవి. తమను కొట్టుచున్న రాజుపైకి దుముకుద మనుకొనుచుండగనే పందులు తామానుకొన్న చెట్లకు బాణములచే నతికింపఁబడిపోయిన విషయమును గ్రహింపలేక చనిపోయెను. ఈ శ్లోకమునందు అడవి పందుల మనస్తత్వమును, దశరథుని హస్తలాఘవమును చక్కగా వర్ణింపఁబడినవి.

శ్లో. తేనాభిఘాత రభసస్య వికృష్య పత్రీ
వన్యస్య నేత్ర వివరే మహిషస్య ముక్తః
నిర్భిద్య విగ్రహ మశోణితలిప్త పుంఖః
తం పాతయాం ప్రథమ మాస పపాత పశ్చాత్ 61

వ్యాఖ్య: అభిఘాత రభసస్య - మీదపడి చంపుటకు వేగిర పడుచున్న, వన్యస్య మహిషస్య - అడవి దున్నయొక్క, నేత్రవివరే - కంటి నడుమ, తేన - ఆ దశరథునిచేత, వికృష్య - బాగుగాలాగి, ముక్తః - విడువఁబడినట్టి - పత్రీ - బాణము, విగ్రహం - ఆ దున్న శరీరమును, నిర్భిద్య - చీల్చుకొని, అశోణితలిప్త పుంఖః - రక్తముచే పూయబడని పిడికలది యగుచు, తం - ఆ మహిషమును, ప్రథమం - మొదట, పాతయామాస (పాతయాం + ఆస) - నేలపై పడవేసెను. పశ్చాత్ - తరువాత, పపాత - తాను క్రిందపడెను. తనను చంపుటకు పైఁబడి వచ్చుచున్న యడవి దున్న కంటికిఁదాకునట్లు విడిచిన దశరథుని బాణము మొదట మహిషమును జీల్చి నేలపైఁబడగొట్టి, పిమ్మట తాను నేలపై బడెను. ''అశోణితలిప్త పుంఖః'' సామాన్యముగా ఖడ్గముగాని, బాణము గాని యొక శరీరమును దూసుకొని పోవునప్పుడు రక్తలిప్తమగును, ఇచ్చట బాణము గాక, బాణపు పిడి సైతము రక్తముచేత పూయబడలేదట. అతి వేగముగా దూసుకొని పోవుటచేత మహిష రక్తము లావుగా వున్న పుంఖమునకు గూడ అంటలేదన్నచో నిక బాణపు మొనకంటుట అసంభవము గదా! ఆ బాణమంత వేగము, పటిమ గలదియై యుండెనని కవి భావము.

శ్లో. ప్రాయో విషాణపరిమోక్ష లఘూత్తమాంగాన్
ఖడ్గాం శ్చకార నృపతి ర్నిశితైః క్షురప్రైః
శృంగం స దృప్త వినయాధికృతః పరేషాం
అత్యుచ్ఛ్రితం న మమృషే నతు దీర్ఘ మాయుః 62

వ్యాఖ్య: నృపతిః -దశరథుఁడు, క్షురప్రైః - ఒక విధమగు బాణములచేత, ఖడ్గాన్ - ఖడ్గమృగములను, ప్రాయః - ఎక్కువగా, విషాణ పరిమోక్షలఘూత్తమాంగాన్—విషాణపరిమోక్ష - కొమ్ములను ఊడగొట్టుట చేత, లఘు - బరువు తగ్గిన, ఉత్తమాంగాన్ - తలలు కలవానినిగా, చకార - చేసెను (కొమ్ములను

ఊడగొట్టెను గాని చంపలేదని యర్థము), (కుతః - ఎందువలననగా) దృప్త వినయాధికృతః - దృప్త - గర్వించిన వారిని, వినయ - శిక్షించుట యందు, అధికృతః - అధికారము గలవాడగు (దుష్టనిగ్రహము చేయువాఁడని యర్థము) సః - ఆ దశరథుఁడు, పరేషాం - ప్రతికూలురైన వారియొక్క, అత్యుచ్ఛ్రితం-మిక్కిలి పైకెగసిన, శృంగం - కొమ్మును (ప్రాధాన్యమును), నమమృషే - సహింపకుండెను. తు - కాని, దీర్ఘం, ఆయుః - దీర్ఘాయుష్యమును (జీవిత కాలమును) న - కాదు. గర్వముచేత కొమ్ములు తిరిగినట్లు వ్యవహరించు వారికి శృంగభంగమగునట్లుచేసి యణచి యుంచుటయే కాని, వారిని జీవింపనీయకుండుట దశరథుని స్వభావము కాదు, కనుక ఖడ్గ మృగములకు ముఖముపై మొలచిన శృంగములను భంగము గావించి, వానికి తలబరువు తగ్గునట్లు చేసి, చంపక విడిచెనని భావము.

శ్లో. వ్యాఘ్రా నభీ రభిముఖోత్పతితాన్ గుహాభ్యః
పుల్లాసనాగ్ర విటపా నివ వాయురుగ్ణాన్
శిక్షావిశేష లఘుహ స్తతయా నిమేషా
త్తూణీచకార శరపూరిత వక్త్రరంధ్రాన్. 63

వ్యాఖ్య : అభీః - భయరహితుఁడైన ఆ దశరథుఁడు, గుహాభ్యః - గుహల నుండి, అభిముఖోత్పతితాన్ - తనకెదురుగా పైకి యెగిరినట్టివియు, వాయురుగ్ణాన్- గాలిచేత విరుగగొట్టబడిన, పుల్లాసనాగ్ర విటపాన్ ఇవ - పూచిన వేగిచెట్టు పెద్ద కొమ్మలవలె నున్నట్టివియు, శరపూరిత వక్త్రరంధ్రాన్ - బాణములచేత నింపఁబడిన నోళ్లు కలవియునగు, వ్యాఘ్రాన్ - పెద్దపులులను, శిక్షావిశేష లఘుహస్తతయా — శిక్షావిశేష - అభ్యాసాతిశయముచేత, లఘుహస్తతయా - హస్తలాఘవము గలవాఁడగుటచేత, నిమేషాత్ - క్షణమాత్రములో, తూణీచకార - అంబుల పొదులనుగా జేసెను. బాణములతో వ్యాఘ్రములనోళ్లను నింపివేసెనని యర్థము, పులులు చిత్రవర్ణము గలవగుటచేత పుష్పించిన వేగిచెట్ల పెద్ద కొమ్మలు ఉపమానముగాఁజెప్పబడినవి. గుహల నుండి ఇవతలికి యెగిరి నోళ్లు తెఱచిన పులులు, గాలికి విరిగి, చెట్టు నుండి దూరమై రంధ్రములు గలవియై యున్న అగ్రవిటపములుగా నుపమింపబడినవి. తెఱచిన నోళ్ల నిండ శరములు నింపి పులులనే తూణీరములుగాఁజేసెననుట చక్కని కల్పన.

శ్లో. నిర్ఘాతోగ్రైః కుంజలీనాన్ జిఘాంసు
ర్జ్యానిర్ఘోషైః క్షోభయామాస సింహాన్
నూనం తేషా మభ్యసూయా పరోఽభూ
ద్వీర్యోదగ్రే రాజశబ్దే మృగేషు. 64

వ్యాఖ్య: కుంజలీనాన్ - పొదరిండ్లలో దాగిన, సింహాన్ - సింహములను, జిఘాంసుః - చంపఁదలచినవాడై, నిర్ఘాతోగ్రైః - పిడుగు చప్పుడువలె భయంకరములైన, జ్యానిర్ఘోషైః - ధనుష్టంకారములచేత, క్షోభయామాస - కలవర పెట్టెను, తేషాం - ఆ సింహముల యొక్క, వీర్యోదగ్రే - శౌర్యముచేత ఉన్నతమైన, మృగేషు, రాజశబ్దే - మృగముల విషయమున నేర్పడిన రాజశబ్దమునందు (మృగరాజ శబ్దము నందు) అభ్యసూయాపరః - అసూయాపరుఁడు, అభూత్, నూనం - అయియుండెనేమోః (కానిచో సింహములను వెదకి చంపనేలః యని భావము) ఇది శాలినీవృత్తము.

శ్లో. తాన్ హత్వా గజకులబద్ధ తీవ్రవైరాన్
కాకుత్స్థః కుటిల నఖాగ్ర లగ్న ముక్తాన్
ఆత్మానం రణకృత కర్మణాం గజానా
మానృణ్యం గత మివ మార్గణై రమంస్త. 65

వ్యాఖ్య : కాకుత్స్థః - దశరథుఁడు, గజకులబద్ధ తీవ్రవైరాన్—గజకుల - ఏనుగుల జాతియందు, బద్ధ - స్థిరముగా నేర్పబడిన, తీవ్రవైరాన్ - అత్యంత శత్రుత్వము గలవియును, కుటిల నఖాగ్రలగ్నముక్తాన్ - కుటిల - వంకరలు దీరిన నఖాగ్ర - గోటి కొనల యందు, లగ్న - తగులుకొన్న (ఇఱికిన), ముక్తాన్ - గజకుంభమౌక్తికములు గలవియునగు, తాన్ - ఆ సింహములను, హత్వా - చంపి, ఆత్మానం - తనను, రణకృతకర్మణాం - యుద్ధముల యందు తనకు చేయబడిన యుపకారములు గల, గజానాం - ఏనుఁగుల యొక్క, ఆనృణ్యం - అనృణత్వమును (అప్పు తీర్చుకొనుటను) మార్గణైః - బాణములచేత (బాణములు తనకు తోడ్పడుటచేత) గతం ఇవ - పొందిన వానినిగా, అమంస్త - తలచెను తనకు యుద్ధములందు ఉపకారము చేసిన గజముల యొక్క ఋణమును, వాటికి బద్ధ శత్రువులైన సింహములను చంపి తీర్చుకొన్నట్లు భావించెనని తాత్పర్యము. సింహ

ములు కుటిల నఖాగ్రములతో గజములను గ్రుచ్చినవి కనుక, దశరథుఁడు శరము లతో సింహములను గ్రుచ్చుట ఏనుగులకు సంతోషకరము గదా! ఇదియు శాలినీ వృత్తమే.

శ్లో. చమరాన్ పరితః ప్రవర్తితాశ్వః
క్వచి దాకర్ణవికృష్ట భల్లవర్షీ
నృపతీ నివ తాన్ వియోజ్య సద్యః
సితవాలవ్యజనై ర్జగామ శాంతిమ్. 66

వ్యాఖ్య: క్వచిత్ - ఒకచోట, చమరాన్ పరితః - చమరీ మృగముల పార్శ్వములందంతటను, ప్రవర్తితాశ్వః - పరుగెత్తింపఁబడిన గుఱ్ఱము గలవాడును ఆకర్ణవికృష్టభల్లవర్షీ — ఆ కర్ణవికృష్ట - చెవిదాక లాగబడిన, భల్ల - బల్లెములను బాణములను, వర్షీ - వర్షించువాడునునగు దశరథుఁడు, నృపతీనివ (నృపతీన్ + ఇవ) - రాజులనువలె, తాన్ - ఆ చమరీ మృగములను, సితవాలవ్యజనైః - తెల్లని వాలములనెడు వీవనలతో, వియోజ్య - ఎడబాటు గలిగించి, సద్యః - వెంటనే, శాంతిం జగామ - శాంతిని పొందెను. చమరీ మృగములకు అలంకారములును, గర్వకారణములునైన వాలములను మాత్రము ఖండించి వానిని చంపక విడిచెను. ఇది ఔపచ్ఛందసిక వృత్తము. శూరులకు పరుల యైశ్వర్యమే సహింపరానిదికాని, వారి జీవితము కాదు కనుక, రాజులకువలె మాకును రాజచిహ్నములగు వ్యజన ములు గలవని గర్వపడు చమర మృగములను శత్రురాజులనుగా భావించి, వాటి వాలవ్యజనములను మాత్రము తొలగించెనని తాత్పర్యము.

శ్లో. అపి తురగసమీపా దుత్పతంతం మయూరం
న స రుచిరకలాపం బాణలక్ష్యీచకార
సపది గత మనస్క శ్చిత్ర మాల్యానుకీర్ణే
రతివిగలితబంధే కేశపాశే ప్రియాయాః. 67

వ్యాఖ్య: సః - ఆ దశరథుఁడు, తురగసమీపాత్ - తన గుఱ్ఱము వద్దనే, ఉత్పతంతమపి - ఎగురుచున్నదియైనను (సులభముగా కొట్టుటకు వీలున్నప్పటికిని యని యర్థము), రుచిరకలాపం - కాంతిమంతమైన పింఛముగల, మయూరం -

నెమలిని, చిత్రమాల్యానుకీర్ణే - రంగురంగుల పూలమాలలచేత వ్యాప్తమైనదియు, రతివిగళితబంధే - సంభోగ సమయమునందు వదలిపోయినముడికలదియునగు, ప్రియాయాః కేశపాశే - ప్రియురాలి యొక్క కొప్పు మీదికి, సపది - అప్పుడే, గతమనస్కః - వెళ్లిన మనస్సు గలవాఁడగుచు, న బాణలక్ష్యీచకార - బాణమునకు గుఱినిగా చేయకపోయెను. ఒక నెమలి తన ప్రక్కన యెగురుచున్నను, దాని పింఛమును చూచుటవలన రతి సమయమున సడలిపోయిన తన ప్రియురాలి కేశపాశము స్మృతికి వచ్చి, ఆ నెమలిని కొట్టుట మానెనని భావము, చిత్రవర్ణము గల నెమలి పింఛమును జూడగానే రతి సమయమున ముడియూడి పరచుకపోయిన కేశములును వానివెంట రాలి చెదిరిపడిన పూలును గల ప్రియురాలి ధమ్మిల్లము స్మృతికి వచ్చెనని చెప్పుటలో చక్కని పోలిక యున్నది. మాలినీవృత్తము.

శ్లో. తస్య కర్కశవిహార సంభవం
స్వేద మానన విలగ్న జాలకమ్
ఆచచామ సతుషార శీకరో
భిన్న పల్లవపుటో వనానిలః 68

వ్యాఖ్య: కర్కశ విహార సంభవం - కఠినమైన మృగయా విహారమువలన గలిగినదియు, ఆననవిలగ్నజాలకం - ముఖముమీద కదలుచున్న బిందువుల మొత్తముగలదియునగు, తస్య - ఆ దశరథుని యొక్క, స్వేదం - చెమటను, సతుషారశీకరః - చల్లని నీటి తుంపురులతోఁగూడినదియు, భిన్నపల్లవపుటః— భిన్న - విచ్చునట్లు చేయబడిన, పల్లవపుటః - దొన్నెలవంటి చిగురాకులు గలదియునగు, వనానిలః - వనవాయువు, ఆచచామ - ఆచమనము చేసెను (సులభముగా తొలగించెనని యర్థము). వేటలో నెడతెగక పరిశ్రమించుటచేత దశరథుని మొగముపై చెమట చుక్కలు నిండుగా నేర్పడెననియు, ఆ స్వేదకణములను చల్లని, మెల్లని వనవాయువు వీచి తొలగించెననియు భావము. "ఆచచామ" ఆచమనము చేయుటకు కొద్దిపాటి జలమే యవసరము, ఇచ్చట పానము చేసెనను నర్థముగల "పపౌ" మొదలగు క్రియల నుపయోగించుట యుక్తముగా నుండదు. కొద్దిపాటి స్వేదకణములకు ఆచమనక్రియ సరిపోయినట్లు ఇతర క్రియలు సరిపోవు కనుగ యట్టి గౌణార్థము గల క్రియ నుపయోగించెను. రథోద్ధతా వృత్తము.

శ్లో. ఇతి విస్మృతాన్యకరణీయ మాత్మనః
సచివావలంబిత ధురం ధరాధిపమ్
పరివృద్ధరాగ మనుబంధసేవయా
మృగయా జహార చతురేవ కామినీ 69

వ్యాఖ్య: ఇతి - ఇట్లు (పూర్వము చెప్పినట్లు), ఆత్మనః - తనయొక్క, విస్మృతాన్యకరణీయం - మరువబడిన ఇతర కర్తవ్యము గలవాఁడును, సచివావలంబితధురం — సచివ - మంత్రులచేత, అవలంబిత ధురం - ధరింపబడిన రాజ్య భారము గలవాఁడును, అనుబంధ సేవయా - ఎడతెగని సేవచేత, పరివృద్ధ రాగం- అభివృద్ధి చెందిన రక్తిగలవాడును నగు, ధరాధిపం - దశరథ మహారాజును, మృగయా - వేట, చతురా - నేర్పరియైన, కామినీ ఇవ - కాముకురాలువలె, జహార - ఆకర్షించెను. (అపహరించెనని పదార్థము). వినోదమునకై ఆరంభింప బడిన వేట వ్యసనముగా మాఱి దశరథుని విస్మృతాన్యకరణీయునిగాఁజేసి దూరము గొనిపోయెనని భావము. ''పరివృద్ధరాగమనుబంధసేవయా'' కోరికలను నిరంతర ముగాఁదీర్చుచుఁబోయినచో నవి వృద్ధి జెందునేకాని తగ్గవని తాత్పర్యము. ''నజాతు కామః కామానాం ఉపభోగేన శామ్యతి, హవిషా కృష్ణవర్త్మేవ భూయ ఏ వాభి వర్ధతే'' అని గీతా వాక్యము.

శ్లో. స లలిత కుసుమ ప్రవాల శయ్యాం
జ్వలిత మహౌషధి దీపికా సనాథామ్
నరపతి రతివాహయాం బభూవ
క్వచి దసమేతపరిచ్ఛద స్త్రియామామ్. 70

వ్యాఖ్య: సః - ఆ దశరథుఁడు, లలితకుసుమ ప్రవాలశయ్యాం — లలిత- సుకుమారములైన కుసుమ, ప్రవాల - పువ్వులు, చిగురాకులు, శయ్యాం పడకగా గలదియును, జ్వలిత మహౌషధిదీపికాసనాథాం — జ్వలిత - వెలిగిన, మహౌషధి - ఉత్తమ ఓషధులనెడు, దీపికా - చిఱుదీపములతో, సనాథాం - కూడినదియునగు, త్రియామాం - రాత్రిని, క్వచిత్ - ఒకానొకచోట, అసమేత పరిచ్ఛదః - వెంబ డింపని పరివారము గలవాఁడగుచు, అతివాహయాంబభూవ - గడపెను. పువ్వు లను, చిగురాకులను పడకగా చేసుకొని, రాత్రివేళ వెలుగు కొన్ని మొక్కల

వెలుగులో నొంటరిగా నొకచోట నిద్రించి, రాత్రిని గడపెననియు మృగయావ్యసన మట్లు ఒంటరిని జేసెననియు భావము. "అసమేత పరిచ్ఛదః" అనుటకుఁగారణము దారిలేని యరణ్యమున స్వేచ్ఛగా గుఱ్ఱమును నడపుచు రాత్రియగు పఱకును దశరథుఁడు వేటాడు చుండుటచేత సేవకజన మతనిని గలుసుకొనలేకపోవుటయే.

శ్లో. ఉషసి స గజయూథ కర్ణతాలైః
పటు పటహ ధ్వనిభి ర్వినీతనిద్రః
అరమత మధురాణి తత్ర శృణ్వన్
విహగ వికూజిత వందిమంగలాని. 71

వ్యాఖ్య: ఉషసి - ప్రాతఃకాలమునందు, పటుపటహధ్వనిభిః - గట్టితప్పెటల యొక్క ధ్వనులతో సమానమైన ధ్వనులుఁగల, గజయూథకర్ణ తాలైః- గజయూథ - ఏనుగుల మంద యొక్క, కర్ణతాలైః చెవులనెడు తాళములచేత, వినీతనిద్రః - తొలగింపబడిన నిద్రగల, సః- ఆ దశరథుఁడు, తత్ర - ఆ వనమునందు, మధురాణి -చెవుల కింపైన, విహగవికూజితవందిమంగలాని— విహగవికూజిత - పక్షుల యఱుపులనెడు, వందిమంగలాని- స్తుతి పాఠకుల మంగళ గీతములను, శృణ్వన్- వినుచున్నవాఁడగుచు, అరమత-ఆనందించెను. అరణ్యమునందు సైతము దశరథునికి, రాజుకు దగిన పఱుపు, వందిమాగధ గీతములు, మంగళవాద్య ధ్వనులు మొదలగు వానిని ప్రకృతియే చేకూర్చెననియు అట్లు సుఖనిద్ర జెంది మేల్కొనె ననియు, "క్వభోగ మాప్నోతి న భాగ్యభాక్ జనః" అదృష్టవంతుఁడు ఎచ్చట సుఖమును పొందఁడు? ఎచ్చటనైనను సుఖమే అనుభవింపఁగలుగుననియు తాత్పర్యము.

శ్లో. అథ జాతు రురో ర్గృహీతవర్త్మా
విపినే పార్శ్వచరై రలక్ష్యమాణః
శ్రమ ఫేనముచా తపస్వి గాఢాం
తమసాం ప్రాప నదీం తురంగమేణ. 72

వ్యాఖ్య: అథ- పిమ్మట. జాతు - ఒకప్పుడు (మృగయా వ్యసనమునఁబడి రోజులు గడుపుచుండగా నొకనాడని యర్థము). రురోః - ఒకవిధమైన లేడియొక్క-

గృహీతవర్త్మా - స్వీకరింపఁబడిన మార్గముగలవాఁడై, (అది వెళ్లిన మార్గమున వెళ్ళుచున్నవాఁడై) విపినే - అరణ్యమునందు, పార్శ్వచరైః - ప్రక్కనవచ్చు సేవకులచేత, అలక్ష్యమాణః - కనఁబడనివాఁడగుచు (తురగ వేగముచేతనని యర్థము), శ్రమఫేనముచా - శ్రమచే నురుగును విడుచుచున్న, తురంగమేణ - గుఱ్ఱముతో, తపస్విగాఢాం - మునులచేత మునుకలు వేయబడుచున్న (స్నానార్థమై ప్రవేశించిన మునులు గల), తమసాం - ''తమసా''యను పేరుగల, నదీం - నదిని, ప్రాప - చేరెను. ఒక లేడి వెంటఁబడి అలసిన గుఱ్ఱముతో తమసా నదిని జేరెను. ''రురుః'' అనగా నల్ల చారల దుప్పి. ఇచ్చట 'తమసాం' అనగా తమసా నదీతీరమునని లాక్షణికార్థమును జెప్పవలెను. లేనిచో ముందు రాఁబోవు శ్లోకార్థముతో విరోధించును.

శ్లో. కుంభపూరణ భవః పటు రుచ్చై
రుచ్చచార నినదోఽంభసి తస్యాః
తత్ర స ద్విరదబృంహిత శంకీ
శబ్దపాతిన మిషుం విససర్జ 73

వ్యాఖ్య: తస్యాః - ఆ తమసా నదియొక్క, అంభసి - ఉదకమునందు, కుంభపూరణ భవః —— కుంభపూరణ - కడవను నింపుటచేత, భవః - పుట్టిన దియు, పటుః-గట్టిదియు, ఉచ్చైః - పెద్దదియునగు, వినదః - ధ్వని. ఉచ్చచార - పైకి వినవచ్చెను. తత్ర - ఆధ్వని విషయమున, సః - ఆ దశరథుఁడు, ద్విరద బృంహితశంకీసన్ - ద్విరద - ఏనుగుయొక్క, బృంహిత - ధ్వనినిగా, శంకీ సన్ - అనుమానించుచున్నవాఁడై, శబ్దపాతినం - శబ్దము ననుసరించి పడునట్టి, ఇషుం - బాణమును, విససర్జ - విడిచెను. తమసానది యొడ్డున కొంచము దూర ముగానున్న దశరథుఁడు, లక్ష్యమును చూడజాలక తన మేటివిలుకానితనమును జూపుటకై నదీజలము నుండి లేచిన శబ్దము కుంభపూరణము వలన గలిగినదని గుర్తింపక పోలికనుబట్టి గజబృంహిత మనుకొని సరిగా నచ్చటపడునట్టి శబ్దవేధి బాణమును విడిచెనని భావము. ఇది స్వాగతావృత్తము.

శ్లో. నృపతేః ప్రతిషిద్ధ మేవ తత్
కృతవాన్ పంక్తిరథో విలంఘ్య యత్

అపథే పద మర్పయంతి హి
శ్రుతవంతోఽపి రజో నిమీలితాః 74

వ్యాఖ్య: తత్ - అది (అట్లు బాణమును విడుచుట), నృపతేః- క్షత్రియునికి, ప్రతిషిద్ధమేవ - నిషిద్ధమైనదే, యత్ - ఏ యీగజవధరూపమైన కర్మము, పంక్తిరథః - దశరథుఁడు, విలంఘ్య - శాస్త్రమును ఉల్లంఘించి, కృతవాన్ - చేసెనో; శ్రుతవంతః అపి- విద్వాంసులు సైతము, రజోనిమీలితాః- రజోగుణము చేత ఆవరింపబడిన వారైనప్పుడు, అపథే - అపమార్గము నందు, పదం - అడుగును, అర్పయంతి హి - పెట్టుదురు గదా! గజవధ శాస్త్రనిషిద్ధమను సంగతిని మరచి బాణమును వేసెను. "లక్ష్మీకామో యుద్ధాదన్యత్ర కరివధం న కుర్యాత్" ఐశ్వర్య కాముఁడైన రాజు యుద్ధరంగమునందు తప్ప యితరత్ర గజమును చంపరాదని శాస్త్రము. అట్టి శాస్త్రము నుల్లంఘించి, కరిబృంహణమని గుర్తింప గలిగిన దశరథుఁడు బాణమునెట్లు ప్రయోగించెననగా, విద్వాంసులైనవారును రజోగుణదూషితులై యొకప్పుడు కానిమార్గమున అడుగుపెట్టుదురు కదా! అట్లే దశరథుఁడు రజోగుణదూషితుఁడై యీతప్పును జేసెనని భావము. వైతాలీయ వృత్తము.

శ్లో. హా తాతేతి క్రందిత మాకర్ణ్య విషణ్ణః
తస్యా న్విష్యన్ వేతస గూఢం ప్రభవం సః
శల్యప్రోతం ప్రేక్ష్య సకుంభం మునిపుత్రం
తాపా దంతఃశల్య ఇవాసీత్ క్షితిపోఽపి. 75

వ్యాఖ్య: హా తాత! ఇతి - ఓ తండ్రీ! యనెడు, క్రందితం - దుఃఖసహితమగు పిలుపును, ఆకర్ణ్య - విని, విషణ్ణః - భగ్నోత్సాహుఁడగుచు, తస్య - ఆ యాక్రందనమునకు, వేతసగూఢం - ప్రబ్బలిచెట్లచేత దాగియున్న, ప్రభవం - కారణమును, అన్విష్యన్ - వెదకుచున్న వాడగుచు, శల్యప్రోతం - బాణముచేత గ్రుచ్చబడిన వాడును, సకుంభం - కడవను పట్టుకొని యున్నవాడును నగు, మునిపుత్రం - మునికుమారుని, ప్రేక్ష్య - చూచి, సః క్షితిపః అపి - ఆ దశరథుఁడు గూడ, తాపాత్ - దుఃఖమువలన, అంతః శల్యఇవ - హృదయమునందు గ్రుచ్చుకొన్న శల్యము గలవాఁడువలె, ఆసీత్ - అయ్యెను. తాను బాణము విడిచిన

వెంటనే "హా తాత!" అను ఆక్రందనము వినవచ్చుటచేత, ప్రబ్బలి పొదచాటు నుండి వచ్చిన యీ యబపునకు కారణమును వెదుకఁబోవుచు, అచ్చట బాణ విద్ధుడై జలకుంభమును పట్టుకొనియున్న యొక మునికుమారునిఁ జూచి దశరథుఁడు దుఃఖితుఁడై తన గుండెలో బాణము గ్రుచ్చుకొన్న వానివలె బాధపడెనని భావము. "శల్యం శంకౌ శరే వంశే" అని విశ్వనిఘంటువు. ఇది మయూర వృత్తము.

శ్లో. తేనావతీర్య తురగాత్ ప్రథితాన్వయేన
పృష్టాన్వయః స జలకుంభ నిషణ్ణ దేహః
తస్మై ద్విజేతర తపస్విసుతం స్ఖలద్భి
రాత్మాన మక్షరపదైః కథయాంబభూవ. 76

వ్యాఖ్య: ప్రథితాన్వయేన - ప్రసిద్ధమైన వంశముగల (దీనివలన పాప భీరుత్వము సూచింపబడుచున్నది), తేన - ఆ దశరథునిచేత, తురగాత్ - గుఱ్ఱము పైనుండి, అవతీర్య - దిగి, పృష్టాన్వయః - అడుగబడిన కులము గలవాఁడును, జలకుంభ నిషణ్ణదేహః - నీటికడవమీద పడిపోయిన శరీరము గలవాఁడును నగు, సః - ఆ మునికుమారుఁడు, తస్మై - ఆ దశరథుని కొఱకు, స్ఖలద్భిః - తొట్రు పడుచున్న, అక్షరపదైః - అక్షర ప్రాయములైన పదములచేత, ఆత్మానం - తనను, ద్విజేతర తపస్విసుతం—ద్విజేతర - ద్విజుడు కానియట్టి, తపస్విసుతం - మునికుమారునిగా, కథయాంబభూవ - చెప్పెను. బ్రహ్మహత్య జరిగెనా? యేమి యని భయపడుచు గుఱ్ఱముమీదినుండి దిగిన దశరథుఁడు ముందుగా "నీ కులమేది" యని యడుగగా నీటికడవ యాధారముగా నిల్చుకొనిన దేహముగల యీ బాలుఁడు తొట్రుపడుచున్న యక్షరములుగల పదములతో శక్తిలేక ఒక్కొక్క పదమునం దొకటి రెం డక్షరములుగా పలుకుచు, నేను ద్విజేతరకులము వాఁడనని చెప్పెను. బ్రహ్మ క్షత్రియ వైశ్య జాతులకు భిన్నమైన కులమున బుట్టిన ముని కుమారుఁడ నని చెప్పెనని భావము. ఇచ్చట రామాయణము, "బ్రహ్మహత్యాకృతం పాపం హృదయా దపనీయతాం। న ద్విజాతి రహం రాజన్ మా భూత్తే మనసోవ్యథా। శూద్రాయా మస్మి వైశ్యేన జాతో జనపదాధిప!" అని చెప్పినది. రాజా! బ్రహ్మ హత్య చేసితినని బాధపడకుము. నేను ద్విజాతివాఁడను కాను, వైశ్యునికి శూద్ర స్త్రీ యందుఁ బుట్టిన వాఁడనని రామాయణార్థము.

శ్లో. తచ్చోదితశ్చ త మనుద్ధతశల్య మేవ
పిత్రోః సకాశ మవసన్నదృశో ర్నినాయ
తాభ్యాం తథాగత ముపేత్య త మేకపుత్ర
మజ్ఞానతః స్వచరితం నృపతిః శశంస. 77

వ్యాఖ్య: తచ్చోదితః - ఆ ముని కుమారునిచేత కోరఁబడిన వాఁడై, నృపతిః - దశరథుఁడు, అనుద్ధత శల్యమేవ - ఊడదీయబడని బాణముగల వానిని గానే, తం - అతనిని, అవసన్న దృశోః - నశించిపోయిన కన్నులుగల (గ్రుడ్డి వారైన), పిత్రోః - తల్లి దండ్రులయొక్క, సకాశం - సమీపమును, వినాయ - చేర్చెను, తథాగతం - ఆ విధముగా ప్రబ్బలి పొదమాటున నున్నట్టి, ఏకపుత్రం - ఒకే కుమారుఁడైయున్న, తం - ఆ మునికుమారుని, ఉపేత్య - సమీపమునకుఁ జేరి, అజ్ఞానతః - మనుష్యు డని తెలియక పోయనందువలన (ఏనుగను భ్రాంతి చేత) జరిగిన, స్వచరితం - తాను చేసినపనిని, తాభ్యాం - ఆ తల్లిదండ్రులకు, శశంస - చెప్పెను. ఆ మునికుమారుఁడు మా తల్లి దండ్రులవద్దికిఁ నన్నుజేర్పు మని కోరగా దశరథుఁడు నాటుకొన్న బాణముతో గూడ నతనిని గ్రుడ్డివారైన తల్లి దండ్రుల వద్దికిఁ గొనిపోయి, "ఏకైక పుత్రుఁడైన మీ కుమారుఁడు తమసా నదిలో ప్రబ్బలి పొదచాటున కడవను నింపుకొనుచుండగా వచ్చిన శబ్దమును కరి బృంహితమనుకొని పొరపాటున బాణము వేసితిని, ఇప్పుడు మీ సమీపమున జేర్చి తిని" అని తాను చేసిన అకృత్యమును దుఃఖితుఁడై దశరథుఁడు వారికి విన్నవిం చెను. "పిత్రోః - మాతాచ పితాచ పితరౌ, తయోః పిత్రోః" అని విగ్రహము. "పితామాత్రా" అను సూత్రముచేత నేర్పడిన ఏక శేష సమాసము. వాల్మీకి రామా యణమునందు దశరథుఁడు చనిపోయిన మునికుమారునివద్ది కతని తల్లిదండ్రు లను తానే తీసికొనివచ్చి, అంధులయిన వారి చేతులతో మృతుఁడైన కుమారుని స్పృశింపఁ జేసినట్లున్నది. "అథాహ మేక స్తం దేశం నీత్వా తౌ భృశ దుఃఖితౌ, అస్పర్శయ మహం పుత్రం తం మునిం సహభార్యయా". దశరథుఁ డంధ దంప తుల వద్దికి తానుమాత్రము వెళ్లి, వారి కుమారుఁడు చనిపోయినట్లు తెలిపి, వారిని తీసికొని వచ్చి, కుమారుని మృత కళేబరమును స్పృశింపఁ జేయునట్టి విలంబము మొదలయినవి సత్యేతిహాసమగు రామాయణమునకుఁ జెల్లునుగాని, రసైక ప్రధాన మైన కావ్యమునకుఁ జెల్లవను భావముతోను, దశరథుని దయావంతునిగాఁ

జిత్రించు తలంపుతోను, కాళిదాసు ఇట్లు మార్చి, సజీవుఁడై, బాణవిద్ధుఁడై యున్న యేకైక పుత్రుని నతని యంధ పితరుల వద్దికి తానే, వెంటనే తీసుకొనిపోయినట్లు వర్ణించెను.

శ్లో. తౌ దంపతీ బహువిలప్య శిశోః ప్రహర్త్రా
శల్యం నిఖాత ముదహారయతా మురస్తః
సోఽభూత్ పరాసు రథ భూమిపతిం శశాప
హస్తార్పితై ర్నయనవారిభి రేవ వృద్ధః. 78

వ్యాఖ్య : తౌ దంపతీ - ఆ వృద్ధదంపతులు, బహు - అనేక విధములుగా, విలప్య - శోకించి, శిశోః - బాలునియొక్క, ఉరస్తః - వక్షస్థలమునుండి, నిఖాతం, శల్యం - నాటబడియున్న బాణమును, ప్రహర్త్రా - దానిని వేసిన దశరథునిచేతనే, ఉదహారయతాం - పైకి లాగించిరి (ఫలితముగా), సః - ఆ బాలుఁడు, పరాసుః - గత ప్రాణుఁడు, అభూత్ - అయ్యెను (చనిపోయెను), అథ - తరువాత, వృద్ధః-ఆ వృద్ధుఁడు, హస్తార్పితైః-తన చేతుల యందుంచుకొన బడిన, నయన వారిభిః ఏవ - కన్నీళ్ల చేతనే, భూమిపతిం - రాజును, శశాప - శపించెను. దశరథునిచే తమ ముందుంచబడిన బాలుని స్పృశించుచు ఆ వృద్ధ దంపతులు పెక్కు విధముల శోకించి, బాలుని యెదపై నాటుకొన్న బాణమును దానిని వేసిన రాజుచేతనే పైకి లాగించిరి. తత్ఫలితముగా బాలుఁడు మరణించెను. క్రుద్ధుఁడైన అంధ వృద్ధుఁడు తన దోసిలినిండిన కన్నీళ్లతో దశరథుని శపించెను. శాపమును జల పూర్వకముగా నిచ్చుట పరిపాటి కనుక ఇచ్చట శోకజల మాపని కుపయోగించెను.

శ్లో. దిష్టాంత మాప్స్యతి భవానపి పుత్రశోకా
దంత్యే వయస్యహ మివేతి త ముక్తవంతమ్
ఆక్రాంతపూర్వ మివ ముక్తవిషం భుజంగం
ప్రోవాచ కోసలపతిః ప్రథమాపరాద్ధః. 79

వ్యాఖ్య : హే రాజన్ - ఓ రాజా ! భవానపి (భవాన్ + అపి) - నీవు కూడ, అంత్యే, వయసి - చివరి వయస్సునందు (వృద్ధత్వమునందు) అహమివ -

నేనువలెనే, పుత్రశోకాత్ - పుత్రదుఃఖమువలన, దిష్టాంతం - కాలావసానమును (మరణమును), అప్స్యతి - పొందగలవు, ఇతి - ఇట్లని, ఉక్తవంతం - పలికిన వాడును, ఆక్రాంతపూర్వం - మొదట కాలిచేత త్రొక్కబడినదియై, ముక్తవిషం - తరువాత విషమును వదలిపెట్టిన, భుజంగం ఇవ - సర్పమువలె నున్న, తం - ఆ వృద్ధుని గుఱించి, ప్రథమాపరాద్ధః - మొదట తప్పుచేసినట్టి, కోసలపతిః - దశరథుఁడు, ప్రోవాచ - పలికెను. 'రాజా! నీవుగూడ నా వలెనే వార్ధక్యమునందు పుత్రశోకముచేత మరణింతువుగాక' అని శాపముపెట్టిన మునిని, మొదట కాలిచేత త్రొక్కబడి, కోపముతో కాటువేసిన సర్పముతో సమానముగా భావించి, మొదటి తప్పు తనది కనుక శాపమును వహించి, దశరథుఁడా మునితో నిట్లు పలికెనని భావము.

శ్లో. శాపోఽ ప్యదృష్ట తనయానన పద్మశోభే
సానుగ్రహో భగవతా మయి పాతితోఽయమ్
కృష్యాం దహన్నపి ఖలు క్షితి మింధనేద్ధో
బీజప్రరోహ జననీం జ్వలనః కరోతి. 80

వ్యాఖ్య: అదృష్ట తనయానన పద్మశోభే—అదృష్ట - చూడబడని తనయ - కుమారుని యొక్క, ఆనన పద్మ శోభే - ముఖకమల కాంతి గల (అపుత్రకుఁడనైన), మయి - నా యందు, భగవతా - షడ్గుణైశ్వర్య సంపన్నుఁడవైన నీచేత, పాతితః - పడవేయఁ బడిన, శాపోఽపి (శాపః + అపి) - శాపముసైతము, సానుగ్రహః - అనుగ్రహముతోఁ గూడినట్టిదే; ఇంధనేద్ధః - కట్టెలచేత ప్రజ్వలించిన, జ్వలనః - అగ్ని, కృష్యాం - దున్నుటకు దగిన, క్షితిం - భూమిని, దహన్, అపి - కాల్చుచున్న దగుచునే, బీజప్రరోహజననీం - బీజాంకురములయొక్క ఉత్పాదన శక్తికల దానినిగా, కరోతి - చేయుచున్నది. కట్టెలచేత బాగా మండిన అగ్ని, దున్ని విత్తనములు వేయదగిన భూమికి అంకురోత్పాదన శక్తి నిచ్చినట్లు, క్రుద్ధుఁడవైన నీవు నాపైఁ బడవేసిన పిడుగువంటి శాపము "పుత్రశోకముచేత మరణింపుము" అనునది, పుత్రుని మొగమునే యెఱుఁగని అపుత్రకుఁడనైన నాకు పుత్రోత్పత్తిని గలిగించునట్టి ఫలముగలది యగుటచేత అనుగ్రహపూర్వక మైనదిగానే యున్నదని దశరథుఁడు వృద్ధమునితో పలికెను.

శ్లో. ఇత్థంగతే గతఘృణః కిమయం విధత్తాం
వధ్య స్తవేత్యభిహితో వసుధాధిపేన
ఏధాన్ హుతాశనవతః సముని ర్యయాచే
పుత్రం పరాసు మనుగంతుమనాః సదారః. 81

వ్యాఖ్య: ఇత్థం, గతే - ఇట్లు జరిగినదికాగా, వసుధాధిపేన - దశరథుని చేత, "గతఘృణః - కరుణాహీనుఁడైన వాడును, తవ - నీకు, వధ్యః - వధార్హుఁడునగు, అయం - ఈ జనుఁడు, కిం విధత్తాం - ఏమి చేయవలయును", ఇతి - అని, అభిహితః - అడుగబడిన, సః, మునిః - ఆ ముని, సదారః - భార్యా సహితుఁడై, పరాసుం, పుత్రం - చనిపోయిన పుత్రుని, అనుగంతుమనాః సన్ - అనుసరించి వెళ్లవలెనను మనస్సు గలవాడగుచు, హుతాశనవతః - అగ్నితో కూడిన, ఏధాన్ - కాష్ఠములను, యయాచే - కోరెను. ఇట్టి అకృత్యము జరిగిపోగా దశరథుఁడు నిర్వేదముతో తనమీద తనకే అసహ్యము కలిగి, ఆ మునిని "నిష్కారుణుఁడై, నీకు వధార్హుఁడైన యీ జనుఁడు ఏమి చేయవలెనో ఆజ్ఞాపింపుము" అని యడిగెను. ఆ వృద్ధముని భార్యా సహితుఁడై కుమారునివెంట అనుమరణము చేయఁ దలచిన వాఁడై మా అందఱికిని సరిపడునట్టి అగ్నిసంస్కారము గల కాష్ఠములను దెచ్చి చితిని గావింపుమని దశరథునిఁ గోరెను. ఇట్టి అనుమరణమువలన ఆత్మఘాత దోషము గలుగదని ధర్మశాస్త్రము: "అనుష్ఠానాసమర్థస్య వానప్రస్థస్య జీర్యతః। భృగ్వగ్ని జలసంపాతై ర్మరణం ప్రవిధీయతే" అని. స్నాన సంధ్యా ద్యనుష్ఠానములు చేసుకొనుటకు శక్తిలేక, నానాటికిని కృశించి పోవుచున్న వానప్రస్థునికి భృగుపాత, అగ్నిపాత, జలపాతములచేత మరణము విధింపఁబడుచున్నది. కనుక అంధులై, వృద్ధులై, అపుత్రకులై యున్న ఆ దంపతులు కాష్ఠాగ్ని ప్రవేశముతో పుత్రానుమరణము చేయుట అధర్మముకాదు, వారికి ఆత్మహత్యాదోషము లేదని భావము.

శ్లో. ప్రాప్తానుగః సపది శాసన మస్య రాజా
సంపాద్య పాతకవిలుప్తధృతి ర్నివృత్తః
అంతర్నివిష్టపద మాత్మవినాశహేతుం
శాపం దధత్ జ్వలన మౌర్వ మివాంబురాశిః. 82

వ్యాఖ్య: ప్రాప్తానుగః - తనవద్దికిఁ జేరిన యనుచరులుగల, రాజా - దశరథుఁడు, సద్యః - తక్షణమే. అస్య - ఆ మునియొక్క, శాసనం - కాష్ఠములతో, చితిని పేర్చుమని చెప్పిన యాజ్ఞను (మొదట నొక్కఁడే యున్నను ఇప్పుడనుచరులందఱును జేరుటచేత), సంపాద్య - పూర్తిచేసి, పాతకవిలుప్తధృతిః— పాతక - పాపముచేత, విలుప్త - లోపించిన, ధృతిః - ధైర్యము గలవాఁడగుచు, అంతర్నివిష్టపదం - తనలో నుంచఁబడిన పాదముగలదియు, ఆత్మ వినాశహేతుం - తన వినాశమునకు కారణమైనదియు నగు, శాపం - శాపమును, అంబురాశిః - సముద్రము, ఔర్వం, జ్వలనం ఇవ - బడబాగ్నినివలె, దధత్ - ధరించుచున్న వాఁడగుచు, నివృత్తః - వనమునుండి గృహమునకు మరలిన వాఁడయ్యెను. దశరథుఁడట్లు వృద్ధమునితో సంభాషించుచుండగా రాజ సేవకులందఱును అచ్చటికి చేరుటచేత, ముని కోరిన చితిని సులభముగాఁ బేర్చి ఆ ముగ్గురికిని దహన సంస్కారమును గావించి, ముని బాలక వధ రూపమైన పాతకముచేత ధైర్యమును గోలుపోయిన వాఁడగుచును, తనలో ప్రవేశించి తన వినాశమునకు కారణమైన శాపమును సముద్రుఁడు తనలో బడబాగ్నిని దాచుకొన్నట్లు ధరించుచును, నిరుత్సాహవంతుఁడై యరణ్యమునుండి అయోధ్యానగరమునకు వెళ్లిపోయెనని భావము. పాతకము (పాపము) మానసిక సంస్కార రూపము కనుక మనస్సు నందున్న ధైర్యమును ప్రక్కకుద్రోసి తా నచ్చట కాలూనెనని యర్థము. శాపముగూడ జీవమునకు, మనస్సునకును అంటుకొనునట్టి సంస్కారమే కనుక ఆ రెండింటిని ధరించి, తన్మూలముగా నుత్సాహమును గోలుపోయి దశరథుఁడు వనమునుండి యింటికి పోయెనని సమన్వయము.

ఇది మహాకవి కాళిదాసకృత రఘువంశ మహాకావ్యమున

నవమ సర్గకు తెలుఁగు లఘువ్యాఖ్య.

మొదటి భాగము

సంపూర్ణము



# తప్పొప్పుల పట్టిక

| పుట | శ్లోకం/పంక్తి | ఉన్నది | ఉండవలసినది |
|---|---|---|---|
| 1 | 3వ పంక్తి | పాపన | పావన |
| 35 | శ్లో. 84 | వవృధా | వభృధా |
| ,, | 15 పంక్తి | అవభృథాత్ | అవభృథాత్ అపి- |
| 54 | శ్లో. 29 | కేసరిణాం | కేసరిణం |
| 60 | 5వ పంక్తి | అశక్యరక్ష్యం- | అశక్యరక్షం- |
| 74 | శ్లో. 68 | ప్రసన్నేందు మఖః | ప్రసన్నేందుముఖః |
| 77 | శ్లో 74 | మాపసంజ | మాససంజ |
| 89 | ,, 19 | పద్మని | సద్మని |
| 98 | శ్లో. 36 | అగచ్ఛదంశే | అగచ్ఛదంశేన |
| 101 | ,, 41 | జవేన | జలేన |
| 104 | ,, 46 | మహాగ్రతో రముం | మహాక్రతోరముం |
| 106 | పంక్తి 20 | బోలియున్న | బోలియున్న |
| 111 | ,, 23 | పత్రిణాం | పత్రిణా |
| 113 | శ్లో 62 | శస్త్రవ్యపహార | శస్త్రవ్యవహార |
| ,, | పంక్తి 20 | అసంగతం | అసంగం |
| 134 | పంక్తి 5 | నేతా | నేతా, సః |
| ,, | శ్లో 38 | స తీర్త్వా | స తీర్త్వా |
| 140 | ,, 52 | ప్రవస్తాంశుక | ప్రస్తాంశుక |
| 150 | ,, 75 | అసన్నోష | ఆసన్నోష |
| 151 | ,, 77 | క్షేసణీయాశ్మ | క్షేపణీయాశ్మ |
| 154 | ,, 84 | రత్నపుష్పోప | రత్నపుష్పోప |
| 167 | ,, 16 | వృద్దేః | వృద్ధేః |
| 169 | ,, 20 | పురసాత్ | పురస్తాత్ |
| 179 | ,, 37 | స్మాత్ | స్యాత్ |
| 182 | ,, 42 | శీకరార్ద్రైః | శీకరార్ద్రైః |
| 193 | ,, 61 | చంద్ర | చంద్రం |

| పుట | శ్లోకం/పంక్తి | | ఉన్నది | ఉండవలసినది |
|---|---|---|---|---|
| 199 | శ్లో | 70 | నిశ్దాత | నిర్ధాత |
| ,, | ,, | ,, | పరభాగతయ | పరభాగతయా |
| 203 | ,, | 75 | ముజ్ఞాం | ముఃజ్ఞాం |
| 220 | ,, | 29 | స్తతీయా | స్తృతీయా |
| 223 | ,, | 34 | స్రదోషాన్ | ప్రదోషాన్ |
| 225 | పంక్తి | 11 | యనూనరాజు | యనూపరాజు |
| 234 | శ్లో | 55 | బందీకృలానా | బందీకృతానా |
| 236 | ,, | 58 | దసావర్తత | దపావర్తత |
| 237 | ,, | 61 | సౌస్నాలికో | సౌస్నాతికో |
| 248 | ,, | 81 | శాలీతయా | శాలీనతయా |
| 256 | ,, | 8 | పన్నికర్షం | సన్నికర్షం |
| ,, | ,, | 9 | రవ్యా | రన్యా |
| 272 | ,, | 38 | విఖావ్య | విభావ్య |
| 274 | ,, | 42 | రుధిరప్రవాహాః | రుధిరప్రవాహః |
| 287 | ,, | 67 | వశ్యానుమతా | పశ్యానుమతా |
| ,, | ,, | 68 | ప్రతిద్వంది | ప్రతిద్వంద్వి |
| 288 | పంక్తి | 1 | ,, | ,, |
| 297 | శ్లో | 14 | సమపాస్యత | సముపాస్యత |
| 299 | ,, | 17 | యుయజే | యుయుజే |
| 300 | ,, | 19 | పంచశరీ | పంచశరీర |
| 309 | ,, | 36 | విభూలి | విభూతి |
| 328 | ,, | 72 | సస్థితః | సంస్థితః |
| 329 | ,, | 74 | వరివాహ | పరివాహ |
| 333 | ,, | 83 | మపస్థితా | ముపస్థితా |
| 334 | ,, | 84 | మావిష్కృత | మావిష్కృత |
| 356 | ,, | 24 | మధురంజీత | మధు రంచిత |
| 379 | ,, | 64 | క్షోభయామాప | క్షోభయామాస |
| 383 | ,, | 72 | తపిస్విగాఢాం | తపస్విగాఢాం |

మహాకవి కాళిదాసకృత

# రఘువంశము

## రెండవ భాగము

తెలుగు లఘువ్యాఖ్యాసహితము
పదినుండి పందొమ్మిది సర్గలు

వ్యాఖ్యాత

**కేశవపంతుల నరసింహశాస్త్రి**

విద్వాన్, శిరోమణి, ఆకాశవాణి సంస్కృత
పరిచయ కార్యకర్త




ప్రచురణ

ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడమి
కళాభవన్, సైఫాబాదు,
హైదరాబాదు-500004

RAGHU VAMSHAM- Vol II (10th to 19 Sargas) A Sanskrit classic by Kalidasa with Telugu Commentary by Sri Keshvapanthula Narasimha Sastry, Retired Programme Executive, All India Radio, Hyderabad.

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి
హైదరాబాదు - 500 004

ప్రచురణ : 337

ప్రథమ ముద్రణ : 1982

ప్రతులు : 2,000

వెల : రూ. 8-00

ప్రతులకు :

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి,
కళాభవన్, సైఫాబాద్,
హైదరాబాదు - 500 004

ముద్రణ :

లక్ష్మీశైలజ ప్రింటింగ్ ప్రెస్, సోమాజిగూడ, హైదరాబాద్-500 482

Paper used for the Printing of this book was made available by the Government of India at concessional rate.

# తొలి పలుకు

ఆంధ్రభాషా సాహిత్యాల్లో సమగ్రమైన అభినివేశం సంపాదించుకోవలసినవారు సంస్కృత భాషతో కొంతైనా పరిచయం చేసుకోవలసిన అగత్యం ఉంటుంది. ఆంధ్రభాషలోని పదజాలం వ్యాకరణం సాహిత్యప్రక్రియా సంపద సంస్కృతంతో ముడివడి వున్నది. సాహిత్య అకాదమి ప్రచురణ కార్యక్రమంలో సంస్కృతానికి సముచితమైన స్థానాన్ని కల్పించి పండితులకూ, పరిశోధకులకూ, విద్యార్థులకూ ఉపయోగపడే విధంగా సంస్కృత గ్రంథప్రచురణ కొనసాగిస్తున్నది. కేవల సంస్కృగ్రంథాలేగాక సరళమైన తెలుగు వ్యాఖ్యానాలతో కొన్ని గ్రంథాలను అందించగలిగింది.

సంస్కృతగ్రంథప్రచురణాప్రణాళికను అనుసరించి 1979లో కాళిదాసు రచించిన రఘువంశాన్ని తెలుగు వ్యాఖ్యతో ప్రచురించింది. అయితే అది మొదటి 9 సర్గలున్న సంపుటం. ఇప్పుడు మిగిలిన 10 సర్గలతో ఈ రెండవ సంపుటాన్ని రసజ్ఞులైన పాఠకులకు అందిస్తున్నాము.

సంస్కృతాంధ్ర సాహిత్యాలలో గరీయః ప్రతిభులైన శ్రీ కేశవపంతుల నరసింహశాస్త్రి, ఈ రఘువంశ మహాకావ్యానికి చక్కని తెలుగు వ్యాఖ్య సమకూర్చినారు. ప్రత్యేకించి ఈ రెండవ సంపుటంలో కొన్ని విశేషాలను గూడచేర్చి వ్యాఖ్యానం చేసినారు. వ్యాఖ్యాన రచనలోనూ ప్రచురణలోనూ అకాడమీతో సహకరించిన శ్రీ కేశవపంతుల నరసింహశాస్త్రిగారికి కృతజ్ఞతాభివందనాలు సమర్పించుకుంటున్నాను.

హైదరాబాదు
7–8–1982

ఇరివెంటి కృష్ణమూర్తి
కార్యదర్శి

# విజ్ఞప్తి

మహాకవి కాళిదాసు కవికులగురువు, భారతదేశ సంస్కృతిని ప్రపంచమున కెత్తిచూపఁగలిగిన కీర్తిధ్వజము. ఆయన రచనలు మధురాతిమధురములై విశ్వవిఖ్యాతి నార్జించిన విషయము జగద్విదితము. వానిలో రఘువంశ మహాకావ్యము రసభరితమై మానవాళికి మహోపదేశమును జేయునట్టిదగుటచేత సంస్కృతభాషాధ్యయనము చేయువారికి ప్రప్రథమ పాఠ్యముగా తరతరముల నుండి విలసిల్లుచున్నది. దీనిని 'తెలుగు'లోనికి పద్యకావ్యముగా ననువదించిన వారును, మొదటి అయిదు సర్గలకు మాత్రము పదవిభాగ, అన్వయక్రమ, అర్థ, తాత్పర్య, సమాసవిగ్రహ, ఆకాంక్షాది విశేషములతో వ్యాఖ్యానమును రచించిన వారును, కొందఱు విద్యార్థుల కవసరమని తోచిన సర్గలకు మాత్రము ప్రతిపదార్థ తాత్పర్యాదులను రచించినవారును గలరు. కాని ఆ రచనలలో కొన్ని అలభ్యములును, కొన్ని అసమగ్రములునుగానున్నవి. రఘువంశకావ్యమహత్త్వమును, అందు కాళిదాసు నిక్షిప్తముగావించిన యుపదేశాదులను, అందలి రసవిశేషములను దెలిసికొనఁదలచిన రసజ్ఞులకును, ఆధునిక విద్యావంతులకును, పూర్వరచనలంతగా నుపయోగపడుట లేదనియు, సమగ్రమైన కావ్యార్థము తెలియుటలేదనియు ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడమీవారు గుర్తించి యీవిధమైన రచనతో రఘువంశమహాకావ్యమును ప్రకటించి లోకమునకందఁజేయఁ దలపెట్టుట హర్షింపఁదగిన సత్కార్యము.

ఆధునిక విద్యావంతులు రఘువంశకావ్యమునందలి భావసౌందర్యమును తమంతటతాము ఊహించి ఆనందింపగల్గుటకు శ్లోకములయందలి ప్రతిపదమునకును అర్థము తెలియవలయును. సముదాయవాక్యమునకుఁ దాత్పర్యము బోధ

పడవలయును. మహాకవి కావ్యముద్వారా లోకమున కుపదేశింపఁదలఁచిన సందేశ మర్థముకావలయును. అందులకై రఘువంశమునందలి పందొమ్మిది సర్గలకును ప్రతిపదార్థ తాత్పర్య విశేషార్థములతో లఘువ్యాఖ్యను తెనుగున రచించుటకు నన్ను అకాడమీ ఆదేశించినది. ఒక సంపుటముతో నీ గ్రంథము పూర్తికానందున రెండవ సంపుటముతో పూర్తిచేయఁబడినది. ఒకేయొక సంపుటమై యుండినచో చదువరులకు సులభముగానుండి యుండును గాని యది సాధ్యపడలేదు.

ఈ లఘువ్యాఖ్యారచనయందు సంస్కృతశబ్ద స్వరూపములు బోధపడుటకై శ్లోకములందును, అర్థములు వ్రాయునప్పుడును విసంధులు పాటింపఁబడినవి. అర్థములు వ్రాయుటలో తాత్పర్యము సుబోధముగా నుండుటకై రెండు మూడు సంస్కృతపదముల కొకచోటనే తెలుఁగర్థములు వ్రాయుటయు, దీర్ఘ సమాసములందు ప్రతి పదమును విడదీసి కొన్నిచోట్లను, విడదీయకయే సముదాయమునకు కొన్ని చోట్లను అర్థములు వ్రాయుట జరిగినది. ప్రతిశ్లోకమునకును ప్రతిపదార్థము ముగిసినవెంటనే క్లుప్తముగా తాత్పర్యమువ్రాసి, విపులముగా కవితామర్మముల నెఱుఁగు బాధ్యత చదువరులగు రసజ్ఞులకే, గ్రంథవిస్తరభీతిచే, వదలిపెట్టఁబడినది. విశేషములు, శబ్దవ్యుత్పత్తులు, ధాతుస్వరూపములు, అచ్చటచ్చటఁ జేర్పబడినవి. ఇంతమాత్రముగానే యీ లఘువ్యాఖ్యను రచించుటకుఁ గారణము చదువరులకు శాస్త్రసంబంధముగా మిక్కిలి శ్రమ గలుగరాదను భావనయే.

గురుముఖమున సర్వవిశేషములతో సంస్కృతకావ్యపాఠమును జదువుకొనువారికిని, విశేషజ్ఞులయిన విద్వాంసులకును, ఆకాంక్షా శబ్దస్వరూపాది శాస్త్ర విషయముల నెఱుఁగదలచిన విద్యార్థులకును, ఇంకనువిపులముగా వ్రాసియుండినచో బాగుండునే! యనిపించవచ్చును. కాని యట్టిపని పూర్వులు కొందఱు చేయబూని కావ్యము నసమగ్రముగా లోకమున కందించిరి. కావున అకాడమీవారి యుద్దేశము ననుసరించి రచించిన యీ లఘువ్యాఖ్యను విలకించి నన్ను కృతకృత్యునిఁగా భావించుట కందఱినిఁ గోరుచున్నాను.

"లఘుమల్లినాథీయ" మని పేర్కొనఁదగిన ఈ తెలుఁగు లఘువ్యాఖ్యను కాళిదాసు రఘువంశమహాకావ్యమునకు రచించు భాగ్యమును నాకు గల్గించిన ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీవారికి నేను సర్వదా కృతజ్ఞుఁడనై యున్నాను.

మొదటి తొమ్మిది సర్గలుగల ప్రథమసంపుటము 1979 జనవరి మాస మున రసజ్ఞులముందుంచుట జరిగినది. ఇప్పుడు పదినుండి పందొమ్మిదవ సర్గ వరకు గల ఈ ద్వితీయసంపుటమును మీకరకమలములం దుంచుచున్నాము. ఇంతటితో మహాకవి కాళిదాసు రచించిన రఘువంశకావ్యము పూర్తియైనది. ఒక్కొక్క నాయకుని వర్ణించునప్పు డొక్కొక్క రసమునకు ప్రాధాన్యము నిచ్చి, ఒక్కొక్క మహోపదేశమును లోకమునకందించి, రఘువంశపురాజులకు ప్రజాపాలన వర్ణాశ్రమరక్షణ దేశసంక్షేమములే తమ జీవిత లక్ష్యములై యుండె ననియు,ప్రజాపాలకు లామా మున నడచుట యుక్తమనియు కాళిదాసు సందేశమై యున్నట్లు ఈ కావ్యము షించుచున్నది. సహృదయు లావిశేషములను గ్రహింపఁగలరని భావించు న్నాను.

ఓం తత్సత్.

26/3RT, విద్వద్విధేయుఁడు

విజయనగర్ కాలనీ లేదా జర్కాత్పుర, హైదరాబాదు. కేశవపంతుల నరసింహశాస్త్రి.

# విషయసూచిక

శ్రీః

మహాకవి కాళిదాస కృత

# రఘువంశము
## దశమసర్గము

శ్లో. పృథివీం శాసత స్తస్య పాకశాసన తేజసః
కించి దూన మనూనర్ధేః శరదా మయుతం యయౌ. 1

వ్యాఖ్య: పృథివీం-భూమిని, శాసతః-పాలించుచున్నవాడును, పాకశాసన తేజసః-ఇంద్రుని పరాక్రమమువంటి పరాక్రమము గలవాడును, అనూనర్ధేః (అనూన+ఋద్ధేః)-అనల్పమైన సంపదగల, తస్య-ఆ దశరథునికి, కించిదూనం (కించిత్ + ఊనం)-కొంచెము తక్కువయైన, శరదాం-సంవత్సరములయొక్క, అయుతం-సహస్రము, యయౌ-గడచిపోయెను.

దేవేంద్రునికిగల వైభవములతో సమానమగు సకలవైభవములతోను, సర్వసంపదల సమృద్ధితోను, రాజ్యపాలనము చేయుచున్న దశరథ మహారాజునకు, మునిశాపానంతరము, తనకు తెలియకయే ఇంచుమించుగా వేయిసంవత్సరముల కాలము గడచిపోయె నని భావము. "స్యాదృతౌవత్సరేశరత్" అను అమరనిఘంటు వాక్యమువలన "శరత్" అనుపదమునకు ఋతువు,సంవత్సరము రెండును అర్థములే. "ష ర్వర్షసహస్రాణి జాతస్య మమ కౌశిక!" అను రామాయణవచనమువలన దశరథుడు అరువదివేలయేండ్లకు పైన జీవించియుండెనని తెలియుచున్నది.

శ్లో. న చోపలేభే పూర్వేషాం ఋణ నిర్మోక్ష సాధనమ్.
సుతాభిధానం స జ్యోతిః సద్యః శోకతమోఽపహమ్. 2

వ్యాఖ్య: సః-ఆదశరథుడు, పూర్వేషాం-తనకు పూర్వులగు పితృదేవతల యొక్క, ఋణ నిర్మోక్ష సాధనం-ఋణవిముక్తికికారణ మైనదియు, సద్యః-పుట్టిన వెంటనే, శోకతమోఽపహం-దుఃఖమనెడు చీకటిని తొలగించునట్టిదియు, సుతాభి

ధానం-కుమారుఁడు అనుపేరుగల, జ్యోతిః-వెలుగును, నచోపలేభే (న+చ+ఉపలేభే)-పొందనుగూడలేదు. పుత్రసంతానము లేనివారికి పితౄణము తీరక పోవుటయేకాక "పుత్" అనునరకము వచ్చును. "ఏషవా అనృణోయఃపుత్రీ" అని వేదము చెప్పుచున్నది. కనుక "పున్నామ్నోనరకాత్ త్రాయతఇతిపుత్రః" అని పుత్రశబ్దవ్యుత్పత్తి. దశరథుని కెన్నిసంపదలున్నను, ఎంత యింద్రవైభవ మున్నను, పితౄణమోక్షమునొసగి, శోకాంధకారమును దొలగించు జ్యోతివంటి పుత్రుఁడంత వరకు కలుగలేదని భావము. "గృహరత్నంచబాలకః" అన్నసామె తగా పుత్రుఁడు లేని జీవితము అంధకారమనియు, పుట్టగానే ఆయంధకారమును తొలగింపగల జ్యోతి పుత్రుఁడేయనియు సారాంశము. అలంకారము: రూపకము.

శ్లో. అతిష్ఠత్ ప్రత్యయాపేక్ష సంతతిః స చిరం నృపః
ప్రాఙ్మంథా దనభివ్యక్త రత్నోత్పత్తి రివార్ణవః 3

వ్యాఖ్య : ప్రత్యయాపేక్షసంతతిః-ప్రత్యయ-ఒకానొకకారణమును, అపేక్ష-కోరునట్టి, సంతతిః-సంతానముగల, సఃనృపః-ఆదశరథమహారాజు, మంథాత్ ప్రాక్-మథించుటకుముందు, అనభివ్యక్త రత్నోత్పత్తిః-బయటపడని శ్రేష్ఠవస్తువుయొక్క పుట్టుకగల, అర్ణవఃఇవ-సముద్రమువలె, చిరం అతిష్ఠత్-బహుకాలము ఊరకుండెను. దశరథునికి, తనకువచ్చిన మునిశాపమువలన పుత్రుఁడు కలుగుననియు, ఆపుత్రుని వలన తనకు మరణము కలుగుననియు భయమున్నది పుత్రులు లేకపోయిరే అను దుఃఖముకూడ నున్నది. కాని దేవదానవులు మథించినప్పుడే సముద్రమునందున్న కల్పవృక్ష కామధేనుప్రభృతులైన శ్రేష్ఠవస్తువులు బయల్పడినట్లు, తనలోనున్న సంతానోత్పాదకశక్తి తగినకారణ మున్నప్పుడే అభివ్యక్తము కాగలదని యూర కుండెనేకాని గొడ్డుబోతుతనముచేతకాదు. "ప్రత్యయాపేక్ష, రత్నోత్పత్తి" పద ములు, కారణజన్ములైన శ్రీరామాది పుత్రరత్నములు పుట్టనుండిరను భావమును సూచించును. అప్రయత్నముగా దశరథుఁడు కాలముగడుపుచుండుట కాదైవికమగు హేతువే కారణము. అలంకారము: ఉపమ.

శ్లో ఋశ్యశృంగాదయ స్తస్య సంత స్సంతానకాంక్షిణః
ఆరేభిరే యతాత్మానః పుత్రీయా మిష్టి మృత్విజః 4

వ్యాఖ్య : ఋశ్యశృంగాదయః-ఋశ్యశృంగుడు మొదలయిన, ఋత్విజః-యజ్ఞముచేయింపగల యాజకులగు, సంతః-మహాత్ములు, యతాత్మానః-నియమ

నిష్ఠలుగలవారై, సంతానకాంక్షిణః-సంతతిని గోరుచున్న, తస్య-ఆదశరథునికి (అతనికొరకై), పుత్రీయాం-పుత్రుడు కలుగుటకు కారణమైన, ఇష్టిం-యాగమును, ఆరేభిరే-ప్రారంభించిరి. ఋశ్యశృంగుఁడు, రోమపాదుని పుత్రికయు, దశరథుని పెంపుడు కూతురునగు శాంతకు భర్త, మహా మహిమోపేతుఁడైన తపస్వి. ఎంతకాలమునకును సంతతి కలుగక పోవుటచేత, దశరథుడు తన సంతాన వాంచను తెలుపగా, ఋశ్యశృంగుడు తన ఆధ్వర్యవమున దశరథునికై పుత్ర కామేష్టిని చేయుటకు నియమనిష్ఠలతో నారంభించె నని భావము.

శ్లో. తస్మి న్నవసరే దేవాః పౌలస్త్యోపప్లుతా హరిమ్
అభిజగ్ము ర్నిదాఘార్తాః ఛాయావృక్ష మివాధ్వగాః 5

వ్యాఖ్య : తస్మిన్, అవసరే-ఆ పుత్రకామేష్టి నారంభించిన సమయమున దేవాః-దేవతలు, పౌలస్త్యోపప్లుతాః (పౌలస్త్య+ఉపప్లుతాః)-రావణాసురునిచేత పీడింపబడిన వారగుచు, నిదాఘార్తాః-గ్రీష్మాతపముచేత బాధపడుచున్న, అధ్వగాః-బాటసారులు, ఛాయావృక్షం, ఇవ-మంచినీడగల చెట్టునువలె, హరిం-విష్ణువును, అభిజగ్ముః-చేరిరి. దశరథుని పుత్రకామేష్టి ఆరంభమైన సమయమునందే దేవతలు చిరకాలమునుండి రావణుఁడు చేయు దుండగములు సైరింపలేక, ఎండకాలపు మండు టెండకు మాడుచున్న బాటసారులు చల్లని విశాలచ్ఛాయగల వృక్షమును జేరినట్లు శ్రీమహావిష్ణువును రక్షింపుమని వేడుటకై చేరిరి. "ఛాయాప్రధానోవృక్షః-ఛాయా వృక్షః" అని విగ్రహము. ఇది శాకపార్థివాదులవంటి సమాసము. పౌలస్త్యః పులస్త్యస్య గోత్రాపత్యం పుమాన్ పౌలస్త్యః రావణః (అణ్‌ప్రత్యయం) అలంకారము: ఉపమ.

శ్లో. తే చ ప్రాపు రుదన్వంతం బుబుధే చాదిపూరుషః
అవ్యాక్షేపో భవిష్యంత్యాః కార్యసిద్ధేర్హి లక్షణమ్ 6

వ్యాఖ్య : తేచ-ఆదేవతలు కూడా, ఉదన్వంతం-సముద్రమును, ప్రాపుః-చేరిరి, ఆదిపూరుషః చ-విష్ణుమూర్తియు, బుబుధే-యోగనిద్రనుండి మేల్కొనెను, అవ్యాక్షేపః-కాలవిలంబములేకపోవుట, భవిష్యంత్యాః-కాఁబోవునట్టి, కార్యసిద్ధేః-కార్యసిద్ధియొక్క, లక్షణం, హి-లక్షణముకదా! రావణభయార్దితులైన దేవతలు సముద్రమును జేరుటయు, దష్టశిక్షణకుద్యుక్తుఁడైన విష్ణువు యోగనిద్రనుండి మేల్కొనుటయు, దశరథుఁడు పుత్రకామేష్టి నారంభించుటయు నేకకాలమున జరిగినవి

కాఁగలపనికి యెచ్చటను విలంబము జరుగకపోవుట లక్షణ మన్న అర్థాంతరన్యాస ముతో నీవిషయము సమర్థింపబడినది కనుక అలంకారము: అర్థాంతరన్యాసము.

శ్లో. భోగి భోగాసనాసీనం దదృశు స్తం దివౌకసః
తత్ఫణా మండలోదర్చిర్మణి ద్యోతిత విగ్రహమ్ 7

వ్యాఖ్య : దివౌకసః-దేవతలు, భోగిభోగాసనాసీనం-ఆదిశేషుని శరీరమను సింహాసనమున పై గూర్చున్నట్టివాడును, తత్ఫణామండలోదర్చిర్మణిద్యోతిత విగ్రహం-తత్-ఆయాదిశేషునియొక్క, ఫణామండల-పడగల సమూహమునందు, ఉదర్చిర్మణి-మెఱయుచున్న మణులచేత, ద్యోతిత-ప్రకాశింపఁ జేయబడిన, విగ్రహం-దేహముగలవాఁడునునగు, తం- ఆవిష్ణుమూర్తిని, దదృశుః-చూచిరి (దర్శనము చేసికొనిరి). విష్ణువు యోగనిద్రనుండి మేల్కొనగానే ఆదిశేషుడు సింహాసనముగా మారె ననియు, అతని వేయిపడగలయందున్న మణులు కాంతులు వెదజల్లుచు విష్ణుదేవుని శరీరమును ప్రకాశింప జేయుచున్న సమయమున దేవతలు దర్శనము చేసుకొని రనియు భావము. ఈ శ్లోకమునుండి 8 శ్లోకములలో విష్ణుమూర్తి వర్ణనము చేయుటకుఁ గారణము, ఈ మహనీయ తేజస్సు, దశరథుని సంతానముగాఁ బుట్టబోవుచున్నదని తెలుపుటకే యని మనము గ్రహింపవలెను.

శ్లో. శ్రియః పద్మనిషణ్ణాయాః క్షౌమాంతరిత మేఖలే
అంకే నిక్షిప్తచరణ మాస్తీర్ణ కరపల్లవే. 8

వ్యాఖ్య : పద్మనిషణ్ణాయాః-కమలమునందు కూర్చున్న, శ్రియః-లక్ష్మీదేవి యొక్క, క్షౌమాంతరితమేఖలే-క్షౌమ-పట్టుచీరచేత, అంతరిత-మరుగు పరుపబడిన, మేఖలే-మొలనూలు గలదియు, ఆస్తీర్ణకరపల్లవే-ఆస్తీర్ణ-పరువబడిన, కరపల్లవే-చిగురుటాకుల వంటి చేతులు గలదియునగు, అంకే-తొడమీద, నిక్షిప్తచరణం-ఉంచబడిన పాదములుగల (తం - ఆ విష్ణువును, దదృశుః- చూచిరి అని వెనుకటి శ్లోకముతో అన్వయము) సుకుమార శరీరముగల లక్ష్మి, మొలనూలి మణులు గ్రుచ్చుకొనకుండ తన పట్టు చీర చెరగును బరచి, దానిపై చిగురాకులవలె మెత్తగా నున్న తన యరచేతులను బెట్టి, వానిపై స్వామిపాదములనుంచుకొన్నది. అట్లు లక్ష్మి తొడపై పాదములుంచుకొనియున్న విష్ణువును దేవతలు దర్శించుకొనిరని భావము.

శ్లో. ప్రబుద్ధ పుండరీకాక్షం బాలాతప నిభాంశుకమ్
దివసం శారద మివ ప్రారంభ సుఖదర్శనమ్. 9

వ్యాఖ్య : ప్రబుద్ధ పుండరీకాక్షం - ప్రబుద్ధ - తెరువబడిన, పుండరీక-తెల్ల తామర రేకులవంటి, అక్షం-కన్నులుగలవాడును, బాలతపనిభాంశుకం-బాలాతప-లేయెండతో, నిభ-సమానముగు, అంశుకం-పట్టుదోవతి కలవాడును (పీతాంబరధారి యనుట), ప్రారంభ సుఖదర్శనం-ప్రారంభ-మహాయోగముగల మునులకు, సుఖ దర్శనం-సులభముగా దర్శన మొసగువాడును నగు (విష్ణువును), ప్రబుద్ధ పుండరీ కాక్షం-వికసించిన తె దామరలే కన్నులుగా గలదియు, బాలాతపనిభాంశుకం-లేత యెండయను వ ము గలదియు, ప్రారంభ సుఖదర్శనం-ఆదిలో సుఖముగా జూచుటకు వీలుపడు డియు నగు, శారదం-శరదృతువు నందలిదియగు, దివసం, ఇవ-దినమునువలె, స్థితం-ఉండిన, తం-ఆ ే వును, దదృశుః-చూచిరి.

దివస శబ్దము పుంలింగ మగుటచేత షాసు ప్రాణితమైన యీ ఉపమాలం కారము చక్కగా అతికి ది. శరదృతువు ష్ణువు యోగనిద్రనుండి లే సమయము కావున "శారదం" అని చెప్పబడినది (ఆషాఢశుద్ధ యేకాదశి శయ కా దశిగాను, కార్తికశుద్ధ ఏకాదశి ఉత్థానైకాదశిగాను శాస్త్రములు చెప్పును). శరదృ వు వీరరసమునకు అనుకూలము గావున రావణ వధార్థము జన్మింపఁబోవు విష్ణు ప్రబోధమును దానితోఁబోల్చుట మిక్కిలి సుందరముగా నున్నది.

శ్లో. ప్రభా నులిప్త శ్రీవత్సం లక్ష్మీ విభ్రమ దర్పణం
కౌస్తుభాఖ్య మపాం సారం బిభ్రాణం బృహతోరసా. 10

వ్యాఖ : ప్రభానులిప్త శ్రీవత్సం-తన కాంతిచేత పూయబడిన విష్ణు వక్ష స్థలముపై ను శ్రీవత్సమను మచ్చగలదియును, లక్ష్మీ విభ్రమదర్పణం-లక్ష్మీదేవి తన సములు చూచుకొనుటకుఁ బనికివచ్చు నద్దమువంటిదియు, కౌస్తు భాఖ్యం—కౌస్తుభము అనుపేరుగల, అపాంసారం-సముద్రజలముల సారభూతమైన మణిని, బృహతా—విశాలమైన, ఉరసా—వక్షస్థలముచేత, బిభ్రాణం-ధరించియున్న (తం—ఆ విష్ణువును, దదృశుః-చూచిరి). కాంతిపుంజములతో శ్రీవత్సమును రంజింపఁజేయుచు, లక్ష్మికి విలాసదర్పణమైన కౌస్తుభమణిని ధరించిన విష్ణువును దేవతలు చూచిరి. "లక్ష్మీ విభ్రమదర్పణ" మనుటచేత శ్రీమహాలక్ష్మి తనసోయగ మును విష్ణువక్షస్థల స్థిత కౌస్తుభ మణియందు చూచుకొనుచున్న సమయమునందు దేవతలు వెళ్ళుట, వారి కార్యసిద్ధికి సూచకము.

శ్లో. బాహుభి ర్విటపాకారై ః దివ్యాభరణ భూషితైః
.ఆవిర్భూత మపాం మధ్యే పారిజాత మివాపరమ్. 11

వ్యాఖ్య : విటపాకారైః-శాఖారూపములుగలవియు, దివ్యాభరణ భూషితైః-కాంతిమంతములగు కటకాంగదాది భూషణములచేత అలంకృతములైన, బాహుభిః-చతుర్బాహువులచేత, అపాం-సముద్రజలములయొక్క, మధ్యే-నడుమ, ఆవిర్భూతం-సాక్షాత్కరించిన, అపరం-రెండవదియగు, పారిజాతం ఇవ-కల్పవృక్షము వలె, స్థితం-ఉండిన, (తం-ఆ విష్ణువును, దదృశుః-చూచిరి ) సముద్రజల మధ్యమున దివ్యాభరణ భూషితములైన చతుర్బాహువులతో సాక్షాత్కరించిన విష్ణువు, సముద్రమునందే వివిధ పుష్ప ఫలపల్లవములు గల శాఖలతో నావిర్భవించిన రెండవ పారిజాతవృక్షమా! యని ఉత్ప్రేక్షింపబడుట మిక్కిలి సమంజసము గానున్నది. అలంకారము: ఉత్ప్రేక్ష.

శ్లో. దైత్యస్త్రీ గండలేఖానాం మద రాగ విలోపిభిః
హేతిభి శ్చేతనావద్భి రుదీరిత జయ స్వనమ్. 12

వ్యాఖ్య : దైత్యస్త్రీగండలేఖానాం-దైత్యస్త్రీ-రాక్షసస్త్రీల, గండలేఖానాం-చెక్కిళ్ళపైనుండు మకరికాది పత్రరచనలయొక్క, మద రాగ విలోపిభిః-మదము వల్ల కలుగు స్వైరదనమును లోపింపజేయునవియు, చేతనావద్భిః-చైతన్యము గలవియు నగు, హేతిభిః-చక్రాద్యాయుధములచేత, ఉదీరిత జయస్వనం-ఉద్ఘోషింపబడిన జయజయ ధ్వానములుగల, (తం-ఆవిష్ణువును, దదృశుః-చూచిరి.) దైత్యస్త్రీల గండస్థలములపైది మదరాగమును లోపింపజేయుట యనగా వారి భర్తలను చంపి, వారిని విధవలనుగా జేయుట. అట్లు చేయగలిగి, చైతన్యవంతము లగుటచేత, దేవతలు వచ్చిన సమయమున, రాబోవు విజయమును ఊహించి, చక్రాద్యాయుధములు జయజయ ధ్వానములు చేయుచుండగా సంతోషము నందుచున్న విష్ణువును, దేవతలు దర్శించుకొనిరని భావము. విష్ణుమూర్తి పంచాయుధములు : పాంచజన్యము (శంఖము), సుదర్శనము (చక్రము), కౌమోదకి (గద), నందకము (ఖడ్గము), శార్ఙ్గము (ధనువు) అనునవి. ఇవి సచేతనములు.

శ్లో. ముక్త శేష విరోధేన కులిశ వ్రణ లక్ష్మణా
ఉపస్థితం ప్రాంజలినా వినీతేన గరుత్మతా. 13

వ్యాఖ్య : ముక్త శేష విరోధేన-విడిచిపెట్టబడిన ఆదిశేషునితోడి విరోధము గలవాఁడును, కులిశ వ్రణ లక్ష్మణా-వజ్రాయుధముచేత కలిగిన గాయముల మచ్చలు గలవాఁడును, ప్రాంజలినా-దోయలించినవాఁడును, వినీతేన-వినయముతోఁ గూడినవాడును నగు, గరుత్మతా-గరుత్మంతునిచేత, ఉపస్థితం-సేవింపబడుచున్న (తం-ఆవిష్ణువును దదృశుః-చూచిరి). గరుత్మంతుఁడు, సహజముగా సర్పవైరియై యున్నను వి కల్పమైయున్న శేషునితో మాత్రము వైరమును విడిచి భగవత్సన్నిధిలో వాహన యుండె నను భావమును "ముక్త శేషవిరోధేన" అను సమాస పదము తెలు ను. అమృతమును దెచ్చునప్పుడింద్రునితో జరిగిన యుద్ధమునందలి వజ్రాయుధపు దెబ్బలచే నేర్పడిన వ్రణముల మచ్చలీనాటికిని గనపడుచుండుటను "కులిశవ్రణలక్ష్మణా" అనునది తెలుపును. "వినీతేన" అనుపద మొక పూర్వ గాథను తెలియఁజేయును; ఇంద్రసారథియగు మాతలికి గరుడకేశి" అను పుత్రిక గలదు, ఆమె భర్త ఒక సర్పరాజు. గరుత్మంతుడా సర్పమును దినకుండునట్లు మాతలి శ్రీమహావిష్ణువును వరమువేడి అభయమును సంపాదించెను. తన శత్రువునకు వరము నిచ్చుటవలన కోపించి, విష్ణువుతో నేను నిన్ను మోయుచున్నాను గనుక నీకంటే నేనే బలవంతుఁడను. నీవెట్లా సర్పమును రక్షింపగలవో చూచెదనని గర్వోక్తులు పలికెను. ఆ మాటలువిన్న విష్ణువు నవ్వుచు తన యెడమచేతి చూపుడు వ్రేలితో గరుడుని వీపుపై నొక్కెను గరుడు డాభారమును మోయలేక అణగి విలవిల లాడుచు గర్వభంగమును పొంది, శరణువేడి, నాటినుండి వినీతుఁడయ్యెను. అట్టివాఁడగు గరుడుని చేత ఉపాసింపబడుచున్న విష్ణువును దేవతలు చూచి రని భావము. 'వినీత' శబ్దమునకు వంచబడిన అనియు నర్థము.

శ్లో. యోగ నిద్రాంత విశదైః పావనై రవలోకనైః
భృగ్వాదీ ననుగృహ్ణాంతం సౌఖశాయనికా నృషీన్. 14

వ్యాఖ్య : యోగ నిద్రాంత విశదైః—యోగ నిద్రాంత-చిత్తము యొక్క ఏకాగ్రతారూపమైన యోగమనెడు నిద్రయొక్క అవసానమునందు, విశదైః-ప్రసన్నములైనవియు, పావనైః-ఎదటివారిని పవిత్రము చేయునవియు నగు, అవలోకనైః-చూపులచేత, సౌఖశాయనికాన్-సుఖముగా నిద్రించితిరా? యని అడుగుచున్న, భృగ్వాదీన్-భృగువు మొదలగు, ఋషీన్-మునులను, అను గృహ్ణాంతం-అనుగ్రహించుచున్న, (తం-ఆ విష్ణువును, దదృశుః-చూచిరి). యోగ నిద్రా పరిసమాప్తి యందు ప్రసన్నములైన చూపులతో భృగ్వాదులైన దేవర్షులను అనుగ్రహించు విష్ణువును దేవతలు చూచిరని భావము. "సుఖ శయనం పృచ్ఛంతీతి

సౌఖశాయనికః" దీని ఏకవచనము "సౌఖ శాయనికః" అగును. అనగా సుఖముగా శయనించితివా? అనియడుగువాడు. అట్లే "సౌస్నాతికః" అనియు నగును. చక్కగా స్నానము చేసితివా? యని అడుగువాడు అని చేనియర్థము. ఈ రెండు శబ్దములును "పృచ్ఛతౌ సుస్నాతా దిభ్యః" అను వార్తికము వలన సిద్ధించుచున్నవి.

శ్లో. ప్రణిపత్య సురా స్తస్మై శమయిత్రే సురద్విషామ్
అథైనం తుష్టువు స్స్తుత్య మవాఙ్మనస గోచరమ్. 15

వ్యాఖ్య : అథ-దర్శనానంతరము, సురాః-దేవతలు, సురద్విషాం-రాక్షసులకు, శమయిత్రే-వినాశకుడగు, తస్మై-ఆవిష్ణువునకు, ప్రణిపత్య-నమస్కరించి, స్తుత్యం-స్తోత్రమున కర్హుఁడును, అవాఙ్మనస గోచరం-వాక్కులకును మనస్సునకును గోచరుఁడుకాని, (తం-ఆవిష్ణువును) ఏవం-ఈ క్రింది విధముగా, తుష్టువుః-స్తోత్రము చేసిరి. దర్శనానంతరము దేవత లందరును సాష్టాంగ నమస్కారములుచేసి అనంత కళ్యాణ గుణములు గల విష్ణువును స్తుతించుట కారంభించిరని భావము ఇందలి "సురద్విషాం శమయిత్రే" అనువిశేషణము సాభిప్రాయము. దేవతలు వచ్చినది రావణాది సురద్వేషులను చంపుమని కోరుటకే కదా? "అవాఙ్మనస గోచరం" అను విశేషణము లోని రహస్య మేమనగా, కాళిదాసు, తన వాక్కులతో సాకారుఁడైన విష్ణువును ఇంతవరకు వర్ణించినాడు. ఇప్పుడు వాక్కులకును మనస్సునకును అందని విష్ణు తత్త్వమును దేవతలచేత పలికింపుటకు బూనుకొన్నాడు. ఇది ఆయన ప్రౌఢతనము.

శ్లో. నమో విశ్వసృజే పూర్వం విశ్వం తదను బిభ్రతే
అథ విశ్వస్య సంహర్త్రే తుభ్యం త్రేధా స్థితాత్మనే. 16.

వ్యాఖ్య : పూర్వం-మొదట, విశ్వసృజే-ప్రపంచమును సృజించువాడవును, తదను-దాని తరువాత, విశ్వం-విశ్వమును, బిభ్రతే-భరించువాఁడవును, అథ-అపిమ్మట, విశ్వస్య-విశ్వమునకు, సంహర్త్రే-సంహారకుడవును, (ఏవం-ఇట్లు) త్రేధా-మూడు విధములుగా, స్థితాత్మనే-ఉన్న స్వరూపముగల, తుభ్యం-నీ కొరకు (నీకు) నమః-నమస్కారము. సృష్టి స్థితి లయ కారకులయిన బ్రహ్మ విష్ణు శివాత్మకుఁడవగు నీకు నమస్కార మని భావము.

శ్లో. రసాంతరా ణ్యేకరసం యథా దివ్యం పయోఽశ్నుతే
దేశేదేశే గుణేష్వేవ మవస్థా స్త్వ మవిక్రియః. 17

వ్యాఖ్య :- ఏకరసం—ఒకేమధుర రసముగల, దివ్యంపయః— ఆకాశమునుండి పుట్టినదగు జలము, దేశేదేశే-ఉప్పునట్టిచోటు మొదలయిన ప్రదేశములందు, రసాంతరాణి—లవణరసము మొదలగు ఇతర రసములను, యథా-ఏవిధముగా, అశ్నుతే-పొందునో, ఏవం-అట్లే, అవిక్రియః-నిర్వికారుడవైన, త్వం-నీవు, గుణేషు-సత్వాది గుణములందు, అవస్థాః- బ్రహ్మాది రూపభేదములను, అశ్నుషే-పొందుదువు. ఒకే మధుర రసము గల జలము తాను పడుచోటు విశేషము వలన లవణత్వాదులను పొందునట్లు ఏ రూపమును లేని నీవు, సత్త్వరజ స్తమో గుణముల సంబంధమువలన విష్ణువుగాను, బ్రహ్మగాను, శంకరుడుగాను మారి ఆయా కార్యములు చేయుచున్నావని భావము. కారణ జలమునకు "శీతస్పర్శవత్యఆపః" అను లక్షణము వలన చల్లదనము మాత్రమే కాని మాధుర్యముగూడ స్వతస్సిద్ధము కాదు. కనుక "దివ్యం" అను విశేషణము వేసి మాధుర్యగుణ యుక్తత్వమును జలమునకు లక్షణముగా జెప్పుట, నిర్వికారుడయిన భగవంతుడు సదా మధురానుభూతినిచ్చు "రసోవై సః" అను శ్రుతి గోచరుడని తెలుపుటకే యని గ్రహింపవలెను.

శ్లో. అమేయో మితలోక స్త్వ మనర్థీ ప్రార్థనావహః
అజితో జిష్ణు రత్యంత మవ్యక్తో వ్యక్త కారణమ్. 18

వ్యాఖ్య : త్వం-నీవు, అమేయః-కొలచుటకు వీలులేని వాడవు, ఇంత వాడవని యితరులచే జెప్పబడుటకు సాధ్యము కానివాడవు, మితలోకః-లోక మింతది యని నీవు చెప్పగలవాడవు, అనర్థీ (న+అర్థీ)-కోరికలేనివాడవు, ప్రార్థ నావహః-ఇతరుల కోరికలను దీర్చగలవాడవు, అజితః-ఇతరులచేత జయింపబడని వాడవు, జిష్ణుః-ఎవని నైనను జయించు స్వభావము గలవాడవు, అత్యంతం, అవ్యక్తః-ఇంద్రియములకు గోచరింపని మిక్కిలి సూక్ష్మరూపుడవు, వ్యక్తకారణం-కనపడుచున్న యీ స్థూలప్రపంచమునకు కారణభూతుడవు, నీవు, అచింత్యావ్యక్త స్వరూపుడవైన మహానుభావుడ వని యర్థము.

శ్లో. హృదయస్థ మనాసన్న మకామం త్వాం తపస్వినమ్
దయాలు మనఘస్పృష్టం పురాణ మజరం విదుః 19

వ్యాఖ్య : హేదేవ!-ఓ మహనీయుడా! త్వాం-నిన్ను, హృదయస్థం-హృత్కమలము నందున్నవాడవైనను, అనాసన్నం-అగమ్యరూపుడ వగుటచేత దూరస్థుడవు గాను, అకామం-పరిపూర్ణకాముడ వగుటచేత కోరికలు లేనివాడవై యున్నను, తపస్వినం-ఒకానొక ఫలాపేక్షచేత ఉత్తమతపస్సు చేయువాడవుగను, దయాలుం-దయగలవాడవయ్యును, అనఘస్పృష్టం- దుఃఖముచే స్పృశింపబడని వాడవుగను, పురాణం-చిరంతనుడవైనను, అజరం-ముదుసలితనము లేనివానిని గను, విదుః-తత్త్వజ్ఞులైనవా రెరుగుదురు. హృదయము నందుండియు దూరస్థుడుగా నుండుట ఇత్యాదులు పరస్పర విరుద్ధములు కాని బ్రహ్మతత్త్వము నెఱిగినవారికి ఆవైరుధ్యము తొలగును కనుక మల్లినాథుడు తలచినట్లు ఇది విరోధాభాస అలంకారమే. ఇచ్చటి "అనఘ" శబ్దములోని "అఘ" శబ్దమునకు "అఘందురిత దుఃఖయోః" అను విశ్వనిఘంటువు వలన దుఃఖము అని యర్థము. దయాళువు దుఃఖముగలవాడగునని మహాభారతము చెప్పుచున్నది.

శ్లో. సర్వజ్ఞ స్త్వ మవిజ్ఞాతః సర్వయోని స్త్వ మాత్మభూః
సర్వప్రభు రనీశ స్త్వ మేక స్త్వం సర్వరూపభాక్ 20

వ్యాఖ్య : హేదేవ-ఓ భగవానుడా! త్వం-నీవు, సర్వజ్ఞః-అనంత విశ్వము నందలి ప్రత్యణువును ఎఱిగినవాడవు, అవిజ్ఞాతః-కాని యేయజ్ఞానిచేతను ఎఱుగ బడినవాడవు కావు, త్వం-నీవు, సర్వయోనిః-సకలవిశ్వమును పుట్టుటకు కారణమైనవాడవు, ఆత్మభూః-కాని నీవు నీయంతట నీవే పుట్టినవాడవు, త్వం-నీవు, సర్వప్రభుః-అందరికిని అధిపతివై, అనీశః-కాని, నీకెవ్వడును ప్రభువులేడు. త్వం-నీవు, ఏకః-ఒక్కడవే, సర్వరూపభాక్-కాని, సర్వచేతనాచేతన స్వరూపుడ వయున్నావు. అనాదినిధనమైన పరబ్రహ్మము, జ్ఞానస్వరూపమై, స్వయంభువై, ఏకమై, యున్నను మాయాప్రభావమువలన సోపాధికమై సర్వప్రపంచమున్ను తానే అయివున్నదని భావము.

శ్లో. సప్త సామోపగీతం త్వాం సప్తార్ణవ జలేశయమ్
సప్తార్చి ర్ముఖ మాచఖ్యుః సప్తలోకైక సంశ్రయమ్ 21

వ్యాఖ్య : త్వాం-నిన్ను, సప్తసామోపగీతం—సప్తసామ-ఏడు విధములైన సామలచేత, ఉపగీతం-గానముచేయబడుచున్న వానిని గాను, సప్తార్ణవజలేశయం—సప్తార్ణవ-ఏడుసముద్రముల యొక్క, జలేశయం-నీటిపైని శయనించు వానినిగాను,

సప్తార్చిర్ముఖం-ఏడువిధములగు జ్వాలలుగల అగ్నియే ముఖముగా గలవానిని గాను, సప్త లోకైక సంశ్రయం—సప్తలోక-ఏడులోకములకును, ఏకసంశ్రయం-ఒకే ఆశ్రయమైన వానినిగాను, ఆచఖ్యుః-తత్త్వవిదులు చెప్పిరి. సప్తసామము లనగా ఏడు సామవేద భాగములు. అవి, గాయత్ర, రథంతర, వామదేవ్య, బృహత్సామ, వైరూప వైరాజ, శక్వరీ సామలు. ఇవికాక పెక్కుసామలు గలవు సప్తసాగరములు : లవణ, ఇక్షు, సురా, సర్పిస్, దధి, క్షీర, జలసాగరములు. సప్తార్చి యనగా ఏడు జ్వాలలు (జిహ్వలు) గల అగ్ని. ఆ జిహ్వలు, కరాళి, ధూమిని, శ్వేత, లోహిత, నీలలోహిత, సువర్ణ, పద్మరాగ అనునవి. సప్తలోకములు భూలోకము, భువర్లోకము, సువర్లోకము, మహర్లోకము, జనలోకము, తపోలోకము, సత్యలోకము. సామగానలోలుడవై, సప్తార్ణవ జలమున శయనించువాడవై, సప్త జిహ్వ యగు అగ్నిద్వారా యజ్ఞహవిస్సును స్వీకరించుచు, సప్తలోకాశ్రయుండ వై యున్న నిన్ను ధ్యానించుచున్నా మని భావము.

శ్లో. చతుర్వర్గఫలం జ్ఞానం కాలావస్థా శ్చతుర్యుగాః
చతుర్వర్ణమయో లోక స్త్వత్తః సర్వం చతుర్ముఖాత్. 22

వ్యాఖ్య : చతుర్వర్గఫలం-నాలుగు పురుషార్థములు ఫలము గాగల, జ్ఞానం-జ్ఞానమున్ను, చతుర్యుగాః-నాలుగు యుగములుగల, కాలావస్థాః-కాలపరిణామము లును, చతుర్వర్ణమయః-నాలుగు వర్ణములుగానున్న, లోకః-జనము, సర్వం-ఈ ప్రపంచమంతయు, చతుర్ముఖాత్-నాలుగు ముఖములు గలవాడవైన, త్వత్తః-నీ వలననే (బ్రహ్మవల్లనే పుట్టినది. రజోగుణ ప్రధానుడవై బ్రహ్మగా అవతరించిన నీవల్లనే యీ సృష్టి అంతయు జరిగినది అని భావము. చతుర్వర్గములనగా, ధర్మ, అర్థ, కామ, మోక్ష ములనబడు పురుషార్థములు. చతుర్యుగములు : కృత, త్రేతా, ద్వాపర, కలియుగములు. చతుర్వర్ణములు : బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్ర వర్ణములు.

శ్లో. అభ్యాస నిగృహీతేన మనసా హృదయాశ్రయమ్
జ్యోతిర్మయం విచిన్వంతి యోగిన స్త్వాం విముక్తయే 23

వ్యాఖ్య : అభ్యాస నిగృహీతేన—అభ్యాస-యమ నియమాది యోగాంగముల అభ్యాసముచేత, నిగృహీతేన-నిలకడగా నుంచబడిన, మనసా-మనస్సుతో, యోగినః-యోగాభ్యాస సిద్ధులైన మునులు, హృదయాశ్రయం-హృదయము

సంమన్న, జ్యోతిర్మయం-జ్యోతిస్స్వరూపుడవైన, త్వాం-నిన్ను, విముక్తయే-మోక్షముకొరకై, విచిన్వంతి-అన్వేషింతురు. హృదయ కమలమునందు జ్యోతిగా ప్రకాశించు నిన్ను యోగులు మోక్షసిద్ధికై వెదకుదు రని భావము. హృద్గతమై, పరబ్రహ్మ రూపమై యున్న వెలుగు యోగాభ్యాసముచేతనే దర్శింప వీలగునన్నది సారాంశము.

శ్లో. అజస్య గృహ్ణతో జన్మ నిరీహస్య హతద్విషః
స్వపతో జాగరూకస్య యాథార్థ్యం వేద క స్తవ. 24

వ్యాఖ్య : అజస్య-జన్మించని వాఁడవైనను, జన్మ-మత్స్యాద్యవతార రూపన జన్మము, గృహ్ణతః-స్వీకరించు చున్నట్టియును, నిరీహస్య-చేష్టా రహితుఁడనను, హతద్విషః-చంపబడిన శత్రువులు గలవాడవును, జాగరూకస్య-సర్వ సాక్షివై నిత్యప్రబుద్ధుడ వైనను, స్వపతః-యోగనిద్రను అనుభవించు వాడ వగు, తవ-నీ యొక్క, యాథార్థ్యం-నిజస్వరూపమును, కః, వేద-ఎవడెరుగును? ఆయా సమయములందు లోకకళ్యాణార్థమై విరుద్ధ వర్తనములు ప్రదర్శింపగల నీ సత్య స్వరూపము నెరుఁగగలవాఁడు లేడని భావము.

శ్లో. శబ్దాదీన్ విషయాన్ భోక్తుం చరితుం దుశ్చరం తపః
పర్యాప్తోఽసి ప్రజాః పాతుం ఔదాసీన్యేన వర్తితుమ్. 25

వ్యాఖ్య : శబ్దాదీన్, విషయాన్-శబ్ద స్పర్శ రూప రస గంధాత్మకము లైన యింద్రియార్థములను, భోక్తుం-ఆయా యవతారము లందనుభవించుటకును, దుశ్చరం-ఇతరులు చేయుటకు సాధ్యపడని, తపః-తపస్సును, చరితుం-కొన్ని యవతారములందు చేయుటకును, ప్రజాః, పాతుం-దైత్యమర్దనముచేత ప్రజలను రక్షించుటకును, ఔదాసీన్యేన-తటస్థ భావముతో, వర్తితుం-ఉండుటకును, పర్యాప్తః-సమర్థుఁడవు, అసి-అగుచున్నావు. పరస్పర విరుద్ధములైన భోగ తపస్సులను, పాలనౌదాసీన్యములను, ఆచరింపగల సమర్థుఁడు నీవు తప్ప మరి యొకడు లేడని భావము.

శ్లో. బహుధా ప్యాగమై ర్భిన్నాః పంథానః సిద్ధి హేతవః
త్వయ్యేవ నిపతం త్యోఘా జాహ్నవీయా ఇవార్ణవే. 26

వ్యాఖ్య : అగమైః-త్రయీ సాంఖ్య యోగాది దర్శనములచేత, బహుధా-అనేక విధములుగా, భిన్నాః,అపి-వేరువేరుగా నున్నను, సిద్ధిహేతవః-పురుషార్థము ఫలించుటకు సాధనములైన, పంథానః-దర్శన మార్గములు, జాహ్నవీయాః-గంగా సంబంధములైన, ఓఘాః-ప్రవాహములు (భిన్నగమనములతో పుణ్యఫల ప్రాప్తికి కారణములైన గంగానది పాయలు) అర్ణవే, ఇవ-సముద్రమునందు వలె, త్వయి, ఏవ-నీయందే, నిపతంతి-చేరుచున్నవి అన్ని విధములైన ఆస్తిక దర్శనములు చూపు మార్గములు నిన్నే చేరును. నీవే సర్వగమ్యుడ వని భావము

శ్లో. త్వ య్యావేశిత చిత్తానాం త్వత్సమర్పిత కర్మణామ్
గతి స్త్వం వీతరాగాణాం అభూయ స్సన్నివృత్తయే. 27

వ్యాఖ్య : త్వయి-నీ యందు. ఆవేశితచిత్తానాం-నిలుపబడిన మనస్సు గల వారును, త్వత్సమర్పిత కర్మణాం-త్వత్-నీ కొరకే, సమర్పిత-అర్పింపబడిన, కర్మణాం-కర్మఫలము గలవారు నగు, వీతరాగాణాం-సంసారవిరక్తులకు, అభూయః సన్నివృత్తయే-తిరిగి సంసారమునకు రాకుండుటకు (మోక్షము కొఱకు) త్వం-నీవే, గతిః-సాధనము. "తమేవ విదిత్వా ఽతిమృత్యుమేతి," నాన్యః పంథా విద్యతే ఽయనాయ" ఇత్యాది శ్రుతివాక్యముల వలనను, "మన్మనా భవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు, మామేవైష్యసి సత్యంతే ప్రతిజానే ప్రియోఽసి మే" అను గీతా వాక్యము వలనను విష్ణువు నందర్పించబడిన చిత్తము, కర్మఫలమును గల విరక్తులకు పునర్జన్మలేని మోక్షపదవి నిచ్చు మహనీయుడవు నీవే యని దేవతలు స్తుతించిరి.

శ్లో. ప్రత్యక్షో ఽప్యపరిచ్ఛేద్యో మహ్యాది ర్మహిమా తవ
ఆప్తవా గనుమానాభ్యాం సాధ్యం త్వాం ప్రతి కా కథా 28

వ్యాఖ్య : ప్రత్యక్షః. అపి-ప్రత్యక్షప్రమాణము చేత తెలిసికొనుటకు వీలైనదయినను, మహ్యాదిః-భూమి, ఆకాశము మొదలయిన, తవ, మహిమా-నీ యొక్క గొప్పదనము, అపరిచ్ఛేద్యః-అపరిచ్ఛిన్నమైనది (ఇంతది అని నిరూపించుటకు వీలుపడనిదై యున్నది). ఆప్తవాగనుమానాభ్యాం—ఆప్తవాక్-వేదరూపమైన శబ్దప్రమాణముచేతను, అనుమానాభ్యాం-అనుమాన ప్రమాణముచేతను, సాధ్యం-తెలిసికోదగిన (ఉన్నాడని చెప్పదగిన) త్వాం, ప్రతి-నిన్ను గురించి, కా, కథా-ఏమి చెప్పవలసి యున్నది? త్వక్చక్షురాదులగు నింద్రియములకు ప్రత్యక్ష

ముఖ్యగా ఉన్న భూ జల వాయ్వాది రూపమున ఉన్న నీ మహిమ, నీ విస్తృతి, ఇంత ఉన్నది అని కొలుచుటకు లేదా చెప్పుటకు వీలుగానిదిగా నున్నప్పుడు, "యతోవా ఇమాని భూతాని జాయంతే" (ఏ పరమాత్మవలన ఈ భూతములన్నియు పుట్టుచున్నవో) అను వేదరూప, ఆప్తవాక్యమైన, శబ్ద ప్రమాణము చేతను, "క్షిత్యాదికం సకర్తృకం కార్యత్వాత్ ఘటవత్" పృథివ్యాదులు సకర్తృకములు, ఘటమువలె కార్యములుగనుక (ఒకనిచే నిర్మింపబడినవి) అను అనుమాన ప్రమాణము చేతను, తెలిసికోదగిన వాడవగు నీవు అపరిచ్ఛిన్నుడవు, ఇంతవాడవని చెప్పుటకు వీలుపడనివాడ వనుటలో ఆశ్చర్యమేమున్నది? అని భావము. వస్తు జ్ఞానము కలుగుటకు అంగీకరింపబడిన ప్రమాణములు ఆరు: "ప్రత్యక్షము, అనుమానము, ఉపమానము, శబ్దము, అర్థాపత్తి, అనుపలబ్ధి" అనునవి ఇచ్చట అర్థాపత్తి ప్రమాణముచేత నేర్పడిన అర్థాపత్తి అలంకారము ఒక విషయమును చెప్పినప్పుడు దానికి సంబంధించిన రెండవ విషయము, దానియంతట అదే తెలియుటకు, అర్థాపత్తి అని పేరు. దీనికి "దండా పూపికా న్యాయ" మనియు పేరు అనగా గారెలు గ్రుచ్చిన కర్రను ఎలుకలెత్తుకపోయినవి అని చెప్పినప్పుడు, ఎలుకలు గారెలు తిన్నవి అని చెప్ప నక్కర లేదుగదా; అట్లే ప్రకృతమున భగవంతునిచే సృజింపబడిన సేవా భగవంతుని యందు ఆరోపింపబడిన మహాదులు అపరిచ్ఛిన్నములై యున్నప్పుడు, తత్కారణమగు పరబ్రహ్మము అపరిచ్ఛిన్నము అని చెప్పనక్కరలేదు అని తాత్పర్యము. ఇచోట కవులు "కా కథా, కిముత" అను పదము లుపయోగించి అర్థాపత్తి అలంకారము సాధింతురు

శ్లో. కేవలం స్మరణే నైవ పునాసి పురుషం యతః
అనేన వృత్తయ శ్శేషా నివేదిత ఫలా స్త్వయి. 29

వ్యాఖ్య : స్మరణేన-నిన్ను స్మరించుటచేతనే, కేవలం-సంపూర్ణముగా, పురుషం-మానవుని, పునాసి, యతః-పవిత్రునిగా జేయుచున్నావంటే, అనేన, ఏవ-ఈ స్మరణముచేతనే, త్వయి-నీ విషయమున శేషాః-మిగిలిన (తక్కినవి), వృత్తయః-దర్శన స్పర్శ నాదులైన వ్యాపారములు, నివేదిత ఫలాః-తెలుపబడిన ఫలములు గలవియై యున్నవి నీ స్మరణముచేతనే సంపూర్ణముగా మానవుడు పవిత్రుడగుచున్నప్పు డతడు చేయు దర్శనాదుల ఫలము ఇంతది అని నిశ్చయింపజాలము. ఇప్పుడు మాకు కలిగిన దర్శనఫలము అనంతమై యుండునని దేవతలు పలికిరి. "కేవలః కృత్స్న ఏకశ్చ" అని శాశ్వత నిఘంటువు కాగా ఇక్కడ కేవల శబ్దమునకు కృత్స్నము-సంపూర్ణము అని యర్థము చెప్పబడినది.

శ్లో. ఉదధే రివ రత్నాని తేజాంసీవ వివస్వతః
స్తుతిభ్యో వ్యతిరిచ్యంతే దూరాణి చరితాని తే. 30

వ్యాఖ్య : ఉదధేః-సముద్రముయొక్క, రత్నాని, ఇవ-రత్నములు వలెను, వివస్వతః-సూర్యునియొక్క, తేజాంసి, ఇవ-కిరణము వలెను, దూరాణి-దూరము న (అవాఙ్మనస గోచరములైన), తే, చరితాని - నీ ప్రవర్తనములు, స్తుతిభ్యః-స్తోత్రములకంటె, వ్యతిరిచ్యంతే-మిక్కిలి యెక్కువగా నున్నవి. నీ నడవడులను శ్లేషముగా స్తుతించుటకు (పేర్కొనుటకు) సాధ్యము కాదని భావము. సముద్రము నందలి రత్నములను, సూర్యుని కిరణములను లెక్కించుటకు వీలుగానట్లు నీఅనంత కళ్యాణ గుణములు లెక్కకు మిక్కుటముగా నున్నవని తాత్పర్యము.

శ్లో. అనవాప్త మవాప్తవ్యం న తే కించన విద్యతే
లోకానుగ్రహ ఏవైకో హేతు స్తే జన్మకర్మణోః 31

వ్యాఖ్య : అనవాప్తం-పొందబడనిదియు, అవాప్తవ్యం-పొందదగినదియు, తే-నీకు, కించన-ఏదియు, న, విద్యతే-లేదు లోకానుగ్రహః-ప్రజల యందలిదయ, ఏక ఏవ-ఒక్కటియే, తే-నీయొక్క, జన్మకర్మణోః-జన్మ మెత్తుటకును, క్రియాకర్మ లను చేయుటకును. హేతుః-కారణము. ఇంతవరకు దేవతలు విష్ణువును స్తుతించి, ఇప్పుడు తమకు కావలసియున్న ఆయన అవతార ప్రసక్తిని దెచ్చి పలుకుచున్నారు. మహానుభావా! నీవు పొందని కోరిక లేదు, పొందవలసినదియు లేదు, నీవు నిత్య పరిపూర్ణకాముడవు. మరి యవతారము లెత్తి క్రియాపములు నేల చేయుచున్నావనగా అది పరమకారుణికుడవైన నీకు గల లోకానుగ్రహమే. లోకానుగ్రహము తప్ప నీకు స్వార్థము లేదు అని భావము.

శ్లో. మహిమానం య దుత్కీర్త్య తవ సంహ్రియతే వచః
శ్రమేణ త దశక్త్యా వా న గుణానా మియత్తయా. 32

వ్యాఖ్య : తవ-నీయొక్క, మహిమానం - ఆధిక్యమును, ఉత్కీర్త్య-ఉప వర్ణించి, వచః-మావాక్కు, సంహ్రియతే, ఇతి,యత్ - ఆపివేయబడుచున్నదనుట యేదికలదో, తత్-అది (అట్లుచేయుట), శ్రమేణ-ఇకమీద పలుకుశక్తి వాక్కునకు లేకపోవుట, అశక్త్యా, వా-మాకు నీ సర్వగుణములను దెలిసికొనదగు శక్తిలేక పోవుటగాని కారణము, గుణానాం-నీగుణములయొక్క, ఇయత్తయా-ఇన్నిఅని

చెప్పదగిన పరిమాణము చేత మాత్రము న - కాదు. "యతో వాచో నివర్తంతే అప్రాప్య మనసా సహ" మనస్సును. దానిని వివరించు వాక్యమును, అద్వితీయ పరబ్రహ్మము జేరుటకును, ఆయనను గురించి చెప్పుటకును, ప్రయత్నించి, అది చేతగాక, వెనుకకు మరలుచున్నవి) అను శ్రుతి ప్రకారము, అనంతకళ్యాణ గుణోపేతుడవైన నీగుణములను వర్ణించుటకు మావాక్కులుగాని మాసామర్థ్యముగాని చాలవు. కనుక ఈ మాత్రపు స్తుతిచేత ప్రసన్నుడవై మాపిన్నపము నాలకింపుమని దేవతలు విష్ణువును సుముఖుని జేసికొనుచు స్తోత్రమునా పిరని భావము.

శ్లో. ఇతి ప్రసాదయామాసు స్తే సురా స్త మధోక్షజం
భూతార్థవ్యాహృతి స్సా హి న స్తుతిః పరమేష్ఠినః. 33

వ్యాఖ్య: ఇతి-ఇట్లుపలికి, తేసురాః-ఆదేవతలు, తం, అధోక్షజః-ఆవిష్ణువును, ప్రసాదయామాసుః- ప్రసన్నునిగా జేసిరి. హి-ఎందువలన. పరమేష్ఠినః- సర్వోత్కృష్టపదమునందున్న భగవంతునికి, సా- ఆదేవతలవాక్కు, భూతార్థ వ్యాహృతిః- సత్యవిషయమును చెప్పుటయేకాని, స్తుతిః-లేనిది కల్పించి పొగడుట, న-కాదో, గొప్పవారు, తమయందు లేనిగుణముల నారోపించిచేయు పొగడ్తలకు సంతోషింపరు కనుక దేవతలు తనయందున్న గుణములనే పలికినందున విష్ణుదేవుడు ప్రసన్నుడయ్యెనని భావము అధోక్షజః-అక్షములనగా చక్షురాదీంద్రియములు, వానివలన 'జ' పుట్టినది, అక్షజం-ఇంద్రియ గోచరమగు ప్రత్యక్షాది జ్ఞానము. "అధోభూతం అక్షజం యస్మిన్ సః అధోక్షజః" ఎవ్వనిని కనుగొనుటకు ప్రత్యక్షాదికమగు ఇంద్రియజ్ఞానము చాలదో అతడు అధోక్షజుడు అనివ్యుత్పత్తి (ఇంద్రియజ్ఞానమతనికంటె క్రిందనుండునని యర్థము) పరమేష్ఠి —పరమే స్థానే తిష్ఠతీతి పరమేష్ఠీ అత్యుత్తమ స్థానమునందుండువాడు. ఇది అలుక్సమాసము. ఉణాదిసూత్రము చేత సిద్ధించిన ఇన్నంత శబ్దము.

శ్లో. తస్మై కుశలసంప్రశ్న వ్యంజిత ప్రీతయే సురాః
భయ మప్రళయోద్వేలా దాచఖ్యు ర్నైఋతోదధేః 34

వ్యాఖ్య : సురాః-దేవతలు, కుశలసం ప్రశ్న వ్యంజితప్రీతయే - కుశల సంప్రశ్న - కుశలమేకదా! అని ప్రశ్నించుటచేత, వ్యంజిత-సూచనచేయబడిన, ప్రీతయే-ప్రేమభావముగల, తస్మై-ఆవిష్ణువునకు, అప్రళయోద్వేలాత్- (అప్ర

శయ + ఉద్వేలాత్) ప్రళయ కాలము కాకపోయినప్పటికిని పొంగులు వారుచున్న నైఋతోదధేః-నైఋత-రాక్షసుడనబడు, ఉదధేః-సముద్రమువలన(గలుగుచున్న) భయం-భయమును గురించి, ఆచఖ్యుః-చెప్పిరి ఇచ్చట "సంప్రశ్న" అను పదము నందలి 'సం' అను ఉపసర్గచేత శ్రీమహావిష్ణువు దయతో కుశలమా! అని యడుగుట చేత వ్యక్తమైన ప్రీతిని ఆధారముగాఁజేసికొని తమ ప్రార్థన సఫల మగునను ధైర్యముతో మనవిచేసుకొనిరని భావము సముద్రము ప్రళయకాలమున ఉప్పొంగును. రావణుఁడను సముద్రము ప్రళయములేకయే ఉప్పొంగుచుండుట వలన తమకు కలిగిన భయాతిరేకమును దేవతలు చెప్పుటకారంభించిరి. రావణుడు చేయుచున్న దుష్కార్యములన్నీ చెప్పిరి. నైఋతుని ఉదధిగా రూపణము చేయుటచే నిది రూపకాలంకారము.

శ్లో. అథ, వేలా సమాసన్న శైల రంధ్రానునాదినా
స్వరేణోవాచ భగవాన్ పరిభూతార్ణవధ్వనిః 35

వ్యాఖ్య : అథ-దేవతలు తమకష్టములను విన్నవించిన పిమ్మట, వేలాసమాసన్నశైలరంధ్రానునాదినా-వేలా-విష్ణువు శయనించియున్న సముద్రముయొక్క తీరమునందు, సమాసన్న-నెలకొనియున్న, శైల-పర్వతములయొక్క,రంధ్ర-గుహలయందు, అనునాదినా-ప్రతిధ్వనించుచున్న, స్వరేణ-కంఠస్వరముతో, పరిభూతార్ణవధ్వనిః-తిరస్కరింపబడిన సముద్రఘోష గల, భగవాన్-శ్రీమహావిష్ణువు, ఉవాచ పలికెను. తానుపరుండిన సముద్రతీరము నందున్న పర్వతగుహలలో గంభీరముగా ప్రతిధ్వనించు కంఠస్వరము, సముద్రఘోషకంటే హెచ్చు స్థాయితో నుండునట్లు భగవంతుడు దేవతలతో భాషించెనని భావము దేవతలు, రాక్షసుని సముద్రముతో పోల్చిచెప్పిరి గనుక, ప్రస్తుత సముద్రఘోషను అణచివినిపించుచున్న విష్ణుకంఠస్వరము, రావణాహంకార హాహాకారముల నణచు నను ధైర్యము దేవతలకు లిగించిన దని వ్యంగ్యార్థము ఇచ్చటి భగవచ్ఛబ్దము సాభిప్రాయము. అనగా, "ఉత్పత్తించ వినాశంచ భూతానామాగతిం గతిమ్ వేత్తి విద్యాం మ విద్యాంచ స వాచ్యో భగవాన్ ఇతి"సర్వ ప్రాణుల ఉత్పత్తి వినాశ కారణములను,అవి ఎచ్చటినుండివచ్చి యెచ్చటికి వెళ్ళుచున్నవి అనువిషయమును విద్య అనగా నేది?అవిద్యఅనగానేమి?అనువాటిని యెరిఁగినవాడు "భగవాన్"అనఁబడును అట్టి భగవచ్ఛబ్దము నుపయోగించి విష్ణువును చెప్పుట యెంతయో సందర్భమునకనుకూలముగా నున్నది ఇట్లు సాభిప్రాయ విశేష్య

మున్న రచన "పరికరాంకురము" అనుఅలంకారముగా చెప్పఁబడును. "పరిభూతార్ణవధ్వని:" అనగా శ్రీవిష్ణువుకంఠస్వరము సముద్రధ్వనికంటే హెచ్చుగానుండి వినవచ్చుచుండె నని భావము.

శ్లో. పురాణస్య కవే స్తస్య వర్ణ స్థాన సమీరితా
బభూవ కృతసంస్కారా చరితార్థైవ భారతీ. 36

వ్యాఖ్య:- పురాణస్య-మిక్కిలి పురాతనుఁడైన, కవేః-కవియగు (సర్వజ్ఞుఁడగు) తస్య-ఆవిష్ణువుయొక్క, వర్ణస్థానసమీరితా-వర్ణ-అకారాది క్షకారాంతములైన అక్షరముల యొక్క, స్థాన-ఉత్పత్తిస్థానములగు కంఠతాల్వాది స్థానముల యందు, సమీరితా-చక్కగా ఉచ్చరింపఁబడినదియు, కృతసంస్కారా-కృత-చేకూర్చబడిన, సంస్కారా-సాధుత్వ స్పష్టోచ్చారణాది ప్రయత్నములు గలదియునగు భారతీ-వాణి, చరితార్థా-కృతార్థురాలు, బభూవ, ఏవ-తప్పక అయియుండినది సుమా; ధ ని, వర్ణ, పద, వాక్యములయందు చక్కని సంస్కారమును పొంది, విష్ణుమూ యొక్క ధీర గంభీర కంఠమునందు సరస్వతి ధన్యురాలైనదనిభావము. ఇందలి " వ"కారము, విష్ణువచనముల యర్థము తెలియక పోవుట, విపరీతముగా నర్థమగుట యనుదోషములులేక సుబోధముగా నుండెనని తెలుపుచున్నది. "కవి" శబ్దమునకున్న మహత్త్వమును స్పష్టపరచుట కాళిదాసు హృదయము.

శ్లో. బభౌ సదశనజ్యోత్స్నా సా విభోః వదనోద్గతా
నిర్యాతశేషా చరణాత్ గంగేవోర్ధ్వప్రవర్తినీ. 37

వ్యాఖ్య : విభోః-విష్ణుమూర్తియొక్క, వదనోద్గతా-ముఖమునుండి బయటికివచ్చిన (నోటినుండి వెలువడిన), సదశనజ్యోత్స్నా-వెన్నెలవంటి దంతకాంతితో కూడిన, సా-ఆభారతి, చరణాత్-పాదమునుండి, నిర్యాతశేషా-బయటికి వెళ్ళుచు మిగిలినదియై, ఊర్ధ్వప్రవర్తినీ-విష్ణుశరీరోర్ధ్వభాగమునుండి ప్రవహించుచున్న, గంగేవ (గంగా + ఇవ)-గంగానదివలె, బభౌ-ప్రకాశించెను. వి ముఖము నుండి, ఆయన దంతకాంతులతోసహా, బయటికి వచ్చిన భారతి ఒకప్పు పాదము నందు పుట్టి ప్రవహింపగామిగిలిన గంగ ఆయననోటినుండి ఊర్ధ్వదిశగా వెడలుచున్నట్టు కనపడెను. విష్ణువు దంతకాంతులను జ్యోత్స్నగా చెప్పుట శరదిందు వికాసమగు శారదధావళ్యము ననుమడించినదని తెలుపుటకే. అట్టి తెల్లని సరస్వతి

(వాక్య) ఆయననోటినుండి వెడలుచు, ఊర్ధ్వగామినియైన గంగయా? అనుకొను నట్లు ప్రకాశించె ననిభావము. గంగ, విష్ణుపాదమున పుట్టి ముల్లోకములయందు త్రిపథగ అనుపేరున ప్రవహించుననుట పురాణ ప్రసిద్ధము. అదిపూర్వవృత్తము. అట్లు పాదమునుండి వెడలగా మిగిలియున్న గంగాజలము ఈనాడు విష్ణునోటి నుండి ఊర్ధ్వముగా వెడలుచున్నదా యేమి! అనుభావమును ఆయననోటినుండి వెడలిన భారతి కలిగించుచున్నట్లు ఊహించుటచేత ఇది ఉత్ప్రేక్షాలంకారము. ఉత్ప్రేక్ష యందు చెప్పిన యుపమానవస్తువు కేవలమూహారూపమే. కనుక విష్ణునోటినుండి కూడ గంగపుట్టినదని మనము భ్రమింపరాదు. వాక్ప్రవాహమును వర్ణించుటకై కవి భారతికి ఈయుపమానమును. దంతకాంతుల సాహచర్యమును కల్పించెను.

శ్లో. జానే వో రక్షసా క్రాంతా వనుభావపరాక్రమౌ

అంగినాం తమసేవోభౌ గుణౌ ప్రథమమధ్యమౌ. 38

వ్యాఖ్య :- హేదేవాః-ఓదేవతలారా! వః-మీయొక్క, అనుభావ పరాక్రమౌ-మహిమయు, పురుషకారమును, రక్షసా-రాక్షసుడగు రావణునిచేత, అంగినాం-దేహధారులగు మానవులయొక్క, ప్రథమమధ్యమౌ-మొదటిదియు నడిమిదియు నగు, ఉభౌగుణౌ-సత్త్వము రజస్సు నను రెండుగుణములును, తమసేవ (తమసా+ఇవ) తమోగుణముచేతవలె, ఆక్రాంతౌ-ఆక్రమింపబడియున్నవని, జానే-ఎరుగుదును. ఇది విష్ణువు దేవతలతో నన్నమాట. ఓదేవతలారా! ఒక్కడేయైన రావణునిచేత దిక్పాలకాదులగు మీయందరియొక్కయు ప్రభావము, పురుషప్రయత్నమును సన్నగిల్లిపోవుట, అజ్ఞాన అంధకారాది రూపమైన తమోగుణముచేత ప్రథమ మధ్యమ గుణములగు సత్త్వరజస్సుల ప్రభావము తగ్గినట్లున్నది. ఇది నేనెరుగుదును. సత్త్వ రజ స్తమో గుణములను వరుసలో సత్త్వము ప్రథమము, రజస్సు మధ్యమము అగును. చివరిదియగు తమస్సు మొదటి రెంటిని పరాభవించుట అధముడు ఉత్తమ మధ్యమాధికారులను తిరస్కరించినట్లున్నది. ఇదిమీకు అత్యంతబాధాకరమైన విషయ మని నేనెరుగుదునని విష్ణువు పలికెను. అలంకారము : ఉపమ.

శ్లో. విదితం తప్యమానం చ తేన మే భువనత్రయమ్

అకామోపనతే నేవ సాధో ర్హృదయ మేనసా. 39

వ్యాఖ్య : కించ-మరియును, అకామోపనతేన-కోరకయే ప్రమాదము చేత వచ్చిపడిన, ఏనసా-పాపముచేత, సాధోః-సజ్జనునియొక్క, హృదయం, ఇవ-మనస్సువలె, తేన-ఆరావణునిచేత, తప్యమానం-సంతాపమును పొందింపబడుచున్న, భువనత్రయంచ-ముల్లోకము సైతము, మే, విదితం-నాకు తెలియుచునే యున్నది (నాచేత తెలియబడుచున్నది అని వాక్యమున కర్థము). సాధువు పాపము చేయఁడు, కోరడు.కాని నిష్కారణముగా పాపము అతనిపై వచ్చిపడినప్పు డతని హృదయము మిక్కిలి బాధపడును. అట్లే రావణుఁడు స్వార్థపరుఁడై చేయుచున్న తపస్సును ఏమరుపాటున ఉపేక్షించిన యింద్రాదులును, లోకములును ఈనాడతనిచేత బాధింపఁబడుచున్న విషయమును నేను చూచుచునే యున్నానని విన్నవనెను. అలంకారము : ఉపమ.

శ్లో. కార్యేషు చైకకార్యత్వా దభ్యర్థ్యోఽస్మి న వజ్రిణా
స్వయ మేవ హి వాతో ఽగ్నే స్సారథ్యం ప్రతిపద్యతే. 40

వ్యాఖ్య : కించ-మరియు, ఏకకార్యత్వాత్-ఉభయులము ఒకేపని చేయ వలసినవార మగుటచేత, కార్యేషు-చేయదగిన పనులయందు, వజ్రిణా-ఇంద్రునిచేత, అభ్యర్థ్యః-"ఈపనిచేసి పెట్టుము" అని ప్రార్థింపఁదగినవాడను, న, అస్మి-కాను, హి-అదిఅంతేకదా! వాతః-వాయువు, స్వయమేవ-తనకుతానే, అగ్నేః-అగ్నికి, సారథ్యం-సాహాయ్యమును, ప్రతిపద్యతే-పొందుచున్నది (చేయును). కోరకయే వాయువు అగ్నికి సహాయముగా నుండునట్లు నేను ఇంద్రునికి సహాయుఁడనై యుండుటకై యతఁడు నన్ను ప్రార్థింప నక్కఱలేదు. ఇద్దరికిని రావణవధరూపమైన కార్యము సమానమే. అని విన్నవనెను.

శ్లో. స్వాసిధారా పరిహృతః కామం చక్రస్య తేన మే
స్థాపితో దశమో మూర్ధా లభ్యాంశ ఇవ రక్షసా. 41

వ్యాఖ్య : స్వాసిధారాపరిహృతః- స్వ-తనయొక్క (రావణునియొక్క) అసిధారా-ఖడ్గముయొక్క అంచుచేత, పరిహృతః-వదలివేయబడిన, దశమః, మూర్ధా-పదియవతల, కామం-పూర్తిగా, లభ్యాంశః, ఇవ-పొందదగిన భాగమో యనునట్లు, తేనరక్షసా-ఆ రాక్షసునిచేత, స్థాపితః-నిలుపబడి యున్నది. పూర్వం రావణుఁడు పరమేశ్వరునిఁ దృప్తిపరచి వరములను పొందుటకై ఒక్కొక్కసారి

తనతలనొక్కొక్కదానిని ఖండించి హోమము చేయుచుండగా పదియవతలను నరుకుకొన బోవునప్పుడు బ్రహ్మ సాక్షాత్కరించి యతనికి కోరినవరములన్నిటిని యిచ్చెను. దానిని విష్ణువు, రావణుడు తొమ్మిదితలలను తన చంద్రహాసమను ఖడ్గముతోఛేదించుకొని, పదియవతలను విష్ణుచక్రమునకు భాగముగానుంచినట్లు ఊహించి పలికెను. ఆయూహ సత్యముకాదు కనుక ఇది ఉత్ప్రేక్షాలంకారము. అనగా శ్రీమహావిష్ణువు రావణాసురునిఁ దప్పక వధించెద ననుభావమును దేవతలకు సూచించెనని తాత్పర్యము.

శ్లో. స్రష్టు ర్వరాతిసర్గాత్తు మయా తస్య దురాత్మనః
అత్యారూఢం రిపో స్సోఢం చందనేనేవ భోగినః 42

వ్యాఖ్య : తు (కింతు)-కాని, స్రష్టుః-బ్రహ్మయొక్క,వరాతిసర్గాత్ (వర + అతిసర్గాత్)-వరదానము వలన, మయా-నాచేత, తస్య, దురాత్మనః-ఆదురాత్ముఁడైన, రిపోః-శత్రువుయొక , అత్యారూఢం (అతి + ఆరూఢం; భావార్థక "క్త" (ప్రత్యయరూపం)-మిక్కిలి కెక్కుట, అతివృద్ధి, భోగినః-సర్పముయొక్క, అత్యారూఢం-అతివృద్ధి, చం నేన, ఇవ-శ్రీగంధపు చెట్టుచేత వలె, సోఢం-సహింపబడినది. బ్రహ్మ యిచ్చిన వరమువ రావణుఁడు మితిమీరిన వృద్ధిని పొంది అందరిపైకి నెక్కుచున్నాడు. ఆ వృ నేను, చందనవృక్షము తన తలపైకెక్కుచున్న సర్పవృద్ధిని వలె సహించుచు ను. విధి వ్రాలుగాని, విధివరముగాని అనుల్లంఘనీయము, కనుక రావణాత్యారూఢము సహింపబడుచున్నదని విష్ణువు చెప్పెను రావణుఁడు "విశ్రవస్సు" అను బ్రహ్మకు పుత్రుఁడు, పులస్త్యబ్రహ్మకు పౌత్రుఁడు; పులస్త్యుడు బ్రహ్మకు కుమారుఁడు.

శ్లో. ధాతారం తపసా ప్రీతం యయాచే స హి రాక్షసః
దైవా త్సర్గా దవధ్యత్వం మర్త్యే ష్వాస్థా పరాఙ్ముఖః 43

వ్యాఖ్య : సః, రాక్షసః-ఆరావణాసురుఁడు, తపసా-తన తపస్సుచేత, ప్రీతం-సంతోషించియున్న, ధాతారం-బ్రహ్మను, మర్త్యేషు-మానవుల విషయమున ఆస్థాపరాఙ్ముఖః (సః) శ్రద్ధలేనివాడగుచు, దైవాత్-దేవతాసంబంధమైన, సర్గాత్-సృష్టివలన, అవధ్యత్వం-తాను చంపబడకుండుటను, యయాచే, హి-యాచించెను సుమా! రావణుఁడు తపస్సుచేత బ్రహ్మను తృప్తిపరచి, దైవజాతిలోని గరుడ,

గంధర్వ, కిన్నర, కింపురుష, సిద్ధ, సాధ్య, విద్యాధర యక్షులనబడు నెనిమిది తెగలలో నెవ్వరును తనను చంప జాలకుండునట్లు వరమును కోరెను. మానవులు తనకు లెక్కలోనివారు కానందున వారినుండి అవధ్యత్వమును కోరలేదు కాగా దేవతలు, దేవేంద్రుడు, దేవాధిదేవుడైన విష్ణువు సైతము వానిని చంపుటకు వీలులేదని చెప్పెను.

శ్లో. సో౽హం దాశరథి ర్భూత్వా రణభూమే ర్బలిక్షమమ్
కరిష్యామి శరై స్తీక్ష్ణైః తచ్ఛిరః కమలోచ్చయమ్. 44

వ్యాఖ్య: సో౽హం (సః + అహం)-ఆనేను, దాశరథిః-దశరథపుత్రుడుగా భూత్వా-అయి, తీక్ష్ణైః, శరైః-తీవ్రములగు బాణములచేత, తచ్ఛిరః-కమలోచ్చయం (తత్ + శిరః + కమల + ఉచ్చయం)-ఆరావణునియొక్క శిరస్సులనెడి కమలముల సమూహమును, రణభూమేః-యు భూమికి, బలిక్షమం-పూజకు తగిన దానినిగా, కరిష్యామి-చేయగలను (చేసెదను . ఇంత వరకు బ్రహ్మవరము కారణముగా నేను రావణుని గర్వాతిరేకమును హించితిని. కాని ఇక గతియేమని మీరు చింతింపనక రలేదు. దశరథుడు మానవజాతిరాజు కనుక నేను అతనికి కుమారుడనై పు , రావణుని తలలను తీక్ష్ణశరములచేత త్రుంచి, కమలముల చేతవలె ఆ తలలచే రణభూమికి పూజచేయుదును. అనగా రావణుని చంపివేయుదును చింతింపకుడని చెప్పెను. ఒక దేవతను పూజించు వస్తువులలో పుష్పములు ముఖ్యము. కనుక రణభూమి దేవతా పూజనమునకు రావణుని తలలు పుష్పములుగా (కమలములుగా) చెప్పబడినవి.

శ్లో. అచిరా ద్యజ్వభి ర్భాగం కల్పితం విధివ త్పునః
మాయావిభి రనాలీఢ మాదాస్యధ్వే నిశాచరైః. 45

తై: హేదేవాః-ఓదేవతలారా! యజ్వభిః-యజ్ఞము చేయువారిచేత (యాజ్ఞికు ల), విధివత్-శాస్త్రప్రకారముగ కల్పితం-కల్పింపబడిన (మీకొఱ కల్పింప , భాగం-హవిర్భాగమును, మాయావిభిః - మాయలుచేయువారగు, నిశాచరైః-రాక్షసులచేత, అనాలీఢం - ఆస్వాదింపబడకుండునట్లుగా, అచిరాత్ - స్వల్పకాలములోనే, ఆదాస్యధ్వే - గ్రహింపగలరు. రావణుని సహాయము వలన రాక్షసులు దేవతలకొఱకై యాగకర్తలు కల్పించిన హవిర్భాగములను మాయలచేత

అపహరించుచుండిరి. దేవతలకు సోమపానము, హవిర్భాగములు కఱవై బహు కాలము గడచినది. ఇక త్వరలోనే మీకు రాక్షసబాధను తొలగించి, హవిర్భాగములు అందునట్లు చేయగలను అని విష్ణువు చెప్పెను. శ్రీరాముడు తన ముప్పది యెనిమిదవ సంవత్సరమున రావణవధ చేయును గనుక గతకాలము అనగా రావణుని ఆయుష్యకాలము కంటే ఇది స్వల్పము కనుక "అచిరాత్" అని చెప్పెను. ఇక మీద రాక్షసులు హవిర్భాగములను రుచిమాడజాలరు, అనగా వారినెల్ల వధించెదనని భావము.

శ్లో. వైమానికాః పుణ్యకృత స్త్యజంతు మరుతాం పథి
పుష్పకాలోక సంక్షోభం మేఘావరణ తత్పరాః 46

వ్యాఖ్య : మరుతాం-దేతలయొక్క, పథి-మార్గమునందు (ఆకాశమార్గమున) వైమానికాః-విమానములపై నెక్కి తిరుగునారై, మేఘావరణతత్పరాః-రావణుని భయము వలన మేఘములచాటున వెళ్ళుదలచుకొన్న, పుణ్యకృతః - పుణ్యాత్ములగు వారు, పుష్పకాలోక సంక్షోభం—పుష్పకాలోక-యదృచ్ఛగా రావణుని పుష్పక విమానము కనబడుటచేత కలుగు సంక్షోభం-భయముతో వణకుటను, త్యజంతు-ఇకమీద విడుతురుగాక. ఆకాశమా మున విమానములపై నెక్కి తిరుగు దేవతలు, యజ్ఞయాగములు చేసి పుణ్యా న పూనవులును, తమ విమానములు మేఘముల చాటున నడచునట్లు చేయుచు, క్రమముగా రావణుని పుష్పక విమాన దర్శనము జరిగినప్పుడు భయచకితు లగుచున్నారు. ఇకమీద వారి కెట్టి భయముండబోదు, అనగా రావణుడు వధింపబడునని భావము. సంక్షోభ మనగా భయముతో వణకుట. "సంక్షోభోభయచకితమ్" అని శబ్దార్ణవ నిఘంటువు.

శ్లో. మోక్ష్యధ్వే స్వర్గబందీనాం వేణీబంధా నదూషితాన్
శాప యంత్రిత పౌలస్త్య బలాత్కార కచగ్రహైః 47

వ్యాఖ్య : శాపయంత్రితపౌలస్త్య బలాత్కార కచగ్రహైః-శాప-నలకూబరుని శాపముచేత, యంత్రిత-ఆపివేయబడిన, పౌల స్త్య-రావణునియొక్క, బలాత్కార-బలాత్కారముచేతనైన, కచగ్రహైః - కేశాక ర్షణములచేత, అదూషితాన్-అనుపహతములుకాని (మలినములై తెగిపోని), స్వర్గబం నాం - రావణునిచే నపహరింపబడిన స్వర్గస్త్రీల యొక్క, వేణీబంధాన్-కేశబంధములను (జుట్టుముడులను) మోక్ష్యధ్వే-విడువ గలుగుదురుగాక. స్వర్గవాసినులైన స్త్రీలలోని యందగత్తెల

నందరిని అపహరించుకొనిపోయి రావణుఁడు లంకలో బందీలనుగా నుంచెను. కాని వారిని బలాత్కరించి చెరుపఁజాలక పోయెను. కారణ మేమనగా నొకప్పుడు రంభ అలంకరించుకొని తన ప్రియుఁడగు నలకూబరుని వద్దికి వెళ్ళుచుండగా దారిలో తారసిల్లిన రావణుఁడు ఆమెను బలాత్కరించి భోగించెను ఆ సంగతి తెలిసిన నలకూబరుడు, "ఇకమీద నీవు ఏ స్త్రీనిగాని బలాత్కరించి భోగించినచో నీతల నూరువక్కలై చత్తువు" అని రావణునికి శాపము పెట్టెను అందువలన స్వర్గస్త్రీలను బందీలుగా నుంచెనే కాని, రావణుఁడు వారిలో నొకరినైనను భోగింపఁజాలక పోయెను. ఇదే కారణముచేత సీతాదేవి తన లంకలో నున్నను ఆమె అంగీకారము నకై యర్థించి, లోభపరచి, భయపెట్టెనే కాని బలాత్కారమునకు సిద్ధపడలేదు. ఈ విషయము నెరుగని రామాయణ విమర్శకులు సీతా పాతివ్రత్యమును గూర్చి యనుమానమును వెల్లడించి లోకమును మోసపుచ్చఁజూచుట దుస్సాహసము. శ్రీమహావిష్ణువు దేవతలతో అట్టి మీ స్వర్గస్త్రీల కేశబంధములు, అదూషితములై చిక్కుమాత్రము పడియున్నవి. వాటి నింక మీరు విప్పగలుగుదురు. అనగా రావణవధా నంతరము పవిత్రలైయున్న మీ మీ భార్యలను మీరు పొందెదరని చెప్పెను.

శ్లో. రావణావగ్రహ క్లాంత మితి వాగమృతేన సః
అభివర్ష్య మరుత్సస్యం కృష్ణమేఘ స్తిరోదధే 48

వ్యాఖ్య : సః,కృష్ణమేఘః-ఆ విష్ణువనెడి మేఘము (నీలమేఘము), రావణావగ్రహక్లాంతం-రావణ-రావణాసురుడను, అవగ్రహ-అనావృష్టిచేత, క్లాంతం-వాడిపోయియున్న, మరుత్, సస్యం-దేవతలనెడు పైరును, ఇతి-ఇట్లు (పూర్వము చెప్పిన రీతిగా), వాగమృతేన-వాక్కులను అమృతముచేత (నీటిచేత) అభివర్ష్య-తడిపి (అభిషేకించి), తిరోదధే-అంతర్థానమును జెందెను. వెనుక చెప్పిన మాటలతో దేవతలను తృప్తిపరచి విష్ణుమూర్తి అంతర్థానము చెందెనని భావము ఇచ్చట దేవతలను సస్యముగాను, రావణాసురుని అనావృష్టిగాను, విష్ణుమూర్తిని నీల మేఘముగాను రూపణము చేయుటచేత ఇది సావయవ రూపకాలంకారము ఈ యలంకారమువలన దేవతాసమూహము రావణ నిదాఘత్వ, అవగ్రహత్వముల చేత సస్యమువలె మాడిపోవుచుండగా నీలమేఘమైన విష్ణువు వర్షించి ఆపైరును పునరుజ్జీవింప జేసెను నను భావము స్పష్టపడుచున్నది. రావణశబ్ద వ్యుత్పత్తి : 'విశ్రవసః అపత్యంపుమాన్' అను విగ్రహముచేత రావణః' అను తద్ధి

తాంత శబ్దము ఏర్పడును. ఎట్లనగా, విశ్రవః శబ్దమునకు "శివాదిభ్యోఽణ్" అను సూత్రముచేత అపత్యార్థకమగు "అణ్" ప్రత్యయము చేర్పగా, "విశ్రవసో విశ్రవణ రవణౌ" అను అంతర్గణ సూత్రముచేత విశ్రవః శబ్దమునకు వృత్తి విషయమున "రవణ" అను ఆదేశము వచ్చును. ఆ రవణ అనుదానికి ఆదివృద్ధి వచ్చి "రావణ" అను శబ్దము సిద్ధించు నని మల్లినాథుఁడు వ్యాఖ్యానించెను.

శ్లో. పురుహూత ప్రభృతయః సురకార్యోద్యతం సురాః
అంశై రనుయయు ర్విష్ణుం పుష్పై ర్వాయుమివ ద్రుమాః 49

వ్యాఖ్య : పురుహూత ప్రభృతయః-ఇంద్రుఁడు మొదలయిన, సురాః-దేవతలు, సురకార్యోద్యతం-దేవకార్యమైన రావణవధ యందు ఉద్యుక్తుఁడైన, విష్ణుం-విష్ణుమూర్తిని, అంశైః-తమ తమ అంశలచేత, ద్రుమాః-వృక్షములు, పుష్పైః-తమ శరీర భాగములగు పువ్వులచేత, వాయుం, ఇవ-వాయువునువలె, అనుయయుః-అనుసరించి వెళ్ళిరి. దేవకార్యమగు రావణవధకై విష్ణువు దశరథుని కుమారుఁడుగా పుట్టుటకు వెళ్ళగా, దేవతలు స్వర్గమునకు తిరిగిపోయిరి. కాని వారి యంశములు సుగ్రీవాది వానరరూపముల నెత్తి విష్ణువునవతారమగు రామునికి తోడ్పడుటకై భూలోకమున కేగెనని భావము. తామున్న చోటనే యుండి తమ యంశములు వెళ్ళునట్లు చేయుటలో వృక్షములు పుష్పరూపమున వాయువువెంట వెళ్ళుట నుపమానముగాఁ జెప్పుట చాల గొప్పగా నున్నది. అలంకారం : ఉపమ.

శ్లో. అథ తస్య విశాం పత్యు రంతే కామ్యస్య కర్మణః
పురుషః ప్రబభూవాగ్నే ర్విస్మయేన సహర్త్విజామ్ 50

వ్యాఖ్య : అథ-అటు తరువాత, తస్య, విశాంపత్యుః-ఆ దశరథమహారాజు యొక్క, కామ్యస్య కర్మణః-పుత్రకామే యొక్క, అంతే-ముగింపునందు, అగ్నేః-హోమాగ్నినుండి, ఒకానొక దివ్యపు మఁడు (ప్రాజాపత్య పురుషుఁడు), ఋత్విజాం-యజ్ఞమును చేయించుచున్న బ్రాహ్మణులయొక్క, విస్మయేన, సహ-ఆశ్చర్యముతోపాటు, ప్రబభూవ-పుట్టెను. దశరథుఁడు చేయుచున్న పుత్రకామేష్టి ముగియుట, క్షీరసాగరమున విష్ణువు అంతర్ధానము నొందుట యేకకాలమున జరిగినవి. విష్ణువు పాలలో ప్రవేశింపగా చరురూపమైన దానినితీసుకొని, ప్రాజాపత్య పురుషుడు హోమాగ్నినుండి ఆవిర్భవించెను. ఋత్విక్కు లిట్టివింత నెప్పుడును జూచియుండకపోవుటచేత వారికాశ్చర్యము కలిగినది. పురుషావిర్భావము, ఋత్వి

జుల ఆశ్చర్యము, ఏకకాలమున సహభావముతో పుట్టుటచేత ఇది సహోక్తి" అను అలంకారము కార్యకారణములకు పౌర్వాపర్యము లేక సహభావము రంజకముగా నుండుటయే సహోక్తి "

శ్లో. హేమపాత్ర గతం దోర్భ్యా మాదధానః పయశ్చరుమ్,
అనుప్రవేశా దాద్యస్య పుంస స్తేనాపి దుర్వహమ్ 51

వ్యాఖ్య : ఆద్యస్య-సృష్టికి మొదటివాఁడైన, పుంసః-పురుషునియొక్క (విష్ణువుయొక్క), అనుప్రవేశాత్-అధిష్ఠానమువలన (చేరుటవలన), తేన, అపి-అగ్నినుండి వచ్చిన ఆ ప్రజాపత్యపురుషుని చేతకూడ, దుర్వహం-మోయశక్యము గాని, హేమపాత్రగతం-బంగారుగిన్నె యందున్న, పయశ్చరుం-పాలతోవండిన అన్నమును (పాయసాన్నమును), దోర్భ్యాం-రెండు చేతులతోను, ఆదధానః-ధరించుచున్నవాఁడగుచు అగ్నినుండి పురుషుఁడావిర్భవించెనని వెనుకటి శ్లోకముతో అన్వయము) బ్రహ్మం మంతయు తనయుదరమునయున్న విష్ణువు ప్రవేశించుట చేత పాయసాన్నము మిక్కిలి బరువుగా నుండుటచేత ఆ పురుషుకు మోయలేక మోయలేక దానిని రెండుచేతులతో పట్టుకొని పైకివచ్చెనని భావము. చరువనగా వార్చకుండ యజ్ఞాగ్నిలో ఉడుకజేసిన యన్నము. అది నీళ్ళతోగాక పాలతోనే యుడికింపఁబడుటచేత "పయశ్చరువు"గాఁ జెప్పబడినది.

శ్లో. ప్రాజాపత్యోపనీతం త దన్నం ప్రత్యగ్రహీ న్నృపః
వృషేవ పయసాం సార మావిష్కృత ముదన్వతా 52

వ్యాఖ్య : నృపః-దశరథమహారాజు, ప్రాజాపత్యోపనీతం-ప్రజాపత్య-ప్రజాపతి (బ్రహ్మ)కి సంబంధించిన పురుషునిచేత, ఉపనీతం-తనవద్దికి తీసుక రాబడిన, తదన్నం (తత్ + అన్నం) ఆ పాయసాన్నమును, ఉదన్వతా-సముద్రుని చేత, ఆవిష్కృతం-వెలువరింపబడిన, పయసాం-పాలయొక్క, సారం-సారభూత మైన యమృతమును, వృషేవ (వృషా, ఇవ) ఇంద్రుఁడువలె, ప్రత్యగ్రహీత్-స్వీక రించెను. క్షీరసముద్రము బయల్పరచిన యమృతము నింద్రుఁడు సంతోషముతో తీసుకొన్నట్లు దశరథుఁడానందముతో ప్రాజాపత్య పురుషుఁ డందిచ్చిన ఆ పాయ సాన్నమును ప్రతిగ్రహించె నని భావము. అలంకారము : ఉపమ "వాసవో, వృత్రహా, వృషా" అని యింద్రుని పేర్లు. (అమరం)

శ్లో. అనేన కథితా రాజ్ఞో గుణా స్తస్యా న్యదుర్లభాః
ప్రసూతిం చకమే తస్మిన్ త్రైలోక్య ప్రభవోఽపి యత్ 53

వ్యాఖ్య : తస్య-ఆ దశరథునియొక్క (సంబంధించిన), అన్యదుర్లభాః-ఇతరులకు లభ్యములుకాని, గుణాః-గుణములు, అనేన-ఈ చెప్పబోవు కారణము చేత, కథితాః-చెప్పబడినవి (వెల్లడియైనవి), యత్-ఎందువల్లనైతే, త్రైలోక్య ప్రభవః, అపి-త్రైలోక్య-త్రిలోకసముదాయమునకు, ప్రభవః, అపి-జన్మ కారణ మగు విష్ణువుకూడ, తస్మిన్-ఆ దశరథునియందు, ప్రసూతిం-ఉత్పత్తిని, చకమే-కోరెనో. త్రిభువన జన్మహేతువైన విష్ణువే అతనియందు జన్మింపఁగోరుట దశ రథుని ఉత్కృష్టగుణములకు పరమావధియని "అనేనకథితాః" అని కవి ప్రయోగించెను. అలంకారము : కావ్యలింగము.

శ్లో. స తేజో వైష్ణవం పత్న్యో ర్విభేజే చరుసంజ్ఞితమ్
ద్యావా పృథివ్యోః ప్రత్యగ్ర మహర్పతి రివాతపమ్. 54

వ్యాఖ్య : సః-ఆ దశరథుఁడు, చరుసంజ్ఞితం-చరువను పేరుగల, వైష్ణవం-విష్ణు సంబంధమగు, తేజః-తేజస్సును, పత్న్యోః ఇద్దరు భార్యలకు (కౌసల కు, కైకేయికి) ద్యావాపృథివ్యోః-భూమికిని, ఆకాశమునకును, అహర్పతిః-సూరు డు ప్రత్యగ్రం-నూతనమైన, ఆతపం, ఇవ-ఎండనువలె (లేత యెండనువలె) వి జే-పంచి యిచ్చెను. చరుసంజ్ఞిత మైన పాయసాన్నము విష్ణు తేజోమయము కనుక దానికి బాలాతపము ఉపమానముగాఁ జెప్పబడినది. దాని ననుసరించి దశరథునికి సూర్యోపమానము; కౌసల్యా కైకేయీలకు ద్యావా పృథువులు పోలికలుగా జెప్పఁ బడినవి. ఈపాయస విభాగమునందు వాల్మీకి రామాయణమునకు భిన్నముగా కాళిదాసు చెప్పుటలోఁగల స్వారస్యము దశరథునికి కైకమీదఁగల అత్యంతాను రాగము, రామవనవాసాది భవిష్యద్రామాయణ కథలో కైకకు గల ప్రాధాన్యము నని యూహింపవలసి యుండును. రామాయణమున మొదట చరువు సందర్ధభాగము కౌసల్యకును, మిగిలినదానిలో సగభాగము సుమిత్రకును, ఆ తరువాత మిగిలిన దానిలో సగము కైకకును ఇచ్చి, శేషించిన భాగమును మరల సుమిత్రకును ఇచ్చినట్లున్నది. కాని ఆ విభాగదానము, భరత జన్మ సందర్భమున "సాక్షాద్విష్ణో శ్చతుర్భాగః" అని చెప్పిన వాక్యముతో విరోధించుచున్నది. కనుక కాళిదాసు సవరించి, రసదృష్టితో సమంజసముగాఁ జెప్పెను. అలంకారము : ఉపమ.

అవతారిక : ముగ్గురు భార్యలుండగా నిద్దరికే పంచియిచ్చుటకుఁగల కారణ మును జెప్పుచున్నాఁడు.

శ్లో. అర్చితా తస్య కౌసల్యా ప్రియా కేకయవంశజా
అతః సంభావితాం తాభ్యాం సుమిత్రా మైచ్ఛ దీశ్వరః 55

వ్యాఖ్య : తస్య-ఆ దశరథునికి, కౌసల్యా-కౌసల్య, అర్చితా-పూజ్యురాలు. కేకయవంశజా-కైకేయి, ప్రియా-ఇష్టురాలు. అతః-ఇందువలన, ఈశ్వరః-ప్రభు వగు దశరథుఁడు, సుమిత్రాం-సుమిత్రను, తాభ్యాం-ఆ సల్యా కైకేయీలచేత, సంభావితాం-గౌరవింపబడు దానినిగా, ఐచ్ఛత్-కోరెను. దశరథుఁడు దక్షిణ నాయకుఁడు, కనుక పూజ్యురాలైన కౌసల్యకును, ప్రియురాలైన కైకకును పాయసభాగము లిచ్చి వారిద్దరును తమ భాగములలోఁ గొంత కొంత భాగమును సుమిత్ర కిచ్చునట్లు కోరెను. దీనివలన దశరథునికి సుమిత్రపై గౌరవము, ప్రేమయు నున్నట్లు స్పష్టపడుటయేకాక సవతులకు పరస్పర సామరస్య మున్న ట్లును దెలియును. తానే ముగ్గురికిని పంచి యిచ్చినచో దశరథునియందుగల దక్షిణ నాయకత్వ కౌశలముగాని, కౌసల్యాదులకున్న పరస్పర ప్రేమానురాగములు గాని వ్యక్తము కావు. కనుక కాళిదాసు రామాయణమునుగాక నారసింహాది పురాణముల ననుసరించి ఈ మార్పు చేసెనని తెలియవలెను.

శ్లో. తే బహుజ్ఞస్య చిత్తజ్ఞే పత్న్యౌ పత్యుర్మహీక్షితః
చరో రర్ధార్ధ భాగాభ్యాం తా మయోజయతా ముభే. 56

వ్యాఖ్య : బహుజ్ఞస్య-సర్వజ్ఞుఁడును, ఉచిత ఁడునైనట్టియు, మహీక్షితః-రాజును నగు, పత్యుః-భర్తయొక్క, చిత్తజ్ఞే-అభిప్రాయము నెరిఁగిన, తే, ఉభే, పత్న్యౌ-ఆ యిద్దరు భార్యలును (కౌసల్యయు, కై యు), చరోః-పాయసాన్నము యొక్క, అర్ధార్ధ భాగాభ్యాం-తమ భాగములలోని సగములోని సగభాగములతో (అనగా మూడువంతులు తాముంచుకొని చతుర్థభాగమునని యర్థము), తాం-ఆసు మిత్రను, అయోజయతాం-సంబంధము కలదానినిగాఁజేసిరి (అనగా సుమిత్ర కిచ్చిరి). దశరథుని యభిప్రాయము నెరిగియున్నవారు కనుక కౌసల్యయు, కైకయు, తమ భాగములలోఁ గొంతకొంత భాగమును సుమిత్రకిచ్చి గౌరవించిరని భావము. "అర్ధార్ధ భాగాభ్యాం" అనువిభాగము వాల్మీకి సమ్మతము కాదు. అయినను శ్రీరామునికిని భరతునకును, లక్ష్మణ శత్రుఘ్నులకును గల సామ్య

మును స్ఫురింపఁజేయుటకై ఇట్టి విభాగమును కాళిదాసు చెప్పెను. ధార్మికత్వము నందు భరతుఁడు రామునికిఁ దీసిపోఁడన్నది ఆయన యభిప్రాయముగా నోపును. ఏమైనను ఈ పాయసాన్న విభజనమందు వాల్మీకి కాళిదాసులకు ఏకాభిప్రాయము లేనట్లు వారి రచనలవలనఁ దెలియుచున్నది.

శ్లో. సాపి ప్రణయ వత్యాసీత్ సపత్న్యో రుభయో రపి
భ్రమరీ వారణ స్యేవ మదనిష్యంద లేఖయోః 57

వ్యాఖ్య : సా, అపి-ఆసుమిత్రయు, ఉభయోః-ఇరువురైన, సపత్న్యోః అపి-సవతులయందు కూడ, భ్రమరీ-ఆడుతుమ్మెద, వారణస్య-ఏనుగుయొక్క, మదనిష్యందరేఖయోరివ-మదనిష్యంద-మదస్రావముచేత నేర్పడిన, రేఖయోరివ-ఏనుగు గండస్థలములపైని చారలమీద వలె, ప్రణయవతీ-ప్రేమగలది, ఆసీత్-ఆయ్యెను. ఆవిధముగా పాయసాన్నమును పంచియిచ్చిన సవతులిద్దరియందును సుమిత్ర, ఒక ఆడుతుమ్మెద గజగండ స్థలములపై (చెక్కిళ్ళపై) స్రవించు మద ధారారేఖలమీద వలె, మిక్కిలి ప్రేమగలదాయెను. ఇచ్చటి సపత్నీ శబ్దము యౌగి కార్థమునందు సాభిప్రాయము. "సమానఃపతిః యయోః తే సపత్న్యౌ తయోః సపత్న్యోః" అను విగ్రహము నందుఁగల సమాన శబ్దము వలన దశరథుఁడు తన యందును, కౌసల్యా కైకల యందును సమాన ప్రేమ గలవాడే యనునర్థము సిద్ధించుట చేతను, వారు పాయసమును బంచి యిచ్చుటచేతను. ఆ ఇద్దరియందును సుమిత్ర ప్రణయవతియైనది. అట్లు సుమిత్రకు పాయస భక్షణానంతరమే కలిగిన ప్రణయము, తన కుమారులుగాఁ బుట్టబోవు లక్ష్మణ శత్రుఘ్నులకు, రాముని యందును, భరతునియందును విశేష భ్రాతృప్రేమగా మారి రామలక్ష్మణులు, భరత శత్రుఘ్నులు అను జంటలుగా నేర్పడుటకు బీజప్రాయమని ధ్వనించు చున్నది. దశరథునికి కౌసల్యా కైకలపై కంటే సుమిత్రపై తక్కువ ప్రేమ యుండెనని భావింపకూడదు.

శ్లో. తాభి ర్గర్భః ప్రజాభూత్యై దధ్రే దేవాంశ సంభవః
సౌరీభి రివ నాడీభి రమృతాఖ్యాభి రమ్మయః 58

వ్యాఖ్య : తాభిః-ఆ ముగ్గురు దశరథ భార్యలచేత, ప్రజాభూత్యై- ప్రజల యభ్యుదయము కొరకు, దేవాంశ సంభవః-దేవ-విష్ణుదేవుని యొక్క, అంశసంభవః అంశలు కారణముగాగల, గర్భః-గర్భము (గర్భములని యర్థము, ఇది జాత్యేక

వచనము), సౌరీభిః-సూర్య సంబంధినులగు, అమృతాఖ్యాభిః, నాడీభిః-అమృతము లను పేరుగల నాళములచేత (కిరణములచేత), అప్మయీః (అప్+మయీః) జల మయమైన, గర్భః ఇవ-గర్భమువలె, దధే-ధరింపబడెను. కౌసల్యా కైకేయీ సుమిత్రలు గర్భవతులైరని భావము. దేవాంశ సంభవము లైన వారి గర్భములందు జనింపబోవు రామాదులవలన రఘువంశ విభూతియేకాక ప్రజాభ్యుదయము కూడ గలుగనున్నదని సూచితమైనది. సూర్య కిరణములలో గొన్నింటికి "అమృతము" లనిపేరు, అవి జలమయగర్భములు ధరించి వర్షముగురియును. సూర్యుడు సహస్ర కిరణుడని ప్రసిద్ధి. అందులో "చ తుశ్శతం వృష్టివాహాస్తాస్సర్వా అమృతాః స్త్రియః" అని చెప్పిన యాదవప్రకాశుని ననుసరించి నాలుగువందల కిరణము "లమృతము" లనుపేరుతో వర్షమును కురిపించును. ఇందలి "అమృతాఖ్యాభిః" అనుపదము, కాళిదాసుయొక్క భౌతిక, జ్యోతిష, శాస్త్రపాండిత్యమును వెల్లడించు చున్నది

శ్లో. సమ మాపన్నసత్త్వా స్తా బభు రాపాండురత్విషః

అంతర్గతఫలారంభా సస్యానా మివ సంపదః 59

వ్యాఖ్య : సమం-ఏకకాలమునందు. ఆపన్నసత్త్వాః-గర్భవతులై యున్నారు కనుక, ఆ పాండురత్విషః-కొంచముతెల్లనికాంతిగల, తాః-ఆరాజ పత్నులు ముగ్గురును, అంతర్గత ఫలారంభాః-లోపలనున్న ఫలోత్పత్తి గల. సస్యా నాం-పైరులయొక్క, సంపదః, ఇవ-సంపత్తులవలె, బభుః- ప్రకాశించిరి ఈనమో సిన పైరులు తెలుపురంగు తిరుగుట సహజము. అట్లే గర్భవతులైన రాజపత్నులు కొంచము తెల్లనికాంతి గలవారుగా మారిరని భావము. పూర్వశ్లోకమునందు జల గర్భమును వహించిన సూర్యనాడులతోను, ఈశ్లోకమున ఘనపదార్థముగా మారు సస్యములతోను పోలిక చెప్పుటచేత వారిగర్భముల పరిణామము తెలుపబడినది. "ఆపన్నాః-గృహీతాః, త్వాః-ప్రాణినః, యాభిస్తాః ఆపన్నసత్త్వాః-గర్భిణ్యః" అని విగ్రహము. "ఆపన్నసత్త్వా స్యా ద్గుర్విణ్యం తర్వత్నీ చ గర్భిణీ" అని యమ రము. అలంకారము: ఉపమ.

శ్లో. గుప్తం దదృశు రాత్మానం సర్వా స్స్వప్నేషు వామనైః

జలజాసి గదా శార్ఙ్గ చక్ర లాంఛిత మూర్తిభిః 60

వ్యాఖ్య : సర్వాః-ఆరాజపత్నులు ముగ్గురును, స్వప్నేషు-స్వప్నములయందు, జలజ, అసి, గదా, శార్ఙ్గ, చక్ర, లాంఛిత, మూర్తిభిః-శంఖ, ఖడ్గ, గదా చాప, చక్రములచేత చిహ్నితములైన శరీరములుగల, వామనైః-చిన్నపురుషులచేత, గుప్తం-రక్షింపబడిన, ఆత్మానం-తమతమ రూపములను, దదృశుః-చూచిరి. వారందరును విష్ణ్వంశతోఁగూడిన పాయసమును భుజించియుండిరి కనుక అందరి స్వప్నములందును శంఖచక్రాదులు ధరించిన బాలవిష్ణుమూర్తులు కనఁబడుచు తమను రక్షించుచున్నట్లు జూచుచుండిరని భావము.

శ్లో. హేమ పక్ష ప్రభా జాలం గగనే చ వితన్వతా
ఉహ్యంతేస్మ సుపర్ణేన వేగాకృష్ట పయోముచా. 61

వ్యాఖ్య : చ(కించ)-మరియు, హేమపక్ష ప్రభాజాలం—హేమపక్ష-బంగారుకాంతిగల రెక్కలయొక్క, ప్రభాజాలం-కాంతిపుంజమును. వితన్వతా-విస్తరింపఁజేయుచున్నట్టియును, వేగాకృష్ట పయోముచా-వేగ-తనగమనవేగముచేత, ఆకృష్ట-లాగుకొనిపోబడుచున్న, పయోముచా-మేఘములు కలిగినట్టి, సుపర్ణేన-గరుత్మంతునిచేత, గగనే-ఆకాశమునందు, ఉహ్యంతేస్మ-మోసికొనిపోఁబడుచుండిరి. ఇది మరియొక స్వప్నము; ఆకౌసల్యాదులు, బంగరు రెక్కల కాంతులను విస్తరింపఁజేయుచు, మహావేగముగ వెళ్ళుచున్న గరుత్మంతునిచేత గగన తలమున మోసికొనిపోఁబడుచున్నట్లు స్వప్నములను గనిరి. విష్ణువు గర్భమునందున్న ఆరాణులు గరుడునిచే మోయఁబడుచున్నట్లు కలలుగనుట సహజముగదా! ఆ విధముగా గరుత్మంతుఁడు వారిసేవలను జేయుచుండెను.

శ్లో. బిభ్రత్యా కౌస్తుభన్యాసం స్తనాంతర విలంబినమ్
పర్యుపాస్యంత లక్ష్మ్యా చ పద్మవ్యజన హస్తయా. 62

వ్యాఖ్య : చ-మరియును, నాంతర విలంబినం-స్తనాంతర-స్తన మధ్య భాగమునందు, విలంబినం-వ్రేలాడుచున్న, కౌస్తుభన్యాసం-భర్త తనవద్ద దాచియుంచిన కౌస్తుభమణిని, బిభ్రత్యా-ధరించుచున్నదియు, పద్మవ్యజన హస్తయా-పద్మమనెడు వింజామరము హస్తమునందు గలదియునగు, లక్ష్మ్యా-లక్ష్మీదేవిచేత, పర్యుపాస్యంత-సేవింపబడుచుండిరి. ఇది మరియొకకల, విష్ణువు భూలోకమునకు వచ్చునపుడు తనవద్ద దాచియుంచిన కౌస్తుభమణిని, ఆయనవలెనే తానును వక్షస్థలమున ధరించి, తన భర్తయగు విష్ణువు గర్భమునందుగల కౌసల్యాదులను ఆ త్తల

సుగా భావించి, లక్ష్మీదేవి పద్మచామరముతో విసరుచు, వారియలసటను దీర్చు చుండెనని భావము.

శ్లో. కృతాభిషేకై ర్దివ్యాయాం త్రిస్రోతసి చ సప్తభిః
బ్రహ్మర్షిభిః పరం బ్రహ్మ గృణద్భి రుపతస్థిరే. 63

వ్యాఖ్య : చ(కించ)-మరియును, దివ్యాయాం-స్వర్గమునందున్న, త్రిస్రోతసి-ఆకాశగంగయందు, కృతాభిషేకైః-చేయబడిన స్నానముగలవారును, పరం బ్రహ్మ-ఉత్కృష్ట వేదరహస్య వచనములను, గృణద్భిః-పఠించుచున్నవారగు, సప్తభిః, బ్రహ్మ ర్షిభిః-ఏడుగురగు కశ్యపాది బ్రహ్మర్షులచేత, ఉపతస్థిరే-ఉపాసింపఁబడుచుండి . ఇది చివరిస్వప్నము, దశరథపత్నుల గర్భమునందున్నది ఉపనిషత్ప్రతిపాద్యమగు బ్రహ్మపదార్థము. కనుక సప్తఋషులు ఆకాశగంగా స్నానము చేసివచ్చి బ్రహ్మ ప్రతిపాదకములగు ఉపనిషత్వాక్యములను బలుకుచు ఆరాధనలను సేవించి రని భావము. మొదటి స్వప్నములందు సగుణ బ్రహ్మవైభవము చిత్రింపబడినది. ఈ స్వప్నమునందు గర్భస్థమైయున్నది నిర్గుణ బ్రహ్మమగు పరమాత్మయని సూచింపబడినది. సప్తఋషులు: అత్రి, భృగువు, కుత్సుడు, కపిలుడు, గౌతముడు, కశ్యపుడు, అంగిరసుడు అనువారు కశ్యపుడు, అత్రి, భరద్వాజుఁడు, విశ్వామిత్రుడు, గౌతముడు, జమదగ్ని, వసిష్ఠుఁడును "సప్తఋషుల"ని మరియొక పరిగణనమున్నది.

శ్లో. తాభ్య స్తథావిధాన్ స్వప్నాన్ శ్రుత్వా ప్రీతోఽథ పార్థివః
మేనే పరార్థ్య మాత్మానం గురుత్వేన జగద్గురోః 64

వ్యాఖ్య : అథ-అనంతరము, పార్థివః-రాజు (దశరథుఁడు), తాభ్యః-ఆ పత్నుల వలన, తథావిధాన్-ఆ విధములైన (వెనుక వర్ణింపఁబడిన) స్వప్నాన్-స్వప్న వృత్తాంతములను, శ్రుత్వా-విని, ప్రీతః (సన్)-సంతోషించిన వాఁడగుచు, ఆత్మానం-తనను, జగద్గురోః-లోకజనకుఁడైన విష్ణువునకు, గురుత్వేన-పితృత్వముచేత, పరార్థ్యం-సర్వోత్కృష్టునిగా, మేనేహి-తలఁచెను సుమా! రాణులు చెప్పిన ఆస్వప్న వృత్తాంతముల వలన దశరథుఁడు సంతోషముతో నుప్పొంగుచు, లోక జనకుఁడైన విష్ణువునకు తాను జనకుఁడు కాఁబోవుచున్నందులకు తనను ధన్యాతి ధన్యునిగా భావించుకొనెను.

శ్లో. విభక్తాత్మా విభు స్తాసా మేకః కుక్షిష్వ నేకధా
ఉవాస ప్రతిమాచంద్రః ప్రసన్నానా మపా మివ 65

వ్యాఖ్య : ఏకః-ఒకడేయైన (అద్వితీయుఁడైన), విభుః- వి ష్ణు, తాసాం-ఆ రాజపత్నులయొక్క, కుక్షిషు-ఉదరములందు, ప్రసన్నానాం- ర్మలములైన, అపాం-ఉదకములయొక్క, కుక్షిషు-అంతర్భాగములయందు, ప్రతిమాచంద్రః, ఇవ-బింబిరూపమున నున్న చంద్రునివలె, అనేకధా-పెక్కురీతుల (ఏకభిన్నం అనేకం కనుక నాలుగు విధములుగా), విభక్తాత్మా-విభజింపఁబడిన యాత్మలు గలవాఁడై, ఉవాస-నివసించెను (గర్భస్థుఁడై యుండెను). 'విభుః' అనగా సర వ్యాపకుఁడు అనగా పరబ్రహ్మము. అది ఏకము. అయినప్పటికిని ఉపాధిగత (శరీరాదులనుపొంది)అనేకథా కనపడును. ప్రకృతమున ఒక్కడేయైయున్న విష్ణు ఉపాధి భూతములైన నాలుగు పాయసభాగములందు ప్రవేశించి రాణుల గర్భము లలో నివసించెను. ఇది ఒకే చంద్రుఁడు భిన్న జలాశయములందు ప్రతిబింబ రూప మున పెక్కు చంద్రులుగా గనబడుటతోఁ బోల్చుట మిక్కిలి సమంజసముగా నున్నది. అద్వితీయ పరబ్రహ్మము ఉపాధిగతమై నానావిధముల గోచరించుచున్న వేదాంత సిద్ధాంత మీశ్లోకమున సూచింపఁబడినది.

శ్లో. అథా గ్ర్యమహిషీ రాజ్ఞః ప్రసూతి సమయే సతీ
పుత్రం తమోఽపహం లేభే న క్తం జ్యోతి రివౌషధిః 66

వ్యాఖ్య : అథ-అనంతరము, రాజ్ఞః-దశరథునియొక్క, సతీ-పతివ్రత యగు భార్యయు, అగ్రమహిషీ-పెద్దరాణియు నగు కౌసల్య, ప్రసూతిసమయే-ప్రసవ కాలమునందు, ఓషధిః-ఒకానొకమొక్క, నక్తం-రాత్రివేళయందు, తమోఽపహం-చీకటిని తొలగించునట్టి, జ్యోతిః, ఇవ-జ్యోతిని వలె, తమోఽ పహం-అజ్ఞానమను చీకటిని తొలగించునట్టి, పుత్రం-కుమారుని, లేభే-పొందెను (ప్రసవించెను). దశమ మాసమున కౌసల్య, తమకు అపుత్రత్వ రూపమున నున్న తమస్సును, లోకమునకు అజ్ఞానాంధకారరూపమగు తమస్సును, బోగొట్టునట్టి వైష్ణవ తేజోరూపుఁడగు కుమారునిఁగనెనని భావము. ఇది వాక్యార్థోపమ.

శ్లో. రామ ఇత్యభిరామేణ వపుషా తస్య చోదితః
నామధేయం గురు శ్చక్రే జగత్ప్రథమ మంగళమ్ 67

వ్యాఖ్య : అభిరామేణ-మనోహరమైన, వపుషా-బాలుని శరీరముచేత, చోదితః- ప్రేరేపింపబడిన, గురుః-తండ్రియగు దశరథుఁడు, తస్య-ఆశిశువునకు, జగత్ప్రథమమంగళం-లోకమునకు మొదటి శుభలక్షణమగు, రామ ఇతి-రాముఁడు అను, నామధేయం-పేరును (నామకరణమును), చక్రే-చేసెను. పుట్టిన శిశువు అభిరాముఁడై యుండుటచే తనే తండ్రి యతనికి రాముఁడు అని నామకరణము చేసెను. "రమంతే-యోగినః, ప్రజాః, పిత్రాద్యాః అస్మిన్ ఇతి రామః అనగా నితనినిచూచి యోగులు, ప్రజలు, తల్లిదండ్రులును ఆనందపడుచుందురు కనుక 'రామ' అనుపదము ఇతని యందు సార్థక మగునని భావము.

శ్లో. రఘువంశ ప్రదీపేన తేనా ప్రతిమ తేజసా

రక్షాగృహా గతా దీపాః ప్రత్యాదిష్టా ఇవా భవన్ 68

వ్యాఖ్య : రఘువంశ ప్రదీపేన-రఘువంశమునకు దీపము వంటి వాఁడును (వంశమున కపారమైన కీర్తిని దెచ్చునట్టివాఁడు), అప్రతిమతేజసా-సాటిలేని తేజస్సు గల, తేన-శిశురూపమున నున్న రామునిచేత, రక్షాగృహగతాః-సూతికాగృహము నందున్న, దీపాః-దీపములు, ప్రత్యాదిష్టాః, ఇవ-తిరస్కరింపబడినవా (కాంతి హీనములు చేయబడినవా) యనునట్లు అభవన్-ఉండెను. బహుకాలము సంతతిలేని దశరథుని వలన పేరుకెక్కని రఘు వంశము శ్రీరాముని జన్మము వలన మహా కీర్తిని బొందుటవలన రాముఁడు రఘువంశమునకు ప్రదీపము (గొప్పదీపము) వంటివాఁడు. అందు వలన పురిటింటిలోని దీపాలు వెలవెలబోయినవి, ఈ మహా తేజస్సు అవతరించుట వలన రావణాదులును వెలవెలబోయిరని ధ్వని ఇది ఉత్ప్రేక్ష అలంకారము, కాని శాస్త్రదృష్టియందు సత్యమే.

శ్లో. శయ్యాగతేన రామేణ మాతా శాతోదరీ బభౌ

సైకతాంభోజ బలినా జాహ్నవీవ శరత్కృశా. 69

వ్యాఖ్య : శాతోదరీ - గర్భమోచనమువల్ల పలుచబడిన యుదరముగల, మాతా-తల్లియగు కౌసల్య, శయ్యాగతేన-పడకపైనున్న, రామేణ-రామునిచేత, సైకతాంభోజబలినా-సైకత-ఇసుకతిన్నెమీద నున్న, అంభోజ-కమలమనెడి, బలినా-పూజాపుష్పముచేత, శరత్కృశా-శరదృతువునందు సన్నగిల్లిన, జాహ్నవీ, ఇవ-గంగానదివలె, బభౌ - ప్రకాశించెను.

శరదృతువున ప్రవాహము తగ్గుటచేత గంగలో ఇసుకతిన్నె లేర్పడును. అప్పు డందలి కమలమును గోసి గంగకు పూజచేయుట శిష్టాచారము. అట్లు చేసిన ప్పుడు కృశించిన గంగ, దాని నానుకొని ఇసుకతిన్నె, దానిపై కమలము ఉండును. అట్లే కృశించిన కౌసల్య (గర్భభారము తగ్గినది కనుక), ఆమె ప్రక్కన స్వచ్ఛ మైన పొత్తిలి గుడ్డల పడక, దానిపై శిశువగు రాముడు నున్నారు. కనుక ఇది కమల పుష్పోపహారము గల శరద్గంగోపమానము గలదై యున్నది అంభోజమును పోలికగాఁజెప్పటచేత రాముని సౌకుమార్యము, జాహ్నవితో పోలిక చెప్పుటచేత కౌసల్య పవిత్రత్వము వ్యక్తమగు చున్నవి.

శ్లో. కైకేయ్యాస్తనయో జజ్ఞే భరతో నామ శీలవాన్
జనయిత్రీ మలంచక్రే యః ప్రశ్రయ ఇవ శ్రియమ్ 70

వ్యాఖ్య : కైకేయ్యాః-కైకేయికి, భరతః, నామ-భరతుడు అను, శీలవాన్-మంచినడవడిగల, తనయః-పుత్రుఁడు, జజ్ఞే-జన్మించెను, యః-ఎవ్వఁడు, ప్రశ్రయః- వినయము, శ్రియం, ఇవ-సంపదనువలె, జనయిత్రీం- తల్లిని, అలం చక్రే-అలంకరించెనో; కైకేయికి సద్వృత్తము నందు సాటిలేని భరతుఁడను కుమారుఁడు పుట్టెను. ఇది దశరథుఁడు పాయసాన్నమును పంచియిచ్చిన వరుస లోనే జరిగినది. వాల్మీకియు శ్రీరాముని తరువాత భరతునకు పుట్టినట్లు చెప్పెను. "కేకయస్య అపత్యం స్త్రీ కైకేయీ" అని వ్యుత్పత్తి. "కేకయ" శబ్దములోని యకారాదిభాగమునకు 'ఇయ' అను ఆదేశమున్ను, ఆదివృద్ధియు, వచ్చి 'కైకేయీ' శబ్దము నిష్పన్నమైనది. సంపదకు వినయమువలె భరతుఁడు తల్లికి అలంకారముగా నుండెనట అలంకారము: ఉపమ.

శ్లో. సుతౌ లక్ష్మణశత్రుఘ్నౌ సుమిత్రా సుషువే యమౌ
సమ్యగారాధితా విద్యా ప్రబోధ వినయా వివ 71

వ్యాఖ్య : సుమిత్రా-సుమిత్ర, లక్ష్మణ శత్రుఘ్నౌ-లక్ష్మణ శత్రుఘ్ను లను పేరు గల, యమౌ-కవలలయిన, సుతౌ-కుమారులను, సమ్యగారాధితా-చక్కగా అభ్యసింపబడిన, విద్యా-విద్య, ప్రబోధ వినయౌ, ఇవ-తత్త్వజ్ఞానమును, ఇంద్రియ జయమునువలె, సుషువే-ప్రసవించెను. రెండు భాగములుగా స్వీకరింపఁబడిన పాయసాన్నము వల రెండు గర్భములు ధరించిన సుమిత్ర లక్ష్మణ, శత్రుఘ్న

లను కుమారులను గనెను. ఇది చక్కగా అభ్యసింపఁబడిన విద్య వలన బుట్టు తత్త్వజ్ఞాన, ఇంద్రియ జయము లతోఁ బోల్పఁబడినది. విద్యకు తత్త్వజ్ఞాన, ఇంద్రియ జయములు ఫలమని గ్రహిం పవలయును.

శ్లో. నిర్దోష మభవ త్సర్వ మావిష్కృతగుణం జగత్
అన్వగా దివ హి స్వర్గో గాం గతం పురుషోత్తమమ్. 72

వ్యాఖ్య : సర్వం, జగత్-భూలోకమంతయు, నిర్దోషం-దుర్భిక్షాది దోషములు లేనిదియు, ఆవిష్కృత గుణం-ప్రకటింప బడిన ఆరోగ్యాది గుణములు గలదియు, అభవత్-ఆయె. (అదియంతము) గాం-భూలోకమును, గతం-చేరిన పురుషోత్తమం-శ్రీమహావిష్ణువును, స్వర్గః-స్వ ముగూడ, అన్వగాత్, ఇవ-అనుగమించివచ్చెనా ఏమి? అన్నట్లుండెను. విష్ణ్వం ములతో శ్రీరామాదు లవతరింపగా జగత్తున దోషములు, అనగా దుర్భిక్షము, రోగములు, రాగద్వేషాదులు, నశించి, సుభిక్షము, ఆరోగ్యము, సంతోషము మొదలగు గుణములు నెలకొన్నవని భావము. స్వర్గమనగా నిర్దోషమై గుణములు గల ప్రదేశమని ఆగమము. అయోధ్యాప్రాంతమంతయు స్వర్గతుల్యముగా మారినది.

శ్లో. తస్యోదయే చతుర్మూర్తేః పౌలస్త్య చకితేశ్వరాః
విరజస్కై ర్నభస్వద్భి ర్దిశ ఉచ్ఛ్వసితా ఇవ. 73

వ్యాఖ్య : చతుర్మూర్తేః-నాలుగు మూర్తులుగల (రామ లక్ష్మణ భరత శత్రుఘ్నుల శరీరములతో) తస్య-ఆవిష్ణుమూర్తి యొక్క, ఉదయే (సతి)-జన్మము కలుగగా, పౌలస్త్య చకితేశ్వరాః-రావణుని వలన భయపడిన తమ తమ అధిపతులు గల, దిశః-నాలుగు దిక్కులును, విరజస్కైః-ధూళి తొలగిన, నభస్వద్భిః-వాయువులతో, ఉచ్ఛ్వసితాః, ఇవ-నిట్టూర్పును విడిచినవా యన్నట్లుండెను. ప్రాక్పశ్చిమ దక్షిణోత్తర దిశలు, రావణుని వలన భయపడుచున్న తమ అధిపతులకు (ఇంద్ర వరుణ యమ కుబేరులకు) రామాది చ ర్మూర్తులతో అవతరించిన విష్ణువు వలన నిర్భయము, రక్షణము నేర్పడుటచేత ధూ ్ త కలుషితములు గాని నిర్మల వాయురూపమున నిట్టూర్పులు విడిచినవి. ్ని మెల్లని వాయువులు రామావతారము జరుగగానే వీచిన వని భావము. చతుర్మూర్తుల ప్రయోజనము చతుర్దిగీశ రక్షణము. "విరజస్క" పదము నిర్భయసూచకము. అలంకారము: ఉత్ప్రేక్ష.

శ్లో. కృశాను రపధూమత్వా త్ప్రసన్నత్వాత్ ప్రభాకరః
రక్షో విప్రకృతా వాస్తాం అపవిద్ధశుచా వివ. 74

వ్యాఖ్య : రక్షో విప్రకృతౌ-రాక్షసుఁడగు రావణునిచేత, పరాభవింపబడి తేజస్సును గోల్పోయి యుండిన, కృశానుః-అగ్నియు, ప్రభాకరః-సూర్యుఁడును, (వరుసగా) అపధూమత్వాత్-పొగ తొలఁగిపోవుట వలనను, ప్రసన్నత్వాత్, చ-నిర్మలత్వము కలుగుట వలనను, అపవిద్ధశుచౌ, ఇవ-తొలఁగిపోయిన శోకము గలవారో యన్నట్లు, ఆస్తాం-అయిరి. మహాతేజస్వు లయిన సూర్యుఁడును, అగ్నియు రావణుని వలన కలిగిన పరాభవము చేత దుఃఖించుచుండిరి. అట్టి సూర్యాగ్నులు నేఁడు విష్ణువు దుష్టశిక్షణార్థమై రామావతారము నెత్తుటచేత నిర్భీకులై ప్రసన్నులైరి. అగ్నిశోకము తొలగుటకు అపధూమత్వము, సూర్యదుఃఖము వాయుటకు ప్రసన్నత్వము సూచకములుగాఁ జెప్పబడినవి. అలంకారము: ఉత్ప్రేక్ష.

శ్లో. దశానన కిరీటేభ్య స్తత్క్షణం రాక్షస శ్రియః
మణివ్యాజేన పర్యస్తాః పృథివ్యా మశ్రుబిందవః 75

వ్యాఖ్య : తత్క్షణం-శ్రీరాముఁ డవతరింపగానే, రాక్షస శ్రియః-రాక్షస రాజ్యలక్ష్మియొక్క, అశ్రుబిందవః-కన్నీటి చుక్కలు, దశానన కిరీటేభ్యః-రావణుని కిరీటములనుండి, మణివ్యాజేన-రత్నముల మిషచేత, పృథివ్యాం-భూమిమీద, పర్యస్తాః-జారిపడినవి. శ్రీరాముఁ డుదయింపఁగానే, ఇక రావణవధ తథ్యము అని తెలిసికొన్న రాక్షస రాజ్యలక్ష్మి తనకన్నీటి చుక్కలను, రావణ కిరీటములనుండి కారణాంతరమున జారి నేలపైబడిన మణులను నెపమున రాల్చినది. రాముఁడు పుట్టగానే రావణునికి కిరీట రత్నములు క్రిందరాలిపడుట యను నపశకునమైనదని భావము. అలంకారము: కైతవాపహ్నవము.

శ్లో. పుత్రజన్మ ప్రవేశ్యానాం తూర్యాణాం తస్య పుత్రిణః
ఆరంభం ప్రథమం చక్రుః దేవదుందుభయో దివి. 76

వ్యాఖ్య : పుత్రిణః-పుత్రవంతుఁడైన, తస్య-ఆ దశరథునియొక్క, పుత్ర జన్మ ప్రవేశ్యానాం-కుమార జన్మోత్సవమునందు ఏర్పాటు చేయదగిన, తూర్యా

ణాం-నాగస్వరాది వాద్యములయొక్క, ఆరంభం-ఉపక్రమమును, ప్రథమం-మొదట, దివి-స్వర్గమున (ఆకాశమునందు) దేవమందుభయః-దేవతల వాద్యము లగు, దుందుభులు-చక్రుః-చేసినవి. దశరథుడు పుత్రజన్మోత్సవమును ప్రకటించుటకై యేర్పాటు చేసిన మంగళవాద్యములు మ్రోగకముందే లోకకళ్యాణార్థ ముద యించిన రాముని యెడలగల తమ భక్తిని, ఆనందమును వెల్లడించుటకై స్వర్గము నుండి దేవతలు దుందుభులు మ్రోగించిరనియు, ఆ తరువాత అయోధ్యానగరము మంగళవాద్యనాదములతో నిండిపోయె ననియు భావము. రామాదుల జన్మముచేత భూలోక స్వర్లోకము లానందపరవశము లయ్యె నన్నది సారాంశము.

శ్లో. సంతానకమయీ వృష్టి ర్భవనే తస్య పేతుషీ
సన్మంగళోపచారాణాం సైవాదిరచనా ఽభవత్. 77

వ్యాఖ్య : తస్య-ఆ దశరథుని యొక్క, భవనే-మందిరమున, సంతానకమయీ-కల్పవృక్ష కుసుమ మయమైన; వృష్టిః-వాను, పేతుషీ-పడినదై, స (సా+ఏవ)-అదియే, సన్మంగళోపచారాణాం- పుత్రజన్మకాల మందవసర మంగళ వస్తూపచారములకు, ఆదిరచనా-ప్రథమ కృత్యము, అభవత్-అయి నది. పుత్రజన్మ సమయమున జాతకర్మ, నామకరణాది వైదికక్రియా కలాపమునకు పువ్వులు, ఫలములు, రంభాస్తంభములు, మామిడియాకులు మొదలయినవి కూర్చుకొనుట యాచారము. దశరథుని భవనమునం దామంగళోపచారములను సేవకు లారంభించుటకంటే ముందే స్వర్గమునుండి కల్పవృక్ష కుసుమ మయమగు పుష్పవృష్టి కురిసి, అదియే మంగళోపచారములలో మొదటి యుపచారమైనది. శ్రీరాముని యవతార సమయమున మానవులకంటే ముందే దేవత లానందోత్సాహములను వె డించుచుండి రని భావము. "సంతానాః ఏవ సంతానకాః (స్వార్థమున "క" ప్రత్యయము), సంతానకానాం పుష్పాణి సంతానకాని, సంతానకానాం వికారః తానకమయీ" అని విగ్రహము చెప్పుకొనవలెను. పేతుషీః ఇది పతుల్ ధాతువునకు "క్వసు" ప్రత్యయము, ఙీప్‌ను చేర్పగా నేర్పడిన రూపము. "క్వసుశ్చ" అనుపాణిని సూత్రము భూతకాలమున దీని ప్రయోగమును సమ్మతించుట చేత, పేతుషీ-పడినది, అని యర్థము చెప్పబడినది. (పడినదై, అనుట సులభ బోధకొఱకు మాత్రమే)

శ్లో. కుమారాః కృతసంస్కారా స్తే ధాత్రీస్తన్య పాయినః
ఆనందే నాగ్రజే నేవ సమం వవృధిరే పితుః 78

వ్యాఖ్య : కృతసంస్కారాః-చేయబడిన జాతకర్మ, నామకరణములను సంస్కారములు గలవారును, ధాత్రీస్తన్యపాయినః-ధాత్రీ-దాదులయొక్క, స్తన్య-పాలను, పాయినః-త్రాగుచున్నవారును నగు, తే, కుమారాః-ఆ రాజకుమారులు, అగ్రజేన, ఇవ- తమకంటె ముందే పుట్టినట్లున్న, పితుః-తండ్రియగు దశరథునియొక్క, ఆనందేన, సమం-ఆనంద ముతోపాటుగా, వవృధిరే-వృద్ధిపొందిరి (పెరిగిరి). ప్రాజాపత్య పురుషుఁడు పాయసము నిచ్చినప్పుడే తన పుత్రసంతానము కలుగు నన్నయానందము దశ రథునికి కలిగెను. కనుక పుత్రులకంటె ఆనందము అగ్రజస్థానము నాక్రమించినది. ఇప్పుడు పుత్రులు పుట్టిపెరుగుచుండగా ఆనందముతో సైతము పెరుగుచున్నది అట్లు దశరథుని ఆనందముతో పాటు కృతసంస్కారులైన రామాదులు, దాదుల పాలుత్రాగుచు పెరుగుచుండిరనియు, దశరథుని యానందము ఇనుమడించుచుండె ననియు భావము. "అగ్రేజాతం అగ్రజం" మొదటపుట్టినది అని యర్థము. అలంకారములు: ఉత్ప్రేక్ష, సహోక్తి.

శ్లో. స్వాభావికం వినీతత్వం తేషాం వినయకర్మణా
మమూర్ఛ సహజం తేజో హవిషేవ హవిర్భుజామ్ 79

వ్యాఖ్య : తేషాం-ఆరాజకుమారులయొక్క, స్వాభావికం-సహజ ని (పుట్టుకతోనే వచ్చిన), వినీతత్వం-చక్కని ప్రవర్తనము, వినయకర్మణా-। మ శిక్షణాభ్యాసముచేత, హవిర్భుజాం-అగ్నులయొక్క, సహజం-స్వాభావి న, తేజః-తేజసు , హవిషాఇవ- ఆజ్యాది ద్రవ్యముల చేతవలె, మమూర్ఛ- ద్ధిని పొందెను. వి ంశసంభూతు న ఆ కుమారులకు సహజముగానే యున్న వినయ సంపద గురు ల శిక్షణము త, సహజతేజస్సుగల అగ్నికి హోమద్రవ్యములచేత తేజస్సు ఇను డించినట్లు వృద్ధిని పొందెను. హవిర్భుక్ శబ్దమును అగ్ని కుపయో గించుట యుక్తియుక్తముగా నున్నది. హవిస్సును తినువాఁడు ఆజ్యాది హవిస్సు భోజనముగా లభించినప్పుడు వృద్ధిని పొందుట సహజముగదా. "హవిర్భుజాం" అని బహువచనము నుపయోగించుట కుమారచతుష్టయమున కుపమానముగా నుండుటకే. ఉపమాలంకారము.

శ్లో. పరస్పరా విరుద్ధాస్తే తద్రఘోరనఘం కులమ్
అలముద్యోతయామాసు ర్దేవారణ్య మివర్తవః 80

వ్యాఖ్య : పరస్పరావిరుద్ధాః-ఒకరితో నొకరు కలహించుకొనినవారగు (సౌభ్రాత్రముగలవారగు), తే-ఆకుమారులు, తత్- ప్రసిద్ధమైన, రఘోః-రఘు మహారాజుయొక్క, కులం-వంశమును, ఋతవః-వసంతాది రుతువులు, దేవారణ్యం, ఇవ-నందనవనమునువలె అలం-మిక్కిలిగా, ఉద్యోతయామాసుః-ప్రకాశింపఁచేసిరి. సవతితల్లుల కొడుకు లగుటచేతను, బాలు రగుటచేతను, పరస్పరము కలహించు కొనుట లోకాచారమై యున్నప్పటికిని, ఒకే విష్ణువు నలుగురుగా బుట్టుటచేత వారం దరును అన్ని విషయములందును ఏకాభిప్రాయము గలవారై సుప్రసిద్ధమైన రఘు వంశమునకు మిక్కిలి కీ ని దెచ్చిరి. ఆది ఋతువులు పరస్పర విరుద్ధ స్వభావ ములు గలవియైనను స్వ ము నందలి నందనోద్యాన విషయమున నన్నియు నేక విధముగా నుంటుటవలె న్నదని చెప్పుట, బాలుర దివ్యత్వమునకును, రఘువంశ మునకుఁ గలిగిన దివ్యశోభకును సూచకము. అలంకారము : ఉపమ. ఈ శ్లోకమునందలి "తత్" శబ్దమునకు "అది" యని యర్థముకాదు. ప్రసిద్ధము అని యర్థము. కనుకనే "యత్తదోర్నిత్య సంబంధః" అనున్యాయము ననుసరించి "యత్" శబ్దము వాడబడలేదు. ప్రసిద్ధార్థకమగు "తత్" అనునది "యత్"ను కోరదని ఆలంకారిక సిద్ధాంతము. "ప్రసిద్ధ ప్రక్రాం తానుభూతార్థక స్తచ్ఛబ్దో యదుపాదానం నాపేక్షతే."

శ్లో. సమానే ఒపిచ సౌభ్రాత్రే యథోభౌ రామలక్ష్మణౌ
తథా భరతశత్రుఘ్నౌ ప్రీత్యా ద్వంద్వం బభూవతుః 81

వ్యాఖ్య : చ (కించ)-మరియును, సౌభ్రాత్రే-సోదరభావము, సమానే, అపి-సమా న అయినప్పటికిని, యథా-ఎట్లు, రామలక్ష్మణౌ-రామలక్ష్మణులు,ఉభౌ-ఇద్దరును, ప్రీత్యా-ప్రేమచేత, ద్వంద్వం-జంటగా, బభూవతుః-ఏర్పడిరో, తథా-అట్లే, భరత శత్రుఘ్నౌ-భరతశత్రుఘ్నులు, ఉభౌ-ఇద్దరును, ప్రీత్యా-ప్రేమచేత, ద్వంద్వం- జంటగా, బభూవతుః-ఏర్పడిరి. రామ లక్ష్మణ భరత శత్రుఘ్నుల భాతృప్రేమ సమానమే అయియున్నప్పటికిని ప్రేమభావముయొక్క ఆధిక్యముచేత రామ లక్ష్మణు లొక్క జంటగాను, భరతశత్రుఘ్ను లొక్క జంటగాను ఏర్పడి యొకరి కొకరు విడిచియుండజాలని స్నేహముతో లోకము వారికి జంటలుగా నభివ్యక్త మైరి. కౌసల్య సుమిత్ర కిచ్చిన పాయస భాగమువలన లక్ష్మణుడును, కైకేయి సుమిత్ర కిచ్చిన పాయస భాగము వలన శత్రుఘ్నుఁడును పుట్టి యుండుటచేత వారికట్టి ద్వంద్వభావము సహజమై యుండెను. స్నేహమునకు

బాహ్యనిమిత్తముండదు, ఆంతరమైన నిమిత్తమే దానికి కారణము. అనగా అట్టి జంటలుగా నేర్పడవలె నని వారనుకొనకయే జంటలుగా నేర్పడిరనియు, నలు గురియందును భాతృప్రేమకు మాత్రము కొదువ లేకుండె ననియు భావము.
సౌభ్రాత్రం :- సు + భ్రాతరః యేషాం తే సుభ్రాతరః సుభ్రాతౄణాం భావః సౌభ్రాత్రమ్, అని వ్యుత్పత్తి. యువాది గణపఠిత మగుటచే "అణ్" ప్రత్యయము వచ్చినరూపము.

శ్లో. తేషాం ద్వయో ర్ద్వయో రైక్యం బిభిదే న కదాచన
యథా వాయువిభావస్వో ర్యథా చంద్రసముద్రయోః 82

వ్యాఖ్య : తేషాం-ఆ నలుగురిలో, ద్వయోః, ద్వయోః-ఇద్దరిద్దరికి (రామ లక్ష్మణులకు, భరత శత్రుఘ్నులకు నని యర్థము), వాయు విభావస్వోః, యథా-పవనాగ్నులకు వలెను, చంద్రసముద్రయోః, యథా-చంద్రసముద్రులకువలెను, ఐక్యం-ఐకమత్యము, కదాచన-ఎప్పుడును, నబిభిదే-భేదించలేదు (చెడలేదు). జంటలుగానున్న రామలక్ష్మణ, భరత శత్రుఘ్నులకు ఎప్పుడును, ఏవిషయమందును భేదభావములేక ఐకమత ముతో నుండిరి. అది సహజము, స్వతస్సిద్ధమునై యుండెను. అగ్నివాయు లయొక్కయు, చంద్రసముద్రులయొక్కయు సంబంధము వలె సుఖదుఃఖములందు దని స్నేహమేర్పడి యుండెనని భావము. గాలి అగ్ని మండుటకు సహకరించుటయు, చంద్రోదయమున సముద్రుఁ డుప్పొంగుటయు లోక ప్రసిద్ధములుగదా! అలంకారము: ఉపమ.

శ్లో. తే ప్రజానాం ప్రజానాథా స్తేజసా ప్రశ్రయేణచ
మనో జహ్రు ర్నిదాఘాంతే శ్యామాభ్రా దివసా ఇవ 83

వ్యాఖ్య : ప్రజానాథాః-ప్రభువులైన, తే-ఆ రామాదులు, తేజసా-ప్రభావము చేతను, ప్రశ్రయేణ, చ-వినయము చేతను, నిదాఘాంతే (నిదాఘ + అంతే)-గ్రీష్మర్తువు ముగియు కాలమునందు, శ్యామాభ్రాః-నల్లని మేఘములు గల, దివసాః ఇవ-దినములువలె, ప్రజానాం-జనులయొక్క, మనః-మనస్సును, జహ్రుః-హరించిరి (ఆకర్షించిరి). ప్రజానాథులైన ఆరాజకుమారులు పెరిగి జనులలోఁదిరుగుచు, గ్రీష్మాతపమువంటి తమ తేజస్సుచేతను, శ్యామాభ్రదివసములవంటి వినయము చేతను, ప్రజలకు ఆనందమును జేకూర్చుచుండి రని భావము. శ్యామాభ్రదివస

ములు ఎక్కువ ఉష్ణముగాని, ఎక్కువ శైత్యముగాని లేక హాయిని గూర్చునుగదా!
"నిదాఘాంత" పదము రావణుని యవసానదశను, "శ్యామా౹ ఖదివసములు"
రామాదుల చల్లదనమును వ్యక్తముచేయును. అలంకారము: ఉపమ.

శ్లో. స చతుర్ధా బభౌ వ్యస్తః ప్రసవః పృథివీపతేః
ధర్మార్థ కామ మోక్షాణాం అవతార ఇవాంగభాక్ 84

వ్యాఖ్య : సః-ఆ, చతుర్ధా-నాలుగు విధములుగా, వ్యస్తః-వేరువేరుగా
నున్న, పృథివీపతేః-దశరథమహారాజుయొక్క, ప్రసవః-సంతానము, అంగభాక్-
ప్రత్యేక శరీరములు ధరించిన, ధర్మార్థకామమోక్షాణాం-ధర్మము, అర్థము, కామము,
మోక్షము అనుపురుషార్థములయొక్క, అవతారః, ఇవ-అవతారమువలె, బభౌ-
ప్రకాశించెను, పురుషార్థ చతుష్టయము వేరువేరు మూర్తులను ధరించినట్లు ఆ
నలుగురు కుమారులవలన దశరథునికి గలిగిన యానందము పురుషార్థ చతు
ప్రాప్తి యేకకాలమునందు లభించినట్లుండె నని భావము. కుమారులు మూ ధ
వించిన పురుషార్థములా? అని యూహించుటచేత నిది యుత్ప్రేక్షాలంకారము.

శ్లో. గుణై రారాధయామాసు స్తే గురుం గురువత్సలాః
త మేవ చతురంతేశం రత్నై రివ మహార్ణవాః 85

వ్యాఖ్య : గురువత్సలాః-తండ్రిపై భక్తిగల, తే-ఆ రామాదులు,
గుణైః-వినయాది గుణములచేత, గురుం-తండ్రియు, చతురంతేశం-
నాలుగుదిక్కులకు ప్రభువైనవాఁడు నగు,తం, ఏవ-ఆదశరథునినే, మహార్ణవాః-
నాలుగు మహాసముద్రములు, రత్నైః, ఇవ-తమయందున్న రత్నములచేత వలె,
ఆరాధయామాసుః-ఆరాధించిరి (సంతోషపెట్టిరి). తండ్రిపై నత్యంత భక్తిగల
ఆ నలుగురు కుమారులును తమ వినయాది గుణములచేత, నాలుఁగు మహాసముద్ర
ములు తమయందున్న రత్నములచేత చతుర్దిగీశుఁడగు దశరథుని ఆరాధించు
చున్నట్లు ఆతనినే సంతోషపెట్టిరి. అనగా దశరథుఁడు లాలన పోషణాదుల చేత
కుమారులను సంతోషపెట్టుట కంటే యెక్కువగా కుమారులే తమ వినయాది
గుణములచేత తండ్రి నానందపరచి రని భావము. గుణవంతులగు కుమారులవలన
తండ్రి మిక్కిలి సంతసించు నన్నది పరమార్థము. సముద్రముల నుపమాన
ములుగాఁ జెప్పుటచేత రామాదుల ధీరత్వ గాంభీర్యములు వ్యక్తమగుచున్నవి.
అలంకారము: ఉపమ.

శ్లో. సురగజా ఇవ దంతై ర్భగ్న దైత్యాసిధారై
నయ ఇవ పణబంధ వ్యక్తయోగై రుపాయైః
హరి రివ యుగదీర్ఘై ర్దోర్భి రంశై స్తదీయైః
పతి రవనిపతీనాం తై శ్చకాశే చతుర్భిః 86

వ్యాఖ్య: భగ్నదైత్యాసిధారైః (భగ్న, దైత్య, అసిధారైః) మొక్కవోవు నట్లు చేయఁబడిన, రాక్షసులయొక్క, ఖడ్గముల యంచులుగల, దంతైః—దంతము లతో, సురగజః, ఇవ-ఐరావతము వలెను, పణబంధ వ్యక్త యోగైః-ఫలసిద్ధిచేత వ్యక్తములైన ప్రయోగములు గల, ఉపాయైః-సామ, దాన, భేద దండము లనఁ బడు చతురుపాయములతో, నయః, ఇవ-రాజనీతివలెను, యుగదీర్ఘైః-బండికాడివలె పొడవై యున్న, దోర్భిః-బాహువులతో, హరిః, ఇవ-విష్ణువు వలెను, తదీయైః-ఆవిష్ణువునకు సంబంధించిన, అంశైః-అంశభూతులైన, చతుర్భిః తైః—నలుగురగు నా రామాది కుమారులతో, అవనిపతీనాం-రాజులకు, పతిః-అధిపతియైన దశరథుడు చకాశే-ప్రకాశించెను. ఐరావతము దంతములు దాని శరీరభాగములే. అట్లే చతురు పాయములు నీతి యంశములే, విష్ణువు బాహువులు విష్ణుశరీరభాగములని చెప్పనక్కర లేదు గదా! ఆత్మావై పుత్రనామాసి అను శ్రుతివాక్యము వలన దశరథుని యాత్మభాగము రామాదులు, వారు విష్ణ్వంశ సంభూతులగుట మరియొక విశే షము. అట్టి కుమారులతో ఐరావతము వలెను, నీతిశాస్త్రమువలెను, విష్ణువువలెను రాజాధిరాజగు దశరథుఁడు ప్రకాశించె నని తాత్పర్యము. మొదటి యుపమానము చేత రామాదుల శౌర్యపరాక్రమములు, రెండవ యుపమానము చేత వారి రాజనీతి చాతుర్యము, మూడవదియగు విష్ణుబాహూపమానముచేత వారి లోకరక్షణ ధర్మాను ష్ఠాన, మహామహిమోపేతత్వములును ధ్వనించుచున్నవి. ఉపమానోపమేయములు నాలుగు సంఖ్యలోనే, పుంలింగములుగానే యుండుట గమనింపవలెను. పెక్కు ఉపమా[illegible]నుటచేత ఇది మాలోపమాలంకారము. సర్గాంతము కనుక వృత్తము మారినది ఇది మాలినీవృత్తము.

ఇది మహాకవి కాళిదాస కృత రఘువంశ

కావ్యమున రామావతారమను దశమ సర్గమునకు కేశవ పంతుల

నరసింహశాస్త్రి రచిత

తెలుఁగు లఘువ్యాఖ్య

శ్రీః

మహాకవి కాళిదాస కృత

# రఘువంశము

## ఏకాదశ సర్గము

శ్లో. కౌశికేన స కిల క్షితీశ్వరో
రామ మధ్వరవిఘాతశాంతయే
కాకపక్షధర మేత్య యాచితః
తేజసాం హి న వయః సమీక్ష్యతే. 1

వ్యాఖ్య: కౌశికేన-విశ్వామిత్రునిచేత, ఏత్య-వచ్చి (అయోధ్యకువచ్చి) సః, క్షితీశ్వరః-ఆదశరథ మహారాజు, అధ్వర విఘాతశాంతయే-యజ్ఞముయొక్క విఘ్నముల శాంతి కొఱకు, కాకపక్షధరం-బాలునికి తగినజుట్టుగల (బాలుడై యున్న), రామం-శ్రీరాముని, యాచితః, కిల-కోరబడెనుసుమా!, తేజసాం-తేజస్వులు, అనగా పరాక్రమ వంతులయొక్క-వయః-బాల్యాది వయస్సు, న, సమీక్ష్యతే, హి-చూడబడదు కదా! కుశికవంశజుడగు విశ్వామిత్రుడు అయోధ్యకు వచ్చి తాను చేయుచున్న యజ్ఞమునకు రాక్షసులు కలిగించుచున్న ఆటంకములను తొలగించుటకై తనవెంట శ్రీరాముని పంపుమని దశరథుని వేడెను. బాలుడేయై యున్నను రాముడు మహాపరాక్రమవంతుడై యున్నందున అట్లుకోరెను. పరాక్రమవంతుల విషయమున ఇతడు బాలుడా? యుక్తవయస్కుడా? వృద్ధుడా అని లోకము ఆలోచింపదుగదా! అందువలన విశ్వామిత్రుని కోరిక సమంజసమైనదే యని భావము. బాలురజుట్టుకు "కాకపక్షము" అని పేరు. "బాలానాంతు శిఖా ప్రోక్తా కాకపక్షః శిఖండకః" అని హలాయుధ నిఘంటువు. ఈసర్గయందుగల రథోద్ధతావృత్తము అనుసరింపబడినది. "రాన్నరావిహ రథోద్ధతా లగౌ" అని లక్షణము. రగణ, నగణ, రగణములును, ఒకలఘువు, ఒక గురువు నుండును.

శ్లో. కృచ్ఛ్రలబ్ధ మపి లబ్ధవర్ణభాక్
తం దిదేశ మునయే సలక్ష్మణమ్
అప్యసుప్రణయినాం రఘోః కులే
న వ్యహన్యత కదాచి దర్థితా. 2

వ్యాఖ : లబ్ధవర్ణభాక్-ప్రసిద్ధులగు విద్వాంసులను సేవించునట్టి యాదశరథుఁడు, కృచ్ఛ్రలబ్ధం, అపి-అతికష్టముచేత తనకు లభించినవాడైనను, సలక్ష్మణం-లక్ష్మణసహితుఁడగు, తం-ఆ రాముని, మునయే-విశ్వామిత్రునికి దిదేశ-ఇచ్చెను. (అదియంతే) అసుప్రణయినాం, అపి-ప్రాణములను కోరువారియొక్కయు, అర్థితా-యాచన, రఘోః- రఘుమహారాజు యొక్క, కులే-వంశమునందు, కదాచిత్-ఎప్పుడును, న వ్యహన్యత-నిరాకరింపఁబడలేదు (నిష్ఫలముగాఁ జేయఁబడలేదు. అర్థికి ప్రాణములనైనను ఇచ్చునట్టి యావంశము వారికి పుత్రత్యాగము అశక్యకరముకాదు గనుక, అనేక వ్రతములు, యజ్ఞము చేసి కన్న పుత్రుడైనను రాము విశ్వామిత్రుని కోరిక ప్రకారము దశరథుఁడిచ్చివేసెనని భావము. లబ్ధవర్ణుఁడగాన పండితుఁడు. "లబ్ధవర్ణో విచక్షణః" అనియమరము.

శ్లో. యావ దాదిశతి పార్థివ స్తయోః
నిర్గమాయ పురమార్గ సంస్క్రియామ్
తావ దాశు విదధే మరుత్సఖైః
సా సపుష్పజలవర్షిభి ర్ఘనైః ?

వ్యాఖ్యః పార్థివః-పృథివీశ్వరుఁడగు దశరథుఁడు, తయోః-ఆయిద్దఱియొక (రామలక్ష్మణులయొక్క), నిర్గమాయ-ప్రయాణము కొరకు, పురమార్గ సంస్క్రియాం-నగరమార్గసంస్కారమును (ధూళిసంమార్జన, గంధోదకసేచన, పుష్ప సమర్పణాద్యలంకార (క్రియలను), యావత్-ఎంతలో, ఆదిశతి-ఆజ్ఞాపించెనో తావత్-అంత సమయములోనే, మరుత్సఖైః-వాయుదేవుని మిత్రులచేతను, సపుష్పజలవర్షిభిః-పుష్పములతో కూడిన జలబిందువులను వర్షించునట్టి, ఘనైః-మేఘములచేతను, సా-ఆ నగర సంస్కారక్రియ, ఆశు-శీఘ్రముగా, విదధే-చేయఁబడెను. దేవకార్యము నారంభింపనున్న శ్రీమహావిష్ణు నవతారమగు రాముని

ప్రయాణ సన్నాహమును దశరథుఁడాజ్ఞాపింపఁగానే, దేవతలగు వాయుసఖులు ధూళిసంమార్జనమును, మేఘములద్వారా ఇంద్రుఁడు జలసేచన పుష్పవికీర్ణనాదులను వెంటనే నిర్వర్తించి రని భావము.

శ్లో. తౌ నిదేశ కరణోద్యతౌ పితు
ర్ధన్వినౌ చరణయో ర్నిపేతతుః
భూపతే రపి తయోః ప్రవత్స్యతోః
నమ్రయో రుపరి బాష్పబిందవః 4

వ్యాఖ్య: నిదేశకరణోద్యతౌ-తండ్రియాజ్ఞను నిర్వర్తించుటకు సిద్ధపడిన వారును, ధన్వినౌ-ధనుస్సులను ధరించిన వారును నగు, తౌ-ఆ రామలక్ష్మణు లిద్దఱును, పితుః-తండ్రియొక్క చరణయోః-పాదములపైన, నిపేతతుః-పడిరి (నమస్కరించిరి) భూపతేః అపి-రాజుయొక్కయు, బాష్పబిందవః-కన్నీటి చుక్కలు, ప్రవత్స్యతోః-ప్రవాసమును చేయఁబోవు వారును, నమ్రయోః-నమస్కరించుచున్న వారును నగు రామ లక్ష్మణులయొక్క, ఉపరి-పైన, నిపేతుః... ఇచ్చటి క్రియ కర్తృపదమగు బాష్పబిందువుల ననుసరించి "నిపేతుః" అని బహువచనముగా మార్చఁబడినది. పితృాజ్ఞను మాటలాడక యాచరించు రామ లక్ష్మణులు ప్రయాణ సన్నద్ధులై తండ్రి పాదములయందు శిరస్సులుంచి నమస్కరించుచుండగా నెంతదాతయైనను దశరథుకు పుత్రవాత్సల్యముచేత ప్రవాసము చేయబోవు వారిపై కన్నీళ్ళురాల్చె నని భావము.

శ్లో. తౌ పితు ర్నయనజేన వారిణా
కించి దుక్షిత శిఖండకా వుభౌ
ధన్వినౌ త మృషి మన్వగచ్ఛతాం
పౌరదృష్టి కృతమార్గతోరణౌ. 5

వ్యాఖ్య: పితుః-తండ్రియొక్క, నయనజేన-కన్నులనుండి రాలిన, వారిణా-బాష్పోదకముచేత, కించిదుక్షితశిఖండకౌ-కొంచెము తడుపబడిన జుట్టులు కలవారును ధన్వినౌ-ధనుర్ధరులును నగు, తౌ, ఉభౌ-ఆయిద్దఱు రామలక్ష్మణు

లును, పౌరదృష్టి కృత మార్గతోరణౌ—పౌరదృష్టి-ప్రజాసమూహపు కన్నులచేత, కృత-కల్పింపబడిన, మార్గతోరణౌ-దారియందు కట్టబడిన కలువపూదోరణములు గలవారగుచు, తం, ఋషిం-ఆవిశ్వామిత్ర ఋషిని, అన్వగచ్ఛతాం-అనుసరించి వెళ్ళిరి. "శిఖా చూడా శిఖండఃస్యాత్" అనియమరము. శిఖండ శబ్దమునకు "శేషాద్విభాషా" అనుసూత్రమువలన "క" ప్రత్యయమువచ్చి "శిఖండక" అని యైనది. వాత్సల పూరితహృదయులైన తండ్రి కన్నీళ్ళతో తడిసిన తలలుగల రామ లక్ష్మణులు తను రులై, ప్రజలకనులే కలువదండలై మార్గము నలంకరింపగా విశ్వా మిత్రుని వెనుక డచిరని భావము. రాముడు మారువల్కక వెళ్ళుట పితృాజ్ఞాపరి పాలన దీక్షయొక్క పరాకాష్ఠ.

శ్లో. లక్ష్మణానుచర మేవ రాఘవం
నేతు మైచ్ఛ దృషి రిత్యసౌ నృపః
ఆశిషం ప్రయుయుజే న వాహినీం
సా హి రక్షణవిధౌ తయోః క్షమా. 6

వ్యాఖ్య : ఋషిః-విశ్వామిత్రుడు, లక్ష్మణానుచరం, ఏవ-లక్ష్మణ మాత్రానుచరుడుగానున్న, రాఘవం-రాముని, నేతుం-తీసికొనివెళ్ళుటకు, ఐచ్ఛత్, ఇతి-కోరియున్నాడను కారణమువలన, అసౌ, నృపః-ఈ దశరథుడు, ఆశిషం-ఆశీస్సును, ప్రయుయుజే-చేసెను, వాహినీం-సైన్యమును, న ప్రయుయుజే-పంప లేదు. హి-ఏకారణమువలననైతే, సా-ఆయాశీస్సే, తయోః-ఆకుమారులయొక్క, రక్షణవిధౌ-కాపాడుటయందు, క్షమా-సమర్థమైయున్నదో; విశ్వామిత్రుని కోరిక ననుసరించి రామునివెంట ఒకలక్ష్మణుని మాత్రమే పంపుచు ఆశీర్వదించెను. వారికి సైన్యసహాయ మక్కరలేదనియు, తనయాశీర్బలమును, ముని యనుగ్రహమును వారిని గాపాడునని దశరథుడెఱుగునని భావము.

శ్లో. మాతృవర్గ చరణస్పృశౌ మునేః
తౌ ప్రపద్య పదవీం మహౌజసః
రేజతు ర్గతివశాత్ ప్రవర్తినౌ
భాస్కరస్య మధుమాధవా వివ. 7

వ్యాఖ్య : మాతృవ చరణస్పృశౌ-తల్లుల పాదములను స్పృశించిన వారై (కౌసల్య, సుమిత్ర, కలను నమస్కరించినవారై), తౌ-ఆరామలక్ష్మణులు, మహౌజసః-మహాతేజ స్వియగు, మునేః-విశ్వామిత్రునియొక్క, పదవీం, ప్రపద్య-మార్గమును అనుసరించి, భాస్కరస్య-సూర్యునియొక్క, గతివశాత్-మేషాదిరాశి సంక్రాంత్యనుసారముగా, ప్రవర్తినౌ-నడచునట్టి, మధు మాధవౌ, ఇవ-చైత్రవైశాఖ మాసములవలె, తేజతుః-ప్రకాశించిరి. తల్లులకు నమస్కరించి మహాతేజస్వియగు విశ్వామిత్రునివెంట నడచుచున్న రామలక్ష్మణులు, మేషాదిరాసులను జేరు సూర్యగతిననుసరించు చైత్ర, వైశాఖ మాసములవలె ప్రకాశించిరని భావము. ఇచ్చట విశ్వామిత్రుఁడు సూర్యునివలెను, రామలక్ష్మణులు, మధు. మాధవ మాసములవలెను ఉండిరని చెప్పుటచేత నిది యుపమాలంకారము, చైత్ర, వైశాఖ మాసములు ఎండవేడిమి కలవియైనను పుష్పఫలభరితమగు ప్రకృతిని గలిగి యున్నట్లు రామలక్ష్మణు లాహ్లాదకరమైన తేజస్సుగలిగియుండి రనియు, విశ్వామిత్రుఁడు చండభానుతేజస్కుఁడై యుండెననియు గ్రహింపవలెను. "స్యాచ్చైత్రే చైత్రికో మధుః", వైశాఖే మాధవో రాధః" అనియమరము.

శ్లో. వీచిలోల భుజయో స్తయో ర్గతం
శైశవా చ్చపల మప్యశోభత
తోయదాగమ ఇవోద్ధ్యభిద్యయో
ర్నామధేయ సదృశం విచేష్టితమ్. 8

వ్యాఖ్య : వీచిలోల భుజయోః-తరంగములవలె చంచలములగు భుజములు గల, తయోః-ఆరామలక్ష్మణుల యొక్క, చపలం, అపి-చాపల్యముగలదై యున్నను, గతం-నడక, తోయదాగమే-వర్షాకాలమునందు, ఉద్ధ్యభిద్యయోః- ఉద్ధ్య భిద్యము లను పేర్లుగల నదములయొక్క, నామధేయ సదృశం-పేర్లకుఁదగిన, విచేష్టితం, ఇవ-వ్యాపారమువలె, శైశవాత్-బాల్యమువలన, అశోభత-అందముగానే కనపడెను. బాల్యచాపల్య వశమున రామలక్ష్మణులు చేతులను ఊపుకొనుచు నడచుట చూచుటకు ముచ్చటగా నుండె నని భావము. ఉజ్ఝతి ఉదకం ఇతి ఉద్ధ్యః అనియు, భినత్తి కూలం ఇతిభిద్యః అనియు నర్థములు గల యా రెంతు శబ్దములును నదముల పేర్లయి యుండఁగా వానిని "భిద్యోద్ధ్యౌనదే" అని పాణిని నిపతించి, "క్యప్" ప్రత్యయాంతములుగాఁ జెప్పెను.

శ్లో. తౌ బలాతిబలయోః ప్రభావతో
విద్యయోః పథి ముని ప్రదిష్టయోః
మమ్లతు ర్న మణికుట్టిమోచితౌ
మాతృపార్శ్వ పరివర్తినా వివ. 9

వ్యాఖ్య : మణికుట్టిమోచితౌ-మణులుపరచిన నేలపై నడువఁదగిన, తౌ-ఆరామలక్ష్మణులు, మునిప్రదిష్టయోః—విశ్వామిత్రునిచే నుపదేశింపఁబడిన, బలాతిబలయోః, విద్యయోః- "బలా, అతిబలా" అనుపే ల మంత్రములయొక్క, ప్రభావతః-సామర్థ్యమువలన, మాతృపార్శ్వ పరివ ర్తినౌ, ఇవ-తల్లి పక్కన ఉన్న వారు వలె, పథి-మార్గమునందు, నమమ్లతుః-వాడి లేదు (అలసిపోలేదు). చలువ రాళ్ళు పరచిన నేలపై దిరుగు సుకుమార కుమారులైనప్పటికిని రామలక్ష్మణులు విశ్వామిత్రుఁ డుపదేశించిన బలాతిబలా విద్యాప్రభావమువలన కఠినభూములపై నడచుటచేతగాని, సకాల భోజనాదులు లేనందువలనగాని అలతఁజెందక తల్లిపక్కన నున్నట్లు సుఖముగా నుండిరని భావము. ఈ సందర్భమునందలి రామాయణ శ్లోకము ఈ విషయమును దృఢపరచుచున్నది:—

శ్లో. "క్షుత్పిపాసే న తే రామ! భవిష్యేతే నరోత్తమ!
బలా మతిబలాం చైవ పఠతః పథి రాఘవ!"

మార్గమునందు బలా అతిబలా మంత్రములను బఠించుచో నీకు ఆకలి దప్పులు కలుగఁబోవు రామా! అని యర్థము. ఈ విద్యల ప్రభావమువలన రాముని కరణ్యసంచారము మిక్కిలి సులభమైనది.

శ్లో. పూర్వ వృత్త కథితైః పురావిదః
సానుజః పితృసఖస్య రాఘవః
ఉహ్యమాన ఇవ వాహనోచితః
పాదచార మపి న వ్యభావయత్. 10

వ్యాఖ్య : వాహనోచితః-ఉత్తమాశ్వరథాదులనెక్కి ప్రయాణము చేయఁదగిన, సానుజః, రాఘవః-లక్ష్మణసహితుఁడగు రాముఁడు, పురావిదః-పురాణ

కథల నెరిగినవాఁడును, పిత సఖస్య-తనతండ్రికి మిత్రుఁడును నగు విశ్వామిత్రునియొక్క, పూర్వవృ కథితైః-పూర్వకాలపు కథలను చెప్పుమాటలచేత, ఉహ్యమానః, ఇవ-మోసికొని బడుచున్నవాని వలె, పాదచారం, అపి-కాలినడకను గూడ, నవ్యభావయత్-మనస్సున కెక్కించుకొనలేదు. మనస్సునకు సంతోషమును గలిగించు పూర్వకథలను విశ్వామిత్రుఁడు చెప్పుచుండుటచేత ఆ సంతోషములో తాను కాలి నడకన వెళ్ళుచుంటి నన్న తలంపే రామునికిఁ గలుగలేదని భావము. ఇది లోకానుభవసిద్ధము, మధుర సంభాషణ ముచేయుచు మనము నడచుచో దారి యెంతదూరమైనను క్లేశము ను భావింపక వెళ్ళుదుము గదా!

శ్లో. తౌ సరాంసి రసవద్భి రంబుభిః
కూజితైః శ్రుతిసుఖైః పతత్త్రిణః
వాయవః సురభిపుష్పరేణుభి
శ్ఛాయయా చ జలదాః సిషేవిరే 11

వ్యాఖ్య : తౌ-ఆరామలక్ష్మణులను, సరాంసి-సరస్సులు, రసవద్భిః-మధురములగు, అంబుభిః జలములచేతను, పతత్త్రిణః-పక్షులు, శ్రుతిసుఖైః చెవులకింపైన, కూజితైః-ధ్వనులచేతను, వాయవః-వాయువులు, సురభిపుష్పరేణుభిః-సువాసనగల పువ్వుల పుప్పొడులచేతను, జలదాః-మేఘములు, ఛాయయా-నీడచేతను, సిషేవిరే-సేవించినవి. విశ్వామిత్రునివెంట కథలువింటూ వెళ్ళుచున్న రామలక్ష్మణులకు దప్పియైనప్పుడు సరస్సులు మధురజలములను, పక్షులు చెవుల కింపైన ధ్వనులను, గాడ్పులు పరిమళవంతములగు పుప్పొడులను, ఎండతగులనీక మేఘములు నీడలను ఇచ్చి సేవించినవట. మహావిష్ణుస్వరూపుడగు రాముఁడు తమ వద్దికి రాగానే ప్రకృతియంతయు పులకించిన దనియు, అవియన్నియు అట్లు సేవించి ధన్యములైన వనియు భావము.

శ్లో. నాంభసాం కమలశోభినాం తథా
శాఖినాం చ న పరిశ్రమచ్ఛిదామ్
దర్శనేన లఘునా యథా తయోః
ప్రీతి మాపు రుభయో స్తపస్వినః. 12

వ్యాఖ్య : తపస్వినః-మునులు, లఘు నా-తమకిష్టమైన, తయోః ఉభయోః-ఆరామలక్ష్మణులిద్దరియొక్క, దర్శనేన-దర్శనముచేత, యథా-ఏవిధ ముగానైతే, ప్రీతిం-ఆనందమును, ఆపుః-పొందిరో, తథా-ఆవిధముగా, కమల శోభినాం-కమలములతో ప్రకాశించుచున్న, అంభసాం-ఉదకములయొక్క, దర్శనేన-దర్శనముచేత గాని, పరిశ్రమచ్ఛిదాం-అలసటను పోగొట్టునట్టి, శాఖి నాం-చెట్లయొక్క, దర్శనేనచ-దర్శనముచేతగాని, న, ఆపుః-పొందలేకపోయిరి రామలక్ష్మణుల దర్శనము వనమార్గముండిలి మునులకన్నులకు హాయిగానుండె నని భావము. ఇచ్చటి "లఘు" శబ్దమునకు "ఇష్టమైన" అని యర్థము. "త్రిష్విష్టేఽల్పేలఘుః" అనియమరము

శ్లో. స్థాణు దగ్ధ వపుష స్తపోవనం
ప్రాప్య దాశరథి రాత్తకార్ముకః,
విగ్రహేణ మదనస్య చారుణా
సోఽభవత్ ప్రతినిధి ర్న కర్మణా 13

వ్యాఖ్య : సః-ఆ, ఆత్తకార్ముకః-పట్టుకొనబడిన ధనుస్సుగల, దాశరథిః-శ్రీరాముడు, స్థాణుదగ్ధవపుషః-శివునిచేత దహింపబడిన శరీరముగల, మదనస్య-మన్మథుని యొక్క, తపోవనం, ప్రాప్య-తపోవనమును ప్రవేశించి, చారుణా-అందమైన, విగ్రహేణ-శరీరముచేత, ప్రతినిధిః-ప్రతిరూపము గలవాడు, (సమానుడు) అభవత్-అయ్యెను. కర్మణా-మన్మథుని చేతలతో మాత్రము, న-కాదు. ధనుర్ధరుడై యున్న రాముడు దేహమాత్ర సామ్యముచేత మదన సుందరుడై యుండెనేయు, మన్మథుడు చేయు మునిమనశ్చాలన రూపమైన తపోవిఘ్నమును చేయక, మునుల కానందమును గలిగించు దేహ సౌందర్యము గలవాడుగా నుండె ననియు భావము.

శ్లో. తౌ సుకేతు సుతయా ఖిలీకృతే
కౌశికా ద్విదిత శాపయా పథి
నిన్యతుః స్థలనివేశి టాటనీ
లీలయే వ ధనుషీ అధిజ్యతామ్. 14

వ్యాఖ్య : కౌశికాత్-కథలు చెప్పుచున్న విశ్వామిత్రునివలన, విదిత శాపయా-తెలియఁబడిన శాపము గలదియగు, సుకేతు సుతయా-సుకేతు పుత్రిక యగు తాటకచేత, ఖిలీకృతే-నడచుటకు వీలుపడనట్లు చెడగొట్టఁబడిన, పథి-మార్గము నందు, తౌ-ఆరామలక్ష్మణు లిద్దరును, స్థలీ వేశి తాటనీ-స్థల నివేశిత-ఉంచఁదగిన చోట నుంచఁబడిన, అటనీ-ధనుస్సుల చివరిభాగములు గలవారై, లీలయా, ఇవ-అతిసులభముగానే, ధనుషీ-తమ ధనుస్సులను, అధిజ్యతాం-ఎక్కుపెట్టబడిన య ల్లె త్రా టు క ల వా ని ని - ని న్య తుః - చే సి రి తే ధ ను షీ అధిజ్యతాం నిన్యతుః" అని వాక్యము. ఇది ద్వికర్మక కర్తరి ప్రయోగము. 'నీ' ధాతువట్టిది కనుక. "విదితశాపయా" అను విశేషణము, తాడకకు అగస్త్యుని వలన గలిగిన శాపమును రామలక్ష్మణులకు విశ్వామిత్రుఁడు చెప్పెనని తెలుపును. "అగస్త్యః పరమ క్రుద్ధ స్తాడకా మభిశప్తవాన్, పురుషాదీ మహాయక్షీ వికృతా వికృతాననా, ఇదం రూప మపహాయ దారుణం రూప మస్తు తే" అని రామాయణ వచనము. అట్లు తాడక భయంకర రూపముతో ఖిలమైయున్న ఆ మార్గమునందు మనుష్యులను భక్షించుచున్న సంగతిని విశామిత్రుఁడు చెప్పుటచేత రామలక్ష్మణులు ధనుఃకోటులను నేలపైనుంచి, వంచి, య ల్లెను బిగించి, తాడకావధార్థమై సిద్ధపడి రని భావము. "ఖిల మ ప్రహతం నమ్" అని హలాయుధ నిఘంటువు.

శ్లో. జ్యా నినాద మథ గృహ్ణతీ తయోః
ప్రాదురాస బహులక్షపా ఛవిః
తాడకా చలకపాలకుండలా
కాలికేవ నిబిడా బలాకినీ. 15

వ్యాఖ్య : అథ-తరువాత (రామలక్ష్మణులు ధనుస్సు లెక్కుపెట్టి మ్రోగించిన పిమ్మట), తయోః-వారిద్దరియొక్క, జ్యానినాదం-ధనుష్టంకారమును, గృహ్ణతీ-ఎరిగినదియై (విన్నదియై), బహుల క్షపా ఛవిః-కృష్ణపక్ష రాత్రి వర్ణముగలదియు, చల కపాల కుండలా-కదలుచున్న తలపుర్రెల కుండలములుగల, తాడకా-తాటక, నిబిడా-దట్టమైన శరీరము గలదియు, బలాకినీ-తనచుట్టు కొంగలు గలదియు నగుచు, కాలికా, ఇవ-మేఘ పంక్తి వలె, ప్రాదురాస-ప్రత్యక్షమయ్యెను. రామ లక్ష్మణ ధనుష్టంకార ధ్వనులకు కోపించిన తాటక, నల్లని శరీరకాంతితో, తల పుర్రెల కుండలములతో, భయంకర శరీరముతో, కొంగలు తనవద్దనున్న నర

మాంసమునకై చుట్టుకొనుచుండగా మేఘపంక్తివలె ప్రత్యక్షమయ్యె నని భావము. "కాలికా" యనగా ఘనావలియని విశ్వ నిఘంటు వచనము.

శ్లో. తీవ్రవేగ ధుత మార్గవృక్షయా
ప్రేత చీవరవసా స్వనోగ్రయా
అభ్యభావి భరతాగ్రజ స్తయా
వాత్యయేవ పితృకాననోత్థయా 16

వ్యాఖ్య : తీవ్ర వేగ ధుత మార్గవృక్షయా-అత్యంతమైన గమన వేగముచేత ఊపివేయబడిన మార్గవృక్షములు గలదియు, ప్రేతచీవర వసా-పీనుగుల వస్త్రము లను ధరించినదియు, స్వనోగ్రయా-సింహనాదములచేత భయంకరమైన, తయా-ఆ తాటకచేత, పితృకాననోత్థయా-పితృకానన-శ్మశానము నుండి, ఉత్థయా-లేచిన, వాత్యయా, ఇవ-గాడ్పు గుంపుచేత వలె, భరతాగ్రజః-శ్రీరాముఁడు, అభ్యభావి-తిరస్కరింపఁబడెను. అతి వేగముతో చెట్లను ఊపుచు, చింకిపాతలను లేపుచు, పెద్ద ధ్వనితోగూడిన శ్మశానమునందలి సుడిగాలి వలె తీవ్రవేగాదులు గల తాటక రాముని చుట్టుముట్టె నని భావము అలంకారము : ఉపమ.

శ్లో. ఉద్యతైకభుజయష్టి మాయతీం
శ్రోణిలంబి పురుషాంత్ర మేఖలామ్
తాం విలోక్య వనితావధే ఘృణాం
పత్రిణా సహ ముమోచ రాఘవః. 17

వ్యాఖ్య : ఉద్యతైకభుజయష్టిం-ఎత్తబడిన దుడ్డుకర్రవంటి భుజముగలదియై, ఆయతీం-వచ్చుచున్నదియు, శ్రోణిలంబి పురుషాంత్రమేఖలాం—శ్రోణిలంబి-పిరుదులపై వ్రేలాడుచున్న, పురుషాంత్ర-మనుష్యుల ప్రేగులనెడు, మేఖలాం-మొలనూలు గ ల ది యు న గు, తాం-ఆ తాటకను, విలోక్య-చూచి, రాఘవః-శ్రీరాముఁడు, వనితావధే-స్త్రీవధయందలి, ఘృణాం-దయను, లేదా అసహ్యభావ మును పత్రిణా, సహ-బాణముతోఁగూడ, ముమోచ-వదలెను. తనను జంపుటకై భుజమునెత్తి భయంకరముగా వచ్చుచున్న తాటకను, "స్త్రీని జంపుట పాపము"

అనుభావమును విడచి, శరముచేత గూర్చెను. ఇచ్చట నేక కాలమున రాముడు బాణమును స్త్రీయందలి కరుణతోపాటు విడిచెనని చెప్పుటకే నిది "సహోక్తి" అలంకారము. స్త్రీవధ పాపకృత్య మనుట నిరపరాధిని లేదా ఆతతాయిని కానట్టి స్త్రీవిషయము. ఆతతాయిత్వము (చంపదలచుకొని వచ్చుట) గల స్త్రీవిషయము కాదు. కనుక రామునికి స్త్రీవధ పాతకము నంటగట్టు విమర్శనము సరికాదు. మనువు ఆతతాయివధ దోషము కాదని యిట్లు చెప్పెను,

శ్లో. "ఆతతాయిన మాయాంతం హన్యాదేవావిచారయన్
జిఘాంసంతం జిఘాంసీయాత్ స తేన బ్రహ్మహా భవేత్
నాతతాయివధే దోషో హంతు ర్భవతి కశ్చన"

శ్లో. య చ్చకార వివరం శిలాఘనే
తాడకోరసి స రామసాయకః
అప్రవిష్ట విషయస్య రక్షసాం
ద్వారతా మగమ దంతకస్య తత్. 18

వ్యాఖ్య : సః, రామసాయకః-ఆరాముని బాణము, శిలాఘనే-రాతివలె గట్టిదైయున్న, తాడకోరసి-తాటకయొక్క వక్షస్థలమునందు, యత్, వివరం-ఏ రంధ్రమును, చకార-చేసెనో, తత్-అది, రక్షసాం-రాక్షసులయొక్క, అప్రవిష్ట విషయస్య-ప్రవేశింపని దేశముగల (ఇంతకుముందు ప్రవేశింపని రాక్షసదేశముగల). అంతకస్య-యమధర్మ రాజునకు, ద్వారతాం-ద్వారమగుటను, అగమత్-పొందెను, శ్రీరాముడు తాటక వక్షస్థలమున బాణముచేత చేసిన రంధ్రము యమధర్మరాజునకు రాక్షసదేశ ప్రవేశమునకు ద్వారముగా నేర్పడెను. ఇది ప్రథమ రక్షోమరణ మనియు, ఇకమీద చచ్చురాక్షసు లెందరోగలరనియు సూచన. తాటకను శిలగా చెప్పుట ఉపమలో లింగసావర్ణ్యముకొఱకు "తాడకా, శిలా" శబ్దములు రెండును స్త్రీలింగములే. పాషాణ ప్రస్తరాదులు పుంలింగములు కనుక వాటిని వాడలేదు.

శ్లో. బాణభిన్న హృదయా నిపేతుషీ
సా స్వకాననభువం న కేవలామ్,
విష్టపత్రయ పరాజయ స్థిరాం
రావణశ్రియ మపి వ్యకంపయత్. 19

వ్యాఖ్య : బాణభిన్నహృదయా-రామబాణముచేత చీల్చబడిన వక్షస్థలము గలదియై, నిపేతుషీ-నేలపైఁబడిన దగుచున్న, సా-ఆతాటక, కేవలాం-ఒక, స్వకానసభువం-తన యరణ్యభూమిని మాత్రమే, నవ్యకంపయత్-వణికింపలేదు, విష్టప త్రయ పరాజయ స్థిరాం-విష్టపత్రయ-మూడు లోకముల యొక్క, పరాజయము-ఓటమిచేత, స్థిరాం - నిలువద్రొక్కుకొని యున్న, రావణశ్రియం, అపి-రావణాసురుని రాజ్యలక్ష్మిని సైతము, వ్యకంపయ - వణకించెను. రామబాణనిహతయై పడిన తాటకవలన ఆమెయున్న కానన ప్రదేశము వణకిపోయెను, ఆమెయనుచరులు గూడ భయకంపితులైరి. అంతేకాక తాటకావధ శ్రవణముచేత రావణునికిఁగూడ భయముగలిగె నని భావము. కేవల శబ్దము "కేవలం" అనినపుంసకలింగమునందు ప్రయోగించినప్పుడు మాత్రమే నిర్ణయము అను అర్థమును దెలుపును.

శ్లో. రామమన్మథ శరేణ తాడితా
దుఃసహేన హృదయే నిశాచరీ,
గంధవద్రుధిరచంద నోక్షితా
జీవితేశవసతిం జగామ సా. 20

వ్యాఖ్య : సా, నిశాచరీ-ఆరాక్షసి (తాటక), దుస్సహేన-సహించుటకు శక్యముగాని, రామమన్మథశరేణ-మదన సుందరుఁడగు రామునిబాణముచేత, హృదయే-వక్షస్థలమునందు, తాడితా-కొట్టబడినదియై, గంధవద్రుధిరచందనోక్షితా-దుర్గంధముగల రక్తమను చందనముచేత పూయఁబడినదియై, జీవితేశవసతిం-సర్వప్రాణుల జీవితమున కధిపతియగు యమునియొక్క నివాసమునకు (నరకమునకు) జగామ-చేరెను. ఈ శ్లోకమునందలి విశేషణముల యర్థబలమున ఒక అభిసారికా నాయికావృత్తాంతము గోచరించుచున్నది. ఎట్లనగా, నిశాచరీ-రాత్రివేళ సంచారము చేయునట్టి యభిసారిక, దుస్సహేన - సహించుటకు శక్యముగాని, రామ మన్మథశరేణ-అందగాడగు మన్మథుని బాణముచేత హృదయే - మనస్సునందు, తాడితా-కొట్టబడినదియై, గంధవద్రుధిరచందనోక్షితా-పరిమళముగల కుంకుమపూవు రసముచేతను, శ్రీగంధము చేతను, పూయబడిన శరీరము గలదయై జీవితేశవసతిం-ప్రాణనాథుని మందిరమునకు, జగామ-వెళ్లెను. అలంకారము: ప్రకృతాప్రకృతశ్లేష. "హృదయం మన ఉరసోః" అను విశ్వనిఘంటు వచనముచేత హృదయ శబ్దమునకు వక్షస్థలము, మనస్సు రెండును అర్థము లే,

"రుధిరం కుంకుమాస్ృజోః" అని విశ్వ ఘంటువే. కనుక రుధిర శబ్దమునకు రక్తము, కుంకుమపుష్పము నర్థములు. "జీవితేశ" శబ్దము యౌగికార్థమున యముని, జెప్పుట చమత్కారము.

శ్లో. నైరృతఘ్న మథ మంత్రవ న్మునేః
ప్రాప దస్త్ర మవదానతోషితాత్,
జ్యోతి రింధననిపాతి భాస్కరాత్
సూర్యకాంత ఇవ తాడకాంతకః 21

వ్యాఖ్య : అథ-తరువాత, తాడకాంతకః-రాముడు, అవదానతోషితాత్-తన పరాక్రమముచేత సంతోషించిన, మునేః-విశ్వామిత్రునివలన, నైరృతఘ్నం-రాక్షసులను జంపునట్టి, మంత్రవత్-సమంత్రకమగు, అస్త్రం-బాణమును, సూర్యకాంతః-సూర్యకాంతమణి, భాస్కరాత్-సూర్యునివలన, ఇంధననిపాతి-కట్టెలను దహించునట్టి, జ్యోతిః, ఇవ-మంటవలె, ప్రాపత్-పొందెను. సూర్యకాంతమణి భాస్కరుని వలన తేజస్సువలె ప్రీతుడగు విశ్వామిత్రునివలన రాక్షసఘ్నమైన అస్త్రమును సమంత్రకముగా రాముడు గ్రహించెనని భావము. అలంకారము: ఉపమ. "అవదాన" మనగా పరాక్రమము. "పరాక్రమోఽవదానంస్యాత్" అని భాగురి చెప్పెను. భాస్కరునితో విశ్వామిత్రునికిని, సూర్యకాంతమణితో రామునికిని పోలిక చెప్పుటలో గురుశిష్యసంబంధము సహజమై రాముడు గుర్వనుగ్రహము నాకర్షించెనని సూచింపబడినది.

శ్లో. వామనాశ్రమపదం తతః పరం
పావనం శ్రుత మృషే రుపేయివాన్,
ఉన్మనాః ప్రథమజన్మచేష్టితా
న్యస్మరన్నపి బభూవ రాఘవః. 22

వ్యాఖ్య : తతఃపరం-ఆతరువాత, రాఘవః-శ్రీరాముడు, ఋషేః-కథలు చెప్పుచున్న విశ్వామిత్రునివలన, శ్రుతం-వినబడినదియు, పావనం-పవిత్రతను జేకూర్చునదియు నగు, వామనాశ్రమపదం-తన పూర్వావతారమగు వామ

నునికి నివాస యుండిన ఆశ్రమస్థానమును, ఉపేయివాన్-చేరినవాడగుచు, ప్రథమజన్మచే తాని-పూర్వజన్మ కృతములగు విషయములను, అస్మరన్, అపి-స్మరించుకొనలే వాఁడైనను, ఉన్మనాః-ఒక విధమగు ఔత్సుక్యము గలవాఁడు, బభూవ-అయె ను. విశ్వామిత్రుని కథాకథన ప్రసక్తిలో వచ్చిన వామనాశ్రమును జేరినప్పుడు రామునికి తన పూర్వజన్మస్మృతి లేకపోయినను, అజ్ఞాతసంస్కార ప్రాబల్యము లన మనస్సులో నొక సంతోషోద్వేగసుగల ఔత్సుక్యము గలిగెనని భావము. భారతీయ వేదాంతసిద్ధాంతము ననుసరించి మానవునికి సంభవించు జన్మ పరంపరలో ప్రాక్తనసంస్కార బలమువలన మనోవికారములు గలుగుచుండునని భావము.

శ్లో. ఆససాద ముని రాత్మన స్తతః
శిష్యవర్గ పరికల్పితార్హణమ్,
బద్ధ పల్లవపుటాంజలి ద్రుమం
దర్శనోన్ముఖ మృగం తపోవనమ్. 23

వ్యాఖ : తతః-తరువాత, మునిః-విశ్వామిత్రుఁడు, శిష్యవర్గ పరికల్పితార్హణం-శిష్యవ -శిష్యబృందముచేత, పరికల్పిత-సిద్ధముచేయఁబడిన, అర్హణం (అర్హణా అసి న్ అస్తి ఇతి అర్హణం)-పూజాసామగ్రి గలదియు, బద్ధ పల్లవ పుటాంజలి ద్రుమం-బద్ధ-జోడించుకున్న, పల్లవపుట-దొన్నెలవలెనున్న చిగురాకులే, అంజలి-దోసిళ్ళుగాఁగల, ద్రుమం-వృక్షములు గలదియు, దర్శనోన్ముఖ మృగం-విశ్వామిత్రదర్శనముకొరకై పైకిచూచిన ముఖములు గల లేళ్ళతోఁగూడి నదియునగు, ఆత్మనః-తనయొక్క, తపోవనం-తపోవనమును, ఆససాద-చేరెను. అతిథిసత్కార, భక్తి, వినయాదులను ఆశ్రమమునందలి శిష్యవర్గము, వృక్షములు, మృగములు సైతముపాటించు శాంతినిలయమగు తన యాశ్రమమును రామలక్ష్మణ సమేతుఁడగు విశ్వామిత్రుఁడు చేరెనని భావము.

శ్లో. తత్ర దీక్షిత మృషిం రరక్షతు
ర్విఘ్నతో దశరథాత్మజౌ శరైః
లోక మంధతమసాత్ క్రమోదితౌ
రశ్మిభిః శశి దివాకరా వివ. 24

వ్యాఖ్య : తత్ర-అచ్చట (విశ్వామిత్రుని తపోవనమునందు), దశరథాత్మజౌ-దశరథుని కుమారులిద్దఱును (రామలక్ష్మణులు),దీక్షితం-యజ్ఞదీక్షా సంస్కారమును పొందిన,ఋషిం-విశ్వామిత్రుని, శరైః-బాణములచేత,విఘ్నతః-విఘ్నముల నుండి, క్రమోదితౌ-వరుసగా ఉదయించిన (రాత్రియందును, పగటియందును) శశి దివాకరౌ-చంద్రుఁడును, సూర్యుఁడును, రశ్మిభిః-కిరణములచేత, అంధతమసాత్-గాఢాంధకారమునుండి, లోకం, ఇవ-ప్రాణిసమూహమును వలె, రరక్షతుః-రక్షణ చేయుటకుఁ బూనిరి. రాత్రియందు చంద్రుడును, పగటివేళ సూర్యుఁడును వరుసగా లోకమును గాఢాంధకారమునుండి కాపాడునట్లు, యజ్ఞదీక్షితుఁడైన విశ్వామిత్రుని, తమశరములచేత రాక్షసులు చేయువిఘ్నముల నుండి రక్షించుటకై, ఒకరి తరువాత నొకరు జాగరూకులై యుండిరని భావము. అలంకారము:ఉపమ.

శ్లో. వీక్ష్య వేది మథ రక్తబిందుభి
ర్బంధుజీవ పృథుభిః ప్రదూషితామ్,
సంభ్రమో ఽభవ దపోఢకర్మణాం
ఋత్విజాం చ్యుత వికంకత స్రుచామ్. ౨౫

వ్యాఖ్య : అథ-ఆతరువాత, బంధుజీవ పృథుభిః-మంకెనపూలయంత పెద్దవియగు, రక్తబిందుభిః-నెత్తురుచుక్కలచేత, ప్రదూషితాం-కలుషితముచేయఁబడిన వేదిం-యజ్ఞవేదికను, వీక్ష్య-చూచి, అపోఢకర్మణాం-వదలివేయఁబడిన తమతమ పనులు గలిగినట్టియు,చ్యుత వికంకత స్రుచాం-చేతులనుండిజాఱినపుల్లవెలగకఱ్ఱలతో చేసిన స్రుక్కులుగలిగినట్టియు, ఋత్విజాం-యజ్ఞమునందు సహకరించు ఋత్విజులయొక్క, సంభ్రమః-సంచలనము, అభవత్-జరిగెను. యజ్ఞవేదికమీద పెద్ద పెద్ద నెత్తురుచుక్కలుపడి దూషితమైపోగా, దానిని చూచిన ఋత్విజులకు భయము కలిగి, వారిచేతులనుండి స్రుక్స్రువములు జారిపడెననియు,వారు తమపనులనుమాని కంగారుతో కలవరపాటుఁజెంది రనియు భావము, హోమము చేయునప్పుడుపయోగించు గరిటెలపంటి కఱ్ఱపనిముట్లకు స్రుక్స్రువము లని పేరు. వాటినిచంద్ర, పుల్లవెలగకఱ్ఱలతో చేయవలెనని శాస్త్రము.

శ్లో. ఉన్ముఖః సపది లక్ష్మణా గ్రజో
బాణ మాశ్రయముఖా త్సముద్ధరన్

రక్షసాం బల మపశ్య దంబరే
గృధ్రపక్ష పవనేరిత ధ్వజమ్. 26

వ్యాఖ్య : సపది-తక్షణమే, లక్ష్మణాగ్రజః-రాముఁడు, బాణం-బాణమును, ఆశ్రయముఖాత్-అంబులపొదినుండి, సముద్ధరన్- పైకిఁదీయుచున్న వాఁడగుచు, ఊర్ధ్వముఖః-ఆకాశమువైపున కెత్తిన ముఖముగలవాఁడై అంబరే- ఆకాశమునందు, గృధ్రపక్షపవనేరితధ్వజం—గృధ్రపక్ష-గ్రద్దలరెక్కలయొక్క, పవన-గాలిచేత, ఈరిత-కదలింపబడిన, ధ్వజం-రథముల జెండాలు గలదియగు, రక్షసాం-రాక్షసుల యొక్క, బలం-సైన్యమును, అపశ్యత్-చూచెను. యజ్ఞవేదిక రక్తమలినము కాగానే తూణీరమునుండి బాణమును దీయుచు, ఆకసమువైపుకు చూచిన రామునికి గ్రద్దల రెక్కలగాలిచే రెపరెప లాడుచున్న రథకేతనములు గల రాక్షససైన్యము కనపడె నని భావము. రథములపైన గ్రద్దలాడుట రాక్షసులకు దుశ్శకునము. "ఆసన్నమృత్యోర్నికటే చరంతి గృధ్రాదయో మూర్ధ్ని గృహోర్ధ్వభాగే" గద్దలుమొదలగుపక్షులు మృత్యువుసమీపించిన వ్యక్తి తలపైనగాని, ఇంటిపైభాగమునందు గాని తిరుగును అని శకునార్ణవమునందుకలదు.

శ్లో. తత్ర యా వధిపతీ మఖద్విషాం
తౌ శరవ్య మకరో త్స నేతరాన్
కిం మహోరగ విసర్పి విక్రమో
రాజిలేషు గరుడః ప్రవర్తతే? 27

వ్యాఖ్య : సః-ఆరాముఁడు, తత్ర- ఆరాక్షససైన్యమునందు, యౌ-ఏయి ద్దఱు, మఖద్విషాం-రాక్షసులకు, అధిపతీ- అధిపతులై యున్నారో, తౌ-ఆయిద్దఱగు సుబాహు, మారీచులను, శరవ్యం-తనబాణమునకు లక్ష్యముగా, అకరోత్-చేసెను. ఇతరాన్-ఇతరరాక్షసులను, న-కాదు; (తథాహి-ఆదియుక్తమే) మహోరగ విసర్పి విక్రమః-మహాసర్పములపైఁబడు పరాక్రమముగల, గరుడః-గరుత్మంతుఁడు రాజి లేషు-అల్పములగు జలజంతువులపైకి, ప్రవర్తతేకిం?-వెళ్ళునాయేమి? వెళ్ళదు అని అర్థము. శ్రీరాముఁ డారాక్షససైన్యపతులగు సుబాహు మారీచుల పైకి దనబాణము లను వేయఁ బూనెను గాని యల్పులగు నితరరాక్షసుల పైకిఁ గాదు. గరుత్మంతుడు

మహాసర్పముల మీదికి వెళ్ళునుగాని జలజంతువుల పైకి వెళ్ళఁడుగదా! అనితాత్ప ర్యము. అలంకారము: అర్థాంతరన్యాసము. "అలగర్దో జలవ్యాలః సమౌరాజిలదుంతుభో" అనియమరము.

శ్లో. సోఽస్త్ర ముగ్రజవ మస్త్రకోవిదః
సందధే ధనుషి వాయుదైవతమ్
తేన శైలగురు మప్యపాతయత్
పాండు పత్ర మివ తాడకా సుతమ్. 28

వ్యాఖ్య : అస్త్రకోవిదః-బాణవిద్యాపండితుఁడగు, సః-ఆరాముఁడు, ఉగ్ర జవః-మిక్కిలివేగముగల, వాయుదైవతం-వాయువు దేవతఁగాఁగల, అస్త్రం-వాయ వ్యాస్త్రమును, ధనుషి-ధనుస్సునందు, సందధే-ఎక్కుపెట్టెను. తేన-ఆయస్త్రముచేత శైలగురుంఅపి- పర్వతమంతటియెత్తు, బరువునుగలవాఁడైనను, తాడకాసుతం-మారీ చుని, పాండుపత్రం, ఇవ-ఒక పండుటాకునువలె, అపాతయత్-పడవేసెను. మహా వేగముగల వాయవ్యాస్త్రముచేత శ్రీరాముఁడు పర్వతాకారముతో ను మారీచుని పండుటాకునువలె నేలపైఁగూల్చె నని భావము. అస్త్రకోవిద శబ్దము ముఁదెప్పు డెవ్వని మీద నెట్టి బాణమును ప్రయోగింపవలెనో యెఱిగియుండె ని తె లు పు చున్నది.

శ్లో. యః సుబాహు రితి రాక్షసోఽ పరః
తత్ర తత్ర విససర్ప మాయయా
తం క్షురప్ర శకలీకృతం కృతీ
పత్త్రిణాం వ్యభజ దాశ్రమాత్ బహిః 29

వ్యాఖ్య : సుబాహుః, ఇతి-సుబాహువనుపేరుగల, యః-ఏ, అపరః-మరి యొకఁడగు రాక్షసః-రాక్షసుఁడు (గలఁడోవాఁడు) తత్రతత్ర-ఆశ్రమప్రాంతము నందచ్చటచ్చట, మాయయా-మాయచేత, విససర్ప-సంచరించుచుండెను. క్షురప్ర శకలీకృతం-బాణములచే ముక్కముక్కలుగాఁ జేయఁబడిన, తం-ఆసుబాహువును, కృతీ-నేర్పరియగు రాముఁడు, ఆశ్రమాత్-ఆశ్రమమునుండి, బహిః-వెలుపల,పత్త్రి

బాం-పక్షులకు, వ్యభజత్-పంచియిచ్చెను.రాముడు, రెండవరాక్షసుఁడగుసుబాహువు దొంగచాటుగా నాశ్రమమం దచ్చటచ్చట తిరుగుచుండగా వానిశరీరమును బాణములచేత ముక్కలుముక్కలుగాఁజేసి, ఆశ్రమానికి దూరప్రదేశమున బక్షులకు పంచియిచ్చెనని భావము. ఇందలి 'కృతీ' శబ్దము, రాముఁడు సుబాహుని ముక్కలు చేయుటయేకాక ఆమాంసఖండము లాశ్రమమందుపడి కశ్మలముజేయనీయక బహిః ప్రదేశమునఁబడునట్లుచేసె నను అర్థమును జెప్పును. "కృతీచకుశలఃసమౌ" అని యమరము.

శ్లో. ఇ త్యపా స్త మఖ విఘ్న యో స్తయోః
సాంయుగీన మభినంద్య విక్రమమ్
ఋత్విజః కులపతే ర్యథాక్రమం
వాగ్యతస్య నిరవ ర్తయ న్ క్రియాః 30

వ్యాఖ్య : ఇతి-ఈవిధముగా, అపాస్త మఖవిఘ్నయోః-తొలగింపబడినయాగ విఘ్నములుగల, తయోః-ఆరామలక్ష్మణులయొక్క, సాంయుగీనం-యుద్ధమునందు చక్కగా ప్రకటింపఁబడిన, విక్రమం-పరాక్రమమును, అభినంద్య-మెచ్చుకొని,ఋత్విజః-ఋత్విక్కులు, వాగ్యతస్య-మౌనదీక్షనువహించిన, కులపతేః-మునిబృందాధిపుడగు విశ్వామిత్రునియొక్క, క్రియాః-యజ్ఞకార్యములను, యథాక్రమం-వరుసగా నిరవర్తయన్-పూర్తిచేసిరి. అట్లు రామలక్ష్మణులు మారీచసుబాహుప్రభృతి రాక్షసులను దొలగింపగా ఋత్విజులు నిర్భయముగా యజ్ఞకృత్యములను నిర్వర్తించిరి.

శ్లో. తౌ ప్రణామచల కాక పక్షకౌ
భ్రాతరా వవభృథాప్లుతో మునిః
ఆశిషా మనుపదం సమస్పృశత్
దర్భపాటిత తలేన పాణినా. 31

వ్యాఖ్య : అవభృథాప్లుతః-అవభృథ-యజ్ఞదీక్షాంతమునందు, ఆప్లుతః-స్నానముచేసిన, మునిః-విశ్వామిత్రుఁడు, ప్రణామచల కాకపక్షకౌ-వంగి నమస్కరించుటచేత కదలుచున్న చిన్న జుట్లుగల, తౌ, భ్రాతరౌ-ఆయిద్దరన్న దమ్ము

లను, ఆశిషాం, అనుపథం-ఆశీర్వచనముల వెంటనే, దర్భ పాటిత తలీన-దర్భల చేత గ్రుచ్చబడిన అరచేయిగల, (పవిత్రముగల) పాణినా-హస్తముచేత, సమస్పృశత్-తాకెను (నిమిరెను). యజ్ఞదీక్షాంతమున నదీస్నానముచేసిన విశ్వామిత్రుని పాదములనంటి నమస్కరించుచున్న రామలక్ష్మణుల తలలపై పవిత్రసహితమగు హస్తముచేత ప్రేమసంతోషములతో విశ్వామిత్రుడు స్పృశించెననిభావము. రామలక్ష్మణుల పరాక్రమముచేత తన యజ్ఞము పసమాప్తి నొందుట విశ్వామిత్రుని యానందమునకు కారణమని భావము. "చలకాకపక్షకౌ" అనుపదము రామలక్ష్మణుల బాల్యమును దెలుపును

శ్లో. తం న్యమంత్రయత సంభృత క్రతు
మైథిలః స మిథిలాం వ్రజన్ వశీ
రాఘవా వపి నినాయ బిభ్రతౌ
తద్ధనుః శ్రవణజం కుతూహలమ్. 32

వ్యా : సంభృతక్రతుః-కూర్చుకొనబడిన సంభారములతో యజ్ఞమును జేయదలపెన, మైథిలః-మిథిలానాథుడగు జనకుడు, తం-ఆవిశ్వామిత్రుని, న్యమంత్రయ -యజ్ఞమునకాహ్వానించెను. వశీ-ఇంద్రియనిగ్రహముగల, సః-ఆ విశ్వామిత్రుడు, మిథిలాం, వ్రజన్-జనకరాజధానికి వెళ్ళుచు, తద్ధనుః శ్రవణజం-ఆ జనకుని ధనుస్సును గురించి వినుటచేత గలిగిన, కుతూహలం-దానిని చూచుట కుత్సాహమును, బిభ్రతౌ-ధరించుచున్న (వాంఛగల), రాఘవౌ, అపి-రఘువంశ దీపకులగు రామలక్ష్మణులను సైతము, నినాయ-తీసుకవెళ్ళెను. తానుచేయు యజ్ఞము పరిసమాప్తమగుటచేత సంతుష్టుడైయున్న విశ్వామిత్రునికి జనకుడు తలపెట్టిన యజ్ఞమునకు రమ్మని యాహ్వానము వచ్చెను. లోకప్రసిద్ధమై జనకుని వద్దనున్న ధనుస్సును జూడవలెనని కుతూహలపడుచున్న రామలక్ష్మణులను సైతము వెంటబెట్టుకొని విశ్వామిత్రుడు మిథిలకు వెళ్ళెనని భావము.

శ్లో. తైః శివేషు వసతి ర్గతాధ్వభిః
సాయ మాశ్రమతరు ష్వగృహ్యత
యేషు దీర్ఘతపసః పరిగ్రహో
వాసవ క్షణ కలత్రతాం యయౌ. 33

వ్యాఖ్య : గతాధ్వభిః-నడువబడినమార్గముగల (కొంతదూరమునడచిన) తైః-ఆ ము రిచేత (విశ్వామిత్ర రామ లక్ష్మణులచేత), సాయం-సాయంకాలము నందు, శివే -రమ్యములగు, ఆశ్రమతరుమ-ఆ శ్రమవృక్షములక్రింద, వసతిః-నివాసము,అగృహ్యత-స్వీకరింపఁబడెను, యేషు-ఏవృక్షములక్రింద, దీర్ఘ తపసః-సుదీర్ఘముగా తపస్సుచేయుచుండిన గౌతమునియొక్క,పరిగ్రహః-భార్య (అహల్య), వాసవ క్షణ కళత్రతాం-వాసవ-ఇంద్రునికి, క్షణ-స్వల్పకాలము, కళత్రతాం-భార్యగానుండుటను, యయౌ-పొందెనో. మిథిలకు బయలుదేరిన విశ్వామిత్ర రామ లక్ష్మణులు, కొంతమార్గమునుదాటి సాయంకాలమునందు చల్లనినీడను, పరిమళ మును ఇచ్చు గౌతమాశ్రమమునందలి వృక్షములక్రింద బసచేసిరి. అచోటు ఇంద్రుఁడ హల్యాసంభోగమును జేసిన గౌతమాశ్రమప్రదేశము, "దీర్ఘ తపసః" అను గౌతమ విశేషణము, "శివేషు" అ వృక్షవిశేషణమును, ఇంద్రాహల్యల కలయికకు ఈ ప్రదేశము, అనుకూల్యమును గలిగించియుండెనని సూచించుచున్నవి.

శ్లో. ప్రత్యపద్యత చిరాయ యత్పున
శ్చారు గౌతమ వధూః శిలామయీ
స్వం వపుః స కిల కిల్బిషచ్ఛిదాం
రామపాద రజసామను గ్రహః 34

వ్యాఖ్య : శిలామయీ-భర్తశాపమువలన రాయిగా మారిన, గౌతమవధూః-గౌతమునిభార్య (అహల్య), చారు-అందమైన, స్వం-తనదియగు, వపుః-శరీర మును, చిరాయ-బహుకాలమునకు, పునః-మరల, ప్రత్యపద్యత, యత్-పొందెన నుట యేది కలదో, సః-అది, కిల్బిషచ్ఛిదాం-పాపమును హరించునట్టి, రామపాద రజసాం-శ్రీరాముని పాదధూళుల యొక్క, అనుగ్రహః, కిల-ప్రసాదమేకదా! పాషాణమై పడియున్న అహల్య సుందరమగు తనపూర్వరూపమును బహుకాలము తరువాత పొందుట రామపాదరజస్సుయొక్క అనుగ్రహబలమే యని లోకముచెప్పు నని భావము. స్త్రీలింగమగు శిలాశబ్దము అహల్యా ప్రతిరూపముగా చెప్ప బడుట యుక్తముగా నున్నది,

శ్లో. రాఘవాన్విత ముపస్థితం మునిం
తం నిశమ్య జనకో జనేశ్వరః,

అర్థకామసహితం సపర్యయా
దేహబద్ధ మివ ధర్మ మభ్యగాత్. 45

వ్యాఖ్య : రాఘవాన్వితం-రఘువంశమునందుపుట్టిన రామలక్ష్మణులకూతోడి నవాఁడై, ఉపస్థితం-వచ్చిన, తం, మునిం-ఆవిశ్వామిత్రుని (గురించి) జ న కః-జనకుఁడనుపేరుగల, జనేశ్వరః-రాజు, నిశమ్య-విని, అర్థకామసహితం-అర్థ కాము పురుషార్థములతోఁ గూడినదియు, దేహబద్ధం-మూర్తీభవించినదియు నగు, ధర్మం ఇవ.-ధర్మమునువలె, సపర్యయా-పూజావిధానముతో, అభ్యగాత్-ఎదురేగి స్వాగతముచెప్పెను. అర్థ కామసహిత ధర్మ పురుషార్థమువలెవచ్చిన రామలక్ష్మణ సహితుఁడగు విశ్వామిత్రుని జనకుఁడు భక్తి గౌరవ పురస్సర పూజావిధానముతోనెదుర్కొనెనని భావము.

శ్లో. తౌ విదేహనగరీ నివాసినాం
గాం గతా వివ దివః పునర్వసూ,
మన్యతే స్మ పిబతాం విలోచనైః
పక్ష్మపాత మపి వంచనాం మనః. 46

వ్యాఖ్య : దివః-ఆకాశమునుండి, గాం-భూమిని, గతౌ-చేరిన, పునర్వసూ, ఇవ-పునర నక్షత్రాధి దేవతల వలెనుండిన, తౌ-ఆరామలక్ష్మణులను,విలోచనైః-విప్ఫారిన కనులచేత,పిబతాం-త్రాగుచుండిన (రెప్పవాల్చక ఆసక్తితో చూచుచుండిన) వి నగరీ నివాసినాం-మిథిలానగర వాసుల యొక్క, మనః-మనస్సు పక్ష్మపాతం, అపి-రెప్పవాలుటసైతము, వంచనాం-మోసమునుగా మన్యతేస్మ-తలచెను. 'స్మ' అనునది చేరినప్పుడు, భూతకాలిక మగు నర్థముగల ! యకువర్తమాన (లట్) రూపముండును మహామంగళప్రదమగు పునర్వసూనక్ష మునకు అధిదేవత అదితి, ఆమెదేవమాత,అట్టివల్లని నక్షత్రము ఆకాశమునుండి లపైకి వచ్చినట్లు కనఁబడుచున్న రామలక్ష్మణుల సౌందర్యమును జూచుచున్న మిథిలావాసుల మనస్సుకు రెప్పపాటుగూడ విఘ్నముగాఁ దోచెనని భావము. శ్రీరాముఁడు పునర్వసూ నక్షత్రమునందు జన్మించియుండుటయు, ఆనక్షత్రజాతుఁడు సత్యవాది, సుగుణుడు ఉత్సాహి. త్యాగి, విభవసంపన్నుఁడు నగునని జ్యోతిశ్శాస్త్రము చెప్పుటయు, నీయు ప్రేక్షకుఁగా రణములై యుండును.

శ్లో. యూపవ త్యవసితే క్రియావిధౌ
కాలవిత్ కుశికవంశ వర్ధనః,
రామ మిష్వసన దర్శనోత్సుకం
మైథిలాయ కథయాంబభూవ సః. 37

వ్యాఖ్య : యూపవతి-పశుబంధనస్తంభము గలదియగు, క్రియావిధౌ-కర్మానుష్ఠానము, అవసితే (సతి)-ముగిసినదికాగా(యజ్ఞము పరిసమాప్తిని చెందినదికాగా), కాలవిత్-సమయము నెఱిఁగినవాఁడగు, కుశికవంశ వర్ధనః-కుశికవంశము నున్నతస్థితికిఁదెచ్చినవాఁడగు, సః-ఆవిశ్వామిత్రుఁడు, రామం-రాముని, ఇష్వసన దర్శనోత్సుకం-శివధనుస్సును చూచుటయందలి కుతూహలము గలవానినిగా, మైథిలాయ-జనకునికొఱకు, కథయాంబభూవ-చెప్పెను. జనకుఁడు యజ్ఞదీక్షానిరతుఁడై యున్నప్పుడూరకయుండి, యజ్ఞము ముగియగానే విశ్వామిత్రుఁడు జనకునికి రాముని ధనుర్దర్శన కుతూహలమును సమయము చూచుకొని చెప్పెనని భావము. "ఇష్వసనం" అనగా చాపము. అస్యతే అనేన ఇత్యసనం, ఇషూణాం అసనం ఇష్వసనం అని విగ్రహము.

శ్లో. తస్య వీక్ష్య లలితం వపుః శిశోః
పార్థివః ప్రథితవంశ జన్మనః,
స్వం విచింత్య చ ధను ర్దురానమం
పీడితో దుహితృ శుల్క సంస్థయా. 38

వ్యాఖ్య : పార్థివః-జనకుఁడు, ప్రథితవంశ జన్మనః-ప్రథిత-సుప్రసిద్ధమైన, వంశ-రఘువంశమందు, జన్మనః-పుట్టుకగల, శిశోః, తస్య-బాలుఁడైయున్న ఆ శ్రీరామునియొక్క, లలితం, వపుః-సుకుమార సుందరమైన యు శరీరమునున్ను, స్వం-తనదియు, దురానమం-వంచుట కశక్యమైనదియునగు, ధనుః చ-ధనుస్సునున్ను, విచింత్య-ఆలోచించి, దుహితృ శుల్క సంస్థయా-తన కూతురగు సీతకు అల్లుఁడీయవలసిన శుల్కము (ఓలి) ఆధనుర్భంగ రూపమై

యుండుటచేత, పీడితః-బాధింపఁబడెను. ఉత్తమవంశజుఁడు, సుకుమార సుందర శరీరుఁడగు రాముఁడు తన కల్లుఁడైనచో బాగుండు నను వాంఛగలిగిన జనక చక్రవర్తి రాముని శిశుత్వమును, శుల్కరూపమై వంచుటకు శక్యముగాని శివధనుస్సును చూచి, బాలుఁడగు రాముఁ డీధనుస్సును వంచజాలఁడే! యని మనస్సునందు బాధ పడె నని భావము. "శుల్క" మనగా జామాత కన్యకై యీయవలసిన ఓలి. "సంస్థా" అనగా స్థితి యని నైఘంటికార్థములు.

శ్లో. అబ్రవీ చ్చ భగవ& మతంగజై
ర్య ద్బృహద్భి రపి కర్మ దుష్కరమ్,
తత్ర నాహ మనుమంతు ముత్సహే
మోఘవృత్తి కలభస్య చేష్టితమ్. 39

వ్యాఖ్య : హే భగవన్-షడ్గుణైశ్వర్య సంపన్నుఁడవగు మునీంద్రా! బృహద్భిః-గొప్పవియగు, మతంగజైరపి-ఏనుగులచేతనైనను, దుష్కరం-చేయుటకు సాధ్యపడని, యత్, కర్మ-ఏపనికలదో, తత్ర-ఆపనియందు, కలభస్య-ఏనుఁగుపిల్లయొక్క, మోఘవృత్తి-వ్యర్థవ్యాపారముగల, చేష్టితం-ప్రయత్నమును, అనుమంతుం-అంగీకరించుటకు, అహం-నేను, నోత్సహే (న+ఉత్సహే)-ఇష్ట పడను. అని, అబ్రవీత్, చ-అనెను కూడ. పూజ్య విశ్వామిత్రమునీ! మహాగజముల చేతనే కాని పనికి ఒక బాలగజము పూను[illegible]జాల నని జనకుఁ డనెను. అనగా మహావీరులగు భూమర్తలెందరో [illegible]స్సును గదిలింప లేకపోయిరి. బాలుఁడగు ఈరాముఁ డెట్లు దీనిని [illegible] అని జనకుని భావము. "ఉత్పత్తిం చ, వినాశం చ, భూతానా మాగతిం,గతిమ్, వేత్తి విదా మవిద్యాం చస వాచో భగవాన్ ఇతి" జగత్తులోని ప్రాణులన్నియు నెట్లు పుట్టుచు[illegible]వి? [illegible] నశించుచు వి? ఎక్కడినుండి వచ్చుచున్న వి? ఎక్కడికి వెళ్ళుచు[illegible]వి? యనగ నేది అవిద్య అనగా నేది? అను విషయములు తెలిసిన మహాపురుషుని [illegible]న్!" అని పిలువవలెను. జనకుఁడు విశ్వామిత్రుని నట్లు సంబోధించుటచే డట్టివాడని తెలియవలయును.

ప్రేషితా హి బహవో నరేశ్వరాః
తేన తాత! ధనుషా ధనుర్భృతః,

జ్యా నిఘాత కఠిన త్వచో భుజా
స్వా విధూయ ధిగితి ప్రతస్థిరే. 40

వ్యాఖ్య: హే తాత-ఓతండ్రీ! తేన,ధనుషా-ఆ చాపముచేత, బహవః-అనేకు లగు, ధనుర్భృతః-ధనుర్ధరులైన, నరేశ్వరాః-రాజులు, హ్రేపితా హ-సిగ్గు పరుపబడిరి సుమా, (వారు జ్యా నిఘాత కఠిన త్వచః-అల్లెత్రాటి దెబ్బలచేత గట్టిపడిన చర్మములుగల, స్వాన్, భుజాన్-తమభుజములను, ధిగితి(ధిక్ + ఇతి)- "ఛీ" యని, విధూయ-అవమానించుకొని, ప్రతస్థిరే-బయలుదేరి వెళ్ళిపోయిరి. ఓతండ్రీ! ఆశివధనుస్సుచేత సిగ్గుపరుపబడిన అనేకరాజులు, అంతకు పూర్వము వివిధ సందర్భములయందు తాము చేసిన ధనుష్టంకారములచేత అల్లెత్రాడు తాకి గరుసువారిన తమ భుజములను, శివధనుస్సును గదిలింపజాలనందున "ఛీ" యని తిట్టుకొని తమదారిన తాము నిరాశతోఁ దిరిగి వెళ్ళిరని జనకుఁడు విశ్వామిత్రునికిఁ జెప్పెను. కాగా ఈ బాలుఁడైన రాముఁ డెట్లు దాని నెత్తఁగలఁ డని భావము.

శ్లో. ప్రత్యువాచ త మృషి ర్నిశమ్యతాం
సారతో௨యమథవా గిరా కృతమ్,
చాప ఏవ భవతో భవిష్యతి
వ్యక్తశక్తి రశని ర్గిరా వివ. 41

వ్యాఖ్య : అయం-ఇతఁడు (రాముఁడు), సారతః-బలముచేత, నిశమ్యతాం-వినఁబడుచుగాక; అథవా-అట్లుకాక, గిరా, కృతం-ధనుస్సార వర్ణనముచు చాలించుము. అశనిః-వజ్రాయుధము, గిరౌ, ఇవ-పర్వతమునందువలె, చాపే, ఏవ-ధనుస్సునందే, భవతః-నీకు, వ్యక్తశక్తిః-స్పష్టముగాఁ దెలిసిన బలముగలవాఁడు, భవిష్యతి-కాఁగలఁడు, ఇతి-ఇట్లని, ఋషిః-విశ్వామిత్రముని, తం-ఆజనకుని గురించి, ప్రత్యువాచ-బదులు పలికెను. ఈరాముని బలసారముతో నితనిని గుర్తింపుము, అంతేకాని యీధనుర్గుణ వర్ణనమువలన నేమి లాభము? వజ్రాయుధ బలము పర్వతముపైవలె నతనిబలము నీధనుస్సునందే కనఁబడును. అని విశ్వామిత్రుఁడు జనకునికి బదులు చెప్పెను. 'కృతం" అనునది చాలును అను అర్థము గల అవ్యయము.

శ్లో. ఏవ మాప్తవచనాత్స పౌరుషం
కాకపక్షకధరే ఽపి రాఘవే,
శ్రద్దధే త్రిదశగోప మాత్రకే
దాహశక్తి మివ కృష్ణవర్త్మని. 42

వ్యాఖ్య : ఆప్తవచనాత్-ఆప్తుఁడగు విశ్వామిత్రునియొక్క మాటవలన, సః-ఆజనకుఁడు, కాకపక్షకధరే, అపి-బాలుఁడైనప్పటికిని, రాఘవే-రాముని యందు, పౌరుషం-పరాక్రమమును, త్రిదశగోప మాత్రకే-ఆరుద్ర పురుగంతగా నుండిన, కృష్ణవర్త్మని-అగ్నియందు,దాహశక్తిం,ఇవ-దహించు శక్తినివలె,శ్రద్దధే-నమ్మెను, చెప్పినమాట ఆప్తుఁడగు విశ్వామిత్రుని దగుటవలన జనకుఁడు బాలుఁడై యున్నను రామునియందలి పరాక్రమమును, చిన్న ఆరుద్రపురుగు ప్రమాణము నందున్న అగ్ని యందు దహింపఁగలశక్తిని వలె విశ్వసించె నని భావము. ఆప్తుఁడనగా యథా వక్తయగు ఇష్టజనుఁడు. 'కాకపక్షక, త్రిదశగోపమాత్రక' శబ్దముల యందలి 'క' ప్రత్యయములు స్వార్థమునం దుపయోగింపఁబడినవి. సామాన్యవాచక మగు "త్రిదశ" శబ్దము, ఇంద్ర అను విశేషార్థమునం దుపయుక్తము. ఇంద్రుడు కూడ దేవతయే కదా! అలంకారము : ఉపమ.

శ్లో. వ్యాదిదేశ గణశో ఽథ పార్శ్వగాన్
కార్ముకాభిహరణాయ మైథిలః,
తైజసస్య ధనుషః ప్రవృత్తయే
తోయదా నివ సహస్రలోచనః. 43

వ్యాఖ్య : అథ-పిమ్మట, మైథిలః-జనకుఁడు, పార్శ్వగాన్-ప్రక్కలనున్న పురుషులను, కార్ముకాభిహరణాయ-కార్ముక-ధనుస్సును, అభిహరణాయ-ఎదురుగా తెచ్చుటకు, సహస్రలోచనః-ఇంద్రుఁడు, తైజసస్య-తేజోమయమగు, ధనుషః-ఇంద్రధనుస్సుయొక్క, ప్రవృత్తయే-ఆవిర్భావముకొఱకు, తోయదాన్, ఇవ-మేఘములనువలె, గణశః-జట్టు జట్టుగా, వ్యాదిదేశ-ఆజ్ఞాపించెను. విశ్వామిత్రుని మాట విన్న పిమ్మట జనకుఁడు తన ప్రక్కలయందున్న సేవకులను జట్టు జట్టుగా పిలిచి, ఇంద్రుఁడు తేజోమయమగు నింద్ర ధనుస్సు నావిర్భవింపజేయుటకు మేఘ

ములనాదేశించినట్లు శివధనుస్సును బయటికి తెండు అని యాజ్ఞాపించెను. ఒక
రి చేత తెచ్చుటకు సాధ్యపడునది కాదు కనుక, జనకుఁడు తన సేవకులను జ
జ గా నొక్కొక్క పార్శ్వమునఁ బట్టుకొని శివధనుస్సును వెలుపలికిఁ దెచ్చి పె
యాజ్ఞ యిచ్చెను. ఇంద్రధనుస్సువంటి సౌందర్య దార్ఢ్యములు గలది
ధనుస్సు అనియు, దానిదర్శన మానందహేతు వనియు భావము.

శ్లో. తత్ ప్రసుప్త భుజగేంద్ర భీషణం
వీక్ష్య దాశరథి రాదదే ధనుః,
విద్రుత క్రతుమృగా నుసారిణం
యేన బాణ మసృజత్ వృషధ్వజః. 44

వ్యాఖ్య : దాశరథిః-రాముఁడు, ప్రసుప్త భుజగేంద్ర భీషణం-నిద్రించిన సర్పరాజువలె భయంకరమైయున్న, తత్, ధనుః-ఆచాపమును, వీక్ష్య-బాగుగాఁ జూచి, ఆదదే-పట్టుకొనెను. వృషధ్వజః-శివుఁడు, యేన-ఏధనుస్సు చేతనైతే, విద్రుత క్రతుమృగా నుసారిణం-విద్రుత-పారిపోవుచున్న, క్రతుమృగ-యజ్ఞమనెడు లేడిని, అనుసారిణం-అనుసరించి వెళ్ళునట్టి, బాణం—బాణమును, అసృజత్-విడిచెనో; ఏధనుస్సు చేతనైతే శివుఁడు మృగరూపమునఁ బరుగెత్తి పోవుచున్న యజ్ఞమును గొట్టుటకు బాణమును విడిచెనో అట్టి యా ధనుస్సును శ్రీరాముఁడు బాగా పరికించి చూచి చేతఁబట్టుకొనె నని భావము. ఒకప్పుడు ఇంద్రాది దేవత లొక మహాయజ్ఞమును జేయుచు, తపోనిష్ఠుఁడై యున్న పరమశివునికి యజ్ఞహవిర్భాగమును కల్పింపక పోయిరి. అప్పుడు శివుఁడు తపోమయమై, సుదీర్ఘమై సూర్యునివలె ప్రకాశించునట్టి యొకధనుస్సును సజించి, దానికి శింజినీ ప్రముఖము లైన యంగములు కల్పించి, కోపానల జ్వాలలు క్రక్కుచు నచ్చటికి వచ్చి యాయజ్ఞమును ధ్వంసము చేయుటకు సిద్ధపడెను. అట్టి వుని జూచి దేవతలు భయాక్రాంతులైరి. శివుఁడు కోపోద్దీపితుఁడై యజ్ఞముపై బాణమును వేయగా నాబాణము దెబ్బకు హృదయము చీలిన యజ్ఞము మృగరూపమును ధరించి అగ్నిహోత్రుని సహితముగాఁ బారిపోయెను. ఆ ధనువే యిది యని "క్రతుమృగానుసారిణం" అను పదము తెలుపుచున్నది. ఆ కథను ఇచ్చట ననుసంధించుకొనవలెను.

శ్లో. ఆతతజ్య మకరోత్స సంసదా
విస్మయ స్తిమిత నేత్ర మీక్షితః

శైలసార మపి నాతియత్నతః
పుష్పచాప మివ పేశలం స్మరః.

వ్యాఖ్య : సః- ఆరాముఁడు, సంసదా-సభచేత (సభాస్థజనులచేత),విస్మయస్తిమితనేత్రం-ఆశ్చర్యముచేత కదలికలేని కన్నులు గలుగునట్లుగా, ఈక్షితః- చూపబడుచున్నవాఁడగుచు, శైలసారం అపి-పర్వతముయొక్క గట్టిదనము, బరువు గలదియై యున్నను, ధనుః- ఆ శివధనుస్సును, స్మరః-మన్మథుఁడు, పేశలం-కోమలమైన, పుష్పచాపం, ఇవ-పూవిల్లునువలె, నాతియత్నతః-ఎక్కువ ప్రయత్నము లేకయే, ఆతతజ్యం-ఎక్కించబడిన మౌర్వి కలదానినిగా, అకరోత్-చేసెను. సభలో నున్న వారందఱును ఆశ్చర్యముచేత తెప్పలు వాల్పక చూచుచుండగా రాముఁడు శైలసారమగు శివధనుస్సును, మన్మథుఁడు పుష్పచాపమును వలె నతి సులభముగా నెత్తి నారిని బిగించె నని భావము.

శ్లో. భజ్యమాన మతిమాత్ర కర్షణాత్
తేన వజ్రపరుషస్వనం ధనుః,
భార్గవాయ దృఢమన్యవే పునః
క్షత్ర ముద్యత మివ న్యవేదయత్. 46

వ్యాఖ్య : తేన-ఆ రామునిచేత, అతిమాత్ర కర్షణాత్-ఎక్కువగా లాగుట వలన, భజ్యమానం-విరుగబడుచున్న దగుటచేత, వజ్రపరుషస్వనం-పిడుగుయొక్క వలె కఠినమైన ధ్వనిగల, ధనుః-ఆ ధనుస్సు, దృఢమన్యవే-చెఱగని కోపముగల, భార్గవాయ-పరశురామునికొఱకు, క్షత్రం-క్షత్రియవంశమును, పునః-మరల, ఉద్యతం-యుద్ధసన్నద్ధమై యున్నదానిని, న్యవేదయత్, ఇవ-విజ్ఞాపన జేసెనా యను నట్లుండెను. రాముఁడు నారిని గట్టి యెక్కువెట్టి శింజినిని బాగా లాగుటచేత విరిగి పోవుచున్న యా ధనుస్సుయొక్క పిడుగువంటి ధ్వని, దృఢకోపుఁడైన పరశురామునికి క్షత్రియకులము మళ్ళీ లేచినది సుమా యని తెలిపినట్లుండె నని భావము అలంకారము : ఉత్ప్రేక్ష.

శ్లో. దృష్టసార మథ రుద్రకార్ముకే
వీర్యశుల్క మభినంద్య మైథిలః,

రాఘవాయ తనయా మయోనిజాం

రూపిణీం శ్రియ మివ న్యవేదయత్. 47

వ్యాఖ్య : అథ-అట్లు ధనుస్సు విరిగిన పిమ్మట, మైథిలః-జనకుఁడు, రుద్రకార్ముకే-శివధనుస్సు విషయమున, దృష్టసారం-చూడబడిన స్థిరాంశముగల, వీర్యశుల్కం-ధనుర్భంగ రూపమగు శౌర్యశుల్కమును, అభినంద్య-మెచ్చుకొని, రాఘవాయ-రామునికొఱకు (రామునికి), అయోనిజాం-అందఱివలెగాక దేవయజ్ఞము నందు పుట్టిన, తనయాం-కూతురగు సీతను, రూపిణీం-రూపమును ధరించిన, శ్రియం, ఇవ-లక్ష్మినివలె (సాక్షాల్లక్ష్మినివలె) న్యవేదయత్-అర్పించెను. శివధనుర్విషయమున స్థిరపడిన శక్తిగల రాముని శౌర్యశుల్కమును మెచ్చుకొని, అయోనిజయైన తన కూతురు సీతను రాఘవునికి భార్యనుగా నిచ్చెదనని మాటచెప్పె నని భావము.

శ్లో. మైథిలః సపది సత్యసంగరో

రాఘవాయ తనయా మయోనిజామ్,

సన్నిధౌ ద్యుతిమత స్తపోనిధే

రగ్నిసాక్షిక ఇవా తిసృష్టవాన్. 48

వ్యాఖ్య : సత్యసంగరః-సత్యప్రతిజ్ఞుఁడగు, మైథిలః-జనకుఁడు, రాఘవాయ-రామునికొఱకు, అయోనిజాం-స్త్రీ గర్భజనిత కానట్టి, తనయాం-కూతురిని, ద్యుతిమతః-తేజస్వియగు, తపోనిధేః-విశ్వామిత్రునియొక్క, సన్నిధౌ-సన్నిధియందు, అగ్నిసాక్షికః, ఇవ-అగ్ని సాక్షిగాఁ గలవాఁడువలె, సపది-అప్పుడే, అతిసృష్టవాన్-ఇచ్చివేసినవాఁ డయ్యెను. సత్యమైన ప్రతిజ్ఞగల జనకుఁడు అయోనిజయై తనకూతురుగా భావింపఁబడిన సీతను రామునికి మహాతేజస్వియగు విశ్వామిత్రుని సన్నిధిలో (విశ్వామిత్రుఁడే అగ్నియై సాక్షిగా నున్న వానివలె) అప్పుడే యిచ్చి వివాహము చేసెను. "సంగర" శబ్దమునకు ప్రతిజ్ఞ, యుద్ధము, జ్ఞానము, ఆపద అర్థములు. "అథ ప్రతిజ్ఞాజి సంవిదాపత్సు సంగరః" అని యమరము, ఇచ్చట తాత్కాలికముగా జనకుఁడు, సీతచేత రాముని కంఠమునందు విజయమాలను విశ్వామిత్రాగ్నిసాక్షికముగా వేయించెనని తలఁపవలయును.

శ్లో. ప్రాహిణోచ్చ మహితం మహాద్యుతిః
కోసలాధిపతయే పురోధసమ్,
భృత్యభావి దుహితుః పరిగ్రహాత్
దిశ్యతాం కుల మిదం నిమే రితి. 49

వ్యాఖ్య : మహాద్యుతిః-గొప్ప కాంతిగల జనకుఁడు, మహితం-పూజితుఁడగు, పురోధసం-పురోహితుని, కోసలాధిపతయే-కోసలదేశ పాలకుఁడగు దశరథుని కొఱకు (వద్దికి), ఇదం-ఈ, నిమేః కులం-నిమియొక్క వంశము, దుహితుః-కూతురగు సీతయొక్క, పరిగ్రహాత్-కోడలుగా స్వీకరించుటవలన, భృత్యభావి-భృత్యత్వము కలదిగా, దిశ్యతాం-అనుమతింపఁబడుఁగాక, ఇతి-ఇట్లు చెప్పుమని, ప్రాహిణోత్, చ-పంపెనుగూడ. జనకుఁడొక పురోహితుని సత్కరించి, నీవు వెళ్ళి దశరథునితో నా కుమార్తెను కోడలుగా స్వీకరించి నిమివంశమును నీ సేవలోనికి దీసికొనుట కంగీకరింపు మని చెప్పుటకై పంపెను. ఇచ్చట "మహాద్యుతిః" అను పదము, శివధనుర్భంగమును జేసిన యల్లుఁడు దొరకుటచేత జనకునికి గలిగిన సంతోషమును, ముఖకాంతిని వెల్లడించుచున్నది.

శ్లో. అన్వియేష సదృశీం స చ స్నుషాం
ప్రాప చైన మనుకూలవా గ్ద్విజః,
సద్య ఏవ సుకృతాం హి పచ్యతే
కల్పవృక్షఫల ధర్మి కాంక్షితమ్. 50

వ్యాఖ్య : సః, చ-ఆదశరథుఁడుకూడ, సదృశీం-రామునికిఁదగిన, స్నుషాం-కోడలిని, అన్వియేష-వెదకెను,అనుకూలవాక్-కోడలు లభించినదని చెప్పు వాక్కుగల, ద్విజః-బ్రాహ్మణుఁడు (జనకపురోహితుఁడు), చ-కూడ, ఏనం-ఈ దశరథుని, ప్రాప-చేరెను. హి-అది యంతే, కల్పవృక్షఫలధర్మి-కల్పవృక్ష ఫలము వలె వెంటనే పండు స్వభావముగల, సుకృతాం-పుణ్యముచేసిన వారియొక్క, కాంక్షితం-మనోరథము, సద్యః, ఏవ-వెంటనే, పచ్యతే-ఫలించునుగదా! యుక్త వయస్సు వచ్చిన రామునికిఁ దగినభార్య యెచ్చట లభించునా యని దశరథుఁడు వెదకుట కారంభించిన వెంటనే జనకుని పురోహితుఁడు సీతను పి

కోడలినిగా స్వీకరింపు దనిచెప్పుట కతనివద్దికి వెళ్ళెను. పుణ్యవంతులకోరిక కల్ప వృక్షము ఫలమువలె పుట్టుటయు ఫలింపుటయు వెంటనే జరుగునుగదా! దశరథునికి రామవివాహకాంక్ష కలుగుటకును, జనకుఁడు పంపిన వార్తకును వ్యవధానమే లేకుండె నని భావము. అలంకారము : అర్థాంతరన్యాసము.

శ్లో. తస్య కల్పిత పురస్క్రియావిధేః
శుశ్రువాన్ వచన మగ్రజన్మనః,
ఉచ్చచాల బలభిత్సఖో వశీ
సైన్యరేణు ముషితార్క దీధితిః. 51

వ్యాఖ్య : బలభిత్సఖః-ఇంద్రస్నేహితుఁడును, వశీ-స్వాయత్తుఁడు నగు దశరథుఁడు, కల్పితపురస్క్రియావిధేః-చేయఁబడిన పూజావిధానము గల, తస్య, అగ్రజన్మనః-అబ్రాహ్మణునియొక్క, వచనం-జనకుఁడు పంపిన సందేశవచనమును, శుశ్రువాన్-విన్నవాఁడై, సైన్యరేణు ముషితార్క దీధితిః-సైన్యరేణు-సైన్యముయొక్క నడకచేత రేగినదుమ్ము చేత, ముషిత-దొంగిలింపఁబడిన (కప్పి వేయఁబడిన), అర్క దీధితిః-సూర్యకాంతిగలవాఁ డగుచు,ఉచ్చచాల-లేచెను(ప్రయాణించెను). ఇంద్రసఖుఁడై స్వతంత్రుఁడై యున్నదశరథుఁడు కృతాతిథిసత్కారుఁ డగు జనకపురోహితుఁడు చెప్పిన శుభసందేశమును విన్నవెంటనే సర్వసన్న మగు సైన్యముతో మిథిలకు బయలుదేరె నని భావము. బలభిత్సఖుఁడగుటచేత వాహ సంభారములు క్షణములో సిద్ధమయ్యె ననియు, వశీ యనుటచేత ఇతరుల ఆలోచనలు సంప్రదింపులు అక్కరలేకపోయెననియు, "సైన్యరేణు ముషితార్క దీధితిః" అనుటచేత మహావైభవసమేతుఁడై పయనించెననియు తాత్పర్యము. "ఉచ్చచాల" అన్నక్రియ "శుభస్య శీఘ్రం" అన్నట్లు కార్యత్వరను దెలుపుచున్నది.

శ్లో. ఆససాద మిథిలాం స వేష్టయన్
పీడితోపవనపాదపాం బలైః
ప్రీతిరోధ మసహిష్ట సా పురీ
స్త్రీవ కాంతపరిభోగ మాయతమ్. 52

వ్యాఖ్య : సః-ఆవిధముగా బయలుదేరిన దశరథుఁడు, బలైః-సైన్యముల చేత, పీడితోపవనపాదపాం——పీడిత-బాధింపఁబడిన, ఉపవన-ఉపవనమునందలి, పాదపాం-వృక్షములుగల, మిథిలాం-మిథిలానగరమును, వేష్టయన్-చుట్టును ఆక్రమించుచు, ఆససాద-చేరెను. సా, పురీ-ఆనగరముకూడ, స్త్రీ-యువతి, ఆయతం-విస్తృతమైన, కాంతపరిభోగం, ఇవ-ప్రియసంభోగమునువలె, ప్రీతిరోధం-ప్రేమ చేత జరిగిన అడ్డగింపును, అసహిష్ట-సహించెను. అట్లు బయలుదేరిన దశరథుఁడు తనసైన్యములచేత అనగా ఏనుగులు, గుఱ్ఱములు, రథములు, కాలిబంట్లచేత పీడింపబడిన ఉపవనవృక్షలతాదులుగల మిథిలను చుట్టును ఆవరించుచుఁ జేరెను. ఆమిథిల, ఆయుపరోధమును,ఒక యువతి తన ప్రియుఁడు చేయు కచ కుచాకర్షణ దంతక్షత నఖక్షతాది సహిత సంభోగాతిశయమును వలె, ఆప్రీతిరోధమును, అనగా ప్రేమచేత జరిగిన అవరోధమును సహించెను. అదియే ద్వేషరోధమైనచో సహించెడిదికాదు. యువతియు ప్రియుఁడు చూపుధార్ష్ట్యమును ప్రేమాధీనయై సహించునుగదా! అలంకారము : ఉపమ.

శ్లో. తౌ సమేత్య సమయే స్థితా వుభౌ
భూపతీ వరుణవాసవోపమౌ,
కన్యకా తనయ కౌతుకక్రియాం
స్వప్రభావసదృశీం వితేనతుః. ౬౮

వ్యాఖ్య : సమయే-ఆచారమునందు, స్థితౌ-ఉన్నట్టివారును, వరుణవాసవోపమౌ-వరుణునితోను ఇంద్రునితోను సమానులగు, తౌ ఉభౌ, భూపతీ-ఆయిద్దఱురాజులగు జనకదశరథులు, సమేత్య-కలిసి, స్వప్రభావసదృశీం-తమ గొప్పతనమునకు తగినట్టి, కన్యకా తనయ కౌతుకక్రియాం-సీతాదికన్యకల యొక్కయు, రామాది తనయులయొక్కయు, వివాహోత్సవమును, వితేనతుః-విస్తారముగాఁ జేసిరి. దేవతలలో వరుణుఁడు, ఇంద్రుఁడును అత్యధికులు, వైదికకర్మనిష్ఠాపరులు; కనుక అట్టివారితోఁ బోల్పఁబడిన జనక దశరథులు సయితము సమయము అనగా ఆచారమునందు నిష్ఠులైయుంటుటచేత, తమ సంతానము యొక్క వివాహమంగళములను తమయైశ్వర్యమునకును, శాస్త్రవిధానమునకును దగినట్లు పెంచి నిర్వర్తించి రని భావము. "సమయ" శబ్దమునకు శపథము, ఆచారము, కాలము, సిద్ధాంతము, జ్ఞానము; అర్థములని యమరము.

శ్లో. పార్థివీ ముదవహ ద్రఘూద్వహో
లక్ష్మణ స్తదనుజా మథోర్మిలామ్,
యౌ తయో రవరజౌ వరౌజసౌ
తౌ కుశధ్వజసుతే సుమధ్యమే. 54

వ్యాఖ్య : రఘూద్వహః-శ్రీరాముఁడు, పార్థివీం-పృథివీపుత్రికయగుసీతను, ఉదవహత్-వివాహమాడెను; అథ-తరువాత, లక్ష్మణః-లక్ష్మణుఁడు, తదనుజాం-ఆమెకు చెల్లెలగు జనకుని యౌరసపుత్రి యూర్మిళను, ఉదవహత్-పెండ్లియాడెను. యౌ-ఏ, వరౌజసౌ-మంచి పరాక్రమవంతులును, తయోః-ఆరామలక్ష్మణులకు, అవరజౌ-తరువాతపుట్టినవారునై యున్నారో, తౌ-ఆభరత శత్రుఘ్నులు, సుమధ్యమౌ-చక్కని నడుములుగల, అందగత్తెలగు, కుశధ్వజసుతే-జనకుని తమ్ముఁడు కుశధ్వజుని కూతురులగు మాండవీ శ్రుతకీర్తులను, ఉదవహతాం-వివాహమాడిరి. రాముఁడు సీతను, లక్ష్మణుఁడు ఊర్మిళను, భరతుఁడు మాండవిని, శత్రుఘ్నుఁడు శ్రుతకీర్తిని వివాహమాడిరని భావము. "అవరజౌ" అనుచోట రామస్య అవరజో భరతః, లక్ష్మణస్య అవరజః శత్రుఘ్నః అని యర్థము చేసికొనవలెను.

శ్లో. తే చతుర్థసహితా స్త్రయో బభుః
సూనవో నవవధూపరిగ్రహాః,
సామ దానవిధి భేద విగ్రహాః
సిద్ధిమంత ఇవ తస్య భూపతేః. 55

వ్యాఖ్య: తే-ఆ, చతుర్థసహితాః-నాలుగవవాఁడగు శత్రుఘ్నునితోఁగూడిన, త్రయః-ముగ్గురగు రామ భరత లక్ష్మణు లనబడు, సూనవః-కుమారులు (అనలుగురు కుమారులనని యర్థము), నవవధూ పరిగ్రహాః-నూతనకన్యలు భార్యలుగాఁ గలవారగుచు, సిద్ధిమంతః-ఫలసిద్ధితోఁగూడిన,తస్య భూపతేః-ఆదశరథునియొక్క, సామ దానవిధి భేద విగ్రహాః ఇవ-సామము, దానము, భేదము, దండమననెడి చతురుపాయములవలె, బభుః-ప్రకాశించిరి. కుమారులు ఉపాయములతోను, వారి భార్యలు ఫలసిద్ధులతోను పోల్చబడుటచేత ఇది ఉపమాలంకారము. "చత్వారః" అనక చతుర్థసహితాః త్రయః" అనుట కేవలము వృత్తానుసారియగు ఛందోవిషయ

మని మల్లినాథసూరి వ్యాఖ్యానించెను. అయినప్పటికిని, అందురో చతుర్థమగు దండోపాయమును అవసరమగుచో నుపయోగింప గలవానికే సామాద్యుపాయత్రయము ఫలించుననియు, దండసహాయము లేనివానికవి సిద్ధించుట దుర్లభమనియు మొదలగు భావములు స్ఫురించుటకే కాళిదాసట్లు రచించె నని భావించుట తప్పుగాదు. సిద్ధిమంతములగు చతురుపాయములవలె వివాహితులగు నలుగురు కుమారులను జూచి దశరథుఁ డానందమును బొందె నని తాత్పర్యము.

శ్లో. తా నరాధిపసుతా నృపాత్మజైః
తే చ తాభి రగమన్ కృతార్థతామ్
సోఽభవ ద్వర వధూ సమాగమః
ప్రత్యయ ప్రకృతి యోగ సన్నిభః. 56

వ్యాఖ్య: తాః, నరాధిపసుతాః-ఆ జనకకన్యలగు సీతాప్రభృతులు, నృపాత్మజైః-దశరథ పుత్రులగు రామాదులచేతను, తే-ఆ రామాదులును, తాభిః, చ-ఆ సీతా ప్రభృతులచేతను, కృతార్థతాం-కుల శీల వయో రూపాది సాఫల్యమును, అగమన్-పొందిరి. సః వర వధూ సమాగమః-ఆ వరులయొక్కయు, వధువుల యొక్కయు చేరిక, ప్రత్యయ ప్రకృతి యోగసన్నిభః-ప్రత్యయములయొక్కయు, ప్రకృతులయొక్కయు చేరికవలె ప్రకాశించునది, అభవత్-అయ్యెను. శబ్దము లన్నియు ప్రకృతి ప్రత్యయ సంయోగము వలననే ఉద్దిష్టార్థముల నిచ్చును. ఉదాహరణమునకు:-భూ, కృఞ్, మొదలగునవి ప్రకృతులు. వాటికి తిఙ్ ప్రత్యయములు చేర్చుట వలన "భవతి, కరోతి" అను రూపములు సిద్ధించి, ఉన్నది, ఉన్నాడు, చేయుచున్నది మొ. అర్థములు వచ్చును. అట్లే సనాది ప్రత్యయములు చేర్చినప్పుడు "బుభూషతి, చికీర్షతి" అను రూపము లేర్పడి ఉండదలచుకొన్నాడు, చేయఁదలచుకొన్నాడు అనునర్థములు సిద్ధించును. అట్లే ఆ వధూవరులు కృతార్థులై పరస్పర సహకారమును పొంది జీవిత లక్ష్యములగు పురుషార్థములను సాధింప గలవారైరి అని భావము. ఇది కాళిదాసునకుగల వ్యాకరణ శాస్త్ర రహస్యజ్ఞానమును, ఆ శాస్త్రముపైఁగల యభిమానమును వెల్లడించుచున్నది.

శ్లో. ఏవ మాత్తరతి రాత్మసంభవాన్
తాన్ నివేశ్య చతురోఽపి తత్ర సః

అధ్వసు త్రిషు విసృష్టమైథిలః
స్వాం పురీం దశరథో న్యవర్తత. 57

వ్యాఖ్య: ఏవం-ఈపైని చెప్పిన రీతిగా, ఆత్తరతిః-పొందిన యానందము గల, సః, దశరథః-ఆ దశరథుఁడు, చతురః, అపి-నలుగురునగు, ఆత్మసంభవాన్-కుమారులను, తత్ర-ఆ మిథిలానగరమునందు, నివేశ్య-వివాహితులనుఁజేసి, త్రిషు, అధ్వసు-మూఁడు విడుదల ప్రయాణములందు, విసృష్టమైథిలః (సన్)-వెనుకకు పంపిన జనక చక్రవర్తి గల వాఁడగుచు, స్వాం, పురీం-తన నగరమగు అయోధ్యను, న్యవర్తత-తిరిగి చేరుటకుఁ బూనెను.'నివేశ్య' అనుపదమునకు వివాహితులను జేసి యను అర్థము ప్రకరణానుసారముగాఁ జెప్పఁబడినది. దానికి, "నివేశః శిబి రోద్వాహ విన్యాసేషు ప్రకీర్తితః" అను విశ్వనిఘంటువు శ్లోకము ప్రమాణము. పూర్వకాలమున ఆప్తబంధువులు సుదూర ప్రయాణమును జేయునప్పుడు సాగనంపువారు, మూడు మజిలీల వరకు వెళ్ళుట యాచారము. అట్లు వచ్చిన జనకుని మర్యాదతో వెనుకకుండునట్లుచేసి, తన ప్రయాణమును ముందునకు సాగించె నని తెల్పుటకే కవి "త్రిషు అధ్వసు" అని ప్రయోగించెను. కాగా సాగనంపవచ్చిన జనకుని అపి, దశరథుఁడు సపుత్ర స్నుషముగా ముందుకు వెళ్లె నని భావము.

శ్లో. తస్య జాతు మరుతః ప్రతీపగా
వర్త్మసు ధ్వజతరు ప్రమాథినః
చిక్లిశు ర్భృశతయా వరూథినీం
ఉత్తటా ఇవ నదీరయాః స్థలీమ్. 58

వ్యాఖ్య: జాతు—ఒకప్పుడు, వర్త్మసు-మార్గములయందు, ధ్వజతరు ప్రమాథినః—ధ్వజములవలె యెత్తుగా నున్న చెట్లను ఊపివేయునవియు, ప్రతీపగాః-ఎదురుగా వీచునవియు నగు, మరుతః-వాయువులు, ఉత్తటాః-తీరములనెక్కి ప్రవహించునట్టి, నదీరయాః-నదులవేగములు, స్థలీం, ఇవ-నేలనువలె, తస, వరూథినీం-ఆ దశరథునియొక్క సేనను, భృశతయా-ఎక్కువగా, చిక్లిశుః- శ పరచినవి. దశరథుని తిరుగు ప్రయాణమునం దొక్కొక్కసారి మిక్కుట న యెదురు గాడ్పులు వీచుచు సైన్యమును బాధపెట్టిన వని భావము. ప్రయాణము నకు వెనుకనుండి వీచు అనుకూల వాయువులు శుభశకునము, ఎదురుగా వచ్చు

గాడ్పులు దుశ్శకునము అని శకున శాస్త్రమునందు జెప్పఁబడినది. "ధ్వజతప" అనుచోట సేనారథముల కేతనములు సైతము ఊగిపోవుచుండెననియు భావము.

శ్లో. లక్ష్యతే స్మ తదనంతరం రవి
ర్బద్ధ భీమ పరివేష మండలః
వైనతేయ శమితస్య భోగినో
భోగవేష్టిత ఇవ చ్యుతో మణిః. 59

వ్యాఖ్య: తదనంతరం—ఆ యెదురు గాడ్పులు వీచిన పిమ్మట, బద్ధ భీమ పరివేష మండలః-తనచుట్టును చుట్టిన భయంకర పరివేష మండలముగల, రవిః-సూర్యుఁడు, వైనతేయ శమితస్య-గరుడునిచేత చంపబడిన, భోగినః-సర్పము యొక్క, భోగవేష్టితః—శరీరముచేత మాత్రము చుట్టబడిన, చ్యుతః మణిః, ఇవ-తలపైనుండి జారిపడిన మణివలె, లక్ష్యతే స్మ-కనఁబడెను గరుత్మంతుడు చంపు నప్పుడు శిరస్సునుండి రాలి పడిన మణి సర్పముయొక్క మృతదేహముతో చుట్ట బడినట్లు సూర్యబింబము తనచుట్టును ఒక పరివేషము గలదియై, పూర్వపు టెదురు గాలులు తగ్గిన వెంటనే దశరథాదులకు కనపడె నని భావము. సూర్యుని చుట్టు నింద్రధనుస్సువలె చుట్టుకొన్న పరివేషము కనపడుట అశుభసూచకము. అట్టి దుశ్శకునము దశరథాదులకుఁ గలిగినది.

శ్లో. శ్యేనపక్ష పరిధూస రాలకాః
సాంధ్యమేఘ రుధిరార్ద్ర వాససః,
అంగనా ఇవ రజస్వలా దిశో
నో బభూవు రవలోకనక్షమాః. 60

వ్యాఖ్య: శ్యేనపక్ష పరిధూసరాలకాః-శ్యేనపక్ష-గద్దలరెక్కలనెడు, పరిధూసరాలకాః-దుమ్ము పట్టిన ముంగురులు గలవియు. సాంధ్యమేఘరుధిరార్ద్రవాససః-సాంధ్యమేఘ-సంధ్యాసమయ మేఘము లనెడు, రుధిరార్ద్ర-రక్తముచేత తడిసిన, వాససః-వస్త్రములు గలవియు, రజస్వలాః-దుమ్ముతోఁగూడిన, దిశః-దిక్కులు, రజస్వలాః-ఋతుమతులగు, అంగనాః, ఇవ-స్త్రీలవలె, అవలోకనక్షమాః-చూచుట

కర్హమైనవి, నో బభూవుః-కాకపోయెను. ఇచ్చట గద్దలెక్కలే దిక్కులయొక్క మాసిన ముంగురులు, సాంధ్యమేఘములే రక్తము చేత తడిసిన వస్త్రములు, అట్టుండి దుమ్మునిండిన దిక్కులు, తలలు మాసి, వలువలు రక్తార్ద్రములై యున్న ఋతుమతులగు స్త్రీలవలె దర్శనయోగ్యములు కాలేదు. ఋతుమతులైన స్త్రీలను జూడరాదని శాస్త్రము. దుము తో నిండిన దిక్కులు చూచుటకు వీలుపడవుగదా! అందు వలన యీపోలిక. ఇది సాను ప్రాణితమగు ఉపమాలంకారము. ధూళి వ్యాపించుటచేత దిక్కులు కనపడ ని భావము. ధూళివర్షము ఉత్పాతహేతువగు నొక యపశకునము.

శ్లో. భాస్కర శ్చ దిశ మధ్యువాస యాం
తాం శ్రితాః ప్రతిభయం వవాసిరే,
క్షత్రశోణిత పితృక్రియోచితం
చోదయంత్య ఇవ భార్గవం శివాః. 61

వ్యాఖ్య: భాస్కరః-సూర్యుఁడు, యాం, దిశం-ఏ దిక్కునందు (ఇచ్చట సప్తమ్యర్థమున ద్వితీయావిభక్తి) అధ్యువాస, చ-ఎక్కియుండెనో, తాం, దిశం-ఆ దిక్కును, శ్రితాః-ఆశ్రయించియుండిన, శివాః-నక్కలు, క్షత్రశోణిత పితృక్రియోచితం-క్షత్ర-క్షత్రియులయొక్క, శోణిత-రక్తముచేనగు, పితృక్రియా-తర్పణమునందు,ఉచితం-పరిచితుఁడైన, భార్గవం-పరశురాముని,చోదయంత్యః, ఇవ-ప్రోత్సహించుచున్నవివలె, ప్రతిభయం-భయంకరముగా, వవాసిరే-కూతలుపెట్టినవి. సూర్యుఁ దేదిక్కున నున్నప్పు డచ్చటనున్న నక్కలు, క్షత్రియరక్తముచేత పితృతర్పణముఁ జేయునట్టి పరశురామునిఁ బ్రోత్సహించునవివలె భయంకరముగాఁ గూతలుపెట్టినవి. నక్కల అరపులు అమంగళ సూచకములు. "స్త్రియాం శివా" అని యమరము, కనుక ఇచ్చటి "శివా" శబ్దము స్త్రీలింగము. "వవాసిరే"ఇది వాస్స-శబ్దే అను ధాతువునకు లిట్ బహువచనరూపము. "తిరశ్చాం వాసితం రుతమ్" అని యమరము. తిర్యగ్జంతువులధ్వని "వాసితం" అనబడుచున్నది.

శ్లో. తత్ప్రతీప పవనాది వైకృతం
ప్రేక్ష్య శాంతి మధికృత్య కృత్యవిత్,

అన్వయుంక్త గురు మీశ్వరః క్షితేః
స్వంత మి త్యలఘయ త్స తద్వ్యథామ్. 62

వ్యాఖ్య : తత్ప్రతీపపవనాది-ఆ ప్రతికూలవాయువు మొదలగు, వైకృతం-దుర్నిమిత్తమును, ప్రేక్ష్య-చూచి, కృత్యవిత్-కార్యజ్ఞుడగు, క్షితేః, ఈశ్వరః-భూపతియగు దశరథుడు, శాంతిం-అనర్థనివృత్తిని, అధికృత్య-ఉద్దేశించి, గురుం-కులగురువగు వసిష్ఠుని, అన్వయుంక్త-అడిగెను. సః-ఆవసిష్ఠుడు, స్వంతం-శుభోదర్కమే (దీనిఫలితము శుభాంతమే యగునని), తద్వ్యథాం-ఆదశరథుని మనోబాధను, అలఘయత్-తగ్గించెను. ఈ ప్రతికూలవాయువు మొదలగు దుశ్శకునములు ఫలింపకుండుటకై యేయే శాంతులు చేయవలయు నని దశరథుడు తనగురువగు వసిష్ఠుని డాశకునఫలము శుభముగానే పరిణమించు నని చెప్పి, యతని మనోవ్యథ తగ్గునట్లు చేసె నని భావము. "అధికృత్య" అనునది ఉద్దేశించి యను నర్థమున నుపయోగింపఁ బడు ల్యబంతమగు నవ్యయము. "స్వంతం" అనగా సు + అంతః-శుభోదర-మని యర్థము.

శ్లో. తేజసః సపది రాశి రుత్థితః
ప్రాదురాస కిల వాహినీముఖే,
యః ప్రమృజ్య నయనాని సైనికై
ర్లక్షణీయ పురుషాకృతి శ్చిరాత్. 63

వ్యాఖ్య: సపది—వెంటనే (అట్లు వారు సంభాషించుచుండగనే), ఉత్థితః—పైకి లేచిన, తేజసః, రాశిః-తేజస్సుయొక్క పుంజము, వాహినీముఖే-సేనయొక్క యెదుట, ప్రాదురాస, కిల-ఆవిర్భవించెను సుమా! యః-ఏతేజోరాశి, సైనికైః-సైనికులచేత, నయనాని-కన్నులను, ప్రమృజ్య-తుడుచుకొని, చిరాత్-చాలకాలము నకు, లక్షణీయపురుషాకృతిః-చూడదగిన పురుషరూపము గలది, అభూత్-అయ్యెనో. అప్పుడు వెంటనే యొక తేజఃపుంజము నేలనుండి లేచి సేనయెదుట సాక్షాత్కరించెను. సైనికులు కన్నులు మిఱుమిట్లుగొలిపి చూడలేకపోగా వారు నీటితోను, ప్రేళ్ళతోను మాటిమాటికి కన్నులను దుడుచుకొని, చాలసేపటికి ఆతేజః పుంజ మొకపురుషాకృతిలో నున్నట్లు కనుగొని రని భావము.

శ్లో. పిత్ర్య మంశ ముపవీతలక్షణం
మాతృకం చ ధను రూర్జితం దధత్,
యః ససోమ ఇవ ఘర్మదీధితిః
సద్విజిహ్వ ఇవ చందనద్రుమః. 64

వ్యాఖ్య: ఉపవీతలక్షణం-యజ్ఞోపవీతము చిహ్నముగాగల, పిత్ర్యం, అంశం-తండ్రి సంబంధమగు భాగమును, ధనురూర్జితం-ధనుస్సుచేత ప్రకాశించునట్టి, మాతృకం చ-తల్లి యంశమును, దధత్-ధరించుచున్న, యః-ఏభార్గవుఁడు, ససోమః-చంద్రునితోఁ గూడిన, ఘర్మదీధితిః, ఇవ-చండభానుఁడగు సూర్యుని వలెను, సద్విజిహ్వః-సర్పముతోఁ గూడిన, చందనద్రుమః, ఇవ-శ్రీగంధపు వృక్షము వలెను, స్థితః-ఉండెనో; అట్టి పరశురాముఁడు వారికిఁ గనపడెను. పరశురాముని తండ్రి జమదగ్ని బ్రాహ్మణుఁడు కావున నతని యంశమగు యజ్ఞోపవీతమును, తల్లి ప్రసేనజితుండను రాజుకూతురు రేణుక యగుటచేత క్షత్రియధర్మమగు ధనుస్సును ధరించిన పరశురాముఁడు, చంద్రునితోఁ గలసియున్న చండభానుఁడగు సూర్యుని వలెను, సర్పముతోఁ గూడియున్న చందనవృక్షము వలెను ఉండెనని భావము. అనగా చంద్రచందన తుల్యమగు యజ్ఞోపవీత లక్షణముచేత దయాదాక్షిణ్యానుగ్రహాది బ్రాహ్మణగుణములును, చండభాను, సర్పసదృశమగు ధనుస్సును ధరించుటచేత అవక్రపరాక్రమమును భార్గవునియం దుండెనని తాత్పర్యము

శ్లో. యేన రోషపరుషాత్మనః పితుః
శాసనే స్థితిభిదో ఽపి తస్థుషా,
వేపమాన జననీ శిరశ్ఛిదా
ప్రాగజీయత ఘృణా తతో మహీ. 65

వ్యాఖ్య: రోషపరుషాత్మనః-కోపముచేత కఠినమైన బుద్ధిగలవాఁడును, స్థితిభిదః, అపి-లోకమర్యాదను ఉల్లంఘించినవాడును అయినప్పటికిని, పితుః-తండ్రియొక్క, శాసనే-ఆజ్ఞయందు, తస్థుషా-నిలిచినవాఁడై, వేపమాన జననీ శిరశ్ఛిదా-

వేపమాన-భయముచేత వణకుచున్న, జననీ-తల్లియొక్క, శిరశ్ఛిదా-తలను నరుకుచున్న, యేన-ఏభార్గవునిచేత, ప్రాక్-మొదట, ఘృణా-దయాభావము, తతః-తరువాత, మహీ-భూమండలమున్ను, అజీయత-జయింపఁ బడెనో; కోపముచేత కఠినత్వమునుపొందిన బుద్ధిగలవాఁడై లోకమర్యాద నుల్లంఘించిన తండ్రియాజ్ఞ ప్రకారము, భయకంపితురాలగుచున్న తల్లి శిరస్సును ఛేదించి, తనలోని దయను, తరువాత సమస్త రాజమండల శిరశ్ఛేదమున సకల సామ్రాజ్యమును జయించిన పరశురాముని జూచిరని భావము. తల్లిని చంపుటలో పితృవాక్యపాలనము చేసిన భార్గవునికి దుష్టరాజలోకమును జంపుట యేపాటిగొప్ప? ఇచ్చటి "ఆత్మన్" శబ్దమునకు "ఆత్మా జీవో ధృతి ర్బుద్ధిః" అను నమరవాక్యముచేత "బుద్ధి" అని యర్థము. దయాదాక్షిణ్యములు ధర్మనిర్వహణమునందు అడ్డురావనియు, రాకూడదనియు ఈ మాతృ శిరశ్ఛేద కృత్యమున వెల్లడియగుచున్నది. పితృవాక్య పరిపాలనమే ఇచ్చట ధర్మము.

శ్లో. అక్షబీజ వలయేన నిర్బభౌ
దక్షిణశ్రవణ సంస్థితేన యః
క్షత్రియాంతక రణైకవింశతేః
వ్యాజపూర్వ గణనా మి వోద్వహన్. 66

వ్యాఖ్య: యః-ఏభార్గవుఁడు, దక్షిణ శ్రవణ సంస్థితేన-కుడిచెవి పైనునుండిన, అక్షబీజవలయేన-రుద్రాక్షల మాలచేత, క్షత్రియాంతక రణైకవింశతేః-క్షత్రియాంతక-క్షత్రియులను జంపునట్టి, రణ-యుద్ధములయొక్క, ఏకవింశతేః-ఇరువదియొక్క సంఖ్యయొక్క, వ్యాజపూర్వగణనాం-జపమాలారూప మిషతో మొదటినుండి చేయు లెక్కను, ఉద్వహన్, ఇవ-నిర్వర్తించుచున్నవాఁడువలె, నిర్బభౌ-అధికముగా ప్రకాశించుచుండెనో అట్టి భార్గవునిఁ జూచిరి. కుడిచెవిపైన ప్రవేలాడుచున్న జపమాలా గణనము తాను చేసిన క్షత్రియవధాత్మక రణముల యేకవింశతి సంఖ్యకు సూచకమా? యనునట్లు అక్షమాలాధరుఁడగు పరశురాముఁడు వారికా తేజఃపుంజమునందు సాక్షాత్కరించె నని భావము.

శ్లో. తం పితు ర్వధభవేన మన్యునా
రాజవంశ నిధనాయ దీక్షితమ్,

బాలసూను రవలోక్య భార్గవం
స్వాం దశాం చ విషసాద పార్థివః. 67

వ్యాఖ్య: పితుః-తన తండ్రియగు జమదగ్నిముని యొక్క, వధభవేన-క్షత్రియకర్తృకమగు వధవలన పుట్టిన, మన్యునా-కోపముచేత, రాజవంశనిధనాయ-సర్వరాజవంశముల నాశముకొఱకై, దీక్షితం-దీక్షవహించిన, తం, భార్గవం-ఆ పరశురాముని, స్వాం, దశాం చ-తనదీనదశను, అవలోక్య-చూచి (ఆలోచించుకొని). బాలసూనుః-బాలురగు కుమారులుగల, పార్థివః-దశరథుఁడు, విషసాద-దుఃఖించెను, ఒకప్పుడు హైహయ క్షత్ర వంశీయుఁడగు, కార్తవీర్యార్జునుఁడు, జమదగ్ని మునీంద్రుని యాశ్రమమునకు ఆహారపానీయవాంఛతో వచ్చెను. జమదగ్ని యతనికి సగౌరవముగా నాహారపానీయము లిచ్చినప్పటికిని, హైహయుఁడు రాజ్యమదమున మునులనందరి నవమానించి, జమదగ్ని హోమధేనువుయొక్క వత్సము నెత్తుకొని పోయెను, ఫలసమిత్కుశాహరణమునకై వనమున కేగిన పరశురాముఁడు తిరిగి వచ్చి, తండ్రివలన కార్తవీర్యుని దుండగము నెఱిఁగి, సహింపలేక వెంటనే వెళ్ళి సహస్రబాహుఁడగు వానిని, వాని సైన్యమును తనపరశుధారల కాహుతిఁ జేసెను. అది తెలిసిన హైహయుని కుమారులు, భార్గవుఁడు లేని సమయమున జమదగ్ని వద్దికి వచ్చి యతనిని వధించిరి. పరశురాముఁడు తిరిగి వచ్చి తల్లి దుఃఖమును, తండ్రి మృతశరీరమును జూచి, విషయము నెఱిఁగి, క్రోధావిష్టుడై, దుర్మార్గులగు క్షత్రియులందఱిని వధించి దేశమును అక్షత్రియముగాఁ జేసెదనని దీక్షవహించి యట్లుచేసి, భూమండలమునంతటిని కాశ్యప మునీంద్రునికి యజ్ఞదక్షిణగా నిచ్చి, తాను మహేంద్రపర్వతమునందు తపస్సు చేసుకొనుచుండెను. ఆ భార్గవుఁడిప్పుడు శివధనుర్భంగ మొక క్షత్రియకుమారునిచేత జరుగుట తెలిసి వచ్చెను. అట్లు వచ్చిన క్షత్రియాంతకుఁడగు పరశురామునిఁజూచి అశక్తుఁడైన దశరథుఁడు బాలురగు తన కొడుకులును, తానును ఏమగుదుమో! యన్న భయముతో పారిపోవుటకు సిద్ధముగానుండె నని భావము.

శ్లో. నామ రామ ఇతి తుల్య మాత్మజే
వర్తమాన మహితే చ దారుణే,

హృద్య మస్య భయదాయి చా భవ
ద్రత్నజాత మివ హారసర్పయోః. 68

వ్యాఖ్య : ఆత్మజే-తన కుమారుని యందును, దారుణే-భయంకరుఁడగు, అహితే, చ-శత్రువునందును, తుల్యం-సమానముగా, వర్తమానం-ఉంటూవున్న, "రామ" ఇతి, నామ-రాముఁడు అనుపేరు, హారసర్పయోః- హారమునందును సర్పమునందును, వర్తమానం-ఉన్నట్టి, రత్నజాతం, ఇవ-రత్నజాతివలె, అస్య-ఈ దశరథునికి, హృద్యం-హృదయమున జేరినట్టి, భయదాయి చ-భయమును గలి గించునదికూడ, అభవత్-అయ్యెను. ముత్యాలహారమునందును, సర్పము శిరస్సు నను, ఉండునది రత్నమే అయినప్పటికిని, రత్నశబ్దముచేత సర్పము స్ఫురణకు నప్పుడు వలె, దారుణ శత్రువగు భార్గవునికిని, తన కుమారునికిని, నామ యము "రామ" అని యుండుటచేత, "రామ" శబ్ద శ్రవణోచ్చారణములయందు భార్గవుఁడు స్మృతిలో మెలఁగి, దశరథుఁడు హృద్గత భయముచేత వణకిపోవుచుండె నని భావము.

శ్లో. "అర్ఘ్య మర్ఘ్య" మితి వాదినం నృపం
సోఽనవేక్ష్య భరతాగ్రజో యతః
క్షత్ర కోపదహ నార్చిషం తతః
సందధే దృశ ముదగ్రతారకామ్. 69

వ్యాఖ్య : సః-ఆ భార్గవుఁడు, అర్ఘ్యం అర్ఘ్యం, ఇతి, వాదినం- "పూజా ద్రవ్యం పూజాద్రవ్యం" అని యనుచున్న, నృపం-దశరథుని, అనవేక్ష్య-చూడ కయే, యతః-ఎచ్చట, భరతాగ్రజః-శ్రీరాముఁడు కలఁడో, తతః-ఆ ప్రదేశము నందు, క్షత్ర కోపదహనార్చిషం—క్షత్ర-క్షత్రియకుల విషయమునగల, కోప దహన-కోపాగ్ని యొక్క, అర్చిషం-జ్వాలవలె నున్నదియు, ఉదగ్రతారకాం-ఎత్తబడిన కనీనికలు గలదియునగు, దృశం-చూపును, సందధే-నిలిపెను. దశ రథుఁ "డర్ఘ్య మర్ఘ్య" మని యంటున్నప్పటికిని అతనివైపు చూడక, శ్రీరాముఁ డెచ్చట నుండెనో ఆ వైపును క్షత్ర కోపాగ్ని జ్వాలవంటి చూపును గ్రుడ్లు పైకెత్తి భార్గవుఁడు చూచెనని భావము. ఇచ్చట "యతః తతః" అనునవి, సార్వ విభక్తిక తసిః అను సంప్రదాయమున సప్తమ్యర్థమున ఉపయోగింపబడిన "తసిల్" ప్రత్యయాంతములగు నవ్యయములు.

శ్లో. తేన కార్ముక నిషక్త ముష్టినా
రాఘవో విగతభీః పురోగతః
అంగులీ వివర చారిణం శరం
కుర్వతా నిజగదే యుయుత్సునా. 70

వ్యాఖ్య : కార్ముక నిషక్త ముష్టినా-కార్ముక-ధనుస్సునందు, నిషక్త-గట్టిగా ఉంచబడిన, ముష్టినా-పిడికిలిగలవాఁడును, శరం-బాణమును, అంగులీ వివర చారిణం-వ్రేళ్ళ సందులయందు కదలుచున్న దానిని, కుర్వతా-చేయుచున్నవాఁడును, యుయుత్సునా-యుద్ధము చేయఁ గోరుచున్నవాఁడును నగు, తేన-ఆ భార్గవునిచేత, విగతభీః (సన్)-భయములేని వాఁడగుచు, పురోగతః-ఎదుటికి వచ్చిన, రాఘవః-శ్రీరాముడు, జగదే-గట్టిగా చెప్పబడెను. ధనుస్సుపై ముష్టిని ఉంచి, బాణమును సంధించుచు, యుద్ధము చేయఁ దలచుకున్న పరశు రామునిచేత భయములేక యెదుట నిలుచున్న రాముఁడు ముందు చెప్పఁబోవు రీతిగా గట్టిగాఁ జెప్పఁబడెను. ని+జగదే-నిజగ . "గద" ధాతువునకు కర్మణి లిట్. "ని" ఉపసర్గము.

శ్లో. క్షత్రజాత మపకారవైరి మే
తన్నిహత్య బహుశః శమం గతః
సుప్తసర్ప ఇవ దండఘట్టనాత్
రోషితో ఽస్మి తవ విక్రమశ్రవాత్. 71

వ్యాఖ్య : క్షత్రజాతం-క్షత్రియజాతి, మే-నాకు, అపకార వైరి-పితృవధ రూపమయిన అపకారము చేయుటచేత శత్రువు, తత్-ఆ క్షత్రియజాతిని, బహుశః-అనేక పర్యాయములు (ఇరువది యొక్క సార్లు), నిహత్య-చంపి, శమం-శాంతిని, గతః (అస్మి)-పొందియున్నాను. (తథాపి-అట్లయినను) సుప్తసర్పః-నిద్రించి యున్న పాము, దండ ఘట్టనాత్, ఇవ-కఱ్ఱదెబ్బవలన వలె, తవ-నీ యొక్క, విక్రమ శ్రవాత్-పరాక్రమ శ్రవణమువలన, రోషితః-కోపము పొందింపబడిన వాఁడను, అస్మి-అగుచున్నాను. మా తండ్రిని చంపుటయను అపకారము చేసినందున క్షత్రియులందరు నా శత్రువులే. కనుక వారిని ఇరువదియొక్క పర్యాయ

ములు భూప్రదక్షిణము చేయుచు చంపి శాంతించి యున్నాను. ఇప్పుడు నిద్రించిన పాముసు కఱ్ఱతో బాదినట్లు నీ పరాక్రమ శ్రవణము గలుగుటవలన కోపము గల వాఁడనైతి నని భార్గవరాముఁడు దశరథరామునితో ననెను

శ్లో. మైథిలస్య ధను రన్యపార్థివైః
త్వం కిలా నమితపూర్వ మక్షణోః
త న్నిశమ్య భవతా సమర్థయే
వీర్యశృంగ మివ భగ్న మాత్మనః. 72

వ్యాఖ్య : అన్యపార్థివైః-ఇతర క్షత్రియులచేత, అనమితపూర్వం-పూర్వము వంచబడనట్టి, మైథిలస్య-జనకుని యొక్క, ధనుః-ధనుస్సును, త్వం-నీవు, అక్షణోః కిల-విఱిచి వటకదా! తత్-ఆ ధనుర్భంగమును, నిశమ్య-విని, భవతా-నీ చేత, ఆత్మనః-నా యొక్క, వీర్యశృంగం-శౌర్యమనెడు కొమ్ము, భగ్నం, ఇవ-విఱువఁబడినట్లు, సమర్థయే-తలచుచున్నాను. ఇతర క్షత్రియు లెవ్వరును వంచనైనా వంచలేని జనకునింటిలోని శివధనుస్సును నీవు విఱిచివేసితివట కదా! ఆ వార్తను విని, నీచేత నా శౌర్యశృంగము భగ్నము చేయఁబడినట్లు తలఁచుచున్నానని భార్గవుఁడు రాఘవునితో ననెను.

శ్లో. అన్యదా జగతి "రామ" ఇత్యయం
శబ్ద ఉచ్చరిత ఏవ మా మగాత్
వ్రీడ మావహతి మే స సంప్రతి
వ్యస్తవృత్తి రుదయోన్ముఖే త్వయి. 73

వ్యాఖ్య : అన్యదా-ఇతర కాలమునందు (ఇంతకు పూర్వము) జగతి-లోకమునందు, "రామ" ఇత్యయం, శబ్దః- రాముఁడు అను ఈ శబ్దము, ఉచ్చరితః, సన్-పలుకఁబడినదగుచునే, మాం, ఏవ-నన్నే, అగాత్-పొందినది సంప్రతి-ఇప్పుడు, త్వయి-నీ , ఉదయోన్ముఖే (సతి)-అభ్యుదయమును పొందుచున్నవాఁడవగుచుండగా, వ్యస్తవృత్తిః-విపరీత వృత్తిగల (మరియొకనిని చెప్పునట్టి) సః-ఆ రామ శబ్దము, -నాకు, వ్రీడం-సిగ్గును, ఆవహతి-కలిగించుచున్నది. ఇంతకు

పూర్వము "రామ" శబ్దము అభిధావృత్తిచేత నన్నే బోధించుచుండెను. దానికి నేనే యర్థము ఇప్పు డభ్యుదయమును పొందుచున్న నిన్ను గూడ ఆ రామశబ్దము బోధించుచున్నదగుటచేత విపరీతవృత్తిగల యా శబ్దము నాకు సిగ్గును గూర్చుచున్నది. అని పరశురాముఁడు శ్రీరామునితో ననెను. ఇచ్చట వృత్తి శబ్దమునకు అర్థబోధకశక్తి యని యర్థము.

శ్లో. బిభ్రతో ఽస్త్ర మచలే ఽప్యకుంఠితం
ద్వౌ రిపూ మమ మతౌ సమాగసౌ
ధేనువత్సహరణా చ్చ హైహయః
త్వం చ కీర్తి మపహర్తు ముద్యతః. 74

వ్యాఖ్య : అచలే, అపి-క్రౌంచము మొదలగు పర్వత జాతియందును, అకుంఠితం-మొక్కవోనిదగు, అస్త్రం-ఆయుధమును, బిభ్రతః-ధరించుచున్న, మమ-నాకు, ద్వౌ-ఇద్దఱు, సమాగసౌ-తుల్యాపరాధములుగల, రిపూ-శత్రువులుగా మతౌ-తోచుచున్నారు. (వారెవ్వ రనఁగా) ధేనువత్స హరణాత్-ధేను-మా తండ్రి దగు హోమధేనువు యొక్క, వత్సహరణాత్-దూడను ఎత్తుకపోవుట యను అపరాధమువలన, హైహయశ్చ-కార్తవీర్యుఁడును, కీర్తిం-నా కీర్తిని, అపహర్తుం-అపహరించుటకు, ఉద్యతః-సిద్ధపడిన, త్వం, చ-నీవున్ను. క్రౌంచాది పర్వత భేదనమునం దకుంఠితాస్త్రము గల నాకు, మా తండ్రి హోమధేనువుదూడ నెత్తుక పోయిన కార్తవీర్యార్జునుఁడును, నా కీర్తి నపహరించుటకుఁ బూనిన నీవు, తుల్యాపరాధముగలఁ యిద్దరే శత్రువులుగాఁ గనపడుచున్నారని భార్గవుఁడు రామునితో ననెను.

శ్లో. క్షత్త్రియాంత కరణో ఽపి విక్రమ
స్తేన మా మవతి నాజితే త్వయి
పావకస్య మహిమా స గణ్యతే
కక్షవజ్జ్వలతి సాగరే ఽపి యః. 75

వ్యాఖ్య : తేన-ఆకారణముచేత (నీవు ముఖ్యశత్రుద్వయము నందొకడవగుటచేత), క్షత్రియాంత కరణః, అపి-సకలక్షత్రియ వినాశమునకు సాధనమై

యుండినప్పటికిని, వి|క్రమః- నా పరా|క్రమము, త్వయి-నీవు; అజితే (సతి)-జయింపఁబడకనివాఁడవగుచుండగా; మాం-నన్ను, నావతి (న+అవతి)-తృప్తిపరచుటలేదు. (తథాహి-అదియంతే) పావకస్య-అగ్నియొక్క, మహిమా-గొప్పతనము; సః-అదియే, గణ్యతే-లెక్కింపఁబడును, యః-ఏది, కక్షవత్-కసవు గడ్డి మొదలగుదానియందు వలెనే, సాగరే, అపి- స ము |ద్ర ము న దు నై త ము, జ్వలతి-మండునో. క్షు|ద్ర క్ష|త్రియ వినాశమునకు దోడ్పడిన నా వి|క్రమః, నీవు జయింపఁబడని కారణమున, నాకు సంతోషమును గలిగింపుటలేదు. గడ్డిగాదము నందువలెనే సము|ద్రజలమునందును జ్వలించినప్పడే కదా! అగ్నియొక్క మహిమ లెక్కకోనికి వచ్చునది! అని జామదగ్న్యరాముఁడు దశరథరామునితో ననెను. ఇచ్చట "అవతి" అను |క్రియ యుపయోగింపఁబడినది. దీనికి రక్షణము అర్థము నావతి-రక్షింపుటలేదు, అనగా నిన్ను జయింపకపోయినందువలన నా శరీరము బాధాయుక్తముగా నుండి సంతోషముచేకున్నదని స్ఫురింపఁజేయుట యుద్దేశము.

శ్లో. విద్ధి చాత్తబల మోజసా హరేః
ఐశ్వరం ధను రభాజి యత్త్వయా
ఖాతమూల మనిలో నదీరయైః
పాతయత్యపి మృదు స్తటద్రుమమ్. 76

వ్యాఖ్య : కించ-మరియును, ఐశ్వరం-ఈశ్వరునికి సంబంధించిన, ధనుః-ధనుస్సు, హరేః-విష్ణువుయొక్క, ఓజసా-బలముచేత, ఆత్తబలం, చ-హరింపఁబడిన సారముగలదిగాను; విద్ధి-తెలుసుకొనుము, యత్-ఏ ధనుస్సు, త్వయా-నీచేత, అభాజి-విఱువఁబడినదో; (తథాహి-అది యట్లే) నదీరయైః-నదీజల వేగములచేత, ఖాతమూలం-పెకలింపఁబడిన |వేళ్ళుగల, తట|ద్రుమం-ఒడ్డుపైనున్న వృక్షమును, మృదుః, అపి-కొద్దిపాటిదేయైనను, అనిలః-వాయువు, పాతయతి-పడవేయునుగదా! జనకునివద్దనున్న ఈశ్వరచాపము విష్ణుతేజస్సుచేత హరింపఁబడిన సారముగలదియై యున్నదనియు, అట్టిదానిని నీవు విఱిచితివనియు తెలిసికొనుము. నదీవేగముచేత పెకలింపఁబడిన |వేళ్ళుగలదై యున తీరస్థవృక్షమును సన్నపాటిగాలికూడ కూల |దోయునుగదా! కనుక చిన్నవాఁడ నను శివధనుస్సును భగ్నముగావించితి నని గర్వపడకుము. అని భార్గవుఁడు రా మునితో ననెను.

శ్లో. తన్మదీయ మిద మాయుధం జ్యయా
సంగమయ్య సశరం వికృష్యతామ్
తిష్ఠతు ప్రధన మేవ మవ్యహం
తుల్యబాహుతరసా జిత స్త్వయా. 77

వ్యాఖ్య : తత్-అందువలన, మదీయం-నాదియగు, ఇదం, ఆయుధం-ఈ ధనుస్సు, జ్యయా-అల్లెత్రాటితో, సంగమయ్య-కూర్చి, సశరం-బాణయుక్తము న గా, త్వయా-నీచేత, వికృష్యతాం-లాగబడునుగాక, ప్రధనం-యుద్ధము, తిష్ఠతు-అట్లుండనిమ్ము; ఏవమ్ అపి-బాధనువునట్లుచేయగలిగినప్పటికిని, అహం-నే, తుల్యబాహుతరసా-సమాన బాహుబలముగల, త్వయా-నీచేత, జితః-జయింపబడినవాఁడనే యగుదును. నాధనుస్సునకు నారినిఁగూర్చి, యెక్కుపెట్టి చూపుము. యుద్ధముమాట [illegible] ఆవిధముగా ధనురాకర్షణమును జేయఁగలిగితివేని, సమానబలముగల నీచేత నేను జితుఁడనైనట్లే యని భార్గవుఁ డనెను.

శ్లో. కాతరో ఽసి యది వోద్గతార్చిషా
తర్జితః పరశుధారయా మమ
జ్యా నిఘాత కఠినాంగులి ర్వృథా
బధ్యతా మభయ యాచనాంజలిః. 78

వ్యాఖ్య : వా-లేక, ఉద్గతార్చిషా-జ్వాలలు గ్రక్కుచున్న, మమ, పరశుధారయా-నా [illegible] గొడ్డలి [illegible] చేత, తర్జితః-బెదిరింపబడినవాఁడవై, కాతరః, అసి, [illegible] వాఁడవగుచున్నచో, జ్యా నిఘాత కఠినాంగులిః - జ్యా-అల్లెత్రాటి [illegible] నిఘాత - లాగుటచేఁ గలుగు దెబ్బల వలన, కఠిన-మొద్దుబారిన, అంగులిః-వ్రేళ్ళుగలవాఁడవగుట, వృథా-నిష్ప్రయోజనము. అభయ యాచనాంజలిః-అభయమును యాచించుదోయిలి, బధ్యతాం-కూర్చఁబడునుగాక. మంటలుగ్రక్కు నా పరశుధారచేత బెదిరింపఁబడి, భయకంపితుఁడవగుచున్నయెడల, నాధనుస్సునెక్కుపెట్టి నారిదెబ్బలతో వ్రేళ్ళు మొద్దుబారజేసికొనుట వృథాప్రయత్నమే యగును. కనుక అభయమును యాచించుట కంజలిని బంధింపు మని యనెను (చంపవద్దని ప్రార్థింపుమని భావము).

శ్లో. ఏవ ముక్తవతి భీమదర్శనే
భార్గవే స్మిత వికంపితాధరః
తద్ధనుర్గ్రహణ మేవ రాఘవః
ప్రత్యపద్యత సమర్థ ముత్తరమ్. 79

వా : భీమదర్శనే-భయంకరుఁడై కనబడుచున్న, భార్గవే-పరశురాముఁడు ఏవం- న జెప్పినరీతిగా, ఉక్తవతి-(సతి) పలికినవాఁడగుచుండగా, రాఘవః-శ్రీరాముఁ , స్మితవికంపితాధరః (సన్)-చిఱునగవుచేత కదల్పఁబడిన యధరోష్ఠము గలవాఁడగుచు, తద్ధనుర్గ్రహణం, ఏవ-ఆభార్గవుని ధనుస్సును గ్రహించుటయే, సమర్థం-ఉచితమగు, ఉత్తరం-సమాధానమునుగా, ప్రత్యపద్యత-అంగీకరించెను. భయంకరరూపముగల భార్గవుఁ డట్లు చులకనచేసి పలుకగా రాఘవుఁడు చిఱునవ్వుచేత కంపించుచున్న పెదవిగలవాఁడగుచు నతనిధనువు నెక్కుపెట్టి బాణ సంధానము చేయుటయే తగిన సమాధానమగునని యట్లు చేయఁబూనెను.

శ్లో. పూర్వజన్మధనుషా సమాగతః
సో ఽతిమాత్ర లఘుదర్శనో ఽభవత్
కేవలో ఽపి సుభగో నవాంబుదః
కిం పున స్త్రిదశచాప లాంఛితః. 80

వ్యాఖ్య : పూర్వజన్మధనుషా-పూర్వజన్మయగు నారాయణావతారము నందలి ధనుస్సుచేత, సమాగతః-కూడిన, సః-ఆ రాముఁడు, అతిమాత్ర లఘుదర్శనః- ఎక్కువగా ప్రియదర్శనుడు, అభవత్-అయ్యెను. (ఎట్లనగా) నవాంబుదః-తొలకరిమేఘము, కేవలః, అపి-ఏహంగులులేక సామాన్యముగా నున్నప్పుడే, సుభగః-అందముగానుండును. త్రిదశచాపలాంఛితః-ఇంద్రధనుస్సుతో చిహ్నితమై యున్నప్పుడు, కిం పునః-ఏమి చెప్పవలెను? రాముఁడు నారాయణావతారమున ధరించిన చాపమే యిప్పుడు భార్గవునివద్దను ది. కనుక ఆధనుస్సును పట్టుకొన్నరాఘవుఁడు మిక్కిలి ప్రియ దర్శనుఁడై క న్పైను. వర్షాకాల మేఘము వట్టిగానే యందమై యుండును. ఇఁక

దానిపై నింద్రధనుస్సు చేరినప్పు డెంతయందముగానుండునో చెప్పవలెనా? అట్లే సహజసుందరుఁడగు రాముఁడు వైష్ణవ ధనుస్సును ధరింపగానే మిక్కిలి దర్శనీయ సౌందర్యముగలవాఁ డయ్యె నని భావము. లఘు శబ్దము సుందరార్థకము.

శ్లో. తేన భూమినిహితైకకోటి త
త్కార్ముకం చ బలినా ధిరోపితమ్
నిష్ప్రభశ్చ రిపు రాస భూభృతాం
ధూమశేష ఇవ ధూమకేతనః. 81

వ్యాఖ్య : బలినా-బలవంతుఁడగు, తేన-ఆరాఘవునిచేత, భూమి నిహితైక కోటి—భూమి-భూమిమీద, నిహిత-ఉంచఁబడిన, ఏకకోటి-ఒకచివరగల, తత్, కార్ముకం చ-ఆభార్గవుఁడిచ్చిన ధనుస్సుగూడ, అధిరోపితం-అల్లెత్రాడుగూర్చి యెక్కు పెట్టబడిన దయ్యెను. భూభృతాం-రాజులకు, రిపుః,చ-శత్రువగు భార్గవుఁడుగూడ, ధూమశేషః-పొగతో మిగిలిన, ధూమకేతనః, ఇవ-అగ్నివలె, నిష్ప్రభః-నిస్తేజస్కుఁడు, ఆస-అయ్యెను. ఒక ధనుఃకోటిని నేలపైనుంచి, నారినిఁ గూర్చి, రాముఁడు విల్లునెక్కు పెట్టుటను జూచిన భార్గవుఁడు, పొగమాత్రము మిగిలిన యగ్నివలె నిస్తేజస్కుఁడయ్యెను. అతనిమొగము పరాభవముచేత కళాహీన మయ్యెనని భావము.

శ్లో. తా వుభా వపి పరస్పరస్థితౌ
వర్ధమాన పరిహీన తేజసౌ
పశ్యతి స్మ జనతా దినాత్యయే
పార్వణౌ శశిదివాకరా వివ. 82

వ్యాఖ్య : పరస్పరస్థితౌ-ఒకరినొకరు ఎదుర్కొనియున్నవారును, వర్ధమాన పరిహీన తేజసౌ-పెరుగుచున్నదియు, తరుగుచున్నదియు నగు తేజస్సులుగల, తౌ, ఉభౌ, అపి-ఆరాఘవ భార్గవులిద్దఱను, దినాత్యయే-సాయంకాలమునందు, పార్వణౌ-పూర్ణిమయందుండిన, శశి దివాకరౌ, ఇవ-చంద్రసూర్యులనువలె, జనతా-జనసమూహము, పశ్యతి, స్మ-చూచెను. అప్పుడు యోద్ధలై యొకరినొకరు ఎదు

ర్కొనియున్న రామ భార్గవులలో రామునితేజస్సు పెరుగుచును, భార్గవుని తేజస్సు తరుగుచును ఉండగా, వారు జనసమూహమునకు పూర్ణిమనాటి సాయంకాలము నందలి చం ద సూర్యులవలెఁగనపడి రని భావము. ఇచ్చట రామునికి చం దుని తోను, భా వునికి సూర్యునితోను ఔపమ్యమును గ్రహింపవలెను. "పార్వణౌ" అనగా ప వ్వమునందున్నవారని యర్థము. పూర్ణిమ పంచపర్వములలో నొకటి కావున సందర్భానుసారముగా దానినే గ్రహింపవలెను. ఆనాడే సూర్యుఁడ స్తమించు చుండఁగాఁ జం ద్రుఁడు తేజోరాశి యగుట కననగునుగదా!

శ్లో. తం కృపామృదు రవేక్ష్య భార్గవం
రాఘవః స్ఖలితవీర్య మాత్మని
స్వం చ సంహిత మమోఘ మాశుగం
వ్యాజహార హరసూనుసన్నిభః. 83

వ్యాఖ్య : హరసూనుసన్నిభః-శివునికుమారుఁడగు షణ్ముఖునితో సమానుఁ డును, కృపామృదుః-దయచేత మెత్తనివాఁడునునగు, రాఘవః-శ్రీరాముఁడు, ఆత్మని-తనవిషయమున, స్ఖలితవీర్యం-కుంఠితశక్తిగల, తం, భార్గవం-ఆపరశు రామునిని, స్వం-తనదియు, సంహితం-సంధానము చేయఁబడినదియు, అమోఘం-వ్యర్థముకానిదియు నగు, ఆశుగం, చ-బాణమునున్ను, అవేక్ష్య-చూచి, వ్యాజహార-పలికెను. కుమారస్వామివంటి పరాక్రమవంతుఁడైనప్పటికిని దయాశాలియగు రాముఁడు తనవిషయమున గళితశౌర్యుఁడైయున్న భార్గవుని దీనదశను, తానెక్కు వెట్టిన బాణము వృథగాఁబోవునది గాకుండుటయుఁ దలఁచి పరశురామునితో ముందు చెప్పఁబోవురీతిని భాషించెను.

శ్లో. న ప్రహర్తు మల మస్మి నిర్దయం
విప్ర ఇత్యభిభవత్యపి త్వయి
శంస కిం గతి మనేన పత్త్రిణా
హన్మి లోక ముత తే మఖార్జితమ్? 84

వ్యాఖ్య : అభిభవతి. అపి-నన్ను తిరస్కరించుచున్న వాఁడవైనను, త్వయి-నీయందు, విప్రః, ఇతి-బ్రాహ్మణుఁడవగుటచేత, నిర్దయం-దయాహీన ముగా, ప్రహర్తుం-బాణమును వేయుటకు, అలం-శక్తుఁడను, న, అస్మి-కాలే

కున్నాను. కాని, అనేన, పత్త్రిణా-ఈబాణముచేత, తే-నీయొక్క, గతిం-గమనమును, హన్మి, కిం-నశింపఁజేయుదునా? ఉత-లేక, మఖార్జితం-యజ్ఞాదులచేత సంపాదింపఁబడిన, లోకం-స్వర్గమును, హన్మి కిం-నశింపఁజేయుదునా? శంస-చెప్పుము. నీవు నన్ను తిరస్కరించుచున్నప్పటికిని, బ్రాహ్మణుఁడవు కనుక, నీపై బాణమువేసి, చంపి, బ్రహ్మహత్యాపాపము నొడిగట్టుకొనుటకు సిద్ధపడలేను. కావున, అమోఘమైన నాయీబాణముచేత నీగమనము నాపివేయమందువా? లేక, నీవు తపోయజ్ఞాదులచేత నార్జించిన స్వర్గమును ధ్వంసముచేయమందువా? చెప్పుమని రాఘవుఁడు భార్గవుని నడిగెను.

శ్లో. ప్రత్యువాచ త మృషి ర్న తత్త్వతః
త్వాం న వేద్మి పురుషం పురాతనమ్
గాం గతస్య తవ ధామ వైష్ణవం
కోపితో హ్యసి మయా దిదృక్షుణా. 85

వ్యాఖ్య : ఋషిః-భార్గవుఁడు, తం-అట్లుపలికిన రాముని గుఱించి, ప్రత్యువాచ-బదులుపలికెను. (ఏమని?) తత్త్వతః-యథార్థముగా, త్వాం-నిన్ను, పురాతనం, పురుషం-పురాణపురుషుని, న వేద్మి న-ఎఱుగననుటలేదు. కింతు-కాని, గాం, గతస్య-భూలోకమును జేరినట్టి, తవ-నీయొక్క, వైష్ణవం-విష్ణుసంబంధమగు, ధామ-తేజస్సును, దిదృక్షుణా-చూడఁదలచుకొన్నట్టి, మయా-నాచేత, కోపితః, హి-కోపమువచ్చినవాడవుగాఁ జేయఁబడినవాడవు, అసి-అగుచున్నావు. అట్లు శరసంధానముచేసి పలికిన రాఘవునికి భార్గవుఁ డిట్లు బదులుపలికెను - మహాత్మా! నిజముగా నీవు పురాణపురుషుఁడవగు నారాయణుఁడవని నేనెఱుఁగని విషయము కాదు. భూలోకమున దశరథసుతుఁడవుగా నవతరించిన నీయందు వైష్ణవతేజస్సు ఏ స్థితిలో నున్నదో చూడఁదలఁచుకొని యట్లు నీకు కోపమువచ్చునట్లు చేసితినికాని వేఱుకాదు.

శ్లో. భస్మసా త్కృతవతః పితృద్విషః
పాత్రసా చ్చ వసుధాం ససాగరామ్

ఆహితో జయవిపర్యయో ఽపి మే
శ్లాఘ్య ఏవ పరమేష్ఠినా త్వయా. 86

వ్యాఖ్య : పితృద్విషః-నా తండ్రి శత్రువులను, భస్మసాత్, కృతవతః-భస్మము చేసి వేసినట్టియును, ససాగరాం-సముద్రములతోఁగూడిన, వసుధాం-భూమిని, పాత్రసాచ్ఛ, కృతవతః-సత్పాత్రదానముగా నిచ్చివేసినట్టియును, మే-నాకు, పరమేష్ఠినా-పరమ పురుషుఁడవగు, త్వయా-నీచేత, ఆహితః-చేయఁబడిన, జయవిపర్యయః, అపి-పరాజయము కూడ, శ్లాఘ్యః, ఏవ-ఆనందముతోఁగోరదగిన దియే ఇంకను భార్గవుఁ డిట్లనుచున్నాడు, నా పితృవైరులను కోపముచేత భస్మీభూతులను జేసినాను. నేను క్షత్రియ జాతమును సంహరించి, స్వాధీనము చేసికొన్న సమస్త భూమండలమును, సత్పాత్రయగు కశ్యపునికి య దక్షిణగా నిచ్చినాను. ఇట్లు కృతకృత్యుఁడనై యున్న నాకు, పురాణపురుషుఁడ , పరమేష్ఠివి అగు నీ చేత గలుగు పరాజయముకూడ సంతోషముతోఁ గోరఁదగిన కాని అన్యము కాదు.

శ్లో. తత్ గతిం మతిమతాం వరేప్సితాం
పుణ్యతీర్థగమనాయ రక్ష మే
పీడయిష్యతి న మాం ఖలీకృతా
స్వర్గపద్ధతి రభోగ లోలుపమ్. 87

వ్యాఖ్య : తత్-ఆ కారణమువలన, హేమతిమతాంవర!-ఓ బుద్ధిమంతులలో శ్రేష్ఠుఁడా! పుణ్యతీర్థగమనాయ-పుణ్య తీర్థములకు వెళ్ళుటకొఱకు, ఈప్సితాం-ఇష్టముగల, మే-నా యొక్క, గతిం-గమన శక్తిని, రక్ష-కాపాడుము. ఖిలీకృతా-వెళ్ళుటకు వీలుపడనట్లు చెఱుపఁబడిన దైనను, స్వర్గపద్ధతిః-స్వర్గమార్గము, అభోగలోలుపం-భోగములయందు నిస్పృహగల వాఁడనగు, మాం-నన్ను, న పీడయిష్యతి-బాధింపఁజాలదు. ఓ మతిమంతుఁడా! అనేక పుణ్యతీర్థముల కేగి యచ్చట తపోనిష్ఠలో నుండఁదలచిన నాకు కాళ్ళు లేకుండ జేయకుము. ఇక నాకు స్వర్గసౌఖ్యాభిలాష లేదు కనుక, నేను వెళ్ళఁబోవు స్వర్గమార్గమును నీవు దుర్గమముగాఁ జేసినప్పటికిని నాకు బాధలేదు. స్వర్గమార్గమునే బాణమువేసి చెఱుపుము అని కోరెను.

శ్లో. ప్రత్యపద్యత తథేతి రాఘవః
ప్రాఙ్ముఖ శ్చ విససర్జ సాయకమ్

భార్గవస్య సుకృతో ఽపి సోఽ భవత్
స్వర్గమార్గ పరిఘో దురత్యయః. 88

వ్యాఖ్య : రాఘవః-శ్రీరాముఁడు, తథేతి (తథా + ఇతి)-సరే యని, ప్రత్య పద్యత-అంగీకరించెను. ప్రాఙ్ముఖః-తూర్పునకు మరలినవాఁడై, సాయకం-ఎక్కు పెట్టిన బాణమును, విససర్జ, చ-విడువనుగూడ విడిచెను. సః-ఆ బాణము, సుకృతః, అపి-మంచిపనులు చేసిన పుణ్యాత్ముఁడే యైనప్పటికిని, భార్గవస్య-పరశురామునికి, దురత్యయః-ముందునకు వెళ్ళనీక అడ్డగించునట్టి, స్వర్గమార్గ పరిఘః-స్వర్గమార్గమునకు గడియగా, అభవత్-అయ్యెను. భార్గవుఁడు కోరిన కోరికను అంగీకరించి, రాముఁడు ప్రాఙ్ముఖుఁడై తాను సంధానము చేసిన బాణ మును వదలెను. ఆ బాణము, పుణ్యాత్ముఁడే అయియున్నప్పటికిని, పరశురామునికి స్వర్గమార్గమును మూసివేసిన గడియగా మారెను అనఁగా భార్గవుఁడు స్వర్గమున కేఁగ వెళ్ళుటకు వీలులేదని భావము.

శ్లో. రాఘవో ఽపి చరణౌ తపోనిధేః
క్షమ్యతా మితి వదన్ సమస్పృశత్
నిర్జితేషు తరసా తరస్వినాం
శత్రుషు ప్రణతి రేవ కీర్తయే. 89

వ్యాఖ్య : రాఘవః, అపి-రాముఁడు కూడ, క్షమ్యతాం-క్షమింపఁబడుదును గాక, ఇతి, వదన్-అనియనుచు, తపోనిధేః-భార్గవునియొక్క, చరణౌ-పాదములను, సమస్పృశత్-పట్టుకొని నమస్కరించెను. తరస్వినాం-బలవంతులకు, తరసా-తమ బలముచేత, నిర్జితేషు-ఓడింపఁబడిన, శత్రుషు-శత్రువుల విషయమున, ప్రణతిః, ఏవ-నమస్కారమే, కీర్తయే-కీర్తినిఁగలిగించునుగదా! అట్లు భార్గవుని స్వర్గ మా మును ధ్వంసము చేసిన రాముఁడు, "నేను క్షమింపఁబడుదునుగాత". అని భా వుని పాదములపైఁ బడి నమస్కరించెను. పరాక్రమవంతులకు, తమచే నిర్జిం బడిన శత్రువులను నమస్కారాదులచేతఁ బ్రసన్నులను జేయుటయే మిక్కిలి యశస్కరము అని భావము. రాముఁడు భార్గవుని గర్వము నణచుట కట్లు చేసెనే కాని యతనియందు సంపూర్ణ వినయ గౌరవము లుండినట్లు "తపోనిధి" "సమస్ప శత్" పదములు దెలుపుచున్నవి.

శ్లో. రాజసత్వ మవధూయ మాతృకం
పిత్ర్య మస్మి గమితః శమం యదా
న న్వనిందితఫలో మమ త్వయా
నిగ్రహో ౽ప్యయ మనుగ్రహీకృతః. 90

వ్యాఖ్య : మాతృకం-తల్లిద్వారా సంక్రమించిన, రాజసత్వం-రజోగుణ ప్రధానత్వమును, అవధూయ-తొలగించివేసి, పిత్ర్యం-తండ్రిద్వారా సంక్రమించిన శమం-శాంతిని, యదా-ఎప్పుడైతే, గమితః-పొందింపఁబడినవాఁడను, అస్మి-అగుచున్నానో, తదా-అప్పుడే, త్వయా-నీచేత, మమ-నాకు, అనిందితఫలః-ఇష్టమయిన స్వర్గహానియే ఫలముగాఁగల, అయం, నిగ్రహః-ఈయపకారము, అనుగ్రహీకృతః, నను-ఉపకారముగాఁ జేయఁబడినది సుమా! రాఘవా! నేను, మహా తపస్వియగు జమదగ్నికి క్షత్రియ కన్యయగు రేణుకయం దుద్భవించుటచేత, మాతృకమగు రాజస గుణమును, పిత్ర్యమగు శాంతగుణమును గలవాఁడనై యుంటిని. నీవు నన్ను రాజసగుణముల (కోపగర్వాదుల) నుండి దూరముచేసి, తపస్వికుఁడ వలసిన శాంతగుణ ప్రధానునిఁజేసితివి. స్వర్గసౌఖ్యము నాకిష్టము కానిది, దానిని ఖండించుటయను నీ నిగ్రహము, నాకు అనుగ్రహమే యైనది. ఇంతకన్న నేమి యుపకారము కావలయును? అని పరశురాముఁడు రాఘవుని శ్లాఘించెను. ఆనాటి నుండి భార్గవుఁడు రాగద్వేషములులేని మహాముని యయ్యెను.

శ్లో. సాధయా మ్యహ మవిఘ్నమస్తు తే
దేవకార్య ముపపాదయిష్యతః
ఊచివా నితి వచః సలక్ష్మణం
లక్ష్మణాగ్రజ మృషి స్తిరోదధే. 91

వ్యాఖ్య: అహం-నేను, సాధయామి-వెళ్ళుచున్నాను. దేవకార్యం-రావణ వధాది దేవకార్యమును, ఉపపాదయిష్యతః-సంపాదింపగలుగునట్టి, తే-నీకు, అవిఘ్నం-విఘ్నాభావము, అస్తు-అగునుగాక. సలక్ష్మణం-లక్ష్మణునితోఁగూడిన, లక్ష్మణాగ్రజం- రాముని గురించి, ఇతి-ఈవిధమగు, వచః-మాటను, ఊచివాన్-పలికినట్టి, ఋషిః-భార్గవరాముఁడు, తిరోదధే-అంతర్ధానమును పొందెను. నేను

వెళ్ళుచున్నాను. దేవతలు ప్రార్థింపఁగా రాముఁడవై పుట్టి, వారి కార్యమగు రావణ వధాదికమును ముందుచేయఁబోవుచుట్టి నీకు అవిఘ్నము అగుగాక. అన్నమాటను సలక్ష్మణుఁడగు రామునికి జెప్పి మహర్షియగు పరశురాముఁ డంతర్ధానమును బొందెను. ఇచ్చట "సలక్ష్మణాం" అనునది సాభిప్రాయవిశేషణము. రాముఁడు అరణ్యవాస, రావణవధాదికమును లక్ష్మణసహితుఁడై చేయఁబోవునుగదా! అందు వలన లక్ష్మణుఁడు సైతము వినునట్లు ఆశీర్వదించెను. అలంకారము: పరికరము.

శ్లో. తస్మిన్ గతే విజయినం పరిరభ్య రామం
స్నేహా దమన్యత పితా పున రేవ జాతమ్
తస్యా భవత్ క్షణశుచః పరితోషలాభః
కక్షాగ్ని లంఘితతరో రివ వృష్టిపాతః. 92

వ్యాఖ్య: తస్మిన్-ఆభార్గవుఁడు, గతే (సతి)- వెళ్ళిపోయినవాఁడు కాగానే, విజయినం-విజయమును పొందిన, రామం-శ్రీరాముని, పితా-తండ్రియగు దశరథుఁడు, స్నేహాత్-వాత్సల్యమువలన, పరిరభ్య-ఆలింగనము చేసికొని, పునః, జాతం, ఏవ-మళ్ళీ పుట్టిన వానినిగానే, అమన్యత-తలఁచుకొనెను. క్షణశుచః-క్షణకాలము దుఃఖమును పొందినట్టి, తస్య-ఆ దశరథునికి, పరితోషలాభః-సంతోష ప్రాప్తి, కక్షాగ్ని లంఘితతరోః-కక్ష-ఎండిన వనము నందలి, అగ్ని-అగ్నిచేత (దావాగ్నిచేత), లంఘిత-చుట్టివేయఁబడిన, తరోః-వృక్షమునకు, వృష్టిపాతః, ఇవ-వర్షపాతమువలె, అభవత్-అయ్యెను. అట్లు ఆశీర్వదించి భార్గవుఁడు వెళ్ళిపోగానే, విజయమును పొందిన రాముని తండ్రియగు దశరథుఁడు గాఢాలింగనము చేసికొని, కొడుకుపైఁగల స్నేహవాత్సల్యములచేత రాముఁడు పునర్జన్మ యెత్తినట్లు భావించి, సంతోషపడెను. క్షణమాత్రదుఃఖము ననుభవించిన దశరథుని కాసంతోషము, దావాగ్నిచేత చుట్టఁబడిన వృక్షమునకు వర్షపాతమువలె నుండెను. ఇచ్చట "పునరేవ జాతం" అనువాక్యము, భార్గవుఁడు, శ్రీరాముఁడు పరాత్పరుఁడనియు, దేవకార్యమును సాధించుటకు అవతరించిన నారాయణుఁడనియు పలికిన పలుకులు విన్న దశరథుఁడు, మరుక్షణమునందే పుత్రవాత్సల్యలోలుపుఁడై రాముని మరల సామాన్యుఁడగు తనపుత్రుఁడే యని భావించెనన్న యర్థాంతరమును గూడ స్ఫురింప జేయుచున్నది. అలంకారము: ఉపమ.

శ్లో. అథ పథి గమయిత్వా క్లుప్తరమ్యోపకార్యే
కతిచి దవనిపాలః శర్వరీః శర్వకల్పః
పుర మవిశ దయోధ్యాం మైథిలీదర్శనీనాం
కువలయితగవాక్షాం లోచనై రంగనానామ్. 93

వ్యాఖ్య: అథ-అపిమ్మట, శర్వకల్పః-ఇంచుమించుగా శంకరునియంత వాఁడగు, అవనిపాలః-దశరథుఁడు, క్లుప్తరమ్యోపకార్యే-అలంకరింపబడిన యంద మగుడేరాలు గల, పథి-మార్గమునందు, కతిచిత్, శర్వరీః-కొన్ని రాత్రులను, గమ యిత్వా-గడపి, మైథిలీదర్శనీనాం-సీతను జూడదలచిన, అంగనానాం-పురస్త్రీల యొక్క, లోచనైః-కన్నులచేత, కువలయితగవాక్షాం-కువలయిత-కలువలుగలవిగాఁ జేయఁబడిన, గవాక్షాం-మేడల కిటికీలుగల, పురం, అయోధ్యాం-పట్టణమగు నయోధ్యను, అవిశత్-ప్రవేశించెను. ఆ తరువాత నచ్చటచ్చట యందమైన డేరాలతో నేర్పరుపఁబడిన విడుదులయందు కొన్ని రాత్రులు గడపిన దశరథుఁడు, కోడండ్ర తోను,కొడుకులతోను సీతనుజూచుటకై యుత్సాహపడుచున్న పురాంగనలకన్నులచేత మేడల కిటికీ లన్నియు కలువలతో నిండినట్లు శోభించుచున్న అయోధ్యానగరమును ప్రవేశించెను. పరశురామునికి కుమారస్వామి సహాధ్యాయి అట్లే రాముఁడు కుమారస్వామితో సమానుఁడై భార్గవుని నిర్జించుటవలన నట్టి కుమారుఁడు గల దశరథుఁడు శర్వకల్పుఁడని కవి వర్ణించెను. కువలయితగవాక్షాం అనుచోట పురస్త్రీల కన్నులకును కలువలకును అభేదము చెప్పుటచేత రూపకాతిశయోక్తి అలంకారము ధ్వనించుచున్నది. ఇది సీతా వివాహ వర్ణనాత్మకమగు నేకాదశ సర్గము.

ఇది మహాకవి కాళిదాస కృత
రఘువంశకావ్యమున సీతా వివాహ వర్ణనము ఏకాదశ
సర్గమునకుఁ కేశవపంతుల నరసింహశాస్త్రి రచిత దెలుఁగు
లఘువ్యాఖ్య.

శ్రీః

## మహాకవి కాళిదాస కృత

# రఘువంశము

## ద్వాదశసర్గము

శ్లో. నిర్విష్టవిషయస్నేహః స దశాంత ముపేయివాన్,
ఆసీ దాసన్ననిర్వాణః ప్రదీపార్చి రివోషసి. 1

వ్యాఖ్య : నిర్విష్టవిషయస్నేహః- నిర్విష్ట-ఉపభుక్తములైన, విషయ-భోగ్యవస్తువులనెడు, స్నేహః-వాంఛితములుగలవాఁడును, దశాంతం-జీవనస్థితి యొక్క అంతమును (వార్ధకమును), ఉపేయివాన్-పొందియున్నట్టి, సః-(అట్లు సీతాకల్యాణానంతరము స్నుషాపుత్రాదులతో అయోధ్యానగరమునకుఁ జేరిన) ఆ దశరథుఁడు, ఉషసి-ఉషఃకాలమునందు, ప్రదీపార్చిరివ (ప్రదీపార్చిః, ఇవ)-దీప జ్వాలవలె, ఆసన్ననిర్వాణః-సమీపించిన మోక్షము (మరణము) గలవాఁడు,ఆసీత్-అయ్యెను. దీపజ్వాలాపక్షమున నిర్విష్టవిషయస్నేహః-నిర్విష్ట-నశించిన (తగ్గి పోయిన), విషయ-ప్రమిదయందలి, స్నేహః-నూనెగలదియనియు, దశాంతం-వత్తియొక్క చివరిభాగమనియు, ఆసన్ననిర్వాణః-సమీపించిన వినాశము గలది యనియు నర్థములు. జీవితకాలమున సర్వసుఖములు అనుభవించి చివరిదశకుఁజేరిన దశరథుఁడు, రాత్రివేళ చక్కఁగా వెలిగి, తైలము తగ్గిపోయినపిమ్మట, వత్తిచివరికి వచ్చి చల్లారిపోవనున్న దీపకళికవలె, మోక్షమునకై వేచియుండెనని భావము. దీపోపమానము, మానవుఁడు తనయవసర మున్నంతవఱకే వెలిగి పిమ్మట నశించు నన్న తత్త్వమును బోధించుచున్నది. "స్నిహ్యంతి పురుషా యేన ఇతి స్నేహః-శబ్దాదయః" అని స్నేహశబ్ద వ్యుత్పత్తి. "నిర్వాణం నిర్వృతౌ మోక్షే వినాశే గజ మజ్జనే" యని యాదవ నిఘంటువు.

శ్లో. తం కర్ణమూల మాగత్య రామే శ్రీ ర్న్యస్యతా మితి,
కైకేయీశంకయే వాహ పలితచ్ఛద్మనా జరా. 2

వ్యాఖ్య : జరా-వృద్ధత్వము, కైకేయీశంకయా, ఇవ-కైకయందలి అనుమానముచేతనో యన్నట్లు, పలితచ్ఛద్మనా-నెరసిన వెండ్రుకల మిషచేత, కర్ణమూలం-దశరథుని చెవి సమీపమునకు, ఆగత్య-చేరి, రామే-శ్రీరామునియందు, శ్రీః-రాజ్యలక్ష్మి, న్యస్యతాం-ఉంచబడునుగాక; ఇతి-ఇట్లని, తం-అతనిని (ఆ దశరథునికి), ఆహ-చెప్పెను, వృద్ధత్వము (కర్త) చెవులవద్ద తెల్లబడిన జుట్టు రూపమున, కైకేయి వినిపోవునోయేమో! అను నను మానముచేత, దశరథుని చెవి వద్దికి వచ్చి "రామునిపై రాజ్యలక్ష్మి నుంచుము" అని దశరథునితోఁ జెప్పెను. అనఁగా దశరథుఁడు తాను వృద్ధుఁ డౌటచేతనే రామునికి యౌవరాజ్యపట్టాభిషేకముఁ జేయుటకుఁ దలపెట్టెనని భావము. ముదుసలితనమునకుఁ జెవులవద్ది వెండ్రుకలు తెల్లబడుట మొదటి చిహ్నము గదా!

శ్లో. సా పౌరాన్ పౌరకాంతస్య రామ స్యాభ్యుదయశ్రుతిః,
ప్రత్యేకం హ్లాదయాంచక్రే కుల్యే వోద్యానపాదపాన్. 3

వ్యాఖ్య : సా-ఆ, పౌరకాంతస్య-పురజనులకు మనోహరుఁడగు. రామస్య-రామునియొక్క, అభ్యుదయశ్రుతిః-పట్టాభిషేకరూపమగు నభ్యుదయవార్త, కుల్యా-కాలువ, ఉద్యానపాదపాన్, ఇవ-తోటయందలి చెట్లనువలె, పౌరాన్-పురజనులను, ప్రత్యేకం-ఒక్కొక్కరిని, హ్లాదయాంచక్రే-ఆనందపరచెను. ఉద్యానవనము నందలి నీటికాలువ యొక్కొక్కచెట్టుపాదును జేరి యచ్చటి వృక్షము నానందపరచి నట్లు రామపట్టాభిషేకవార్త ప్రతి నగరవాసి నత్యంతముగా సంతోషపరచె నని భావము. "శ్రూయతే" ఇతి శ్రుతిః-వినఁబడునది కనుక వార్తకు "శ్రుతిః" అని పేరు. ఇది స్త్రీలింగము. "కుల్యా" అనునదియు స్త్రీలింగమే. స్త్రీభాషణమువలెఁ జల్లగా మెల్లఁగా రామపట్టాభిషేకవార్త ప్రతి మనిషి చెవికినిఁ జేరి యానందపరచినదట!

శ్లో. తస్యాభిషేకసంభారం కల్పితం క్రూరనిశ్చయా,
దూషయామాస కైకేయీ శోకోష్ణైః పార్థివాశ్రుభిః. 4

వ్యాఖ్య : క్రూరనిశ్చయా-భయంకరమైన కార్యనిశ్చయముగల, కైకేయీ-కైక, తస్య-ఆ రామునికి, కల్పితం-ఏర్పాటుచేయఁబడిన అభిషేకసంభారం-పట్టాభి

షేకమునకుఁ గూర్చిన వస్తుజాతమును, శోకోష్ణైః-దుఃఖముచేత వేడియెక్కిన, పార్థివాశ్రుభిః-రాజు కన్నీళ్ళచేత, దూషయామాస-చెడిపోవునట్లు చేసెను. తన కార్యమును సాధించుకొనుటలో మొండిపట్టుదల గల కైకేయి రాముని పట్టాభిషేక వార్తచే నేడ్చుచు, తన్మూలకమైన దశరథ దుఃఖాశ్రువులచేత అభిషేకసంభారము నంతటిని చెడఁగొట్టెను. అనఁగా దశరథుఁడు తాను కూర్చిన సంభారము నంతటిని వ్యర్థముగాఁ దలఁచి దుఃఖించెననియు, నావిధముగా కైక రామపట్టాభిషేకమును ఆపె ననియు భావము.

శ్లో. సా కిలాశ్వసితా చండీ భర్త్రా తత్సంశ్రుతౌ వరౌ,
ఉద్వవా మేంద్రసిక్తా భూ ర్బిలమగ్నా వివోరగౌ. 5

వ్యాఖ్య : చండీ-అతికోపముగల, సా-ఆ కైకేయి, భర్త్రా-భర్తచేత, ఆశ్వసితా (సతీ)-ప్రబిమాలి యోదార్పఁబడినదగుచు, తత్సంశ్రుతౌ (తత్ + సంశ్రుతౌ)-ఆతనిచేత ప్రతిజ్ఞాతములైన, వరౌ-రెండు వరములను, ఇంద్రసిక్తా-ఇంద్రునిచేత (మేఘముచేత) వర్షింపఁబడిన, భూః-భూమి, బిలమగ్నౌ-బిల-పుట్టలు మొదలగువాని రంధ్రములయందు, మగ్నౌ-దాగియున్న, ఉరగౌ, ఇవ-సర్పము లనువలె, ఉద్వవామ, కిల-బయటికిఁ గక్కినది సుమా! దశరథుఁడు బ్రతిమాలు కొనఁగా నోదార్పును జెందినదగుచు, చండియైన కైక, భర్త పూర్వము తన కిచ్చెదనని చెప్పియున్న రెండు వరములను, మేఘముచేత వర్షింపఁబడిన భూమి పుట్టలోనున్న పాములను పైకి విడిచినట్లు, వెడలఁగ్రక్కె నని భావము. ఉపమాన స్వారస్యముచేత పాము లెంతచెడ్డవో ఆ రెండు వరములు నంతచెడ్డవి యని తెలు చున్నది. కైక రెండు వరములను గోరెనని భావము

శ్లో. తయో శ్చతుర్ద శై కేన రామం ప్రావ్రాజయ త్సమాః,
ద్వితీయేన సుత స్యైచ్ఛ ద్వైధవ్యైకఫలాం శ్రియమ్. 6

వ్యాఖ్య: (సా-ఆకైక) తయోః-ఆరెండు వరములలో, ఏకేన-ఒకవరము చేత, రామం-రాముని, చతుర్దశ-పదునాలుగు, సమాః-సంవత్సరములు, ప్రావ్రాజయత్-అరణ్యమునకుఁ బంపునట్లు చేసెను. ద్వితీయేన-రెండవ వరముచేత, సుతస్య-తన కుమారుఁ డగు భరతునికి, వైధవ్యైకఫలాం-తన వైధవ్యము మాత్రమే ఫలము గాఁగల, శ్రియం-రాజ్యలక్ష్మిని, ఐచ్ఛత్-కోరెను, ఆరెండు

వరములలో నొకదానిచేత పదునాలుగు వత్సరములు రామవనవాసమును, రెండవ దానిచేత భరతుని యౌవరాజ్య పట్టాభిషేకమును గోరెను. భరత పట్టాభిషేకము వలన నతనికి రాజ్యభోగము లేకపోగా భర్త చనిపోవుటవలనఁ దనకు వైధవ్యము కలుగుటయే ఫలమని కైక యెఱుఁగక మొండిపట్టుదలతో వరములను గోరెనని భావము

శ్లో. పిత్రా దత్తాం రుదన్ రామః ప్రాఙ్మహీం ప్రత్యపద్యత,
పశ్చా ద్వనాయ గచ్ఛేతి తదాజ్ఞాం ముదితో ఽగ్రహీత్. 7

వ్యాఖ్య: రామః-శ్రీరాముఁడు, ప్రాక్-మొదట, పిత్రా-తండ్రిచేత, దత్తాం-ఇయ్యఁబడిన, మహీం-భూపరిపాలనమును, రుదన్-దుఃఖపడుచు, ప్రత్యపద్యత-అంగీకరించెను పశ్చాత్-తరువాత, వనాయ, గచ్ఛ, ఇతి-వనమునకు వెళ్ళుము అనునట్టి, తదాజ్ఞాం-ఆ తండ్రియొక్క ఆజ్ఞను, ముదితః-సంతోషముగలవాఁడై, అగ్రహీత్-స్వీకరించెను. దశరథుఁడు మొదట రాజ్యభారమును వహింపుమన్నప్పుడు దుఃఖముతో నొప్పుకొనుటకుఁ గారణము దశరథుఁడు బ్రతికియుండఁగా నేను రాజగుట యెందులకన్న భావము. రెండవ మాటగా వనమున కేగుటవలన పితాజ్ఞాకరణ లాభము సంతోషము గలుగుటకు కారణము. రామావతారఫలము వనవాస రూపమగు నాజ్ఞలో నుండుటచే నది రాముని కానందమును గలిగించెనన్నది నిగూఢమైన భావము.

శ్లో. దధతో మంగళక్షౌమే వసానస్య చ వల్కలే,
దదృశు ర్విస్మితా స్తస్య ముఖరాగం సమం జనాః. 8

వ్యాఖ్య : మంగళక్షౌమే-శుభసూచకములగు పట్టు వస్త్రములను, దధతః-కట్టుకొనుచున్నవాఁడును, వల్కలే-నార చీరలను, వసానస్య, చ-ధరించుచున్నవాఁడును, అగు, తస్య-ఆ శ్రీరామునియొక్క, సమం-ఒకే విధమైన, ముఖరాగం-ముఖవర్ణమును, జనాః-ప్రజలు, విస్మితాః-ఆశ్చర్యపడినవారై, దదృశుః-చూచిరి, తండ్రియాజ్ఞచేత పట్టాభిషేకముకొఱకు పట్టు వస్త్రములు కట్టుకొనుచున్నప్పుడును, అది భగ్నమై యరణ్యమునకు వెళ్ళుటకై వల్కలములు ధరించుచున్నప్పుడును, శ్రీరాముని ముఖవర్ణము ఒకే విధముగా నుండుటను జూచి, జనులు ఆశ్చర్యపడిరి.

సుఖము వచ్చినప్పుడు ముఖము వికసించుటయు, దుఃఖము వచ్చినప్పుడు ముఖము ముడుచుకొనుటయు, సామాన్యుల లక్షణము. సుఖ దుఃఖములయందు ముఖవర్ణము మారకుండుట ధీరుల లక్షణ మని భావము.

శ్లో. స సీతాలక్ష్మణసఖః సత్యా ద్గురు మలోపయన్,
వివేశ దండకారణ్యం ప్రత్యేకం చ సతాం మనః. 9

వ్యాఖ్య : సః-అట్టి రాముఁడు, గురుం-తండ్రిని, సత్యాత్-వరదాన రూపమైన సత్యమునుండి, అలోపయన్-జారిపోనియ్యనివాఁడగుచు, సీతాలక్ష్మణసఖః-సీతా లక్ష్మణ సహితుఁడై, దండకారణ్యం-దండకారణ్యమును, సతాం-సత్పురుషుల యొక్క, మనః, చ-మనస్సును, ప్రత్యేకం-ఒక్కొక దానినిగాను, వివేశ-ప్రవేశించెను. కైక కిచ్చిన వరదానసత్యము నుండి తండ్రిని తప్పిపోనీయక, సీతా లక్ష్మణ సహితుఁడై రాముఁడు దండకావనమును ప్రవేశించెను. అట్లు చేసిన రాముని చర్య ప్రతి సత్పురుషుని మనస్సు నానందపరచె నని భావము. "సీతాలక్ష్మణయోః సఖా" అని విగ్రహము. అనఁగా తమకు సర్వకాల సర్వావస్థలయందును అత్యంత స్నేహపాత్రుడై యున్న రాముని విడువలేక వారే యతనిని వెంబడించిరని సమాసార్థము తేలును. ఏకస్మిన్ ఏకస్మిన్-ప్రత్యేకం-ప్రతి దానియందు అని విగ్రహము.

శ్లో. రాజాఽపి తద్వియోగార్తః స్మృత్వా శాపం స్వకర్మజమ్,
శరీరత్యాగమాత్రేణ శుద్ధిలాభ మమన్యత. 10

వ్యాఖ్య : తద్వియోగార్తః-వారియెడఁబాటుచేత శోకార్తుఁడైన, రాజా, అపి-దశరథ మహారాజుకూడా, స్వకర్మజం-మునిపుత్ర వధరూపమైన తన పూర్వ కర్మచేత వచ్చిన, శాపం-పుత్రశోకమువలన తాను మరణించునని శాపమును, స్మృత్వా-స్మరించుకొని, శరీరత్యాగమాత్రేణ-దేహత్యాగముచేతనే, శుద్ధిలాభం-ప్రాయశ్చిత్తమును, అమన్యత-తలంచెను. పుత్రవియోగముచేత దుఃఖితుఁడై ఇక జీవింపలేనని యెంచిన దశరథుఁడు పూర్వము తన బాణముచేత పొరపాటున మరణించిన మునికుమారుని తండ్రి యిచ్చిన శాపము స్మృతికిరాఁగా నాపాపమునకుఁ దన శరీరత్యాగమే ప్రాయశ్చిత్త మని యెఱిఁగి మరణించె నని భావము. ప్రాయశ్చిత్తమనఁగా చేసిన పాపమును దొలఁగించుకొనుటకుఁ జేయు శుద్ధికర్మ. "ప్రాయః

పాపం విజానీ యాత్ చిత్తం తస్య విశోధనమ్" అని ప్రాయశ్చిత్తశబ్దనిర్వచనము.
"శరీరత్యాగ మాత్రేణ" అనుపదములోని "మాత్రా" శబ్దము ఏవ కారార్థకము.

శ్లో. విప్రోషితకుమారం త ద్రాజ్య మస్తమితేశ్వరమ్,
రంధ్రాన్వేషణదక్షాణాం ద్విషా మామిషతాం యయౌ. 11

వ్యాఖ్య : విప్రోషితకుమారం-దూరముగావెళ్ళిపోయిన కుమారులుగలదియు, అస్తమితేశ్వరం-చనిపోయిన రాజుగలదియు నగు, తత్, రాజ్యం-ఆ అయోధ్యా రాజ్యము, రంధ్రాన్వేషణదక్షాణాం-రంధ్ర-లోపములను, అన్వేషణ-వెదకుటయందు, దక్షాణాం-సమర్థులైన, ద్విషాం-శత్రువులకు, ఆమిషతాం-భోగ్యవస్తుత్వమును, యయౌ-పొందెను; రామలక్ష్మణు లరణ్యమునందును, భరతశత్రుఘ్నులు మేన మామయింటను నుండుటచేత రాజకుమారులులేనిదియు, దశరథమరణముచేత రాజులేని దియు నగు నయోధ్యారాజ్యము రంధ్రాన్వేషణ తత్పరులైన శత్రురాజుల వశము కాకుండె నని భావము. ఆమిష మనఁగా మాంసము, భోగ్యవస్తువు నర్థములు.

శ్లో. అథానాథాః ప్రకృతయో మాతృబంధునివాసినమ్,
మౌలై రనాయయామాసు ర్భరతం స్తంభితాశ్రుభిః. 12

వ్యాఖ్య : అథ-ఆతరువాత, అనాథాః-ప్రభువు లేనివారగు, ప్రకృతయః-అమాత్యులు, మాతృబంధునివాసినం-తల్లికి చుట్టములైన మేనమామ మొదలగు వారితో నివసించుచున్న, భరతం-భరతుని, స్తంభితాశ్రుభిః-బిగబట్టుకోఁబడిన కన్నీళ్ళుగల, మౌలైః-ఆప్తులైన సచివులచేత, ఆనాయయామాసుః-రప్పించిరి "ప్రకృతిః సహజే యోనా వమాత్యే పరమాత్మని" అను విశ్వనిఘంటువు వలన ప్రకృతులనఁగా అమాత్యులు. మేనమామ యింటిలో నుంటున్న భరతుని అప్తులగు ముఖ్య సచివులచేత రప్పించిరి. వెళ్ళినవారు దశరథమరణ, రామవనవాసవార్తను చెప్పి శోకింపరాదనియు నాదేశించిరి. అగ్రజుఁడగు రాముఁ డరణ్యమున నుండుట చేత, తదనుజుఁడైన భరతుఁడు దశరథుని యంత్యక్రియలు చేసి, రాజ్యపట్టాభి షేకము నొందవలసినవాఁ డగుటచేత నతనిని రప్పించిరని భావము.

శ్లో. శ్రుత్వా తథావిధం మృత్యుం కైకేయీతనయః పితుః,
మాతు ర్న కేవలం స్వస్యాః శ్రియోఽ
ప్యాసీత్ పరాఙ్ముఖః. 13

వ్యాఖ్య: కైకేయీతనయః—భరతుఁడు, పితుః—తండ్రియొక్క, తథావిధం—అట్టిది యగు (రామవనవాసమును గోరిన తన తల్లియే కారణమైనది యగు), మృత్యుం-మరణమును, శ్రుత్వా-విని, స్వస్యాః, మాతుః, కేవలం, న-తన తల్లికిమాత్రమేకాక, శ్రియః, అపి-రాజ్యలక్ష్మికిఁగూడ, పరాఙ్ముఖః- పెడమొగముపెట్టినవాఁడు, ఆసీత్-అయ్యెను. అట్లు మాతులగృహమునుండి అయోధ్యకు వచ్చినపిమ్మట పితృమరణ, రామవనవాసములు కైకేయీమూలకములని యెఱిఁగిన భరతుఁడు తన తల్లి ముఖమును జూచుటకును, రాజ్యలక్ష్మి నంగీకరించుటకును ఏవగింపుగలవాఁడై బాధ పడెనని భావము. మిక్కిలి కోపము, దుఃఖము గలవాఁడయ్యెను.

శ్లో. సససైన్య శ్చాన్వగా ద్రామం దర్శితా నాశ్రమాలయైః,
తస్య పశ్యన్ ససౌమిత్రే రుదశ్రు ర్వసతిద్రుమాన్. 14

వ్యాఖ్య: ససైన్యః-సైన్యసమేతుఁడైన భరతుఁడు, ఆశ్రమాలయైః-ఆశ్రమములే యింట్లుగాఁగల వనవాసులచేత, దర్శితాన్-చూపఁబడినట్టి, ససౌమిత్రేః-లక్ష్మణసహితుఁడగు, తస్య-శ్రీరామునియొక్క, వసతిద్రుమాన్-నివాసవృక్షములను, పశ్యన్-చూచుచు, ఉదశ్రుః-కన్నీరు గారుచున్నవాఁడగుచు, రామం-శ్రీరాముని, అన్వగాత్-చేరెను (అను+అగాత్) సైన్యసమేతుఁడై భరతుఁడు, ఆశ్రమవాసుల చేత "అదిగో ఆవృక్షములక్రింద నున్నాడు" అని చూపఁబడిన రాముని నివాస వృక్షములను జూచి యేడ్చుచు రాముని వద్దికి వెళ్ళెను. ఇచ్చట "ససైన్యః" అను విశేషణము భరతుని యాత్మరక్షణము కొఱకుఁ గాదనియు, సీతారాముల కరణ్య మున నెట్టియాపదలు వచ్చెనో! వచ్చునో! యన్న భావముచేతనే యనియు గ్రహింప వలయును.

శ్లో. చిత్రకూట వనస్థం చ కథితస్వర్గతి ర్గురోః,
లక్ష్మ్యా నిమంత్రయాంచక్రే త మనుచ్ఛిష్టసంపదా. 15

వ్యాఖ్య: చిత్రకూటవనస్థం-చిత్రకూట పర్వతారణ్య మందున్న, తం చ-ఆరామునిని, గురోః-తమతండ్రియైన దశరథునియొక్క, కథితస్వర్గతిః- చెప్ప బడిన మరణము కలవాఁడగుచు (భరతుఁడు), అనుచ్ఛిష్టసంపదా-అనుభవింపఁ బడని గుణోత్కర్షగల, లక్ష్మ్యా-రాజ్యలక్ష్మిచేత, నిమంత్రయాంచక్రే-ఆహ్వానిం చెను. అన్నయా! మనతండ్రి మరణించినాఁడు, నేనెంతమాత్రమును రాజ్యసుఖము

లను దాఁకలేదు, నీ వా రాజ్యలక్ష్మినిఁ జేపట్టుటకు రమ్ము. అని భరతుఁడు చిత్రకూటమునందు వానప్రస్థధర్మమును నిర్వర్తించుచున్న రాముని వెనుకకు రమ్మని పిలిచెను. ఇచ్చటి "సంపత్" శబ్దమునకు గుణోత్కర్ష యని అర్థము. "సంపద్భూతౌ గుణోత్కర్షే" అని కేశవ నిఘంటువు.

శ్లో. స హి ప్రథమజే తస్మి న్నకృతశ్రీపరిగ్రహే,
పరివేత్తార మాత్మానాం మేనే స్వీకరణా ద్భువః. 16

వ్యాఖ్య : సః, హి- ఆ భరతుఁడేమో, ప్రథమజే-అగ్రజుడైన, తస్మిన్-ఆతఁడు (రాముఁడు), అకృత శ్రీపరిగ్రహే(సతి)-స్వీకరింపఁబడని రాజ్యశ్రీ పరిగ్రహము గలవాఁ డగుచుండఁగా, భువః-భూమియొక్క, స్వీకరణాత్-స్వీకారము వలన, ఆత్మానం-తనను, పరివేత్తారం-పరివేత్తనుగా, మేనే-తలఁచెను. రాముఁడు రాజ్యలక్ష్మి పరిగ్రహమును జేయకున్నప్పుడు తాను చేయుట, అన్నకు వివాహము కాకముందే తమ్ముఁడు పెండ్లియాడుట వంటి దగునని భరతుఁడు తలఁచెను. భూపరిగ్రహము కూడ దార పరిగ్రహము వంటిదే యని యతని భావము. "పరివేత్త" యనఁగా నగ్రజునికంటె ముందు వివాహమును జేసుకొన్నవాఁడు.

శ్లో. త మశక్య మపాక్రష్టుం నిదేశాత్ స్వర్గిణః పితుః,
యయాచే పాదుకే పశ్చాత్ కర్తుం రాజ్యాధిదేవతే. 17

వ్యాఖ్య : స్వర్గిణః-స్వర్గస్థుఁడైన, పితుః-తండ్రియొక్క, నిదేశాత్-ఆజ్ఞ వలన, అపాక్రష్టుం-ఇంటికి మరల్చుటకు, అశక్యం-సాధ్యపడని, తం-ఆ రాముని, పశ్చాత్-ఎంతగానో బ్రతిమాలుకొన్న పిమ్మట, రాజ్యాధిదేవతే-రాజ్యప్రభువులనుగా, కర్తుం-చేయుటకు, పాదుకే-రామపాదుకలను, యయాచే-యాచించెను, పితాజ్ఞాపాలనమునందు దృఢవ్రతుఁడై యున్న రాముని మరల్చుట సాధ్యపడక పోగా నతని పాదుకలను సింహాసనమున నుంచుట కిమ్మని యాచించెనని భావము.

శ్లో. స విసృష్ట స్తథేత్యుక్త్వా భ్రాత్రా నైవావిశత్ పురీం,
నందిగ్రామగత స్తస్య రాజ్యం న్యాస మివాభునక్. 18

వ్యాఖ్య : సః-భరతుఁడు, భ్రాత్రా-అన్నగారిచేత, తథా, ఇతి, ఉక్త్వా-అట్లే యగుఁగాక యని బదులు పలికి, విసృష్టః (సన్)-వెనుకకు పంపఁబడిన వాఁడ

గుచు, పురీం-అయోధ్యానగరమును, నావిశదేవ (న + ఆవిశత్ + ఏవ) ప్రవేశింపనే లేదు. (కింతు-అయితే) నందిగ్రామగతః-నందిగ్రామమును జేరినవా , తస్య, రాజ్యం-ఆ రామునియొక్క రాజ్యమును, న్యాసం, ఇవ-తనవద్ద దాచి వస్తువును వలె, అభుంక్-పాలించెను తాను రాజభోగముల ననుభవింపక మరల నప్పగింప వలసిన వస్తువుగా భావించి రాజ్యపాలనముఁ జేసెను. న్యాసమనఁగా నితరులు తనవద్ద దాచియుంచిన నిక్షేపము. "అభునక్" అను పరస్మైపదిక్రియ అట్టి యర్థ మును బోధించును. తా ననుభవింపలేదని భావము.

శ్లో. దృఢభక్తి రితి జ్యేష్ఠే రాజ్యతృష్ణాపరాఙ్ముఖః,
మాతుః పాపస్య భరతః ప్రాయశ్చిత్త మి వాకరోత్. 19

వ్యాఖ్య : జ్యేష్ఠే-అగ్రజుఁడగు రామునియందు, దృఢభక్తిః-అచంచలమైన భక్తిగలవాఁడును, రాజ్యతృష్ణాపరాఙ్ముఖః-రాజ్య-రాజ్యమునందలి, తృష్ణా-ఆశకు, పరాఙ్ముఖః-విముఖుఁడగు, భరతః-భరతుఁడు, ఇతి-ఇట్లు (పూర్వోక్తప్రవర్తనము చేత) మాతుః-తల్లియొక్క, పాపస్య-పాపమునకు, ప్రాయశ్చిత్తం-నివర్తన కర్మను అకరోత్, ఇవ-చేసెనో! యనునట్లుండెను తనతల్లి చేసిన పాపమునకు ప్రాయ శ్చిత్తాచరణమా! యనునట్లు రాజ్యకాంక్షను వదలి భరతుఁడు నందిగ్రామమున వసించెను. "దృఢభక్తిః" అనుచోట దృఢా భక్తిః యస్య సః అని విగ్రహమును జెప్పినచో "స్త్రియాః పుంవత్"ఇత్యాదిసూత్రమువలన "అప్రియాదిషు" అని నిషేధ ముంటుటచేత, పుంవద్భావము రాఁజాల దనియు, దృఢం భక్తి రస్య అని నపుంసక పూర్వపద బహువ్రీహిని చెప్పినప్పుడే "దృఢ భక్తిః" అన్నది సాధు వగు ననియు మల్లినాథుఁడు నిర్వచించెను. విస్తరభీతిచే నితరమగు చర్చ యుపేక్షింపఁ బడినది

శ్లో. రామోఽపి సహ వైదేహ్యా వనే వన్యేన వర్తయన్,
చచార సానుజః శాంతో వృద్ధేక్ష్వాకువ్రతం యువా. 20

వ్యాఖ్య : సానుజః-తమ్ముఁడగు లక్ష్మణునితో గూడినవాఁడును, శాంతః-ఇంద్రియనిగ్రహము గలవాఁడునునగు, రామోఽపి (రామః, అపి)-రాముఁడును, వైదేహ్యా, సహ-సీతతోఁగూడ, వనే-అరణ్యమునందు, వన్యేన-వనమునందు పుట్టిన కందమూలాదికముచేత, వర్తయన్-జీవనమును నడపుచు, వృద్ధేక్ష్వాకువ్రతం-వృద్ధ

లగు ఇక్ష్వాకువంశీయులు చేయు వాన ప్రస్థ వ్రతమును, యువా-యువకుఁడయ్యు, చచార-ఆచరించెను రాముఁడు తనతోపాటు సీతాలక్ష్మణులను సైతము కాషాయ వస్త్రధారణ, కందమూలఫలాశనములచేత వాన ప్రస్థధర్మము నాచరింపఁజేసెను. యువకుఁడై నను శాంతవర్తనము గలవాఁడయ్యె నని భావము.

శ్లో. ప్రభావ స్తంభితచ్ఛాయ మాశ్రితః స వనస్పతిమ్,
కదాచి దంకే సీతాయాః శిశ్యే కించి దివ శ్రమాత్. 21

వ్యాఖ్య : సః-రాముఁడు, కదాచిత్-ఒకానొకప్పుడు, ప్రభావ స్తంభిత చ్ఛాయం—ప్రభావ-తనవిస్తృతిచేత, స్తంభిత-ఆపియుంచఁబడిన, ఛాయం-నీడ గల, వనస్పతిం-ఒకమహావృక్షమును, ఆశ్రితః సన్-ఆశ్రయించినవాఁడగుచు, కించిత్, శ్రమాత్, ఇవ-కొంచెె మలసటవల్లనో యేమొ, సీతాయాః-సీతాదేవియొక్క అంకే-తొడపైన, శిశ్యే-నిద్రించెను ఒక మహావృక్షము తనవిస్తృతిచేత ప్రాక్ప శ్చిమములనుండి వచ్చు నెండను మధ్యభాగమునకు సోకనీయక చల్లఁదనము నిచ్చు చుండగా, నొకప్పు డలసటఁ జెందిన రాముఁడు సీతతొడపైఁ దలనుంచి నిద్రించెను. ప్రభావ మనగా సత్త, స్థితి అని యర్థము.

శ్లో. ఐంద్రిః కిల నఖై స్తస్యా విదదార స్తనౌ ద్విజః,
ప్రియోపభోగచిహ్నేషు పౌరోభాగ్య మి వాచరన్. 22

వ్యాఖ్య : ఐంద్రిః-ఇంద్రపుత్రుఁడగు, ద్విజః-పక్షి (కాకము), తస్యాః-ఆసీతాదేవియొక్క. స్తనౌ-స్తనములను, ప్రియోపభోగచిహ్నేషు-పూర్వము రామునిచే నుంచఁబడిన నఖక్షతముల మచ్చలయందు, పౌరోభాగ్యం-కఠినాలింగన దోష విఘాతమును, ఆచరన్, ఇవ-చేయుచున్నదివలె, నఖైః-కాలిగోళ్ళచేత, విద దార, కిల-చీల్చినదట. రాముఁ డీసీత స్తనముల నింతగా యనుభవింపవలెనా? యను నసూయచేత కాకము వానినిఁ జీల్చెనని భావము. అది దేవతావరమునొందిన దుష్ట కాకముగనుక నట్లు చేసెను.

శ్లో. తస్మి న్నాస్థ దిషీకాస్త్రం రామో రామావబోధితః,
ఆత్మానం ముముచే తస్మా దేకనేత్రవ్యయేన సః. 23

వ్యాఖ్య : రామావబోధితః-సీతచేత మేల్కొల్పఁబడిన, రామః-శ్రీరాముఁడు, తస్మిన్-ఆకాకిపైన, ఇషీకాస్త్రం-రెల్లుగడ్డి బాణమును, అస్యత్-పడవేసెను, సః-ఆకాకము, ఏకనేత్రవ్యయేన-ఒకకంటి వినాశముచేత, తస్మాత్-ఆరెల్లు బాణమునుండి, ఆత్మానం-తనను, ముముచే-విడిపించుకొనెను. "అస్యత్" ఇది "అసు క్షేపణే" యనుధాతువునకు లఙ్ రూపము. సీతచే నిద్ర మేల్కొల్పఁబడిన రాముఁడు రెల్లుగడ్డిని బాణముగా మంత్రించి కాకముపై వేయఁగా, నది తట్టుకొనలేక శరణు వేడఁగా బాణప్రయోగము వృథాయగుటకు వీలులేనందున ఒకకంటిని మాత్రము హరించి కాకమును విడిచె నని భావము రామా యనఁగా స్త్రీ. "సుందరీ రమణీ రామా" యని అమరము.

శ్లో. రామ స్త్వాసన్న దేశత్వా ద్భరతాగమనం పునః,
ఆశం క్యోత్సుకసారంగాం చిత్రకూటస్థలీం జహౌ. 24

వ్యాఖ్య : రామః-శ్రీరాముఁడు, ఆసన్నదేశత్వాత్-అయోధ్యకు సమీప ప్రదేశ మగుటవలన, పునః-మరల, భరతాగమనం-భరతునియొక్క రాకను, ఆశంక్య-అనుమానించి, ఉత్సుకసారంగాం-ఉత్కంఠితములైన లేళ్ళుగల, చిత్రకూటస్థలీం-చిత్రకూటపర్వత ప్రాంతమును, జహౌ-వదలివెళ్లెను. తమనివాస మయోధ్యకు దగ్గరలోనుండుటచేత భరతుఁడు మరలవచ్చి ప్రతిమాలుకొనునేమో! యను సంశయమువలన, అచ్చటిలేళ్ళు మచ్చికపడియున్నందున తమను విడవలేక బాధపడుచున్నప్పటికిని విధిలేక చిత్రకూట ప్రాంతమును రాముఁడు విడిచివెళ్లెనని భావము.

శ్లో. ప్రయయా వాతిథేయేషు వసన్ ఋషికులేషు సః,
దక్షిణాం దిశ మృక్షేషు వార్షికే ష్వివ భాస్కరః. 25

వ్యాఖ్య : సః-ఆరాముఁడు, ఆతిథేయేషు-చక్కనిఅతిథిసత్కారములుచేయునట్టి, ఋషికులేషు-ఋష్యాశ్రమములందు, వార్షికేషు-వర్షాకాలమునందలి, ఋక్షేషు-నక్షత్రములు, లేదా రాసులయందు, భాస్కరః ఇవ-సూర్యుఁడువలె, వసన్-నివసించుచు, దక్షిణాం, దిశం-దక్షిణదిక్కును గురించి (దక్షిణమునకు), ప్రయయౌ-వెళ్లిపోయెను. భాస్కరుఁడనఁగా వెలుతురునిచ్చు సూర్యుఁడు, వర్షాకాలమునందలి రాసులలోనుండి జనుల కానందమును గూర్చుట దక్షిణాయనమున జరుఁగును. అట్లే

రాముఁ డా శ్రమవాసులకు రాక్షసబాధను దొలఁగించుచు నానందమును గూర్చుచు దక్షిణదిక్కునకుఁ బ్రయాణము సాగించెను భాస్కరోపమాన మర్థవంతమై యున్నది

శ్లో. బభౌ త మనుగచ్ఛంతీ విదేహాధిపతేః సుతా,
ప్రతిషిద్ధాపి కైకేయ్యా లక్ష్మీ రివ గుణోన్ముఖీ. 26

వ్యాఖ్య : తం-ఆరాముని, అనుగచ్ఛంతీ-వెంబడించుచున్న, విదేహాధిపతేః, సుతా-విదేహదేశాధిపతియగు జనకునియొక్క కూతురగు సీత, కైకేయ్యా-కైకేయి చేత, ప్రతిషిద్ధా, అపి-నివారింపబడినదైనను, గుణోన్ముఖీ (గుణ + ఉన్ముఖీ)-సద్గుణములయం దభిలాష గల, లక్ష్మీః, ఇవ-రాజ్యలక్ష్మివలె, బభౌ-ప్రకాశించెను. రామునివెంట వెళ్ళుచున్న సీత, కైక వద్దని యడ్డగించినను గుణానురక్తయైన రాజ్యలక్ష్మి రాముని వెంటఁబడి వచ్చుచున్నదా! యనునట్లు భాసించె నని భావము

శ్లో. అనసూయాతిసృష్టేన పుణ్యగంధేన కాననమ్,
సా చకారాంగరాగేణ పుష్పోచ్చలిత షట్పదమ్. 27

వ్యాఖ్య : సా-ఆ సీత, అనసూయాతిసృష్టేన—అనసూయా-అత్రిముని భార్యయగు అనసూయచేత. అతిసృష్టేన-ఇయ్యఁబడిన, పుణ్యగంధేన-పవిత్రమైన సువాసనగల, అంగరాగేణ-మైపూతచేత, కాననం-అరణ్యమును, పుష్పోచ్చలిత షట్పదం-పుష్ప-పువ్వులనుండి, ఉచ్చలిత-పైకిలేచిన, షట్పదం-తుమ్మెదలు గల దానిని, చకార-చేసెను. సీతారామలక్ష్మణులు అత్రిమహాముని యాశ్రమమునకుఁ జేరఁగా నచ్చట వారికి జరిగిన యతిథిసత్కారములో, ననసూయాదేవి సీతకిచ్చిన మంచి గంధము నామె శరీరముపైఁ బూసికొనఁగా, నాపరిమళముచేత వనపుష్పముల పైనున్న తుమ్మెద లాకర్షింపఁబడినవి. కాననమంతయు నాసుగంధముచే నిండి పోయినది. ముత్తైదువలకుఁ జేయుపూజ పసుపు, కుంకుమ, గంధములతోనే కనుక సీత ననసూయ అట్లు పూజించినదని భావము.

శ్లో. సంధ్యాభ్రకపిశ స్తస్య విరాధో నామ రాక్షసః,
అతిష్ఠ న్మార్గ మావృత్య రామ స్యేందో రివ గ్రహః. 28

వ్యాఖ్య : సంధ్యాభ్రకపిశః— సంధ్యాభ్ర-సంధ్యాసమయమునందలి మేఘమువలె, కపిశః-నలుపును ఎఱుపును గలిసిన రంగుగలవాఁడై, విరాధః, నామ-విరాధుఁడని పేరువడసిన, రాక్షసః-రాక్షసుఁడు, గ్రహః-రాహుగ్రహము, ఇందోః, ఇవ-చంద్రునియొక్క-వలె, తస్య, రామస్య-ఆ రామునియొక్క, మార్గం-దారిని, ఆవృత్య-అడ్డగించి, అతిష్ఠత్-నిలిచెను. గ్రహణకాలమున రాహువు చంద్రుని నడ్డగించినట్లు భయంకర స్వరూపుఁ డగు విరాధుఁడను రాక్షసుఁడు రాముని దారి నడ్డగించి నిలిచెను.

శ్లో. స జహార తయో ర్మధ్యే మైథిలీం లోకశోషణః,
నభోనభస్యయో ర్వృష్టి మవగ్రహ ఇవాంతరే. 29

వ్యాఖ్య : లోకశోషణః-లోకమునకు బాధకుఁడైన, సః-ఆ రాక్షసుఁడు, తయోః-వారి ఇరువురియొక్క (రామలక్ష్మణులయొక్క) మధ్యే-నడుమనున్న, మైథిలీం-సీతను, నభో నభస్యయోః-శ్రావణ భాద్రపద మాసములయొక్క, అంతరే-మధ్య భాగమునందలి, వృష్టిం-వర్షమును, అవగ్రహః, ఇవ-వర్ష ప్రతిబంధమువలె (కఱవు వలె), జహార-అపహరించెను. వృష్టిశబ్దము స్త్రీలింగము కావున సీత కుపమానముగాఁ జెప్పఁబడినది. శ్రావణ భాద్రపదముల మధ్యన తప్పకయుండు వృష్టిని అవగ్రహము అపహరించినట్లు రామలక్ష్మణులమధ్య నున్న సీతను విరాధుఁ డెత్తుకపోయెను. శ్రావణభాద్రపదముల లోకోపకారకత్వము, అవగ్రహముయొక్క లోకవిరోధిత్వము రామలక్ష్మణ విరాధులకు సాధారణ ధర్మముగా స్వీకరించుటవలన ఉపమాలంకారము బాగున్నది. "వృష్టి ర్వర్షం, తద్విఘాతే ఒవగ్రహావగ్రహౌ సమౌ" అని యమరము.

శ్లో. తం వినిష్పిష్య కాకుత్స్థౌ పురా దూషయతి స్థలీమ్,
గంధే నాశుచినా చేతి వసుధాయాం నిచఖ్నతుః. 30

వ్యాఖ్య : కాకుత్స్థౌ-కకుత్స్థుని వంశమునఁ బుట్టిన రామలక్ష్మణులు, తం-ఆ విరాధుని, వినిష్పిష్య-పిండి చంపి, అశుచినా-అపవిత్రమైన, గంధేన-వాసనచేత, స్థలీం-ఆశ్రమ భూమిని, పురా దూషయతి, ఇతి-తప్పక చెడఁగొట్టఁగలఁడని, వసుధాయాం-భూమిలోపల, నిచఖ్నతుః, చ-త్రవ్వి పాతిపెట్టిరి కూడాను. మహావీరులగు రామలక్ష్మణులు ఆ విరాధునిఁ బట్టి నలిపి, కొట్టి, చంపి వాని శరీర దుర్గం

ధముచేత ఆశ్రమ ప్రాంతము కళ్మలమైపోవుట తప్పదని తలంచి యా శరీరమును నేలలో పాతిపెట్టిరి "కకుత్స్థస్య గోత్రాపత్యం పుమాంసౌ కాకుత్స్థౌ" అని వ్యుత్పత్తి. కకుత్స్థుని వంశమునందు బుట్టిన పురుషులని యర్థము. "పురా దూషయతి" దూషయిష్యతి అను భవిష్యదర్థక క్రియకు బదులు 'పురా' అను నిపాతతోఁ జేర్చిన వర్తమానార్థక క్రియ ఇది. తప్పక చెడఁగొట్టగలదని యర్థము. "యావత్పురా నిపాతయోర్లట్" అని పాణిని సూత్రమువలన నీ ప్రయోగము సాధువు.

శ్లో. పంచవట్యాం తతో రామః శాసనా త్కుంభజన్మనః,
అనపోఢస్థితి స్తస్థౌ వింధ్యాద్రిః ప్రకృతా వివ. 31

వ్యాఖ్య : తతః-ఆ విరాధవధయైన పిమ్మట, రామః-రాముఁడు, కుంభజన్మనః-అగస్త్యునియొక్క, శాసనాత్-ఆజ్ఞవలన, పంచవట్యాం-పంచవటియందు, వింధ్యాద్రిః-వింధ్య పర్వతము, ప్రకృతౌ, ఇవ-పూర్వస్థితియందువలె, అనపోఢస్థితిః-అనతిక్రాంత మర్యాదగలవాఁడై, తస్థౌ-నిలిచెను. అగస్త్యముని వింధ్య పర్వతమునకు గురువు, రామునికి కులగురువు. కనుక నాముని యాజ్ఞ వలన పూర్వము వింధ్య కదలక నిలుచున్నట్లు రాముఁడు పంచవటికిఁజేరి యచ్చటినుండి మరియొక యాశ్రమమునకు వెళ్ళక యచ్చటనే స్థిరనివాసమును బర్ణశాలయందేర్పరచుకొనెను. "పంచవటి" యనఁగా నైదు మఱ్ఱిచెట్ల గుంపు. "పంచానాం వటానాం సమాహారః-పంచవటీ" అని విగ్రహము ఇది ద్విగు సమాసము. "ద్విగోః" అను సూత్రముచేత "ఈ" కారమును, "ద్విగు రేకవచనమ్" అని యేకవచనమును వచ్చినవి "పంచవట్యాం" అనునది సప్తమీ విభక్త్యేక వచనాంతము.

శ్లో. రావణావరజా తత్ర రాఘవం మదనాతురా,
అభిపేదే నిదాఘార్తా వ్యాలీవ మలయద్రుమమ్. 32

వ్యాఖ్య : తత్ర-ఆ పంచవటియందు, మదనాతురా-సంభోగవాంఛచేత త్వరపడుచున్న, రావణావరజా (రావణ + అవరజా)-రావణాసురుని చెల్లెలగు శూర్పణఖ, రాఘవం-శ్రీరాముని, నిదాఘార్తా-ఎండవేడిమికిఁ దట్టుకొనలేని, వ్యాలీ-ఆడు సర్పము, మలయద్రుమం, ఇవ-చందన వృక్షమునువలె, అభిపేదే-వచ్చి చేరెను. పంచవటియం దొకనాఁడు రావణుని చెల్లెలగు శూర్పణఖ మదనబాధతో రామునిఁ

జేరి "నన్ను భోగింపుమని కోరెను. అది యెట్లున్న దనఁగా నొక ఆడునాగుబాము వేసవితాపముచే నలిగి శ్రీగంధము చెట్టువద్దికి ఆలింగనమునకై వచ్చినట్లున్నదట. ఉపమాలంకారము. "వ్యాలీ" అను నుపమానము శూర్పణఖకు,మలయద్రుమ మన్న యుపమానము రామునికిని చాలా చక్కఁగా నున్నవి. ఇట్లే ప్రతిచోటను గల యుపమాన స్వారస్యమును జదువరు లూహించుకొన్నచోఁ గాళిదాసు ప్రతిభ బోధ పడఁగలదు.

శ్లో. సా సీతాసన్నిధా వేవ తం వవ్రే కథితాన్వయా,
అత్యారూఢో హి నారీణా మకాలజ్ఞో మనోభవః. 33

వ్యాఖ్య : సా—ఆ శూర్పణఖ, సీతాసన్నిధౌ, ఏవ-సీతయొక్క సమక్షము నందే, కథితాన్వయా-చెప్పఁబడిన తన వంశము గలది యగుచు, తం-రాముని, వవ్రే-వరించెను. అత్యారూఢః-మిక్కిలి హెచ్చిపోయిన, నారీణాం, మనోభవః-స్త్రీలయొక్క కామవికారము, అకాలజ్ఞః, హి—సమయమును గుర్తించునది కాదుగదా! శూర్పణఖ సీతయెదుటనే రాముని బలవంతపెట్టి తనను పెండ్లాడు మన్నది. —కుఁ గామవికారము మిక్కిలి హెచ్చినప్పుడు కాలము యొక్కయు కులగోత్రముల యొక్కయు, పరుసవాని యొక్కయు, ఔచిత్యమును గుర్తింపదుగదా. నిచో సీత యున్నదని సిగ్గుపడక శూర్పణఖ కోరుట యెట్లు? శాస, చిత్రాంగి మొద లయిన వారి తెగకుఁ జెందిన యూహు వారే కనుక కవి యిట్టి లోకోక్తినిఁ గూర్చెను.
అలంకారము : అర్థాంతరన్యాసము.

శ్లో. కళత్రవా నహం బాలే! కనీయాంసం భజస్వ మే,
ఇతి రామో వృషస్యంతీం వృషస్కంధః శశాస తామ్. 34

వ్యాఖ్య : వృషస్కంధః-వృషభముయొక్క మూపురమువంటి భుజ శిరస్సులుగల, రామః-రాముఁడు, వృషస్యంతీం-కాముకియగు, తాం-ఆ శూర్ప ణఖను, హే బాలే!-అమ్మాయీ! అహం—నేను, కళత్రవాన్-భార్యతో నున్నాను, మే-నాయొక్క, కనీయాంసం-కనిష్ఠుఁడగు తమ్ముని, భజస్వ-సేవింపుము. ఇతి-ఇట్లని, శశాస-ఆజ్ఞాపించెను. రాముఁడు, కాముకి యగు శూర్పణఖతో 'అమ్మాయీ! నేను భార్యావంతుఁడనై యున్నాను. నాకంటే చిన్నవాఁడగు నా తమ్మునిఁ

గామింపు మని చెప్పెను. "వృషః సా ద్వాసవే ధర్మే సౌరభేయే చ శుక్రలే, పుం రాశిభేదయోః శృంగ్యాం మూషక శ్రే యో రపి" అను విశ్వనిఘంటువు వలన నిచ్చట "వృషః" అనఁగా సమర్థుఁడు. పురుషుఁడని యర్థము. "వృషం అత్మార్థం ఇచ్ఛతీతి" వృషస్యంతీ అని వ్యుత్పత్తి. "వృషస్యంతీ తు కాముకీ" అని యమరము.

శ్లో. జ్యేష్ఠాభిగమనాత్ పూర్వం తేనా ప్యనభినందితా,
సాభూత్ రామాశ్రయా భూయో నదీ వోభయ
కూలభాక్. 35

వ్యాఖ్య : జ్యేష్ఠాభిగమనాత్, పూర్వం-పెద్దవాఁడగు రాముని యొద్దికి వెళ్ళుటకు ముందే, తేన, అపి-ఆ లక్ష్మణునిచేతఁగూడ, అనభినందితా-మెప్పులేక నిరాకరింపఁబడినదై, భూయః-మరల మరల, రామాశ్రయా-రాముని నాశ్రయించుచున్న, సా-ఆ శూర్పణఖ, ఉభయకూలభాక్-రెండు గట్టులను జేరుచున్న, నదీవ-నదివలె, అభూత్-ఉండెను. రాముని వద్దికి వచ్చుటకు ముందే లక్ష్మణునిచేత నిరాకరింపఁబడి యుండుటచేత మిక్కిలి కరుణాళుఁడైన రామునినే యా శయించుచున్న శూర్పణఖ, ఇటునుంచి అటు, అటునుంచి యిటుఁ దిరుగుచు, శ్రమపడుచు, ఉభయతీరములను జేరుచు, నురుగులు గ్రక్కుచున్న యొక నదివలె నుండెనట.

శ్లో. సంరంభం మైథిలీహాసః క్షణసౌమ్యాం నినాయ తామ్,
నివాతస్తిమితాం వేలాం చంద్రోదయ ఇవోదధేః. 36

వ్యాఖ్య : మైథిలీహాసః-సీతాదేవి నవ్వు, క్షణసౌమ్యాం—క్షణం-స్వల్పకాలము, సౌమ్యాం-శాంతాకారముతోఁ నుండిన, తాం-ఆశూర్పణఖను, నివాతస్తిమితాం-గాలిలేకపోవుటచేత నిశ్చలముగానుండిన, ఉదధేః, వేలాం-సముద్రముయొక్క తీరజలరేఖను (చెలియలికట్టను), చంద్రోదయః, ఇవ-చంద్రోదయమువలె, సంరంభం-సంక్షోభమును, నినాయ-పొందించెను. యాతాయాతములచేత రామలక్ష్మణులను ప్రేమింపుఁడని ప్రతిమాలుచున్న శూర్పణఖను జూచి సీత నవ్వినది. ఆ నవ్వు, చంద్రోదయము సముద్రతీరమునకు ఉల్లోలకల్లోలములు గాలివచ్చినప్పుడు గలిగించునట్లు, ఆ రాక్షసికి క్షణకాలము శాంతమైయున్న స్వాంతమున సంక్షోభమును రేపి కోపముఁ దెప్పించె నని భావము "మైథిలీహాసః తాం సంరంభం నినాయ" అని

ద్వికర్మకక ర్తరి ప్రయోగము. ఉపమాలంకారము. కాళిదాసు ఉపమానములన్నియు ఉపమేయగుణాధిక్యమును సంతరించునవే కనుక భావసౌందర్య మూహించుకొన వలయును.

శ్లో. ఫల మస్యోపహాసస్య సద్యః ప్రాప్స్యసి పశ్య మామ్,
మృగ్యాః పరిభవో వ్యాఘ్ర్యా మిత్యవేహి త్వయా
కృతమ్. 37

వ్యాఖ్య : అస్య, ఉపహాసస్య-ఈ వెక్కిరింపునవ్వునకు, ఫలం-ఫలమును, సద్యః-ఇప్పుడే, ప్రాప్స్యసి-పొందఁగలవు, మాం, పశ్య-నన్నుఁజూడు, త్వయా-నీచేత, కృతం-చేయఁబడిన పనిని, వ్యాఘ్ర్యాం-ఆడుపులి విషయమున, మృగ్యాః-ఆడులేడియొక్క (ఆడులేడి చేసినట్టి), పరిభవః, ఇతి-అవమానమని, అవేహి-తెలిసికొనుము. క్రోధమూర్ఛిత యగు శూర్పణఖ సీతను జూచి, నీవు చేసిన యుప హాసమునకుఁ దగినఫల మిప్పుడే యనుభవింతువు, ఇది లేడి పులిని పరిహసించుట వంటిదని యెఱుఁగుము. అని,

శ్లో. ఇత్యుక్త్వా మైథిలీం భర్తు రంకే నివిశతీం భయాత్,
రూపం శూర్పణఖా నామ్నః సదృశం ప్రత్యపద్యత. 38

వ్యాఖ్య : భయాత్-భయమువలన, భర్తుః-భర్తయొక్క, అంకే-తొడమీద, నివిశతీం-కూర్చొనుచున్న, మైథిలీం-సీతను, ఇతి, ఉక్త్వా-వెనుకయన్నట్లు పలికి, బెదిరించి, శూర్పణఖా-శూర్పణఖ, నామ్నః-తన పేరునకు, సదృశం-తగిన, రూపం-ఆకారమును, ప్రత్యపద్యత-పొందెను. (చూపెనని యర్థము) రాక్షసిపలుకు లకు బెదిరి సీత భర్త తొడపైనిఁ జేరుచుండగా నిదిగో! చూడుమని శూర్పణఖ తన పేరునకుఁ దగిన రూపమును ప్రదర్శించెను. అనఁగా చేటలంత గోళ్ళుగలది యని "శూర్పణఖా" శబ్దార్థము కనుక, అంతటి గోళ్ళు, వాటికిఁదగిన వ్రేళ్ళు, చేతులు, కాళ్ళు, ముఖము మొదలగు నవయవములతో భయంకరాకారమును జూపెనని భావము. శూర్ప + నఖ-శూర్పణఖ "రషాభ్యాం నోణః సమానపదే" అనుపాణిని సూత్రముచేత ఏకపదమునందు రేఫషకారముల తరువాతనున్న "న" కారమునకు "ణ" కారము వచ్చినది. "ప" కారము మధ్యలోనున్నను వచ్చును.

శ్లో. లక్ష్మణః ప్రథమం శ్రుత్వా కోకిలామంజువాదినీమ్,
శివాఘోరస్వనాం పశ్చాత్ బుబుధే వికృతేతి తామ్. 39

వ్యాఖ్య : లక్ష్మణః-లక్ష్మణుఁడు, ప్రథమం-మొదట, కోకిలామంజువాదినీం-కోకిలవలె మనోహరముగాఁ బలికినదియు. పశ్చాత్-పిమ్మట, శివాఘోరస్వనాం-నక్కవలె భయంకరమగు కంఠస్వరముగలదియు నగు, తాం-ఆ శూర్పణఖను. శ్రుత్వా-విని, వికృతా, ఇతి-మాయావిని యని, బుబుధే-తెలిసికొనెను. మొదట మధురముగాఁ గోకిలవలె సంభాషించి పిమ్మట నక్కవలె కర్ణకఠోరముగా భాషించిన శూర్పణఖ మాయావిని యగు రాక్షసి యని లక్ష్మణుఁడు గుర్తించెను.

శ్లో. పర్ణశాలా మథ క్షిప్రం వికృష్టాసిః ప్రవిశ్య సః,
వైరూప్యపౌనరుక్త్యేన భీషణాం తా మయోజయత్. 40

వ్యాఖ్య : అథ-అట్లు గుర్తించిన వెంటనే, సః-ఆ లక్ష్మణుఁడు, వికృష్టాసిః-దూసిన ఖడ్గము గలవాఁడగుచు, క్షిప్రం-వేగముగా, పర్ణశాలాం-పర్ణశాలను, ప్రవిశ్య-ప్రవేశించి, భీషణాం-భయంకర రూపముగల, తాం-ఆ శూర్పణఖను, వైరూప్యపౌనరుక్త్యేన-వైరూప్య-వికార రూపముయొక్క, పౌనరుక్త్యేన-ద్విగుణత్వముచేత, అయోజయత్-కూర్చెను. సీతారాములకుఁ గొంచెము దూరమున నున్న లక్ష్మణుఁడు తమ ప్రేమభిక్షకై వచ్చిన స్త్రీ యొక సుందరాంగి కాక మాయావిని యగు నొక రాక్షసి యని స్వరముచేత గుర్తించిన వెంటనే, రామలక్ష్మణుల కెట్టి కీడును జేయునో! యన్న భావముచేత ఖడ్గపాణియై, శీఘ్రముగాఁ బర్ణశాలకు జేరి. యప్పటి భయంకర రూపముతోనున్న శూర్పణఖయొక్క ముక్కు, చెవులను, ఛేదించి. మొదటనే వికృతరూపముతోనున్న దాని నింకను వికృత రూపిణిగాఁ జేసెనని భావము. వైరూప్యపౌనరుక్త్య మనగా విరూపముయొక్క పునరుక్తి, రెండుసార్లు వైరూప్యమును (వైరూప్యము+వైరూప్యము) పొందుట. అనఁగా రెట్టింత వైగుణ్యమని యర్థము.

శ్లో. సా వక్రనఖధారిణ్యా వేణుకర్కశపర్వయా,
అంకుశాకారయాంగుల్యా తా వతర్జయ దంబరే. 41

వ్యాఖ్య : సా-ఆ శూర్పణఖ, వక్రనఖధారిణ్యా-వంకరలు తిరిగిన గోటిని ధరించినదియు, వేణుకర్కశపర్వయా-వేణు-వెదురుకఱ్ఱవలె, కర్కశపర్వయా-కఠినములగు గనుపులు కలదియు నగుటచేతనే, అంకుశాకారయా-అంకుశమను ఆయుధమువంటి యాకారముగల, అంగుళ్యా-వ్రేలిచేత, తౌ-ఆ రామలక్ష్మణులను, అంబరే (స్థితా)-ఆకసమున నిల్చుని, అతర్జయత్-బెదరించెను. లక్ష్మణునిచేత ముక్కుచెవులు కోయఁబడిన శూర్పణఖ క్రుద్ధురాలై, వంకర తిరిగిన గోరు, కర్కశములైన గనుపులు గల తన తర్జని వ్రేలితో రామలక్ష్మణులను చూడండి! మిమ్ము నేమిచేయుదునో! యని యాకసమున నిల్చి బెదిరించెను.

శ్లో. ప్రాప్య చాశు జనస్థానం ఖరాదిభ్య స్తథావిధం,
రామోపక్రమ మాచఖ్యౌ రక్షఃపరిభవం నవమ్. 42

వ్యాఖ్య : ఆశు-వెంటనే, జనస్థానం-రాక్షస జననివాసమును, ప్రాప్య-చేరి, ఖరాదిభ్యః-ఖరాసురుడు మొదలగు వారికి, తథావిధం-అట్టిది యగు (తన యవయవములను నరుకుట వంటి), రామోపక్రమం-రాముని దుష్కార్యారంభమును, నవం-క్రొత్తదియగు, రక్షఃపరిభవం-రాక్షసుల నవమానించుటను, ఆచఖ్యౌ, చ-చెప్పివేసెనుగూడ. శూర్పణఖ వెంటనే జనస్థానమునకుఁ జేరి, తన యవయవచ్ఛేదము జేయుటకు రాముడే పూనుకొనుట యనెడు నూతన రాక్షసావమానమును ఖరదూషణాదులకుఁ జెప్పి వారికిఁ గోపము వచ్చునట్లు చేసినదని భావము.

శ్లో. ముఖావయవలూనాం తాం నైర్ఋతా యత్పురో దధుః,
రామాభియాయినాం తేషాం తదే వాభూ దమంగళమ్. 43

వ్యాఖ్య : నైర్ఋతాః-రాక్షసులు, ముఖావయవలూనాం-ముఖావయవములగు నాసికాకర్ణములయందు ఛేదింపఁబడిన, తాం-ఆ శూర్పణఖను, పురః-ముందర, దధుః ఇతి యత్-ఉంచుకొని రనుట యేది కలదో, తదేవ (తత్+ఏవ)-అదియే, రామాభియాయినాం-రామునిపైకి యుద్ధమునకు వెళ్ళునట్టి, తేషాం-ఆ రాక్షసులకు, అమంగళం-అశుభము, అభూత్-అయ్యెను. ముక్కు చెవులు తెగిన దానిని ముందు పెట్టుకొని రామునిపైకి యుద్ధమునకువెళ్ళిన ఖరదూషణాదుల కదే యపశకునముగా పరిణమించెనని భావము.

శ్లో. ఉదాయుధా నాపతత స్తాన్ దృప్తాన్ ప్రేక్ష్య రాఘవః,
నిదధే విజయాశంసాం చాపే సీతాం చ లక్ష్మణే. 44

వ్యాఖ్య : ఉదాయుధాన్-ఎత్తబడిన మారణాయుధములు గలవారును, ఆపతతః-తనమీదికి వచ్చుచున్నవారును, దృప్తాన్-గర్వితులైయున్న, తాన్-ఆ ఖరదూషణాది రాక్షసులను, ప్రేక్ష్య-పరికించి చూచి, రాఘవః-శ్రీరాముఁడు, చాపే-ధనుస్సునందు, విజయాశంసాం-విజయమునుయొక్క ఆశను, లక్ష్మణే-లక్ష్మణునియందు, సీతాం చ-సీతను, నిదధే-ఉంచెను. గర్వితులై తన పైకి వచ్చుచున్న రాక్షసులను జూచి, సీతారక్షణమునందు లక్ష్మణుని నియోగించి రాముఁడు యుద్ధసన్నద్ధుఁ డయ్యెనని భావము.

శ్లో. ఏకో దాశరథిః కామం యాతుధానాః సహస్రశః,
తే తు యావంత ఏవాజౌ తావాంశ్చ దదృశే స తైః. 45

వ్యాఖ్య: దాశరథిః-రాముఁడు, ఏకః-ఒకఁడే యాతుధానాః-రాక్షసులు, కామం-మిక్కుటముగా, సహస్రశః-వేలకువేలు, తైః, తు-ఆరాక్షసులచేతనై తే సః-ఆరాముఁడు, ఆజౌ-యుద్ధమునందు, తే, యావంతః, ఏవ-ఆరాక్షసులు ఎంత సంఖ్యతో నుండిరో, తావాంశ్చ (తావాన్ + చ)-అంతసంఖ్యగలవాఁడుగా, దదృశే-కనఁబడెను. నిజమునకు రాముఁ డొక్కడు, రాక్షసులు వేలకొలఁదిగాను నుండిరి. కాని రాక్షసులకు యుద్ధరంగమున తామెంద రుండిరో అంత సంఖ్యలో రాములు కనఁబడిరి. అనఁగా ప్రతిరాక్షసునితోను బాణ ప్రతిబాణములు వేయుచు రాముఁడు యుద్ధము చేసెనని భావము.

శ్లో. అసజ్జనేన కాకుత్స్థః ప్రయుక్త మథ దూషణమ్,
న చక్షమే శుభాచారః స దూషణ మి వాత్మనః. 46

వ్యాఖ్య: అథ-తరువాత, శుభాచారః-యుద్ధమున నియమము తప్పనివాఁడై న (మంచినడవడికలవాఁడని యర్థాంతరము), సః కాకుత్స్థః-కకుత్స్థ వంశీయుఁడగు ఆరాముఁడు, అసజ్జనేన-దుర్జనులగు రాక్షస జనముచేత, ప్రయుక్తం-పంపఁబడిన (ఉచ్చరింపఁబడిన యని యర్థాంతరము) దూషణం-దూషణుఁడను రాక్షసుని ఆత్మనః-తనయొక్క, దూషణం, ఇవ-దోషవచనమువలె, న, చక్షమే-సహింప

లేదు. సత్ప్రవర్తనగల వ్యక్తి దుష్టజనముచేత నిందింపబడిన తన దోషమును వలె రాముడు రాక్షసజనముచేత తనపైకిఁబంపఁబడిన దూషణుఁడను రాక్షసుని ప్రతి ఘటనమును సహింపలేదు, అనగా వానినిఁ జంపుటకుఁ బూనెనని భావము.

శ్లో. తం శరైః ప్రతిజగ్రాహ ఖరత్రిశిరసౌ చ సః,
క్రమశ స్తే పున స్తస్య చాపా త్సమ మివోద్యయుః. 47

వ్యాఖ్య: సః-రాముఁడు, తం-ఆ దూషణుని, ఖరత్రిశిరసౌ, చ-ఖరాసుర, త్రిశిరోఽసురులను సైతము, ప్రతిజగ్రాహ-ఎదురుకొట్టెను. క్రమశః (ప్రయుక్తా అపి)-ఒకదానివెనుక నొకటిగా విడువబడినవే అయినప్పటికిని, తస్య-ఆరాముని యొక్క, తే, పునః-ఆబాణములేమో, చాపాత్-రామ ధనుస్సునుండి, సమం, ఇవ-ఏకకాలమునందు వలె, ఉద్యయుః-ఎగిరిపోయినవి. అనగా రాముఁడు వరుసగా దూషణ, ఖర, త్రిశిరసులపైకి విడిచినప్పటికిని ఆబాణము లొకేసారి ధనుస్సునుండి బయలుదేరినట్లు చూపరుల కగపడినవట! అట్టి హస్తలాఘవముతో రాముడా రాక్షసులను ముగ్గురిని ప్రతిఘటించెనని భావము.

శ్లో. తై స్త్రయాణాం శితై ర్బాణై ర్యథాపూర్వవిశుద్ధిభిః,
ఆయు ర్దేహాతిగైః పీతం, రుధిరం తు పతత్రిభిః. 48

వ్యాఖ్య: దేహాతిగైః-దేహములను భేదించి వెళ్ళినవియు, యథాపూర్వ విశుద్ధిభిః-యథాపూర్వ-ప్రయోగించుటకుముందున్న, విశుద్ధిభిః-నైర్మల్యముగల, శితైః-తీక్ష్ణములైన, తైః, బాణైః-ఆరామబాణములచేత, త్రయాణాం-ముగ్గురియొక్క (ఖర, దూషణ, త్రిశిరోసురులయొక్క), ఆయుః-ఆయుష్యము, పీతం-త్రాగబడినది. రుధిరం తు-రక్తమేమో, పతత్రిభిః-గ్రద్దలు మొదలగు పక్షులచేత, పీతం-త్రాగఁబడినది. రాముఁడు ప్రయోగించిన మూడుబాణములు, తీక్ష్ణములై వేగాతిశయముచేత ఆముగ్గురు రాక్షసుల శరీరములు దూఱి, మరల నెప్పటివలె నునఁగా రక్తసిక్తములు గాక, వారి ప్రాణములను మాత్రము హరించినవనియు, ఆరాక్షస దేహములనుండి కారుచున్న రక్తమును కాకులు, గద్దలు మొదలగు పక్షులు త్రాగిన వనియు భావము.

శ్లో. తస్మిన్ రామశరోత్కృత్తే బలే మహతి రక్షసామ్,
ఉత్థితం దదృశేఽన్యచ్చ కబంధేభ్యో న కించన. 49

వ్యాఖ్య: తస్మిన్-ఆ, రామశరోత్కృత్తే-రామబాణములచేత ఛేదింపఁబడిన, మహతి-గొప్పదియగు, రక్షసాం, బలే-రాక్షసులయొక్క సైన్యమునందు, ఉత్థితం-లేచినిల్చున్నది, కబంధేభ్యః-మొండెములకంటె, అన్యత్-మరియొకటి యైనది, కించన-ఏదియును, న దదృశే-కనఁబడలేదు. అట్లు రామబాణ హతమైన ఆరాక్షస సైన్యమునందు లేచి నిల్చున్నవి రాక్షల మొండెములు తప్ప మరియే ప్రాణులు లేకుండెను. తండోపతండములుగా వచ్చిన రాక్షససైన్యము రామునిచేత నిశ్శేషముగాఁ జంపఁబడినదని భావము. "కబంధ" మనఁగా ప్రాణముండి తల తెగిన శరీరము.

శ్లో. సా బాణవర్షిణం రామం యోధయిత్వా సురద్విషాం,
అప్రబోధాయ సుష్వాప గృధ్రచ్ఛాయే వరూథినీ. 50

వ్యాఖ్య: సా, సురద్విషాం, వరూథినీ-ఆరాక్షసులయొక్క సైన్యము, బాణ వర్షిణం-శరవర్షమును గురిపించునట్టి, రామం-రాముని, యోధయిత్వా-యుద్ధము చేయించి, గృధ్రచ్ఛాయే-గ్రద్దతెక్కల నీడయందు, అప్రబోధాయ - మరల మేల్కొనకుండుటకై, సుష్వాప-నిద్రించెను (దీర్ఘనిద్రపోయెను). అట్లు రాక్షససేన తానై రామునికిఁ గోపమును తెప్పించి యతని బాణ వర్షముచేతఁ బ్రాణములు గోల్పోయి గ్రద్దతెక్కల నీడలో దీర్ఘనిద్రపోయెను. అనఁగా మరణించెనని భావము.

శ్లో. రాఘవాస్త్రవిదీర్ణానాం రావణం ప్రతి రక్షసామ్,
తేషాం శూర్పణఖైవైకా దుష్ప్రవృత్తిహరాఽభవత్. 51

వ్యాఖ్య: ఏకా-ఒకతెయగు, శూర్పణఖా, ఏవ-శూర్పణఖమాత్రమే, రావణం, ప్రతి-రావణుని గురించి, రాఘవాస్త్ర విదీర్ణానాం-రామబాణములచేత చీల్చఁబడిన (చచ్చిన), తేషాం, రక్షసాం-ఖరాదిరాక్షసులయొక్క, దుష్ప్రవృత్తిహరా-దుర్మరణవార్తను తీసుకవెళ్ళవలసినదై, అభవత్-అయ్యెను, ఖరదూషణాదిరాక్షసుల మరణవార్తను రావణునికిఁ జెప్పుట కొక్క శూర్పణఖ మాత్రమే మిగిలియుండె ననియు రాక్షసు లందరును రామబాణములచేత హతులైరనియు భావము. శూర్ప + నఖా శూర్పణఖా "పూర్వపదాత్సంజ్ఞాయాం" అను సూత్రముచేత 'నఖ' శబ్దము నందలి 'న' కారమునకు "ణ" కారము రాగా, "నఖముఖాత్సంజ్ఞాయామ్" అను

సూత్రముచేత్ "ఙీష్" కునిషేధ మొండుటవలన, "శూర్పణఖీ" యని ఈకారాంతము కాక "శూర్పణఖా" యని ఆకారాంతశబ్దమైనది శూర్పణఖ వెళ్ళి రావణునికి రాముడు తనకుఁ జేసిన యవమానమును, ఖరదూషణాదుల మరణమును, చెప్పెనని గ్రహింపవలయును.

శ్లో. నిగ్రహా త్స్వసు రాప్తానాం వధాచ్చ ధనదానుజః,
రామేణ నిహితం మేనే పదం దశసు మూర్ధసు. 52

వ్యాఖ్య: స్వసుః-చెల్లెలగు శూర్పణఖయొక్క,నిగ్రహాత్-కర్ణనాసికాచ్ఛేదము వల్లను, ఆప్తానాం-బంధువులగు ఖరదూషణాదులయొక్క, వధాచ్చ-వధవల్లను, ధనదానుజః-కుబేరుని తమ్ముడగు రావణుఁడు, రామేణ-శ్రీరామునిచేత, దశసు, మూర్ధసు-తన పది తలల మీదను, పదం-పాదమును. నిహితం-ఉంచఁబడినదిగా, మేనే-తలఁచెను. తన చెల్లెలి ముక్కు చెవులు కోయుటవల్లను, తన బంధువులు ఖరాదులను జంపుటవల్లను, రాముఁడు తన పది తలలపైన పాదమునుంచి యవమానించినట్లు భావించి క్రుద్ధుఁడయ్యె నని భావము. రామాయణ కథాభాగమును సంగ్రహించి వ్రాయుచున్న యీద్వాదశసర్గమునందు కాళిదాసు తనకు మహాకవి వాల్మీకిపైఁ గల ఎనలేని భక్తిభావమును ప్రకటించుటకో! యనునట్లు కథను అతి క్లుప్తముగా సంగ్రహించుటకుఁ బూనెనుగాని నేను సమితము రామకథను వ్రాయుదు ననికాని, వాల్మీకి కంటే అతిశయించి వ్రాయుదు ననిగాని తలఁచినట్లు లేదు. అందుకే ఆదిలోనే "మందః కవియశః ప్రార్థీ గమిష్యా మ్యుపహాస్యతామ్" అని యనెను. ఇచ్చటి కవి శబ్దమునకు వాల్మీకియే యర్థము. మందుఁడనైన నేను వాల్మీకి కీర్తినిఁ గోరినట్టయితే నలుగురు నవ్విపోవుదు రని యాశ్లోకభావము. కనుక రఘువంశవృక్ష చరిత్రలో వచ్చుటచేత కాళిదాసు రామకథను తాకెను గాని లేనిచోఁ దాకువాఁడుగాఁడని మనము గ్రహింపవలెను. ఆయనకు వాల్మీకిపై నపారమైన భక్తియున్నది. వాల్మీకిని మించి రామకథను నడుపఁజాల నన్న భయము గూడ నున్నది.

శ్లో. రక్షసా మృగరూపేణ వంచయిత్వా స రాఘవౌ,
జహార సీతాం పక్షీంద్రప్రయాసక్షణ విఘ్నితః. 53

వ్యాఖ్య : సః-అట్లు క్రుద్ధుఁడైన రావణుఁడు, మృగరూపేణ-బంగారులేడి రూపమును ధరించిన, రక్షసా-మారీచునిచేత, రాఘవౌ-రామలక్ష్మణులను, వంచ

యిత్వా-మోసగించి, పక్షీంద్ర ప్రయాస క్షణ విఘ్నితః—పక్షీంద్ర-జటాయువు యొక్క, ప్రయాస-యుద్ధరూపమైన శ్రమచేత, క్షణ-కొలదికాలము, విఘ్నితః-విఘ్నముగలవాఁ డగుచు, సీతాం-సీతాదేవిని, జహార-అపహరించుకొని వెళ్ళెను. రామాయణకథా భాగసంగ్రహరూపమైన యీశ్లోకమునందు, శూర్పణఖ రావణుని రెచ్చఁగొట్టుటచేత నతఁడు క్రుద్ధుడై, మారీచుని తనవాక్చాతుర్య తర్జనములచేత లొంగదీసి బంగరులేడినిఁ జేసుకొని, పంచవటికివచ్చి బంగరులేడిపై సీతకు అభి లాషను గలిగించి తన్మూలముగా రామలక్ష్మణులను దూరముగాఁ పంపి, బ్రాహ్మణ వేషమున భిక్షనుగోరి సమీపమునకు వచ్చిన సీతను పట్టుకొని వెళ్ళుచు దారిలో జటాయువు ఎదుర్కొనఁగా నతని ఱెక్కలు ఛేదించి కొంచమాలస్యముగా సీతను లంకకుఁ జేర్చుకొనె నన్న భావము వెల్లడియగుచున్నది.

శ్లో. తౌ సీతాన్వేషిణౌ గృధ్రం లూనపక్ష మపశ్యతామ్,
ప్రాణై ర్దశరథప్రీతే రనృణం కంఠవర్తిభిః. 54

వ్యాఖ్య : సీతాన్వేషిణౌ-సీతనువెదకుచు వెళ్ళిన, తౌ-ఆ రామలక్ష్మణులు, లూనపక్షం-ఛేదింపఁబడిన ఱెక్కలుగలదియు, కంఠవర్తిభిః-కంఠమునందున్న, ప్రాణైః-ప్రాణములచేత, దశరథప్రీతేః-దశరథస్నేహమునకు, అనృణం-ఋణము తీర్చుకొనినదియునగు, గృధ్రం-జటాయువను గ్రద్దను, అపశ్యతాం-చూచిరి. సీతకై యరణ్యమున వెదకుచుఁ దిరుగుచున్న రామలక్ష్మణులు, ఱెక్కలు తెగి, కంఠ మునఁ బ్రాణముల నిలుపుకొని, తమకు సీతను రావణుఁ డెత్తుకొనిపోయినవార్తను జెప్పి, దశరథుని సఖ్యమునకు ఋణముఁ దీర్చుకొన్న జటాయువును జూచిరి.

శ్లో. స రావణహృతాం తాభ్యాం వచసాఽఽచష్ట మైథిలీం,
ఆత్మనః సుమహత్కర్మ వ్రణై రావేద్య సంస్థితః. 55

వ్యాఖ్య : సః-అట్లు కంఠగతప్రాణుఁడై యున్న జటాయువు, రావణ హృతాం-రావణునిచేత అపహరింపఁబడిన, మైథిలీం-సీతను గుఱించి, తాభ్యాం-ఆ రామలక్ష్మణులకు (షష్ఠీ విభక్త్యర్థమున చతుర్థీ విభక్తి), వచసా-మాటచేత, ఆచష్ట—చెప్పెను. ఆత్మనః-తనయొక్క, సుమహత్-మిక్కిలి గొప్పదియగు, కర్మ-యుద్ధరూపమైన ప్రయత్నమును, వ్రణైః-తన శరీరమునకుఁ దగిలిన గాయముల చేత, ఆవేద్య-తెలిపి, సంస్థితః-మరణించెను.సీతను రావణుఁ డెత్తుకపోయిన వార్తను

మాత్రము వాక్కుతోఁ జెప్పి, తాను ప్రతిఘటించిన రావణయుద్ధ వివరములను జెప్పుటకు శక్తిచాలక, గాయములచేతనే రామలక్ష్మణులు గ్రహించునట్లు చేసి జటాయువు మరణించెనని భావము. సంస్థితః—"సమ్" అను ఉపసర్గతో జేరిన "స్థా" ధాతువునకు మరణము అర్థము కనుక ఆ యర్థముననే "సంస్థిత" శబ్దమును ప్రయోగించెను.

శ్లో. తయో స్తస్మి న్నవీభూత పితృవ్యాపత్తి శోకయోః,
పితరీ వాగ్నిసంస్కారాత్ పరా వవృతిరే క్రియాః. 56

వ్యాఖ్య : నవీభూత పితృవ్యాపత్తి శోకయోః—నవీభూత-మరల క్రొత్తదిగామారిన, పితృవ్యాపత్తి-తండ్రి మరణము వలని, శోకయోః- దుఃఖము గలిగిన, తయోః-ఆరామలక్ష్మణులయొక్క, తస్మిన్-ఆజటాయువునందు, పితరి, ఇవ-తండ్రియందువలె, అగ్నిసంస్కారాత్-అగ్నిసంస్కారమునుండి, పరాః క్రియాః-ఉత్తరక్రియలు, వవృతిరే-జరిగినవి. అట్లు మరణించిన జటాయువును జూచి మరల పితృమరణదుఃఖము ననుభవించుచున్న రామలక్ష్మణులు ఆ జటాయువునకు అగ్నిసంస్కారము మొదలు తర్పణాంతము లగు ఔర్ధ్వదైహిక క్రియలను తమ తండ్రికి చేసినట్లు చేసిరని భావము. అనాథ ప్రేత సంస్కారము కోటి యజ్ఞతుల్యము గనుక రాముఁ డట్లు చేసెను. వ్యాపత్తి అనగా మరణము.

శ్లో. వధ నిర్ధూతశాపస్య కబంధ స్యోపదేశతః,
ముమూర్ఛ సంఖ్యం రామస్య సమానవ్యసనే హరౌ. 57

వ్యాఖ్య : వధనిర్ధూతశాపస్య—వధ-రామకృతమైన వధచేత, నిర్ధూత-తొలఁగింపఁబడిన, శాపస్య-శాపముగలిగి స్వర్గమునుజేరిన, కబంధస్య-కబంధుఁడను రాక్షసునియొక్క, ఉపదేశతః-ఉపదేశమువలన, రామస్య-రామునికి, సమాన వ్యసనే-తనకు సమానమైన ఆపదగల, హరౌ-కపియగు సుగ్రీవునియందు, సఖ్యం-స్నేహము, ముమూర్ఛ-వృద్ధిచెందెను. కబంధరాక్షసుఁడు రామబాణ నిహతిచేత శాపముతొలఁగి దేవత్వమును పొంది రామునికి సుగ్రీవునితో సఖ్యముఁజేసినచో నీ కార్యము సిద్ధించునని చెప్పెను. ఆ కారణమువల్లనే రాముఁడు తనవలెనే భార్యను పోగొట్టుకున్న సుగ్రీవునితో మైత్రినిఁ బెంచుకొనెను. "ఉపదేశ" మనఁగా తెలియని విషయమును చెలుపుట (అజ్ఞాత జ్ఞాపన ముపదేశః) "మూర్ఛా-మోహస

మున్ప్రియయోః" అనుటవలన మూర్ఛధాతువునకు తెలివిలేక పడిపోవుటయు, అభివృద్ధియు నర్థములు. ఇచ్చట అభివృద్ధ్యర్థకము.

శ్లో. స హత్వా వాలినం వీర స్తత్పదే చిరకాంక్షితే,

ధాతోః స్థాన ఇవాదేశం సుగ్రీవం సంన్యవేశయత్. 58

వ్యాఖ్య : వీరః-వీరుఁడైన, సః-ఆరాముఁడు, వాలినం-వాలిని, హత్వా-చంపి, చిరకాంక్షితే-బహుకాలమునుండి కోరఁబడిన, తత్పదే-ఆవాలి స్థానమునందు, ధాతోః, స్థానే, ఆదేశం, ఇవ-ధాతువుయొక్క స్థానమున ఆదేశధాతువును వలె, సుగ్రీవం-సుగ్రీవుని, సంన్యవేశయత్-స్థాపించెను. హనుమద్దర్శన, సుగ్రీవసఖ్య ప్రభృతి కార్యములు జరిగిన పిమ్మట మహావీరుఁడైన రాముఁడు వాలినిఁజంపి యతని స్థానమున అతఁగా కపిరాజ్యమునందు సుగ్రీవునిపట్టాభిషేకమును జరిపించె నని భావము. అది ధాతుస్థానమున వచ్చిన ఆదేశము (మరియొకధాతువు)వలెనున్న దట. అస్తే ర్భూః" అని అస్తిధాతుస్థానమునం దాదేశముగా వచ్చిన "భూ" ధాతువు అసధాతురూపములనన్నిటిని పొందును. అట్లే సుగ్రీవుడు వాలి సర్వస్వమున కధిపతియై, తారాదిపరిగ్రహణముఁ జేసెనని వ్యంగ్యార్థము.

శ్లో. ఇత స్తత శ్చ వైదేహీ మన్వేష్టుం భర్తృచోదితాః,

కపయ శ్చేరు రార్తస్య రామ స్యేవ మనోరథాః. 59

వ్యాఖ్య: వైదేహీం-సీతను, అన్వేష్టుం-వెదకుటకు, భర్తృచోదితాః-తమ ప్రభువైన సుగ్రీవునిచేత ప్రోత్సహింపఁబడిన, కపయః-హనుమంతుడు మొదలగు వానరులు, ఆర్తస్య-సీతావిరహాతురుఁడగు, రామస్య-రామునియొక్క, మనోరథాః, ఇవ-కోరికలు, ఇత స్తతః-ఇటునటు నానావనప్రదేశములందు, చేరుః, చ-తిరిగిరి (వెదకి గూడ). సీతావిరహబాధ ననుభవించు రాముని కోరికలవలె సుగ్రీవుని యాజ్ఞచేత హనుమదాది కపీశ్వరులు వనప్రదేశములం దంతటను సీతను వెదకుచుఁ దిరిగిరి.

శ్లో. ప్రవృత్తా వుపలబ్ధాయాం తస్యాః సంపాతిదర్శనాత్

మారుతిః సాగరం తీర్ణః సంసార మివ నిర్మమః. 60

వ్యాఖ్య: సంపాతిదర్శనాత్-సంపాతియొక్క దర్శనమువలన, తస్యాః—సీత యొక్క, ప్రవృత్తౌ—వార్త, ఉపలబ్ధాయాం—తెలియఁబడినదికాగా, మారుతిః-హను మంతుఁడు, సాగరం—సముద్రమును, నిర్మమః—మమకారములేనివాఁడు, సంసారం, ఇవ-అవిద్యాబంధనమునువలె, తీర్ణః—దాటెను సీతాన్వేషణమున శ్రమపడుచున్న వానరులకు జటాయువు సోదరుఁడగు సంపాతి కనఁబడి, సీత లంకయందున్న విషయమును జెప్పఁగా, ఆంజనేయుఁడు లంకను జేరుటకై సముద్రమును దాటెను. అది, అవిద్యారూపమై జనన మరణ క్లేశముతోఁ గూడిన సంసారసాగరమును నిర్మముఁడు మమకారము లేనివాఁడు, దాటిన ట్లుండెనట. అంత దుస్తరమని భావము. "నిర్మమ" శబ్దమునందలి మమ యనునది మమతార్థకమగు అవ్యయము. "తీర్ణః" కర్త్రర్థక క్త ప్రత్యయాంతము గనుక దాటెను అని యర్థము. కార్మార్థకమైనప్పుడు దాటఁబడిన యను నర్థమున నుండును.

శ్లో. దృష్టా విచిన్వతా తేన లంకాయాం రాక్షసీవృతా,
జానకీ విషవల్లీభిః పరీతేవ మహౌషధిః. 61

వ్యాఖ్య: లంకాయాం-లంకయందు, విచిన్వతా-వెదకుచుండిన, తేన—ఆ హనుమంతునిచేత, రాక్షసీవృతా—రాక్షస స్త్రీలచేత చుట్టఁబడియుండిన, జానకీ-సీత, విషవల్లీభిః-విషపుఁదీగలచేత, పరీతా-చుట్టుకొనఁబడిన, మహౌషధిః, ఇవ-సంజీవి నీలతవలె, దృష్టా-చూడఁబడెను రావణ రాజధానియందు వెదకుచున్న హనుమంతు నికి విషలతలచేతఁ జుట్టఁబడిన సంజీవినీమహౌషధివలె, రాక్షసస్త్రీలచేత చుట్టఁబడి యుండిన జానకి కనఁబడెను.

శ్లో. తస్యై భర్తు రభిజ్ఞాన మంగుళీయం దదౌ కపిః,
ప్రత్యుద్గత మివానుష్ణై స్తదానందాశ్రుబిందుభిః. 62

వ్యాఖ్య: కపిః-హనుమంతుఁడు, భర్తుః-భర్తయగు రామునియొక్క, అభిజ్ఞానం-ఆనవాలుగానుండిన, అంగుళీయం-ఉంగరమును, తస్యై-అట్టుకినఁబడిన సీతకు, దదౌ-ఇచ్చెను. (ఆ యుంగరము) అనుష్ణైః-చల్లని, తదానందాశ్రు బిందుభిః-ఆ సీతాదేవియొక్క, ఆనందాశ్రుబిందువులచేత, ప్రత్యుద్గతం, ఇవ-ఎదురు కొనఁబడినట్లుండెను ఆంజనేయుఁడు సీతకు ఇది నాభర్తదే యనిగుర్తుపట్టుటకు వీలగు రామాంగుళీయకము నీయఁగా నామె యానందాశ్రుబిందువులు రాల్చుచు

సంతోషమును స్వీకరించెనని భావము. అభిజ్ఞాన మనఁగా ప్రత్యభిజ్ఞానసాధకము, ఆనవాలు అని యర్థము.

శ్లో. నిర్వాప్య ప్రియసందేశైః సీతా మక్షవధోద్ధతః,
స దదాహ పురీం లంకాం క్షణసోఢారినిగ్రహః. 63

వ్యాఖ్య : సః-ఆ హనుమంతుఁడు, ప్రియసందేశైః-భర్తయగు రాముని యొక్క సందేశవచనములచేత, సీతాం-సీతను, నిర్వాప్య-సంతోషపరచి, అక్షవధోద్ధతః-రావణకుమారుఁడు అక్షయునియొక్క వధచేత దర్పితుఁడగుచు, క్షణసోఢారినిగ్రహః—క్షణసోఢ-క్షణకాలము సహింపఁబడిన, అరినిగ్రహః-ఇంద్రజిత్కర్తృకమగు బ్రహ్మాస్త్రబంధరూపమైన బాధగలవాఁడై, లంకాం—లంకను, దదాహ-కాల్చివేసెను. హనుమంతుఁడు రామసందేశమును సీతకుఁ జెప్పి, అశోకవన భంజన, అక్షయకుమారవధలు చేసి, ఇంద్రజిత్తు బ్రహ్మాస్త్రముచేత బంధింపఁగా క్షణకాల మాబాధను సహించి పిమ్మట తన వాలము నంటించుటను రాక్షసకృతమైన యగ్నిచేతనే రావణరాజధానియగు లంకను భస్మీపటలముగాఁ జేసెను.

శ్లో. ప్రత్యభిజ్ఞానరత్నం చ రామా యాదర్శయత్ కృతీ,
హృదయం స్వయ మాయాతం వైదేహ్యా ఇవ
మూర్తిమత్. 64

వ్యాఖ్య : కృతీ-కృతకృత్యుఁడైన హనుమంతుఁడు, స్వయం, ఆయాతం-తనకుతానై వచ్చినదియగు, వైదేహ్యాః-సీతయొక్క, మూర్తిమత్-సాకారమైన, హృదయం, ఇవ-హృదయమును బోలియుండిన, ప్రత్యభిజ్ఞానరత్నం, చ-సీతదియగు చూడారత్నమును సైతము, రామాయ—రామునికి, ఆదర్శయత్-చూపెను. లంకాదహనముచేతఁ గృతకృత్యుఁడైన ఆంజనేయుఁడు ఒక వస్తురూపమునుబొంది తానై వచ్చిన సీత హృదయమా? యనఁదగిన చూడారత్నమును ప్రతిసందేశవాక్యరస్సరముగా రామున కిచ్చెను.

శ్లో. స ప్రాప హృదయన్యస్తమణిస్పర్శ నిమీలితః,
అపయోధర సంసర్గాం ప్రియాలింగన నిర్వృతిమ్. 65

వ్యాఖ్య : హృదయన్యస్త మణిస్పర్శ నిమీలితః-హృదయన్యస్త-వక్షస్థలమునం దుంచుకోఁబడిన, మణిస్పర్శ-ఆచూడారత్నము యొక్క స్పర్శచేత, నిమీలితః-ముకుళిత నేత్రములుగల. సః-ఆరాముడు, అపయోధరసంసర్గాం-స్తనస్పర్శ లేని, ప్రియాలింగననిర్వృతిం-ప్రియురాలి ఆలింగనముచేతఁ గలుగుసుఖమును, ప్రాప-పొందెను. హనుమంతుఁ డిచ్చిన సీతాచూడారత్నమును హృదయమునకు హత్తుకొనుటచేతఁ గలిగిన మోదాధిక్యముచేతఁ గన్నులు మూసికొన్న రామచంద్రుఁడు స్తనసంబంధములేని సీతాలింగనసంతోషమును బొందెను. ఈ యాలింగనమునకు సీతాస్తనస్పర్శలేకుండుటను "అపయోధరసంసర్గాం" అనువిశేషణముఁ దెలుపుచున్నది. దీనివలన రామునికి వనవాసకాలమున కామవాంఛ లేకుండెను. లేదా దుఃఖపరితప్తుఁడగు నతనికి సీతాలింగనము ఆమె పునర్దర్శన భాగ్యానందమాత్ర ఫలకము. లేదా రామవియోగముచేత సీత కృశించియున్నందున స్తనాభావము. మొదలగు నూహలను వ్యంగ్యభంగిచేత ఈ విశేషణము గలిగించుచున్నది.

శ్లో. శ్రుత్వా రామః ప్రియోదంతం మేనే తత్సంగమోత్సుకః,
మహార్ణవపరిక్షేపం లంకాయాః పరిఖాలఘుమ్. 66

వ్యాఖ్య: ప్రియోదంతం (ప్రియా + ఉదంతం)-ప్రియురాలియొక్క వార్తను శ్రుత్వా-విని, తత్సంగమోత్సుకః-ఆమెయొక్క సమాగమమునందు ఆతురతగల, రామః-రాముఁడు, లంకాయాః-లంకయొక్క, మహార్ణవపరిక్షేపం-మహాసముద్ర పరివేషమును, పరిఖాలఘుం-చిన్నయగడ్తచే చుట్టబడియుండుటనుగా, మేనే-తలఁచెను. ప్రియురాలివార్త తెలియఁగానే యామెను కలసికొనవలెనను త్వరగల రాముఁడు లంకాపట్టణము మహాసముద్రముచేత చుట్టబడియున్నను అది యొకచిన్న యగడ్తనడుమ నున్నట్టు భావించెను. అనఁగా మహాపరాక్రమవంతుఁడైన రామునికి సీతాదర్శనమునందలి యౌత్సుక్యముచేత లంకకుఁజేరుట యొకగొప్పపని కాదని తోచె నని భావము.

శ్లో. స ప్రతస్థే ఒరినాశాయ హరిసైన్యై రనుద్రుతః,
న కేవలం భువః పృష్ఠే వ్యోమ్ని సంబాధవర్తిభిః. 67

వ్యాఖ్య : కేవలం-ఒక, భువః, పృష్ఠే-భూతలము పైననే, న-కాదు, వ్యోమ్ని-ఆకాశమునందును, సంబాధ వర్తిభిః-చోటుచాలక యొకరినొకరు త్రోసి

కొని ఁడపఁబడ్న, హరిసైన్యైః—వానర సైన్యములచేత, అనుద్రుతః—అనుసరింపఁ బడుచున్నవాఁడగుచు. సః—రాముఁడు, అరినాశాయ—శత్రునాశముచేయుటకొరకు, ప్రతస్థే—బయలుదెరెను. సీతాన్వేషణ దర్శనానంతరము గమనస్ఫూర్తైన రాముఁడు శత్రువినాశనముకొఱకు బయలుదేరగా నతని వెంట కోట్లసంఖ్యగల సుగ్రీవాదివానరులు నేలను గ్రింగియుఁ బట్టక యొకరినొకరు రాచుకొనుచుఁ బడగెత్తిరని భావము.

శ్లో. నివిష్టముదధేః కూలే తం ప్రపేదే విభీషణః,

స్నేహాత్ రాక్షసలక్ష్మ్యేవ బుద్ధి మావిశ్య చోదితః. 68

వ్యాఖ్య : ఉదధేః-సముద్రముయొక్క, కూలే-తీరమునందు, నివిష్టం-కూర్చుండియున్న, తం-ఆ రాముని, విభీషణః-విభీషణుఁడు, రాక్షసలక్ష్మ్యా-రాక్షస రాజ్యలక్ష్మిచేత, స్నేహాత్-స్నేహమువలన, బుద్ధిం-బుద్ధిని, ఆవిశ్య- ప్రవేశించి, చోదితః, ఇవ-ప్రేరణచేయఁబడినవాఁడువలె, ప్రపేదే-చేరెను. సర్వవానరసైన్యముతో రాముఁడు సముద్రతీరమును జేరి కూర్చుని కర్తవ్యము నాలోచించు సమయమున రాక్షసరాజ్యలక్ష్మిచేత రాక్షసులయందలి ప్రేమవలనఁ బ్రోత్సహింపఁ బడినవాఁడు వలె రాముని ప్రార్థించుటకై విభీషణుఁడు వినమ్రభావముతో రాముని సన్నిధికి వచ్చెను "విశేషేణ భీషయతే శత్రూన్ ఇతి విభీషణః" అని విభీషణ శబ్ద వ్యుత్పత్తి. శత్రుభయంకరుఁడు అని యర్థము.

శ్లో. తస్మై నిశాచరైశ్వర్యం ప్రతిశుశ్రావ రాఘవః,

కాలే ఖలు సమారబ్ధాః ఫలం బధ్నంతి నీతయః. 69

వ్యాఖ్య : రాఘవః-రాముఁడు, తస్మై-అట్లువచ్చి యాశ్రయించిన విభీషణునికి, నిశాచరైశ్వర్యం-రాక్షసరాజ్యాధిపత్యమును, ప్రతిశుశ్రావ-ఇచ్చెదనని ప్రతిజ్ఞచేసెను (తథాహి—ఇదియు క్రమే) కాలే-సరియైన సమయమునందు, సమారబ్ధాః-ప్రారంభింపఁబడిన, నీతయః-యుక్తిప్రయత్నములు, ఫలం, బధ్నంతి ఖలు-ఫలమును జేకూర్చునుగదా! శ్రీరాముఁడు తనశరణాశ్రయింపవచ్చిన విభీషణునికి అభయము నిచ్చి లంకాధిపత్యము నొసఁగెదనని మాట యిచ్చెను. రాముఁడు జయించు నన్న నమ్మకముతో విభీషణుఁడు రావణకృతావమానమును భరింపలేక వచ్చి శరణువేఁడుటయు రాముఁ డతనిని విశ్వసించి రాక్షసరాజ్యలక్ష్మి నొసఁగెదనని ప్రతిజ్ఞచేయుటయు జరిగెను. సకాలమునఁ జేసిన రాజనీతి ప్రయోగము తప్పక

ఫలించును గనుక ఆ ప్రతిజ్ఞవలన విభీషణుఁడు రామభృత్యుఁడగుటయు నతనికి రాక్షసరాజ్యము లభించుటయు జరిగినవని భావము. అలంకారము: అర్థాంతర న్యాసము.

స సేతుం బంధయామాస ప్లవగై ర్లవణాంభసి
రసాతలా దివోన్మగ్నం శేషం స్వప్నాయ శార్ఙ్గిణః. 70

వ్యాఖ్య: సః-రాముఁడు, లవణాంభసి-లవణసముద్రమునందు, ప్లవగైః-వానరులచేత, శార్ఙ్గిణః-విష్ణువుయొక్క, స్వప్నాయ-శయనముకొఱకు, రసాతలాత్-పాతాళమునుండి, ఉన్మగ్నం-పైకిఁదేలిన, శేషం, ఇవ-ఆదిశేషునివలెనున్న, సేతుం-వంతెనను (వారధిని), బంధయామాస-కట్టించెను. రాముఁడు వానరులచేత సముద్రముపై సేతువును గట్టించెను. అది విష్ణువు శయనించుటకై పాతాళమునుండి జలోపరిభాగమునకు వచ్చిన ఆదిశేషుఁడా! యన్నట్లుండెనట. రాముఁడు విష్ణుమూర్తి యొక్క యవతారమేయగుటచేత సేతువునకు శేషోపమానము మిక్కిలి సమంజసముగా నున్నది. అలంకారము: ఉత్ప్రేక్ష.

శ్లో. తేనోత్తీర్య పథా లంకాం రోధయామాస పింగళైః
ద్వితీయం హేమప్రాకారం కుర్వద్భి రివ వానరైః. 71

వ్యాఖ్య: రాముఁడు, తేనపథా-ఆసేతుమార్గముచేత, ఉత్తీర్య-సాగరమును దాటి, పింగళైః-సువర్ణవర్ణముగలవారైనందున, ద్వితీయం-రెండవదియగు, హేమప్రాకారం-బంగారపుకోటను, కుర్వద్భిః, ఇవ-సిద్ధము చేయుచున్న వారివలెనున్న, వానరైః-కపులచేత, లంకాం-లంకాపట్టణమును, రోధయామాస-చుట్టును ముట్టడి చేయించెను. రాముఁడు సేతుమార్గమున సముద్రమునుదాటి వానరసైన్యములతో లంకను ముట్టడించెను. వానరులు పింగళవర్ణముగలవారగుటవలన వారు చుట్టును ఆక్రమింపఁగా లంక తనకు మొదటనున్న సువర్ణప్రాకారముతోపాటు రెండవ బంగారు కోటతో విలసిల్లినట్లుండెనట. "హేమప్రాకార" శబ్దమునందలి "మ" కారము రేఫ సంయుక్తాక్షరముకంటే ముందున్నందున, లఘువేకాని గురువుకాదు. అలం: ఉత్ప్రేక్ష.

శ్లో. రణః ప్రవవృతే తత్ర భీమః ప్లవగరక్షసామ్
దిగ్విజృంభిత కాకుత్స్థ పౌలస్త్య జయఘోషణః. 72

వ్యాఖ్య: తత్ర ఆలంకయందు, ప్లవగరక్షసాం-వానరులకును రాక్షసులకును, భీమః-భయంకరమైనదియు, దిగ్విజృంభిత కాకుత్స్థపౌలస్త్య జయఘోషణః— దిగ్విజృంభిత-దిక్కులకెగఁ బ్రాకిన, కాకుత్స్థపౌలస్త్య-రామరావణులయొక్క, జయఘోషణః-"జయ, జయ" యను నినాదములుగల, రణః-యుద్ధము, ప్రవవృతే-జరిగెను. లంకయందు "రామజయ! రామజయ!" అని యొకప్రక్కను, "రావణజయ! రావణజయ" అని యొకప్రక్కను బయలు వెడలుచున్న రామ రావణ జయనినాద ఘోషణముల వలన దిక్కులు పిక్కటిల్లఁగా వానర రాక్షసులకు భయంకరమైన యుద్ధము జరిగెను. "సమర, అనీక, రణ, కలహ, విగ్రహ" శబ్దములు పుంలింగములు.

శ్లో. పాదపావిద్ధపరిఘః శిలానిష్పిష్టముద్గరః
అతిశస్త్రనఖన్యాసః శైలరుగ్ణమతంగజః. 73

వ్యాఖ్య: ఆరణము, పాదపావిద్ధపరిఘః-వృక్షములచేత విరుగఁగొట్టబడిన యినుపముళ్ళ గదలుగలదిగను, శిలానిష్పిష్టముద్గరః-రాళ్ళచేత పిండిచేయఁబడిన ద్రుఘణములనబడు శూలములు గలదిగను, అతిశస్త్రనఖన్యాసః-ఖడ్గములను మించిన గోటిచీల్పులు గలదిగను, శైలరుగ్ణమతంగజః-కొండబండలు మీదఁబడుటచే చచ్చిన గజములు గలదిగను నుండెను. అనఁగా వానరులు వృక్షశిలానఖపాషాణ ఘాతములచేత రాక్షసుల శస్త్రాస్త్రములను త్రుంచి భయంకర యుద్ధమును గావించిరి.

శ్లో. అథ రామశిరశ్ఛేద దర్శనోద్భ్రాంత చేతనామ్
సీతాం మాయేతి శంసంతీ త్రిజటా సమజీవయత్. 74

వ్యాఖ్య: అథ-అనంతరం, రామశిరశ్ఛేద దర్శనోద్భ్రాంత చేతనాం— రామ-శ్రీరామునియొక్క, శిరశ్ఛేద-నఱుకఁబడినతలయొక్క, దర్శన-దర్శనముచేత, ఉద్భ్రాంతచేతనాం-ఎగిరిపోయిన చైతన్యముగలదియగు (మూర్ఛిల్లిన), సీతాం-సీతను, త్రిజటా-త్రిజటయను పేరుగల రాక్షస వనిత, మాయా, ఇతి-ఇదిమా

యాకల్పితమని, శంసంతీ-చెప్పుచున్నదియై, సమజీవయత్-బ్రతికించెను. విద్యు జ్జిహ్వుఁడను రాక్షసుఁడు సీతవద్దకివెళ్ళి రాముఁడు రావణునిచేఁ జంపఁబడెనని తన మాయచేత రాముని తలను జూపఁగా ఆరామశిరఃఖండమును జూచి సీత గత చేతనయై మూర్ఛిల్లినది. అప్పుడు త్రిజట "ఇది మాయాకల్పితము నిజముకాదు" అని సీతకుఁ జెప్పుచు, మూర్ఛఁదీర్చి బ్రతికించినదని భావము.

శ్లో. కామం జీవతి మే నాథ ఇతి సా విజహౌ శుచమ్
ప్రాఙ్మత్వా సత్య మస్యాంతం జీవితాస్మీతి లజ్జితా. 75

వ్యాఖ్య: సా–అట్లు బ్రతికిన సీత, మే, నాథః-నాథుఁడయిన రాముఁడు, జీవతి, ఇతి-బ్రతికియేయున్నాఁడను కారణము వలన, శుచం-శోకమును, కామం, విజహౌ-పూర్తిగా వదలిపెట్టెను. కాని, ప్రాక్-పూర్వము, అస్య-అతనియొక్క, అంతం-నాశమును, సత్యం, మత్వా-నిజమని తలఁచి, జీవితా, అస్మి, ఇతి-బ్రతికిన దాననైతినే యని, లజ్జితా- సిగ్గుపడినది. త్రిజటానవచనమువలన రాముఁడు జీవించియేయున్నాఁడని యెఱిఁగి సీత దుఃఖమును పూర్తిగా విడచినది. కాని మొదట రాముఁడు మరణించెనన్న వార్తను నమ్మి మరలఁ బ్రతికితినేయని సిగ్గుపడెను. ఆ మహావీరుని మరణమును నమ్ముటయు, మరలఁ బ్రదుకుటయు లజ్జకుఁగారణములు. దుఃఖము కన్నను లజ్జాభరము దుస్సహమైన దని భావము.

శ్లో. గరుడాపాత విశ్లి మేఘనాదాస్త్ర బంధనః
దాశరథ్యోః క్షణ క్లేశః స్వప్నవృత్త ఇవాభవత్. 76

వ్యాఖ్య: గరుడాపాత........బంధనః-గరుడాపాత-గరుత్మంతునియొక్క యాగమనముచేత, విశ్లిష్ట-విడిపోయిన మేఘనాద-ఇంద్రజిత్తుయొక్క, అస్త్ర బంధనః-నాగాస్త్రబంధనముగల, క్షణ క్లేశః-స్వల్పకాలమునందలి బాధ, దాశరథ్యోః-దశరథ పుత్రులకు (రామలక్ష్మణులకు, స్వప్నవృత్తః, ఇవ-స్వప్నమునందు జరిగిపోయినది వలె, అభవత్-ఉండెను. ఇంద్రజిత్తు నాగాస్త్రముచేత రామలక్ష్మణులను బంధింపఁగా విష్ణువాహనమైన గరుత్మంతుఁడచ్చటికి వచ్చి వ్రాలెను. అతనినిఁ జూచి నాగాస్త్రము భయముచే సడలిపోయెను. క్షణకాలమున జరిగిన ఆబాధ రామలక్ష్మణులకు స్వప్న వృత్తాంతమువలె నుండెనట. గరుత్మంతుఁడు వచ్చుటకు రాముఁడు శ్రీమహావిష్ణువి యవతారమై యుండుటయే కారణమని భావము.

శ్లో. తతో బిభేద పౌలస్త్యః శక్త్యా వక్షసి లక్ష్మణమ్
రామ స్త్వనాహతో உప్యాసీత్ విదీర్ణహృదయః శుచా. 77

వ్యాఖ్య: తతః-ఆతరువాత, పౌలస్త్యః-రావణుఁడు, శక్త్యా-శక్తియను పేరు గల ఆయుధముచేత లక్ష్మణం-లక్ష్మణుని, వక్షసి-వక్షస్థలమునందు, బిభేద-చీల్చెను. రామస్తు (రామః+తు)-రాముఁడేమో, అనాహతః, అపి-కొట్టఁబడనివాఁడైనను, శుచా-శోకముచేత, విదీర్ణహృదయః-చీల్చఁబడిన హృదయము గలవాఁడు, ఆసీత్-అయ్యెను. ఆ తరువాత రావణుఁడు శక్త్యాయుధమును లక్ష్మణుని వక్షముపైవేసి యతనిని మూర్ఛిల్లఁజేయఁగా నట్టియూ దవలని శోకముచేత రాముని హృదయము బ్రద్దలయ్యెను. అనగాఁ రాముఁడు మిక్కలి దుఃఖించెనని భావము.

శ్లో. స మారుతి సమానీత మహౌషధి హతవ్యథః
లంకాస్త్రీణాం పున శ్చక్రే విలాపాచార్యకం శరైః 78

వ్యాఖ్య: సః-అట్లుమూర్ఛిల్లిన లక్ష్మణుఁడు మారుతి...............వ్యథః-మారుతి-హనుమంతునిచేత, సమానీత-తీసుకరాఁబడిన, మహౌషధి-సంజీవనీలత చేత, హతవ్యథః-తొలఁగింపఁబడిన బాధగలవాఁడగుచు, పునః-మరల, లంకాస్త్రీణాం-లంకాపట్టణమునందలి స్త్రీలకు, శరైః-బాణములచేత, విలాపాచార్యకం-శోకించుట యందు ఆచార్యత్వమును, చక్రే-చేసెను. హనుమంఁతుడు తెచ్చిన సంజీవనీ ప్రభావముచేత మూర్ఛతొలఁగిన లక్ష్మణుఁడు మరల శరములు ధరించి యుద్ధము చేసెను. "విలాపాచార్యక" శబ్దము, తత్పూర్వము శోకింపుటయే యెరుఁగని రాక్షసవనితలకుఁ క్రొత్తగా దుఃఖింపవలసిన గతిని (భర్తృపుత్రాది మరణముల వలన) లక్ష్మణుఁడు పట్టించెనని తెలుపుచున్నది.

శ్లో. స నాదం మేఘనాదస్య ధను శ్చేంద్రాయుధప్రభమ్
మేఘస్యేవ శరత్కాలో న కించిత్ పర్యశేషయత్. 79

వ్యాఖ్య: సః-లక్ష్మణుఁడు, శరత్కాలః-శరత్కాలము, మేఘస్య, ఇవ-మేఘము యొక్క వలె, మేఘనాదస్య-ఇంద్రజిత్ యొక్క, నాదం-సింహనాదమును, (మేఘ పక్షమున గర్జితమును) ఇంద్రాయుధప్రభం-ఇంద్రధనుస్సుకాంతివంటి కాంతిగల, ధనుశ్చ-ధనుస్సునున్ను, కించిత్-కొంచెముగూడ, న, పర్యశేషయత్-మిగుల్పలేదు.

ఆతనిని జంపెనని యర్థము. శరత్కాలము, మేఘముయొక్క గర్జితములను తత్సంబంధముగల ఇంద్రధనుస్సున. మిగుల్చనట్లు లక్ష్మణుఁ డింద్రజిత్తును సింహనాద ధనుస్సహితముగాఁ జంపెనని భావము. అలంకారము : ఉపమ.

శ్లో. కుంభకర్ణః కపీంద్రేణ తుల్యావస్థః స్వసుః కృతః
రురోధ రామం శృంగీవ టంకచ్ఛిన్నమనఃశిలః. 80

వ్యాఖ్య : కపీంద్రేణ-కపిరాజగు సుగ్రీవునిచేత, స్వసుః-చెల్లెలికి (శూర్పణఖకు) తుల్యావస్థః-సమానమగు స్థితిగలవాఁడుగా, కృతః-చేయఁబడిన, కుంభకర్ణః-కుంభకర్ణుఁడు, టంకచ్ఛిన్నమనఃశిలః-టంక-సమ్మెటచేత, ఛిన్న-విరుగగొట్టఁబడిన, మనఃశిలః-ఎఱ్ఱని ధాతువిశేషము (మణిశిల) గల, శృంగీ, ఇవ-పర్వతము వలె, రామం-రాముని, రురోధ-అడ్డగించెను. సుగ్రీవునిచేత ముక్కుచెవులును గోయఁబడి తన చెల్లెలు శూర్పణఖవంటి దుస్థితినిఁబొందిన కుంభకర్ణుఁడు, రాళ్ళను పగులఁగొట్టు సమ్మెటచేత భగ్నము చేయఁబడిన మణిశిలా ఫలకములుగల పర్వతమువలె రాముని కడ్డముగావచ్చి నిల్చెను. ముక్కు చెవులుదెగి రక్తసిక్తములైన యవయవములుగల కుంభకర్ణుకు పగులఁగొట్టఁబడిన మణిశిలతో వ్యాప్తమైయున్న పర్వతముతో నుపమింపఁబడుటచేత నిది యుపమాలంకారము. వాఁడు పర్వత మంతయుండెనట !

శ్లో. అకాలే బోధితో భ్రాత్రా ప్రియస్వప్నో వృథా భవాన్
రామేషుభి రితీ వాసౌ దీర్ఘనిద్రాం ప్రవేశితః. 81

ప్రియస్వప్నః-ఇష్టమైన నిద్రగల, భవాన్-నీవు, వృథా-వ్యర్థముగ, భ్రాత్రా-మీయన్నయైన రావణునిచేత, అకాలే-ఆ సమయమునందు, బోధితః, ఇతి, ఇవ-మేలుకొలుపఁబడితి వన్నట్లు, అసౌ-ఆ కుంభకర్ణుఁడు, రామేషుభిః-రామబాణములచేత, దీర్ఘనిద్రాం-దీర్ఘనిద్రను (మరణమును), ప్రవేశితః-పొందింపఁబడెను. అట్లు ఎదుర్కొన్న కుంభకర్ణుని "అయ్యో! పాపం నిద్ర అంటే యెంతో ఇష్టముగల నీవు మీయన్న చేత వృథాగా నిద్రనుండి మేల్కొల్పఁబడితివే!" అన్నభావము చేత వలె కుంభకర్ణుఁడు రామబాణములచేత దీర్ఘనిద్రను పొందింపఁబడెను. అనఁగా మళ్ళీ మేలొ నుటలేని నిద్రను పొందింపఁబడెను. రామునిచేతిలో కుంభకర్ణుఁడు చచ్చె నని భావము.

శ్లో. ఇతరాణ్యపి రక్షాంసి పేతు ర్వానరకోటిషు
రజాంసి సమరోత్థాని తచ్ఛోణిత నదీష్వివ. 82

వ్యాఖ్య : ఇతరాణి, రక్షాంసి, అపి-తక్కిన రాక్షసులు సైతము, వానర కోటిషు-అసంఖ్యాకములై యున్న వానరులదండులో, సమరోత్థాని-యుద్ధమునందు లేచిన, రజాంసి-ధూళులు, తచ్ఛోణితనదీషు, ఇవ-ఆరాక్షసుల రక్తనదులయందువలె పేతుః-పడి నశించిరి. కుంభకర్ణాదులుగాక మిగిలిన రాక్షసులందఱు, యుద్ధభూమి నుండిలేచిన ధూళులు అచ్చటనే చచ్చినవారి రక్తప్రవాహమునఁ బడినట్లు, రామ సైన్యములగు వానరులపైఁబడి యచ్చటనే నశించిపోయిరని భావము. అలంకారము : ఉపమ.

శ్లో. నిర్యయా వథ పౌలస్త్యః పున ర్యుద్ధాయ మందిరాత్
అరావణ మరామం వా జగ దద్యేతి నిశ్చితః. 83

వ్యాఖ్య : అథ-అపిమ్మట, పౌలస్త్యః-రావణుఁడు, అద్య-ఈరోజున, జగత్-లోకము, అరావణం-రావణుఁడు లేనిదిగానో, అరామం-రాముఁడు లేనిది గానో, ఇతి-అగునని, నిశ్చితః-నిర్ణయించుకున్నవాఁడై, పునః-మరల యుద్ధాయ-యుద్ధముకొఱకై, మందిరాత్-గృహమునుండి, నిర్యయౌ-బయలుదేరెను. కుంభ కర్ణాది రాక్షస వినాశమును విన్న రావణుఁడు క్రుద్ధుఁడై ఇఁక ప్రపంచము అరావ ణం లేక అరామం అయిపోవలె నన్న నిశ్చయముతో విజయమును లేదా వీరస్వర్గ మును జేపట్టఁదలఁచి గృహమునుండి బయలుదేరెను.

శ్లో. రామం పదాతి మాలోక్య లంకేశం చ వరూథినమ్
హరియుగ్యం రథం తస్మై ప్రజిఘాయ పురందరః. 84

వ్యాఖ్య : పదాతిం-పాదచారియైయున్న, రామం-రాముని, వరూథినం-రథమువందున్న, లంకేశం, చ-రావణాసురునిగూడ, ఆలోక్య-చూచి, పురందరః-ఇంద్రుఁడు, హరియుగ్యం-కపిలవర్ణాశ్వములుగల, రథం-రథమును, తస్మై-రాముని కొఱకు, ప్రజిఘాయ-పంపెను. రాముఁడు నేలపైనుండుటను, రావణుఁడు రథముపై నుండుటను జూచిన యింద్రుఁడు, రామువిజయమును గోరినవాఁడగుటచేత కపిల వర్ణములగు నశ్వములుకట్టిన తనరథమును రామునికై పంపెను. వరూథము గల

వాఁడు వరూథీ అని తద్ధితాంతశబ్దము, నకారాంతము" రథగు ప్తిర్వరూథోనా"యని అమరము. "రథమునందున్నవాఁడు అని యర్థము. "హరియుగ్య"మన్నచోటఁగల "హరి" శబ్దమునకు కపిలవర్ణమనియు, "యుగ్య" శబ్దమునకు గుఱ్ఱములనియు నర్థములు.

శ్లో. త మాధూతధ్వజపటం వ్యోమగంగోర్మి వాయుభిః
దేవసూతభుజాలంబీ జైత్ర మధ్యా_స్త రాఘవః. 85

వ్యాఖ్య : రాఘవః-శ్రీరాముఁడు, వ్యోమగంగోర్మి వాయుభిః-వ్యోమ గంగా-ఆకాశగంగయొక్క, ఊర్మివాయుభిః-తరంగములపైనుండి వచ్చిన గాలులచేత ఆధూతధ్వజపటం-కదల్పఁబడిన జెండావస్త్రము గలదియు, జైత్రం-జయముఁ జేకూర్పగల, తం-ఆరథమును, దేవసూతభుజాలంబీ--దేవసూత-దేవతలసారథి యగు మాతలియొక్క, భుజాలంబీ-భుజమును ఊతఁగాఁబట్టుకొన్నవాఁడగుచు, అధ్యాస్త-యెక్కి కూర్చుండెను. ఆకాశగంగామార్గంగా పిల్లవాయువుల చల్లదనమును సంతరించుకొని వచ్చిన జయశీలమగు నింద్రరథమునందు మాతలి చేయూతగాని రాముఁడెక్కి కూర్చునెను.

శ్లో. మాతలి _స్తస్య మాహేంద్ర మాముమోచ తనుచ్ఛదమ్
యత్రోత్పలదల క్లైబ్య మస్త్రాణ్యాపుః సురద్విషామ్. 86

వ్యాఖ్య : మాతలిః-ఇంద్రసారథి, మాహేంద్రం-ఇంద్రుఁడు పంపిన, తను చ్ఛదం-కవచమును, తస్య-ఆరామునికి, ఆముమోచ-ధరింపఁజేసెను, యత్ర-యేకవచముపై, సురద్విషాం-దేవశత్రువులగు రాక్షసులయొక్క, అస్త్రాణి-బాణ ములు, ఉత్పలదలక్లైబ్యం-కలువరేకులయొక్క మెత్తఁదనమును, ఆపుః-పొందెనో! మాతలి ఇంద్రుఁడు పంపిన వజ్రకవచమును రామునికిఁ దొడిగింపఁగా, రాక్షసులు రామునిపైవేసిన బాణములు కలువదళములవలె నాకవచమునకుఁదాకి గ్రుచ్చుకొన లేక నిర్వీర్యములై వృథా యయిపోయెనని భావము. బాణములకు రంగునందును ఆకారమునందును కలువదళముల పోలిక చక్కఁగా నున్నది.

శ్లో. అన్యోన్య దర్శనప్రా_ప్త విక్రమావసరం చిరాత్
రామరావణయో ర్యుద్ధం చరితార్థ మివాభవత్. 87

వ్యాఖ్య : చిరాత్-బహుకాలమునకు, అన్యోన్య...సరం-అన్యోన్యదర్శన-ఒకరినొకరు చూచుటచేత, ప్రాప్త-లభించిన, విక్రమావసరం-పరాక్రమ సమయము గల, రామరావణయోః-రామరావణులయొక్క, యుద్ధం-యుద్ధము, చరితార్థం-సఫలమైనది, అభవదివ-అయినదా? యనునట్లుండెను. పూర్వము రావణుని శౌర్యమును రాముడును, రాముని శౌర్యమును రావణుడును వినుటయేకాని చూడలేదు. బహుకాలమున కిప్పుడుభయులకును పరాక్రమ ప్రదర్శనావసరము లభించుటచేత వారియుద్ధము చరితార్థమైనదిగా నుండెను. అలంకారము : ఉత్ప్రేక్ష.

శ్లో. భుజమూర్ధోరుబాహుల్యా దేకోఽపి ధనదానుజః
దదృశే హ్యయథాపూర్వో మాతృవంశ ఇవ స్థితః. 88

వ్యాఖ్య : అయథాపూర్వః-పూర్వమువలెలేనివాడు గనుక (నిహతబంధుడయినందున రాక్షస పరివారములేనివాడని యర్థము), ఏకః, అపి-ఒక్కడేయై యున్నప్పటికిని, ధనదానుజః-రావణుడు, భుజమూర్ధోరు బాహుల్యాత్-భుజముల యొక్కయు, తలలయొక్కయు, పాదములయొక్కయు బాహుళ్యమువలన,మాతృవంశే-తల్లికి సంబంధించిన వర్గమునందు, స్థితః ఇవ-ఉన్నవాడువలెనే, దదృశే, హి-కనబడెను సుమా! విశ్రవోబ్రహ్మకు కుబేరుడు, రావణుడును పుత్రులు. కనుక రావణుడు "ధనదానుజుడు" కుబేరుని తమ్ముడని యర్థము. "దశాస్యో వింశతిభుజ శ్చతుష్పా న్మాతృమందిరే" యను యాదవ నిఘంటు వచనముచేత నతడు పదితలలు, ఇరువది భుజములు గలవాడై తల్లియింటియందును, తలచు కొన్నప్పుడు మాయచేతను, గనపడుననుట నర్థము స్పష్టమగును. బంధువులందరును జచ్చి యొంటరివాడై యున్నప్పటికి రావణుడు తన భుజశీర్షపాదముల బాహుళ్యము చేత మాతృబంధువులగు రాక్షసు లనేకు లతనిచుట్టు నున్నట్లు గోచరించె నని భావము. రావణుని తండ్రి బ్రహ్మఋషి, తల్లి రాక్షసస్త్రీ యగుటచే "మాతృవంశ" శబ్దముపయోగింపబడినది. కాగా నతనికి "దశాస్యత్వము" స్థానమునుబట్టియు, ఆతని యిచ్ఛనుబట్టియు నుండు నని యర్థము.

శ్లో. జేతారం లోకపాలానాం స్వముఖై రర్చితేశ్వరమ్,
రామ స్తులితకైలాస మరాతిం బహ్వమన్యత. 89

వ్యాఖ్య : లోకపాలానాం-ఇంద్రాది లోకపాలురను (కర్మణి షష్ఠి), జేతారం-జయించినవాడును, స్వముఖైః- తన శిరస్సులచేత, అర్చితేశ్వరం-

పూజింపఁబడిన శంకరుఁడు గలవాఁడును, తులితకైలాసం-ఎత్తబడిన కైలాస పర్వతము గలవాఁడును నగు, అరాతిం-శత్రువును, రామః-రాముఁడు, బహ్వమన్యత (బహు + అమన్యత)-గౌరవముతోఁ జూచెను. ఇంద్రాద్య దిక్పాలకులను జయించి, తన శిరస్సుల హోమముతో శివుని మెప్పించి, తన యి సిద్ధికై కైలాసమునే చేతులతో నెత్తిన రావణాసురుఁడు, తన విక్రమమునకుఁ గిన శత్రువై యుద్ధమునకు వచ్చెనని గుణగ్రాహి యగు రాముఁడు తలఁచి యతనిని గౌరవించె నని భావము.

శ్లో. తస్య స్ఫురతి పౌలస్త్యః సీతాసంగమశంసిని ।
నిచఖా నాధికక్రోధః శరం సవ్యేతరే భుజే. 90

వ్యాఖ్య : అధికక్రోధః-బంధు వినాశముచేత మిక్కిలి క్రుద్ధుఁడై యున్న, పౌలస్త్యః—రావణుఁడు, స్ఫురతి—అదరుచున్నదియు (అందువల్లనే), సీతాసంగమ శంసిని-సీతా సమావేశమును సూచించుచున్న, తస్య—ఆ రామునియొక్క, సవ్యేతరే, భుజే—దక్షిణ (కుడి) భుజమునందు, శరం—బాణమును, నిచఖాన-నాటెను. కోపావిష్టుఁడైన రావణుఁడు రాముని కుడిభుజముపై బాణము నాటెను. కుడిచేతితోనే కదా! శరసంధానముచేసి బాణప్రయోగమును జేయునది. అట్లు చేయుటకు వీలు పడనీయరాదని రావణుఁ డాచేతిని విరుగఁగొట్టఁదలఁచి యచ్చట బాణమును నాటె నని భావము. కాని ఆ భుజము అదరుచుంటుట శుభశకునము, ఆ శకునఫల మనతికాలమున సీతాసమాగమును గలిగించుటయే. "సవ్యః ఇతరో యస్మాత్ సః—సవ్యేతరః, తస్మిన్—సవ్యేతరే" అని బహువ్రీహి సమాసమును జెప్పవలెను. అప్పుడు "నబహువ్రీహౌ" అను సూత్రముచేత "ఇతర" శబ్దమునకు సర్వనామ సంజ్ఞా ప్రతిషేధమువలన ప్రయోగము సాధువగును. లేనిచో "సవ్యేతరస్మిన్" అని అనిష్ట రూపము వచ్చును. సవ్యమనఁగా ఎడమప్రక్క.

శ్లో. రావణస్యాపి రామాస్త్రో భిత్త్వా హృదయ మాశుగః।
వివేశ భువ మాఖ్యాతు మురగేభ్య ఇవ ప్రియమ్. 91

వ్యాఖ్య : రామాస్తః (రామ + అస్తః)-రామునిచేఁ బ్రయోగింపఁబడిన, ఆశుగః-బాణము, రావణస్య,అపి-రావణునియొక్కయు, హృదయం-వక్షస్థలమును, భిత్త్వా-చీల్చి, ఉరగేభ్యః-పాతాళలోకము వారగు సర్పరాజులకు, ప్రియం-ఇష్ట

మైన వార్తను, ఆఖ్యాతుం, ఇవ-చెప్పుటకువలె, భువం-భూమిని, వివేశ-ప్రవేశించెను. రావణుఁడే ఆరంభించిన యుద్ధమునందు రాముఁడు వేసిన ప్రతి బాణము రావణుని వక్షమును జీల్చి పోయి భూమిలోనికి వెళ్ళుటను కవి సర్పరాజులకీ వా ను జెప్పుటకు వెళ్ళినట్లు ఉత్ప్రేక్షించుటవలన రామబాణ సామర్థ్య వేగములు స పతుచున్నవి. అలంకారము : ఉత్ప్రేక్ష. రావణ శబ్ద వ్యుత్పత్తి : విశ్రవసః అప త్యం పుమాన్ రావణః అని చెప్పవలెను. విశ్రవః శబ్దమునకు అపత్యార్థమున "అణ్" ప్రత్యయము రాఁగా "విశ్రవసో విశ్రవణరవణౌ" అని రవణాదేశము వచ్చును. అట్లు వచ్చిన "రవణ" శబ్దముపై "రావణః" అనురూపము సిద్ధి చును.

శ్లో. వచసైవ తయో ర్వాక్య మస్త్ర మస్త్రేణ నిఘ్నతోః
అన్యోన్యజయసంరంభో వవృధే వాదినో రివ. 92

వ్యాఖ : వాక్యం-మాటను, వచసా, ఏవ-మాటతోనే, అస్త్రం-బాణమును, అస్త్రేణ-అ ముతోనే, నిఘ్నతోః-త్రిప్పికొట్టుచున్న, తయోః-ఆ రామరావణులకు, వాది ః, ఇవ-కలహించుచున్న వారికివలె, అన్యోన్యజయసంరంభః-ఒకరినొకరు జయింపవలెనను నుత్సాహము, వవృధే-వృద్ధిఁజెందెను. ఒక శా య వి గముపై వాదోపవాదములకుఁ బూనిన వారికివలె మాటను మాటతో, అ ము న ముతోఁ ద్రిప్పికొట్టుచున్న రామరావణులకు పరస్పర విజయ విజృం ణము పె పోయెనని భావము.

శ్లో. విక్రమవ్యతిహారేణ సామాన్యాభూత్ ద్వయోరపి ।
జయశ్రీ రంతరా వేది ర్మత్తవారణయో రివ. 93

వ్యాఖ్య : జయశ్రీః-జయలక్ష్మి, విక్రమ వ్యతిహారేణ-పరాక్రమము యొక్క పర్యాయక్రమముచేత, ద్వయోః, అపి-ఆ రామరావణులిద్దఱియొక్కయు, అంతరా-నడుమ, వేదిః-వేదికగానున్న గోడ, మత్తవారణయోః, ఇవ-మదపుటేనుఁగులు రెండింటికివలె, సామాన్య-సమానభావముగలది, అభూత్-అయ్యెను. రెండు గజములను పోరించునప్పుడు నడుమ అరుగువంటి యొక గోడ నుంచుట యాచారము. ఏ గజమైనను ఆ యరుగుపై దన ముందఱి కాళ్ళనుంచి పోరాడ వచ్చును కనుక దానిపై నుభయ గజములకును సమానమైన హక్కు ఉండును. అట్లే ప్రస్తుతమున రాముఁడొక్కసారియు రావణుఁడొక్కసారియు పరాక్రమము

నందు ఆధిక్యమును జూపుచుండుటచేత జయలక్ష్మి ఉభయ సాధారణమై ఎవరు జయింతురో! చెప్పుటకు వీలులేకుండెనట! అట్లు మహాపరాక్రమముతో నుభయులును విజృంభించుచుండిరని భావము.

శ్లో. కృతప్రతికృతప్రీతై స్తయో ర్ముక్తాం సురాసురైః।
పరస్పరశరవ్రాతాః పుష్పవృష్టిం న సేహిరే. 94

వ్యాఖ్య : కృతప్రతికృతప్రీతైః-ఒకరు ప్రయోగించ న బాణములచేతను వాటికిఁ బ్రతిప్రయోగము చేసిన బాణములచేతను సంతుష్ట న, సురాసురైః-దేవతలచేతను, రాక్షసులచేతను, తయోః-ఆ రామరావణులపై , ముక్తాం-వదలఁబడిన, పుష్పవృష్టిం-పుష్పవర్షమును, పరస్పరశరవ్రాతాః-ఒకరిపై నొకరు కురిపించుచున్న బాణ పరంపరలు, న సేహిరే-సహింపలేకపోయినవి. రామరావణ బాణ| యోగములకు సంతసించిన దేవరాక్షసులు ఒకరి పిమ్మట నొకరు గుఱిపించిన పుష్ప ని, రామునిపైఁ గురియు పుష్పవృష్టిని రావణ బాణములు, రా ణునిపైఁ బడను పుష్పవృష్టిని రాముని బాణములు అంతరాళమునందే అ .ంచినవి. అనఁగా వారి బాణ వర్షమంత దట్టమై పుష్పవృష్టిని వారిపైఁ బడ యశేదని భావము.

శ్లో. అయఃశంకుచితాం రక్షః శతఘ్నీ మథ శత్రవే,
హృతాం వైవస్వతస్యేవ కూటశాల్మలి మక్షిపత్. 95

వ్యాఖ్య: అథ-పిమ్మట, రక్షః-రావణుఁడు, అయః శంకుచితాం-ఇనుప మేకులు పొదుగఁబడిన, శతఘ్నీం-గదాముఖముగల ఆయుధమును, హృతాం-తన విజయమునందపహరించి తెచ్చుకొనఁబడిన, వైవస్వతస్య-యమునియొక్క, కూట శాల్మలిం, ఇవ-"కూటశాల్మలి" యను పేరుగల ఆయుధమునువలె, శత్రవే-శత్రువు కొఱకు (రామునిపైన), అక్షిపత్-వేసెను (ప్రయోగించెను). రావణుఁడు తన విజయ యాత్రలో యముని జయించి అపహరించుకొని వచ్చిన కూటశాల్మలి (యముని గదా దండము) యను నాయుధమా? యనునట్లున్న ఇనుపసూదుల శతఘ్నిని రామునిపైఁ బ్రయోగించె నని భావము. కూటశాల్మలి యనఁగా నొకే వేఱుతో నేలలోదిగి ముం తో నుండుచెట్టు. రావణుని శతఘ్ని అయః శంకుకీలితమై యున్నందున దాని దృశ్యము చెప్పఁబడినది.

శ్లో. రాఘవో రథ మప్రాప్తాం తా మాశాంచ సురద్విషామ్,
అర్ధచంద్రముఖై ర్బాణై శ్చిచ్ఛేద కదలీసుఖమ్. 96

వ్యాఖ్య: రాఘవః-రాముఁడు, రథం-తన రథమును, అప్రాప్తాం-చేరకయే యుండిన, తాం-ఆశతఘ్నిని, సురద్విషాం-రాక్షసులయొక్క, ఆశాం, చ-విజయ తృష్ణనుగూడ, అర్ధచంద్రముఖైః-అర్ధచంద్రాకారముఖములుగల, బాణైః-బాణముల చేత, కదలీసుఖం-అరఁటి చెట్టునందువలె అక్లేశముగా, చిచ్ఛేద-ముక్కలు ముక్కలుగా విరుగఁగొట్టెను. రావణుఁడు ప్రయోగించిన శతఘ్నిని అర్ధచంద్ర ముఖములుగల బాణములచేత అది తన రథము వద్దికి రాకమునుపే (దారిలోనే) ముక్కలు ముక్కలుగా విరుగఁగొట్టి రాక్షసుల విజయతృష్ణను వమ్ముచేసె నని భావము.

శ్లో. అమోఘం సందధే చాస్మై ధను ష్యేకధనుర్ధరః,
బ్రాహ్మ మస్త్రం ప్రియాశోకశల్య నిష్కర్ష ణౌషధమ్. 97

వ్యాఖ్య: ఏకధనుర్ధరః-అద్వితీయ ధనుర్ధారియగు రాముఁడు, ప్రియాశోక శల్యనిష్కర్షణౌషధం-ప్రియా-సీతాదేవియొక్క, శోకశల్య-దుఃఖమనెడు శల్య మును, నిష్కర్షణ-తొలగించునట్టి, ఔషధం-ఔషధమై, అమోఘం-వ్యర్థముకాని, బ్రాహ్మం-బ్రహ్మదేవతాకమగు, అ ం-అభిమంత్రితమైన బాణమును, అస్మై, చ-ఆ రావణుని కొఱకుఁగూడ (వాని ఁ జంపుటకని యర్థము), ధనుషి-ధనుస్సు నందు, సందధే-ఎక్కుపెట్టెను. ప్ర ంచమునం దేకైక ధనుర్ధరుఁడైన రాముఁడు సీతా దుఃఖశల్యమును దొలగించు మహౌషధమగు బ్రహ్మాస్త్రమును రావణునిపైఁ బ్రయోగించుట కెక్కుపెట్టెను. "అస్త్ర" మనఁగా ఒక మంత్రముచేత నభిమం త్రించి వేయఁబడు బాణము. శస్త్రమనఁగా మంత్రమక్కరలేని ఆయుధము.

శ్లో. తత్ వ్యోమ్ని శతధా భిన్నం దదృశే దీప్తిమన్ముఖమ్,
వపు ర్మహోరగ స్యేవ కరాలఫణమండలమ్. 98

వ్యాఖ్య: వ్యోమ్ని-ఆకాశమునందు, శతధా-అనేక రూపములతో, భిన్నం ప్రసరించినదియు, దీప్తిమన్ముఖం (దీప్తిమత్ + ముఖం)-ప్రకాశించుచున్న ముఖ

ములు గలదియునగు, తత్-ఆ బ్రహ్మాస్త్రము, కరాళఫణమండలం-భయంకరములగు ఫణముల సమూహముగల, మహోరగస్య-మహాసర్పమగు శేషునియొక్క, వపుః, ఇవ-దేహమువలె, దదృశే-కనఁబడెను. అట్లు ప్రయోగింపఁబడిన రాముని బ్రహ్మాస్త్రము నానారూపములతో దేదీప్యమానమై ఆకాశమున భయంకర ఫణామండలముతో నాలుకలు చాచుచున్న మహాసర్పమువలెఁజూపఱులకుఁ గనపడెను.

శ్లో. తేన మంత్రప్రయుక్తేన నిమేషార్ధా దపాతయత్,
స రావణశిరః పంక్తి మజ్ఞాత్రవణవేదనామ్. 99

వ్యాఖ్య: సః-రాముఁడు,మంత్రప్రయుక్తేన-మంత్రయుక్తముగాఁబ్రయోగించిన, తేన-ఆ బ్రహ్మాస్త్రముచేత, అజ్ఞాతవ్రణవేదనాం-అతివేగగమనముచేత రావణుని కెఱుకపడని వ్రణబాధగల, రావణశిరః పంక్తిం-రావణునియొక్క శిరముల వరుసను, నిమేషార్ధాత్-అరనిముషములో, అపాతయత్-నేలపైఁ బడఁగొట్టెను. అట్లు మంత్రపూతమగు బ్రహ్మాస్త్రముచేత రాముఁడు రావణుని శిరస్సుల నన్నింటిని అర్ధనిముషములో నేలపైఁ గూల్చెను. అతివేగముతో ఛేదించుట వలన కంఠము లందు రావణునికి బాధయే కనపడలేదని భావము.

శ్లో. బాలార్కప్రతిమే వాప్సు వీచిభిన్నా పతిష్యతః,
రరాజ రక్షఃకాయస్య కంఠచ్ఛేదపరంపరా. 100

వ్యాఖ్య: పతిష్యతః-నేలపైఁ బడఁబోవుచున్న, రక్షఃకాయస్య-రావణుని కళేబరముయొక్క, కంఠచ్ఛేద పరంపరా-కంఠఖండములయొక్క వరుస, వీచిభిన్నా-తరంగములచేత నానావిధములుగా విడఁగొట్టఁబడిన అప్సు-జలములయందలి, బాలార్కప్రతిమా, ఇవ-బాలసూర్యుని ప్రతిబింబమువలె, రరాజ-ప్రకాశించెను. నేలపైఁ బడఁబోవు రావణ శరీరమునుండి రక్తస్రావయుక్తముగాఁ బడుచున్న యతని శిరః ఖండములు, మహానదీ తటాకాదుల యందు ప్రతిఫలించు సూర్యబింబమును తరంగము లొకదానివెంబడి మరియొకటి కొనిపోవుచు నెఱ్ఱదనముతో నున్నట్లు ప్రకాశించెనని భావము. ఇచ్చట "బాలార్క" యనుట యెఱ్ఱఁదనము కొఱకని యెరుగవలెను. అలంకారము: ఉపమ.

శ్లో. మరుతాం పశ్యతాం తస్య శిరాంసి పతితాన్యపి,
మనో నాతివిశశ్వాస పునఃసంధానశంకినామ్. 101

వ్యాఖ్య : పతితాని-నేలపై (బడినట్టి, తస్య, శిరాంసి-ఆరావణునియొక్క-తలలను, పశ్యతాం, అపి-చూచుచున్నవారైనప్పటికిని, పునఃసంధానశంకినాం-మరల శరీరమున కంటుకొనునేమో! యని అనుమానపడుచున్న, మరుతాం-దేవతలయొక్క, మనః-మనస్సు, నాతివిశశ్వాస (న+అతి+విశశ్వాస)-అంతగా నమ్మలేదు. దేవత లింతకుపూర్వము రావణుని శిరస్సులు ఛేదింప(బడినను మరల మొలచుట నెఱి(గియున్నారు. కనుక యిప్పుడు నేలపై(బడి యున్న యతనితలలను తాము ప్రత్యక్షముగా(జూచుచున్నను అవి మరల నతుకుకొనునేమో! యని యనుమానపడుచుండిరి. కాని, రాముని బ్రహ్మాస్త్రము, అపునఃసంధానముగా రావణుని శిరస్సులను ఛేదించినదని భావము.

శ్లో. అథ మదగురుపక్షై ర్లోకపాలద్విపానా
మనుగత మలిబృందై ర్గండభిత్తీ ర్విహాయ,
ఉపనతమణిబంధే మూర్ధ్ని పౌలస్త్యశత్రోః
సురభి సురవిముక్తం పుష్పవర్షం పపాత. 102

వ్యాఖ్య : అథ-అపిమ్మట, మదగురుపక్షైః-మద-గజగండస్థల సంచారముచేత అంటుకున్న మదముచేత, గురు-బరువెక్కిన, పక్షైః-రెక్కలుగల, అలిబృందైః-తుమ్మెదగుంపులచేత, లోకపాలద్విపానాం-ఆకసమునందున్న దిక్పాలకగజములయొక్క, గండభిత్తీః-గండస్థలములను, విహాయ-వదలిపె, అనుగతం-వెంబడిం (బడినదియు, సురభి-పరిమళముగలదియు, సురవిముక్తం-దేవతలచేత (గుఱిపిం (బడినదియునగు, పుష్పవర్షం-పువ్వులవాన, ఉపనతమణిబంధే-సమీపకాలము జరుగ(బోవు రత్నకిరీటధారణముగల, పౌలస్త్యశత్రోః-రావణశత్రువగు శ్రీరామునియొక్క, మూర్ధ్ని-తలపైన, పపాత-పడెను (కురిసెను). అట్లు రావణసంహారము(జేసిన శ్రీరాముని శిరస్సుపైన ఆకసమునుండి చూచుచున్న యింద్రాది దేవతలు, మంచి పరిమళముగల పుష్పములను గురిపించి యనతికాలమున జరుగ(బోవు రామపట్టాభిషేకమును సూచించిరని భావము.

శ్లో. యంతా హరేః సపది సంహృతకార్ముకజ్య
మాపృచ్ఛ్య రాఘవ మనుష్ఠితదేవకార్యమ్,
నామాంక రావణ శరాంకిత కేతుయష్టి
మూర్ధ్వం రథం హరిసహస్రయుజం నినాయ. 103

వ్యాఖ్య : హరేః-ఇంద్రునియొక్క, యంతా-సారథియగు మాతలి, సపది-అప్పుడే సంహృతకార్ముకజ్యం-ఊడదీయబడిన వింటినారి గలవాఁడును, అనుష్ఠితదేవకార్యం-పూర్తిచేయబడిన రావణవధరూపమగు దేవకార్యము గలవాఁడును నగు రాఘవం-శ్రీరాముని, ఆపృచ్ఛ్య-ఆమంత్రణముచేసి (మంచిది, వెళ్ళి వచ్చెదనని రామునికిఁ జెప్పియని అర్థము), నామాంక రావణ శరాంకిత కేతుయష్టిం-నామాంక-పేరును దెలుపు నక్షరముల గుర్తులుగల, రావణశర-రావణుని బాణములచేత, అంకిత-చిహ్నితమైన, కేతుయష్టిం-ధ్వజదండముగలదియు, హరిసహస్ర యుజం-అనేకాశ్వములు గలదియునగు, రథం-ఇంద్రుఁడుపంపిన రథమును, ఊర్ధ్వం-పైకి అనఁగా స్వర్గలోకమునకు, నినాయ-తీసికొని వెళ్ళెను. దేవతలు పుష్పవృష్టిని గురిసినవెంటనే యింద్రసారథియగు మాతలి, శ్రీరాముఁడు రావణవధరూపమైన దేవకార్యమును బూర్తిచేసినందున ధనుర్బాణముల నుపసంహరించియుండఁగా, "వెళ్ళివచ్చెదను సెలవు!" అని రామునికిఁ జెప్పిఁ రావణనామాక్షరములు చెక్కినబాణములు ధ్వజదండమునకుఁ గ్రుచ్చుకొనియున్న యింద్రరథమును స్వర్గమునకుఁ జేర్చెను. "హరి" శబ్దమునకు యమ, అనిల, ఇంద్ర, చంద్ర, అర్క, విష్ణు, సింహ, అంశు, వాజి, శుక, అహి, కపి, భేకములు అర్థమని యమరము

శ్లో. రఘుపతి రపి జాతవేదోవిశుద్ధాం ప్రగృహ్య ప్రియాం
ప్రియసుహృది విభీషణే సంగమయ్య శ్రియం వైరిణః,
రవిసుతసహితేన తేనానుయాతః ససౌమిత్రిణా
భుజవిజిత విమానరత్నాధిరూఢః ప్రతస్థే పురీమ్. 104

వ్యాఖ్య : రఘుపతిః, అపి-శ్రీరాముఁడుఁగూడ, జాతవేదోవిశుద్ధాం-అగ్నియందు ప్రవేశించుటచేత పరిశుద్ధురాలైన, ప్రియాం-ప్రియురాలగు సీతను, ప్రగృహ్య-స్వీకరించియు, ప్రియసుహృది-ఇష్టమిత్రమైన, విభీషణే-విభీషణుని యందు, వైరిణః-శత్రువగు రావణునియొక్క, శ్రియం-సంపదను (రాజ్యలక్ష్మిని) సంగమయ్య-సంక్రమింపఁజేసియు, రవిసుతసహితేన-సుగ్రీవునితోఁగూడిన వాఁడును, ససౌమిత్రిణా-లక్ష్మణసహితుఁడుసునగు, తేన-ఆవిభీషణునిచేత, అనుయాతః-వెంబడింపఁబడినవాఁడగుచు, భుజవిజిత విమానరత్నాధిరూఢః-భుజవిజిత-తన పరాక్రమముచేత గెల్చుకున్న, విమానరత్న-శ్రేష్ఠమైన విమానమగు పుష్పకమును, అధిరూఢః-ఎక్కినవాఁడై, పురీం-అయోధ్యానగరమునుగుఱించి, ప్రతస్థే-

బయలుదేరెను. శ్రీరాముఁడు రావణగృహనివాసముచేతఁ గలిగిన మాలిన్యము తొలఁగుటకై యగ్నిప్రవేశముఁ జేయించిన సీతాదేవిని(బరిశుద్ధనుగా లోకమునకుఁ దెలిపి యామెను స్వీకరించియు, తనను శరణువేడి వచ్చిన విభీషణునికి లంకారాజ్య పట్టాభిషేకముఁజేయించియు లక్ష్మణ సుగ్రీవ సహితుఁడై తనవెంటనడచుచున్న విభీషణుని పుష్పకవిమానము నధిరోహించి సంతోషముతో అయోధ్యానగరమునకు బయలుదేరెను.

ఇది మహాకవి కాళిదాస కృత రఘు వంశ
కావ్యమున రావణవధయను ద్వాదశసర్గమునకు
కేశవపంతుల నరసింహశాస్త్రి రచిత
తెలుఁగు లఘువ్యాఖ్య.

శ్రీః

మహాకవి కాళిదాస కృత

# రఘువంశము

## త్రయోదశ సర్గము

శ్లో. అథాత్మనః శబ్దగుణం గుణజ్ఞః
పదం విమానేన విగాహమానః,
రత్నాకరం వీక్ష్య మిథః స జాయాం
రామాభిధానో హరి రిత్యువాచ. 1

వ్యాఖ్య: అథ–అట్లు ప్రయాణము చేసిన పిమ్మట, గుణజ్ఞః–మార్గమునందలి ఆయావస్తువుల గుణముల నెఱిగిన, సః, రామాభిధానః, హరిః–రాముఁడను పేరుగల యావిష్ణువు, శబ్దగుణం–శబ్దము గుణముగాఁ గల, ఆత్మనః, పదం–తనయొక్క స్థానమును, అనగా విష్ణుపదం, ఆకాశమునని యర్థము. "వియద్విష్ణుపదమ్" అనియమరము. విమానేన–పుష్పక విమానముచేత, విగాహమానః–చొచ్చుకొని పోవుచున్నవాఁడగుచు, రత్నాకరం–సముద్రమును, వీక్ష్య–చూచి, మిథః–రహస్యమున, జాయాం–భార్యను (సీతనుగుఱించి), ఇతి–ముందుచెప్పఁబోవు రీతిగా, ఉవాచ–పలికెను అట్లు పుష్పక విమానముపై నాకాశమున వెళ్ళుచు సముద్రమును జూచి సీతతో నెమ్మదిగా ముందు చెప్పఁబోవుమాటలను పలికెనని భావము. భూమికి గంధము గుణము, జలమునకు శీతస్పర్శ గుణము, ఆకాశమునకు శబ్దము గుణము ఈ మొదలయిన నిర్ణయములు "గంధవతీపృథివీ, శబ్దగుణక మాకాశమ్" ఇత్యాది వాక్యములతో తార్కికులు చేసినారు. ఇక్కడ రామునికి "హరి" యనుట ఆతఁడు నిరంకుశమహిమ గలవాఁడని తెలుపుటకు, "మిథః" అను పదము సీతారాములు స్వేచ్ఛాసంభాషణము కొఱకు, అని గ్రహింపవలయును.

శ్లో. వై దేహి! పశ్యామలయా ద్విభక్తం
మత్సేతునా ఫేనిల మంబురాశిమ్,
ఛాయాపథేనేవ శరత్ప్రసన్న
మాకాశ మావిష్కృతచారుతారమ్. 2

వ్యాఖ్య: హేవైదేహి-ఓసీతా!, ఆ, మలయాత్-మలయ పర్వతము వఱకు, మత్సేతునా-నేనుకట్టించిన వంతెనచేత, విభక్తం-రెండుగా విభజింపఁబడినదియు, ఫేనిలం-నురుగుకలదియునగు, అంబురాశిం-సముద్రమును, ఛాయాపథేన-ఛాయాపథముచేత, విభక్తం-విభజింపఁబడినదియు, శరత్ప్రసన్నం-శరదృతువునందు నిర్మలముగా నున్నదియు, ఆవిష్కృత చారుతారం-కనఁబడునట్లు చేయఁబడిన చక్కని చుక్కలుగలదియునగు, అకాశం, ఇవ-ఆకాశమునువలె (ఉన్నదానిని), పశ్య-చూడుము. సీతా! నేను కట్టించిన సేతువుచేత మలయపర్వతముదాక రెండుగా చీలి, బుడగలు బుడగలుగానున్న నురుగుతో యీ సముద్రము, శరదృతువునందు ఛాయాపథముచేత రెండుభాగములు గలిగి, మెఱయుచున్న సకల నక్షత్రములతోఁ గనఁబడునట్టి, యాకాశమువలె, ముచ్చటఁగొల్పుచున్నదిచూడు! అని రాముఁడు సీతతోననెను. "మత్సేతునా" ఇందలి మత్, అస్మచ్ఛబ్దము, నేను నీకొఱకెంత యద్భుతకార్యమును జేసితినో! చూచితివా? యన్న భావముతో ఆత్మ సంతోషమును, సీత కూరడింపును స్ఫురింపజేయుచున్నది. "ఛాయాపథేన" ఛాయాపథమనఁగా ఆకాశమునందలి నక్షత్రమండల మధ్యమున అడ్డముగా నేర్పడియున్న దీర్ఘమగు అవకాశము (ఖాళీభాగము) అని యర్థము.

శ్లో. గురో ర్యియక్షోః కపిలేన మేధ్యే
రసాతలం సంక్రమితే తురంగే,
తదర్థ ముర్వీ మవదారయద్భిః
పూర్వైః కిలాయం పరివర్ధితో నః. 3

వ్యాఖ్య : యియక్షోః-యజ్ఞముచేయఁదలపెట్టిన, గురోః-తండ్రియగు సగర చక్రవర్తియొక్క, మేధ్యే-అశ్వమేధమునకర్హమగు, తురంగే-గుఱ్ఱము, కపిలేన-కపిలమహర్షిచేత, రసాతలం-పాతాళమును, సంక్రమితే-చేర్పఁబడినదికాఁగా, తదర్థం-ఆగుఱ్ఱముకొఱకై, ఉర్వీం-భూమిని, అవదారయద్భిః-త్రవ్వుచున్న, నః,

పూర్వైః-మాపూర్వులచేత (సగరపుత్రులచేత), అయం-ఈ సముద్రము, పరివర్ధితః, కిల-విశాలముగాఁజేయఁబడినదని చెప్పుదురు సుమా! పూర్వము మాసూర్యవంశీయుఁడగు సగరచక్రవర్తి అశ్వమేధయాగమునకై విడిచిన గుఱ్ఱమును, ఇంద్రుఁడపహరించి కపిలమునివద్దఁ జేర్పఁగా, కపిలుఁడే యపహరించినట్లు భ్రమపడిన సగరపుత్రులగు మా పెద్ద లాయశ్వమును దెచ్చుటకై భూమినిఁ ద్రవ్వుటచేత యీ సముద్ర మింత వెడల్పయినదని యితిహాసము గలదు. కనుక నీ సాగరము మనకుఁ బూజ్యమైనది సుమా! యని రాముఁడు సీతకుఁ జెప్పెను.

శ్లో. గర్భం దధ త్యర్క మరీచయో ఽస్మా
ద్వివృద్ధి మత్రాశ్నువతే వసూని,
అబింధనం వహ్ని మసౌ బిభర్తి
ప్రహ్లాదనం జ్యోతి రజ న్యనేన.

వ్యాఖ్య : అర్కమరీచయః-సూర్యకిరణములు, అస్మాత్-ఈ సముద్రము నుండి, గర్భం-జలమయ గర్భమును, దధతి-ధరించును. అత్ర-ఈ సాగరము నందు, వసూని-ధనములు, వివృద్ధిం-అభివృద్ధిని అశ్నువతే-కాంచుచున్నవి. అసౌ-ఈ యర్ణవము, అబింధనం (అప్ + ఇంధనం)-నీరు ఇంధనముగాఁగల, వహ్నిం-బడబాగ్నిని (విద్యుత్తును), బిభర్తి-ధరించును. అనేన-ఈ జలనిధిచేత, ప్రహ్లాదనం-అందఱికిని అహ్లాదమును గలిగించు. జ్యోతిః-వెలుతురు (చంద్రుఁడు), అజని-పుట్టింపఁబడినది. రాముఁడు సీతతో నింకను సముద్ర మహిమ నిట్లు చెప్పుచున్నాఁడు, సీతా! సూర్యకిరణములలో కొన్ని యీ సముద్రమునుండి జలమయమైన గర్భమును ధరించి వర్షమును గురియుచున్నవి. కనుక ఇతఁడు లోకోపకారి యని యెఱుఁగుము, ధనములు ఇతని యందున్న రత్నరాసులను జేర్చుకొనుచు వృద్ధిజెందును గనుక యితఁడు సంపన్నుఁడనియేకాక ప్రజలను సంపన్నులను జేయువాఁడనియుఁ దెలిసికొనుము. నీళ్ళను ఇంధనముగా గ్రహించి మండుచున్న బడబాగ్నిని (విద్యుత్తును) ధరించును గావున అపకారియైనను ఆశ్రితుని దూరము చేయ వాఁడని గుర్తింపుము. సర్వప్రాణి సమాహ్లాదకుఁడైన చంద్రుని యితఁడే పుట్టించెనని గ్రహింపుము. (సూర్యకిరణములు జలగర్భమును ధరించు విషయము దశమసర్గ 56వ శ్లోకమున విపులముగాఁ జెప్పబడినది) ఇది, కాళిదాసు భౌతికశాస్త్ర విజ్ఞానము.

శ్లో. తాంతా మవస్థాం ప్రతిపద్యమానం
స్థితం దశ వ్యాప్య దిశో మహిమ్నా,
విష్ణో రివా స్యానవధారణీయ
మీదృక్తయా రూప మియత్తయా వా. 5

వ్యాఖ్య : తాం, తాం-ఆయా (అనేక విధములైన), అవస్థాం-అక్షోభాద్య వస్థను (విష్ణుపక్షమున సత్త్వ ప్రధానాద్యవస్థను), ప్రతిపద్యమానం-పొందు చున్నట్టియు, మహిమ్నా-గొప్పదనముచేత (మహిమచేత), దశ, దిశః, వ్యాప్య-పది దిక్కులను వ్యాపించి (పది యవతారములను పొంది), స్థితం-ఉన్న, విష్ణోః, ఇవ-విష్ణువుయొక్కవలె, అస్య-ఈ సముద్రముయొక్క, రూపం-స్వరూపము, ఈదృక్తయా-ఈ ప్రకారమైనదనిగాని, ఇయత్తయా, వా-ఇంత పరిమాణము గలది యని కాని, అనవధారణీయం-తెలిసికొనుటకు సాధ్యముగానిది సుమా! ఒకప్పుడు స్తిమితముగాను, ఒకప్పుడుల్లోలకల్లోలయుక్తముగాను ఉండుచు దశ దిశలు వ్యాపించియున్న యీ సాగరము మహా మహిమోపేతమై సత్త్వరజస్తమో గుణములలో నన్యతమముతో వివిధావతారములు దాల్చు విశ్వరూపుడు విష్ణువు యొక్క స్వరూపమువలె ఇట్టిదనికాని యింతదనికాని తెలిసి నిరూపించుటకు సాధ్య పడదని భావము. "తాంతాం" వీప్సయందు ద్విరుక్తి యని తెలియవలెను.

శ్లో. నాభిప్రరూ ఢాంబురుహాసనేన
సంస్తూయమానః ప్రథమేన ధాత్రా,
అముం యుగాంతోచిత యోగనిద్రః
సంహృత్య లోకాన్ పురుషో ఽధిశేతే. 6

వ్యాఖ్య : యుగాంతోచితయోగనిద్రః— యుగాంత - కల్పాంతమునందు, ఉచిత-పరిచితమైన, యోగ-ఆత్మనిష్ఠయే, నిద్రః-నిద్రగా జెప్పబడు నిద్రగల వాడై, పురుషః-విష్ణువు, లోకాన్-సమస్తభువనములను, సంహృత్య-తనలో నుప సంహరించుకొని, నాభిప్రరూఢాంబురుహాసనేన— నాభి-తన బొడ్డునందు, ప్రరూఢ-మొలచియున్న, అంబురుహ-కమలము, ఆసనేన-ఆశ్రయముగా గల వాడును, ప్రథమేన-దక్షాదులలో మొదటివాడునగు, ధాత్రా-సర్వసృష్టికర్త

యగు బ్రహ్మచేత, సంస్తూయమానః (సన్)-స్తుతింపఁబడుచున్న వాఁడగుచు, అముం, అధిశేతే-ఈ సముద్రమునందు శయనించును. ఇచ్చట, అధిపూర్వక శీఙ్ ధాతువు సంబంధమువలన, ఆధారమునకు కర్మత్వము (సప్తమికి బదులు ద్వితీయ) వచ్చి "అముం" అనియైనది. సీతా! కల్పాంతమునందు శ్రీ మహావిష్ణువు సర్వ భువనములను ఉపసంహరించి యోగనిద్రతో బ్రహ్మాభివంద్యమానుఁడగుచు నీ సముద్రమునందు శయనించును. ఇది కల్పాంతమునందును ఉండునట్టి జలరాశి సుమా! యని చెప్పెను. సర్వసృష్టికి ఆధారభూతమైనదనియు భావము.

శ్లో. పక్షచ్ఛిదా గోత్రభిదా ఽ త్తగంధాః
శరణ్య మేనం శతశో మహీధ్రాః,
నృపా ఇవోపప్లవినః పరేభ్యో
ధర్మోత్తరం మధ్యమ మాశ్రయంతే. 7

వ్యాఖ్య : పక్షచ్ఛిదా-తెక్కలు నఱుకునట్టి, గోత్రభిదా-పర్వతములను గొట్టు ఇంద్రునిచేత, ఆత్తగంధాః-హరింపఁబడిన గర్వముగల(తిరస్కరింపఁబడిన), మహీధ్రాః-పర్వతములు, శతశః-నూటికి నూరువంతులు, శరణ్యం-రక్షకుఁడైన, ఏనం-ఈ సముద్రుని, పరేభ్యః-శత్రువులవలన, ఉపప్లవినః-భయకంపితులైన, నృపాః-రాజులు, ధర్మోత్తరం-ధర్మప్రధానుఁడగు, మధ్యమం, ఇవ-మధ్యస్థుఁడగు రాజునువలె, ఆశ్రయంతే-ఆశ్రయించుచున్నవి. ఇంద్రునికి భయపడి గర్వమును విడిచిన పర్వతములన్నియు నితఁడే శరణాగత రక్షకుఁడని యెఱిఁగి, శత్రువుల వలన భయకంపితులగు రాజులు ధర్మమును బాటించు మధ్యవర్తి రాజునువలె నాశ్రయించుచున్నవి, అట్టితఁడు ఆర్తబంధువని యెఱుఁగుము అని భావము.

శ్లో. రసాతలా దాదిభవేన పుంసా
భువః ప్రయుక్తోద్వహనక్రియాయాః,
అస్యాచ్ఛ మంభః ప్రలయప్రవృద్ధం
ముహూర్తవక్త్రాభరణం బభూవ. 8

వ్యాఖ్య : ఆదిభవేన, పుంసా-ఆదివరాహమూర్తిచేత, రసాతలాత్-పాతాళమునుండి, ప్రయుక్తోద్వహనక్రియాయాః-ప్రయుక్త - చేయఁబడిన

ఉద్వహనక్రియాయాః—ఉద్ధరణ క్రియగల, భువః—భూదేవికి, ప్రలయ పవృద్ధం-ప్రళయకాలమునందు వృద్ధిచెందిన, అస్య, అచ్ఛం, అంభః-ఈ సముద్రముయొక్క-నిర్మలమైన జలము, ముహూర్తవక్త్రాభరణం-క్షణకాలము ముసుగుగా, బభూవ-ఉండినది. హిరణ్యాక్షాది రాక్షసులచేత భూమిని ముంచఁబడినప్పుడు శ్రీమహావిష్ణువు ఆదివరాహమై భూమిని ఉద్ధరించెను గదా! అప్పుడు ఆదివరాహమూర్తికిని భూదేవికిని జరిగిన వివాహమునందు క్షణకాలము అనఁగా ముహూర్త సమయమువరకు ఈ సముద్రజలము కన్యాలజ్జావ గుంఠనముగా నుండినదని భావము. ఆదికాలమునందే అట్టి పవిత్రత గలది యీ సముద్రము.

శ్లో. ముఖార్పణేషు ప్రకృతి ప్రగల్భాః
స్వయం తరంగాధర దానదక్షః,
అనన్యసామాన్య కళత్ర వృత్తిః
పిబ త్యసౌ పాయయతే చ సింధూః, 9

వ్యాఖ్య : అనన్య సామాన్య కళత్రవృత్తిః—అనన్య సామాన్య—ఇతర పురుషుల కెవ్వరికిని సాధారణముకాని, కళత్ర వృత్తిః—భార్యల విషయమునందలి భోగప్రవృత్తిగలవాఁడై, తరంగాధర దానద క్షః—తరంగాధర-తరంగమనెడు అధ రము, దాన—ఇచ్చుటయందు, దక్షః-చతురుఁడైన, అసౌ-ఈసముద్రుఁడు, ముఖార్పణేషు-ముఖముల నర్పించుటయందు, ప్రకృతిప్రగల్భాః-సహజముగా ప్రౌఢ వైన, సింధూః—నదులను, (తరంగాధరమును) స్వయం, పిబతి-తాను పానము చేయును, పాయయతే, చ-నదులతో పానముఁ జేయించును. సఖుల ప్రేరణ లేకయే సహజ ప్రౌఢలైన నదీమతల్లికలు వచ్చి ముఖార్పణము చేసి నప్పుడు, తాను వారి తరంగాధరపానముఁ జేయుచు, వారికి తన తరంగాధర పానము గలిగించును. ఇట్లు దంపతుల కేకకాలమునందు పరస్పరాధరపానముజేయు భాగ్య మీ సముద్రునికిఁదప్ప మరియొకనికి లేదని భావము. "నపాదమ్యాఙ్" ఇత్యాది సూత్రము వలన నిచ్చట ణ్యంతమగు 'పా' ధాతువునకు పరస్మైపద నిషేధము కలిగి "పాయయతే" అని ఆత్మనేపది వచ్చినది.

శ్లో. స స త్త్వ మాదాయ నదీముఖాంభః
సంమీలయంతో వివృతాననత్వాత్, 10

అమీ శిరోభి స్తిమయః సరంధ్రైః
ఊర్ధ్వం వితన్వంతి జలప్రవాహాన్.

వ్యాఖ్య: అమీ-ఈ, తిమయః-ఒకవిధమగు మత్స్యములు, వివృతాననత్వాత్-తెరువఁబడినవోళ్ళు గలవగుటవలన, ససత్త్వం-మత్స్యాదిప్రాణులతో గూడిన, నదీముఖాంభః-నదీముఖజలమును, ఆదాయ-తీసికొని, సమ్మీలయంతః-ముకుపుటములను నోటిని మూసికొనుచు, సరంధ్రైః-రంధ్రములుగల, శిరోభిః-తలలచేత జలప్రవాహాన్-జలప్రవాహములను, ఊర్ధ్వం-పైకి, వితన్వంతి-ఎగఁజిమ్ముచున్నవి. "అస్తి మత్స్య స్తిమిర్నామ శతయోజన మాయతః" అను వచన ప్రకారము నూరామడల పొడవును దానికిఁదగిన వెడల్పును గల "తిములు" అనఁబడు సీమత్స్యములు విశాలముగాఁ దెఱువఁబడిన నోళ్ళుగలవి యగుటవలన చిన్నచేపలు మొదలగు ప్రాణులతోఁ గూడిన నదీముఖజలమును, అనగా సముద్రమునందప్పుడే వచ్చి పడుచున్న నీటిని త్రాగి నోరుమూసికొన్నవియై తమ శిరస్సులందున్న రంధ్రముల ద్వారా జలప్రవాహములను ఆకాశమునకు ఎగఁజిమ్ముచున్నవి! అద్భుతమైన జలయంత్ర క్రీడవలెనున్నదికదా! అని రాముఁడు సీతకుఁ జూపెను.

శ్లో. మాతంగనక్రైః సహసోత్పతద్భిః
భిన్నాన్ ద్విధా పశ్య సముద్రఫేనాన్,
కపోలసంసర్పితయా య ఏషాం
వ్రజంతి కర్ణక్షణచామరత్వమ్. 11

వ్యాఖ్య: సహసా-వేగముగా, ఉత్పతద్భిః-ఎగిఱిపడుచున్న, మాతంగనక్రైః-గజాకారముగల మొసళ్ళచేత, ద్విధా, భిన్నాన్-రెండుగా వేరుపరుపఁబడిన, సముద్రఫేనాన్-సముద్రమునందలి నుఱుగులను, పశ్య-చూడుము, యే-యేనుఱుగులు, ఏషాం-ఈజలమాతంగనక్రములకు, కపోలసంసర్పితయా-చెక్కిళ్ళయందు రాచుకొనుచున్న కారణముచేత, కర్ణక్షణ చామరత్వం-చెవులయందు క్షణకాలము చామరములైయుండుటను, వ్రజంతి-పొందుచున్నవో! సీతా! జలోపరిభాగమున కెగురుచున్న ఆజలగజ నక్రములచేత రెండుగాఁ జీల్పఁబడిన సముద్రపు నుఱుగులు, ఆనక్రముల చెంపల నొరసికొనుచు, వాటికి క్షణకాలము చామరములుగాఁ గన్పట్టుచున్నవి చూడు! అన్నాఁడు. రాచయేనుఁగులపై రాజులూరేగు

నప్పుడు ఆ యేనుఁగులకుఁజేయు నలంకారములలో చెవులకుఁ జెంపలకు నడుమ తెల్లని చామరములు గట్టుదురు. అట్లే యీజలగజము లనఁబడు మొసళ్ళు సముద్రపు నురుగు రెండుప్రక్కలందుండుటచేత రాచయేనుఁగులవలెఁ గనఁబడుచున్నవని భావము. ఉత్ప్రేక్షాలంకారము.

శ్లో. వేలానిలాయ ప్రసృతా భుజంగాః
మహోర్మి విస్ఫూర్జథు నిర్విశేషాః,
సూర్యాంశు సంపర్క సమృద్ధరాగైః
వ్యజ్యంత ఏతే మణిభిః ఫణస్థైః. 12

వ్యాఖ్య: వేలానిలాయ-సముద్రతీరవాయువుకొఱకు (గాలినిఁదినుటకు), ప్రసృతాః-నీటినుండి బయలుదేరినవియు, మహోర్మి విస్ఫూర్జథు నిర్విశేషాః— మహోర్మి - పెద్ద తరంగములయొక్క, విస్ఫూర్జథు-విజృంభణముకంటె, నిర్విశేషాః-భేదములేనివియునగు, ఏతే, భుజంగాః-ఈజలసర్పములు, సూర్యాంశు సంపర్క సమృద్ధరాగైః— సూర్యాంశు—సూర్య కిరణములయొక్క, సంపర్క—సంబంధముచేత, సమృద్ధరాగైః—వృద్ధిచెందిన యెఱ్ఱని కాంతులుగల, ఫణస్థైః-ఫణములపైనున్న, మణిభిః-పద్మరాగమణులచేత, వ్యజ్యంతే—ఊహింపఁబడుచున్నవి. ఈసముద్రతరంగములు ఎత్తుగాలేచి తీరమునకు జేరుచున్నవి గదా! తీరమునందలిగాలినిఁ బీల్చుటకై యీతరంగములలోఁగలిసి తీరమునకు జేరుచున్న సర్పములను, తెల్లనివగుటచేతను, వేగమున వచ్చుచున్నవగుటచేతను, తరంగములకంటె భిన్నయున్నట్లు మనము గుర్తింపలేకపోయినను, తరంగములపైఁబడుచున్న సూర్యకిరణములకాంతి, సర్పముల శిరస్సులందలి మాణిక్యముల కాంతిని యినుమడింపఁజేయుటచేత ఇవి సర్పములు సుమా! అని యూహించుటకు వీలుకలిగినదని భావము.

శ్లో. తవాధరస్పర్ధిషు విద్రుమేషు
పర్యస్త మేత త్సహసోర్మివేగాత్,
ఊర్ధ్వాంకుర ప్రోతముఖం కథంచిత్
క్లేశా దపక్రామతి శంఖయూథమ్. 13

వ్యాఖ్య: తవ, అధరస్పర్థిషు-నీయధరోష్ఠమును బోలియున్న, విద్రుమేషు-పగడముల న, సహసా-హఠాత్తుగా, ఊర్మివేగాత్-తరంగముల వేగమువలన, పర్యస్తం- డవేయఁబడినదియు, ఊర్ధ్వాంకురప్రోతముఖం-ఊర్ధ్వాంకుర-పైకివచ్చిన పగడపు మొలకలచేత, ప్రోత-గుచ్చఁబడిన, ముఖం-ముఖభాగములు గలదియు నగు, ఏతత్—ఈ, శంఖయూథం-శంఖముల మొత్తము, కథంచిత్-ఎట్టకేలకు, క్లేశాత్—కష్టముగా, అపక్రామతి-తొలఁగి చనుచున్నది (ఆలస్యముగా శంఖములు దొరలిపోవుచున్నవని యర్థము). సీతా! నీయధరోష్ఠమును బోలియున్న పగడముల గుంపు పైన తరంగవేగముచేతఁ బడవేయఁ బడిన శంఖముల మొత్తము అచ్చటి పగడపు మొక్కలు ముఖరంధ్రములలో నిరుకుటచేత ఎట్లో తప్పించుకొని నిదానముగా క్రిందికి దొరలిపోవుచున్నది చూడుము! అన్నాడు. ఇచ్చట "తవాధరస్పర్థిషు" అన్నచోట ఉపమానమే ఉపమేయమును బోలియున్నట్లు చెప్పుటచేత వ్యతిరేకాలంకారమును, పగడములపై శంఖములు బడుట, అధరోష్ఠముపై చిఱునగవు ప్రసరించుట వంటిదగుటచేత వస్తుధ్వనియుఁ గలవు.

శ్లో. ప్రవృత్తమాత్రేణ పయాంసి పాతు
మావర్తవేగాత్ భ్రమతా ఘనేన,
అభాతి భూయిష్ఠ మయం సముద్రః
ప్రమథ్యమానో గిరిణేవ భూయః. 14

వ్యాఖ్య: పయాంసి-జలములను, పాతుం-త్రాగుటకు, ప్రవృత్తమాత్రేణ-పూనుకొన్నవాఁడు మాత్రమే యయినవాఁడును, ఆవర్తవేగాత్-సముద్రమునందలి సుడుల వేగమువలన, భ్రమతా-గుండ్రముగాఁ దిరుగుచున్నవాఁడునునగు, ఘనేన-మేఘునిచేత, అయం, సముద్రః - ఈ సముద్రము, భూయః-మరల, గిరిణా-మందరపర్వతముచేత, ప్రమథ్యమానః,ఇవ- తఱచఁబడుచున్నదివలె, భూయిష్ఠం-మిక్కిలి, ఆభాతి-ప్రకాశించుచున్నది. మేఘము సముద్రజలమును ద్రాగుటకై నీటి చెంతకు వచ్చినంతనే యచ్చటి సుడులవేగముచే ఉపహతమై యచ్చటనే వలయముగాఁదిరుగుచున్నది. దానినిఁ జూడగా, ఈసముద్రము మరల గూడ మందరాద్రిచేత మథింపఁబడుచున్నదా? యన్నట్లు కనఁబడుచున్నది సుమా! అలంకారము: వస్తూత్ప్రేక్ష.

శ్లో. దూరా దయశ్చక్రనిభస్య తన్వీ
తమాల తాలీవన రాజి నీలా,
ఆభాతి వేలా లవణాంబురాశే
ర్ధారా నిబద్ధేవ కలంకరేఖా. 15

వ్యాఖ్య: అయశ్చక్రనిభస్య-ఇనుపచక్రముతో సమానముగానున్న, లవణాంబురాశేః-లవణసముద్రమునకు, దూరాత్-దూరముగా, తన్వీ-సూక్ష్మముగానున్నదియు, తమాల తాలీవన రాజినీలా—తమాల-కానుగుచెట్లయొక్కయు, తాలీవన-తాటితోపులయొక్కయు, రాజి-వరుసలచేత, నీలా-నల్లదనము కలదియునగు, వేలా-సముద్రతీరము (చెలియలికట్ట), ధారానిబద్ధా-చక్రము అంచునఁ గట్టఁబడిన, కలంకరేఖా, ఇవ-ఇనుపకమ్మియనఁబడు మాలిన్యరేఖవలె, ఆభాతి-ప్రకాశించుచున్నది. వర్తులముగానున్న సముద్రము చక్రమువలె నుండఁగా దానిచుట్టును తమాలతాళీవన పంక్తులతో నల్లగాఁ గనఁబడుచున్న తీరరేఖ బండిచక్రముయొక్కయినుపకమ్మివలె గోచరించుచున్నదని భావము. అలంకారము : ఉపమ.

శ్లో. వేలానిలః కేతకరేణుభి స్తే
సంభావయ త్యాననమాయతాక్షి!
మా మక్షమం మండనకాలహానే
ర్వే త్తీవ బింబాధర బద్ధతృష్ణమ్. 16

వ్యాఖ్య: హేఆయతాక్షి-ఓవిశాలనేత్రములుగలదానా! వేలానిలః-ఈసముద్రతీరవాయువు. కేతకరేణుభిః-మొగలిపూల పుప్పొడులతో, తే-నీయొక్క, ఆననం-ముఖమును, సంభావయతి-అలంకరించుచున్నది? బింబాధరబద్ధతృష్ణం-దొండపండువంటి నీయధరోష్ఠమునందు మిక్కిలియాశగల, మాం-నన్ను, మండనకాలహానేః-అలంకరించుటచేతనగు కాలహరణమునకు, అక్షమం-సహింపలేనివానినిగా (తట్టుకోలేని వానినిగా) వేత్తీవ (వేత్తి+ఇవ)-ఎఱుఁగునా యేమి? సీతా! ఈసముద్రతీరవాయువు అచ్చటనున్న మొగలిపూల పరాగమును దెచ్చి నీముఖమునకు పులిమియలంకరించుచున్నదే! నీయధరోష్ఠపానమును క్షణమైనను విడువలేని నేను ఈయలంకార కాలయాపనమునకు తట్టుకోఁజాలనని యెఱుఁగునాయేమి? నన్ను నీవిరహ

ముతో నుడికించుటకా! యేమి యీవాయువిట్లు చేయుట? అని భావము. ఈఘట్టము చిరవిరహ దుఃఖితులగు సీతారాములు రహస్యముగా విస్రంభాలాపములు చేయు నదియు, విశేషించి రాముఁడు సీతనోదార్చునదియుఁగావున రాముఁడిట్లు పలికెను.

శ్లో. ఏతే వయం సైకతభిన్న శుక్తి
పర్యస్తముక్తాపటలం పయోధేః
ప్రాప్తా ముహూర్తేన విమానవేగాత్
కూలం ఫలావర్జితపూగమాలమ్. 17

వ్యాఖ్య : ఏతే, వయం-ఈమనము, సైకతభిన్నశుక్తి పర్యస్తముక్తాపటలం-సైకత-ఇసుకదిబ్బలమీద, భిన్న-పగిలిన, శుక్తి-ముత్తెపుఁజిప్పలచేత, పర్యస్త-అంతటను చల్లఁబడిన, ముక్తాపటలం-ముత్యాల కుప్పలు గలదియు, ఫలావర్జితపూగ మాలం—ఫల-పండ్లచేత, ఆవర్జిత-వంగునట్లు చేయఁబడిన, పూగమాలం-పోకచెట్ల వరుసలు గలదియునగు, పయోధేః, కూలం-సముద్రముయొక్క తీరమును, విమాన వేగాత్-విమానముయొక్క వేగమువలన, ముహూర్తేన, ప్రాప్తాః-ముహూర్తకాల మునఁజేరితిమి (ముహూర్తమనఁగా రెండు గడియలు. 48 నిముషముల కాలము). సీతా! ఇదుగో! మనము, ఇసుక నేలపై చిటిలిన ముత్తెపుఁజిప్ప లిటునటుఁజల్లిన ముత్యాలకుప్పలతోను, పండ్లగుత్తుల బరువుచే వంగిన పోకచెట్ల బారులతోను రమ ణీయముగానున్న సముద్రతీరమును, వేగముగావచ్చిన విమానమువలన ముహూర్త కాలంలో చేరుకున్నాము సుమా! అన్నాఁడు.

శ్లో. కురుష్వ తావత్కరభోరు! పశ్చా
న్మార్గే మృగప్రేక్షిణి! దృష్టిపాతమ్,
ఏషా విదూరీభవతః సముద్రాత్
సకాననా నిష్పతతీవ భూమిః. 18

వ్యాఖ్య : హేకరభోరు! కరభమువంటి తొడలుగలదానా! హేమృగప్రేక్షిణి!-ఓలేడి చూపులుగల సీతా! తావత్-పూర్వముగా, పశ్చాన్మార్గే (పశ్చాత్+మార్గే)-మనము దాటివచ్చిన మార్గమునందు, దృష్టిపాతం, కురుష్వ-చూపును ప్రసరింప జేయుము (చూడుము!), ఏషా—ఈ, సకాననా-అరణ్యసహితమగు, భూమిః-భూమి

విదూరీభవతః-క్రమముగా దూరమగుచున్న, సముద్రాత్-సాగరమునుండి, నిష్పతతి, ఇవ-నిష్క్రమించుచున్నదివలె నున్నది. సకాననయగు భూమి సముద్రము నుండి వెడలివచ్చుచున్నట్లు విమాన వేగమువలన మనకుఁ గనఁబడుచున్నదని భావము. ఇచ్చట కరభోరు! అన్నప్పుడు రాముఁడు ఇతర వస్తుదర్శన పారవశ్యము నందున్న సీతను తొడతట్టి, ప్రస్తుత భూమిదర్శనముకకై మృగప్రేక్షిణి! అని ప్రోత్సహించెనని ఈ సంబోధన పదద్వయ సార్థక్యము నూహింపవలయును. భావ విశేషములందట్టి క్రియా విశేషములు సహజములు.

శ్లో. క్వచిత్ పథా సంచరతే సురాణాం
క్వచిత్ ఘనానాం, పతతాం క్వచిచ్చ,
యథావిధో మే మనసో ఽభిలాషః
ప్రవర్తతే పశ్య తథా విమానమ్. 19

వ్యాఖ్య : హేదేవి!-ఓసీతా! విమానం-పుష్పక విమానము, మే, మనసః-నా మనస్సుయొక్క, అభిలాషః-కోరిక, యథావిధః-ఏవిధముగా నున్నదో, తథా, అట్లే, ప్రవర్తతే-నడచుచున్నది, పశ్య-చూడుము, క్వచిత్-ఒకచోట, సురాణాం-పథా-దేవతలయొక్క దారివెంబడి, సంచరతే-నడుచుచున్నది. క్వచిత్-మరియొక చోట, ఘనానాం-మేఘముల యొక్కయు, క్వచిత్-ఇంకొకచోట, పతతాం, చ-పక్షుల యొక్కయును, పథా-మార్గముద్వారా, సంచరతే-వెళ్ళుచున్నది. సీతా! ఈ పుష్పక విమానము నా మనస్సులోని కోరిక నెట్లుగుర్తించుచున్నదో! నేను ఏ మార్గమును జూడఁదలఁచితినో అదే దేవమార్గ, మేఘమార్గ, పక్షిమార్గములలో నిది వెళ్ళుచున్నది. ఇది అద్భుతము సుమా! "సంచరతే" సమ్ అను ఉపసర్గతోను, తృతీయాంతమగు "పథా" అను పదముతోను, చేరుటచేత "చర" ధాతువున కాత్మనేపది వచ్చినది. "సమస్తృతీయా యుక్తాత్" అని సూత్రము.

శ్లో. అసౌ మహేంద్రద్విప దానగంధిః
త్రిమార్గగావీచి విమర్ద శీతః,
ఆకాశవాయు ర్దినయౌవనోత్థా
నాచామతి స్వేదలవాన్ ముఖే తే. 20

వ్యాఖ్య : మహేంద్రద్విప దానగంధిః-మహేంద్రద్విప-ఐరావతముయొక్క, దానగంధిః-మదపువాసనగలదియు, త్రిమార్గావీచి విమర్దశీతః—త్రిమార్గా-గంగ యొక్క, వీచివిమర్ద-తరంగముల సంబంధముచేత, శీతః-చల్లగానున్నదియునగు, అసౌ, ఆ కా శ వా యుః-ఈ యా కా శ వా యు వు, దినయౌవనోత్థాన్-దిన యౌవన-మధ్యాహ్న కాలము చే త, ఉత్థాన్-బ య లు దే రి న (కలిగిన), తే-నీయొక్క, ముఖే-ముఖమునందలి, స్వేదలవాన్-చెమటచుక్కలను, ఆచామతి-ఆచమనముచేయుచున్నది (తొలగించుచున్నది) సీతా! ఐరావతమదగంధ పరి మళముతోను, గంగాతరంగ సంపర్కమువలని చల్లదనముతోను వచ్చుచున్న యీ యాకాశపవనము, ఈ మధ్యాహ్నకాలమున నీ ముఖముపైఁ బొడమిన చెమట చుక్కలను దొలగించుచున్నది సుమా! ఇది, విమానముయొక్క సురపథ సంచార మని భావము. ఆకాశ, భూ, పాతాళమార్గములందుఁ బ్రవహించుటచేత గంగ "త్రిమార్గా" యనఁబడుచున్నది. మధ్యాహ్నమును "దినయౌవన" మనుట చక్కని ప్రౌఢప్రయోగము.

శ్లో. కరేణ వాతాయనలంబితేన

స్పృష్ట స్త్వయా చండి! కుతూహలిన్యా,

ఆముంచతీ వాభరణం ద్వితీయ

ముద్భిన్నవిద్యుద్వలయో ఘన స్తే. 21

వ్యాఖ్య : చండి!-ఓకోపముగలదానా! కుతూహలిన్యా-వినోదార్థినివగు, త్వయా - నీచేత, వాతాయనలంబితేన - గవాక్షమునందు జార్చఁబడిన, కరేణ - చేతితో, స్పృష్టః — తాకఁబడినదగుటవలన, ఉద్భిన్నవిద్యుద్వ లయః-పైకెగిరినవలయాకార విద్యుత్తుగల, ఘనః-మేఘము, ద్వితీయం, ఆభరణం-రెండవకంకణమును, ఆముంచతి, ఇవ—అర్పించుచున్నదివలెనున్నది. విమానగవా మునుండి (కిటికీవంటిది) జార్చిన చేతితో నీవు తాకఁగా యెగిరిన విద్యుత్తుగల ఘము నీచేతికి మరియొక మణి కంకణమును దొడుగుచున్నదా? యన్నట్లున్నది తా! అనెను. అలంకారము : ఉత్ప్రేక్ష ఇచ్చటి "చండి" అను శబ్దము సీత యొక్క ప్రణయకోపమును దెలుపును. ఇన్ని రోజులు నన్నేలయుపేక్షించితివని యలిగిన సీతను రాముఁడు, చండి! అనిపిలిచి, యీ వినోదవాక్యముచేత నామె నోదార్చుచున్నట్లు భావింపవలెను.

శ్లో. అమీ జనస్థాన మపోఢవిఘ్నం
మత్వా సమారబ్ధనవోటజాని,
అధ్యాసతే చీరభృతో యథాస్వం
చిరోజ్ఝితా న్యాశ్రమ మండలాని. 22

వ్యాఖ్య : అమీ, చీరభృతః-ఈతపస్విజనులు, జనస్థానం-జనస్థానమును (పూర్వము రాక్షసపాలనమునందున్న ప్రాంతము), అపోఢవిఘ్నం-తొలఁగిన విఘ్నములుగలదానినిగా, మత్వా-తెలిసికొని, సమారబ్ధనవోటజాని-ఆరంభింపఁబడిన క్రొత్తపర్ణశాలలుగలవియు, చిరోజ్ఝితాని-రాక్షసభయమువలన చాలకాలముక్రింద విడువఁబడినవియునగు, ఆశ్రమమండలాని-ఆశ్రమభాగములను, యథాస్వం-తమ తమభాగముల ప్రకారము కట్టుకొని, అధ్యాసతే-అధివసించుచున్నారు. పూర్వము ఖరదూషణ తాటకాదులు చేయుచుండిన విఘ్నములవలన తమతపోయజ్ఞాదులను సరక్షించుకొనుట కితరప్రాంతములకు వెళ్ళిపోయిన మునిజనులు, రావణవధవలన వి ము లేకమీదనుండవను భావముతో మరల జనస్థానమునకు వచ్చి తమ పూ్వస్థలములందే పర్ణకుటీరములు గట్టుకొని నివసించుచున్నారు చూతుము! ఇది జనస్థాన మని రాముఁడు సీతకుఁదెలిపెను.

శ్లో. సైషా స్థలీ యత్ర విచిన్వతా త్వాం
భ్రష్టం మయా నూపుర మేక ముర్వ్యామ్,
అదృశ్యత త్వచ్చరణారవింద
విశ్లేష దుఃఖా దివ బద్ధమౌనమ్. 23

వ్యాఖ్య: సైషా (సా+ఏషా), స్థలీ-ఆదేయీచోటు; యత్ర-యెచ్చట నైతే, త్వాం-నిన్ను, విచిన్వతా-వెదకుచుండిన, మయా—నాచేత, త్వచ్చరణార వింద విశ్లేష దుఃఖాత్, ఇవ-త్వచ్చరణారవింద-నీపాదకమలముతో, విశ్లేష-విడిపో వుటచేతనైన దుఃఖాత్, ఇవ-దుఃఖమువలననో యనునట్లు, బద్ధమౌన -చప్పుడు లేనిదై, ఉర్వ్యాం-భూమిమీద, భ్రష్టం-జారిపడియుండిన, ఏక , నూపురం-ఒక కాలియందె, అదృశ్యత-చూడఁబడియుండెనో! సీతా! యెచ్చటనైతే నిన్ను వెదకు చున్ననాకు, నీపాదవియోగదుఃఖమువలననో యనునట్లు నిశ్శబ్దముగా నేలపైఁబడి యుండిన నీపాదమంజీరము కనఁబడినదో ఆచోటు ఇదేసుమా! మంజీరమౌనమునకు పాదవియోగదుఃఖము హేతువనుటచే నిది హేతూత్ప్రేక్షాలంకారము.

శ్లో. త్వం రక్షసా భీరు! యతో ఉపనీతా
తం మార్గ మేతాః కృపయా లతా మే,
అదర్శయన్ వక్తు మశక్నువత్యః
శాఖాభి రావర్జిత పల్లవాభిః. 24

వ్యాఖ్య : భీరు–భయస్వభావముగల ఓసీతా!, త్వం–నీవు. రక్షసా–రాక్షసునిచేత (రావణునిచేత), యతః–యేమార్గముచేత (ద్వారా), అపనీతా–అపహరింపఁబడితివో, తం, మార్గం–ఆత్రోవను, వక్తుం–చెప్పుటకు, అశక్నువత్యః–నోరు లేనందున చేతఁగానివై, ఏతాః, లతాః–ఈతీఁగలు, ఆవర్జితపల్లవాభిః–వంచఁబడిన చిగురుటాకులుగల, శాఖాభిః–కొమ్మలచేత, కృపయా–దయతో, మే, అదర్శయన్–నాకుఁజూపినవి. సీతా! రావణుఁ డేత్రోవన నిన్నపహరించుకొని వెళ్లెనో ఆమార్గము నీలతలు అరచేతులవంటి చిగురాకులనువంచి తమ కొమ్మలనెడు బాహువులతో నాకుఁజూపినవి. ఇవినోరులేనివగుటచేత దయతో నట్లు సంజ్ఞచేసి మార్గమును జూపినవని భావము. "భీరు!" అనిపిలుచుట, ఇప్పటికిని ఆ సంఘటనము జ్ఞప్తికి వచ్చినచో సీత వణికిపోవుననియు, "రక్షసా" యనుట దుష్టుఁడైన రావణుని పేరు నుచ్చరింపరాదనియు, సూచించును. లతలు కృపతో రామునికిఁ త్రోవనుజూపుట కేవలం మాలంకారికభావన యనుకొనుట తగదు. వృక్షలతాదులు మానవులవలెనే సుఖదుఃఖాది భావములు గలిగియున్నట్లు ఆధునిక విజ్ఞానశాస్త్రవేత్తలు, కీ. శే. జగదీశచంద్రబోసు మొదలగువారు, చెప్పువరకు మనము నమ్మలేదు, కాని, ఈవిషయమును, "అంతఃసంజ్ఞా భవంత్యేతే సుఖదుఃఖ సమన్వితాః" అని బహుపురాతన కాలమునందే మనువు చెప్పెను.

శ్లో. మృగ్యశ్చ దర్భాంకుర నిర్వ్యపేక్షాః
తవాగతిజ్ఞం సమబోధయన్ మామ్,
వ్యాపారయంత్యో దిశి దక్షిణస్యాం
ఉత్పక్ష్మరాజీని విలోచనాని. 25

వ్యాఖ్య: దర్భాంకుర నిర్వ్యపేక్షాః–తినుచున్న దర్భమొలకలపై నిస్పృహ గలవియగు, మృగ్యః, చ–ఆడులేళ్ళు తము, ఉత్పక్ష్మరాజీని–యెత్తిన ఱెప్పల బారులుగల, విలోచనాని–కన్నులను, క్షిణస్యాం, దిశి–దక్షిణదిక్కునందు, వ్యాపారయంత్యః–ప్రవర్తింపఁజేయుచున్నవగుచు, తవ–నీయొక్క, అగతిజ్ఞం–గమన

మార్గము నెఱుఁగని, మాం-నన్ను-సమబోధయన్-ఎఱుకగలవానిని జేసినవి. నీకు జరిగిన విపత్తునకుఁ జింతించుచున్న మృగాంగనలు దక్షిణదిక్కువైపునకు తెప్ప లెత్తిచూచుచు నీవు కొనిపోఁబడిన మార్గమును నాకుఁదెలిపిన వని భావము. వాని దృష్టిచేష్టద్వారా నాకు బోధించినవిసుమా!

శ్లో. ఏత ద్గిరే ర్మాల్యవతః పురస్తాత్
ఆవిర్భవ త్యంబరలేఖి శృంగమ్,
నవం పయో యత్ర ఘనై ర్మయా చ
త్వద్విప్రయోగాశ్రు సమం విసృష్టమ్. 26

వ్యాఖ్య : మాల్యవతః-మాల్యావంతమను పేరుగల, గిరేః-పర్వతముయొక్క, అంబరలేఖి-ఆకాశమును తాకుచున్న, శృంగం-శిఖరము, ఏతత్-ఇదియే, పురస్తాత్-ఎదుట, ఆవిర్భవతి-కానవచ్చుచున్నది. యత్ర-ఏశిఖరమునందు, ఘనైః-మేఘముల చేత, నవం, పయః-నూతనవర్షజలము, మయా-నాచేత, త్వద్విప్రయోగాశ్రు—త్వత్-నీయొక్క, విప్రయోగ-ఎడఁబాటుచేత, అశ్రు, చ-కన్నీరున్ను, సమం, విసృష్టం-ఏకకాలమునందు విడువఁబడినదో! ఈ కనపడుచున్నది మాల్యవంతము యొక్క శిఖరము, అచ్చట వర్షఋతువునందు మేఘములు నూతనజలమును, నేను నీవియోగముచేతవచ్చిన కన్నీటిని, సమముగా విడిచితిమి వర్షఋతువు వియోగుల కెక్కువబాధాకర మని భావము.

శ్లో. గంధశ్చ ధారాహత పల్వలానాం
కాదంబ మర్ధోద్గత కేసరం చ,
స్నిగ్ధాశ్చ కేకాః శిఖినాం బభూవుః
యస్మి న్నసహ్యాని వినా త్వయా మే. 27

వ్యాఖ్య : యస్మిన్-ఏపర్వత శృంగమునందు, ధారాహత పల్వలానాం-ధారాహతి-వర్షధారలచేత కూలఁగొట్టబడిన యొడ్డులుగల, పల్వలానాం-చిన్న చిన్న సరస్సులయొక్క, గంధః, చ-పరిమళమున్ను, అర్ధోద్గత కేసరం-సగముపైకివచ్చిన కింజల్కములుగల, కాదంబం, చ-కడిమి పువ్వును, స్నిగ్ధాః-మధురములగు, శిఖినాం,

కేకాః, చ-నెమళ్ళయొక్క కేకలున్ను, త్వయా, వినా—నీవు లేనందుచేత, మే-నాకు అసహ్యాని-సహించుటకు వీలుగానివి, బభూవుః—అయినవి. నీవు లేనప్పుడు నాకే భోగ్య వస్తువును సుఖమునియ్య లేదని భావము. "అసహ్యాని" అనునది గంధ, కాదంబ, కేకలకు సాముదాయికమగు ఏకశేష, "నపుంసక మనపుంసకేన" అను సూత్రముచే సిద్ధించును.

శ్లో॥ పూర్వానుభూతం స్మరతా చ యత్ర
కంపోత్తరం భీరు! తవోపగూఢమ్,
గుహావిసారీ ణ్యతివాహితాని
మయా కథంచిత్ ఘనగర్జితాని. 28

వ్యాఖ్య : హేభీరు!-ఓ భయస్వభావము గలదానా! యత్ర-యేశృంగము నందు, పూర్వానుభూతం-పూర్వ మనుభవింపబడినదియు, కంపోత్తరం-శరీర కంపమే ముఖ్యముగా గలదియునగు, తవ, ఉపగూఢం-నీయాలింగనమును, స్మరతా-స్మరించుచున్న, మయా-నాచేత, గుహావిసారీణి-గుహలయందు వ్యాపించుచుండిన, ఘనగర్జితాని-మేఘగర్జనములు, కథంచిత్-అతికష్టముగా, అతివాహితాని-గడుపఁబడ్డవో! ఎచ్చట, మేఘగర్జనములు గుహలలోదూరి ప్రతిధ్వనించుటచేత, పూర్వానుభూతమైన నీయాలింగనమును స్మరించుచుండిన నాచేత నారోజులు శరీరకంప సహితములై గడుపఁబడినవో ఆప్రదేశమే యీగిరిశిఖరము సుమా! యని చెప్పెను. నాటి మేఘగర్జనము లుద్దీపకములై తత్పూర్వాలింగన స్మృతిని గలిగించినవని తాత్పర్యము.

శ్లో. ఆసారసిక్త క్షితిబాష్పయోగాత్
మా మక్షిణో ద్యత్ర విభిన్నకోశైః,
విడంబ్యమానా నవకందలైస్తే
వివాహధూమారుణ లోచనశ్రీః. 29

వ్యాఖ్య : యత్ర-ఏమాల్యవచ్ఛిఖరమునందు, విభిన్నకోశైః-విచ్చినమొగ్గలు గల, నవకందలైః-క్రొత్త నేలయరఁటి పువ్వులచేత, ఆసారసిక్తక్షితి బాష్పయో

గాత్——ఆసార-ధారాసంపాత :ర్షముచేత, సిక్త-తడుపఁబడిన, క్షితిబాష్ప-ధూమ వర్ణముగల నేలయావిరియొక్క, యోగాత్-సంబంధముకలుగుటయను కారణము వలన, విడంబ్యమానా-అనుకరింపఁబడుచున్న, తే-నీయొక్క, వివాహ ధూమారుణ లోచనశ్రీః-వివాహకాల హోమధూమముచేత నెఱ్ఱబడిన నీకన్నుల కాంతి (స్మరింపఁబడినదగుచు) మాం, అక్షిణోత్-నన్ను బాధించెనో! యెచ్చటనైతే వికసించిన నేల యరఁటిమొగ్గలు వర్షపాతముచే బాష్పము గ్రమ్మిన నేలపై జలబిందువులనురాల్చుచు, వివాహధూమారుణమైన నీనేత్రశోభను బోలుటకు యత్నించుచుండెనో అచ్చటి దృశ్యము నిన్నుస్మరింపఁజేసి యెక్కువగా బాధించెను. అదియే యీ పర్వత శిఖరము. "శోభా సంపత్తిపద్మాసు లక్ష్మీః శ్రీ రివకథ్యతే" అను నిఘంటువువలన నిచ్చట శ్రీ శబ్దమునకు "కాంతి" యని యర్థము

శ్లో. ఉపాంత వానీర వనోపగూఢా

న్యాలక్ష్య పారిప్లవ సారసాని,

దూరావతీర్ణా పిబతీవ ఖేదా

దమూని పంపాసలిలాని దృష్టిః. 30

వ్యాఖ్య : ఉపాంత వానీర వనోపగూఢాని--ఉపాంత-ప్రక్కనున్న, వానీరవన-నీటిప్రబ్బలివనములచేత, ఉపగూఢాని-కప్పఁబడినవియు, ఆలక్ష్య పారిప్లవసారసాని--ఆలక్ష్య-కొంచెముకనఁబడునవియై, పారిప్లవ-కదలుచున్న (ఈదుచున్న)సారసాని-చిన్నకొంగలుగలవియునగు, అమూని, పంపాసలిలాని-ఈపంపా సరోవర జలములను, దూరావతీర్ణా--దూరాత్-దూరమునుండి, అవతీర్ణా-దిగినట్టి. దృష్టిః-నాచూపు, ఖేదాత్-అలసటవలన. పిబతి, ఇవ- తాగుచున్నదివలె నున్నది. మాల్యవత్పర్వత ప్రాంతమును దాటి విమానము పంపాసరోవర ప్రాంతమునకు వచ్చినది. అప్పుడు రాముఁడు, సీతా! ప్రబ్బలివనములతోఁ జుట్టఁబడి, కదలుచునీదుచున్న సారసములుగల యీ పంపాజలములను దూరప్రయాణమువలన అలసిన నాదృష్టి త్రాగుచున్నట్లున్నదిసుమా! అనఁగా నాకీచోటును విడుచుటకు బుద్ధిపుట్టుట లేదని భావము.

శ్లో. అత్రావియుక్తాని రథాంగనామ్నా

మన్యోన్య దత్తోత్పల కేసరాణి,

ద్వంద్వాని దూరాంతరవర్తినా తే
మయా ప్రియే! సస్పృహా మీక్షితాని. 31

వ్యాఖ్య : అత్ర-ఈపంపా సరస్సునందు, అన్యోన్య దత్తోత్పల కేసరాణి అన్యోన్య-ఒకదానికొకటి, దత్త-ఇయ్యఁబడిన, ఉత్పలకేసరాణి-కలువల కేసరములు గలవియు, అవియుక్తాని-ఎడబాటులేనివియు నగు, రథాంగనామ్నాం-చక్రవాకములయొక్క-, ద్వంద్వాని-జంటలు, తే-నీకు, దూరాంతరవర్తినా-దూరదేశముననుండిన, మయా-నాచేత, ప్రియే-ప్రియురాలా! సస్పృహం-అభిలాషపూర్వముగా, ఈక్షితాని-చూడఁబడినవి. ఈ పంపాసరస్సునందలి చక్రవాకమిథునములు కలువకింజల్కముల నందించుకొనుచు, ఒకదానినొకటి యొరసికొనుచు నుండఁగాఁ జూచిన నాకు నీవు స్మృతికివచ్చుటయు, దూరవర్తినగుటచేత నిన్నుఁగలిసికొనలేక పోయితినే యని బాధపడుటయు జరిగి, ఆజంటలనే సాభిలాషముగాఁ జూచు చుంటిని ప్రియా! యని భావము.

శ్లో. ఇమాం తటాశోకలతాం చ తన్వీం
స్తనాభిరామ స్తబకాభినమ్రామ్,
త్వత్ప్రాప్తిబుద్ధ్యా పరిరబ్ధుకామః
సౌమిత్రిణా సాశ్రు రహం నిషిద్ధః. 32

వ్యాఖ్య : మరియును, స్తనాభిరామ స్తబకాభినమ్రాం- స్తనాభిరామ- స్తనములవలె నందముగానున్న, స్తబక-పూగుత్తులచేత, అభినమ్రాం-ఎదురుగావంగినదియు, తన్వీం-సన్నగానున్న, ఇమాం-ఈ, తటాశోకలతాం-పంపాతటమున నున్న యశోకలతను, త్వత్ప్రాప్తిబుద్ధ్యా-నీవు వచ్చితి వన్నభ్రమచేత, పరిరబ్ధుకామః-ఆలింగనము చేసికొనుటకుఁ బూనినట్టి, అహం-నేను, సౌమిత్రిణా-లక్ష్మణునిచేత, సాశ్రుః-కన్నీరుఁగార్చుచున్న వాఁడనై, నిషిద్ధః-తొలఁగింపబడితిని. స్తనములవంటి రెండు పూగుత్తులతో నెదురుగా వంగియుండిన యీ పంపాతటమునందలి యశోకలతను జూచి సీవే యచ్చట నిలువఁబడియుంటివని యాలింగనము చేసికొనఁబోగా లక్ష్మణుఁడు "ఇచ్చట సీతలేదు, ఇది యశోకలత" యనిచెప్పి, నిజముతెలిసినమీఁదటఁ గన్నీరుఁగార్చుచున్న నన్ను అచ్చటినుండి తొలఁగించెను. అది, ఈయశోకశాఖ యని చెప్పెను.

శ్లో. అమూ ర్విమానాంతర లంబినీనాం
శ్రుత్వా స్వనం కాంచనకింకిణీనామ్,
ప్రత్యుద్వ్రజంతీవ ఖ ముత్పతంత్యో
గోదావరీ సారసపం క్తయ స్త్వామ్. 33

వ్యాఖ్య : విమానాంతరలంబినీనాం-విమానముయొక్క సందులలోనుండి వ్రేలాడుచున్న, కాంచనకింకిణీనాం-బంగారపుగజ్జెలయొక్క, స్వనం-చప్పుడును, శ్రుత్వా-విని, (తమజాతిగుంపు ధ్వని యనుభ్రమచేత) ఖం-ఆకాశమునుగురించి, ఉత్పతంత్యః-ఎగురుచున్న, అమూః-ఈ, గోదావరీ సారసపంక్తయః-గోదావరీ నదియందలి బెగ్గురు పక్షులు (కొంగలు), త్వాం, ప్రత్యుద్వ్రజంతి, ఇవ-నిన్ను యెదుర్కొనుచున్నట్లు ఉన్నవి. మనవిమానము గోదావరీనది ప్రాంతమునకు వచ్చినది యని చెప్పుటలో, సీతా! విమానపుసందులలో వ్రేలాడుచున్న సువర్ణకింకి ణుల చప్పుడును తమజాతికొంగలేవో యలికిడి చేయుచున్నట్లు భావించి పైకెగురు చున్న యీ బెగ్గురుపక్షులు నీకు స్వాగతమును జెప్పుటకు వచ్చుచున్నట్లున్నవి సుమా! అన్నాడు. అలంకారము: ఉత్ప్రేక్ష.

శ్లో. ఏషా త్వయా పేశలమధ్యయా உపి
ఘటాంబు సంవర్ధిత బాలచూతా,
ఆనందయ త్యున్ముఖ కృష్ణసారా
దృష్టా చిరాత్ పంచవటీ మనో మే. 34

వ్యాఖ్య : పేశలమధ్యయా, అపి-సుకుమారమైన నడుముగలదానవైనను, త్వయా-నీచేత, ఘటాంబు సంవర్ధిత బాలచూతా-ఘటాంబు-కడవలనీటిచేత, సంవర్ధిత-పెంచఁబడిన, బాలచూతా-గున్నమామిడి చెట్లుగలదియు, ఉన్ముఖకృష్ణసారా-మనవైపు మొగమునెత్తిచూచు మగలేళ్ళుగలదియు, చిరాత్-బహుకాలము తర్వాత, దృష్టా-మనచేఁజూడఁబడినదియునగు, ఏషా, పంచవటీ-ఈపంచవటి, మే, మనః-నామనస్సును, ఆనందయతి-ఆహ్లాదపరచుచున్నది. బరువును మోయఁజాలని సుకుమారమధ్యము గలదానవైనను, కడవలతో గోదావరి జలమునుదెచ్చిపోసి, ప్రేమతోఁ బెంచిన మామిడిమొక్కలు గలిగియుండినదియు, నీచేఁబెంచఁబడిన కృష్ణసారములు మొగమునెత్తి మనవద్దికివచ్చు సౌభాగ్యముగలదియు నైయుండిన యీపంచవటి నెంత

కాలమునకుఁజూచితిమి సీతా! ఇది నామనస్సునెంతగానో యాహ్లాదపరచుచున్నది అని భావము.

శ్లో. అత్రానుగోదం మృగయానివృత్తః
తరంగవాతేన వినీతఖేదః,
రహ స్త్వదుత్సంగ నిషణ్ణ మూర్ధా
స్మరామి వానీరగృహేషు సుప్తః. 35

వ్యాఖ్య : అత్ర-ఈపంచవటియందు, అనుగోదం-గోదావరిసమీపమున, మృగయానివృత్తః-వేటనుండి మరలివచ్చినవాఁడనై, తరంగవాతేన-గోదావరీ తరంగముల నుండివచ్చు గాలిచేత, వినీతఖేదః-తొలఁగింపఁ బడిన యలసటగల వాఁడనై, రహః-ఏకాంతమున, త్వదుత్సంగ నిషణ్ణమూర్ధా-త్వదుత్సంగ-నీతొడ యందు, నిషణ్ణ-ఉంచఁబడిన, మూర్ధా-శిరస్సుగలవాఁడనగుచు, వానీరగృహేషు-ప్రబ్బలిపొదలయందు, సుప్తః-నిద్రించియుంటినని, స్మరామి-స్మరించుచున్నాను. ఈపంచవటివద్ది గోదావరియొడ్డుననున్న ప్రబ్బలిపొదలలో వేటనుండివచ్చి, తరంగ వాయువులు హాయిగఁ గూర్చఁగా నీతొడపైఁదలనుంచి నేను నిద్రించిన విషయము జ్ఞాపకమునకు వచ్చుచున్నది సీతా! "గోదా" గోదావరికి పర్యాయపదము.

శ్లో. భ్రూభేదమాత్రేణ పదా న్మఘోనః
ప్రభ్రంశయాం యో నహుషం చకార
తస్యా విలాంభః పరిశుద్ధిహేతోః
భౌమో మునేః స్థానపరిగ్రహో ఽయమ్. 36

వ్యాఖ్య : యః-ఏముని, భ్రూభేదమాత్రేణ-కనుబొమ్మలు చిట్లించినమాత్ర ముచేతనే, నహుషం-నహుషుఁడను రాజును, మఘోనః, పదాత్-ఇంద్రునియొక్క పదవినుండి, ప్రభ్రంశయాంచకార-భ్రష్టునిగాఁజేసెనో, ఆవిలాంభఃపరిశుద్ధి హేతోః-ఆ విలాంభః-కలుషితమగు జలముయొక్క పరిశుద్ధిహేతోః నిర్మ లత్వమునకుఁగారణుఁడయిన, తస్య, మునేః - ఆయగస్త్యమునియొక్క, భౌమః-భూమియందలిదగు, స్థానపరిగ్రహః-నివాసయోగ్యమగు నాశ్రమము, అయం-ఇది. ఏమునియొక్క క్రోధదృష్టి నహుషునిఁ బదభ్రష్టునిఁజేసినదో,

నక్షత్రరూపమున యేముని గగనమునందావిర్భవింపఁగా శరదృతువున నదీతటాకాది జలములన్నియు వర్షాకాలపుఁగాలుష్యమును బాసి నిర్మలములగునో, ఆ యగస్త్యముని "లోకకళ్యాణమునకై భూమిపై నేర్పరచుకొన్న నివాసమగు ఆశ్రమము ఇది, అని చెప్పెను ఇంద్రపదవీగర్వితుఁడై మునులను, అగస్త్యుని నవమానించుటచే నహుషుని కగస్త్యుఁడు పదభ్రష్టుఁడగునట్లు శాపము నిచ్చెను. అగస్త్యనక్షత్రోదయము శరదృతువున జరుగుటయు జలము స్వచ్ఛముగా మారుటయు నేటికిని లోకానుభవసిద్ధము.

శ్లో. త్రేతాగ్నిధూమాగ్ర మనింద్యకీర్తేః
తస్యేద మాక్రాంతవిమానమార్గమ్,
ఘ్రాత్వా హవిర్గంధి రజోవిముక్తః
సమశ్నుతే మే లఘిమాన మాత్మా. 37

వ్యాఖ్య: అ ంద్యకీర్తేః-ఉత్తమకీర్తిగల, తస్య-ఆయగస్త్యునియొక్క, ఆక్రాంతవిమానమా ం-ఆక్రమింపఁబడిన మనవిమానమార్గము గలదియు, హవిర్గంధి-హుతద్ర ˜ రిమళము గలదియునగు, త్రేతాగ్నిధూమా గ్రం-అగ్నిత్రయ ధూమముయొక్క భాభాగమైన, ఇదం-దీనిని, ఘ్రాత్వా-ఆఘ్రాణించి, రజోవిముక్తః-రజోగుణముచేతవదలఁబడిన, మే, ఆత్మా-నాయంతఃకరణము లఘిమానం-లఘుత్వగుణమును, సమశ్నుతే-పొందుచున్నది. ఆయగస్త్యుని హోమధూమము మనమార్గమున వ్యాపించుటచేత దాని నా ఘ్రాణించిన నామనస్సు రజోగుణవిముక్తమై తేలికపడినదని భావము. త్రేతాయనఁగా అగ్నిత్రయము. "అగ్నిత్రయమిదం త్రేతా" అని యమరము.

శ్లో. ఏత న్మునే ర్మానిని! శాతకర్ణేః
పంచాప్సరో నామ విహారవారి,
ఆభాతి పర్యంతవనం విదూరాత్
మేఘాంతరాలక్ష్య మివేందుబింబమ్. 38

వ్యాఖ్య: మానిని-ఓ సీతా! శాతకర్ణేః-శాతకర్ణి యను మునికి సంబంధించిన, పంచాప్సరః, నామ-పంచాప్సర మని పేరుఁబడసినదియు, పర్యంతవనం-

చుట్టును వనములు గలదియునగు, ఏతత్, విహారవారి-ఈ క్రీడా సరస్సు, విదూరాత్-ఎక్కువ దూరమునుండి, మేఘాంతరాలక్ష్యం-మేఘముల నడుమ కొంచముగాఁ గనఁబడునట్టి, ఇందుబింబం, ఇవ-చంద్రబింబమువలె, ఆభాతి-ప్రకాశించు చున్నది. మేఘముల నడుమ నున్న చంద్రబింబమువలె దూరమునుండి వన మధ్యమున కొద్దిగాఁ గనఁబడుచున్న యీ వెలుఁగు "పంచాప్సర" మను పేరుగల శాతకర్ణి మునియొక్క క్రీడా సరోవరము సీతా! యని చెప్పెను. "పంచ అప్సరసః యస్మిన్ తత్ పంచాప్సరః" అని విగ్రహము చెప్పవలసిన బహువ్రీహి సమాస మిది.

శ్లో. పురా స దర్భాంకురమాత్రవృత్తిః
చరన్ మృగైః సార్ధ మృషి ర్మఘోనా,
సమాధిభీతేన కిలోపనీతః
పంచాప్సరోయౌవనకూటబంధమ్. 39

వ్యాఖ్య : పురా-పూర్వకాలమునందు, దర్భాంకురమాత్ర వృత్తిః-దర్భ మొలకలు మాత్రమే యాహారముగాఁ గలవాఁడై, మృగైః, సార్ధం-లేళ్ళతోఁగూడి, చరన్-తిరుగుచుండిన (లేక దర్భను మేయుచుండిన), సః ఋషిః-ఆ శాతకర్ణిముని, సమాధిభీతేన-శాతకర్ణియొక్క తపస్సమాధివలన భయపడిన, మఘోనా-ఇంద్రుని చేత, పంచాప్సరోయౌవనకూటబంధం—పంచాప్సరో-అయిదుగురు అప్సర స్త్రీల యొక్క, యౌవన-యౌవనమనెడు, కూటబంధం-కూటయంత్రమును, ఉపనీతః, కిల-చేర్పఁబడెనని చెప్పదురు. ఏహా తపస్వియగు శాతకర్ణి మృగరూపమునుదాల్చి మృగములతోఁ దిరుగుచు, దర్భాంకురమాత్ర భోజనముగలవాఁడై యుండఁగా నతని తపోనిష్ఠకు భయపడిన యింద్రుఁడు పంచాప్సర స్త్రీలను ఆడులేళ్ళ రూపముతోఁ బంపి మృగమును బంధించినట్లే యీ ఋషిని బంధించెనని ఐతిహ్యము గలదని చెప్పెను.

శ్లో. త స్యాయ మంత ర్హితసౌధభాజః
ప్రసక్త సంగీత మృదంగ ఘోషః,
వియద్గతః పుష్పకచంద్రశాలాః
క్షణం ప్రతిశ్రుమ్ముఖరాః కరోతి. 40

వ్యాఖ్య : అంతర్హితసౌధభాజః—అంతర్హిత-జలాంతర్గతమైన, సౌధ-మేడను, భాజః-చేరియున్న, తస్య-ఆ శాతకర్ణియొక్క, అయం-ఈ, ప్రసక్త సంగీత మృదంగ ఘోషః—ప్రసక్త-ఎడతెగని, సంగీత-సంగీతమునకు సంబంధించిన, మృదంగఘోషః-మృదంగ ధ్వని, వియద్గతః (సన్)-ఆకాశమును జేరినదగుచు, పుష్పకచంద్రశాలాః-ఈ పుష్పక విమానముయొక్క శిరోగృహములను, క్షణం-క్షణకాలము, ప్రతిశ్రుణ్ముఖరాః—ప్రతిశ్రుత్-ప్రతిధ్వనులచేత, ముఖరాః-ధ్వనించువానినిగా, కరోతి-చేయుచున్నది. అప్సరసల చేతిలోఁ జిక్కిన శాతకర్ణి జలాంతర్గత సౌధమున నివసించుచు నిరంతర సంగీత లోలుపుఁడై యుంటుటచేత నచ్చటి మృదంగ ధ్వని మన విమాన చంద్రశాలల యందు క్షణకాలము ప్రతిధ్వనించినది. "క్షణం" అని చెప్పుట విమాన మొకచోట నిలుచునది కాదు గావున. "చంద్రశాలా శిరోగృహమ్" అని హలాయుధ నిఘంటువు; "స్త్రీ ప్రతిశ్రుత్ ప్రతిధ్వానే" అని యమరము.

శ్లో. హవిర్భుజా మేధవతాం చతుర్ణాం
మధ్యే లలాటంతపసప్తసప్తిః,
అసౌ తపస్య త్యపర స్తపస్వీ
నామ్నా సుతీక్ష్ణ శ్చరితేన దాంతః. 41

వ్యాఖ్య : నామ్నా, సుతీక్ష్ణః-పేరుచేత సుతీక్ష్ణుఁడనియు, చరితేన,దాంతః-నడవడిచేత దాంతుఁడనియుఁ బ్రసిద్ధుఁడైన, అసౌ-ఈ, అపరః,తపస్వీ, మరియొక ముని, ఏధవతాం-ఇంధనవంతములగు, చతుర్ణాం, హవిర్భుజాం-నాలుగగ్నుల యొక్క, మధ్యే-నడుమనుండి, లలాటంతపసప్తసప్తిః—లలాటంతప-ఫాల ప్రదేశమును మండించుచున్న, సప్తసప్తిః-సూర్యుఁడుగలవాఁడగుచు, తపస్యతి-తపస్సును జేయుచున్నాఁడు. పేరు సుతీక్ష్ణుఁడైనను ప్రవర్తనలో సౌమ్యుఁడైన యీ మరియొక ఋషి అగ్ని చతుష్టయ మధ్యగతుఁడై చూపును తీక్ష్ణ రవిబింబము పై నిలిపి తపస్సును జేయుచున్నాఁడు చూడుమని శాతకర్ణిని దాటివచ్చిన పిమ్మటఁ జూపెను. "ఏధ" శబ్దమునకు కాష్ఠము, ఇంధనము అనునవి పర్యాయపదములు. "లలాటం తపతి ఇతి లలాటంతపః" అని విగ్రహము. "ఖశ్" ప్రత్యయాంత మగునీశబ్దమునకు "అరుర్ద్విష" దిత్యాది సూత్రముచేత ముమాగమము వచ్చి" లలాటంతపః" అనియైనది. లేనిచో "లలాట తప" అని కావలసియుండును. "సప్తసప్తిః" అనఁగా ఏడు గుఱ్ఱములు (రథము

నకు) గలవాఁడు, సూర్యుఁడు అని యర్థము. "దాంతః" అనఁగా దమము (ఇంద్రియ వాంఛలనణచుట) గలవాఁడు.

శ్లో. అముం సహాస ప్రహితేక్షణాని
వ్యాజార్ధ సందర్శిత మేఖలాని,
నాలం వికర్తుం జనితేంద్రశంకం
సురాంగనా విభ్రమ చేష్టితాని. 42

వ్యాఖ్య : జనితేంద్రశంకం-తపస్సుచేత సింద్రునికి సందేహమును బుట్టించిన, అముం-ఈసుతీక్ష్ణమునిని, సహాస ప్రహితేక్షణాని—సహాస-నవ్వులతో, ప్రహిత-పంపఁబడిన, ఈక్షణాని-చూపులుగలవియు, వ్యాజార్ధసందర్శిత మేఖలాని—వ్యాజ-ఏదేనొక నెపముతో, అర్ధసందర్శిత-సగము చూపఁబడిన, మేఖలాని-మొలనూళ్ళు గలవియునగు, సురాంగనా విభ్రమ చేష్టితాని-ఇంద్రుఁడు పంపిన దేవాంగనలవిలాస చేష్టితములు, వికర్తుం-వికారమునుజెందించుటకు, నాలం (న + అలం)-చాలలేదు. సుతీక్ష్ణముని తపస్సువలన తన యింద్రపదవి కేమిముప్పువచ్చునోయని యింద్రుఁడు పంపిన రంభాద్యప్సరసలు నవ్వులు, అనురాగవీక్షణములు, అర్ధదర్శిత నాభిప్రదేశములు గల శృంగార విలాసముల నెన్నిటినిఁజూపినప్పటికిని అవి యామునికిఁ జిత్తవికారమును గలిగింపలేకపోయెను. ఈముని చలింపలేదు.

శ్లో. ఏషో ఽక్షమాలావలయం మృగాణాం
కండూయితారం కుశసూచిలావమ్,
సభాజనే మే భుజ మూర్ధ్వబాహుః
సవ్యేతరం ప్రాధ్వ మితః ప్రయుంక్తే. 43

వ్యాఖ్య : ఊర్ధ్వబాహుః-ఎత్తినబాహువుగల, ఏషః-ఈసుతీక్ష్ణముని, అక్షమాలావలయం-జపమాలయే కంకణముగాఁగలదియు, మృగాణాం-లేళ్ళను, కండూయితారం-గోకునదియు, కుశసూచిలావం-దర్భాంకురములను గోయునదిఁయు, సవ్యేతరం (సవ్య + ఇతరం) కుడిప్రక్కదియగు (సవ్యమనఁగా నెడమప్రక్క), భుజం-బాహువును, మే, సభాజనే-నాయొక్క సంమానమునకై, ఇతఃప్రాధ్వం-ఇచ్చట నానుకూల్యముగా నున్నదని, ప్రయుంక్తే-ప్రయోగించుచున్నాఁడు (చూపు

చున్నాఁడు). ఊర్ధ్వబాహుఁడై కనఁబడుచున్న యీసుతీక్ష్ణముని, తన జపశీలత్వ, భూతదయావత్వ, కర్మక్షమత్వ ద్యోతకమగు దక్షిణబాహువును, ఇచ్చట సత్కారమును స్వీకరించి వెళ్ళవలసినదని నన్ను బలవంతపెట్టుచుఁ, జూపుచున్నాఁడని తాత్పర్యము. "ప్రాధ్వం" ఇది యవ్యయము. అనుకూలార్థకం ప్రాధ్వమ్ అని యమరము.

శ్లో. వాచం యమత్వాత్ ప్రణతిం మమైష
కంపేన కించిత్ ప్రతిగృహ్య మూర్ధ్నః,
దృష్టిం విమానవ్యవధాన ముక్తాం
పునః సహస్రార్చిషి సంనిధత్తే. 44

వ్యాఖ్య : ఏషః-ఈసుతీక్ష్ణుఁడు, వాచంయమత్వాత్-మౌనవ్రతముగలవాఁడగుటవలన, మమ,ప్రణతిం-నానమస్కారమును, కించిత్-కొంచము మూర్ధ్నః, కంపేన-శిరఃకంపముచేత, ప్రతిగృహ్య-స్వీకరించి, విమానవ్యవధానముక్తాం-విమానముయొక్క యడ్డగింపువలన విడువఁబడిన, దృష్టిం-తన చూపును, పునః-మరల, సహస్రార్చిషి-సూర్యునియందు, సంనిధత్తే-చక్కగా నిలుపుచున్నాఁడు. ఈముని మౌనవ్రతముగలవాఁడగుటవలన నానమస్కారమును కొంచముగా తలయూపి స్వీకరించి, తన దృష్టికిని సూర్యునికిని మధ్యలోవచ్చిన మన విమానము ముందునకు సాగగానే మరలభాస్కరునిపైఁ దనచూపును నిలిపెను సుమా! యన్నాఁడు. "వాచం యచ్ఛతి ఇతివాచం యమః" అని విగ్రహము.

శ్లో. అదః శరణ్యం శరభంగనామ్న
స్తపోవనం పావన మాహితాగ్నేః,
చిరాయ సంతర్ప్య సమిద్భి రగ్నిం
యో మంత్రపూతాం తను మప్యహౌషీత్. 45

వ్యాఖ్య : శరణం-ఆశ్రయింపఁదగినదియు, పావనం-పవిత్రతగలిగించునదియు, అదః-ఈ కనపడుచున్న), తపోవనం-తపోవనము, ఆహితాగ్నేః-నిత్యాగ్నిహోత్రియగు, శరభంగనామ్నః-శరభంగుఁడను పేరుగల మునికి సంబంధించినట్టిది. యః-ఏశరభంగ మహాముని,

చిరాయ-బహుకాలము, అగ్నిం-అగ్నిహోత్రుని, సమిద్భిః-సమిథలచేత, సంతర్ప్య-తృప్తిపరచి, (పిమ్మట) మంత్రపూతాం-మంత్రములచేత శుద్ధమైన, తనుం, అపి-తన శరీరమును సైతము, అహౌషీత్-హోమముచేసెనో! చిరకాలము యజ్ఞ యాగ నిత్యాగ్ని కార్యములను సమిదాజ్యాది ద్రవ్యములతో చేసి, యగ్నిని తృప్తిపరిచి, చివరికి తన దేహమునే యగ్నిహోత్రునికి సమర్పించిన శరభంగ మహర్షికి సంబంధించిన పుణ్యాశ్రమ మిది యని సీతకుఁ జూపెను. "అహౌషీత్" ఇది "హు-దానాదనయోః" అను ధాతువుయొక్క లుఙ్ రూపము.

శ్లో. ఛాయా వినీతాధ్వ పరిశ్రమేషు
భూయిష్ఠ సంభావ్య ఫలే ష్వమీషు,
తస్యాతిథీనా మధునా సపర్యా
స్థితా సుపుత్రేష్వివ పాదపేషు. 46

వ్యాఖ్య : అధునా-ఇప్పుడు (శరభంగముని యనంతరమున), తస్య-ఆ మునికి సంబంధించిన, అతిథీనాం, సపర్యా-అతిథులయొక్క సత్కారము, ఛాయా వినీతాధ్వపరిశ్రమేషు-నీడలచేతఁ దొలఁగింపఁబడిన మార్గశ్రమగలవియు, భూయిష్ఠ సంభావ్య ఫలేషు-అధికములై మెచ్చఁదగిన ఫలములుగలవియునగు, అమీషు,పాదపేషు-ఈ యాశ్రమ వృక్షములయందు, సుపుత్రేషు, ఇవ-సత్పుత్రులయందువలె, స్థితా-ఉన్నది. ఆ శరభంగముని లేకపోయినను ప్రస్తుతకాలమున యిచ్చటికి వచ్చు నతిథులకు చల్లని నీడనిచ్చి మార్గాయాసమును దొలఁగించుచును, వలసిన ఫలములు పుష్కలముగా నిచ్చుచును ఆశ్రమ వృక్షములు అతిథి పూజను ఆ ముని సత్పుత్రులవలె నెరవేర్చుచున్నవి. ఇప్పుడును అతిథులిచ్చటికి వచ్చుచుందురు. సత్పుత్రులు తమ తండ్రి చేయుచుండిన సత్కార్యములను విడువరు.

శ్లో. ధారాస్వనోద్గారి దరీముఖో ఽసౌ
శృంగాగ్ర లగ్నాంబుద వప్రపంకః,
బధ్నాతి మే బంధురగాత్రి! చక్షుః
దృప్తః కకుద్మానివ చిత్రకూటః. 47

వ్యాఖ్య : ధారాస్వనోద్గారిదరీముఖః—ధారా–జలధారలయొక్క, స్వనోద్గారి-ధ్వనిని వెలువరచుచున్న, దరీముఖః-దరియే ముఖముగాఁ గలదియు, శృంగాగ్ర లగ్నాంబుద వప్రపంకః—శృంగ-శిఖరమనెడు కొమ్ముయొక్క, అగ్ర-చివరిభాగమునందు, లగ్న–చేరిన, అంబుదవప్రపంకః-మేఘమనియెడు వప్రక్రీడా కర్దమము గలదియునైన, అసౌ, చిత్రకూటః-ఈచిత్రకూట పర్వతము, బంధుర గాత్రి!—ఎత్తును వంపును గలదేహముగలదానా! (లేక యౌవనముచేత దిట్టములగు నవయవములు గలదానా!) దృప్తః-మదించిన, కకుద్మాన్, ఇవ-వృషభమువలె, మే, చక్షుః-నాచూపును, బధ్నాతి-కట్టివేయుచున్నది. ఎడతెగని జలధారాధ్వనిగల కందరముతోను, శిఖరాగ్రమునందున్న మేఘముతోను యీచిత్రకూటము, అంకెలు వేయుచు, కొమ్ములకు కోరాడుటచేత అంటుకొన్న బురదగలిగి, మదించిన వృషభమువలెఁ గన్పడుచు, నాదృష్టినిఁ జలింపనీయకున్నది సుమా! అనఁగా దానివైపునకే చూడమనసగుచున్న దని భావము. "బంధురంతూన్నతానతమ్" అని యమరకోశము.

శ్లో. ఏషా ప్రసన్న స్తిమిత ప్రవాహా
సరి ద్విదూరాంతరభావ తన్వీ,
మందాకినీ భాతి నగోపకంఠే
ముక్తావలీ కంఠగతేవ భూమేః. 48

వ్యాఖ్య : ప్రసన్న స్తిమిత ప్రవాహా-నిర్మలమై నిష్పందమైన ప్రవాహము గలదియు, విదూరాంతరభావతన్వీ-దూరాన లోతుననుండుటచేత చిన్నదిగాఁ గానవగు, మందాకినీ-మందాకిని పేరుతో చిత్రకూటమునంటి పాఱునట్టి, ఏషా, సరిత్-ఈనది, నగోపకంఠే-పర్వతప్రాంతమునందు, భూమేః-భూదేవికి, కంఠగతా-మెడపైనున్న, ముక్తావళీ, ఇవ-ముత్యాలదండవలె, భాతి-ప్రకాశించుచున్నది. నెమ్మదిగా ప్రవహించుచు దూరమున నుంటుటచేత చిన్నదిగాఁ గనఁబడు ఈ మందాకినినది చిత్రకూట ప్రాంతమున భూదేవి మెడలోని ముత్యాలహారమువలె నున్నది. ఇచ్చట చిత్రకూటమును భూదేవి శిరస్సునుగాను, తత్ప్రాంతమును కంఠమునుగాను భావింపవలయును. ఇది "మందాకిని" యనుపేరుగల యొక చిన్ననది. అలంకారము: ఉత్ప్రేక్ష.

శ్లో. అయం సుజాతో ౽నుగిరం తమాలః
ప్రవాల మాదాయ సుగంధి యస్య,
యవాంకురాపాండు కపోలశోభీ
మయా ౽వతంసః పరికల్పిత స్తే. 49

వ్యాఖ్య : అనుగిరం-ఈచిత్రకూట పర్వత సమీపమున, సుజాతః-చక్కఁగాపుట్టిన, తమాలః-క్రానుఁగచెట్టు (ఉలిమిరి, చీకటిమాను) అయం-ఇది. యస్య-ఏతమాలవృక్షముయొక్క, సుగంధి-మంచిపరిమళముగల, ప్రవాలం-చిగురును, ఆదాయ-తీసికొని, మయా-నాచేత, తే-నీకు, యవాంకురాపాండు, కపోలశోభీ—యవాంకురమువలె తెల్లనిదగు నీకపోలమునందు ప్రకాశించునట్టి, అవతంసః-కర్ణభూషణము, పరికల్పితః-కల్పింఁపఁబడియుండెనో! పరిమళవంతమగు దేనిచిగురును దెచ్చి నీకపోలమునందు అవతంసముగా మునుపునేను అలంకరించితినో ఆతమాలవృక్షమే యీగిరిప్రక్కనున్నది. "గిరేః సమీపే అనుగిరం" గిరేశ్చ సేనకస్య అనుసూత్రముచేత సమాసాంతమున "టచ్" ప్రత్యయము (అ) వచ్చి "అనుగిరం" అయినది.

శ్లో. అనిగ్రహత్రాస వినీత సత్త్వ
మపుష్పలింగాత్ ఫలబంధివృక్షమ్,
వనం తపఃసాధన మేత దత్రేః
ఆవిష్కృతోదగ్రతర ప్రభావమ్. 50

వ్యాఖ్య : అనిగ్రహత్రాస వినీతసత్త్వం—అనిగ్రహత్రాస-దండభయము లేనివైనను, వినీత-వినయముగల (లొంగి క్రమశిక్షణమున మెలఁగున ). సత్త్వం-శార్దూలాది జంతువులుగలదియు, అపుష్పలింగాత్-పుష్పరూప నిమి ములేకయే, ఫలబంధివృక్షం-పండ్లుపండునట్టి వృక్షములుగలదియు (కావుననే), ఆ విష్కృతోదగ్రతర ప్రభావం-ఆవిష్కృత-ప్రకటింపఁబడిన, ఉదగ్రతర-అత్యున్నతమైన, ప్రభావం-మహిమగల, అత్రేః-అత్రిమహామునియొక్క, తపఃసాధనం-తపస్సునకుసాధనమగు, వనం—వనము, ఏతత్-ఇది. కొట్టుట, కోపగించుట లేకయే వినయవినమ్రములైన మృగము లిచ్చట సంచరించును. పూతపట్టకయే యిచ్చటి వృక్షములు ఫలములనిచ్చును కనుక మహామహిమగలదియని ప్రసిద్ధిఁజెందిన యీ

వనము అత్రిమహామునియొక్క తపోవనము సుమా! యని రాముఁడు సీతకుఁ జెప్పెను.

శ్లో. అత్రా భిషేకాయ తపోధనానాం
సప్తర్షి హస్తోద్ధృత హేమపద్మామ్,
ప్రవర్తయామాస కిలా నుసూయా
త్రిస్రోతసం త్ర్యంబక మౌలిమాలామ్. 51

వ్యాఖ్య : అత్ర-ఈ యవనమునందు, అనసూయా-అత్రిభార్యయగు అనసూయాదేవి, సప్తర్షి హస్తో త హేమపద్మాం-సప్తఋషుల చేతులతోఁ గోయఁబడిన బంగారు తామరలు గల యు, త్ర్యంబక మౌలిమాలాం-శివునితలపైని పూలదండయునగు, త్రిస్రోతసం-గంగానదిని, తపోధనానాం-ఋషులయొక్క, అభిషేకాయ-స్నానముకొఱకై, ప్రవర్తయామాస, కిల-ప్రవహింపఁజేసె నందురు. పూర్వము అనసూయాదేవి యతిథులుగా వచ్చిన ఋషులందఱికిని స్నాన సౌకర్యార్థమై, స్వర్గవాహినియై సప్తర్షులు స్వయముగాఁ దెంపుకొను కనక కమలములు గలదియు, శివుని తలపై మల్లెదండగా మెఱయునదియు నగు గంగానదిని ఈ వనమునందుఁ బ్రవహించునట్లు చేసినదని పెద్దలు చెప్పుదురు. "త్రిస్రోతసం" స్వర్గ మర్త్య పాతాళ లోకములందుఁ బ్రవహించుటచేత "గంగ" త్రిపథగా అని వ్యవహరింపఁబడుచున్నదని యర్థము. "త్రీణి స్రోతాంసి యస్యాః సా త్రిస్రోతాః, తాం త్రిస్రోతసం" అని వ్యుత్పత్తి.

శ్లో. వీరాసనై ర్ధ్యానజుషా మృషీణా
మమీ సమధ్యాసిత వేదిమధ్యాః,
నివాత నిష్కంపతయా విభాంతి
యోగాధిరూఢా ఇవ శాఖినోఽపి. 52

వ్యాఖ్య: వీరాసనైః-వీ నములచేత, ధ్యానజుషాం-ధ్యానమును పొందిన, ఋషీణాం-ఋషులయొక్క వారికి సంబంధించిన), సమధ్యాసితవేదిమధ్యాః-ధ్యానవేదికల నడుమనున్న, , శాఖినః, అపి-ఈ వృక్షములుసైతము, నివాత నిష్కంపతయా-గాలి లేనందువ చలింపకుండుటచేత, యోగాధిరూఢాః, ఇవ-

ధ్యానముచేయుచున్నవివలె, విభాంతి-ప్రకాశించుచున్నవి. తమ క్రింద ధ్యానమగ్నులై యున్న ఋషులకు సంబంధించిన వృక్షములు సైతము ఆ వేదికలపైఁ గదలికలేక ధ్యాననిమగ్న— యున్నట్లున్నవి. వీరాసన లక్షణమును "ఏకపాద మథైకస్మిన్ విన్యస్యోరుణి సం తమ్, ఇతరస్మిన్ తథాచాన్యం వీరాసన ముదాహృతమ్" అని వసిష్ఠుఁడు చెప్పె స్పష్టము.

శ్లో. త్వయా పురస్తా దుపయాచితో యః
సోఽయం వటః శ్యామ ఇతి ప్రతీతః,
రాశి ర్మణీనా మివ గారుడానాం
స పద్మరాగః ఫలితో విభాతి. 53

వ్యాఖ్య : త్వయా-నీచేత, పురస్తాత్-పూర్వము, యః-ఏది, ఉపయాచితః-ప్రార్థింపఁబడియుండెనో, శ్యామః, ఇతి, ప్రతీతః-"శ్యామ"మని ప్రసిద్ధినిఁబొందిన, సః, వటః, అయం-ఆ మఱ్ఱిచెట్టేయిది, ఫలితః-పండ్లు కలదియగుచు సపద్మరాగః-పద్మరాగమణులతోఁగూడిన (కెంపులతో), గారుడానాం-పచ్చలయొక్క, రాశిః, ఇవ-కుప్పవలె, విభాతి-ప్రకాశించుచున్నది. నా యరణ్యవాసముయొక్క ఆరంభము నందు, మనము ఈన్యగ్రోధవృక్షము (మఱ్ఱిచెట్టు) వద్దికి వచ్చినప్పుడు, నీ వీవన స్పతిని, వ్రత పరిపాలనమును నాభర్త నిర్వహించునట్లనుగ్రహింపుమని కోరి యుంటివే ఆన్యగ్రోధమే యిది. రామాయణశ్లోకంః "న్యగ్రోధం తముపస్థాయ వైదేహీ వాక మబ్రవీత్ నమ స్తేఽస్తు మహావృక్ష! పాలయే న్మే వ్రతం పతిః". ఇప్పుడు పం కాచి, చూచుటకు పద్మరాగమణులు కలిసిన గరుడపచ్చల రాశివలెఁ గనపడుచున్న ! అని రాముఁడు సీతకుఁజెప్పెను. అలంకారము : ఉపమ.

శ్లో. క్వచి త్ప్రభాలేపిభి రింద్రనీలై ర్ముక్తామయీ యష్టిరి వాను విద్ధా
అన్యత్ర మాలా సితపంకజానా మిందీవరై రుత్ఖచింతాత రేవ. 54
క్వచి త్ఖగానాం ప్రియమానసానాం కాదంబసంసర్గవతీవ పంక్తిః,
అన్యత్ర కాలాగురుద త్తపత్రా భ క్తి ర్భువ శ్చందన కల్పి తేవ. 55

క్వచి త్ప్రభా చాంద్రమసీ తమోభి శ్ఛాయావిలీనైః
శబలీకృతేవ,
అన్యత్ర శుభ్రా శరదభ్రలేఖా రంధ్రేష్వి వాలక్ష్యనభః
ప్రదేశా. 56

క్వచిచ్చ కృష్ణోరగభూషణేవ భస్మాంగరాగా తను రీశ్వరస్య,
పశ్యా నవద్యాంగి! విభాతి గంగా భిన్నప్రవాహా
యమునాతరంగైః. 57

వ్యాఖ్య : హే అనవద్యాంగి!-ఓ చక్కని దేహముగలదానా! యమునాతరంగైః-యమునానది తరంగములచేత, భిన్నప్రవాహా-వివిధరీతుల కలసిపోవుచున్న, గంగా-ఈ గంగానది, క్వచిత్-ఒకచోట, ప్రభాలేపిభిః-కాంతిచేత యితర వస్తువులను పూయునట్టి, ఇంద్రనీలైః-ఇంద్రనీలమణులచేత, అనువిద్ధా-కలిపి కూర్చఁబడిన, ముక్తామయీ, యష్టిః, ఇవ-ముత్యాలహారమువలెను, అన్యత్ర-మరియొకచోట, ఇందీవరైః-నల్లకలువలచేత, ఉత్ఖచితాంతరా-గ్రుచ్చఁబడిన నడిమి భాగములుగల, సితపంకజానాం-తెల్లదామరపువ్వులయొక్క, మాలా, ఇవ-దండవలెను, క్వచిత్-మరియొకచోట, కాదంబసంసర్గవతీ-నీలహంసల సంబంధముగల, ప్రియమానసానాం-ప్రియమైన మానస సరోవరముగలవియగు, ఖగానాం, పంక్తిః, ఇవ-హంసలబారువలెను, అన్యత్ర-ఇంకొక్కచోట, కాలాగురుదత్తపత్రా-అగురుచేత వ్రాయఁబడిన మకరికాదిపత్రరచనలుగల, భువః-భూదేవియొక్క, చందనకల్పితా-శ్రీగంధముచేతఁబూయఁబడిన, భక్తిః ఇవ-మైపూఁతవలెను, క్వచిత్-ఒకచోట, ఛాయావిలీనైః-నీడలయందు దాగిన, తమోభిః-చీకట్లచేత, శబలీకృతా-బూడిదవర్ణముకలదిగాఁ జేయఁబడిన, చాంద్రమసీ-చంద్రసంబంధినియగు, ప్రభా, ఇవ-కాంతివలెను (వెన్నెలవలెననియర్థము), అన్యత్ర-మరియొకచక్కిన, రంధ్రేషు-రంధ్రములయందు, ఆలక్ష్యనభఃప్రదేశా-కనఁబడు గగనఖండములుగల, శుభ్రా, శరదభ్రలేఖా, ఇవ-తెల్లనిశరత్కాలమేఘపంక్తివలెను, క్వచిత్-ఇంకొకస్థలమున, కృష్ణోరగభూషణా-కృష్ణసర్పము భూషణముగాఁగలిగి, భస్మాంగరాగా-భస్మమును మైపూఁతగాఁచేసికొన్న, ఈశ్వరస్య, తనుః, ఇవ-శివునిదేహమువలెను, విభాతి-ఎంతయోచక్కఁగా ప్రకాశించుచున్నది, పశ్య-చూడుము. ఓసీతా! అటుచూడు, ఆ గంగానది యమునాతరంగమిళితయై యీ ప్రయాగతీర్థమునం దెంతమనోహరముగాఁ బ్రవహించుచున్నదో! ఒకచోట, ఇంద్రనీలాలతోఁ గలిపిగ్రుచ్చిన ముత్యాలహారమువలెను, మరియొకచోట, నల్లకలువలుచేర్చి కూర్చిన తెల్లతామరలదండ

వలెను, ఇంకొక ప్రదేశమున కాదంబపక్షులతోఁజేరిన రాజహంసల బారుల తీరునను, మరియొక్కచోట గంధలేపనము చేసిన భూదేవి శరీరముపై రచించిన కాలాగురుపత్రరచనల పోలికయు, ఇంకొకతావున వృక్షకుడ్యాది ఛాయలలో దాగిన చీకట్లతోఁ గూడిన వెన్నెలవలెను, మరియొక్క చోట రంధ్రములందుఁ గనబడు నాకాశ భాగములుగల శరత్కాల మేఘపంక్తిని బోలియు, వేరొక్కచోట కృష్ణసర్పములను ధరించిన భస్మాంగలిప్తశివశరీరము తీరునను గనఁబడుచున్నదికదా! అని గంగా యమునా సంగమ ప్రదేశమును రాముఁడు వర్ణించి చెప్పెను. ఇట్లు నాలుగు శ్లోకములను ఒకే మహావాక్యముగాఁ గూర్చుటకు "కలాపకమ్" అని పేరు సర్వత్ర ఉపమాలంకారములే యని యెఱుఁగవలెను.

శ్లో. సముద్రపత్న్యో ర్జలసంనిపాతే
పూతాత్మనా మత్ర కిలాభిషేకాత్,
తత్త్వావబోధేన వినాపి భూయ
స్తనుత్యజాం నాస్తి శరీరబంధః. 58

వ్యాఖ్య : అత్ర-ఇచ్చట, సముద్రపత్న్యోః-సముద్రుని భార్యలగు గంగా యమునలయొక్క, జలసంనిపాతే-జలసంగమమునందు, అభిషేకాత్-స్నానము చేయుటవలన, పూతాత్మనామ్-శుద్ధములగు శరీరమానసములు గలవారై, తనుత్యజాం-శరీరమును విడిచిన పురుషులకు, తత్త్వావబోధేన, వినా, అపి-ఆత్మతత్త్వజ్ఞానము లేకపోయినను, భూయః-మరల (ప్రస్తుత ప్రారబ్ధ శరీరమును విడిచిన పిమ్మట), శరీరబంధః-శరీరము కలుగుట, నాస్తికిల-లేదుసుమా! ఈ గంగా యమునా సంగమ ప్రదేశమున స్నానమును జేసినవారికి ఆత్మతత్త్వజ్ఞానము లేకపోయినను పునర్జన్మరహితమగు మోక్షము లభించును. "అన్యత్ర జ్ఞానాదేవ ముక్తిః, అత్రతు స్నానాదేవ ముక్తిః" అని పెద్దల యభిప్రాయమని భావము.

శ్లో. పురం నిషాదాధిపతే రిదం తత్
యస్మిన్ మయా మౌలిమణిం విహాయ,

జటాసు బద్ధా స్వరుద త్సుమంత్రః
"కైకేయి! కామాః ఫలితా స్తవేతి." 59

వ్యాఖ్య : నిషాదాధిపతేః-బోయలదొరయగు గుహుని యొక్క, తత్,పురం-అప్పుడు మనము చూచిన పట్టణము ఇదం-ఇదియే. యస్మిన్-దేనియందు, మయా-నాచేత, మౌలిమణిం, విహాయ-రాజచిహ్నమగు మణి కిరీటమును దీసివేసి, జటాసు, బద్ధాసు (సతీమ)-జడలు ధరింపబడినవి కాగా, సుమంత్రః-సుమంత్రుడు, "హే కైకేయి-ఓ కైకా! తవ, కామాః-నీ కోరికలు, ఫలితాః, ఇతి-సఫలములైన వనుచు, అరుదత్-దుఃఖి చెనో! ఇది గుహుని పట్టణము, ఇచ్చటనే నేను రాజ చిహ్నమగు మణికిరీటమును త్యజించి జటాధారినికాగాం జూచి సుమంత్రుడు "కైకా! నీ దుష్టవాంఛిత ములు ఫలించినవనుచు" నేడ్చెనుగదా!

శ్లో. పయోధరైః పుణ్యజనాంగనానాం
నిర్విష్ట హేమాంబుజ రేణు యస్యాః,
బ్రాహ్మం సరః కారణ మాప్తవాచో
బుద్ధేరివావ్యక్త ముదాహరంతి. 60

వ్యాఖ్య : పుణ్యజనాంగనానాం-యక్షస్త్రీలయొక్క, పయోధరైః- స్తనములచేత, నిర్విష్ట హేమాంబుజరేణు—నిర్విష్ట-ఉపభోగింపబడిన, హేమాంబుజ-బంగారు కమలములయొక్క, రేణు-పరాగముగలదియగు, బ్రాహ్మం, సరః-బ్రహ్మకు సంబంధించిన మానససరోవరము, యస్యాః-ఏ సరయూనదికి, బుద్ధేః-మహత్తత్త్వమునకు, అవ్యక్తం, ఇవ-ప్రధానము (ప్రకృతి) వలె, కారణం-ఉత్పత్తికిం గారణమని, ఆప్త వాచః-వేదవాక్కులు, లేదా మునులు, ఉదాహరంతి- చెప్పుచున్నారో! జలక్రీడలాడు చున్న యక్షాంగనల స్తనములచేత ననుభవింపబడు సువర్ణకమల పరాగముగల మానస సరోవరము సరయూనది పుట్టుకకుం గారణమని మహామునులు చెప్పుదురు అది అవ్యక్తమువల్ల మహత్తత్త్వము పుట్టునని చెప్పు సాంఖ్యదర్శన వచనములను విశ్వసించునట్లు, ఆప్తవాక్కులవలన, సరయూజన్మకు మానస సరస్సు అంతర్గత, పరోక్షకారణమని నమ్మవలెనుగాని ప్రత్యక్షగోచరముకాదని భావము.

శ్లో. జలాని యా తీరనిఖాతయూపా
వహ త్యయోధ్యా మను రాజధానీమ్,

తురంగమేధా వభృథా వతీర్ణై

ఇక్ష్వాకుభిః పుణ్యతరీకృతాని. 61

వ్యాఖ్య : తీరనిఖాతయూపా—తీరనిఖాత–ఒడ్డునపాతఁబడిన, యూపా-మంత్రసంస్కారయుక్త యజ్ఞపశుబంధన స్తంభములుగల, యా—ఏ సరయూనది, తురంగమేధావభృథావతీర్ణైః- అశ్వమేధయాగములందు అవభృథస్నానార్థమై దిగినట్టి, ఇక్ష్వాకుభిః-ఇక్ష్వాకు వంశీయులగు మాపూర్వులచేత, పుణ్యతరీకృతాని-పవిత్రతరములుగాఁ జేయఁబడిన, జలాని—ఉదకములను, అయోధ్యాం, రాజధానీం, అను-అయోధ్యానగర సమీపమున, వహతి- ప్రవహించునో! తీరమున యూప స్తంభములు గలిగి, అశ్వమేధయాగ సమయము లందవభృత స్నానార్థమై దిగిన మాపూర్వుల చేత ద్విగుణీకృత పవిత్రతను సంపాదించుకొన్న జలములను అయోధ్యా సమీపమున బ్రవహింపఁజేయుచున్న సరయూనది యిది యనిభావము. ఇక్ష్వాకురాజు లెవ్వరును జేయని యశ్వమేధయాగములుచేసి రన టకీసరయూనది సాక్ష్యముగా నున్నదని యభిప్రాయము.

శ్లో. యాం సైకతోత్సంగసుఖోచితానాం

ప్రాజ్యైః పయోభిఃపరివర్ధితానామ్,

సామాన్యధాత్రీ మివ మానసం మే

సంభావయ త్యుత్తరకోసలానామ్. 62

వ్యాఖ్య : యాం-ఏసరయూనదిని, మే, మానసం-నామనస్సు, సైకతోత్సంగ సుఖోచితానాం-సైకతోత్సంగ-ఇసుకతిన్నెయను నొడియందలి, సుఖ-ఆనందమునకు, ఉచితానాం—తగినవారును, ప్రాజ్యైః—అధికములైన, పయోభిః-ఉదకములచేత (క్షీరములచేతనని యర్థాంతరము), పరివర్ధితానాం-పోషింపఁబడిన వారునునగు, ఉత్తరకోసలానాం-ఉత్తరకోసలదేశ ప్రభువులకు, సామాన్యధాత్రీం, ఇవ-అందఱికిని సమానయగు పెంపుడుతల్లిని (దాదిని) వలె, సంభావయతి-గౌరవించుచున్నది. దీని యిసుకతిన్నెలపై తల్లియొడిలోవలె సుఖపడుచు, క్షీరసదృశమగు జలమున్ద్రాగి, పుష్టినిఁబొందిన మాయుత్తరకోసలాధిపతులందఱికిని యీ సరయువు దాదివంటిదన్న భావనతో నా మనస్సీనదిని గౌరవించుచున్నది సీతా!

అన్నాడు. "ఉత్తరకోసలానాంరాజానః ఉత్తరకోసలాః" తద్రాజస్య "ఇత్యాది సూత్రముచేత తద్ధిత ప్రత్యయమునకు లోపమువచ్చును. ధాత్రీశబ్దమునకు "జననీ, ఆమలకీ, వసుమతీ, ఉపమాతా" అర్థములని విశ్వకోశము. అలంకారము: ఉపమ.

శ్లో. సేయం మదీయా జననీవ తేన
మాన్యేన రాజ్ఞా సరయూ వియుక్తా,
దూరే వసంతం శిశిరానిలై ర్మాం
తరంగహస్తైరుపగూహతీవ. 63

వ్యాఖ్య : మదీయా, జననీ, ఇవ-మాతల్లియగు కౌసల్యవలెనే, మాన్యేన-పూజ్యుడగు, తేన, రాజ్ఞా-స్వర్గతుడైన యాదశరథునిచేత, వియుక్తా-విడువబడిన, సేయం (సా+ఇయం), సరయూః-ఇంగవటకు నాచేత నుల్లేఖింపబడిన సరయూ నది, దూరే, వసంతం-దూర ప్రదేశముననుండిన, మాం-పుత్రభూతుడనైన నన్ను శిశిరానిలైః-చల్లనిగాలితోగూడిన, తరంగహస్తైః-తరంగములనెడి చేతులతో, ఉపగూహతి, ఇవ-ఆలింగనము చేసికొనుచున్నదివలె నున్నది. మాతల్లి కౌసల్యవలెనే స్వర్గతుడైన మాతండ్రిచేత వియుక్తురాలైన యీ సరయూనది భర్తృ దుఃఖము చేతను, దూరస్థుడనై యుండిన నావలని పుత్రదుఃఖముచేతను బాధపడుచుండి నదియై యిప్పుడు తిరిగి వచ్చుచున్న నన్ను చల్లని తరంగ హస్తములతో దగ్గఱికి జేర్చుకొనుచున్నట్లున్నది. అలంకారము ; రూపకాను ప్రాణితమగు నుత్ప్రేక్ష.

శ్లో. విరక్తసంధ్యాకపిశం పురస్తాత్
యతో రజః పార్థివ ముజ్జిహీతే,
శంకే హనూమత్కథిత ప్రవృత్తిః
ప్రత్యుద్గతో మాం భరతః ససైన్యః. 64

వ్యాఖ్య : విరక్తసంధ్యాకపిశం—విరక్త-తకు వ యెఱ్ఱనైన, సంధ్యా-సంధ్యారాగమువలె, కపిశం-ఎఱుపు నలుపు కలిసిన వ ము ల, పార్థివం, రజః-భూసంబంధమైన ధూళి, పురస్తాత్-మనయెదుట, యతః-ఏకారణమువలన, ఉజ్జిహీతే-ఎగయుచున్నదో! (తస్మాత్-ఆకారణమువలన) హనూమత్కథిత ప్రవృత్తిః-హనుమంతునిచేతఁజెప్పఁబడిన మన యాగమనవార్తగల, భరతః-భరతుఁడు,

ససైన్యః (సన్)-సైన్య సహితుఁడగుచు, మాం, ప్రత్యుద్గతః-నన్ను స్వాగతించుచున్నాఁడని, శంకే-ఊహించుచున్నాను. ఎదురుగా వచ్చిన ధూళివలన, మనము వచ్చుచున్న వార్తను ముందుగా నాచేఁబంపఁబడిన హనుమంతుఁడు చెప్పఁగా విన్న భరతుఁడు సైన్యసమేతుఁడై మనలనెదుర్కొని తీసుక వెళ్ళుటకు వచ్చుచున్నాఁడని భావింతును. "హనూమాన్" హనుః-అస్య అస్తీతి హనూమాన్. అని విగ్రహము. "శరాదీనాంచ" అను సూత్రముచేత "హను" శబ్దము శరాది గణపఠితమగుటచేత దీర్ఘము వచ్చి "హనూ" అయినది. "విరక్త" సంధ్యాకపిశం" అనునది రజస్సుకు (ధూళికి) విశేషణము. "విరక్త" పదమునకు "అతిరక్తాయాసంధ్యా" అని మల్లినాథుఁడు వ్రాయుటచేత నేను "తక్కువ యెఱ్ఱనైన" యని అర్థమును వ్రాసితిని. "అతి క్రాంతా రక్తం" అని యప్పుడు వి గ్రహము. "ప్రకర్షే లంఘనే ప్యతి" అని యమరము "అతి" కి లంఘనార్థమును సైతము చెప్పెను.

శ్లో. అద్ధా శ్రియం పాలితసంగరాయ
ప్రత్యర్పయిష్య త్యనఘాం స సాధుః,
హత్వా నివృత్తాయ మృధే ఖరాదీన్
సంరక్షితాం త్వా మివ లక్ష్మణో మే. 65

వ్యాఖ్య : సాధుః, సః-సజ్జనుఁడైన యాభరతుఁడు, పాలితసంగరాయ-నెఱవేర్చఁబడిన పితృ ప్రతిజ్ఞగల మే-నాకొఱకు, అనఘాం-దోషరహితయై, సంరక్షితాం-కాపాడఁబడినదియగు, శ్రియం-రాజ్యలక్ష్మిని, మృధే-యుద్ధమునందు, ఖరాదీన్-ఖరదూషణాదులను, హత్వా-చంపి, నివృత్తాయ-తిరిగివచ్చిన, మే-నాకొఱకు, లక్ష్మణః-లక్ష్మణుఁడు త్వాం, ఇవ-దోషరహితవై, సంరక్షితవైన నిన్నువలె, ప్రత్యర్పయిష్యతి-తిరిగి సమర్పింపఁగలఁడు. అద్ధా-సత్యము(తప్పదు). సజ్జనుఁడైన భరతుఁడు తానేమాత్రమును అనుభవింపక కేవలము సంరక్షించిన రాజ్యలక్ష్మిని తండ్రి ప్రతిజ్ఞను నెఱవేర్చివచ్చిన నాకు, పూర్వమరణ్యమున ఖరాదులను యుద్ధమునఁజంపి తిరిగివచ్చిన నాకు లక్ష్మణుఁడు నిన్నుకాపాడి యప్పగించినట్లు, తప్ప సమర్పింపఁగలఁడని భావించుచున్నాను. "సంగర" మనఁగా ప్రతిజ్ఞ. రాజ్యలక్ష్మికి సీత నుపమానముగాఁజెప్పుట భరతుఁడు రాజ్యసుఖ మిసుమంతయు ననుభవింపక రాముని రాజ్యమును రామునికే ప్రత్యర్పణముఁజేయుననుటకే. అలంకారము: దృష్టాంతము. "తత్త్వేత్వద్ధా" అనియమరము. "అద్ధా" అనునది అవ్యయము.

శ్లో. అసౌ పురస్కృత్య గురుం పదాతిః
పశ్చా దనస్థాపితవాహినీకః,
వృద్ధై రమాత్యైః సహ చీరవాసాః
మా మర్ఘ్యపాణి ర్భరతో౽భ్యుపైతి. 66

వ్యాఖ్య : అసౌ-ఇతఁడే, పదాతిః-పాదచారియు, చీరవాసాః-వల్కల వస్త్రముగలవాఁడునగు, భరతః-భరతుఁడు, పశ్చాత్-తనవెనుక, అవస్థాపితవాహినీకః-ఉంచుకోఁబడిన సేనగలవాఁడగుచు, గురుం-కులగురువగు వసిష్ఠుని, పురస్కృత్య-తనముందుంచుకొని, వృద్ధైః, అమాత్యైఃసహ-పెద్దలయిన మంత్రులతో పాటు, అర్ఘ్యపాణిఃసన్-పూజాద్రవ్యములను చేతులయం దుంచుకొన్నవాఁడగుచు, మాం-నన్ను, అభ్యుపైతి-ఎదుర్కొన వచ్చుచున్నాఁడు. వల్కలధారియుఁ బాద చారియు నగుభరతుఁడు సైన్యమును వెనుకవచ్చుటకు నియోగించి వసిష్ఠమహర్షిని ముందుంచుకొని పూజాద్రవ్యములను మంత్రులయుక్తముగాఁబుచ్చుకొని నాకు స్వాగతముఁజెప్పుట కదిగో! వచ్చుచున్నాఁడు చూడుము! అని సీతకుఁ జెప్పెను. పూజావస్తువులను మంత్రులుసైతము పట్టుకొని యుండిరని భావము.

శ్లో. పిత్రా విసృష్టాం మదపేక్షయా యః
శ్రియం యువా ప్యంకగతా మభోక్తా,
ఇయంతి వర్షాణి తయా సహోగ్ర
మభ్యస్యతీవ వ్రత మాసిధారమ్. 67

వ్యాఖ్య : యః-ఏభరతుఁడు, పిత్రా-తండ్రిచేత, విసృష్టాం-ఇయ్యఁబడిన దియై, అంకగతాం, అపి-ఒడినిఁజేరినదియైనను, శ్రియం-రాజ్యలక్ష్మినిఁ యువా-యువకుఁడై కూడ, మదపేక్షయా-నాయందలిభక్తిచేత, అభోక్తాసన్-అనుభవింపక యున్నవాఁడగుచు, ఇయంతి, వర్షాణి-ఇన్నిసంవత్సరములు, తయాసహ-ఆరాజ్య లక్ష్మితోఁగూడ, ఉగ్రం-కఠినమైన, ఆసిధారం-అసిధారమనుపేరుగల, వ్రతం-వ్రతమును, అభ్యస్యతి, ఇవ-నడుపుచున్నాఁడువలెనున్నాఁడో. తండ్రిచేత నీయఁ బడి తనవద్దికి వచ్చిన రాజ్యలక్ష్మిని యువకుఁడై యుండియు భరతుఁడు, తన తొడపైకి వచ్చిన ప్రియురాలిని అనుభవింపఁదలపని యువకునివలె, నాయందలి

భక్తిచేత భోగింపకయున్నాఁడనగా నితఁడిన్నిసంవత్సరాలామెతోఁగలసి "అసిధారావ్రతము" నాచరించుచున్నట్లున్నది. "పిత్రావిసృష్ట" తండ్రియిచ్చినదికనుక ధర్మవిరుద్ధముగాని, న్యాయవిరుద్ధముగాని కాదని యర్థము. "అంకగతాం" స్వీయముగాఁ బ్రేమించినట్టిది. ఇట్టిరాజ్యశ్రీని అనుభవింపకుండుట "అసిధారావ్రతము" కాదా? "యువా యువత్యాసార్థంయత్ ముగ్ధభర్తృవ దాచరేత్, అంతర్నివృత్త సంగః స్యాత్ అసిధారావ్రతం హి తత్" అని యాదవప్రకాశుఁడు నిర్వచించెను. స్త్రీభోగము నెఱుఁగని మూర్ఖునివలె "నాతిగల బ్రహ్మచర్యమును పాటించుట యని యర్థము. అసిధారా—కత్తియంచు. దానిపై నడుచుటవంటి దగుటచేత దీనిని "అసిధారావ్రతం" అన్నారు.

శ్లో. ఏతావ దుక్తవతి దాశరథౌ తదీయా
మిచ్ఛాం విమాన మధిదేవతయా విదిత్వా,
జ్యోతిష్పథా దవతతార సవిస్మయాభి
రుద్వీక్షితం ప్రకృతిభి ర్భరతానుగాభిః. 68

వ్యాఖ్య : దాశరథౌ-రాముఁడు, ఏతావత్-ఇంతమాత్రము, ఉక్తవతి-వచించినవాఁడుకాఁగానే, విమానం-పుష్పకము, తదీయాం, ఇచ్ఛాం-రామునికోరికను, అధిదేవతయా—తనయధిదేవతచేత, విదిత్వా—తెలిసికొని, సవిస్మయాభిః-ఆశ్చర్యముగలవారై, భరతానుగాభిః-భరతునివెంటవచ్చుచున్న, ప్రకృతిభిః—ప్రజలచేత, ఉద్వీక్షిత (సత్)—తలలెత్తి చూడఁబడుచున్నదగుచు, జ్యోతిష్పథాత్-ఆకాశమునుండి, అవతతార-దిగెను. రాముఁడు తననెదుర్కొనుటకు భరతుఁడువచ్చుచున్నాఁడని యనఁగానే, రామునికోరికను తనయధిదేవతచేసిన సంజ్ఞద్వారా తెలిసికొన్న పుష్పకవిమానము భరతునివెంట వచ్చిన అయోధ్యాపురజను లాశ్చర్యముతోఁ జూచుచుండఁగా నేలపైకిదిగె నని భావము. "జ్యోతిష్పథ" మనఁగా నక్షత్రమార్గము, ఆకాశమనియర్థము.

శ్లో. తస్మాత్పురః సర విభీషణ దర్శితేన
సేవావిచక్షణ హరీశ్వరదత్త హస్తం,
యానా దవాతర దదూరమహీతలేన
మార్గేణ భంగిరచిత స్ఫటికేన రామః. 69

వ్యాఖ్య : రామః-శ్రీరాముఁడు, సేవావిచక్షణ హరీశ్వరదత్తహస్తః-సేవావిచక్షణ-సేవించుటయందునేర్పరియగు, హరీశ్వర-కపిరాజైన సుగ్రీవుని చేత, దత్తహస్తః-ఇయ్యఁబడిన హస్తావలంబము గలవాఁడగుచు, పురఃసర విభీషణదర్శితేన-పురస్సర-ముందునడచుచున్న, విభీషణదర్శితేన-విభీషణునిచేతఁ జూపఁబడినదియు. అదూరమహీతలేన-ఆసన్నమైన భూప్రదేశముగలదియు, భంగిరచితస్ఫటికేన-మెట్లుగాఁగట్టఁబడిన స్ఫటికశిలలు గలదియునగు, మార్గేణ-సోపానమార్గముద్వారా, తస్మాత్, యానాత్-పుష్పకవిమానమునుండి, అవాతరత్-దిగెను. సుగ్రీవునిచేతిని యవలంబముగాఁబట్టుకొని, విభీషణుఁడు చూపుచున్న స్ఫటికసోపాన మార్గముగుండా రాముఁడు పుష్పకవిమానమునుండి నేలపైకి దిగెనని భావము. "అవాతరత్" తౄ-ప్లవనతరణయోః (తరతి) అనుధాతువునకు "లఙ్" రూపము.

శ్లో. ఇక్ష్వాకువంశగురవే ప్రయతః ప్రణమ్య
స భ్రాతరం భరత మర్ఘ్యపరిగ్రహాంతే,
పర్యశ్రు రస్వజత మూర్ధని చోపజఘ్రౌ
తద్భక్త్యపోఢ పితృరాజ్య మహాభిషేకే. 70

వ్యాఖ్య: ప్రయతః-శాస్త్రవిధి ననుసరించిన, సః-ఆరాముఁడు, ఇక్ష్వాకు వంశగురవే-ఇక్ష్వాకుల కులగురువగు వసిష్ఠునికొఱకు (వసిష్ఠునికి), ప్రణమ్య-నమస్కరించి, అర్ఘ్యపరిగ్రహాంతే-తాను అర్ఘ్యమును స్వీకరించిన పిమ్మట, పర్యశ్రుః-ఆనందబాష్పములు గలవాఁడగుచు, భ్రాతరం, భరతం-తమ్ముఁడగు భరతుని, అస్వజత్-ఆలింగనముచేసికొనెను, తద్భక్త్యపోఢ పితృరాజ్య మహాభిషేకే తద్భక్తి-ఆరామునియందలి భక్తిచేత, అపోఢ-పరిహరింపఁబడిన, పితృరాజ్య-తండ్రిరాజ్యమునందలి, మహాభిషేకే-పట్టాభిషేకముగల, మూర్ధని-శిరస్సునందు, ఉపజఘ్రౌచ-వాసనచూచెను (మూర్కొనెను) గూడ. అట్లు విమానము దిగిన రాముఁడు, యథాశాస్త్రముగా వసిష్ఠునికి నమస్కరించి, భరతుఁడిచ్చిన యర్ఘ్యమును స్వీకరించిన పిమ్మట, ఆనందాశ్రుముఖుఁడై భరతునిఁగౌఁగిలించుకొని, తనయందలి భక్తిచేత పట్టాభిషేకమునొల్లని యతనితలను ప్రేమతో మూర్కొనె నని భావము.

శ్లో. శ్మశ్రుప్రవృద్ధి జనితానన విక్రియాంశ్చ
ప్లక్షాన్ ప్రరోహజటిలానివ మంత్రివృద్ధాన్
అన్వగ్రహీత్ ప్రణమతః శుభదృష్టిపాతైః
వార్తానుయోగ మధురాక్షరయా చ వాచా. 71

వ్యాఖ్య: శ్మశ్రు ప్రవృద్ధి జనితానన విక్రియాన్, చ-మీసములు గడ్డముల యొక్క పెరుగుదలచేత కలిగిన ముఖవికారము గలవారై, ప్రరోహజటిలాన్-ఊడల చేత జటాధారులై యున్న, ప్లక్షాన్, ఇవ (స్థితాన్)-వటవృక్షములవలె నుండినవారై, ప్రణమతః-నమస్కరించుచున్న, మంత్రివృద్ధాన్, చ-వృద్ధమంత్రులను సైతము, శుభదృష్టిపాతైః-చల్లనిచూపులచేతను, వార్తానుయోగ మధురాక్షరయా-కుశల ప్రశ్నములయందలి మధురాక్షరములు గల, వాచా, చ-వాక్కుచేతను, అన్వగ్రహీత్-అనుగ్రహించెను. భరతునిఁగౌఁగిలించుకొన్న పిమ్మట, రాముఁడు పెద్దలయిన వృద్ధమంత్రులు నమస్కరింపఁగా, వారిని ప్రేమార్ద్ర దృష్టిచేతను, కుశల ప్రశ్నల చేతను అనుగ్రహించి గౌరవించెనని భావము. ఊడలు దిగిన మఱ్ఱిచెట్లను మంత్రుల కుపమానముగాఁ జెప్పుట వారియాకారముతోఁ బాటు లోకానుభవ విశేషమును సైతము చెప్పుటకేయని తెలియవలెను. అలంకారము: ఉపమ.

శ్లో. దుర్జాతబంధు రయ మృక్షహరీశ్వరో మే
పౌలస్త్య ఏష సమరేషు పురఃప్రహర్తా,
ఇత్యాదృతేన కథితౌ రఘునందనేన
వ్యుత్క్రమ్య లక్ష్మణ ముభౌ భరతో వవందే. 72

వ్యాఖ్య: అయం-ఇతఁడు, మే-నాయొక్క, దుర్జాతబంధుః-ఆపద్బాంధవుఁడగు, ఋక్షహరీశ్వరః-భల్లూకములకు వానరములకు ప్రభువైన సుగ్రీవుఁడు, ఏషః-ఈతఁడు, సమరేషు-యుద్ధములయందు, పురఃప్రహర్తా-ముందుకు దూకునట్టి (వీరాగ్రణియగు), పౌలస్త్యః-విభీషణుఁడు. ఇతి-ఇట్లు, ఆదృతేన-ఆదరవంతుఁడగు, రఘునందనేన-రామునిచేత, కథితౌ-చెప్పఁబడిన, ఉభౌ-సుగ్రీవ విభీషణుల నిద్దఱిని, లక్ష్మణం-తమ్ముఁడైనను లక్ష్మణుని, వ్యుత్క్రమ్య-దాటవేసి, భరతః-భరతుఁడు,వవందే-నమస్కరించెను రామునికాపద్బాంధవులైన సుగ్రీవ విభీషణులకు భరతుఁడు తమ్ముఁడైనను లక్ష్మణుని యాలింగనాదులకంటె వారిని నమస్కరించుట

ముఖ్యమనియు నదికృతజ్ఞతా సూచకమనియు భావము. "దుర్జాతం వ్యసనం ప్రోక్తమ్" అని విశ్వనిఘంటువు. వి + ఉత్క్రమ్య-వ్యుత్క్రమ్య-క్రమమును దప్పించియని అర్థము.

శ్లో. సౌమిత్రిణా తదను సంససృజే స చైన
ముత్థాయ నమ్రశిరసం భృశ మాలిలింగ,
రూఢేంద్రజిత్ప్రహరణవ్రణ కర్కశేన
క్లిశ్య న్నివాస్య భుజమధ్య మురః స్థలేన. 73

వ్యాఖ్య : తదను-సుగ్రీవాదివందనానంతరము, సః-అభరతుఁడు, సౌమిత్రిణా-లక్ష్మణునితో, సంససృజే-కలుసుకొనెను. నమ్రశిరసం-ప్రణతుఁడైన ఏనం-అతనిని, ఉత్థాయ-లేపి, రూఢేంద్రజి త్ప్రహరణవ్రణ కర్కశేన-రూఢ-పైకిఁగనఁబడుచున్న, ఇంద్రజిత్ప్రహరవ్రణ-ఇంద్రజిత్తుకొట్టిన దెబ్బలవలని వ్రణముల చేత, కర్కశేన-కఠినమైన (నొప్పిని గలిగించు), ఉరఃస్థలేన-తనవక్షఃస్థలముచేత, అస్య, భుజమధ్యం-ఆ లక్ష్మణుని వక్షమును, క్లిశ్యన్, ఇవ-నొప్పించుచున్నవాఁడువలె, భృశం-గాఢముగా, ఆలిలింగ, చ-ఆలింగనమును సైతము చేసికొనెను. భరతుఁడు సుగ్రీవాదులకు నమస్కరించి, లక్ష్మణునిపద్దికి వెళ్ళగా నతఁడువంగి నమస రించెననియు, నట్లుపాదపతితుఁడైన సౌమిత్రినిలేపి, ఇంద్రజిత్తు యుద్ధమునం ప్రహారములచేతఁ గలిగిన వ్రణములతోఁగన్పట్టు లక్ష్మణుని వక్షమును నొప్పింనా! యనితోఁచునట్లు గాఢముగా నాలింగనముఁజేసికొనెననియు భావము. గాఢానురాగవాత్సల్యములు స్వల్పమగు శరీరబాధను లెక్కింపవుగదా!

శ్లో. రామాజ్ఞయా హరిచమూపతయ స్తదానీం
కృత్వా మనుష్యవపు రారురుహు ర్గజేంద్రాన్,
తేషు క్షరత్సు బహుధా మదవారిధారాః
శైలాధిరోహణసుఖా న్యుపలేభిరే తే. 74

వ్యాఖ్య: తదానీం-అప్పుడు, హరిచమూపతయః-వానరసేనాపతులు, మాజ్ఞయా-రామునియొక్క ఆజ్ఞచేత, మనుష్యవపుః-మానవశరీరమును, కృత్వా-ంచి, గజేంద్రాన్-ఉత్తమగజములను, ఆరురుహుః-ఎక్కిరి. బహుధా-విశేష

ముగా, మదవారిధారాః-మదజలధారలను, క్షరత్సు-కురియుచున్న, తేషు-ఆగజముల యందు, తే-ఆకపిసైన్యనాథులు, శైలాధిరోహణసుఖాని-పర్వతములనెక్కుట యందలి సుఖములను, ఉపలేభిరే-అనుభవించిరి. రాముఁడు తనవెంట గౌరవముగాఁ బురమును ప్రవేశించుటకై వానరపతులను మానవశరీరములను ధరింపుఁడని యాజ్ఞాపింపఁగా, దేవాంశసంభూతులుగావున వారట్లేమారి మత్తగజములపై నెక్కిరి. మదధారలను గురియుచున్న గజములపై నుండినవారు సెలయేళ్ళతోఁ గూడిన పర్వతములపైఁ గూర్చున్నప్పటి తమ సహజసంతోషమును పొందిరని భావము. అలంకారము: గమ్యోపమ.

శ్లో. సానుప్లవః ప్రభు రపి క్షణదాచరాణాం
భేజే రథాన్ దశరథప్రభవానుశిష్టః,
మాయావికల్పరచితై రపి యే తదీయై
ర్న స్యందనై స్తులితకృత్రిమభక్తిశోభాః. 75

వ్యాఖ్య: సానుప్లవః (స + అనుప్లవః)-అనుచరులతోఁగూడిన, క్షణదాచ రాణాం, ప్రభుః, అపి-విభీషణుఁడుగూడ, దశరథప్రభవానుశిష్టః- దశరథప్రభవ-రామునిచేత. అనుశిష్టః-ఆజ్ఞాపింపఁబడినవాఁడగుచు, రథాన్-రథములను, భేజే-ఎక్కెను. యే-ఏరథములు, మాయావికల్పరచితైః, అపి-రాక్షసమాయచేత కల్పింపబడిన వైనప్పటికిని, తదీయైఃస్యందనైః-ఆవిభీషణుని రథములతో, తులిత కృత్రిమభక్తిశోభాః-పోల్పఁబడిన కృత్రిమభాగముల కాంతులుగలవి, న-కావో. రాముఁడు తెప్పించిన యే సహజ నిర్మాణముగల రథములు, రాక్షస మాయాకల్పితములైన విభీషణుని రథములు కలిగియున్న కృత్రిమశోభను నిరాకరించుచున్నవో అట్టి రథములను విభీషణుఁడు సపరివారముగా రామాజ్ఞచేత నెక్కెను. "అనుప్లవః" అనఁగా వెంటవచ్చువాఁడు, "అభిసార స్త్వనుసరః సహాయోఽనుప్లవోఽనుగః" అని యాదవకోశము. "క్షణదా" యనఁగారాత్రి, క్షణదాచరులనగా రాత్రించరులు-రాక్షసులని యర్థము. దశరథప్రభవః-దశరథుఁడు తన పుట్టుటకుఁ గారణమైన వాఁడు, రాముఁడని యర్థము (ప్రభవత్యస్మాదితి ప్రభవః-జనకః).

శ్లో. భూయ స్తతో రఘుపతి ర్విలసత్పతాకం
అధ్యాస్త కామగతి సావరణో విమానమ్,

దోషాతనం బుధబృహస్పతియోగ దృశ్య
స్తారాపతి స్తరలవిద్యు దివాభ్రవృందస్. 76

**వ్యాఖ్య:** తతః-పిమ్మట, రఘుపతిః-రాముఁడు, సావరజః-తమ్ములతో (భరతలక్ష్మణులతో) గూడినవాఁడగుచు, విలసత్పతాకం-ప్రకాశించుచున్న జెండాలు గలదియు, కామగతి-కోరినట్లు నడచునదియునగు, విమానం-పుష్పకవిమానమును, భూయః-మరలఁగూడ, బుధబృహస్పతియోగ దృశ్యః-బుధబృహస్పతి నక్షత్రముల సంబంధముతోఁ జూడముచ్చటయైన, తారాపతిః-చంద్రుఁడు, దోషాతనం-రాత్రి యందలిదియు, తరలవిద్యుత్-మెరయుచున్న మెఱుపుగల, అభ్రవృందం, ఇవ-మేఘమండలమునువలె, అధ్యాస్త-ఎక్కెను. ఎవరెవ రేయే వాహనములపై నెక్కి-రావలయునో నిర్ణయించి, భరతలక్ష్మణ సహితుఁడై రాముఁడు మరల విమానము నెక్కెను. ఆదృశ్యము బుధబృహస్పతులతోఁ గూడిన చంద్రుఁడు, మెఱుపుతో నుండిన మేఘము నెక్కినట్లు హృద్యముగానుండెను. ఇచ్చట బుధబృహస్పతులు భరత లక్ష్మణులకును, చంద్రుఁడు రామునికిని, మేఘము పుష్పకమునకును, విద్యుత్తు విమానమునందేయుండిన సీతకును, ఉపమానములని గ్రహింపవలెను. అలంకారము: ఉపమ.

శ్లో. తత్రేశ్వరేణ జగతాం ప్రలయా దివోర్వీం
వర్షాత్యయేన రుచ మభ్రఘనా దివేందోః,
రామేణ మైథిలసుతాం దశకంఠకృచ్ఛ్రాత్
ప్రత్యుద్ధృతాం ధృతిమతీం భరతో వవందే. 77

**వ్యాఖ్య :** తత్ర-ఆవిమానమునందు, జగతాం, ఈశ్వరేణ-లోకములకు ప్రభువైన ఆదివరాహమూర్తిచేత, ప్రలయాత్-జల ప్రళయమునుండి, ఉర్వీం, ఇవ-భూదేవిని వలెను; వర్షాత్యయేన-శరదృతువుచేత (వర్షఋతువు యొక్క అవసానము) అభ్రఘనాత్-మేఘ సంఘమునుండి, ఇందోః, రుచం, ఇవ-చంద్రుని యొక్క కాంతినివలె (చంద్రికనువలె), రామేణ-రామునిచేత, దశకంఠకృచ్ఛ్రాత్-రావణుఁడను సంకటమునుండి, ప్రత్యుద్ధృతాం-ఉద్ధరింపఁబడినదియై, ధృతిమతీం-సంతోషముతోనున్నదియగు, మైథిలసుతాం-సీతను, భరతః-భరతుఁడు, వవందే-నమస్కరించెను. ఆదివరాహమూర్తిచేతఁ బ్రళయమునుండి భూదేవినివలెను, శర

దృతువుచేత మేఘమండలమునుండి చంద్రికనువలెను, రామునిచేత రావణునినుండి విడిపింపబడిన సీతాదేవిని భరతుఁడు నమస్కరించెను. అనఁగా భరతుఁడు ప్రత్యుద్గమనముచేత సత్కరించుటకు వచ్చినప్పుడు, రాముఁడును సుగ్రీవాదులును పుష్పకమునుండి దిగిరనియు, సీత పుష్పకమునందే యుండెననియు, ఇప్పుడు రాముఁడు సానుజుఁడై మరల విమానము నెక్కఁగా నచ్చటనున్న సీతకు భరతుఁడు ఇప్పుడు నమస్కరించెననియు భావము. అది సంప్రదాయమే కదా ! అలంకారము : ఉపమ.

శ్లో. లంకేశ్వర ప్రణతిభంగ దృఢవ్రతం త

ద్వంద్యం యుగం చరణయో ర్జనకాత్మజాయాః,

జ్యేష్ఠానువృత్తిజటిలం చ శిరోఽస్య సాధోః

అన్యోన్యపావన మభూ దుభయం సమేత్య. 78

వ్యాఖ్య : లంకేశ్వర ప్రణతిభంగ దృఢవ్రతం—లంకేశ్వర-రావణుని యొక్క, ప్రణతి-నమస్కారములయొక్క, భంగ-నిరసనముచేత, దృఢవ్రతం-చలింపనిపాతివ్రత్యముగలది యగుటవలన, వంద్యం-నమస్కరింపదగినదగు, జనకాత్మజాయాః-సీతాదేవియొక్క, చరణయోః, యుగం-పాదములయొక్క జంటయు, జ్యేష్ఠానువృత్తిజటిలం-జ్యేష్ఠానువృత్తి- పెద్దవాఁడగు రామునియందలి భక్తిచేత, జటిలం-జడలుదాల్చిన, సాధోః-సజ్జనుఁడగు, అస్య-ఈభరతునియొక్క, శిరః, చ-శిరస్సును, ఉభయం-ఈరెండును, సమేత్య-కలిసికొని, అన్యోన్యపావనం-ఒకదాని నొకటి పవిత్రముఁ జేయునది, అభూత్-అయ్యెను. రావణుని ప్రార్థనల నంగీకరింపక పాతివ్రత్యమును గాపాడుకొన్న సీతాపాదయుగ్మమును, అన్నకై రాజ్యమును వదలి జటాధారియైన భరతుని శిరస్సును గలిసికొని, యొకదాని నొకటి పావనముఁ జేసెనని భావము. రెంటును సమప్రాధాన్యముగల మహత్తర కార్యములగుటచేఁ గవి ఇట్లు వర్ణించెను.

శ్లో. క్రోశార్ధం ప్రకృతిపురఃసరేణ గత్వా,

కాకుత్స్థః స్తిమితజవేన పుష్పకేణ,

శత్రుఘ్నప్రతివిహితోపకార్య మార్యః

సాకేతోపవన ముదార మధ్యువాస. 79

వ్యాఖ్య : ఆర్యః-పూజ్యుఁడైన, కాకుత్స్థః-రాముఁడు, ప్రకృతిపురఃసరేణ-పురజనులు ముందు నడచునట్టిదై, స్తిమితజవేన-తగ్గినవేగముగల, పుష్పకేణ-పుష్పక విమానముతో, క్రోశార్ధం-అఱకోసుదూరము, గత్వా-వెళ్ళి, శత్రుఘ్న ప్రతివిహితోపకార్యం-శత్రుఘ్న-శత్రుఘ్నునిచేత, ప్రతివిహిత-వేయింపఁబడిన, ఉపకార్యం-పటకుటీరములు (డేరాలు) గలదియు, ఉదారం-గొప్పదియునగు, సాకేతోపవనం-అయోధ్యానగరము యొక్క ఉపవనమును, అధ్యువాస-అధివసించెను. అప్పుడు రాముఁడు, జనులుముందు నడచుచుండగా విమానమును నెమ్మదిగాఁబోవనిచ్చి శత్రుఘ్నుఁడు ముందే సిద్ధపరచియుంచిన పటకుటీరములుగల అయోధ్యానగరోపవనమున విడిసెను. భరతుఁడు, నందిగ్రామమునఁదాను రాముని నెదుర్కొని తెచ్చువఱకు నుద్యానమున సవానర విభీషణుఁడగు రామునికిఁ దాత్కాలికవాసము నేర్పాటుచేయుమని శత్రుఘ్నునికి వార్తనంపియుండెననియు, ఆతఁడాప్రదేశముననే యుండి యన్నయాజ్ఞను నిర్వర్తించెననియు భావము. మహోత్సవముతో రాముని నగరమునఁబ్రవేశించునట్లు చేయుటకే యేర్పాట్లని తెలియవలయును.

ఇది మహాకవి కాళిదాసకృత రఘువంశ కావ్యమునఁ దండకాప్రత్యాగమన
మను త్రయోదశసర్గకు కేశవపంతుల నరసింహశాస్త్రి రచిత
తెలుఁగు లఘు వ్యాఖ్య

శ్రీః

## మహాకవి కాళిదాసకృత

# రఘువంశము

## చతుర్దశసర్గము

శ్లో. భర్తుః ప్రణాశా దథ శోచనీయం
దశాంతరం తత్ర సమం ప్రపన్నే,
అపశ్యతాం దాశరథీ జనన్యౌ
ఛేదా దివోపఘ్నతరో ర్వ్రతత్యౌ. 1

వ్యాఖ్య : అథ-శ్రీరామాదు లుపవనమున విడిసిన పిమ్మట, దాశరథీ-రామలక్ష్మణులు, ఉపఘ్నతరోః-ఆశ్రయవృక్షముయొక్క, ఛేదాత్-నఱుకుటవలన, వ్రతత్యౌ, ఇవ-లతలవలె, భర్తుః-భర్తయగు దశరథునియొక్క, ప్రణాశాత్-మరణమువలన, శోచనీయం-దుఃఖింపఁదగిన, దశాంతరం-అవస్థాంతరమును, ప్రపన్నే-పొందియుండిన, జనన్యౌ-తల్లులగు కౌసల్యాసుమిత్రలను, తత్ర-ఆ సాకేతనగరోపవనమునందు, సమం-ఏకకాలమునందు, అపశ్యతాం-చూచిరి. తాము ప్రాకిన చెట్టును కొట్టివేయఁగా నిరాలంబములై, వాడి కళాహీనములైన తీఁగలవలె దశరథ మరణమువలన సౌభాగ్యముఁగోలుపోయి శోచనీయ దశలోనున్న కౌసల్యా సుమిత్రలను రామలక్ష్మణు లేకకాలమునఁజూచి బాధపడిరని భావము. ఆశ్రయము అను నర్థమున "ఉపఘ్న" శ ము వ్యాకరణమున 'నిపాత' చేయఁబడినది."దశా" శబ్దమునకు వస్త్రపుటంచు, అ౦ అర్థములని విశ్వనిఘంటువు. "అపశ్యతామ్" దృశిర్-ప్రేక్షణేధాతువునకు కర్త్రర్థమున లఙ్ ప్ర.పురుష ద్వి.వచనము.

శ్లో. ఉభా వుభాభ్యాం ప్రణతౌ హతారీ
యథాక్రమం విక్రమశోభినౌ తౌ,

విస్పష్ట మస్రాంధతయా న దృష్టౌ
జ్ఞాతౌ సుతస్పర్శసుఖోపలంభాత్. 2

వ్యాఖ్య : యథాక్రమం-వరుసతప్పనీయక (స్వస్వమాతృపూర్వకముగా), ప్రణతౌ-నమస్కరించినవారును, హతారీ-చంపఁబడిన శత్రువులుగలవారును, విక్రమశోభినౌ-శౌర్యప్రకాశము గలవారునునగు, తౌ, ఉభౌ-ఆ రామలక్ష్మణు లిద్దఱు, ఉభాభ్యాం-ఇద్దఱు తల్లులచేత, అస్రాంధతయా-కన్నీటిచేత కలిగిన అంధత్వకారణమున, స్పష్టం-స్పష్టముగా, న, దృష్టౌ-చూడబడలేదు. సుతస్పర్శ సుఖోపలంభాత్-సుతస్పర్శ-కుమారునిఁదాకుటచేతనగు, సుఖ-ఆనందముయొక్క, ఉపలంభాత్-అనుభవమువలన, జ్ఞాతౌ-తెలిసికొనఁబడిరి. రామలక్ష్మణులు తన తన తల్లికి నమస్కరించినప్పుడు, కన్నీళ్ళతో నిండిన చూపులుగలవారగు కౌసల్యా సుమిత్రలు కుమారులను స్పష్టముగాఁ గుర్తింపలేకపోయిరి, కాని సుతదేహస్పర్శ వలని" యనిర్వచనీయ సుఖమువలన నితఁడు నా కుమారుఁడే యని గుర్తించిరని భావము. "నమాతుఃపరదైవతమ్" అను శాస్త్రక్రమము నతిక్రమింపక యెవరి తల్లికి వారు ముందుగా నమస్కరించిరి. సుతస్పర్శసుఖ మనుభవైకవేద్యముగాన వారు గుర్తింపఁగలిగిరి. "అస్ర" శబ్దమునకు రక్తము, కన్నీరు రెండును అర్థము లని యాదవకోశము.

శ్లో. ఆనందజః శోకజ మశ్రు బాష్ప
స్తయో రశీతం శిశిరో బిభేద,
గంగాసరయ్వో ర్జల ముష్ణతప్తం
హిమాద్రినిష్యంద ఇవావతీర్ణః. 3

వ్యాఖ్య : తయోః-ఆ యిద్దఱు తల్లులయొక్క, ఆనందజః-సంతోషము వలనఁ బుట్టిన, శిశిరః, బాష్పః-చల్లని కన్నీరు, శోకజం-దుఃఖమువలనఁ గలిగి నదియు, అశీతం-ఉష్ణమైన, అశ్రు-కన్నీటిని, ఉష్ణతప్తం-సూర్యరశ్మిచేత వేడి యెక్కిన, గంగాసరయ్వోః-గంగా సరయూనదులయొక్క, జలం-నీటిని,అవతీర్ణః-క్రిందికిఁ బ్రవహించిన, హిమాద్రినిష్యందః, ఇవ-హిమాలయ నిర్ఝరమువలె,బిభేద-వేరుపరచెను. రామలక్ష్మణుల దర్శనముచేత వారి యరణ్యవాసక్లేశస్మరణమున వేడికన్నీరుగార్చు కౌసల్యాసుమిత్రల నేత్రములనుండి సుతస్పర్శసుఖానుభూతిచేత

దొరలివచ్చు చల్లని యానందబాష్పములు గురిసెననియు, అది గ్రీష్మమునందు గంగా సరయూనదుల జలము ఉష్ణమైయుండఁగా హిమాద్రినుండి దిగివచ్చిన హిమ ప్రవాహము దానిని చల్లఁగా మార్చినట్లుండెననియు, ఆ తల్లుల కన్నులనుండి యుబుకు శోకబాష్పముల యుష్ణతను ఆనందబాష్ప శైత్యము చల్లఁబరచె ననియు భావము. దుఃఖబాష్పము లుష్ణములుగానుండుటయు, ఆనందబాష్పములు చల్లఁగా నుండుటయు లోకానుభవసిద్ధముగదా! దుఃఖముపోయి వారానందపడి రన్నది పర మార్థము. అలంకారము:ఉపమ.

శ్లో. తే పుత్రయో ర్నైరృతశస్త్రమార్గా
నార్ద్రా నివాంగే సదయం స్పృశంత్యౌ,
అపీప్సితం క్షత్రకులాంగనానాం
న వీరసూశబ్ద మకామయేతామ్. 4

వ్యాఖ్య : తే-ఆ తల్లులిద్దఱు, పుత్రయోః-ఇద్దఱు కుమారులయొక్క, అంగే-శరీరమునందు, నైరృతశస్త్ర మార్గాన్-రాక్షసఖడ్గ ప్రణములను, ఆర్ద్రాన్ ఇవ-పచ్చివానినిగా, సదయం-నొప్పునన్న దయకలిగి, స్పృశంత్యౌ-తాకుచు వారై, క్షత్రకులాంగనానాం-ఉత్తమ క్షత్రియాంగనలకు, ఈప్సితం, అపి-ఇష్టమైనదే యైనను, వీరసూశబ్దం-వీరమాత యను పేరును, న, అకామయేతాం-కోరుట గదను కొనిరి. రాక్షసుల శస్త్రముల చేత వ్రణితములగు రామలక్ష్మణుల శరీరములను నెమ్మదిగా నిమురుచున్న కౌసల్యాసుమిత్రలు "వీరమాత" యను బిరుదము క్షత్రియాంగనలకు ఇష్టమేయైనను దుఃఖహేతువగుటచేత నది కోరఁదగినదికాదని భావించిరని తాత్పర్యము. "అకామయేతాం" స్వార్థణిజంతమగు "కము-కాంతౌ" అను ధాతువునకు ఆత్మనేపదిలజ్ ద్వివచనము. ఇచ్చటి కాంతి శబ్దమునకు ఇచ్ఛ అని యర్థము.

శ్లో. క్లేశావహా భర్తు రలక్షణాహం
సీతేతి నామ స్వ ముదీరయంతీ,
స్వర్గప్రతిష్ఠస్య గురో ర్మహిష్యా
వభక్తిభేదేన వధూ ర్వవందే.

వ్యాఖ్య : భర్తుః-భర్తకు-, క్లేశావహా-కష్టములు గలిగించినదానను (కనుక) అలక్షణా-శుభలక్షణములులేని, అహం-నేను, సీతా-సీతను, ఇతి-అని, స ం, నామ-తన పేరును, ఉదీరయంతీ-పలుకుచున్నదియగుచు, స్వర్గప్రతిష్ఠస్య-స్వ ము నందున్న, గురోః-మామయగు దశరథునికి, మహిష్యౌ-రాణులగు కౌసల్యా మి త్రలను, వధూః-కోడలగు సీత, అభక్తిభేదేన-భక్తిలో భేదభావము లేక, వవందే-నమస్కరించెను. "భర్తకుఁగష్టము గూర్చిన యవలక్షణురాలగు సీతను" అని తనపేరు చెప్పుకొనుచు సీత అత్తలిద్దఱికిని సమాన భక్తితో నమస్కరించెను. పెద్దలకు నమస్కరించునప్పుడు తన పేరును జెప్పుకొనుట ధర్మశాస్త్రవిహితము. "స్వర్గప్రతిష్ఠస్య" అను పదముచేత అత్తలకుఁగలిగిన వైధవ్యమును జూచి సీత దుఃఖించెనని సూచితము. "అలక్షణా" అనునదియు తనమూలమున వారికిఁగలిగిన యాపదలను సూచించును.

శ్లో. ఉత్తిష్ఠ వత్సే నను సానుజో౽సౌ
వృత్తేన భర్తా శుచినా తవైవ,
కృచ్ఛ్రం మహ త్తీర్ణ ఇతి ప్రియార్హాం
తా మూచతు స్తే ప్రియ మప్యమిథ్యా. 6

వ్యాఖ్య : నను, వత్సే-చూడు అమ్మాయీ! ఉత్తిష్ఠ-లెమ్ము, అసౌ-ఈ, సానుజః-తమ్మునితోఁగూడిన, భర్తా-నీభర్తయగు రాముఁడు, తవ+ఏవ-నీ యొక్కయే, శుచినా, వృత్తేన-పవిత్రమైన నడవడిచేత, మహత్, కృచ్ఛ్రం-గొప్ప దుఃఖమును, తీర్ణః-దాటిన వాడయ్యెను. ఇతి-ఇట్లనుచు, ప్రియార్హాం, తాం-ప్రియ వచనములకే తగిన ఆకోడలిని గురించి, ప్రియం, అపి-ఇష్టమైనదైనను, అమిథ్యా-సత్యమును, తే-ఆ యిద్దరత్తలు, ఊచతుః-పలికిరి. తమ పాదములపైఁబడిన సీతను అమ్మాయీ! లే, నీ నిర్మల ప్రవర్తనముచేతనే తమ్మునితోఁగూడ యీనీ భర్త మహాదుఃఖమును తరించెను. అని కౌసల్యా సుమిత్రలు ప్రియమైన సత్య మును బలికి సీతను దేర్చిరని భావము. "ప్రియార్హాం" అను విశేషణమ. సీత యొక్క మనఃసౌకుమార్యమును, కష్టాసహనమును దెలుపుచున్నది. "హితం మనో హారిచ దుర్లభం వచః" అనికదా అభియుక్తోక్తి. కాని దానికి అపవాదముగా కౌసల్యా సుమిత్రలు సీతకు మనోహరమైన సత్యమును (హితమును) జెప్పిరి

శ్లో. అథాభిషేకం రఘువంశకేతోః
ప్రారబ్ధ మానందజలై ర్జనన్యోః,
నిర్వ ర్తమాయాసు రమాత్యవృద్ధాః
తీర్థాహృతైః కాంచనకుంభతోయైః. 7

వ్యాఖ్య : అథ-ఆతరువాత, జనన్యోః-యిద్దరు తల్లులయొక్క, ఆనంద జలైః-ఆనందబాష్పములచేత, ప్రారబ్ధం-ప్రారంభింపఁబడిన, రఘువంశకేతోః-రఘువంశ శ్రేష్ఠుఁడగు రామునియొక్క, అభిషేకం-పట్టాభిషేకమును, అమాత్య వృద్ధాః-పెద్దలైన మంత్రులు, తీర్థాహృతైః-గంగాది పుణ్యతీర్థములనుండి తేఁబడిన, కాంచనకుంభతోయైః-సువర్ణకలశములయందలి జలములచేత, నిర్వ ర్తయామాసుః-జరిపించిరి. తల్లులగు కౌసల్యా సుమిత్రల ఆనందబాష్పములచేత ఆరంభింపబడిన రామపట్టాభిషేకమును, వృద్ధులగు మంత్రులు సువర్ణకలశములయందు తీసికొనిరాఁబడిన గంగాది పుణ్యతీర్థజలములతో జరిపించిరి. తల్లుల సంతోషజలములచేతఁదడిసిన రామునితలపై గంగాదిజలములుంచి యభిషేకించిరని భావము.

శ్లో. సరిత్సముద్రాన్ సరసీశ్చ గత్వా
రక్షఃకపీంద్రై రుపపాదితాని,
త స్యాపతన్ మూర్ధ్ని జలాని జిష్ణోః
వింధ్యస్య మేఘప్రభవా ఇవాపః. 8

వ్యాఖ్య : రక్షఃకపీంద్రైః-రాక్షసశ్రేష్ఠులచేతను, కపిశ్రేష్ఠులచేతను,సరిత్సముద్రాన్-గంగాదినదులను, ప్రాక్పశ్చిమాది సముద్రములను, సరసీఃచ-మానసాది సరస్సులను సైతము, గత్వా-చేరి, ఉపపాదితాని-తీసుకరాఁబడిన, జలాని-నీరములు, జిష్ణోః, తస్య-జయశీలుఁడగు ఆరామునియొక్క, మూర్ధ్ని-శిరస్సుపైన, వింధ్యస్య-వింధ్యపర్వతముయొక్క, మూర్ధ్ని-తలపైన, మేఘప్రభవాః-మేఘమునుండిపుట్టిన, ఆపః, ఇవ-జలములవలె, అపతన్-పడినవి. కపిరాక్షసవీరులు సర్వ నదీసముద్ర సరస్సులనుండి తెచ్చిన తీర్థోదకములు రాముని శిరస్సుపై వింధ్యాద్రిమీదవర్ష జలములవలె పడినవి. వింధ్యాద్రియొక్క ఉపమానము రాముని యౌన్నత్యమును, వర్షజలోపమానము, రాక్షసకపివీరులు తెచ్చిన అభిషేకజల బాహుళ్యమును

సూచింపుచున్నవి. "జిష్ణోః" అను విశేషణము సందర్భయుక్తముగా నున్నది.
అలంకారము:ఉపమ.

శ్లో. తపస్వివేష క్రియయాపి తావత్
యః ప్రేక్షణీయః సుతరాం బభూవ,
రాజేంద్రనేపథ్య విధానశోభా
త స్యోదితా సీత్ పునరుక్తదోషా. 9

వ్యాఖ్య : యః-ఏ రాముఁడు, తపస్వివేషక్రియయా, అపి-మునివేషరచన చేతనే, సుతరాం-మిక్కిలి, ప్రేక్షణీయః, తావత్-చూడఁదగినవాఁడుగా, బభూవ-ఉండెనో, తస్య-ఆ రామునికి, రాజేంద్రనేపథ్యవిధానశోభా-రాజవేషరచన చేతఁ గలిగిన కాంతి, ఉదితా-ఏర్పడినదియై, పునరుక్తదోషా-పునరుక్తదోషముఁగలది, ఆసీత్-అయినది. తాపస వేషముచేతనే ఎంతయో దర్శనీయశోభ గలిగియుండిన శ్రీరామునికిఁ బట్టాభిషేక సమయమునఁ గూర్చిన మణికిరీటరత్నకంకణాదికమగు రాజేంద్రవేషము పునరుక్తదోషము గలదిగా నుండెను. అనఁగా అందగాఁడై యున్న వానిని మరల నందగానిని జేయు యత్నమువలె నిరుపయోగముగా నుండెనని భావము. కవితలో వేసినపదమునే వేయుట, చెపిన భావమునే చెప్పుటవలె నుండె ననుట. జటావల్కలధారి యగు రాముఁడు దర్శనీయతరశోభ గలవాఁడని కవి హృదయము.

శ్లో. స మౌలరక్షోహరిభిః ససైన్యః
తూర్యస్వనానందిత పౌరవర్గః,
వివేశ సౌధోద్గత లాజవర్షా
ముత్తోరణా మన్వయరాజధానీమ్. 10

వ్యాఖ్య : సః-ఆ రాముఁడు, ససైన్యః-సైన్యముతోఁగూడినవాఁడును, తూర్యస్వనానందితపౌరవర్గః—తూర్యస్వన-మంగళవాద్యధ్వనులచేత, ఆనందిత-సంతోషమును పొందిన, పౌరవర్గః-పురజన సమూహము గలవాఁడును నగుచు, మౌలరక్షోహరిభిః-మంత్రి వృద్ధులతోను, రాక్షసులతోను, కపిశ్రేష్ఠులతోను, సౌధోద్గతలాజవర్షాం-మేడలనుండిపడు పేలాల వర్షము గలదియు, ఉత్తోరణాం-

ఎత్తైనగవనివాకిండ్లు గలదియునగు, అన్వయరాజధానీం-తమ వంశపు రాజులకు నివాసమగు నయోధ్యానగరమును, వివేశ-ప్రవేశించెను. రాముఁడు సైన్యసమేతుఁడై వృద్ధమంత్రులు, కపిరాక్షసవీరులు వెంటరాగా, మంగళవాద్య పురజన కోలాహలమున, పుణ్యాంగనలు మేడలపైనుండి లాజవర్షము గురియుచుండ తమ వంశ రాజధాని యగు నయోధ్యను బ్రవేశించెను. "మూలేభవాః మౌలాః" ముఖ్యస్థానమున నుండువారు, వృద్ధమంత్రులని యర్థము. రాజులు నగరమునవెళ్ళునప్పుడు పేలాలు చల్లుట యాచారము.

శ్లో. సౌమిత్రిణా సావరజేన మంద
మాధూతవాలవ్యజనో రథస్థః,
ధృతాతపత్రో భరతేన సాక్షా
దుపాయసంఘాత ఇవ ప్రవృద్ధః. 11

వ్యాఖ్య : సావరజేన (స + అవరజేన)-తమ్ముఁడగు శత్రుఘ్నునితోఁ గూడిన, సౌమిత్రిణా-లక్ష్మణునిచేత, మందం-మల్లఁగా, ఆధూతవాలవ్యజనః-వీచఁబడిన చామరములు గలవాఁడును, రథస్థః-రథమునందున్నవాఁడును, భరతేన-భరతునిచేత, ధృతాతపత్రః-పట్టుకొనఁబడిన ఛత్రముగలవాఁడును నగు రాముఁడు ప్రవృద్ధః-వృద్ధిఁజెందిన, సాక్షాత్-ఎదుటఁగనఁబడు, ఉపాయసంఘాతః, ఇవ-సామాద్యుపాయ చతుష్టయమువలె (నగరమును ప్రవేశించెనని పూర్వశ్లోకముతో నన్వయము). అనుజసహితుఁడైన రాముఁడు మూర్తీభవించిన ఉపాయచతుష్టయము వలె నగరమునఁ బ్రవేశించెనని భావము. ఇది భావిరాజ్యపాలన చాతుర్య సూచకము. రవివర్మ వ్రాసిన రామపట్టాభిషేక పటమున కిదిమూలమా?

శ్లో. ప్రాసాద కాలాగురు ధూమరాజిః
తస్యాః పురో వాయువశేన భిన్నా,
వనా న్నివృత్తేన రఘూత్తమేన
ముక్తా స్వయం వేణి రివావభాసే. 12

వ్యాఖ్య : వాయువశేన-గాలివచ్చుటచేత, భిన్నా-వేరుపడిన, ప్రాసాద కాలాగురు ధూమరాజిః—ప్రాసాద-సౌధమునందలి, కాలాగురుధూమ-అగురుపొగ

యొక్క, రాజిః-రేఖ, వనాత్, నివృత్తేన-అరణ్యమునుండి మరలివచ్చిన, రఘూత్తమేన-రామునిచేత, స్వయం, ముక్తా-స్వంతముగా విడువఁబడిన, తస్యాః, పురః-ఆ యయోధ్యారాజధానియొక్క, వేణిః, ఇవ-జడవలె, అవభాసే-ప్రకాశించెను. రాముడు ప్రవేశించునప్పుడు రాజప్రాసాదముమీద గాలిచేదూరముగా సాగిన అగురుధూమరేఖ, అయోధ్యాపురి, తన పతియగు రాముఁడు ప్రవాసమునయున్న కాలమున పాతివ్రత్య ధర్మమునను సరించి విడువక ముడుచుకొన్న జడను, రాముఁడరణ్యమునుండి వచ్చి విప్పినట్లుండెనని భావము. "పురః" పూః అనురేఫాంత స్త్రీలింగశబ్ద షష్ఠ్యేక వచనము. భర్తపరదేశమున నుండగా భార్య తలదువ్వుకొనరాదనియు, జడను విడువరాదనియు హారీతస్మృతి చెప్పుచున్నది. "న ప్రోషితే తు సంస్కుర్యా న్న వేణీంచ ప్రమోచయేత్" అలంకారము: ఉత్ప్రేక్ష.

శ్లో. శ్వశ్రూజనానుష్ఠిత చారువేషాం
కర్ణీరథస్థాం రఘువీర పత్నీం,
ప్రాసాద వాతాయన దృశ్యబంధైః
సాకేతనార్యో ఽంజలిభిః ప్రణేముః. 13

వ్యాఖ్య : శ్వశ్రూజనానుష్ఠిత చారువేషాం-అత్తలచేతఁ జేయఁబడిన మంచి వస్త్రాలంకార వేషముగలదియు, కర్ణీరథస్థాం-స్త్రీలకు యోగ్యమగు చిన్నరథమునందుఁ గూర్చున్నదియునగు, రఘువీరపత్నీం-సీతను, సాకేతనార్యః-అయోధ్యానగరస్త్రీలు, ప్రాసాదవాతాయన దృశ్యబంధైః-ప్రాసాదవాతాయన-మేడల కిటికీలలో, దృశ్యబంధైః-కనఁబడు జోడింపులుగల, అంజలిభిః-దోయిళ్ళతో, ప్రణేముః-నమస్కరించిరి. అరణ్యవాసవేషమును దొలఁగించి యత్తలు రాజమహిషీ వేషమును ధరింపఁజేయఁగా స్త్రీయోగ్యమగు చిన్న రథమునందు రాజప్రాసాదమునకు వెళ్ళుచున్న సీతను నగరస్త్రీలు మేడలపైనిల్చి కిటికీలగుండాఁ గనఁబడుచున్న తమయంజలిపుటములతో నమస్కరించిరి. "కర్ణీరథః ప్రవహణం డయనం రథగర్భకే" అని యాదవనిఘంటువు.

శ్లో. స్ఫురత్ప్రభామండల మానుసూయం
సా బిభ్రతీ శాశ్వత మంగరాగమ్,

రరాజ శుద్ధేతి పునః స్వపుర్యై
సందర్శితా వహ్నిగతేవ భర్త్రా. 14

వ్యాఖ్య : స్ఫురత్ప్రభామండలం-మెఱయుచున్న కాంతిమండలము గల దియు, అనుసూయం-అనుసూయాదేవిచే నియ్యఁబడినదియు, శాశ్వతం-చెదరక బహుకాల ముండునదియునగు, అంగరాగం-ఎఱ్ఱనిమైపూతను, బిభ్రతీ-ధరించినది యగు, సా-ఆసీత, భర్త్రా-భర్తచేత, స్వపుర్యై-తన నగరముకొఱకు (అయోధ్యా నగరజనుల కని లక్షణావృత్తిచేత నర్థము) శుద్ధా, ఇతి-పరిశుద్ధురాలేయని, సంద ర్శితా-చూపఁబడినదియై, పునః-మరల, వహ్నిగతా, ఇవ-అగ్నినిఁ బ్రవేశించినది వోలె, రరాజ-ప్రకాశించెను. దారిలో అనుసూయాదేవి యిచ్చిన యంగరాగము చెక్కుచెదరక యెఱ్ఱనికాంతితోనుండగా సీత, భర్తచేత పురజనుల విశ్వాసము కొఱకై మరల నగ్నిప్రవేశముఁజేయించి, యీమె లంకలోనుండి వచ్చినను పరిశుద్ధు రాలే యని నిరూపింపఁబడినట్లు ప్రకాశించెనని భావము. అలంకారము: ఉత్ప్రేక్ష

శ్లో. వేశ్మాని రామః పరిబర్హవంతి
విశ్రాణ్య సౌహార్దనిధిః సుహృద్భ్యః,
బాష్పాయమాణో బలిమ న్నికేత
మాలేఖ్యశేషస్య పితు ర్వివేశ. 15

వ్యాఖ్య : సౌహార్దనిధిః — సౌజన్యనిధియగు, రామః - రాముఁడు సుహృద్భ్యః-స్నేహితులగు సుగ్రీవాదులకు, పరిబర్హవంతి-ఉపకరణములుగల, వేశ్మాని-గృహములను, విశ్రాణ్య-ఇచ్చి, ఆలేఖ్యశేషస్య-చిత్రపటముగానే మిగి లిన, పితుః-తండ్రియొక్క, బలిమత్-పూజాయుక్తమగు, నికేతం-గృహమును, బాష్పాయమాణః-కన్నీరుఁగార్చుచున్నవాఁడగుచు, వివేశ-ప్రవేశించెను. మంచితన మునకుఁబెన్నిధియగు రాముఁడు సుగ్రీవాది మిత్రులకు సకలోపకరణశోభితము లగు గృహములను విడుదులుగాఁజేసి, చిత్రపటముగాఁ బూజలందుకొనుచున్న తండ్రి దశరథుని యింటిని పితృవియోగజనిత బాష్పములు గార్చుచున్నవాఁడ గుచుఁ బ్రవేశించెనని భావము. "వివేశ" విశ-ప్రవేశనేధాతువునకు లిట్ ప్ర. పు. ఏకవచనము.

శ్లో. కృతాంజలి స్తత్ర యదంబ! సత్యాత్
నాభ్రశ్యత స్వర్గఫలాత్ గురు ర్నః,

తచ్చింత్యమానం సుకృతం తవేతి
జహార లజ్జాం భరతస్య మాతుః. 16

వ్యాఖ్య : తత్ర-ఆ సౌధమునందు, కృతాంజలిః-నమస్కరించుచున్న వాఁడగుచు, హేఅంబ-ఓ తల్లీ, నః, గురుః-మా తండ్రి, స్వర్గఫలాత్-స్వర్గము ఫలముగానున్న, సత్యాత్-సత్యమునుండి, న, అభ్రశ్యత, ఇతియత్-జారిపడలేదను నది యేదికలదో, తత్-ఆయభ్రంశనము, చింత్యమానం-విచారింపఁబడినదగుచు, తవ-నీయొక్క, సుకృతం-మంచిపనియే యగుచున్నది. ఇతి-ఇట్లు పలికి, భరతస్య మాతుః-కైకేయియొక్క, లజ్జాం-రామునిఁజూడఁజాలని సిగ్గును, జహార-తొలఁగించెను. దశరథసౌధమునందుఁ జేరిన రాముఁడు బద్ధాంజలియై కైకనుజేరి, "అమ్మా! మా తండ్రి స్వర్గఫలమైన సత్యవాక్యమునుండి దూరముకాకుండుటకు నీవు చేసిన మంచిపనియే, సుకృతమే, కారణము" అని పలుకుచుఁ, దనను కన్నెత్తి చూచుటకు సిగ్గుపడుచున్న కైకేయి లజ్జను హరించి యామెకు మనఃప్రసాదమును గలిగించెను. భరతశబ్దప్రయోగము రామునికి భరతుని కన్నను కైకేయి ముఖ్యురాలను భావమును సూచించుటకు.

శ్లో. తత్రైవ సుగ్రీవ విభీషణాది
నుపాచర త్కృత్రిమ సంవిధాభిః,
సంకల్పమాత్రోదితసిద్ధయ స్తే
క్రాంతా యథా చేతసి విస్మయేన. 17

వ్యాఖ్య : సుగ్రీవవిభీషణాదీన్ - సుగ్రీవవిభీషణాదులను, కృత్రిమ సంవిధాభిః-కల్పింపఁబడిన భోగ్యవస్తువులచేత, తత్రైవ-అదేవిధముగా, ఉపాచరత్-గౌరవించెను. యథా-ఏవిధమున, సంకల్పమాత్రోదితసిద్ధయః-తలఁచుకొనుటచేతనే చేకూరు కార్యములుగల, తే-ఆ సుగ్రీవాదులు, చేతసి-మనస్సునందు, విస్మయేన-ఆశ్చర్యముతో, క్రాంతాః-ఆక్రమింపఁబడిరో. పిమ్మట నానావిధ వస్తుసామగ్రితో సుగ్రీవాదులకు నివాస సౌకర్యమును గూర్చఁగా సంకల్పముచేతనే ద్రవ్యవస్తువులు సంపాదించుకోఁగల సుగ్రీవాదులు రాముఁడు సమర్పించిన వస్తుజాలమును జూచి ఔరా! ఎంత మనోహరము లీవస్తువులని యాశ్చర్యపడిరని భావము.

శ్లో. సభాజనా యోపగతాన్ స దివ్యాన్
మునీన్ పురస్కృత్య హతస్య శత్రోః,
శుశ్రావ తేభ్యః ప్రభవాది వృత్తం
స్వవిక్రమే గౌరవ మాదధానమ్. 18

వ్యాఖ్య : సః-రాముఁడు, సభాజనాయ-తన నభినందించుటకై, ఉపగతాన్-వచ్చినవారును, దివ్యాన్-స్వర్గవాసులునగు, మునీన్-అగస్త్యాదిమునులను, పురస్కృత్య-పూజించి, హతస్య, శత్రోః-తనచేఁజంపఁబడిన శత్రువగు రావణుని యొక్క, ప్రభవాది-పుట్టుక మొదలయినదియు, స్వవిక్రమే-తనశూరత్వమునందు, గౌరవం-గొప్పతనమును, ఆదధానం-నిలుపుచున్నదియు నగు, వృత్తం-చరిత్రను, తేభ్యః-ఆ మునులవలన, శుశ్రావ-వినెను. రావణ వధవలన సంతసించిన అగస్త్యాది దేవమునులు రామునభినందించుటకు రాఁగా వారిని గౌరవించి, సత్కరించి రాముఁడు వారివలన తాను వధించిన రావణుని చరిత్రనంతయు వినెనని భావము. ఓడిపోయిన వాని గొప్పతనము గెలిచిన వీరుని శౌర్యము నినుమడింపఁజేసి కీర్తిదాయక మగును గదా! అందులకే రామునికి మునులు రావణ జన్మాదిక వృత్తాంతమును జెప్పుట యని గ్రహింపవలెను.

శ్లో. ప్రతిప్రయాతేషు తపోధనేషు
సుఖా దవిజ్ఞాత గతార్ధమాసాన్,
సీతా స్వహస్తోపహృతాగ్ర్య పూజాన్
రక్షఃకపీంద్రాన్ విససర్జ రామః. 19

వ్యాఖ్య : తపోధనేషు-అగస్త్యాదిమునులు, ప్రతిప్రయాతేషు-తిరిగి వెళ్ళిపోయినవారుకాఁగా (సతిసప్తమి), సుఖాత్-సుఖానుభవమువలన, అవిజ్ఞాతగతార్ధమాసాన్—అవిజ్ఞాత-తమకుఁదెలియకయే, గత-కడచిపోయిన,అర్ధమాసాన్-సగము నెల గలవారును (కావున) సీతాస్వహస్తోప హృతాగ్ర్యపూజాన్—సీతాస్వహస్త-సీతయొక్క హస్తములచేత, ఉపహృత-తీసుకరాఁబడిన, అగ్ర్యపూజాన్-ఉత్తమ సత్కార వస్తువులుగలవారును నగు, రక్షః కపీంద్రాన్-రాక్షసేంద్ర కపీంద్రులను, రామః-రాముఁడు, విససర్జ-పంపివేసెను మునులు తమ నివాసములకు " వెళ్ళిన

పిమ్మట, సుఖముగా తామెన్ని రోజులనుండి యచ్చటనుండిరో గమనింపక హాయిగా పదునైదుదినములు గడపిన సుగ్రీవాది కపీంద్రులను, విభీషణాది రాక్షసేంద్రులను సీత తన హస్తములతోఁదెచ్చిన యుత్తమవస్త్రభూషణాదులతో సత్కరించి, వారిని రాముఁడు స్వగృహములకుఁబంపె నని భావము. "గతార్థమాసాః" చుట్టము, మిత్రుఁడు పదునైదుదినములుండుట, ఉండవలెనని కోరుట, లోకమర్యాద యని సూచించుచున్నది.

శ్లో. తచ్చాత్మచింతాసులభం విమానం
హృతం సురారేః సహ జీవితేన
కైలాసనాథోద్వహనాయ భూయః
పుష్పం దివః పుష్పక మన్వమంస్త. 20

వ్యాఖ్య: ఆత్మచింతాసులభం – స్వేచ్ఛామాత్రముచేత లభించునదియు, సురారేః–దేవశత్రువగు రావణునియొక్క, జీవితేన, సహ–ప్రాణములతోఁగూడ, హృతం–తనచేఁ దీసికొనఁబడినదియు, దివః–ఆకాశమునకు, పుష్పం–పుష్పమువలె నాభరణప్రాయమైనదియు నగు, తచ్చ, పుష్పకం, విమానం–ఆపుష్పకవిమానమును గూడ, భూయః–మరల, కైలాసనాథోద్వహనాయ–కైలాసనాథ–కుబేరుని, ఉద్వహనాయ–ఆకసముపైఁ ద్రిప్పుటకొఱకు, అన్వమంస్త–అనుమతించెను. అధిపతి తలఁచినట్లు మెలఁగునదియు, రావణునిఁ జంపినప్పుడు తనవశమైనదియు, ఆకాశమునకు భూషణమైనట్టిదియు నగు పుష్పకవిమానము మరలఁ గుబేరునివద్దికి వెళ్ళుటకు రాముఁడనుమతించెను. "భూయః" అనుపదము పుష్పక విమానము కుబేరునిదేయనియు, రావణుఁ డపహరించియుండె ననియు సూచించుచున్నది. అను + అమంస్త–అన్వమంస్త "మన–అవబోధనే" ధాతువులుఙ్ ప్ర.ఏ.

శ్లో. పితు ర్నియోగా ద్వనవాస మేవం
నిస్తీర్య రామః ప్రతిపన్నరాజ్యః,
ధర్మార్థకామేషు సమాం ప్రపేదే
యథా తథై వావరజేషు వృత్తిమ్. 21

వ్యాఖ్య: రామః-రాముఁడు, ఏవం-ఇట్లు, పితుః-తండ్రియొక్క, నియోగాత్-ఆజ్ఞవలన, వనవాసం-అరణ్యవాసమును, నిస్తీర్య-దాటి (పూర్తిచేసి), ప్రతిపన్న రాజ్యః-పొందఁబడినరాజ్యముగలవాఁడగుచు, ధర్మార్థకామేషు-పురుషార్థములగు ధర్మార్థకామములందు, యథా-ఎట్లో, తథైవ-అట్లే, అవరజేషు-తమ్ములయందు, సమాం, వృత్తిమ్-సమానమగు ప్రవృత్తిని, ప్రపేదే-పొందెను. తండ్రి శాసనము వలన సుదీర్ఘమైన వనవాసమును పూర్తిచేసి పట్టాభిషిక్తుఁడైన రాముఁడు ధరా కామములందువలె ముగ్గురు తమ్ముల విషయమునను సమానప్రేమగలవాఁ యుండెను. ధర్మార్థకామపురుషార్థములను వైషమ్యములేక సేవించుచు, తమ్ములం తిని సమానముగాఁ జూచెనని భావము.

శ్లో. సర్వాసు మాతృష్వపి వత్సలత్వాత్
స నిర్విశేషప్రతిప్రత్తి రాసీత్,
షడాననాపీతపయోధరాసు
నేతా చమూనా మివ కృత్తికాసు. 22

వ్యాఖ్య : సః-రాముఁడు, వత్సలత్వాత్-సహజప్రేమ గలవాఁడగుటవలన, సర్వాసు, మాతృషు, అపి-తల్లులందఱియందును, నిర్విశేషప్రతిపత్తిః-సమానసత్కారములు చేయువాఁడు, చమూనాం, నేతా-దేవసైన్యములకు నాయకుఁడగు షణ్ముఖుఁడు, షడాననాపీతపయోధరాసు-ఆరు మొగములచేతను ద్రాగఁబడిన స్తన్యములుగల, కృత్తికాసు, ఇవ-తల్లులైన షట్కృత్తికలయందువలె, ఆసీత్-అయ్యెను. షణ్ముఖుఁడు ఆరు మొగములద్వారా ఆ రు తల్లుల పాలు త్రాగి వారందఱియందును సమాన భక్తిగలిగియున్నట్లు స జ వాత్సల్యపూర్ణుఁడగు రాముఁడు తల్లులందఱి యందును తుల్యగౌరవము గలవాఁడై యుండెనని భావము. మాతాపుత్ర ప్రేమకు స్తన్యపానము పరాకాష్ఠ యగుట వలన షడాననోపమాన మిచ్చుటఁ జెప్పఁబడినది.

శ్లో. తేనార్థవాన్ లోభపరాఙ్ముఖేన
తేన ఘ్నతా విఘ్నభయం క్రియావాన్,
తేనాస లోకః పితృమాన్ వినేత్రా
తైనైవ శోకాపనుదేన పుత్రీ. 23

వ్యాఖ్య : లోకః-జనము, లోభపరాఙ్ముఖేన-లోభగుణమునకు విముఖుఁడైన (దాతయగు), తేన-ఆ రామునిచేత, అర్థవాన్-ధనముగలది, ఆస-అయినది, విఘ్నభయం-విఘ్నములవలని భయమును, ఘ్నతా-నశింపఁజేయుచున్న, తేన-ఆతనిచేత, క్రియావాన్-సత్కర్మానుష్ఠానముగలది, ఆస-అయ్యెను, వినేత్రా-కర్తవ్యమువైపున నడపునట్టి, తేన-ఆతనిచేత, పితృమాన్-తండ్రిగలది, ఆస-అయ్యెను. శోకాపనుదేన-దుఃఖమును దొలఁగించునట్టి, తేన, ఏవ-ఆ రామునిచేతనే, పుత్రీ-కుమారులుఁగలది (పుత్రః అస్య అస్తీతి పుత్రీ అని విగ్రహము). ఆస-అయ్యెను. రాముఁడు ప్రజలను దాతయై ధనవంతులనుజేయుచు, విఘ్నములను దొలఁగించి సత్కర్మానుష్ఠానపరులను జేయుచు, సన్మార్గనియామకుఁడై తండ్రిగల వారినిగా జేయుచు, దుఃఖములు తొలఁగించి పుత్రవదానందమును గూర్చుచుఁ బరిపాలించెనని భావము. "ఆస" అనునది క్రియవలెఁగనఁబడునట్టి అవ్యయము.

శ్లో. స పౌరకార్యాణి సమీక్ష్య కాలే
రేమే విదేహాధిపతే ర్దుహిత్రా,
ఉపస్థిత శ్చారు వపు స్తదీయం
కృత్వో వభోగోత్సుకయేవ లక్ష్మ్యా. 24

వ్యాఖ్య : సః-రాముఁడు, కాలే-సరియగునవసరమునందు, పౌరకార్యాణి-పౌరులపనులను, సమీక్ష్య-విచారించి, విధేహాధిపతేః దుహిత్రా-జనకునియొక్క కూతురగు సీతతో, ఉపభోగోత్సుకయా-సౌఖ్యానుభవమునకై త్వరపడుచున్నది యగుటచేత, తదీయం, చారు, వపుః-సీతాదేవిదగు నంద న దేహమును, కృత్వా-ధరించియున్నలక్ష్మ్యా, ఇవ-లక్ష్మీదేవిచేతవలె, ఉప తః(సన్)-కలిసికొఁబడిన వాఁడగుచు, రేమే-క్రీడించెను. సకాలమునఁ ప్రజాహి కార్యములను సరిదిద్ది, సౌఖ్యానుభవమునకుఁ ద్వరపడుచున్న లక్ష్మి యామెరూపమును ధరించెనా? యన నుండిన సీతాసుందరితో రాముఁ డిష్టసుఖముల ననుభవించె ననిభావము. "ఉప నంతు సంగతిః" అనియాదవ నిఘంటువు. 'రేమే' రము-క్రీడాయాం అను ధాతు నకు లిట్ ప్ర. పు. ఏ.

శ్లో. తయో ర్యథాప్రార్థిత మింద్రియార్థా
నాసేదుషోః సద్మసు చిత్రవత్సు,

ప్రాప్తాని దుఃఖాన్యపి దండకేషు
సంచింత్యమానాని సుఖా న్యభూవన్. 25

వ్యాఖ్య : చిత్రవత్సు-తమవనవాసచిత్రములు నిలిపిన, సద్మసు-భవనము లయందు, యథా ప్రార్థితం-కోరికల ప్రకారముగా, ఇంద్రియార్థాః-జిహ్వాదీంద్రియ ములకు వలసిన రసాదులను, ఆసేదుషోః-అను భవించుచుండిన, తయోః-ఆసీతా రాముఁలకు. దండకేషు-దండకారణ్యములయందు, ప్రాప్తాని-పొందఁబడినవి, దుఃఖాని, అపి-కష్టములేయైనను, సంచింత్యమానాని-ఇప్పుడు స్మరింపఁబడుచున్న వగుచు, సుఖాని-సుఖములే, అభూవన్-అయినవి. రామవనవాస సంఘటనలను చిత్రపటములపై వేసి రాజభవనములందుంచఁగా సకలసౌఖ్యము లనుభవించు చున్న సీతారాములు చిత్రపటదర్శనమున స్మృతికి వచ్చిన విరహవిలాపాది కష్ట ములను సుఖములుగానే భావించిరి. పూర్వకష్టములు స్మరణసమయమున మధు రములగుట లోకసిద్ధముగదా! ఇంద్రియములు. "త్వక్చక్షుఃశ్రోత్రజిహ్వాఘ్రాణ ములు. అర్థములనఁగా స్పర్శ, రూప, శబ్ద, రస, గంధములు; ఇవి వాంఛితము లగుచో నానందము కల్గును.

శ్లో. అథా ధికస్నిగ్ధవిలోచనేన
ముఖేన సీతా శరపాండురేణ,
ఆనందయిత్రీ పరిణేతు రాసీ
దనక్షర వ్యంజితదోహదేన. 26

వ్యాఖ్య: అథ-ఆతరువాత, సీతా-సీతాదేవి, అధిక స్నిగ్ధవిలోచనేన-మిక్కిలి మసృణములగు కన్నులుగలదియు, శరపాండురేణ-రెల్లుపువ్వువలె తెల్లనైనదియు, అనక్షర వ్యంజితదోహదేన—అనక్షర వ్యంజిత-వాగ్వ్యాపారములేకయే సూచింపఁ బడిన, దోహదేన-గర్భముగలదియు నగు, ముఖేన-ముఖముచేత, పరిణేతుః-భర్తకు, ఆనందయిత్రీ-సంతోషమును జేకూర్చునది, ఆసీత్-అయ్యెను. రాజ్యసుఖము నను భవించుచు సీతారాములు కొంతకాలముఁగడపిన పిమ్మట, ఎక్కువ జిడ్డువారిన కన్నులతో తెల్లుపువ్వువలెఁదెల్లబడి గర్భచిహ్నములను సూచించు ముఖముచేత సీత రాముని కానందముఁగలిగించె నని భావము. అనఁగా సీత గర్భవతి యయ్యెను.

శ్లో. తా మంక మారోప్య కృశాంగయష్టిం
వర్ణాంతరాక్రాంతపయోధరాగ్రామ్,
విలజ్జమానాం రహసి ప్రతీతః
పప్రచ్ఛ రామాం రమణో ఽభిలాషమ్. 27

వ్యాఖ్య : ప్రతీతః-గర్వమును, సీత మనస్సును ఎఱిఁగినట్టి, రమణః-ప్రియుడగు రాముఁడు, కృశాంగయష్టిం-కృశించిన దేహముగలదియు, వర్ణాంతరాక్రాంత పయోధరాగ్రాం--వర్ణాంతరాక్రాంత-నలుపువారిన, పయోధరాగ్రాం-స్తనాగ్రములు (చూచుకములు) గలదియు, విలజ్జమానాం-సిగ్గుపడుచున్నదియు నగు, తాం, రామాం-ఆప్రియురాలిని (సీతను), రహసి-ఏకాంతమునందు, అంకం, ఆరోప్య-తొడనెక్కించుకొని, అభిలాషం-మనోరథమును, పప్రచ్ఛ-అడిగెను. శరీరము కృశించుట, చూచుకములు నల్లబడుట, ఆమె సిగ్గుపడుచుండుట మొదలగు లక్షణములతో సీతమనోగతము నెఱిఁగినరాముఁడామెనేకాంతమునఁదొడపై నిడుకొని "నీ కోరికయేదో! తెలుపు" మని యడిగెను. "రమణః రామాం అభిలాషం పప్రచ్ఛ" ఇది ద్వికర్మక కర్తరి ప్రయోగము. ఈ రామారమణ శబ్దములు సీతారాముల యనురాగమును దెలుపుచున్నవి. రమయతీతి "..." అని వ్యుత్పత్తి.

శ్లో. సా దష్టనీవారబలీని హింస్రైః
సంబద్ధ వైఖానసకన్యకాని,
ఇయేష భూయః కుశవంతి గంతుం
భాగీరథీ తీర తపోవనాని. 28

వ్యాఖ్య : సా-సీత, హింస్రైః-క్రూరమృగములచేత, దష్టనీవారబలీని-దష్ట-కొరుకఁబడిన, నీవార-నివ్వరిధాన్యములే, బలిని-దేవతా తిర్యగ్జంతువుల బలులు గలవియు, సంబద్ధవైఖానసకన్యకాని-సంబద్ధ-స్నేహముగల, వైఖానసకన్యకాని-మునికన్యలుగలవియును, కుశవంతి-దర్భలుగలవియు నగు, భాగీరథీ తీర తపోవనాని-గంగాతీరమునందలి తపోవనములను గురించి, భూయః-మరల, గంతుం-వెళ్ళుటకు, ఇయేష-కోరెను. గడ్డిధాన్యములే పూజా దానములకు యోగ్యములై, తనతో సఖ్యముగలిగియున్న మునికన్యలు గలిగినవై, దర్భారణ్యములుగల గంగాతీరస్థ తపోవనములకు మరల నొకపర్యాయము వెళ్ళినబాగుండు. నని సీత రామునికిఁదనయభిలాషను వెల్లడించెను. "ఇయేష" ఇష-ఇచ్ఛాయాం అనుధాతువునకు లిట్ ప్ర.పు. ఏకవచనము.

శ్లో. తస్యై ప్రతిశ్రుత్య రఘుప్రవీర
స్తదీప్సితం పార్శ్వచరానుయాతః,
ఆలోకయిష్యన్ ముదితా మయోధ్యాం
ప్రాసాద మభ్రం లిహ మారురోహ. 29

వ్యాఖ్య: రఘుప్రవీరః-రాముఁడు. తస్యై-సీతకొఱకు, తదీప్సితం-ఆకోరి కను, ప్రతిశ్రుత్య-తీర్చెదనని ప్రతిజ్ఞచేసి, పార్శ్వచరానుయాతః—పార్శ్వచర-అప్పు డచ్చటనుండిన, సేవకజనముచేత, అనుయాతః-వెంబడింపఁబడిన వాఁడగుచు, ముదితాం-తమయునికివలన నానందమును జెందిన, అయోధ్యాం-అయోధ్యానగరమును, ఆలోకయిష్యన్-చూడఁబోవువాఁడగుచు, అభ్రంలిహం-ఆకాశమునుదాకుచున్న, ప్రాసాదం-మేడను, ఆరురోహ-ఎక్కెను. గంగాతీరస్థ తపోవనములను మరలఁజూడఁదలచిన సీత యొక్క కోరికను తప్పక తీర్చెదనని చెప్పి, రాముఁడు తనరాజ్యపాలనమున అయోధ్యానగర మెట్టులానందించుచున్నదో చూడఁదలచినవాఁడై సేవకజన మనుసరించుచుండగా మహోన్నతమైనరాజభవ నముపైకి వెళ్లెను. ఆఙ్ అను ఉపసర్గతోఁగూడిన "రుహ" ధాతువునకు లిట్ ప్ర. పు. ఏ. (ఆ + రురోహ-ఆరురోహ). ఆరురోహ-ఎక్కెను, అవరురోహ-దిగెను. అని యర్థములు.

శ్లో. ఋద్ధాపణం రాజపథం స పశ్యన్
విగాహ్యమానాం సరయూం చ నౌభిః
విలాసిభి శ్చాధ్యుషితాని పౌరైః
పురోపకంఠోపవనాని రేమే. 30

వ్యాఖ్య: సః-రాముఁడు, ఋద్ధాపణం-సమృద్ధిగా [illegible], రాజ పథం-పెద్దవీథిని, నౌభిః-పడవలచేత, విగాహ్య[illegible]పబడుచున్న సరయూం చ-సరయూనదినిన్నీ, విలాసిభిః-విలాసాభిలాషగల, పౌరైః-నగర వాసులచేత, అధ్యుషితాని-కూర్చుండఁబడినవగు, పురోపకంఠోపవనాని, చ-నగరసమీ పమునన్నతోటలను తము, పశ్యన్-చూచుచున్నవాఁడగుచు, రేమే-ఆనందిం చెను. క్రయవిక్రయార్థమై వచ్చిన జనుల కలకలముతో వస్తుసమృద్ధిగలకొట్లతో ముచ్చటగొల్పు రాజవీధిని, వ్యాపారార్థమై సముద్రమువైపునకు వెళ్ళు నోడలచేఁ

ఇ త్యేకపక్షాశ్రయ విక్లబత్వా
దాసీ త్స దోలాచల చిత్తవృత్తిః. 34

వ్యాఖ్య : ఆత్మనిర్వాదకథాం-నాయపకీర్తికథను, కిం,ఉపేక్షే-ఉపేక్ష సేయుదునా? (లెక్కచేయకుందునా?), ఉత-లేక, అదోషాం-ఏతప్పునుజేయని, జాయాం-భార్యను, సంత్యజామి-విడిచిపెట్టుదునా?, ఇతి-ఇట్లని, ఏకపక్షాశ్రయ విక్లబత్వాత్—ఏకపక్ష-రెండింటిలో నొకదానిని, ఆశ్రయ-స్వీకరించుటయందు, విక్లబత్వాత్-అధీరుఁడై నిర్ణయించుకోఁ జాలకపోవుటవలన, సః-రాముఁడు, దోలా చలచిత్తవృత్తిః-ఊయెలవలె నిలుకడలేని మనోవ్యాపారముగలవాఁడు, ఆసీత్-అయ్యెను, తనపైవచ్చిన యపకీర్తిని లెక్కచేయకుంతుటయా? లేక యెట్టిదోష మునులేని భార్యను విడుచుటయా? అ రెంతు పక్షములలో నొకదాని నాశ్ర యింపఁజాలక రాముఁడు సంశయగ్రస్తుఁడయ్యె నని భావము. అపకీర్తి మరణము కంటెను గొప్పది. పతివ్రతయై తప్పుచేయని భార్యను విడుచుట పాప హేతువు కనుక రామునికట్టి స్థితి యేర్పడెను. "జాయా" శబ్దము, సంతానప్రద త్వార్థము గలదియు, "విక్లబ" శబ్దము, సర్వేంద్రియవ్యాపార శూన్యత్వమును దెలుపునదియు నగుటచే సార్థకములు.

శ్లో. నిశ్చిత్య చానన్యనివృత్తి వాచ్యం
త్యాగేన పత్న్యాః పరిమార్ష్టు మైచ్ఛత్,
అపి స్వదేహాత్ కిము తేంద్రియార్థాత్
యశోధనానాం హి యశో గరీయః. 35

వ్యాఖ్య: చ-మరియు, వాచ్యం-అపకీర్తిని, అనన్యనివృత్తి-మరియొక దానిచేత నివర్తింపని దానినిగా, నిశ్చిత్య-నిశ్చయించుకొని, పత్న్యాః-భార్యయొక్క త్యాగేన-త్యాగముచేత, పరిమార్ష్టుం-తుడిచివేయుటకు (పరిహరించుటకు) ఐచ్ఛత్-ఇష్టపడెను. హి-అదియుక్తమే; యశోధ నానాం-యశోధనులగు వారికి, స్వదేహాత్, అపి-తమశరీరముకంటెను, యశః-కీర్తి, గరీయః-గొప్పదై యుండఁగా, ఇంద్రి యార్థాత్-ప్రసక్చందన వనితాదిక మగు భోగ్యవస్తు జాతముకంటే, గరీయః-గొప్పదని, కిముత-చెప్పవలసినదేమున్నది? ఈ వచ్చిన యపకీర్తికి సీతాపరిత్యా

గముతప్ప మరియొక నివృత్తిమార్గము లేదని నిశ్చయించుకొని, భార్యను విడిచి పెట్టుటకే రాముఁడు ఇష్టపడెను. కారణమేమనగా యశోధనులకు కీర్తి తమ శరీరము కంటెను గొప్పదై యున్నప్పుడు శరీరోపభోగ్య వస్తుజాతము సంగతి చెప్పవలసిన దేమున్నది? పురుషునికి స్త్రీ ఉపభోగ్యయే కనుక రాముఁడాత్మాపవాద నివృత్తికై సీతను విడువఁదలచెనని భావము. పరి + మార్ష్టుం-పరిమార్ష్టుం. "మృజూ-శుద్ధౌ" ధాతువునకు "తముఞ్" ప్రత్యయాంతమగు నవ్యయము.

శ్లో. స సంనిపాత్యావరజాన్ హతౌజాః
తద్విక్రియా దర్శన లుప్తహర్షాన్,
కౌలీన మాత్మాశ్రయ మాచచక్షే
తేభ్యః పున శ్చేద ముపాచ వాక్యమ్. 36

వ్యాఖ్య: హతౌజాః-నిస్తేజస్కుఁడగు, సః-రాముఁడు, తద్విక్రియా దర్శన లుప్తహర్షాన్-తత్-ఆరామునియొక్క, విక్రియాదర్శన-ముఖవికారదర్శనముచేత, లుప్త-లోపించిన, హర్షాన్-సంతోషముగల, అవరజాన్-తమ్ములను, సంనిపాత్య-ఒక్కచోటఁజేర్చి, ఆత్మాశ్రయం-స్వవిషయకమగు, కౌలీనం-నిందను, తేభ్యః-వారికి, ఆచచక్షే-చెప్పెను, పునశ్చ-మరియును, ఇదం-ఇక చెప్పఁబోవు, వాక్యం-మాటను, ఉవాచ-పలికెను. కలిగిన యపకీర్తిచేతఁ దేజోహీనుడై యున్న రాముఁడు తన దర్శనముచేత సంతోషము నశించిన తమ్ములందఱి నొక్కచోటఁజేర్చి తనకు వచ్చిన లోకనిందను వివరించిచెప్పి మరియు నిట్లుపలికెను. ఆ + చచక్షే-"ఆచచక్షే" చక్షిఙ్-వ్యక్తాయాంవాచి అనుధాతువునకు ఆత్మనే పదిలిట్ ప్ర.పు.ఏ.

శ్లో. రాజర్షివంశస్య రవిప్రసూతేః
ఉపస్థితః పశ్యత కీదృశో ఽయమ్,
మత్తః సదాచారశుచేః కలంకః
పయోదవాతా దివ దర్పణస్య. 37

వ్యాఖ్య: రవిప్రసూతేః-సూర్యునివలనఁబుట్టిన, రాజర్షివంశస్య-ఇక్ష్వాకు వంశమునకు, సదాచారశుచేః-సచ్ఛీలమువలన శుద్ధమైయున్న దానికి, మత్తః-

నానుండి, దర్పణస్య-అద్దమునకు, పయోదవాతాత్, ఇవ-మేఘయుక్త వాయువు వలనవలె, కీదృశః-ఎట్టి, అయః, కలంకః-ఈలోపము, ఉపస్థితః-ప్రాప్తమైనదో, పశ్యత-చూడుడు. ఇంటియందున్న అద్దమునకుఁ జినుకులతోఁడిగాలి సోకి యప్రకాశ మును జేకూర్చినట్లు నావలన సూర్యసంజాతమై సదాచారయుక్తమైయున్న యిక్ష్వాకు వంశమున కెట్టికళంకము వచ్చినదో చూడుఁడని తమ్ములతో ననెను. పయోదవాత శబ్దమునకు జలకణయుక్త మేఘముతోఁ గూడినగాలి యర్థము.

శ్లో. పౌరేషు సోఽహం బహులీభవంత
మపాం తరంగే ష్వివ తైలబిందుమ్,
సోఢుం న తత్పూర్వ మవర్ణ మీశే
ఆలానికం స్థాణు మివ ద్విపేంద్రః. 38

వ్యాఖ్య: సోఽహం (సః+అహం)-అట్టిస్థితిలోనున్ననేను, అపాం, తరంగేషు-జలతరంగములయందు, తైలబిందుం, ఇవ-నూనెచుక్కవలె, పౌరేషు-పురజనులయందు, బహులీభవంతం-వ్యాపించిపోవునదియు, తత్పూర్వం-అదియే మొదటిదియు నగు, అవర్ణం-అపవాదమును, ద్విపేంద్రః-ఉత్తమగజము, ఆలానికం-కట్టుఁగొయ్యగానున్న, స్థాణుం, ఇవ- స్తంభమునువలె, సోఢుం-సహించుటకు, నేశే (న+ఈశే)-శక్తుఁడనుగాలేకయున్నాను. తరంగములపైఁబడిన నూనెచుక్కవలె పౌరులయం దొకరినుండి మరియొకరికిఁబ్రాకి పెరుగుచున్న యీ క్రొత్తయపకీర్తిని గజేంద్రము బంధన స్తంభమునువలె సహింపలేకున్నాను. తరంగోపమానము పౌరులకుఁ జెప్పుట చక్కగానున్నది. స్వేచ్ఛావిఘాతుకమగు నాలానమున గజము బాధపడునట్టు లీయపకీర్తివలన నలుగురిలోఁ దలయెత్తుకొని తిరుగఁజాలని బాధ పడుచున్నానని భావము.

శ్లో. తస్యా పనోదాయ ఫల ప్రవృత్తా
వుపస్థితాయా మపి నిర్వ్యపేక్షః
త్యక్ష్యామి వైదేహసుతాం పురస్తాత్
సముద్రనేమిం పితు రాజ్ఞ యేవ. 39

వ్యాఖ్య: తస్య-ఆయపవాదముయొక్క, అపనోదాయ-తొలఁగింపు కొఱకు, ఫలప్రవృత్తౌ-సంతానోత్పత్తియందు (ఫలమునిచ్చుటయందు), ఉపస్థితాయాం,

అపి-సమీపించియున్న దైనప్పటికిని, నిర్వ్యపేక్షః(సణ)-నిస్పృహగలవాఁడనగుచు, వైదేహసుతాం-సీతను, పురస్తాత్-పూర్వము, పితుః, ఆజ్ఞయా-తండ్రియొక్క ఆజ్ఞచేత, సముద్రనేమిం, ఇవ-భూమినివలె, త్యక్ష్యామి-విడిచెదను. వచ్చిన యపవాదమును దొలగించుకొనుటకు సంతానవతికాఁ బోవుచున్నదైనను సీతను, పూర్వము తండ్రియాజ్ఞచేత రాజ్యమును విడిచినట్లు, ఎట్టియాశయులేక విడువనున్నానని చెప్పెను. సముద్రః నేమిరివ నేమిః యస్యాః సా-సముద్రనేమిః. బండి చక్రమునకు ఇనుపకమ్మివలె తనచుట్టు సముద్రము గలది, భూమి అని యర్థము. "త్యక్ష్యామి" త్యజధాతువునకు భవిష్యదర్థకల్ృట్. ఉ.పు.ఏ.

శ్లో. అవైమి చైనా మనఘేతి కింతు
లోకాపవాదో బలవాన్ మతో మే,
ఛాయా హి భూమేః శశినో మలత్వే
నారోపితా శుద్ధిమతః ప్రజాభిః. 40

వ్యాఖ్య: ఏనాం-సీతను, అనఘా, ఇతి, చ-దోషములేనిదని కూడా, అవైమి-ఎఱుగుదును, కింతు-కాని, మే-నాకు, లోకాపవాదః-వచ్చిన లోకనింద, బలవాన్, మతః-గొప్పదని తలఁచెదను. హి-ఏకారణము వలన, ప్రజాభిః-ప్రజలచేత, భూమేః, ఛాయా-భూమియొక్క ప్రతిబింబము, శుద్ధిమతః-నిర్మలుఁడైన, శశినః-చంద్రునికి, మలత్వేన-కళంకముగా, ఆరోపితా-ఆరోపింపఁబడియున్నదో, అందువలన లోకాపవాదమే బలవత్తరమని తలఁచెదనని య ము. "పదుగురాడు మాట పాటియైధరఁ జెల్లు"నన్నట్లు సత నకు దూరమైన , చంద్రునిలోఁ గనఁబడు భూచ్ఛాయను కళంకముగా రపరచినట్లు ని ్కళంకయైన సీతను దోషయుక్తనుగాఁ జిత్రించుచున్న ప్ర వాదిని నేను అనురింపక తప్పదని భావము. అవ+ఏమి-అవైమి. ఇణ్ ధాతువునకు లట్. ఉత్తమ పురుష ఏకవచము

శ్లో. రక్షోవధాంతో న చ మే ప్రయాసో
వ్యర్థః స వైరప్రతిమోచనాయ,
అమర్షణః శోణితకాంక్షయా కిం
పదా స్పృశంతం దశతి ద్విజిహ్వః. 41

వ్యాఖ్య: కించ-మరియును, మే-నాయొక్క, రక్షోవధాంతః-రావణునివధ వఱకు నుండిన, ప్రయాసః-శ్రమ, వ్యర్థః, న-ప్రయోజనములేనిదికాదు. కింతు-మరియేమనఁగ, వైర పతిమోచనాయ, సః-వైరనిర్మూలనముకొఱకేయది, తథాహి-అదియెట్లనగా, అమ ఱః-కీడును సహింపఁజాలని, ద్విజిహ్వః-సర్పము, పదా-కాలితో, స్పృశం ం-తాకుచున్నవానిని, శోణితకాంక్షయా-నెత్తురు మీది కోరిక చేతనే, దశతికిం?-కఱచునా? నాప్రయాసము రావణునిఁ జంపుటతో ముగియలేదు. ఆవైరము, తన్మూలకమగు నపకీర్తి సమూలముగా నశింపఁ జేయువఱకు అది యాగదు. అవమానమును సహింపలేని సర్పము కాలితో త్రొక్కిన పురుషుని రక్తము కొఱకై వానిని గఱచునా? వానిపైఁగల శత్రుత్వమును దీర్చుకొనుటకే వానిని గఱచును. అట్లే నాయొక్కశ్రమము రావణాపకారఫలస్పర్శ నశించువఱకు నుండును, అది సీతా పరిత్యాగముతోఁగాని యాగదని భావము. "దశతి" "దంశ-దశనే" ధాతువునుండి ప్ర.పు.ఏ. "దశన"మనఁగా దంష్ట్రా వ్యాపారము.

శ్లో. త దేష సర్గః కరుణార్ద్రచిత్తై
ర్న మే భవద్భిః ప్రతిషేధనీయః,
యద్యర్థితా నిర్హృతవాచ్యశల్యాన్
ప్రాణాన్ మయా ధారయితుం చిరం వః. 42

వ్యాఖ్య: తత్-అందువలన, ఏషః-ఈ, మే, సర్గః-నాయొక్క నిశ్చయము, కరుణార్ద్రచిత్తైః, భవది ః-దయార్ద్రచిత్తులైన మీచేత, న, ప్రతిషేధనీయః-నివారింపఁదగినదికాదు. ని ర్హృతవాచ్యశల్యాన్-నిర్హృత-పూర్తిగాఁ దీసివేయఁబడిన, వాచ్య-లోకనిందయనెడి, శల్యాన్-శల్యముగల, ప్రాణాన్-ప్రాణములను, మయా నాచేత, చిరం, ధారయితుం-ఎక్కువకాలము ధరింపఁ జేయుటకు, వః-మీకు, అర్థితా, యది-వాంఛ ఉన్నట్లయితే. వెనుక చెప్పిన కారణము వలన నా నిశ్చయమును, నేను నిందారహితుఁడనై కొంతకాలము జీవింపవలె నన్న కోరిక మీకున్నట్లయితే, దయాభావముతో నివారింపవద్దని రాముఁడు తమ్ములతో ననెను. "సర్గః స్వభావనిర్మోక్ష నిశ్చయాధ్యాయ సృష్టిమ" అని యమరము.

శ్లో. ఇత్యుక్తవంతం జనకాత్మజాయాం
నితాంతరూక్షాభినివేశ మీశమ్,

న కశ్చన భ్రాతృషు తేషు శక్తో
నిషేద్ధు మాసీ దనుమోదితుం వా. 43

వ్యాఖ్య : ఇతి, ఉక్తవంతం-ఇట్లుపలికినవాఁడును, జనాకాత్మజాయాం-సీతావిషయమున, నితాంతరూక్షాభినివేశం—నితాంతరూక్ష-మిక్కిలిక్రూరమైన, అభినివేశం-పట్టుదలగలిగియున్న, ఈశం-ప్రభువైన శ్రీరాముని, తేషు, భ్రాతృషు-ఆసోదరులయందు, కశ్చన-ఎవ్వఁడుఁగూడ, నిషేద్ధుం-నివారించుటకుఁగాని, అనుమోదితుం, వా-సరేయని యంగీకరించుటకుఁగాని, శక్తః-చాలినవాఁడు, న,ఆసీత్-కాలేదు. అట్లు సీతావిషయమున కఠిన ప్రవృత్తినిఁ జూపఁదలఁచుకొన్న రాముని వారించుటకుఁగాని, అట్లే ప్రవర్తింపుమని ఆమోదించుటకుఁగాని, రెండుపక్షములును ప్రబలములై యున్నందున, తమ్ములలో నెవ్వరును సమర్థులుగాక మౌనము వహించిరని భావము.

శ్లో. స లక్ష్మణం లక్ష్మణపూర్వజన్మా
విలోక్య లోకత్రయగీతకీర్తిః,
సౌమ్యేతి చాభాష్య యథార్థభాషీ
స్థితం నిదేశే పృథగాదిదేశ. 44

వ్యాఖ్య : లోకత్రయగీతకీర్తిః-మూడులోకములవారిచేత కొనియాడఁబడిన కీర్తిగలవాఁడును, యథార్థభాషీ-సత్యమును పచించువాఁడును, లక్ష్మణపూర్వజన్మా-లక్ష్మణాగ్రజుఁడును నగు, సః-రాముఁడు, నిదేశే,స్థితం-ఆజ్ఞాకారి యగు, లక్ష్మణం-లక్ష్మణుని, విలోక్య-చూచి, హేసౌమ్య ఇతి, ఆభాష్య, చ-ఓసౌమ్యుఁడా! యని పలుకరించియు, పృథక్-భరతశత్రుఘ్నులు లేనిచోట, ఆదిదేశ-ముందుఁజెప్పఁబోవురీతి నాజ్ఞాపించెను. ఎవ్వరును పలుకకపోఁగా తనయాజ్ఞను సర్వదా శిరసావహించు లక్ష్మణుని ప్రక్కకుఁబిలిచి కర్తవ్యము నాజ్ఞాపించెను.

శ్లో. ప్రజావతీ దోహదశంసినీ తే
తపోవనేషు స్పృహయాలు రేవ,
స త్వం రథీ తద్వ్యపదేశనేయాం
ప్రాపయ్య వాల్మీకిపదం త్యజైనామ్. 45

వ్యాఖ్య: దోహదశంసినీ-గర్భిణీ మనోరథమును జెప్పుచున్న, తే ప్రజావతీ-మీవదినె, తపోవనేషు-తపోవనములయందు, స్పృహయాలుః, ఏవ-కోరికగలదియే యైయున్నది. సః, త్వం-అట్లు ఇట్టందిలని నీవు, రథీ(సన్)-రథమును గ ంచు కొన్నవాఁడవై, తద్వ్యపదేశనేయాం-ఆదోహదమిషచేత తీసుకొనివెళ్ళుటకు పీ న, ఏనాం-ఆమెను (సీతను), వాలీ కి పదం-వాల్మీకి తపోవనమును, ప్రాపయ్య- ర్పి, త్యజ-విడువుము. గర్భిణి నాను మీవదినె తపోవనములను మరలఁ జూడవలె న్నది కనుక ఆమిషతో నామెను రథ క్కించుకొని వాల్మీకి తపోవనమున విడిచిరమ్మని యాజ్ఞాపించెను. "ప్రజావతీ భ్రాతృజాయా" అని యమరము. "త్యజ" లోట్ మధ్యమపురుష ఏ.

శ్లో. స శుశ్రువాన్ మాతరి భార్గవేణ
పితు ర్నియోగాత్ ప్రహృతం ద్విషద్వత్,
ప్రత్యగ్రహీ దగ్రజశాసనం తత్
ఆజ్ఞా గురూణాం హ్యవిచారణీయా. 46

వ్యాఖ్య: పితుః-తండ్రియగు జమగ్నియొక్క. నియోగాత్-శాసనము వలన, భార్గవేణ-పరశురామునిచేత, మాతరి-తల్లియందు, ద్విషద్వత్-శత్రువునందువలె, ప్రహృతం-చేయబడిన పరశుప్రహారమును, శుశ్రువాన్-విని యుండిన, సః-అలక్ష్మ ణుఁడు, తదగ్రజశాసనం-ఆయన్నగారి యాజ్ఞను, ప్రత్యగ్రహీత్-స్వీకరించెను. హి-ఏకారణము వలన, గురూణాం-పెద్దలయొక్క, ఆజ్ఞా-శాసనము, అవిచార ణీయా—ముందు వెనుకలాలోచింపఁ దగినదిగాదో! పూర్వము జమదగ్ని యాజ్ఞచేత తల్లితలను నఱికిన పరశురాముని చరిత్రను విన్నవాఁడు గావున లక్ష్మణుఁడన్న శాసనమును బదులాడక స్వీకరించెను. పెద్దలు చేయుమన్న పనిలో మంచిచె లు తానాలోచింపక చేయుటయే సోదర పుత్రాదుల ధర్మము. "పితృసమోజ్యేః" అన్న ధర్మవచన ప్రకారము లక్ష్మణునికి రాముఁడు తండ్రివంటివాఁడు-గదా

శ్లో. అథా నుకూలశ్రవణప్రతీతా
మత్రస్నుభి ర్యుక్తధురం తురంగైః,
రథం సుమంత్రప్రతిపన్నరశ్మి.
మారోప్య వై దేహసుతాం ప్రతస్థే.

వ్యాఖ్య : అథ-పిమ్మట, లక్ష్మణుఁడు, అనుకూలశ్రవణప్రతీతాం——అనుకూలశ్రవణ-ఇష్టమైన విషయమును వినుటచేత, ప్రతీతాం-సంతోషమునుజెందిన, వైదేహసుతాం-సీతను, అత్రస్నుభిః-బెదురులేని, తురంగైః-గుఱ్ఱములచేత, యుక్తధురం-కట్టఁబడిన భారముగలదియు, సుమంత్రప్రతిపన్నరశ్మిం-సుమంత్రసారథిచేత పట్టుకోఁబడిన పగ్గములుగలదియునగు, రథం-రథమును, ఆరోప్య-ఎక్కించుకొని, ప్రతస్థే-బయలుదేరెను. అన్నయాజ్ఞకుబద్ధుఁడైన లక్ష్మణుఁడు సీతకోరిక ప్రకారం తపోవనమునకు చేసికొని పెళ్ళెదనని చెప్పి, గర్భిణీస్త్రీలకు శ్రమకలుఁగనరీతిగా నదరు బెదరులేని గుర్రాలు కట్టిన రథముపై నామెనెక్కించుకొని ప్రయాణమయ్యెను: అత్రస్నుభిః (న+త్రస్నుభిః) త్రసిధాతువునకు "క్ను" ప్రత్యయాంతము.

శ్లో. నా నీయమానా రుచిరాన్ ప్రదేశాన్
ప్రియంకరో మే ప్రియ ఇత్యనందత్,
నాబుద్ధ కల్పద్రుమతాం విహాయ
జాతం త మాత్మ న్యసిపత్రవృక్షమ్. 48

వ్యాఖ్య : సా-ఆసీత, రుచిరాన్-అందములైన, ప్రదేశాన్-ప్రదేశములను, నీయమానా-చేర్పఁబడినదగుచు, మే-నాయొక్క, ప్రియః-ప్రియుఁడగు భర్త, ప్రియంకరః, ఇతి-నాయిష్టమును గూర్చువాఁడని, అనందత్- సంతోషించెను. తం-అతనిని, ఆత్మని-తనవిషయమున, కల్పద్రుమతాం-కల్పవృక్షత్వమును, విహాయ-విడిచి, అసిపత్రవృక్షం-ఖ కా ర ప త్ర ము లు గ ల విషవృక్షముగా, జాతం-మారినవానిఁగా, నాబు (న+అబుద్ధ)-తెలిసికొనలేకపోయెను. అట్లులక్ష్మణుఁడు రమ్య ప్రదేశములకుఁ సికొనిపోవుచుండఁగా సీత తనభర్తను తనకుఁ ప్రియములను గూర్చువానిఁగానే తలఁచి యానందించెనుగాని, ఆతఁడు తనయభీష్టములను గూర్పఁగల కల్పవృక్షత్వమును వీడి యొక విషవృక్షముగా మారిన సంగతిని గుర్తింపలేకపోయెనని భావము "అసిపత్ర" మనఁగాఖడ్గకోశాకారముగల యాకులతో నుండు వృక్షమనియు, ఒక నరకమునవియు విశ్వనిఘంటువు. "అనందత్" టునది–సమృద్ధౌధాతువునకు లఙ్; "అబుద్ధ" బుధ-అవగమ ధాతువునకు లుఙ్. ప్ర. పు. ఏ.

శ్లో. జుగూహ తస్యాః పథి లక్ష్మణో యత్
సవ్యేతరేణ స్ఫురతా త దక్ష్ణా,
ఆఖ్యాత మస్యై గురు భావి దుఃఖం
అత్యంత లు ప్త ప్రియదర్శనేన. 49

వ్యాఖ్య: పథి-మార్గమునందు, లక్ష్మణః-లక్ష్మణుఁడు, యత్-ఏదుఃఖమును, తస్యాః-సీతాదేవినుండి, జుగూహ-దాచియుంచెనో, తత్, గురు-ఆగొప్పదియగు, భావి, దుఃఖం-ముందుఁకలుఁగబోవు దుఃఖము, అత్యంతలు ప్త ప్రియదర్శనేన-మిక్కిలిలోపించిన అందమగుచూపు గలదియు, స్ఫురతా-అదరుచున్నదియు, సవ్యేతరేణ-కుడిదియనగు (అపసవ్యమైన), అక్ష్ణా-కంటిచేత, అస్యై-ఆమెకొఱకు (ఆమెకు) ఆఖ్యాతం-చెప్పఁబడినది. లక్ష్మణుఁ డేదుఃఖమును సీతకుఁ జెప్పక దాచి యుంచెనో! మార్గమునందు, మాటిమాటికిని ఆదరుచున్న యామెకుడికంటిచేత భవిష్యత్తునఁగల యామహత్తర దుఃఖము చెప్పఁబడినది. స్త్రీలకు దక్షిణాక్షిస్ఫురణము అపశకున మగుటచేత సీత యేదియో యాపద రానున్నదని యూహించెనని భావము. "జుగూహ" గుహూ-సంవరణే ధాతువునకు భూతకాలార్థక లిట్ ప్ర.పు. ఏకవచనము.

శ్లో. సా దుర్నిమిత్తో పగతాత్ విషాదాత్
సద్యః పరిమ్లానముఖారవిందా,
రాజ్ఞః శివం సావరజస్య భూయాత్
ఇ త్యాశశంసే కరణై రబాహ్యైః. 50

వ్యాఖ్య: సా-ఆమె(సీత), దుర్నిమిత్తోపగతాత్-దుశ్శకునమువలనఁ గలిగిన, విషాదాత్-దుఃఖమువలన, సద్యః-అప్పుడే పరిమ్లానముఖారవిందా-వాడిన ముఖకమలము గలదగుచు, సావరజస్య-అనుజసహితుఁడయిన, రాజ్ఞః-రాజునకు (రామునికి) శివం-శుభము, భూయాత్-అగునుగాక, ఇతి-అని, అబాహ్యైః,కరణైః-అంతః కరణములచేత (మనస్సుచేత), ఆశశంసే-కోరెను. ఆ కలుగుచున్న దుశ్శకునమువలని భయము వలన వాడి కళాహీనమగు ముఖముగలదై నసీత రామునికిని, ఆయన తమ్ములకును శుభమగునుగాక యని మనస్సులో దీవించెను. "కరణైః" బహువచనము మనోబుద్ధిహృదయములలో మాటిమాటికి అట్లుకోరె

ననియు, "ఆశశంసే" యనుఅత నే పద ప్రయోగము సానుజుఁడగు భర్తక్షేమమే తనక్షేమమనియు సూచించుచు ంది. "భూయాత్" ప్రార్థనార్థకమగు లిజ్ ప్ర.పు ఏ. ఉత్తమ పతివ్రత యె యాపనయందును సుందుగాఁగోరునది భర్త క్షేమమేయని పరమార్థము.

శ్లో. గురో ర్నియోగా ద్వనితాం వనాంతే
సాధ్వీం సుమిత్రాతనయో విహాస్యన్,
అవార్యతే వోత్థితవీచిహస్తైః
జహ్నో ర్దుహిత్రా స్థితయా పురస్తాత్. 51

వ్యాఖ్య : గురోః-జ్యేష్ఠునియొక్క, నియోగాత్-ఆజ్ఞవలన, సాధ్వీం, వనితాం-పతివ్రతయైనస్త్రీని (సీతను), వనాంతే-అరణ్యమునందు, విహాస్యన్-విడువఁబోవువాఁడగు, సుమిత్రాతనయః-లక్ష్మణుఁడు, పురస్తాత్-ఎదుట, స్థితయా-ఉన్నదియగు, జహ్నోః, దుహిత్రా-జాహ్నవిచేత, ఉత్థితవీచిహస్తైః-పైకిలేచిన తరంగములనెడు చేతులతో, అవార్యత, ఇవ-నివారింపఁబడెనా? యన్నట్లుండెను. అన్నయాజ్ఞవలన సాధ్వియైన సీతను అరణ్యమున విడిచిపెట్టఁదలచిన లక్ష్మణుడు, తమయెదుట ఇఁక దాటవలసినదిగానున్న గంగానదిచేత"వద్దుఅకార్యమునుజేయవద్దు" అని తరంగహస్తములెత్తి నివారింపబడుచున్నాఁడా? యన్నట్లుండెను. లక్ష్మణుఁడు సీతాయుక్త రథముతో గంగాతీరమునకుఁజేరెనని భావము. అలంకారము: ఉత్ప్రేక్ష.

శ్లో. రథా త్స యంత్రా నిగృహీతవాహాత్
తాం భ్రాతృజాయాం పులినే ఽవతార్య,
గంగాం నిషాదాహృతనౌ విశేషః
తతార సంధా మివ సత్యసంధః. 52

వ్యాఖ్య : సః-ఆలక్ష్మణుఁడు, యన్త్రా-సారథిచేత! నిగృహీతవాహాత్-ఆపఁబడినగుఱ్ఱములుగల, రథాత్-రథమునుండి, తాం, భ్రాతృజాయాం-అవదినెను, పులినే-గంగయందలి యిసుకదిబ్బపై, అవతార్య-దింపి, నిషాదాహృతనౌవిశేషః-నిషాద-పల్లెవానిచేత, ఆహృత-తీసుకరాఁబడిన, నౌవిశేషః-దృఢ న మంచి పడవగలవాఁడగుచు, గంగాం-గంగానదిని, సత్యసంధః-సత్యవ్రతగలవాఁడు, సంధాం, ఇవ-ప్రతిజ్ఞనువలె, తతార-దాటెను. గంగాతీరమున సారథి రథము

నావఁనా, సీతాదేవిని యిసుకదిబ్బపై దింపి నిషాదుఁడుతెచ్చిన మంచిపడవపై నెక్కించి ఆమెతో భాగీరథినిదాటెను. ఆదాటుట ఒక సత్యసంధుడు తన ప్రతిజ్ఞను తెల్లించుకొనునట్లుండెనట. అనఁగా నతికష్టముపై తనకిష్టమున్ననులేకున్నను నిర్వ హింపవలసిన ప్రతిజ్ఞనుగా లక్ష్మణుఁడు మానసిక క్లేశమననుభవించుచు సీతా యుక్తముగా గంగనుదాటె నని భావము "సంధాప్రతిజ్ఞామర్యాదా" అని యమ రము. అలంకారము: ఉపమ.

శ్లో. అథ వ్యవస్థాపితవాక్ కథంచిత్
సౌమిత్రి రంతర్గత బాష్పకంఠః,
ఔత్పాతికం మేఘ ఇవాశ్మవర్షం
మహీపతేః శాసన ముజ్జగార. 53

వ్యాఖ్య: అథ-గంగనుదాటిన పిమ్మట, కథంచిత్-అతికష్టముతో, వ్యవస్థాపి తవాక్-స్వభావమునా (సరిగా) నుంచుకొనఁ బడిన వాక్కుగలిగినవాఁడును, అంత ర్గత బాష్పక ఠః - కంఠమునందు స్తంభించిన కన్నీరుగలవాఁడును నగు, సౌమిత్రిః-లక్ష్మణుఁడు, మహీపతేః-రాజుయొక్క, శాసనం-ఆజ్ఞను, మేఘః- మేఘము, ఔత్పాతికం-ప్రళయమునందుఁ గలిగిన, అశ్మవర్షం, ఇవ-శిలావర్షమును వలె, ఉజ్జగార-వెడలఁగ్రక్కెను (చెప్పెను). గంగనదాటిన పిమ్మట సీతకుఁ జెప్ప వలసినమాట దారుణము, అవాచ్యము నగుటచేత నెట్లో వాక్కును స్థిరపరచుకొని, వచ్చుచున్న కన్నీటిచేత రుద్ధమైన కంఠముగల లక్ష్మణుఁడు రాజశాసనమును, మేఘము ఉత్పాత సమయమునఁ గురియు శిలావర్షమునువలె, వెలుపలికి గ్రక్కెను. అనఁగా అత్యంత దుఃఖపరవశుఁడై చెప్పెనని భావము. ఇచ్చట రాముఁడనక "మహీపతి" యనుట రాజశాసన మనుల్లంఘనీయమనియు, "ఉజ్జగార" పదము తనయిష్టములేకయే వెలువరించెననియు, "ఔత్పాతిక" పదము సీతకావాక్కు శిలా వర్షమువలె నుండెననియు స్ఫురింపజేయును, "ఉజ్జగార" (ఉత్ + జగార) గౄ- నిగరణే. ధాతువునకు లిట్. అలంకారము; ఉపమ.

శ్లో. తతో ఽభిషంగానిల విప్రవృద్ధా
ప్రభ్రశ్యమానా భరణ ప్రసూనా,
స్వమూర్తిలాభప్రకృతిం ధరిత్రీం
లతేవ సీతా సహసా జగామ. 54

వ్యాఖ్య: తతః-అందువలన, అభిషంగానిల విప్రవృద్ధా-పరాభవమనెడి వాయువుచేతఁ గొట్టఁబడినదియు, ప్రభ్రశ్యమానాభరణ ప్రసూనా-జారిపడుచున్న పూలవంటి ఆభరణములు గలదియు నగు, సీతా-సీత, లతేవ-ఒకతీఁగవలె, సహసా-హఠాత్తుగా, స్వమూర్తిలాభ ప్రకృతిం-తనశరీరోత్పత్తికిఁ గారణమగు, ధరిత్రీం-భూమిని, జగామ-చేరెను. పెద్దగాలిదెబ్బకు పువ్వులురాల్చుచు నేలపైఁబడు తీఁగవలె సీతాదేవి, ఆయవమానమును సహింపలేనిదై యాభరణములు జారిపడు చుండ తనజన్మకు కారణమైన భూమిపై మూర్ఛిల్లి హఠాత్తుగాఁబడిపోయెను. స్త్రీలకు ఆపదయందు తల్లియొడిలోఁజేరుట సహజముగదా! అలంకారముఁ ఉపమ

శ్లో. ఇక్ష్వాకువంశప్రభవః కథం త్వాం
త్యజేదకస్మాత్పతి రార్యవృత్తః,
ఇతి క్షితిః సంశయితేవ తస్యై
దదౌ ప్రవేశం జననీ నతావత్. 55

వ్యాఖ్య: ఇక్ష్వాకువంశప్రభవః-సుప్రసిద్ధమగు ఇక్ష్వాకువంశమునఁబుట్టి నవాఁడును, ఆర్యవృత్తః-సాధుచరితముగలవాఁడును నగు, పతిః-భర్త, త్వాం-నిన్ను, అకస్మాత్-అకారణముగా, కథం, త్యజేత్-ఎట్లువిడుచును?. ఇతి-ఇట్లని, సంశయితా, ఇవ, తావత్-పూర్తిగా సందేహపడినది వలె, జననీ,క్షితిః-తల్లియగు భూదేవి, తస్యై-ఆసీతకు (కొఱకు), ప్రవేశమును, న, దదౌ-ఇయ్యలేదు. రాముఁడు. సీతను విడుచుటకుఁ గల కారణము తెలియని భూదేవి. గొప్పవంశ మునఁబుట్టి, ఆర్యవృత్తము ననుసరించుభర్త నిష్కారణముగా నిన్నేలవిడుచును? అని సంశయించుచున్నదివలె సీతకుఁదనలో ప్రవేశమునియ్యలేదు. మూర్ఛతో సీత యట్లే నేలపైఁబడియుండెననియు, త్యాగహేతువు తెలియుటకుఁ బూర్వము భూదేవి యుపేక్షించినదనియు భావము. "త్యజేత్" త్యజధాతువునకు సంభావనార్థక లిఙ్.

శ్లో. సా లుప్తసంజ్ఞా న వివేద దుఃఖం
ప్రత్యాగతాసుః సమతప్యతాంతః,
తస్యాః సుమిత్రాత్మజయత్నలబ్ధో
మోహాదభూత్ కష్టతరః ప్రబోధః. 56

వ్యాఖ్య: లుప్తసంజ్ఞా-స్వ్యాహతప్పినట్టి, సా-ఆసీత, దుఃఖము ను, న, వివేద-తెలిసికొనలేదు. ప్రత్యాగతాసుః-తిరిగి వచ్చిన ప్రాణములుగలదియయి, అంతః-మనస్సులో, సమతప్యత-తపించెను. తస్యాః-ఆమెకు, సుమిత్రాత్మజయత్న లబ్ధః-సుమిత్రాత జ-లక్ష్మణునియొక్క యత్న-ప్రయత్నములచేత, లబ్ధః-పొందబడిన, బోధః-మెలకువ, మోహాత్-మూర్ఛకంటె, కష్టతరః-ఎక్కువ దుఃఖమును గ ంచుచున్నది, అభూత్-అయెను నష్టచేతనయైన సీత దుఃఖమును ఎఱుగలేదుకాని, ప్రాణములు వచ్చినదై మనస్సులో ఉడికిపోయెను. లక్ష్మణ ప్రయత్నలబ్ధమైన మెలకువయే ఆమెకు మూర్ఛకంటే అధికతరబాధను గలిగించెను మూర్ఛలో బాధ తెలియదుగదా! "వివేద" విద-జ్ఞానేధాతువునకు లిట్ ప్ర పు ఏ. "అతప్యత" తప-సంతాపే ధాతువునకు లఙ్. ప్ర.పు ఏ.

శ్లో. న చావదత్ భర్తు రవర్ణ మార్యా
నిరాకరిష్ణో ర్వృజినా దృతే ఽపి,
ఆత్మాన మేవ స్థిరదుఃఖ భాజం
పునఃపున ర్దుష్కృతినం నినింద. ౫

వ్యాఖ్య : ఆర్యా-సాధ్వియైనసీత, వృజినాత్, ఋతే, అపి-పాపములేక పోయినను, నిరాకరిష్ణోః-నిరసించినట్టి, భర్తుః-భర్తయొక్క, అపవాదం-లోకాప వాదమును గుఱించి, న, చ, అవదత్-పలుకనేలేదు స్థిరదుఃఖభాజం-ఎల్లకాలమును దుఃఖమునకు గుఱియగుచున్న, దుష్కృతినం-పాపమునుజేసినట్టి, ఆత్మానంఏవ-తనను గురించియే, పునఃపునః-మాటిమాటికిని, నినింద-నిందించెను. సాధ్వి గావున సీత ఏపాపమును జేయని తనను నిరాకరించిన భర్తయొక్క అపవాద సత్యాసత్యములను గురించి పలుకక శాశ్వతముగా దుఃఖమునే యనుభవించు పాప మును జేసిన తనయాత్మనే పలుమారు పలువిధముల దూషించుకొనె నని భావము. అది పతివ్రతాలక్షణము. "కలుషం వృజినై నోఽఘమ్" అని యమరము: "అవ దత్" వద-వ్యక్తాయాంవాచి అనుధాతువునకు లఙ్; "నినింద" ణిది-కుత్సాయాం ధాతువునకు లిట్.

శ్లో. ఆశ్వాస్య రామావరజః సతీం తా
మాఖ్యాతవాల్మీకి నికేతమార్గః,
నిఘ్నస్య మే భర్తృనిదేశరౌక్ష్యం
దేవి! క్షమస్వేతి బభూవ నమ్రః. ౫౫

వ్యాఖ్య : రామావరజః-రామునితమ్ముఁడు (లక్ష్మణుడు), సతీం-పాతివ్రత్యగు, తాం-ఆసీతను, ఆశ్వాస్య-ఊరడించి, ఆఖ్యాతవాల్మీకి నికేతమార్గః-చెప్పబడిన వాల్మీకి ఆశ్రమముయొక్క మార్గముగలవాఁడగుచు, నిఘ్నస్య-పరాధీనుఁడనైన, మే-నాయొక్క, భర్తృనిదేశరౌక్ష్యం-ప్రభువునాజ్ఞచేతఁ జూపిన పరుషత్వమును, దేవి!-తల్లి! క్షమస్వ-క్షమింపుము, ఇతి-ఇట్లనుచు, న్యమః-పాదములపైఁబడినవాఁడు, బభూవ-అయ్యెను. రాముని తమ్ముఁడుగావున నతనియాజ్ఞను నెరవేర్చుటలో నేను చూపిన కాఠిన్యమును క్షమింపుము, నేను పరాధీనుఁడను అనుచు సీతకాళ్ళపైఁబడెను. వాల్మీకిమహర్షిఆశ్రమమునకు వెళ్ళుదారిని జూపి యట్లు ప్రతిమాలెనని భావము.

శ్లో. సీతా త ముత్థాప్య జగాద వాక్యం
ప్రీతాస్మి తే సౌమ్య! చిరాయ జీవ,
బిడౌజసా విష్ణు రివాగ్రజేన
భ్రాత్రా యదిత్థం పరవా నసి త్వమ్. 59

వ్యాఖ్య : సీతా—సీతాదేవి, తం-లక్ష్మణుని, ఉత్థాప్య-తనకాళ్ళపైనుండిలేపి, వాక్యం—ఇందుచెప్పఁబోవువాక్యమును, జగాద-పలికెను. (కిమితి-ఏమనియనఁగా) హేసౌమ్య-ఓసజ్జనుఁడా! తే, ప్రీతాస్మి-నీకొఱకు సంతోషించినదాననగుచున్నాను. చిరాయ, జీవ-చిరకాలము జీవింపుము. యత్-ఏకారణమువల్లనైతే, బిడౌజసా-ఇంద్రునిచేత, విష్ణుఃఇవ-ఉపేంద్రుఁడువలె, అగ్రజేన, భ్రాత్రా-పెద్దవాఁడైన అన్నచేత, త్వం-నీవు, ఇత్థం-ఇట్లు, పరవాన్-పరతంత్రుఁడవు, అసి-అయియున్నావో! పాదములపైనుండి లేపి సీత లక్ష్మణునితో నిట్లనెను, సౌమ్యుఁడా! నీయందు నాకు కోపములేదు, చిరకాలము వర్ధిల్లుము. ఇంద్రునిచేత నుపేంద్రుఁడువలె జ్యేష్ఠుని యాజ్ఞకు బద్ధుఁడవై యిట్లుచేసితివి, పరతంత్రుఁడవైన నీయందు తప్పేమియులేదు.

శ్లో. శ్వశ్రూజనం సర్వ మనుక్రమేణ
విజ్ఞాపయ ప్రాపిత మత్ప్రణామః,
ప్రజానిషేకం మయి వర్తమానం
సూనో రనుధ్యాయత చేతసేతి.

వ్యాఖ్య : సర్వాం, శ్వశ్రూజనం-అత్తలందరికి, అనుక్రమేణ-క్రమము ననుసరించి, ప్రాపితమత్ప్రణామాఃసన్-చేర్చబడిన నా నమస్కారములు గల వారవగుచు, విజ్ఞాపయ-విన్నవింపుము (ఏమనియనఁగా), మయి-నాయందు, వర్తమానం-ఉన్నట్టి, సూనోః-మీకుమారునియొక్క, ప్రజానిషేకం-సంతానని షేపమును (గర్భమును), చేతసా-మనస్సుచేత, అనుధ్యాయత, ఇతి-మంగళమగుఁ గాక యని స్మరింపుడు, అని. సీత మరియు లక్ష్మణునితో నాయత్తలందరికిని పరు సగా నా నమస్కారములందించి, నాగర్భమునందున్న వారికుమారుని సంతాననిషే పమును దీవింపుమఁడని చెప్పు మని యనెను. నిషిచ్యత ఇతి నిషేకః-గర్భః అని యర్థము. "విజ్ఞాపయ" "వి" అను ఉపసర్గతోఁగూడి జ్ఞా-అవబోధనే ధాతువునకు ప్రేరణార్థకమగు లోట్ మధ్యమపురుషైకవచనము. "అనుధ్యాయత" అనుపూర్వా ధ్యై-చింతాయాం ధాతువునకు లోట్ మధ్యమ పురుష బహువచనము.

శ్లో. వాచ్య స్త్వయా మద్వచనా త్స రాజా
వహ్నౌ విశుద్ధా మపి య త్సమక్షమ్
మాం లోకవాదశ్రవణా దహాసీః
శ్రుతస్య కిం త త్సదృశం కులస్య? 61

వ్యాఖ్య: సః, రాజా-ఆరాజు (రాముఁడు), త్వయా-నీచేత, మద్వచనాత్-నామాటగా, వాచ్యః-చెప్పఁదగియున్నాఁడు. (ఏమనియందువా) సమక్షం-నీకనుల యెదుట, వహ్నౌ-అగ్నియందు విశుద్ధాం అపి-పరిశుద్ధురాలనైయున్నప్పటికిని, మాం-నన్ను, లోకవాదశ్రవణాత్-ప్రజలయసత్యవచనములు విన్నందున, అహాసీః, ఇతియత్-విడిచి పెట్టితివనునదియేదికలదో తత్-అది, శ్రుతస్య-ప్రఖ్యాతినొందిన, కులస్య-మీవంశమునకు, సదృశంకిం ? - తగియున్నదా ? లేక శ్రుతస్య-శాస్త్రమునకుగాని, కులస్య - ఇక్ష్వాకువంశమునకుఁగాని, సదృశంకిం- గిన దేనా నీకన్నులయెదుట నగ్నిప్రవేశముఁజేసిన నన్ను దహింపక యగ్ని హస్తుఁడే నీవద్దకిఁదెచ్చి "యీమెపరిశుద్ధురాలు" స్వీకరింపుమని నీకుఁజెప్పెనుగదా ఆ నన్ను లోకాపవాదశ్రవణమాత్రముచేత విడిచితివి. ఇది శాస్త్రసమ్మతమా? లేక మీ వంశము నకుచితమా? లేక కామచారివై నీయిష్టమువచ్చినట్లు చేసితివా? యని రాజైన మీ యన్ననడుగుమని సీత దుఃఖించుచు లక్ష్మణునితోననెనని భావము. "రాజా!" యనుట ఇదిరాజధర్మమా? యని యెత్తిపొడుచుట. "అహాసీః" ఓహాక్-త్యాగే ధాతువునకు లఙ్ మధ్య పు.ఏ.

శ్లో. కల్యాణబుద్ధే రథవా తవాయం
న కామచారో మయి శంకనీయః
మమైవ జన్మాంతరపాతకానాం
విపాకవిస్ఫూర్జథు రప్రసహ్యః 62

వ్యాఖ్య: అథవా-లేక, కల్యాణబుద్ధేః-మంచిబుద్ధిమంతుఁడవగు, తవ-నీకు, మయి-నావిషయమునందు, అయం-ఈత్యాగము, కామచారః-స్వేచ్ఛతోఁజేసినట్టిదని, నశంకనీయః-అనుమానింపఁ దగినదికాదు (కింతు-అయితే) మమైవ (మమ+ఏవ)-నాయొక్కయే, జన్మాంతర పాతకానాం-పూర్వజన్మకృత పాపములయొక్క, అప్రసహ్యః-సహించుటకు శక్యముగాని, విపాకవిస్ఫూర్జథుః-ఫలమేయగు పిడుగు పాటు. లేదా ఇట్లు చెప్పవచ్చును, చక్కని శాస్త్రసంస్కారము, ధర్మస్వరూపము నెఱిఁగిన బుద్ధిగలవాఁడవగు నీవు చేసిన యీదారత్యాగము కామచారమని, అనఁగా శాస్త్ర ధర్మ కులాచార విరుద్ధమగు స్వేచ్ఛాప్రవృత్తి యని యెట్లు ఊహించుటకు వీలున్నది? ఇది నేను పూర్వజన్మమునందుఁ జేసిన మహాపాపములకు ఫలమై నాపైఁబడిన పిడుగుపాటే యని తలఁచుచున్నాను, దీనిని నేనుభరింపలేకున్నాను. "స్ఫూర్జథు ర్వజ్రనిర్ఘోషః" అనియమరము. "కామచార" మనఁగా శాస్త్రవిరుద్ధ ముగా నడచుట.

శ్లో. ఉపస్థితాం పూర్వ మపాస్య లక్ష్మీం
వనం మయా సార్ధ మసి ప్రపన్నః,
త దాస్పదం ప్రాప్య తయాతిరోషాత్
సోఢాస్మి న త్వద్భవనే వసంతీ. 63

వ్యాఖ్య: పూర్వం-మొదట, ఉపస్థితాం-వచ్చిచేరిన, లక్ష్మీం-రాజ్యలక్ష్మిని, అపాస్య-దూరముచేసి, మయా, సార్ధం-నాతోఁగూడ, వనం-అరణ్యమును, ప్రపన్నః, అసి-చేరితివి, తత్-అందువల, తయా-ఆలక్ష్మిచేత, అతిరోషాత్-మిక్కిలికోపమువలన, త్వద్భవనే-నీగృహమునందు, ఆస్పదం-నిలుకడను, ప్రాప్య-పొంది, వసంతీ-నివసించుచున్ననేను, సోఢా-సహింపఁబడినదానను, న, అస్మి-కాకున్నాను. నేను వచ్చిన క్రొత్తలో నిన్నువరించిన రాజ్యలక్ష్మిని వదలివేసి

నాయందలి యనురాగముచేత నన్నుఁగొని యరణ్యమున కేగితివి. ఆకారణమువలన మిక్కిలి క్రుద్ధురాలైయున్న యాలక్ష్మి నేను మరల నీగృహమందు స్థిరముగా నివసించినచోఁ దనపై నీకనురాగము కలుగఁబోదను నీర్ష్యచేత నన్నచ్చట నుండనీక గెంటివేసినదని భావించుచున్నాను. సవతిపోరులేకుండఁ జేసికొన్నదేమో! యని యుత్ప్రేక్ష. "ఆస్పదం ప్రతిష్ఠాయామ్" ఇతినిపాతః. తిష్ఠవేయుట అని యర్థము.

శ్లో. నిశాచరోపప్లుతభర్తృకాణాం
తపస్వినీనాం భవతః ప్రసాదాత్,
భూత్వా శరణ్యా శరణార్థ మన్యం
కథం ప్రపత్స్యే త్వయి దీప్యమానే. 64

వ్యాఖ్య: నిశాచరోపప్లుతభర్తృకాణాం - నిశాచర-రాక్షసులచేత, ఉపప్లుత-పీడింపఁబడిన, భర్తృకాణాం-తమ భర్తలు గలవారగు, తపస్వినీనాం-మునిపత్నులకు, భవతః-నీయొక్క, ప్రసాదాత్-అనుగ్రహమువలన, శరణ్యా-రక్షణము నిచ్చినదానను, భూత్వా-అయియుండి, అద్య—ఇప్పుడు, త్వయి, దీప్యమానే-నీవు సర్వవిధముల ప్రకాశించుచున్నవాఁడవై యుండఁగానే, శరణార్థం-నన్ను రక్షించుట కొఱకు, అన్యం-మరియొక తపస్విని, కథం. ప్రపత్స్యే-ఎట్లు చేరఁగలను? పూర్వము మునిపత్నులెందఱో తమ భర్తలను రాక్షసులు పీడించుచుండఁగా నీభార్యనై యుండుటచేత నన్ను శరణువేడిరి. నీయనుగ్రహమువలన వారికి రక్షణము నీయఁగల్గితిని. అట్టినేను ఇప్పుడు నీవు విరాజమానుఁడవై యుండఁగానే యరణ్యమున మరియొక తపస్విని యెట్లుశరణువేడఁగలను? రాక్షసభీరువగునాముని నన్నెట్లు కాపాడఁగలఁడు? అని భావము. విషమాలంకారము.

శ్లో. కింవా తవా త్యంతవియోగమోఘే
కుర్యా ముపేక్షాం హతజీవితే ఽస్మిన్,
స్యా ద్రక్షణీయం యది మే న తేజ
స్త్వదీయ మంతర్గత మంతరాయః. 65

వ్యాఖ్య: కింవా-లేదా, తవ-నీయొక్క, అత్యంతవియోగమోఘే—అత్యంత యోగ-పునఃప్రాప్తిరహితమగు వియోగముచేత, మోఘే-నిష్ఫలమైన,అస్మిన్,

హతజీవితే-ఈతుచ్ఛజీవితమునందు, ఉపేక్షాం-ఔదాసీన్యమును; రక్షణీయం-ఎట్లయి ననుగాపాడఁదగినదియు, అంతర్గతం-నాగర్భముననున్నదియు, త్వదీయం-నీదియు నగు, తేజః-సంతానఫలకమగు తేజస్సు, మే-నాకు, అంతరాయః-విఘ్నము, న, స్యాత్, యది-కాకయుండినచో, కుర్యాం-చేసియేయుందును. నీశాశ్వత వియోగ మునే యనుభవింపవలసిన యీతుచ్ఛజీవితమును, నాలోగర్భరూపముననున్న నీతేజస్సు విఘ్నముగా నేర్పడకుండినచో, వదలివేసియే యుందును, అనఁగా గర్భ వతిని కాకయుండినచో నీవ్యర్థజీవితమును త్యజించియే యుందునని భావము. "కుర్యామ్" డుకృఞ్-కరణేధాతువునకు, "స్యాత్" "అస"ధాతువునకును లిఙ్ రూపములు.

శ్లో. సాహం తపః సూర్యనివిష్టదృష్టి
రూర్ధ్వం ప్రసూతే శ్చరితుం యతిష్యే,
భూయో యథా మే జననాంతరేఽపి
త్వ మేవ భర్తా న చ విప్రయోగః. 66

వ్యాఖ్య : సాహం (సా + అహం)-అట్టి నిశ్చయముగలనేను, ప్రసూతేః, ఊర్ధ్వం-ప్రసూతియొక్క యనంతరము, సూర్యనివిష్టదృష్టిః-సూర్యమండలముపై నుంచఁబడినచూపు గలదాననగుచు, తపః, చరితుం-తపస్సును జేయుటకు, యతిష్యే-ప్రయత్నింపఁగలను. యథా-ఏవిధమున, భూయః-మరల, మే-నాకు, జననాంతరే, అపి-పునర్జన్మయందును, త్వం,ఏవ-నీవే, భర్తా-భర్తవగుదువో, విప్రయోగః, న,చ-వియోగములేకుండునో అట్టి తపస్సును జేయఁగలనని యర్థము. ఇప్పుడు నాగర్భమున నీవంశాంకుర ముండుటచేత నాశరీరముపేక్షించు టకుఁగాని తపఃక్లేశమనుభవించుటకుఁగాని యోగ్యముకాదు. ప్రసూతియనంత రమున శరీరమును లెక్కచేయక ఘోరమైన తపస్సును జేసి తత్ఫలముగా రాఁబోవుజన్మమున నీవే నాభర్తవై వియోగరహిత జీవనమును గడుపునట్లు చేయుదునని భావము. "యతిష్యే" యతీ-ప్రయత్నేధాతువునకు లృట్. ఉ. ఏ.

శ్లో. నృపస్య వర్ణాశ్రమపాలనం యత్
స ఏవ ధర్మో మనునా ప్రణీతః,

నిర్వాసితా ప్యేవ మత స్త్వయా హం
తపస్విసామాన్య మవేక్షణీయా. 67

వ్యాఖ్య : వర్ణాశ్రమపాలనం, యత్-బ్రాహ్మణాది వర్ణధర్మముల యొక్కయు బ్రహ్మచర్యా ద్యాశ్రమధర్మములయొక్కయు పాలనమేదికలదో, స, ఏవ-అదియే, నృపస్య-రాజుయొక్క, ధర్మః-ధర్మముగా, మనునా, ప్రణీతః-మనువుచేతఁ జెప్పఁబడినది. అతః-ఈకారణమువలన, ఏవం-ఇట్లు, త్వయా-నీచేత, నిర్వాసితా, అపి-వెళ్ళఁగొట్టఁబడినదాననైనను, అహం-నేను, తపస్విసామాన్యం - తపస్విజనులందఱితో సమానమగురీతిని, అవేక్షణీయా-చూడఁదగియున్నాను. లోకమునందలి వర్ణాశ్రమములకుఁజెందిన ప్రజలను దగినరీతిని పాలించుటయే రాజుకు ధర్మమని మనువుచెప్పియున్నాఁడు. కనుక నన్ను భార్యనుగా కాకపోయినను ఒకతాపసస్త్రీనిగా జూచి నాకు రక్షణను గల్పింపుము, నిర్వాసితురాలుగదా! యని యుపేక్ష సేయకు మని భావము. "యత్, సఏవ" ఇచ్చట తచ్ఛబ్దముయొక్క లింగభేదము విధేయమగు "ధర్మః" అను శబ్దము ననుసరించి వచ్చినదని తెలియవలెను.

శ్లో. తథేతి తస్యాః ప్రతిగృహ్య వాచం
రామానుజే దృష్టిపథం వ్యతీతే,
సా ముక్తకంఠం వ్యసనాతిభారా
చ్చక్రంద విగ్నా కురరీవ భూయః. 68

వ్యాఖ్య: తథేతి (తథా+ఇతి)-అట్లేచెప్పెదనని, తస్యాః, వాచం-ఆసీత యొక్క మాటను, ప్రతిగృహ్య-అంగీకరించి, రామానుజే-లక్ష్మణుఁడు, దృష్టిపథం-చూపునకందుమార్గమును, వ్యతీతే (సతి)-దాటివెళ్ళినవాఁడుకాఁగా, సా-సీతాదేవి, వ్యసనాతిభారాత్-దుఃఖాతిరేకమువలన, ముక్తకంఠం-పెద్దగాకంఠము విడివడునట్లు, విగ్నా-భీతయై, కురరీవ-పెద్దగా అరచు అనాగరికస్త్రీవలె, భూయః-మాటిమాటికి, చక్రంద-ఏడ్చెను. వెనుకఁజెప్పిన సీత పలుకులను గ్రహించి అట్లే రామునికి విన్నవించెదనని లక్ష్మణుఁడు తిరిగివెళ్ళుచుఁ గనుచూపు మేరను దాటగా సీతాదేవి దుఃఖమును భరింపలేక భయకంపితురాలై మాటిమాటికిని పెద్దగా నేడ్చుచుండెను. "కురరీవ" అను ఉపమానము సీత యడవిలో భయముచేత తన సౌకుమార్య

నాగరికత్వములను విడచి యేడ్చె ననుభావమును సూచించుచున్నది. "చక్రంద" క్రది-వైక్లబ్యేఅను ధాతువునకు పరస్మైపదిలిట్. ఆవకురాలై యేడ్చెనని యర్థము.

శ్లో. నృత్యం మయురాః కుసుమాని వృక్షా
దర్భా నుపాత్తాణ్ విజహు ర్హరిణ్యః,
తస్యాః ప్రపన్నే సమదుఃఖభావ
మత్యంత మాసీత్ రుదితం వనేఽపి. 69

వ్యాఖ్య: మయూరాః-నెమళ్ళు, నృత్యం-నాట్యమును, వృక్షాః-వృక్షములు, కుసుమాని-పువ్వులను, హరిణ్యః-ఆడులేళ్ళు, ఉపాత్తాణ్,దర్భాణ్-నోటియందుంచు కొన్న దర్భపరకలను, విజహుః-విడిచిపెట్టినవి. తస్యాః-ఆ౦తకు, సమదుఃఖ భావం-సమానమగు దుఃఖానుభవమును, ప్రపన్నే-పొందినట్టి, వనే, అపి-వనము నందుఁగూడ, అత్యంతం-అధికాధికమైన, రుదితం-శోకము, ఆసీత్-నెలకొనెను. సీతశోకమును వినుచున్న నెమళ్ళు నృత్యమును చాలించెను; వృక్షములు కన్నీఁటి చుక్కలవలె పూలనురాల్చెను; లేళ్ళు నోటియందలి దర్భపరకలను నైల జార విడిచెను. ఇట్లు సీతతో సమదుఃఖము ననుభవించుచున్న వనమునందు తమ అత్యంతమైన శోకము నిండిపోయెను. "వనేఽపి" ఇచ్చటి 'అపి' శబ్దము నను నంటేకాక శోకము అయోధ్యయందును, రామునిమందిరమందును మిక్కుటమయ్యె నని సూచించును.

శ్లో. తా మభ్యగచ్ఛత్ రుదితానుసారీ
కవిః కుశేధ్మాహరణాయ యాతః,
నిషాద విద్ధాండజ దర్శనోత్థః
శ్లోకత్వ మాపద్యత యస్య శోకః. 70

వ్యాఖ్య : కుశేధ్మాహరణాయ-దర్భలను సమిధలను దెచ్చుకొనుటకొఱకు, యాతః-వెళ్ళినట్టి, కవిః-కవియగు వాల్మీకి, రుదితానుసారీ(సణ్)-ఏడ్పునువినుచు వచ్చువాఁడై, తాం-ఆసీతను, అభ్యగచ్ఛత్-చేరెను నిషాదవిద్ధాండజదర్శనోత్థః— నిషాద-బోయవానిచేత, విద్ధ-బాణముచేఁగుచ్చి చంపఁబడిన, అండజ-క్రౌంచపక్షి యొక్క, దర్శనోత్థః-దర్శనముచేత ఉత్పన్నమైన, యస్య-ఏవాల్మీకియొక్క,

శోకః-దుఃఖము, శ్లోకత్వం-శ్లోకరూపమును, ఆపద్యత-పొందెనో! నిత్యాగ్ని హోత్రాదులకై స్వయముగా దర్భలను, సమిధలను దెచ్చుకొనుటకు వచ్చినవాల్మీకి సీతయేడ్పును వినుచు నామెవద్దికివచ్చెను. కరుణాళుఁడై నయేవాల్మీకి తమసాతీర మున వ్యాధునిచేతఁ జంపఁబడిన మగ క్రౌంచపక్షిని జూచుటచేతఁ దనలోనుదికి వచ్చిన శోకమునకు శ్లోకత్వమును అనఁగా, "మా నిషాద ప్రతిష్ఠాం త్వ మగమః శాశ్వతీః సమాః, యత్క్రౌంచమిథునా దేక మవధీః కామమోహితమ్" అను వాగ్రూపమును ఇచ్చియుండెనో! వాల్మీకి సీతవద్దికిఁ జూడవచ్చుట అతఁ డత్యంత దయాళుఁడగుటచేతనే యనియు, పశుపక్ష్యాదులయందే దయాపంతుఁడై యున్న యతఁడు సీతాశోకమును విని యచ్చటికివచ్చుటలో వింతలేదనియు గ్రహింపఁదగును. ఇచ్చట "కవిః" అని వాల్మీకిని గుఱించి నిరుపపదముగాఁ గాళి దాసు చెప్పుటలో నతని యుద్దేశమున "కవి" యనఁగా వాల్మీకియనియు నతఁ డొక్కఁడే కవిశబ్దవాచ్యుఁడనియు భావము. కాళిదాసునకు వాల్మీకిపైఁ గలభక్తిని ఈ ప్రయోగము స్థిరపరచును.

శ్లో. తమశ్రు నేత్రావరణం ప్రమృజ్య
సీతా విలాపా ద్విరతా వవందే,
తస్యై మునిర్దోహదలింగదర్శీ
దాశ్వాన్ సుపుత్రాశిష మిత్యువాచ. 71

వ్యాఖ్య : సీతా-సీతాదేవి, విలాపాత్-ఏడ్పునుండి, విరతా-విరమించినదై, నేత్రావరణం-చూపునకుఁ బ్రతిబంధకమగు, అశ్రు-కన్నీటిని, ప్రమృజ్య-తుడుచు కొని, తం-ఆవాల్మీకిమునిని, వవందే-నమస్కరించెను. దోహదలింగదర్శీ- సీత యొక్క గర్భచిహ్నములను జూచుచున్న, మునిః-వాల్మీకి, తస్యై-ఆమెకు, సుపు త్రాశిషం-"సుపుత్రప్రాప్తిరస్తు" అను నాశీర్వచనమును, దాశ్వాన్-ఇచ్చినవాఁడై, ఇతి-ముందుఁజెప్పబోవురీతిగా, ఉవాచ-పలికెను. వాల్మీకి తనవద్దికిరాఁగానే సీత పెద్దగానేడ్చుటను మాని, చూపునకడ్డముగానున్న కన్నీటినిఁ దుడుచుకొని, అతనికి నమస్కరించెను. వాల్మీకి యామె గర్భవతిగానున్న సంగతిని గుర్తించి, "సుపుత్ర ప్రాప్తిరస్తు" అని దీవించి సీతతో నీరీతిగా (ముందువచ్చుశ్లోకములు) ననెను. "దాశ్వాన్" ఇది "దాణ్-దానే" అనుధాతువుపై 'క్వసు' ప్రత్యయాంతము. దీనిని వైదికప్రక్రియయందు పాణిని "దాశ్వా"నిత్యాదిసూత్రముచే నిపతించెను. దీనివలన

కాళిదాసునకుఁగల వైదికభాషా పరిచయము తెల్లమగును. "వవందే" వది-అభివాద నస్తుత్యోః ధాతువులిట్ రూపము.

శ్లో. జానే విసృష్టాం ప్రణిధానత స్త్వాం
మిథ్యాపవాద క్షుభితేన భర్త్రా,
త న్మా వ్యథిష్ఠా విషయాంతరస్థం
ప్రాప్తాసి వై దేహి! పితు ర్నికేతమ్. 72

వ్యాఖ్య : త్వాం-నిన్ను, మిథ్యాపవాదక్షుభితేన—మిథ్యాపవాద-అసత్యము నాధారపడిన లోకనిందచేత, క్షుభితేన-కలతఁజెందిన, భర్త్రా-భర్తచేత, విసృష్టాం-విడిచిపెట్టఁబడిన దానినిగా, ప్రణిధానతః-సమాధి దృష్టిచేత, జానే-ఎఱుఁగుచున్నాను. హేవైదేహీ-ఓసీతా! విషయాంతరస్థం-దేశాంతమునందున్న, పితుః, నికేతం-తండ్రియొక్క యింటినే, ప్రాప్తాసి (ప్రాప్తా+అసి)-చేరితివి. తత్-అందువలన, మావ్యథిష్ఠాః-దుఃఖింపకుము. వాల్మీకి యిట్లనుచున్నాఁడు, అసత్య విషయముపై నాధారపడిన లోకులనిందవలన భయపడినభర్తచేత నీవు విడువఁబడితివని అంతరదృష్టితోఁగనుగొనుచున్నాను. ఓవిదేహతనయా! నీవు మరియొక ప్రదేశమువందున్న మీతండ్రియింటినే చేరినావు కనుక దుఃఖింపకుము. "పితుర్నికేతం" తాను జనకచక్రవర్తితో సమానుఁడననియు, తనయాశ్రమము సీతకుఁబుట్టినిల్లనియు, భర్తచేవిడువఁబడిన యిల్లాలు పుట్టినింటిలోనుండుట ధర్మమనియు వాల్మీకిమునియభిప్రాయము. "జానే" జ్ఞా-అవబోధనే అనుధాతువునకు ఆత్మనేపది లట్ ఉత్తమపురుష. ఏ. "మా-వ్యథిష్ఠాః" వ్యథ-భయసంచలనయోః అనుధాతువునకు ఆత్మనేపది లుఙ్ మధ్య. పు. ఏ. "అవ్యథిష్ఠాః" అనునది నిజరూపము. ఇచ్చట "మా" తోఁ జేరుటచేత "నమాఙ్యోగే" అనునిషేధమువలన "అ" లోపించి వ్యథిష్ఠాః అయినది.

శ్లో. ఉత్ఖాతలోకత్రయకంటకే ఽపి
సత్యప్రతిజ్ఞే ఽప్యవికత్థనే ఽపి,
త్వాం ప్రత్యకస్మా త్కలుషప్రవృత్తా
వ స్త్యేవ మన్యు ర్భరతాగ్రజే మే.

వ్యాఖ్య : ఉత్ఖాతలోకత్రయకంటకే, అపి-ఉత్ఖాత—తీసివేయఁబడిన, లోకత్రయకంటకే, ముల్లోకములకు కంటకప్రాయుఁడగు రావణుఁడు గలవాఁడు, అపి-ఐనను, సత్యప్రతి, అపి-సత్యసంధుఁడై యున్నను, అవికత్థనే, అపి-ఆత్మశ్లాఘాపరాయణుఁడు గానివాఁడైనను, త్వాం, ప్రతి-నిన్ను గుఱించి, అకస్మాత్-అకారణముగా, కలుషప్రవృత్తౌ-గర్హితప్రవర్తనముగల, భరతాగ్రజే-రామునియందు, మే-నాకు, మన్యుః-కోపము, అస్త్యేవ (అస్తి+ఏవ) ఉండనేయున్నది. సీతా! ముల్లోకములకుఁ గంటకప్రాయుఁడగు రావణుని వధించి లోకోపకారమును జేసినవాఁడును, సత్యసంధుఁడు, ఆత్మశ్లాఘాదూరుఁడు నగుటచేత స్నేహపాత్రుఁడైనప్పటికిని నీవిషయమునఁ గలుషవర్తనమునుజూపి ఆగుణములన్నిటిని మాయించుదోషమును జేసిన భరతాగ్రజుఁడంటే నాకెంతో మంటగానున్నది సుమా! అన్నాఁడు వాల్మీకి. "భరతాగ్రజ" శబ్దము "నామాతిక్రమణస్యచ" అను ధర్మ వచన ప్రకారము వాల్మీకి "రామ" నామము నుచ్చరింపలేదని సీత గ్రహించుట ప్రయోగింపఁబడినది. వాల్మీకి చేసిన యీరామోపాలంభము సీతను ఓదార్చుటకుద్దేశింపఁ బడినదని మనము గ్రహింపవలయును, నిజముగా వాల్మీకికి రామునిపైఁ గోపము వచ్చుట యసంభవముగదా!

శ్లో. తవోరుకీర్తిః శ్వశురః సఖా మే
సతాం భవోచ్ఛేదకరః పితా తే,
ధురి స్థితా త్వం పతిదేవతానాం
కిం తన్న యేనాసి మమానుకంప్యా? 74

వ్యాఖ్య : ఉరుకీర్తిః-మహాకీర్తిమంతుఁడగు, తవశ్వశురః-మీమామ, మేసఖా-నాకుమిత్రుఁడు; తేపితా-మీతండ్రియగు జనకచక్రవర్తి, సతాం-విద్వాంసులకు, భవోచ్ఛేదకరః-జ్ఞానోపదేశముచేత సంసారదుఃఖమును దొలఁగించు బ్రహ్మజ్ఞాని; త్వం-నీవు, పతిదేవతానాం-పతివ్రతలయొక్క, ధురి-అగ్రస్థానమునందు, స్థితా-ఉన్నట్టిదానవు; యేన-ఏకారణముచేత, మమ-నాకు, అనుకంప్యా-గౌరవముగా దయచూపఁదగినదానవు, నాసి (న+అసి)-కాకున్నావో!, తత్ కిం-అదియేది? మీమామ నామిత్రుఁడు, బ్రహ్మజ్ఞానియైన మీతండ్రి నాకుపూజ్యుఁడు, నీవా పతివ్రతలలో నుత్తమురాలవు. ఇఁక నిన్ను దయతో నాయాశ్రమమున నుంచుకొనకుండుటకుఁ గారణమేమున్నది? ఏదియులేదు; నీవు సర్వథా నాకు ఆదరణీయురాలవని వాల్మీకి సీతతో ననెను.

శ్లో. తపస్వి సంసర్గవినీతసత్త్వే
తపోవనే వీతభయా వసాస్మిన్,
ఇతో భవిష్యత్యనఘప్రసూతేః
అపత్యసంస్కారమయో విధి స్తే. 75

వ్యాఖ్య : తపస్విసంసర్గవినీతసత్త్వే—తపస్విసంసర్గ – మునిజనులయొక్క స్నేహముచేత, వినీతసత్త్వే-శాంతములగు మృగములుగల, అస్మిన్, తపోవనే-ఈతపోవనమునందు, వీతభయా-భయములేనిదానవగుచు, వస-నివసింపుము. ఇతః-ఈవనమునందే, అనఘప్రసూతేః-సుఖప్రసవము గలిగిన, తే-నీయొక్క, అపత్యసంస్కారమయః-సంతానమునకు జాతకర్మాదిరూపమగు, విధిః-అనుష్ఠానము భవిష్యతి-జరుగఁగలదు. మునుల సహవాసముచేత క్రౌర్యమును విడిచిన జంతువులు గల యీతపోవనమునందు నిర్భయముగా నివసింపుము. నీవు సుఖముగా ప్రసవించిన పిమ్మట నీసంతానమునకు జాతకర్మాదికమగు అనుష్ఠానము ఇచ్చటనే జరుపఁబడునని వాల్మీకి సీతకుఁజెప్పెను. "ఇతః" అస్మిన్ ఇతః అనివిగ్రహము. "సార్వవిభక్తిక స్తసిః" అను ప్రమాణమువలన ఇదంశబ్దమునకు సప్తమ్యర్థమున వచ్చిన "తసిల్" ప్రత్యయాంతమగు నవ్యయము.

శ్లో. అశూన్యతీరాం మునిసంనివేశైః
తమోనిహంత్రీం తమసాం వగాహ్య,
తత్సైకతోత్సంగ బలిక్రియాభిః
సంపత్స్యతే తే మనసః ప్రసాదః. 76

వ్యాఖ్య : మునిసంనివేశైః-మునులయొక్క కుటీరములచేత, అశూన్యతీరాం-నిండినయొడ్డులుగలదియు, తమోనిహంత్రీం-శోకమును, పాపమును దొలఁగించునదియు నగు, తమసాం-తమసానదిని, వగాహ్య-ప్రవేశించి (ఆనదిలో స్నానము చేసి యనియర్థము), తత్సైకతోత్సంగబలిక్రియాభిః—తత్సైకతోత్సంగ-ఆనదియిసుకదిబ్బలనడుమఁజేయు, బలిక్రియాభిః-ఇష్టదేవతాపూజలచేత, తే, మనసః-నీమనస్సునకు, ప్రసాదః-నైర్మల్యము (సంతోషము), సంపత్స్యతే-కలుగఁగలదు. ఉభయతీరములందును మునుల కుటీరములతో నిండిన తమసానదీ జలములందు స్నానముఁజేసి, ఆనదియిసుకతిన్నెలపై యిష్టదేవతాపూజలు సలుపునప్పుడు

నీమనస్సు నిర్మలమై శోకము నశించు నమ్మా! యని వాల్మీకి పలికెను. "సం నివిశంతే యేషు ఇతి సంనివేశాః" అని వి గ్రహము. "వగాహ్య" అవగాహ్యకు రూపాంతరము. "సంపత్స్యతే, సమ్ అను ఉపసర్గతోఁగూడిన ప-గతౌధాతువునకు ల్యుట్ ప్ర.పు ఏ. (సంపత్స్యతే, సంపత్స్యేతే, సంపత్స్యంతే, ఇత్యాది).

శ్లో. పుష్పం ఫలం చార్తవ మాహరంత్యో
బీజం చ బాలేయ మకృష్టరోహి,
వినోదయిష్యంతి నవాభిషంగా
ముదారవాచో మునికన్యకా స్త్వామ్. 77

వ్యాఖ్య : ఆర్తవం-ఆయాఋతువునకు సంబంధించిన, పుష్పం-పూలను, ఫలంచ-పండ్లను సైతము, అకృష్టరోహి-దున్నక నాటకయే మొలచిన, బాలేయం-బలికి (పూజకు) యోగ్యమగు, బీజం, చ-నీవారాదిధాన్యమును గూడ, ఆహరంత్యః-తెచ్చువారును, ఉదారవాచః-చక్కఁగా మాట్లాడువారును నగు, మునికన్యకాః-తాపసకన్యలు, నవాభిషంగాం-నూతన దుఃఖముగల లేదా క్రొత్తగా స్నేహితురాలవైన, త్వాం-నిన్ను, వినోదయిష్యంతి-ఆనందపరుపఁగలరు. సురభిళము లగు పూలు, మధురములగు పండ్లు, పూజార్థమై దున్నకయే పండిన నీవారధాన్యము నీకిచ్చుచు, చక్కఁగా భాషించుచు మునికన్యలు క్రొత్తదానవైననిన్ను సంతోషపరచుచు నీశోకమును దొలఁగింతురు. "పుష్పం, ఫలం, బీజం" జాత్యేక వచనములు. "బలయే హితం బాలేయం" అని విగ్రహము.

శ్లో. పయోఘటై రాశ్రమబాలవృక్షాన్
సంవర్ధయంతీ స్వబలానురూపైః,
అసంశయం ప్రాక్ తనయోపపత్తేః
స్తనంధయప్రీతి మవాప్స్యసి త్వమ్. 78

వ్యాఖ్య: స్వబలానురూపైః-నీశక్తికిఁదగిన, పయోఘటైః-జలకుంభములచేత, ఆశ్రమబాలవృక్షాన్-ఆశ్రమమునందలి చిన్నమొక్కలను, సంవర్ధయంతీ-పెంచుచున్న, త్వం-నీవు, తనయోపపత్తేః-పుత్రోత్పత్తికి, ప్రాక్-ముందుగానే అసంశయం-నిస్సంశయముగా, స్తనంధయప్రీతిం-శిశువిషయకమైన యానందమును, అవా

ప్స్యసి-పొందఁగలవు నీశక్తికిఁదగిన చిన్నకడవలతో నీరునుదీసుకవెళ్ళి చిన్నచిన్న యాశ్రమవృక్షకములకుఁ దోసి వాటినిఁ బెంచుచున్న నీవు, నీకుఁ బుత్రోత్పత్తి కలుగకముందే తప్పక శిశుదర్శన లాభ పోషణాదులవలనఁ గలుగఁబోవు ప్రీతిని పొందఁగలవమ్మా! అన్నాఁడు. "పయోఘటైః" స్తన్యమునిచ్చుటను, స్తనంధయ శబ్దము రాఁబోవు శిశుదర్శనమును ధ్వనింపఁ జేయుచున్నవి స్త్రీలకు సంతానోత్పత్తి పోషణాదులు సర్వదుఃఖములను విస్మరింపఁజేయునన్నది ముఖ్య తాత్పర్యము. అందువలన నిట్లు ఓదార్చుట.

శ్లో. అనుగ్రహా ప్రత్యభినందినీం తాం
వాల్మీకి రాదాయ దయార్ద్రచేతాః,
సాయం మృగాధ్యాసిత వేదిపార్శ్వం
స్వ మాశ్రమం శాంతమృగం నినాయ. 79

వ్యాఖ్య : దయార్ద్రచేతాః-కరుణామయచిత్తుఁడగు, వాల్మీకిః-వాల్మీకిముని, అనుగ్రహప్రత్యభినందినీం-తానుచూపిన యనుగ్రహమునుగురించి యెంతోసంతోష పడుచున్న, తాం-ఆసీతాదేవిని, ఆదాయ-తీసికొని, సాయం-సాయంకాలమున, మృగాధ్యాసితవేదిపార్శ్వం—మృగ-లేళ్ళచేత, అధ్యాసిత-కూర్చోఁబడిన, వేది పార్శ్వం-యజ్ఞవేదిక ప్రక్కచోటులుగలదియు, శాంతమృగం-శాంతస్వభావముతో నున్న శార్దూలాది మృగములు గలదియునగు, స్వం, ఆశ్రమం-తనయాశ్రమమును, నినాయ-చేర్చెను. దయావంతుఁడగు వాల్మీకి తానుచూపినయాదరమున కెంతగానో యానందించుచుఁ గృతజ్ఞురాలై యున్న సీతను తనయాశ్రమమునకుఁ దీసుకవెళ్ళెను. "సాయం" అనుట, సీత వాల్మీకివచనముల కంగీకరించుట కంత సేపుపట్టినదనియు, ఆశ్రమము శాంతమృగముగాఁ గనపడుట కదేసమయమనియు మున్నగు భావములు స్ఫురింపఁజేయుటకు. "వాల్మీకిః తాం ఆశ్రమం నినాయ" ద్వికర్మకకర్తరి ప్రయోగము.

శ్లో. తా మర్పయామాస చ శోకదీనాం
తదాగమప్రీతిషు తాపసీషు,
నిర్విష్టసారాం పితృభి ర్హిమాంశో
రంత్యాం కలాం దర్శ ఇవౌషధీషు. 80

వ్యాఖ్య : శోకదీనాం,తాం-శోకముచేత దీనురాలై యున్న యాసీతను, తదాగమప్రీతిషు-ఆసీతరాకచేతసంతుష్టురాండ్రగు, తాపసీషు-మునిపత్నులయందు. పితృభిః-అగ్నిష్వాత్తాది పితృదేవతలచేత, నిర్విష్టసారాం-భుక్తమగుసారముగల, హిమాంశోః-చంద్రునియొక్క, అంత్యాం, కలాం-మిగిలిన చివరికళను, దర్శః-అమావాస్యాకాలము, ఓషధీషు, ఇవ-ఓషధులందువలె, అర్పయామాసచ-అర్పించెనుగూడ. వాల్మీకి తనవెంటఁదీసుకపోఁబడి, శోకార్తయైయున్న సీతను మునిపత్నులుమాచి సంతోషపడుచుండ వారికి సీతయాతిథ్యాదులను నిర్వర్తింపుఁడని యప్పగించెను. ఆయర్పణము పితృదేవతలు భుజింపఁగా మిగిలిన చంద్రుని చివరి కళను దర్శకాలము ఓషధులకప్పగించినట్లుగా నుండెనట. సీత దుఃఖతప్తయగుటచేత సర్వసౌందర్యమును గోలుపోయి కళామాత్ర పరిశిష్టగానున్నను తాపసీజనమున కానందమునే యోషధీశునికళ యోషధులకువలెఁ గూర్చెనట. "అమాయాంతు సదా సోమ ఓషధీః ప్రతిపద్యతే" అని వ్యాసవచనము. అలంకారము: ఉపమ.

శ్లో. తా ఇంగుదీస్నేహకృతప్రదీప
మాస్తీర్ణమేధ్యాజినతల్ప మంతః,
తస్యై సపర్యానుపదం దినాంతే
నివాసహేతో రుటజం వితేరుః. 81

వ్యాఖ్య : తాః-ఆతపస్వికాంతలు, తస్యై-సీతకొఱకు, సపర్యానుపదం-పూజానంతరము, దినాంతే-సాయంకాలమునందు, నివాసహేతోః-సీతానివాసము కొఱకు, ఇంగుదీస్నేహకృతప్రదీపం—ఇంగుదీస్నేహ-గారనూనెచేత, కృతప్రదీపం-వెలిగింపఁబడినదీపముగలదియు, అంతః-లోపల, ఆస్తీ...ల్పం-ఆస్తీర్ణ-పరువఁబడిన, మేధ్యాజినతల్పం-పరిశుద్ధమైన కృష్ణాజినమే పడకగాఁగలదియునగు, ఉటజం-పర్ణశాలను, వితేరుః-ఇచ్చిరి. మునిపత్నులు సీతకు ఆశ్రమవాసయోగ్యమైన, విడిది నిచ్చిరని భావము. "ఇంగుదీ తాపసతరుః" అనియమరము."వితేరుః"వి అను ఉపసర్గతోఁగూడిన తౄ-ప్లవనతరణయోః అనుధాతువునకు ఇచ్చుట అనియర్థము.

శ్లో. తత్రాభిషేకప్రయతా వసంతీ
ప్రయుక్తపూజా విధినాతిథిభ్యః,

వన్యేన సా వల్కలినీ శరీరం
పత్యుః ప్రజాసంతతయే బభార. 82

వ్యాఖ్య : తత్ర-ఆయాశ్రమమునందు, అభిషేక ప్రయతా-స్నానముచేత నియమముగలది యగుచు, వసంతీ-నివసించుచున్నదియై, విధినా-శాస్త్రవిధానము చేత, అతిథిభ్యః-అతిథులకు, ప్రయుక్తపూజా-చేయఁబడిన సత్కారముగలదియై, వల్కలినీ-వల్కలముధరించిన, సా-ఆసీత, పత్యుః-భర్తయొక్క, ప్రజాసంతతయే-సంతానము ముందుకు సాగుటకొఱకై, వన్యేన-కందమూల ఫలాదికముచేత, శరీరం-శరీరమును, బభార-పోషించెను. స్నానము, అతిథిపూజ, వల్కలధారణము మొదలయిన తాపసీవృత్తిని అవలంబించిన సీత, భర్తయొక్క సంతానము అవిచ్ఛిన్నముగా సాగవలెనను కోరికచే మాత్రము అరణ్యలభ్యమగు కందమూలాదికముచేత శరీరమును పోషించుకొనెను. లేనిచో నుపవాసాదులు చేసి యుండెడిదే యని భావము.

శ్లో. అపి ప్రభుః సానుశయో ఽధునా స్యాత్
కి ముత్సుకః శక్రజితో ఽపి హన్తా,
శశంస సీతాపరిదేవనాంత
మనుష్ఠితం శాసన మగ్రజాయ. 83

వ్యాఖ్య: ప్రభుః-రాముఁడు, అధునా, అపి-ఇప్పటికైనను, సానుశయః-సానుతాపముగలవాఁడు, స్యాత్కిం-అయియుండునో (లేదో), అని ఉత్సుకః-త్వరపడుచున్న, శక్రజితః-ఇంద్రజిత్తుయొక్క (కర్మణిషష్ఠి) హన్తా, అపి-చంపిన లక్ష్మణుఁడు సైతము, సీతాపరిదేవనాంతం-సీతావిలాపమే అంతముగాఁగలదియై, అనుష్ఠితం-తనచే నాచరింపఁబడిన, శాసనం-ఆజ్ఞను, అగ్రజాయ-అన్నగారికి, శశంస-వివరముగాఁ జెప్పెను. లోకాపవాదభీతుఁ కాఠిన్యమునువహించి సీతను బయట వేసిన రాముఁడు అయ్యో! ఇట్టిపని చేయ లసివచ్చెనే! యని పశ్చాత్తప్తుఁడయ్యెనో లేదో ఇంతలో త్వరత్వరగావచ్చిన లక్ష్మణుఁడు సీతశోకించుచుండుటకుఁగల శాసనానుష్ఠానమును అన్నకు నివేదించెను. "శక్రజితఃహన్తా" యను విశేషణము లక్ష్మణుఁడు మహాపరాక్రమవంతుఁడై యున్నను రామశాసనము ననుష్ఠించుటయందు విధేయతగలవాఁడని సూచించును.

శ్లో. బభూవ రామః సహసా సబాష్పః
తుషారవర్షీవ సహస్య చంద్రః,
కౌలీనభీతేన గృహాన్నిరస్తా
న తేన వైదేహసుతా మనస్తః. 84

వ్యాఖ్య : సహసా-లక్ష్మణుఁడు ప్రస్తావించినవెంటనే, సబాష్పః-కన్నీటితోఁగూడిన, రామః-రాముఁడు, తుషారవర్షీ-మంచుచుక్కలనుగురియుచున్న, సహస్యచంద్రః, ఇవ-పౌషమాసచంద్రుఁడువలె, బభూవ-అయ్యెను. కౌలీనభీతేన-లోకాపవాదమువలన భయపడిన, తేన-రామునిచేత, వైదేహసుతా-సీతాదేవి, గృహాత్, నిరస్తా-ఇంటినుండి వెళ్ళఁగొట్టఁబడినదిగాని, మనస్తః-తనమనస్సునుండి, న-కాదు లక్ష్మణుఁడు సీతాత్యాగమును వివరింపఁగానే కన్నులనుండి యశ్రువులు రాల్చుచున్న రాముఁడు తుషారమునువర్షించునట్టి పుష్యమాసపుచంద్రునివలె నయ్యెను. తానై సీతను బంపినవానికాదట యెట్లువచ్చెననఁగా లోకాపవాదభీతుఁడై యింటినుండి బహిష్కరించెనుగాని తనమనస్సునుండికాదు. మనస్సు సీతావిషయకమగుదుఃఖము కలిగియేయున్నందున అట్లుకన్నీరురాల్చె నని భావము. ధీరుఁడైనపురుషుఁడు శోకునయేడ్చుట తగదుకావున తుషారోపమానము కన్నీటికిఁజెప్పఁబడినది. అలంకారము: ఉపమ. "మనస్తః" పంచమ్యర్థమున "తసిల్" ప్రత్యయాంతమగు నవ్యయము.

శ్లో. నిగృహ్య శోకం స్వయమేవ ధీమాన్
వర్ణాశ్రమావేక్షణజాగరూకః,
స భ్రాతృసాధారణభోగమృద్ధం
రాజ్యం రజోరిక్తమనాః శశాస. 85

వ్యాఖ్య : ధీమాన్-బుద్ధిమంతుఁడగు, సః-ఆరాముఁడు, స్వయం, ఏవ-తనకుఁదానే, శోకం-సీతావియోగదుఃఖమును, నిగృహ్య-అణఁచుకొని, వర్ణాశ్రమావేక్షణజాగరూకః—వర్ణాశ్రమ-బ్రాహ్మణాదివర్ణాశ్రమ ధర్మాచరణముయొక్క, అవేక్షణ-పర్యవేక్షణమునందు, జాగరూకః-అప్రమత్తుఁడై, రజోరిక్తమనాః-రజోగుణప్రయుక్తమగు భోగలాలసత్వము లేనిమనస్సుగలవాఁడగుచు, భ్రాతృసాధారణభోగం-సోదరులందరికిని సమానమగు సుఖానుభవముగల, ఋద్ధం, రాజ్యం-సర్వ

సంపత్సమృద్ధమైన రాజ్యమును, శశాస-ఏలెను. దైవికము కానందున యితరు లోదార్చుటకు వలనుపడని సీతావియోగ దుఃఖమును తానే నిరోధించుకొని, వర్ణాశ్రమధర్మానుసరణము ప్రజలకు ముఖ్యముగావున వారి ప్రవర్తనపర్యవేక్షణము నందు జాగరూకుఁడై, సోదరులకంటే తనకు విశేషములేని భోగము ననుభవించుచు సర్వసమృద్ధమైన అయోధ్యారాజ్యమును రాముఁడుపాలించుచుండెనని భావము. "శశాస" శాసు-అనుశిష్టౌ ధాతువునకు లిట్ ప్ర.పు ఏ.

శ్లో. తా మేకభార్యాం పరివాదభీరోః
సాధ్వీ మపి త్యక్తవతో నృపస్య,
వక్షః స్యసంఘట్టసుఖం వసంతీ
రేజే సపత్నీరహితేవ లక్ష్మీః. 86

వాఖ్య : పరివాదభీరోః - అపకీర్తికిభయపడువాఁడుగావున, ఏకభార్యాం, అపి-ఒకతెయేభార్యయైయున్నప్పటికిని, సాధ్వీం, అపి-పతివ్రతయైయున్నప్పటికిని, తాం-సీతాదేవిని, త్యక్తవతః-విడిచిపెట్టిన, నృపస్య-రాజైన రామునియొక్క, వక్షసి-వక్షస్థలమునందు, అసంఘట్టసుఖం - అడ్డములేనిసుఖముగలుగునట్లుగా, వసంతీ-నివసించుచున్న, లక్ష్మీః-రాజ్యలక్ష్మి, సపత్నీరహితా, ఇవ-సవతిలేనిదివలె, రేజే- ప్రకాశించెను. లోకాపవాదభీరువై ఉన్న ఒక్కభార్యను విడిచిపెట్టిన రాముని వక్షమున నెదురులేక నివాసముచేయుచున్న రాజ్యలక్ష్మి సవతిపోరులేనిదానివలె ప్రకాశించెను. అనఁగా మరల రాముఁడు మఱియొకస్త్రీనిఁ జేపట్టలేదని భావము. "రేజే" రాజృ-దీప్తౌధాతువునకు ఆత్మనేపదిలిట్ ప్ర.పు.ఏ. అలంకారము: ఉత్ప్రేక్ష.

శ్లో. సీతాం హిత్వా దశముఖరిపు ర్నోపయేమే యదన్యాం
తస్యా ఏవ ప్రతికృతిసఖో యత్క్రతూ నాజహార,
వృత్తాంతేన శ్రవణవిషయప్రాపిణా తేన భర్తుః
సా దుర్వారం కథమపి పరిత్యాగదుఃఖం విషేహే. 87

వ్యాఖ్య : దశముఖరిపుః-రాముఁడు, సీతాం, హిత్వా-సీతనువిడిచి, అన్యాం-మఱియొకస్త్రీని, నోపయేమే (న+ఉపయేమే) ఇతియత్-వివాహముచేసి

కానలేదనునది యేటికలదో, (కించ-మఱియు) తస్యాః ఏవ-ఆసీతయొక్కయే, ప్రతికృతిసఖః సన్-బంగారు ప్రతిమతోఁ గూడినవాఁడగుచు, క్రతూన్-యజ్ఞములను, ఆజహార ఇతియత్-స్వీకరించెననునది యేటిగలదో, తేన-అట్టి, శ్రవణవిషయప్రాపిణా-చెవిని సోకినట్టి (వినవచ్చినట్టి), భర్తుః, వృత్తాంతేన-భర్తకుసంబంధించిన వార్తచేత, సా-ఆసీత, దుర్వారం-తొలఁగించుటకు సాధ్యపడని, పరిత్యాగదుఃఖం-తననువిడుచుటచేతఁ గలుగుచున్న దుఃఖమును, కథమపి-ఎట్లో (అతికష్టముతో), విషేహే-సహించెను. రాముఁడు తనను విడిచిన పిమ్మట మఱియొకస్త్రీని వివాహమాడలేదనియు, తనరూపముతోనే సువర్ణప్రతిమను నిర్మించి, దానితో భార్యావంతుఁడై యజ్ఞములు చేయుచున్నాఁడనియు, వార్తలు వచ్చుచుండుటచేత భర్తయందు భక్తిగలిగిన సీత దుర్వారమైన పరిత్యాగదుఃఖము నెట్లో భరించుచుండెనని భావము. "ఉపయేమే" "యమ-ఉపరమే" అనుధాతువు పరస్మైపదియైనను ఉపఅనునుపసర్గతోఁగూడి వివాహార్థకమగును. అప్పుడు "ఉపాద్యమః స్వకరణే" అనుసూత్రమువలన ఆత్మనేపదిగామారును. కాఁగా నిది యమధాతువునకాత్మనేపద లిట్ ప్ర. పు. ఏ. "విషేహే" "వి" పూర్వక షహ-మర్షణే ధాతువునకు ఆత్మనేపది లిట్ ప్ర. ఏ.

ఇది మహాకవి కాళిదాసకృత రఘువంశకావ్యమునందలి
సీతాపరిత్యాగమను చతుర్దశ సర్గమునకు
కేశవపంతుల నరసింహశాస్త్రి రచిత
తెలుఁగు లఘువ్యాఖ్య.

## మహాకవి కాళిదాస కృత

# రఘువంశము

## పంచదశసర్గము

శ్లో. కృతసీతా పరిత్యాగః స రత్నాకర మేఖలామ్,
బుభుజే పృథివీపాలః పృథివీ మేవ కేవలామ్. 1

వ్యాఖ్య : కృతసీతాపరిత్యాగః - చేయఁబడిన సీతాపరిత్యాగముగల, సః పృథివీపాలః-భూపరిపాలకుఁడైన యారాముఁడు, రత్నాకరమేఖలాం-సముద్రము మొలనూలుగాఁ గలదియు, కేవలాం-ఒక్కతెయేయైన, పృథివీం, ఏవ-భూమిని మాత్రమే, బుభుజే-అనుభవించెను. సీతను విడిచినరాముఁడు నిర్వేదమును జెందక పృథివీపాలనముఁజేసె ననుభావమును "రత్నాకరమేఖలాం" అను పృథివీవిశేషణము తెల్పుచున్నది. "కేవలాం" అనువిశేషణము రాముఁడు మరియొకస్త్రీని వివాహమాడ లేదనియు, ఏకపత్నీవ్రతస్థుఁడై యుండె ననియుఁ దెల్పుచున్నది. "సఃపృథివీం బుభుజే" అన్నది వాక్యము. ఇతరములు వాక్యస్థపదములకు సంబంధపడునవి. ఇది "సకర్మకకర్తరిప్రయోగము." బుభుజే-"భుజ-పాలనాభ్యవహారయోః" అను ధాతువునకు లిట్ ప్ర.పు. ఏకవచనము.

శ్లో. లవణేన విలుప్తేజ్యా స్తామిస్రేణ త మభ్యయుః,
మునయో యమునాభాజః శరణ్యం శరణార్థినః. 2

వ్యాఖ్య : లవణేన-లవణుఁడనుపేరుగల, తామిస్రేణ - రాత్రించరునిచేత, విలుప్తేజ్యాః-లోపించినయాగక్రియలుగలవారై, శరణార్థినః-రక్షణమునుగోరుచున్న, యమునాభాజః-యమునాతీరవాసులగు, మునయః-ఋషులు, శరణ్యం-రక్షణసమర్థుఁడగు, తం-ఆరాముని, అభ్యయుః-చేరిరి. తమయజ్ఞకర్మలను లవణాసురుఁడు ధ్వంసముచేయుచుండగా యమునాతీరవాసులైన మునులు రక్షణమును గోరువారై

శ్రీరామునివద్దికి వచ్చిరనిభావము. తమ్ప్రాయాం చరతీతి తామి సః అనివిగ్రహము ఇచ్చుట "యమునా"శబ్దమునకు లక్షణావృత్తిచేత "యమునాతీర" మని యర్థము. "మునయః తం అభ్యయుః" సకర్మకకర్తరిప్రయోగము "అభ్యయుః" (అభి+అయుః) యా-ప్రాపణే. లఙ్ ప్ర.పు.బహు. అయాత్, అయాతాం, అయుః. అని రూపములు శరణేసాధుః శరణ్యః అనివ్యుత్పత్తి.

శ్లో. అవేక్ష్య రామం తే తస్మిన్న ప్రజహ్రుః స్వతేజసా,
త్రాణాభావే హి శాపాస్త్రాః కుర్వంతి తపసో వ్యయమ్. 3

వ్యాఖ్య : తే-ఆ మునులు, రామం-రక్షకుఁడగు రాముని, అవేక్ష్య-చూచుకొని, తస్మిన్-ఆలవణాసురునియందు, స్వతేజసా-శాపరూపమైన తమ తపస్సుచేత నప్రజహ్రుః-విక్రమింపక యుండిరి. హి-అదియుక్తమే. త్రాణాభావే-రక్షకుడు లేనియప్పుడే, శాపాస్త్రాః-శాపమే ఆయుధముగాఁ గలమునులు, తపసః-తపస్సుయొక్క, వ్యయం-వ్యయమును, కుర్వంతి-చేయుచుందురు. శాపమునిచ్చుట వలన తపస్సు వ్యయమగును గావున ఆ మునులు లవణాసురుని శాపదగ్ధునిఁ జేయక, రక్షకుఁడైయున్న రాముని లవణబాధను దొలఁగింపుమని వేడిరని భావము. "ప్రజహ్రుః" (ప్ర+జహ్రుః) "ప్ర" అను ఉపసర్గతోఁగూడిన "హృ"ధాతువునకు లిట్ ప్ర పు బ జహార, జహ్రతుః జహ్రుః. ఇది "ప్ర" అనుపసర్గతోఁ జేరినప్పుడు కొట్టుట అను నర్థము నిచ్చును.

శ్లో. ప్రతిశుశ్రావ కాకుత్స్థ స్తేభ్యో విఘ్నప్రతిక్రియామ్,
ధర్మసంరక్షణార్థైవ ప్రవృత్తి ర్భువి శార్ఙ్గిణః. 4

వ్యాఖ్య : కాకుత్స్థః-రాముఁడు తేభ్యః-ఆ మునుల కొఱకు, విఘ్నప్రతిక్రియాం-లవణవధరూపమైన విఘ్నప్రతీకారమును, ప్రతిశుశ్రావ-తప్పక చేయుదునని మాటయిచ్చెను. భువి-లోకమునందు, శార్ఙ్గిణః-ధనుర్ధరుఁడగు క్షత్రియుని యొక్క (విష్ణువుయొక్క), ప్రవృత్తిః-ప్రవర్తనము (రాముఁడుగా నవతరించుట), ధర్మ సంరక్షణార్థా, ఏవ-ధర్మమును గాపాడుటకొఱకేకదా! రాజధర్మము. ధర్మమును గాపాడుటయు, విష్ణువు రామావతారమును స్వీకరించుటయు నందులకేగావున రాముఁడు తప్పక లవణాసురునిఁజంపి మీయజ్ఞములకు విఘ్నములు గలుగనీయనని ప్రతిజ్ఞ చేసెను. "ప్రతిశుశ్రావ" ప్రతియను నుపసర్గతోఁ జేరినప్పుడు "శ్రు-

శ్రవణే" అనుధాతువునకు ప్రతిజ్ఞ అర్థము. ఇది లిట్ ప్ర.పు.ఏ. "కాకుత్స్థః విఘ్న ప్రతిక్రియాం ప్రతిశుశ్రావ" సకర్మక కర్తరి ప్రయోగము. కకుత్స్థస్య గోత్రాపత్యం పుమాన్ కాకుత్స్థః అని విగ్రహము.

శ్లో. తే రామాయ వధోపాయ మాచఖ్యు ర్విబుధద్విషః,
దుర్జయో లవణశ్శూలీ విశూలః ప్రార్థ్యతా మితి. 5

వ్యాఖ్య : తే-మునులు, రామాయ-రామునికి, విబుధద్విషః-దేవద్వేషియైన లవణునియొక్క, వధోపాయం-చంపుటుపాయమును, ఆచఖ్యుః-చెప్పిరి (ఎట్లనగా) లవణః-లవణాసురుఁడు, శూలీ-శూలమును ధరించినవాఁడయినప్పుడు, దుర్జయః-జయించుటకు సాధ్యపడడు; విశూలః-శూలరహితుఁడైనప్పుడు, ప్రార్థ్యతాం-ఎదుర్కొనఁబడునుగాక, ఇతి-ఇట్లని (చెప్పిరి) శూలధారియైన లవణుఁ డజయ్యుఁడనియు శూలధారి కానప్పుడే యతని నెదుర్కొను మనియు మునులు రామునికి లవణవధోపాయమును జెప్పిరి "తే వధోపాయం ఆచఖ్యుః" సకర్మక కర్తరి ప్రయోగము. "ఆచఖ్యుః" ఆఙ్ పూర్వక 'ఖ్యా-ప్రకథనే' ధాతువునకు లిట్ ప్ర.బ. "ప్రార్థ్యతామ్" యాచ్ఞాయా మభియానేచ ప్రార్థనా కథ్యతేబుధైః అను కేశవనిఘంటువు వలన అభియానము (ఎదుర్కొనుట) అను నర్థమునఁ బ్రయోగింపఁబడినది.

శ్లో. ఆదిదేశాథ శత్రుఘ్నం తేషాం క్షేమాయ రాఘవః,
కరిష్యన్నివ నామాస్య యథార్థ మరినిగ్రహాత్. 6

వ్యాఖ్య : అథ-తరువాత, తేషాం-ఆ మునులకు, క్షేమాయ-క్షేమమును కలిగించుటకొఱకు, రాఘవః-రాముఁడు, శత్రుఘ్నం-శత్రుఘ్నుని, అస్య-అతని యొక్క, నామ-పేరును, అరినిగ్రహాత్-శత్రుహనన కారణమువలన, యథార్థం-సార్థకమైన దానినిగా, కరిష్యన్, ఇవ-చేయఁబోవువాడువలె, ఆదిదేశ-ఆజ్ఞాపించెను. శత్రూన్ హంతి ఇతి శత్రుఘ్నః అను వ్యుత్పత్తిగల యతనిపేరును సార్థకము చేయఁదలచుచున్నవాఁడువలె రాముఁడు మునుల క్షేమము కొఱకై వెళ్ళుమని శత్రుఘ్నుని యాజ్ఞాపించె నని భావము. "ఆదిదేశ" ఆఙ్ పూర్వక "దిశ-అతిసర్జనే" ధాతువునకు లిట్ ప్ర పు.ఏ. అలంకారము : ఉత్ప్రేక్ష.

శ్లో. యః కశ్చన రఘూణాంహి పరమేకః పరంతపః,
అపవాద ఇవోత్సర్గం వ్యావర్తయితు మీశ్వరః.

వ్యాఖ్య : హి-ఎందువలననన(గా పరంతపః-శత్రువులను బాధింప(గల వా(డైన, రఘూణాం-రఘువంశీయులలో, యఃకశ్చన-ఎవ(డో ఒక(డగు, ఏకః-ఒకపురుషు(డే, అపవాదః-విశేషశాస్త్రము, ఉత్సర్గం-సామాన్యశాస్త్రమును, ఇవ-వలె పరం-శత్రువును, వ్యావర్తయితుం-బాధించుటకు (మరల్చుటకు), ఈశ్వరః-సమర్థుడు. అందువలన శత్రుఘ్నుని నాజ్ఞాపించెనని పూర్వశ్లోకముతో సమన్వయము. వ్యాకరణాది శాస్త్రములందలి సూత్రములలో( గొన్ని సామాన్య శాస్త్రములనియు (ఉత్సర్గములు), కొన్ని విశేషశాస్త్రములనియు (అపవాదములు) నుండును. ప్రస్తుతమున లవణు(డు శత్రుసామాన్యములోనివా(డు కావున ఉత్సర్గము రఘువంశీయులగు రామ లక్ష్మణ భరత శత్రుఘ్నులలో నేయొక్కడైనను విశేషశాస్త్రమువలె (అపవాదము) అతనిని జయింప( గల(డు కావున రాము(డు శత్రుఘ్నుని( బంపెనని భావము. "గిరీశః" (గిరి + ఈశః) అనుచోట "ఇకోయణచి" అనుసూత్రము చేత వచ్చు యణాదేశమును ఉత్సర్గముచేసి, "అకస్సవర్ణేదీర్ఘః" అనుసూత్రము అపవాదశాస్త్రమై సవర్ణదీర్ఘము వచ్చునట్లు చేయుట ఉత్సర్గాపవాద సంబంధమని యెరుగవలయును.

శ్లో. అగ్రజేన ప్రయుక్తాశీ స్తతో దాశరథీ రథీ,

యయౌ వనస్థలీః పశ్యన్ పుష్పితాః సురభీ రభీః. 8

వ్యాఖ్య : తతః-పిమ్మట, అగ్రజేన-అన్నగారిచేత, ప్రయుక్తాశీః-చేయ(బడిన యాశీర్వాదముగలవా(డై, రథీ-రథమునధిష్ఠించినవా(డై, అభీః-భయరహితు(డై, దాశరథిః-దశరథుని కుమారు(డగు శత్రుఘ్ను(డు, పుష్పితాః-పువ్వులు గలవియు, సురభీః-పరిమళవంతములునగు, వనస్థలీః-వనప్రదేశములను, పశ్యన్-చూచుచు, యయౌ-వెళ్ళెను. రామునిచేత నాశీర్వాదముపొంది, రథమునెక్కి నిర్భీకు(డై, పుష్పితవనములను జూచుచు శత్రుఘ్ను(డు లవణాసురవధకై సంతోషముగా వెళ్ళెను. ఆత్మశౌర్యము, అన్నగారి యాశీర్వాదము నిర్భయానందములకు( గారణములు. "దాశరథిః యయౌ" అకర్మక కర్తరి ప్రయోగము. "యయౌ" యా-ప్రాపణే ధాతువునకు లిట్ ప్ర.పు.ఏ. "దాశరథీరథీ, సురభీరభీః" అనుచోట్ల చేకాను ప్రాసమన(బడు శబ్దాలంకారము.

శ్లో. రామాదేశా దనుగతా సేనా తస్యార్థసిద్ధయే,

పశ్చా దధ్యయనార్థస్య ధాతో రథి రివాభవత్. 9

వ్యాఖ్య : రామాదేశాత్-రాముని ఆజ్ఞవలన, అనుగతా-వెంటవచ్చిన, సేవా-సైన్యము, తస్య-ఆశత్రుఘ్నునికి,అధ్యయ నార్థస్య-చదువుటఅర్థముగానున్న,ధాతోః-"ఇఙ్ అధ్యయనే" అను ధాతువునకు, పశ్చాత్-వెనుక ప్రక్కన, అధిః, ఇవ-'అధి' యను నుపసర్గవలె, అర్థసిద్ధయే-ప్రయోజనసాధనము కొఱకు (ఉపసర్గపక్షమున అర్థమును జెప్పుట కొఱకు), అభవత్-అయ్యెను. "ఇఙికా వధ్యుపసర్గం నవ్యభిచరతః" అను వైయాకరణన్యాయానుసారముగా 'అధి' యను నుపసర్గము, స్వయముగానే అర్థసాధకమగు "ఇఙ్" ధాతువునకు సంనిధిమాత్రముచేత నుపయోగించునట్లు, సైన్యము శత్రుఘ్నునికి లవణవధయందు నామమాత్రముగా నుండెనని భావము. అర్థశబ్దమునకు అభిధేయము, ధనము, వస్తువు, ప్రయోజనము, నివృత్తి అ మలని యమరము "ఇఙ్-అధ్యయనే" నిత్యమధిపూర్వః అనిశాసనము. దీనికి క ర్తరూపము: "అధీతే" అనియు, కర్మరూపము "అధీయతే" అనియు నుండును. [illegible] రణార్థమున "అధ్యాపయతి" యనియు, కృదంతములు అధ్యేతుం, అధీతం, అధ్యయనం, అధీయానః ఇత్యాదిగాను నుండును.

శ్లో. ఆదిష్టవర్త్మా మునిభిః స గచ్ఛం స్తపతాం వరః,
విరరాజ రథప్రష్ఠై ర్వాలఖిల్యై రివాంశుమాన్. 10

వ్యాఖ్య : రథప్రష్ఠైః-రథముముందు నడచుచున్న, మునిభిః-శరణమువేడిన మునులచేత, ఆదిష్టవర్త్మా-చూపఁబడిన మార్గముగలవాఁడె, గచ్ఛన్-వెళ్ళుచున్న, తపతాం, వరః-దేదీప్యమానులలో శ్రేష్ఠుఁడగు, సః-ఆశత్రుఘ్నుఁడు, వాలఖిల్యైః-వాలఖిల్యులను పేరుగల మునులచేత, అంశుమాన్, ఇవ-సూర్యుడువలె, విరరాజ-మిక్కిలి ప్రకాశించెను. శరణాగతులైన యమునాతీరవాసి మునిజనులు తనరథము ముందు నడచుచు దారిని చూపఁగా వెళ్ళుచున్న శత్రుఘ్నుఁడు, సూర్యరథము ముందు నడచు వాలఖిల్యాదిమునులతో నేగు సూర్యభగవానునివలె, దేదీప్యమానుఁడై ప్రకాశించెనని భావము. సూర్యరథమునకుముందు వాలఖిల్యులు నడతురని పురాణ ప్రసిద్ధము. "సః విరరాజు" అకర్మక, కర్తరి ప్రయోగము. 'విరరాజ' వి ఉపసర్గతో గూడిన "రాజృ-దీప్తౌ" ధాతువునకు లిట్ ప్ర పు.ఏ. "ప్రష్ఠోఽగ్రగామిని" అని నిపాతము.

శ్లో. తస్య మార్గవశా దేకా బభూవ వసతి ర్యతః,
రథస్వనోత్కంఠమృగే వాల్మీకీయే తపోవనే. 11

వ్యాఖ్య : యతః-వెళ్ళుచున్న, తస్య-ఆశ్రుతుఘ్నునికి, మార్గవశాత్-మార్గవశమువలన, రథస్వనోత్కంఠమృగే—రథస్వన-రథధ్వనిని వినుటయందు, ఉత్కంఠ-ఎత్తబడిన మెడలుగల, మృగే-లేళ్ళుగలదియు, వాల్మీకీయే-వాల్మీకి మునికి సంబంధించినదియునగు, తపోవనే-తపోవనమునందు, ఏకా, వసతిః-ఒక రాత్రి, బభూవ-నివాసముగా నయ్యెను. అట్లు వెళ్ళుచున్న శత్రుఘ్నుడు మార్గవశమున వాల్మీకి తపోవనమునం దొక రాత్రి నివసించుట జరిగెను. "యతః" ఇణ్-గతౌధాతువునకు వర్తమానార్థకమగు శతృప్రత్యయాంతము "యన్" అను శబ్దమునకు షష్ఠీవిభక్తి యేకవచనము. "వసతీరాత్రివేశ్మనోః" అను నమరము వలన నిచ్చటి వసతి శబ్దమునకు రాత్రి యని యర్థము.

శ్లో. త మృషిః పూజయామాస కుమారం క్లాంతవాహనమ్,
తపఃప్రభావసిద్ధాభి ర్విశేష ప్రతిపత్తిభిః. 12

వ్యాఖ్య : క్లాంతవాహనం-అలసిన గుఱ్ఱములుగల, తం, కుమారం-ఆ శత్రుఘ్నుని, ఋషిః-వాల్మీకి, తపఃప్రభావసిద్ధాభిః-తన తపశ్శక్తిచేత సృజింపబడిన, విశేషప్రతిపత్తిభిః-ఉత్కృష్ట గౌరవమునకు దగిన వస్తువులచేత, పూజయామాస-సత్కరించెను. తన మానసిక సృష్టిచేత రాజభోగమునకుదగిన యాహారపానీయ వస్త్రాదులను కల్పించి వాల్మీకి శత్రుఘ్నుని సత్కరించెనని భావము. "ఋషిః కుమారం పూజయామాస" సకర్మక కర్తరి ప్రయోగము. "పూజయామాస" పూజ-పూజాయాం ధాతువు లిట్.

శ్లో. తస్యా మేవాస్య యామిన్యా మంతర్వత్నీ ప్రజావతీ,
సుతా వసూత సంపన్నౌ కోశదండా వివ క్షితిః. 13

వ్యాఖ్య : తస్యాం, ఏవ, యామిన్యాం-ఆరాత్రియందే, అంతర్వత్నీ-గర్భిణియై యుండిన, అస్య, ప్రజావతీ-శత్రుఘ్నుని వదినెయైనసీత, క్షితిః-భూమి సంపన్నౌ-సమగ్రములగు, కోశదండౌ, ఇవ-భాండాగార రాజశాసనములను వలె, సుతౌ-ఇద్దఱు కుమారులను, అసూత-కనెను. శత్రుఘ్నుడు వాల్మీక్యాశ్రమమున నివసించిన రాత్రియందే సీత యిద్దఱు కుమారులను ప్రసవించెను. భూమి రాజ్యమునకు ప్రసాదించు కోశదండములవలె నాకుమారులు పుట్టిరనియు, రాజ్యమునకు కోశదండములు ముఖ్యములైనట్లు వారు రఘువంశమునకు ముఖ్యులనియు

భావము. "ప్రజావతీ సుతౌ అసూత" సకర్మక కర్తరి ప్రయోగము, "అసూత" షూఙ్-ప్రాణిగర్భవిమోచనే అను ఆత్మనేపది ధాతువునకు లఙ్ ప్ర.పు.ఏ. "ప్రజావతీ భ్రాతృజాయా" అని యమరము.

శ్లో. సంతానశ్రవణాత్ భ్రాతుః సౌమిత్రిః సౌమనస్యవాన్,
ప్రాంజలి ర్మునిమామంత్ర్య ప్రాత ర్యుక్తరథో
యయౌ. 14

వ్యాఖ్య : భ్రాతుః-జ్యేష్ఠుఁడగు రామునియొక్క, సంతానశ్రవణాత్-సంతానోత్పత్తిని విన్నకారణమువలన, సౌమనస్యవాన్-సంతోషమును బొందిన మనస్సుగలవాఁడగు, సౌమిత్రిః-సుమిత్రానందనుఁడగు శత్రుఘ్నుఁడు ప్రాతః-మరుసటి ప్రాతఃకాలమున,యుక్తరథః-సిద్ధపరుపఁబడిన రథముగలవాఁడగుచు, ప్రాంజలిః-చేతులు జోడించినవాఁడై, మునిం-వాల్మీకిని, ఆమంత్ర్య-ఆ మంత్రణముచేసి (మునికి వెళ్ళివచ్చెదనని చెప్పి), యయౌ-వెళ్ళిపోయెను. రాముఁడు సంతానవంతుఁడైనట్లు విని, సంతోషభరితమగు మనస్సుతో నారాత్రి యచ్చటనుండి, మరునాటి యుదయమున వాల్మీకికి నమస్కరించి సెలవు తీసికొని వెళ్ళిపోయెను. "సౌమిత్రిః యయౌ" అకర్మక కర్తరి ప్రయోగము.

శ్లో. స చ ప్రాప మధూపఘ్నం కుంభీనస్యాశ్చ కుక్షిజః,
వనాత్ కర మివాదాయ సత్త్వరాశి ముపస్థితః. 15

వ్యాఖ్య : సః, చ-శత్రుఘ్నుఁడును, మధూపఘ్నం-మధూపఘ్నమను పేరుగల లవణపురమును, ప్రాప-చేరెను. కుంభీనస్యాః-రావణుని చెల్లెలగు కుంభీనసియొక్క కుక్షిజః, చ-కడుపునఁబుట్టిన లవణాసురుఁడును, వనాత్-అరణ్యమునుండి, కరం, ఇవ-పన్నునువలె, సత్త్వరాశిం-జంతువులరాసిని, ఆదాయ-తీసికొని, ఉపస్థితః-చేరెను. శత్రుఘ్నుఁడు లవణపురమును జేరిన సమయముననే లవణుఁడు తమ యాహారముకొఱకు మృగరాశిని వనమునుండి తోలుకొని యెదురుపడెను. "కుంభీనసీ కుక్షిజ" శబ్దములు పూర్వవైరమును, లవణుని నిరర్థక జన్మను సూచించుచున్నవి. ప్రాప (ప్ర+ఆప). "సః మధూపఘ్నం ప్రాప" సకర్మక కర్తరి ప్రయోగము. ఆవనము వాని రాజ్యమని "కర" శబ్దము సూచించును.

శ్లో. ధూమధూమ్రో వసాగంధీ జ్వాలా బభ్రుశిరోరుహః,
క్రవ్యాద్గణపరీవార శ్చితాగ్ని రివ జంగమః. 16

వ్యాఖ్య : ధూమధూమ్రః-పొగవలె నలుపు ఎఱుపు గలిసిన వర్ణముగల వాఁడును, వసాగంధీ-హృదయ మేదో గంధము గలవాఁడును, జ్వాలాబభ్రుశిరోరుహః—జ్వాలా-మంటలవలె, బభ్రు-పసుపు నెఱుపురంగుగల, శిరోరుహః-కేశములుగలవాఁడును, క్రవ్యాద్గణపరీవారః — క్రవ్యాత్-మాంసభక్షకులగు రాక్షసులయొక్క, గణ-గుంపులే, పరీవారః-తనను సేవించు పరివారముగాఁ గల వాఁడును, జంగమః-నడచుచున్న, చితాగ్నిః, ఇవ-శ్మశానాగ్నివలె, లవణుఁడు, శత్రుఘ్నునికిఁ గనిపించెను. (శ్మశానాగ్ని పక్షమున ధూమములచేత ధూమ్రమవఁ డనియు, జ్వాలలే శిరోజములనియు, క్రవ్యాదులనఁగా గ్రద్దలు మొదలగు పక్షులనియు నర్థము). భావము స్పష్టము. క్రవ్యం-మాంసం అదంతీతి క్రవ్యాదః అని వ్యుత్పత్తి. "హృన్మేదస్తు వపా వసా" అను నమరమువలన మేధస్సు అనఁగా గుండె నుండి కారు ద్రవము. దానిని వంటినిండఁ బూసికొన్నవాఁడని యర్థము.

శ్లో. అపశూలం త మాసాద్య లవణం లక్ష్మణానుజః,
రురోధ సంముఖీనో హి జయో రంధ్రప్రహారిణామ్. 17

వ్యాఖ్య : లక్ష్మణానుజః-శత్రుఘ్నుఁడు, అపశూలం-శూలరహితుఁడగు, తం, లవణం- ఆ లవణాసురుని, ఆసాద్య-చేరి, రురోధ-అడ్డగించెను, రంధ్రప్రహారిణాం-ఎదటివాని లోపమును గుర్తించికొ స్వభావముగలవారికి, జయః-విజయము, సంముఖీనః, హి-ఎదురుగాఁగనఁబడును దిగదా! మునులు లవణాసురుఁడు శూలహస్తుఁడు కానియప్పుడే జయింపఁబడు చెప్పియుండుటచేత శత్రుఘ్నుఁడు శూలరహితుఁడై యున్న లవణునిఁగని యెదురుగానేగి యడ్డగించెనని భావము. శత్రువు రంధ్రము (లోపము) తనకు విజయసాధనమగుట లోకప్రసిద్ధము. ఇచ్చట లవణుని యపశూలతయే రంధ్రము. "లక్ష్మణానుజః లవణం రురోధ" సకర్మక కర్తరి ప్రయోగము. "రురోధ" రుధిర్-ఆవరణే ధాతువునకు పరస్మైపది లిట్.ప్ర.పు.ఏ. అలంకారము : అర్థాంతరన్యాసము. "సంముఖీనః" సర్వస్య ముఖస్య దర్శనః అను విగ్రహముగల యీ శబ్దము "యథాముఖేత్యాది సూత్రవిహిత "ఖ" ప్రత్యయాంతము స్పష్టముగాఁగనఁబడునది యని యర్థము.

యుగ్మమ్

శ్లో. నాతిపర్యాప్త మాలక్ష్య మత్కుక్షేః రద్య భోజనమ్,
దిష్ట్యా త్వ మసి మే ధాత్రా భీతేనే వోపపాదితః. 18
ఇతి సంతర్జ్య శత్రుఘ్నం రాక్షస స్తజ్జిఘాంసయా
ప్రాంశు ముత్పాటయామాస ముస్తా స్తంబ మివ ద్రుమమ్ 19

వ్యాఖ్య : రాక్షసః-లవణుఁడు, అద్య- ఈరోజున, మత్కుక్షేః-నా కడుపునకు, భోజనం-మృగాదిభోజ్యపదార్థమును, నాతిపర్యాప్తం-బాగుగా చాలనిదానినిగా, ఆలక్ష్య చూచి, భీతేన, ఇవ-భయపడినవాఁడగు ధాత్రా-బ్రహ్మదేవునిచేత, దిష్ట్యా-అదృష్టవశమున, మే-నాకొఱకు, త్వం, ఉపపాదితః, అసి-నీవు కల్పింపబడ్డ వాఁడ వగుచున్నావు, ఇతి-ఇట్టిమాటలచేత, శత్రుఘ్నం-శత్రుఘ్నుని, సంతర్జ్య-బెదిరించి, తజ్జిఘాంసయా-అతనినిఁ జంపుకోరికచేత, ప్రాంశుం-ఉన్నతమైన, ద్రుమం చెట్టును, ముస్తా స్తంబ మివ-తుంగగడ్డిపఱకనువలె, ఉత్పాటయామాస-కిఁబెకలించుకొనెను. లవణాసురుఁడు ఓయీ! "యీనాడు నా కుక్షికి మృగాది జ్యపదార్థము చాలదనియు, నా కడుపునిండకున్నచో నేనేమి చేయుదునో! యని భయపడియు బ్రహ్మ నాకొఱకు నిన్ను కల్పించినాడు" అని శత్రుఘ్నుని బెదిరించుచు నొకమహావృక్షమును గడ్డిపఱకనువలె సులభముగాఁబెకలించుకొని యతనిని జంపుట కుద్యుక్తుఁడయ్యె నని భావము.

శ్లో. సౌమిత్రే ర్నిశితై ర్బాణై రంతరా శకలీకృతః,
గాత్రం పుష్పరజః ప్రాప న శాఖీ నైరృతేరితః. 20

వ్యాఖ్య : నైరృతేరితః-రాక్షసునిచే విసిరివేయఁబడిన, శాఖీ-వృక్షము, అంతరా-నడుమనే, నిశితైః-తీక్ష్ణములైన, బాణైః-శరములచేత, శకలీకృతః-చిన్న ముక్కలుగాఁజేయఁబడినదగుచు, సౌమిత్రేః-శత్రుఘ్నునియొక్క, గాత్రం-శరీరమును, నప్రాప-చేరలేదు (కాని), పుష్పరజః-పుప్పొడి. ప్రాప-చేరెను. లవణాసురుఁడు విసరివేసిన మహావృక్షము శత్రుఘ్నుఁడు ప్రయోగించిన బాణములచేత దారిలోనే చూర్ణమై యతని శరీరమును జేరలేకపోయెను గాని ఆ వృక్షపుష్పముల లోని రజముమాత్రము శత్రుఘ్నుని శరీరమును గప్పెను. 'శాఖీ గాత్రం నప్రాప' "పుష్పరజః గాత్రం ప్రాప" అన్నవి సకర్మక వాక్యములు. అది శత్రుఘ్నునికి విజయసూచకమని భావము.

శ్లో. వినాశా త్తస్య వృక్షస్య రక్ష స్తస్మై మహోపలమ్,
ప్రజిఘాయ కృతాంతస్య ముష్టిం పృథ గివ స్థితమ్. 21

వ్యాఖ్య : రక్షః-లవణాసురుఁడు, తస్య, వృక్షస్య-ఆవృక్షముయొక్క, వినాశాత్-నశించిన కారణమువలన, మహోపలం-పెద్దపాషాణమును, పృథక్, స్థితం-విడిగానుండిన, కృతాంతస్య-యమునియొక్క, ముష్టిం, ఇవ-పిడికిలికివలె, తస్మై-శత్రుఘ్నునికొఱకు, ప్రజిఘాయ-విసిరివేసెను. లవణాసురుఁడు తానువేసిన మహావృక్షము శత్రుఘ్నుని బాణములచేత చూర్ణమైపోగా ఒక పెద్దగుండును, యమునిదేహమునకు దూరముగానున్న యమముష్టినివలె శత్రుఘ్నునిపై విసరెనని భావము.

శ్లో. ఐంద్ర మస్త్ర ముపాదాయ శత్రుఘ్నేన స తాడితః,
సికతాత్వా దపి పరాం ప్రపేదే పరమాణుతామ్. 22

వ్యాఖ్య : సః-ఆ మహోపలము, శత్రుఘ్నేన-శత్రుఘ్నునిచేత, ఐంద్రం-ఇంద్రదేవతాకమగు, అస్త్రం-బాణమును, ఉపాదాయ-తీసికొని, తాడితఃసన్-కొట్టఁబడినదగుచు, సికతాత్వాత్, అపి-సికతాభావముకంటెను (ఇసుకగా మారుట కంటెను), పరాం-ఎక్కువదియగు, పరమాణుతాం-పరమాణువుగా మారుటను, ప్రపేదే-పొందెను. లవణుఁడు విసరినగుండు ఇంద్రదేవతాకమగు అస్త్రమును దీసికొని శత్రుఘ్నునిచేతఁ గొట్టబడినదై యిసుకరేణువులకంటెను చిన్నవియగు పరమాణువులుగా చూర్ణమైపోయెనని భావము. పర్వతపాషాణాదులను భేదించువాడింద్రుఁడు గావున నిచ్చట మహాపాషాణమును జూర్ణము చేయుటకు ఇంద్రదేవతాకమగు నస్త్రముపయోగింపఁబడినది. "యతః అణు ర్నాస్తి స పరమాణుః (దేనికంటెను చిన్నదియగు అణవులేదో అది పరమాణువు) అని పరమాణుశబ్దార్థము. "సః పరమాణుతాం ప్రపేదే" సకర్మక కర్తరిప్రయోముగ. ప్రపూర్వక పద-గతౌ ధాతువునకు లిట్ ప్ర. పు. ఏ.

శ్లో. త ముపాద్రవ దుద్యమ్య దక్షిణం దో ర్నిశాచరః,
ఏకతాల ఇవోత్పాతపవనప్రేరితో గిరిః. 23

**వ్యాఖ్య :** నిశాచరః-లవణాసురుఁడు, దక్షిణం, దోః-కుడిభుజమును, ఉద్యమ్య-పైకెత్తి, ఏకతాలః-ఒకేతాటిచెట్టుగలదియు, ఉత్పాతపవనప్రేరితః-ఉత్పాత-భూకంపాద్యుపద్రవ సమయమునందలి, పవన-వాయువుచేత, ప్రేరితః-త్రోయబడిన, గిరిః ఇవ-పర్వతమువలె, తం-ఆశత్రుఘ్నుని-ఉపాద్రవత్-ఎదుర్కొనెను. తాను విసరినగుండు చూర్ణమైపోగా క్రుద్ధుఁడైన లవణాసురుఁడు దక్షిణ బాహువును పైకెత్తుకొని, ఒకేతాటి చెట్టుగల పర్వతము ప్రళయకాల వాయువుచే నెగురఁగొట్టబడి వచ్చునట్లు; శత్రుఘ్నునిపైకుఱికె నని భావము: కవిప్రయోగము లందును, నిఘంటువులయందును "దోశ్శబ్దము" పులింగముగా (ప్రవేష్టోదోః, దోషంతస్య అనురీతిగా), నున్నను ఇచ్చట నపుంసకలింగముగాఁ బ్రయోగింపఁబడుటకు "కకుద్దోషణీ" యను వ్యాకరణమహాభాష్యకారుని (పతంజలి) ప్రయోగము కారణమని యెఱుగవలెను "ఉపాద్రవత్" (ఉప+అద్రవత్) ద్రు-గతౌ ధాతువునకు భూతార్థకమగు లఙ్. ప్ర పు. ఏ. "ఉప" ఉపసర్గము.

శ్లో. కార్ష్ణేన పత్రిణా శత్రుః స భిన్నహృదయః పతన్,
ఆనినాయ భువః కంపం జహా రాశ్రమవాసినామ్. 24

**వ్యాఖ్య :** సః, శత్రుః-ఆ లవణాసురుఁడు, కార్ష్ణేన-విష్ణుదేవతాకమగు, పత్రిణా-బాణముచేత, భిన్నహృదయః-చీల్పఁబడిన వక్షస్థలముగలవాఁడై, పతన్-పడుచు, భువః-భూమికి-కంపం-చలనమును, ఆనినాయ-కలిగించెను; ఆశ్రమవాసినాం-మునులయొక్క, కంపం-భయమును, జహార-తొలఁగించెను. శత్రుఘ్నుఁడువేసిన వైష్ణవబాణముచేత వక్షము చీలి నేలపైఁబడుచున్న లవణునివలన భూమి యతని దేహభారముచేతఁ గంపించెననియు మునులకు రాక్షసభయము తొలఁగిపోయెననియు భావము. కృష్ణస్యేదంకార్ష్ణం. ఇచ్చటికృష్ణ శబ్దమునకు "విష్ణుర్నారాయణః కృష్ణః" అను అమరమువలన విష్ణువనియు, వైష్ణవబాణమనఁగా నారాయణాస్త్ర మనియు నర్థములు 'ఆనినాయ' నీఞ్-ప్రాపణే ధాతువునకును, "జహార" హృఞ్-హరణే ధాతువునకును లిట్ ప్ర. పు. ఏకవచనములు.

శ్లో. వయసాం పంక్తయః పేతు ర్హతస్యోపరి విద్విషః,
తత్ప్రతిద్వంద్వినో మూర్ధ్ని దివ్యాః కుసుమవృష్టయః.

వ్యాఖ్య : హతస్య—చంపఁబడిన, విద్విషః—శత్రువగులవణునియొక్క, ఉపరి—మీద, వయసాం-పక్షులయొక్క, పంక్తయః-బారులు, పేతుః-పడెను; తత్ప్రతిద్వంద్వినః-వానితోయుద్ధముచేసిన శత్రుఘ్నునియొక్క, మూర్ధ్ని-శిరస్సునందు, దివ్యాః, కుసుమవృష్టయః-దేవతలు కురిపించిన పూలవానలు, పేతుః-పడినవి. చచ్చినేలపైఁబడిన లవణాసురునిమీద కాకులు గ్రద్దలు మొదలగు పక్షులు వ్రాలెననియు, విజయమును పొందిన శత్రుఘ్నుని తలపై దేవతలు పుష్పవృష్టినిఁ గురిపించిరనియు భావము. "పేతుః" పపాత, పేతతుః, పేతుః—పత్ల్-గతౌ ధాతువు లిట్. ప్ర. బ. "పేతుః" అను క్రియ పక్షులపంక్తులకును, కుసుమవృష్టికిని అవృత్తిని పొందుటచేత నిది దీపకాలంకారము (శబ్దావృత్తి దీపకము).

శ్లో. స హత్వా లవణం వీర స్తదా మేనే మహౌజసః,
భ్రాతుః సోదర్య మాత్మాన మింద్రజిద్వధశోభినః. 26

వ్యాఖ్య : సః, వీరః—వీరుఁడగు శత్రుఘ్నుఁడు, లవణం-లవణాసురుని, హత్వా—చంపి, తదా-అప్పుడు, ఆత్మానం-తనను, మహౌజసః-గొప్పపరాక్రమశాలియు, ఇంద్రజిద్వధశోభినః-ఇంద్రజిత్తు వధచేత ప్రకాశించువాఁడును నగు, భ్రాతుః-అన్నయగు లక్ష్మణునియొక్క, సోదర్యం-ఏకోదరుఁడగు తమ్మునిగా, మేనే-తలఁచుకొనెను. మహావీరుఁడు భయంకరుఁడు నగు లవణాసురునిఁ జంపి, అప్పుడు, శత్రుఘ్నుఁడు ఇంద్రజిత్తును వధించి కీర్తిమంతుఁడగు తనయన్న లక్ష్మణునికిఁ దగినసోదరుఁడనైతినని భావించి సంతసించెనని భావము. "సమానోదరే శయితః సోదర్యః" అని విగ్రహము. "మేనే" మను-అవబోధనే లిట్. ప్ర. పు. ఏ.

శ్లో. తస్య సంస్తూయమానస్య చరితార్థై స్తపస్విభిః,
శుశుభే విక్రమోదగ్రం వ్రీడయా వనతం శిరః. 27

వ్యాఖ్య : చరితార్థైః-కృతార్థులైన, తపస్విభిః-మునులచేత, సంస్తూయమానస్య-పొగడఁబడుచున్న, తస్య-ఆశత్రుఘ్నునియొక్క, విక్రమోదగ్రం-పరాక్రమముచేత ఉన్నత నదియు, వ్రీడయా-మునులపొగడ్తవలన గలిగిన సిగ్గుచేత, అవనతం-వంచఁబడి దియునగు, శిరః-శిరస్సు, శుశుభే-ప్రకాశించెను. లవణ

వధరూపమైన తమ కార్యము సిద్ధించిన పిమ్మట మునులు పొగడుచుండగా విజయము కలిగినందున నెత్తఁబడినదియు, సమక్షమున మునులు పొగడుచుండుట చేత సిగ్గున వంచఁబడినదియు నగు శత్రుఘ్నుని శిరస్సు మిక్కిలి ప్రకాశించెను. విజయము పొందినవానికి లజ్జయే భూషణమని భావము. "శుశుభే" శుభ-దీప్తౌ ఆత్మనేపది లిట్ ప్ర. పు. ఏ. "శిరఃశుశుభే" అకర్మక కర్తరి ప్రయోగము.

శ్లో. ఉపకూలం స కాలింద్యాః పురీం పౌరుషభూషణః,
నిర్మమే నిర్మమో ఽర్థేషు మధురాం మధురాకృతిః. 28

వ్యాఖ్య : పౌరుషభూషణః-పురుషప్రయత్నముభూషణముగాఁగలవాఁడును, అర్థేషు-భోగ్యవిషయములయందు,నిర్మమః-మమకారములేనివాఁడును,మధురాకృతిః-దర్శనీయరూపముగలవాఁడును నగు, సః-ఆశత్రుఘ్నుఁడు, కాలింద్యాః-యమునా నదియొక్క, ఉపకూలం-తీరమునందు, మధురాం, పురీం-మధురానామకనగరమును, నిర్మమే-నిర్మించెను. కార్యశూరుఁడును, విషయలోలుపుఁడుగాని వాఁడు నగు శత్రుఘ్నుఁడు, యమునాతీరమునందు మధుర యను పట్టణమును తన పౌరుషచిహ్నముగా నిర్మించెను. "నిర్మమే" నిర్ అను నుపసర్గతోఁగూడిన "మా-మానే" య౯ పరస్మైపది ధాతువునకు లిట్ ప్ర. పు. ఏ.

శ్లో. యా సౌరాజ్యప్రకాశాభి ర్బభౌ పౌరవిభూతిభిః,
స్వర్గాభిష్యందవమనం కృత్వే వోపనివేశితా. 29

వ్యాఖ్య : యా-ఏమధురాపురి, సౌరాజ్యప్రకాశాభిః-మంచిరాజు (శత్రుఘ్నుఁడు) కలిగియుండుటచేత ప్రకాశమానము లగుచున్న, పౌరవిభూతిభిః-పురజనులయైశ్వర్యములచేత, స్వర్గాభిష్యందవమనం—స్వర్గ-స్వర్గమునకు, అభిష్యంద-ఎక్కువగానున్న జనముయొక్క, వమనం-ఆహరణమును, కృత్వా-చేసి, ఉపనివేశితా, ఇవ-స్థాపింపఁబడినదివలె, బభౌ-ప్రకాశించెనో! అట్టి మధురానగరమును నిర్మించెను. అట్లు యమునాతీరమున నిర్మింపఁబడిన మధురానగరము శత్రుఘ్నుని పాలనమున రాజన్వతియై తన్మూలములగు నైశ్వర్యములతో ప్రజలు తులదూగుచుండఁగా నానగరము, స్వర్గముపట్టక మిగిలిన స్వర్గవాసి జనమును దెచ్చి నిర్మింపబడెనాయేమి! యనునట్లు దేదీప్యమానమై విలసిల్లుచుండెననియు, దానిని శత్రుఘ్నుఁడు చక్కగా పరిపాలించుచుండెననియు భావము. "బభౌ" భా-దీప్తౌ

అనుధాతువునకు లిట్. ప్ర.పు.ఏ. ఇచ్చట కాళిదాసుయొక్క అర్థశాస్త్ర విజ్ఞానము "స్వర్గాభిష్యందవమనం" మొదలగు పద ప్రయోగములవలన వ్యక్తమగుచున్నది. కౌటిల్యార్థ శాస్త్రమునందు "జనపదనివేశః" అను శీర్షిక క్రింద నొకరాజు నూతన నగర నిర్మాణము నెట్లు చేయవలెనో చెప్పెను. "భూతపూర్వ మభూత పూర్వంవా జనపదం పరదేశాపవాహనేన స్వదేశాభిష్యందవమనేన వా నివేశయేత్" ఆనగర మంతకు ముందొకవిధముగా నున్నదికాని, లేక క్రొత్తదికాని కావచ్చును. అచ్చట నివసింపవలసిన జనమును పరదేశమునుండి తెచ్చికాని, తనదేశమున మిగిలియున్న, అనగా గృహారామక్షేత్రాదులులేని ఆయా వృత్తులవారిని, తెచ్చి యా నగరమున నిలుపవలెను. అతరువాత దాని సీమలు, నచ్చట కల్పింపవలసిన సౌకర్యములు, జనుల వృత్తిభేదములు మొదలగునవి చేయవలెనని చెప్పెను. ప్రస్తుత మధురానగరమునకు శత్రుఘ్నుడు స్వర్గమున మిగిలియున్న జనమును దెచ్చి నిలి పెనా? యను ఉత్ప్రేక్షాలంకారముచేత నచ్చటిసౌకర్యములు, ఐశ్వర్యములు చాణ క్యార్థశాస్త్రప్రకారమున విరాజిల్లుచుండెనని తెలియుచున్నది

శ్లో. తత్ర సౌధగతః పశ్యన్ యమునాం చక్రవాకినీమ్,
హేమభక్తిమతీం భూమేః ప్రవేణీ మివ పిప్రియే. 30

వ్యాఖ్య : తత్ర-ఆ మధురానగరమునందు, సౌధగతః-మేడమీదికెక్కిన వాడై, సః-ఆశత్రుఘ్నుడు, చ కవాకినీం-చక్రవాకపక్షులుగలదియగు, యమునాం-యమునానదిని, హేమభక్తిమతీం- బంగారపు రేకులతో, ఆభరణములతోను గూడిన, భూమేః-భూదేవియొక్క, ప్రవేణీం, ఇవ-పొడుగుగానున్న జడనువలె, పశ్యన్-చూచుచున్నవాడై, పిప్రియే-ప్రీతినిబొందెను ఆ మధురానగరరాజధాని లోని మేడమీద నిల్చుని శత్రుఘ్నుడు, చక్రవాక పక్షులతోనున్న యమునానది యందమును చూచుచు, పొడుగైనజడలో సువర్ణాభరణములు పెట్టుకొని యున్న భూదేవి సౌందర్యమును భావించుచు ఆనందమునొందుచుండె ననిభావము "పిప్రియే" ప్రీఙ్-ప్రీణనే అనుధాతువునకు లిట్. ప్ర.పు.ఏ.

శ్లో. సఖా దశరథస్యాపి జనకస్యచ మంత్రకృత్,
సంచస్కారో భయప్రీత్యా మైథిలేయౌ యథావిధి. 31

వ్యాఖ్య: దశరథస్య-దశరథునికి, జనకస్యచ-జనకమహారాజునకును, సఖా-మిత్రుడగు, మంత్రకృత్, అపి-మంత్రద్రష్టయగు వాల్మీకిగూడ, ఉభయప్రీత్యా-

జనకదశరథు లిద్దఱియందునుగల స్నేహముచేత, మైథిలేయా-మైథిలీతనయుల నిద్దఱిని, యథావిధి-శాస్త్రానుసారముగా, సంచస్కార-జాతకర్మాదులతో సంస్క రించెను. దశరథుఁడు, జనకుఁడు సైతము, తన మిత్రులై నందున, వాల్మీకి ఆయుభ యులకును వంశవర్ధనులగు శిశువులు సంస్కారరహితులైయుండుట తగదుగనుక, స్వయముగా వేదవేత్తయైనందున బాలురిద్దఱికి శాస్త్రప్రకారము జాతకర్మాదిసంస్కా రములు జరిపెనని భావము. ఇచ్చట రాముని పేరెత్తక జనక దశరథులను జెప్పట వలన వాల్మీకికి రాముఁడు లోకాపవాదభీతుఁడై ధర్మదార పరిత్యాగము చేసెనన్న చిఱుకోపముండినట్లు స్ఫురించుచున్నది. ద్విజశబ్ద వాచ్యులగు బ్రహ్మ క్షత్రియ వైశ్యులకు "నిషేకాది శ్మశానాంతః" అను మనుస్మృతి వాక్యమువలన సమంత్ర కములగు "గర్భాధాన పుంసవన సీమంతోన్నయన జాతకర్మాదులగు నలువది సంస్కారములు ధర శాస్త్రముచేత విహితములైయున్నవి. అట్టి సంస్కారముల వలన ద్విజుడు పరి ఁడగును. కావున వాల్మీకి ఆ శిశువులకు సంస్కార లోప మును జరుగనీయలే . మిథిలానాం రాజా మైథిలః అనగాజనకుఁడు, మైథిలస్య అపత్యంస్త్రీ-మైథిలీ అనఁగా సీత, మైథిల్యాః సుతౌ మైథిలేయా-ఇద్దరు సీతాసుతు లగు శిశువులు అని వ్యుత్పత్తి. "సంచస్కార" "డు కృఞ్-కరణే" అను ధాతువు "సమ్" అను ఉపసర్గతోకూడినప్పుడు ధాతుమా తమునకు "సుట్" అను ఆగమము వచ్చి "సంస్కరోతి" అని లట్ రూపము సి ంచును. ప్రస్తుత లిట్ రూపమునందు అభ్యాస "చ" కారముతో వ్యవధానము ్నను సుడాగమమువచ్చి "సంచస్కార" అని యగును. కాగా లిట్. ప్ర పు ఏ. "మంత్రకృత్" అను శబ్దము "సుకర్మపాప మంత్రపుణ్యేషు కృఞః" అను సూత్రమువలన క్విప్ ప్రత్య యాంతముగాఁ బ్రయుక్తమైనది. ఇవి సుకృత్, కర్మకృత్, పాపకృత్, మంత్ర కృత్, పుణ్యకృత్. అనుతకారాంత శబ్దములుగా నుండును.

శ్లో. స తౌ కుశలవోన్మృష్టగర్భక్లేదౌ తదాఖ్యయా,
కవిః కుశలవా వేవ చకార కిల నామతః. 32

వ్యాఖ్య : సఃకవిః-ఆ వాల్మీకిముని, కుశలవోన్మృష్టగర్భక్లేదౌ-కుశ దర్భలచేతను, లవ-గోపుచ్ఛలోమములచేతను, ఉన్మృష్ట-ఉపమార్జనముచేసి గింపఁబడిన, గర్భక్లేదౌ-గర్భోపద్రవముగల, తౌ-ఆ కుమారులిద్దఱిని, తదాఖ్య ఏవ-వాటిపేర్లతోనే, నామతః-పేర్లగునట్లు, కుశలవౌ, ఏవ-కుశలవులు అ చకార, కిల-నామకరణము చేసెనుసుమా. గర్భస్థశిశువులకు లోన నెట్టి బాధ

గలుగకుండునట్లు సమంత్రకముగా దర్భలతోను, గోవు తోకయందలి వెంట్రుకల తోను గర్భమునకు ఉపమార్జనముచేయుట ఆచారమైయున్నందున అట్టి మార్జనము చేత సుఖముగా ఉద్భవించిన యాశిశువులకు వాల్మీకి ఆ కుశలవముల పేర్లే పెట్టెనని భావము. ఉపమార్జనమనగా క్రిందినుండి పైకి ప్రోక్షించుట. "కుశైః ఉన్మృష్టః కుశః; లవైః ఉన్మృష్టః లవః" అని వ్యుత్పత్తి. "లవో లవణ కింజల్క పక్ష్మ గోపుచ్ఛలోమసు" అని వైజయంతి నిఘంటువు.

శ్లో. సాంగం చ వేద మధ్యాప్య కించిదుత్క్రాంతశైశవౌ,
స్వకృతిం గాపయామాస కవిప్రథమపద్ధతిమ్. 33

వ్యాఖ్య : కించిదుత్క్రాంతశైశవౌ-కొంచముగా గడచిపోయిన శిశుత్వము గల యా బాలురను, సాంగంచ-అంగములతోఁగూడినదియునగు, వేదం వేదమును, అధ్యాప్య-అధ్యయనముచేయించి, కవిప్రథమపద్ధతిః-కవులకు మేలుబంతియగు(కవితా రచనకు బీజభూతమైన) స్వకృతిం-తన కావ్యమగు రామాయణమును, గాపయామ స-గానము చేయించెను. వాల్మీకి ఆ కుశలవులకు కొంతశైశవముగడచి చెప్పినచదువును పలుకఁగల బాల్యమురాగానే వేదమును, వేదాంగములను నేర్పి పిమ్మట తాను రచించి నదియు, కవిత్వమునకు బీజభూతమైనదియు నగు రామాయణమును గానముచేయు టకు నేర్పెను. ఋగ్వేద, యజుర్వేద, సామవేదములు, అధర్వణవేదమునునేర్పుటయే గాక శిక్ష, వ్యాకరణం ఛందస్సు, నిరుక్తం, జ్యోతిషము, కల్పము అనువేదాంగము లను సైతము నేర్పెను. "గాపయామాస"గై-శబ్దే ధాతువునకు ణిచ్‌లో (ప్రేరణార్థ కము) లిట్. ప్ర.పు ఏ. ఇచ్చటి "కవిప్రథమపద్ధతిమ్" అనునది రామాయణము యొక్క ఆదికావ్యత్వ కవిమార్గదర్శకత్వ ములను వెల్లడించుచున్నది.

శ్లో. రామస్య మధురం వృత్తం గాయంతౌ మాతు రగ్రతః,
తద్వియోగవ్యథాం కించిత్ శిథిలీచక్రతుః సుతౌ. 34

వ్యాఖ్య : తౌ, సుతౌ-ఆ కుమారులిద్దఱు, రామస్య-శ్రీరామునియొక్క, వృత్తం-చరిత్రను, మాతుః-తల్లియొక్క, అగ్రతః-ఎదుట, మధురం-మనోహర ముగా, గాయంతౌ-గానముచేయుచున్నవారగుచు, తద్వియోగవ్యథాం-సీతకుఁగల రామవియోగవేదనను, కించిత్-కొంచము, శిథిలీచక్రతుః-సడలించిరి అట్లు వాల్మీకి నేర్పిన రామాయణమువలన కుశలవులు రాముని జీవితవిశేషములను తల్లియందుఁ

గూర్చుని మధురముగా గానముఁజేయుచు నామెకు రాముని యెడబాటువలనఁ గలిగిన దుఃఖములను కొంచము తగ్గించిరని భావము. మానవులకు దూరమైన ప్రేమాస్పద వ్యక్తియొక్కగాని, వస్తువుయొక్కగాని గుణవర్ణనము కొంత దుఃఖశాంతిని గలిగించునుగదా!

శ్లో॥ ఇతరేఽపి రఘోర్వంశ్యా స్త్రయ స్త్రేతాగ్ని తేజసః,
తద్యోగా త్పతివత్నీషు పత్నీషు ప్రాసవ ద్విసూనవః. 35

వ్యాఖ్య : రఘోః-రఘుమహారాజుయొక్క, వంశ్యాః-వంశీయులును, త్రేతాగ్నితేజసః-గార్హపత్యము, దాక్షిణాగ్నియు, ఆహవనీయము, అను మూడు యజ్ఞాగ్నులయొక్క తేజస్సువంటి తేజస్సుగల, ఇతరే, త్రయః, అపి-రాముని కంటె యితరులగు భరతాదులు ము రును, తద్యోగాత్-వారివారి సంబంధమువలన, పతివత్నీషు-పతివ్రతలుగా ప్రఖ్యాత న, పత్నీషు-భార్యలయందు, ద్విసూనవః-ఇద్దఱిద్దఱు కుమారులుకలవారు, ఆస -అయిరి. పవిత్రమగు రఘువంశమునందు త్రేతాగ్నులవంటి తేజస్సుగల భరత, లక్ష్మణ, శత్రుఘ్నులు సైతము పతివ్రతలైన తమ భార్యలయందు ఇద్దఱిద్దఱు కుమారులను బడసిరని భావము. "ద్వౌద్వౌ సూనూ యేషాంతే ద్విసూనవః" అని విగ్రహము. "అంతర్వత్నపతివతోర్నుక్" అను సూత్రముచేత ఙీప్, నుగాగములు వచ్చి, అంతర్వత్నీ, పతివత్నీ శబ్దములు సిద్ధించును. అంతర్వత్నీ యనఁగా గర్భిణియనియు, పతివత్నీ యనగా జీవత్పతిక యనియు నర్థములు. కాని ప్రస్తుత శ్లోకభావానుసారముగా పతివ్రతలుగా ప్రఖ్యాతలైన అని యర్థము వ్రాయఁబడినది.

శ్లో. శత్రుఘాతిని శత్రుఘ్నః సుబాహౌ చ బహుశ్రుతే,
మధురావిదిశే సూన్వో ర్నిదధే పూర్వజోత్సుకః. 36

వ్యాఖ్య : పూర్వజోత్సుకః-జ్యేష్ఠుఁడగురామునిఁ జూచుటయందు ప్రేమగల శత్రుఘ్నః-శత్రుఘ్నుఁడు, బహుశ్రుతే-బహుశ్రుతుఁడనియు, శత్రుఘాతిని-శత్రువులనుఱంపఁగల, సుబాహౌచ-సుబాహుఁడనియుఁ బేర్లుగల, సూన్వోః-ఇద్దఱుకుమారులయందు, మధురావిదిశే-మధురా విదిశా నగరములను, నిదధే-ఉంచెను. మధు నగరనిర్మాణానంతరము కొంతకాల మచ్చటనుండిన శత్రుఘ్నుఁడు, అగ్రజుఁడ

రామునివద్దికేగుటయందు వాంఛగలవాఁడగుటచేత తనకుమారులగు శత్రుఘాతి సుబాహులయందు మధురానగర విదిశానగర పరిపాలన బాధ్యతను ఉంచి, తాను అయోధ్యకు వెళ్ళెనని భావము "నిదధే" ని అను ఉపసర్గతోఁగూడిన (డు) ధాఞ్-ధారణపోషణయోః అను ధాతుపునకు లిట్ ప్ర. పు. ఏ.

శ్లో. భూయ స్తపోవ్యయో మాభూత్ వాల్మీకే రితి
సో ఒత్యగాత్,
మైథిలీతనయోద్గీత నిఃస్పందమృగ మాశ్రమమ్. 37

వ్యాఖ్య : సః-ఆశ త్రుఘ్నుఁడు, థిలీతనయోద్గీతనిఃస్పందమృగం—మైథిలీతనయ-కుశలవులయొక్క, ఉద్గీత-పె గావినఁబడు గానముచేత, నిస్పంద-నిశ్చలములగుచువినుచున్న, మృగం-లేళ్ళు, వాల్మీకేః, ఆశ్రమం-వాల్మీకి యొక్క ఆశ్రమమును, భూయః-మరలగూడ, తపోవ్యయః-తనకు ఆతిథ్యాదుల నేర్పరచుటకగు తపోహాని, మాభూత్, ఇతి--లేకు డునుగాకయని, అత్యగాత్-దాటివెళ్ళెను. కుశలవులు చేయుచున్న రామాయణగానమును వినుచు నిశ్చలములై యున్న లేళ్ళతో ప్రశాంతముగానున్న వాల్మీకి తపోవనమునకు తన ప్రవేశమువలన మరల నంతరాయము, తపోవ్యయము గలుగుట తగదని భావించిన శత్రుఘ్నుఁ డందుఁబ్రవేశింపక దాటివెళ్లెనని భావము. మా+అభూత్-మాభూత్ "నమాఙ్ యోగే" అనుసూత్రమువలన "మా"తోసంబంధమున్న ధాతువునకు "అ" చేరదు. అతి+అగాత్-అత్యగాత్. అతి ఉపసర్గతోఁగూడిన "ఇణ్-గతౌ" ధాతువు రెండును భూతార్థకలుఙ్ ప్ర. పు. ఏకవచనములు.

శ్లో. వశీ వివేశ చాయోధ్యాం రథ్యాసంస్కారశోభినీమ్,
లవణస్య వధాత్ పౌరై రీక్షితో ఒత్యంత గౌరవమ్. 38

వ్యాఖ్య: వశీ-ఇంద్రియ నిగ్రహముగల శత్రుఘ్నుఁడు, లవణస్య-లవణాసురునియొక్క, వధాత్-చంపుటకారణముగా, పౌరైః-పురజనులచేత, అత్యంత గౌరవం-మిక్కిలిగౌరవ యుక్తముగా, ఈక్షితః సన్-చూడఁబడినవాఁడగుచు, రథ్యాసంస్కారశోభినీం-తోరణాది సంస్కారముతోగూడిన రాజమార్గముగల, అయోధ్యాం-అయోధ్యానగరమును, వివేశచ-ప్రవేశించెనుగూడ. లవణాసురుని జంపిన వీరుఁడని ప్రజలు గౌరవపురస్సరముగాఁజూచుచుండ శత్రుఘ్నుఁ డలంక

రింపఁబడిన రాజమార్గములు, రచ్చలుగల అయోధ్యను జేరెను. ఇందలి "వశీ" అను విశేషణము శత్రుఘ్నుఁడు సీతా విషయమును రామునితోఁజెప్పక మనస్సులోనే యుంచుకొన్న విషయమును సూచించును. "వివేశ" విశ-ప్రవేశనే ధాతువునకు లిట్ ప్ర. పు. ఏ.

శ్లో. స దదర్శ సభామధ్యే సభాసద్భి రుపస్థితమ్,

రామం సీతాపరిత్యాగా దసామాన్యపతిం భువః. 39

వ్యాఖ్య : సః-ఆ శత్రుఘ్నుఁడు, సభామధ్యే-సభామధ్యప్రదేశమునందు, సభాసద్భిః-సభ్యులచేత, ఉపస్థితం-సేవింపబడినవాఁడును, సీతాపరిత్యాగాత్-సీతను పరిత్యజించుటవలన, భువః-భూమికి, అసామాన్యపతిం-అసాధారణ భర్తయు నగు, రామం-రాముని, దదర్శ-చూచెను. సభ్యులతో సభామధ్యమునన్న యసాధారణ భూభర్త యగు రాముని శత్రుఘ్నుఁడు దర్శించెను. ఏ రాజైనను భూమికి సామాన్య భర్తయే అనఁగా భూదేవితోపాటు అతని పట్టపురాణియు నుండునుగావున ఆ రాజు వారిద్దరికిని, లేక పెక్కండ్రకు సమానభోక్తగా నుండును ఇచ్చట సీతా పరిత్యాగమును జేసినరాముఁ డొక్క భూదేవికే భర్తగావున అసామాన్యపతిగాఁ జెప్పుటలో రాముఁడు మఱియొక స్త్రీని వివాహముజేసికొనలేదని సూచితము. "దదర్శ" దృశిర్-ప్రేక్షణే ధాతువునకు లిట్ ప్ర. పు. ఏ.

శ్లో. త మభ్యనందత్ ప్రణతం లవణాంతక మగ్రజః,

కాలనేమివధాత్ ప్రీత స్తురాషా డివ శార్ఙ్గిణమ్. 40

వ్యాఖ్య : అగ్రజః-అన్నయగు రాముఁడు, లవణాంతకం-లవణునిఁజంపిన వాఁడును, ప్రణతం-తనకు నమస్కరించువాఁడునునగు, తం-ఆ శత్రుఘ్నుని, కాలనేమివధాత్-కాలనేమి యను రాక్షసునిఁ జంపుటవలన, ప్రీతః-సంతుష్టుఁడైన, తురాషాట్-ఇంద్రుఁడు, శార్ఙ్గిణం, ఇవ-ఉపేంద్రుఁడగు విష్ణువునువలె, అభ్యనందత్-అభినందించెను. కాలనేమి రాక్షసుని జంపిన యుపేంద్రుని ఇంద్రుఁ డెంతగా మెచ్చుకొనెనో అంతగా రాముడు లవణ వధచేసివచ్చిన శత్రుఘ్నుని మెచ్చుకొని సంతోషించెను. తురాం-వేగం సహతే ఇతి తురాషాట్ అని వ్యుత్పత్తి. అభి + అనందత్-అభ్యనందత్. "అభి" అను ఉపసర్గతో కూడిన "(టు)నది-సమృద్ధౌ" ధాతువునకు లఙ్. ప్ర.పు.ఏ.

శ్లో. సపృష్టః సర్వతో వార్త మాఖ్యద్రాజ్ఞే న సంతతిమ్,
ప్రత్యర్పయిష్యతః కాలే కవే రాద్యస్య శాసనాత్. 41

వ్యాఖ్య: సః-శత్రుఘ్నుడు, పృష్టఃసన్-అడుగబడినవాడగుచు, సర్వతః, వార్తం-అంతటనుగల కుశలమును రాజ్ఞే-రాజైన రామునికి, ఆఖ్యత్-చెప్పెను, సంతతిం-కుశలవోత్పత్తి రూపమగు సంతాన విషయమును గురించి మాత్రము, కాలే-సరియైన అవసరమున, ప్రత్యర్పయిష్యతః-రాముని కప్పగింపబోవుటకుదల పెట్టిన, ఆద్యస్య, కవేః-ఆదికవియగు వాల్మీకియొక్క, శాసనాత్-ఆజ్ఞవలన, న, ఆఖ్యత్-చెప్పలేదు. ప్రభువైన రాముడు ప్రశ్నింపగా శత్రుఘ్నుడు సర్వ విషయికమగు కుశలమును విన్నవించెనుగాని, వాల్మీకి "సరియైన సమయమున నేనే కుశలవులను రామునికప్పజెప్పవలె కీవిషయమును దెలుపవద్దని" శాసించి యుండుటవలన సంతతి విషయమును జెప్పలేదని భావము. 33వ శ్లోకమున శత్రుఘ్ననకు "వశీ" యని విశేషణమువేయుట యిందుకేయని గ్రహింపవలయును. "ఆఖ్యత్" చక్షిఙ్-వ్యక్తాయాంవాచి అను ధాతువునకుగాని, ఖ్యా-ప్రకథనే అను ధాతువునకుగాని లుఙ్ ప్ర.పు ఏ.

శ్లో. అథ జానపదో విప్రః శిశు మప్రాప్తయౌవనమ్,
అవతార్యాంకశయ్యాస్థం ద్వారి చక్రంద భూపతేః. 42

వ్యాఖ్య: అథ-ఆ పిమ్మట, జానపదః, విప్రః-దేశమునందలి యొకానొక బ్రాహ్మణుడు, అప్రాప్తయౌవనం-యువకుడుగానెదుగని, శిశుం-మృతబాలుని, భూపతేః-రామునియొక్క, ద్వారి-రాజభవన ద్వారమునందు, అంకశయ్యాస్థం-తొడపైబండుకొనునట్లుగా, అవతార్య-క్రిందకు దింపి, చక్రంద-రోదనను చేసెను. తరువాత నొకప్పుడు దేశమునందలి యొక విప్రుడు చనిపోయిన తన కుమారుని దెచ్చి రాజభవన ద్వార ప్రదేశమునందు తొడపైదలయుంచునట్లు పండబెట్టుకొని పెద్దగా నేడ్చుచుండెను "జనపదేభవః జానపదః" అని విగ్రహము. "చక్రంద" క్రది-రోదనే ధాతువు లిట్ ప్ర పు.ఏ.

శ్లో. శోచనీయాసి వసుధే! యా త్వం దశరథా చ్చ్యుతా,
రామహస్త మనుప్రాప్య కష్టాత్కష్టతరం గతా. 43

వ్యాఖ్య : హేవసుధే-ఓభూదేవీ! దశరథాత్-దశరథునినుండి, చ్యుతా-జారి పోయిన, యా, త్వం-ఏనీవు, రామహ సం-రామునిచేతిని, అను ప్రాప్య-చేరి, కష్టాత్కష్టతరం-మిక్కిలి కష్టమును, గతా (సతీ)-పొందినదానవగుచు, శోచనీయా, అసి-శోచనీయురాలవగుచున్నావు ఓభూదేవి! దశరథుని వాసి రామునిచేతిలోపడ్డ నీవు మహాకష్టములపాలైతి అయ్యో! అని దుఃఖి-పబడుచున్నావని బ్రాహ్మణుడు రోదనముచేయుచు పలికెనని భావము. నీస్థితి మిక్కిలి హీనదశనుబొందినది. "అసి" అస-భువిధాతువు లట్ మధ్య పు.ఏ.

శ్లో. శ్రుత్వా తస్య శుచో హేతుం గోప్తా జిహ్రాయ రాఘవః,
న హ్యకాలభవో మృత్యు రిక్ష్వాకుపద మస్పృశత్. 44

వ్యాఖ్య : గోప్తా-రక్షకుడగు, రాఘవః రాముడు, తస్య-ఆవిప్రుని యొక్క, శుచః-శోకమునకు, హేతుం-కారణమును (పుత్రమరణమును), శ్రుత్వా-విని, జిహ్రాయ-సిగ్గుపడెను. హి-ఎందువల్లనైతే అకాలభవః-అసమయమున గలిగెడు మృత్యుః-మరణము, ఇక్ష్వాకుపదం-ఇక్ష్వాకుల రాష్ట్రమును, న, అస్పృశత్-స్పృశించియుండలేదో! పెద్దలు బ్రతికియుండగా చిన్నవారు చచ్చుట యెన్నడులేని యిక్ష్వాకుల రాష్ట్రమునందు ఈవిప్రుని కుమారుడు మరణించుట విన్న రామునికి ఆశ్చర్యలజ్జకలిగెనని భావము. "జిహ్రాయ" హ్రీ-లజ్జాయాం ధాతువునకు "లిట్" ప్ర.పు ఏ. జిహ్రాయ జిహ్రియతుః, జిహ్రియుః. ఇత్యాదిరూపములుండును. "అస్పృశత్" స్పృశ-సంస్పర్శే ధాతువునకు లఙ్. ప్ర.పు ఏ.

శ్లో. స ముహూర్తం క్షమస్వేతి ద్విజ మాశ్వాస్య దుఃఖితమ్,
యానం సస్మార కౌబేరం వైవస్వతజిగీషయా. 45

వ్యాఖ్య : సః-రాముడు. దుఃఖితం, ద్విజం-దుఃఖపడుచుండిన విప్రుని, ముహూర్తం-క్షణకాలము, క్షమస్వ-ఓర్చుకొనుము, ఇతి-అని, ఆశ్వాస్య-ఊరడించి వైవస్వతజిగీషయా-యమునిగూడ జయించు కోరికచేత, కౌబేరం-కుబేరునిదగు యానం-పుష్పకవిమానమును, సస్మార-స్మరించెను. ఏడ్చుచున్న బ్రాహ్మణు క్షణకాలము ఓర్చుకొనుమని యోదార్చి రాముడు ఇట్లు చేసిన యమధర్మరా నైనను జయించి విప్రునికి మేలుచేయవలసినదే యన్న కోరికచేత నచ్చటికి శీ గతిని వెళ్ళుటకై పుష్పకవిమానమును స్మరించెను. పుష్పకము అక్కడపడిన

స్మరించినచో వచ్చి సేవించెదనని చెప్పియుండెనుగదా! "క్షమస్వ" క్షమూష్-సహనే ధాతువు ఆత్మనేపది. దానిలోట్. మధ్యమపురుష.ఏ. "సస్మార" స్మృ-చింతాయాం (పరస్మైపది) ధాతువునకు లిట్.ప్ర.పు.ఏ.

శ్లో. ఆత్తశస్త్ర స్త దధ్యాస్య ప్రస్థితః స రఘూద్వహః,
ఉచ్చచార పుర స్తస్య గూఢరూపా సరస్వతీ. 46

వ్యాఖ్య : సః, రఘూద్వహః-అట్లుసిద్ధపడిన రాముఁడు, ఆత్తశస్త్రః-తీసికొనఁబడిన ఆయుధముగలవాఁడగుచు, తత్-ఆపుష్పకమును, అధ్యాస్య-ఎక్కి, ప్రస్థితః-బయలుదేరెను. తస్య, పురః-అతనియెదుట, గూఢరూపా, సరస్వతీ-అశరీరవాణి, ఉచ్చచార-పలికెను. రాముఁడు స్మరణమాత్రమున తనవద్దికి వచ్చిన పుష్పకమును సాయుధుఁడై యెక్కి బయలుదేరినవెంటనే ఒకయశరీరవాణి ముందు చెప్పబోవురీతిగా పలికెనని భావము. ఉచ్చచార (ఉత్+చచార) "ఉత్" అను నుపసర్గతోఁగూడిన చర-గతిభక్షణయోః అను ధాతువునకు లిట్ ప్ర.పు.ఏ.

శ్లో. రాజన్! ప్రజాసు తే కశ్చి దపచారః ప్రవర్తతే,
త మన్విష్య ప్రశమయే ర్భవితాసి తతః కృతీ. 47

వ్యాఖ్య : హేరాజన్—ఓరాజా! తే, ప్రజాసు-నీప్రజలయందు, కశ్చిత్-ఒకానొక, అపచారః-వర్ణధర్మవ్యతిరేకము, ప్రవర్తతే-జరుగుచున్నది. తం-ఆయపచారమును, అన్విష్య-వెదకి, ప్రశమయేః-శమింపజేయుము. తతః-దానివలన, కృతీ-కృతకృత్యుఁడవు, భవితాసి-కాఁగలవు. రాజా! నీప్రజలలో నొక వర్ణధర్మ విరుద్ధమగుపని జరుగుచున్నది, దానిని తొలగించితివేని నీవు కృతకృత్యుఁడవు కాఁగలవని ఆయశరీరవాణి పలికెను. "ప్రవర్తతే" ప్రపూర్వకవృతు-వర్తనే. ధాతువునకు లట్ ప్ర.పు.ఏ. "ప్రశమయేః" ప్రపూర్వకశమ-ఉపశమేధాతువునకు విధిలిఙ్. మధ్య పు.ఏ. "భవితాసి" భూ-సత్తాయాం ధాతువునకు భవిష్యదర్థకమగు లుట్. మధ్య.పు.ఏ.

శ్లో. ఇత్యాప్తవచనాత్ రామో వినేష్యన్ వర్ణవిక్రియామ్,
దిశః పపాత పత్త్రేణ వేగనిష్కంపకేతునా. 48

వ్యాఖ్య : ఇతి-ఈవిధముగా వినఁబడిన, ఆ ప్రవచనాత్-ఆ ప్రవాక్యము వలన, రామః-రాముఁడు, వర్ణవిక్రియాం-వర్ణాపచారమును, వినేష్యన్-తొలగింపగల వాఁడగుచు, వేగనిష్కంపకేతునా—వేగ-గమనవేగముచేత, నిష్కంప-చలింపని, కేతునా-జెండాగల, పత్త్రేణ-వాహనమగు పుష్పకముచేత, విదిశః, ప్రపాత-దిక్కులను జేరెను (పరుగెత్తెననియర్థము). ఆ ప్రవచనమగు నశరీరవాణిని విన్నరాముఁడు వర్ణధర్మవిరుద్ధకార్యమును దొలగింపఁదలచి, యతివేగముగా వెళ్ళు విమానముద్వారా అన్నిదిక్కులకుఁ బరుగిడెనని భావము. "ప్రపాత" పత్ల-గతౌ ధాతువునకు లిట్ ప్ర.పు ఏ.

శ్లో. అథ ధూమాభితామ్రాక్షం వృక్షశాఖావలంబినమ్,

దదర్శ కంచిదైక్ష్వాక స్తపస్యంత మధోముఖమ్. 49

వ్యాఖ్య : ఐక్ష్వాకః-రాముఁడు, అథ-ఒకదిక్కును జేరినపిమ్మట, ధూమాభితామ్రాక్షం—ధూమ-పొగత్రాగుటచేత, అభితామ్ర-అంతటనెఱ్ఱబారిన, అక్షం-కన్నులుగలవాఁడును, వృక్షశాఖావలంబినం-చెట్టుకొమ్మయందు వ్రేలాడుచున్న వాఁడును, అధోముఖం-నేలవైపున ముఖముగలవాఁడును, తపస్యంతం-తపస్సు చేయుచున్నవాఁడుననగు, కంచిత్-ఒకానొక పురుషుని, దదర్శ-చూచెను. అట్లు వెళ్ళినరాముఁడొకచోట ధూమపానముచేత నెఱ్ఱబడిన కన్నులు గలిగి, అధోముఖముగా నొకచెట్టుకొమ్మకు వ్రేలాడుచు తపస్సు నాచరించుచున్న యొక అపరిచిత పురుషుని జూచెను. ఇక్ష్వాకువంశేభవః ఐక్ష్వాకః, అని విగ్రహము. అణ్ ప్రత్యయాంతమైన ఇక్ష్వాకుశబ్దము నందలి "ఉ" కారమునకు లోపముఁ జెప్పుటచేత "ఐక్ష్వాకః" అనియైనది. "దదర్శ" దృశిర్-ప్రేక్షణే ధాతువునకు లిట్ ప్ర.పు.ఏ

శ్లో. పృష్టనామాన్వయో రాజ్ఞా స కిలాచష్ట ధూమపః.

ఆత్మానం శంబుకం నామ శూద్రం సురపదార్థినమ్. 50

వ్యాఖ్య : రాజ్ఞా-రాజుచేత, పృష్టనామాన్వయః—పృష్ట-అడుగఁబడిన, నామ-పేరును, అన్వయః-వంశమును గలవాఁడును, ధూమపః-ధూమపాయియగు, సః-ఆ పురుషుఁడు, ఆత్మానం-తనను, సురపదార్థినం-స్వర్గమునుగోరుచున్న, శంబుకం, నామ-శంబుకుఁడనుపేరుగల, శూద్రం-శూద్రునిగా, అచష్టకిల-చెప్పెను సుమా! రాముఁడు నీపేరేమి? నీవంశమేది? ఎందులకీ తపస్సును జేయుచున్నావు?

అని ప్రశ్నింపగా నతఁడు నాపేరు శంబూకుఁడు, నేను శూద్రుఁడను, స్వర్గ ఫలమునుగోరి యీ తపస్సు నాచరించుచున్నానని చెప్పెను. "అచష్ట" చక్షిఙ్-వ్యక్తాయాంవాచి (స్పష్టముగాఁ జెప్పుట) అను ధాతువునకు లఙ్. ప్ర.పు.ఏ.

శ్లో. తప స్యనధికారిత్వాత్ ప్రజానాం త మఘావహమ్,
శీర్షచ్ఛేద్యం పరిచ్ఛిద్య నియంతా శస్త్ర మాదదే. 51

వ్యాఖ్య : తపసి-తపస్సుచేయుటయందు, అనధికారిత్వాత్-అధికారములేని వాఁ డగుటవలన, ప్రజానాం-ప్రజలకు, అఘావహం-దుఃఖమును గలిగించువాఁడగు, తం-ఆ శంబూకుని, శీర్షచ్ఛేద్యం-శిరస్సున ఖండింపఁదగినవానినిగా, పరిచ్ఛిద్య-నిశ్చయించి, నియంతా-ప్రజలను నియమించు రక్షకుఁడగు రాజు, శస్త్రం-ఖడ్గమును, ఆదదే-గ్రహించెను. తన కధికారములేని తపస్సు నాచరించుచుఁ బ్రజల దుఃఖమునకు కారణమైన శంబుకునికి శిరచ్ఛేదమే ప్రాయశ్చిత్తమని ధర్మశాస్త్రదృష్టి చేత నిర్ణయించిన రాముఁ డతని తలను నఱుకుటకై ఖడ్గమును గ్రహించెను. "ఆదదే" (ఆ+దదే) ఆఙ్ పూర్వక (డు) దాఞ్-దానే (ఆత్మనేపది) ధాతువునకు లిట్. ప్ర.పు.ఏ.

శ్లో. స తద్వక్త్రం హిమక్లిష్టకింజల్క మివ పంకజమ్,
జ్యోతిష్కణాహతశ్మశ్రు కంఠనాళా దపాతయత్. 52

వ్యాఖ్య : సః-రాముఁడు, జ్యోతిష్కణాహతశ్మశ్రు-జ్యోతిష్కణ-ఖడ్గాగ్ని మిణుగురులచేత, ఆహతశ్మశ్రు-కాల్చబడిన మీసములుగల, తద్వక్త్రం-అతని ముఖమును, హిమక్లిష్టకింజల్కం-మంచుచేత చెడిన కేసరములుగల, పంకజం,ఇవ-కమలమునువలె, కంఠనాళాత్-నాళమువంటి కంఠమునుండి, అపాతయత్-పడఁ గొట్టెను. ఖడ్గాగ్ని స్ఫులింగములచేత కాలిపోయిన మీసములుగడ్డముగల శంబూకుని తలను మంచుపడి చెడిపోయిన కేసరములుగల కమలమునువలె కంఠనాళమునుండి ఛేదించి నేలపైఁబడవేసెనని భావము. "అపాతయత్" పత్ల-గతౌధాతువునకు లఙ్ ప్ర.పు.ఏ. (ప్రేరణార్థకణిజంతము). అలంకారము: ఉపమ.

శ్లో. కృతదండః స్వయం రాజ్ఞా లేభే శూద్రః సతాం గతిమ్,
తపసా దుశ్చరేణాపి న స్వమార్గవిలంఘినా. 53

వ్యాఖ్య : శూద్రః-శూద్రుఁడగు శంబూకుఁడు, రాజ్ఞా-రాజయిన రాముని చేత, స్వయం, కృతదండః సన్-స్వయముగా విధింపఁబడిన శిక్షగలవాఁడగుచు, సతాం, గతిం-సత్పురుషులయొక్క పుణ్యమార్గమును, లేభే-పొందెను, దుశ్చరేణ, అపి-అతికష్టముతో నాచరింపఁదగినదైనను స్వమార్గవిలంఘినా-తన కులధర్మము నతిక్రమించినట్టి తపసా-తపస్సుచేత, నలేభే-పొందలేదు. తన కులధర్మముగానిదై కష్టసాధ్యమైన తపస్సుచేతఁ బొందజాలని సద్గతిని శూద్రుఁడగు శంబూకుఁడు రాజు చేత శిక్షింపఁబడినవాఁడుకాఁగానే పొందెను "రాజభిః కృతదండాస్తు కృత్వా పాపాని మానవాః, నిర్మలాః స్వర్గ మాయాంతి సంతః సుకృతినో యథా" అని చెప్పిన మనువచనమువలన చేసిన ధర్మవిప్లవమునకు శిక్ష ననుభవించుటవలన శంబూకుఁడు స్వర్గమును జేరెననియు, రాముఁడు ధర్మరక్షకుఁడేకాని ప్రాణులను నిష్కారణముగా హింసించువాఁడు గాడనియు భావము. "లభే"(డు)లభష్-ప్రాప్తౌ (ఆత్మనేపది) లిట్. ప్ర.పు ఏ. "లేభే, లేభాతే, లేభిరే, ఇత్యాదిరూపము లుండును.

శ్లో. రఘునాథో ప్యగస్త్యేన మార్గసందర్శితాత్మనా,
మహౌజసా సంయుయుజే శరత్కాల ఇవేందునా. 55

వ్యాఖ్య : రఘునాథః, అపి-రాముఁడుగూడ, మార్గసందర్శితాత్మనా-తిరిగి వచ్చు మార్గమునందు దర్శనమీయఁబడినవాఁడును, మహౌజసా - గొప్ప తేజము గలవాఁడు నగు, అగస్త్యేన-అగస్త్యునితో, ఇందునా, శరత్కాలః, ఇవ-చంద్రునితో శరత్కాలమువలె, సంయుయుజే - కలిసికొనెను (మహౌజసా యను విశేషణము చంద్రునికి సైతము న్వయించును). రాముఁడు శంబూకవధచేసి, యతనికి సద్గతిని ప్రసాదించిన పిమ్మటఁ, దిరిగి వచ్చుచు, దారిలో మహాతేజస్వియై కనపడిన అగస్త్య మునిని శరత్కాలము చంద్రునినివలెఁ గలిసికొనెను. సుప్రసన్నమైన శరత్కాలము చంద్రునితోఁగలిసి విరాజమానమగునట్లు ధర్మవిప్లవమును దొలఁగించి నిష్కళంకుఁడైన రాముఁడు మహాతేజస్వియగు నగస్త్యునిఁగలిసికొనె నని భావము. "సంయుయుజే." సమ్ అనునుపసర్గతోడి "యుజిర్-యోగే" (ఆత్మనేపది)లిట్. ప్ర.పు.ఏ. అలంకారము: ఉపమ.

శ్లో. కుంభయోని రలంకారం తస్మై దివ్యపరిగ్రహమ్‌.
దదౌ దత్తం సముద్రేణ పీతేనే వాత్మనిష్క్రియమ్. 56

వ్యాఖ్య : కుంభయోనిః-అగస్త్యుఁడు, పీతేన-తనచే పానముచేయఁబడిన, సముద్రేణ-సముద్రునిచేత, ఆత్మనిష్క్రియం, ఇవ—తనను విడుచుటకై యర్పిం చిన వెలనువలె, దత్తం-ఇయ్యబడిన, దివ్యపరిగ్రహం-దివ్యపురుషులచేత స్వీక రింపఁదగినది యగు, అలంకారం-భూషణమును (రత్నకంకణమును), తస్మై-అట్లు కలిసికొన్న రామునికి దదౌ-ఇచ్చెను. అగస్త్యుఁడు, సముద్రమునఁ దాగిన కాలకేయులు బయల్పడుటకై దేవతల ప్రార్థనపై సముద్రమును పానముఁజేసెను. ఆ సమయమునఁ దనను విడుచుటకు వెలగా సముద్రుఁడిచ్చిన రత్నభూషణమును రామునికి బహుమానముగా నగస్త్యుఁడిచ్చెననియు, శంబూకవధ ధర్మకార్యమేయని దేవర్షియగు నగస్త్యుఁ డభినందించె ననియుఁ దాత్పర్యము. "దదౌ" దాఞ్-దానే-లిట్.

శ్లో. తం దధ న్మైథిలీకంఠ నిర్వ్యాపారేణ బాహునా,
పశ్చా న్నివవృతే రామః ప్రా క్పరాసు ర్ద్విజాత్మజః. 56

వ్యాఖ్య : మైథిలీకంఠ నిర్వ్యాపారేణ-సీతాకంఠాలింగనములేని, బాహునా-బాహువుచేత, తం-అగస్త్యుఁడిచ్చిన యాభరణమును, దధన్-ధరించుచు, రామః-రాముఁడు;పశ్చాత్-తరువాత,నివవృతే-తిరిగివెళ్ళెను. పరాసుః-మృత్యువైన, ద్విజాత్మజః-బ్రాహ్మణకుమారుఁడు, ప్రాక్-రాముఁడు వచ్చుటకు ముందే, నివవృతే-తిరిగి వచ్చెను (బ్రతికెను). అగస్త్యుఁడిచ్చిన భూషణమును సీతావియోగముగల రాముఁడు ధరింపక చేతితో పట్టుకొని అయోధ్యకుఁ దిరిగి వచ్చెననియు, రాముఁడు వచ్చుటకు ముందే విప్రకుమారుఁడు బతికియుండె ననియు భావము. నివవృతే (ని+వవృతే) "ని" ఉపసర్గతోఁజేరిన వృతు-వర్తనే ధాతవు లిట్ ప్ర.పు.ఏ.

శ్లో. తస్య పూర్వోదితాం నిందాం ద్విజః పుత్రసమాగతః,
స్తుత్యా నివర్తయామాస త్రాతు ర్వైవస్వతా దపి. 57

వ్యాఖ్య : పుత్రసమాగతః-పుత్రునితోఁగలసికొన్న, ద్విజః-బ్రాహ్మణుఁడు, వైవస్వతాత్, అపి-యముని వద్దినుండికూడ, త్రాతుః-తెచ్చి రక్షింపఁగల్గిన, తస్య-రామునియొక్క, పూర్వోదితాం-తనచే మొదట పలుకఁబడిన, నిందాం-దూషణమును, స్తుత్యా-అప్పుడు చేసిన స్తోత్రముచేత; నివర్తయామాస-తొలఁగించెను. బ్రదికిన కొడుకును జూచుకొన్న విప్రుఁడు మొదట తాను ఎరుఁగకచేసిన రామ

నిందను మరల ననేకవిధములుగా స్తోత్రము(జేయుచు( దొల(గించెను. తన ధర్మ పాలనమున యముడు సైతము విఘ్నమును జేయ(జాల(డని రాముడు నిరూపించె నని ద్విజుడు మెచ్చుకొనెనని భావము. "నివర్తయామాస" నిపూర్వక వృతు-వర్తనే ధాతువునకు "ణిచ్" (ప్రేరణమున) లిట్. ప్ర.పు.ఏ.

శ్లో. త మధ్వరాయ ముక్తాశ్వం రక్షఃకపినరేశ్వరాః,

మేఘాః సస్య మివాంభోభి రభ్యవర్ష న్నుపాయనైః. 58

వ్యాఖ్య : అధ్వరాయ-యాగముకొరకు, ముక్తాశ్వం-విడువ(బడిన గుర్రము గల, తం-ఆరామును, రక్షఃకపినరేశ్వరాః-విభీషణ, సుగ్రీవ ప్రభృతులును, దేశము నందలిరాజులును, మేఘాః-మేఘములు, అంభోభిః-జలములచేత, సస్యం, ఇవ-పైరునువలె, ఉపాయనైః-కానుకలచేత, అభ్యవర్షన్-వచ్చిరి. రాముడు తన రాజ్యపాలనకాలమున అశ్వమేధయాగము( జేయ(దలపె యశ్వమును విడువగానే విభీషణాదులగు రాక్షసరాజులు, సుగ్రీవాదులగు వానరులు, వివిధప్రాంతముల యందలి నరపాలురును, మేఘములు సస్యములపై వర్షమును గురిసినట్లు, వివిధము లగు ఉపాయనములు తెచ్చి రాముని ముందు క్రుమ్మరించిరి. రామాశ్వమేధ ప్రయత్నము లోకమున కానందదాయకముగా నుండెనని భావము. అభ్యవర్షన్ (అభి + అవర్షన్) "అభి" ఉపసర్గతో(గూడిన వృషు-సేచనే ధాతువు లఙ్. ప్ర. బహు. "అవర్షత్, అవర్షతాం, అవర్షన్" ఇత్యాదిరూపములుండును.

శ్లో. దిగ్భ్యో నిమంత్రితా శ్చైన మభిజగ్ము ర్మహర్షయః,

న భౌమాన్యేవ ధిష్ణ్యాని హిత్వా జ్యోతిర్మయాన్యపి. 59

వ్యాఖ్య : నిమంత్రితాః-ఆహూతులగు, మహర్షయఃచ-మహర్షులందఱు, భౌమాని-భూమిపైనుండినవగు, ధిష్ణ్యాని, ఏవ-నివాసములనే, న-కాదు, జ్యోతిర్మయాని, అపి-నక్షత్రరూపస్థానములనుగూడ, హిత్వా-వదలి, దిగ్భ్యః-అన్నిదిక్కుల నుండి, ఏనం-రాముని, అభిజగ్ముః-చేరిరి. భూ నక్షత్ర లోకములందున్న మహర్షు లందఱును యజ్ఞమున కాహ్వానింప(బడి, తమ తమ నివాసములను వదలి, యన్ని దిక్కులనుండియు వచ్చి రాముని(జేరిరి. "ధిష్ణ్యం స్థానే గృహే భేఽగ్నౌ" అని యమరము. "అభిజగ్ముః" (అభి + జగ్ముః) గమ్లు-గతౌధాతువునకు లిట్ ప్ర. పు. బహు.

శ్లో. ఉపశల్యనివిష్టై స్తై శ్చతుర్ద్వారముఖీ బభౌ,
అయోధ్యా సృష్టలోకేవ సద్యః పైతామహీ తనుః. 60

వ్యాఖ్య : చతుర్ద్వారముఖీ-నాలుగుదా ములే ముఖములుగానున్న, అయోధ్యా-అయోధ్యానగరము, ఉపశల్యనివి ః-ఉపశల్య-పొలిమేర ప్రాంతముల యందు, నివిష్టైః-కూర్చొనియున్న, తైః-ఆమి ర్షులచేత, సద్యః-అప్పుడే, సృష్ట లోకా-సృజింపఁబడినజనులుగల, పైతామహీ, తనుః, ఇవ-బ్రహ్మకుసంబంధించిన మూర్తివలె, బభౌ-ప్రకాశించెను. నాలుగు ద్వారములుగా అలంకరింపఁబడిన అయోధ్య పొలిమేరలయందు నివసింపఁజేయఁబడిన మునిజనుల వేదపఠనాదులచేత అప్పుడే సృష్టినిజేయుచున్న బ్రహ్మదేవునిమూర్తివలె ప్రకాశించెను. నాలుగుద్వారము లలో వేదోచ్చారణము, అసంఖ్యాకజనోల్బణము, బ్రహ్మయొక్క సద్యఃసృష్టిని దల పించుచుండెనని భావము. "బభౌ" భా-దీప్తౌ" ధాతువునకు లిట్ ప్ర. పు. ఏ. "బభౌ, బభతుః, బభుః" ఇత్యాది.

శ్లో. శ్లాఘ్య స్త్యాగోఽపి వైదేహ్యా. పత్యుః, ప్రాగ్వంశవాసినః,
అనన్యజానేః సైవాసీ ద్యస్మా జ్జాయా హిరణ్మయీ. 61

వ్యాఖ్య : వైదేహ్యాః-సీతయొక్క, త్యాగః అపి-త్యాగముగూడ, శ్లాఘ్యః-మెచ్చుకొనఁదగినట్టిదే. (కుతః-ఎందుకనగా) యస్మాత్-ఏకారణమువలన, ప్రాగ్వంశవాసినః-ప్రాచీనస్థూణ మను పేరుగల యజ్ఞశాలయందున్నవాఁడును, అనన్యజానేః-మరియొకభార్యలేనట్టి పత్యుః-ప్రభువగు రామునికి, హిరణ్మయీ-సువర్ణముతో నిర్మితయైన, సా, ఏవ, జాయా-ఆ సీతయే భార్య, ఆసీత్-అయ్యెనో సీతాపరి త్యాగముగూడ మెచ్చఁదగినదే. కారణమేమనగా యజ్ఞశాలయందు మరియొకభార్య లేనందున సువర్ణముతో సీతామూర్తిని నిర్మించి యామెనే భార్యనుగా స్వీకరించెను గనుక. అనఁగా రామునికి సీతపై అనన్య సామాన్యమగు ప్రేమ యుండుటచేతనే మరియొకజాయను చేపట్టక, సీతనే బంగారుబొమ్మనుగా నిర్మింపఁజేసి, "ధర్మేచ, అర్థేచ నాతిచరామి" యని పెండ్లికాలమునఁజేసిన ప్రతిజ్ఞను పాలించి, యజ్ఞఫలభాగి నినిగా సహధర్మచారిణినే తన ప్రక్కన నుంచుకొనుట కంటే రాముఁడు సీతపైఁ జూపవలసిన ప్రేమగాని, సీత కింతకంటే కోరవలసిన భాగ్యముగాని యే మున్నది? కనుక సీతాపరిత్యాగముసైతము ఒకవిధముగా మెచ్చఁదగినదే యని కాళిదాసు హృదయము.

శ్లో. విధే రధికసంభార స్తతః ప్రవవృతే మఖః,
అసన్ యత్ర క్రియావిఘ్నా రాక్షసా ఏవ రక్షిణః. 62

వ్యాఖ్య : తతః-అట్లు స్వర్ణసీతాదులతో సిద్ధపరుపఁబడిన పిమ్మట, విధేః-శాస్త్రనియమముకంటే, అధికసంభారః-మించిన పరికరములుగల, మఖః-యజ్ఞము, ప్రవవృతే-ప్రారంభమయ్యెను. యత్ర-ఏయజ్ఞమునందు, క్రియావిఘ్నాః-అనుష్ఠానవిఘాతుకులైన, రాక్షసాః,ఏవ-రాక్షసులే, రక్షిణః-రక్షకులు, అసన్-అయియుండిరో, సర్వత్ర యజ్ఞములను ధ్వంసముఁజేయువారు రాక్షసులేయైనను, ఈ రామాశ్వమేధమునందు విభీషణాది రాక్షసులే రక్షకులై యున్నందున, శాస్త్రము చెప్పిన దానికంటె నధికమగు సంభారము గూర్పఁబడిన యజ్ఞము ప్రారంభమయ్యెనని భావము. "ప్రవవృతే" ప్రపూర్వక వృతు-వర్తనే. లిట్.

శ్లో. అథ ప్రాచేతసోపజ్ఞం రామాయణ మిత స్తతః,
మైథిలేయౌ కుశలవౌ జగతు ర్గురుచోదితౌ. 63

వ్యాఖ్య : అథ-అట్లుయజ్ఞము మొదలయిన పిమ్మట, మైథిలేయౌ-సీతాకుమారులగు, కుశలవౌ-కుశలవులు, గురుచోదితౌ(సంతౌ)-గురువగు వాల్మీకిచేత ప్రేరేపింపఁబడినవారగుచు, ప్రాచేతసోపజ్ఞం-వాల్మీకిచేత మొదటిసారిగా రచింపఁబడిన, రామాయణం-రామాయణమను కావ్యమును, ఇత స్తతః-ఇచ్చటను అచ్చటను, జగతుః-గానముచేసిరి. రాముఁ డశ్వమేధమును జేయుకాలమున కుశలవులు గురువైన వాల్మీకిచేత ప్రోత్సహింపఁబడినవారై వాల్మీకి క్రొత్తగా రచించిన రామాయణ కావ్యమును అయోధ్యానగరమునందు అచ్చటచ్చట గానముచేసిరి. "ప్రచేతసః పుత్రః ప్రాచేతసః" అని విగ్రహము. వాల్మీకికి "ఋక్షుఁ" డని జన్మనామము. "ప్రాచేతసః" అని వంశనామము. "వాల్మీకి" బిరుదనామము. ఇతఁడు భృగు వంశమువాఁడు. "ఉపజ్ఞ" యనఁగా ప్రప్రథమునఁదెలిసికొనుట. "ఉపజ్ఞా జ్ఞానమాద్యంస్యాత్" అని యమరము. "అయ్యతే జ్ఞాయతే అనేన ఇత్యయనం చరితం, రామస్య అయనం రామాయణం (రామచరితం) అని విగ్రహము. "జగతుః" గై-శబ్దేధాతువునకు లిట్ ప్ర. పు. ద్వివచనము. జగౌ, జగతుః, జగుః ఇత్యాది.

శ్లో. వృత్తం రామస్య వాల్మీకేః కృతి స్తౌ కిన్నరస్వనౌ,
కిం త ద్యేన మనో హర్తు మలం స్యాతాం న శృణ్వతామ్ 64

వ్యాఖ్య : రామస్య, వృత్తం-కావ్యవస్తువు రామచరితము; వాల్మీకేః,కృతిః-రచన వాల్మీకికావ్యము, తౌ-ఆ కుశలవులు, కిన్నరస్వనౌ-కిన్నరకంఠులగు గాయకులు, (పునః-మరి) తత్, కిం-అది యేమున్నది? యేన-ఏ కారణముచేత, తౌ-ఆ కుశలవులు, శృణ్వతాం-వినుచున్నవారియొక్క, మనః-మనస్సును,హర్తుం-ఆకర్షించుటకు, అలం-సమర్థులు, న, స్యాతాం-కాకపోవుదు రనుటకు. కావ్యవస్తువు లోకోత్తర గుణోత్తరుఁడగు రాముని చరితము; గేయమగు కావ్యమా ఆదికవి వాల్మీకి కృతి; గాయకులగు కుశలవులా? కింనరకంఠస్వరముగలవారు; ఇఁక నేకారణమున వారి రామాయణగానము శ్రోతలచిత్తమును రంజింపఁజాలకపోయెనని చెప్పఁగలము? సర్వము సరసమే, అందుచే ఆ రామాయణగానమును ఆసక్తులై వినుచుండిరని భావము. "స్యాతాం" అస-భువి ధాతువునకు విధి లిఙ్. ప్ర.పు ద్వి. స్యాత్, స్యాతాం, స్యుః. ఇత్యాదిరూపము లుండును.

శ్లో. రూపే గీతే చ మాధుర్యం తయో స్తజ్జై ర్నివేదితమ్,

దదర్శ సానుజో రామః శుశ్రావచ కుతూహలీ. 65

వ్యాఖ్య : తజ్జైః-అభిజ్ఞులగువారిచేత, నివేదితం-తెలుపఁబడిన, తయోః-ఆ కుశలవులయొక్క, రూపే-ఆకారమునందునను, గీతేచ-గానమునందునను గల, మాధుర్యం-రామణీయకమును, సానుజః-తమ్ములతోఁ గూడిన రామః-రాముఁడు, కుతూహలీ-ఆనందముగలవాఁడగుచు. దదర్శ-చూచెను, శుశ్రావచ-వినెనుగూడ. కుశలవుల రూపమునందు, గానమునందుఁగల మాధుర్యము నెఱిఁగినవారు చెప్పఁగా రాముఁడు సానుజుఁడై వెళ్ళి చూచి, విని యానందించెను. "దదర్శ" దృశిర్-ప్రేక్షణే, "శుశ్రావ" శ్రు-శ్రవణె ధాతువులకు లిట్ రూపములు.

శ్లో. తద్గీత శ్రవణై కాగ్రా సంస దశ్రుముఖీ బభౌ,

హిమనిష్యందినీ ప్రాత ర్నిర్వాతేవ వనస్థలీ. 66

వ్యాఖ్య : తద్గీత శ్రవణైకాగ్రా-తత్-ఆకుశలవులయొక్క, గీతశ్రవణ-గానమును వినుటయందు, ఏకాగ్రా-నిశ్చలచిత్తముగలదియు, అశ్రుముఖీ-ఆనంద బాష్పములుగల ముఖముగలదియు నగు, సంసత్-సభ, ప్రాతః- ప్రాతఃకాలమున, హిమనిష్యందినీ-మంచునురాల్చునదియై, నిర్వాతా-గాలిలేనిదియైయున్న, వనస్థలి,

శివ-వనభూమివలె, బభౌ-ప్రకాశించెను. సానుజుఁడగు రామునితోఁగూడియున్న సభయంతయు నేకాగ్ర చిత్తమున వారిగానమునువినుచు, ఆనందాశ్రువులురాల్చుచు ప్రాతఃకాలమునందు నిష్కంపముగా హిమబిందువులు రాల్చు వనస్థలివలె శోభించెనని భావము. అలంకారము : ఉపమ.

శ్లో. వయోవేషవిసంవాది రామస్య చ తయో స్తదా,
జనతా ప్రేక్ష్య సాదృశ్యం నాక్షికంపం వ్యతిష్ఠత. 67

వ్యాఖ్య : జనతా-జనసమూహము, వయోవేషవిసంవాది—వయః-వయస్సుచేత, వేష-వస్త్రధారణముచేత మాత్రమే, విసంవాది-విలక్షణమగు (వేరుగానుండిన), తదా-అప్పుడి, తయోః-ఆకుశలవుల యొక్కయు, రామస్యచ-రామునియొక్కయు, సాదృశ్యం-పోలికను, ప్రేక్ష్య-చూచి, నాక్షికంపం-కన్నులు గదలింపక, వ్యతిష్ఠత-నిలిచియుండెను. వయస్సునందు వస్త్రధారణమునందు మాత్రమే భేదము గన్పడుచున్న కుశలవులకును రామునికినిగల పోలికనుజూచి యాశ్చర్యపడుచున్న జనము కనులప్పగించి చలనములేక నిలిచియుండెనని భావము. వ్యతిష్ఠత (వి + అతిష్ఠత) సమ్, అవ, ప్ర, వి అను ఉపసర్గలతోఁజేరినప్పుడు "స్థా" ధాతువు ఆత్మనేపదిగా మారును. ఇది "ష్ఠా-గతినివృత్తౌ" అను (స్థా) ధాతువునకు ఆత్మనేపది లఙ్. ప్ర. ఏ.

శ్లో. ఉభయో ర్న తథా లోకః ప్రావీణ్యేన విసిష్మియే,
నృపతేః ప్రీతిదానేషు వీతస్పృహతయా యథా. 68

వ్యాఖ్య : లోకః-జనము, ఉభయోః-కుశలవులయొక్క, ప్రావీణ్యేన-నైపుణ్యముచేత, తథా-ఆవిధముగా, నవిసిష్మియే-ఆశ్చర్యమునుపొందలేదు. యథా-ఏ విధముగా నైతే, నృపతేః-రాజగురామునియొక్క, ప్రీతిదానేషు-ప్రేమచేతఁజేయు బహుమానములయందు, వీతస్పృహతయా - ఆశలేని వారగుట చేత, విసిష్మియే-ఆశ్చర్యమును బొందెనో! మధురగానముచేసిన కుశలవులను ప్రీతితో రాముఁడు సత్కరింపబోగా వారు మాకెట్టిదానములును అక్కరలేదని నిస్పృహను వెల్లడించిరి. ఆదృశ్యమును జూచుచున్నజనము కుశలవులగాన నైపుణ్యమున కాశ్చర్యపడినదానికంటే ప్రతిఫలాపేక్షలేని వారినైస్పృహ్యమున కెక్కువగా నాశ్చర్యపడిరని భావము. "విసిష్మియే" (వి + సిష్మియే) ష్మిఙ్-ఈషద్ధసనే

(ఆత్మనేపది) ధాతువునకు "వి" అను ఉపసర్గతోఁగూడి లిట్ ప్ర పు. ఏ. విసిష్మియే, విసిష్మియాతే. విసిష్మియిరే. ఇత్యాది ఈషద్ధసనమనఁగా చిఱు నగవు.

శ్లో. గేయే కోను వినేతా వాం కస్య చేయం కృతిః కవేః,
ఇతి రాజ్ఞా స్వయం పృష్టౌ తౌ వాల్మీకి మశంసతామ్. 69

వ్యాఖ్య : గేయే-సంగీతమునందు, కోను (కః, ను)-ఎవ్వఁడు, వాం-మీ యిద్దఱికి, వినేతా-శిక్షకుఁడు? ఇయం, చ-ఇదియు, కస్య కవేః-ఏకవియొక్క, కృతిః-కావ్యము? ఇతి-ఇట్లని, రాజ్ఞా-రాజుచేత, స్వయం, పృష్టౌ-స్వంతముగా అడుగఁబడిన, తౌ-ఆకుశలవులు, వాల్మీకిని, అశంసతాం-చెప్పిరి. రాముఁడు స్వయముగా మీకు సంగీతమును నేర్పినదెవరు? మీరు పఠించిన యీ కావ్యమును రచించిన దెవరు? అని యడుగగా కుశలవులు మాకుగానము నేర్పినవాఁడును, ఈ కావ్యమును రచించినవాఁడును వాల్మీకియే యని చెప్పిరి. "స్వయం" అన పదము రాజైన రాముఁడు ఇతరులద్వారా ప్రశ్నింపక వారియందుఁగల ప్రేమగౌరవములవలన స్వంతముగాఁ ప్రశ్నించెనని సూచించుచున్నది. "అశంసతామ్" శంసు-స్తుతౌ ధాతువునకు లఙ్. ప్ర. ద్వి. అశంసత్, అశంసతాం, అశంసన్. ఇత్యాది.

శ్లో. అథ సావరజో రామః ప్రాచేతస ముపేయివాన్,
ఊరీకృ త్యాత్మనో దేహం రాజ్య మస్మై న్యవేదయత్. 70

వ్యాఖ్య : అథ-పిమ్మట, సావరజః-తమ్ములతోఁగూడిన, రామః-రాముఁడు, ప్రాచేతసం-వాల్మీకిని, ఉపేయివాన్-చేరినవాఁడగుచు, ఆత్మనః-తన యొక్క, దేహం-శరీరమును, ఊరీకృత్య-నిలుపుకొన్నవాడై రాజ్యం-సమస్తరాజ్యమును, అస్మై-వాల్మీకికొఱకు, న్యవేదయత్-సమర్పించెను. వాల్మీకిసన్నిధికి సానుజుఁడై వెళ్ళి రాముఁడు తనదేహమును తప్ప సర్వరాజ్యమును అమహర్షికి అర్పించెనని భావము. న్యవేదయత్ (ని+అవేదయత్) "ని" ఉపసర్గతోఁగూడిన విద-జ్ఞానేధాతువునకు ప్రేరణార్థకము. లఙ్. ప్ర.పు.ఏ.

శ్లో. స తా నాఖ్యాయ రామాయ మైథిలేయౌ తదాత్మజౌ,
కవిః కారుణికో వవ్రే సీతాయాః సంపరిగ్రహమ్. 71

వ్యాఖ్య : కారుణికః-దయాళువైన, సః కవిః-ఆవాల్మీకి, రామాయ-రామునికొఱకు; తౌ, మైథిలేయౌ-ఆసీతాకుమారులను, తదాత్మజౌ-రామునికుమారులనుగా ఆఖ్యాయ-వివరించిచెప్పి, సీతాయాః-సీతయొక్క, సంపరిగ్రహం-స్వీకారమును, వవ్రే-కోరెను. అట్లు వినయవినమ్రుఁ యున్న రామునికి ఈకుమారులు నీపుత్రులేయని వివరించిచెప్పి, కరుణాళుఁ న వాల్మీకి సీతను మళ్ళీ స్వీకరింపు మని కోరెను. "వవ్రే" వృఞ్-వరణే (ఆ త్మనేపది) ధాతువు లిట్ ప్ర.ఏ. "వృణుతే" అనిలట్; వవ్రే, వవ్రాతే, వవ్రిరే. ఇత్యాది లిట్ రూపములుండును.

శ్లో. తాత! శుద్ధా సమక్షం నః స్నుషా తే జాతవేదసి,
దౌరాత్మ్యా ద్రక్షస స్తాం తు నాత్రత్యాః శ్రద్దధుః ప్రజాః. 72

వ్యాఖ్య : హేతాత-తండ్రీ! తే-నీయొక్క, స్నుషా-కోడలగుసీత, నః-మా యొక్క, సమక్షం-కన్నులయెదుట, జాతవేదసి-అగ్నిహోత్రునియందు, శుద్ధా-శుద్ధినిపొందియున్నది. తు-కాని, రక్షసః-రాక్షసునియొక్క, దౌరాత్మ్యాత్-దుర్భావమువలన, అత్రత్యాః-ఇచ్చటనున్న, ప్రజాః-జనులు, తాం-ఆమెను, నశ్రద్దధుః-విశ్వసింపలేదు. సీతను సీ కరింపుమని కోరిన వాల్మీకితో. రాముఁడు "తండ్రీ! నీకోడలయిన సీత మాకం యెదుట అగ్నిలో ప్రవేశించి పరిశుద్ధురాలైనది, అగ్నియు నామెపవిత్రత ధృవపరచెను, మాకు సంపూర్ణవిశ్వాసమున్నది. కాని దురాత్ముఁడగు రావణునివద్ద నుండివచ్చుటచేత నయోధ్యావాసులయన జనులు మా త మామెను నమ్ముటలేదు, నేనేమి చేయఁగలను?" అని బదులుపలికె నని భావము. "శ్రద్దధుః" లిట్. ప్ర బ.

శ్లో. తాః స్వచారిత్ర ముద్దిశ్య ప్రత్యాయయతు మైథిలీ,
తతః పుత్రవతీ మేనాం ప్రతిపత్స్యే త్వదాజ్ఞయా. 73

వ్యాఖ్య : మైథిలీ-సీత, స్వచారిత్రం-తననడవడిని, ఉద్దిశ్య-ఉద్దేశించి తాః-అప్రజలను, ప్రత్యాయయతు-నమ్మించునుగాక, తతః-అట్లుచేసిన పిమ్మ పుత్రవతీం, ఏనాం-పుత్రువంతురాలైనయీమెను, త్వదాజ్ఞయా-నీయాజ్ఞచేత, ప్ర పత్స్యే-స్వీకరింపఁగలను మరియు, సీత తన నడవడిచేత తానుదోషరహితయై

ప్రజలను నమ్మించినట్లయితే పిమ్మట మీ యాజ్ఞప్రకారము పుత్రవతియగు నీమెను తప్పక స్వీకరింపఁగలనని చెప్పెను. "ప్రత్యాయయతు" పతి + ఆయయతు. ప్రతిపూర్వకమగు "అయ-గతౌ" అను ధాతువునకు ప్రేరణా మున (ణిజంతము) లోట్ ప్ర.పు.ఏ. "ప్రతిపత్స్యే" ప్రతిపూర్వక "పద-గతౌ" తువునకు (ఆత్మనే పది) ల్యట్ ఉత్తమ పు.ఏ.

శ్లో. ఇతి ప్రతిశ్రుతే రాజ్ఞా జానకీ మాశ్రమా న్మునిః,
శిష్యై రానయయామాస స్వసిద్ధిం నియమై రివ. 74

వ్యాఖ్య : రాజ్ఞా-రామునిచేత, ఇతి-ఇట్లు, ప్రతిశ్రుతే-ప్రతి చేయఁబడఁగా మునిః-వాల్మీకి, ఆశ్రమాత్-ఆశ్రమమునుండి, జానకీం-సీతను, శి ష్యైః-శిష్యులచేత, స్వసిద్ధిం-స్వార్థసిద్ధిని, నియమైః, ఇవ-తపోనియమములచేతవలె, ఆ యయామాస-తీసుకరప్పించెను. రాముఁ డట్లు ప్రతిజ్ఞ చేయఁగా వాల్మీకి శిష్యులనుఁబంపి యా శ్ర మమునుండి సీతను రప్పించెను. ఆ రప్పించుట వాల్మీకి తపస్సులచేత కార్యసి ని పొందినట్లుండెనట. అలంకారము: ఉపమ. "ఆనయయామాస" ఆఙ్ పూర్వక నీ - ప్రాపణే ధాతువునకు ణిజంతము. లిట్ ప్ర.పు.ఏ.

శ్లో. అన్యేద్యు రథ కాకుత్స్థః సంనిపాత్య పురౌకసః,
కవి మాహ్వాయయామాస ప్రస్తుతప్రతిపత్తయే. 75

వ్యాఖ్య : అథ-పిమ్మట, కాకుత్స్థః-రాముఁడు, అన్యేద్యుః-మరియొక దినమున, ప్రస్తుత ప్రతిపత్తయే-ప్రస్తుతకార్యాను సంధానము కొఱకు, పురౌక సః-నగరవాసులను, సంనిపాత్య-ఒకచోటఁజేర్చి, కవిం-వాల్మీకిని, ఆహ్వాయయా మాస-ఆహ్వానించెను. రాముఁడు తన మాటకు వాల్మీకియు, సీతయు నంగీకరిం పఁగా అయోధ్యకుఁ దిరిగి వచ్చిన పిమ్మట ఒకరోజున ప్రస్తుతకార్యమును నిర్వ హించుటకై నగరవాసుల నందఱిని నొకచోటఁజేర్చి వాల్మీకి మునిని పిలిపించెను. "ఆహ్వాయయామాస" ఆఙ్ పూర్వక "హ్వేఞ్-స్పర్ధాయాం శబ్దేచ" అను ధాతువు నకు ప్రేరణార్థకము (ణిజంతము) లిట్. ప్ర.పు.ఏ.

శ్లో. స్వరసంస్కారవత్యాసౌ పుత్రాభ్యా మథ సీతయా,
ఋచే వోదర్చిషం సూర్యం రామం మునీ రుపస్థితః. 76

వ్యాఖ్య : అథ-ఆహ్వానమందిన పిమ్మట, స్వరసంస్కారవత్యా-స్వర-ఉదాత్తాది స్వరములును, సంస్కారవత్యా-శబ్దశుద్ధియుఁ గలిగిన, ఋచా-సావిత్రీ ఋక్కుచేత (గాయత్రీ మంత్రము చేత), ఉదర్చిషం, సూర్యం, ఇవ-ఉదయించు చున్న సూర్యునివలె, పుత్రాభ్యాం-ఇద్దఱు కుమారులతోనున్న, సీతయా-సీతా దేవితో, రామం-రాముని, అసౌ-ఆవాల్మీకి, ఉపస్థితః-సేవించెను. సర్వసంస్కార ములుగల గాయత్రీ మంత్రముచేత సూర్యుని ఉపాసించినట్లు పుత్రులతోడి సీతతోఁ గలిసి వాల్మీకి రాముని దర్శించె నని భావము. స్వరసంస్కారములు కుశలవుల కును, సావిత్రీఋక్కు సీతకును, సూర్యుఁడు రామునికిని ఉపమానములై వారి పవిత్రతను, నిత్యసంబంధమును వెల్లడించుచున్నవి. అలంకారము: ఉపమ.

శ్లో. కాషాయపరివీతేన స్వపదార్పితచక్షుషా,
అన్వమీయత శుద్ధేతి శాంతేన వపుషైవ సా. 77

వ్యాఖ్య : కాషాయపరివీతేన-కషాయవర్ణముగల యుత్తరీయము గలదియు, స్వపదార్పితచక్షుషా-తనపాదములందుంచిన చూపు గలదియు, శాంతేన-ప్రసన్న మైన, వపుషా, ఏవ-దేహముచేతనే, సా-ఆ సీత, శు -పవిత్రురాలు, ఇతి-అని, అన్వమీయత-ఊహింపఁబడినది. కషాయపురంగు వ మును గప్పుకొని, తనపాద ములందే చూపు నిలుపుకొని నడచుచు, ప్రసన్నమ దేహముతోనే సీత పరిశుద్ధు రాలేయని చూ జను లూహించిరని భావము. "అన్వమీయత" అను ఉపసర్గతోఁ గూడిన "మాఙ్-మానే" ధాతువునకు కర్మణి లఙ్ ప్ర పు.ఏ.

శ్లో. జనా స్తదాలోకపథా త్ప్రతిసంహృతచక్షుషః,
తస్థు స్తే ఽవాఙ్ముఖాః సర్వే ఫలితా ఇవ శాలయః. 78

వ్యాఖ్య : తదాలోకపథాత్-ఆ సీతయొక్క దర్శనమార్గమునుండి, ప్రతి సంహృతచక్షుషః-తొలగించుకొన్న చూపులుగలవారై, తే, సర్వేజనాః-ఆజనులందఱు ఫలితాః-పండిన, శాలయః ఇవ-వరిమొక్కలవలె, అవాఙ్ముఖాః-నేలకు వంచిన ముఖములుగలవారై, తస్థుః-నిలుచుండిరి. పండిన వరిమొక్కలవలె తలలువంచి సీతనుజూచు మార్గమునుంచి చూపులు త్రిప్పుకొని జనులందఱు నిలుచుండిరనియు, వారట్లుచేయుటకుఁ గారణము సీతను అనుమానించియుండుట పొరపాటనియు భావము. "తస్థుః" ష్ఠా-గతినివృత్తౌ ధాతువునకు లిట్ ప్ర.పు. బహువచనము.

శ్లో. తాం దృష్టివిషయే భర్తు ర్మునిరాస్థితవిష్టరః,
కురు నిఃసంశయం వత్సే! స్వవృత్తే లోక మిత్యశాత్. 79

వ్యాఖ్య : ఆస్థితవిష్టరః-పవిత్రాసనముపైఁ గూర్చున్న, మునిః-వాల్మీకి, హేవత్సే!-ఓఅమ్మాయీ! (సీతా!), భర్తుః-నీభర్తయొక్క, దృష్టివిషయే-సమక్షమున, స్వవృత్తే-నీనడవడివిషయమున, లోకం-జనమును, నిఃసంశయం-అనుమానములేనిదానినిగా, కురు-చేయుము, ఇతి-ఇట్లని, తాం-ఆసీతను-అశాత్-ఆజ్ఞాపించెను. రాముఁడు అయోధ్యాజనులు గల ఆసభామధ్యమున పవిత్రాసనముఁ గూర్చున్న వాల్మీకిముని సీతనుద్దేశించి అమ్మాయీ! నీభర్తయెదుట నీజనులందఱి ని నీనడతయందుఁగల సందేహమును దీర్పు మని శాసించెను. "అశాత్" శాసు-అనుశిష్టౌ ధాతువునకు భూతార్థక లఙ్. ప్ర. పు.ఏ.

శ్లో. అథ వాల్మీకి శిష్యేణ పుణ్య మావర్జితం పయః,
ఆచ మ్యోదీరయామాస సీతా సత్యాం సరస్వతీమ్. 80

వ్యాఖ్య : అథ-అట్లు వాల్మీకి యాజ్ఞాపించిన పిమ్మట, వాల్మీకి శిష్యేణ-వాల్మీకియొక్క శిష్యునిచేత, ఆవర్జితం-చేతియందు వంచఁబడిన, పుణ్యం, పయః-పవిత్రమగు జలమును, ఆచమ్య-ఆచమనముచేసి, సీతా-సీతాదేవి, సత్యాం-నిజమైన, సరస్వతీం-వాక్కును, ఉదీరయామాస-పలికెను. వాల్మీకి శాసనమును పాటించినసీత మునిశిష్యుఁడు తన చేతిలో పోసిన పవిత్రజలముతో నాచమనము చేసి ముందు చెప్పఁబోవురీతిగా తన విషయమును దెలుపు సత్యవచనమును బలికెనని భావము. "ఉదీరయామాస" (ఉత్ + ఈరయామాస) ఉత్ ఉపసర్గతోఁగూడిన ఈర-గతౌ, క్షేపేచ అను ధాతువునకు లిట్. ప్ర.పు.ఏ. (స్వార్థణిజంతము).

శ్లో. వాఙ్మనః కర్మభిః పత్యౌ వ్యభిచారో యథా న మే,
తథా విశ్వంభరే దేవి! మా మంతర్ధాతు మర్హసి. 81

వ్యాఖ్య : వాఙ్మనః కర్మభిః-వాక్కుచేతగాని, మనస్సుచేతగాని, క్రియచేతగాని, పత్యౌ-భర్తవిషయమున, మే-నాకు, వ్యభిచారః-స్ఖాలిత్యము, నయథా-లేకయున్నచో, తథా-అట్లయినయెడల, హేవిశ్వంభరే, దేవి-ఓభూదేవీ! మాం-నన్ను, అంతర్ధాతుం-నీగర్భమునందుంచుకొనుటకు, అర్హసి-తగుదువు. ఓ భూదేవీ! నేను

భర్తవిషయమున వాఙ్మనః కర్మలచేత అతిక్రమణము లేనిదాననేని నన్ను నీలోఁ జేర్చుకొనుము" అని సీత పలికె నని భావము. "అర్హసి" అర్హ-పూజాయాం అను ధాతువునకు లట్. మ.పు.ఏ.

శ్లో. ఏవ ముక్తే తయా సాధ్వ్యా రంధ్రా త్సద్యోభవా ద్భువః,
శాతహ్రాద మివ జ్యోతిః ప్రభామండల ముద్యయౌ. 82

వ్యాఖ్య : సాధ్వ్యా-పతివ్రతయగు, తయా-సీతాదేవిచేత, ఏవం-ఇట్లు, ఉక్తే-పలుకఁబడగా, సద్యోభవాత్-అప్పుడే కలిగిన, భువః, రంధ్రాత్-భూమి యొక్క రంధ్రమునుండి, శాతహ్రాదం-మెఱుపునకు సంబంధించిన, జ్యోతిః, ఇవ-తేజస్సువలె, ప్రభామండలం-కాంతిమండలము, ఉద్యయౌ-పైకిలేచెను. అట్లు పతివ్రతయగు సీత పలుకగానే అప్పుడే యేర్పడిన భూరంధ్రమునుండి మెఱుపువంటి యొక మండలాకారముగల కాంతిపుంజము పైకి వచ్చెనని భావము. "శతహ్రదాయాః ఇదం శాతహ్రాదం" అనివిగ్రహము "శంపా శతహ్రదా" అని యమరము. "ఉద్యయౌ" (ఉత్ + యయౌ) ఉత్పూర్వక యా-ప్రాపణే ధాతువునకు లిట్. ప్ర పు.ఏ. ప్రాపణమనఁగా గమనమని యర్థము.

శ్లో. తత్ర నాగఫణోత్క్షిప్త సింహాసన నిషేదుషీ,
సముద్రరశనా సాక్షా త్ప్రాదురాసీత్ వసుంధరా. 83

వ్యాఖ్య : తత్ర-ఆప్రభామండలమునందు, నాగఫణోత్క్షిప్త సింహాసన నిషేదుషీ-నాగఫణా-ఆదిశేషుని ఫణములచేత, ఉత్క్షిప్త-పైకియెత్తఁబడిన, సింహాసన-సింహాసనమునందు, నిషేదుషీ-కూర్చునియున్నదియు, సముద్రరశనా-సాగరములు మొలనూలుగాఁ గలదియునగు, సాక్షాత్ వసుంధరా-భూదేవియే, ప్రాదురాసీత్-ఆవిర్భవించెను. అట్లు భూరంధ్రమునుండి పైకివచ్చిన కాంతివలయమునందు ఆదిశేషుఁడు తన ఫణములయందు నిల్పుకొన్న సింహాసనపైఁ గూర్చున్న సాక్షాత్ భూదేవి ఆవిర్భవించి యందఱికిని దర్శనమిచ్చె నని భావము. "ప్రాదురాసీత్." ప్రాదుః అనునవ్యయముతోఁగూడిన అస-భువి అను ధాతువునకు లజ్ ప్ర.పు.ఏ.

శ్లో. సా సీతా మంక మారోప్య భర్తృప్రణిహితేక్షణాం,
మా మేతి వ్యాహరత్యేవ తస్మిన్ పాతాల మభ్యగాత్. {

వ్యాఖ్య : సా-అట్లు ప్రత్యక్షమైన భూదేవి, భర్తృప్రణిహితేక్షణాం-భర్త యందుంచఁబడిన చూపులుగల, సీతాం-సీతను, అంకం, ఆరోప్య-తొడపై నెకి ంచు కొని, తస్మిన్-రాముఁడు, "మామా" ఇతివ్యాహరతి, (సతి) ఏవ-వద్దు వ అని పలుకుచున్న వాఁడైనప్పటికిని, పాతాలం-పాతాళలోకమును, అభ్యగాత్- రెను. అట్లు ఆవిర్భవించిన భూదేవి, భర్తపై నుంచిన చూపులుఁగల సీతను తన తొడపై నెక్కించుకొని, రాముఁడు "వద్దు వద్దు" అని మొరపెట్టుచున్నప్పటికిని, ఆతని మాటలను లెక్కచేయక పాతాళలోకమునకు వెళ్ళిపోయెనని భావము. "అభ్యగాత్" (అభి + అగాత్) అభి పూర్వకమగు ఇణ్ ధాతువునకు లుఙ్.

శ్లో. ధరాయాం తస్య సంరంభం సీతాప్రత్యర్పణైషిణః,

గురు ర్విధిబలాపేక్షీ శమయామాస ధన్వినః. 85

వ్యాఖ్య : సీతాప్రత్యర్పణైషిణః-సీతను తనకు మరల నియ్యవలెనని కోరుచున్నట్టివాఁడును, ధన్వినః-స్వీకరింపబడిన ధనుస్సుగలవాఁడును నగు, తస్య-ఆరామునియొక్క, ధరాయాం, సంరంభం-భూదేవి విషయము నందలి యుద్రేకమును, విధిబలాపేక్షీ-దైవశక్తిని గుర్తించిన, గురుః-వాల్మీకి, శమయా మాస-శాంతింపఁజేసెను. భూదేవి సీతను దీసికొనిపోవఁగా రామునికిఁ గోపము వచ్చి తనసీతను తనకు మరల నర్పించుమని ధనుస్సునెక్కుపెట్టి బాణమును భూదేవిపై నేయుటకు సిద్ధపడఁగా వాల్మీకి విధివిలాసము అపరిహార్యమనియు, అది యట్లే జరుగవలసి యున్నదనియుఁ జెప్పి రాముని శాంతింపజేసెనని భావము. "శమయామాస" శము-ఉపశమే ధాతువునకు ప్రేరణార్థకము (ణిజంతము). లిట్ ప్ర.పు.ఏ.

శ్లో. ఋషీన్ విసృజ్య యజ్ఞాంతే సుహృదశ్చ పురస్కృతాన్,

రామః సీతాగమం స్నేహం నిదధే తదపత్యయోః. 86

వ్యాఖ్య : రామః-రాముఁడు, యజ్ఞాంతే-అశ్వమేధయాగము ముగింపునందు, పురస్కృతాన్-సత్కరింపఁబడిన, ఋషీన్-యజ్ఞక్రియను నిర్వహించిన మును లను, సుహృదః, చ-యజ్ఞదర్శనార్థమై వచ్చిన మిత్రులను, విసృజ్య-పంపివేసి, సీతాగమం-సీతయందుండిన, స్నేహం-తన ప్రేమను, తదపత్యయోః-ఆమె కుమా రులయందు, నిదధే-ఉంచుకొనెను. యజ్ఞమున కాహ్వానింపఁబడిన ఋత్విజులను,

బంధుమిత్రాదులను సత్కరించిపంపి, తనకు సీతయందుండిన ప్రేమను కుమారు లగు కుశలవులయందు వాత్సల్యమునుగా మార్చుకొని యానందమును బొందుచు రాజ్యము నేలెనని భావము. "నిదధే" "ని" ఉపసర్గతోఁ గూడిన (డు) ధాఞ్-ధారణపోషణయోః (ఆత్మనేపది) ధాతువునకు లిట్. ప్ర.పు.ఏ. క్రియాఫలము కర్తను జెందుచున్నది గావున ఆత్మనేపదిగా ధాతువును ప్రయోగించెను.

శ్లో. యుధాజిత శ్చ సందేశాత్ స దేశం సింధునామకమ్,
దదౌ దత్తప్రభావాయ భరతాయ భృతప్రజః. 87

వ్యాఖ్య : భృతప్రజః-భరింపఁబడిన ప్రజలుగల, సః-రాముఁడు, యుధాజితః-భరతునిమేనమామయగు యుధాజిత్తుయొక్క, సందేశాత్-సందేశమువలన, సింధునామకం-"సింధు" అను పేరుగల, దేశం-దేశమును, దత్తప్రభావాయ-రాజ్యపాలనమునకువలసిన యైశ్వర్యమీయఁబడిన, భరతాయ-భరతునికొఱకు, దదౌ-ఇచ్చెను. భరతుని మేనమామ యగుయుధాజిత్తు "భరతు"నికి ప్రత్యేక రాజ్యపాలనమునకుఁ గొంతదేశము నిమ్ము" అని రామునికి సందేశమును బంపఁగా రాముఁడు రాజ్యపాలనమున కవసరమగు వస్తువాహనాద్యైశ్వర్యముతో సింధుదేశమును భరతునికిచ్చెను. "దదౌ" దాఞ్-దానే ధాతువునకు లిట్. ప్ర.పు.ఏ. కైక యిష్టసిద్ధి కిది సూచకము.

శ్లో. భరత స్తత్ర గంధర్వాన్ యుధి నిర్జిత్య కేవలమ్,
ఆతోద్యం గ్రాహయామాస సమత్యాజయ దాయుధమ్. 88

వ్యాఖ్య : తత్ర-ఆసింధుదేశమునందు, భరతః-భరతుఁడు, యుధి-యుద్ధమునందు, గంధర్వాన్-గంధర్వులను, నిర్జిత్య-ఓడించి, కేవలం-ఒక,, ఆతోద్యం-వీణాదికమును, గ్రాహయామాస-పట్టుకొనునట్లుచేసెను (పట్టించెను). ఆయుధం-ఆయుధమును, సమత్యాజయత్-విడుచునట్లుచేసెను (విడిపించెను). భరతుఁడు సపరివారముగా సింధుదేశమునకు వెళ్ళి, యచ్చట నివసించుచున్న గంధర్వజాతివారు ఎదుర్కొనఁగా, యుద్ధమునందు వారినోడించి, శాంతిని నెలకొల్పి వారికిష్టమైన గాంధర్వకలా "ప్రావీణ్యమునకు వీణలు" పట్టుకొనునట్లును, యుద్ధములకై ఆయుధములు పట్టకుండునట్లును చేసెను. అనాఁడు సింధుదేశవాసులు గంధర్వులై యుండి రని భావము. "గ్రాహయామాస" గ్రహ-ఉపాదానే ధాతువ

ప్రేరణార్థకము (ణిజంతము) లిట్. ప్ర.పు.ఏ. సమత్యాజయత్ (సమ్ + అత్యాజయత్) 'సమ్' అను ఉపసర్గతోఁగూడిన "త్యజ-హానౌ" ధాతువునకు ప్రేరణార్థకము (ణిజంతము) భూతార్థక లఙ్. ప్ర.పు ఏ.

శ్లో. స తక్షపుష్కలౌ పుత్రౌ రాజధాన్యోస్తదాఖ్యయోః,
అభిషిచ్యాభిషేకార్హౌ రామాంతిక మగాత్పునః. 89

వ్యాఖ్య : సః-భరతుఁడు, అభిషేకార్హౌ - రాజ్యాభిషేకమునకుఁదగిన వయస్సు వచ్చిన, తక్షపుష్కలౌ-తక్షుఁడు, పుష్కలుఁడు అనుపేర్లుగల, పుత్రౌ-ఇద్దఱుకుమారులను, తదాఖ్యయోః-వారిపేర్లేయున్న, (తక్షశిల, పుష్కలావతి అనఁబడు), రాజధాన్యోః-నగరములయందు, అభిషిచ్య-పట్టాభిషేకముచేసి నిలిపి, పునః-మరల, రామాంతికం-రాముని సమీపమును, అగాత్-చేరెను. సింధుదేశమున గంధర్వులను జయించి కొంతకాలముండి, తన కొడుకులు పెద్దవారైన పిమ్మట ముఖ్యపట్టణములగు తక్షశిలా పుష్కలావతుల యందు, వరుసగా తన కుమారులగు తక్షుని, పుష్కలుని రాజ్యాధినేతలనుగా నభిషేకించి, రామభక్తిధురంధరుఁడగు భరతుఁడు తిరిగి అయోధ్యకు వచ్చి రాముని సేవించెనని భావము. "అగాత్" పూర్వమువచ్చిన క్రియ.

శ్లో. అంగదం చంద్రకేతుం చ లక్ష్మణో ఉప్యాత్మసంభవౌ,
శాసనాద్రఘునాథస్య చక్రే కారాపథేశ్వరౌ. 90

వ్యాఖ్య : లక్ష్మణః, అపి-లక్ష్మణుఁడుసైతము, రఘునాథస్య-రామచంద్రునియొక్క, శాసనాత్-ఆజ్ఞవలన, అంగదం, చంద్రకేతుం, చ-అంగదుఁడు, చంద్రకేతువనియుఁ బేర్లుగల, ఆత్మసంభవౌ-తనకుమారులను, కారాపథేశ్వరౌ-కారాపథమనుదేశమునకు ప్రభువులనుగా, చక్రే-చేసెను. రాముని యాజ్ఞవలన లక్ష్మణుఁడుగూడ తనకుమారులగు అంగదుని, చంద్రకేతువును, "కారాపథ"మను పేరుగల దేశమునకు ప్రభువులనుగాఁజేసెను. "చక్రే" డు, కృఞ్-కరణే (ఆత్మనేపది) ధాతువునకు లిట్. ప్ర.పు.ఏ.

శ్లో. ఇత్యారోపితపుత్రాస్తే జననీనాం జనేశ్వరాః,
భర్తృలోకప్రపన్నానాం నివాపాన్ విదధుః క్రమాత్. 91

వ్యాఖ్య : ఇతి-పైవిధముగా, ఆరోపితపుత్రాః-రాజ్యసింహాసనములెక్కింపఁబడిన కుమారులుగల, తే, జనేశ్వరాః-ఆరాజులు, భర్తృలోకప్రపన్నానాం-భర్త యున్న స్వర్గలోకమును జేరిన, జననీనాం-తల్లులకు, క్రమాత్-వరుసగా, నివాపాన్-శ్రాద్ధతర్పణాదులను, విదధుః-చేసిరి. అట్లు తమకుమారులను రాజ్యసింహాసనములం దెక్కించిన రామలక్ష్మణభరతశత్రుఘ్నులు స్వర్గముఁజేరిన కౌసల్యాసుమిత్రాకైకలకు వరుసగా శ్రాద్ధతర్పణాద్యంతక్రియలను చక్కగా నిర్వర్తించిరి. "విదధుః" వి పూర్వక( ) ధాఞ్-ధారణపోషణయోః ధాతువునకు లిట్ ప్ర.పు. బహువచనము.

శ్లో. ఉపేత్య మునివేషో ఽథ కాలః ప్రోవాచ రాఘవమ్,
రహఃసంవాదినౌ పశ్యే దావాం య స్తం త్యజే రితి. 92

వ్యాఖ్య : అథ-ఆతరువాతికాలమున, కాలః-యముఁడు, మునివేషఃసన్-మునివేషముగలవాఁడగుచు, ఉపేత్య-వచ్చి, రాఘవం-రామునిగుఱించి, ప్రోవాచ-పలికెను (ఏమనియనఁగా), రహఃసంవాదినౌ-రహస్యముగామాట్లాడుచున్న, ఆవాం-మనయిద్దఱిని, యః-ఎవఁడు, పశ్యేత్-చూచునో, తం-అతనిని, త్యజేః-విడిచిపెట్టుము. ఇతి-ఇట్లని. పుత్రులకు రాజ్యములప్పగించి, తల్లులకు అంత్యక్రియలు చేసి, రామాదులు కొంతకాలమున్న పిమ్మట నొకనాఁడు యముఁడు మునివేషమునవచ్చి "మనరహస్య సంభాషణమును విని యెవ్వఁడు రహస్య భంగము చేయునో వానిని విడువుము" అని రామునితోఁ బలికెనని భావము. "పశ్యేత్" దృశిర్-ప్రేక్షణే ధాతువునకు సంభావనాలిఙ్. ప్ర పు.ఏ. "త్యజేః" త్యజ-హానౌ ధాతువునకు విధిలిఙ్. మధ్య.పు.ఏ.

శ్లో. తథేతి ప్రతిపన్నాయ వివృతాత్మా నృపాయ సః,
ఆచఖ్యౌ దివ మధ్యాస్వ శాసనాత్ పరమేష్ఠినః. 93

వ్యాఖ్య : సః-ఆయముఁడు, తథేతి (తథా, ఇతి)-అట్లేయని, ప్రతిపన్నాయ-అంగీకరించినట్టి, నృపాయ-రామునికొఱకు, వివృతాత్మా-ప్రకాశింపఁబడిన నిజస్వరూపము గలవాఁడగుచు, పరమేష్ఠినః-బ్రహ్మయొక్క, శాసనాత్-ఆజ్ఞవలన, దివం, అధ్యాస్వ-స్వర్గమునందు నిలువుము. ఇతి-అని, ఆచఖ్యౌ-చెప్పెను. అంతకుఁడుచెప్పిన నియమమును సరేయని యొప్పుకొన్న రామునికి తన నిజస్వ

రూపమునుజూపి, బ్రహ్మ నిన్ను స్వర్గమును జేరుమని యాజ్ఞాపించియున్నాఁడు. కనుక అట్లుచేయుమని చెప్పెను. "దివమధ్యాస్వ" అధిపూర్వకమైన "ఆస" ధాతువుతోఁజేరుటవలన "దివి" అని యుండవలసినది "దివం" అని సప్తమ్యర్థమున ద్వితీయగా వచ్చినది. "ఆచఖ్యౌ" ఆఙ్పూర్వక ఖ్యా-ప్రకథనే ధాతువునకు లిట్ ప్ర.పు.ఏ. "అధ్యాస్వ (అధి + ఆస్వ) అధిపూర్వక ఆస-ఉపవేశనే (ఆత్మనేపది) లోట్. మ.పు.ఏ.

శ్లో. విద్వానపి తయో ర్ద్వాస్థః సమయం లక్ష్మణో ఽభినత్,
భీతో దుర్వాససః శాపా ద్రామసందర్శనార్థినః. 94

వ్యాఖ్య : ద్వాస్థః-ద్వారమునందున్న, లక్ష్మణః-లక్ష్మణుఁడు, విద్వాన్, అపి-ఆవిషయము నెఱిఁగినవాఁడైనను, రామసందర్శనార్థినః-రాముని దర్శనమును గోరుచున్న, దుర్వాససః-దూర్వాసమునియొక్క, శాపాత్-శాపమువలన, భీతః సన్-భయపడిన వాఁడగుచు, తయోః-ఆకాలపురుష రాములయొక్క, సమయం-సంవాద ప్రతిజ్ఞను, అభినత్-భంగము చేసెను. యముఁడు రాముతును సంభాషించునప్పుడు లోనికెవ్వరిని రానీయవద్దని చెప్పి ద్వారమునందుంచఁబడిన లక్ష్మణుఁడు రామదర్శనమునకై వచ్చిన దూర్వాసుని విషయమును రామునికిఁ దెలుపకపోయినచో శాపము పెట్టునేమో యన్న భయమువలన లోనికి వెళ్ళి అంతకరాముల సంభాషణ నియమమునకు భంగముఁ గలిగించెనని భావము. "అభినత్" భిదిర్-విదారణే ధాతువునకు లఙ్ ప్ర.పు.ఏ.

శ్లో. స గత్వా సరయూతీరం దేహత్యాగేన యోగవిత్,
చకా రావితథాం భ్రాతుః ప్రతిజ్ఞాం పూర్వజన్మనః. 95

వ్యాఖ్య : యోగవిత్-యోగమార్గము నెఱిఁగిన, సః-ఆలక్ష్మణుఁడు, సరయూతీరం-సరయూనదియొద్దను, గత్వా-చేరి, దేహత్యాగేన-తన శరీరమును విడుచుట చేత, పూర్వజన్మనః-తనకంటే ముందుజన్మించిన (జ్యేష్ఠుఁడైన), భ్రాతుః-అన్నయొక్క, ప్రతిజ్ఞాం-ప్రతిజ్ఞను, అవితథాం-సత మైనదానిని, చకార-చేసెను. అట్లు నియమభంగముఁజేసిన లక్ష్మణుఁడు యోగమా ము ద్వారా సరయూనదీ తీరమున శరీరమును విడిచి, యమరామ సంభాషణమున విఘ్నముఁ గలిగించిన వానిని రాముఁడు విడిచిపెట్టవలయు నన్న ప్రతిజ్ఞ అబద్ధముకానియట్లుచేసె నని భావము.

---

లక్ష్మణుఁడు ఆదిశేషుని యవతారమై యుండుటచేతను, ఆదిశేషుఁడు పతంజలియవ తారమున యోగసూత్రములను రచించుటచేతను "యోగవిత్" అను విశేషణము మిక్కిలి సమంజసముగా నున్నది.

శ్లో. తస్మి న్నాత్మచతుర్భాగే ప్రాఙ్నాక మధితస్థుషి,
రాఘవః శిథిలం తస్థౌ భువి ధర్మ స్త్రిపాదివ. 96

వ్యాఖ్య : ఆత్మచతుర్భాగే-తనయొక్క నాల్గవభాగమైన, తస్మిన్-ఆలక్ష్మ ణుడు. ప్రాక్-ముందుగానే, నాకం-స్వర్గమును, అధితస్థుషి-చేరినవాఁడుకాగా, రాఘవః-రాముఁడు, భువి-భూలోకమునందు. త్రిపాద్-మూడుపాదములేయున్న, ధర్మఃఇవ-ధర్మమువలె, శిధిలం-శిథిలముగా. త -నిలిచెను. విష్ణువు నాలుగంశ ములుగా రామలక్ష్మణభరతశత్రుఘ్నులుగా ఖు యుండెనుగదా! అందులో నొక భాగమైన లక్ష్మణుఁడు ముందుగానే స్వర్గమునకు ళ్ళఁగా, నాలుగుకాళ్ళలో నొకటి విరిగిన ధర్మదేవతవలె, రాముఁడు శిథిలభావముతో నిలిచెనని భావము. త్రేతాయుగ మున ధర్మము త్రిపాత్‌గా నుండునన్నది దీనికిమూలము. "చతుర్థఃభాగః చతు ర్భాగః" అనియు, "త్రయఃపాదాఃయస్యసః త్రిపాత్" అనియు విగ్రహవాక్య ములు. "తస్థౌ" స్థాధాతువునకు లిట్.

(యుగ్మమ్)

శ్లో. స నివేశ్య కుశావత్యాం రిపునాగాంకుశం కుశమ్,
శరావత్యాం సతాం సూక్తైర్జనితాశ్రులవం లవమ్. 97
ఉదక్ప్రతస్థే స్థిరధీః సానుజో ఽగ్నిపురస్సరః,
అన్వితః పతివాత్సల్యాత్ గృహావర్జ మయోధ్యయా. 98

వ్యాఖ్య : స్థిరధీః-స్థిరప్రజ్ఞుఁడగు, సః-ఆరాముఁడు, రిపునాగాంకుశం-శత్రువులనెడు నేనుఁగులకు అంకుశమువంటివాఁడగు, కుశం-కుశకుమారుని, కుశావత్యాం-కుశావతీపట్టణమునందు, నివేశ్య-ఉంచియు, సూక్తైః-చక్కనిపలుకుల చేత, సతాం-సత్పురుషులకు, జనితాశ్రులవం-కలిగింపఁబడిన ఆనందాశ్రుకణములు గల, లవం-లవకుమారుని, శరావత్యాం-శరావతీపట్టణమునందు, నివేశ్య-ఉంచియు, సానుజః-తమ్ములతోఁగూడినవాఁడై, అగ్నిపురస్సరఃసన్-అగ్నినితమముందుంచు కొన్నవాఁడగుచు, పతివాత్సల్యాత్ పత్యౌ-తమప్రభువైనరామునియందలి. వాత్స

ల్యాత్-ప్రేమవలన, గృహవర్జం-ఇండ్లనుమాత్రం వదలివచ్చిన, అయోధ్యయా-అయోధ్యావాసి జనసమూహముచేత, అన్వితః-వెంబడింపఁబడినవాఁడై, ఉదక్-ఉత్తరదిశకు, ప్రతస్థే-బయలుదేరెను. స్థితప్రజ్ఞుఁడైన రాముఁడు కుశుని కుశావతీ పట్టణమునకును, లవుని శరావతీపట్టణమునకును అధిపతులనుగానిలిపి, తమ్ము లతోను, తనయందలి ప్రేమతో వెంటవచ్చు నయోధ్యాజనముతోను, అగ్నిని ముందు తీసుకపోవునట్లు నియమించి మహాప్రస్థానమును ఉత్తరదిశగాఁ జేసె ననిభావము. "గృహాఽవర్జయిత్వాగృహవర్జం" ఇండ్లను దీసికొనిపోవుటకు వీలులేనందున అవి తప్ప అందఱును వెళ్ళిరనియర్థము, "ప్రతస్థే" ప్రపూర్వకస్థాధాతువునకు ప్రయాణమర్థము.

శ్లో. జగృహు స్తస్య చిత్తజ్ఞాః పదవీం హరిరాక్షసాః,
కదంబముకుళస్థూలై రభివృష్టాం ప్రజాశ్రుభిః 99

వ్యాఖ్య : చిత్తజ్ఞాః-రామునిచిత్తము నెఱిఁగిన, హరిరాక్షసాః-కపిరాక్షస వీరులు, కదంబముకుళస్థూలైః-కడిమి మొగ్గలంత పెద్దవియగు, ప్రజాశ్రుభిః-ప్రజల కన్నీళ్ళచేత, అభివృష్టాం-వర్షింపఁబడిన (తడిసి . తస్య-రామునియొక్క, పదవీం-మార్గమును, జగృహుః-అనుసరించిరి. రాముని నస్సు నెఱిఁగిన కపి రాక్షసవీరు లందఱును, ప్రజలు దుఃఖముచేతఁగార్చుచున్న కన్నీటితోఁ దడిసిన రాముని మార్గమును బట్టి యతనివెంట వెళ్ళిరి. కన్నీటిచుక్కలు కదంబముకుళము లంత పెద్దగానుంటుట దుఃఖసమయమునందే జరుగుచున్నది. కాళిదాసుయొక్క లోక జ్ఞతకు మచ్చుతునక. "జగృహుః" గ్రహ-ఉపాదానే ధాతువునకు లిట్. ప్ర.పు.బ.

శ్లో. ఉపస్థితవిమానేన తేన భక్తానుకంపినా,
చక్రే త్రిదివనిశ్రేణిః సరయూ రనుయాయినామ్. 100

వ్యాఖ్య : ఉపస్థిత విమానేన-తనకై వచ్చిన విమానముగలవాఁడును, భక్తాను కంపినా-భక్తులను దయతోఁజూచువాఁడును నగు, తేన-రామునిచేత, అనుయాయినాం-తనవెంట వచ్చువారికి, సరయూః-సరయూనది, త్రిదివనిశ్రేణిః-స్వర్గమునకు నిచ్చెనగా, చక్రే-చేయఁబడినది. తాను వెళ్ళుటకు విమానము వచ్చి యుండఁగా, భక్తులపైఁ నత్యంతదయావంతుఁడైన రాముఁడు తనవెంట స్వర్గము నకు రాఁదలఁచిన వారందరికిని సరయూనదిని స్వర్గమునకుఁజేర్పునట్టి నిచ్చెననుగాఁ

జేసెను. అనఁగా నట్టివారందరికిని సరయూనదియందు శరీరత్యాగముచేసి స్వర్గమును జేరుఁడని చెప్పెనని భావము. "చక్రే" (డు) కృఞ్-కరణే ధాతువునకు కర్మణి లిట్ ప్ర.పు.ఏ. "తేన సరయాః చక్రే" ఇది కర్మార్థక వాక్యము.

శ్లో. యద్గోప్రతరకల్పో ఽభూ త్సంమర్ద స్తత్ర మజ్జతామ్,
అత స్తదాఖ్యయా తీర్థం పావనం భువి పప్రథే. 101

వ్యాఖ్య : యత్-ఏకారణమువలన, తత్ర-ఆసరయూనదియందు, మజ్జతాం-మునుగుచున్నవారియొక్క, సమ్మర్దః-ఒరసికొనుట, గోప్రతరకల్పః-ఆవులమంద ప్రవేశము వంటిది, అభూత్-అయియుండెనో, అతః-ఆ కారణమువలన, తదాఖ్యయా-ఆ గోప్రతర మను పేరుచేతనే, పావనం-పవిత్రతను గలిగించునట్టి, తీర్థం-పుణ్యతీర్థము, భువి-లోకమునందు, పప్రథే-ప్రసిద్ధినిఁ బొందెను. రామునియాదేశముచేత కపి రాక్షస నరులందఱును నొక్కసారిగా సమ్మర్దమున గోప్రతరమువలె ననఁగా నావులమందలు జలపానముకొఱకు నదిలో ప్రవేశించినట్లు ప్రవేశించుటచేత ఆప్రదేశము అదే పేరుతో సరయూ నదీతీరమునందలి పుణ్యతీర్థమగు గోప్రతరము (గోప్రతారము)గా నావిర్భవించి ప్రసిద్ధికెక్కినదని భావము. "పప్రథే" ప్రథ-ప్రఖ్యానే (ఆత్మనేపది, అకర్మకము) లిట్. ప్ర. పు. ఏ.

శ్లో. స విభు ర్విబుధాంశేషు ప్రతిపన్నాత్మమూర్తిషు,
త్రిదశీభూతపౌరాణాం స్వర్గాంతర మకల్పయత్. 102

వ్యాఖ్య : విభుః, సః-ప్రభువైన రాముఁడు, విబుధాంశేషు-దేవాంశలుగల సుగ్రీవాదులు, ప్రతిపన్నాత్మమూర్తిషు (సత్సు)-పొందఁబడిన తమ పూర్వరూపములు గలవారుకాఁగా, త్రిదశీభూతపౌరాణాం-క్రొత్తగా దేవతలైన పురజనులకు, స్వర్గాంతరం-మరియొక స్వర్గమును, అకల్పయత్-కల్పించెను. రామావతార సమయమునందు రాక్షసవధకుఁ దోడ్పడుటకై సుగ్రీవాదులై పుట్టిన దేవతలందఱును వారి వారి పూర్వరూపములు ధరించి వెళ్ళిపోగా, రామానుగ్రహమునఁ గ్రొత్తగా దేవత్వమును బొందిన అయోధ్యానగర పౌరులకై ప్రభువైన రాముఁడు ఒక నూతన స్వర్గమును కల్పించెనని భావము. "ఇచ్ఛామాత్రం ప్రభోః సృ ః" అనున్యాయమున నారాయణాంశగల రాముని ప్రభావమువలన నూతన స్వ ము వెలయుటలో వింతలేదు. "అకల్పయత్" కృపూ-సామర్థ్యే అను ధాతువు కు

ప్రేరణార్థకము (ణిజంతము). లఙ్. ప్ర పు ఏ. ఈ ధాతుసంబంధమగు ఋకారావయ రేఫమునకు "ల" కారము వచ్చును.

శ్లో, నిర్వర్త్యైవం దశముఖశిరశ్ఛేదకార్యం సురాణాం
విష్వక్సేనః స్వతను మవిశ త్సర్వలోకప్రతిష్ఠామ్,
లంకానాథం పవనతనయం చోభయం స్థాపయిత్వా
కీర్తిస్తంభద్వయ మివ గిరౌ దక్షిణే చోత్తరే చ, 103

వ్యాఖ్య : విష్వక్సేనః-విష్ణువు, ఏవం-ఈవిధముగా, సురాణాం-దేవతల యొక్క, దశముఖశిరచ్ఛేదకార్యం-రావణుని శిరస్సును చేదించుటయను కార్యమును, నిర్వ -పూర్తిచేసి,లంకానాథం-విభీషణుని,పవనతనయం-హనుమంతుని, ఉభయం చ-ఇ ఱినిగూడ, కీర్తిస్తంభద్వయం-తనకీర్తిస్తంభములు రెండిటినివలె, దక్షిణగిరౌ-దక్షిణదిక్కునందలి చిత్రకూట పర్వతమునందును, ఉత్తరే, గిరౌచ-ఉత్తరదిక్కునందలిహిమాల మునందును,స్థాపయిత్వా-నిలిపి, సర్వలోకప్రతిష్ఠాం-సర్వలోకములకును ఆధార న, స్వతనుం-తన మూర్తిని, అవిశత్-ప్రవేశించెను. ఈవిధముగా దేవతల కోరిక రామావతారమును పొందిన విష్ణుమూర్తి దేవకార్యమైన రావణ వధనుచేసి ఉ రమున హిమగిరిపై విభీషణుని, దక్షిణమున చిత్రకూటపర్వతముపై హనుమంతుని, తన కీర్తి ధ్వజములవలె శాశ్వతముగా నిలిపి అఖిల సృష్టికినిఆధార భూతమైన స్వస్వరూపమును మరల ధరించెనని భావము. విభీషణ హనుమంతులు చిరంజీవులై నేటికిని యున్నట్లు ఆస్తికులు విశ్వసించుచున్నారు. దక్షిణభారతమున హనుమదాలయములు ఎక్కువగా నిర్మింపఁబడుట కిదియే కారణమేమో! "అవిశత్" విశ-ప్రవేశనే ధాతువునకు లఙ్. ప్ర. పు. ఏ.

ఇది మహాకవి కాళిదాస కృతరఘువంశ కావ్యమున
శ్రీరామస్వర్గారోహణమను పంచదశసర్గకు
కేశవపంతుల నరసింహశాస్త్రి రచిత
తెలుఁగు లఘువ్యాఖ్య.

## మహాకవి కాళిదాస కృత

# రఘువంశము

## షోడశసర్గము

శ్లో. అథేతరే సప్త రఘుప్రవీరా జ్యేష్ఠం పురోజన్మతయా గుణైశ్చ,
చక్రుః కుశం రత్నవిశేషభాజం సౌభ్రాత్ర మేషాం హి కులానుసారి. 1

వ్యాఖ్య : అథ-రామనిర్యాణానంతరమున, ఇతరే సప్త-ఇతరులైన ఏడుగురుగు రఘుప్రవీరాః-రఘువంశపు వీరులు, పురోజన్మతయా-మొదటఁబుట్టినవాఁడగుటచేతను, గుణైః చ-సత్యశౌర్యాది గుణములచేతను, జ్యేష్ఠం-పెద్దవాఁడగు కుశం-కుశుని, రత్నవిశేషభాజం-ఆయా శ్రేష్ఠ వస్తువుల ననుభవించు వానినిగా, చక్రుః-చేసిరి. హి-అది సరియే, సౌభ్రాత్రం-మంచిసోదరభావము, ఏషాం-ఈకుశల వాదులకు, కులానుసారి, హి-వంశక్రమాను గతమైనది సుమా! రామాదుల పుత్రులెనమండుగురిలోను వయస్సు చేతను, సద్గుణములచేతను పెద్దవాఁడై యున్న కుశునికి సర్వశ్రేష్ఠ వస్తువులను జేకూర్చి యితరులగు నేడ్గురును అతనిని సేవించు చుండిరని భావము. అట్లు అన్నదమ్ములలోఁ బొరపొచ్చములులేక సౌభ్రాత్రమును నెరపుట రఘువంశరాజులకు వంశక్రమాగతమైన యాచారము. "జాతౌ జాతౌ యదుత్కృష్టం తద్రత్న మభిధీయతే" అనియుంటుటవలన కుశునికి ఉత్తమోత్తమ రథగజాశ్వ సౌధ రత్నాభరణాదులు చేకూర్చిరని తాత్పర్యము.

శ్లో. తే సేతువార్తాగజబంధముఖ్యై రభ్యుచ్ఛ్రితాః కర్మభి రప్యవంధ్యైః,
అన్యోన్యదేశప్రవిభాగసీమాం వేలాం సముద్రా ఇవ న వ్యతీయుః. 2

వ్యాఖ్య : సేతువార్తాగజబంధముఖ్యైః— సేతు - జలాశయములుకట్టుట, వార్తా-కృషిగోరక్షణాదులు, గజబంధ-ఏనుగులను పట్టుకొనుట, ముఖ్యైః-మొదలు యిన, అవంధ్యైః-సఫలములగు, కర్మభిః-పనులచేత, అభ్యుచ్ఛ్రితాః అపి-సామర్థ్యముచేత నభ్యుదయము పొందినవారై యున్నప్పటికిని, తే-ఆకుశలవాదులు, అన్యోన్యదేశప్రవిభాగసీమాం - అన్యోన్యదేశ - ఒండొరులదేశములయొక్క, ప్రవిభాగ-పరిధులను సూచించు ప్రదేశములయొక్క, సీమాం-హద్దును, వేలాం-చెలియలికట్టను, సముద్రాః, ఇవ-సముద్రములువలె, నవ్రతీయుః-అతిక్రమింపరైరి. "కృషి ర్వణిక్పథో దుర్గం సేతుః కుంజరబంధనం, ఖన్యాకరధనాదానం శూన్యానాంచ నివేశనమ్, అష్టవర్గ మిమం సాధుః స్వయం వృద్ధోఽపి వర్ధయేత్" అనుకామందక రాజనీతివచనానుసారముగా, రాజు సర్వసంపదభివృద్ధిగలవాడై యున్నను, కృషి, వాణిజ్యము, దుర్గములు, జలాశయములు, గజసైన్యవృద్ధి, గనులనుండి ధనసంపాదనము, ఆకరములనుండి తత్తద్వస్తుసంపాదనము, శూన్యప్రదేశములను గ్రామములుగా మార్చుట, అను అష్టవర్గమును అభివృద్ధిపరచుచునే యుండవలయును. కాని కుశాదులు సేతువార్తాదుల సమృద్ధికలవారై నూతనాభివృద్ధిచేయుటకు సమర్థులైయున్నను, అట్టి యభివృద్ధికై యొకరిదేశములం దొకర ప్రవేశింపక యన్యోన్యప్రేమతో సోదరభావమును నెఱపుచుండిరని భావము.

శ్లో. చతుర్భుజాంశప్రభవః స తేషాం దానప్రవృత్తే

రనుపారతానామ్,

సురద్విపానా మివ సామయోని ర్భిన్నోఽష్టధా

విప్రససార వంశః. 3

వ్యాఖ్య : చతుర్భుజాంశప్రభవః-విష్ణువుజన్మకారణమైనదియగు, దానప్రవృత్తేః-త్యాగప్రవృత్తినుండి (గజపక్షమున మదోదకప్రవాహమునుండి) అనుపారతానాం-విరమింపని, తేషాం-ఆకుశలవాదలయొక్క, సః వంశః-ఆరఘువంశము, సామయోనిః- సామవేదమునుండి పుట్టినదియగు, సురద్విపానాం-దిగ్గజములయొక్క, వంశఃఇవ-వంశమువలె, అష్టధా-ఎనిమిదివిధములుగా, భిన్నః-వేరుపడినదగుచు, విప్రససార-విస్తరించెను. విష్ణ్వంశసంభూతులైన రామలక్ష్మణభరతశత్రుఘ్నుల పుత్రులగు కుశలవాదులెనమండుగురును మహాదాతలై, నిరంతర దానధారలచేత పవిత్రముగావించిన తమవంశమును, సామవేదమునుండి పుట్టిన దిగ్గజములు తమతమవంశమునువలె విస్తరింపజేసిరని భావము. గజమునకు

"సామజము" అను పేరువచ్చుటకు కారణము, "సూర్యస్యాండకపాలే ద్వే సమాసీయ ప్రజాపతిః, హస్తాభ్యాం పరిగృహ్యాథ స ప్త సామా న్యగాయత, గాయతో బ్రహ్మణ స్తస్మా త్సముత్పేతు ర్మతంగజాః" అను పాలకాప్యవచనము. అనగా, బ్రహ్మ సూర్యగోళాండకపాలములను రెంటినిఁజేర్చి చేతులలోపట్టుకొని స ప్తసామ లను గానముచేయుచుండగా నందులోనుండి మతంగజములు పుట్టెనట. అట్లు ఎన మంటుగురి వంశములును అతిపవిత్రములు, ఉదా త్తములునుగా క్రమాభివృద్ధిని బొందినవి.

శ్లో. అథార్ధరాత్రే స్తిమితప్రదీపే శయ్యాగృహే సు ప్తజనే ప్రబుద్ధః,
కుశః ప్రవాసస్థకళత్రవేషా మదృష్టపూర్వాం వనితా మపశ్యత్. 4

వ్యాఖ్య : అథ-కుశాదు లెవరి రాజ్యమునందు వారున్నపిమ్మట నొకరోజున అర్ధరాత్రే-నిశీథమునందు, స్తిమితప్రదీపే-నిశ్చలమైన దీపములుగలదియు, సు ప్త జనే-నిద్రించిన జనులుగలదియు నగు, శయ్యాగృహే-పడకటింటియందు, ప్రబుద్ధః-మేల్కొనియుండిన, కుశః-కుశుఁడు, ప్రవాసస్థకళత్రవేషాం-దూరదేశము నందున్నవాని భార్యవేషముగలదియు (ప్రోషిత భ ర్తృకావేషముగలది), అదృష్ట పూర్వాం-అంతకుముం దెప్పుడును జూడబడనిదియునగు, వనితాం-ఒక స్త్రీని, అపశ్యత్-చూచెను. ఒకనాటిరాత్రి శయ్యాగృహమున నిద్రపట్టక మేల్కొనియున్న కుశుఁడు ప్రోషితభ ర్తృక వేషమునందున్న యుకానొక స్త్రీనిఁ జూచెనని భావము.

శ్లో. సా సాధుసాధారణపార్థివర్ధేః స్థిత్వా పురస్తాత్ పురుహూత భాసః,
జేతుః పరేషాం జయశబ్దపూర్వం తస్యాంజలిం బంధుమతో బబంధ. 5

వ్యాఖ్య : సా-ఆవనిత, సాధుసాధారణ పార్థివర్ధేః-సజ్జనులందఱికిని సాధార ణముగానుండునట్టి రాజ్యలక్ష్మి గలిగినట్టియు, పురుహూతభాసః-ఇంద్రుని తేజస్సు వంటి తేజస్సుగలిగినట్టియు, పరేషాం జేతుః-శత్రువులను జయించువాఁడును,

బంధుమతః-బంధు సంపదగలవాఁడును నగు, తస్య-ఆ కుశునియొక్క, పురస్తాత్-ఎదుట, స్థిత్వా-నిలుచుని, జయశబ్దపూర్వం-జయ ! అనుశబ్దము మొదట నుండు నట్లుగా, అంజలిం, బబంధ-చేతులు జోడించెను. అట్లు కనఁబడిన వనిత, రాజ్యలక్ష్మియుతుఁడై, ఇంద్ర తేజస్సుగలవాఁడై, శత్రువిజేతయై, బంధుయుక్తుఁడై యుండిన కుశుని యెదుట నిలుచుండి, చేతులు జోడించుకొని, "జయ! జయ!" అని పలికెను.

శ్లో. అథా నపోఢార్గల మప్యగారం ఛాయా మివాదర్శతలం ప్రవిష్టామ్,

సవిస్మయో దాశరథే స్తనూజః ప్రోవాచ పూర్వార్ధ విసృష్టతల్పః. 6

వ్యాఖ్య : అథ-అట్లు "జయ" శబ్దము పలికినపిమ్మట, సవిస్మయః-ఆశ్చర్యయుక్తుఁడై, పూర్వార్ధ విసృష్టతల్పః-శరీరపూర్వభాగముచేత విడువఁబడిన పడకగలవాఁడైన, దాశరథేః, తనూజః-రామునిపుత్రుఁడగు కుశుఁడు, అనపోఢార్గలం, అపి-తొలగింపఁబడని తలుపుగడియ గలదియైనను, అగారం-గృహమును, ఆదర్శతలం-అద్దములోని భాగమును, ప్రవిష్టాం-ప్రవేశించిన, ఛాయాం, ఇవ-ప్రతిబింబమునువలె, ప్రవిష్టాం-ఇంటిలోనికి ప్రవేశించిన, తాం-ఆస్త్రీని ప్రోవాచ-ముందు చెప్పఁబోవురీతిగా వివరములడిగెను.జయశబ్దమును విన్నకుశుఁడు, పరుపుమీద సగము లేచినవాఁడై, గడియవేసియున్న శయ్యాగృహములోనికి,అద్దములోనికి ప్రతిబింబము ప్రవేశించినట్లు, ఎట్లు వచ్చినదో! ఊహింపరాని ఆ వనితతో సంభాషించెను. ఆదర్శచ్ఛాయా ప్రవేశోపమానము లోకోత్తరముగా నున్నది. కుశుఁడుపడకపై, యెదుట బద్ధాంజలియైన వనిత, శయ్యాగృహము; ఇది చిత్రకారుని చిత్రరచనకు అనుకూలముగానున్న సన్నివేశము. అలంకారము : ఉపమ.

(యుగ్మమ్)

శ్లో. లబ్ధాంతరా సావరణేఽపి గేహే యోగప్రభావో నచ లక్ష్యతే తే,

బిభర్షి చాకార మనిర్వృతానాం మృణాళినీ హైమ మివోపరాగమ్. 7

కా త్వం శుభే! కస్య పరిగ్రహోవా? కింవా మదభ్యాగమ
కారణం తే?
ఆచక్ష్వ మత్వా వశినాం రఘూణాం మనః పరస్త్రీ విముఖ
ప్రవృత్తి. 8

వ్యాఖ్య : సాపరణే, అపి-ఆవరణముగలదైనను, గేహే-గృహమునందు, లబ్ధాంతరా-పొందఁబడిన యవకాశముగలదానవయితివి, యోగప్రభావః, చ-యోగ శక్తిగూడ, తే, న, లక్ష్యతే-నీకున్నట్లు గనఁబడదు. మృణాళినీ-తామరతీఁగ, హైమం-మంచువలన వచ్చిన, ఉపరాగం, ఇవ-ఉపద్రవమునువలె, అనిర్వృతానాం-సుఖములేనివారియొక్క, ఆకారం-రూపమును, బిభర్షి, చ-ధరించుచున్నావుగూడను, హేశుభే-ఓ అమ్మాయీ! త్వం, కా-నీవు ఎవరు? కస్య, వా, పరిగ్రహః-ఎవని యొక్క పత్నివి? తే-నీకు, మదభ్యాగమకారణం-నావద్దికి వచ్చుట యందలి కారణము, కింవా-ఏమైయున్నది? వశినాం-జితేంద్రియులగు, రఘూణాం-రఘు వంశపు రాజులయొక్క, మనః-మనస్సు, పరస్త్రీ విముఖ ప్రవృత్తి-పరస్త్రీల విష యమున పెడమొగముపెట్టు నడవడిగలదానినిగా, మత్వా-తెలిసికొని, ఆచక్ష్వ-చెప్పుము. ఓ శుభాంగీ! తలుపులు మూసియున్న యీ గృహములోని కెట్లు వచ్చి తివి? నీలో యోగశక్తి యున్నట్టును దోచుటలేదు, మంచుదెబ్బతిన్న తామరతీఁగ వలె దుఃఖితమైన రూపముగలదానవై యున్నావు. నీ వెవరు? ఎవని భార్యవు? నా వద్దికి వచ్చుటకుఁగారణమేమి? మా రఘువంశీయుల మనస్సు పరస్త్రీ విముఖమైనట్టి దని తెలిసికొని, ఆలోచించుకొని, నీ విషయమును వివరముగాఁజెప్పుమని కుశుఁ డావనిత నడిగెనని భావము.

శ్లో. త మబ్రవీ త్సా గురుణా నవద్యా యా నీతపౌరా
స్వపదోన్ముఖేన,
తస్యాః పురః సంప్రతి వీతనాథాం జానీహి రాజ
న్నధిదేవతాం మామ్. 9

వ్యాఖ్య : సా-ఆవనిత, తం-కుశునుద్దేశించి, అనవద్యా-ఎట్టిదోషమునులేని, యా-ఏపురము స్వపదోన్ముఖేన-తనస్థానమగు వైకుంఠమునకు వెళ్ళుచున్న, గురుణా-పితంద్రిచేత, నీతపౌరా-తనవెంటఁదీసికొనిపోఁబడిన పురజనులుగలదై

యున్నదో! హేరాజన్-ఓరాజా, మాం-నన్ను, సంప్రతి-ఇప్పుడు, పీతనాథాం-అనాథనైన, తస్యాః, పురః-ఆ అయోధ్యానగరముయొక్క, అధిదేవతాం-అధిదేవతనుగా, జానీహి-ఎఱుగుము, అని, అబ్రవీత్-పలికెను. ఆవనిత, మీతండ్రి రాముఁడు తన నిర్యాణసమయమున జనులనందఱిని వెంటఁబెట్టుకొని వైకుంఠమునకు వెళ్ళగా నిర్మానుష్యమైన అయోధ్యకు అధిదేవతనై అనాథనై యున్నానని కుశునికిఁ జెప్పెను. ఇచ్చటి విశేషము రాముఁ డయోధ్యలోఁదనకు సమకాలికులై యుండిన వారినందఱిని వైకుంఠముఁజేర్చి మోక్షమొసఁగుట. "అబ్రవీత్" క్రియకు వాక్యార్థము కర్మ.

శ్లో. వస్వౌకసారా మభిభూయ సాహం సౌరాజ్య
బద్ధోత్సవయా విభూత్యా,
సమగ్రశక్తౌ త్వయి సూర్యవంశ్యే సతి ప్రపన్నా
కరుణా మవస్థామ్. 10

వాఖ్య: సాహం (సా+అహం)- అయోధ్యాధిదేవతనైననేను, సౌరాజ్యబద్ధోత్సవయా-మంచిరాజుపాలనముచేత ఉత్సవయుక్తమగు, విభూత్యా-సంపదచే , వస్వౌకసారాం-అలకాపురిని లేదా ఇంద్రదనగరమును, అభిభూయ-తిరస్కరించి, సమగ్రశక్తౌ-సంపూర్ణశక్తిమంతుఁడవగు, త్వయి-నీవు, సూర్యవంశ్యే సతి-సూర్యవంశీయుఁడవై యున్నందున, కరుణాం, అవస్థాం-దీనదశను, ప్రపన్నా-పొందియున్నాను. మంచిరాజుగల అయోధ్యావిభూతిని మీతండ్రికాలమున అనుభవించుటచేత కుబేరనగరమగు అలకాపట్టణమునుగాని, వస్వౌకసార మను పేరుగల ఇంద్రదనగరమునుగాని లెక్కచేయనినేను సూర్యవంశీయుఁడవే అయి, సమగ్రశక్తిమంతుఁడవైన నీవుండియు నన్ను పరామర్శించుటలేదేయని దీనదశకు లోనైతి నని యావనిత కుశునితోననెను. రామరాజ్యము స్వర్గరాజ్యముకన్నను వైభవోపేతమై యుండినదని భావము.

శ్లో. విశీర్ణతల్పాట్టశతో నివేశః పర్యస్తశాలః ప్రభుణా వినా మే,
విడంబయ త్యస్తనిమగ్నసూర్యం దినాంత
ముగ్రానిలభిన్నమేఘమ్. 11

వ్యాఖ్య : విశీర్ణతల్పాట్టశతః-శిథిలమైపోయిన అట్టాలికలయొక్కయు, సౌధగృహములయొక్కయు శతములుగలదియు, పర్యస్తశాలః-పడిపోయిన ప్రాకారములు గలదియునగు, మేనివేశః-నానివేశనము, ప్రభుణావినా-స్వామిలేనిదై, అస్తనిమగ్నసూర్యం-అస్తపర్వతమున మునిగిన-సూర్యుఁడుగలదియు, ఉగ్రానిల భిన్నమేఘం-ప్రచండ వాయువు చేత ముక్కలు చేయఁబడిన మేఘములు గలదియు నగు, దినాంతం-సాయంకాలమును, విడంబయితి-పోలియున్నది. మేడలు, మేడల పైని అట్టాలకములు శిథిలములై, ప్రాకారములు పడిపోయి, ప్రభువులేకయున్న నానివాసమగు నయోధ్యానగరము, అస్తమించిన సూర్యుఁడును పెనుగాడ్పులచేత చెదరి ముక్కలయిన మేఘములును గల సాయం సమయమును బోలుచు కళాహీనమై యున్నదని చెప్పెను. ఇచ్చటి "తల్ప" శబ్దమునకు అట్టాలిక యని అర్థము.

శ్లో. నిశాసు భాస్వత్కలనూపురాణాం యః సంచరోఽభూ
దభిసారికాణామ్,
నదన్ముఖోల్కావిచితామిషాభిః స వాహ్యతే రాజపథః
శివాభిః. 12

వ్యాఖ్య : నిశాసు-రాత్రులయందు, భాస్వత్కలనూపురాణాం-ప్రకాశించుచు అవ్యక్తమధురధ్వనులుచేయు కాళ్ళయందెలుగల, అభిసారికాణాం-అభిసారికానాయి కలకు, యః-ఏరాజమార్గము, సంచరః-సంచారమార్గమైయుండెనో, సః, రాజపథః-ఆరాజవీధి, నదన్ముఖోల్కావిచితామిషాభిః-నదన్ముఖ-అరచుచున్న నోళ్ళయందలి, ఉల్కా-మండుచున్న శ్మశానపు కొఱవులచేత, విచితామిషాభిః-వెదకబడుచున్న మాంసపుముక్కలుగల, శివాభిః-ఆడునక్కలచేత, వాహ్యతే-నడుపఁబడుచున్నది. రాత్రులయందు శృంగారనాయికలగు అభిసారికలు రత్ననూపురధ్వనులతోఁ ప్రియులవద్దికి వెళ్ళుట కుపయోగపడిన రాజమార్గము నేఁడు నోళ్ళలో శ్మశానపు కొఱవులను బట్టుకొని కూతలుపెట్టుచు మాంసములను వెదకుచున్న నక్కలు నడచు దౌర్భాగ్యమును పొందియున్నదని భావము. రత్నకాంతులకు కొఱవి మంటలు, కలనాదములకు నక్కకూతలు సామ్యమును పొందియున్నవి. "సంచరంతి అనేన ఇతి సంచరః" గోచరసంచర ఇత్యాది సూత్రముచేత "ఘ" ప్రత్యయాంత మగు నిపాతము. ఇట్లే గోచరః (దేశము), వహః (స్కంధము), వ్యజః (తాల వృంతము), ఆపణః (పణ్యస్థానము) ఇత్యాది శబ్దములు నిపతింపఁబడినవి.

శ్లో. ఆస్ఫాలితం యత్ ప్రమదాకరాగ్రై ర్మృదంగధీర ధ్వని
మన్వగచ్ఛత్,
వన్యై రిదానీం మహిషై స్తదంభః శృంగాహతం క్రోశతి
దీర్ఘికాణామ్. 13

వ్యాఖ్య : యత్-ఏజలము, ప్రమదాకరాగ్రైః-జలక్రీడలాడుస్త్రీలయొక్క హస్తములచేత, ఆస్ఫాలితం-కొట్టబడినదగుచు, మృదంగధీరధ్వనిం-మృదంగముల యొక్క గంభీరధ్వనిని, అన్వగచ్ఛత్-అనుకరించియుండెనో, తత్-అట్టి, దీర్ఘికాణాం-దిగుడుబావులయొక్క, అంభః-జలము,ఇదానీం-ఇప్పుడు, వన్యైఃమహిషైః-అడవిదున్నలచేత, శృంగాహతం-కొమ్ములతో చెలగఁబడినదగుచు, క్రోశతి-అరచుచున్నది. పూర్వ మయోధ్యయందలి దిగుడుబావులలో జలక్రీడలు సలుపు ప్రమదలు హస్తములతో వాయింపఁగా, మృదంగధ్వనివలె వినఁబడుచుండిన నీటిచప్పుడు ఇప్పుడు ఆడవిదున్నల కొమ్ములతో చెలగఁబడుచు రోదనధ్వనితో హోరెత్తుచున్న దని భావము.

శ్లో. వృక్షేశయా యష్టినివాసభంగా న్మృదంగశబ్దాపగమా
దలాస్యాః,
ప్రాప్తా దవోల్కాహతశేషబర్హాః క్రీడామయూరా
వనబర్హిణత్వమ్. 14

వ్యాఖ్య : యష్టినివాస భంగాత్-నివాసముగా కట్టిన కఱ్ఱలు విరుగుటవలన, వృక్షేశయాః-చెట్లుపై నిద్రించుచున్న వగుచును, మృదంగశబ్దాపగమాత్-మృదంగ నాదములు లేనందువలన, అలాస్యాః-నృత్య శూన్యములగుచును, దవోల్కాహతశేషబర్హాః—దవోల్కా-వనాగ్నియొక్క మిణుగురులచేత, హతశేష-కాలగామిగిలిన బర్హాః-పింఛములుగలవి యగుచును, క్రీడామయూరాః-విలాసమయూరములు, వనబర్హిణత్వం-అడవి నెమళ్ళగుటను, ప్రాప్తాః-పొందినవి. అయోధ్యయందలి క్రీడా మయూరములు, సౌధములయందలి మ నివాసయష్టులు విరిగిపోవుటచేత చెట్లపై నిద్రించుచు, ఎచ్చటను మృదంగనాదము వినఁబడకుండుటచేత లాస్యమును విడిచి, అరణ్యముగామారిన అయోధ్యలో నప్పుడప్పుడు రగుల్కొను వనాగ్ని మిణుగురులచే కాలాగా మిగిలిన పింఛములతో అడవి నెమళ్ళవలె దీనదశను పొందియున్నవి అని చెప్పెను. "వృక్షేశయాః" అలుక్సమాసము.

శ్లో. సోపానమార్గేషు చ యేషు రామా నిక్షిప్తవత్య శ్చరణాన్ సరాగాన్,
సద్యో హతన్యంకుభి రస్రదిగ్ధం వ్యాఘ్రైః పదం తేషు నిధీయతే మే. 15

వ్యాఖ్య : యేషు, సోపానమార్గేషు-ఏ సోపాన మార్గములయందు, రామాః-స్త్రీలు, సరాగాన్-లాక్షా రసము చేఁ దడిసిన, చరణాన్-పాదములను, నిక్షిప్తవత్యః-ఉంచుచుండిరో, తేషు, మే, మార్గేషు-ఆనాసోపానమార్గములయందు, సద్యః-అప్పుడే, హతన్యంకుభిః-చంపఁబడిన యిఱ్ఱులు గల, వ్యాఘ్రైః-పులుల చేత; అస్రదిగ్ధం-రక్తముచే పూయఁబడిన, పదం-అడుగు, నిధీయతే-ఉంచఁబడు చున్నది. మరియు సౌధాదులసోపానమార్గములందు పూర్వము విలాసవతులు లక్కపూతలతోఁదడిసిన చరణము లుంచుచుండిరి. ఇప్పుడు పులులు అప్పుడే చంపిన లేళ్ళ నెత్తురుతోఁ దడిసిన తమ యడుగుల నదేమెట్లపై నుంచుచున్నవని వాపోయెను.

శ్లో. చిత్రద్విపాః పద్మవనావతీర్ణాః కరేణుభి ర్దత్తమృణాలభంగాః,
నఖాంకుశాఘాతవిభిన్నకుంభాః సంరబ్ధసింహప్రహృతం వహన్తి 16

వ్యాఖ్య : పద్మవనావతీర్ణాః-కమలవనమున దిగినవిగాను, కరేణుభిః-ఆడ యేనుగులచేత, దత్తమృణాలభంగాః-ఈయఁబడిన తామరకాడల ముక్కలు గలవిగాను వ్రాయఁబడిన, చిత్రద్విపాః-భిత్తిచిత్రములయందలి యేనుఁగులు, నఖాంకుశాఘాతవిభిన్నకుంభాః-అంకుశములవంటి గోళ్ళ దెబ్బలచేత పగిలిన కుంభస్థలములు గలవి యగుచు, సంరబ్ధసింహప్రహృతం-కోపించిన సింహముల ప్రహారమును, వహంతి-భరించుచున్నవి. నగరసౌధములగోడలపై, కమలవనములోనికి దిగి ఆడ యేనుఁగు లందించు తామరతూండ్లను దినుచున్నట్లు, చిత్రింపఁబడిన యేనుఁగు బొమ్మలను, సత్యగజములని భ్రమించి పాడువడిన యయోధ్యలోనికిఁ బ్రవేశించిన సింహాలు తమ గోళ్ళతో నాయేనుఁగుల కుంభస్థలములను చీల్చి, కోపించి కొట్టు చున్నవని భావము. భ్రాంతిమదలంకారము వ్యంగ్యము.

శ్లో. స్తంభేషు యోషిత్ప్రతియాతనానా ముత్క్రాంతవర్ణక్రమ
ధూసరాణామ్,

స్తనోత్తరీయాణి భవంతి సంగా న్నిర్మోకపట్టాః ఫణిభి
ర్విముక్తాః. 17

వ్యాఖ్య : ఉత్క్రాంత వర్ణక్రమ ధూసరాణాం—ఉత్క్రాంత-వెలిసి పోయిన, వర్ణక్రమ-మొదటవేసిన రంగులుగలవగుటచేత, ధూసరాణాం-బూడిదరంగు గల, స్తంభేషు-కట్టుస్తంభములయందలి, యోషిత్ప్రతియాతనానాం-శిల్పరూపమున నున్న స్త్రీమూర్తులకు; ఫణిభిః-సర్పములచేత, విముక్తాః-విడువఁబడిన, నిర్మోక పట్టాః-బట్టముక్కలవంటికుబుసములు, సంగాత్-తగులుకొనియున్నందువలన, స్తనో త్తరీయాణి-స్తనాచ్ఛాదనవస్త్రములు, భవంతి—అగుచున్నవి,సౌధములలోని స్తంభము లపై స్త్రీశిల్పములను జెక్కి వాటివస్త్రాదులను పెక్కురంగులతో వేసియుండిరి. కాల క్రమమున ఆరంగులు మాసిపోయినందున స్త్రీశిల్పములకు స్తనములు బయల్పడఁగా నచ్చట సర్పములు విడిచిన కుబుసములు దగుల్కొని స్తనో త్తరీయములుగా నుండు దశవచ్చినదనిచెప్పెను. ఈ స్తనోత్తరీయములు ఉత్తరదేశపు వారు వేసుకొను చిన్నపాటివని గ్రహింపవలెను. అయోధ్యానగర మంతపాడువడిన ని భావము.

శ్లో. కాలాంతరశ్యామసుధేషు నక్తమితస్తతో
రూఢతృణాంకురేషు,

త ఏవ ముక్తాగుణశుద్ధయోపి హర్మ్యేషు మూర్ఛంతి
న చంద్రపాదాః 18

వ్యాఖ్య : కాలాంతరశ్యామసుధేషు — కాలాంతర - కాలవ్యవధానముచేత, శ్యామ-నల్లఁబడిన, సుధేషు-సున్నపుపూతలుగలవియు, ఇతస్తతః-ఇచ్చటచ్చట, రూఢతృణాంకురేషు-మొలచినగడ్డిపరకలు గలవియునగు, హర్మ్యేషు-గృహముల మీద, నక్తం-రాత్రియందు, ముక్తాగుణశుద్ధయః, అపి-ముత్యాలహారములవలె తెల్లనివైయున్నప్పటికిని, తే, ఏవ-ఇంతకుపూర్వము ప్రకాశించినవేయగు, చంద్ర పాదాః-చంద్రకిరణములు, న మూర్ఛంతి-ప్రతిఫలించుటలేదు. పూర్వము రాత్రి వేళలలో సౌధములయందు తళతళమని ప్రతిఫలించిన చంద్రకిరణములే యిప్పుడు మేడలన్నియు సున్నమువేయువారులేకయు, అచ్చటచ్చట గడ్డిమొలకలు మొల

చియుఁ గళాహీనములై యున్నందున ఆహర్మ్యములమీద చంద్రకిరణములు ప్రతిఫలించుటయే లేదట.

శ్లో, అవర్ష్య శాఖాః సదయం చ యాసాం పుష్పాణ్యుపాత్తాని విలాసినీభిః,

వన్యైః పులిందైరివ వానరైస్తాః క్లిశ్యంత ఉద్యానలతా మదీయాః. 19

వ్యాఖ్య : విలాసినీభిః-సుకుమారయువతులచేత, సదయం-దయాపూర్వకముగా, శాఖాః-కొమ్మలను, ఆవర్ష్య-వంచి, యాసాం-ఏతీఁగలయొక్క, పుష్పాణి-పువ్వులు, ఉపాత్తాని-తెంపుకోఁబడియుండెనో, తాః-అట్టి, మదీయాః, ఉద్యానలతాః-నాయుద్యానలతలు, పులిందైః, ఇవ-ఆటవికజనులచేతవలె వన్యైఃవానరైః-అడవికోతులచేత, క్లిశ్యంతే-బాధింపఁబడుచున్నవి. ఏనాయుద్యానలతలు పూర్వము విలాసినులచేత దయతోవంచఁబడి పువ్వులుకోసుకోఁబడుచుండెనో యవి నేఁడు కర్కశస్వభావముగలయాటవికులచేతవలె వనవానరములచేత నిర్దయముగా బాధింపఁబడుచున్నవని చెప్పెను.

శ్లో. రాత్రావనావిష్కృతదీపభాసః కాంతాముఖశ్రీవియుతా దివాపి,

తిరస్క్రియంతే కృమితంతుజాలై ర్విచ్ఛిన్నధూమప్రసరా గవాక్షాః. 20

వ్యాఖ్య : రాత్రౌ-రాత్రియందు, అనావిష్కృతదీపభాసః-శూన్యమైన దీపకాంతులు గలవియు, దివా, అపి-పగటియందును, కాంతాముఖశ్రీవియుతాః-స్త్రీలముఖకాంతిచేత వియుక్తములైనవియు, విచ్ఛిన్నధూమప్రసరాః-నష్టమైన ధూమప్రసారముగలవియునగు, గవాక్షాః-గవాక్షములు, కృమితంతుజాలైః-సాలెపురుగులదారాల వలలచేత, తిరస్క్రియంతే-మూయఁబడుచున్నవి. నగరసౌధ గవాక్షములు రాత్రివేళలో దీపకాంతులు లేనివగుచు, పగలు అప్పుడప్పుడు తొంగిచూచు స్త్రీలముఖములులేనివగుచును, లోపలమనుష్యులులేనందున పొగవెళ్ళుటలేనివగుచు, సాలెపురుగు లల్లిన దారములతో మూతపడుచున్నవి సుమా! అని వాపోయెను.

ఈ గవాక్షములు గోడలకే ఆవుకన్నులవంటి రంధ్రములతో నిర్మింపఁబడిన నేటి కిటికీలవంటివి.

శ్లో. బలిక్రియావర్జితసైకతాని స్నానీయసంసర్గ మనాప్నువంతి,
ఉపాంతవానీరగృహాణి దృష్ట్వా శూన్యాని దూయే
సరయూజలాని. 21

వ్యాఖ్య : బలిక్రియావర్జితసైకతాని-బలిక్రియా-పూజాకర్మలచేత, వర్జిత-వర్జితములై, సైకతాని-ఇసుకతిన్నెలుగలవియు, స్నానీయసంసర్గం-స్నానసాధనములగు పిండి మొదలగు వానితోఁ గలియుటను, అనాప్నువంతి-పొందనివియు, ఉపాంతవానీరగృహాణి-సమీపమునందు నెంకొన్న ప్రబ్బలిపొదలు గలవియునగు, సరయూజలాని-సరయూనదీజలములను, శూన్యాని-నిర్మానుష్యములైన వానినిగా, దృష్ట్వా-చూచి, దూయే-పరితపించుచున్నాను. ఇఁక సరయూనదీ సైకతములందు పూజలు చేయువారులేరు, స్నానము చేయువారు శరీరమునకు రాచుకొను ఇప్ప, సెనగ మొదలగు వాని చూర్ణములు నీటిలోఁ గలియుటలేదు, నదిలోనికి దిగు దారులన్నియు ప్రబ్బలిపొదలతో నిండియున్నవి, ఇట్టి శూన్యములైన సరయూ జలములను జూచినప్పుడు నామనస్సు బాలానొచ్చుచున్నది అని యావనిత కుశుని యెదుట దురపిల్లెనని భావము. "బలిః పూజోపహారః స్యాత్" అని శాశ్వతనిఘంటువు. స్నాంతి అనేన ఇతి "స్నానీయం" కరణార్థమున "అనీయర్" ప్రత్యయము.

శ్లో. త దర్హసీమాం వసతిం విసృజ్య మా మభ్యుపైతుం
కులరాజధానీమ్,
హిత్వా తనుం కారణమానుషీం తాం యథా గురు స్తే
పరమాత్మ-మూర్తిమ్. 22

వ్యాఖ్య : తత్-అందువలన, ఇమాం, వసతిం-ఈ నివాసమును (కుశావతీ ప ణమును), విసృజ్య-వదలిపెట్టి, కులరాజధానీం-మీవంశ రాజధానినగు, మాం-న ౧ (అయోధ్యను), అభు పైతుం-చేరుటకు, అర్హసి-తగియున్నావు. (ఎట్లనగా) తే- యొక్క, గురుః-` యగు రాముఁడు, తాం, కారణమానుషీం, తనుం-కారణవశమున మానవ ముగల యాశరీరమును, హిత్వా-వదలి, పరమాత్మ మూర్తిం-విష్ణు శరీరమును, యథా-ఎట్లుపొందెనో అట్లు. రావణవధరూప కారణ

మున మానవరూపమును ధరించిన మీతండ్రియగురాముఁడు మరల విష్ణుమూర్తిగా వైకుంఠమునకు వెళ్ళినట్లు నీవును శత్రువిజయ చిహ్నముగా వసతిని(జేసికొన్న కుశావతీపట్టణమును వదలి కులరాజధానియైన అయోధ్యను జేరి నాదుఃఖమును దొలఁగింపు మని కోరెను.

శ్లో. తథేతి తస్యాః ప్రణయం ప్రతీతః ప్రత్యగ్రహీ త్ప్రాగ్రహరో రఘూణామ్,
పూ రప్యభివ్యక్తముఖప్రసాదా శరీరబంధేన తిరోబభూవ. 23

వ్యాఖ్య : రఘూణాం-రఘువంశీయులలో, ప్రాగ్రహరః-మిక్కిలిశ్రేష్ఠుఁడైన కుశుఁడు, తస్యాః-ఆయయోధ్యాధిదేవతయొక్క, ప్రణయం-ప్రార్థనమును, ప్రతీతః (సన్)-సంతుష్టుఁడగుచు, తథేతి (తథా + ఇతి)-అట్లేయగుగాక యని, ప్రత్యగ్రహీత్-అంగీకరించెను. పూరపి (పూః + అపి)-పురాధిదేవత సైతము, అభివ్యక్తముఖప్రసాదా-స్పష్టమైన ముఖనైర్మల్యము గలదియగుచు, శరీరబంధేన-శరీరముతో, తిరోబభూవ-అంతర్ధానమును పొందెను. అట్లు ఆహ్వానించిన ప్రార్థనను రఘువీరుఁడైన కుశుఁడంగీకరింపఁగా నయోధ్యా నగరాధిదేవత ధరించిన శరీరమును విడిచి అంతర్ధానమును పొందెను. అనఁగా నావనిత కుశుని యెదుటినుండి మాయమై పోయెనని భావము.

శ్లో. త దద్భుతం సంసది రాత్రివృత్తం ప్రాత ర్ద్విజేభ్యో నృపతిః శశంస,
శ్రుత్వా త ఏనం కులరాజధాన్యాః సాక్షా త్పతిత్వే వృత మభ్యనందన్. 24

వ్యాఖ్య : నృపతిః-కుశుఁడు, తదద్భుతం(తత్ + అద్భుతం) ఆయాశ్చర్యకరమైన, రాత్రివృత్తం-రాత్రియందలి వృత్తాంతమును, ప్రాతః-మరుసటి యుదయమున, సంసది-సభయందు, ద్విజేభ్యః-బ్రాహ్మణులకు, శశంస-చెప్పెను. తే-ఆ బ్రాహ్మణులు, శ్రుత్వా-విని, ఏనం-అతనిని, కులరాజధాన్యాః-వంశరాజధానికి, సాక్షాత్-స్వయముగా, పతిత్వే-భర్తయగుటయందు, వృతం-వరింపఁబడినవానిని, అభ్యనందన్-ఆశీర్వచనములచేత అభినందించిరి. అట్లు పూర్వరాత్రియందు జరిగిన వృత్తాంతమును మరునాటి ప్రాతఃకాలమున కుశుఁడు బ్రాహ్మణులకు సభలో వివ

రింపఁగా వారు కులరాజధాని స్వయముగా భర్తగా వరించినందులకతని నాశీర్వదించి మెచ్చుకొనిరని భావము. స్వప్నతుల మైన యీ సంఘటన విషయమున గార్గ్యుఁడను స్వప్నశాస్త్రవేత్త యిట్లు చెప్పెను. . "దృ _ స్వప్నం శోభనం నైవసుప్యాత్ పశ్చాత్ హృష్టోయః సపాకంవిధ , శంసేది ం తత్రసాధుర్విజేభ్యస్తే చాశీర్భిః ప్రీణయేయు ర్నరేంద్రమ్" అనఁగా మంచి స ము వచ్చినప్పుడు మేల్కొన్న రాజు ఆ స్వప్నఫలము ననుభవింపదలఁచుకొ చో మరల నిద్రింపరాదు. తరువాత బ్రాహ్మణులకుఁ జెప్పవలెను. వారును "తథా " అని ఆశీర్వదించి యతని నానం దింపఁజేయవలయునని యర్థము.

శ్లో॥ కుశావతీం శ్రోత్రియసా త్స కృత్వా యాత్రానుకూలే
ఒహాని సావరోధః,
అనుద్రుతో వాయు రివాభ్రవృందైః సైన్యై రయోధ్యాభి
ముఖః ప్రతస్థే. 25

వా — : సః-కుశుఁడు, కుశావతీం-కుశావతి నగరమును, శ్రోత్రియ సాత్-వేదవే ల స్వాధీనమైనదానినిగా, కృత్వా-చేసి, యాత్రానుకూలే-ప్రయాణ మునకుఁదగి , అహని-దినమునందు, సావరోధః సన్-అంతఃపురాంగనలతోఁగూడిన వాఁడగుచు, వాయుః-వాయువు, అభ్రవృందైః, ఇవ-మేఘసమూహములతోవలె, సైన్యైః-సేనలతో, అనుద్రుతఃసన్-వెంబడింపఁబడినవాఁడగుచు, అయోధ్యాభి ముఖః-అయోధ్యానగరమువైపు, ప్రతస్థే-ప్రయాణముచేసెను. కుశావతీ పట్ట ణమును వేదపండితులకు దానముచేసి, ప్రయాణమునకు యోగ్యమైన తిథివార నక్షత్రాదులుగల దినమునందు అంతఃపుర స్త్రీలతో అయోధ్యాభిముఖుఁడై కుశుఁడు ప్రయాణముచేయఁగా నతనివెంట సైన్యములు, వాయువువెంబడి మేఘబృందముల వలె, బయలుదేరెను. అలంకారము: ఉపమ.

శ్లో॥ సా కేతుమాలోపవనా బృహద్భి ర్విహారశైలానుగతేవ
నాగైః,
సేనా రథోదారగృహా ప్రయాణే తస్యాభవ
జ్జంగమరాజధానీ. 26

వ్యాఖ్య : కేతుమాలోపవనా-జెండాలవరుసలనెడి ఉపవనముగలదియు, బృహద్భిః-పెద్దవియగు, నాగైః-ఏన్గులచేత, విహారశైలానుగతా-క్రీడాపర్వతములతోఁ గూడినదివలెనున్నదియు రథోదారగృహా-రథములను మంచిగృహములుగలదియునగు, సా, సేనా-ఆసైన్యము, తస్య, ప్రయాణే-అకుశునిప్రయాణమునందు, జంగమరాజధానీ, ఇవ-నడచుచున్న నగరమువలె, అభవత్-ఉండెను. రంగురంగుల జెండాబట్టలు పువ్వులు, ఆకులు, కొమ్మలుగాఁ గనఁబడుటచేత ఉపవనముగానుఁ, ఎత్తైనయేనుఁగులు క్రీడాశైలములుగాను, రథములు అలంకరింపఁబడినయిండ్లుగాను గోచరించుటచేత ఆసేనయంతయుఁ గుశునిప్రయాణమునందు నడచుచున్న రాజధానిగాఁ బ్రకాశించెనని భావము. కేతుమాలాదులయందు ఆరోపింపఁబడిన ఉపవనాదులు జంగమరాజధానిగాఁ బరిణమించుట కుపయోగపడినందున పరిణామాలంకారము. "ఆరోప్యమాణస్య ప్రకృతోపయోగిత్వే పరిణామః" అని లక్షణము.

శ్లో. తేనాతపత్రామలమండలేన ప్రస్థాపితః
పూర్వనివాసభూమిమ్,
బభౌ బలౌఘః శశినోదితేన వేలా ముదన్వానివ
నీయమానః, 27

వ్యాఖ్య : ఆతపత్రామలమండలేన-నిర్మలమండలాకారముగల ఛత్రముగల, తేన-అకుశునిచేత, పూర్వనివాసభూమిం-మొదటినివాసమగు నయోధ్యను గుఱించి, ప్రస్థాపితః-ప్రయాణముచేయింపఁబడిన, బలౌఘః- న్యసమూహము, ఆతపత్రామలమండలేన-ఛత్రమువలె నిర్మలపూర్ణబింబముగలవాఁ , ఉదితేన-ఉదయించిన, శశినా-చంద్రునిచేత, వేలాం, నీయమానః-తీరము జేర్పఁబడుచున్న ఉదన్వాన్, ఇవ - స ము ద్ర ము వ లె, బభౌ - ప్రకాశించెను. శ్వేతచ్ఛత్రముగల కుశునిచేత నయోధ్యకు ప్రయాణముఁ జే యి ం ప ఁ బ డి న, సైన్య సమూహము, పూర్ణిమాచంద్రునిచేతఁ జెలియలికట్టకుఁ దీసికొనిపోఁబడుచున్న జలనిధివలెఁ బ్రకాశించెనని భావము. రూపకానుప్రాణితమగు ఉపమాలంకారము. "ఉదకం అస్య అస్తీతి ఉదన్వాన్" అని విగ్రహము.

శ్లో. తస్య ప్రయాతస్య వరూథినీనాం పీడా మపర్యాప్తవతీవ సోఢుమ్,
వసుంధరా విష్ణుపదం ద్వితీయ మధ్యారురోహేవ రజశ్ఛలేన. 28

వ్యాఖ్య : ప్రయాతస్య-ప్రయాణమైవెళ్ళుచున్న, తస్య-కుశునియొక్క, వరూథినీనాం-సేనలయొక్క, (అవి కలిగించునట్టి) పీడాం-బాధను, సోఢుం-సహించుటకు, అపర్యాప్తవతీ, ఇవ-శక్తిలేనిదివలెనుండిన, వసుంధరా-భూదేవి, రజశ్ఛలేన-దుమ్ము నెపమున, ద్వితీయం-రెండవదియగు, విష్ణుపదం-ఆకాశమును, అధ్యారురోహ, ఇవ-ఎక్కినదా? యనునట్లుండెను. కుశుని ప్రయాణమునందలి సైన్యమువలని బరువును మోయలేక భూదేవి ధూళిగామారి యాకాశమునెక్కెనా యేమి? అని తోచునట్లు ఆకాశము రజోమయమయ్యెనని భావము. "వరూథినీనాం" కర్తరి షష్ఠి. అలంకారము ; ఉత్ప్రేక్ష.

శ్లో. ఉద్యచ్ఛమానా గమనాయ పశ్చాత్ పురో నివేశే పథిచ వ్రజంతీ,
సా యత్ర సేనా దదృశే నృపస్య తత్రైవ సామగ్ర్యమతిం చకార. 29

వ్యాఖ్య ; గమనాయ-నడచుటకొఱకు, ఉద్యచ్ఛమానా-ముందుకు వెళ్ళుచున్నదియై, పశ్చాత్-వెనుకభాగమునందును, పురః-ముందుభాగమునందును, నివేశే-విడిదియందును, పథి-దారియందు, వ్రజంతీచ-వెళ్ళుచున్నదియగుచును, నృపస్య-కుశునియొక్క, సా, సేనా-ఆసైన్యము, యత్ర-ఎచ్చటెచ్చట, దదృశే-చూడఁబడుచుండెనో, తత్రైవ-అచ్చటచ్చటనే, సామగ్ర్యమతిం-సంపూర్ణముగా నున్నదను బుద్ధిని, చకార-కలిగించెను. ఒక సైన్యము లేదా జనసమూహము దారిలో నడచునప్పుడు ముందర వెనుక జనము పలుచగానుండి మధ్యలోకొంచె మెక్కువగా నుండుట సామాన్యము. కాని కుశుని సైన్యము వెనుక, ముందు, విడిదులలోను, దారి నడచునప్పుడును, ఎచ్చట చూచినను మిక్కుటము గానుండి సమగ్రసైన్య మిచ్చటనే యున్నదా? అను బుద్ధిని గలిగించుచు నేగెను. ఆసైన్య మంతయపరిమితముగా నుండెనని భావము. "ఉద్యచ్ఛమానా" యమ-ఉపరమే

అనుపరస్మైపదిధాతువు "సముదాఙ్భ్యోతామోఽగ్రంథే" అనుసూత్రమువలన ఆత్మనేపదికాఁగా "శానచ్" ప్రత్యయమువచ్చిన రూపము.

శ్లో. తస్య ద్విపానాం మదవారిసేకాత్ ఖురాభిఘాతాచ్చ
తురంగమాణామ్,
రేణుః ప్రపేదే పథి పంకభావం పంకోఽపి రేణుత్వ
మియాయ నేతుః. 30

వ్యాఖ్య : నేతుః-నాయకుఁడగు, తస్య-ఆకుశునియొక్క, ద్విపానాం-ఏనుఁగులయొక్క, మదవారిసేకాత్-మదోదకసేచనము వలనను, తురంగమాణాం-గుఱ్ఱములయొక్క, ఖురాభిఘాతాత్, చ-గిట్టల త్రొక్కుడు వలనను, (యథాసంఖ్యముగా) పథి-మార్గమునందు, రేణుః-ధూళి, పంకభావం-బురదతనమును, ప్రపేదే-పొందెను. పంకః, అపి-బురదకూడ, రేణుత్వం-ధూళియగుటను, ఇయాయ-పొందెను. అట్లు సైన్యమును దీసికొని పోవుచున్న కుశుని మార్గమునం దతనియేనుఁగుల మదజలధారలచేత ధూళి బురదగాను, నేలపైనుండినబురద గుఱ్ఱాల త్రొక్కిడి వలన ధూళిగాను మారెనని భావము. అనఁగా సైన్యమునందన్ని యేనుఁగులు, అన్ని గుఱ్ఱములు నుండెనన్నమాట. పంకము రేణువుగాను రేణువు పంకముగాను మారుట అతిశయోక్తి అలంకారము.

శ్లో. మార్గైషిణీ సా కటకాంతరేషు వైంధ్యేషు సేనా బహుధా
విభిన్నా,
చకార రేవేవ మహావిరావా బద్ధప్రతిశ్రుంతి
గుహాముఖాని. 31

వ్యాఖ్య : వైంధ్యేషు-వింధ్యకు సంబంధించిన, కటకాంతరేషు-పర్వతమధ్య ప్రదేశములయందు, మార్గైషిణీ-దారులు వెదకుచున్నది యగుటచే, బహుధా-అనేక విధములుగా, విభిన్నా-భిన్నదియై, మహావిరావా-పెద్దగా కేకలువేయుచున్న, సా, సేనా-ఆకుశునిసేన, రేవా, ఇవ-నర్మదానదివలెనే, గుహాముఖాని-నోళ్ళవంటి వింధ్య గుహలను, బద్ధప్రతిశ్రుంతి-ఎడతెగని ప్రతిధ్వనులు గలవానినిగా, చకార-చేసెను. దారిలోవచ్చిన వింధ్యపర్వతముపై పెక్కుకొండదారు లుండుటచేత నేఁభాగమెట్లు

నడచునో చూచుటలో నా సేన పెక్కు రీతుల చీలిపోయెను. అట్లు చీలిన సేన తమ గుర్తింపునకై పెద్దగా సరచుచుండఁగా నాధ్వనులు, నర్మదాశాఖల చప్పుడుల వంటివై, వింధ్యపర్వత గుహాముఖములను ప్రతిధ్వనింపఁజేసెనని భావము. అలంకారము: ఉపమ.

శ్లో. స ధాతుభేదారుణయాననేమిః ప్రభుః ప్రయాణధ్వని
మిశ్రతూర్యః,
వ్యలంఘయ ద్వింధ్య ముపాయనాని పశ్యన్ పుళిందై
రుపపాదితాని. 32

వ్యాఖ్య: ధాతుభేదారుణయాననేమిః-గైరికాదిధాతువులచేత నెఱ్ఱఁబడిన రథచక్రములయంచులు (కమ్ములు) గలవాఁడును, ప్రయాణధ్వని మిశ్రతూర్యః-ప్రయాణధ్వని-ప్రయాణమునందలి రథధ్వని, గజఘీంకార, అశ్వహేషాదులతో, మిశ్ర-కలిసిన, తూర్యః-మంగళవాద్యధ్వనులుగల, సః, ప్రభుః-ఆ కుశుఁడు, పుళిందైః-ఆటవికులచేత, ఉపపాదితాని-సమర్పింపఁబడిన, ఉపాయనాని-కానుకలను, పశ్యన్-చూచుచు, వింధ్యం-వింధ్యపర్వతమును, వ్యలంఘయత్-దాటెను. వింధ్య పర్వతమునందలి రంగు రంగుల ధాతువులు రథచక్రధారల కంటుకొనుచుండఁగా, సైన్యధ్వనులు, మంగళఘోషలు ఏకీభవింపగా, నేగుచున్న కుశుఁ డచ్చటి పుళిందులు తెచ్చిన కానుకలు చూచుచు ససైన్యముగా వింధ్యను దాటెను. కానుకలు చూచుట రాజనీతి, వానిని వెంటనే పరిజనులు తీసికొనియుంచుట యాచారము.

శ్లో. తీర్థే తదీయే గజసేతుబంధాత్ ప్రతీపగా ముత్తరతో
ఽస్య గంగామ్,
అయత్నవాలవ్యజనీబభూవు ర్హంసా నభోలంఘనలోల
పక్షాః. 33

వ్యాఖ్య: తదీయే-ఆ వింధ్యకు సంబంధించిన, తీర్థే-గంగలోని దిగు మార్గమునందు, గజసేతుబంధాత్-ఏనుగుల వంతెనకట్టుటవలన, ప్రతీపగాం-పశ్చిమవాహినియగు, గంగాం-గంగానదిని, ఉత్తరతః-దాటుచున్న, అస్య-ఆ కుశునికి, నభోలంఘనలోలపక్షాః-ఆకాశముపైకెగురుటచేతఁ గదలుచున్న రెక్కలుగల,

హంసాః-హంసలు, అయత్నవాలవ్యజనీబభూవుః-ప్రయత్నములేక లభించిన వింజామరము లయ్యెను. వింధ్యనుండి గంగలోనికి దిగు మార్గమునుండి గంగ యవతలి యొడ్డువఱకు వంతెనగా నిల్చిన గజములపైనుండి పశ్చిమవాహినిగాఁ బ్రవహించుచున్న గంగానదిని దాటుచున్న కుశ మహారాజునకు పైభాగమున ఱెక్కలాడించుచుఁ దిరుగునట్టి హంసలు అయత్నలబ్ధములైన వింజామరములుగాఁ బ్రకాశించుచుండెననియు నరణ్యమార్గమున సైతమతని రాచఱికమునకు లోపము లేకుండెననియు భావము.

శ్లో. స పూర్వజానాం కపిలేన రోషాత్ భస్మావశేషీకృత విగ్రహాణామ్,
సురాలయప్రాప్తి నిమిత్త మంభ స్త్రైస్రోతసం నౌలులితం వవందే. 34

వ్యాఖ్య : సః-కుశుఁడు కపిలేన-కపిలమహామునిచేత, రోషాత్-తన నవమానించిరను కోపమువలన, భస్మావశేషీకృతవిగ్రహాణాం-బూడిదగా మిగుల్పఁబడ్డ దేహములుగల, పూర్వజానాం-తమ పెద్దలగు సగరపుత్రులకు, సురాలయప్రాప్తి నిమిత్తం-స ... మును జేయుటకు కారణమైనదియు, నౌలులితం-నావలచేతఁగదిలింపఁబడినదియు, త్రైస్రోతసం-గంగాసంబంధమైనదియు నగు, అంభః-జలమును, వవందే-నమస్కరించెను. కపిలకోపాగ్నిచేత దగ్ధులైన సగరచక్రవర్తిపుత్రులు స్వర్గమునుజేరుటకై భగీరథుఁడు గంగాజలముతోఁ దర్పణ శ్రాద్ధములు చేసి వారికి ముక్తినిగలిగించెను వారు సూర్యవంశీయులగు, కుశుని పెద్దలు. అట్టి పెద్దలకు స్వర్గహేతువై, నిరంతరనౌకాయానములచేతఁ గదలు జలములుగల గంగకు భక్తితోఁ గుశుఁడు నమస్కరించెనని భావము. "త్రిస్రోతాః" అనఁగా స్వర్గ మర్త్య పాతాళ లోకములందు మూడు ప్రవాహములుగల గంగ, "త్రిస్రోతసః ఇదం త్రైస్రోతసం" గంగకు సంబంధించినది యని అర్థము.

శ్లో. ఇత్యధ్వనః కైశ్చి దహోభి రంతే కూలం సమాసాద్య కుశః సరయ్వాః,
వేదిప్రతిష్ఠాన్ వితతాధ్వరాణాం యూపా నపశ్య చ్ఛతశో రఘూణామ్. 35

వ్యాఖ్య : ఇతి-ఇట్లు, క్రైశ్చిత్, అహోభిః-కొన్నిరోజులతో (ముగిసిన) అధ్వనః-మార్గముయొక్క, అంతే-అవసానమునందు, కుశః-కుశమహారాజు, సరయ్వాః-సరయూనదియొక్క, కూలం-తీరమును, సమాసాద్య-చేరి, వితతాధ్వరాణాం-ఎన్నియో యజ్ఞములుచేసిన, రఘూణాం-రఘువంశపురాజులయొక్క, వేదిప్రతిష్ఠాన్-యజ్ఞవేదికలపై నిలుపఁబడిన, యూపాన్-పశుబంధన స్తంభములను, శతశః-నూర్లకొలఁదిగా, అపశ్యత్-చూచెను. వెనుకఁజెప్పినరీతిగాఁ గొన్నిరోజుల నడకతో మార్గముచివరగల సరయూనదీతీరమును జేరినకుశుఁడు తనపూర్వులయిన రఘువంశపురాజులు ఎన్నోయజ్ఞములుచేసి నిలిపిన నూర్లకొలఁది యూపస్తంభములను సరయూతీరసమీపమున జూచెనని భావము.

శ్లో. ఆధూయ శాఖాః కుసుమద్రుమాణాం స్పృష్ట్వాచ శీతాన్ సరయూతరంగాన్,
తం క్లాంతసైన్యం కులరాజధాన్యాః ప్రత్యుజ్జగామోపవనాంతవాయుః 36

వ్యాఖ్య : కులరాజధాన్యాః-అయోధ్యయొక్క, ఉపవనాంతవాయుః-ఉద్యానవనమారుతము, కుసుమద్రుమాణాం-పూలచెట్లయొక్క, శాఖాః కొమ్మలను, అధూయ-కొంచముకదలించియు, శీతాన్-చల్లని, సరయూతరంగాన్, చ-సరయూనదియలలనుసైతము, స్పృష్ట్వా-తాకియు, ంతసైన్యం-అలసినసేనగల, తం-ఆ కుశుని, ప్రత్యుజ్జగామ-ఎదురుకొనెను. పూలచె కొమ్మలు కొంచము కదలునట్లుగా సరయూతరంగములను దాకుచు,చల్లదనము ప మళమునుగల అయోధ్యానగరోద్యానవాయువు అలసిన సైనముతో వచ్చిన కుశరాజునకు స్వాగతము చెప్పెను. అనఁగా వారికి హాయిని గలిగించెనని భావము. ప్రత్యుజ్జగామ (ప్రతి + ఉత్ + జగామ).

శ్లో. అథోపశల్యే రిపుమగ్నశల్య స్తస్యాః పురః పౌరసఖః స రాజా,
కులధ్వజ స్తాని చలధ్వజాని నివేశయామాస బలీ బలాని. 37

వ్యాఖ్య : అథ-అట్లు సేదదీరిన పిమ్మట, రిపుమగ్నశల్యః-శత్రువులయందు నాటుకొన్న శరములు గలవాఁడును (యుద్ధ విజేతయని యర్థము), పౌరసఖః-

ప్రజలకు మిత్రుఁడును, కులధ్వజః-వంశమునకు పతాకవంటివాఁడును, బలీ-బల వంతుఁడు నగు, సఃరాజా-ఆకుశుఁడు, చలధ్వజాని-గాలికి రెపరెపలాడుచున్న జెండాలుగల, బలాని-సైన్యములను, తస్యాః, పురః-అయయోధ్యానగరముయొక్క, ఉపశల్యే-గ్రామాంతమునందు, నివేశయామాస-విడిదిచేయించెను. మహాపరాక్రమ వంతుఁడు, కులదీపము, ప్రజాబంధువు నగు కుశుఁడు సేదదీరి రెపరెపలాడు జెండాలతో గంభీరముగానున్న తన సైన్యమును అయోధ్యానగరముయొక్క వెలుపల నివసింపజేసెను. "గ్రామాంత ముపశల్యం స్యాత్" అని యమరము. "శల్యం శంకౌ శరే వంశే" అనివిశ్వనిఘంటువు. పాతనగరము ప్రవేశయోగ్యముగా లేనందున నట్లు చేసెనని భావము.

శ్లో. తాం శిల్పిసంఘాః ప్రభుణా నియుక్తా స్తథాగతాం సంభృత సాధనత్వాత్,
పురం నవీచక్రు రపాం విసర్గాత్ మేఘా నిదాఘగ్లపితా మివోర్వీమ్. 38

వ్యాఖ్య : ప్రభుణా-రాజైన కుశునిచేత, నియుక్తాః-నియోగింపఁబడిన, శిల్పి సంఘాః-శిల్పుల సమూహములు,సంభృతసాధనత్వాత్-సమృద్ధిగాజేర్చినపరికరములు గలవారగుటవలన, తథాగతాం-అట్లు శూన్యమైయుండిన,పురం-అయోధ్యను,మేఘాః-మేఘములు, అపాం, విసర్గాత్-జలములు కురియుటవలన, నిదాఘగ్లపితాం-గ్రీష్మ తప్తయైన, ఉర్వీం,ఇవ-భూమినివలె, నవీచక్రుః-క్రొత్తదానినిగాఁజేసిరి. సమృద్ధిగాఁ జేర్చిన పరికరములుండుటచేత శిల్పులు, వడ్రంగులు మొదలగువారు పాడువడి యున్న అయోధ్యానగరమును, ఎండకాలమున బీటలువారియున్న నేలను మేఘములు వర్షపాతముచేతవలె, శిథిలములు చక్కఁబరచి క్రొత్తపట్టణముగాఁ జేసిరి. అనగా నివాసయోగ్యముగాఁ జేసిరని భావము.

శ్లో. తతః సపర్యాం సపశూపహారాం పురః పరార్ధ్యప్రతిమా గృహాయాః,
ఉపోషితై ర్వాస్తువిధానవిద్భి ర్నిర్వర్తయామాస రఘుప్రవీరః. 39

వ్యాఖ : తతః-తరువాత, రఘుప్రవీరః-కుశుడు, పరార్థ్యప్రతిమా గృహాయాః—పరా -మిక్కిలివెలగలిగి ప్రశస్తములైన, ప్రతిమాగృహాయాః-దేవతా మందిరములు , రామదశరథాది శిల్పములునుగల, పురః-నూతననగరమునకు, ఉపోషితైః-ఉపవాసము చేసిన, వాస్తువిధాన విద్భిః-వాస్తుశాస్త్ర విధానములెఱిఁగిన వారిచేత, సపశూపహారాం-పశుబలులతోఁగూడిన, సపర్యాం-పూజను, నిర్వర్తయామాస-జరిపించెను. దేవాలయములతోను, నూతన గృహములతోను నిర్మింపఁబడిన అయోధ్యానగరమునకు వాస్తువిధానము నెఱిఁగిన శిల్పులు పురోహితులు మొదలగువారిచేత పశుబలియుక్తమైన నగరప్రవేశ శాంతిపూజాదులను కుశుఁడు జరిపించెనని భావము. భాసుని ప్రతిమా నాటకమును గాళిదాసెఱిఁగి యుండెను గాన నిచ్చటి ప్రతిమా శబ్దమునకు రఘుదిలీపాదుల, విగ్రహములును అర్థము కావచ్చునని ఊహింపఁబడినది.

శ్లో. తస్యాః స రాజోపపదం నిశాంతం కామీవ కాంతా

హృదయం ప్రవిశ్య,

యథార్హ మన్యై రనుజీవిలోకం సంభావయామాస

యథాప్రధానమ్. 40

వ్యాఖ్య : సః-కుశుఁడు, తస్యాః-ఆనగరమునకు (సంబంధించిన) రాజోపపదం-"రాజ"అనుపదము మొదటగల, నిశాంతం-భవనమును (రాజభవనమునని యర్థము) కామీ-కాముకుఁడు, కాంతాహృదయం, ఇవ-ప్రియురాలి హృదయమును వలె, ప్రవిశ్య-ప్రవేశించి, అన్యైః-ఇతరభవనములచేత, అనుజీవిలోకం-తన ననుసరించి జీవించు మంత్రులు మొదలగువారిని, యథాప్రధానం-మాన్యత్వానుసారముగా యథార్హం-వారికి తగినరీతిగా, సంభావయామాస-గౌరవించెను. ఆనగరముయొక్క రాజభవనమునందు తాను మక్కువతోఁ బ్రవేశించి, అమాత్యులు మొదలగు అనుజీవివర్గమును వారియుద్యోగములకుఁదగిన గృహములచేత సత్కరించెను. "కామీవ కాంతాహృదయం ప్రవిశ్య" అనునది, అయోధ్యానగరాధి దేవతకును కుశునికిని గల పరస్పరానురాగమును దెలుపుచున్నది. "రాజోపపదం" రాజశబ్దము ముందున్న పద మని "రాజభవన"మని గ్రహింపవలెను.

శ్లో. సా మందురాసంశ్రయిభి స్తురంగైః శాలావిధిస్తంభగతైశ్చ

నాగైః,

పూ రాబభాసే విపణిస్థపణ్యా సర్వాంగనద్ధా భరణేవ
నారీ. 41

వ్యాఖ్య : విపణిస్థపణ్యా-విపణి వీధియందుంచఁబడిన సమస్త క్రయ విక్రయార్హ వస్తువులుగలదియగు,సా,పూః-ఆయయోధ్యానగరము,మందురాసంశ్రయిభిః-అశ్వశాలయందుండుస్వభావముగల, తురంగైః-గుఱ్ఱములచేతను, శాలావిధిస్తంభగతైః-గజశాలలయందుంచిన స్తంభములకుఁ గట్టబడిన, నాగైశ్చ-ఏనుఁగులచేతను, సర్వాంగనద్ధాభరణా-సర్వావయవములందును అలంకరింపఁబడిన భూషణములుగల, నారీవ-స్త్రీవలె, అబభాసే-ప్రకాశించెను. అంగడివీథిలోనమర్చిన ధాన్యములు, రత్నములు మొదలగు క్రయవిక్రయార్హ వస్తువులచేతను, గుఱ్ఱపుశాలలలోనున్న గుఱ్ఱములచేతను, గజశాలలలో స్తంభములవద్ద నిలిచిన యేనుఁగులచేతను గూడియున్న అయోధ్యాపురి, సర్వాభరణ భూషితయగు స్త్రీవలె మిక్కిలి రాణించెనని భావము. "విపణిః పణ్యవీధికా" వాజిశాలాతు మందురా" అనియు నమరము.

శ్లో. వసన్ స తస్యాం వసతౌ రఘూణాం పురాణశోభా
మధిరోపితాయామ్,
న మైథిలేయః స్పృహయాంబభూవ భర్త్రేదివో
నాప్యలకేశ్వరాయ. 42

వ్యాఖ్య : సః,మైథిలేయః-సీతాకుమారుఁడగు నాకుశుఁడు, పురాణశోభాం-పూర్వపుటందమును, అధిరోపితాయాం-పొందించఁబడినట్టి. తస్యాం, రఘూణాం, వసతౌ-రఘువంశపురాజుల నివాసమగు నా అయోధ్యానగరమునందు, వసన్-నివసించుచున్నవాఁడై, దివః-స్వర్గమునకు, భర్త్రే-అధిపతియగు నింద్రునిగాని, అలకేశ్వరాయ, అపి-అలకానాథుఁడగు కుబేరునిఁగాని , నస్పృహయాంబభూవ-లెక్కింపలేదు. అట్లు పూర్వశోభను బొందిన అయోధ్యయందు నివాసమును జేయుచున్న కుశరాజు స్వర్గాధిపతియగు ఇంద్రుని, అలకాధిపతియగు కుబేరుని లెక్కచేయలేదు. అనఁగా స్వర్గముకంటెను, అలకానగరముకంటెను, అయోధ్య సుందరముగాఁ తీర్చిదిద్దబడినదని భావము. ఇచ్చట "భర్త్రే, అలకేశ్వరాయ" అను చతుర్థీవిభక్త్యంతములు స్పృహయాంబభూవ అను క్రియతో సంబంధించియున్నం దున "స్పృహేరీప్సితః" అను సూత్రముచేత సంప్రదానత్వమును, చతుర్థిని

బొందినవి. అర్థబోధ సౌకర్యముకొఱకు "ఇంద్రునిఁగాని, కుబేరునిఁగాని" అని వ్రాయఁబడినవి.

కుశునికి కుముద్వతీలాభము

శ్లో. అథాస్య రత్నగ్రథితోత్తరీయ మేకాంతపాండు
స్తనలంబిహారమ్,
నిశ్వాసహార్యాంశుక మాజగామ ఘర్మః ప్రియావేష
మివోపదేష్టుమ్. 43

వ్యాఖ్య : అథ-ఆతరువాత, అస్య-కుశునికి, రత్నగ్రథితోత్తరీయం-ముత్యములచేత గూర్చఁబడిన యుపవస్త్రముగలదియు, ఏకాంతపాండు స్తన లంబిహారం-ఏకాంతపాండు-మిక్కిలితెల్లగాను , స్తన-స్తనములమీద, లంబిహారం-వ్రేలాడు ముత్యాలహారములు గలిగిన యు, నిశ్వాసహార్యాంశుకం—నిశ్వాసహార్య-నిశ్వాసవాయువులచేతఁ దొలగింటకువీలగు, అంశుకం-వస్త్రములుగలదియు నగు, ప్రియావేషం-ప్రియురాలివేషమును, ఉపదేష్టుం, ఇవ-ఉపదేశించుటకు వలె, ఘర్మః-గ్రీష్మఋతువు, ఆజగామ-వచ్చెను. ఇక నీప్రియురాలిని ముత్యాల అంచులుకు న యుపవస్త్రమును ధరింపజేయుము; తెల్లని స్తనములపై వ్రేలాడు నట్లు ము సరులను ధరింపుమనుము, నీ నిట్టూర్పువాయువులకుఁ దొలఁగిపోవు పలుచని వస్త్రములు కట్టుకొనునట్లుచేయుము, అటు ప్రియావేషమును మార్చినగాని నీకు చల్లదనము సుఖము లభింపవు అని యుపదేశించుటకువలె గ్రీష్మఋతువు వచ్చెను. గ్రీష్మకాలమున నాయిక యిట్టివేషమును ధరించినగాని నాయకునికి సుఖముఁగూర్పఁజాలదని భావము.

శ్లో. అగస్త్యచిహ్నా దయనాత్సమీపం దిగుత్తరా భాస్వతి
సంనివృత్తే,
ఆనందశీతా మివ బాష్పవృష్టిం హిమస్రుతిం
హైమవతీం పసర్జ. 44

వ్యాఖ్య : అగస్త్యచిహ్నాత్-అగస్త్యనక్షత్రోదయము గుర్తుగానున్న, అయనాత్-దక్షిణాయనమార్గమునుండి, భాస్వతి-సూర్యుఁడు, సమీపం-తనసమీప

మును, సంనివృత్తే (సతి)-చేరినవాఁడుకాగానే, ఉత్తరా, దిక్-ఉత్తరదిక్కు, ఆనందశీతాం-సంతోషమున చల్లబడిన, బాష్పవృష్టిం, ఇవ-కన్నీటిధారనువలె, హైమవతీం-హిమవత్పర్వత సంబంధమగు, హిమస్రుతిం-మంచుప్రవాహమును, ససర్జ-సృజించెను. అగస్త్యనక్షత్ర సంబంధముగల దక్షిణాయనమును ముగించుకొని సూర్యుఁడుత్తరదిక్కున, ప్రయాణముసలుపువఱకు ఇంచుమించుగా గ్రీష్మమారంభమగును. అట్లు వియోగమును ముగించి తనవద్దికిఁజేరిన సూర్యుని జూచిన ఉత్తరదిక్కు, ప్రోషితభర్తృకయగునాయిక ప్రియసమాగమమువలనఁ బొందు నానందమును బొందుచు ఆనందబాష్పవృష్టినివలె, హిమవత్పర్వతసంబంధమగు మంచుబేఱులను సృజించె ననిభావము. గ్రీష్మమున మంచుకరగుట సహజముకదా! అలంకారము: సమాసోక్తి.

శ్లో. ప్రవృద్ధతాపో దివసోఽతిమాత్ర మత్యర్థ మేవ
క్షణదా చ తన్వీ,
ఉభౌ విరోధక్రియయా విభిన్నౌ జాయాపతీ
సానుశయా వివాస్తామ్. 45

వ్యాఖ్య : అతిమాత్రం—మిక్కిలి ఎక్కువగా, ప్రవృద్ధతాపః-వృద్ధిచెందిన యెండ వేడిమిగల, దివసః-పగలును, అత్యర్థమేవ-అంతయెక్కువగానే, తన్వీ-కృశించిన (కుఱచదియైన), క్షణదా, చ-రాత్రియును, ఉభౌ-ఇద్దఱును, విరోధక్రియయా-(ఒకరికిష్టముగాని పనిని మరియొకరు చేయుటవంటి) ప్రణయకలహాది విరోధాచరణముచేత, విభిన్నౌ-వేరుపడినవారై, సానుశయౌ-పశ్చాత్తాపముగల, జాయాపతీ, ఇవ-దంపతులవలె, ఆస్తాం-ఉండినవి. గ్రీష్మమున దీర్ఘమై వేడి ఎక్కువగానుండిన పగటివేళయు, మిక్కిలి కుఱుచయైన రాత్రివేళయు నుండుట సహజము. దివస శబ్దము పుంలింగ మగుటయు, "క్షణదా" (రాత్రి) స్త్రీలింగ మగుటయుఁ గారణముగా వానిని భార్యాభర్తలుగాఁబోల్చి, ఆజాయాపతులు కలహించుకొని, వేరుపడి, ఒకరికై యొకరు తాపముఁజెందుటయు, కృశించుటయు జరుగుచున్నట్లు వర్ణించెను. దీర్ఘమైన దివసము తాపముతో రాత్రియెప్పుడువచ్చునా? యనియు, రాత్రి దివసాగమమునకై కృశించుటయు సమాన ధర్మములు. అలంకారము : ఉపమ.

శ్లో. దినేదినే శైవలవం త్యధస్తాత్ సోపానపర్వాణి విముంచ
దంభః,

ఉద్దండపద్మం గృహదీర్ఘికాణాం నారీనితంబద్వయసం
బభూవ. 46

వ్యాఖ్య : దినేదినే-దినదినమునందును, శైవలవంతి-నాచుకలవియగుచు, అధస్తాత్-క్రింద క్రిందగానున్న, సోపానపర్వాణి-మెట్లవరుసలను, విముంచత్-విడుచుచున్నదియు, ఉద్దండపద్మం-పైకివచ్చినకాడలుగల కమలములు గలదియు నగు, గృహదీర్ఘికాణాం, అంభః-ఇండ్లయందలి దిగుడుబావులయొక్క నీరు, నారీనితంబద యసం-స్త్రీల నితంబములవఱకువచ్చు లోతుగల', బభూవ-అయినది. గృహదీర్ఘికలలోని నీరు, దినదినము క్రింద క్రింద నాచుతోఁగూడిన మెట్లను విడుచుచు, లు దిగినచో వారినితంబములంతవఱకు వచ్చు లోతుగందియై వారికి జలవిహార యోగ్యముగా మారినదని భావము. "ప్రమాణేద్వయసచ్" ఇత్యాది సూత్రమువలన ఊరుద్వయసం, వలెనే నితంబద్వయసం" సిద్ధించినది. ఊరువుల లోతు, నితంబములోతు అని యర్థము.

శ్లో. వనేషు సాయంతన మల్లికానాం విజృంభణోద్గంధిషు
కుట్మలేషు,

ప్రత్యేకనిక్షిప్తపదః సశబ్దం సంఖ్యా మివైషాం భ్రమర
శ్చకార. 47

వ్యాఖ్య : వనేషు-ఉద్యానవనములయందు, విజృంభణోద్గంధిషు-వికసించుచు సౌరభము నెగజల్లునవియగు, సాయంతనమల్లికానాం, కుట్మలేషు-సాయంకాలపు మల్లెలయొక్క మొగ్గలయందు, సశబ్దం-ఝుంకారముతోగూడునట్లు, ప్రత్యేకనిక్షిప్త పదః-ఒక్కొక్కదానియందు ఉంచబడిన పాదములుగల, భ్రమరః-తుమెద, ఏషాం-ఆ మొగ్గలయొక్క, సంఖ్యాం-గణనమును, చకార, ఇవ-చేసియు న్నది. పూఁదోటలయందు వికసించునప్పుడు పరిమళముల నెగజల్లుచు సాయంకాలపు మల్లెమొగ్గలయందు (బొండుమల్లెలు) ఒక్కొక్కదానియందుఝుంకార యుక్తముగా మకరందపానముకొఱకుఁ గాళ్లూన్చుచున్న భ్రమరము ఆ మొగ్గ

లెన్నియున్నవో లెక్కించునట్లు తిరుగుచున్నదని భావము. గ్రీష్మఋతుసాయంకాల మంతమనోహరముగా నుండినదని తాత్పర్యము. అలంకారము: ఉత్ప్రేక్ష.

శ్లో. స్వేదానువిద్ధార్ద్రనఖక్షతాంకే భూయిష్ఠసందష్టశిఖం కపోలే,
చ్యుతం న కర్ణాదపి కామినీనాం శిరీషపుష్పం
సహసా పపాత. 48

వ్యాఖ్య: స్వేదానువిద్ధార్ద్రనఖక్షతాంకే—స్వేదానువిద్ధ-చెమటతోఁగలిసిన, ఆర్ద్రనఖక్షత- క్రొత్తగోరుగిచ్చులు, అంకే-గుర్తులుగానుండిన, కామినీనాం,కపోలే-స్త్రీలయొక్క చెంపలయందు (జాత్యేకవచనము), భూయిష్ఠసందష్టశిఖం-ఎక్కువగా విడిపోయిన కేసరములుగల, శిరీషపుష్పం-దిరిసెనపువ్వు, కర్ణాత్-చెవినుండి, చ్యుతం, అపి-జారినదైనను, సహసా-వెంటనే, నపపాత-క్రిందపడలేదు. కామినుల చెంపలపై అప్పుడే యేర్పడిన నఖక్షతములలో రతిశ్రమ, ఘర్మతాపాదులవలని చెమట కూడ కలియుటచేత, శయనసమ్మర్దమునందు విడిపోయిన కేసరములుగల శిరీషపుష్పము, చెంపలపైఁ గొంచముగా నతుకుకొనియుంటుటవలన చెవిసందునుండి జారినప్పటికిని త్వరగాక్రిందఁబడలేదు. గ్రీష్మమున శిరీషములుపూయుట, వాటిని స్త్రీలు కర్ణావతంసములుగా ధరించుట యాచారము.

శ్లో. యంత్రప్రవాహైః శిశిరైః పరీతాన్ రసేన ధౌతాన్
మలయోద్భవస్య,
శిలావిశేషా నధిశయ్య నిన్యుః ధారాగృహేష్వాతప
మృద్ధిమంతః 49

వ్యాఖ్య:ఋద్ధిమంతః-ధనికులు,ధారాగృహేషు-యంత్రధారాగృహములయందు శిశిరైః-చల్లనివియగు, యంత్రప్రవాహైః-యంత్రములద్వారా వచ్చుజలధారలచేత, పరీతాన్-కూడినవియు, మలయోద్భవస్య, రసేన-చందనముయొక్క ఉదకముచేత, ధౌతాన్-కడుగఁబడినవియునగు, శిలావిశేషాన్-మణిమయములగు జాతికట్టడములను,అధిశయ్య-ఎక్కి-పండుకొని, ఆతపం-ఎండవేడిమిని, నిన్యుః-తొలఁగించుకొనిరి. ధనికులు మణినిర్మితములైన యరుగులను శ్రీగంధోదకముతోఁగడిగించి, వాటిపై చల్లని యంత్రజలధారలు పడునట్లుచేసి, అచ్చట శయనించి యెండవలనఁగలిగిన తాపమును దొలఁగించుకొనుచుండిరట.

శ్లో. స్నానార్ద్రముక్తే ష్వనుధూపవాసం విన్యస్తసాయంతన
మల్లి కేషు,
కామో వసంతాత్యయమందవీర్యః కేశేషు లేభే బల
మంగనానామ్. 50

వ్యాఖ్య : వసంతాత యమందవీర్యః—వసంతాత్యయ-తనకు సహకారి యగు వసంతుఁడు వెళ్ళిపో టచేత, మందవీర్యః-తగ్గినశౌర్యముగల, కామః-మన్మథుఁడు, స్నానార్ద్రము ష-స్నానముచేత దడిసినవగుటవలన జాఱవిడువఁబడినవియు, అనుధూపవాసం-సుగంధపుఁబొగ వేసిన వెంటనే, విన్యస్తసాయంతన మల్లికేషు-ఉంచఁబడిన సాయంతాలపు మల్లెపూవులు గలవియునగు, అంగనానాం, కేశేషు-స్త్రీలయొక్క శిరోజలములయందు, బలం-బలమును, లేభే-పొందెను. మిత్రుఁడు, వసంతుడు వెళ్ళిపోవుటచేత బలహీనుఁడై యున్న మన్మథుఁడు, సాయంకాల స్నానముచేతఁదడిసి, ధూపముకొరకు జారవిడువఁబడినవియై, పొగవేసిన వెంటనే బొండుమల్లెల దండ లమర్చిన లకేశపాశములయందు మరల బలమును జేకూర్చుకొనెను. అనఁగా స్త్రీల యాకేశ శములు మన్మథోద్దీపకములుగా నుండె ననియు, పురుషులకు శృంగార భావమును గలిగించెననియు భావము.

శ్లో. ఆపింజరా బద్ధరజఃకణత్వాత్ మంజర్యుదారా
శుశుభేఽర్జునస్య,
దగ్ధ్వాపి దేహం గిరిశేన రోషాత్ ఖండీకృతా జ్యేవ
మనోభవస్య. 51

వ్యాఖ్య : బద్ధరజఃకణత్వాత్-వ్యాపించిన పుష్పొడిరేణువులు గలదగుటచేత, ఆపింజరా-తెలుపుపసుపును గలిసిన రంగు గలదియు, ఉదారా-పొడవుగా నున్నదియు నగు, అర్జునస్య, మంజరీ-మద్దిపూలగుత్తి, దేహం - శరీరమును, దగ్ధ్వా, అపి-కాల్చియుఁగూడ, రోషాత్-శమించనికోపమువలన, గిరిశేన-శివునిచేత, ఖండీకృతా-త్రుంచఁబడిన, మనోభవస్య-మన్మథునియొక్క జ్యేవ (జ్యా + ఇవ)-మౌర్వివలె, శుశుభే-ప్రకాశించెను. పుష్పొడిరేణువులురాలుచున్న మద్దిపూలగుత్తి,మన్మథునిదహించియును కోపముచల్లారక శివుఁడు అతని ధనుస్సున

కున్న అల్లెత్రాటినిఁ దెంపినట్లు గనఁబడుచుండె నని భావము. అలంకారము : ఉత్ప్రేక్ష.

శ్లో. మనోజ్ఞగంధం సహకారభంగం పురాణశీధుం నవపాటలం చ,
సంబధ్నతా కామిజనేషు దోషాః సర్వే నిదాఘావధినా
ప్రమృష్టాః. 52

వ్యాఖ్య : మనోజ్ఞగంధం-ఇంపైన వాసనలుగల, సహకారభంగం-మామిడి చిగురు ముక్కను (అంతట జాత్యేకవచనము), పురాణశీధుం-పులియబెట్టఁబడిన చెఱకుమద్యమును, నవపాటలం, చ-క్రొత్త కలిగొట్టుపువ్వును, సంబధ్నతా-సమ కూర్చుచున్న, నిదాఘావధినా-గ్రీష్మకాలముచేత, కామిజనేషు-కామినీకాముకుల యందలి, సర్వే, దోషాః-తాపాదులగు దోషములన్నియు, ప్రమృష్టాః-తుడిచివేయఁ బడినవి. మనోహరములగు పరిమళములు గల తియ్యమామిడిచిగుళ్ళ ముక్కలు, చక్కగా భావనచేయఁబడిన చెఱకురసపుమద్యము, క్రొత్తగాపూచిన కలిగొట్టు పూవులు సంతరించిన గ్రీష్మవేళలచేత కాములకును కామినులకును గలుగుచుండిన నిదాఘతాప విరహవేదనాది బాధలన్నియుఁ దుడిచివేయఁబడి వారి కపరిమిత సౌఖ్యమును గలిగించుచుండినవని భావము. "శేరతే అనేన ఇతి శీధుః" అను వ్యుత్పత్తితో "శీఙ్-స్వప్నే" ధాతువునకు "ధుక్" ప్రత్యయముచేరఁగా నేర్పడిన శబ్దము "శీధుః" అని తెలియవలెను

శ్లో. జనస్య తస్మిన్ సమయే విగాఢే బభూవతు ర్ద్వౌ సవిశేష
కాంతౌ,
తాపాపనోదక్షమపాదసేవౌ స చోదయస్థౌ నృపతిః
శశీ చ. 53

వ్యాఖ్య : తస్మిన్, సమయే-ఆగ్రీష్మకాలము, విగాఢే (సతి)-కఠినమైన దిగానుండగా, జనస్య-జనమునకు, ద్వౌ-ఇద్దరే, సవిశేషకాంతౌ-మిక్కిలియిష్టమైన వారు, బభూవతుః-అయియుండిరి. తాపాపనోదక్షమపాదసేవౌ—తాపాపనోద-తాపమునుతొలఁగించుటయందు, క్షమ-సమర్థమైయున్న, పాదసేవౌ-పాదసేవ నముగలవారై (కుఱని పక్షమున రాజసేవయు, చంద్రుని పక్షమున

కిరణకాంతి ననుభవించుటయు నర్థము), ఉదయస్థౌ-అభ్యుదయము నందున, స, చ, నృపతిః—ఆ రాజున్ను, శశీ, చ-చంద్రుఁడు ను, అతికఠిన యున్న ఆ గ్రీష్మకాలమున ప్రజలకు మిక్కిలి యిష్టులై యాశ్రయింపఁ దగినవా కుశుఁడు, చంద్రుఁడును మాత్రమే అయియుండిరి. అనఁగా నుదయించు చున్న చంద్రుని కిరణముల నాశ్రయించి చల్లఁదనమును, అభ్యుదయమును బొందిన కుశుని సేవించి జీవనమున కవసరమగు ధాన్యములను, చలిపందిరులు మొదలగు సౌకర్యములను బొందుచుండిరని భావము.

శ్లో. అథోర్మిలోలోన్మదరాజహంసే రోధోలతాపుష్పవహే సరయ్వాః
విహర్తు మిచ్ఛా వనితాసఖస్య తస్యాంభసి గ్రీష్మసుఖే బభూవ. 54

వ్యాఖ్య : అథ-తరువాత, ఊర్మిలోలోన్మదరాజహంసే—ఊర్మి-తరంగ ములయందు, లోల-అభిలాషగల, ఉన్మదరాజహంసే-మదించిన రాజహంసలు గలదియు, రోధోలతాపుష్పవహే—రోధః-ఒడ్డునందలి, లతాపుష్ప-తీగలపూలను, వహే-చేర్చునదియు, గ్రీష్మసుఖే-గ్రీష్మఋతువునందు సుఖమునిచ్చునదియునగు, సరయ్వాః, అంభసి-సరయూనదియొక్క జలమునందు, తస్య-ఆ కుశునికి, వనితా సఖస్య-స్త్రీలతోసహ, విహర్తుం-విహరించుటకు, ఇచ్ఛా-కోరిక, బభూవ-కలిగెను. ఆ తరువాత తరంగములందు చెలరేగి తిరుగు రాజహంసలతోను, ఒడ్డునరాలి లోపల ప్రవేశించిన పువ్వులతోను, వేసవిలో ఆనందమునుగూర్చు సరయూ జలమునందు సఖీసమేతుఁడై విహరించుటకు కుశునికిఁ గోరికకల్గెనని భావము. "లోల శ్చల సతృష్ణయోః" అని అమరము.

శ్లో. స తీరభూమౌ విహితోపకార్యా మానాయిభి స్తా మపకృష్టనక్రామ్,
విగాహితుం శ్రీమహిమానురూపం ప్రచక్రమే చక్రధరప్రభావః. 55

వ్యాఖ్య : చక్రధరప్రభావః-విష్ణుతేజస్సుగల, సః-ఆ కుశుఁడు, తీర భౌ-ఒడ్డుననున్న భూమియందు, విహితోపకార్యాం-వేయింపబడిన పటకుటీరము

(దేరా) గలదియు, ఆనాయిభిః-జాలరులచేత, అపకృష్టనక్రాం-తొలఁగింపబడిన మొసళ్ళుగలదియునగు, తాం-ఆ సరయూనదిని, శ్రీమహిమానురూపం-తన సంపదకును, గొప్పదనమునకును దగినట్లు, విగాహితుం-ప్రవేశించుటకు, ప్రచక్రమే-మొదలిడెను శ్లో. "పరిశాపిషు వాసరేషు పశ్యన్-తటలేఖాస్థిత మాప్తసైన్యచక్రమ్, సువిశోధితనక్రమీనజాలం వ్యవగాహేతజలం సుహృత్సమేతః" అను కామందకనీతిసార వచనమువలన ఆగ్రీష్మదినములలో సరయూనదియందలి మొసళ్ళను, చేపలను జాలరుల చేతఒడ్డునవేయించి తన సంపద్వైభవములకుఁ దగినరీతిగా స్త్రీలతోను,మిత్రులతోను గలిసి సరయూజలమునందు విహరించుటకు ప్రారంభించెను.

శ్లో. సా తీరసోపానపథావతారా దన్యోన్యకేయూరవిఘట్టినీభిః,
సనూపురక్షోభపదాభి రాసీ దుద్విగ్నహంసా సరి
దంగనాభిః. 56

వ్యాఖ్య : సా, సరిత్-ఆసరయూనది, తీరసోపానపథావతారాత్-తీరసోపానపథ-ఒడ్డునుండి - మెట్లత్రోవనుండి, అవతారాత్-దిగుటవలన, అన్యోన్యకేయూరవిఘట్టినీభిః-అన్యోన్య-ఒకరినొకరు,కేయూరవిఘట్టినీభిః-భుజభూషణముల చేత ఒరసికొనుచున్నట్టియు, సనూపురక్షోభపదాభిః-అందెల ఘలంఘలలతోఁ గూడిన పాదములుగల, అంగనాభిః-స్త్రీలచేత. ఉద్విగ్నహంసా-భయపడినహంసలు గలది, ఆసీత్-అయ్యెను. మెట్లపైనుండి నదిలోనికి దిగునప్పుడు ఒకరిభుజములతో మరియొకరి భుజములు రాచుకొన్నందునగలుగుచున్న భూషణధ్వనులతోను, కాళ్ళయందెల ఘల్లులారావములతోను, పెక్కుమంది స్త్రీలు సరయూనదిలోనికి వచ్చుచుండుట కారణముగా నచ్చటనున్న హంసలు బెదరిపోయె ననిభావము. అట్లు సరయూనది చూడముచ్చటగా నుండెను.

శ్లో. పరస్పరాభ్యుక్షణతత్పరాణాం తాసాం నృపో
మజ్జనరాగదర్శీ,
నౌ సంశ్రయః పార్శ్వగతాం కిరాతీ ముపాత్తవాలవ్య
జనాం బభాషే. 57

వ్యాఖ్య : నౌ సంశ్రయః-పడవలోనుండియు, పరస్పరాభ్యుక్షణతత్పరాణాం—పరస్పరాభ్యుక్షణ-ఒకరిపైనొకరు నీళ్ళు చల్లుకొనుటయందు,తత్పరాణాం-

ఆసక్తిగల, తాసాం-ఆస్త్రీలయొక్క, మజ్జనరాగదర్శీ-నీటమునుగుటయందలి యభి లాషను జూచుచున్న, నృపః-కుశుఁడు, పార్శ్వగతాం-తన ప్రక్కనున్నదియు, ఉపాత్తవాలవ్యజనాం-చేతఁబట్టుకొన్న వింజామరముగలదియు, కిరాతీం-కిరాతజాతి స్త్రీయగు చామరగ్రాహిణినిగురించి, బభాషే-పలికెను ఆజలక్రీడాసమయమున పడ వలో నెక్కియుండి, స్త్రీలు నీటిలోమునుగుటను, నొకరిపైనొకరు నీళ్ళు చల్లు కొనుట మొదలగు వినోదమును జూచుచున్న కుశుఁడు తనప్రక్కనుండిన చామరగ్రాహిణితో ముందు చెప్పఁబోవురీతిగాఁ బలికెను. "కిరాతి" యనఁగా చామర గ్రాహిణి మాత్రమేయని కేశవఘంటు వర్థము చెప్పినది.

శ్లో. పర్యావరోధైః శతశో మదీయై ర్విగాహ్యమానో గలితాంగరాగైః,
సంధ్యోదయః సాభ్ర ఇవైష వర్ణం పుష్య త్యనేకం సరయూప్రవాహః. 58

వ్యాఖ్య: గలితాంగరా. ః-రాలిన మైపూతలుగలవారును, శతశః-నూర్ల కొలదిగానున్న, మదీయైః-అవ ః-నాయంతఃపురస్త్రీలచేత, విగాహ్యమానః-మున కలచేఁ జెదరఁగొట్టబడుచున్న, షః, సరయూప్రవాహః-ఈ సరయూ ప్రవా హము, సాభ్రః-మేఘముతోఁగూడిన, సంధ్యోదయః, ఇవ—సంధ్యాకాలోదయము వలె, అనేకం-పెక్కువిధములగు, వర్ణం-ఎరుపు, పసుపు మొదలగు రంగును, పుష్యతి-పోషించుచున్నది, పశ్య-చూడుము. తమ దేహములకుఁ బూసికొన్న గందము పసుపు మొదలగు మైపూఁతలు రాలునట్లు నూర్లకొలఁదిగానున్న నాయంతః పురస్త్రీలు మునకలు వేయుటచేత ఈ సరయూ ప్రవాహము, రక్తపీతాదివర్ణములు గలిగి మేఘముతోఁగూడిన సాయంకాల పుటాకాశమువలె ప్రకాశించుచున్నది చూడు! అని కుశుఁడు చామరగ్రాహిణితో ననెను.

శ్లో. విలుప్త మంతః పురసుందరీణాం యదంజనం నౌలులితాభి రద్భిః,
త ద్బధ్నతీభి ర్మదరాగశోభాం విలోచనేషు ప్రతిముక్త మాసామ్. 59

వ్యాఖ్య : నౌలులితాభిః-ఓడలచేతఁ జలింపజేయఁబడిన, అద్భిః-జలముల చేత, అంతఃపురసుందరీణాం-రాణివాసపు స్త్రీలయొక్క, యత్, అంజనం-ఏకాటుక, విలుప్తం-పోఁగొట్టఁబడినదో, తత్-దానిని, విలోచనేషు-వారికన్నులయందు, మద రాగశోభాం-మదముచేతఁగలుగు నెఱ్ఱనికాంతివంటి కాంతిని బధ్నతీభిః-కూర్చుచున్న, అద్భిః-జలములచేత, ఆసాం-ఈస్త్రీలకు, ప్రతిముక్తం-తిరిగి యియ్యఁబడినది. ఓడల కదలికచేతఁ జలించుచున్న సరయూజలము, రాణివాసపు స్త్రీల కన్నులయందలి కజ్జలమును దుడిచివేసినప్పటికిని, తన స్పర్శచేత నెఱ్ఱబారిన వారి కన్నులయందు మదమువల్లగలుగు నెఱ్ఱనికాంతివంటి కాంతిని గలిగించి, వారి వస్తువునకు మరియొక వస్తువును బదులుగానిచ్చి యప్పు తీర్చుకొన్నట్లున్నది చూడుము! అని కుశుఁడు చామరగ్రాహిణితో ననెను. "ప్రతిముక్త" మనఁగా ప్రత్యర్పితం అని యర్థము.

శ్లో. ఏతా గురుశ్రోణిపయోధరత్వా దాత్మాన ముద్వోఢు
మశక్నువత్యః,
గాఢాంగదై ర్బాహుభి రప్సు బాలాః క్లేశో త్తరం
రాగవశాత్ ప్లవంతే. 60

వ్యాఖ్య : గురుశ్రోణిపయోధరత్వాత్--గురు-బరువైన, శ్రోణిపయోధర త్వాత్-పిఱుదులును, స్తనములునుగలదియగుటవలన, ఆత్మానం-శరీరమును, ఉద్వోఢుం-మోయుటకు, అశక్నువత్యః-శక్తిచాలని, ఏతాః,బాలాః-ఈ స్త్రీలు, గాఢాంగదైః-గట్టిగా కరచుకొన్న భుజాలంకారములుగల, బాహుభిః-బాహువులచేత, క్లేశోత్తరం-అతికష్టముగా, రాగవశాత్-జలక్రీడయందలి ప్రేమాధిక్యమువలన, ప్లవంతే-ఈదుచున్నారు. ఈ యంగనలు బరువైన పిఱుదులును, స్తనములును గల దేహములను నీటిపైకెత్తలేక భూషణభూషితములైన త్తిడిగల బాహువులనుమాత్రము నీటిపైకి వేయుచు, చాలకష్టపడుచు, జలక్రీడయందలి యౌత్సుక్యముచేత నెట్లో ఈదు చున్నారు చూడుము! అనెను.

శ్లో. అమీ శిరీషప్రసవావతంసాః ప్రభ్రంశినో వారివిహారిణీనామ్,
పారిప్లవాః స్రోతసి నిమ్నగాయాః శైవాలలోలాం
శ్ఛలయంతి మీనాన్. 61

వ్యాఖ్య : వారివిహారిణీనాం-జలవిహారముచేయుచున్న యీ స్త్రీలయొక్క, ప్రభ్రంశినః-జారిపడినవియు, నిమ్నగాయాః-నదియొక్క, స్రోతసి-ప్రవాహము నందు, పారిప్లవాః-తేలియాడుచున్నవియు నగు, అమీ-ఈ,శిరీష ప్రసవావతంసాః-దిరిసెనపూలనెడు కర్ణభూషలు, శైవాలలోలాన్-నాచుపైనాశగల, మీనాన్-చేపలను, ఛలయంతి-మోసగించుచున్నవి. జల క్రీడాడుచున్న యీ స్త్రీల చెవులనుండి జారి, నదీప్రవాహమునందు తేలియాడుచు న్న, యీ దిరిసెనపూలు, నాచుపై మక్కువగల చేపలను మోసగించి యవి నీటిపైకి చ్చ కనపడునట్లు చేయుచున్నవిసుమా! యని కుశుడు చామరగ్రాహిణితోఁ బలికెనని భావము.

శ్లో. ఆసాం జలాస్ఫాలనతత్పరాణాం ముక్తాఫలస్పర్ధిషు
శీకరేషు,
పయోధరోత్సర్పిషు శీర్యమాణః సంలక్ష్యతే న
ఛిదురోఽపి హారః 62

వ్యాఖ్య : జలాస్ఫాలనతత్పరాణాం--జలాస్ఫాలన-నీటిని చేతులతోఁగొట్టుట యందు తత్పరాణాం-ఆసక్తలైయున్న, ఆసాం-ఈ స్త్రీలయొక్క, ముక్తాఫల స్పర్ధిషు-ముత్యములను బోలియున్నట్టియు, పయోధరోత్సర్పిషు- స్తనములపై నెగిరి పడుచున్నవి నగు, శీకరేషు - తుంపురులయందు, శీర్యమాణః-జారుచున్న,హారః-ముత్యాలదండ, ఛిదురః,అపి-తెగియున్నదైనను, నసంలక్ష్యతే-స్త్రీలచేత చూచుకోఁ బడుటలేదు.జలక్రీడలయందు అరచేతులతో నీటినిగొట్టుచు(తాళమువేయుచు) మైమరచి యున్న యీస్త్రీల స్తనములమీద ముత్యములంతలావునఁ బడుచున్న నీటిబిందు వుల మధ్యన, తమమెడలయందున్న ముత్యాలహారము నీటితాకిడికి జారి తెగిపడిన విషయమునుగూడ వీరు గుర్తింపఁజాలకున్నారు. శీకరములకును ముత్యములకును పోలికయున్నందున వారికి ముత్తెపుసరములు తెగినసంగతియే తెలియుటలేదని భావము.

శ్లో. ఆవర్తశోభా నతనాభికాంతే ర్భంగో భ్రువాం
ద్వంద్వచరాః స్తనానామ్,
జాతాని రూపావయవోపమానా న్యదూరవర్తీని
విలాసినీనామ్. 63

వ్యాఖ్య : విలాసినీనామ్-ఈవిలాసవతులకు, రూపావయవోపమానాని-తమ చక్కని యవయవములయొక్క ఉపమానము లన్నియు, అదూరవర్తీని-తమ వద్దికి వచ్చినవే. జాతాని-అయినవి. ఎట్లనగా, నతనాభికాంతేః-లోతైన బొడ్డుచక్కదనమునకు, ఆవర్తశోభా-సీటి సుడులకాంతియు, భ్రువాం-కనుబొమలకు, భంగః-తరంగములును (జాత్యేకవచనము), స్తనానాం-చన్నులకు, ద్వంద్వచరాః-జంటలుగాఁదిరుగు చక్రవాకములును ఉపమానములై యున్నవి. కవివాక్కుల ద్వారా నెచ్చటనో లోకప్రసిద్ధములై యుండునట్టి ఉపమానము లన్నియు నీ విలాసవతుల యవయవములగు ఉపమేయములకు అతిసమీపముననుండి, నాభికాంతికి ఆవర్త శోభయు, కనుబొమలకు సరయూతరంగములును, స్తనములకు చక్రవాకముల జంటలును ద్విగుణసౌందర్యమును నెలకొల్పుచున్నవి చూడుము! అనెను.

శ్లో. తీరస్థలీబర్హిభి రుత్కలాపైః ప్రస్నిగ్ధకేకై రభినంద్యమానమ్,
శ్రోత్రేషు సంమూర్ఛతి రక్త మాసాం గీతానుగం
వారిమృదంగవాద్యమ్. 64

వ్యాఖ్య : ఉత్కలాపైః-ఎత్తుకొన్న పింఛములుగలవియు, ప్రస్నిగ్ధకేకైః-మధురమగు కేకలుగలవియు, తీరస్థలీబర్హిభిః-సరయూతీరమునందుండినవియు నగు నెమళ్ళచేత, అభినంద్యమానాం-ఆనందింపఁబడుచున్నదియు, రక్తం-శ్రావ్యమైనదియు, గీతానుగం-పాటననుసరించునదియు నగు, ఆసాం-ఈ స్త్రీలయొక్క, వారిమృదంగవాద్యం-నీరనెడు మృదంగము యొక్క, వాద్యధ్వని, శ్రోత్రేషు-చెవులయందు, సంమూర్ఛతి - వ్యాపించుచున్నది ఈ స్త్రీలు గానము చేయుచు, దానికనుకూలముగా నీటినే మృదంగముగా భావించి కొట్టుచున్న వాద్యధ్వని, తీరమునందలి నెమళ్ళు సంతోషపడి, పింఛము లెత్తుకొని నృత్యము చేయునట్లును, మధురముగా నఱచునట్లును జేయుచు, వినువారి చెవులలో నిండి యానందమును గలిగించుచున్నదని భావము.

శ్లో. సందష్టవస్త్రే ష్వబలానితంబే ష్విందు ప్రకాశాంతరి
తోడుతుల్యాః,
అమీ జలాపూరిత సూత్రమార్గా మౌనం భజంతే
రశనాకలాపాః. 65

వ్యాఖ్య : సందష్టవస్త్రేషు-నీటిలోఁదడిసియున్నందున కఱచుకపోయిన వస్త్రములుగల, అబలానితంబేషు-స్త్రీలయొక్క పిఱుదుల పైభాగములందు, ఇందు ప్రకాశాంతరితోడుతుల్యాః—ఇందుప్రకాశ-వెన్నెలచేత, అంతరిత-మరుగుపడిన, ఉడు-నక్షత్రములతో, తుల్యాః-సమానములగు, అమీ-ఈ, జలాపూరిత సూత్ర మార్గాః—నీటితో నింపబడిన సూత్రమార్గములుగల, రశనాకలాపాః-మొలనూలు భూషలు, మౌనం-నిశ తను, భజంతే-పొందుచున్నవి. స్నానార్ద్ర వస్త్రములు గరచుకపోయియున్న ల నితంబములమీద వెన్నెలచే మరుగుపడి స్వల్పకాంతిగల నక్షత్రములతో సమా ములగు ము త్తెములుగలిగియు, సూత్రమార్గము నీటితో నిండియునున్న యీ మొలనూలు గజ్జెల భూషణము చప్పుడులేక నిశ్శబ్దముగానున్నది సుమా! ఎప్పుడును గల్లుగల్లుమను నీభూషణము జలక్రీడాసమయమున నిట్లు నిశ్శబ్దముగానుండి చూతముచ్చటగా నున్నదని భావము.

శ్లో. ఏతాః కరోత్పీడితవారిధారా దర్పా త్సఖీభి
ర్వదనేషు సిక్తాః,
వక్రేతరాగ్రై రలకై స్తరుణ్య శ్చూర్ణారుణా
వారిలవా వమంతి. 66

వ్యాఖ్య : దర్పాత్ - మదమువలన, కరోత్పీడితవారిధారాః-ఇతరస్త్రీలపై చేతులతోనెగజల్లఁబడిన వారిధారలుగలవారును, సఖీభిః-చెలులచేత, వదనేషు-తమ ముఖములపైన, సిక్తాః-అట్లే జలధారలు చల్లఁబడినవారును నగు, ఏతాః,తరుణ్యః-ఈయువతులు, వక్రేతరాగ్రైఃనీటిలోఁదడిసినందున వంకరలులేని, అలకైః-ముంగురులచేత, చూర్ణారుణాన్—కుంకుమాదులచేత నెఱ్ఱబడిన, వారిలవాన్-ఉదకబిందువులను, వమంతి—వర్షించుచున్నారు. మదించి యొకరిపైనొకరు చల్లుకొన్న జలధారల వల్ల వంకరులు పోయి చక్కగాసాగిన ముంగురులద్వారా యువతులు కుంకుమ యుక్తములగు నీటిబొట్టులు గార్చు ముఖములతో నున్నారని భావము.

శ్లో. ఉద్బంధకేశ శ్చ్యుతపత్రలేఖో విశ్లేషిముక్తాఫలపత్రవేష్టః,
మనోజ్ఞ ఏవ ప్రమదాముఖానా మంభోవిహారాకులితోఽపి
వేషః. 67

వ్యాఖ్య : ఉద్బంధకేశః-విడిపోయిన శిరోజములుగలదియు, చ్యుతపత్రలేఖః-జారిపోయిన మకరికాది పత్రరచనలు గలదియు, విశ్లేషిముక్తాఫలపత్రవేష్టః-పడిపోయి ముత్యాలతాటంకములు గలదియునై, అంభోవిహారాకులితః, అపి-జలవిహారముచేత చెదరిపోయిన దైనప్పటికిని, ప్రమదాముఖానాం-ఈ స్త్రీలముఖముల యొక్క, వేషః-నేపథ్యము, మనోజ్ఞః, ఏవ-మనోహరముగానే యుండెను సుమా! ఈ స్త్రీల ముఖములు, విడిపోయిన శిఖలతోను, చెదరిపోయిన చెంపల నిపత్ర రచనలతోను, ఊడిపోయిన ముత్యాలకమ్మలతోను, జలవిహారమూలము చెదరిన వేషములుగలవి యైనప్పటికిని మనోహరములుగానే యున్నవి. చక్కని వదనముగలవారికి వేషవికారముసైతము క్రొత్తకాంతిని జేకూర్చునుగదా!

శ్లో. స నౌవిమానా దవతీర్య రేమే విలోలహారః సహతాభి రప్సు,
స్కంధావలగ్నోద్ధృతపద్మినీకః కరేణుభి ర్వన్య ఇవ ద్విపేంద్రః. 68

వ్యాఖ్య : సః-అట్లు స్త్రీదర్శన చలితమనస్కుడైన కుశుడు, నౌవిమానాత్-విమానమువంటి యోడనుండి, అవతీర్య-దిగి, విలోలహారః(సన్)-చలించుచున్న ముత్యాలహారములు గలవాడగుచు, తాభిః, సహ-ఆస్త్రీలతోగూడ, కరేణుభిః-ఆడ యేనుగులతోగూడ, స్కంధావలగ్నోద్ధృత పద్మినీకః— స్కంధావలగ్న-భుజములపైదగుల్కొన్న,ఉద్ధృత పద్మినీకః (సన్)-తనచే పెరుకబడిన తామరతీగలుగలది యగుచున్న, వన్యః, ద్విపేంద్రః, ఇవ-వన గజేంద్రమువలె, అప్సు-నీళ్ళయందు, రేమే-క్రీడించెను. వివిధ చేష్టలతో, మధురరూపములతో, జలవిహారము చేయుచున్న సుందరాంగులను జూచుటచే ముగ్ధుడైన కుశుడు విమానమువలె నెత్తుగానుండిన యోడనుండి నీటిలోనికి దిగి, వక్షములమునందున్న ముత్యాలహారములు చెదరునట్లుగా చెలరేగి యాయువతులతోస జలక్రీడ సలిపెను. అది యొకయడవి యేనుగు తామరతీగలతోగూడిన దేహముతో నాడయేనుగులనుగలసి చెలరేగి జలవిహారము చేయుచున్నట్లుండెనని భావము. అలంకారము : ఉపమ.

శ్లో. తతో నృపేణానుగతాః స్త్రియస్తా భ్రాజిష్ణునా సాతిశయం విరేజుః,
ప్రాగేవ ముక్తా నయనాభిరామాః ప్రాప్యేంద్రనీలం కిము తోన్మయూఖమ్. 69

వ్యాఖ్య : తతః-తరువాత, భ్రాజిష్ణునా-ప్రకాశించునట్టి, నృపేణ-కుశునితో, అనుగతాః-కలుసుకొ , తాఃస్త్రియః-ఆయువతులు, సాతిశయం-పూర్వముకంటెయెక్కువగా, విరేజుః-| శించిరి. ప్రాక్,ఏవ-మొదటనే, ముక్తాః-ముత్యములు, నయనాభిరామాః- ...నులకిం నట్టివి. ఉన్మయూఖం-కాంతులువెదఁజల్లునట్టి, ఇంద్రనీలం-ఇంద్రనీలమణిని, | ప్య-పొందినతరువాత, కిముత-ఏమిచెప్పవలెను? స్వయంప్రకాశశీలుఁడైన కుశు ఁ గలిసికొన్నవారై ఆయువతులు అత్యంతము విరాజిల్లిరి. ముత్యములు అసలే కన్నులకింపుగా నుండును. అవి కాంతులు విరజిమ్మునట్టి ఇంద్రనీలమణితో గలసియున్నప్పుడు మిక్కిలిమనోహరములుగా నుండునని చెప్పవలెనా? కనుక సుందరాంగులయిన యాస్త్రీలు చక్కనివాఁడైన కుశునితోఁ గలసి యెంతయో ప్రకాశించిరని భావము.కుశుఁడు నీలవర్ణుఁడు.

శ్లో. వర్ణోదకైః కాంచనశృంగముక్తై స్తమాయతాక్ష్యః
ప్రణయా దసించన్,
తథాగతః సో ఒతితరాం బభాసే సధాతునిష్యంద
ఇవాద్రిరాజః. 70

వ్యాఖ్య : తం-కుశుని, ఆయతాక్ష్యః-విశాలనేత్రలగు స్త్రీలు, కాంచనశృంగము ః-బంగరుకొమ్ములచేత చల్లబడిన, వర్ణోదకైః-రంగులనీళ్ళచేత, ప్రణయాత్-| మువలన, అసించన్-తడిపిరి. తథాగతః-అట్లుండిన, సః-అతఁడు, సధాతునిష్యందః-గైరికాది ద్రవములుగారుచున్న, అద్రిరాజః,ఇవ-పర్వతరాజమువలె, అతితరాం-మిక్కిలి, బభాసే-ప్రకాశించెను. ఆయువతులు బంగరుకొమ్ములనుండి కుంకుమాదివర్ణములుగల రంగులను ప్రేమాతిశయమువలన కుశునిపైఁజల్లిరి. అట్లు తడిసి శరీరమునుండి రంగులుగారుచున్న కుశుఁడు గైరికాది దాతుద్రవములు స్రవించుచున్న యొకపర్వతరాజమువలె మిక్కిలిప్రకాశించెనని భావము. అలంకారము: ఉపమ.

శ్లో. తేనా వరోధప్రమదాసఖేన విగాహమానేన
సరిద్వరాం తామ్,
ఆకాశగంగారతి రప్సరోభి ర్వృతో మరుత్వా
ననుయాతలీలః. 71

వ్యాఖ్య : అవరోధప్రమదాసఖేన-అంతఃపురసుందరీ సహచరుఁడును, తాం, సరిద్వరాం-ఆసరయూనదిని, విగాహమానేన-ఈదుచున్న, తేన-ఆకుశునిచేత, ఆకాశగంగారతిః-ఆకాశగంగయందుఁ గ్రీడించుచున్నవాఁడును, అప్సరోభిః, వృతః-అప్సరః స్త్రీలచేత చుట్టుకొనఁబడినవాఁడును నగు, మరుత్వాన్-ఇంద్రుఁడు, అనుయాతలీలః-అనుకరింపఁబడిన విలాసముగల వాఁడయ్యెను. అంతఃపురస్త్రీలతోఁ గలిసి సరయూనదిలో జలక్రీడలు సలుపుచున్న కుశుఁడు, ఆకాశగంగలో నప్సరః స్త్రీలతోఁగలిసి జలకములాడు నింద్రునిఁ బోలియుండెనని భావము. అలంకారము : ఉపమ.

శ్లో. యత్ కుంభయోనే రధిగమ్య రామః కుశాయ రాజ్యేన సమం దిదేశ,
తదస్య జైత్రాభరణం విహర్తు రజ్ఞాతపాతం సలిలే మమజ్జ. 72

వ్యాఖ్య : యత్-ఏయాభరణమును, రామః-రాముఁడు, కుంభయోనేః-అగస్త్యునినుండి, అధిగమ్య-పొందియుండి, కుశాయ-కుశునికొఱకు, రాజ్యేన, సమం-రాజ్యముతోపాటు, దిదేశ-ఇచ్చెనో, సలిలే-నీటియందు, విహర్తుః-విహరించుచున్న, అస్య-ఈకుశుని యొక్క, తత్-అట్టి, జైత్రాభరణం-జయశీలమైన యాభరణము, అజ్ఞాతపాతం-తెలియకయే పడినదై, మమజ్జ-నీటిలో మునిగెను. తనకు అనుగ్రహపూర్వకముగా అగస్త్యుఁ డిచ్చియుండిన రత్నాభరణమును రాముఁడు, కుశునికి రాజ్యముతోపాటు ఇచ్చియుండెను. అట్టి రాజ్యసమము, జయములనుజేకూర్చునదియు నగు ఆభరణము ఎట్లు పడినదో కుశుఁడు తెలిసికొనుటకు వీలులేకయే జలక్రీడా సమయమున నీటిలో మునిగిపోయెను.

శ్లో. స్నాత్వా యథాకామ మసౌ సదార స్తీరోపకార్యాం గతమాత్ర ఏవ,
దివ్యేన శూన్యం వలయేన బాహు ముపోఢనేపథ్య విధి ర్దదర్శ. 73

వ్యాఖ్య : అసౌ-కుశుఁడు, సదారః-భార్యాసహితుఁడగుచు, యథాకామం-యథేచ్ఛగా, స్నాత్వా-స్నానముచేసి, తీరోపకార్యాం-ఒడ్డునందలి పటకుటీరమును,

గతమాత్రః, ఏవ-చేరినవాఁడై నంతనే, అపోధనేపథ విధిః-చేసుకోఁబడని ప్రసాధనము గలవాఁడగుచునే, దివ్యేన, వలయేన-దైవశ గల కంకణముచేత, శూన్యం-శూన్యమైయున్న, బాహుం-తన బాహువును, దర్శ-చూచెను. భార్యతోను, అంతఃపుర యువతులతోను గలిసి యథేచ్ఛగా జలక్రీడ సలిపిన కుశుఁడు, తీరమున నున్న దేరాలోనికి వెళ్ళగానే, ఉరికి వస్త్రములు కట్టుకొనకముందే తన బాహువునందు దివ్యకంకణము లేకుంటుటను జూచెనని భావము.

శ్లో. జయశ్రియః సంవననం యతః స్త దాముక్తపూర్వం
గురుణాచ యస్మాత్,
సేహేఽస్య న భ్రంశ మతో న లోభా త్స తుల్యపుష్పా
భరణో హి ధీరః. 74

వ్యాఖ్య : యతః-ఏకారణమువలన, తత్-ఆయాభరణము, జయశ్రియః-జయలక్ష్మికి, సంవననం-వశీకరణమో, యస్మాత్, చ-ఏకారణమువలననైతే, గురుణా-తండ్రిచేత, ఆముక్తపూర్వం-పూర్వము భరింపఁబడియుండెనో, అతః-ఈ కారణమువలన, అస్య-దానియొక్క, భ్రంశం-నాశమును, నసేహే-సహింపలేకపోయెను. లోభాత్-పిసినిగొట్టుతనమువలన, న-కాదు, హి-ఎందువల్లననఁగా, ధీరః, సః-పరిస్థితులవలనఁ జిత్తవికారముపొందని యాకుశుఁడు, తుల్యపుష్పాభరణః-పువ్వులతో సమానమైన ఆభరణములు గలవాఁడై యుండెనో! ఆ దివ్యాభరణము శత్రువిజయమునకు వశీకరణక్రియగాను, పూర్వము తనతండ్రిరాముఁడు ధరించినదిగాను ఉన్నందున అది పోయెనే! యని కుశుఁడు బాధపడెనుగాని దాని యందలి లోభముచేతగాదు. ధీరుఁడైన యతనికి సాధారణ సువర్ణాభరణములు పువ్వులతో సమానములు. అనఁగా నిర్మాల్యములయిన పుష్పములనువలెనే బంగారు సొమ్ములనుగూడ లెక్కచేయక పారవేయునట్టివాఁడే యని భావము. "వశక్రియా సంవననం" అని యమరము.

శ్లో. తతః సమాజ్ఞాపయ దాశు సర్వా నానాయిన స్తద్విచయే
నదీష్ణాన్,
వంధ్యశ్రమా స్తే సరయూం విగాహ్య త మూచు
రమ్లానముఖప్రసాదాః. 75

వ్యాఖ్య : తతః-పిమ్మట, నదీష్ణాన్-నదులయందు దిగి వెదకునేర్పుగల, సర్వాన్, ఆనాయినః-జాలరులందఱిని, తద్విచయే-ఆయాభరణమును వెదకుట యందు, ఆశు-వెంటనే, సమాజ్ఞాపయత్-ఆజ్ఞాపించెను. తే-ఆజాలరులు,సరయూం-సరయూంనదిని, విగాహ్య-విలోడనముచేసి (గాలించి), వంధ్య ప్రశమాః-విఫలమైన ప్రయాసగలవారైనను (అది యెచ్చటికిఁబోయినదో యెఱిఁగినవారగుటవలన), అమ్లానముఖ ప్రసాదాః-వాడిపోని ముఖకాంతిగలవారగుచు, తం, ఊచుః-అతని నుద్దేశించి పలికిరి. అప్పుడు నదిలోనికి దిగి వెదుకగల పల్లెవాం డ్రనందఱిని వెంటనే యాభరణమును వెదకుఁడని ఆజ్ఞాపించెను. ఆ జాలరులు నదిని గాలించి విఫల ప్రయత్నులై నప్పటికిని ఆభరణమున్నచోటు నెఱిఁగినవారు కావునవాడని ముఖములు గలవారై కుశునితో నిట్లు విన్నవించిరి. "నద్యాం స్నాంతి కౌశలేన ఇతి నదీష్ణాః" అని విగ్రహము.

శ్లో. కృతః ప్రయత్నో నచ దేవ! లబ్ధం మగ్నం పయ
స్యాభరణోత్తమం తే,
నాగేన లౌల్యా త్కుముదేన నూన ముపాత్త
మంతర్హ్రదవాసినా తత్. 76

వ్యాఖ్య : హేదేవ!-ఓప్రభూ, ప్రయత్నః, కృతః-ప్రయత్నము చేయఁబడినది. పయసి-నీటియందు, మగ్నం-మునిగిపోయిన, తే, ఆభరణోత్తమం-నీయుత్తమాభరణము, న చలబ్ధం-దొరకలేదు, తత్-ఆయాభరణము, అంతర్హ్రద వాసినా-లోపలి మడుగులోనున్న, కుముదేన,నాగేన-కుముదుఁడను పేరుగలసర్పము చేత, లౌల్యాత్-లోభమువలన, ఉపాత్తం, నూనం-తీసికొనఁబడియుండవచ్చును. ప్రభూ! ఎంతో వెదకితిమి, నీటిలోమునిగిన నీ యాభరణము దొరకలేదు, కాని ఆయాభరణమును నదిలోనిమడుగున నివాసముచేయుచున్న కుముదుఁడను సర్ప రాజు లోభమువలనఁ దీసికొని యుండవచ్చునని యూహించుచున్నాము. అని జాల రులు చెప్పిరి

శ్లో. తతః స కృత్వా ధను రాతతజ్యం ధనుర్ధరః
కోపవిలోహితాక్షః,
గారుత్మతం తీరగత స్తరస్వీ భుజంగనాశాయ
సమాదదే ౽స్త్రమ్. 77

వ్యాఖ్య : తతః-అప్పుడు, ధనుర్ధరః-విల్లుపట్టినవాఁడును, కోపవిలోహితాక్షః-కోపముచేత నెఱుపెక్కిన కన్నులుగలవాఁడును, తరస్వీ-బలవంతుఁడును నగు, సః-ఆకుశుఁడు, తీరగతః(సన్)-నదియొడ్డును జేరినవాఁడగుచు, ధనుః-విల్లును, ఆతతజ్యం-ఎక్కుపెట్టఁబడిన యల్లెత్రాడు కలదానినిగా, కృత్వా-చేసి, భుజంగనాశాయ-సర్పవినాశముకొఱకు, గారుత్మతం, అస్త్రం-గరుత్మంతుడు దేవత గానున్న బాణమును, సమాదదే-తీసుకొనెను. అప్పుడు వీరుఁడును, కోపరక్తనేత్రములుగలవాఁడును, మహాబలవంతుఁడునగు కుశుఁడు నదియొడ్డునకువెళ్ళి, ధనుస్సునకు నారినిగూర్చి, కుముద సర్పవినాశమును జేయఁదలచి గారుడాస్త్రమును చేతికిఁదీసికొనె ననిభావము.

శ్లో. తస్మిన్ హ్రదః సంహితమాత్ర ఏవ క్షోభా
త్సమావిద్ధతరంగహస్తః,
రోధాంసి నిఘ్నన్నవపాతమగ్నః కరీవ వన్యః
పరుషం రరాస. 78

వ్యాఖ్య : తస్మిన్-ఆబాణము, సంహితమాత్రే, ఏవ-సంధానముచేయఁబడుచుండగానే, హ్రదః- మడుగు, క్షోభాత్-సంక్షోభమువలన, సమావిద్ధ తరంగహస్తః —. సమావిద్ధ-దగ్గఱికిఁజేర్చఁబడిన, తరంగహస్తః-అలలనెడు చేతులు గలదియై, రోధాంసి-నదియొడ్డులను, నిఘ్నన్-కూలఁద్రోయుచు, అవపాతే-ఏనుఁగులను బట్టుకొను గుంటయందు, మగ్నః-పడిన, వన్యః, కరీ, ఇవ-అడవియేనుఁగువలె, పరుషం-ఘోరముగా, రరాస-ధ్వనించెను. కుశుఁడు బాణము నెక్కుపెట్టినంతలోనే భయపడి కలఁతఁజెందిన యా హ్రదము తరంగములనెడు హస్తములను జోడించుకొని, జలవేగముచేత తీరమును గూలఁద్రోయుచు, గజగ్రహణగర్తమునందు పడిన యడవి యేనుగువలె పెద్దగా మొఱపెట్టెనని భావము. "అవపాత" మనఁగా నేనుఁగులను బట్టుకొనుటకు గడ్డిమొదలయినవానితో గప్పియుంచబడిన పెద్దగుంట. "అవపాతస్తు హస్త్యర్థే గర్తశ్ఛన్న స్తృణాదినా" అని యాదవ నిఘంటువు.

శ్లో. తస్మా త్సముద్రా దివ మథ్యమానా దుద్వృత్తనక్రా
త్సహ సోన్మమజ్జ,
లక్ష్మ్యేవ సార్ధం సురరాజవృక్షః కన్యాం పురస్కృత్య
భుజంగరాజః. 79

వ్యాఖ్య : మథ్యమానాత్-మథింపఁబడుచున్న, సముద్రాత్, ఇవ-సాగరము నుండివలె,ఉద్వృత్తన కాత్-బయటికిత్రోయఁబడిన మొసళ్ళుగల,తస్మాత్-ఆమడుగు నుండి, లక్ష్మ్యా, సా ం-లక్ష్మీదేవితోఁగూడ, సురరాజవృక్షః, ఇవ-ఇంద్రునిదగు పారిజాతవృక్షమువ , కన్యాం-ఒక కన్యను, పురస్కృత్య-ముందు పెట్టుకొని, భుజంగరాజః-సర్పరాజైన కుముదుఁడు, సహసా-హఠాత్తుగా, ఉన్మమజ్జ-పైకి లేచెను. ఆ ధ్వని వెంటనే, మథింపబడుచున్న క్షీరసముద్రమునుండి లక్ష్మినియెత్తు కొని వచ్చిన పారిజాత వృక్షమువలె, నక్రాదులను దొంఁగించిన ఆహ్రదమునుండి సర్పరాజైన కుముదుఁ డొక చక్కని కన్యను ముందు పెట్టుకుని హఠాత్తుగా, ఆశ్చర్యము కలుగునట్లు, నీటిపైకిఁ జేరెనని భావము.

శ్లో. విభూషణప్రత్యుపహారహస్త ముపస్థితం వీక్ష్య విశాం
పతి స్తమ్,
సౌపర్ణ మస్త్రం ప్రతిసంజహార ప్రహ్వే ష్వనిర్బంధరుషో
హి సంతః. 80

వ్యాఖ : విశాం, పతిః-మనుజపతియైన కుశుఁడు, విభూషణ ప్రత్యుపహార హ ం-భూషణమును కానుకగానియ్యఁబోవు హస్తములుగలవాఁడును, ఉపస్థితం-స మమునకు వచ్చినవాఁడును నగు, తం-ఆకుముదుని, వీక్ష్య-చూచి, సౌపర్ణం-గరుత్మంతుఁ డ ధి దే వ త గాఁ గ ల, అస్త్రం-బాణమును, ప్రతిసంజహార-ఉపసంహరించెను, హి-అదియంతే, సంతః-సజ్జనులు, ప్రహ్వేషు-నమ్రులవిషయమున (లొంగిపోయినవారి విషయమున), అనిర్బంధరుషః-పట్టుదల లేని కోపము గలవారై యుందురుగదా! అట్లు పైకి కన్యతోవచ్చిన కుముదుఁడు ఉపాయనహస్తుఁడై వినయపూర్వకముగా సమీపించినందున కుశుఁడు ప్రయోగింపఁ దలపెట్టిన గారుడాస్త్రమును వెనుకకు ఉపసంహరించెను. సజ్జనులు లొంగిపోయిన

వారి విషయమున కోపమును విడుచుట సహజముగదా! "ద్వావిశౌవైశ్యమనుజౌ" అని యమరము. అలంకారము: అర్థాంతరన్యాసము.

శ్లో. త్రైలోక్యనాథప్రభవం ప్రభావా త్కుశం ద్విషా మంకుశ మస్త్రవిద్వాన్,
మానోన్నతే నాప్యభివంద్య మూర్ధ్నా మూర్ధాభిషిక్తం కుముదో బభాషే. 81

వ్యాఖ్య : అస్త్రవిదా న్ - గారుడాస్త్రమునెఱింగిన, కుముదః-కుముదుఁడు, త్రైలోక్యనాథప్రభవం-విష్ణు అవతారమగు రాముఁడు తండ్రిగాగలిగినవాఁడును, ప్రభావాత్-మహత్త్వమువల , ద్విషాం-శత్రువులకు, అంకుశం-అంకుశమువంటి వాఁడును, మూర్ధాభిషిక్తం-రాజైనవాఁడును నగు, కుశం-కుశుని, మానోన్నతేన, అపి-అభిమానముచేత ఉన్నతమైనదయినప్పటికిని,మూర్ధ్నా-శిరస్సుచేత, అభివంద్య-నమస్కరించి, బభాషే-పలికెను. గారుడా ము సర్పజాతికి వినాశకరమని యెఱిఁగి యున్న కుముదుఁడు, శ్రీరామునికుమారుఁ , శత్రునివారకుఁడై, రాజై యున్న కుశునకు, ఎవ్వనికి తలవంచని అభిమానగర్వము గలవాడైనను, తలవంచి నమస్కరించి ముందు చెప్పఁబోవురీతిగా సంభాషించెనని భావము. "అస్త్రవిద్వాన్" అస్త్రం వేత్తి ఇతి అని విగ్రహము చెప్పవలెను. ద్వితీయాతత్పురుష సమాసము.

శ్లో. అవైమి కార్యాంతరమానుషస్య విష్ణోః సుతాఖ్యా మపరాం తనుం త్వామ్,
సోఽహం కథంనామ తవాచరేయ మారాధనీయస్య ధృతే ర్విఘాతమ్. 82

వ్యాఖ్య : త్వాం-నిన్ను, కార్యాంతరమానుషస్య-దేవకార్యార్థమై మానవావతారమునెత్తిన, విష్ణోః-విష్ణువుయొక్క(రామునియొక్క),సుతాఖ్యాం-కుమారుఁడను పేరుగల, అపరాం, తనుం-మరియొక శరీరమునుగా, అవైమి-ఎఱుఁగుదును. సోఽహం (సః + అహం) అట్లెఱిఁగిన నేను, ఆరాధనీయస్య-పూజింపఁదగినట్టి తవ-నీయొక్క, ధృతేః-ప్రీతికి, విఘాతం-విఘ్నమును, కథం,నామ-ఏవిధముగా,

ఆచరేయం-చేయుదును? నిన్ను దేవకార్యము కొఱకై రామావతారమునెత్తిన శ్రీమహా విష్ణువుయొక్క పుత్రరూపమగు మరియొకమూర్తినిగా నెఱింగిన నేను పూజనీయుఁడవగు నీసంతోషమునకు విఘ్నము నెట్లుకలిగించెదను? అది జరుగదు. అని కుముదుఁడు కుశునితో సవినయముగాఁబలికెను. "కార్యాంతర" ఈయంతరశబ్దమునకు "ఓదనాంతరః తండులః" అన్న ప్రయోగమునందువలె తాదర్థ్యము అర్థము. కాఁగా కార్యార్థమని యర్థము. శాశ్వతనిఘంటువు "స్థానాత్మీయాన్యతాదర్థ్యరంధ్రాంతర్యేషు చాంతరమ్" అని అంతరశబ్దమున కర్థములు చెప్పినది. "ఆత్మా వై పుత్రనామాసి" అను శ్రుతివలన కుశుఁడు రాముని మరియొక శరీరమని చెప్పఁబడినది. "ధృతిః" "ధృ-ప్రీతౌ" అనుధాతువునకు "క్తిన్" ప్రత్యయాంతము.

శ్లో. కరాభిఘాతోత్థితకందు కేయ మాలోక్య
బాలాతికుతూహలేన,
హ్రదాత్ పత జ్జ్యోతి రివాంతరిక్షా దాదత్త జైత్రాభరణం
త్వదీయమ్. 83

వ్యాఖ్య : కరాభిఘాతోత్థితకందుకా-కరాభిఘాత—చేతివిసురుచేత, ఉత్థిత కందుకా-పైకెగిరినబంతిగల, ఇయం, బాలా—ఈకన్య, అతికుతూహలేన-అత్యంతమగు ఉత్సాహముచేత, అంతరిక్షాత్-ఆకాశమునుండి, జ్యోతిః, ఇవ—నక్షత్రము వలె, హ్రదాత్-మడుగునుండి, పతత్-పడుచున్న, త్వదీయం-నీదియగు, జైత్రాభరణం-జయశీలమైన ఆభరణమును, ఆలోక్య-చూచి, ఆదత్త-తీసికొన్నది. ఈ బాలిక బంతిని పైకి విసిరివేసి దానివైపు చూచుచు మిక్కిలియుల్లాసముతో నున్న సమయమున ఆకాశమునుండి తేజస్వంతమగు నక్షత్రమువలె మడుగుద్వారా క్రిందికిఁబడుచుండినదియు, నీకు సంబంధించినదియు నగు జైత్రాభరణమును జూచి తాను తీసికొన్నది. ఒక విచిత్రమైనవస్తువు దొరికినదికదా! యన్న ఆనందముచేత గ్రహింపఁబడినదే కాని నీదియని, నీపై ధృష్టీకారభావముచేత తీసుకోఁబడినది కాదని కుముదుఁడు గౌరవాదరములతో విన్నవించెనని భావము. "జ్యోతి ర్భద్యోత దృష్టిషు" అని యమరము.

శ్లో. తదేత దాజానువిలంబినా తే జ్యాఘాతరేఖాకిణ
లాంఛనేన,

భుజేన రక్షాపరిఘేణ భూమే రుపైతు యోగం పున
రంసలేన. 84

వ్యాఖ్య : తత్, ఏతత్—అందువలన ఈ యాభరణము, ఆజాను విలంబినా-మోకాటివరకు వ్రేలాడునదియు, జ్యాఘాతరేఖాకిణలాంఛనేన— జ్యాఘాత-అల్లెత్రాటిదెబ్బలచేతనయిన, రేఖాకిణ-రేఖగా నేర్పడిన గనుపులు, లాంఛనేన-చిహ్నముగాఁగలదియు, భూమేః-నీచే పాలింపఁబడుచున్న భూమికి, రక్షాపరిఘేణ-రక్షణముకొఱకైన గడియవంటిదియు, అంసలేన-బలిష్ఠమైనదియు నగు, తే, భుజేన-నీ భుజముతో, పునః-మరల, యోగం-సంబంధమును, ఉపైతు-పొందునుగాక. అట్లు బాలికచేత వినోదార్థమై గ్రహింపబడినదే కావున ఈ మీ జైత్రవిభూషణమును మరల స్వీకరించి దీర్ఘమై, జ్యాకిణాంకితమై, భూరక్షణ ధురీణమై, మాంసలమై యున్న మీభుజమున ధరింపుడని కుముదుఁడు పలికెను. ఈ భుజవిశేషణములచేత కుశుని మహాభాగ్యశౌర్యధురంధరత్వబలవత్త్వాది గుణములు సూచింపఁబడుచున్నవి.

శ్లో. ఇమాం స్వసారం చ యవీయసీం మే కుముద్వతీం నార్హసి
నానుమంతుమ్,

ఆత్మాపరాధం నుదతీం చిరాయ శుశ్రూషయా పార్థివ!
పాదయో స్తే. 85

వ్యాఖ్య : హేపార్థివ-ఓ రాజా! తే, పాదయోః-నీ పాదములయందు, చిరాయ-బహుకాలము, శుశ్రూషయా-పరిచర్యచేత, ఆత్మాపరాధం-ఆభరణగ్రహణ రూపమైన యపరాధమును నుదతీం-తొలగించుకొనుచున్న, ఇమాం-ఈ, మే, యవీసీం, స్వసారం-నా చెల్లెలిని, కుముద్వతీం-కుముద్వతి యను పేరుగల దానిని, అనుమంతుం-అనుమతించుటకు, నార్హసీతిన (న+అర్హసి+ఇతి-న)- తగవు అనునదిలేదు. తగియే యున్నావని యర్థము. ఓ రాజా! నీ పాదసేవను యావజ్జీవముచేసి ఆభరణగ్రహణరూపమగు అపరాధమును దొలఁగింపఁదలచుకొను చున్న యీ నా చెల్లెలిని అనుమతించి స్వీకరింప నర్హుఁడవైయున్నావు. అనఁగా భార్యనుగా ఈ కుముద్వతిని అంగీకరింపుమని కుముదుఁడు కుశునితో విన్నవించె

నని భావము. "కృ శూషా శ్రోతుమిచ్ఛాయాం- పరిచర్యాప్రదానయోః" అని విశ్వ నిఘంటువు. "న అర్హసి ఇతి న" అన్న నిషేధద్వయము "అర్హస్యేవ" అని ధృఢ పరచుటకే యని గ్రహింపవలెను.

శ్లో. ఇత్యూచివా నుపహృతాభరణః క్షితీశం
శ్లాఘ్యో భవాన్ స్వజన ఇత్యనుభాషితారమ్,
సంయోజయాం విధివ దాస సమేతబంధుః
కన్యామయేన కుముదః కులభూషణేన. 86

వ్యాఖ్య : ఇతి-వెనుకటిరీతిగా, ఊచివాన్-పలికినవాఁడై, కుముదః-కుముదుఁడు, ఉపహృతాభరణః-సమర్పించిన ఆభరణము గలవాఁడగుచు, భవాన్-నీవు, శ్లాఘ్యః-మెచ్చుకోఁదగిన, స జనః-బంధువుఁడవు, ఇతి-ఇట్లని, అనుభాషితారం-బదులుపలికినట్టి, క్షితీశం-రా సమునిని, సమేతబంధుః-బంధుసహితుఁడై, కనామయేన-కన్యారూపమగు, లభూషణేన-ఉభయకులభూషణముతో, విధివత్-శా ప్రకారముగా, సంయోజయామాస-సమకూర్చెను. భూషణము తమకు చేరిన రీతి వివరించి దానిని ప్రత్యర్పణము చేయఁగా ఓకుముదా! నీవు మెచ్చుకోఁదగిన బంధువుఁడవని బదులుపలికిన కుశునికి బంధుపరివార సహితుఁడై కుముదుఁడు ఉభయవంశములకును భూషణమయిన కన్యను, చెల్లెలి, నిచ్చి శాస్త్ర ప్రకారముగా వివాహమును జరిపించెనని భావము.

శ్లో. తస్యాః స్పృష్టే మనుజపతినా సాహచర్యాయ హస్తే
మాంగల్యోర్ణావలయిని పురః పావక స్యోచ్ఛిఖస్య,
దివ్య స్తూర్యధ్వని రుదచర ద్వ్యశ్నువానో దిగంతాన్
గంధోదగ్రం తదను వవృషుః పుష్ప మాశ్చర్యమేఘాః. 87

వ్యాఖ్య : మనుజపతినా-కుశునిచేత, సాహచర్యాయ-సహధర్మాచరణము కొఱకు, మాంగల్యోర్ణావలయిని-మంగళప్రదమైన, ఊర్ణా-మేకవెంట్రుకలతోఁజేసిన దారము,వలయిని-కంకణముగాఁగల,తస్యాః-ఆకుముద్వతియొక్క,హస్తే- హస్తము ఉచ్ఛిఖస్య-జ్వాలలతోఁగూడిన, పావకస్య-అగ్నియొక్క, పురః-ఎదుట, స్పృష్టే

(సతి)-పట్టుకోఁబడినదికాఁగా, దిగంతాన్-దిగంతములను,వ్యశ్నువానః-వ్యాపించుచు, దివ్యః-ఆకాశమునందలి, తూర్యధ్వనిః-మంగళవాద్యములధ్వని: ఉదచరత్-బయలు దేరెను.తదను-దానివెంటనే,ఆశ్చర్యమేఘాః-అద్భుతములగుమేఘములు,గంధోద(గం-పరిమళమును వెదఁజల్లునట్టి, పుష్పం-పూలను, వవృషుఃవర్షించెను.రాజైనకుశునిచేత సహధర్మచారిణి యగుటకొఱకు, మంగళయుక్తమైన మేషలోమ సూత్ర కంకణము గల కుముద్వతి హస్తము అగ్నిసాక్షికముగాఁ బట్టుకోఁబడినది కాఁగానే దిక్కులు పిక్కటిల్లినట్లుదేవతల మంగళవాద్యధ్వనులు చెలరేగెననియు, ఆవెంటనే యద్భుత ముగా మేఘములు పుష్పవృష్టిని గురిసెననియు భావము. "పుష్పం" అన్నది జాత్యేకవచనము. మేఘవిశేషణమగు"ఆశ్చర్య"శబ్ద మిచ్చటపుంలింగము. వైభవో పేతముగా కుశకుముద్వతులకు వివాహము జరిగెనని తాత్పర్యము.

శ్లో. ఇత్థం నాగ స్త్రిభువనగురో రౌరసం మైథిలేయం
లబ్ధ్వా బంధుం,త మపి చ కుశః పంచమం తక్షకస్య,
ఏకః శంకాం పితృవధరిపో రత్యజ ద్వైనతేయాత్,
శాంతవ్యాలా మవని మపరః పౌరకాంతః శశాస. 88

వ్యాఖ్య : ఇత్థం-ఈవిధముగా, నాగః-సర్పమైనకుముదుఁడు, త్రిభువన గురోః-విష్ణ్వంశసంభూతుఁడగు రామునియొక్క, ఔరసం-ధర్మపత్నిపుత్రుఁడగు, మైథిలేయం-కుశుని, బంధుం-బంధువునుగా, లబ్ధ్వా-పొందియు, కుశః, అపి, చ-కుశుడును, తక్షకస్య-తక్షకుఁడను సర్పరాజుయొక్క, పంచమం-అయిదవపుత్రుఁ డైన, తం-ఆకుముదుని, బంధుం, లబ్ధ్వా-బంధువునుగాఁబొందియు, ఏకః-వారి ద్దఱిలో నొకఁడగుకుముదుఁడు, పితృవధరిపోః-తనతండ్రినిఁజంపుటచేత శత్రువై యున్న వైనతేయాత్-గరుత్మంతునివలన, శంకాం-భయమును. అత్యజత్-వదలి పెట్టెను. అపరః-ఇద్దరిలో రెండవవాఁడైనకుశుఁడు, శాంతవ్యాలాం-శమించిన క్రూర సర్పభయముగల, అవనిం-భూమిని, పౌరకాంతః-ప్రజలకు ప్రియమైనవాఁడగుచు, శశాస-ఏలెను. ఈ విధముగా విష్ణుమహిమగల రామునికి సీతాదేవియందు ఔరస పుత్రుఁడై జన్మించిన కుశుని ఆత్మబంధువునుగాఁ జేసుకొన్న కుముదుఁడును అష్ట సర్పరాజులలోఁ బ్రసిద్ధుఁడైన తక్షకునియొక్క అయిదవ కుమారుఁడగు కుముదుని శ్యాలకునిగాఁబొందిన కుశుఁడును సంతుష్టులైయుండుటయేకాక, కుముదుఁడు తనతండ్రినిఁజంపుటచేత శత్రువైయున్న గరుత్మంతుని

వలని భయమును వైష్ణవాంశగల కుశుని యాజ్ఞవలన గరుడుడు హాని చేయడు గావున, విడిచిపెట్టెను. అట్లే కుముదుని యాజ్ఞవలన సర్పములేవియు కుశపరిపాలితమయిన భూమియం దెవ్వరినిఁగాటువేయనందునఁ బ్రజలు ప్రేమతో నారాధించుచున్న కుశుఁడు సుఖముగా రాజ్యమును పాలించెను క్రమాలంకారము. "త్రయాణాం భువనానాం సమాహారః త్రిభువనమ్" అని విగ్రహము. "ఔరసో ధర్మపత్నీజః" అని యాజ్ఞవల్క్యమహర్షి చెప్పెను.

ఇది మహాకవి కాళిదాసకృత రఘువంశకావ్యమున
కుముద్వతీపరిణయమను షోడశసర్గకు కేశవ
పంతుల నరసింహశాస్త్రి రచిత
తెలుఁగు లఘువ్యాఖ్య.

మహాకవి కాళిదాస కృత

# రఘువంశము

## సప్తదశసర్గము

శ్లో. అతిథిం నామ కాకుత్స్థాత్పుత్రం ప్రాప కుముద్వతీ,
పశ్చిమా ద్యామినీయామాత్ ప్రసాద మివ చేతనా. 1

వ్యాఖ్య : కుముద్వతీ-కుముద్వతి, కాకుత్స్థాత్-కకుత్స్థవంశీయుఁడగుకుశుని వలన, అతిథిం, నామ-అతిథియనుపేరుగల, పుత్రం-కుమారుని, చేతనా-బుద్ధి, పశ్చిమాత్-చివరిదియగు, యామినీయామాత్-రాత్రియొక్క జామువలన, ప్రసాదం ఇవ-నిర్మలత్వమునువలె, ప్రాప-పొందెను. బుద్ధి రాత్రియొక్క నాల్గవజాము వలన వైశద్యమును పొందినట్లు కుముద్వతి కుశునివలన "అతిథి" యను కుమారుని గనెనని భావము. బ్రాహ్మముహూర్త మనఁబడు రాత్రి చివరిజామున అందరికిని బుద్ధివైశద్యము కలుగునని ప్రసిద్ధి. అలంకారము : ఉపమ.

శ్లో. స పితుః పితృమాన్ వంశం మాతు శ్చానుపమ ద్యుతిః
అపునాత్ సవితే వోభౌ మార్గా వుత్తరదక్షిణౌ. 2

వ్యాఖ్య : పితృమాన్-మంచితండ్రిగలిగినట్టియు, అనుపమద్యుతిః-సాటిలేని కాంతిగలవాఁడునునగు (ఇది సవితకుఁగూడ విశేషణము), సః-ఆ యతిథి, పితుః-తండ్రి యొక్కయు, మాతుః, చ-తల్లియొక్కయు, వంశం-వంశమును, సవితా-సూర్యుఁడు, ఉత్తర దక్షిణౌ-ఉత్తర దక్షిణములైన, ఉభౌ, మార్గౌ, ఇవ-ఉభయ మార్గములనువలె, అపునాత్-పవిత్రము చేసెను. అసాధారణ తేజస్వియైన సూర్యుఁడు నడచునప్పు డుత్తరదక్షిణ మార్గములను ప్రకాశింపజేసినట్లు అతిథి తన సత్ప్రవర్తనముచేత తలిదండ్రుల వంశములు రెంటిని పవిత్రముచేసి నుతి

తెక్కెనని భావము. "పితృమాన్" చక్కని శిక్షతోఁ గుమారునిఁ దీర్చిదిద్దగలిగిన తండ్రి గలవాఁ డన్న యర్థమున నుపయోగింపఁబడిన శబ్దము. అలంకారము: ఉపమ.

శ్లో. తమాదౌ కులవిద్యానా మర్థ మర్థవిదాం వరః,
పశ్చాత్ పార్థివకన్యానాం పాణి మగ్రాహయత్ పితా. 3

వ్యాఖ్య : విదాం-శబ్దార్థములను, అర్థశాస్త్రవిషయములను నెఱిఁగిన వారిలో, వరః-శ్రేష్ఠుఁడగు, పితా-తండ్రియైన కుశుఁడు, తం-ఆ యతిథిని, ఆదౌ-మొదట, కుల ద్యానాం-క్షత్రియకులోచితములైన ఆన్వీక్షకీ త్రయీ వార్తా దండనీతి మొదలగు విద్యలయొక్క, అర్థం-అర్థవిశేషమును, అగ్రాహయత్-బోధించెను. పశ్చాత్-ఆ పిమ్మట, పార్థివకన్యానాం-రాజకన్యలయొక్క, పాణిం-హస్తమును, అగ్రాహయత్-పట్టుకొనునట్లు చేసెను. అనఁగా కుశుఁడు మొదట కుమారునికి క్షత్రియకులోచితములైన సకల విద్యలను నేర్పించి తరువాత వివాహముఁ జేసెనని భావము. ప్రతిష్ఠ్యక్తికి నతని కులవిద్య యుపసరమనియు నది సమాజశ్రేయస్సుకు మూలమనియు కవి యభిప్రాయము.

శ్లో. జాత్య స్తేనాభిజాతేన శూరః శౌర్యవతా కుశః,
అమన్య తైక మాత్మాన మనేకం వశినా వశీ. 4

వ్యాఖ్య : జాత్యః-కులీనుఁడును, శూరః-శూరుఁడును, వశీ-ఇంద్రియ నిగ్రహముగలవాఁడును నగు, కుశః-కుశుఁడు, అభిజాతేన-కులీనుఁడును, శౌర్యవతా-శౌర్యముగలవాఁడును, వశినా-ఇంద్రియ నిగ్రహముగలవాఁడునునగు, తేన-అతిథిచేత, ఏకం, ఆత్మానం-ఒకఁడుగానున్న తనను, అనేకం-ఎన్నోరూప ములు గలవానినిఁగా, అమన్యత-తలచెను. "అభిజాతః కులీన స్యాత్" అను నమరముచేత ఉత్తమ వంశీయుఁడైన కుశుఁడు తన కన్నివిధములఁ దగినవాఁడగు అతిథి వలన తానొక్కఁడేయైనను తన ననేకసమముగాఁ గుమారుని భావించెనని తాత్పర్యము.

శ్లో. స కులోచిత మింద్రస్య సాహాయక ముపేయివాన్,
జఘాన సమరే దైత్యం దుర్జయం తేన చావధి. 5

వ్యాఖ్య : సః-ఆ కుశుఁడు, కులోచితం-తమ వంశమువారి కర్తవ్యమైన, ఇంద్రస్య-ఇంద్రునికి, సాహాయకం-సహకారిత్వమును, ఉపేయివాన్-పొందిన వాఁడగుచు, సమరే-యుద్ధమునందు, దుర్జయం-జయింప సాధ్యముగాని దుర్జయుఁడను పేరుగల, దైత్యం-రాక్షసునిఁ జఘాన-చంపెను. తేన-ఆ దుర్జయునిచేత, అవధిచ-చంపఁబడెనుకూడ. తమ వంశీయులకు యుద్ధములలో నింద్రునికిఁ దోడ్పడుట యాచారమై యున్నందున కుశుఁడును అట్లే దేవరాక్షస యుద్ధమున ఇంద్రునికి సహాయముగావెళ్ళి, అచ్చట మహాపరాక్రమశాలియగు దుర్జయుఁడను రాక్షసునిఁ జంపి, వానిచేతనే తానును జంపఁబడెనని భావము. "హన-హింసా గత్యోః" అను ధాతువునకు లిట్ జఘాన, కర్మణిలుఙ్ అవధి అనునవి అగును.

శ్లో. తం స్వసా నాగరాజస్య కుముదస్య కుముద్వతీ,
అన్వగాత్ కుముదానందం శశాంక మివ కౌముదీ. 6

వ్యాఖ్య ; కుముదస్య-కుముదుఁడనఁబడు, నాగరాజస్య-సర్పరాజు యొక్క, స్వసా-చెల్లెలయిన, కుముద్వతీ-కుముద్వతి (కుశునిభార్య), కుముదానందం-కలువలకానందమును గలిగించు, శశాంకం-చంద్రుని, కౌముదీ, ఇవ-జ్యోత్స్నవలె, తం-మృతుఁడైన కుశుని, అన్వగాత్-అనుసరించి వెళ్ళెను. కుశుని పక్షమున "కుముదానందం" అనుపదమునకు కుః-పృథివీ, తస్యాః ము -ప్రీతిః, సైవ ఆనందః యస్యసః అని విగ్రహము భూప్రజల సంతోషమే తన సంతోషముగాఁగలవాఁడని యర్థము. చంద్రునివెంట వెన్నెల వెళ్ళినట్లు, కుశునివెంట కుముద్వతి సహగమనముచేసి మృతిచెందెనని భావము. సహగమనమున కింత చక్కని యుపమానమును జెప్పుట కాళిదాసుకే సాధ్యము. ఉపమాలంకారము.

శ్లో. తయో ర్దివస్పతే రాసీ దేకః సింహాసనార్ధభాక్,
ద్వితీయాపి సఖీ శచ్యాః పారిజాతాంశభాగినీ.

వ్యాఖ్య : తయోః-ఆ కుశకుముద్వతు లిద్దఱిలో, ఏకః-ఒకడైన కుశుఁడు దివస్పతేః-ఇంద్రునియొక్క, సింహాసనార్థభాక్-సింహాసనమునందలి సగము ప్రవేశమును పొందినవాఁడు, ఆసీత్-ఉయ్యెను. ద్వితీయా, అపి-రెండవది యగు కుముద్వతియు, శచ్యాః-శచీదేవియొక్క, పారిజాతాంశ భాగినీ-పారిజాత పుష్పములయందు భాగమును పొందునట్టి, సఖీ-స్నేహితురాలు, ఆసీత్-అయ్యెను. మృతులై స్వర్గమును జేరిన కుశకుముద్వతులలోఁ గుశుఁడింద్ర మిత్రుడై స్వర్గసింహాస నార్థభాగమును పొందెననియు, కుముద్వతి శచీదేవికి ప్రాణస్నేహితురాలయ్యెననియు భావము. "తయోః-" (సచ, సాచ) ఏకశేష స మా స ము. "దివఃపతిః-దివస్పతిః" కస్కాదిగణమాకృతిగణమగుటచే సాధువు.

శ్లో. తదాత్మసంభవం రాజ్యే మంత్రివృద్ధాః సమాదధుః,
స్మరంతః పశ్చిమా మాజ్ఞాం భర్తుః సంగ్రామయాయినః. 8

వ్యాఖ్య : సంగ్రామయాయినః-యుద్ధమునకు వెళ్ళుచుండిన, భర్తుః-ప్రభువగు కుశునియొక్క, పశ్చిమాం-చివరిదియగు, ఆజ్ఞాం-ఆ ను, స్మ ర ం తః - స్మ రి ం చు చు న్న, మంత్రి వృ ద్ధాః-మంత్రి [illegible] లు, తదాత్మస ం భ వ ం-అతని కు మా రుఁ డ గు అతిథిని, రా [illegible]-రాజ్యమునందు, సమాదధుః-నిలిపిరి. యుద్ధమునకు వెళ్ళుచు విపర్యయ మేమైన జరిగినయెడల నాకుమారునికి రాజ్యాభిషేకమును జేయుఁడని చెప్పిన కుశునియాజ్ఞను గుర్తుంచుకొన్న వృద్ధమంత్రులు, కుశుని మరణమును విన్న వెంటనే అతిథిని రాజుగా నిలిపిరని భావము.

శ్లో. తే తస్య కల్పయామాసు రభిషేకాయ శిల్పిభిః,
విమానం నవ ముద్వేది చతుస్స్తంభప్రతిష్ఠితమ్. 9

వ్యాఖ్య : తే-ఆమంత్రులు, తస్య-ఆయతిథియొక్క, అభిషేకాయ-పట్టాభిషేకముకొఱకు, శిల్పిభిః-శిల్పులచేత, ఉద్వేది-ఉన్నతమైన యరుగుగలదియు, చతుస్స్తంభప్రతిష్ఠితం-నాలుగు స్తంభములపై నిలుపఁబడినదియునగు, నవం, విమానం-క్రొత్తమండపమును, కల్పయామాసుః-కట్టించిరి. అతిథియొక్క పట్టాభిషేకముకొఱకై యెత్తైన వేదిక, దానిపై నాలుగు స్తంభముల క్రొత్తవిమాన

మును మంత్రులు శిల్పులచేత నిర్మింపఁజేసి రనిభావము. ఈ విమానము దేవాలయముల పైభాగమువలె నుండుననియు. దానిని నాలుగు స్తంభములపై నిలుపుట అన్ని దిక్కులనుండియుఁ బ్రజలు చూచుటకనియుఁ దెలియవలయును.

శ్లో. తత్రైనం హేమకుంభేషు సంభృతైస్తీర్థవారిభిః,
ఉపతస్థుః ప్రకృతయో భద్రపీఠోపవేశితమ్. 10

వ్యాఖ్య : తత్ర-విమానమునందు, భద్రపీఠోపవేశితం—భద్రపీఠ-మంగళపీఠమునందు, ఉపవేశితం-కూర్చోఁబెట్టఁబడిన, ఏనం-అతిథిని, హేమకుంభేషు-బంగారుబిందెలయందు, సంభృతైః-నింపఁబడిన, తీర్థవారిభిః-గంగాదితీర్థజలములతో, ప్రకృతయః-మంత్రులు, ఉపతస్థుః-సమీపించిరి. విమానమునందు భద్రపీఠముపైఁ గూర్చోఁబెట్టఁబడిన అతిథిని అభిషేకించుటకు మంత్రులు సువర్ణ కలశములలో నింపఁబడిన గంగాది పుణ్యతీర్థజలములతో సమీపించిరని భావము.

శ్లో. నదద్భిః స్నిగ్ధగంభీరం తూర్యైరాహతపుష్కరైః,
అన్వమీయత కళ్యాణం తస్యావిచ్ఛిన్నసంతతి. 11

వ్యాఖ్య : ఆహతపుష్కరైః-కొట్టబడిన ముఖభాగములుగలవియు, స్నిగ్ధగంభీరం-మధురముగాను గంభీరముగాను, నదద్భిః-మ్రోగుచున్న, తూర్యైః-మృదంగాది వాద్యములచేత, తస్య-ఆయతిథియొక్క, అవిచ్ఛిన్న సంతతి-ఆగిపోని పరంపరగల, కళ్యాణం-భవిష్యచ్ఛుభము, అన్వమీయత-ఊహింపఁబడెను. "పుష్కరం కరిహస్తాగ్రే వాద్యభాండముఖేఽపిచ" అనియమరము. ఆ సమయమున మ్రోగింపఁబడిన మృదంగ ఢక్కాది వాద్యముల మధుర గంభీరమైన ధ్వనుల యనురణనముచేత అతిథి రాజుయొక్క అవిచ్ఛిన్న శుభ పరంపర ఊహింపఁబడెనని భావము.

శ్లో. దూర్వాయవాంకుర ప్లక్షత్వ గభిన్నపుటోత్తరాన్,
జ్ఞాతివృద్ధైః ప్రయుక్తాన్ స భేజే నీరాజనావిధీన్. 12

వ్యాఖ్య : సః-అతిథి, దూర్వా...రాన్—దూర్వా-గఱిక పరకలును, యవాంకుర-యవధాన్యపు మొలకలును, ప్లక్షత్వక్-రావిచెట్టు చర్మమును,

అభిన్నపుట-పంచ పల్లవములనఁబడు లేఁతచిగుళ్లను, ఉత్తరాన్-ప్రధానములుగాఁ గలవియు, జ్ఞాతివృద్ధైః-బంధువులయందు వృద్ధులైన వారిచేత, ప్రయుక్తాన్-చేయఁబడినవియునగు, నీరాజనావిధీన్-శాంతికర్మ విశేషములను, భేజే-పొందెను. "అభిన్నపుటము" లనఁగా ఇప్పపువ్వులు అనికొందఱును, కమలములని మరికొందఱును జెప్పుదురు. సింహాసనముపైఁ గూర్చున్న అతిథికి కులవృద్ధులు వివిధ మూలికలతో నీరాజన విధిని నిర్వర్తించిరని భావము.

శ్లో. పురోహితపురోగా స్తం జిష్ణుం జైత్రై రథర్వభిః,
ఉపచక్రమిరే పూర్వ మభిషేక్తుం ద్విజాతయః. 13

వ్యాఖ్య ; పురోహితపురోగాః-పురోహితుఁడు మొదలుగాఁగల, ద్విజాతయః-బ్రాహ్మణులు, జిష్ణుం-జయశీలుఁడైన, తం-ఆ యతిథిని; జైత్రైః-జయమునుగూర్పగల, అథర్వభిః-అథర్వ వేదమంత్రములచేత, పూర్వం-మొదట, అభిషేక్తుం-అభిషేకముఁజేయుటకు, ఉపచక్రమిరే-ప్రారంభించిరి. పురోహితుఁడును అతనితోఁబాటు బ్రాహ్మణులును పట్టాభిషేక సమయ పఠనీయము లగు నథర్వ వేదమంత్రములు జదువుచు మొదట నభిషేకించిరని భావము. "పురః హితం వక్తి" ఇతి పురోహితః-రాఁబోవు మేలునకై వైదిక జ్యోతిషాది శాస్త్రవిహిత కర్మలను జెప్పి చేయించువాఁడని యర్థము.

శ్లో. తస్యౌఘమహతీ మూర్ధ్ని నిపతంతీ వ్యరోచత,
సశబ్ద మభిషేకశ్రీః గంగేవ త్రిపురద్విషః. 14

వ్యాఖ్య : తస్య-ఆయతిథియొక్క, మూర్ధ్ని-తలపైన, సశబ్దం-ధ్వనితో గూడునట్లు, నిపతంతీ-పడుచున్నదియు, ఓఘమహతీ-ప్రవాహముచేత గొప్పఁగా నున్నదియునగు, అభిషేకశ్రీః-కాంతియుక్తమైన అభిషేకజలము, త్రిపురద్విషః-శివునియొక్క, మూర్ధ్ని-తలపైన, నిపతంతీ-పడుచున్న, గంగా, ఇవ-గంగవలె, వ్యరోచత-మిక్కిలి ప్రకాశించెను. ధారాపాతముగా ధ్వనించుచు, అతిథితలపైనఁ బడుచుండిన యభిషేకజలము శివుని తలపైఁబడుచుండిన గంగవలె శోభిల్లెనని భావము. అలంకారము: ఉపమ 'అభిషిచ్యతే అనేన ఇతి అభిషేకః' అనఁగా జలమని యర్థము.

శ్లో. స్తూయమానః క్షణే తస్మి న్నలక్ష్యత స వందిభిః,
ప్రవృద్ధ ఇవ పర్జన్యః సారంగై రభినందితః. 15

వ్యాఖ్య : తస్మిన్, క్షణే-ఆయభిషేకకాలమునందు, వందిభిః-స్తుతిపాఠకులచేత, స్తూయమానః-స్తోత్రముచేయఁబడుచున్న, సః-అతిథి, ప్రవృద్ధః-వృద్ధినిఁజెందినదై, సారంగైః-చాతకపక్షులచేత, అభినందితః-మెచ్చుకొనఁబడిన, పర్జన్యః, ఇవ-మేఘమువలె, అలక్ష్యత-కనఁబడెను. ధారావాహిజలముతోఁ దడియుచు, మాగధులచేత నుతింపఁబడుచుండిన యతిథి, వృద్ధినిఁజెంది వర్షధారలు గురియుచుఁ జుట్టునుమూగిన చాతకపక్షుల కిలకిలారావముల మెప్పులలోఁగూడిన మేఘమువలెఁ జూచువారికిఁ గనఁబడెనని భావము. అలంకారము: ఉపమ.

శ్లో. తస్య సన్మంత్ర పూతాభిః స్నాన మద్భిః ప్రతీచ్ఛతః,
వవృధే వైద్యుతస్యాగ్నే ర్వృష్టిసేకా దివ ద్యుతిః. 16

వ్యాఖ్య : సన్మంత్రపూతాభిః-చక్కఁగానుచ్చరింపఁబడిన వేదమంత్రములచేత పవిత్రములైన, అద్భిః-అభిషేకజలములచేత, స్నానం-స్నానమును, ప్రతీచ్ఛతః-చేయుచుండిన, తస్య-అతిథికి, వృష్టిసేకాత్-వర్షముపడుటవలన, వైద్యుతస్య-విద్యుత్తుకు సంబంధించిన, అగ్నేః ఇవ-అగ్నికివలె, ద్యుతిః-కాంతి, వవృధే-వృద్ధినిఁజెందెను. వ ధారాసారమువలన విద్యుత్తుకు సంబంధించిన అగ్ని (బడబాగ్ని) దీప్తినిఁజెందిన మంత్రపూతమైన జలాభిషేకముచేత అతిథియొక్క శరీరకాంతి అభివృద్ధినిఁజెందె ని భావము. ఉపమాలంకారము. ఇందులో కవి వేదమంత్ర ప్రభావమును, విజ్ఞానశాస్త్రరహస్యమును వెల్లడించెనని గ్రహింపవలెను.

శ్లో. స తావ దభిషేకాంతే స్నాతకేభ్యో దదౌ వసు,
యావ తైషాం సమాప్యేరన్ యజ్ఞాః పర్యాప్తదక్షిణాః. 17

వ్యాఖ్య : సః-ఆ విధముగా నభిషేకమును బొందిన యతిథి, అభిషేకాంతే-అభిషేకము ముగియఁగానే, స్నాతకేభ్యః-గృహస్థులైయున్న బ్రాహ్మణులకు, తావత్-అంతపరిమాణముగల, వసు-ధనమును, దదౌ-ఇచ్చెను. యావతా-ఎంత ప్రమాణముగల ధనముచేత, ఏషాం-ఈ గృహస్థులయొక్క, పర్యాప్తదక్షిణాః-చాలినదక్షిణలుగల, యజ్ఞాః-యజ్ఞములు, సమాప్యేరన్-పూర్తిచేయఁబడునో,

పట్టాభిషేకము ముగియఁగానే అతిథి, సభాసదులైన గృహస్థులకు వారు చేయవల సిన యజ్ఞములు సమగ్ర దక్షిణలు గలవియై యెంత ధనముతో పరిసమాప్తము లగునో అంత ధనమును ఒక్కొక్కటికి దానము చేసెను. "యావత్తావచ్చ సాకల్యే" అను నిఘంటువు వలన "యావత్, తావత్, సంపూర్ణార్థకములు.

శ్లో. తే ప్రీతమనస స్తస్మై యామాశిష ముదైరయన్,
సా తస్య కర్మనిర్వృత్తై ర్దూరం పశ్చాత్కృతా ఫలైః. 18

వ్యాఖ్య : ప్రీతమనసః-సంతోషించిన మనస్సుగల, తే-ఆస్నాతకులు, తస్మై-అతిథి కొఱకు, యాం, ఆశిషం-ఏయాశీర్వచనమును, ఉదైరయన్-పలికిరో, సా-ఆ యాశీర్వచనము, తస్య-అతనికి, కర్మనిర్వృత్తైః-పూర్వపుణ్యము చేతఁ గలిగిన, ఫలైః-సామ్రాజ్యాది ఫలములచేత, దూరం-ఎక్కువగా, పశ్చాత్కృతా-వెనుకఁబడఁగొట్టఁబడినదయ్యెను. అట్లు గౌరవింపఁబడిన స్నాతకులు తృప్తులై యతిథికిఁ జేసిన ఆశీర్వచనము అతని పూర్వపుణ్యఫలములచేత మిక్కిలి వెనుకవేయఁబడినదయ్యెను. అనగా పూర్వజన్మకృత సుకృతఫలముగా ముందు రాజ్యాధికారాదులు వచ్చెననియు, ఆ తరువాత బ్రాహ్మణాశీర్వాదములు ఫలించెననియు భావము.

శ్లో. బంధచ్ఛేదం స బద్ధానాం వధార్హాణా మవధ్యతామ్,
ధుర్యాణాంచ ధురో మోక్ష మదోహం చాదిశ ద్గవామ్. 19

వ్యాఖ్య : సః-అతిథి, బద్ధానాం-బంధింపఁబడిన వారియొక్క, బంధచ్ఛేదం-బంధములు విడుచుటను, వధార్హాణాం-మరణశిక్షవేయఁబడినవారియొక్క, అవధ్యతాం-చంపదగకుండుటను, ధుర్యాణాం - బరువులు మోయువారికి, ధురః-బరువునుండి, మోక్షం - విడుదలను, గవాం-గోవులకుఁ అదోహంచ-పాలుపితుకకుండుటకున్ను, ఆదిశత్-అజ్ఞాపించెను. పట్టాభిషేక సమయమున నందఱును సంతోషమున నుండవలయునన్న యభిప్రాయముచేత అతిథి కారాగారములందున్న వారిని విడిచిపెట్టుటకును, మరణదండన పడినవారినిఁ జంపకుండుటకును, బరువులుమోయుచున్న కూలీలు, వృషభములు ఆ పనిచేయుట విడుపవలయుననియు, ఆ సమయమున దూడలు స్వేచ్ఛాపూర్తిగా క్షీరపానము చేయవలయునని గోవులను పాలుపిదుకరాదనియు రాజ్యమునందంతటను ఆజ్ఞలు పంపెను.

శ్లో. క్రీడాపతత్రిణో౽ప్యస్య పంజరస్థాః శుకాదయః,
లబ్ధమోక్షా స్తదాదేశా ద్యథేష్టగతయో౽భవన్. 20

వ్యాఖ్య : పంజరస్థాః-పంజరములందుండిన, శుకాదయః-చిలుకలు మొదలయిన, అస్య, క్రీడాపతత్రిణః, అపి-అతనియొక్క ఆటపక్షులు సైతము, తదాదేశాత్-అతని యాజ్ఞవలన, లబ్ధమోక్షాః-పొందిన విడుదలగలవియగుచు, యథేష్టగతయః-స్వేచ్ఛాసంచారముగలవి, అభవన్-అయినవి. అతిథి యాజ్ఞవలన పంజరములందలి శుకాదిక్రీడాపక్షులుగూడ విడువఁబడి స్వేచ్ఛావిహారము గలవైనవనఁగా నితరుల విషయము చెప్పవలసినదేమున్నది? అని భావము.

శ్లో. తతః కక్ష్యాంతర న్యస్తం గజదంతాసనం శుచి,
సోత్తరచ్ఛద మధ్యాస్త నేపథ్యగ్రహణాయ సః. 21

వ్యాఖ్య : తతః-అభిషేకానంతరము, సః-అతఁడు, నేపథ్యగ్రహణాయ-రాజవేషమును స్వీకరించుటకు, కక్ష్యాంతర న్యస్తం-మరియొక భవనపు అంగణమునందు, న్యస్తం-ఉంచఁబడినదియు, శుచి-నిర్మలమైనదియు, సోత్తరచ్ఛదం-పైన వస్త్రము కప్పఁబడినదియు నగు, గజదంతాసనం-ఏనుగు దంతములతో నిర్మించిన పీఠమును, అధ్యాస్త-ఎక్కెను (అచ్చటఁగూర్చునెను). అభిషేక ప్రక్రియ ముగిసిన తరువాత తడి వస్త్రములు విడిచి రాజోచిత వస్త్రాలంకారములు ధరించుటకై మఱియొక భవనాంగణమున నుంచఁబడిన నిర్మల న గజదంత పీఠము అతిథి కూర్చునెనని భావము. "సోత్తరచ్ఛదం" ఉ రచ్ఛదెన సహితం సో రచ్ఛదం అని విగ్రహము. ఉత్తరచ్ఛదమనఁగా ఉ రీయము-పైఁగప్పుకొ వస్త్రము.

శ్లో. తం ధూపాశ్యానకేశాంతం తోయనిర్ణిక్తపాణయః,
ఆకల్పసాధనై స్తై స్తై రుపసేదుః ప్రసాధకాః. 22

వ్యాఖ్య : తోయనిర్ణిక్తపాణయః-జలముతో కడుగుకోఁబడిన చేతులుగల, ప్రసాధకాః-అలంకరించు సేవకులు, ధూపాశ్యానకేశాం ం-ధూప-గంధద్రవ్యములపొగచేత, ఆశ్యాన-తడిపోఁగొట్టఁబడిన, కేశాంతం-జు గల, తం-అతిథిని, తైః, తైః-ఆయావిధములైన, ఆకల్పసాధనైః-అలంకార ధనములైన గంధ

మాల్యాదులచేత, ఉపసేదుః-చేరిరి (అలంకరింప మొదలిడిరి). రాజు నలంకరించు సుద్యోగులు చేతులు శుభ్రముగాఁ గడిగికొని, సుగంధధూపములచేత నతని జుట్టును తడిలేని దానినిఁగాజేసి, అలంకారసాధనములైన వివిధవస్తువులతో నతి సమీపించిరి.

శ్లో. తే ఽస్య ముక్తాగుణోన్నద్ధం మౌలి మంతర్గతస్రజమ్,
ప్రత్యూపుః పద్మరాగేణ ప్రభామండలశోభినా. 23

వ్యాఖ్య: తే-ఆప్రసాధకులు, ముక్తాగుణోన్నద్ధం — ముక్తాగుణ-ముత్తెపుసరులచేత, ఉన్నద్ధం-ఎత్తికట్టఁబడినదియు, అంతర్గతస్రజం-లోపలుంచ బడిన పూదండ గలదియునగు, అస్య-అతిథియొక్క, మౌలిం-జుట్టును, ప్రభా మండలశోభినా-కాంతిమండలముచేత ప్రకాశించుచున్న, పద్మరాగేణ-మాణిక్యము చేత, ప్రత్యూపుః-పొదిగిరి. అలంకార సేవకులు అతిథి కేశబంధమునందు పుష్ప మాలికనుంచి, ముత్యాలదండతో పైకిఁగట్టి, దానిపై మిక్కిలికాంతిగల మాణిక్య మును జెక్కి యలంకరించిరని భావము.

శ్లో. చందనే నాంగరాగం చ మృగనాభి సుగంధినా,
సమాపయ్య తత శ్చక్రుః పత్రం విన్యస్తరోచనమ్. 24

వ్యాఖ్య: మృగనాభిసుగంధినా-కస్తూరినిగలుపుటచేతఁబరిమళించుచున్న, చందనేన-శ్రీగంధముచేత, అంగరాగం-శరీరలేపనమును, సమాపయ్య-పూర్తి చేసి, తతః-తరువాత, విన్యస్తరోచనం-కలుపఁబడిన గోరోచనముగల, పత్రం-మకరికాదిపత్రరచనను, చక్రుః-చేసిరి. మరియు నా ప్రసాధకులు కస్తూరి కలి పిన శ్రీగంధముచేత నతని మైపూఁతను ముగించి, దానిపై గోరోచనా మిశ్రిత రంజన ద్రవముచేత వివిధ చిత్రములుగల పత్రరచనను చేసిరని భావము.

శ్లో. ఆముక్తాభరణః స్రగ్వీ హంసచిహ్నదుకూలవాన్,
ఆసీ దతిశయప్రేక్ష్యః స రాజ్యశ్రీవధూవరః. 25

వ్యాఖ్య: ఆముక్తాభరణః-ధరించినయాభరణములు గలవాఁడును, స్రగ్వీ-పుష్పమాలా ధరుఁడును, హంసచిహ్నదుకూలవాన్-హంసల అంచులుగల పట్టు

వస్త్రమును ధరించినవాఁడును, రాజ్యశ్రీవధూవరః-రాజ్యలక్ష్మియనెడు పెండ్లి కూతురునకు వరుఁడును నగు, సః-అయతిథి, అతిశయ ప్రేక్ష్యః-ఆ యలంకరణములచేత మిక్కిలి చూడఁదగినవాఁడు, ఆసీత్-అయ్యెను. రాజ్యలక్ష్మీవరుఁడుగా నలంకరింపఁబడిన నాయతిథి చూపఱకు మిక్కిలి యందగాఁడుగాఁ గనఁబడెనని భావము. "హంసచిహ్నదుకూలవాన్" హంసచిహ్నం యద్దుకూలం తద్వాన్" అని విగ్రహముచెప్పి, నకర్మధారయాన్మత్వర్థీయః (కర్మధారయ సమాసముపై మత్వర్థీయ ప్రత్యయము రాదు) అను సిద్ధాంతమునకు అపవాదముగా, "సర్వధనీ" వలెనే ఇచ్చటను మత్వర్థీయము వచ్చుట సాధువేయని మల్లినాథసూరి తెలిపెను.

శ్లో. నేపథ్యదర్శిన శ్ఛాయా తస్యాదర్శే హిరణ్మయే,
విరరాజోదితే సూర్యే మేరౌ కల్పతరో రివ. 26

వ్యాఖ్య : హిరణ్మయే-బంగారముతోఁ జేసిన, ఆదర్శే-అద్దమునందు, నేపథ్యదర్శినః-తన వేషమును జూచుకొనుచున్న, తస్య-అతిథియొక్క, ఛాయా-ప్రతిబింబము, ఉదితే-ఉదయించిన, సూర్యే-సూర్యునియందలి, మేరౌ-మేరుపర్వతమునందు, కల్పతరోః-కల్పవృక్షముయొక్క, ఛాయా, ఇవ-ప్రతిబింబమువలె, విరరాజ-మిక్కిలి ప్రకాశించెను. బంగారుటద్దమునందు చూచుకొనుచున్న అతిథి ప్రతిబింబము సూర్యోదయ సమయమున మేరుపర్వతమునందు ప్రతిఫలించిన కల్పవృక్షచ్ఛాయవలె నుండెను. వివిధ శాఖాఫలపుష్ప సహితమైన కల్పవృక్షచ్ఛాయ అతిథి ప్రతిబింబమున కుపమానము. అలంకారము: ఉపమ.

శ్లో. స రాజ కకుద వ్యగ్రపాణిభిః పార్శ్వవర్తిభిః,
యయా వుదీరితాలోకః సుధర్మానవమాం సభామ్. 27

వ్యాఖ్య : సః-అతిథి, రాజకకుద వ్యగ్రపాణిభిః—రాజకకుద-రాజచిహ్నములందు (ఛత్రచామరాదులయందు), వ్యగ్ర-ఆసక్తములైయున్న, పాణిభిః-చేతులుగల, పార్శ్వవర్తిభిః - ప్రక్కన నడచుచున్న పరిజనులచేతఁ, ఉదీరితాలోకః-పెద్దగా నుచ్చరింపఁబడిన 'బయ' శబ్దములు గలవాఁడగుచు, సుధర్మానవమాం (సుధర్మా, అనవమాం) -దేవసభకంటే తక్కువగాని, సభాం-అస్థానమును, యయౌ-చేరెను. రాజచిహ్నములగు ఛత్రచామరాదులను బట్టి

కొన్న జనులచేత "జయ, జయ" అని సంబోధింపఁబడుచున్న అతిథి, దేవసభను బోలిన తన యాస్థానమండపమును జేరెనని భావము. 'కుకుద' శబ్దమునకు ప్రధానమైనది, రాజచిహ్నము, ఎద్దుమూపురము, అని యర్థములుగలవు. 'ఆ లోకో జయశబ్దఃస్యాత్, అని యమరము.

శ్లో. వితాన సహితం తత్ర భేజే పైతృక మాసనమ్,
చూడామణిభి రుద్ఘృష్టపాదపీఠం మహీక్షితామ్. ౨౮

వ్యాఖ్య : తత్ర-ఆ సభామండపమునందు, వితానసహితం-మేలుకట్టుచేతఁ గూడినదియు, మహీక్షితాం-రాజులయొక్క, చూడామణిభిః-శిరోరత్నములచేత, ఉద్ఘృష్టపాదపీఠం-చెక్కఁబడిన పాదపీఠముగలదియు, పైతృకం-తండ్రియగు కుశునికి సంబంధించినదియు నగు, ఆసనం-సింహాసనమును, భేజే-పొందెను (ఎక్కెను). పైభాగమున మంచివస్త్రముచేత మేలుకట్టుకట్టఁబడి, పరరాజుల శిరోరత్నములు పొదిగిన పాదపీఠముగలిగి, పూర్వము తండ్రియైన కుశునిచేత నధిరోహింపఁబడుచుండిన ఇక్ష్వాకు రాజవంశ సింహాసనమును అతిథి యెక్కి కూర్చునెనని భావము. వితానము, ఉల్లోచము, మేలుకట్టు సమానార్థకములు. 'పితుఃఇదంపైతృకమ్' అని విగ్రహము.

శ్లో. శుశుభే తేన చాక్రాంతం మంగలాయతనం మహత్,
శ్రీవత్సలక్షణం వక్షః కౌస్తుభేనేవ కైశవమ్. ౨౯

వ్యాఖ్య : తేన-అతిథిచేత, ఆక్రాంతం-అడుగిడఁబడినదియు, శ్రీవత్స లక్షణం-'శ్రీవత్స' మను గృహలక్షణములు గలదియు, మహత్-విశాలముగా నుండినదియునగు,మంగళాయతనం-సభారూపముననున్న మంగళగృహము, కౌస్తుభేన, ఆక్రాంతం-కౌస్తుభమణిచేత నాక్రమింపఁబడినదియగు, శ్రీవత్సలక్షణం-శ్రీవత్సమను పుట్టుమచ్చగల, కైశవం, వక్షః, ఇవ-విష్ణువక్షస్థలమువలె, శుశుభే-ప్రకాశించెను. "శ్రీవత్సము, నంద్యావర్తము" మొదలగునవి నిర్మాణభేదములున్న గృహవిశేషములు. శ్రీవత్సమని చెప్పఁదగిన యా సభాభవనమునందు శ్రీవత్స లాంఛనమైన విష్ణువక్షస్థలమునందు కౌస్తుభమణివలె అతిథి ప్రకాశించెననిభావము. అలంకారము : శ్లేషానుప్రాణితమగు ఉపమ.

శ్లో. బభౌ భూయః కుమారత్వా దాధిరాజ్య మవాప్య సః,
రేఖాభావా దుపారూఢః సామగ్ర్య మివ చంద్రమాః. ౩౦

వ్యాఖ్య : సః-ఆ యతిథి, కుమారత్వాత్-బాల్యమునుండి, భూయః-యౌవ రాజ్యమును పొందియే పరం, ఆధిరాజ్యం-మహారాజ్యమును, అవాప్య-పొంది, రేఖాభావాత్-అ ర్ధచంద్రత్వము నుండియే, సామగ్ర్యం-సంపూర్ణత్వమును, ఉపా రూఢః-పొందిన , చంద్రమాః, ఇవ-చంద్రునివలె, బభౌ-ప్రకాశించెను. అతిథి మిక్కిలి బాలుఁడుగా నున్నందున నతనికి మొదట యువరాజ ధర్మములైన విద్యావినయ శౌర్యములు గలిగించి, తరువాత సమగ్రరాజ్యపాలన రూపమగు మహారాజ్యాధిపత్యమును మంత్రు లప్పగింపఁగా, నతఁడు, రేఖాభావము అనగా నర్ధచంద్రాకారమునుండి పూర్ణత్వమును పొందిన పూర్ణచంద్రునివలె క్రమాభి వృద్ధిని పొందుచు ప్రకాశించెనని భావము. అతనిలోఁ గ్రమాభివృద్ధికి లోపము గలుగలేదని యభిప్రాయము. అధికో రాజా అధిరాజః అధిరాజస్య భావః "ఆధిరాజ్యం" అని విగ్రహము.

శ్లో. ప్రసన్నముఖరాగం తం స్మితపూర్వాభిభాషిణమ్,
మూర్తిమంత మమన్యంత విశ్వాస మనుజీవినః. ౩౧

వ్యాఖ్య : ప్రసన్నముఖరాగం-నిర్మలమైన ముఖకాంతి గలవాఁడును, స్మితపూర్వాభిభాషిణం-చిఱునగవుముందు కనపడుచుండగాఁ బక్కగా భాషించు వాఁడును నగు, తం-ఆయతిథిని, అనుజీవినః-ఆశ్రయించి జీవించు మంత్రిపురో హిత ప్రభృతులు, మూర్తిమంతం శరీరమును ధరించిన, విశ్వాసం-నమ్మకము నుగా, అమన్యంత-తలఁచిరి. ముఖములో నెట్టి దుర్భావములును లేక ప్రసన్న మైన కాంతియు, ఇతరులతో సంభాషించునప్పుడు చిఱునవ్వుతోఁబలుకుటయు గల అతిథిని మంత్రులు, పురోహితులు, సేవకులు మొదలగువారు మూర్తీభ వించిన విశ్వాసముగా భావించిరి. నమ్మిరని భావము.

శ్లో. స పురం పురుహూతశ్రీః కల్పద్రుమనిభధ్వజామ్,
క్రమమాణ శ్చకార ద్యాం నాగే నైరావతౌజసా. ౩౨

వ్యాఖ్య : పురుహూతశ్రీః-ఇంద్రవైభవముగల, సః-అతిథి, కల్పద్రుమ నిభధ్వజాం--కల్పద్రుమ-కల్పవృక్షములకు, నిభ-సమానమగు,

ధ్వజాం-కేతనములుగల, పురం-అయోధ్యానగరమును, ఐరావతౌజసా-ఐరావతముయొక్క బలమువంటి బలముగల, నాగేన-గజముతో, క్రమమాణః-తిరుగుచున్నవాఁడై (ఊరేగుచున్నవాఁడై), ద్యాం-స్వర్గమును, చకార-చేసెను. ఇంద్ర వైభవముగల యతిథి కల్పవృక్షములవలె వివిధరూపములతో నలంకరింపఁబడిన జెండాలుగల అయోధ్యానగరమును, ఐరావతమువంటి యొక భద్రగజముపైనెక్కి యూరేగుచు స్వర్గపట్టణముగా మార్చెనని భావము. ఇంద్రుఁడు స్వర్గమునవలె నతథి అయోధ్యానగరమున పట్టాభిషేకానంతర మూరువెదలు సుత్సవమునఁ బాల్గొనెనని తాత్పర్యము.

శ్లో. తస్యైకస్యోచ్ఛ్రితం ఛత్రం మూర్ధ్ని తేనామలత్విషా
పూర్వరాజ వియోగౌష్మ్యం కృత్స్నస్య జగతో
హృతమ్. 32

వ్యాఖ్య : తస్య, ఏకస్య-అయొక్కనియొక్క, మూర్ధ్ని-శిరముపైన, ఛత్రం-ఛత్రము, ఉచ్ఛ్రితం-ఎత్తియుంచఁబడినది. అమలత్విషా-నిర్మలకాంతిగల, తేన-ఆఛత్రమునేర, కృత్స్నస్య-సంపూర్ణమైన, జగతః-లోకముయొక్క, పూర్వరాజవియోగౌష్మ్యం--పూర్వరాజ-ఇంతకుముందు రాజుగానుండిన కుశుని యొక్క, వియోగ-ఎడబాటుచేతనైన, ఔష్మ్యం-సంతాపము, హృతం-హరింపబడినది. అయతిథియొక్కని శిరముపై మాత్రమే ఛత్రముంచఁబడినది. దాని దాని చేత సర్వలోకమునకు సంబంధించినట్టి పూర్వవియోగజనిత సంతాపమంతయుఁ దొలఁగింపఁబడెనని భావము. ఇచ్చట ఛత్రము క్రొత్తగారాజైన అతిథిపైనుండగా ప్రజలకు తాపముపోయినట్లు వర్ణించుట అసంగతము. కారణమొకచోటను కార్యమొకచోటను నుండుటయే అలంకారికమైన అసంగతికి లక్షణము. "కార్యకారణయో ర్భిన్నదేశతాయా మసంగతిః" కనుక ఇటి అతిథి రాజ్యసింహాసన ఛత్రమును ధరింపగానే ప్రజలకు అరాజకమువలన వచ్చు తాపము తొలఁగి యానందమును బొందిరను తాత్పర్యమును వర్ణించుచున్నది. ఇది అసంగతి అలంకారము.

శ్లో. ధూమా దగ్నేః శిఖాః పశ్చా దుదయాదంశవో రవేః,
సోఽతీత్య తేజసాం వృత్తిం సమ మేవోత్థితో గుణైః. 34

వ్యాఖ్య : అగ్నేః-అగ్నికి, ధూమాత్, పశ్చాత్-పొగకంటెతరువాత, శిఖాః-జ్వాలలును, రవేః-సూర్యునికి, ఉదయాత్, పశ్చాత్-ఉదయముకంటే తరువాత, అంశవః - కిరణములును (ఉత్తిష్ఠంతే - లేచుచుండును). సః-అతిథి, తేజసాం-తేజస్వంతులగు అగ్న్యాదులయొక్క, వృత్తిం-స్వభావమును, అతీత్య-అతిక్రమించి, గుణైః-సద్గుణములతో, సమమేవ-సమానముగానే ఉత్థితః-పెరిగెను. లోకమునందు అగ్నికి మొదట ధూమము, పిమ్మట మంటలును వచ్చుటయు, సూర్యుని యుదయము ముందు తరువాత కిరణప్రసారము జరుగుటయుఁజూతుము. కాని అతిథి వివిధ సద్గుణములలోపాటే పెరుగుట జరిగినది. ఇది యపూర్వ మని భావము. క్రమముగాఁగాక యేకకాలమునందే యతఁడును నతని గుణములును వృద్ధిచెందుట చిత్రము.

శ్లో. తం ప్రీతివిశదై ర్నేత్రై రన్వయుః పౌరయోషితః,
శరత్ప్రసన్నై ర్జ్యోతిర్భి ర్విభావర్య ఇవ ధ్రువమ్. ౭౫

వ్యాఖ్య : పౌరయోషితః-పురస్త్రీలు, ప్రీతివిశదైః-ప్రేమచేత నిర్మలములైన నేత్రైః-చూపులతో, తం-ఆ యతిథిని, అన్వయుః-వెంబడించిరి. శరత్ప్రసన్నైః-శరదృతువునందు ప్రసన్నములైయున్న, జ్యోతిర్భిః-నక్షత్రములతో, విభావర్యః-రాత్రులు, ధ్రువం, ఇవ-ధ్రువునినివలె (ధ్రువమండలమునువలె) నని యర్థము. అయోధ్యానగరస్త్రీలు అతిథిని ప్రీతిపూర్వకమగు దృష్టి ప్రసారముచేత నడుగా దూరమునుండియే వీక్షించిరి. అవి శరదృతువు నందతిస్వచ్ఛముగానున్న నక్షత్రములతో రాత్రులు ధ్రువమండలమును జూచినట్లుండెనట. శరద్రాత్రులు దీర్ఘముగా నుండునుగావున నీ యుపమానముచేత వారు చాలసేపు అతనిని ప్రేమతోఁ జూచిరని భావము. నక్షత్రచక్రము ధ్రువపాశబద్ధమై యున్నదని జ్యోతిర్విదులు చెప్పుదురు.

శ్లో. అయోధ్యాదేవతా శ్చైనం ప్రశస్తాయతనార్చితాః,
అనుదధ్యు రనుధ్యేయం సాన్నిధ్యైః ప్రతిమాగతైః. ౭౬

వ్యాఖ్య : ప్రశస్తాయతనార్చితాః-ప్రశస్త-శ్రేష్ఠములగు, ఆయతన-దేవాలయములందు, అర్చితాః-పూజింపఁబడిన, అయోధ్యా దేవతాః, చ-అయోధ్యానగరమునందలి దేవతలుగూడ, అనుధ్యేయం-అనుగ్రహింపఁదగిన, ఏనం-

ఈ అతిథిని, ప్రతిమాగతైః-విగ్రహములందు సంక్రమించియున్న, సాన్నిధ్యైః-సన్నిధానములచేత, అనుదధ్యుః-అనుగ్రహించిరి. అయోధ్యానగరమునందలి దేవాలయస్థదేవతలు తమ తమ అర్చామూర్తులందు ఆవేశించి సమస్కరించుచున్న అతిథిని అనుగ్రహించిరని భావము. "అనుధ్యాన మనుగ్రహః" అని యుత్పలమాల.

శ్లో. యావ న్నాశ్యాయతే వేది రభిషేకజలాప్లుతా,
తావ దేవాస్య వేలాంతం ప్రతాపః ప్రాప దుస్సహః. 37

వ్యాఖ్య : అభిషేకజలాప్లుతా-పట్టాభిషేక జలముచేతఁదడుపఁబడిన, వేదిః-అరుగు, యావత్-ఎంతకాలమున, న, ఆశ్యాయతే-ఎండలేదో, తావత్, ఏవ-అంతకాలముననే, అస్య-ఆ రాజుయొక్క, దుస్సహః-సహించుటకు సాధ్యపడని, ప్రతాపః-శౌర్యము, వేలాంతం-సముద్రతీర పర్యంతమును, ప్రాప-వ్యాపించెను. అతిథికి పట్టాభిషేకము జరిగిన యరుగుమీది తడియైనను ఆరక ముందే యతని ప్రతాపము సముద్రపర్యంతము వ్యాపించెను. అనఁగా నతఁడు మహాప్రతాపవంతుఁడన్నవార్త సర్వత్ర వ్యాపించెనని భావము.

శ్లో. వసిష్ఠస్య గురో ర్మంత్రాః సాయకా స్తస్య ధన్వినః,
కిం తత్సాధ్యం యదుభయే సాధయేయు ర్న సంగతాః. 38

వ్యాఖ్య : గురోః-కులగురువగు, వసిష్ఠస్య-వసిష్ఠునియొక్క, మంత్రాః-వేదమంత్రములు, ధన్వినః,తస్య-ధనుర్ధారియగు నాయతిథియొక్క, సాయకాః-బాణములు; ఉభయే-ఆ రెండును,సంగతాః-కలసికొన్నవగుచు, యత్,సాధ్యం-సాధ్యమును, న సాధయేయుః-సాధింపలేకపోవునో, తత్-అ , సాధ్యం-సాధింపఁదగినకార్యము, కిం-ఏమున్నది? ఏదియులేదని యర్థము. మంత్రములా! మహామహిమోపేతుఁడైన వసిష్ఠునిచే నుచ్చరింపఁబడుచున్నట్టివి. బాణములా! ఉత్తమ ధానుష్కుఁడైన అతిథిచేత ప్రయోగింపఁబడుచున్నట్టివి. ఇఁక ఆరెండును గలిసి సాధింపఁజాలనికార్యమేమున్నది! ఏదియు లేదు, వానికసాధ్యమే లేకుండెనని భావము.

శ్లో. స ధర్మస్థసఖః శశ్వ దర్థిప్రత్యర్థినాం స్వయమ్,
దదర్శ సంశయచ్ఛేద్యాన్ వ్యవహారా నతంద్రితః. 39

వ్యాఖ్య : ధర్మస్థసఖః-ధర్మమునందు నిలుచువారు మిత్రులుగాఁగల వాఁడును, అతంద్రితః-అలసత్వములేని వాఁడునునగు, సః-ఆరాజు, అహ్వరే-ప్రతిదినమును, అ ప్రత్యర్థినాం-ఒక ప్రయోజనమును గోరునట్టియు దానిని ప్రతిరేకించునట్టియు జనులయొక్క, సంశయచ్ఛేద్యాన్-సంశయములను నిర్ణయింపనట్టి, వ్యవహారాన్-వివాదములను, స్వయం-తానే, దదర్శ-చూచెను (పరిష్కరించెను). తనకు శత్రువులయిన వారి విషయమునను మిత్రులైన వారి విషయమునను సమానముగా ప్రవర్తించునట్టి సభ్యులతోఁగూడినవాఁడై, ఆలసత్వములేక ప్రతిదినమును ధర్మాసనమును గూర్చుని, ఒక కార్యమునకై వాదప్రతివాదములు చేయునట్టి అర్థిప్రత్యర్థుల యొక్క వివాదమునందలి న్యాయనిర్ణయమును తానే స్వయముగాఁజేయుచుండె ననియు, ఒక న్యాయాధికారికే వ్యవహారములను వదిలిపెట్టక ప్రజాపాలనముఁ జేయుచుండెననియుభావము. "రాజ్ఞా సభాసదః కార్యా రిపౌ మిత్రేచ యేసమాః" అనియు, "వ్యవహారాన్ నృపః పశ్యేత్ విద్వద్భిః బ్రాహ్మణైఃసహ" అనియుఁ జెప్పిన ధర్మశాస్త్రమును అతిక్రమింపక తప్పక పాటించి పక్షపాతరహితముగా రాజ్యము నేలుచుండెనని తాత్పర్యము.

శ్లో. తతఃపర మభివ్యక్త సౌమనస్య నివేదితైః,

యుయోజ పాకాభిముఖై ర్భృత్యాన్ విజ్ఞాపనాఫలైః. 40

వ్యాఖ్య : తతః, పరం-ప్రజా వ్యవహారదర్శనానంతరము, భృత్యాన్-తన సేవకులను, అభివ్యక్త సౌమనస్య నివేదితైః—అభివ్యక్త-ముఖరాగాదుల వలన స్పష్టపడిన, సౌమనస్య-ప్రసన్నతచేత, నివేదితైః-సూచింపఁబడినవియు, పాకాభిముఖైః-ఫలోన్ముఖములైనవియు నగు, విజ్ఞాపనాఫలైః-విజ్ఞప్తులయొక్క ఫలములతో, యుయోజ-సంబంధపరచుచుండెను. ప్రజావ్యవహారములు పరిష్కరించి వచ్చి, యాసనమున ప్రసన్నుఁడై కూర్చున్న తనవద్దకిఁజేరి తమ తమ కోరికలు మనవిచేసుకొను పరిజనులకు వారివారి యభీష్టములు దీర్చుచుండెను. శ్లో. నియుక్తః కర్మనిష్పత్తౌ విజ్ఞప్తౌచ యదృచ్ఛయా। భృత్యాన్ ధనై ర్మానయంస్తు నవోప్యక్షోభ్యతాం వ్రజేత్" ఒక పనియందు నియోగించిన రాజు 'ఆ పనిని పూర్తిచేసితిమ'ని వచ్చి చెప్పిన భృత్యుల విజ్ఞప్తికి ఫలముగా ధనముల నిచ్చినయెడల నట్టిరాజు క్రొత్తవాడైనను క్షోభలేక సుఖముగా నుండు నన్న బృహస్పతి నీతిసారవచనమును పాటించుచుండెనని భావము. ఇచ్చటి సౌమనస్య

(పుష్పములుగల), ఫలయోజన (పండ్లనిచ్చుట) ప్రభృతులచేత అతఁడొక ఫల వృక్షముగా నుండెనన్న భావము వ్యంగ్యము.

శ్లో. ప్రజా స్తద్గురుణా నద్యో నభసేవ వివర్ధితాః,
తస్మింస్తు భూయసీం వృద్ధిం నభస్యే తా ఇవాయయుః. 41

వ్యాఖ్య : ప్రజాః-ప్రజలు, తద్గురుణా-అతని తండ్రియగు కుశునిచేత, నభసా - శ్రావణమాసముచేత, నద్యః, ఇవ - న దు ల వ లె, వివర్ధితాః - వృద్ధినిఁబొందింపబడి యుండిరి. తస్మిన్, తు-అతఁడు రాజుకాఁగానే, నభస్యే-భాద్రపదమాసమునందు, తాః, ఇవ-ఆనదులవలెనే, భూయసీం-అత్యంతమైన, వృద్ధిం-అభ్యుదయమును, ఆయయుః-పొందిరి. ప్రజాపోషణమునందు అతిథి తండ్రిని మించెనని భావము.

శ్లో. యదువాచ న తన్మిథ్యా యద్దదౌ న జహార తత్,
సోఽభూద్భగ్నవ్రతః శత్రూ నుద్ధృత్య ప్రతిరోపయన్. 42

వ్యాఖ్య : సః-అతిథి, యత్-దాన రక్షణాది విషయకముగు నేవాక్యమును, "ఉవాచ-చెప్పెనో, తత్-అది, మిథ్యా, న-అసత్యముకాకుండెను. యత్-ఏవస్తువును, దదౌ-ఇచ్చెనో, తత్-దానిని, న జహార-మరల వెనుకకు తీసికొనలేదు. (కింతు-కాని) శత్రూన్-శత్రువులను, ఉద్ధృత్య-ఉన్మూలించి, ప్రతిరోపయన్-మరలస్థాపించుచు, భగ్నవ్రతః-భగ్నమైన నియమము గలవాఁడు, అభూత్-అయ్యెను. ప్రజాక్షేమమునకై యాడిన మాట తప్పక, ఇచ్చినవస్తువును మరల వెనుకకు దీసికొనక నియమమును పాటించుచున్న యతఁడు, శత్రువులను మాత్రము మొదట స్థానభ్రష్టులను జేసి, వారు 'దాసోఽహ' మని లొంగినపిమ్మట మరల వారి స్థానములందుంచుచు నియమ భంగమును జేయుచుండెను. అనఁగా నతని ప్రజాపాలన శత్రునిర్మూలనాదులు శాస్త్రసమ్మతములై యుండె నని భావము.

శ్లో. వయో రూప విభూతీనా మేకైకం మదకారణమ్,
తాని తస్మిన్ సమస్తాని న తస్యోత్సిషిచే మనః. 43

వ్యాఖ్య : వయోరూపవిభూతీనాం-యౌవనము, సౌందర్యము, ఐశ్వర్యము అను వానిలో, ఏకైకం-ఒక్కటొక్కటియే, మదకారణం-మదమునకు హేతువు, తాని-ఆ మదకారణములన్నియు, తస్మిన్-అతనియందు, సమస్తాని-చేరియున్నవి, (తథాపి-అట్లయినను, తస్య-ఆ యతిథియొక్క, మనః-మనస్సు, న, ఉత్సిషిచే-పైకి పొంగలేదు (గర్వపడలేదు). వయస్సు, రూపము, ఐశ్వర్యము అనునవి యొక్కటొక్కటియే గర్వకారణములైనను, అన్నియుఁజేరిన యతని మనస్సున మదమురేకెత్తలేదు. అన్నియునున్నను వినయము వివేకమును గలవాఁడై యుండెనని భావము. గర్వశబ్దమును, "ఐశ్వర్య రూప తారుణ్య కుల విద్యా బలైరపి, ఇష్టలాభాదినాన్యేషా మవజ్ఞా గర్వ ఈరితః" అనియు, మద శబ్దమును, "మద స్త్వానందసందోహః సంభేదో మదిరాకృతః" అనియు పెద్దలు నిర్వచించిరి. "ఉత్సిషిచే" ఉత్ అను నుపసర్గతోఁజేరిన షిచ్లఞ్-క్షరణే అన ఆత్మనేపది ధాతువునకు లిట్ ప్రథమపురుష ఏకవచన రూపము.

శ్లో. ఇత్థం జనితరాగాసు ప్రకృతి ష్వనువాసరమ్,
అక్షోభ్యః స నవోప్యాసీ ద్దృఢమూల ఇవ ద్రుమః. 44

వ్యాఖ్య : ఇత్థం-ఇట్లు, అనువాసరం-ప్రతిదినమును, ప్రకృతిషు-ప్రజలు, జనితరాగాసు (సత్సు)-కలిగింపఁబడిన ప్రేమగలవారగుచుండఁగా, సః-ఆరాజు, నవః, అపి-క్రొత్తవాఁడైనను, దృఢమూలః-గట్టిగా నున్న ప్రేళ్ళుగల, ద్రుమః, ఇవ-వృక్షమువలె, అక్షోభ్యః-కదలించుటకు సాధ్యముగానివాఁడు, ఆసీత్-అయ్యెను. తన సద్గుణములచేతను, గర్వములేని ప్రవర్తనముచేతను నిరంతరము ప్రజలకుఁ దనపై ప్రీతిని గలిగించుకొనుచునున్న యారాజు గట్టిగా ప్రేళ్ళుబారిన మహావృక్షమువలె గట్టిపడి క్రొత్తగా రాజ్యాధికారమును స్వీకరించి నను శత్రువులు మొదలగువారికి అప్రధృష్యుఁడుగా నుండెను.

శ్లో. అనిత్యాః శత్రవో బాహ్యా విప్రకృష్టాశ్చ తే యతః,
అతః సోఽభ్యంతరా న్నిత్యాన్ షట్ పూర్వ మజయ
ద్రిపూన్. 45

వ్యాఖ్య : యతః-ఏకారణము వలన, బాహ్యాః-వెలుపలనున్న, శత్రవః-ప్రత్యర్థులైన రాజులు మొదలగువారు, అనిత్యాః-నిత్యముగా ద్వేషించువారు

కారో, తే-వారు, విప్రకృష్టాః, చ-దూరముగానుండువారో, అతః-ఈకారణము వలన, సః-అతఁడు, అభ్యంతరాన్-లోపల నుండువారును, నిత్యాన్-ఎప్పుడును గనఁబడువారును, షట్-ఆర్గురునునగు, రిపూన్-కామక్రోధాదులగు శత్రువులను, పూర్వం-మొదట, అజయత్-జయించెను. వెలుపటనున్న శత్రురాజులు ఒకప్పుడు ద్వేషించుటయు ఒకప్పుడు స్నేహమును జూపుటయు జరుగును. పైగా వారు దూరప్రదేశములందుందురు. కనుక వారు అనిత్య శత్రువులు. వారికంటే తనను విడువక లోపలఁజేరి చెడ్డమార్గమును బట్టించు అంతశ్శత్రువులు అపాయమును గలిగింతురు. కనుక కామము, క్రోధము, లోభము, మోహము, మదము, మాత్సర్యము అనఁబడు నార్గురు శత్రువుల నతఁడు మొదట జయించెను. అంత శ్శత్రుజయము గలిగినప్పుడు బాహ్యశత్రుజయము దుర్లభము కాదని భావము.

శ్లో. ప్రసాదాభిముఖే తస్మిన్ చపలాపి స్వభావతః,
నికషే హేమరేఖేవ శ్రీ రాసీ దనపాయినీ. 46

వ్యాఖ్య : స్వభావతః-ప్రకృతిసిద్ధముగా, చపలా, అపి-చంచలురాలైనను, శ్రీః-రాజ్యలక్ష్మి. ప్రసాదాభిముఖే-నిర్మలమైన దర్శనముగల, తస్మిన్-ఆ రాజునందు, నికషే-ఒరబాతియందలి, హేమరేఖా, ఇవ-బంగారపు గీతవలె, అనపాయినీ-తొలఁగిపోనిది (స్థిరమైనది), ఆసీత్-అయ్యెను. లక్ష్మి స్వభావముచేత చపలయే యైనను ప్రసన్నముఖుఁడైన యతిథియందు నికషోపలముపైని సువర్ణ రేఖవలె స్థిరముగా నుండెను. ప్రసన్నముఖుఁడగుటచేత నతనిసద్దికి వచ్చిన వారెవ్వరును ద్వేషమును, అసంతృప్తినిఁ బొందలు కనుక వ్యవహారములుచెడక రాజ్యలక్ష్మి స్థిరపడియుండెనని భావము.

శ్లో. కాతర్యం కేవలా నీతిః శౌర్యం శ్వాపద చేష్టితమ్,
అతః సిద్ధిం సమేతాభ్యా ముభాభ్యా మన్వియేష సః. 47

వ్యాఖ్య : కేవలా-శౌర్యవర్జితమై ఒకటియేయైన, నీతిః-నీతి। యోగము, కాతర్యం-పిటికితనము, కేవలం, శౌర్యం-నీతివర్జితమైన శౌర్య। యోగము, శ్వాపదచేష్టితం-క్రూరమృగచేష్టితము. అతః-ఇందువలన, సః- ఁడు, సమేతాభ్యాం-కలసికొన్నట్టి, ఉభాభ్యాం-నీతిశౌర్యములు రెండింటిచేతను, సిద్ధిం-జయప్రాప్తిని, అన్వియేష-వెదకుచుండెను. శౌర్యములేక కేవలము నీతికౌశలముచేత

ఎత్తులకు పైయెత్తులువేయుట పిఱికితనమునకు లక్షణము. అట్లే నీతిశాస్త్రము నెఱుఁగక కేవలము శౌర్యముతో శత్రువుమీదికి దుముకుట వ్యాఘ్రాదుల క్రూర కృత్యము వంటిది. కనుక అతిథి తన విజయప్రాప్తి కెల్లప్పుడును నీతిశౌర్యము లను జోడించి ప్రవర్తించుచుండెనని భావము, "వ్యాఘ్రాదయో వనచరాః పశవః శ్వాపదా మతాః" అని హలాయుధ నిఘంటువు.

శ్లో. న తస్య మండలే రాజ్ఞో న్యస్తప్రణిధిదీధితేః,
అదృష్టమభవత్ కించిద్ వ్యభ్రస్యేవ వివస్వతః. 48

వ్యాఖ్య : న్యస్తప్రణిధిదీధితేః—న్యస్త అన్ని దిక్కులకుఁబంపఁబడిన, ప్రణిధి-చారులే, దీధితేః-కిరణములుగాఁగల, తస్య, రాజ్ఞః-ఆ రాజునకు, వ్యభ్రస్య-మేఘములులేని, వివస్వతః, ఇవ-సూర్యునికివలె, మండలే-తన దేశము నందు, కించిత్-కొంచముగూడ, అదృష్టం-చూడఁబడనిది (తెలిసికొనబడనిది), న అభవత్-లేకుండెను. మేఘరహితమగు నాకాశమున కిరణప్రసారముగల సూర్యునికివలె నంతటను చారులనుంచిన యతనికి తన రాష్ట్రమునందలి చిన్న వస్తువు సహితము తెలియనిదిలేకుండెను. చారచక్షువై సర్వమును దెలిసికొను చుండెనని భావము.

శ్లో. రాత్రిందివ విభాగేషు యదాదిష్టం మహీక్షితాన్,
తత్సిషేవే నియోగేన స వికల్పపరాఙ్ముఖః. 49

వ్యాఖ్య : రాత్రిందివవిభాగేషు-రాత్రియొక్కయు పగటియొక్కయు జాములరూపములగు విభాగములయందు, మహీక్షితాం-రాజులకు, యత్-ఏది, ఆదిష్టం-ఈ సమయమున దీని నాచరింపవలెనని మనువు మొదలగు వారిచేత ఉపదేశింపఁబడియున్నదో, తత్-దానిని, సః-అతఁడు, వికల్పపరాఙ్ముఖః(సన్)-సంశయములేనివాఁడగుచు, నియోగేన-నిశ్చయముతో, సిషేవే-సేవించెను (అనుష్ఠించెనని యర్థము). మనువు, గౌతముఁడు మొదలగు ధర్మశాస్త్రజ్ఞులు రాజైనవాఁడు ఏయే సమయములం దేయేకార్యము లాచరింపవలెనో ఉపదేశించి యున్నారు. ఆ యుపదేశములను రాత్రిందివ విభాగములందు నిశ్చయముతో, అనుమానింపక, వికల్పములేమేని కలవేమోచూడక శ్రద్ధతో నతఁడాచరించు చుండెనని భావము. కౌటిల్యుఁడు అర్థశాస్త్రమునందు కార్యములకు నియోగ

వికల్పసముచ్చయము లుండుననిచెప్పి వాని నిట్లు వివరించెను. "అనేనైవోపాయేన నాన్యేనేతి నియోగః, అనేన వాక్యేన వేతి వికల్పః, అనేన చేతి సముచ్చయః".

శ్లో. మంత్రః ప్రతిదినం తస్య బభూవ సహ మంత్రిభిః,
స జాతు సేవ్యమానోఽపి గుప్తద్వారో న సూచ్యతే. 50

వ్యాఖ్య : తస్య-అతనికి, ప్రతిదినం-ప్రతిరోజును, మంత్రిభిః, సహ-మంత్రులతోఁగూడ, మంత్రః-రాజ్యతంత్ర విచారము, బభూవ-జరుగుచుండెను. సః-అది, సేవ్యమానః, అపి-నిరంతరము ఆవర్తింపబడుచున్నప్పటికిని, గుప్తద్వారః-గోప్యముగా నుంచబడిన ప్రకటన మార్గములు గలదియగుచు, జాతు-ఒకప్పుడు సైతము, నసూచ్యతే-వెల్లడింపఁబడకుండెను. అతిథి మంత్రులతోఁగలిసి ప్రతిదినమును రాజ్యతంత్ర విచారమును జేయుచుండెను. కాని ఆ రహస్యమును అభిప్రాయముద్వారాగాని, ముఖలక్షణములచేతగాని, మాటలద్వారాగాని ఎవ్వరును వెల్లడించుటకు వీలులేని పద్ధతులను గల్పించెనని భావము.

శ్లో. పరేషు స్వేషుచ క్షిప్తై రవిజ్ఞాతపరస్పరైః,
సోఽపసర్పై ర్జజాగార యథాకాలం స్వపన్నపి. 51

వ్యాఖ్య : యథాకాలం-కాలాతిక్రమణములేక, స్వపన్, అపి-నిద్రించుచున్నవాఁడైనను, సః-అతఁడు, పరేషు-శత్రువుల విషయమునను, స్వేషు, తనవారి విషయమునను, క్షిప్తైః-నియమింపఁబడినవారును, అవిజ్ఞాతపరస్పరైః-ఒకరినొకరు గుర్తింపలేనివారును నగు, అపసర్పైః-చారులచేత, జజాగార-మేల్కొనియుండెను. ప్రతిదినము కాలము నతిక్రమింపక నిద్రించువాఁడైనను ఆరాజు, శత్రువుల రహస్యములను, స్వీయజనుల రహస్యమును సైతము తెలిసికొనుటకు నియమింపఁబడిన గూఢచారులు, తమలోఁదాముగూడ నొకరినొకరు గుర్తింపజాలనివారగుచు, వారివారి నియమితకాలములందు వచ్చి తెలుపుచుండఁగా సర్వమును రాత్రివేళలయందు మేల్కొని తెలిసికొనుచుండెననిభావము. ఈ విషయమున కామందకనీతిసారమిట్లుచెప్పినది, "చారా న్విచారయే త్తీర్థే ష్వాత్మనశ్చ పరస్యచ! పాషండ్యాదీ నవిజ్ఞాతా నన్యోన్య మితరైరపి" తీర్థేషు-సహాయులయందు అని యర్థము.

శ్లో. దుర్గాణి దుర్గ్రహాణ్యాసన్ తస్య రోద్ధురపి ద్విషామ్,
నహి సింహో గజాస్కందీ భయా ద్గిరిగుహాశయః. ౫౨

వ్యాఖ్య : ద్విషాం, రోద్ధుః, అపి-శత్రువులను అడ్డగించునట్టివాఁడై యున్నప్పటికిని, తస్య-ఆరాజునకు, దుర్గ్రహాణి-పరులు పట్టుకొనుటకు సాధ్య పడని, దుర్గాణి-కోటలు, ఆసన్-ఉండినవి. గజాస్కందీ-ఏనుఁగులను జంపునట్టి సింహః-సింహము, భయాత్-భయకారణమువలన, గిరుగుహాశయః-కొండగుహల యందు పండుకొనునది, నహి-కాదుగదా! ఏనుఁగులనే చంపఁగలిగిన సింహము భయమువలనకాదుగదా! కొండగుహలలో పండుకొనునది. అది దాని స్వభావము. అట్లే సర్వశత్రువులను నిర్జించువాఁడైనను అతనికి శత్రుదుర్భేద్యములైన మహీ దుర్గాదులైన కోటలు ఉండెనని భావము. ఈ విషయమున మనువు "ధన్వ దుర్గం మహీదుర్గ మబ్దుర్గం వార్క్షమేవవా! నృదుర్గం గిరదుర్గంవా సమాశ్రిత్య వసే ద్బుధః" అని చెప్పెను. అలంకారము: అర్థాంతరన్యాసము.

శ్లో. భవ్యముఖ్యాః సమారంభాః ప్రత్యవేక్ష్యా నిరత్యయాః,
గర్భశాలిసధర్మాణ స్తస్య గూఢం విపేచిరే. ౫౩

వ్యాఖ్య : భవ్యముఖ్యాః-శుభమే ప్రధానముగాఁగలవియు, పత్యవేక్ష్యాః-కార్యక్రమపర్యవేక్షణము గలవియు, నిరత్యయాః-నిర్బాధములును, గర్భశాలి సధర్మాణః - పైరుపొట్టలలోనే ఫలించు వరిధాన్యమునకు సమానములును నగు, తస్య - అతనియొక్క, సమారంభాః-కర్మలప్రారంభములు, గూఢం-రహస్యముగా, విపేచిరే-ఫలించినవి. అతఁడు ప్రజలకు మేలునే కలిగించు పనులను ఆరంభించుననియు, ఆరంభించినవి చక్కని పర్యవేక్షణముగలిగి విఘ్నములు పొందక నిర్బాధముగా సాగుచు, పొట్టలోనే కంకులేర్పడి పండు వరిధాన్యమువలె నిగూఢముగా పూర్తియై వాంఛిత ఫలము లిచ్చుచుండెననియు భావము. ఒక కార్యము నారంభింపనున్నప్పుడే దీనివలన నీలాభముగలదు, ఆ లాభముగలదు, అని ప్రగల్భములు పలికి తుదకా పనిని విఘ్నములపాలుచేయు నసమర్థపాలకునివలెఁగాక "ఫలానుమేయాః ప్రారంభాః" అను రాజనీతి ననుసరించి ప్రజాహితకార్యములు చేయుచుండెనని తాత్పర్యము.

శ్లో. అపథేన ప్రవవృతే న జాతూపచితోఽపి సః,
వృద్ధౌ నదీముఖేనైవ ప్రస్థానం లవణాంభసః. 54

వ్యాఖ్య : సః-అతిథి, ఉపచితః, అపి-వృద్ధిని పొందియున్నవాఁడైనను, జాతు-ఒకప్పుడుగూడ, అపథేన-చెడ్డమార్గముద్వారా, న ప్రవవృతే-ప్రవర్తింప లేదు. లవణాంభసః-లవణ సముద్రమునకు, వృద్ధౌ-ఉప్పొంగుటయందును, నదీ ముఖేన, ఏవ-నదీప్రవేశమార్గముద్వారానే, ప్రస్థానం-ప్రయాణము (నిస్సరణము) గదా! అతఁడెంతగానో యభివృద్ధినిఁజెందియున్నను ధన రూప శౌర్య గర్వముల చేత చెడ్డమార్గమునఁ బ్రవర్తింపకుండెను. సముద్ర ముప్పొంగునప్పుడును నదీ ప్రవేశ మార్గములనుండియే బయలునకు వచ్చును. అట్లే అతిథి న్యాయమార్గ మున రాజ్యపాలనముఁజేయు చుండెనని భావము. అలంకారము:దృష్టాంతము.

శ్లో. కామం ప్రకృతివైరాగ్యం సద్యః శమయితుం క్షమః,
యస్య కార్యః ప్రతీకారః స తన్నైవోదపాదయత్. 55

వ్యాఖ్య : ప్రకృతి వైరాగ్యం-దైవికముగా ప్రజలయందుఁగలుగు వైరా గ్యమును లేదా అపరాగమును, సద్యః-వెంటనే, కామం-చక్కఁగా లేక స్వేచ్ఛగా శమయితుం-శమింపఁజేయుటకు, క్షమః-శక్తుఁడైయున్న, సః-ఆరాజు, యస్య-ఏవిరాగమునకు, ప్రతీకారః-ప్రతీకారము, కార్యః-చేయవలసియుండునో, తత్-ఆవిరాగమును, నైవ, ఉదపాదయత్-కలిగింపకయే యుండెను. దైవికములగు వర్షాభావ దారిద్ర్యాదుల వలన బ్రతుకుపై నిరాశ, ప్రభువునందు ప్రేమరాహిత్య మును పొందిన ప్రజలయొక్క అపరాగమును ద్రవ్యదాన కారుణ్యాదులచేత వెంటనే తొలఁగించుటకు శక్తుఁడైనయతఁడు, అట్లు చేయుటకుఁబూనుకొనక, రాజనీతిరహస్యము నెఱిఁగినవాఁడై ఎట్టి యసం తృప్తికి ప్రతీకారముచేయవలసియుండెనో అ యసంతృప్తి ప్రజలకు కలుగ నీయకుండెను. ఉత్పన్న ప్రతీకారముకంటే అనుత్పాదనము మేలుగదా! యన్న భావముతో నట్లు మెలఁగుచుండెను. ప్రజల అననురక్తి విషయమున కౌటిల్యుఁ డర్థశాస్త్రమునం దిట్లు వచించెను. "క్షీణాః ప్రకృతయో లోభం లుబ్ధా యాంతి విరాగతామ్। విరక్తా యాంత్యమిత్రంవా భర్తారం ఘ్నంతివా స్వయమ్" రాజ పోషణములేక క్షీణించిన ప్రజలు లోభ గుణమును పొందుదురు. లుబ్ధులైనవారు విరాగమును పొందుదురు, విరక్తులైన ప్రజలు తమ రాజుయొక్క శత్రువు

నైనను జేరుదురు. లేదా తమ రాజునే చంపుదురు అని శ్లోకార్థము. కావున నీ రహస్యమునెఱిఁగి యతిథి ప్రజానురాగమును గోలుపోక రాజ్యము నేలుచుండెనని భావము.

శ్లో. శక్యేష్వే వాభవత్ యాత్రా తస్య శక్తిమతః సతః,
సమీరణ సహాయోఽపి నాంభః ప్రార్థీ దవానలః, 56

వ్యాఖ్య : శక్తిమతః, సతః-శక్తిసంపన్నుఁడై యుంటున్నను, తస్య-ఆ రాజుయొక్క, శక్యేషు, ఏవ-తన శక్తికి లొంగిపోవు శత్రువుల విషయముననే, యాత్రా-దండయాత్ర, అభవత్-జరుగుచుండెను. సమీరణసహాయః, అపి-వాయువు మిత్రుఁడుగానున్నవాడైనను, దవానలః-అరణ్యాగ్ని, అంభఃప్రార్థీ-కాల్చుటకు జలమును వెదకువాఁడు, న-కాఁడుగదా! దవానలము, తనకువాయువు సహాయుఁడై యున్నను కాల్చుటకు జలమును వెదుకక తృణకాష్ఠాదులనే చూచు కొనునట్లు, శక్తిమంతుఁడై యున్నను అతిథి, తనకంటే తక్కువ బలముగల శత్రువులపైననే దండయాత్రలు సాగించుచుండెననియు, సమానులు, అధికులు నగు రాజులతో సంధిచేసికొనుచుండెననియుభావము. ఇది, "సమజ్యాయోభ్యాం సంద ధీత హీనేన విగృహ్ణీయాత్"-సమానునితోను, గొప్పవానితోను, సంధిచేసికొన వలెను. తక్కువ బలముగలవానితో యుద్ధము చేయవలెను. అని చెప్పిన కౌటిల్య నీతియొక్క అనుసరణము.

శ్లో. న ధర్మ మర్థకామాభ్యాం బబాధే న చ తేన తౌ,
నార్థం కామేన కామం వా సోఽర్థేన సదృశ స్త్రిషు. 57

వ్యాఖ్య : సః-అతఁడు, అర్థకామాభ్యాం-అర్థకామములచేత, ధర్మం-ధర్మమును, నబబాధే-న శింపఁ జే య లే దు. తేనచ-ఆ ధర్మముచేతను, తౌ-ఆయర్థకామములను,న-బాధింపలేదు. అర్థం-అర్థమును, కామేన-కామముచేతను, కామంవా-కామమునుగూడ, అర్థేన-అర్థముచేతను, నబబాధే-బాధింపలేదు. త్రిషు-ధర్మార్థకామములు మూడింటియందును, సదృశః-సమానప్రవృత్తి గలవాఁడ య్యెను. "ధర్మార్థకామాః సమమేవ సేవ్యాః యో హ్యేకస క్తః సనృపో జఘన్యః" అను నీతివచనానుసారముగా ఒక్కపురుషార్థమునందే విశేషముగా ఆసక్తుఁడుకాక, ఒకదానినే మైమరచి సేవింపక, ధర్మార్థకామపురుషార్థములు మూడింటిని శాస్త్ర సమ్మతముగా నారాధించెనని భావము.

శ్లో. హీనా న్యనుపక ర్తౄణి ప్రవృద్ధాని వికుర్వతే,
తేన మధ్యమశక్తీని మిత్రాణి స్థాపితాన్యతః. 58

వ్యాఖ్య : మిత్రాణి-మిత్రులు, హీనాని-మిక్కిలి తక్కువస్థితియందున్న వారైనచో, అనుపకర్తౄణి-ఉపకారము చేయఁజాలరు. ప్రవృద్ధాని-మిక్కిలి యున్నతస్థితియందున్నవారైనచో, వికుర్వతే-విరుద్ధప్రవర్తనులై యపకారమును జేయుదురు. అతః-ఈకారణమువలన, తేన-అతిథిచేత, మధ్యమశక్తీని-అతిక్షీణులు అతిప్రవృద్ధులును కాని మిత్రులు, స్థాపితాని-ఆయాకార్యము లందుంచఁబడిరి. అతిహీనులతోను అత్యున్నతులతోను మైత్రిచేయుట నిరుపయోగముకనుక తనకు సములగు మిత్రులతో మైత్రిచేసి వారినితగినస్థానములందుంచెననిభావము. మిత్ర శబ్దము నపుంసకలింగమైనచో స్నేహితుఁడనియు, పుంలింగమైనచో సూర్యుఁడనియు నర్థములు. "మిత్రంసుహృది మిత్రోఽర్కే" అని విశ్వనిఘంటువు.

శ్లో. పరాత్మనోః పరిచ్ఛిద్య శక్త్యాదీనాం బలాబలమ్,
యయా వేభి ర్బలిష్ఠశ్చే త్పరస్మా దాస్త సోఽన్యథా. 59

వ్యాఖ్య : సః-ఆయతిథి, పరాత్మనోః-శత్రువుయొక్కయు, తనయొక్కయు, శక్త్యాదీనాం-శక్తి దేశకాలములు మొదలయినవాటియొక్క, బలాబలం-బలదౌర్బల్యములను, పరిచ్ఛిద్య-నిర్ణయించి, ఏభిః-ఆశక్త్యాదులచేత, పరస్మాత్ - శత్రువుకంటెను, బలిష్ఠః,చేత్ - తాను ఎక్కువబలముగలవాఁడైయున్నచో, యయౌ - దండయాత్ర చేసెను. అన్యథా - అట్లుగాక శత్రువే మిన్నయైనచో, ఆస్త - నిలిచిపోయెను. "యదా మన్యేత భావేన హృష్టం పుష్టం బలం స్వకమ్, పరస్య విపరీతం చేత్తదా యాయా దరీన్ప్రతి యదాతు స్యాత్ పరిక్షీణో వాహనేన బలేనచ తదాసీత ప్రయత్నేన శనకైః సాంత్వయన్నరీన్" అని మనువు చెప్పినమార్గము ననుసరించి తనబలము సంతోషముతో దృఢముగానుండి శత్రువు తగ్గుదశలోనున్నప్పుడు యుద్ధము చేయుచును, తానే తక్కువ దశలో నున్నట్లు తోచినప్పుడు బలిష్ఠుడైన శత్రువును మంచి మాటలతో ననుకూలపరచుచు స్వస్థానమునుండి కదలకయు రాజ్యమును నిర్వహించెనని భావము. ఈ శ్లోకము ౫౮ వ శ్లోకమునకు భూషణ ప్రాయము.

శ్లో. కోశేనాశ్రయణీయత్వ మితి తస్యార్థసంగ్రహః,
అంబుగర్భో హి జీమూత శ్చాతకై రభినంద్యతే. 60

వ్యాఖ్య : కోశేన-ధనమును గూర్చుటచేత, ఆశ్రయణీయత్వం-ఉపజీవి జనముచేత ఆశ్రయింపఁదగియుండుట, (భవతి-జరుగును) ఇతి-ఇట్లని, తస్య-అతనియొక్క, అర్థసంగ్రహః-ధనమును జేర్చియుంచుట. అంబుగర్భః-జలము గర్భమునందుగల, జీమూతః-మేఘము, చాతకైః-చాతక పక్షులచేత, అభినంద్యతే, హి-మెచ్చుకొనఁబడుచున్నదిగదా (సేవింపఁబడుచున్నదిగదా). "ధర్మహేతో స్తథార్థాయ భృత్యానాం రక్షణాయచ ఆపదర్థంచ సంరక్ష్యః కోశో ధర్మవతా సదా"-ధర్మాచరణము కొఱకును, అర్థసంపదను పెంచుటకొఱకును, భృత్యుల రక్షణముకొఱకును, ఆపదలు నివారించుట కొఱకును, ధర్మాత్ముఁడగురాజుచేత ధనాగారము రక్షింపఁదగియుండును. అను కామందక నీతి వచనానుసారముగను, లోకమున జలగర్భములైన మేఘములనే చాతకములు సేవించుచుండునను దృష్టాంతము నెఱిఁగియున్నందునను, బహుజనాశ్రయణీయత్వమును బొందుటకే యతఁడు కోశమును పెంచుచుండెనుగాని లోభముచేత మాత్రము కాదని భావము.

శ్లో. పరకర్మాపహః సోఽభూ దుద్యతః స్వేషు కర్మసు,
ఆవృణో దాత్మనో రంధ్రం రంధ్రేషు ప్రహర న్రిపూన్. 61

వ్యాఖ్య: సః-అతడు, పరకర్మాపహః—పర-శత్రువులయొక్క, కర్మ-సేతునిర్మాణ వార్తాప్రచారాది కర్మలను, అపహః-నశింపఁజేయువాఁడగుచు స్వేషు-తనవియగు, కర్మసు-నిర్మాణకర్మలయందు, ఉద్యతః-ఉద్యుక్తుఁడు, అభూత్-అయ్యెను. రిపూన్-శత్రువులను, రంధ్రేషు-వారి కష్ట సమయముల యందు, ప్రహరన్-కొట్టుచు, ఆత్మనః-తనయొక్క, రంధ్రం-వ్యసనాదికమును ఆవృణోత్-దాచియుంచెను. "నాస్యచ్ఛిద్రం పరో విద్యా ద్విద్యాచ్ఛిద్రం పరస్యతు। గూహేత్కూర్మ ఇవాంగాని రక్షేద్వివర మాత్మనః" అని చెప్పిన మనువు వచనము ననుసరించి తన లోపముల నెఱుకపడనీయక, పరులను వారి కష్టసమయములందు జయించుచు, వారి యభివృద్ధికి నాటంకముల సృజించుచు తన దేశపు నిర్మాణకార్యక్రమములను సాగించుచుండెను.

శ్లో. పిత్రా సంవర్ధితో నిత్యం కృతాస్త్రః సాంపరాయికః,
తస్య దండవతో దండః స్వదేహాన్న వ్యశిష్యత. 62

వ్యాఖ్య : దండవతః-దమనము నెఱిఁగిన లేదా మంచిమూల బలముగల వాఁడైన, తస్య-ఆ రాజునకు, పిత్రా-తండ్రిచేత, నిత్యం-ప్రతిరోజును, సంవర్ధితః-పోషింపఁబడినదియు, కృతాస్త్రః-నేర్పఁబడిన యస్త్రప్రయోగములుగలదియు, సాంపరాయికః-యుద్ధమునం దుపయోగించునదియు నగు, దండః-సైన్యము,స్వదేహాత్-తన శరీరము కంటే, న, వ్యశిష్యత-భిన్నముగా లేకుండెను. తండ్రియైన కుశునిచేత తానెట్లు నిత్యసంవర్ధితుఁడై, కృతాస్త్రుఁడై, సాంపరాయికుఁడై యుండునట్లు పెంచఁబడెనో, అట్లే నిత్యమును పోషించి, అస్త్రప్రయోగములునేర్పి, యుద్ధమున కర్హమగునట్లు చేయఁబడిన మూలబలమును అతిథి తనదేహమునువలె కాపాడుకొనుచుండెనని భావము. "యుద్ధాయత్యోః సంపరాయః" అని యమరము. "దండో యమే మానభేదే లగుడే దమసైన్యయోః" అని విశ్వనిఘంటువు.

శ్లో. సర్పస్యేవ శిరోరత్నం నాస్య శక్తిత్రయం పరః,
స చకర్ష పరస్మాత్తు దయస్కాంత ఇవాయసమ్. 63

వ్యాఖ్య : సర్పస్య-పాముయొక్క, శిరోరత్నం, ఇవ-తలపైనున్న రత్నమునువలె, అస -ఈరాజుయొక్క, శక్తిత్రయం-శక్తిత్రయమును, పరః-శత్రువు, న చ ´ -లాగలేకపోయెను. సః-అతఁడుమాత్రము, పరస్మాత్-శత్రువునుండి, త -ఆ శక్తి త్రయమును, అయస్కాంతః - సూదంటుఱాయి, ఆ య స ం, ఇవ - ఇనుప ముక్కనువలె, చకర్ష - లాగివేసెను. సర్పము తలపైనున్న మణిని యె వ్వ డు ను లాగలేనట్లు, అతనికిఁగల శక్తిత్రయమును, అనఁగా ప్రభుశక్తి, మంత్రశక్తి, ఉత్సాహశక్తి అనువానిలో దేనినిగూడ భగ్నపరుపలేకపోయెననియు నతఁడుమాత్రమా శక్తిత్రయమును శత్రువునుండి అయస్కాంతము ఇనుపముక్కనువలె లాగివేసెననియు భావము. అతనిముందు శత్రువులు శక్తిహీనులైరని యర్థము: ఉపమాలంకారము.

శ్లో. వాపీష్వివ స్రవంతీషు, వనేషూపవనేష్వివ,
సార్థాః స్వైరం స్వకీయేషు చేరు ర్వేశ్మస్వివాద్రిషు. 64

వ్యాఖ్య : స్రవంతీషు-నదులయందు, వాపీషు, ఇవ-దిగుడుబావుల యందువలెను, వనేషు-అరణ్యములయందు, ఉపవనేషు, ఇవ-ఉద్యానవనములందు వలెను, అద్రిషు-పర్వతములయందు, స్వకియేషు, వేశ్మసు, ఇవ-స్వంతములైన యిండ్లయందువలెను, సార్థాః-వైశ్యులుమొదలగు వర్తకులు, స్వైరం-స్వేచ్ఛగా, చేరుః-తిరుగుచుండిరి. అతని రాజ్యమునందు వాణిజ్యమును జేయువారు నదీ వన పర్వత ప్రాంతములందు దొంగలభయముగాని క్రూరమృగముల భయముగాని లేక స్వేచ్ఛగా తమ గృహములందువలెఁ దిరుగుచు వాణిజ్యమును సాగించుచుండి రని భావము.

శ్లో. తపో రక్షన్ స విఘ్నేభ్య స్తస్కరేభ్యశ్చ సంపదః,
యథాస్వ మాశ్రమై శ్చక్రే వర్ణైరపి షడంశభాక్. 65

వ్యాఖ్య : విఘ్నేభ్యః-విఘ్నములనుండి, తపః-తపస్సును, రక్షన్-రక్షించుచున్నవాఁడును, తస్కరేభ్యః-దొంగలనుండి, సంపదః, చ-సంపదలను సైతము, రక్షన్-రక్షించుచున్నవాఁడును నగు, సః-అతిథి, ఆశ్రమైః-బ్రహ్మ చర్యాద్యాశ్రమముల ద్వారాను, వర్ణైః, అపి-బ్రాహ్మణాదివర్ణముల ద్వారాను, యథాస్వం-వారివారి యాదాయము నతిక్రమింపక, షడంశభాక్-ఆఱవభాగమును పన్నుగాఁబొందువానినిగా, చక్రే-చేసికొనెను. బ్రాహ్మణాదివర్ణములాచరించు తపస్సులకు విఘ్నములు వాటిల్లనీయక, వైశ్యాదుల సంపదలకు దొంగలభయ మును బాపి, వారు వారార్జించిన ధనతపోరాసుల ప్రమాణమునకు దగిన యాఱవభాగములను పన్నుగా గ్రహించుచుండెను. అట్లు రక్షణముచేయగల్గి నప్పుడే రాజు పన్నులను దీసికొనుట కర్హుఁడగునని భావము.

శ్లో. ఖనిభిః సుషువే రత్నం క్షేత్రైః సస్యం వనై ర్గజాన్,
దిదేశ వేతనం తస్మై రక్షాసదృశ మేవ భూః. 66

వ్యాఖ్య : భూః-భూదేవి, తస్మై-అతని కొఱకు, రక్షాసదృశం, ఏవ-రక్షణకు తగినట్లుగానే, వేతనం-భృతిని, దిదేశ-ఇచ్చెను. (కథం-ఎట్లనగా)

ఖనిభిః-గనుల ద్వారా, రత్నం-మాణిక్యాది రత్నములను (జాత్యేక వచనము), క్షేత్రైః-పొలములద్వారా, సస్యం-పైరును, వనైః-అరణ్యములద్వారా, గజాన్-ఏనుగులను, సుషువే-కనెను. అతడు భూపరిపాలనమును చక్కగా చేయుచుండుటచేత భూదేవి సంతసించి యతనికి దగిన వేతనముగా గనులనుండి రత్నాలను క్షేత్రములనుండి పైరు పంటలను, వనములనుండి గజములను సమృద్ధిగా నిచ్చుచుండెను.

శ్లో. స గుణానాం బలానాంచ షణ్ణాం షణ్ముఖవిక్రమః,
బభూవ వినియోగజ్ఞః సాధనీయేషు వస్తుషు. 67

వ్యాఖ్య : షణ్ముఖవిక్రమః-కుమారస్వామియొక్క పరాక్రమమువంటి పరాక్రమముగల, సః-ఆరాజు, షణ్ణాం-ఆరైన, గుణానాం-సంధివిగ్రహాది గుణములయొక్కయు, బలానాం, చ-మూలభృత్యాది బలములయొక్కయు, సాధనీయేషు-తాను సాధింపదగినట్టి, వస్తుషు-అర్థములయందు, వినియోగజ్ఞః-ఉపయోగింపవలసిన పద్ధతి నెఱిగినవాడు, బభూవ-అయియుండెను. 1. సంధి (పరరాజుతోనేకీభవించుట), 2. విగ్రహము (శత్రుమండలముతో యుద్ధము చేయుట), 3. యానము (తాను ఎకువ బలవంతుడుగానో లేక శత్రువునకు ఛిద్రము కలిగియున్నప్పుడో యు ముసకు గదలిపోవుట), 4. ఆసనము (దేశకాలముల ననుసరించి దుర్గములం చేరి కదలకుండుట), 5. ద్వైధీభావము (తనపై కిద్దఱు శత్రువులు వచ్చినప్పుడు, ఒకనితో మైత్రి సికొని రెండవ వానితో విరోధించుట) 6. సమాశ్రయము (తాను శక్తిహీనుడ నప్పుడు బలవంతుడగువాని నాశ్రయించుట) అనుషడ్గుణములయొక్కయు, ధబల, గజబల, అశ్వబల, పదాతిబల, మూలబల, కోశబలములనబడు షడ్బలములయొక్కయు వినియోగమెట్లు చేయవలెనో యెఱిగి సాధింపదగిన ప్రయోజనముల నారాజు సాధించుచుండెనని భావము.

శ్లో. ఇతి క్రమాత్ ప్రయుంజానో రాజనీతిం చతుర్విధామ్,
ఆతీర్థా దప్రతీఘాతం స తస్యాః ఫల మానశే. 68

వ్యాఖ్య ; ఇతి-ఇట్లు, చతుర్విధాం-సామాద్యుపాయములచే నాల్గువిధములైన, రాజనీతిం-దండనీతిని, క్రమాత్-సామ, దాన, భేద దండముల క్రమము వలననే, ప్రయుంజానః-ప్రయోగించుచున్న, సః-అతడు, ఆతీర్థాత్-మంత్రి

మొదలయిన అష్టాదశ సహాయపురుషులనుండి, తస్యాః-ఆరాజనీతియొక్క, ఫలం-ఫలితమును, అప్రతిఘాతం-అప్రతిబంధముగా, ఆనశే-పొందెను. తన చతుర్విధరాజనీతిని మొదట సామము, తరువాత దానము, పిమ్మటభేదము, ఆ పిమ్మట దండము అనువరుసలోనే మంత్రి మొదలగు తీర్థములయందు (సహాయులపైన) ఎవరికిఁదగినయుపాయమును వారిపై ప్రయోగించుచు దానికిఁదగిన సత్ఫలితములను పొందెనని భావము. "యోసౌ జలావతారేచ మంత్ర్యాద్యష్టాదశస్వపి పుణ్యక్షేత్రే తథాపాత్రే తీర్థం స్యాత్" అని హలాయుధ నిఘంటువు తీర్థశబ్దమునకు ఇ ములు చెప్పినది. తీర్థశబ్దమునకు రాజులు సుస్థిరపరిపాలనమునకై యేర్పరచుకొ అధికారివర్గమని యర్థము. వారు మంత్ర్యాద్యష్టాదశ సంఖ్యాకులు: మంత్రులు, పురోహితులు, యువరాజు, సేనాపతి, దౌవారికులు, అంతర్వేశికులు, కారాగారాధికారులు, కోశాధ్యక్షులు, కార్యనియోజకులు, ప్రాడ్వివాకులు, సేనానాయకులు, నగరాధ్యక్షులు, కర్మాంతికులు, సభాధికృతులు, ధర్మాధికారులు, దండపాలురు (పోలీసులు), దుర్గపాలురు, రాష్ట్రాంత పాలకులు. అని పదునెనిమిది విధములు. వీరందఱును అతనికి లొంగియుండిరని తాత్పర్యము.

శ్లో. కూటయుద్ధవిధిజ్ఞేఽపి తస్మిన్ సన్మార్గయోధిని,
భేజేఽభిసారికావృత్తిం జయశ్రీర్వీరగామినీ. ౬౯

వ్యాఖ్య: కూటయుద్ధ విధిజ్ఞే, అపి-కపట యుద్ధముయొక్క విధానమును ఎఱిఁగియున్నవాఁడైనను, సన్మార్గయోధిని-ధర్మపద్ధతియందు యుద్ధము చేయునట్టి, తస్మిన్-ఆయతిథి విషయమున, వీరగామినీ-వీరులనుజేరు స్వభావముగల, జయశ్రీః-జయలక్ష్మి, అభిసారికావృత్తిం-అభిసారికానాయికయొక్క పద్ధతిని, భేజే-అవలంబించెను. అనేకవిధములగు కపటోపాయములతో యుద్ధమునుజేయు రీతుల నెఱిఁగినవాఁడైనను ధర్మమును విడువక చక్కనిమార్గమున యుద్ధముఁజేయుచుండిన యారాజును వీరులవద్దకే చేరునట్టి జయలక్ష్మి అభిసారికవలె వెదకికొని వచ్చి ఛేరెననియు, సర్వత్ర జయ మతనిదేయనియు భావము. "కాంతార్థినీతు యా యాతి సంకేతం సాభిసారికా" అని అభిసారికా లక్షణము.

శ్లో. ప్రాయః ప్రతాపభగ్నత్వా దరీణాం తస్య దుర్లభః,
రణో గంధద్విపస్యేవ గంధభిన్నాన్యదంతినః. 70

వ్యాఖ్య : అరీణాం-శత్రువులందఱును, ప్రతాపభిన్నత్వాత్ - అతని ప్రతాపముచేతనే చెదిరిపోయియుండుటవలన, తస్య-అతిథికి, గంధభిన్నాన్య దంతినః—గంధ-తన మదవాసనచేతనే, భిన్న-పారిపోయిన, అన్యదంతినః-ఇతర గజములుగల, గంధద్విపస్య, ఇవ-మదపుటేనుఁగునకువలె, ప్రాయః-సాధారణముగా, రణః-యుద్ధము, దుర్లభః-లభింపనిదై యుండెను. మదపు టేనుఁగుయొక్క మదవాసనచేతనే దూరము పాఱిపోవు సామాన్య గజములుగల గంధగజమునకువలె, తన ప్రతాపముచేతనే భగ్నులగుచున్న శత్రుసమూహము గల అతిథికి యుద్ధమే దుర్లభముగా నుండెను. అనఁగా నతఁ డంత ప్రతాపవంతుఁడై యుండెననియు, వైరులు అతనితో యుద్ధమునకు దిగకుండిరనియు భావము.

శ్లో. ప్రవృద్ధౌ హీయతే చంద్రః సముద్రోఽపి తథావిధః,

స తు తత్సమవృద్ధిశ్చ న చాభూత్తావివ క్షయీ. 71

వ్యాఖ్య : ప్రవృద్ధౌ (సత్యాం)-అభివృద్ధి పూర్తికాగానే, చంద్రః-చంద్రుఁడు, హీయతే-తగ్గిపోవును, సముద్రః, అపి-సముద్రుఁడుగూడ, తథా విధః-అట్టివాఁడే, సః, తు-ఆరాజన్ననో, తత్సమవృద్ధిశ్చ-ఆచంద్ర సముద్రుల వృద్ధివంటి యభివృద్ధిగలవాఁడయ్యెను, తావివ (తౌ + ఇవ) - వారిద్దరివలె, క్షయీ-నశించువాఁడుమాత్రము నచాభూత్-కాలేదు. అత్యంతమైన అభివృద్ధి జరిగిన పిమ్మట చంద్రుఁడును, సముద్రుఁడును తగ్గిపోవుదురు. అతిథి వారివలె పూర్ణవృద్ధిని మాత్రము పొందెనుగాని, వారివలె మరల తగ్గిపోలేదు. వృద్ధితప్ప నతనికి క్షయము లేకుండెనని భావము. వ్యతిరేకాలంకారము గమ్యము.

శ్లో. సంత స్తస్యాభిగమనా దత్యర్థం మహతః కృశాః,

ఉదధే రివ జీమూతాః ప్రాపు ర్దాతృత్వ మర్థినః. 72

వ్యాఖ్య : అత్యర్థం-మిక్కిలి, కృశాః-దరిద్రులై, అర్థినః-యాచకులైన, సంతః-విద్వాంసులు, మహతః-గొప్పవాఁడైన, తస్య- ఆ రాజుయొక్క, అభిగమనాత్ - సన్నిధిని జేరుటవలన, ఉదధేః - సముద్రముయొక్క, అభిగమనాత్ - సమీపమునకు వెళ్ళుటవలన, జీమూతాః, ఇవ - మేఘములువలె, దాతృత్వం - దానము చేయగల్గుటను, ప్రాపుః-పొందిరి.

మిక్కిలి దరిద్రులై యుండుటచేత యాచకులుగా మారిన విద్వాంసులు ఆరాజు నాశ్రయించుటవలన, సముద్రము నాశ్రయించిన మేఘములు మొదట కృశించి యున్నను సముద్రోదకలబ్ధిచేత దాతృత్వమును పొందినట్లు, తాము ఇతరులకు దానముఁజేయఁగలవారుగా మారిరి. అనఁగా నారాజు విద్వాంసులకు దానమునకును, భోగమునకును, సరిపోవునంతటి ధనము నిచ్చుచుండెనని భావము.

శ్లో. స్తూయమానః స జిహ్రాయ స్తుత్య మేవ సమాచరన్,
తథాపి వవృధే తస్య తత్కారిద్వేషిణో యశః. 73

వ్యాఖ్య : సః-ఆరాజు, స్తుత్యం, ఏవ-స్తోత్రముచేయఁదగిన కారజాతమునే, సమాచరన్-చేయుచున్నవాఁ డగుచున్నందున, స్తూయమానః-స్తోత్రముచేయఁబడుచున్నవాఁడగుచు, జిహ్రాయ-సిగ్గుపడెను. తథాపి-అట్లుసిగ్గుపడువాఁడైనను, తత్కారిద్వేషిణః—తత్-ఆస్తోత్రములను, కారి-చేయుచున్నవారిని, ద్వేషిణః-అసహ్యించుకొనుచున్న, తస్య-ఆయతిథియొక్క, యశః-కీర్తి, వవృధే-వృద్ధినిఁజెందెను. అతిథి ప్రజలకు మేలుకలిగించు మంచిపనుల నెన్నిఁటినో చేయుచుండెను. కాని యాపనులను పురస్కరించుకొని తన నితరులు స్తోత్రముచేయునప్పుడు సిగ్గుపడుచుండెను. అట్లు సిగ్గుపడుచు స్తోత్రములుచేయువారిని అసహ్యించుకొనుచున్నను అతనికీర్తి వృద్ధిచెంది దిక్కులకు వ్యాపించెను. గుణాఢ్యునికి తనస్తుతియందు లజ్జకలుగుటయే భూషణమనియు, మంచిపనులు చేయుటవలన కీర్తివచ్చునుగాని "మంచివాఁడు, గొప్పవాఁడు" అని పొగడించుకొనుటవలన రాదనియు భావము..

శ్లో. దురితం దర్శనేన ఘ్నన్ తత్త్వార్థేన నుదన్ తమః,
ప్రజాః స్వతంత్రయాంచక్రే శశ్వ త్సూర్య ఇవోదితః. 74

వ్యాఖ్య : సః-అతఁడు, ఉదితః-ఉదయించిన. సూర్యః, ఇవ-సూర్యుఁడువలె, దర్శనేన-తనను జూచుటచేత, దురితం-పాపమును, ఘ్నన్-నశింపఁజేయుచున్నవాఁడగుచు, తత్త్వార్థేన - వస్తుతత్త్వముయొక్క సమ నముచేత, తమః-అజ్ఞానమును (చీకటిని), నుదన్-తొలఁగించుచును, శశ్వత్-నిరంతరము, ప్రజాః-జనులను, స్వతంత్రయాంచక్రే - స్వాధీలనుగాఁ జేసికొనెను. అభ్యుదయమును పొందిన అతిథి, ఉదయించిన

సూర్యునివలె, తన దర్శనముచేత పాపమును తొలగించుచు, యాథార్థవస్తు ప్రకటనముచేత అజ్ఞానాంధకారమును నివర్తించుచు, నిత్యము ప్రజలను స్వాతంత్ర్య విలసితులను జేయుచుండెను. సూర్యదర్శనమువలెనే రాజ దర్శనము పాపమును తొలఁగించునని పసువు చెప్పెను. "అగ్నిచిత్కపిలా సత్రీ రాజా భిక్షు ర్మహోదధిః। దృష్టమాత్రా పునంత్యేతే తస్మాత్పశ్యేత నిత్యశః" సూర్యుఁడంధకారమును తొలఁగించి సర్వవస్తువులు గోచరము చేయుచున్నట్లతఁడును సత్యములను బ్రకటించుచు ప్రజలయజ్ఞానమును తొలఁగించి వారిని స్వాధీనపరముకొనుచుండె నని భావము.

శ్లో. ఇందో రగతయః పద్మే సూర్యస్య కుముదేఽంశవః,
గుణా స్తస్య విపక్షేఽపి గుణినో లేభిరేఽంతరమ్. 75

వ్యాఖ్య : ఇందోః-చంద్రునియొక్క, అంశవః-కిరణములు, పద్మే-కమలమునందు, అగతయః-ప్రవేశములేనివి. సూర్యస్య-సూర్యునియొక్క, అంశవః-కిరణములు, కుముదే-కలువయందు, అగతయః-ప్రవేశములేనివి. గుణినః-గుణవంతుఁడగు, తస్య-అతనియొక్క, గుణాః-సద్గుణములైతే, విపక్షే, అపి-శత్రువునందును, అంతరం-ప్రవేశావకాశమును లేభిరే-పొందినవి. చంద్రకిరణములు శత్రువైన పద్మమునందు ప్రవేశించవు, అట్లే సూర్యకిరణములు కలువయందుఁ బ్రవేశింపవు. కాని యతని సద్గుణములు శత్రువునందును బ్రవేశించును అనఁగా నారాజు శత్రువులకును అపకారము చేయకుండెననియు, శత్రువులును అతనిని పొగడుచుండిరనియు భావము.

శ్లో. పరాభిసంధానపరం యద్యప్యస్య విచేష్టితమ్,
జిగీషో రశ్వమేధాయ ధర్మ్య మేవ బభూవ తత్. 76

వ్యాఖ్య : అశ్వమేధాయ-అశ్వమేధయాగము కొఱకు. జిగీషోః-శత్రువులను జయింపఁదలచిన, అస్య-అతిథియొక్క, విచేష్టితం-దిగ్విజయరూపమగు కృత్యము, యద్యపి-విచారింపగా, పరాభిసంధానపరం—పర-శత్రువులయొక్క, అభిసంధానపరం-వంచనాప్రధానమే, తథాపి-అట్లయ్యును. తత్-అది, ధర్మ్యం, ఏవ-ధర్మయుక్తమే, బభూవ-అయియుండెను. అశ్వమేధయాగాంగముగా దిగ్వి

జయమును జేయఁదలచిన యతని ప్రవర్తనము ఆలోచింపగా శత్రువంచనమే. కాని అదియును ధర్మమునకు దూరముగాలేకుండెను. అనఁగాఁ దనసర్వాధిక్యమును పరరాజులచేత అంగీకరింపఁజేయు ప్రయత్నమేకాని వారి సంపదలు కొల్లగొట్టి వారికి కష్టములు గలిగించుట లేకుండెను. "మంత్రప్రభావోత్సాహశక్తిభిః పరాన్ సందధ్యాత్" అను కౌటిల్యార్థశాస్త్ర వచనానుసరణమేకాని శత్రువినాశముఁ జేయదలంపలేదని భావము.

శ్లో. ఏవ ముద్యన్ ప్రభావేణ శాస్త్రనిర్దిష్టవర్త్మనా,
వృషేవ దేవో దేవానాం రాజ్ఞాం రాజా బభూవ సః. 77

వ్యాఖ్య : ఏవం-ఇట్లు, శాస్త్రనిర్దిష్టవర్త్మనా-శాస్త్రముచేత ఉపదేశింపఁబడిన పద్ధతిగల, ప్రభావేణ-కోశదండములవలనఁ గలిగిన తేజస్సుచేత, ఉద్యన్-అభివృద్ధినిఁబెందుచున్న, సః-ఆయతిథి, వృషా-ఇంద్రుఁడు, దేవానాం-దేవతలకు, దేవః, ఇవ-దేవుఁడువలె, రాజ్ఞాం-రాజులకు, రాజా-రాజు, బభూవ-అయ్యెను. పూర్వోక్తరీతిగా అతఁడు శాస్త్రముపదేశించిన మా మును తప్పని ప్రభావముచేత నభ్యున్నతిని,ఁ బెందుచు ఇంద్రుఁడు దేవదేవుఁ నట్లు తాను రాజరాజు (సార్వభౌముఁడు) అయ్యెననిభావము. "స ప్రతాపః ప్రభావశ్చ యత్తేజః కోశదండజమ్" అనియమరము. కోశము, రాజ్యపాలనపద్ధతి, పెరుగుటయే తేజము, ప్రభావము, ప్రతాపము అనఁబడునని యర్థము.

శ్లో. పంచమం లోకపాలానా మూచుః సాధర్మ్యయోగతః,
భూతానాం మహతాం షష్ఠ మష్టమం కులభూభృతామ్. 78

వ్యాఖ్య : తం-అతనిని, సాధర్మ్యయోగతః-సమానధర్మసంబంధము వలన (వరుసగా లోకసంరక్షణ, పరోపకార, భూభరణరూపములగు సమానగుణముల పోలికవలన అని యర్థము), లోకపాలానాం-లోకపాలురైన ఇంద్ర, యమ, వరుణ, కుబేరులకు, పంచమం-అయిదవవానినిగను, మహతాం-గొప్పవిగు, భూతానాం-పృథివి, జలము, తేజస్సు, వాయువు, ఆకాశము, అనఁబడు పంచభూతములకు, షష్ఠం-ఆఱవవానినిగాను, కులభూభృతాం-మహేంద్రము, మలయము, సహ్యము, శుక్తిమంతము, ఋక్షపర్వతము, వింధ్యము, పారియాత్రము, అను సప్తకులపర్వతములకు, అష్టమం-ఎనిమిదవవానినిగను, ఊచుః-

పెద్దలు చెప్పిరి యనియర్థము. అతిథి, యింద్రాదులవలె లోకసంరక్షణము చేయుచు, పంచభూతములవలె పరోపకారమునుజేయుచు, కులపర్వతములవలె భూభారమును వహించుచు రాజ్యపాలనముఁజేయుచుండెనని భావము.

శ్లో. దూరాపవర్జితచ్ఛత్రై స్తస్యాజ్ఞాం శాసనార్పితామ్
దధుః శిరోభి ర్భూపాలా దేవాః పౌరందరీ మివ. 79

వ్యాఖ్య: భూపాలాః-రాజులందఱును, శాసనార్పితాం—శాసన-అధికారపత్రములందు, అర్పితాం-ఉంచఁబడిన(చెప్పఁబడిన), తస్య-అతనియొక్క, ఆజ్ఞాం-ఆజ్ఞను, దేవాః-దేవతలు, పౌరందరీం, ఇవ-ఇంద్రునియాజ్ఞనువలె, దూరాపవర్జితచ్ఛత్రైః-దూరమునఁబాఱవేయఁబడిన ఛత్రములుగల, శిరోభిః-శిరస్సులచేత, దధుః-ధరించిరి. దేవతలు ఇంద్రునియాజ్ఞను తలధరించినట్లు, అతఁడు శాసనపత్రములందు చేసిన యానతని రాజులందఱును శిరసావహించిరి. 'దూరాపవర్జితచ్ఛ ః' అనుటవలన రాజులందఱును తమతమ ఆతపత్రములను దూరముపె అతిథియొక్క యేకచ్ఛత్రాధిపత్యము నంగీకరించి యతనిశాసనానువర్తు యుండిరని భావము. "పురందరస్య ఇయం పౌరందరీ" అని విగ్రహము.

శ్లో. ఋత్విజః స తథానర్చ దక్షిణాభి ర్మహాక్రతౌ
యథా సాధారణీభూతం నామాస్య ధనదస్య చ. 80

వ్యాఖ్య: సః-ఆరాజు, మహాక్రతౌ-అశ్వమేధయాగమునందు, ఋత్విజః-యజ్ఞముచేయించినవారిని, దక్షిణాభిః-దక్షిణలచేత, తథా-ఆవిధముగా, ఆనర్చ-పూజించెను. యథా-ఏవిధముగా, అస్య-ఈ రాజుయొక్కయు, ధనదస్య, చ-కుబేరునియొక్కయును, నామ-పేరు, సాధారణీభూతం-సమానమైనదో (ఏకీభవించినదో). అశ్వమేధ యాగమునందు పౌరోహిత్యమును నెఱపిన ఋత్విజులకు ఆ రాజు భూరిదక్షిణలిచ్చి సత్కరించెను. అట్లు బహుళధనము నిచ్చుట వలన నతనిని జనులు "ధనదుఁడు, ధనదుఁడు" అని పొగడుటచేత "ధనద" నామధేయ మతనికిని కుబేరునికిని ఒకటిగానె మారినదని భావము. కుబేరుని పేరైనప్పుడు "ధనద" శబ్దమునకు "ధనం దయతే-రక్షతి ఇతి ధనదః" అనియు, అతిథి పేరైనప్పుడు "ధనం దదాతి ఇతి ధనదః" అనియు వ్యుత్పత్తులు గమ

నింపవలెనని చారిత్రవర్ధనుఁడను రఘువంశ వ్యాఖ్యాత వ్రాసినది మిక్కిలి సమంజసముగా నున్నది.

శ్లో. ఇంద్రా ద్వృష్టి ర్నియమిత గదో ద్రేకవృత్తి ర్యమోఽభూ
ద్యాదోనాథః శివజలపథః కర్మణే నౌచరాణామ్,
పూర్వాపేక్షీ తదను విదధే కోశవృద్ధిం కుబేర
స్తస్మిన్ దండోపనతచరితం భేజిరే లోకపాలాః. 81

వ్యాఖ్య : ఇంద్రాత్-ఇంద్రునివలన, వృష్టిః-వర్షము, అభూత్-కురిసెను. యమః-యమధర్మరాజు, నియమితగదోద్రేకవృత్తిః— నియమిత - ఆపివేయ బడిన, గద-రోగములయొక్క, ఉద్రేక-అతిశయమునందలి, వృత్తిః-వ్యాపారము గలవాఁడు అభూత్-అయ్యెను. యాదోనాథః- జలజంతువుల కధిపతియగు వరుణుఁడు, నౌచరాణాం-ఓడలయందు తిరుగువారియొక్క, కర్మణే-సంచారము కొఱకు, శివజలపథః-భద్రతగల జలమార్గము తేర్పరచినవాఁడు, అభూత్-అయ్యెను. తదను-వారిననుసరించి, పూర్వాపేక్షీ-పూర్వులగు రఘువు, రాముఁడు మొదలగువారియందు భక్తిగల, కుబేరః-కుబేరుఁడు, కోశవృద్ధిం-ధనసంచయాభి వృద్ధిని, విదధే-చేసెను. (ఇత్థం-ఇట్లు) లోకపాలాః-లోకపాలురైన యింద్రా దులు, తస్మిన్-ఆ రాజు విషయమున, దండోపనతచరితం—దండోపనత-శరణా గతునియొక్క, చరితం-నడవడిని, భేజిరే-పొందిరి. "దుర్బలో బలవత్సేవీ విరుద్ధా చ్ఛంకితాదిభిః, వర్తేత దండోపనతో భర్తర్యేవ మవస్థితః" అను కౌటిల్య నీతి ననుసరించి దుర్బలుఁడైనరాజు బలవంతుని సేవించునట్లు దండోపనతులైన దిక్పాలురలో ఇంద్రుఁడు వర్షములు గురిపించుచును, యముఁడు ప్రజలకు రోగ బాధను తగ్గించుచును, కుబేరుఁడు రాజునకు ధనరాసులు గూర్చుచును అతిథి యొక్క రాజ్యపాలనమున తమంతటతామే సహాయపడుచు వశవర్తులై యుండి రని భావము.

ఇది మహాకవి కాళిదాస కృత రఘువంశ
కావ్యమునందలి అతిథివర్ణనమను సప్తదశసర్గకు
కేశవపంతుల నరసింహశాస్త్రి
రచిత తెలుఁగు లఘు
వ్యాఖ్య.

## మహాకవి కాళిదాస కృత

# రఘువంశము

## అష్టాదశసర్గము

శ్లో. స నైషధస్యార్థపతేః సుతాయా
ముత్పాదయామాన నిషిద్ధశత్రుం,
అనూనసారం నిషధా న్నగేంద్రాత్
పుత్రం య మాహు ర్నిషధాఖ్య మేవ. 1

వ్యాఖ్య : నిషిద్ధశత్రుః-నివారింపఁబడిన శత్రువులుగల, సః-అయతిథి రాజు, నైషధస్య-నిషధదేశమున కధిపతియగు, అర్థపతేః-అర్థపతి యను పేరుగల రాజుయొక్క, సుతాయాం-కుమార్తెయందు, నిషధాత్, నగేంద్రాత్-నిషధమను పేరుగల పర్వతరాజముకంటే, అనూనసారం-తక్కువకాని బలముగల, పుత్రం-కుమారుని, ఉత్పాదయామాస-కనెను. యం-ఏ కుమారుని, నిషధాఖ్యం, ఏవ-నిషధుఁడు అను పేరు గలవానినిగానే, ఆహుః-అందఱును పిలిచిరో. వీరుఁడైన యతిథి నిషధదేశాధిపతియగు అర్థపతి కూతురును వివాహమాడి యామెయందు నిషధుఁడను కుమారుని గనెనని భావము. "నిషధ" పర్వతము, మేరువునకు పూర్వదక్షిణభాగములందున్న పర్వత శ్రేణియనియు, నిషధదేశ రాజధాని మొదట ఆ ప్రాంతమునందున్న "అలకాపట్టణ" మనియు, నలునికాలమున వారు భారతదేశపుమధ్య భాగమునకు వచ్చిరనియు పాశ్చాత్యవిమర్శకులయభిప్రాయము. "నైషధస్య" కురునాదిభ్యోణ్యః అనుపాణిని సూత్రముచేత నైషధ్యః" అని కావలసియున్నను, శేషవివక్షయందు "నైషధః" అను అణ్ ప్రత్యయాంత రూపము సాధువే యనివ్యాకర్తలు నిర్ణయించిరి.

శ్లో. తేనోరువీర్యేణ పితా ప్రజాయై
కల్పిష్యమాణేన ననంద యూనా,
సువృష్టియోగాదివ జీవలోకః
సస్యేన సంపత్తిఫలోన్ముఖేన. 2

వ్యాఖ్య : ఉరువీర్యేణ-గొప్పపరాక్రమముగల వాఁడగుటచేత, ప్రజాయై-ప్రజారక్షణము కొఱకు, కల్పిష్యమాణేన-సమర్థుఁడు కాఁగలవాడగు, తేన, యూనా-ఆ యువకుఁడగు నిషధునిచేత, పితా-తండ్రియైన అతిథి, సువృష్టియోగాత్-మంచివర్షములు గురియుటవలన, సంపత్తిఫలోన్ముఖేన-పండుటకు సిద్ధముగానున్న, సస్యేన-పైరుచేత, జీవలోకః, ఇవ-ప్రాణిసమూహమువలె, ననంద-సంతోషించెను. పరాక్రమవంతుఁడై యువకుఁడైన కుమారుఁడు నిషధుఁడు ప్రజాపాలనముఁ జేయఁగలవాఁడగునని అతిథి, సువృష్టియోగమున ఫలోన్ముఖమైన పైరుసుజూచిన జీవలోకమువలె హర్షమును జెందెనని భావము. అలంకారము : ఉపమ.

శ్లో. శబ్దాది నిర్విశ్య సుఖం చిరాయ
తస్మిన్ ప్రతిష్ఠాపితరాజశబ్దః,
కౌముద్వతేయః కుముదావదాతైః
ద్యా మార్జితాం కర్మభి రారురోహ, 3

వ్యాఖ్య : కౌముద్వతేయః-అతిథి, శబ్దాది-శబ్దస్పర్శాదికమగు, సుఖం-సుఖసాధనమైన భోగ్యవస్తువర్గమును, నిర్విశ్య-అనుభవించి, చిరాయ-బహు కాలముపిమ్మట, తస్మిన్-ఆనిషధుఁడను పుత్రునియందు, ప్రతిష్ఠాపితరాజశబ్దః-నిలుపఁబడిన రాజశబ్దముగలవాఁడగుచు, కుముదావదాతైః-నిర్మలములైన (తెల్ల కలువలవలె స్వచ్ఛమైన యని ప్రతిపదార్థము), కర్మభిః-అశ్వమేధాది పుణ్య కర్మలచేత, ఆర్జితాం-సంపాదింపఁబడిన, ద్యాం-స్వర్గమును, ఆరురోహ-ఎక్కెను. అతిథిరాజు బహుకాలము రాజ్యసుఖముల ననుభవించి, కుమారుఁడగు నిషధుని రాజునుగాజేసి, తానొనర్చిన పుణ్యకర్మలఫలమగు స్వర్గమును జేరెను.

శ్లో. పౌత్రః కుశస్యాపి కుశేశయాక్షః
ససాగరాం సాగరధీరచేతాః,
ఏకాతపత్రాం భువ మేకవీరః
పురార్గలాదీర్ఘభుజో బుభోజ. 4

వ్యాఖ్య : కుశేశయాక్షః-కమలదళములవంటి కన్నులుగలవాఁడును, సాగరధీరచేతాః-సముద్రమువలె గంభీరమైన చిత్తముగలవాఁడును, ఏకవీరః-అసహాయశూరుఁడును, పురార్గళాదీర్ఘభుజః—పురార్గళా-నగరముయొక్క గవని వాకిటిగడియవంటి, దీర్ఘభుజః-పొడవైన చేతులుగలవాఁడును, కుశస్య, పౌత్రః అపి-కుశునియొక్క మనుమఁడగు నిషధుఁడుసైతము, ససాగరాం-సముద్రములతోఁగూడినదియు, ఏకాతపత్రాం-తనయొక్కని ఛత్రమేకలదియు నగు, భువం-భూమిని, బుభోజ-పరిపాలించెను. అందమైన కన్నులుగలవాఁడు, లోతైన మనస్సుగలవాఁడు, అసహాయశూరుఁడు, ఆజానుబాహువు, కుశునిపౌత్రుఁడు నగు నిషధుఁడు సర్వభూమిని ఏకచ్ఛత్రాధిపత్యముగా పాలించెనని భావము. "శతపత్రం కుశేశయమ్, తద్విష్కంభోఽర్గలంననా" అని యమరము. "వర్ణావృత్తిఃపదేషుచ" అను కావ్యాదర్శవచనానుసారముగా నిచ్చటను, ఈ సర్గయందంతటను 'అనుప్రాస' మనఁబడు శబ్దాలంకారము.

శ్లో. తస్యానలౌజా స్తనయ స్తదంతే
వంశశ్రియం ప్రాప నలాభిధానః,
యో నడ్వలానీవ గజః పరేషాం
బలాన్యమృద్నా న్నలినాభవక్త్రః. 5

వ్యాఖ్య : అనలౌజాః-అగ్నివంటి తేజస్సుగలవాఁడును, నలాభిధానః-నలుఁడను పేరుగలవాఁడును అగు, తస్య, తనయః-ఆనిషధునియొక్క కుమారుఁడు తదంతే-ఆనిషధునియనంతరమున, వంశశ్రియం-వంశముయొక్క రాజ్యలక్ష్మిని, ప్రాప-పొందెను. నలినాభవక్త్రః-కమలమువంటి ముఖముగల, యః-ఏనలుఁడు, గజః-ఏనుఁగు, నడ్వలాని, ఇవ-కిక్కసగడ్డి నేలలనువలె, పరేషాం-

శత్రువులయొక్క, బలాని-సైన్యములను, అమృద్నాత్-త్రొక్కినలిపివేసెనో (మృద-క్షోదే, పరస్మైపది 'శ్నా' వికరణిధాతువునకు 'లఙ్' ప్ర.పు.ఏ.). మదగజము జమ్ముగడ్డినేలలను త్రొక్కివైచినట్లు శత్రుసైన్యములను నలిపివేసిన వీరుఁడు, నలుఁడనురాజు, తండ్రియగు నిషధునియనంతరమున రఘువంశ రాజ్యలక్ష్మినిఁ జేపట్టెనని భావము. అలంకారము : ఉపమ, అనుప్రాసము.

శ్లో. నభశ్చరై ర్గీతయశాః స లేభే
నభ స్తలశ్యామతనుం తనూజమ్,
ఖ్యాతం నభశ్శబ్దమయేన నామ్నా
కాంతం నభోమాస మివ ప్రజానామ్. 6

వ్యాఖ్య : నభశ్చరైః-ఆకాశమున సంచరించు గంధర్వాదులచేత, గీతయశాః-గానము చేయఁబడిన కీర్తిగల, సః-ఆనలుఁడు, నభ స్తలశ్యామతనుం-ఆకాశతలమువంటి శ్యామలదేహము గలవాఁడును, నభశ్శబ్దమయేన-నభః అనుశబ్దముతోఁగూడిన, నామ్నా-పేరుతో, ఖ్యాతం-ప్రసిద్ధుఁడును, నభోమాసం, ఇవ-శ్రావణ మాసమువలె, ప్రజానాం-ప్రజలకు, కాంతం-ప్రియుఁడైన, తనూజం-పుత్రుని, లేభే-పొందెను. గొప్పకీర్తిగల నలరాజు నీలమేఘశ్యాముఁడగు నభసుఁడను కుమారుని గనెననియు, ఆకుమారుఁడు ప్రజలకు శ్రావణ మాసమువలె ప్రియుఁడయ్యెననియు భావము. శ్యామలదేహము రామునికాలము నుండి యీ వంశమువారికి ప్రియము, శ్రావణము సస్యాదులతోను, పండుగల తోను ఉండునుగనుక ప్రజలకు ప్రియము. అలంకారము : ఉపమానుప్రాసములు.

శ్లో. తస్మై విసృజ్యోత్తరకోసలానాం
ధర్మోత్తర స్తత్ప్రభవే ప్రభుత్వమ్,
మృగై రజర్యం జరసోపదిష్ట
మదేహబంధాయ పున ర్బబంధ. 7

వ్యాఖ్య : ధర్మోత్తరః-ధర్మ ప్రధానుఁడగు నా నలుఁడు, ప్రభవే-సమర్థుఁడైన, తస్మై-ఆ నభసునికొఱకు (నభసునికి), తత్-ఆ, ఉత్తరకోసలా

నాం, ప్రభుత్వం-ఉత్తరకోసలదేశాధిపత్యమును, విసృజ్య-వదలిపెట్టి (ఇచ్చి), జరసా-ముడుసలితనముచేత, ఉపదిష్టం-ఉపదేశింపఁబడిన, మృగైః, అజర్యం-మృగములతోఁగలసియుండు స్నేహమును, పునః-మరల, అదేహబంధాయ-దేహబంధము లేకుండుటకొఱకు (జన్మరాహిత్యముకొఱకు), బబంధ-కట్టెను. నభసుఁడు పెరిగి పెద్దవాఁడై సమర్థుఁడైన పిమ్మట రాజ్యాధికారమును అతని కిచ్చి, ధర్మపరాయణుఁడగు నలుఁడు వార్ధకమునందాచరింపవలసిన వానప్రస్థ జీవితమును ఆరణ్యకమృగములతో నేస్తముకట్టి గడుపుటకు, మోక్షసాధనము నకై వనమునకు వెళ్ళెనని భావము. 'అజర్యం' అనగా మైత్రి. "అజర్యం సంగతమ్" అని పాణిని నిపాతము చేసెను. అలం : అనుప్రాసము.

శ్లో. తేన ద్విపానా మివ పుండరీకో
రాజ్ఞా మజయ్యోఽజని పుండరీకః,
శాంతే పిత ర్యాహృతపుండరీకా
యం పుండరీకాక్ష మివ శ్రితా శ్రీః 8

వ్యాఖ్య : తేన-ఆ నభసునిచేత, ద్విపానాం-ఏనుఁగులకు, పుండరీకః ఇవ-పుండరీకమను పేరుగల దిగ్గజమువలె, రాజ్ఞాం-రాజులకు, అజయ్యః-, జయించుటకు శక్యుఁడుగాని, పుండరీకః-పుండరీకుఁడను పుత్రుఁడు, అజని-జనితుఁడయ్యెను, పితరి-తండ్రియగు నభసుఁడు, శాంతే-స్వర్గముఁజేరగానే, ఆహృతపుండరీకా-తీసికొనఁబడిన శ్వేతపద్మముగల, శ్రీః-లక్ష్మి, యం-ఏ పుండ రీకుని, పుండరీకాక్షం, ఇవ-విష్ణుమూర్తినివలె, శ్రితా-ఆశ్రయించినదయ్యెనో. నభసునికి పుండరీకుఁడను పుత్రుఁడు పుట్టెననియు, అతఁడు సామాన్య గజము లకు దిగ్గజమగు పుండరీకమువలె రాజులకు అజయ్యుఁడై యుండెననియు! నభ సుఁడు దివంగతుఁడుకాఁగానే రాజ్యలక్ష్మి పుండరీకాతపత్రయై పుండరీకునిఁజేరె ననియు భావము. పుండరీకము శ్వేతచ్ఛత్రమును సూచించును. విష్ణుసామ్యము నా విష్ణుః పృథివీపతిః" అను వాక్యమును సూచించును. అలంకారము : ఉపమ అనుప్రాసము.

శ్లో. స క్షేమధన్వాన మమోఘధన్వా
పుత్రం ప్రజాక్షేమ విధానదక్షమ్,
క్ష్మాం లంభయిత్వా క్షమయోపపన్నం
వనే తపః క్షాంతతర శ్చచార. 9

వ్యాఖ్య : అమోఘధన్వా-సఫలమైన ధనుస్సుగల, సః-ఆ పుండరీకుఁడు, ప్రజాక్షేమ విధానదక్షం-ప్రజాక్షేమమును జేయుటయందు సమర్థుఁడును, క్షమయా-శాంతగుణముచేత, ఉపపన్నం-కూడినవాడును నగు, క్షేమధన్వానం-క్షేమధన్వుఁడను పేరుగల, పుత్రం-కుమారుని, క్ష్మాం-భూరాజ్యమును, లంభయిత్వా-పొందునట్లుచేసి, క్షాంతతరః-మిక్కిలి శాంతగుణము కలవాఁడగుచు, వనే-అరణ్యమునందు, తపః-తపస్సును, చచార-ఆచరించెను. పేరెక్కిన విలుకాఁడై కొంతకాలము శత్రువులనణఁచి, ప్రజాపాలన సమర్థుఁడును, శాంతిపరుఁడును అగు క్షేమధన్వుఁడు అనుకుమారునికి రాజ్యమును అప్పగించి పుండరీకుఁడు శాంతచిత్తుఁడై వానప్రస్థాశ్రమమును నిర్వహించుటకు వనమునఁజేరెను. "సః పుత్రం క్ష్మాం లంభయిత్వా" లభధాతువు గత్యర్థకమగుటచేత ద్వికర్మకత్వము. అలంకారము : అనుప్రాసము.

శ్లో. అనీకినీనాం సమరేఽగ్రయాయీ
తస్యాపి దేవప్రతిమః సుతోఽభూత్,
వ్యశ్రూయ తానీకపదావసానం
దేవాది నామ త్రిదివేఽపి యస్య. 10

వ్యాఖ్య : తస్య, అపి-ఆక్షేమధన్వునికిఁగూడ, సమరే-యుద్ధమునందు, అనీకినీనాం-సైన్యములయొక్క, అగ్రయాయీ-ముందరనడచువాఁడును, దేవప్రతిమః-ఇంద్రాది దేవతలతో సమానుఁడును అగు, సుతః-కుమారుఁడు, అభూత్-ఉండెను (పుట్టెను). అనీకపదావసానం-"అనీక" యనుపదము చివరగలదియు, దేవాది-"దేవ" శబ్దము మొదటఁగలదియునగు, యస్య, నామ-ఎవనియొక్క పేరు, ("దేవానీక" యనుపేరు) త్రిదివే, అపి-స్వర్గమున సైతము, వ్యశ్రూయత-విశ్రుతమయ్యెనో. ఆ క్షేమధన్వునికి యుద్ధవీరుఁడు, దైవగుణములు

గలవాఁడు నగు "దేవానీకుఁడ"ను కుమారుఁడు పుట్టి, యతఁడు భూలోకస్వర్గ లోకములందు మిక్కిలి ప్రసిద్ధుఁ డయ్యెనని భావము.

శ్లో. పితా సమారాధనతత్పరేణ
పుత్రేణ పుత్రీ స యథైవ తేన,
పుత్ర స్తథై వాత్మజవత్సలేన
స తేన పిత్రా పితృమా న్బభూవ. 11

వ్యాఖ్య : సః, పితా-తండ్రియయిన ఆక్షేమధన్వుఁడు, సమారాధన తత్పరేణ-పితృసేవయందు శ్రద్ధగలవాఁడైన, తేన, పుత్రేణ-కుమారుఁడైన యాదేవానీకునిచేత, యథైవ-ఏప్రకారముగానైతే, పుత్రీ-పుత్రవంతుడు, బభూవ-ఐయుండెనో, తథైవ-ఆప్రకారముగానే సఃపుత్రః-అపుత్రుఁడు, ఆత్మజ వత్సలేన-కుమారునిపై వాత్సల్యముగల, తేన, పిత్రా-ఆ తండ్రిచేత, పితృ మాన్-మంచి తండ్రిగలవాఁడు, బభూవ-అయియుండెను. క్షేమధన్వుఁడు పితృ సేవాపరాయణుఁడగు పుత్రునిచేత నేవిధముగానైతే తనకు సత్పుత్రుఁడుగలఁడని మురియుచుండెనో అట్లే దేవానీకుఁడు పుత్రవాత్సల్యపరుఁడైన తండ్రిచేత తనకు మంచి పితృదేవుఁడు గలఁడని గర్వపడుచుండెను. పితాపుత్ర భావము వారి కున్నట్లు మరియెవ్వరికిని లేకుండెనని ప్రజలు తలఁచుచుండిరని భావము.

శ్లో. పూర్వ స్తయో రాత్మసమే చిరోఢాం
ఆత్మోద్భవే వర్ణచతుష్టయస్య,
ధురం నిధా యైకనిధి ర్గుణానాం
జగామ యజ్వా యజమానలోకమ్. 12

వ్యాఖ్య : గుణానాం-సద్గుణములకు, ఏకనిధిః-ముఖ్యస్థానమై, యజ్వా-యాగకర్తయైన, తయోః, పూర్వః-అయిద్దఱిలో మొదటివాఁడగు తండ్రి (క్షేమ ధన్వుడు), ఆత్మసమే-తనకు సమానుఁడగు, ఆత్మోద్భవే-కుమారునియందు (దేవానీకునిపైన), చిరోఢాం-బహుకాలము తనచేత భరింపఁబడిన, వర్ణచతుష్ట యస్య, ధురం-బ్రాహ్మణాది వర్ణములు నాలుగింటియొక్క రక్షాభారము ను

నిధాయ-ఉంచి, యజమానలోకం-యజ్ఞములు చేయువారు చేరునట్టి స్వర్గలోకము ను, జగామ-చేరెను. తండ్రి కొడుకులగు క్షేమధన్వ దేవానీకులలో మొదటి వాడైన క్షేమధన్వుడు తనవలెనే గుణనిధియగు కుమారునిపైన రాజ్యపాలన వర్ణధర్మ రక్షణాదుల భారమునుంచి విధి విధానమున యజ్ఞములు చేయువారు పొందునట్టి స్వర్గలోకమును జేరెనని భావము. అలంకారము : అనుప్రాసము.

శ్లో. వశీ సుత స్తస్య వశంవదత్వాత్
స్వేషా మివాసీత్ ద్విషతా మపీష్టః,
సకృత్ వివిగ్నానపి హి ప్రయుక్తం
మాధుర్య మీష్టే హరిణాన్ గ్రహీతుమ్. 13

వ్యాఖ్య : తస్య-ఆ దేవానీకునియొక్క, వశీ-సమర్థుడగు, సుతః-కుమారుడు, (ముందు చెప్పబోవు 'అహీనగు'డనువాడు) వశంవదత్వాత్-ప్రియభాషియగుటవలన, స్వేషాం, ఇవ-తనవారికివలెనే, ద్విషతాం, అపి-శత్రువులకుగూడ, ఇష్టః-ప్రియమైనవాడు, ఆసీత్-అయ్యెను. హి-అటియట్లే, ప్రయుక్తం-ప్రయోగింపబడిన (పలుకబడిన), మాధుర్యం-వాఙ్మాధుర్యము, సకృత్-ఒకసారి, వివిగ్నాన్, అపి-భయపడినవైనను, హరిణాన్-లేళ్ళను, గ్రహీతుం-వశపరచుకొనుటకు, ఈష్టే-చాలినదై యుండును. దేవానీకుని కుమారుడగు అహీనగువు మధురభాషియగుటవలన ఆత్మీయులకువలెనే శత్రువులకును ప్రియుడై యుండెను. మధురమైన పలుకు ఒకసారి బెదరినవైనను లేళ్ళను పట్టుకొనుటకు ఉపయోగించును. అట్లే దేవానీకుని కాలమున భయపడియున్న శత్రువులందఱును అతని కొడుకునకు మాటనేర్పరితనముచేత ప్రియమిత్రులైపోయిరని భావము. అలంకారములు : అర్థాంతరన్యాసము, అనుప్రాసము.

శ్లో. అహీనగు ర్నామ స గాం సమగ్రా
మహీనబాహుద్రవిణః శశాస
యో హీన సంసర్గ పరాఙ్ముఖత్వాత్
యువాప్యనర్థై ర్వ్యసనై ర్విహీనః. 14

వ్యాఖ్య : అహీనబాహుద్రవిణః-తక్కువగాని భుజపరాక్రమము గలవాడును, హీనసంసర్గ పరాఙ్ముఖత్వాత్-నీచుల సహవాసమునకు విముఖుడగుట

వలన, యువా, అపి-యువకుఁడై యున్నను, అనర్థైః-అనర్థములను గలిగించునట్టి, వ్యసనైః-పానద్యూతాదులచేత, విహీనః-రహితుడుననగు, యః,అహీనగుః నామ-ఏ యహీనగుఁడు పూర్వము చెప్పఁబడెనో, సః-ఆ దేవానీకసుతుఁడు, సమగ్రాం-సంపూర్ణమైన, గాం-భూమిని, శశాస-ఏలెను. గొప్ప భుజపరాక్రమము గలిగి, నీచుల స్నేహము లేనందున వ్యసనదూరుఁడై, అనర్థములకు లోనుగాక యుండిన దేవానీకసుతుఁడగు అహీనగుఁడు రాజ్యము నేలెను. "ద్రవిణం కాంచనం విత్తం ద్రవిణంచ పరాక్రమః" అని విశ్వనిఘంటువు. కనుక ఇచ్చట ద్రవిణ శబ్దమునకు పరాక్రమ మని యర్థము.

శ్లో. గురోః స చానంతర మంతరజ్ఞః
పుంసాం పుమానాద్య ఇవావతీర్ణః,
ఉపక్రమై రస్ఖలితై శ్చతుర్భిః
చతుర్దిగీశ శ్చతురో బభూవ. 15

వ్యాఖ్య : పుంసాం-పురుషులయొక్క, అంతరజ్ఞః-తారతమ్యము నెఱిఁగినవాడును, చతురః-నిపుణుఁడునుగుఅ, సః,చ-ఆ యహీనగుడును, గురోః-తండ్రియొక్క, అనంతరం-తరువాత, అవతీర్ణః-అవతారమును పొందిన, ఆద్యః, పుమాన్, ఇవ-ఆదిపురుషుఁడగు విష్ణువవలె, అస్ఖలితైః-అప్రతిహతములగు, చతుర్భిః, ఉపక్రమైః-నాలుగు ఉపాయములచేత, చతుర్దిగీశః-నాలుగు దిక్కులకును అధిపతి, బభూవ-అయ్యెను. పురుషులయంతరమునెఱిఁగి, నిపుణుఁడై యున్న ఆ యహీనగుఁడు తండ్రి పిమ్మట భూలోకమునందవతరించిన మహావిష్ణువవలె అప్రతిహతములగు సామాది చతురుపాయముల ప్రయోగముచేత సర్వశత్రువులను జయించి నేల నాలుగు చెరగులందును తన యాధిపత్యమును నెఱపెనని భావము. "సామాదిభి రుపక్రమైః" అను మనువచనమువలన ఉపక్రమ మనఁగా ఉపాయము. అలంకారములు : ఉపమ, అనుప్రాసము.

శ్లో. తస్మిన్ ప్రయాతే పరలోకయాత్రాం
జేతర్యరీణాం తనయం తదీయమ్,
ఉచ్చైః శిరస్త్వా జ్జితపారియాత్రం
లక్ష్మీః సిషేవేకిల పారియాత్రమ్. 16

వ్యాఖ్య : అరీణాం-శత్రువులకు, జేతరి-విజేతయగు, తస్మిన్-అహీన గుఁడు, పరలోకయాత్రాం-స్వర్గమును, ప్రయాతే (సతి) చేరినవాఁడుకాఁగా, ఉచ్చైఃశిరస్త్వాత్-ఉన్నత శిరస్కుఁడగుటవలన (గొప్పవాఁడయినందున), జిత పారియాత్రం-జయింపఁబడిన పారియాత్రమను కుల పర్వతముగల, పారి యాత్రం-పారియాత్రుఁడను పేరుగల, తదీయం, తనయం-ఆయహీనగునిపుత్రుని లక్ష్మీః-రాజ్యలక్ష్మి, నిషేవేకిల-సేవించినదిసుమా! వీరుఁడైన యహీనగుఁడు దివంగతుఁడుకాగా అంతకంటెను ఉన్నతుఁడైన యతనిపుత్రుఁడు పారియాత్రుని రాజ్యలక్ష్మి సేవించెను. అనఁగా నతఁడు రాజయ్యెనని భావము. హిమవంతము, గంధమాదనము, నిషధము, వింధ్య, మాల్యవంతము, పారియాత్రము, హేమ కూటము. ఇవి యేడు కులపర్వతములు. అలం : యమకము.

శ్లో॥ తస్యాభవ త్సూను రుదారశీలః
శిలః శిలాపట్టవిశాలవక్షాః,
జితారిపక్షోఽపి శిలీముఖై ర్యః
శాలీనతా మవ్రజ దీడ్యమానః. 17

వ్యాఖ్య : తస్య-ఆపారియాత్రునికి, ఉదారశీలః-మంచిస్వభావముగలవాఁ డును, శిలాపట్టవిశాలవక్షాః-ఱాతిపలకవలె విశాలమైన వక్షస్థలముగలవాఁడునగు, శిలః-శిలాఖ్యుఁడను, సూనుః-కుమారుఁడు, అభవత్-ఉండెను. (పుట్టెను). యః-ఎవఁడు, శిలీముఖైః-బాణములచేత, జితారిపక్షః, అపి-జయింపఁబడిన శత్రు పక్షము గలవాఁడైనను,ఈడ్యమానః-ఆవిషయమున పొగడఁబడుచు, శాలీనతాం- లజ్జను, అవ్రజత్-పొందెనో. పారియాత్రునికి ఉదారశీలుఁడు, విశాలవక్షస్కుఁడు నగు శిలాఖ్యుఁడను కుమారుఁడు పుట్టెననియు, ఆ కుమారుఁడు శత్రుజయమును జేసినను తనవిజయమును పొగడునప్పుడు సిగ్గుపడుచు వినయవంతుఁడైయుండె ననియు భావము. శాలీనుఁడనఁగా గర్వములేనివాఁడనియు నర్థము. "స్యాదధృష్టేతు శాలీనః" అని యమరము. అలంకారము : అనుప్రాసము.

శ్లో. త మాత్మసంపన్న మనిందితాత్మా
కృత్వా యువానం యువరాజమేవ,
సుఖాని సోఽభుంక్త సుఖోపరోధి
వృత్తం హి రాజ్ఞా ముపరుద్ధవృత్తమ్. 18

వ్యాఖ్య : అనిందితాత్మా-గర్హింపఁబడని స్వభావముగల, సః-ఆపారియాత్రుఁడు, ఆత్మసంపన్నం-బుద్ధిసంపదగల, యువానం, తం-యువకుఁడగు శిలాఖ్యుని, యువరాజం, కృత్వా, ఏవ-యువరాజునుగా నభిషేకించియే, సుఖాని-ఇష్టసుఖములను, అభుంక్త-అనుభవించెను. హి-ఎందువలన ననఁగా, రాజ్ఞాం-రాజులయొక్క, వృత్తం-ప్రజాపాలనాదిరూపమైన నడవడి, సుఖోపరోధి-కార్యబాహుళ్యమువలన సుఖము నడ్డగించునది కనుక, ఉపరుద్ధవృత్తం-అడ్డంకులుగల జీవనపథము గలదియే. పారియాత్ర మహారాజు బుద్ధిమంతుఁడగు కుమారునికి యౌవరాజ్య పట్టాభిషేకమును జేసియే తాను ఇష్టసుఖముల ననుభవించెను. రాజుల నిత్యవర్తనము సుఖానుభవమునకుచోటీయని కారాగారవాసమువంటిదికనుక కుమారుఁడగు శిలాఖ్యునికి ప్రజాపాలనభారమును వదలి తాను స్వేచ్ఛగానుండెనని భావము. ఇచ్చట 'ఆత్మన్' శబ్దము, స్వభావము, బుద్ధి అను రెండర్థములు గలదిగా నుపయోగింపఁబడిననది. ఆత్మా యత్నో ధృతి ర్బుద్ధిః స్వభావో బ్రహ్మ వర్ష్మచ" అనియమరము. అలంకారములు: అర్థాంతరన్యాసము, అనుప్రాసము.

శ్లో. తం రాగబంధి ష్వవితృప్తమేవ
భోగేషు సౌభాగ్యవిశేషభోగ్యమ్,
విలాసినీనా మరతిఃమాపి
జరా వృథా మత్సరిణీ జహార. 19

వ్యాఖ్య : రాగబంధిషు-అనురక్తికిఁగారణములగు, భోగేషు-ప్రసక్చందనవనితాదులగు విషయములయందు, అవితృప్తం, ఏవ-తృప్తిపడనివాడై యుండగనే, విలాసినీనాం-విలాసవతులకు, సౌభాగ్యవిశేషభోగ్యం-సౌందర్యాతిశయము గలవాఁడగుటచేత భోగించుటకర్హుఁడై యున్న, తం-ఆపారియాత్రుని, అరతి

క్షమా, అపి-సంభోగించుటకర్హమైనది కాకున్నను, వృథా-వ్యర్థముగా, మత్సరిణీ- ఓర్వలేనిదైన, జరా-వృద్ధత, జహార-వశపరచుకొనెను. పారియాత్రుఁడు స్త్రీ సంభోగాది సుఖానుభవములందు పూర్తిగాఁ దృప్తినిఁ జెందకముందే, విలాసవతులకుఁ గోరఁదగిన చక్కఁదనముగల యతనిని వశపరచుటకొనుటలో రతియోగ్యలైన విలాసవతులపై మాత్సర్యమునుబూని, తానుమాత్ర మేలభోగింపరాదని భోగమున కర్హురాలు కాకున్నను జర (వార్థక్యము) వృథాగా, అతనిని వశపరచుకొనెను. అనఁగా చక్కనివాఁడైన పారియాత్రునికి విషయసుఖతృప్తి కలుగకముందే ముసలితనము వచ్చెననియు, శిలాఖ్యుఁడు రాజ్యసుఖములనుభవించెననియు భావము. 'జరా' శబ్దము స్త్రీలింగమగుటచేత ఈకల్పనచమత్కారముగానున్నది.

శ్లో. ఉన్నాభ ఇత్యుద్గతనామధేయః
తస్యాయథార్థోన్నతనాభిరంధ్రః
సుతోఽభవత్ పంకజనాభకల్పః
కృత్స్నస్య నాభి ర్నృపమండలస్య. 20

వ్యాఖ్య : తస్య-ఆశిలాఖ్యునికి, ఉన్నాభః, ఇతి-ఉన్నాభుఁడని, ఉద్గతనామధేయః-ప్రసిద్ధికెక్కిన పేరుగలవాఁడును, అయథార్థోన్నతనాభిరంధ్రః— అయథార్థోన్నత-అసాధారణముగా పైకిఁగనఁబడునట్టి, నాభిరంధ్రః-నాభిరంధ్రముగలవాఁడును (గంభీరమగు నాభి గలవాఁడని యర్థము). పంకజనాభకల్పః-విష్ణువుతో సమానుఁడును, కృత్స్నస్య-సమస్తమైన, నృపమండలస్య-తనరాజ్యముచుట్టును చక్రాకారముగానుండిన రాజసమూహమునకు, నాభిః-ప్రధానుఁడైనవాఁడును నగు, సుతః-కుమారుఁడు, అభవత్-ఉండెను (పుట్టెను). గంభీరమైననాభిగలిగినందునపద్మనాభునితో సమానుఁడై,రాజమండలమునకు చక్రవర్తియై, కీర్తిమంతుఁడైన ఉన్నాభుఁడనువాఁడు శిలాఖ్యుని పుత్రుఁడై రఘువంశమునఁ బుట్టి యుండెనని భావము. అలంకారము : అనుప్రాసము. 'చక్రవర్తి' యనఁగా తన రాజ్యముచుట్టునుగల దేశాధిపతులపైఁ దనపలుకుఁబడియు, ఆధిక్యమును వారు లొంగియుండుటయు మొదలగు విశేషములు గలవాఁడుగానున్న రాజేకాని సర్వభూమండలమునకును అధిపతికాదని చాణక్యార్థశాస్త్ర, కామందకనీతిసారాది గ్రంథములవలనఁ దెలియుచున్నది.

శ్లో. తతఃపరం వజ్రధర ప్రభావ
స్తదాత్మజః సంయతి వజ్రఘోషః,
బభూవ వజ్రాకరభూషణాయాః
పతిః పృథివ్యాః కిల వజ్రణాభః. 21

వ్యాఖ్య : తతః, పరం-ఆతరువాత, వజ్రధరప్రభావః-ఇంద్రునివంటి తేజస్సుగలవాఁడును, సంయతి-యుద్ధమునందు, వజ్రఘోషః-పిడుగువలె సింహనాదము చేయువాఁడును, వజ్రణాభః-వజ్రనాభుఁడను పేరుగలవాఁడును నగు, తదాత్మజః-ఆ ఉన్నాభుని కుమారుఁడు, వజ్రాకరభూషణాయాః—వజ్రాకర-వజ్రములగనులు, భూషణాయాః-అలంకారములుగాఁగల, పృథివ్యాః-భూమికి, పతిః-అధిపతి, బభూవకిల-అయ్యెనట. ఉన్నాభుని యనంతరమున ఇంద్రునివంటి ప్రభావముగలిగి, యుద్ధములందు మహావీరుఁడై, అతని కుమారుఁడైన వజ్రనాభుఁడు భూమండలమున కధిపతి యయ్యెనని భావము. వజ్ర శబ్దమునకు ఇంద్రునియాయుధము, శస్త్రము, మణులకు రంధ్రమునువేయుసాధనము, వజ్రము, పిడుగు, వజ్రాసనము అనునర్థములు గలవని కేశవ నిఘంటువు చెప్పుచున్నది. "వజ్రణాభః" అని "ణ" కారయుక్తముగా వ్రాయుటకు ఇది నామవాచకము కనుక ఏకపదముగా భావించుటయే కారణము. "రషాభ్యాం నోణః సమానపదే" అని పాణిని సూత్రము. తెలుఁగు సాహిత్యమునందు 'వజ్రనాభుఁ'డనియే వాడిరి. అలంకారము : అనుప్రాసము.

శ్లో. తస్మిన్ గతే ద్యాం సుకృతోపలబ్ధాం
తత్సంభవం శంఖణ మర్ణవాంతా,
ఉత్ఖాత శత్రుం వసుధోపతస్థే
రత్నోపహారై రుదితైః ఖనిభ్యః. 22

వ్యాఖ్య : తస్మిన్-ఆవజ్రణాభుఁడు, సుకృతోపలబ్ధాం-తనపుణ్యకర్మఫలముగా లభించిన, ద్యాం-స్వర్గమును, గతే (సతి)-చేరినవాఁడుకాఁగా, ఉత్ఖాత శత్రుం-నిర్మూలింపఁబడిన శత్రువులుగలవాఁడును, శంఖణం-శంఖణుఁడనుపేరు

గల, తత్సంభవం-అతనికుమారుని, అర్ణవాంతా-సముద్రము లంచులుగాఁ గల వసుధ, ఖనిభ్యః-గనులనుండి, ఉదితైః-ఉత్పన్నములైన, రత్నోపహారైః-ఉత్కృష్టవస్తువుల కానుకలచేత, ఉపతస్థే-సేవించెను. వజ్రణాభుఁడు సుకృత ఫలమగు స్వర్గమును జేరఁగా నతని కుమారుఁడు శంఖణుఁడనురాజు శత్రు నిర్మూలనముచేసి రత్నగర్భయగు భూమిని పాలించెనని భావము. అలంకారము : రూపకభేదము.

శ్లో. తస్యావసానే హరిదశ్వధామా
పిత్ర్యం ప్రపేదే పద మశ్విరూపః,
వేలాతటే షూషిత సైనికాశ్వం
పురావిదో యం వ్యుషితాశ్వ మాహుః. 23

వ్యాఖ్య : తస్య-ఆశంఖణునియొక్క, అవసానే-అంతమునందు, హరిదశ్వధామా—హరిదశ్వ-సూర్యునియొక్క, ధామా-తేజస్సుతో సమానమగు తేజముగలవాఁడును. అశ్విరూపః-అశ్వినీదేవతలవంటి చక్కఁదనముగలవాఁడును నగు అతని పుత్రుఁడు, పిత్ర్యం, పదం-తండ్రిది యగు నమును, ప్రపేదే-పొందెను. వేలాతటేషు-సముద్రతీరములందు, ఊషితసైకాశ్వం-ఉంచఁబడిన సైనికులును, అశ్వములునుగల, యం-ఏకుమారుని, పురావిదః- పెద్దలు, వ్యుషితాశ్వం-వ్యుషితాశ్వుఁడని, ఆహుః-పిలిచెదరో. శంఖణరాజు మరణానంతరము సూర్యతేజస్సు, అశ్వినీదేవతల చక్కఁదనము గల యతనికుమారుఁడు వ్యుషితాశ్వుఁడను రాజు రఘువంశ రాజయ్యెను. సముద్రతీరమువఱకు నతనిసైన్యములు గుర్రములు వెళ్ళినిలుచుటచేత నతనికి వ్యుషితాశ్వుఁడు (వి + ఉషితాశ్వుఁడు) అను నామము సార్థకనామధేయమయ్యెనని యందఱును గొనియాడిరని భావము. అలంకారము : అనుప్రాసము, వ్యంగ్యోపమ.

శ్లో. ఆరాధ్య విశ్వేశ్వర మీశ్వరేణ
తేన క్షితే ర్విశ్వసహో విజజ్ఞే,
పాతుం సహో విశ్వసఖః సమగ్రాం
విశ్వంభరా మాత్మజమూర్తి రాత్మా. 24

వ్యాఖ్య : తేన, క్షితేః, ఈశ్వరేణ-క్షితీశ్వరుఁడైన అవ్యుషితాశ్వునిచేత విశ్వేశ్వరం-కాశీవాసుఁడయిన శివుని, ఆరాధ్య-ఉపాసించి, విశ్వసహః-విశ్వసహుఁడను పేరుగలవాఁడును, విశ్వసఖః-అందఱికిని మిత్రుఁడైనవాఁడును, సమగ్రాం, విశ్వంభరాం-సమస్తమైనభూమిని, పాతుం-రక్షించుటకు, సహః-సమర్థుఁడగువాఁడును, ఆత్మజమూ ః-కుమారరూపము గలవాఁడునగు, ఆత్మా-తానే (పుత్రుఁడని యర్థము), విజ -ఉదయించుట జరిగెను. వ్యుషితాశ్వుఁడు కాశీనాథుఁడగు శివుని నారాధించి " ఆత్మావై పుత్రనామాసి" అను శ్రుతివచన ప్రకారము తానే "విశ్వసహుఁడ"ను పేరుగలిగి, సర్వమిత్రుఁడై సర్వంసహను పాలింపఁగల పుత్రుఁడై జన్మించెను. వ్యుషితాశ్వునికి విశ్వసహుఁడను కుమారుఁడు పుట్టెనని భావము. 'వి' పూర్వకమగు 'జనీ-ప్రాణిగర్భవిమోచనే' ధాతువునకును సహజార్థము పూరకుండుటకు "సమాం సమాం విజాయతే"యను పాణిని సూత్రము ప్రమాణమని మల్లినాథుఁడు రచించెను. 'విజజ్ఞే' యనునది భావే ప్రయోగము.

శ్లో. అంశే హిరణ్యాక్షరిపోః స జాతే
హిరణ్యనాభే తనయే నయజ్ఞః
ద్విషా మసహ్యః సుతరాం తరూణాం
హిరణ్యరేతా ఇవ సానిలోఽభూత్. 25

వ్యాఖ్య: నయజ్ఞః-నీతిజ్ఞుఁడగు, సః-ఆవిశ్వసహుఁడు, హిరణ్యాక్షరిపోః-విష్ణువుయొక్క, అంశే-అంశయందు, హిరణ్యనాభే-హిరణ్యనాభుఁడను పేరుగల, తనయే-కుమారుఁడు, జాతే(సతి) పుట్టినవాఁడుకాఁగా, తరూణాం-వృక్షములకు, సానిలః-వాయువుతోఁగూడిన, హిరణ్యరే తాః, ఇవ-అగ్నివలె, ద్విషాం-శత్రువులకు, సుతరాం-మిక్కిలి, అసహ్యః-సహించుటకు శక్యముగానివాఁడు, అభూత్-అయ్యెను. విశ్వసహునికి విష్ణ్వంశతో హిరణ్యనాభుఁడను పుత్రుఁడు పుట్టెననియు, అతఁడు పెద్దవాఁడై తండ్రికి తోడ్పడఁగా, వాయుదేవునితోఁగూడిన అగ్నికి వృక్షములు తట్టుకొనలేనియట్లు, తండ్రి కొడుకుల ప్రతాపమునకు శత్రువులు తట్టుకొనలేకపోయిరనియు భావము. అలంకారము : అనుప్రాసము, ఉపమ.

శ్లో. పితా పితౄణా మనృణ స్త మంతే
వయస్యనంతాని సుఖాని లిప్సుః,
రాజాన మాజానువిలంబి బాహుం
కృత్వా కృతీ వల్కలవాన్ బభూవ. 26

వ్యాఖ్య : పితౄణాం-పితృదేవతలకు, అనృణః-ఋణములేనివాఁడై, కృతీ-కృతకృత్యుఁడైన, పితా-తండ్రియగు ఐశ్వసహుఁడు, అంతే, వయసి-చివరివయస్సునందు, అనంతాని-వినాశములేని, సుఖాని-సుఖములను, లిప్సుః-పొందఁదలఁచినవాఁడై, ఆజానువిలంబిబాహుం-దీర్ఘబాహువులుగల యదృష్టవంతుఁడగు, తం-ఆ హిరణ్యనాభుని, రాజానం, కృత్వా-రాజునుజేసి, వల్కలవాన్-నార చీరలను ధరించినవాఁడు, బభూవ-అయ్యెను. "ప్రజయాపితృభ్యః" అను శ్రుతివాక్యమునసనుసరించి యుత్తమ పుత్రుఁడుగలుగుటవలన పితృఋణవిముక్తుఁడై వార్ధకమునందు మోక్షము నొందఁదలఁచినవాఁడగుచు, భాగ్యవంతుఁడు పరాక్రమవంతుఁడునగు హిరణ్యనాభుఁడను కుమారునికి రాజ్యపట్టాభిషేకముఁజేసి తాను వల్కలధారియై వానప్రస్థాశ్రమమును స్వీకరించి యరణ్యమును చేరెనని భావము.

శ్లో. కౌసల్య ఇత్యుత్తర కోసలానాం
పత్యుః పతంగాన్వయ భూషణస్య,
తస్యౌరసః సోమసుతః సుతోఽభూత్
నేత్రోత్సవః సోమ ఇవ ద్వితీయః. 27

వ్యాఖ్య : ఉత్తరకోసలానాం-ఉత్తరకోసలదేశమునకు, పత్యుః-ప్రభువవాఁడును, పతంగాన్వయభూషణస్య - సూర్యవంశమున కలంకారప్రాయుఁను, సోమసుతః-యజ్ఞములుచేసినవాఁడునునగు, తస్య-ఆ హిరణ్యనాభునికి, -తీయః, సోమః, ఇవ-రెండవ చంద్రునివలె, నేత్రోత్సవః-నయనానందకరుఁడ , కౌసల్యః, ఇతి-కౌసల్యుఁడను పేరున ప్రసిద్ధుఁడైన, ఔరసః, సుతః-ధర్మపత్నికిఁబుట్టిన కుమారుఁడు, అభూత్-ఉండెను. ఉత్తరకోసలదేశాధిపతియై సూర్యవంశభూషణమై యజ్ఞయాగములు నిర్వర్తించిన ఆ హిరణ్యనాభునికి ధర్మ

పత్నియందు ప్రజలకుఁదనకును చంద్రునివలె కన్నులపండువు గావించు కుమారుఁడుపుట్టి యతఁడు కౌసల్యుఁడను పేరునఁ ప్రసిద్ధుఁడయ్యెనని భావము. "కోసలానాం రాజా కౌసల్యః" అనియు, "సోమం సునోతి ఇతి సోమసుత్ తస్య సోమసుతః" అనియు విగ్రహవాక్యములు.

శ్లో. యశోభి రాబ్రహ్మసభం ప్రకాశః
స బ్రహ్మభూయం గతి మాజగామ,
బ్రహ్మిష్ఠ మాధాయ నిజే௨ధికారే
బ్రహ్మిష్ఠమేవ స్వతనుప్రసూతమ్. 28

వ్యాఖ్య : ఆబ్రహ్మసభం-బ్రహ్మనివాసమగు సత్యలోక పర్యంతము, యశోభిః-మంచి కీర్తులచేత, ప్రకాశః-ప్రసిద్ధుఁడగు, సః-ఆ కౌసల్యుఁడు, బ్రహ్మిష్ఠం-బ్రహ్మవేత్తయగు, బ్రహ్మిష్ఠం-బ్రహ్మిష్ఠుఁడను పేరుగల, స్వతను ప్రసూతం, ఏవ-తనకుమారునే, నిజే-తనదియగు, అధికారే-ప్రజాపాలనాధి కారమునందు, ఆధాయ-ఉంచి, బ్రహ్మభూయం-బ్రహ్మత్వమనెడి, గతిం-గమన మును, ఆజగామ-పొందెను (ముక్తుఁడయ్యెనని యర్థము). భూలోక స్వర్గలోక సత్యలోకములం దంతటను వ్యాపించినకీర్తిగల యాకౌసల్యుఁడు ఆత్మతత్త్వ వేత్తయు, బ్రహ్మిష్ఠుఁడను పేరుగలవాఁడునునగు తన కుమారుని రాజ్యాధికారము నందుంచి తాను మోక్షమును పొందెనని భావము. రఘువంశక్రమమునందు కౌసల్యుని పిమ్మట బ్రహ్మిష్ఠుఁడు రాజయ్యెనని తాత్పర్యము. అలంకారము : యమకము. హేమాద్రి యను రఘువంశ వ్యాఖ్యాత "బ్రహ్మిష్ఠ" శబ్దమునకు బ్రాహ్మణభక్తుఁ డన్నయర్థమును వ్రాసెను.

శ్లో. తస్మిన్ కులాపీడనిభే విపీడం
సమ్యఙ్మహీం శాసతి శాసనాంకామ్,
ప్రజా శ్చిరం సుప్రజసి ప్రజేశే
ననందు రానందజలావిలాక్ష్యః. 29

వ్యాఖ్య : కులాపీడనిభే-వంశమునకు శిరోభూషణము వంటివాఁడును, సుప్రజసి-సత్సంతానవంతుఁడునగు, తస్మిన్, ప్రజేశే-ప్రజానాథుడయిన

ఆ బ్రహ్మిష్ఠరాజు, శాసనాంకాం-రాజశాసన చిహ్నములుగల, మహీం-భూమిని, విపీడం-బాధారహితముగా, సమ్యక్-చక్కగా, శాసతి (సతి)-పాలించుచుండగా, ఆనందజలావిలాక్ష్యః-ఆనందాశ్రువులతో చెదరిన కన్నులుగల, ప్రజాః-ప్రజలు, చిరం-బహుకాలము, ననందుః-సంతోషించిరి. రఘువంశమునకే తలమానికమై సత్సంతానవంతుఁడై దేశమున రాజశాసనములను విరివిగా నిలుపుచు రాజ్యము నేలుచుండిన ఆ బ్రహ్మిష్ఠుని రాజ్యమునందలి ప్రజలు ఆనందాశ్రుపూరితనేత్రులై బహుకాలము సంతోషపడిరని భావము. కుల+ఆపీడ-కులాపీడ. ఆపీడమనగా శిరోభూషణ మని యర్థము.

శ్లో. పాత్రీకృతాత్మా గురుసేవనేన
స్పష్టాకృతిః పత్రరథేంద్రకేతోః,
తం పుత్రిణాం పుష్కరపత్రనేత్రః
పుత్రః సమారోపయ దగ్రసంఖ్యామ్. ౩౦

వ్యాఖ్య : గురుసేవనేన-పెద్దలసేవచేత, పాత్రీకృతాత్మా-యోగ్యముగాఁ జేయఁబడిన ఆత్మగలవాఁడును, పత్రరథేంద్రకేతోః—పత్రరథేం ద-గరుత్మంతుఁడు, కేతోః-ధ్వజముగాఁగల విష్ణువుయొక్క, స్పష్టాకృతిః-స్ప _నదేహము గలవాఁడును, పుష్కరపత్రనేత్రః-కమలదళములవంటి కన్నులు. లవాఁడు నగు పుత్రః-పుత్రుఁడను పేరుగల కుమారుఁడు, తం-ఆబ్రహ్మిష్ఠరాజును, పుత్రిణాం-పుత్రవంతులయొక్క, అగ్రసంఖ్యాం-మొదటిసంఖ్యను, సమారోపయత్-ఎక్కించెను. (అగ్రగణ్యునిగాఁ జేసెనని యర్థము). తండ్రి మొదలగువారి శుశ్రూషచేత మంచియోగ్యుఁ డన్న పేరుమ పొంది, ఆకారమునందు కేవలము విష్ణువుగాఁ గనఁబడుచు, విశాలనేత్రములు గల పుత్రుఁడను రాజు బ్రహ్మిష్ఠునికిఁగలిగి, తండ్రిని పుత్రవంతులలో అగ్రగణ్యునిగాఁ జేసెనని భావము. "యోగ్యభాజనయోఃపాత్రమ్" అని యమరము. ఆకృతిః కథితా రూపే సామాన్యవపుషోరపి" అని విశ్వనిఘంటువు. "పుత్రః" అన్న పేరును లేకలేక కలిగి "పుత్" అను నరకమునుండి రక్షించువాఁడు కనుక ఆ విధముగా నామకరణము చేసియుందురని యూహింపవలెను.

శ్లో. వంశస్థితిం వంశకరేణ తేన
సంభావ్య భావీ స సఖా మఘోనః,

ఉపస్పృశన్ స్పర్శనివృత్తలౌల్య
స్త్రిపుష్కరేషు త్రిదశత్వ మాప. 31

వ్యాఖ్య : స్పర్శనివృత్తలౌల్యః —— స్పర్శ - భోగ్య వస్తువులనుండి, నివృత్త-మరలిన, లౌల్యః-లోలత్వముగలవాడు (గనుక), మఘోనః-ఇంద్రు నికి, సఖా-మిత్రుఁడు, భావీ-కాఁదలఁచినవాఁడై, సః-ఆ బ్రహ్మిష్ఠుఁడు, వంశ కరేణ-వంశమును సాగించువాఁడగు, తేన-ఆపుత్రునిచేత, వంశస్థితిం-కులప్రతి ష్ఠను, సంభావ్య-సంపాదించి, త్రిపుష్కరేషు-మూడు పుణ్యతీర్థములందు, ఉప స్పృశన్-స్నానముచేయుచు, త్రిదశత్వం-దేవత్వమును, ఆప-పొందెను. ఆ బ్రహ్మిష్ఠుఁడు వైరాగ్యముకలిగి, స్వర్గమును జేరఁదలఁచి తనకుమారునివలన వంశము ఉద్ధరింపఁబడు నన్న నమ్మకము గలవాఁడై త్రిపుష్కరములందు (మూడు గంగా పుష్కరములందు)స్నాతుఁడై దేవత్వమును బొందెనని భావము.

శ్లో. తస్య ప్రభానిర్జితపుష్పరాగం
పౌష్యాం తిథౌ పుష్య మసూత పత్నీ,
తస్మి న్నపుష్య న్నుదితే సమగ్రాం
పుష్టిం జనాః పుష్య ఇవ ద్వితీయే. 32

వ్యాఖ్య : తస్య-ఆపుత్రాఖ్యునియొక్క, పత్నీ-భార్య, పౌష్యాం-పుష్య మీనక్షత్రయుక్తమగు, తిథౌ-పూర్ణిమాతిథియందు, ప్రభానిర్జితపుష్పరాగం-కాంతిచేత జయింపఁబడిన పుష్యరాగమణిగల, పుష్యం-పుష్యాఖ్యుఁడను కుమారుని అసూత-కనెను. ద్వితీయే-రెండవదియగు, పుష్యే, ఇవ-పుష్యమీనక్షత్రమునందు వలె, తస్మిన్-ఆ శిశువు, ఉదితే (సతి)-పుట్టినవాఁడు కాఁగానే, జనాః-ప్రజలు, సమగ్రాం-సంపూర్ణమగు, పుష్టిం-సమృద్ధిని, అపుష్యన్-పోషించుకొనిరి. పుత్రాఖ్యరాజు ధర్మపత్ని పుష్యమాస పూర్ణిమనాడు పుష్యరాగమణి కాంతులు గల పుష్యుఁడను శిశువును ప్రసవించెననియు, అతఁడు పుట్టగానే ప్రజలు పుష్యనక్షత్ర కృతకార్యములు సిద్ధించినట్లు సర్వసమృద్ధినిఁ బొందిరనియు భావము. "పుష్యః పరకృతం హంతి నతు పుష్యకృతం పరః అపిద్వాదశగే చంద్రే పుష్యః సర్వార్థసాధకః" అని జ్యోతిః శాస్త్రము.

శ్లో. మహీం మహేచ్ఛః పరికీర్య సూనౌ
మనీషిణే జైమినయే ఒర్పితాత్మా,
తస్మాత్సయోగా దధిగమ్య యోగ
మజన్మనే ఒకల్పత జన్మభీరుః. 33

వ్యాఖ్య : మహేచ్ఛః-గొప్పఆశయముగలవాఁడును, జన్మభీరుః-సంసార భయముగలవాఁడునుఅగు, సః-ఆ పుత్రాఖ్యుడు, సూనౌ-కుమారునియందు, మహీం-భూమిని, పరికీర్య-వదిలిపెట్టి, మనీషిణే-బ్రహ్మవిద్యావేత్తయగు, జైమినయే-జైమిని మహర్షికి, అర్పితాత్మా-అర్పింపఁబడిన దేహేంద్రియాత్మలు గలవాడై (శిష్యుఁడై), సయోగాత్-యోగనిష్ఠుఁడైన, తస్మాత్-ఆ మినినుండి, యోగం-యోగవిద్యను, అధిగమ్య--నేర్చుకొని, అజన్మనే-జన్మరాహిత్యము కొఱకు, అకల్పత-పూనుకొనెను. పుత్రాఖ్యుఁడు సంసారభీరువై కుమారునిపై రాజ్యభారమునుంచి జైమినిమహర్షికి శిష్యుఁడై యోగవిద్య నభ్యసించి జన్మరాహిత్యమునుబొంది ముక్తుఁడయ్యెనని భావము. హేమాద్రి యనువ్యాఖ్యాత జైమినయే మనీషిణే" అనగా యాజ్ఞ్యవల్క్యుఁడని అర్థమువ్రాసి వాయుపురాణమును ప్రమాణముగాఁజూపెను. జైమిని పూర్వమీ మాంసాప్రవర్తకుఁడేకాని బ్రహ్మవిద్యాప్రవర్తకుడుగాడన్న ప్రసిద్ధియే యీ యనుమానమునకుఁ గారణము.

శ్లో. తతః పరం తత్ప్రభవః ప్రపేదే
ధ్రువోపమేయో ధ్రువసంధి రుర్వీమ్,
యస్మి న్నభూ జ్జ్యాయసి సత్యసంధే
సంధి ర్ధ్రువః సంనమతా మరీణామ్. 34

వ్యాఖ్య : తతః, పరం-ఆ తరువాత, తత్ప్రభవః-ఆ పుష్యాఖ్యుని కుమారుఁడును, ధ్రువోపమేయః-ఔత్తానపాదియగు ధ్రువునితో సమానుఁడును నగు, ధ్రువసంధిః-ధ్రువసంధి యనురాజు, ఉర్వీం-భూపరిపాలనమును, ప్రపేదే-పొందెను. జ్యాయసి-గొప్పవాఁడును, సత్యసంధే-సత్యమైన ప్రతిజ్ఞలు గలవాఁడును నగు, యస్మిన్-ఎవనియందు, సంనమతాం-లొంగిపోయిన,

అరీణాం-శత్రురాజులయొక్క, సంధిః-సంధి, ధ్రువః-స్థిరమైనది, అభూత్-అయ్యెనో. పుష్యాఖ్యుని పిమ్మట అతని కుమారుఁడును ధ్రువునివంటి సద్గుణములు గలవాఁడును అగు "ధ్రువసంధి" యనురాజు రఘువంశమున వెలసెను. గొప్పవాఁడును సత్యసంధుఁడునగు ఆధ్రువసంధి శత్రురాజులు లొంగిపోయి శాశ్వతముగా మిత్రత్వసంధినిఁ జేసికొనుటచేత సార్థకనామధేయుఁడయ్యెనని భావము.

శ్లో॥. సుతే శిశావేవ సుదర్శనాఖ్యే
దర్శాత్యయేందుప్రియదర్శనే సః,
మృగాయతాక్షో మృగయావిహారీ
సింహా దవాప ద్విపదం నృసింహః. 35

వ్యాఖ్య : మృగాయతాక్షః-లేడి కన్నులవంటి విశాల నేత్రములు గలవాఁడును, నృసింహః-పురుషశ్రేష్ఠుఁడును నగు, సః-ఆధ్రువసంధి, దర్శాత్యయేందు ప్రియదర్శనే—దర్శాత్యయ-అమావాస్యముగింపునందలి, ఇందు-చంద్రునివలె, ప్రియదర్శనే-చూడముచ్చటయైనవాఁడగు,సుదర్శనాఖ్యే-సుదర్శనుఁడను పేరుగల సుతే-కుమారుఁడు, శిశౌ, ఏవ-పసివాఁడై యుండగానే, మృగయావిహారీ (సన్)-వేటకై వెళ్ళుచున్నవాఁడగుచు, సింహాత్-సింహముపలన, విపదం-మరణమును, అవాపత్-పొందెను. చక్కనివాఁడు వీరుఁడు నగు ధ్రువసంధి, ప్రతిపచ్చంద్రునివలె దర్శనీయుఁడై యున్న సుదర్శనుఁడను తన కుమారుఁడు మిక్కిలి పసివాడై యుండగానే, మృగయావ్యసనమునందుఁ దగిలి యరణ్యము లలోఁ దిరుగుచు సింహముచేతఁ జంపఁబడెనని భావము. వ్యసనాసక్తి యెన్నడును అనర్థావహమేకదా!

శ్లో॥. స్వర్గామిన స్తస్య త మైకమత్యా
దమాత్యవర్గః కులతంతు మేకమ్,
అనాథదీనాః ప్రకృతీ రవేక్ష్య
సాకేతనాథం విధివ చ్చకార. 36

వ్యాఖ్య : స్వర్గామినః-స్వర్గమునుజేరిన, తస్య-ఆధ్రువసంధియొక్క, అమాత్యవర్గః-మంత్రిమండలి, అనాథదీనాః-ప్రభురహితులై నందునశోచనీయులై

యున్న, ప్రకృతిః-ప్రజలను, అవేక్ష్య-చూచి, కులతంతుం-వంశావలంబనమై, ఏకం-ఒక్కడుగానే యున్న, తం-ఆసుదర్శనుఁడను బాలుని, ఐకమత్యాన్-ఏకాభిప్రాయమువలన, విధివత్-శాస్త్రప్రకారముగా, సాకేతనాథం-అయోధ్యాధిపతిని, చకార-చేసెను. ధ్రువసంధి మరణింపగానే అతని మంత్రులు, అరాజకమైన దేశమునందలి ప్రజల దీనావస్థనుజూచి, ఏకైకవంశాంకురమైయున్న సుదర్శనుఁడనుబాలుని శాస్త్రప్రకారము సాకేతనాథునిగా నభిషేకించి, యైకమత్యముతో తాము రాజ్యపాలనమును సాగించిరని భావము.

శ్లో. నవేందునా త న్నభసోపమేయం
శాబైకసింహేన చ కాననేన,
రఘోః కులం కుట్మలపుష్కరేణ
తోయేన చాప్రౌఢ నరేంద్ర మాసీత్. 37

వ్యాఖ్య : అప్రౌఢనరేంద్రం-వయసువచ్చినరాజులేని, తత్, రఘోః కులం-ఆరఘువంశము, నవేందునా-బాలచంద్రుఁడుగల, నభసా-ఆకాశముతోను, శాబైకసింహేన-ఒకేపిల్లసింహముగల, కాననేనచ-అరణ్యముతోను, కుట్మలపుష్కరేణ-మొగ్గగానున్న యొక్కకమలముగల, తోయేనచ-జలముతోను, ఉపమేయం-పోల్చుటకుఁదగినదిగా, ఆసీత్-ఉండెను. పెద్దలులేక ఒకేయొక బాలునితో నున్న యారఘురాజులవంశమప్పుడు బాలచంద్రునితోనున్న యాకాశముతోను, ఒకేసింహపుపిల్లగల యరణ్యముతోను, ఒక్క తామరమొగ్గతోనున్న సరోవరముతోను బోల్పఁదగియుండెనట. బాలచంద్ర సింహశాబక కుట్మలపుష్కరోపమానములచేత సుదర్శనబాలుఁడు వర్ధిష్ణువు, శౌర్యవంతుఁడు, శ్రీమంతుఁడును గాఁబోవుచున్నాఁడను భావము వ్యంగ్యము. అలంకారము: ఉపమాభేదము.

శ్లో. లోకేన భావీ పితురేవ తుల్యః
సంభావితో మౌలిపరిగ్రహా త్సః,
దృష్టో హి వృణ్వన్ కలభప్రమాణో
ఉప్యాశాః పురోవాత మవాప్య మేఘః. 38

వ్యాఖ్య : సః-ఆ బాలుఁడు, మౌలిపరిగ్రహాత్-కిరీటస్వీకారమువలన, పితుః-తండ్రికి, తుల్యః, ఏవ-సమానుఁడే, భావీ-కాఁగలఁడని, లోకేన-జనముచేత,

సంభావితః-ఊహింపఁబడెను, (అది యుక్తమే), కలభప్రమాణః, అపి-ఏనుఁగు పిల్లంతదిగానున్నను, మేఘః-మేఘము, పురోవాతం-ముందుకునడపుగాలిని, అవాప్య-పొంది, ఆశాః-దిక్కులను, వ్యాప్స్యన్-ఆవరించుచు, దృష్టః, హి-చూడఁబడుచున్నది గదా! కిరీటము ధరించి రాజ్యసింహాసనము నెక్కిన యాబాలుఁడు తండ్రికి సమానుఁడు కాఁగలఁడనియె లోకము భావించెను. మొదట నేనుఁగుపిల్లవలె చిన్నగానున్నను ముందుకునడుపు వాయువుతో సంబంధమును బొందిన మేఘము అన్ని దిక్కులకును వ్యాపించుట చూచుచున్నాముగదా! అట్లే రాజ్యాధికార మంత్రి సహాయములతో నీతఁడును వృద్ధిఁజెందుననుటలో సంశయములేదని భావము. అలంకారము : దృష్టాంతము.

శ్లో. తం రాజవీథ్యా మధిహస్తి యాంత
మాధోరణాలంబిత మగ్ర్యవేషమ్,
షడ్వర్ష దేశీయ మపి ప్రభుత్వాత్
ప్రైక్షంత పౌరాః పితృగౌరవేణ. 39

వ్యాఖ్య : రాజవీథ్యాం-రాజమార్గమునందు, అధిహస్తి-ఏనుఁగుమీద, యాంతం-ఎక్కి వెళ్ళుచున్నవాఁడును, ఆధోరణాలంబితం-మావటివానిచేతఁబట్టుకొనఁబడినవాఁడును, అగ్ర్యవేషం-ఉదారమైన రాజవేషముగలవాఁడును, షడ్వర్షదేశీయం, అపి-ఇంచుమించుగా నాఱుసంవత్సరముల బాలుఁడైయున్నను, తం-ఆ సుదర్శనుని, పౌరాః-పురజనులు, ప్రభుత్వాత్-ప్రభు యున్నందువలన, పితృగౌరవేణ-తండ్రియందెట్టిగౌరవము గలిగియుండిరో అ గౌరవముతోనే, ప్రైక్షంత-చూచిరి. రాజవీథిలో నేనుఁగుమీద మావటివానిచేఁ బట్టుకొనఁబడి, మనోహరమైన వేషముగలిగి వెళ్ళుచున్న సుదర్శనుఁడను ఆరేండ్ల బాలుని పౌరులు ప్రభుగౌరవముతోఁ జూచిరని భావము. 'అధిహస్తి' విభక్త్యర్థమున అవ్యయీభావము. "షడ్వర్షదేశీయం" ఈ షదసమాప్తియందు వచ్చిన 'శీయర్' ప్రత్యయాంతము.

శ్లో. కామం న సోఽకల్పత పైతృకస్య
సింహాసనస్య ప్రతిపూరణాయ,
తేజోమహిమ్నా పున రావృతాత్మా
తద్వ్యాప చామీకరపింజరేణ. 40

వ్యాఖ్య : సః-ఆసుదర్శనబాలుఁడు, పైతృకస్య-తండ్రిదియగు, సింహాసనస్య-సింహాసనమునకు, కామం-సరిగా, ప్రతిపూరణాయ-నింపుటకొఱకు, న, అకల్పత-చాలినవాఁడు కాలేదు. చామీకర పింజరేణ-బంగారపుకాంతిగల, తేజో మహిమ్నా, పునః-తేజస్సంపదచేతనైతే, ఆవృతాత్మా-ఆవరించిన దేహముగలవాఁడగుచు, తత్-ఆసింహాసనమును, వ్యాప-వ్యాపించెను. ఆసుదర్శనుఁడు పసివాఁడగుట వలన తనతండ్రి గూర్చొను సింహాసనమునందు శరీరముచేత నిండుగాఁ గూర్చొనలేకపోయెను గాని అతని చుట్టును వ్యాపించిన బంగారు ఛాయగల తేజస్సంపదచేత మాత్రము పితృసింహాసనమును పూర్తిగా వ్యాపించెనని భావము. రాజునకు శరీరముకంటే తేజస్సు ముఖ్యమను విషయము సూచితము.

శ్లో. తస్మా దధః కించి దివావతీర్ణా
వసంస్పృశంతౌ తపనీయపీఠమ్,
సాలక్తకౌ భూపతయః ప్రసిద్ధై
ర్వవందిరే మౌలిభి రస్య పాదౌ. 41

వ్యాఖ్య : తస్మాత్-ఆసింహాసనముసుండి. అధః-క్రిందికి, కించిదివ-కొంచముగా, అవతీర్ణౌ-వ్రేలాడుచున్నవియు, తపనీయపీఠం-బంగారపు పాదపీఠమును, అసంస్పృశంతౌ-చిన్నగానున్నందున తాకనివియు, సాలక్తకౌ-పారాణి పూయఁబడినవియునగు, అస్య-సుదర్శనునియొక్క, పాదౌ-అడుగులను, భూపతయః-సామంతరాజులు, ప్రసిద్ధైః-ఔన్నత్యముగల, మౌలిభిః-కిరీటములచేత, వవందిరే-నమస్కరించెరి. అట్లు సింహాసనమునందు కూర్చున్న సుదర్శనుని పాదములు క్రిందికి వ్రేలాడుచు, పాదపీఠమును స్పృశింపలేనివై యున్నను లాక్షారసపు పారాణితో నలంకరింపబడియున్న యాచిన్నియడుగులను సామంతరాజులు తాము రఘువంశ చక్రవర్తులకు విధేయులై యున్నందున పాదపీఠముపైవంగి యెత్తుగానున్న తమ కిరీటములచేత నాపాదములను దాకుచు నమస్కరించిరని భావము.

శ్లో. మణౌ 'మహానీల' ఇతి ప్రభావాత్
అల్పప్రమాణేఽపి యథా న మిథ్యా,

శబ్దో 'మహారాజ' ఇతి ప్రతీతః
తథైవ తస్మిన్ యుయుజే ఒర్భకేఒపి. 42

వ్యాఖ్య : అల్పప్రమాణే, అపి-మిక్కిలి చిన్నదిగా నున్నప్పటికిని, మణౌ-ఇంద్రనీలమణి విషయమున, ప్రభావాత్-కాంతిమంతమై యుండుటవలన, మహానీలః, ఇతి- "మహానీల" మను శబ్దము, యథా-ఏవిధముగా, మిథ్యా-అసత్యము (అర్థరహితము), న-కాదో, తథైవ (తథా+ఏవ)-అట్లే, అర్భకే, అపి-బాలుడైయున్నను, తస్మిన్-ఆసుదర్శనునియందు, ప్రతీతః-ప్రసిద్ధమైన, మహారాజః, ఇతి- "మహారాజ" అను శబ్దము, నమిథ్యా-అసత్యముకానిదై, యుయుజే-సంబంధముకలదియై యుండెను. ఎంతచిన్న ప్రమాణముగలదైనను ఇంద్రనీలమణిని "మహానీల" మని లోకము వ్యవహరించుచున్నట్లు అర్భకుడై యున్నను సుదర్శనుని "మహారాజు" అని జనులు, సామంతరాజులు పిలుచుచుండిరనియు, అతని తేజస్సు, వంశప్రతిష్ఠ దానికి దగి యుండె ననియు భావము. మహత్త్వము గుణాధీనముగాని శరీరాధీనము కాదుగదా.

శ్లో. పర్యంత సంచారిత చామరస్య
కపోలలోలోభయ కాకపక్షాత్,
తస్యాననా దుచ్చరితో వివాదః
చస్మాల వేలాస్వపి నార్ణవానామ్. 43

వ్యాఖ్య : పర్యంత సంచారిత చామరస్య—పర్యంత-ఇరుప్రక్కల యందును, సంచారిత-వీచఁబడుచుండిన, చామరస్య-చామరములుగల, తస్య-ఆ బాలునియొక్క, కపోల లోలోభయ కాకపక్షాత్—కపోల-చెంపలయందు, లోల-కదలుచున్న, ఉభయకాకపక్షాత్-రెండు చిన్నజుట్లుగల, ఆననాత్-ముఖము నుండి, ఉచ్చరితః-పలుకఁబడిన, వివాదః-ఆజ్ఞారూపమైన వచనము, అర్ణవానాం-సముద్రములయొక్క, వేలాసు, అపి-తీరములందు సైతము, నచస్మాల-చలింప లేదు. ఉభయ పార్శ్వములందలి చామరముల గాలికిఁ గదలుచున్న పిల్లజుట్లుగల చెంపలు గలయతని నోటినుండి వెలువడిన యాజ్ఞారూపమైన వచనము చతుస్సముద్రతీరములందుఁగూడ తొట్రుపడక యందఱిచేతను శిరసావహింపఁబడు చుండెను. చపల సంసర్గమున్నను మహాత్ములమాటకు స్ఖలన ముండదనిభావము.

ఇందలి చామర, లోలకాకపక్ష, వేలాదులు చాపల్యసూచకములేకదా. "విశేషో వాదః వివాదః" అని విగ్రహము. ముఖ్యవచనము అని యర్థము.

శ్లో. నిర్వృత్త జాంబూనద పట్టశోభే
న్యస్తం లలాటే తిలకం దధానః,
తేనైవ శూన్యాన్యరిసుందరీణాం
ముఖాని స స్మేరముఖ శ్చకార. 44

వ్యాఖ : నిర్వృత్తజాంబూనదపట్టశోభే — నిర్వృత్త - కట్టఁబడిన, జాంబూనదప -బంగారురేకుయొక్క, శోభే-కాంతిగల, లలాటే-నొసటిమీద, న్యస్తం-ఉ ఁబడిన, తిలకం-బొట్టును, దధానః-ధరించినవాఁడును, స్మేర ముఖః-చిరునగవుతోఁగూడిన ముఖముగల, సః-ఆరాజు, అరిసుందరీణాం-శత్రు స్త్రీలయొక్క, ముఖాని-మొగములను, తేనైవ-ఆ తిలకముతోనే, శూన్యాని-శూన్యములైనవానిని, చకార-చేసెను. కనకపట్టముచేత నలంకరింపఁబడిన లలాటమునం దుంచఁబడిన తిలకముతోను, చిరునగవుగల ముఖముతోను శోభిల్లు నారాజు అక్లేశముగా శత్రువధచేసి వారిభార్యలముఖములను తిలకశూన్యములుగా గావించెనని భావము. ముఖముమీది తిలకము చెడకుండుటయు, చిరునగవుతరుగ కుండుటయు నతని పరాక్రమ విశేషమును సూచించును.

శ్లో, శిరీషపుష్పాధిక సౌకుమార్యః
ఖేదం స యాయాదపి భూషణేన,
నితాంతగుర్వీ మపి సోఽనుభావా
ద్ధురం ధరిత్ర్యా బిభరాంబభూవ. 45

వ్యాఖ్య : శిరీషపుష్పాధికసౌకుమార్యః-దిరిసెనపువ్వునుమించిన సుకు మారత్వముగలవాఁడు (కనుక), సః-అతఁగు, భూషణేన, అపి-అలంకారము చేత సైతము, ఖేదం-శ్రమను, యాయాత్-పొందువాఁడగునేమొ! సః-అట్టివాఁ డైన యతఁడు, నితాంతగుర్వీం, అపి-మిక్కిలిబరువుగలదైనను ధరిత్ర్యాః, ధురం-భూమియొక్కభారమును, అనుభావాత్-ప్రభావమువలన, బిభరాంబభూవ-

భరించెను. శిరీషపుష్పముకంటెను సుకుమారమైన మేనుగలయారాజు భూషణ ములచేతనే యలసటజెందును. అట్టివాఁడయినను శౌర్యసామర్థ్యములచేత ఎంతో బరువైన భూభారమును వహించెననఁగా నది యాశ్చర్యమని భావము.

శ్లో, న్యస్తాక్షరా మక్షరభూమికాయాం
కార్త్స్న్యేన గృహ్ణాతి లిపిం న యావత్,
సర్వాణి తావత్ శ్రుతవృద్ధయోగాత్
ఫలాన్యుపాయుంక్త స దండనీతేః. 46

వ్యాఖ్య : అక్షరభూమికాయాం-అక్షరలేఖనఫలకమునందు, న్యస్తాక్షరాం-ఉంచఁబడిన అక్షరరేఖలుగల, లిపిం-పంచాశద్వర్ణములుగల మాతృకను, కార్త్స్న్యేన-సంపూర్ణముగా, యావత్-ఎంతకాలమున, న గృహ్ణాతి-గ్రహింపలేదో, సః-ఆ సుదర్శనుఁడు, తావత్-అంతకాలములోనే, శ్రుతవృద్ధయోగాత్-విద్యావంతులగు పెద్దల సంబంధమువలన, సర్వాణి-సమస్తములైన, దండనీతేః-దండనీతి శాస్త్రముయొక్క, ఫలాని-ఉదాహరణరూపములైన ఫలితములను, ఉపాయుంక్త-అనుభవమువలన నుపయోగించెను. సుదర్శనుఁడు పంచాశద్వర్ణరూపమైన లిపి జ్ఞానమును బొందకపూర్వమే విద్యావంతులగు పెద్దల సంసర్గమువలన, వారు చెప్పు బోధలవలన సకల దండనీతి రహస్యములను ఎఱిఁగి యుపయోగింపగలిగె ననియు, లిపిని నేర్చుకొని గ్రంథములను జదువునప్పుడు ఓహో! ఇవి నాకుఁ దెలిసిన విషయములేనే! యని భావించుచుఁ బోల్చుకొనుటకుమాత్రము గ్రంథము లుపయోగపడుచుండెననియు భావము.

శ్లో. ఉరస్యపర్యాప్త నివేశభాగా
ప్రౌఢీభవిష్యంత ముదీక్షమాణా,
సంజాతలజ్జేవ త మాతపత్ర
చ్ఛాయాచ్ఛలే నోపజుగూహ లక్ష్మీః. 47

వ్యాఖ్య : ఉరసి-సుదర్శనుని వక్షస్థలమునందు, అపర్యాప్తనివేశభాగా-చాలని నివాసావకాశముగలది గావున, ప్రౌఢీభవిష్యంతం-వర్ధిష్యమాణుఁడగు

చున్న యతనిని, ఉదీక్షమాణా-ఎదురుచూచుచున్న, లక్ష్మీః-రాజ్యలక్ష్మి, సంజాత లజ్జా, ఇవ-ఆలింగనము చేసికొనుటకు సిగ్గుపడుచున్నదివలె! తం-ఆ సుదర్శనుని, ఆతపత్రచ్ఛాయాచ్ఛలేన-శ్వేతచ్ఛత్రముయొక్క నీడ యను మిషచేత, ఉపజుగూహ-ఆలింగనము చేసికొనెను. చిన్నవాఁడైన యతని వక్షస్థలము నాలింగనము చేసికొనుట సిగ్గుచేటు గనుక సుదర్శనుఁడెప్పుడు పెద్దవాఁడగునా? యని యెదురు చూచుచున్న రాజ్యలక్ష్మి శ్వేతచ్ఛత్రచ్ఛాయామిషచేత నప్పటికతని నాలింగనము జేసికొనెను. ఛత్రచ్ఛాయ లక్ష్మీరూపమని ప్రసిద్ధి. ప్రౌఢాంగన బాలుని నాలింగనము చేసుకొన్నచోఁ జూచినవారు నవ్వెదరని లక్ష్మి సిగ్గుపడి యట్లు చేసినదని భావము.

శ్లో, అనశ్నువానేన యుగోపమాన
మబద్ధమౌర్వీకిణలాంఛనేన,
అస్పృష్టఖడ్గత్సరుణాపి చాసీత్
రక్షావతీ తస్య భుజేన భూమిః. 48

వ్యాఖ్య : యుగోపమానం-బండికాడిపోలికను, అనశ్నువానేన-పొందని దైనప్పటికిని, అబద్ధమౌర్వీకిణలాంఛనేన—అబద్ధ-ఏర్పడని, మౌర్వీకిణ-అల్లె త్రాటిదెబ్బలవలన నేర్పడు గ్రంథులనెడు, లాంఛనేన-చిహ్నములుగలదైనను, అస్పృష్టఖడ్గత్సరుణా, అపి—అస్పృష్ట-తాకఁబడని, ఖడ్గత్సరుణా, అపి-ఖడ్గము యొక్క పిడికలది యైనప్పటికిని, తస్య-సుదర్శనునియొక్క, భుజేన-భుజము చేత, భూమిః-భూమి, రక్షావతీ-రక్షణముగలది, ఆసీత్-అయ్యెను. సుదర్శనుని భుజము,కాడివలె పెటిగి దృఢముగాలేకపోయినను, అల్లెత్రాటిదెబ్బలవలన కసుపు లేర్పడినది కాకపోయినను, ఖడ్గముష్టిని పట్టుకొన్నదిగాకున్నను, అతని తేజస్సు వలననే భూమిని రక్షింపఁగలిగెను. శిశువుగానున్నను మహాతేజస్వియైన యతని ప్రభావము వలన శత్రుచోర దుష్టుల బాధలేక ప్రజలు సుఖముగా నుండిరని భావము.

శ్లో. న కేవలం గచ్ఛతి తస్యకాలే
యయుః శరీరావయవా వివృద్ధిమ్,

---

వంశ్యా గుణాః ఖల్వపి లోకకాంతాః
ప్రారంభసూక్ష్మాః ప్రథిమాన మాపుః॥ 49

వ్యాఖ్య : కాలే, గచ్ఛతి (సతి)-కాలము గడచుచుండఁగా, తస్య-ఆసు దర్శనునియొక్క, కేవలం, శరీరావయవాః-ఒక శరీరభాగములు మాత్రమే, వివృద్ధిం-అభివృద్ధిని, న, యయుః-పొందలేదు (కింతు-మరియేమనగా), వంశ్యాః-వంశముననున్నవియు, లోకకాంతాః-జనప్రియములైనవియు, ప్రారంభ సూక్ష్మాః-ఆదిలోఁ గొంచముగాఁ గనపడినవియు నగు, తస్య-అతనియొక్క, గుణాః, అపి-ఔదార్య శౌర్య ధైర్యాదిసద్గుణములు సైతము, ప్రథిమానం-విస్తృతిని, ఆపుః, ఖలు-పొందినవిసుమా! కాలము గడచినకొలఁది యతని వక్షోబాహు ప్రభృతులైన యవయవములు పెరిగినట్లే వంశక్రమాగతములై ఆరంభమున సూక్ష్మముగా నుండిన శౌర్యము, ఔదార్యము మొదలయిన సద్గుణములుగూడ చాలా విస్తారముగాఁ బెఱిగినవని భావము.

శ్లో. స పూర్వజన్మాంతరదృష్టపారాః
స్మరన్నివాక్లేశకరో గురూణామ్,
తిస్రస్త్రివర్గాధిగమస్య మూలం
జగ్రాహ విద్యాః ప్రకృతీశ్చ పిత్ర్యాః. 50

వ్యాఖ్య : సః-సుదర్శనుఁడు, పూర్వజన్మాంతరదృష్టపారాః—పూర్వ-పూర్వపుడైన, జన్మాంతర-మరియొక జన్మమునందు, దృష్టపారాః-చూడఁబడిన యంతములుగలవానినే, స్మరన్, ఇవ-స్మరించుచున్న వాఁడువలె, గురూణాం-గురువులకు, అక్లేశకరః (సన్)-శ్రమనుగలిగింపనివాఁడగుచు, త్రివర్గాధిగమస్య-ధర్మార్థకామములనెడు త్రివర్గము యొక్క ప్రాప్తికి, మూలం-కారణమగు, తిస్రః-మూడైన, విద్యాః-త్రయీ, వార్తా, దండనీతి యనువిద్యలను, పిత్ర్యాః-తండ్రికి సంబంధించిన, ప్రకృతీః, చ-ప్రజలనుగూడ, జగ్రాహ-స్వాధీనము చేసికొనెను. సుదర్శనుఁడు పూర్వజన్మములందుఁ జదివిన విదలను స్మరించుచున్నట్లు గురువులకు శ్రమను గలిగింపక ధర్మార్థకామపురుషార్థములకు మూలమైన త్రయి, వార్త, దండనీతి యను మూడు విద్యలను, తండ్ర

యందు భక్తిగల ప్రజల యుక్తముగా స్వాధీనము చేసికొనెను. చాణక్యార్థ శాస్త్రము "ధర్మాధర్మౌ త్రయ్యాం అర్థానర్థౌ వార్తాయాం నయానయౌ దండ నీత్యాం" అని త్రయ్యాది విద్యలకు త్రివర్గమూలత్వమును జెప్పినది.

శ్లో. వ్యూహ్యా స్థితః కించిదివోత్తరార్ధ
మున్నద్ధచూడో ఽంచితసవ్యజానుః,
ఆకర్ణ మాకృష్టసబాణధన్వా
వ్యరోచతాస్త్రేషు వినీయమానః. 51

వ్యాఖ్య : అస్త్రేషు-ధనుర్విద్యయందు, వినీయమానః-శిక్షను పొందింపఁబడుచున్నవాఁడగుచు, ఉత్తరార్ధం-పూర్వదేహమును, కించిదివ-కొంచముగా, వ్యూహ్య-విస్తరింపఁజేసి, స్థితః- లిచినవాఁడై, అంచిత సవ్యజానుః-వంచఁబడిన యెడమ మోకాలుగలవాఁడై, ఆకర్ణం-చెవివఱకు, ఆకృష్ట సబాణధన్వా-లాగఁబడిన బాణయుక్తమగు ధనుస్సుగల వాఁడగుచు, వ్యరోచత-ప్రకాశించెను. ధనుర్విద్యాభ్యాస సమయమునందలి యతని వేషము, శరీరమునుంచిన స్థితి, బాణమును విడుచురీతి మొదలయిన యాకార విశేషము చూడముచ్చటగా నుండె నని భావము.

శ్లో. అథ మధు వనితానాం నేత్రనిర్వేశనీయం
మనసిజతరుపుష్పం రాగబంధప్రవాలమ్,
అకృతకవిధి సర్వాంగీణ మాకల్పజాతం
విలసితపద మాద్యం యౌవనం స ప్రపేదే. 52

వ్యాఖ్య : అథ-అటు తరువాత, సః-ఆ సుదర్శనుఁడు, వనితానాం-స్త్రీలకు, నేత్ర నిర్వేశనీయం-నేత్రములచేత భోగింపఁదగినదియగు (నేత్రపేయ మని యర్థము), మధు-తేనెవంటిదియు, రాగబంధప్రవాలం-అనురాగధార యనెడు చిగుళ్ళుగల, మనసిజతరుపుష్పం-మన్మథుఁడను వృక్షముయొక్క-పుష్పమైనదియు,అకృతకవిధి-అకృత్రిమసంపాదనమై, సర్వాంగీణం-సర్వావయవములందును వ్యాపించిన, ఆకల్పజాతం-ఆభరణసమూహమైనదియు, ఆద్యం-

మొట్టమొదటిదగు, విలసితపదం-విలాసస్థానమైన, యౌవనం-యౌవనమును, ప్రపేదే-పొందెను. అటుతరువాత యువతులకు నేత్రపేయమైన మధువుగాను, అనురాగపరంపరా ప్రవాళములతో గూడిన మన్మథతరుపుష్పముగాను, ప్రకృతి సిద్ధమై సర్వావయవములందును నెలకొన్న భూషణజాతముగాను, ప్రప్రథమ విలాసస్థానముగాను వేర్వేఱుదగిన యౌవనము నా సుదర్శనుఁడు పొందెనని భావము. ఆయావిశేషణములతోఁగూడిన మధు, పుష్ప, ఆకల్పజాత, విలాసపద ములతో నభేదరూపమున యౌవనము నాల్గువిధములుగాఁ జెప్పఁబడుటచేత నిది మాలారూపకమను అలంకారము. ఈ శ్లోకము అభిజ్ఞానశాకుంతలమునందలి "అనాఘ్రాతంపుష్పమ్" అను శ్లోకమును బోలియున్నది.

శ్లో. ప్రతికృతి రచనాభ్యో దూతి సందర్శితాభ్య
సమధికతర రూపాః శుద్ధసంతానకామైః,
అధివివిదు రమాత్యై రాహృతా స్తస్య యూనః
ప్రథమపరిగృహీతే శ్రీభువౌ రాజకన్యాః. 53

వ్యాఖ్య : దూతిసందర్శితాభ్యః—కన్యాపరీక్షణముకొఱకై ఆయాదేశము లకుఁ బంపఁబడిన దూతికలచేత చూపఁబడినట్టి, ప్రతికృతిరచనాభ్యః-చిత్రరుపుల యందు రచింపఁబడిన కన్యాప్రతిమలనుండి, సమధికతరరూపాః-ఎక్కువసౌంద ర్యముగలవారును, శుద్ధసంతానకామైః - రాజునకు మంచి సంతానము గలుగవలెనను కోరికగల, అమాత్యైః-మంత్రులచేత, ఆహృతాః- తీసుకరాబడిన, రాజకన్యాః-రాజకన్యలను, యూనః, తస్య-యువకుఁడైన ఆ సుదర్శనునియొక్క ప్రథమపరిగృహీతే-మొదట పరిగ్రహింపఁబడిన, శ్రీభువౌ- రాజ్యలక్ష్మీభూదేవులు, అధివివిదుః-సవతులనుఁగా జేసికొనిరి. యువకదశ వచ్చు టకు ముందే సుదర్శనునికి రాజ్యలక్ష్మితోను, భూదేవితోను పాణిగ్రహణము జరిగి యుండుటచేత అనఁగా రాజ్యాధికారము సంక్రమించియుండుటచేత వారిద్దఱును అతనికి పత్నులుగా వర్ణింపఁబడిరి. యౌవనదశ వచ్చినపిమ్మట దేశ విదేశము లకు దూతికలను బంపి చక్కని రాజకన్యలను వెదకి వారి చిత్రములు తెండని నియోగించిరి. అట్లు వారు తెచ్చిన రాజకన్యా చిత్రములలో మిక్కిలిరూపవతులై, జాతకచక్ర సాముద్రిక లక్షణములు రఘువంశప్రతిష్ఠకును, సత్సంతానముగలు గుటకును యోగ్యతగలవై యున్న రాజకన్యలను మంత్రులుతీసికొనిరాగా అట్టిరాజ

కన్యలను శ్రీభూదేవులు తమ సవతులనుగా జేసికొనిరి. అనఁగా నా రాజకన్య లతో సుదర్శన రాజునకు వివాహమంగళము నిర్వర్తింపఁబడెనని భావము. అధివేదనమనగా భార్యయుండఁగా మరియొక భార్యను జేసికొనుట. 'అధివిన్నా' యనఁగా సవతిగల భార్య. "కృతసాపత్నికా అధ్యూఢా అధివిన్నా" అని యమరము.

ఇది మహాకవి కాళిదాస కృత రఘువంశ
కావ్యమున వంశానుక్రమమను అష్టాదశ
స ర్గ కు కే శ వ ప ం తు ల
నరసింహశాస్త్రి రచిత
తెలుఁగు లఘువ్యాఖ్య

## మహాకవి కాళిదాస కృత

# రఘువంశము

## ఏకోనవింశ సర్గము

శ్లో. అగ్నివర్ణ మభిషిచ్య రాఘవః
స్వే పదే తనయ మగ్ని తేజసమ్,
శిశ్రియే శ్రుతవతా మపశ్చిమః
పశ్చిమే వయసి నైమిశం వశీ. 1

వ్యాఖ్య : శ్రుతవతాం-శాస్త్ర సంపన్నులలో, అపశ్చిమః-ప్రథముఁడును, వశీ-జితేంద్రియుఁడునగు, రాఘవః-రఘువంశీయుఁడైన సుదర్శనుఁడు, పశ్చిమే, వయసి-వార్థకమునందు, స్వే-తనదియగు, పదే-స్థానమునందు, అగ్ని తేజసం-అగ్నియొక్క తేజస్సువంటి తేజముగల, తనయం, అగ్నివర్ణం-కుమారుఁడైన అగ్నివర్ణుని, అభిషిచ్య-పట్టాభిషేకముఁజేసి యుంచి, నైమిశం-నైమిశారణ్యమును, శిశ్రియే-ఆశ్రయించెను. పాండిత్యము, శమదమములునుగల సుదర్శనుఁడు తన ముదుసలితనమునందు అగ్నివర్ణుఁడను పేరుగల కుమారుని తన సింహాసనమునందభిషేకించి తాను నైమిశారణ్యమునకు వానప్రస్థమును నిర్వర్తించుటకు వెళ్ళెనని భావము. అలంకారము : యమకము.

శ్లో. తత్ర తీర్థసలిలేన దీర్ఘికా॰
తల్ప మంతరిత భూమిభిః కుశైః,
సౌధవాస ముటజేన విస్మృతః
సంచికాయ ఫలనిస్పృహ స్తపః. 2

వ్యాఖ్య : తత్ర-ఆ నైమిశమునందు, తీర్థసలిలేన - నదీజలముచేత, దీర్ఘికాః-విహారయోగ్యములైన దిగుడుబావులను, అంతరితభూమిభిః-కప్పఁబడిన నేలగల, కుశైః-దర్భలచేత, తల్పం-హంసతూలికాతల్పమును, ఉటజేన-పర్ణశాల

చేత, సౌధవాసం-మేడలలోనుండుటను, విస్మృతః-మరచిన సుదర్శనుఁడు, ఫల నిస్పృహః-స్వర్గాదిఫలమునందు కోరికలేనివాఁడగుచు, తపః-తపస్సును, సంచికాయ-చేకూర్చుకొనెను. నదీస్నానములచేత దీర్ఘికావిహారములను, నేలపైఁబరచు కొన్న దర్భలచేత శయ్యాసౌఖ్యమును, పర్ణశాలలోనుండుటచేత సౌధనివాసమును మరచిన సుదర్శనుఁడు నిష్కామతపస్సును జేయుచుండెనని భావము. "సంచికాయ" సమ్ అను ఉపసర్గతోఁగూడిన చిఞ్-చయనే, అను శబ్వికరణిధాతువునకు లిట్‌లో "విభాషాచేః" అనుసూత్రమువలన అభ్యాసకుపరమైన చ కారమునకు కుత్వమువచ్చినరూపము.

శ్లో. లబ్ధపాలనవిధౌ న తత్సుతః
ఖేద మాప గురుణాం హి మేదినీ,
భోక్తు మేవ భుజనిర్జితద్విషా
న ప్రసాధయితు మస్య కల్పితా. 3

వ్యాఖ్య : తత్సుతః-ఆసుదర్శనపుత్రుఁడైన యగ్నివర్ణుఁడు, లబ్ధపాలనవిధౌ-లభించినరాజ్యమును పాలించుటయందు, ఖేదం-క్లేశమును. న, ఆప-పొందలేదు. హి-ఎందువలననైతే, భుజనిర్జితద్విషా-పరాక్రమముచేత నోడింపఁబడిన శత్రువులుగల, గురుణా-తండ్రిచేత, మేదినీ-భూమి, అస్య-ఈయగ్నివర్ణునికి, భోక్తుం, ఏవ-అనుభవించుటకుమాత్రమే, కల్పితా-ఏర్పాటుచేయఁబడినదో. ప్రసాధయితుం-కంటకశోధనము చేయుటకు, న-కాదో. తండ్రియగు సుదర్శనుఁడు శత్రువిజయముచేసి, యన్ని సౌకర్యములును జేకూర్చి యిచ్చిన రాజ్యమును పాలించుటలో అగ్నివర్ణునికి లేశముగూడ క్లేశముగలుగలేదు. కారణము అతఁడు సరిదిద్దవలసినదేదియు లేకుండుటయే. కనుక రాజ్యమును సుఖముగా నేలెను. ఇచ్చటి "ప్రసాధయితుం" అనుపదము అలంకరణమును ధ్వనించుచున్నది. కాఁగా, సర్వాలంకారశోభితయైన యువతిని అనుభవించుటయేకాని ఆమె ప్రసాధనచింత యువకునికుండనట్లు అగ్నివర్ణునకు రాజ్యసుఖానుభవమేకాని కంటకశోధన మక్కఱలేకపోయెనని భావము.

శ్లో. సోఽధికార మభికః కులోచితం
కాశ్చన స్వయ మవర్తయత్ సమాః,

సంనివేశ్య సచివే ష్వతః పరం
స్త్రీవిధేయనవయౌవనో ఽభవత్. 4

వ్యాఖ్య : అభికః-కాముకుఁడగు, సః-అగ్నివర్ణుఁడు, కులోచితం-వంశమునకుఁదగిన, అధికారం-ప్రజాపాలనమును, కాశ్చన, సమాః-కొన్నిసంవత్సరములు, స్వయం-తానే, అవర్తయత్-నడిపెను. అతఃపరం-ఆతరువాత, సచివేషు-మంత్రులయందు, సంనివేశ్య-ఉంచి, స్త్రీవిధేయనవయౌవనః—స్త్రీవిధేయ-స్త్రీలకు ఆధీనమైన, నవయౌవనః-నూతనయౌవనముగలవాఁడు, అభవత్-అయ్యెను. కాముకుఁడైన యగ్నివర్ణుఁడు వంశక్రమాగతము కులోచితమునైన ప్రజాపాలనాధికారమును కొన్ని సంవత్సరములు మాత్రము స్వయముగా చేపట్టి యాతరువాత మంత్రులకు పాలనాధికారము నప్పగించి తాను స్త్రీలోలుఁడై స్త్రీలకధీనుఁడై యుండెనని భావము. "కమ్రః కమయితాఽభీకః కమనః కామనోఽభికః" అని యమరము.

శ్లో. కామినీసహచరస్య కామినః
తస్య వేశ్మసు మృదంగనాదిషు,
ఋద్ధిమంత మధికర్ధి రుత్తరః
పూర్వ ముత్సవ మపోహ దుత్సవః. 5

వ్యాఖ్య : కామినీ సహచరస్య-స్త్రీమిత్రసహచరుఁడగు, కామినః, తస్య-కాముకుఁడగు నాయగ్నివర్ణునియొక్క, మృదంగనాదిషు-మృదంగనాదములుగల, వేశ్మసు-భవనములయందు, అధికర్ధిః-పూర్వపు దానికంటే యెక్కువ సంభారముగల, ఉత్తరః-తరువాతిదియగు నుత్సవము, ఋద్ధిమంతం-గీతవాద్యాది సాధనసంపన్నమై, పూర్వం-మొదట జరిగిన, ఉత్సవం-వేడుకను, అపోహత్-త్రోసివేసెను. (దానిని మించిన వైభవముతోనుండె ననియర్థము.) కామినులైన యువతులతోనుండు కాముకుఁడగు నగ్నివర్ణునియొక్క నిరంతరగీత నృత్త వాద్య మృదంగ ధ్వనులుగల రాజప్రాసాదములయందు పూర్వాపూర్వములగు వేడుకలకంటె నుత్తరోత్తరములగు వేడుకలు అధికతరగాన నృత్య మృదంగ యువతీయుక్తములై మొదట జరిగిన వానిని మరపించుచుండెననియు, అట్లుత్సవ పరంపర సాగుచుండెననియు రాజకార్యములు విడిచి స్త్రీలోలుఁడయ్యె ననియుభావము.

శ్లో. ఇంద్రియార్థ పరిశూన్య మక్షమః
సోఢు మేక మపి స క్షణాంతరమ్,
అంత రేవ విహరన్ దివానిశం
నవ్యపై క్షత సముత్సుకాః ప్రజాః. 6

వ్యాఖ్య: ఇంద్రియార్థ పరిశూన్యం —ఇంద్రియార్థ - శ్రవణాదీంద్రియ భోగ ములైన మధుర శబ్దాది విషయములచేత, పరిశూన్యం-శూన్యమైన (అవి లేని) ఏకం, అపి, క్షణాంతరం-ఒకక్షణకాలమునుగూడ, సోఢుం-సహించుటకు అ క్షః-అశక్తుఁడైన, సః-అగ్నివర్ణుఁడు, దివానిశం-పగళ్ళురాత్రులును, అంతః, ఏవ-అంతఃపురమునందే, విహరన్-విహరించుచు, సముత్సుకాః-తనదర్శనము నందు కోరికగల, ప్రజాః-జనులను, నవ్యపైక్షత-చూడఁదలపనేలేదు. ప్రతిక్షణము నందును ఇంద్రియార్థములైన స్రక్చందనవనితాగీత నృత్యాదులు లేకున్నచో శూన్యమైన ఆక్షణమును సహింపఁజాలక అంతఃపురమునందే దివారాత్రులు భోగలాలసుఁడై కాలముగడపుచున్న యగ్నివర్ణుని దర్శనార్థమై ప్రజలెంత కుతూహలముతో వచ్చినను వారి నతఁడు కంటితోఁగూడ చూచుటలేదని భావము.

శ్లో. గౌరవాద్యదపి జాతు మంత్రిణాం
దర్శనం ప్రకృతికాంక్షితం దదౌ,
తద్గవాక్ష వివరావలంబినా
కేవలేన చరణేన కల్పితమ్. 7

వ్యాఖ్య: జాతు-ఎప్పుడో ఒకసారి, మంత్రిణాం-మంత్రులయొక్క, గౌరవాత్-గురుభావమువలన (వారు చెప్పినందువలన), ప్రకృతికాంక్షితం-ప్రజలచేతఁగోరఁబడిన, యదపిదర్శనం-ఏదోయొకదర్శనమును, దదౌ-ఇచ్చెనా! తత్-అదికూడ, గవాక్షవివరావలంబినా-గవాక్షరంధ్రమునుండి వ్రేలాడుచున్న, కేవలేన, చరణేన-ఒకపాదముచేతమాత్రము, కల్పితమ్-ఇయ్యఁబడినది. ప్రజలు నిరీక్షించుచుండగా మంత్రులువచ్చి బ్రతిమాలుటవలన నామంత్రులమాటను దీసి వేయలేక యెప్పుడో ఒకసారి తన దర్శనము ప్రజలకు లభించునట్లుచేసెనా! అప్పుడుగూడ గవాక్షరంధ్రమునుండి యొకపాదమును వారు చూచునట్లు బైటికిఁ

బెట్టి, ముఖదర్శనముగూడ లేక పాదమును జూచితిరిగదా! ఇక వెళ్ళవచ్చు నను చుండెనని భావము.

శ్లో. తం కృతప్రణతయో ఽనుజీవినః
కోమలాత్మనఖరాగ రూషితమ్,
భేజిరే నవదివాకరాతప
స్పృష్టపంకజ తులాధిరోహణమ్. 8

వ్యాఖ్య : కోమలాత్మనఖరాగరూషితం—కోమల-మృదులమైన, ఆత్మ నఖరాగ-తనగోళ్ళయెఱ్ఱదనముచేత, రూషితం-వ్యాపించినదియు, నవ దివాకరాతప స్పృష్టపంకజ తులాధిరోహణం—నవదివాకరాతప-తొలిసూర్యరశ్మిచేత, స్పృష్ట-తాకబడిన, పంకజ-కమలముయొక్క, తులా-పోలికను, అధిరోహణం-పొందినట్టి, తం-అట్లు గవాక్షమునుండి వెలుపటికుంచఁబడిన యతని చరణమును, అనుజీవినః-ఆశ్రితులగు ప్రజలు, కృతప్రణతయః-చేసిననమస్కారములు గల వారగుచు, భేజిరే-సేవించిరి. కోమలమైన గోళ్ళకాంతులచేతఁ గప్పఁబడి యున్నందున ప్రాతఃకాలమునందు బాలసూర్యుని కిరణములఁచేగప్పబడిన పంకజమువలె నుండినదియు, గవాక్షరంధ్రమునుండి వెలుపలికుంచఁబడినదియు నగు ఆయగ్నివర్ణుని చరణమును నమస్కరించి ప్రజలు సేవించిరని భావము. "కోమలాత్మనఖరాగరూషితమ్" అనుదానిని "కోమలాంశునఖరాగభూషితం" అని ఇతర వ్యాఖ్యాతలు పఠించిరి. పైశ్లోకమునందలిది మల్లినాథునిపాఠము. ఇతరులపాఠమే సరసముగా నున్నట్లు తోచును.

శ్లో. యౌవనోన్నత విలాసినీ స్తన
క్షోభలోల కమలాశ్చ దీర్ఘికాః,
గూఢమోహనగృహా స్తదంబుభిః
స వ్యగాహత విగాఢమన్మథః. 9

వ్యాఖ్య : విగాఢమన్మథః-ప్రౌఢమన్మథుఁడుగల, లేక హృదయమునందు స్థిరముగానిల్చిన మన్మథుఁడుగల, సః-ఆయగ్నివర్ణుఁడు, యౌవనోన్నత. . . . కమలాః—యౌవన-తొలివయసుచేత, ఉన్నత-పెఱిగి నిక్కపొడచిన, విలాసి

నీ స్తన-విలాసవతుల స్తనములయొక్క, క్షోభ-సంచలనముచేత, లోల-కదలు చున్న, కమలాః- పద్మములుగలవియు, తదంబుభిః-ఆబావుల నీటిచేత, గూఢ మోహనగృహాః, చ-కప్పఁబడిన సురతభవనములు గలవియునగు, దీర్ఘికాః- దిగుడు బావులను (కోనేరులను), వ్యగాహత-ప్రవేశించి కలియఁబెట్టెను. ప్రగాఢ మైన మన్మథోద్రేకముగల అగ్నివర్ణుఁడు కఠినోన్నతములైన మదవతుల స్తనముల యొక్క ఆఘాతములచేతఁ జెదరి కదలుచున్న పద్మములతోను, జలాంతర్గత సురతగృహములతోను విరాజిల్లుచున్న దీర్ఘికలయందు విలాసవతులను గలిసి విహరించెనని భావము. "మోహనగృహ" మనఁగా జలాంతర్గతముగా సురతము ననుభవించుటకుఁ గట్టిన చిన్నగది. కొందరు వ్యాఖ్యాతలు స్త్రీ మర్మావయవ ములనియు నభిప్రాయపడిరి.

శ్లో. తత్ర సేకహృత లోచనాంజనైః
ధౌతరాగ పరిపాటలాధరైః,
అంగనా స్త మధికం వ్యలోభయ
న్నర్పిత ప్రకృతికాంతిభి ర్ముఖైః. 10

వ్యాఖ్య: తత్ర-ఆదిగుడుబావులయందలి, అంగనాః-స్త్రీలు, సేకహృత లోచనాంజనైః- సేక-జలసేచనముచేత, హృత-తొలగింపఁబడిన, లోచనాంజనైః- కన్నులకాటుకగలవియు, ధౌతరాగపరిపాటలాధరైః-ధౌత-జలముచేత తుడుచుక పోయిన, రాగ-లాక్షాది రంజనద్రవ్యముయొక్క, పరిపాటల-యెఱ్ఱదనముతోడి, అధరైః-పెదవులుగలవియు, (కనుకనే) అర్పిత ప్రకృతి కాంతిభిః-వ్యక్తము చేయఁబడిన సహజకాంతులుగల, ముఖైః-ముఖములచేత, తం-ఆయగ్నివర్ణుని, అధికం-పూర్వముకంటె నెక్కువగా, వ్యలోభయన్-ప్రలోభపరచిరి. అట్లు జలక్రీడలు సలుపుచున్న అగ్నివర్ణుని నచ్చట నుండిన స్త్రీలు జలావసేచనముచేత తొలఁగిన కండ్లకాటుకలును, తుడుచుకపోయిన పెదవుల రంజన ద్రవ్యములును గలగినవగుటచేత సహజసౌందర్యమును వెదజల్లుచున్న ముఖములచేత పూర్వము కంటె నెక్కువగా మోహపరచిరనియు, కృత్రిమశోభకంటే సహజశోభ మిన్న యనియు భావము. అవసేచనమనగా నొకరిపైనొకరు నీరు చల్లుట.

శ్లో. ఘ్రాణకాంత మధుగంధ కర్షిణీః
పానభూమిరచనాః ప్రియాసఖః,

అభ్యపద్యత స వాసితాసఖః
పుష్పితాః కమలినీరివ ద్విపః. 11

వ్యాఖ్య : ప్రియాసఖః-ప్రియాజనమిత్రుఁడైన, సః-అగ్నివర్ణుడు, ఘ్రాణ...క ణీః—ఘ్రాణకాంత-నాసికామనోహరమగు, మధుగంధ-మద్యపు వాసనచేత, క ణీః-ఆకర్షించుచున్న, పానభూమిరచనాః-మద్యపానగృహములను, వాసితాసఖః- దయేనుఁగులతోఁగూడిన, ద్విపః-గజము, పుష్పితాః-పువ్వులు పూచిన, కమలినీః-ఇవ-పద్మలతలసువలె, అభ్యపద్యత-చేరెను. ప్రియాసహితుఁడైన యగ్నివర్ణుఁడు మధుర పరిమళముచేత ఆకర్షించుచున్న మద్యపానశాలలను ఆడ యేనుగులతోఁగలిసిన మదగజము కమల యుక్తములగు తామర తీగలను ఆసక్తితోఁజేరునట్లు, ఉల్లాసమునఁ జేరెనని భావము. అలంకారము : ఉపమ. "వాసితా స్త్రీ కరిణ్యోశ్చ" అను నమరమువలన "వాసితా" శబ్దమునకు స్త్రీ యనియు, ఆడయేనుఁగనియు నర్థములు.

శ్లో. సాతిరేక మద కారణం రహః
తేన దత్త మభిలేషు రంగనాః,
తాభి రప్యుపహృతం ముఖాసవం
సోఽపిబ ద్వకులతుల్య దోహదః. 12

వ్యాఖ్య : అంగనాః-స్త్రీలు, రహః-ఏకాంతమున, సాతి...రణం—సాతిరేక-అత్యంతమైన, మద-మైమరపునకు, కారణం-హేతువైనదియై, తేన-అగ్నివర్ణునిచేత, దత్తం-ఇయ బడు ముఖాసవమును, అభిలేషుః-అభిలషించిరి. వకులతుల్యదోహదః-పొగడ -తో సమానమగు దోహదముగల, సోఽపి (సః+అపి)-అతఁడుసైతము, భిః-ఆ యంగనలచేత, ఉపహృతం-ఇయ్యఁబడిన, ముఖాసవం-కొంచము త్రాగి, లేక ఒక ప్రక్కన త్రాగుచు నిచ్చిన మద్యమును అపిబత్-పానము చేసెను. కొందరు విలాసవతులు రహస్యప్రదేశమున యగ్నివర్ణునిచే నీయబడిన ముఖాసవమును గోరిరనియు, పొగడచెట్టు స్త్రీ ముఖాసవమును దోహదముగాఁ గొనునట్లు వారు త్రాగిన లేక పానపాత్రయం దొక ప్రక్కనఁ ద్రాగుచున్న స్త్రీముఖాసవమునం దభిలాషగలవాఁడై అతఁడు పానముచేసెననియు భావము. అట్లు స్త్రీ సహితముగా నతని మద్యపానకేళి జరిగెను.

శ్లో. అంక మంకపరివ ర్తనోచితే
తస్య నిన్యతు రశూన్యతా ముభే,
వల్లకీ చ హృదయంగమ స్వనా
వల్గువాగపి చ వామలోచనా. 13

వా ఖ్య : అంకపరివ ర్తనోచితే — అంక-తొడలపైన, పరవ ర్తన-పొర్లుటకు విహరించుటకు), ఉచితే-తగిన, ఉభే-ఇద్దఱును, తస్య-ఆయగ్ని వర్ణునియొ క్క, అంకం-ఒడిని, అశూన్యతాం-పూర్ణత్వమును, నిన్యతుః-పొందించిరి. (ఆయిద్దఱు ఎవరనగా) హృదయంగమస్వనా-మనోహరనాదముగల, వల్లకీ, చ-వీణయును, వల్గువాక్-మధురభాషిణియగు, వామలోచనాపి, చ-కామినియును, అగ్ని వర్ణుఁడు తొడలపై మనోహరనాదముగలవీణను, మధుకరకంఠము గల ప్రియురాలిని అధివసింపఁజేసికొని, వారి వాద్యధ్వని మధురగానములతోఁ గ్రీడించుచు నానందపరవశుఁడయ్యెను. 'పరివ ర్తన' శబ్దము వీణమార్పులను, ప్రియురాలిశయనమును సూచించును. వామలోచన యనఁగా చక్కని కన్నులు గల స్త్రీ.

శ్లో. స స్వయం ప్రహత పుష్కరః కృతీ
లోల మాల్య వలయో హరన్ మనః,
న ర్తకీ రభినయాతిలంఘినీః
పార్శ్వవ ర్తిషు గురు ష్వలజ్జయత్. 14

వ్యాఖ్య : కృతీ-నేర్పరియై, ప్రహతపుష్కరః-స్వయముగా వాయించిన మద్దెల మొదలగువాని ముఖములుగలవాఁడును, లోలమాల్యవలయః-కదలుచున్న పూలహారములు కడియములును గలవాడునై, మనః-న ర్తకీజనమనస్సును, హరన్-ఆకర్షించుచున్న, సః-ఆయగ్నివర్ణుఁడు, అభినయాతిలంఘినీః-అభినయములందుఁ దొట్రుపడుచున్న, న ర్తకీః-విలాసినులగు నట్టువక త్తెలను, గురుషు-నాట్యాచార్యులు, పార్శ్వవ ర్తిషు (సత్సు)-ప్రక్కలనున్నవారగుచుండగానే, అలజ్జయత్-సి -పడునట్లుచేసెను. వాద్యవాదన శృంగారలీలల యందునేర్పరియైన అగ్నివ ఁడు మెడలోని పూలదండలు, చేతులకడియములును జలించునట్లు మృదంగాదుల వాయించుచు న ర్తకీజనుల మనస్సును హరించుచుండగా

నతినిపైఁగల ధ్యానముచేత నర్తనగతులు తప్పుచున్న యా నట్టువకత్తెలు తమ నాట్యాచార్యులు ప్రక్కలనేయున్నందున వారినిజూచి తమ మనశ్చాంచల్యభిన్న నర్తనగతులకు సిగ్గుపడుచుండిరని భావము.

శ్లో. చారు నృత్యవిగమే చ తన్ముఖం
స్వేదభిన్నతిలకం పరిశ్రమాత్,
ప్రేమదత్తవదనానిలః పిబ
న్నత్యజీవ దమరాలకేశ్వరౌ. 15

వ్యాఖ్య : చారు-అందమైనదియు, నృత్యవిగమే-నాట్యావసానమునందు, పరిశ్రమాత్-నర్తన ప్రయాసముచలన, స్వేదభిన్నతిలకం-చెమటచేత చెడిపోయిన తిలకముగలదియునగు, తన్ముఖం-ఆనర్తకి ముఖమును, ప్రేమదత్త వదనానిలః—ప్రేమ-అనురాగముచేత, దత్త-ప్రసరింపఁజేయఁబడిన, వదనానిలః-ముఖమారుతముగలవాఁడై, పిబన్-త్రాగుచు (ముద్దు పెట్టుకొనుచు) అమరాలకేశ్వరౌ-దేవతల కధిపతియగు నింద్రుని, అలకాధిపతియగు కుబేరుని, అత్యజీవత్-మించి జీవించెను. నృత్యము ముగిసిన పిమ్మట నర్తనశ్రమచేతఁ గలిగిన చెమటచే తుడుచుకపోయిన తిలకముగలిగి, ముద్దులొలుకుచున్న యా నట్టువకత్తె ముఖమును ప్రేమ ప్రసారితమైన తన ముఖమారుత యుక్తముగా ముద్దుగొనుచున్న యగ్నివర్ణుఁడు దేవాంగనాభోగము లనుభవించునింద్రునికిని, యక్షకాంతాసుఖము ననుభవించు కుబేరునికిని లభింపని సౌఖ్యము ననుభవించెను. దేవజాతికిలేని స్వేద మీ నర్తకికిఁ గలుగుటవలన నిట్టిసుఖము ఇంద్ర కుబేరులకు లేదనియు నందువలన నగ్నివర్ణుఁడు వారి నతిక్రమించి జీవించెననియు భావము.

శ్లో. తస్య సావరణ దృష్ట సంధయః
కామ్యవస్తుషు నవేషు సంగినః,
వల్లభాభి రుపసృత్య చక్రిరే
సామిభుక్త విషయాః సమాగమాః. 16

వ్యాఖ్య : నవేషు-నూతనములైన, కామ్యవస్తుషు-భోగ్యవస్తువులయందు, సంగినః-ఆసక్తుఁడైన, తస్య-అగ్ని వర్ణునియొక్క, సావరణదృష్ట సంధయః—

సావరణ-ప్రచ్ఛన్నములును, దృష్ట-ప్రకాశములునునగు, సంధయః-సాధనములుగల, సమాగమాః-నూతన స్త్రీ సంగమములు, వల్లభాభిః-రాణులచేత, లేక పూర్వభుక్త విలాసినులచేత, ఉపస్పృత్య-అతని నూతన సంకేత స్థలములకువెళ్ళి, సామిభుక్త విషయాః— సామిభుక్త-సగమే యనుభవించిన, విషయాః-వనితాసంభోగ ప్రసక్త్యందనాదులు గలవిగా, చక్రిరే-చేయఁబడినవి. నిత్యనూతన కామ్య వస్తువులందు ఆసక్తుఁడైన యగ్నివర్ణుఁడు భిక్షుక్యాదులద్వారా ప్రచ్ఛన్నముగాను, ఒకప్పుడు తానే స్వయముగాను సంధానములు కుదిరించుకొని క్రొత్తజవరాంగ్రడతో నలుపు చున్న సంభోగాదులను అతని రాణులు, లేదా పూర్వపరిచతలైన విలాసినులు ఆనూతన సంకేతములకు వెళ్ళి విఘ్నపరచి అతని భోగములను అర్థోపభుక్తము లుగా మార్చుచుండిరని భావము. కారణమేమనఁగా వారివద్ద సంపూర్ణసౌఖ్యము ననుభవించినచో పూర్వప్రియలైన తమను కన్నెత్తి చూడదేమో యన్నభయమే. ఇచ్చట గోనర్దీయుఁడను కామశాస్త్రవేత్తవచన మనుసంధానము చేయఁదగి యున్నది. "సంధిర్ద్వివిధః; సావరణః ప్రకాశశ్చ, సావరణోభిక్షుక్యాదినా, ప్రకాశః స్వయముపేత్యకేనాపి" అని.

శ్లో. అంగులీ కిసలయాగ్ర తర్జనం
భ్రూవిభంగ కుటిలం చ వీక్షితమ్,
మేఖలాభి రసకృచ్చ బంధనం
వంచయన్ ప్రణయినీ రవాప సః. 17

వ్యాఖ్య : సః-అగ్నివర్ణుఁడు, ప్రణయినీః-ప్రేయసులను, వంచయన్-మోసగించుచుండుటచేత, అంగులీకిసలయాగ్రతర్జనం-చిగురాకులవంటి చూపుడు వ్రేళ్ళ బెదిరింపును, భ్రూవిభంగకుటిలం-కనుబొమలు చిట్లించుటచేత కుటిలమైన, వీక్షితం, చ-ప్రియురాండ్రచూపును, మేఖలాభిః-వారిమొలనూళ్ళచేత, అసకృత్-అనేక పర్యాయములు, బంధనం, చ-కట్టివేయుటను, అవాప-పొందెను. ఇతర నూతన నాయికల పద్దికి వెళ్ళుచు మోసగించుచున్న యగ్నివర్ణుని ప్రేయసీ జనము వ్రేళ్ళుచూపి బెదిరించుచును, బొమలు చిట్లించి కోపముతోఁ జూచుచును, తమ మొలనూళ్ళతో బంధించుచును దండించిరని భావము. అపరాధము దండనము రెండును సరసములే.

శ్లో. తేన దూతివిదితం నిషేదుషా
పృష్ఠతః సురతవార రాత్రిషు,
శుశ్రువే ప్రియజనస్య కాతరం
విప్రలంభ పరిశంకినో వచః. 18

వ్యాఖ్య : సురతవారరాత్రిషు-సంభోగదినములయొక్క రాత్రులయందు, దూతివిదితం-దూతికలకు మాత్రము తెలియనట్లుగా, పృష్ఠతః-ప్రియురాండ్ర యొక్క వెనుక భాగమునందు, నిషేదుషా-కూర్చొనియున్న, తేన-అగ్నివర్ణుని చేత, విప్రలంభపరిశంకినః-తమ వియోగమును అనుమానించుచున్న, ప్రియ జనస్య-ప్రేయసీజనముయొక్క, కాతరం-భయముతోఁగూడిన, వచః-వచనము, శుశ్రువే-వినఁబడుచుండినది. ఒక్కొక్క ప్రియురాలివద్ది కొక్కొక్కరాత్రి వెళ్ళి యచ్చటి దూతికకుమాత్రము తనరాక తెలియునట్లుగా ప్రియురాలివెనుక చాటునఁ గూర్చొనుచున్న యగ్నివర్ణుఁడు ఆ ప్రియురాలికిఁ దనయందుఁగల ప్రేమాతిశయమును ఆమె తన దూతికతో సంభాషించు వచనములవలనఁ దెలిసి కొనుచుండెననియు, ఆప్రియురాలు తనరాక ఆలస్యమైనది, తాను వచ్చునా లేదా? తనను విడుచునా! యేమి యని భయపడుచు, ఎట్లైనను ప్రియుని రప్పింపవే! యని దూతికతోఁబలుకు భయవచములను విని యానందించుచుండెననియు భావము. 'సురతవారరాత్రిషు' అన్నపదము ఒక్కొక్క నాయికకు ఒక్కవారము సోమ, మంగళ ఇత్యాదులు, ఏర్పరచి విహరించుచుండెనన్న భావమును సూచిం చును. 'దూతివిదితం' అన్న పదము, లంచములు పొందుచున్న దూతికలు అగ్ని వర్ణుని వ్యవహారము తెలిసియుఁ దమయజమానురాండ్రగు నాయికలవద్ద తెలియ నట్లు నటించుచుండిరని సూచించును.

శ్లో. లౌల్యమేత్య గృహిణీపరిగ్రహాత్
నర్తకీ ష్వసులభాసు తద్వపుః,
వర్తతే స్మ స కథంచి దాలిఖ
న్నంగులీక్షరణ సన్నవర్తికః. 19

వ్యాఖ్య : గృహిణీపరిగ్రహాత్-భార్యల నిర్బంధ సమాగమమువలన, నర్తకీషు-వేశ్యలు, అసులభాసు (సతీషు) -లభింపనివారలగుచుండఁగా, లౌల ం-

వారినిఁ గలిసికొనవలయునను తొందరపాటును, ఏత్య-పొంది, అంగుళీక్షరణ సన్నవర్తికః—అంగుళీ-వ్రేళ్ళయొక్క, క్షరణ-చెమటచేత, సన్న-జారిన, వర్తికః-కుంచెగలవాఁడైన, సః-అగ్నివర్ణుఁడు, తద్వపుః-ఆవేశ్యలయొక్క శరీరమును, ఆలిఖన్-చిత్రించుచు, కథంచిత్-ఎట్లో, వర్తతే, స్మ-ఉండెను. గృహిణీజనము బలవంతముగాఁ దమవద్దనుంచుకొన్నందున విలాసినులను గలిసికొనుట దుర్లభముకాఁగా మనస్సు స్తిమితపడక, ఆ వేశ్యలనే మనస్సునఁదలచుకొనుచు, వారి రూపములను జిత్రించి యాప్రతికృతుల దర్శనముచేత వినోదమును బొందఁదలఁచెను. కాని చిత్రరచన చెయ్యఁబోగా సాత్త్వికభావోద్రేకమున చేతివ్రేళ్ళు చెమర్చి కుంచె జారిపోవుచుండ నెట్లో వ్రాయుచు నతికష్టముగాఁ గాలముఁగడపుచుండెనని భావము.

శ్లో. ప్రేమగర్విత విపక్ష మత్సరా
దాయతాచ్చ మదనా న్మహీక్షితమ్,
నిన్యు రుత్సవవిధిచ్ఛలేన తం
దేవ్య ఉజ్ఝితరుషః కృతార్థతామ్. 20

వ్యాఖ్య : ప్రేమగ....రాత్ — ప్రేమ - తమపై ప్రియునికిఁబ్రేమ గలదను కారణముచేత, గర్విత-గర్వమెక్కిన, విపక్ష-ప్రతిపక్షమైన సపత్నీ జనమునందలి, మత్సరాత్-వైరమువల్లను, ఆయతాత్-తమలో ప్రవృద్ధ న, మదనాచ్చ (మదనాత్ + చ)-మన్మథబాధవల్లను, దేవ్యః-రాణులు, ఉ త రుషః-విడిచిపెట్టిన కోపముగలవారలగుచు, తం, మహీక్షితం - ఆయగ్ని ర్ణ రాజును, ఉత్సవవిధిచ్ఛలేన-మదనమహోత్సవమును నడుపు నెపముచేత, కృతార్థతాం-కృతార్థత్వమును, నిన్యుః-పొందించిరి. అగ్నివర్ణుఁడు తమను ప్రేమించుటలేదన్నకోపము గలవారేయైనను, మాయందే ప్రేమగలిగియున్నాఁ డని గర్వపడుచున్న సవతులమీది వైరమువల్లను, పతియొక్క చిరవియోగము సహింపఁజాలని తమ మన్మథోద్రేకమువల్లను రాణులు కోపమును విడిచి, మదన మహోత్సవవిధానమును నిర్వర్తించుట కన్ననెపమున నతనిని బిలుచుకవెళ్ళి తమ కోర్కెలను దీర్చుకొని కృతార్థలై యతనినిఁగృతార్థునిఁజేసిరని భావము.

శ్లో. ప్రాత రేత్య పరిభోగశోభినా
దర్శనేన కృతఖండనవ్యథాః,

ప్రాంజలిః ప్రణయినీః ప్రసాదయన్
సోఽదునోత్ ప్రణయమంథరః పునః 21

వ్యాఖ్య : సః - ఆయగ్నివర్ణుఁడు, ప్రాతః - మరుసటియుదయమున, ఏత్య-వచ్చి, పరిభోగశోభినా-సంభోగానుభవముచే ప్రకాశించుచున్న, దర్శనేన - తననుజూపుటచేత, కృతఖండనవ్యథాః—కృత - కలిగింపఁబడిన, ఖండన-ఇతరస్త్రీసంభోగమువలని, వ్యథాః-మనోవేదనగల, ప్రణయినీః-ప్రియురాండ్రను, ప్రాంజలిః-దోసిలొగ్గినవాఁడై, ప్రసాదయన్-ఊరడించువాఁడగుచున్నను, ప్రణయమంథరః-నర్తకీప్రణయఁబ్ధి లేనివాడగుచు, పునః-మరల, అదునోత్-పరితాపమునుజెందెను. రాణుల బలవంతపు సంభోగము ననుభవించిన యగ్నివర్ణుఁ డాచిహ్నములతో మరునాటి ప్రాతఃకాలమున వచ్చిదర్శనము నీయఁగా విలాసినులకు మనోవ్యథయే కలిగెననియు, దానినిఁ దొలఁగించుట కతఁడు ప్రాంజలియై బ్రతిమాలినను వారికతనిపైఁ బ్రణయము గలుగనందుల కతనికి మరల మనోవ్యథయే కలిగెననియు భావము. ఇచ్చట విలాసినులు ఖండితానాయికలుగా సూచింపఁబడుచున్నారు "జ్ఞాతేఽన్యాసంగవికృతే ఖండితేర్ష్యాకషాయితా" అని లక్షణము.

శ్లో. స్వప్నకీర్తితవిపక్ష మంగనాః
ప్రత్యభైత్సు రవదంత్య ఏవ తమ్.
ప్రచ్ఛదాంత గలితాశ్రు బిందుభిః
క్రోధభిన్నవలయై ర్వివర్తనైః. 22

వ్యాఖ్య : స్వప్నకీర్తితవిపక్షం—స్వప్న-స్వప్నములందు, కీర్తిత-పేర్కొనఁబడిన, విపక్షం-పరస్త్రీలుగల, తం-అగ్నివర్ణుని అంగనాః-విలాసినులు, అవదంత్యః, ఏవ-ఏమియు ననకయే, ప్రచ్ఛ...భిః—ప్రచ్ఛదాంత-పరుపునడుమ, గలిత-జారిన, అశ్రుబిందుభిః-కన్నీటిచుక్కలు గలవియు, క్రోధభిన్నవలయైః-కోపముచేత పగిలిన గాజులు గలవియునగు, వివర్తనైః-పక్కపై దొరలుటలచేత, ప్రత్యభైత్సుః-ప్రతిక్రియ చేసిరి (బెదిరించిరని యర్థము). తమప్రక్కన శయనించి స్వప్నమున గోత్రస్ఖలనము అనఁగా

మరియొక నాయికపేరు నుచ్చరించిన యగ్నివర్ణునిపైఁ గోపగించుకొన్న విలాసినులు అతనిని గుఱించి యేమియుననకయే పడకపైఁగన్నీటి చుక్కలు రాల్చుచు, కోపవశమున గాజులు చిట్లించుకొనుచు, పరుపున దొర్లుచు ప్రతీకారము చేయుచుఁ దిరస్కరించిరని భావము.

శ్లో. క్లుప్తపుష్పశయనాన్ లతాగృహా
నేత్య దూతికృతమార్గదర్శనః,
అన్వభూత్పరిజనాంగనారతం
సో ఽవరోధభయవేపథూత్తరమ్. 23

వ్యాఖ్య : సః-అగ్నివర్ణుడు, దూతికృత మార్గదర్శనః (సన్)-దూతికల చేతఁ దెలుపఁబడిన దారిగలవాఁడగుచు, క్లప్తపుష్పశయనాన్-పరువఁబడిన పూసెజ్జలుగల, లతాగృహాన్-లతామండపమును, ఏత్య-చేరి, అవరోధభయవేపథూత్తరం—అవరోధ-అంతఃపురాంగనలవలని, భయ-భయముచేతనైన, వేపథు-కంపము, ఉత్తరం-ప్రధానముగాఁ గనఁబడుచుండఁగా, పరిజనాంగ నారతం-దాసీసంభోగమును, అన్వభూత్-అనుభవించెను. దూతికలు మార్గమును జూపుచుండ పూలపాన్పులతో సిద్ధపరచిన పొదరింటినిజేరి రాణులకుఁ దెలిసినఁజిక్కు వచ్చునను భయముచేతనే ఆ దాసీల పొందును వణకుచు ననుభవించెనని భావము. "దూతికృత" అనుచోట "దూతీకృత" అనియుండవలసియుండగా హ్రస్వప్రయోగము ఛందోభంగభయముచేత కవి చేసినట్లు మల్లినాథుఁడభిప్రాయపడెను. "అపి మాషం మషం కుర్యాత్ ఛందోభంగం త జేత్ గిరామ్" అన్నలోకోక్తిని సైత ముదాహరించెను. కాని ఈసర్గ 18, 38 కాలలోను అట్లే యున్నది. ఇకారాంత దూతి శబ్దముకూడఁ గలదు. కాళిదాసు ఛందోభంగ భయమా? "గృహ" శబ్దము పుంలింగ బహువచనము.

శ్లో. నామ వల్లభజనస్య తే మయా
ప్రాప్య భాగ్య మపి తస్య కాంక్ష్యతే,
లోలుపం నను మనో మమేతి తం
గోత్రవిస్ఖలిత మూచు రంగనాః. 24

వ్యాఖ్య : మయా-నాచేత, తే, వల్లభజనస్య-నీ ప్రియురాలియొక్క నామ-పేరును, ప్రాప్య-పెట్టుకొని, తస్య-ఆవల్లభజనముయొక్క, భాగ్యం, అపి-అదృష్టముకూడ, కాంక్ష్యతే-కోరఁబడుచున్నది. నను-ఓహో! మమ, మనః-నాయొక్కమనస్సు, లోలుపం-ఎంతయాశకలది! ఇతి-ఇట్లనుచు, అంగనాః-అతని ప్రియురాండ్రు, గోత్రవిస్ఖలితం-నిద్రలోఁ గలువరించిన క్రొత్తనాయిక పేరుగల, తం-అగ్నివర్ణునుద్దేశించి, ఊచుః-పలికిరి. అగ్నివర్ణుఁడు స్వప్నము నందుఁ గ్రొత్తనాయిక పేరు నుచ్చరించిన పిమ్మట నతని ప్రియురాండ్రు ఒక్కొక్కరుగా, నేను నీస్వప్నసుందరి పేరు పెట్టుకొని ఆమె భాగ ము పొంద వలెనని నామనస్సు కోరుచున్నది. ఈమనస్సున కెంతయాశ ఉ ది! అని యెత్తిపొడుపు మాటలతో నగ్నివర్ణునిఁ దిరస్కరించిరని భావము. "ఆ భాగ్య" మనగా నగుబాటు పాలగు నపకీర్తియని సూచన.

శ్లో. చూర్ణబభ్రు లులితస్రగాకులం
ఛిన్నమేఖల మలక్తకాంకితమ్,
ఉత్థితస్య శయనం విలాసినః
తస్య విభ్రమరతా న్యపావృణోత్. 25

వ్యాఖ్య : చూర్ణబభ్రు-రాలిన కుంకుమాది చూర్ణములచేత పింగళవర్ణము గలదియు, లులితస్రగాకులం-నలిగిన పూలదండలచేత చెదిరినదియు, ఛిన్నమేఖలం-తెగి జారిపడిన మొలనూలు గలదియు, అలక్తాంకితం-పాదలాక్షార సముద్రలు గలదియునగు, శయనం-పరుపు, ఉత్థిత స్య-పడకపైనుండి లేచినట్టి, విలాసినః-భోగపరాయణుఁడగు, తస్య-అగ్నివర్ణునియొక్క, విభ్రమరతాని-బంధయుక్తములైన లీలాసురత విశేషములను, అపావృణోత్-స్పష్టముగా వెల్లడించెను. భోగలాలసుఁడై నిద్రనుండి లేచిన యగ్నివర్ణుని శయనము, "వ్యాన "తబంధ" రతిలో అధోముఖగానుండిన నాయికముంగురులనుండి రాలిన కుంకు మాదులచేత పింగళవర్ణముగలదియై, "కరిపద" బంధరతియందు నాయిక భూమిపైనుంచిన తలగలదియగుటచేత క్రిందపడి నలిగిన పూలదండలు గలదియై, "హరివిక్రమబంధ" రతి సమయమునసాయిక ఒకకాలునుపైకినెత్తుటచేత జారిపడి తెగినమేఖలగలదియు,'ధైనుకబంధ'రతివేళనాయిక తనపాదములనుపడకపైనుంచి నిలువఁబడి వంగుటచేత పాదలాక్షారసముద్రలు గలదియునగుచు, నతని విభ్ర రతములను అనగా వివిధ రతిబంధయుక్త సురతవిశేషములను స్పష్టముగా వెల్ల

డించెనని భావము. "రతిరహస్య" మనుకామశాస్త్రగ్రంథము ఈ బంధముల నిట్లు వివరించినది: శ్లో. "వ్యానతం" రతమిదం ప్రియాయది స్యాదధోముఖ చతుష్ప దాకృతిః, తత్కటిం సమధిరుహ్యవల్లభః స్యాత్ వృషాదిపశు సంస్థితస్థితిః॥ భూగత స్తన భుజాస్యమస్తకా మున్నతస్ఫిచ మధోముఖీం స్త్రియమ్। క్రామతి స్వకరకృష్టమేహనే వల్లభే "కరిపదం" తదుచ్యతే. "యోషిదేకచరణే సముత్థితే జాయతే హి "హరివిక్రమా"హ్వయః॥ న్యస్తహస్తయుగలా నిజేపదే యోషి దేతి కటిరూఢవల్లభా। అగ్రతోయది శనై రధోముఖీ "ధైనుకం" వృషవదు న్నతే ప్రియే॥

శ్లో. స స్వయం చరణరాగ మాదధే

యోషితాం న చ తథా సమాహితః,

లోభ్యమాననయనః శ్లథాంశుకై

ర్మేఖలాగుణపదై ర్నితంబిభిః. 26

వ్యాఖ్య : సః-అగ్నివర్ణుఁడు, స్వయం-తానే, యోషితాం-యువతులకు, చరణరాగం-పాదములయందు లాక్షారసమును, ఆదదే-పూయమొదలిడెను. కాని శ్లథాంశుకైః-జారిన చీరలుగలవియు, నితంబిభిః-నితంబములతోఁ గూడినవియు నగు, మేఖలాగుణపదైః-మొలనూలిదారములకు నివాసములగు జఘనముల చేత, లోభ్యమాననయనః-లోభపెట్టఁబడుచున్న కన్నులుగలవాఁడగుచు, తథా-ఆవిధ ముగానే, సమాహితః-నిశ్చలమనస్కుఁడై, న చ ఆదధే-పూయలేదు. అగ్ని వర్ణుఁడు యువతులపాదములకు లాక్షారసమును తానే పూయుటకు సిద్ధపడెను. కాని తనస్పర్శవలన వస్త్రములు జారి నితంబసహితముగా బయటపడిన జఘన ములచేత ఆకర్షింపఁబడిన దృష్టిగలవాఁడగుటచేత ఎట్లు శ్రద్ధతో పూయవలెనో అట్లు అవహితుఁడై వారికిఁ జరణరాగమును చక్కగా సమర్పింపలేకపోయెనని భావము. స్త్రీయొక్క కటిపశ్చాత్భాగమునకు 'నితంబ' మనియు, పూర్వభాగము నకు "జఘన" మనియుఁబేర్లు, "పశ్చాన్నితంబః స్త్రీకట్యాః క్లీబేతు జఘనం పురః" అని యమరము.

శ్లో, చుంబనే విపరివర్తితాధరం

హస్తరోధి రశనావిఘట్టనే,

విఘ్నితేచ్ఛ మపి తస్య సర్వతో
మన్మథేంధన మభూ ద్వధూరతమ్. 27

వ్యాఖ్య : చుంబనే-ముద్దుగొనుట నారంభింపఁగానే, విపరివర్తితాధరం-ప్రక్కకు త్రిప్పిన పెదవిగలదియు, రశనావిఘట్టనే-చీరముడితో మొలనూలిని తొలఁగించుటకుఁ బూనఁగనే, హస్తరోధి-చేతినడ్డగించునదియు, సర్వతః-అంతట, విఘ్నితేచ్ఛం, అపి-ఆటంకపరుపఁబడిన ఇచ్ఛగలదియైనను, వధూరతం-యువతీ సంభోగము, తస్య-అగ్నివర్ణునికి, మన్మథేంధనం-కామోద్రేకముఁగలిగించునదే, అభూత్-అయ్యెను. చుంబనమున మొగత్రిప్పినను, పోకముడి విడువఁబోగా చేతినిఁద్రోసివేసినను, ప్రతిప్రయత్నమును అట్లు విఘ్నపరచుచున్నను అగ్నివర్ణునికి అవియన్నియుఁ గామోద్దీపనములేయై ఆ యువతి సంభోగమును బలవంతముగా లోబరచుకొని యనుభవించెనని భావము.

శ్లో. దర్పణేషు పరిభోగదర్శినీః
నర్మపూర్వ మనుపృష్ఠసంస్థితః,
ఛాయయా స్మితమనోజ్ఞయా వధూః
హ్రీనిమీలితముఖీ శ్చకార సః. 28

వ్యాఖ్య : సః-అతఁడు, దర్పణేషు-అద్దములయందు, పరిభోగదర్శినీః-సంభోగ చిహ్నములను జూచుకొనుచున్న, వధూః-స్త్రీలను, నర్మపూర్వం-పరిహాసపూర్వకముగా, అనుపృష్ఠ సంస్థితః (సన్)-వారివెనుకభాగమున నిలువఁబడినవాఁడగుచు, స్మిత మనోజ్ఞయా-చిరునగవుచేనందమైయున్న, ఛాయయా-దర్పణమునఁగనపడు తన ప్రతిబింబముచేత, హ్రీనిమీలితముఖీః-సిగ్గుచేత మూసుకొన్న ముఖములుగలవారినిగా, చకార-చేసెను. తనచే రాత్రులయందు ఉపభోగింపఁబడిన యువతులు పగటివేళలలో అద్దములందు తమ ముఖస్తనాదులపై నేర్పడిన నఖక్షతాది చిహ్నములను జూచుకొనుచుండగా వారివెనుక నిలిచి చిరునవ్వుతో మనోహరమై అద్దమునందుఁగనఁబడు తన ప్రతిబింబముచేత నా యువతులను సిగ్గుపడునట్లును, సిగ్గుచేత ముఖములను చేతులతో మూసుకొను నట్లును జేయుచు తనవిలాస జీవనమును గడపుచుండెననియు భావము.

శ్లో. కంఠసక్త మృదు బాహుబంధనం
న్యస్తపాదతల మగ్రపాదయోః,
ప్రార్థయంత శయనోత్థితం ప్రియాః
తం నిశాత్యయ విసర్గ చుంబనమ్. 29

వ్యాఖ్య : ప్రియాః-అతని ప్రియురాండ్రు, శయనోత్థితం-పడకనుండి లేచినట్టి, తం-ఆయగ్నివర్ణుని, కంఠసక్త మృదు బాహబంధనం-తమ కంఠము నందుంచబడిన సుకుమారమైన యాలింగనము గలదియు, అగ్రపాదయోః-తమ పాదముల పైభాగములయందు, న్యస్తపాదతలం-ఉంచఁబడిన యతని యడుగులు గలదియునగు, నిశాత్యయ విసర్గచుంబనమ్—నిశాత్యయ-రాత్రియొక్క అవసానమునందు, విసర్గ-విడిచివెళ్ళు సమయమునందలి, చుంబనం-ముద్దును, ప్రార్థయంత-యాచించిరి. శయనమునుండి లేచిన అగ్నివర్ణుని నతని ప్రియురాండ్రు బాహుబంధనయుక్తమై తమపాదములపై నతని పాదములుంచి చేయునట్టి నిశావసానగమనమునందలి చుంబనముఁ జేసి వెళ్ళుమని కోరిరి. అట్లు చేయుట మన్మథ నివాసమునకు హేతువని గోనర్దీయుఁడు చెప్పెను. "రతావసానే యది చుంబనాది ప్రయుజ్య యాయాన్మదనోఽస్య వాసః"

శ్లో. ప్రేక్ష్య దర్పణతలస్థ మాత్మనో
రాజవేష మతిశక్ర శోభినమ్,
పిప్రియే న స తథా యథా యువా
వ్యక్తలక్ష్మ పరిభోగమండనమ్. 30

వ్యాఖ్య : యువా, సః-యువకుఁడైన ఆయగ్నివర్ణుడు, అతిశక్రశోభినం-ఇంద్రుని మించిన యందము కలదియై, దర్పణతలస్థం-అద్దమునందుఁగనబడు చున్నది యగు, ఆత్మనః-తనయొక్క, రాజవేషం-రాజోచిత వస్త్రాలంకార వేషమును, ప్రేక్ష్య-చూచి, తథా-ఆవిధముగా, నపిప్రియే-సంతోషపడలేదు. యథా-యేవిధముగానైతే, వ్యక్తలక్ష్మ-స్పష్టముగాఁ గనపడుచున్న చిహ్నములు గల, పరిభోగమండనం-యువతీ సంభోగముల వలన గలిగిన సొగసును, ప్రేక్ష్య-చూచి, పిప్రియే-సంతోషపడెనో! యువకుఁడైన అగ్నివర్ణుఁడు తనవ

కుండల కంకణ కిరీట ధారణముచేత ఇంద్రునినిమించిన శోభగల తన రాజవేషమును అద్దమునఁ జూచుకొన్నప్పటికంటెను యువతీ సంభోగజనితములైన నఖక్షత దంతక్షతములు, అలసినముఖము, జారినవస్త్రములు మొదలగు చిహ్నములను దర్పణమునఁ జూచుకొన్నప్పుడే యెక్కుడు సంతోషపడెను. రాజ్యసుఖముకంటె నతనికి రమణీసుఖమే అధికమైన యానందమును గూర్చుచుండెనని భావము.

శ్లో. మిత్రకృత్య మపదిశ్య పార్శ్వతః
ప్రస్థితం త మనవస్థితం ప్రియాః,
విద్మ హే శఠ! పలాయనచ్ఛలా
న్యంజసేతి రురుధుః కచగ్రహైః, 31

వ్యాఖ్య : మిత్రకృత్యం-సుహృత్కార్యమును, అపదిశ్య-నెపముగాఁ జెప్పి, పార్శ్వతః-మరియొకచోటికి, ప్రస్థితం-వెళ్ళుటకు బయలుదేరిన వాఁడై, అనవస్థితం-నిలుకడలేకయున్న, తం-అగ్నివర్ణుని, ప్రియాః-విలాసినులు, హే శఠ-ఓమోసగాడా!, పలాయనచ్ఛలాని-నీవు పారిపోవుటకుఁ జెప్పు మోసములను, అంజసా-యథార్థముగా, విద్మ-ఎఱుఁగుదుము, ఇతి-ఇట్లనుచు, కచగ్రహైః-కేశాకర్షణములచేత, రురుధుః-అడ్డగించిరి. విలాసినులవద్దనుండిన యగ్నివర్ణుడు "నాకొకమిత్రకార్యమున్నది" అని చెప్పి ప్రక్కకు వెళ్ళఁ బోవుచు కాలు నిలుపలేని స్థితిలోనుండగా ఆ విలాసినులు "ఓ శఠుఁడా! నీవు పారిపోవుటకుఁ జెప్పిన అపదేశవాక ములతత్త్వము మాకుఁదెలియునులే" యనుచు నతనిజుట్టు వెంట్రుకలను ప లాగి వెళ్ళకుండునట్లుచేసిరని భావము. వారాంగనలు విటులను మిత్రకార్యము ప్పుడు విడుచుట కామశాస్త్ర ధర్మము, కనుక అగ్నివర్ణుఁడు మిత్రకార్యమిషచే వెళ్ళదలఁచుట, అది యబద్ధమని తెలిసిన ప్రియురాండ్రు అతనిని వెళ్ళనీయకపోవుట ఇచ్చట వర్ణింపఁబడినది. ఈ సందర్భమున గోనర్దీయుఁడు "ఋతుస్నాతాభిగమనే, మిత్రకార్యే, తథాపది; త్రిష్వేతేషు ప్రియతమః క్షంతవ్యో వారగమ్యయా" అని వ్రాసెను. వారగమ్యా-వారస్త్రీ.

శ్లో. తస్య నిర్దయరతిశ్రమాలసాః
కంఠసూత్ర మపదిశ్య యోషితః

అధ్యాశేరత బృహ ద్భుజాంతరం
పీవర స్తనవిలు ప్తచందనమ్. 32

వ్యాఖ్య : నిర్దయరతిశ్రమాలసాః — నిర్దయరతి - అతఁడు సలిపిన ఉత్కటసంభోగమువలని, శ్రమ-ఆయాసముచేత, అలసాః-సడలిన యవయవములుగల, యోషితః-యువతులు, కంఠసూత్రం-"కంఠసూత్ర"మను పేరుగల ఆలింగనవిశేషమును, అపదిశ్య-వ్యాజముగాఁజెప్పి పీవర స్తనవిలు ప్తచందనం-పెద్దవియగు స్తనములచేత తుడిచివేయఁబడిన గంధపుపూతగలది యగు, తస్య-అగ్నివర్ణునియొక్క, బృహత్, భుజాంతరం-విశాలమైన వక్షస్థలమును (వక్షస్థలమునందు), అధ్యాశేరత-శయనించిరి. బలిష్ఠుఁడు, యువకుఁడునగు, అగ్నివర్ణుఁడు నిర్దయముగాఁజేసిన సంభోగమువలన అలసి, అవయవములు సడలి, పునారతికి సిద్ధపడజాలని కొందరు యువతులు, అతనిని తృప్తిపరచుటకై ఇప్పుడు "కంఠసూత్ర" మనునాలింగనమును జేయుదు మన్న నెపముతో తమ పీవర స్తనముల రాపిడిచేత మైపూతగానున్న గంధము తుడుచుకపోవునట్లు అతని విశాల వక్షస్థలమునందు శయనించి రని భావము. "యత్ కుర్వతే వక్షసి వల్లభస్య స్తనాభిఘాతం నిబిడోపగూహాత్, పరిశ్రమార్థం శనకై ర్విదగ్ధా స్తత్ "కంఠసూత్రం" ప్రవదంతి సంతః" అని కంఠసూత్ర లక్షణము. ఇదియే రతి రహస్యమునందు "స్తనాలింగన" మని చెప్పఁబడినది. "ఉరసి కమితు రుచ్చై రాదిశంతీ వరాంగీ స్తన యుగ ముపధత్తే యత్ స్తనాలింగనం తత్" అని దాని లక్షణము.

శ్లో. సంగమాయ నిశి గూఢచారిణం
చారదూతికథితం పురోగతాః,
వంచయిష్యసి కుత స్తమోవృతః
కాముకేతి చకృషు స్తమంగనాః. 33

వ్యాఖ్య : సంగమాయ-అన్యస్త్రీ సురతముకొఱకు, నిశి-రాత్రివేళ, గూఢచారిణం-రహస్యముగా వెళ్ళుచున్నవాఁడును, చారదూతికథితం-గూఢచారిణులగు దూతికలచేత రాణులకు తెలుపఁబడిన వాఁడునునగు, తం-ఆ యగ్నివర్ణుని, అంగనాః-అతని ప్రియురాండ్రు, పురోగతాః (సత్యః)-ముందుగానే వెళ్ళి దారి

నర్దగించినవారై, హేకాముక!-ఓకాముకుఁడా! తమోవృతః-చీకటిచేత దాచఁబడిన వాడవగుచు, కుతః-ఎందువలన, వంచయిష్యసి-మోసగించుచున్నావు? అని ఉపాలంభనము చేసిరి. రాత్రివేళలో పరస్త్రీ సంగమము కోసము చీకటిలో వెళ్ళుచున్న అగ్నివర్ణుని చర్యను ముందే గూఢచారిణులగు దూతికలద్వారా తెలుసుకున్నరాణులు అతనిదారికి అడ్డముగా వెళ్ళి కాముకుఁడా! చీకటిలోదాగి ఎందుకు మోసగించుచున్నావు? అని తృణీకరించి పలికిరనియు, వెనుకకు తీసుకవెళ్ళిరనియు భావము.

శ్లో. యోషితా ముడుపతే రివార్చిషాం
స్పర్శనిర్వృతి మసా వవాప్నువన్,
ఆరురోహ కుముదాకరోపమాం
రాత్రిజాగరపరో దివాశయః. 34

వ్యాఖ్య : ఉడుపతేః-చంద్రునియొక్క, అర్చిషాం, ఇవ-కాంతులయొక్క వలె,యోషితాం-స్త్రీలయొక్క, స్పర్శనిర్వృతిం-స్పర్శసుఖమును, అవాప్నువన్-పొందుచును, రాత్రిజాగరపరః-రాత్రులయందు నిద్రమేల్కొనుటయం దాసక్తి కలవాఁడై, దివాశయః-పగళ్ళు నిద్రించుచున్నవాఁడై, అసౌ-ఈ అగ్నివర్ణుఁడు, కుముదాకరోపమాం-కలువలకొలనుయొక్క పోలికను, ఆరురోహ-పొందెను. స్త్రీలస్పర్శసుఖము ననుభవించుచు రాత్రిళ్ళు మేల్కొని పగళ్ళునిద్రపోవునట్టి అగ్నివర్ణుఁడు, చంద్రకిరణస్పర్శచేత వికసించి పగలు ముడుచుకొనిపోవు కలువలుగల కాసారమువలె నుండెనని భావము. అలంకారము : ఉపమ.

శ్లో. వేణునా దశనపీడితాధరా
వీణయా నఖపదాంకితోరవః,
శిల్పకార్య ఉభయేన వేజితా
స్తం విజిహ్మనయనా వ్యలోభయన్. 35

వ్యాఖ్య : దశనపీడితాధరాః-దంతములచేతఁ గొఱుకబడిన క్రిందిపెదవులు గలవారును, నఖపదాంకితోరవః-నఖక్షతముల గాయములతోడి తొడలుగలవారును,

అయినప్పటికిని, వేణునా-మురళియు, వీణయా-వీణయునను, ఉభయేన-రెండిటి చేతను, వేజితాః-పీడితలైన, శిల్పకార్యః-గాయికలు, తం-అతనిని, విజిహ్మన యనాః-కుటిలవీక్షణములు గలవారగుచు, వ్యలోభయన్-లోభముగలవానినిఁగాఁ జేసిరి. కళాప్రవీణలయిన గాయనీమణులను సురతములందు అధరోష్ఠములను దంతములచే వ్రణములుగాను, తొడలను నఖక్షతములచేత వ్రణములుగాను మార్చుటయేకాక, మరుసటి దినమున వేణువాదనముచేయువారిని వేణుగానము వినిపించుఁడని, వీణావాదనముచేయువారిని వీణ వాయింపుడనియు నిర్బంధ పరచిన యతని యెదుట నట్లేచేయుచు వేణువీణలచేత బాధింపఁబడుచున్నట్టివారు, తానుచేసిన పని నెఱిఁగియు తమ నిట్లుబాధించుచున్నాడని సాభిప్రాయముగా చూచుచుండగా నా కుటిలదృష్టులను జూచి యగ్నివర్ణుఁడు సంతోషపడుచు వారిపై నింకను ఎక్కువగా ప్రలోభపడుచుండెను. వారికిఁగలుగుచున్న వీణా వేణు స్పర్శలవలని పీడ చిలిపితనముగల అగ్నివర్ణునికి ఆనందహేతువయ్యేనని భావము.

శ్లో. అంగసత్త్వవచనాశ్రయం మిథః
స్త్రీషు నృత్య ముపధాయ దర్శయన్,
స ప్రయోగనిపుణైః ప్రయోక్తృభిః
సంజఘర్ష సహ మిత్రసన్నిధౌ. 36

వ్యాఖ్య : అంగహస్తవచనాశ్రయం—అంగ-పతాకాది హస్తవిశేషములు సత్త్వ-అంతఃకరణవృత్తులైన అశ్రుపాతాదులు, వచన-గేయములు, ఆశ్రయం-కారణములుగానున్న, నృత్యం-ఆంగిక సాత్త్విక వాచిక రూపమైన అభినయ మును, మిథః-రహస్యస్థలమునందు, స్త్రీషు-నట్టువకత్తెలయందు, ఉపధాయ-ఉంచి, దర్శయన్-ప్రదర్శనము సలుపుచు, సః-ఆయగ్నివర్ణుఁడు, మిత్ర సన్నిధౌ-మిత్రులయెడుట, ప్రయోగనిపుణైః-అభినయశాస్త్రమునందు నేర్పరు లైన, ప్రయోక్తృభిః సహ-అభినయార్థప్రకాశకులైన నాట్యాచార్యులతోగూడ, సంజఘర్ష-ఘర్షణపడెను. ఏకాంతస్థలమున అందగత్తెలగు నర్తకీజనమును, నాట్యాచార్యులను బిలిపించి, మిత్రసహితుఁడై చూచుచు, ఆనట్టువకత్తెలను అభినయింపఁజేయుచు వారి ప్రయోగములందు గల దోషములనుజూపు నెపమున స్త్రీలహస్త పాద స్తనాదులను దాకుచు నాట్యాచార్యులతో గలహించెను. అనగా

నటుఁడభినయశాస్త్రవేత్తయైన స్త్రీలోలుఁడుగా నచ్చటఁ గనఁబడెనని భావము. "సామాన్యాభినయో నామ జ్ఞేయో వాగంగసత్త్వజః" అని భరత నాట్య శాస్త్రము.

శ్లో. అంసలంబి కుటజార్జునస్రజః
తస్య నీపరజసాంగరాగిణః,
ప్రావృషి ప్రమదబర్హిణే ష్వభూత్
కృత్రిమాద్రిషు విహారవిభ్రమః. 37

వ్యాఖ్య : ప్రావృషి - వర్షాకాలమునందు, అంసలంబికుటజార్జునస్రజః— అంస-భుజములయందు, లంబి-వ్రేలాడుచున్న, కుటజ-కొండమల్లెపూల యొక్కయు, అర్జున-మద్దిపూలయొక్కయు, స్రజః-మాలికలుగలవాఁడును, నీపరజసాం-కడిపూల పుప్పొడులయొక్క, అంగరాగిణః-మైపూతగలవాఁడునగు తస్య-ఆయగ్నివర్ణునికి, ప్రమదబర్హిణేషు-మదించిననెమళ్ళుగల, కృత్రిమాద్రిషు-కల్పితములైన గిరి నదీ సరస్సులయందు, విహారవిభ్రమః-విహరించుటయను విలాసము, అభూత్-జరిగెను. కల్పితములైన వర్షాచిహ్నములతో నటుఁడు వర్ష కాల విహారములను సలిపెనని భావము.

శ్లో. విగ్రహాచ్చయనే పరాఙ్ముఖీః
నానునేతు మబలాః స తత్వరే,
ఆచకాంక్ష ఘనశబ్దవిక్లబాః
తా వివృత్య విశతీ ర్భుజాంతరమ్. 38

వ్యాఖ్య : (ఆ వర్షాకాలమునందు) సః-అగ్నివర్ణుఁడు, విగ్రహాత్-ప్రణయకలహమువలన, శయనే-పరుపుమీద, పరాఙ్ముఖీః-ప్రక్కకుమళ్ళిపండుకున్న, అబలాః-స్త్రీలను, అనునేతుం-బ్రతిమాలుటకు, నతత్వరే-త్వరపడలేదు. ఘనశబ్దవిక్లబాః-మేఘగర్జనములచేత భయపడినవారై, వివృత్య-తవవై పునకుఁ దిరిగి, భుజాంతరం-వక్షములను, విశతీః-ప్రవేశించుచున్న, తాః-వారిని, ఆచకాంక్ష-అభిలషించెను. త ప్రక్కన శయనించిన యువతులు ప్రణయకలహము

వలన కుపితలై, పెడమొగముపెట్టి పండుకొనఁగా అగ్నివర్ణుఁడు త్వరపడి వారిని ప్రతిమాలుకొనుటకు పూనుకొనలేదు. కారణమేమనఁగా కృత్రిమమేఘ గర్జనములవలన భయపడిన ఆయువతులు తమంతటతామే తనవైపు తిరిగి వక్ష స్థలమునందు దూరిగాఢాలింగనముఁ జేసికొందురులెమ్మని యుపేక్షించెనని భావము.

శ్లో. కార్తికీషు సవితానహర్మ్యభాక్
యామినీషు లలితాంగనాసఖః,
అన్వభుంక్త సురతశ్రమాపహాం
మేఘముక్తవిశదాం స చంద్రికామ్. 39

వ్యాఖ్య : కార్తికీషు-కార్తికమాసమునకు సంబంధించిన, యామినీషు-రాత్రులయందు (శరద్రాత్రులయందని అర్థము), సవితానహర్మ్యభాక్—సవితాన-మేలుకట్టువస్త్రములతోఁగూడిన, హర్మ్య-మేడలను, భాక్-చేరినవాఁడై, లలితాంగనాసఖః-సుందరాంగులతోఁగూడిన, సః-అగ్నివర్ణుఁడు, సురతశ్రమాపహాం-సంభోగమువలనియలసటను దొలఁగించునట్టిదియగు, మేఘముక్తవిశదాం-మేఘములచే విడువఁబడి స్వచ్ఛమైన, చంద్రికాం-వెన్నెలను, అన్వభుంక్త-అనుభవించెను. శరత్కాలమున మంచు పడకుండుటకై వ ములను పైభాగ మునఁగట్టించి వానిక్రింద నిద్రించుట పూర్వులయలవాటు. అ చేయించిన మేడలపై సుకుమారాంగులతో సురతము ననుభవించిన యగ్నివర్ణుఁ శరత్కాలమున మేఘములుతొలఁగి తెల్లగా చల్లగానుండిన వెన్నెలలో సంభోగశ్రమను దొలఁగించుకొనుచుండె నని భావము.

శ్లో. సైకతం చ సరయూం వివృణ్వతీం
శ్రోణిబింబ మివ హంసమేఖలమ్,
స్వప్రియా విలసితానుకారిణీం
సౌధజాలవివరై ర్వ్యలోకయత్. 40

వ్యాఖ్య : హంసమేఖలం-హంసలబారనెడు మొలనూలితోనున్న, సైకతం-ఇసుక తిన్నెను, శ్రోణిబింబం, ఇవ-కటిపశ్చాద్భాగమునువలె, వివృణ్వతీం-

కనఁబరచుచున్నట్టిది కనుక, స్వప్రియా విలసితానుకారిణీం-తన ప్రియురాలి విలాసమును అనుకరించుచున్న, సరయూం, చ-సరయూనదినిగూఁడ, సౌధజాల వివరైః-మేడయొక్క గవాక్షరంధ్రములద్వారా, వ్యలోకయత్-ఆసక్తితోఁ జూచెను. సౌధమునందు ప్రియా సమాగమ సుఖము ననుభవించుచున్న అగ్నివర్ణుఁడు, హంసల బారుతోఁజూఁబడిన యిసుకదిబ్బను మొలనూలుతో నుండిన నితంబమునువలెఁ గనఁబరచుచున్న సరయూనది తనప్రక్కన నగ్నయై యున్న ప్రియురాలిని బోలియుండుటచే గవాక్షరంధ్రములద్వారా ఆసక్తితోఁజూచెను. కాముకునికి పరకామిని వివస్త్రగానుండినప్పుడు చూచుటయు, అదియుఁదన ప్రియురాలిని బోలియుండుటయు, మిక్కిలి ప్రలోభమునకుఁగారణమని భావము.

శ్లో. మర్మరై రగురుధూపగంధిభి
ర్వ్యక్తహేమరశనై స్తమేకతః,
జహ్రు రాగ్రథన మోక్షలోలుపం
హైమనై ర్నివసనైః సుమధ్యమాః. 41

వ్యాఖ్య : మర్మరైః-సంస్కార విశేషమువల్ల ధ్వనించుచున్నవియు, అగురుధూప గంధిభిః-అగురుధూపములవాసన గలవియు, వ్యక్తహేమరశనైః-వెలుపటికివచ్చిన బంగారుమొలనూలు గలవియు, హైమనైః-హేమంతఋతువున ధరించినవియునగు, నివసనైః-వస్త్రములచేత, సుమధ్యమాః-స్త్రీలు, ఏకతః-నితంబముయొక్క ఒకప్రక్కన, ఆగ్రథనమోక్ష లోలుపం—ఆగ్రథన-పోక ముడియొక్క, మోక్ష-ఊడఁదీయుటయందు, లోలుపం-ఆసక్తుఁడైన, తం-అగ్నివని, జహ్రుః-ఆకర్షించిరి. చలికాలమునందు తాముధరించిన వస్త్రములు గంజిపెట్టనవగుటచేత చప్పుడు చేయుచు, అగురుధూపవాసనలుగలవై, వదలిబయటికి జారిన బంగారుమొలనూళ్ళుగలవియై, నితంబముల నొకప్రక్కనఁ గనఁబరచుచుండుటచేత చీరముడిని ఊడదీయుటకుఁ ద్వరపడుచున్న అగ్నివర్ణుని నిద్రించుచున్న స్త్రీలు ఆకర్షించిరని భావము. అట్టి స్థితిలో నిద్రించు సుమధ్యల నతఁడు రమించుటకుపక్రమించెను. మర్మరమనగా వస్త్రములయొక్కయు భూషణముల యొక్కయు చిఱుచప్పుడు.

శ్లో. అర్పిత స్తిమిత దీప దృష్టయో
గర్భవేశ్మసు నివాతకుక్షిషు,

తస్య సర్వ సురతాంతర క్షమాః
సాక్షితాం శిశిరరాత్రయో యయుః. 42

వ్యాఖ్య : నివాతకుక్షిషు-గాలిలేని లోనిభాగములుగల, గర్భవేశ్మసు-సౌధముయొక్క గదులయందు, అర్పిత స్తిమితదీపదృష్టయః—అర్పిత-ఉంచఁబడి, స్తిమిత-కదలికలేని, దీప-దీపములనెడు, దృష్టయః-చూపులుగలవియు, సర్వసురతాంతరక్షమాః—సర్వ-అన్నివిధములైన, సురతాంతర-రతిబంధములకు, క్షమాః-తగినవియునగు, శిశిరరాత్రయః-శిశిరర్తురాత్రులు, తస్య-ఆ యగ్నివర్ణునియొక్క, సాక్షితాం-సాక్షిత్వమును, యయుః-పొందినవి. సౌధాంతరమునందలి గర్భగృహములు గాలిలేనివగుటచేత అచ్చటనుంచిన నిశ్చలదీపములే చూపులుగాఁగలిగి, చెమటపట్టుటలేక దీర్ఘములై యున్నందున అన్నివిధములైన శృంగారచేష్టాసురతబంధముల కనుకూలమైన శిశిరరాత్రులు అగ్నివర్ణుని సంభోగ విలాసములను తెప్పలార్పక చూచి యాశ్చర్యపడు సాక్షులవలె నుండెనని భావము.

శ్లో. దక్షిణేన పవనేన సంభృతం
ప్రేక్ష్య చూతకుసుమం సపల్లవమ్,
అన్వనైషు రవధూత విగ్రహా
స్తం దురుత్సహవియోగ మంగనాః. 43

వ్యాఖ్య : అంగనాః-యువతులు, దక్షిణేన, పవనేన-మలయమారుతముచేత, సంభృతం-కూర్చఁబడిన, సపల్లవం-చిగురాకులతోడి, చూతకుసుమం-మామిడిపూఁతను, ప్రేక్ష్య-చూచి, అవధూతవిగ్రహాః-త్రోసివేసిన ప్రణయ కలహములుగలవారగుచు, దురుత్సహవియోగం-దుస్సహమైన వియోగముగల, తం-అతనిని, అన్వనైషుః-అనునయించిరి. మలయానిలమువీచుట, మామిళ్ళ చిగుళ్ళతో పూతలతో ప్రత్యక్షమగుట మొదలయిన చిహ్నములుగల వసంత ఋతువును దర్శించిన యువతులు, అంతకుముందు తమకు అగ్నివర్ణునికి జరిగిన ప్రణయకలహములవలని వియోగ మనుభవించుచుండినను ఋతుప్రభావముచేత కామోద్దీపితలై విరహమును సహింపఁజాలక తామే యగ్నివర్ణుని ప్రతిమాలుకొనుచుఁ ప్రణయకలహములు మానిరని భావము.

శ్లో. తాః స్వ మంక మధిరోప్య దోలయా
ప్రేంఖయన్ పరిజనాపవిద్ధయా,
ముక్తరజ్జు నిబిడం భయచ్ఛలాత్
కంఠబంధన మవాప బాహుభిః. 44

వ్యాఖ్య : తాః-ఆస్త్రీలను, స్వం, అంకం-తన తొడను (తొడలమీఁద) అధిరోప్య-ఎక్కించుకొని, పరిజనాపవిద్ధయా-సేవకజనముచేత ఊపఁబడిన, దోలయా-ఉయ్యాలచేత, ముక్తరజ్జు-విడువఁబడిన ఊయెలత్రాళ్ళు గలగునట్లు, ప్రేంఖయన్-ఎగిరిపడఁజేయుచు, భయచ్ఛలాత్-భయమనుమిషవలన,బాహుభిః-అంగనాభుజములచేత, నిబిడం-గాఢమైన, కంఠబంధనం-కంఠాలింగనమును, అవాప-పొందెను. అట్లు ప్రతిమాలుకొనవచ్చిన యువతులను అగ్నివర్ణుఁడు తన యొడిలో నెక్కించుకొని, ఊయెలలోఁ గూర్చుని, దాసీజనముచేత ఉయ్యాల నూపించుచు, త్రాళ్ళు విడువమని పరిజనముతోఁ జెప్పఁగా వారు విడిచిరి. అప్పుడింకను వేగము, చలనము గలుగుటచేత నాపడుచులు భయపడి గట్టిగా నతని కంఠమును బాహువులచేత ఆలింగనముఁ జేసికొనిరి. అట్లు వసంతఋతువున అగ్నివర్ణుఁడు స్త్రీల స్వయంగ్రాహాలింగన సౌఖ్యము ననుభవించెనని భావము.

శ్లో. తం పయోధర నిషిక్తచందనైః
మౌక్తిక గ్రథిత చారుభూషణైః.
గ్రీష్మవేషవిధిభిః సిషేవిరే
శ్రోణిలంబి మణిమేఖలైః ప్రియాః. 45

వ్యాఖ్య : ప్రియాః-అతని ప్రేయసులు, పయోధర నిషిక్తచందనైః—పయోధర-తమస్తనములయందు, నిషిక్త-తడియుండునట్లు చల్లఁబడిన, చందనైః-శ్రీగంధజలములు గలవియు, మౌక్తికగ్రథిత చారుభూషణైః-ముత్యాలతోఁ గూర్చిన అందమగు భూషణములు గలవియు, శ్రోణిలంబి మణిమేఖలైః-శ్రోణి-పిఱుదులమీద, లంబి-వ్రేలాడుచున్న, మణి-పచ్చలు మొదలగు రత్నములతోఁ గూర్చిన, మేఖలైః-కటిసూత్రములుగలవియునగు, గ్రీష్మవేషవిధిభిః-ఉష్ణకాలమునకుఁ దగిన వేషవిధానములచేత, తం-అగ్నివర్ణుని, సిషేవిరే-సేవిం

చిరి. ఎండ వేడిమి గల గ్రీష్మఋతువు రాగానే శీతలోపచారములు చేయఁదలఁచిన ప్రియురాండ్రు తమ స్తనములను గంధజలముతోఁ దడుపుకొనియు, తమ భూషణములన్నిఁటిని ముత్యాలమయములుగాఁ జేసికొనియు, పచ్చలు మొదలగు రత్నములతోఁ గూర్చిన కటిసూత్రములు నితంబములపై వ్రేలాడునట్లు జేసికొనియు అగ్నివర్ణుని సేవలోనుండిరి. చందన, మౌక్తిక, గారుత్మతములు శీతలములై యతనికి సౌఖ్యము గలిగించెనని భావము.

శ్లో. యత్స లగ్నసహకార మాసవం
రక్తపాటలసమాగమం పపౌ,
తేన తస్య మధునిర్గమాత్ కృశః
చిత్తయోని రభవత్ పునర్నవః.

వ్యాఖ్య : సః-అగ్నివర్ణుఁడు, లగ్నసహకారం-మామిడి చిగురంటుకొన్నదియు, రక్తపాటల సమాగమం-ఎఱ్ఱని కలిగొట్టు పువ్వు కలిసినదియునగు, ఆసవం-మద్యమును, పపౌ ఇతియత్-త్రాగెననునది యేదికలదో, తేన-ఆయాసవపానముచేత, మధునిర్గమాత్-వసంతము వెళ్ళిపోవుటవలన, కృశః-బలహీనుఁడైన తస్య, చిత్తయోనిః-అగ్నివర్ణునికి సంబంధించిన మన్మథుఁడు, పునర్నవః-మరల క్రొత్తవాఁడు (ప్రబలుఁడు) అభవత్-అయ్యెను. వగరుకై మామిడి చిగురు, పరిమళమునకై కలిగొట్టు పువ్వు కలిపిన మద్యమును త్రాగుటచేత, వసంతము వెళ్ళిపోవుటవలన నీరసపడియున్న అగ్నివర్ణునిలో మరల కామోద్దీపనము గలిగెనని భావము. మన్మథుఁడు తన మిత్రుఁడగు వసంతుఁడు వెళ్ళిపోగా మిత్రవియోగమున నీరసపడియున్నను అగ్నివర్ణుని యాసవ పానమువలనఁ బుంజుకొనెనని తాత్పర్యము. "శోకాన్ముక్తః పునర్నవః" అని నిఘంటువు.

శ్లో. ఏవ మింద్రియసుఖాని నిర్విశ
న్నన్యకార్యవిముఖః స పార్థివః,

అత్మలక్షణనివేదితా నృతూ
నత్యవాహయ దనంగవాహితః. 47

వ్యాఖ్య : ఏవం-ఇట్లు, అనంగవాహితః-కామప్రేరితుఁడై, అన్యకార్య విముఖః-ఇతర కార్యములం దిష్టములేనివాఁడైన, సః, పార్థివః-ఆ రాజు, ఇంద్రియ సుఖాని-ఇంద్రియములకు సుఖకరములైన శబ్దాది విషయములను, నిర్విశన్-అనుభవించుచు, ఆత్మలక్షణ నివేదితాన్-తమ చిహ్నములగు గిరిమల్లికాదులచేత తెల్పుకొనుచున్న, ఋతూన్-వర్షాది ఋతువులను, అత్యవాహయత్-గడపెను. వెనుక వర్ణించినట్లు కామప్రేరితుఁడై, పరిపాలనాది కృత్యములందు విముఖుఁడై యున్న ఆ యగ్నివర్ణుఁడు ఆయా చిహ్నములను జూచి ఆయా ఋతువు వచ్చి నట్లు గుర్తించి తదనుకూలమైన సౌకర్యములు గలిగించుకొనుచు ప్రియురాండ్రను సైతమట్లే మార్చుచు ఇంద్రియ సుఖములతో కాలముఁగడపెనని భావము.

శ్లో. తం ప్రమత్త మపి న ప్రభావతః
శేకు రాక్రమితు మన్యపార్థివాః,
ఆమయస్తు రతిరాగసంభవో
దక్షశాప ఇవ చంద్ర మక్షిణోత్. 48

వ్యాఖ్య : ప్రమత్తం, అపి-వ్యసనములచేత మత్తుఁడైనను, తం-ఆయగ్ని వర్ణుని, ప్రభావతః-కోశదండాదుల ప్రభావము వలన, అన్యపార్థివాః-ఇతర రాజులు, ఆక్రమితుం-లోఁబరచుకొనుటకు, నశేకుః-సమర్థులు గాలేకపోయిరి. రతిరాగసంభవః-సంభోగాసక్తి వలనఁ గలిగిన, ఆమయః, తు-వ్యాధిమాత్రము (క్షయరోగము), దక్షశాపః-దక్షప్రజాపతియొక్క శాపము, చంద్రం, ఇవ-చంద్రునినివలె, అక్షిణోత్-క్షీణింపఁజేసెను. అగ్నివర్ణు డట్లు స్త్రీమద్యపానాది వ్యసనములకులోనై ప్రమత్తుఁడై యున్నప్పటికిని, ఆసువంశికము, కోశదండ

ప్రభావజము నగు రఘువంశ ప్రభావము వలన పరరాజులుమాత్ర మతని రాజ్యము నాక్రమింపఁజాలకపోయిరి. కాని నిరంతర రతిరాగముచేతఁ గలిగిన క్షయవ్యాధి, దక్షుని శాపము చంద్రునిని వలె, దినదినము నతనిని క్షీణింపజేసెను. ఇతర పుత్రికలను ఉపేక్షించి ఒక్క రోహిణియందే ప్రేమాధిక్యమునుఁజూపు చుండిన చంద్రుని దక్షుఁడు శపించెననియు, అందువల్లనే చంద్రునికి నేటికిని కృష్ణపక్షమున క్షీణత్వము గలుగుచున్నదనియు ఉపాఖ్యానము గలదు.

శ్లో. దృష్టదోష మపి తన్న సోఽత్యజత్
సంగవస్తు భిషజా మనాశ్రవః,
స్వాదుభిస్తు విషయై ర్హృత స్తతో
దుఃఖ మింద్రియగణో నివార్యతే. 49

వ్యాఖ్య : భిషజాం-వైద్యులయొక్క, అనాశ్రవః-మాటలను విననట్టి, సః-అగ్నివర్ణుఁడు, దృష్టదోషం, అపి-దోషము గలదియని తెలిసినదైనను, తత్, సంగవస్తు-స్త్రీ మద్యరూపమై సంగజనకమగునా వస్తుజాతమును, న అత్యజత్-విడువకపోయెను. ఇంద్రియగణః-ఇంద్రియ సమూహము, స్వాదుభిః-రుచికరములగు, విషయైః-భోగ్యవస్తువులచేత, హృతః, తు-ఆకర్షింపబడినచో, తతః-ఆవస్తువులనుండి, దుఃఖం-అతికష్టముగా, నివార్యతే-మరలింపఁబడును. వైద్యులమాటను పెడచెవినిబెట్టిన యగ్నివర్ణుఁడు తనకు మిత్రస్త్రీ సమావేశము లతో ఆనందమును గలిగించు స్త్రీ మద్యరూపమైన సంగవస్తువులను విడువక పోయెను. అది యట్లే జరుగును, కారణ మేమనగా ఇంద్రియగణము రుచికరము లైన భోగ్యవస్తువులకు అలవాటు పడెనా? ఆ వస్తువులనుండి ఇంద్రియములు మరలవు. అనఁగా వానిని విడువవు. ఒకవేళ విడిపించినా అతికష్టముచేత మాత్రమే విడిపించుటకు వీలగునని భావము. "ఆశ్రవః" అనఁగా చెప్పినమాట వినువాడు, "అనాశ్రవః" విననివాఁడు. "వచనే స్థిత ఆశ్రవః" అని యమరము.

శ్లో. తస్య పాండువదనాల్పభూషణా
సావలంబగమనా మృదుస్వనా,

రాజయక్ష్మపరిహాని రాయయౌ
కామయానసమవస్థయా తులామ్. 50

వ్యాఖ్య : తస్య-ఆ యగ్నివర్ణుని యొక్క, పాండువదనా-తెల్లబారిన ముఖముగలదియు, అల్పభూషణా-స్వల్పముగా ధరించిన అలంకారములుగలదియు, సావలంబగమనా-ఇతరుల సహాయముతోఁగూడిన నడకగలదియు, మృదుస్వనా-హీనమైన కంఠస్వరము గలదియునగు, రాజయక్ష్మ పరిహానిః-క్షయవ్యాధిచేతఁ గలిగిన క్షీణదశ, కామయాన సమవస్థయా-కాముకునియొక్క స్థితితో, తులాం-పోలికను, ఆయయౌ-ఎక్కువగాఁబొందెను. అగ్నివర్ణుఁడు మొగము తెల్లఁబడి, బరువు మోయలేక ఆభరణములు తగ్గించుకొని, సేవకుల భుజములపై చేతులు వేసికొని నడచుచు, హీనమైనకంఠస్వరముతో ననుభవించుచున్న క్షయరోగము, ఒక కామకుని విరహావస్థతో సమానముగా నుండెనని భావము. "కామయాన" శబ్దము "కము" ధాతువునకు ణింజతముపై శానచ్ ప్రత్యయాంత రూపము "కామయమానః" అని కావలసియుండఁగా "అనిత్యమాగమ శాసనమ్" అను పరిభాషచే "ముమాగమము" అనిత్యమై "కామయాన" అనియే నిల్చినది. దీనిని వామనుఁడు కావ్యాలంకార సూత్రములందు "కామయావ శబ్దః సిద్ధో౽నాదిశ్చ" అని సమర్థించెను. మొగమున కళలేకుండుట, అల్పభూషణాదులు, కాముకలక్షణములు గదా !

శ్లో. వ్యోమ పశ్చిమకలాస్థితేందు వా
పంకశేష మివ ఘర్మపల్వలమ్,
రాజ్ఞి తత్కుల మభూత్ క్షయాతురే
వామనార్చి రివ దీపభాజనమ్. 51

వ్యాఖ్య : రాజ్ఞి-రాజైన అగ్నివర్ణుఁడు, క్షయాతురే (సతి)-క్షయవ్యాధి పీడితుఁడై యుండఁగా, తత్కులం-ఆరఘువంశము, పశ్చిమ కళా స్థితేందు-చివరికళయందున్న చంద్రుఁడు గలదియగు, వ్యోమ, వా-ఆకాశమువలెను, పంకశేషం-బురదతో మిగిలిన, ఘర్మపల్వలం, ఇవ-వేసవియందలి చిన్నచెఱువు

వలెను, వామనార్చిః-చిన్నవెలుఁగుగల, దీపభాజనం, ఇవ-దీపపు ప్రమిదవలెను, అభూత్-అయ్యెను. రాజైన యగ్నివర్ణుఁడు క్షయవ్యాధి పీడితుఁడై కృశించిపో గానే రఘువంశము, తన్నివాసమైన రాజమందిరమున్ను చిట్టచివరికళతో మిగిలిన చంద్రబింబముగల ఆకాశమువలెను, బురదమాత్రము మిగిలిన చిన్నసరస్సువలెను, మినుకు మినుకు మనుచు చల్లారుటకు సిద్ధముగానున్న దీపశిఖతోడి ప్రమిద వలెను కళాహీనమై కన్పట్టెనని భావము. "వా" అను నవ్యయము ఇవార్థకము. "ఇవ వత్ వా యథా శబ్దా" అని దండి వచించెను.

శ్లో. బాఢ మేష దివసేషు పార్థివః
కర్మ సాధయతి పుత్రజన్మనే,
ఇత్యదర్శితరుజో ఽస్యమంత్రిణః
శశ్వ దూచు రఘశంకినీః ప్రజాః. 52

వ్యాఖ్య: బాఢం-సత్యముగా, ఏషః పార్థివః-ఈయగ్నివర్ణుఁడు, దివ సేషు-పగటివేళలయందు, పుత్రజన్మనే-పుత్రుఁడు పుట్టుట కొఱకు, కర్మ-జపాది వైదిక కర్మను, సాధయతి-ఆచరించుచున్నాఁడు ఇతి-ఇట్లని, అదర్శితరుజః-దాచిన క్షయరోగము గలవారగుచు, అస్య, మంత్రిణః-అగ్నివర్ణుని మంత్రులు, అఘశంకినీః-రాజు మరణమును అనుమానించుచున్న, ప్రజాః-ప్రజలనుద్దేశించి, శశ్వత్-ఎప్పుడును, ఊచుః-చెప్పుచుండిరి. రోగగ్రస్తుఁడై పగటివేళలలో దర్శనమీయకుండిన యగ్నివర్ణుని గుఱించి ప్రజలు, ఏదియో యనర్థము దాప రించునేమో! యని సంశయపడుచు ప్రశ్నింపఁగా నతని మంత్రులు "రాజు పుత్రోత్పత్తికై యంతఃపురమున జపహోమాద్యనుష్ఠానములు చేయుచున్నందున వెలుపటికి వచ్చుటలేదు." అని యతనిరోగము సంగతినిఁ జెప్పక దాచి, అడిగి నప్పుడెల్లను జెప్పుచుండిరని భావము. రాజవ్యసనము ముందుగా వెల్లడియగుట రాజ్యస్థైర్యమునకు భంగమనియు, శత్రువులకు రంధ్రప్రాయమనియు, భావించి మంత్రులట్లు చెప్పుచుండిరని తాత్పర్యము.

శ్లో. స త్వనేకవనితాసఖో உపి సన్
పావనీ మనవలోక్య సంతతిమ్,
వైద్యయత్నపరిభావినం గదం
న ప్రదీప ఇవ వాయు మత్యగాత్. 53

వ్యాఖ్య : సః, తు-ఆయగ్నివర్ణుఁడేమో, అనేకవనితాసఖః - పెక్కు-భార్యలు గలవాఁడు, సన్, అపి-అగుచుండియు, పావనీం-పవిత్రమైన అనఁగా పితృఋణవిమోచనముఁజేయునట్టి, సంతతిం-సంతానమును, అనవలోక్య-చూడక, వైద్యయత్నపరిభావినం-వైద్యుల ప్రయత్నమును తిరస్కరించునట్టి, గదం-రోగమును, ప్రదీపః-దీపము, వాయుం, ఇవ-గాడ్పునువలె, న అత్యగాత్-అతిక్రమింపలేకపోయెను (మరణించెనని యర్థము). అగ్నివర్ణుఁడు పెక్కండ్రు భార్యలు గలవాఁడయినను పితృఋణవిమోచనముఁజేయఁగల పుత్ర సంతానమును జూడకయే వైద్యులెంత ప్రయత్నించినను తగ్గక, దీపము తనను బాధించువాయువునువలె క్షయరోగమును ఎదుర్కొనఁజాలకపోయెను,మరణించెనని భావము. పుత్రసంతానమువల్ల పితృఋణము తీరునని ధర్మశాస్త్రము.

శ్లో. తం గృహోపవన ఏవ సంగతాః
పశ్చిమక్రతువిదా పురోధసా,
రోగశాంతి మపదిశ్య మంత్రిణః
సంభృతే శిఖిని గూఢ మాదధుః. 54

వ్యాఖ్య : పశ్చిమక్రతువిదా-అంత్యేష్టివిధానమునెఱిఁగిన, పురోధసా-పురోహితునితో, సంగతాః-కూడిన, మంత్రిణః-మంత్రులు, గృహోపవనే, ఏవ-ఇంటియుద్యానమునందే, రోగశాంతిం-క్షయరోగశాంతిని, అపదిశ్య-నెపముగాఁజెప్పి, తం-అగ్నివర్ణుని, సంభృతే-మండుచున్న. శిఖిని-అగ్నియందు, గూఢం-రహస్యముగా, ఆదధుః-ఉంచిరి. రాజమరణమును వెల్లడిచేయరాదను

తలంపుగలమంత్రులు అంత్యేష్టిని జరుపుపద్ధతి నెఱిఁగిన పురోహితునిఁగలిసి రాజ భవనముయొక్క ఉద్యానమునందే చితినిఁబేర్చి, రోగశాంతికై యేదోవైదికకర్మను జరుపుచున్నట్లు ఇతరులకుఁ జెప్పి, మండుచున్న అగ్నిహోత్రమునందు అగ్ని వర్ణునిదేహము నుంచిదహింపఁ జేసిరని భావము. అట్లు చేయుటకుఁ గారణము సంతానహీనుఁడగు నగ్నివర్ణుని రాజ్యమును దాయాదులు, శత్రురాజులు, ఆక్ర మింపకుండుటకే యని తెలియవలయును.

శ్లో. తైః కృతప్రకృతి ముఖ్యసంగ్రహై
రాశు తస్య సహధర్మచారిణీ,
సాధు దృష్టశుభగర్భలక్షణా
ప్రత్యపద్యత నరాధిపశ్రియమ్. 55

వ్యాఖ్య : ఆశు-శీఘ్రముగా, కృత ప్రకృతి ముఖ్య సంగ్రహైః—కృత-చేయఁబడిన, ప్రకృతి ముఖ్య-పౌరులలో ముఖ్యులగు వారియొక్క, సంగ్రహైః, తైః-సమూహము గలవారైన ఆ మంత్రులచేత, సాధు-నిపుణముగా, దృష్ట శుభ గర్భలక్షణా-పరీక్షింపఁబడిన గర్భచిహ్నములుగల, తస్య-ఆయగ్నివర్ణునియొక్క సహధర్మచారిణీ-పట్టపురాణి, నరాధిపశ్రియం-రాజలక్ష్మిని, ప్రత్యపద్యత-పొందెను. వెంటనే మంత్రులు పౌరులలో పెద్దలగువారిని రప్పించి సభచేసి, చక్కగాఁబరీక్షింపఁబడిన గర్భలక్షణములుగల అగ్నివర్ణుని పట్టపురాణినిఁజూపి, గర్భస్థశిశు యుక్తురాలైన ఆమె రాజ్యాధికారిణియైనట్లు ప్రకటించిరని భావము.

శ్లో. తస్యా స్తథావిధ నరేంద్ర విపత్తిశోకాత్
ఉష్ణై ర్విలోచనజలైః ప్రథమాభితప్తః,
నిర్వాపితః కనకకుంభముఖోజ్ఝితేన
వంశాభిషేక విధినా శిశిరేణ గర్భః. 56

వ్యాఖ్య : తథావిధ నరేంద్ర విపత్తిశోకాత్——తథావిధ-అట్లు జరిగిన, నరేంద్ర విపత్తి-అగ్నివర్ణుని మరణము చేతఁగలిగిన, శోకాత్-దుఃఖమువలన, ఉష్ణైః-వేడియైన, విలోచనజలైః-కన్నీళ్ళచేత, ప్రథమాభితప్తః-మొదట తడుపఁబడిన, తస్యాః, గర్భః-ఆ పట్టపురాణి యొక్క గర్భము, కనకకుంభ ముఖోజ్ఝితేన-బంగారు కలశములద్వారా పోయఁబడినదియు, శిశిరేణ-చల్లనిదియ నగు, వంశాభిషేక విధినా-రఘువంశ పట్టాభిషేక విధానముతోఁగూడిన జలధారలచేత, నిర్వాపితః-చల్లపరుపఁబడెను. సింహాసనముపై నాసీనురాలైన ఆ రాణి తనకు సంభవించిన భర్తృమరణ దుఃఖముచేత వేడి కన్నీటితో గర్భమును మొదటఁ దడుపఁగా నుష్ణమైన ఆ గర ము మంత్రి పురోహితాదులచే జరుపబడిన పట్టాభిషేక ప్రక్రియయందు సువ కలశములతో నభిషేకించిన చల్లని జలధారలచేతఁ జల్లబడి రఘువంశ ప్రతిష్ఠా కమైన రాజ్యాధికార మంగళమును పొందెనని భావము.

శ్లో. తం భావార్థం ప్రసవసమయాకాంక్షిణీనాం ప్రజానా
మంతర్గూఢం క్షితిరివ నభోబీజముష్టిం దధానా,
మౌలైఃసార్థం స్థవిరసచివైః హేమసింహాసనస్థా
రాజ్ఞీ రాజ్యం విధివ దశిషత్ భర్తు రవ్యాహతాజ్ఞా. 57

వ్యాఖ్య : ప్రసవసమయాకాంక్షిణీనాం—— ప్రసవసమయ - గర్భమోచన సమయమును (ఫలించు కాలమును), ఆకాంక్షిణీనాం-కోరుచున్నట్టి; ప్రజానాం-ప్రజలయొక్క, భావార్థం-భావముకొఱకు (సంపదకొఱకు), క్షితిః-భూమి; అంతర్గూఢం-లోపలదాగియు ్, నభోబీజముష్టిం, ఇవ——నభః-శ్రావణమాసము నందు నాటఁబడిన, బీజము ం, ఇవ-విత్తనములనువలె, తం-అంతర్గతమైన ఆగర్భమును, దధానా- ంచుచున్నదియు, . హేమసింహాసనస్థా-బంగారు రాచగద్దెపైనున్నదియు, అవ్యాహతాజ్ఞా-ఎదురులేని శాసనము గలదియునగు, రాజ్ఞీ-రాణి, మౌలైః-ఆప్తముఖ్యులైన, స్థవిరసచివైః, సార్థం-వృద్ధామాత్యులతోఁగూడ, భర్తుః-భర్తయగు నగ్నివర్ణునియొక్క, రాజ్యం-రాజ్యమును, విధివత్-శాస్త్రప్రకారముగ, అశిషత్-పాలించెను. శ్రావణమాసమున విత్తిన బీజముల ఫలితమును వలె అంతర్గూఢమైన రాజ్ఞీగర్భముయొక్క ప్రసవమును గోరుచున్న ప్రజల మేలుకొఱకు బీజముష్టిని భూమివలె గర్భమును ధరించిన

అగ్నివర్ణుని ధర్మపత్ని సింహాసనస్థురాలై ముఖ్యులైన వృద్ధమంత్రులద్వారా అప్రతిహతమైన యాజ్ఞకలదగుచు అయోధ్యానగరమున రఘువంశీయుల రాజ్యము‌ను పరిపాలించెనని భావము. "ప్రసవశబ్దము" నకు గర్భమోచనము, ఫలము అర్థములు. "భావ" శబ్దమునకు అభిప్రాయము, సంపద మొదలగున అర్థములను యాదవ నిఘంటువు చెప్పెను.

ఇది మహాకవి కాళిదాసకృత రఘువంశ కావ్యమునందలి అగ్నివర్ణుని శృంగారమను
పందొమ్మిదవ సర్గమునకు మహామహోపాధ్యాయ కోలచల మల్లినాథసూరి
సంజీవినీ వ్యాఖ్యాను సారముగా రామలక్ష్మ్యంబా తిప్పాజోస్యుల
తనూజుఁడు కేశవపంతుల నరసింహశాస్త్రి రచిత
తెలుఁగు లఘువ్యాఖ్యా సర్వము
సంపూర్ణము.